





# గేయాలు

పౌరాణిక,జానపద,సామాజిక

# తెలుగు జానపద గేయ సాహిత్యము





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# తెలుగు జానపదగేయ సాహిత్యము

బి. రామరాజు
ప్రొఫెసర్ – తెలుగుశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయము



రచయిత : బిరుదురాజు రామరాజు

జననం : క్రోధన చైత్ర బ॥ అష్టమి గురువారం; ఉత్తరాషాఢ (16-4-1925, 4-40 A.M.) దేవునూరు, వరంగల్ తాలుకా, పెరిగినది మడికొండ.

తల్లిదండ్రులు : బిరుదురాజు లక్ష్మీదేవి; నారాయణరాజు.

పెంచినవారు : బిరుదురాజు లలితమ్మ; రాఘవరాజు.

*విద్య* : దేవునూరులో వీథిబడి; మడికొండలో ప్రైమరీ; హనుమకొండలో ఇంటరుమీడియటువరకు, హైదరాబాదులో — బి. ఏ. నిజాంకళాశాల (1949). ఎం. ఏ. (1951) ఉస్మానియా విశ్వవిద్యాలయం, పి.ఎచ్.డి. 1956; ఎం.ఏ. సంస్కృతం 1960; P. G. Diploma in Linguistics 1966.

*ఉద్యోగం*: 1951 నుండి లెక్చరర్, 1957 నుండి రీడర్, 1968 నుండి ప్రొఫెసర్, 1973 నుండి తెలుగు శాఖాధ్యక్ష్యం. 1967 నుండి 1974 వరకు వరంగల్ స్నాతకోత్తర కేంద్రంలో, తక్కిన కాలం విశ్వవిద్యాలయ కళాశాలలో.

*రచనలు* : తెలుగువీరుడు 1952; వీరగాథలు 1954; తెలుగు జానపద గేయసాహిత్యము 1958, మరుగుపడిన మాణిక్యాలు 1961, ఉర్దూ—తెలుగు నిఘంటువు 1962, Folk tales of Andhra Pradesh 1974, Folk lore of Andhra Pradesh 1978, సుమారు నూరు పరిశోధనవ్యాసములు.

*అనువాదాలు* : గురుగోవిందసింగు చరిత్ర 1966, ప్రేంచంద్ 71.

*సంపాదనము* . తెలంగాణా పిల్లల పాటలు 1960, త్రివేణి 60, తెలంగాణా పల్లె పాటలు 1968.

*అముద్రిత గ్రంథ పరిష్కరణ* : (తెలుగు) ప్రసన్నరాఘవ ప్రబంధము 1962, రాఘవాభ్యుదయము 1965, శివరాత్రిమాహాత్మ్యము 1966, (సంస్కృతం) వసుచరిత్రమ్ 1965, జాంబవతీపరిణయమ్ 1969, శృంగార శేఖరభాణమ్ 1969, రామాయణసార తిలకమ్ 1972.

*అముద్రితాలు* : Contribution of Andhra to Sanskrit Literature, పరిష్కృత ప్రాచీన సంస్కృతాంధ్రగ్రంథాలు.

*అభిరుచి* : సాహిత్యం, చరిత్ర, సంస్కృతి.

# ప్రథమ ముద్రణ పీఠిక

తెలుగుదేశమున వందలకొలదిమైళ్ళు ప్రవహించు మహానదులతోపాటు వాగులు, వంకలు, సెలయేరులు కూడ అనేకములున్నవి. ప్రతి యూర నొక వాగు, ప్రతిపల్లె నొక వంక, తప్పక కనబడును. ఒకటి మడమలను పుణికి జాలువారిన మరియొకటి గొంతుబంటి పారును. ఒకటి పుట్టిన చోటనే గిట్టిన మరియొకటి కొంతదూరము సాగి యాగిపోవును. ఒకటి నడియెడారిలో నింకిపోయిన నింకొకటి యంతర్వాహినియై ప్రవహించును. ఒకటి కొన్నియూళ్ళు చుట్టివచ్చినచో మరియొకటి కొన్ని మండలములు గడచును. కంప కసవు బురదతో నొకయే రురవడిగా పారిన, తేటనీటితో గలగలగానములతో మరియొక సెలయేరు ప్రవహించును. ఒకటి పంకముతో నిండిన మరియొకటి పంకజములతో పరిపూర్ణమైనది. పల్లెపట్టుల పారిశుద్ధ్యమునకు పనికివచ్చునదొకటి; పాంథుల దప్పికలు తీర్చునది మరియొకటి. ఆంధ్రదేశము జలసమృద్ధమైనను "నదీనాం సాగరో గతిః" అనునది మనదేశమున నధికముగా వ్యాప్తిగాంచిన మాట. మహానదులే సరిగా వినియోగింపబడక హోరుమను వేదనాధ్వనులతో సాగర గర్భమున చేరిపోవుచుండ నీ వాగులను వంకలను అడుగువా రెవరు? ఇంకిపోగా మిగిలినవి ముండ్లడొంకలను కొండకోనలను బట్టి పారుచున్నవి. ఎగుడు దిగుడులుగా ఎత్తిపోతలుగా కొన్నియున్నవి. పాశ్చాత్యుల దయవలన ఇటీవలనే మనవారి దృష్టి యిటు మరలినది. కొందరు పుణ్యాత్ములు తహ తహపడి [illegible]చ్చటచ్చట చిన్నచిన్న అడ్డకట్టలు కట్టినారు, మాటులు వేసినారు, జలాశయములు [illegible]చినారు. మరికొందరు కాలువలు త్రవ్వి సాహితీ కేదారములకు పారించినారు. వా[illegible]యడుగు జాడలందే నేనుకూడ నడచినాను. మరికొంత పరిశ్రమించి పల్లె పల్లెలో మూల మూలలలో దేశము నాలుగు చెరగులందున్న వాగులను వంకలను నా యోపినంత మేర కొక్క చోటకు మళ్ళించి యొక మహాజలాశయముగా నిర్మించినాను. ఈ జలాశయమే యీ నా "తెలుగు జానపద గేయసాహిత్యము". దీనియందున్న పదునారు ప్రకరణములు పెద్దవైన పంటకాలువలు; వానికి వేరే చిన్న చిన్న కాలువలును మడవలును ఉన్నవి.

జానపదగేయసాహిత్యమున తొలుదొలుత నా కభినివేశము కలిగించినవారు జానపదులే. మాయూర (దేవునూరు) పొలము నాటు లప్పుడు, వరికోతలప్పుడు, మోట తోలునప్పుడు, పిండి విసరునప్పుడు, ధాన్యము దంచునప్పుడు పల్లీయులు పాడినప్పుడును. తెల్లవారుజామున మా నాయనమ్మగారు నన్నొడిలో కూర్చుండ బెట్టుకొని మేలుకొలుపులు పాడినప్పుడును నా చెవుల గింగురుమన్న పాటలు మాటలు నన్నధికముగా నాకర్షించినవి. చిన్ననాటనుండి యున్న యభిమానమునకు పెద్దవాడనైన పిమ్మట కీ.శే. సురవరం ప్రతాపరెడ్డిగారి ప్రోత్సాహము దోహద మొనర్చినది. ఆనాటినుండియే అప్పుడప్పుడు జానపదగేయములు సేకరించు చుంటిని. 1952 సంవత్సరము ప్రారంభమున మా విశ్వవిద్యాలయమున తెలుగులో పరిశోధమునకు తొలిసారిగా అవకాశము లభించగనే తొలుత నారుమాసములవరకు యక్షగానములనుగూర్చి పరిశోధన మొనర్చి ఆ విషయమును వదలివేయవలసివచ్చుటచే మద్గురువర్యులు ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు నాకభిమతమైన జానపద గేయసాహిత్యమునుగూర్చి పరిశోధించుటకు నన్నాదేశించినారు. ఇక కావలసినదేమున్నది! ఇమ్మడి సంబరముతో వారు చూపిన బాటలో సాగినాను. పల్లె పల్లెలు తిరిగినాను. నాకు కావలసిన సామగ్రిని కూర్చుకొన్నాను.అప్పుడప్పు డీ పరిశోధనా ప్రయాణమున త్రోవ తెలియనపుడు,దిక్కు తోచనపుడు ఆకాశవాణివలె శ్రీశ్రీపాదగోపాల కృష్ణ మూర్తిగారి సందేశము వినపడుచుండెడిది.గుండె దిటవుతో మూడు మాసములు కావించిన నా పరిశ్రమ ఈతీరుగా నవతరించినది. నేను కుప్పలు పోసికొన్న సామగ్రిలో దశాంశము మాత్రయే ఈ గ్రంథమున నుంచగలిగితిని. మిగిలిన దటులే యున్నది.ప్రత్యేకముగా చిన్నపాటలు ముక్తకములవంటివి నూర్లకొలది మిగిలిపోయినవి. దీర్ఘములైన కథా గీతములు, చారిత్రకగేయము లనేకము లటులే యున్నవి.ఒక్కొక్క ప్రకరణమున నొండురెం డముద్రితగేయములను మాత్రమే తెలంగాణమునకు సంబంధించినవానిని మచ్చునకుగా నుట్టంకించినాను. జానపదగేయముల భాషాసారస్వతములు, జానపదగేయముల వరుసలు అను ప్రకరణము లింకను అసమగ్రములనియే నా విశ్వాసము. ఆయా విషయములను గూర్చి మరికొంత పరిశీలనము, పరిశోధనమును అవసరము. ఇటులే సాంఘిక శాస్త్రము (Sociology) దృష్టితోకూడ ఈ పల్లె పదముల పరిశీలనము చేసిన మన కధికాంశములు తెలియవచ్చుననుటలో సందేహము లేదు.

పాశ్చాత్యులు జానపదగేయములు, కథలు, సాంప్రదాయిక విజ్ఞానము నమితముగా సేకరించుటేకాక పరిశోధనామార్గమునగూడ సుదూరము సాగిపోయినారు. సేకరణమునకును పరిశోధనమునకును ప్రత్యేకముగా కొన్ని సంస్థలే నెలకొల్పబడినవి. భారతదేశమునగూడ ఔత్తరాహులైన హిందీవారు, వంగీయులు, మహారాష్ట్రులు జానపదవాఙ్మయము నధికముగా సేకరించి పరిశోధనలు చేసినారు. తెలుగువారము మాత్రము చాల వెనుకబడి యున్నాము. పరిశోధనముననే కాదు మనము వెనుకబడినది, అసలు మనకున్న గేయసంపద నంతటిని మనము సేకరించుకొననే లేదు. శాస్త్రీయముగా సేకరించుకొనవలెనన్న పల్లీయులు పాడినది పాడినట్లుగా స్వరములు, ఉచ్చారణములు, వరుసలు, ఏసలు, ఉన్నవి యున్నట్లుగా యంత్రముల సహాయమున రికార్డు చేయవలయును. అప్పుడుగాని శాస్త్రీయమైన పరిశోధనము జరుగదు. ప్రభుత్వమునకు గాని, విద్యాసంస్థలకు గాని, తెలుగుదేశమున నీ విషయమై యెన్నడు దయగలుగునో తెలియదు. పండుటాకులవంటి ప్రాతతరములవారు రాలిపోయిన పిమ్మట మనకు దక్కునది తక్కువ. అభిమానముగల నావంటి యొంటి మానిసి చేయదగిన పని కాదిది. తెలుగుదేశమెంత విశాలమో అంత విస్తారమైన పని యున్నది. నా యోపినంత నేను చేసినాను. ఎందరైనను ఈ మార్గమున పయనింపవచ్చును.

జానపదగేయములు సేకరించుట మిక్కిలి వ్యవప్రయాసములతో కూడిన పని. ఈ యుద్యమమున నాకు సుమారు నాల్గువేల రూపాయలు వ్యయమైనవి. పడిన ప్రయాసము వేరే యున్నది. విశాఖపట్టణము మొదలుకొని మద్రాసు చాకలపేట వరకున్న పుస్తకముల దుకాణములు గాలించి లభించిన అచ్చయిన పాటలపుస్తకము లన్నియు సేకరించితిని. ఈ గుజిలీ ప్రతులు తప్పులతడకలైనను వీనివలననే మనకు కొంతకుకొంత ఈ సాహిత్యము దక్కినది. ఈ పుస్తకములు సేకరించుటయందు నా కధికముగా తోడ్పడినవారు శ్రీ నేదునూరి గంగాధరంగారు, శ్రీ శ్రీపాదగోపాలకృష్ణమూర్తి గారు. మద్రాసు, విజయవాడ, హైదరాబాదు రేడియో కేంద్రములనుండి అప్పుడప్పుడు ప్రసారమైన గేయములను కూడ కొన్నింటిని రేడియోసెట్టు ముందర కూర్చొని తొందర తొందరగా వ్రాసికొన్నాను. ఈ భారమును నా యర్ధాంగి కూడ కొంతవరకు వహించినది. తెలంగాణమున ఎనిమిది మండలములందును, ప్రతి మండలమున కొక తాలుకా చొప్పున తిరిగి అముద్రితములగు గేయము లనేకము సేకరించినాను.

వినిపించెడువారు. వారికి కావలసినది పిడికెడు బిచ్చము, కల్లునీళ్ళకు కావలసిన రాగి డబ్బులు, ప్రాత వస్త్రములు. నా యీవివలన వారి జోలెలు నిండకున్నను తమ యెదలం దూరిన యమృతవాక్కులతో నా పాటల జోలెను మాత్రము పూటిగా నింపినారీ యల్పసంతోషులు. కాని వీరితో గొప్ప తిప్పలు పడవలసి వచ్చినది. తమ ఫొటోలు తీయనిచ్చెడివారుకారీ దరిద్రనారాయణులు. ఫొటో తీసినచో ఒడలు చిక్కిపోవుననియు, కంఠమాధుర్యము చెడిపోవుననియు వీరి నమ్మకము. ఐనను పడరాని పాట్లుబడి వారి బొమ్మలు తీయించినాను. అముద్రితములగు పల్నాటివీరులకథలు మున్నగువానిని మద్రాసు ప్రా. పు. భాండాగారమున చదివి నోట్సు వ్రాసికొంటిని. ఆయా చారిత్రక విశేషములను శాసనములను శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి వలన నెరింగితిని. నాకన్న పూర్వ మీరంగమున కృషిచేసినవారి వ్రాత లన్నియు చదివినాను. ఇంత కష్టము పడినందులకు నాకత్యంతసంతోషమును కూర్చున దేమన ఈ రంగమున చెప్పుకొనదగినంత కృషి చేసినవారిలో నేనే ప్రథముడను. ఈనా కృషి జనాదరణము గాంచి మరి కొందరు పరిశోధకు లీమార్గమున పరిశ్రమించినచో నేను ధన్యుడ నగుదును.

మన భాషాసారస్వతముల యారంభస్థితిని క్రమపరిణామమును గూర్చి ఇప్పుడిప్పుడే పరిశోధనములు జరుగుచున్నవి. కేవలము శిష్ట సాహిత్యమునే యాధారముగా చేసికొని ఇట్టి పరిశోధనలకు పూనుకొనుట నేలవిడిచిన సాముగును. జానపదుల భాషాసారస్వతములను బాగుగా పరిశీలించినచో మన యారంభస్థితి కొంతకుకొంత తప్పక గోచరించును. జానపదసాహిత్యము శిష్టసాహితీ సౌధమునకు పునాదివంటిది. ఈనాడీ రెండింటియందును ఒకదాని ప్రభావము మరియొకదానిపై నున్నట్లు స్పష్టముగా కాననగును. వాఙ్మయారంభమునకు జానపదుల మనోభావములును తొలి నుడుగులును ఆధారమైనటులే శిష్ట వాఙ్మయమున గల నానాప్రసిద్ధపురాణేతిహాసప్రబంధముల కథలు, భావములు నేడు ప్రచారమందున్న గేయములందు కనబడు చున్నవి. శిష్టకవుల రచనములు మహానదుల వంటివైన జానపదులగేయములు సెలయేరులవంటివి. రెండింటను జలము సమానము. జలమొక్కటే వివిధరూపములతో భాసించినట్లుగా, విశ్వజనీనమైన వస్తువు, భావములు, ఉపమానములు మున్నగునవి రెండింటను సమానముగా గోచరించినట్లు భావింపవలయును. ఆయాప్రకరణములందు—

ఈ యాత్రలందు పడరాని పాట్లు పడవలసివచ్చినది. అసలే తెలంగాణము వెనుకబడిన ప్రదేశము. ప్రయాణసౌకర్యములు పల్లెలందు లేనేలేవు. పెక్కుమారులు పదయాత్రలు తప్పవయ్యెను. బండి ప్రయాణము రాళ్ళరప్పల బాటలందును, ఎగుడుదిగుడులందును కాలి నడకకన్న కష్టముగా తోచెడిది. కొన్ని చోటుల భయమువలనను మరికొన్ని తావుల సిగ్గువలనను పల్లీయులు పాటలు పాడెడువారు కారు. వారినెంతయో బతిమాలవలసి వచ్చెడిది. వారు పనిపాటలందు నిమగ్నులై పాడుచున్నప్పుడు ఒకప్పుడు వారి కంటబడకుండ దాగియుండియు, మరొకప్పుడు వారి యెదుటనుండియు తొందరగా వ్రాసికొనుచుండెడివాడను. ఒకగ్రామమున సేకరించిన పాటలు మరియొక గ్రామమున నేను పాడి వినిపించి యచటివారి కుత్సాహము కల్పించి వారిచే క్రొత్తపాటలు పాడించి వ్రాసికొంటిని. కొన్ని ప్రదేశములకు రేడియో సెట్టునుకూడ వెంట నిడుకొనిపోయి ఆలిండియా రేడియో వారు ప్రసారము చేయు పాటల నాయా గ్రామీణులకు వినిపించి మీపాటలు కూడ రేడియోలో ఇదేవిధముగా పాడుదురని వారిని బులిపించి, ఆస చూపించి పాటలు పాడించితిని. కొందరికి ప్రాతగుడ్డ లిచ్చి, కొందరికి పొగాకు చుట్టలనిచ్చి, మరికొందరికి కల్లుపోయించి, ఇంకకొందరికి పైకమిచ్చి పాటలు పాడించితిని. పాటలు సేకరించుటకు కొన్నిచోట్ల అన్యాయమునకుగూడ ఒడికట్టితిని. చేసిన పాపము చెప్పుకొనిన పోవునందురు. కొన్ని గ్రామముల పల్లీయులు బతిమాలినను, ఏమిచ్చినను పాడనివారిని గ్రామాధికారులచేతను, పోలీసులచేతను బలవంతముగా పట్టితెప్పించి — కొట్టించి కూడ — పాటలు పాడించితిని. వ్రాసికొన్న తరువాత నేను చేసిన యన్యాయమున కేడ్పువచ్చెడిది. అటుతరువాత వారి యిండ్లకు పోయి క్షమాపణము వేడుకొని చేతనైన యుపకృతి చేసితిని. నా యదృష్టవశమున నా సహాధ్యాయులైన మిత్రులెందరో ఆయా జిల్లాలయందు రెవిన్యూ పోలీసుశాఖలం దున్నతోద్యోగులుగా నున్నవారందరును నాకు తోడ్పడిరి. గ్రామాధికారులు, ఆయా పాఠశాలలందు పనిచేయు ఉపాధ్యాయ వర్గము, మిత్రులు, బంధువులు, ఎందరో తోడ్పడిరి. పోవుటకు వీలుకాని చోట్ల కుత్తరములు వ్రాసి మిత్రులవలన గేయములు సేకరించుకొంటిని. నేను సేకరించిన గేయములను ప్రత్యేక సంపుటములుగా ప్రకటింపగలను. అప్పు డేగేయ మెచ్చట సేకరించినది, ఎవరు పాడినది, ఎవరెవరు నాకు తోడ్పడినది విపులముగా మనవి చేసికొందును. జానపదగాయకభిక్షుకులు Professionals మాత్రము కోరినంతనే పాడి

వినిపించెడువారు. వారికి కావలసినది పిడికెడు బిచ్చము, కల్లునీళ్ళకు కావలసిన రాగి డబ్బులు, ప్రాత వస్త్రములు. నా యీవివలన వారి జోలెలు నిండకున్నను తమ యెదలం దూరిన యమృతవాక్కులతో నా పాటల జోలెను మాత్రము పూటిగా నింపినారీ యల్పసంతోషులు. కాని వీరితో గొప్ప తిప్పలు పడవలసి వచ్చినది. తమ ఫొటోలు తీయనిచ్చెడివారుకారీ దరిద్రనారాయణులు. ఫొటో తీసినచో ఒడలు చిక్కిపోవుననియు, కంఠమాధుర్యము చెడిపోవుననియు వీరి నమ్మకము. ఐనను పడరాని పాట్లుబడి వారి బొమ్మలు తీయించినాను. అముద్రితములగు పల్నాటివీరులకథలు మున్నగువానిని మద్రాసు ప్రా. పు. భాండాగారమున చదివి నోట్సు వ్రాసికొంటిని. ఆయా చారిత్రక విశేషములను శాసనములను శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి వలన నెరింగితిని. నాకన్న పూర్వ మీరంగమున కృషిచేసినవారి వ్రాత లన్నియు చదివినాను. ఇంత కష్టము పడినందులకు నాకత్యంతసంతోషమును కూర్చున దేమన ఈ రంగమున చెప్పుకొనదగినంత కృషి చేసినవారిలో నేనే ప్రథముడను. ఈనా కృషి జనాదరణము గాంచి మరి కొందరు పరిశోధకు లీమార్గమున పరిశ్రమించినచో నేను ధన్యుడ నగుదును.

మన భాషాసారస్వతముల యారంభస్థితిని క్రమపరిణామమును గూర్చి ఇప్పుడిప్పుడే పరిశోధనములు జరుగుచున్నవి. కేవలము శిష్ట సాహిత్యమునే యాధారముగా చేసికొని ఇట్టి పరిశోధనలకు పూనుకొనుట నేలవిడిచిన సామగును. జానపదుల భాషాసారస్వతములను బాగుగా పరిశీలించినచో మన యారంభస్థితి కొంతకుకొంత తప్పక గోచరించును. జానపదసాహిత్యము శిష్టసాహితీ సౌధమునకు పునాదివంటిది. ఈనాడీ రెండింటియందును ఒకదాని ప్రభావము మరియొకదానిపై నున్నట్లు స్పష్టముగా కాననగును. వాఙ్మయారంభమునకు జానపదుల మనోభావములును తొలి నుడుగులును ఆధారమైనటులే శిష్ట వాఙ్మయమున గల నానాప్రసిద్ధపురాణేతిహాసప్రబంధముల కథలు, భావములు నేడు ప్రచారమందున్న గేయములందు కనబడు చున్నవి. శిష్టకవుల రచనములు మహానదుల వంటివైన జానపదులగేయములు సెలయేరులవంటివి. రెండింటను జలము సమానము. జలమొక్కటే వివిధరూపములతో భాసించినట్లుగా, విశ్వజనీనమైన వస్తువు, భావములు, ఉపమానములు మున్నగునవి రెండింటను సమానముగా గోచరించినట్లు భావింపవలయును. ఆయాప్రకరణములందు—

ప్రత్యేకముగా పౌరాణికగేయములందు—శిష్టసాహిత్యము జానపదసాహిత్యము ఒకదానిని వేరొకటి ఏతీరుగా ప్రభావిత మొనర్చెనో పేర్కొని యున్నాను.

లబ్ధగేయసారస్వతమంతటిని-అనగా నాకు దొరికిన ముద్రిత గేయములు, అముద్రిత గేయములు మున్నగువానిని పరిశోధనాసౌలభ్యమునకై కొన్ని వర్గములుగా విభజించితిని విషయవిభజనమునకై ఏయొక పద్ధతి నవలంబించినను, అది సమగ్రము కాజాలదు జానపదగేయముల నన్నింటిని రెండు మూడు తీరులుగా వర్గీకరింపవచ్చును. ఒక విధముగా నీగేయసంపద నంతటిని నాల్గు బృహద్భాగములుగా విడదీయవచ్చును. 1. బాలబాలికా సాహిత్యము, 2. స్త్రీ సాహిత్యము, 3. పురుష సంబంధి సాహిత్యము, 4. స్త్రీ పురుషోభయసంబంధము. కాని యిట్టి విభజనమున పరిశోధనమునకు కావలసినంత సౌకర్యము లభించుట యటుంచి కొంత క్లిష్టత కూడ ఏర్పడును. ఇక గేయములందలి వస్తువునుబట్టి విభజన మొనర్చినచో 1. పౌరాణికములు — తద్భేదములు. 2. చారిత్రకములు — అస్పష్టచారిత్రకములు 3. మత సంబంధములు. 4. వేదాంత సంబంధములు 5. సాంఘికములు మున్నగు వర్గము లేర్పడును. ఇటులైనను కొన్నిగేయములీ విభజనమున కందజాలవు. ఇక మూడవ పద్ధతి రసానుగుణముగా విభజించుట. శిష్ట సాహిత్యమున తత్తద్రసప్రధానములుగా కావ్యము లున్నటులే జానపదగేయములు కూడ నాయా రసములకు సంబంధించినవి కలవు. ఈ గేయములందధికభాగము శృంగార, వీర, కరుణ, అద్భుత, హాస్య, రసములందు విభక్తమైనను మరికొన్ని గేయములు మిగిలిపోవును. కనుక మొదటనే ఏ యొక పద్ధతి నవలంబించినను సమగ్రవిభజనము జరుగబోదని మనవి చేసితిని. పరిశోధనాసౌలభ్యమునకై పైన పేర్కొన్న మూడు పద్ధతుల నవలంబించినచో జానపదగేయసంపద నంతటిని సమగ్రముగా విభజింపవచ్చును. ఆలంబనము ననుసరించి విభజించినచో 1. బాలబాలికా గేయములు 2. స్త్రీలపాటలు 3. శ్రామికగేయములును; వస్తువు ననుసరించి విభజించినచో 1. పౌరాణికములు, 2. చారిత్రకములు, 3. మతసంబంధములు 4. పారమార్థికములును ; రసము ననుసరించి విభజించినచో 1. శృంగార 2. అద్భుత, 3. కరుణ, 4. హాస్యరస సంబంధములును; ఈ విధముగా పదునొకండు విభేదము లేర్పడును. ఈ విభాగముల విమర్శనముతో పాటు జానపదగేయముల యుత్పత్తి, వాని లక్షణము జానపద గేయముల ప్రశస్తి, పూర్వసాహిత్యమున వాని ప్రసక్తి, జానపదగేయములను

గూర్చిన కృషి మున్నగునవి చర్చింపవలసియుండును. జానపదగేయములందలి భాషాసారస్వతవిషయములు ప్రత్యేకముగా పరిశీలింపదగినవి. అటులే జానపద గేయములందు కానవచ్చు సాంఘికవిషయములుకూడ కనుగొనుట యావశ్యకము. మఱియును జానపదగేయములు పాడుచు బిచ్చమెత్తెడు గాయకభిక్షుకులను గూర్చియు జానపదగేయములను పాడునట్టి పద్ధతినిగూర్చియు పరిశీలింపనగును. కనుక పరిశోధన కనుకూలముగా నా యీ ప్రకరణము లీవిధముగా విభజింప నైనవి. 1. ప్రథమ ప్రకరణమున జానపదగేయముల పుట్టు పూర్వములు, వాని వ్యాప్తి, వాని లక్షణము, పూర్వసాహిత్యమున వాని ప్రసక్తి, జానపదగేయములను గూర్చిన కృషి మున్నగు విషయము లుండును. అటుతరువాత ప్రకరణములు 2. పౌరాణికములు, 3. చారిత్రకములు, 4. మతసంబంధములు, 5 పారమార్థిక ములు, 6. స్త్రీలపాటలు, 7. శ్రామికగేయములు, 8. పిల్లల పాటలు, 9. శృంగార గేయములు, 10. అద్భుత గేయములు, 11. కరుణ, 12. హాస్య సంబంధములు, 13. జానపదగేయములందలి భాషాసారస్వతవిషయములు, 14. జానపదగేయము లందలి సాంఘిక విషయములు, 15. జానపదగాయకులు, 16 జానపదగేయముల వరుసలు, ఈ విధముగా మొత్తము 16 ప్రకరణము లేర్పడినవి. జానపద గాయకులను గూర్చి వ్రాసిన ప్రకరణమున నాకు లభించిన గాయకభిక్షుకుల ఛాయాచిత్రములుకూడ చేర్చినాను. ఉపసంహారముగా నాలుగు మాటలు వ్రాసి చిట్టచివరన నాకు తోడ్పడిన గ్రంథముల పట్టికను మరియు అనుక్రమణికను ఇచ్చియున్నాను.

డాక్టరేటు పట్టము కొరకు సాగించిన ఈ పరిశోధనమున కవకాశము కల్పించినవారు డా. సూరి భగవంతంగారు. డా. భగవంతంగారికి పూర్వము కూడ మా విశ్వవిద్యాలయమున తెలుగులో పరిశోధనము చేయుట కిష్టమున్నవారు దరఖాస్తులు పెట్టుకొనవచ్చునన్న నియమముండెడిదేకాని పరిశోధనము చేయుట కనుమతి లభించెడిదికాదు. విశ్వవిద్యాలయమువారి నియమము ననుసరించి రెండుసారులు దరఖాస్తు పెట్టుకొన్నను నా కవకాశము లభించలేదు డా. భగవంతం గారు విశ్వవిద్యాలయోపాధ్యక్షులైన తరువాతనే తెలుగులోకూడ పరిశోధనము చేయుట కవకాశము కల్పించినారు. ఆ యవకాశమును వినియోగించుకొన్న వారిలో నేను ప్రథముడను. వారి చొరవతో మా తెలుగుశాఖ పరిశోధనాపుష్టమైనది. వారికి నేనెంతయు కృతజ్ఞుడను.

నా పరిశోధనమునకు దర్శకులై, నాజీవితమునకు మార్గదర్శకులై శిష్యవాత్సల్యము మూర్తీభవించిన మద్గురుదేవులు ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం గారికి నతులు.

నిండు మనంబు నవ్యనవనీతసమానము పల్కు చంద్రమో
మండల మండనార్ద్రము సుమద్రవతుల్యము చేత; విప్రులం
దుండడు మా గురున్ త్రికరణోపమితిన్ ప్రతిసేయ శిష్యులం
దుండడు నన్ను బోలు మరియొక్కడు రాజకుమారమండలిన్.

ఈ గ్రంథమును ముద్రించుటకును, పరీక్షకుల యభిప్రాయము ప్రకటించుకొనుటకును అనుమతి నొసంగిన మా విశ్వవిద్యాలయోపాధ్యక్షుల శ్రీ డి. ఎస్. రెడ్డిగారికిని, శాణోపలములవంటి పరీక్షకులైన శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం, శ్రీ గంటి జోగిసోమయాజులు, శ్రీ నిడుదవోలు వెంకటరావు గారలకును నా నమోవాకములు.

నా పరిశోధన మంతయు నొకయెత్తు, చేసిన పరిశోధనాఫలితము నీ విధము ప్రకటించుకొనుట ఇంకొకయెత్తు. పరిశోధనమున కెంత శ్రమపడితిని ప్రచురణమున కంతకన్న నెక్కుడు కష్టపడితిని. నా గ్రంథమును చూచి మెచ్చి నన్ను ప్రోత్సహించు నుద్దేశముతో హైద్రాబాదు ప్రభుత్వ ముఖ్యామాత్యు శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు ఈ గ్రథంమునేకాక నేను సేకరించిన తెలంగాణ జానపదగేయము లన్నింటిని ప్రభుత్వపక్షమున ముద్రించుటకు నిశ్చయించి ఈ యత్నమున నాకు తోడ్పడినవారిలో శ్రీ కాశోటి నారాయణరావుగారును శ్రీ కపిల కాశీపతిగారును ముఖ్యులు. కాని ఇంతలో ఆంధ్రప్రదేశ మవతరించు కాల మాసన్నమైనది. ప్రభుత్వమే మారిపోవుచున్న సమయమున నిట్టి నిశ్చయము ఫలవంతమగునో కాదో యని శ్రీ బూర్గుల రామకృష్ణరావు గారు, గ్రంథముద్రణకు హైద్రాబాదు ప్రభుత్వమువారెట్టి నిబంధనలు లేకుండ నాలైదువేల రూపాయ సహాయముగా నిచ్చుట కుత్తరువు చేసిరి. ఉత్తరువైన మరునాడు హైద్రాబాదు ప్రభుత్వము మారిపోయి ఆంధ్రప్రదేశ ప్రభుత్వమవతరించినది. కొంతకాలమ తరువాత హైద్రాబాదు ప్రభుత్వాజ్ఞను మన్నించి ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువా నాలైదువేల రూపాయ లిచ్చుటకు సమ్మతించిరి, మొదట రూ. 2500 ఇచ్చుటకు అచ్చైన పిదప ప్రభుత్వమునకు నూరు ప్రతు లిచ్చినచో కడమ రూ. 2500 ఇచ్చుటకును అంగీకరించిరి. పూర్వపు హైద్రాబాదు ప్రభుత్వపు విద్యాసము

మన్నించి ఈ సాహాయ్య మొనర్చిన ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారికిని ముఖ్యముగా గౌ॥ డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారికిని (నాటి అర్థికమంత్రి), విద్యాశాఖామాత్యులు గౌ॥ శ్రీ ఎస్.బి.పి. పట్టాభిరామారావు గారికిని, కృతజ్ఞతలు. ప్రభుత్వము చేయూత నీయకున్నచో ఈ గ్రంథమును నాకై నేను ప్రస్తుతము ప్రచురించుకొనెడువాడను గాను.

ఈ గ్రంథమునకు నూరు రీముల కాగితమును సరసముగు ధరకిప్పించిన సిర్పూరు పేపరుమిల్సు యజమానులగు బిర్లా సోదరులకును వారి ఆఫీసు మేనేజరు శ్రీ భండారి గారికిని మిక్కిలి కృతజ్ఞుడను.

గ్రంథ మచ్చగునప్పుడు స్ఖాలిత్యములను తొలగించి దిద్ది తీర్చిన మద్గురుపాదులు శ్రీమదాచార్యరఘునాథచక్రవర్తిగారికి ప్రణతులు.

ప్రతిశీర్షికకు కావలసిన చిత్రములను సిద్ధమొనర్చి ఈ గ్రంథమున కుచితమగు వన్నెచిన్నెలు దిద్దిన నా మిత్రులు కళాకారులు శ్రీ మదిపడగ బలరామాచార్యులకు నమస్సులు.

పదానుక్రమణికను సిద్ధమొనర్చిన మిత్రులు నాగభూషణ శర్మ, సుప్రసన్న రామకోటిశాస్త్రి గారలకు కృతజ్ఞుడను.

3-4-685
నారాయణ గూడ
హైదాబాదు
9-12-1958

రచయిత

# ద్వితీయ ముద్రణ పీఠిక

ఈ గ్రంథము ప్రథమముద్రణమై రెండు దశాబ్దములు గడచినవి. ఈ యిరువదేండ్లలో తెలుగు జానపదసాహిత్యమును గూర్చిన పరిశ్రమ మరికొంత జరిగినది. ఆనాడీ విషయముపై పరిశోధనమున కనుమతి పొందుటే గగనమైనది. ఈనాడు తెలుగుదేశమందలి వివిధవిశ్వవిద్యాలయములయందే కాక రాష్ట్రము బయటను జానపదవాఙ్మయాధ్యయనము పరిశోధనము చెప్పుకొనదగినంతగా సాగుచున్నది. ముందుముందింకను ఈ రంగమున విశేషకృషి జరుగగలదను ఆశయున్నది. ఆయాశయే ఈ ద్వితీయముద్రణకు ప్రోత్సాహకారియైనది. ద్వితీయ ముద్రణమున అవసరమనుకొన్న మార్పులు కూర్పులు కొన్ని చేసినాను. జానపద విజ్ఞానమందలి వివిధశాఖల గూర్చియు, దాని దశాంకవిభజనపద్ధతి గూర్చియు, కడచిన యిరువదేండ్లలో ఈ రంగమున సాగిన కృషిని గూర్చియు, కొన్నితత్త్వము లందలి గూఢార్థములగూర్చియు, జానపదగేయముల స్వరముల గూర్చియు కొంతవిషయ మధికముగా చేర్చినాను. ఈ విధముగా ద్వితీయ ముద్రణము వస్తుప్ర విషయమున కొంత మెరుగైనను అచ్చువిషయమున తరుగైనది. ఇది మూడిండ్ల పిల్లికూనయై మూడు ప్రెస్సులు మారినది. మొదటి యారుఫారములొక ప్రెస్సులో, తరువాతి నాలుగు ఫారములు ఇంకొక ప్రెస్సులో, కడమ ఫారములు మరొక ప్రెస్సులో అచ్చైనవి. ముద్రణము 1977 జనవరిలో ప్రారంభమై 1978జులైలో, ముగిసినది. గజగర్భమువలె దీర్ఘముగా సాగినదీ ముద్రణకళ. దానికితోడు రెండుతీరుల కాగితమైనది. అచ్చుపోతల వైవిధ్యముతో వర్ణశబలితమై కాగితప్ర రంగుల భేదముతో గంగాయమునల కూడలియైనది. సరస్వతి యంతర్లీనమైనది. తలపాగా, ఇన్షర్టువేసికట్టిన బిళ్ళగోచి దోవతి, కోటు, నెక్టైల వేషపు బ్రిటిషు ఉద్యోగివలెనో; జుంపాలు, గల్మఛీలు, హస్తిపాదముల పాంటు, బొమ్మల బుష్కోటు ధరించు స్వతంత్రదేశపు యువకునివలెనో కనువిందుగానున్నది.

ఈ ముద్రణమునకు ప్రభుత్వమువారు కొంత ఆర్థికసహాయము గావించినారు. ముఖ్యముగా నాటి విద్యాశాఖామాత్యులు శ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు, విద్యాశాఖ కార్యదర్శి శ్రీ సి. శ్రీనివాసశాస్త్రిగారు నా కృతజ్ఞతలకు పాత్రులు. తక్కువవెలకు కాగితమిప్పించిన కేంద్రప్రభుత్వము వారికి కృతజ్ఞుడను.

శా.శ. ౧౯౦౦
కాళయుక్తి ఆషాఢపూర్ణిమ
20-7-1978

విధేయుడు
బి. రామరాజు

# విషయ సూచిక

ఈ యాత్రలందు పడరాని పాట్లు పడవలసివచ్చినది. అసలే తెలంగాణము వెనుకబడిన ప్రదేశము. ప్రయాణసౌకర్యములు పల్లెలందు లేనేలేవు. పెక్కుమారులు పదయాత్రలు తప్పవయ్యెను. బండి ప్రయాణము రాళ్ళరప్పల బాటలందును, ఎగుడుదిగుడులందును కాలి నడకకన్న కష్టముగా తోచెడిది. కొన్ని చోటుల భయమువలనను మరికొన్ని తావుల సిగ్గువలనను పల్లీయులు పాటలు పాడెడువారు కారు, వారినెంతయో బతిమాలవలసి వచ్చెడిది. వారు పనిపాటలందు నిమగ్నులై పాడుచున్నప్పుడు ఒకప్పుడు వారి కంటబడకుండ దాగియుండియు, మరొకప్పుడు వారి యెదుటనుండియు తొందరగా వ్రాసికొనుచుండెడివాడను. ఒకగ్రామమున సేకరించిన పాటలు మరియొక గ్రామమున నేను పాడి వినిపించి యచటివారి కుత్సాహము కల్పించి వారిచే క్రొత్తపాటలు పాడించి వ్రాసికొంటిని. కొన్ని ప్రదేశములకు రేడియో సెట్టునుకూడ వెంట నిడుకొనిపోయి ఆలిండియా రేడియో వారు ప్రసారము చేయు పాటల నాయా గ్రామీణులకు వినిపించి మీపాటలు కూడ రేడియోలో ఇదేవిధముగా పాడుదురని వారిని ఉబ్బించి, ఆస చూపించి పాటలు పాడించితిని. కొందరికి ప్రాతగుడ్డ లిచ్చి, కొందరికి పొగాకు చుట్టలనిచ్చి, మరికొందరికి కల్లు పోయించి, ఇంకకొందరికి పైకమిచ్చి పాటలు పాడించితిని. పాటలు సేకరించుటకు కొన్నిచోట్ల అన్యాయమునకుగూడ ఒడికట్టితిని. చేసిన పాపము చెప్పుకొనిన పోవునందురు. కొన్ని గ్రామముల పల్లీయులు బతిమాలినను, ఏమిచ్చినను పాడనివారిని గ్రామాధికారులచేతను, పోలీసులచేతను బలవంతముగా పట్టితెప్పించి — కొట్టించి కూడ — పాటలు పాడించితిని. వ్రాసికొన్న తరువాత నేను చేసిన యన్యాయమున కేడ్పువచ్చెడిది. అటుతరువాత వారి యిండ్లకు పోయి క్షమాపణము వేడుకొని చేతనైన యుపకృతి చేసితిని. నా యదృష్టవశమున నా సహాధ్యాయులైన మిత్రులెందరో ఆయా జిల్లాలయందు రెవిన్యూ పోలీసుశాఖలం దున్నతోద్యోగులుగా నున్నవారందరును నాకు తోడ్పడిరి. గ్రామాధికారులు ఆయా పాఠశాలలందు పనిచేయు ఉపాధ్యాయ వర్గము, మిత్రులు, బంధువులు, ఎందరో తోడ్పడిరి. పోవుటకు వీలుకాని చోట్ల కుత్తరములు వ్రాసి మిత్రులవలన గేయములు సేకరించుకొంటిని. నేను సేకరించిన గేయములను ప్రత్యేక సంపుటములుగా ప్రకటింపగలను. అప్పు డేగేయ మెచ్చట సేకరించినది, ఎవరు పాడినది, ఎవరెవరు నాకు తోడ్పడినది విపులముగా మనవి చేసికొందును. జానపదగాయకభిక్షుకులు Professionals మాత్రము కోరినంతనే పాడి

వినిపించెడువారు. వారికి కావలసినది పిడికెడు బిచ్చము, కల్లునీళ్ళకు కావలసిన రాగి డబ్బులు, ప్రాత వస్త్రములు. నా యీవివలన వారి జోలెలు నిండకున్నను తమ యెదలం దూరిన యమృతవాక్కులతో నా పాటల జోలెను మాత్రము పూటిగా నింపినారీ యల్పసంతోషులు. కాని వీరితో గొప్ప తిప్పలు పడవలసి వచ్చినది. తమ ఫొటోలు తీయనిచ్చెడివారుకారీ దరిద్రనారాయణులు. ఫొటో తీసినచో ఒడలు చిక్కిపోవుననియు, కంఠమాధుర్యము చెడిపోవుననియు వీరి నమ్మకము. ఐనను పడరాని పాట్లుబడి వారి బొమ్మలు తీయించినాను. అముద్రితములగు పల్నాటివీరులకథలు మున్నగువానిని మద్రాసు ప్రా. పు. భాండాగారమున చదివి నోట్సు వ్రాసికొంటిని. ఆయా చారిత్రక విశేషములను శాసనములను శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి వలన నెరింగితిని. నాకన్న పూర్వ మీరంగమున కృషిచేసినవారి వ్రాత లన్నియు చదివినాను. ఇంత కష్టము పడినందులకు నాకత్యంతసంతోషమును కూర్చిన దేమన ఈ రంగమున చెప్పుకొనదగినంత కృషి చేసినవారిలో నేనే ప్రథముడను. ఈనా కృషి జనాదరణము గాంచి మరి కొందరు పరిశోధకు లీమార్గమున పరిశ్రమించినచో నేను ధన్యుడ నగుదును.

మన భాషాసారస్వతముల యారంభస్థితిని క్రమపరిణామమును గూర్చి ఇప్పుడిప్పుడే పరిశోధనములు జరుగుచున్నవి. కేవలము శిష్ట సాహిత్యమునే యాధారముగా చేసికొని ఇట్టి పరిశోధనలకు పూనుకొనుట నేలవిడిచిన సాముగును. జానపదుల భాషాసారస్వతములను బాగుగా పరిశీలించినచో మన యారంభస్థితి కొంతకుకొంత తప్పక గోచరించును. జానపదసాహిత్యము శిష్టసాహితీ సౌధమునకు పునాదివంటిది. ఈనాడీ రెండింటియందును ఒకదాని ప్రభావము మరియొకదానిపై నున్నట్లు స్పష్టముగా కాననగును. వాఙ్మయారంభమునకు జానపదుల మనోభావములును తొలి నుడుగులును ఆధారమైనటులే శిష్ట వాఙ్మయమున గల నానాప్రసిద్ధపురాణేతిహాసప్రబంధముల కథలు, భావములు నేడు ప్రచారమందున్న గేయములందు కనబడు చున్నవి. శిష్టకవుల రచనములు మహానదుల వంటివైన జానపదులగేయములు సెలయేరులవంటివి. రెండింటను జలము సమానము. జలమొక్కటే వివిధరూపములతో భాసించినట్లుగా, విశ్వజనీనమైన వస్తువు, భావములు, ఉపమానములు మున్నగునవి రెండింటను సమానముగా గోచరించినట్లు భావింపవలయును. ఆయాప్రకరణములందు—

ప్రత్యేకముగా పౌరాణికగేయములందు-శిష్టసాహిత్యము జానపదసాహిత్యము ఒకదానిని వేరొకటి ఏతీరుగా ప్రభావిత మొనర్చెనో పేర్కొని యున్నాను.

లబ్ధగేయసారస్వతమంతటిని-అనగా నాకు దొరికిన ముద్రిత గేయములు, అముద్రిత గేయములు మున్నగువానిని పరిశోధనాసౌలభ్యమునకై కొన్ని వర్గములుగా విభజించితిని విషయవిభజనమునకై ఏయొక పద్ధతి నవలంబించినను, అది సమగ్రము కాజాలదు జానపదగేయముల నన్నింటిని రెండు మూడు తీరులుగా వర్గీకరింపవచ్చును. ఒక విధముగా ఈగేయసంపద నంతటిని నాల్గు బృహద్భాగములుగా విడదీయవచ్చును. 1. బాలబాలికా సాహిత్యము, 2. స్త్రీ సాహిత్యము, 3. పురుష సంబంధి సాహిత్యము, 4. స్త్రీ పురుషోభయసంబంధము. కాని యిట్టి విభజనమున పరిశోధనమునకు కావలసినంత సౌకర్యము లభించుట యటుంచి కొంత క్లిష్టత కూడ ఏర్పడును. ఇక గేయములందలి వస్తువునుబట్టి విభజన మొనర్చినచో 1. పౌరాణికములు – తద్భేదములు. 2. చారిత్రకములు – అస్పష్టచారిత్రకములు 3. మత సంబంధములు. 4. వేదాంత సంబంధములు 5. సాంఘికములు మున్నగు వర్గము లేర్పడును. ఇటులైనను కొన్నిగేయములీ విభజనమున కందజాలవు. ఇక మూడవ పద్ధతి రసానుగుణముగా విభజించుట. శిష్ట సాహిత్యమున తత్తద్రసప్రధానములుగా కావ్యము లున్నటులే జానపదగేయములు కూడ నానా రసములకు సంబంధించినవి కలవు. ఈ గేయములందధికభాగము శృంగార, వీర, కరుణ, అద్భుత, హాస్య, రసములందు విభక్తమైనను మరికొన్ని గేయములు మిగిలిపోవును. కనుక మొదటనే ఏ యొక పద్ధతి నవలంబించినను సమగ్రవిభజనము జరుగబోదని మనవి చేసితిని. పరిశోధనాసౌలభ్యమునకై పైన పేర్కొన్న మూడు పద్ధతుల నవలంబించినచో జానపదగేయసంపద నంతటిని సమగ్రముగా విభజింపవచ్చును. ఆలంబనము ననుసరించి విభజించినచో 1. బాలబాలికా గేయములు 2. స్త్రీలపాటలు 3. గ్రామికగేయములును; వస్తువు ననుసరించి విభజించినచో 1. పౌరాణికములు, 2. చారిత్రకములు, 3. మతసంబంధములు 4. పారమార్థికములును ; రసము ననుసరించి విభజించినచో 1. శృంగార 2. అద్భుత, 3. కరుణ, 4. హాస్యరస సంబంధములును; ఈ విధముగా పదునొకండు విభేదము లేర్పడును. ఈ విభాగముల విమర్శనముతోపాటు జానపదగేయముల యుత్పత్తి, వాని లక్షణము జానపద గేయముల ప్రశస్తి, పూర్వసాహిత్యమున వాని ప్రసక్తి, జానపదగేయములను

గూర్చిన కృషి మున్నగునవి చర్చింపవలసియుండును. జానపదగేయములందలి భాషాసారస్వతవిషయములు ప్రత్యేకముగా పరిశీలింపదగినవి. అటులే జానపద గేయములందు కానవగు సాంఘికవిషయములుకూడ కనుగొనుట యావశ్యకము. మఱియును జానపదగేయములు పాడుచు బిచ్చమెత్తెడు గాయకభిక్షుకులను గూర్చియు జానపదగేయములను పాడునట్టి పద్ధతినిగూర్చియు పరిశీలింపనగును. కనుక పరిశోధన కనుకూలముగా నా యీ ప్రకరణము లీవిధముగా విభజింప నైనవి. 1. ప్రథమ ప్రకరణమున జానపదగేయముల పుట్టుపూర్వములు, వాని వ్యాప్తి, వాని లక్షణము, పూర్వసాహిత్యమున వాని ప్రసక్తి, జానపదగేయములను గూర్చిన కృషి మున్నగు విషయము లుండును. అటుతరువాత ప్రకరణములు 2. పౌరాణికములు, 3. చారిత్రకములు, 4. మతసంబంధములు, 5 పారమార్థిక ములు, 6. స్త్రీలపాటలు, 7. గ్రామికగేయములు, 8. పిల్లల పాటలు, 9. శృంగార గేయములు, 10. అద్భుత గేయములు, 11. కరుణ, 12. హాస్య సంబంధములు, 13. జానపదగేయములందలి భాషాసారస్వతవిషయములు, 14. జానపదగేయము లందలి సాంఘిక విషయములు, 15. జానపదగాయకులు, 16 జానపదగేయముల వరుసలు, ఈ విధముగా మొత్తము 16 ప్రకరణము లేర్పడినవి. జానపద గాయకులను గూర్చి వ్రాసిన ప్రకరణమున నాకు లభించిన గాయకభిక్షుకుల ఛాయాచిత్రములుకూడ చేర్చినాను. ఉపసంహారముగా నాలుగు మాటలు వ్రాసి చిట్టచివరను నాకు తోడ్పడిన గ్రంథముల పట్టికను మరియు అనుక్రమణికను ఇచ్చియున్నాను.

డాక్టరేటు పట్టము కొరకు సాగించిన ఈ పరిశోధనమున కవకాశము కల్పించినవారు డా. సూరి భగవంతంగారు. డా. భగవంతంగారికి పూర్వము కూడ మా విశ్వవిద్యాలయమున తెలుగులో పరిశోధనము చేయుట కిష్టమున్నవారు దరఖాస్తులు పెట్టుకొనవచ్చునన్న నియమముండెడిదేకాని పరిశోధనము చేయుట కనుమతి లభించెడిదికాదు. విశ్వవిద్యాలయమువారి నియమము ననుసరించి రెండుసారులు దరఖాస్తు పెట్టుకొన్నను నా కవకాశము లభించలేదు డా. భగవంతం గారు విశ్వవిద్యాలయోపాధ్యక్షులైన తరువాతనే తెలుగులోకూడ పరిశోధనము చేయుట కవకాశము కల్పించినారు. ఆ యవకాశమును వినియోగించుకొన్న వారిలో నేను ప్రథముడను. వారి చొరవతో మా తెలుగుశాఖ పరిశోధనాపుష్టమైనది. వారికి నేనెంతయు కృతజ్ఞుడను.

నా పరిశోధనమునకు దర్శకులై, నాజీవితమునకు మార్గదర్శకులై శిష్యవాత్సల్యము మూర్తీభవించిన మద్గురుదువర్యులు ఆచార్య శ్రీ ఖండవ, లక్ష్మీరంజనం గారికి నతులు.

నిండు మనంబు నవ్యనవనీతసమానము పల్కు చంద్రమో
మంతల మండనార్థము సుమద్రవతుల్యము చేత; విపులం
దుండదు మా గురున్ త్రికరణోపమితిన్ ప్రతిసేయ శిష్యులం
దుండదు నన్ను బోలు మరియొక్కడు రాజకుమారమండలిన్.

ఈ గ్రంథమును ముద్రించుటకును, పరీక్షకుల యభిప్రాయము ప్రకటించుకొనుటకును అనుమతి నొసంగిన మా విశ్వవిద్యాలయోపాధ్యక్షుల శ్రీ డి. ఎస్. రెడ్డిగారికిని, శాణోపలములవంటి పరీక్షకులైన శ్రీ ఖండవ లక్ష్మీరంజనం, శ్రీ గంటి జోగిసోమయాజులు, శ్రీ నిడుదవోలు వెంకటరా గారలకును నా నమోవాకములు.

నా పరిశోధన మంతయు నొకయెత్తు, చేసిన పరిశోధనాఫలితము నీ విధము ప్రకటించుకొనుట ఇంకొకయెత్తు. పరిశోధనమున కెంత శ్రమపడితిన ప్రచురణమున కంతకన్న నెక్కుడు కష్టపడితిని. నా గ్రంథమును చూచి మెచ్చి నన్ను ప్రోత్సహించు నుద్దేశముతో హైద్రాబాదు ప్రభుత్వ ముఖ్యామాత్యు శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు ఈ గ్రథంమునేకాక నేను సేకరించిన తెలంగాణ జానపదగేయము లన్నింటిని ప్రభుత్వపక్షమున ముద్రించుటకు నిశ్చయించి ఈ యత్నమున నాకు తోడ్పడినవారిలో శ్రీ కాశోజి నారాయణరావుగారున శ్రీ కపిల కాశీపతిగారును ముఖ్యులు. కాని ఇంతలో ఆంధ్రప్రదేశ మవతరిం కాల మాసన్నమైనది. ప్రభుత్వమే మారిపోవుచున్న సమయమున నిట్టి నిశ్చయవ ఫలవంతమగునో కాదో యని శ్రీ బూర్గుల రామకృష్ణరావు గారు, గ్రంథముద్రణ హైద్రాబాదు ప్రభుత్వమువారెట్టి నిబంధనలు లేకుండ నాకైదువేల రూపాయ సహాయముగా నిచ్చుట కుత్తరువు చేసిరి. ఉత్తరువైన మరునాడు హైద్రాబా ప్రభుత్వము మారిపోయి ఆంధ్రప్రదేశ ప్రభుత్వమవతరించినది. కొంతకాలమ తరువాత హైద్రాబాదు ప్రభుత్వాజ్ఞను మన్నించి ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువా నాకైదువేల రూపాయ లిచ్చుటకు సమ్మతించిరి. మొదట రూ. 2500 ఇచ్చుటకు అచ్చైన పిదప ప్రభుత్వమునకు నూరు ప్రతు లిచ్చినచో కడమ రూ. 250 ఇచ్చుటకును అంగీకరించిరి. పూర్వపు హైద్రాబాదు ప్రభుత్వపు వాగ్దానము

మన్నించి ఈ సాహాయ్య మొనర్చిన ఆంధ్రప్రదేశ ప్రభుత్వమునకుకిని ముఖ్యముగా గౌ॥ డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారికిని (నాటి ఆర్థికమంత్రి), విద్యాశాఖామాత్యులు గౌ॥ శ్రీ ఎస్.బి.పి. పట్టాభిరామారావు గారికిని, కృతజ్ఞతలు. ప్రభుత్వము చేయూత నీయకున్నచో ఈ గ్రంథమును నాకై నేను ప్రస్తుతము ప్రచురించుకొనెడువాడను గాను.

ఈ గ్రంథమునకు నూరు రీముల కాగితమును సరసముగు ధరకిప్పించిన సిర్పూరు పేపరుమిల్సు యజమానులగు బిర్లా సోదరులకును వారి ఆఫీసు మేనేజరు శ్రీ భండారి గారికిని మిక్కిలి కృతజ్ఞుడను.

గ్రంథ మచ్చగునపుడు స్ఖాలిత్యములను తొలగించి దిద్ది తీర్చిన మద్గురు పాదులు శ్రీమదాచార్యరఘునాథచక్రవర్తిగారికి ప్రణతులు.

ప్రతిశీర్షికకు కావలసిన చిత్రములను సిద్ధమొనర్చి ఈ గ్రంథమున కుచితమగు వన్నెచిన్నెలు దిద్దిన నా మిత్రులు కళాకారులు శ్రీ మడిపడగ బలరామాచార్యులకు నమస్సులు.

పదానుక్రమణికను సిద్ధమొనర్చిన మిత్రులు నాగభూషణ శర్మ, సుప్రసన్న రామకోటిశాస్త్రి గారలకు కృతజ్ఞుడను.

3-4-685
నారాయణ గూడ
హైదరాబాదు
9-12-1958

రచయిత

# ద్వితీయ ముద్రణ పీఠిక

ఈ గ్రంథము ప్రథమముద్రణమై రెండు దశాబ్దములు గడచినవి. ఈ యిరువదేండ్లలో తెలుగు జానపదసాహిత్యమును గూర్చిన పరిశ్రమ మరికొంత జరిగినది. ఆనాడీ విషయముపై పరిశోధనమున కనుమతి పొందుటే గగనమైనది. ఈనాడు తెలుగుదేశమందలి వివిధవిశ్వవిద్యాలయములయందే కాక రాష్ట్రము బయటను జానపదవాఙ్మయాధ్యయనము పరిశోధనము చెప్పుకొనదగినంతగా సాగుచున్నది. ముందుముందింకను ఈ రంగమున విశేషకృషి జరుగగలదను ఆశయున్నది. ఆయాశయే ఈ ద్వితీయముద్రణకు ప్రోత్సాహకారియైనది. ద్వితీయ ముద్రణమున అవసరమనుకొన్న మార్పులు కూర్పులు కొన్ని చేసినాను. జానపద విజ్ఞానమందలి వివిధశాఖల గూర్చియు, దాని దశాంకవిభజనపద్ధతి గూర్చియు, కడచిన యిరువదేండ్లలో ఈ రంగమున సాగిన కృషినిగూర్చియు,కొన్నితత్త్వము లందలి గూఢార్థములగూర్చియు, జానపదగేయముల స్వరముల గూర్చియు కొంతవిషయ మధికముగా చేర్చినాను.ఈ విధముగా ద్వితీయ ముద్రణము వస్తువు విషయమున కొంత మెరుగైనను అచ్చువిషయమున తరుగైనది. ఇది మూడిండ్ల పిల్లికూనయై మూడు ప్రెస్సులు మారినది. మొదటి యారుఫారములొక ప్రెస్సులో, తరువాతి నాలుగు ఫారములు ఇంకొక ప్రెస్సులో, కడమ ఫారములు మరొక ప్రెస్సులో అచ్చైనవి. ముద్రణము 1977 జనవరిలో ప్రారంభమై 1978జులైలో, ముగిసినది. గజగర్భమువలె దీర్ఘముగా సాగినదీ ముద్రణకళ. దానికితోడు రెండురీతుల కాగితమైనది. అచ్చుపోతల వైవిధ్యముతో వర్ణశబలితమై కాగితపు రంగుల భేదముతో గంగాయమునల కూడలియైనది. సరస్వతి యంతర్లీనమైనది. తలపాగా, ఇన్షర్టువేసికట్టిన బిళ్ళగోచి దోవతి, కోటు, నెక్టైల వేషపు బ్రిటిషు ఉద్యోగివలెనో; జుంపాలు, గల్మీఛీలు, హస్తిపాదముల పాంటు, బొమ్మల బుష్కోటు ధరించు స్వతంత్రదేశపు యువకునివలెనో కనువిందుగానున్నది.

ఈ ముద్రణమునకు ప్రభుత్వమువారు కొంత ఆర్థికసహాయము గావించినారు. ముఖ్యముగా నాటి విద్యాశాఖామాత్యులు శ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు, విద్యాశాఖ కార్యదర్శి శ్రీ పి. శ్రీనివాసశాస్త్రిగారు నా కృతజ్ఞతలకు పాత్రులు. తక్కువవెలకు కాగితమిప్పించిన కేంద్రప్రభుత్వము వారికి కృతజ్ఞుడను.

శా.శ. ౧౯౦౦
కాళయుక్తి ఆషాఢపూర్ణిమ
20-7-1978

విధేయుడు
బి. రామరాజు

# విషయ సూచిక

# ప్రవేశిక

## నిర్వచనము

జనపదమనగా పల్లెటూరు. "ఆర్యావర్తః పుణ్యభూమి ర్మధ్యం విన్ధ్యహిమాగయోః, నీవృజ్జనపదౌ దేశవిషయౌ తూపవర్తనమ్" అని అమరము. జనపదములయందుండువారు జానపదులు. వారు పాడుకొనెడు పాటలు లేదా గేయములు జానపదగేయము లనబడును. వీనినే ఇంగ్లీషులో **Folk Songs** అందురు. ఈపదము **Volkslied** అను జర్మనుభాషాపదమున కనువాదము. **Folk Songs** జానపదగేయములు, **Folk Literature** జానపదసాహిత్యము **Eolk Lore** జానపదవిజ్ఞానము అను మాటలన్నియు నా శబ్దభవములే. ఔత్తరాహులగు భారతీయులుకూడ నీవిషయమును తెలుపుటకే 'లోకసాహిత్య' 'లోకగీత్' శబ్దములను వాడుచున్నారు. జానపదులనగా మోటువారు, పల్లెటూరివారు, అనాగరకులు, పామరులు, ప్రాకృతులు, అజ్ఞానులను నర్థము స్ఫురించునని కాబోలు కొందరాంధ్రపండితు లీగేయములను ఈ సాహిత్యమును తమ యిష్టానుసారముగా వేరువేరు పేర్లతో పిలిచిరి. జానపదశబ్దము ప్రాకృతత్వమును సూచించునన్నచో దానికి పూర్తిగా విరుద్ధార్థమిచ్చునట్టి ప్రయోగమును కలదు. "కృతయజ్ఞశ్చ మేధావీ బుధో జానపద శ్శుచిః"[1] అని వ్యాసులవారు జానపదులను యజ్ఞము చేసినవారితోడను పండితులతోడను సమానులనుగా నొనర్చిరి. ఇక ఆంధ్రపండితులు, విమర్శకు లేయే పేరుల నీగేయములను నిర్వచించిరో అటుల నిర్వచించుటకు కారణము లేవో ఆయాపండితు లొనర్చిన నామకరణము లెంతవరకు సమంజసములై యున్నవో తెలిసికొని తరువాత సరియగు నామనిర్వచనము చేయ యత్నింతము. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగా రిట్టి వాఙ్మయమును ప్రజావాఙ్మయ మనిరి. ప్రజలనగా పల్లెటూరివారు కావచ్చును. పట్టణవాసులును కావచ్చును. విశేషించి పామరత్వదోషము తొలగిపోవునని వార భిప్రాయపడియుందురు. శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి, శ్రీ అడిదము

1. భారతము. శాం ౧౭౩ అ ౪౧ శ్లో. కృతప్రజ్ఞశ్చ. పాఠాంతరము

రామారావు ప్రభృతులు పదవాఙ్మయమని పేర్కొనిరి.[1] జానపదగేయముల కున్న రెండుమూడు ముఖ్యలక్షణములలో నొకటియగు పదచ్ఛందస్సునే ప్రధానముగా గొని వారిట్టి నామకరణ మొనర్చియుందురు. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు అనాదృతవాఙ్మయ మనిరి.[2] నాగరకులు పండితులు లాక్షణికు లిట్టి పాటలను తమ చెంతనున్న శిష్టసాహితీనికషములపై రాచి పనికి రానివని యనాదరణ సేయుటవలనను, స్వయముగా శ్రీ శర్మగారికట్టి వాఙ్మయము నెడగల యాదరముచేతను దానిని వారావిధముగా పేర్కొనియుందురు. శ్రీ వావిలాల సోమయాజులుగారు గేయరచనలనిరి. ఇవి పద్యములుగా కాక గేయములుగా రచింపబడుటనుబట్టియే వీరీనామమును ఎంచుకొనిరనుట స్పష్టము. చతుర్విధములగు నాంధ్రకవిత్వములందేది యొకటి కావున లాక్షణికమతాను సారముగా శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మధురకవితలని పిలిచిరి.[3] శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు దేశిసారస్వత మనిరి.[4] మార్గ దేశి భేదములతో నొప్పారు మన యాంధ్ర సారస్వతమున నీభాగమంతయు దేశిసారస్వతమున జేరును కావున వారావిధముగా వింగడించిరి. శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ, శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావు, శ్రీహరి ఆదిశేషువు, శ్రీ తూమాటి దొణప్ప, శ్రీ నేమనూరి గంగాధరం ప్రభృతులు మాత్రము జానపదశబ్దమునే వాడియున్నారు. తార్కికపద్ధతి నాలోచించి వీనియం దేపదము సార్థకమో తేల్చయత్నించుచో నీపేర్లన్నింటికి నతివ్యాప్తియో యవ్యాప్తియో కలుగుచున్నది. ప్రజావాఙ్మయమనెడు మాటనే తీసికొనుడు. ప్రజలు కానివారెవరు? నాగరకులు పండితులు మాత్రము ప్రజలు కారా? వారును ప్రజలే. అటులైనచో పండితులచే పోషింపబడు వాఙ్మయముకూడ ప్రజావాఙ్మయము కావలసివచ్చును. కనుక ప్రజావాఙ్మయమనుమాట పొసగదు. పదవాఙ్మయమను మాటను విచారింతము. జానపదకవిత్వము పదకవిత్వమను మాట వాస్తవమే. కాని పండితకవులు కూడ రచించిన పదము లున్నవికదా! అవికూడ ఈశాఖలో చేరునా? చేరవు. కనుక నిదియును పొసగదు. మూడవది అనాదృతవాఙ్మయమను పేరు. ఎవరిచే ననాదరింపబడినందులకు దీనికీపేరు? పండితులచే ననాదరింపబడినందులకా? పండితు లాదరించలేదని ఈ పేరిడినచో

1. వ్యాస సంగ్రహము
2. అమరావతీ స్తూపము
3. మీగడ తఱకలు
4. కిన్నెర (డిసెంబరు ౧౯౫౩.)

మరి ఆదరించువారికి సైతము అనాదృతవాఙ్మయమేనా ? నూటికొక రనాదరణ మొనర్చినంత మాత్రమున తక్కిన తొంబదితొమ్మండ్రు తామాదరించుదాని ననాదృతవాఙ్మయమందురా ? ఆవాఙ్మయమున కాపేరిడిన శ్రీ మల్లంపల్లివారికి మాత్రమది యత్యంతాదరణీయమైనదే కదా ! కనుక ఈ పేరును పొసగదు. మధురకవితలను పేరు లాక్షణికసమ్మతమైనను దానికి నతివ్యాప్తి కలదు. "మధురకవిత్వం బన్నది నాటకాలంకారంబులు, కళికోత్కళికలు, విభక్త్యర్థ దేవతోదాహరణములు, సప్తతాళనటనలు, నట్టొట్లు, గీతప్రబంధములు, చతుర్భద్రికాష్టభద్రికలు, బిరుదావళి, నామావళి, భోగావళి, రంగఘోష, త్యాగ ఘోష, చతురుత్తరసంఘటనలు, యక్షగానంబుల వెలయుపదంబులు, దరువులు, నేలలు, ధవళంబులు, మంగళహారతులు, శోభనంబులు, నుయ్యాలజోలలు, జక్కులరేకు పదంబులు, చందమామసుద్దులు, అష్టకంబులు, ఏకపద, ద్విపద, త్రిపద, చతుష్పదాష్టపదలు నివి యాదిగాగల్గు నన్నియు" నగును.[1] పై వానిలో యక్షగానంబుల వెలయు పదములుదక్క తక్కినవాని జేర్చుటకు వీలు లేని రచనలగూడ మధురకవితలనుట పొసగదుకదా ! ఇటువంటిదే దేశి సారస్వతమను పేర్లు. దీనికిసైత మతివ్యాప్తి కలదు. జానపదసాహిత్య మంతయు దేశిభాగమున జేరును. నిజమేకాని దీని వెనువెంట నా విభాగమున పాల్కురికి సోమనాథునివంటి పండితప్రకాండులు రచించిన పండితారాధ్య చరిత్రము, బసవపురాణము, గోనబుద్ధారెడ్డి విరచితమగు రంగనాథ రామాయణము మొదలగు కావ్యము లనేకములు చొచ్చుకొనిపోవును. కనుక నీపేరును పొసగదు. ఇటుల నాయాపండితులిడిన పేరుల త్రోసిరాజనుట వారు పొరపడినారనుటకు గాదు. వారివారి యుద్దేశముల ప్రకారముగా వారెంచిన పేర్లు సరియైనవే. ఆ వాఙ్మయమునకున్న న్యూనతను తొలగించి సామాన్య ప్రజానీకమునకు సంబంధించినదని చెప్పుటకే ప్రజావాఙ్మయమని యొకరు పేరిడిన మరియొకరు జానపదసాహిత్యముఖ్యలక్షణములలో నొకదగు ఛందము నాధారముగా గొనియును, మరియొకరు పద్యకవిత్వమునకన్న పద కవిత్వము భిన్నమైనదని చెప్పుటకు పదసాహిత్యమనియు నిర్వచించిరి. ఒకరు పండితు లనాదరించుటజేసి యశ్రద్ధవలన గలిగిన హానికి నొచ్చుకొనియు వారికి స్వయముగా నా వాఙ్మయమునెడ గల ఆదరాభిమానముల సూచించుటకు అనాదృతవాఙ్మయ మనిన నింకొకరు మన పూర్వులైనవారు రచించిన చతుర్విధ

1. 'సుగ్రీవవిజయము' పీఠికలో వేటూరివారు.

కవితలంపు జేరెస మధురకవితలో నీగేయభాగ మంతయు నిమిడిపోవుటచే లాక్షణికసమ్మతి ననుసరించియు తక్కిన మూడు తీరుల కవిత్వముల (ఆశు, చిత్ర, విస్తర)తోబాటుగా దీనిగూడ గద్దె నెక్కింపదలచియు "మధురకవిత"లనిరి. మరియొక రిది సంస్కృతసాహితీవిపణివీథులనుంచి యెరవు తెచ్చుకొన్న మార్గ సాహిత్యమునకన్న భిన్నమనియు దేశవాసుల మనోభావములు దేశీయ భాషలో (జాను తెనుగులో) దేశిచ్ఛందముతో చెప్పబడినవగుట సిసలైన సారస్వతమదియేయను గౌరవముతో దేశిసారస్వత మనిరి. కనుక వారివారి యభినివేశములకొలది దిద్దబడిన పేరులు వారి వ్యవహారమున సమంజసముగా నుండుటయేగాక వారి ముఖ్యోద్దేశములను పాఠకులహృదయములపరకు మోసికొని వచ్చుటయందును సఫలములైనవి. కాని ఒకే లక్ష్యమునకిన్ని పేర్లుండుట ఒక్కొక్క రొక్కొక విధముగా నిర్వచించుట పాఠకులకు కొంత క్లేశము కలుగక తప్పదు. ఇట్టి క్లేశమును దూరమొనర్చి సాధారణమైనట్టిదియును, అన్ని విధములుగా తగినట్టిదియును సంపూర్ణముగా సార్థకమైనట్టిదియును నగు పేరొకటి యుండవలయును గదా! ఒక విషయమును నిర్వచించుటకు తోడ్పడు పద్ధతులలో వ్యతిరేకమున చెప్పుట యొకటి. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు పండితులచే ననాదరింపబడినందుల కీవాఙ్మయమును అనాదృతవాఙ్మయ మన్నట్లే దీనిని శిష్టవాఙ్మయభిన్నమని కూడ చెప్పవచ్చును. పదసాహిత్యమనుచో పండితులచే రచింపబడినవియును, పల్లెలందును ముఖ్యముగా పామరులందును వ్యాపించనట్టి శిష్టగేయములు, అన్నమాచార్య, క్షేత్రయ్య, త్యాగరాజ, సారంగ పాణి, విరచితములైన 'కీర్తనల నీయావరణమునుండి తొలగించుటకు 'అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికం' అని చెప్పుకొన్నట్లు "నేతివాద" పద్ధతి నవలంబింపవలయును.

సార్థకమగు నొకపేరు పెట్టుటకు పూనుకొనవలయునన్నచో నా విషయముయొక్క ప్రధానతత్త్వమును పరిశీలించవలయును. తత్త్వము లక్షణము కూడలివలన స్ఫురించునట్టిదే యైనను ఒక్కొక్క లక్షణముకన్న దాని పరిధి విస్తృతమని యెఱుగుట యత్యావశ్యకము. ఒక విషయమునకున్న ముఖ్యలక్షణములబట్టి దానికి నామకరణము చేయవలయునన్న నొక్కొక సమయమున వివాదము లేర్పడును. ఒకరొక లక్షణము నంగీకరించిన మరొక రింకొక లక్షణమునకు ప్రాధాన్య మొసంగెదరు. రెండు మూడు ముఖ్య లక్షణములు సమానప్రాధాన్యము గలవైనచో నప్పుడింతకన్న గొప్పచిక్కు

సంభవించును. తత్త్వమంతా చిక్కులుండవు. కనుక ప్రస్తుతత్త్వము నాధారముగా గ్రైకొందుమేని సులభముగా నావస్తువునకును తదితరములకును గల భేదము తెలిసిపోవును. ఆదృష్టితో చూచిన కవిత్వమంతటిని రెండు పెద్ద భాగములుగా చేయవచ్చును.[1] ఒకటి చేతనాకృతము. రెండవది యచేతనాకృతము. ఈ రెండును పరస్పర భిన్నములు.[2] ఒకటి భావుకుడైన కాళాకారుని ప్రయత్నమున దిద్ది తీర్చబడినది. రెండవది జానపదసృష్టి, మఱియు నప్రయత్నముగా నొకనోటినుండి వెడలి తనకుతానే రూపు దిద్దుకొన్నట్టిది. ఒకటి కళాత్మక కవిత్వము, ఏకకర్తృకము. రెండవది అజ్ఞాతకర్తృకమో లేక సామూహిక కర్తృకమోయని భావింపనగును. మొదటిది నాగరకతాసుందర సౌరభ్య సంవాసితము. రెండవది ప్రాకృతాకలుపయోదప్రథమోదబిందుసంసిక్త మృణ్మయ మృత్పృథ్వీగంధబంధురము. కనుక నిట్టి తత్త్వమునుబట్టి నామకరణము చేయవలయునన్నచో జానపదశబ్దమే సార్థకముగా దోచును. జనపదములందు మాత్రము పండితులు లేరా ? వారిచే పోషింపబడు సాహిత్యము కూడ జానపద సాహిత్య మగునా? తక్కిన పేళ్ళకు కలిగినట్టి విప్రతిపత్తి ఈ విధముగా దీనికి గూడ కలుగుచున్నదికదా యందురేమో ? అటులకాదు. జనపదమందున్నను పండితుడు నాగరకుడే! విదగ్ధుడే! నగరమందున్నను జానపదుడు పామరుడే. జానపదుడను మాట పామరత్వమును ప్రాకృతత్వమును సూచించును. పామరత్వము నిందార్థద్యోతకమని చింతింప నక్కరలేదు. ఆ పామరత్వమే యాసాహిత్యమునకు భూషణము మరియు నాత్మ వంటిది. జానపద సాహిత్యమన పామరుల సాహిత్యమే. ఇది పాండిత్యప్రకర్షగాని చేతనాకృతకళావిలసనముగాని లేనట్టిది. మరియు అకృత్రిమమైనదను అర్థమును సూచించును. పాశ్చాత్య దేశములందీ విషయమున కృషిచేసిన పండితులు చైల్డ్, హెండర్సన్, సీగర్, లామ్మన్, గమ్మెర్, మిల్లర్, గ్రిమ్ మున్నగువారలును, భారతదేశమున నీ విషయమై పరిశ్రమ మొనర్చిన టెంపుల్, గోవర్, ఎల్విన్, కూర్త్రే, బోసుల్,

---

1. "All poetry is divisible into two great classes–that which is manifestly the work of the conscious artist, and that which is not"

   English and Scottish Ballads. F. J. Child.

2. "............the poetry of the folk is different from the poetry of art." Ibid.

హేమెండార్ఫ్, మున్నగు పాశ్చాత్యులును, దేవేంద్రసత్యార్థిమంటి భారతీయులును 'ఫోక్‌లోర్', ఫోక్‌సాంగ్' శబ్దములనే వాడిరి. 'ఫోక్' శబ్దమునకు జానపద శబ్దము భాషాంతరీకరణముగా గ్రహించిరి. జనపద శబ్దమొక జాతిపరముగను, ప్రజల పరముగను, విషయపరముగను వాడబడును. 'కులాని జాతీః శ్రేణీశ్చ గణాన్ జనపదానపి.'[1] ఇంకొకచో జనపదమొక విషయము, దేశము, నాడు అను నర్థమున నున్నది. 'అత ఊర్ధ్వం జనపదాన్నిబోధగదతో మమ తత్ర మే కురుపాంచాలాః సాల్వా మాద్రేయజాంగలాః శూరసేనాః పుళిందాశ్చ' యని ఇటులే మరికొన్ని జనపదము లుల్లేఖింపబడినవి.[2] భారతమందే మరియొకచో "వర్షమైరావతం రాజన్నానాజనపదావృతమ్, ధనుస్సంస్థే మహారాజ ద్వేవర్షే దక్షిణోత్తరే"[3] యని కలదు. ఇక జానపద శబ్దమును గమనింపుడు. "దేయం చౌరహృతం ద్రవ్యం రాజ్ఞా జానపదాయ తు"[4] "స యథా మహారాజో జానపదాన్ గృహీత్వా స్వే జనపదే యథాకామం పరివర్తతే"[5] ఆంధ్రమహాభారతమున జానపదశబ్దము గ్రామీణులను నర్థమున కర్ణశకునిదుర్యోధనుల మంతనంబున గాంచనగును.

ఉ. జానపదుల్ పురీజనులు సంతసముం బ్రమదం బెలర్ప నీ
దైన శుభోదయంబు హృదయంబుల గోరుచునున్నవారు స
మ్మానము నొంది కౌరవసమాజము నిన్ను భజింప భూరితే
జోనిధివై వెలింగెదవు సూర్యుని చాడ్పున నీవ యిమ్మహిన్'' 6

జానపదగీతముల ముఖ్యతత్త్వమును గురించి విచారించునప్పుడు అనాగరక జాతులను గ్రామీణులను సూచించుటకే పైన పేర్కొనబడిన పండితులు 'ఫోక్' శబ్దము నుపయోగించిరి. ఒక పాశ్చాత్యపండితు డభిప్రాయపడినట్లు[7] మనముకూడ అత్యంతప్రాచీనమగు జనపదసంఘముల నూహించుకొననక్కర లేదు. ఏలన ఒకనాడు తెలుగునాటి జనపదములం దిట్టివారే నివసించుచుండిరి.

---

1. యాజ్ఞ్యవల్క్య
2. భార. భీ ౯ అ.
3. భార. భీ ౬ అ.
4. యాజ్ఞ్యవల్క్య.
5. శత. బ్రా. ౧౪. ౩౧. ౨౦
6. భార. ఆర. ౨౮–౩౪౬
7. "Folk is a large word. It suggests a whole nation, or at all events a huge concourse of people. Let us abandon it, then, for a moment, and think rather of a small tribal gathering assembled in very early times . ......" English and Scottish Ballads. F. J. Child·

ఇప్పటికి అచ్చటచ్చట నున్న ఆటవికులను, వారుండు ప్రదేశములను సందర్శించినచో నీ సత్యము మనకు స్పష్టముగా తెలియవచ్చును. ఆ జనపదములందు పండితు లుండరు. అచటివారందరును నాగరికత లేనివారే. వారిది సామూహికజీవనమే కాని వైయక్తికజీవనము కాదు. అందరకు గల సుఖదుఃఖములు, జీవితసమస్యలు, అనుభూతులు, సమానములు. ఆ సమష్టిజీవనము గడుపువారి జీవితావసరములం దొకవ్యక్తికి మరియొకవ్యక్తికి గాని, ఒక కుటుంబమునకు (లేదా జాతికి) మరియొక కుటుంబమునకు గాని, భేద మేమియు నుండదు. ఆసంఘమందలి వ్యక్తులందరికిని ముఖ్యావసరమగు ఆహారోత్పత్తి యొక తక్కిన జీవితావసరములయెడ ప్రత్యక్షసంబంధమేకాని మనమున్నట్టితర మధ్యస్థమగు వృత్తులు లేవు. మన కనీసపుటవసరములే వారి ముఖ్యావసరములు. వ్యక్తిగత మేధాసంపత్తియం దంతగా చెప్పుకొనదగిన వ్యత్యాసము లేదు. చదువు సంఘాలు లేవు. జానపదగేయసామకరణమున కిటువంటి సంఘము లేదా జాతిగల జనపదముల నూహించుకొనవలయును.[1] ఇదియంతయు నూహాగాన మందురేమో! అటులకాదు. ఇది కేవలము సంపూర్ణనాగరకత సంపాదించుకొన్న దేశముల కన్వయించుమాట. ఇంగ్లాండువంటి నాగరకదేశములం దిట్టి ప్రాకృత జనము ప్రస్తుతము వ్యర్థమైపోయినది. అచటి యాదిమవాసులు మున్నగువారు నాగరకులై నవీననాగరకతాసంపన్నులై, విద్యావేత్తలై, విజ్ఞానసంపన్నులై పోయినందున నిట్టి పురాజనపదము లూహింపవలయునేగాని మన భారతదేశ విషయమున నిట్టి యూహాగాన మనవసరములేదు. భారతదేశమున నింకను అట్టి జాతు లున్నవి. అట్టి జనపదము లున్నవి.

ఉత్తరమున హిమాలయములనుండి దక్షిణమున కన్యాకుమారివరకును తూర్పున ఆఫ్ఘనిస్థానమునుండి పడమట బర్మావరకును మనకీ జనపదములును జానపదములును గానుపించెదరు. ఇంత ఎందులకు? ప్రత్యక్ష నిదర్శనమునకై తెలుగువారైన కొండరెడ్లును (The Reddis of Bison hills) చెంచు వారలును, మన్నెప్రాంతముల నున్నారుగదా! మనకు వీరున్నట్లే తక్కిన జాతుల వారికిని ఇటువంటివారే యున్నారు. వారి వారసులమే మనమందరమును.

1. It requires a combined effort of the reason and the imagination to conceive a poet as a person who cannot write, singing or reciting his verses to an audience that cannot read. English and Scattish Ballads.

అటువంటి యనాగరకుల నోటినుండి వెలువడిన గీతమే జానపదగీతము. పైన పేర్కొనబడిన పాశ్చాత్యపండితాభిప్రాయమున Folk అను పదమున కిట్టి జాతిని సూచించు అర్థమే కలదు. ఇంతకు తెల్పుకొనదగిన దేమన మానవుడు నాగరకతా సౌధనిర్మాణమునకు పునాదులు త్రవ్వునప్పుడు అప్రయత్నముగా ననాలోచితముగా నాతని నోటినుండి వెడలిన పృథ్వీగంధసంవాసితములైన మాటలు గంధవహుడు నడచిన బాటలందు పాటలై నడచి దేశపరిభ్రమణమున నొకచో విరిగి మరియొకచో తరిగి ఇంకొకచోట పెరిగి జానపదగేయమయ్యెను. దీని కర్తృత్వము మున్నగునవి తరువాత విచారింపనగును. భారతదేశమం దన్యభాషలలో నీవిషయమై పరిశోధన మొనర్చినవారు కూడ ఇట్టి యర్థమిచ్చునట్టి శబ్దములనే వాడియున్నారు. ఎల్విన్ మహాశయుడు తన గ్రంథమునకు "ఆటవిక గీతములు"[1] అని పేరిడెను. వ్రజభాషయందు పరిశోధన చేసిన డాక్టరు సత్యేంద్రుడు 'లోకసాహిత్య'మనెను[2]. రామనరేశత్రిపాఠియను పండితుడు తన గ్రంథమునకు 'గ్రామ గీత్'అని పేరిడెను. ఇటువంటి పేర్లు పెట్టుటలో నీపండితులందరును ఆ సాహిత్యము యొక్క తత్త్వమునే ఆధారముగా గొనిరి. కనుక మన తెలుగు భాషయందు జానపదసాహిత్యమను పేరు ఆ సాహిత్యమును సూచించునదై సార్థకముగా నుండునని నా యభిప్రాయము. ఇదిగాకను పెక్కుమంది ఈపేరుతోడనే ఆసాహిత్యమును వ్యవహరించుచున్నారు. ఇప్పటికే ఆపేరునకు కొంత ప్రతిష్ఠ కలిగిన దనవచ్చును. దీనితో తృప్తి కలుగనిచో కనీసమింకొక సాకు చెప్పుకొన వచ్చును. ప్రయోగప్రవాహమున బడి లక్షణవిరుద్ధములగు శబ్దము లెన్నియో సాధువులగుట మన మెరుగనిది కాదు. అటులనే జానపదశబ్దముకూడ ప్రయోగ ప్రవాహమునబడి సాలగ్రామమైపోయిన దనుకొనవచ్చును. కనుక నామకరణ-నామనిర్వచన చర్చ నింతటితో విడిచి తక్కిన వివరములను పూనుకొందము.

**Folk-songs, Folk-literature, Folk-lore** అను మాటలను జానపదగీతములు, జానపద సాహిత్యము లేదా జానపద సారస్వతము, జానపద విజ్ఞానమను మాటలను వాడుట పరిపాటి. కొందరు జానపదసాహిత్య, జానపద వాఙ్మయముల కభేదము పాటించుచున్నారు. వాఙ్మయశబ్దము సాహిత్య శబ్దమునకన్న విస్తృతమైనదని గమనింపవలయును. జానపద విజ్ఞాన మనగా **Folklore. Folklore** శబ్దకల్పనము **William Thoms** అను నాతనిచే

1. **Songs of the Forest, V. Elwin** 2. వ్రజలోక సాహిత్యకా అధ్యయన్

క్రీ. శ. 1846 ప్రాంతమున జరిగినపట.[1] ఆతడు The Athenaeum అను పత్రికకు ఒక జాబు వ్రాయుచు అందులో Popular Antiquities and Popular Litrature అను మాటలకు మారుగా Folklore మాటను వాడ వలసినదని సూచించెను. సాంప్రదాయికవిజ్ఞానమనగా నాగరకజాతులందుండు అనాగరకసంఘములవారి, కేవలము ఆచారవ్యవహారములు మరియు మూఢవిశ్వాసములని మొదటి నిర్వచనము. తరువాత రానురాను ఆశబ్దార్థము మరింత విస్తృతమైనది. ఆంగ్లేయ నృశాస్త్రవేత్తలగు (Anthropologists) Tylor, Frazer ప్రభృతుల పరిశోధనఫలితముగా నేటికది మరింత విశాలమైనది.[2] ప్రస్తుతము కృషీవలురకు సంబంధించిన కళలు, వృత్తులు మున్నగునవికూడ జానపద విజ్ఞానమున చేరిపోయినవి. వీరందరికన్న ముందుగా జర్మను దేశమున గ్రిమ్ సోదరులు క్రీ. శ. 1812 ప్రాంతముననే ఈ విషయమై కొన్ని గ్రంథములు ప్రకటించిరి.[3] సారాంశమేమన జానపదవిజ్ఞానమున (Folklore) జానపదులకు సంబంధించిన విజ్ఞానమంతయు వచ్చి చేరుననుట. దీనితో జానపద కథా వాఙ్మయము, మూఢవిశ్వాసములు, ఆచారవ్యవహారములు, మంత్రతంత్రములు, శాస్త్రవిజ్ఞానము అనగా భౌతిక పారమార్థిక విషయములందు జనపదవాసుల పరిజ్ఞానము, వారి భాషలు, పొడుపు కథలు, సామెతలు, వినోదములు, వేడుకలు, ఆటలు, మున్నగు పెక్కు విశేషములు చేరును. వానినుండి మంచి చెడుగులు గ్రహించగలవారు వేరుగానున్నారు. వారే సామాజికశాస్త్రవేత్తలు (Sociologists) మరియు నృశాస్త్రవేత్తలు (Anthropologists). మనకు గూడ వారికుండవలసిన దృష్టి యవసరమే యైనను మనమిప్పుట ప్రధానముగా కళాత్మకదృష్టి గలవారమని మనవి. వాఙ్మయమునందున్న ఇట్టి విస్తృతార్థము

1. The word was coined by W. J. Thoms in 1846 to denote the tradition, customs and superstitions of the uncultured classes in civilized nations.

2. "Folk-lore includes what was deliberately excluded in the early definition, popular arts and crafts, ie, the material as well as the intellectual culture of the peasantry. The Encyclopaedia Britannica W. R. H.

3. (a) Kinder-Und Hansmarchen. (1812)
   (b) Deutche Mythologie (1835).

ననుసరించి మనము చర్చించు విషయము జానపదవాఙ్మయము కాజాలదు. ఇక రెండవపదము జానపదసాహిత్యము (Folk literature) అనునది. కొందరు సాహిత్యశబ్ద మీ విషయమున ప్రయోగింపగూడదందురు. కేవలమది శిష్టులరచనములకే ప్రయోగింపబడవలె నందురు. ఈ యభ్యంతరము పూర్తిగా మడికట్టుకొని సాహిత్యము కేవలపండితజనపూజాప్రదమ్యముగా భావించువారి సొంతమని నా మనవి. సాహిత్యతత్త్వవిచారమున అప్రయత్నశిల్పమే జానపద సాహిత్యముఖ్యతత్త్వమని గుర్తించినప్పుడది ప్రయత్నముతోగూడిన శిల్పముగల సాహిత్యముతో పోటీపడుటకు వచ్చుటలేదు. మన యుద్దేశముకూడ నీ రెంటికి స్పర్థ కల్పించుట కాదు. అచేతనాకృతశిల్పమే చేతనాకృతశిల్పముకన్న మొదటిదని తెలిసికొనుటయే కాని, దానిని మించినదని గాని దానికన్న గొప్పదని చెప్పుటగాని ఉద్దేశము కాదు. అచేతనాకృతశిల్పమైన కవిత్వము ప్రథమదశయని భావించుటలో ఆక్షేపణముండబోదు. చేతనాకృతశిల్పమైన కవిత్వ మనంతర దశలో వచ్చినదనుట సహేతుకమే కదా! ఐనను ఇది విషయాంతరము. సాహిత్యమున వివిధరచనాప్రక్రియలు చేరియుండుట మన మెరిగిన విషయమే. అటులనే జానపదసాహిత్యమున యక్షగానములు, దాసరి భాగవతములు, హరికథలు, బయలాటలు, చిందుభాగోవతములవంటివి చేరును. ఈ విషయముల గురించి నామమాత్రప్రసక్తియేగాని లోతులకు దిగి విమర్శింపబూనుట నేను పెట్టుకొన్న పనికాదు. నా పరిశోధనావిషయము కేవలము జానపదగేయ సాహిత్యము, అనగా కథావిరహితమైన ముక్తకములవంటి పల్లెపాటలు మరియు కథాసహితమైన గాథాగేయములు రెండును.

## జానపద విజ్ఞానము

Folklore అను మాటకు Maria Leach కూర్చిన Standard Dictionary of Folklore Mythology and Legend నిఘంటువులో 21 మంది పండితులు చేసిన వివిధనిర్వచనము లున్నవి. Folk అనగా జానపదులు lore అనగా విజ్ఞానము Folklore అనగా జానపదవిజ్ఞానము. ఈ పదమును విశాలదృష్టితో పరిశీలించిన Alan Dundes పండితుడు తాను సంపాదించిన The Study of Folklore గ్రంథమున What is Folklore? అను ప్రశ్న వేసికొని, " It is possible, however, to define both f olk

and lore in such a way than even the beginner can understand what folklore is. The term "Folk" can refer to *any group of people whatsoever* who share at least one common factor. It does not matter what the linking factor is—it could be a common occupation, language, or religion but what is important is that a group formed for whatever reason will have some traditions which it calls its own" అని Folk పదమును నిర్వచించినాడు. "Folklore includes myths, legends, folktales, jokes, proverbs, riddles, chants, charms, blessings, curses, oaths, insults, retorts, taunts, teases, toasts, tongue-twisters, and greeting and leave-taking formulas. It also includes folk costume, folk dance, folk drama (and mime), folk art, folk belief (or Superstition) folk medicine, folk instrumental music, folksongs, folk speech, folk similies, folk metaphors and names. Folk poetry ranges from oral epics to autograph-book verse, epitaphs, latrinalia, limericks, ball bouncing rhymes, jump-rope rhymes, finger and toe rhymes, dandling rhymes, counting-out rhymes, and nursery rhymes. The list of folklore forms also contains games; gestures; symbols: prayers; practical jokes; folk etymologies; food recipes: quilt and embroidery designs; house, barn, and fence types; Street Vendor's-Cries; and even the traditional conventional Sounds used to summon animals or to give them commands. There are such minor forms as mnemonic devices, envelope sealers, and the traditional comments made after body emissions. There are such major forms as festivals and special day customs." అని పెద్ద పట్టిక నిచ్చి అంతటితో తృప్తిపడక,

This list provides a sampling of the forms of folklore. It does not include all the forms. These materials and the study of them are both referred to as folklore. To avoid confusion it might be better to use the term *folklore* for the materials and the term *folkloristics* for the study of the materials. Both the definition of the materials and the discipline should become clearer as the relationships between the study of folklore and the study of literature and anthropology are discussed in the following essays" అని హెచ్చరించినాడు.

ఇంత విస్తృతమైన జానపదవిజ్ఞానమును (verbal folklore) వాగ్రూపముగా నున్నదానిని (non-verbal folklore) వాగ్రూపేతరముగా నున్నదానిని Richard M. Dorson పండితుడు తాను సంపాదించిన **Folklore and Folklife** అను వ్యాససంపుటికి వ్రాసిన పరిచయములో నాలుగు శీర్షికల క్రింద వింగడించినాడు.

1. **Oral literature,** మౌఖిక సారస్వతము: అనగా ముఖోద్గతముగా వెలువడుపాట, మాట, పలుకు మున్నగునవి. ఇందులో తీరుతీరుల కథాగేయములు లేదా గాథలు, కథావిరహితమైన పెక్కు తీరుల చిన్నపాటలు, గద్యరూపమున లేదా వచనరూపముననుండు కథలు, సామెతలు, పొడుపు కథలు, మారుమూల పదములు, మాండలికములు, యాసలు, నుడికారములు, తిట్లు, ఒట్లు మున్నగునవి చేరును. ముఖోద్గతమైన దంతయు వాగ్రూపమున నుండక పోవచ్చును. కాని రాగములు, గొణుగుటలు, ఆశ్చర్యార్థకములు, సంబోధనలు, మెచ్చుకోళ్ళు, పిలుపులు, మచ్చికకూతలు, అరపులు, కేకలు, సంజ్ఞలు, ఉచ్చాటనలు, ఏడ్పులు, శోకాలాపములు మొదలగునవి భాషలో చేరకున్నను, నిఘంటువుల కెక్కకున్నను సంప్రదాయబలమున వ్యక్తిత్వము సంపాదించుకొన్నవి కూడ ఇందు చేరును.

2. **Material culture,** భౌతికజీవితమునకు సంబంధించిన వస్తు సంస్కృతి లేదా భౌతికసంస్కృతి. ఆయా పనులు వృత్తులు కుటీరపరిశ్రమలకు సంబంధించిన నేర్పు, కౌశలము, వంటలు వార్పులకు పానీయములకు సంబంధించిన పాకకళ, నిర్మాణ వాస్తు విజ్ఞానము, నేత అల్లిక సూదిపని, వ్యవసాయ పద్ధతులు పశుపక్షిపాలనాదులు, ఉపకరణములు వస్తువాహనములు పాత్రములు చేయుటయందలి నేర్పు, వేషభూషణములు అలంకరణములు తెర పటములు పడగలు ముగ్గులు పచ్చబొట్లు మాలాకారవిద్య, జలచర భూచర ఖేచరముల వేట మున్నగునవి ఇందులో చేరును.

3. **Social folk custom,** జానపదసాంఘికాచారము. అటు మౌఖిక సారస్వతమునకును ఇటు భౌతిక సంస్కృతికిని మధ్యన ఇరువైపులను వ్యాపించు సాంప్రదాయికజీవితమునకు సంబంధించిన సమస్తాచారము లిందులో చేరును. పుట్టినదిమొదలు గిట్టుటవరకుండు సమస్తకర్మలకు చెందిన రీతిరివాజులు ఆచారములు, వేడుకలువినోదములు, క్రొత్త పెట్టుటలు, క్రీడలు గీతనృత్తములు, పండుగలు పబ్బములు తిరునాళ్లు, ప్రభలు, సిడులు, బోనములు వీరాచారములు బలులు, సూతకపుటాచారములు, సమాధులు తిరుపళ్ళెలు, మంత్రతంత్రములు

మంత్రములు మంపులు మాయలు ప్రయోగములు కట్టుబోతు విద్యలు తాయెతలు రక్షలు దిగమడుపులు దృష్టి తీయుటలు, సంతర్పణలు దానధర్మములు పూజలు నైవేద్యములు, మ్రొక్కుబడులు ఆరాధనావిశేషములు దేవతల కొలుపులు పూనకములు, విశ్వాసములు శకునములు సోది కాలజ్ఞానములు, ఆటలు పందెములు, సైగలు, భూతవైద్యము మూలికావైద్యము బైరాగి చిట్కాలు రాక్షస వైద్యము తీర్థములు విభూతి కుంకుమలు మొదలగునవి ఇందులో చేరును.

4. **Performing folk arts,** జానపద ప్రదర్శనకళలు. ఆటవికులయు జానపదులయు వైయక్తిక- బృంద నృత్తనృత్యములు, గాత్రసంగీతము వాద్య సంగీతము, యక్షగానములు వీథిభాగవతములు గొల్లభాగవతములు చిందు భాగవతములు కలాపములు కొరవంజులు, కోలాటలు భజనలు పగటివేషములు, తోలుబొమ్మలాటలు చెక్క-బట్ట-బుట్టబొమ్మలాటలు, వాలకములు దొమ్మరాటలు గారడివిద్యలు కాటిపాపలవిద్యలు విప్రవినోదులు, పులివేషములు అర్ధనారీశ్వర వేషములు దాదినమ్మవేషములు గుఱ్ఱపునృత్యములు, భంగిమలు ముద్రలు మొదలగునవి యిందులో చేరును.

విస్తృతమైన ఈ జానపదవిజ్ఞానమును **R.S. Boggs** పండితుడు శాస్త్రీయ పద్ధతులపై సూక్ష్మాతిసూక్ష్మవిశ్లేషణ మొనర్చి విభజించినాడు.[1] దాని సారాంశమును **R. V. S.** సుందరంగారు తమ 'జానపదసాహిత్యస్వరూప'మను గ్రంథమున నీతీరుగా చెప్పినారు.

జానపదవిజ్ఞానమును **R.S. Boggs** కొన్ని **Groups** గణములుగావిభజించినాడు. వానికి గుర్తులుగా **A B C D** మున్నగు ఇంగ్లీషు వర్ణము లుంచినాడు.

- **A. General folklore** (సాధారణ జానపదవిజ్ఞానము)
- **B. Prose Narrative** (గద్యాఖ్యానము)
- **C. Ballad** (గాథా-కథాగేయము) **Song** (గేయము-పాట) **Dance** (నృత్యము) **Game** (క్రీడ-ఆట) **Music** (సంగీతము) **Verse** (గద్యము-వచనము).
- **D. Drama** (నాటకము).

---

1. **Standard Dictionary of Folklore Mythology and Legend Edited by Maria Leach, Funk & Wagnalls** లో **Types and Classification of folklore** అనువ్యాసము, పుటలు 1138-1147.

F. **Custom** (ఆచారము) **Festival** (ఉత్సవము)

G. **Geography** (భూగోళము)

L. **Language** (భాష)

M. **Art** (కళ) **Craft** (వృత్తి) **Architecture** (వాస్తువు)

N. **Food** (ఆహారము) **Drink** (పానీయము)

P. **Belief** (విశ్వాసము)

S. **Speech** (వాక్కు)

V. **Proverb** (సామెత)

W. **Riddle** (సమస్య-ప్రహేళిక-పొడుపు).

పైగణములను మరల నొక్కొక్కదానిని కొన్ని **Categories** వర్గము లుగా విభజించినాడు. ఉదాహరణమునకు, **B** గణము గద్యాఖ్యానమును మూడు వర్గము లొనర్చినాడు. **B 200, Myth** (పురాణము) **B 400. Legend** (ఐతిహ్యము). **B 600 Tale** (కథ). ఈ మూడు వర్గములం దొక్కొక్కదానిని మరల **Types** మాదిరులుగాను, మాదిరులను **Forms** ప్రక్రియలుగాను, ప్రక్రియలను **Divisions** విభాగములుగాను, విభాగములను **Subdivisions** ఉపవిభాగములుగాను విభజించినాడు. ఇట్టి విశ్లేషణవిధానమువలన నెట్టి సూక్ష్మాంశము నైనను స్పష్టముగా గుర్తించి సులభముగా వింగడించుటకు వీలగును. ఉదాహరణమునకు **C** గణములోని గాథాగేయము, కథారహితగేయము, నృత్యము, క్రీడ, సంగీతము, గద్యములను **C 200** సంజ్ఞతో గాథాగేయముగను **C 300** సంజ్ఞతో జానపదగేయము-పల్లెపాటగను గుర్తించవచ్చును. **C 320** అనగా భావాత్మక-రసాత్మకగేయమనియు **C 322** అనగా ప్రేమగేయమనియు, **C 323** అనగా నిరసనగేయమనియు **C 324** అనగా సంతోషగేయమనియు **C 325** దుఃఖగేయమనియు, **C 326** అనగా మెచ్చుకోలు-పొగడ్త-స్తోత్రగేయమనియు, **C 327** అనగా దూషణ-తిరస్కారగీతమనియు, **C 328** అనగా హాస్యగేయమనియు, **C 329** అనగా అపహాస్యగేయమనియు సులభముగా గుర్తించవచ్చును.

ఇట్టి వర్గీకరణమువలన రెండు ప్రయోజనములు సిద్ధించుచున్నవి. 1. ప్రపంచమందలి జానపదవిజ్ఞానము అది యేదేశమునకు నేభాషకు

సంబంధించినదైనను శాస్త్రీయముగా విశ్లేషించుటకు వీలుపడును. 2. జానపద విజ్ఞానమున నేయే యంశములుండునో వాని స్వరూపస్వభావము లవగతమగును.

ఇంత విశాలమైన జానపదవిజ్ఞానమున జానపదవాఙ్మయ మొకభాగము మాత్రమే. దీనిలో వాగ్రూపవిజ్ఞానము మాత్రము చేరును. వాగ్రూపేతరమైన జానపదవిజ్ఞానము, జానపదసాంఘికాచారములు, జానపదుల భౌతికసంస్కృతి దీనిలో చేరవు. ఇట్టి జానపదవాఙ్మయమున జానపదసారస్వత మొకభాగము. జానపదుల ఆధ్యాత్మిక, ఆధిభౌతిక భావవ్యాప్తికి లక్ష్యభూతమైనదీ జానపద సారస్వతము. దీనిలో జానపదుల గేయవచనరూపకములు మూడును చేరిపోవును. తెలుగునాట వెలసిన దేశిసారస్వతమును నిబద్ధదేశియనియు అనిబద్ధదేశియనియు రెండుగా విభజింపవచ్చును. నిబద్ధదేశి యంతయు శిష్టుల రచనము. అనిబద్ధదేశి జానపదుల సామూహికరచనము. కనుక దీనిని జానపదదేశి యనవచ్చును. జానపదదేశిని ఆటవికదేశి, పామరదేశి, జాతిదేశి యని మూడు భాగములుగా ఆయా జనుల సంస్కారమునుబట్టి వింగడింపవచ్చును. ఆటవికులకు గిరిజనులకు సంబంధించిన సారస్వతము ఆటవికదేశి. చదువు సంధ్యలు రాని పల్లీయులకు సంబంధించిన సారస్వతము పామరదేశి. కొంచెము అక్షరాస్యులైనను కాకున్నను అగ్రవర్ణములవారికి ప్రత్యేకముగా స్త్రీలకుసంస్కార వంతులకు సంబంధించిన సారస్వతము జాతిదేశి. జానపదసారస్వతము (అనిబద్ధ దేశి) కన్నను పరిమితమైనది జానపదసాహిత్యము. ఇది రసానందము, భావసౌకుమార్యము, భాషాసౌందర్యములు ప్రధానముగా గలది.

జానపదసాహిత్యమున గేయ, వచన, రూపకములను మూడు ప్రధాన శాఖలున్నవి. గేయశాఖ కథాసహితమనియు కథావిరహితమనియు ద్విధా విభక్తము. కథాసహితమైన గేయములను కథాగేయములనియు, గాథాగేయము లనియు, కథావిరహితమైనగేయములను జానపదగేయములనియు పల్లెపాటలనియు పేర్కొనవచ్చును. ఈ రెండుతీరుల గేయములందును రసము, ఆలంబనము, వస్తువుననుసరించి పదులకొలది అంతశ్శాఖ లున్నవి. గేయశాఖవలె వచనశాఖ కథలు సామెతలు పొడుపులని త్రిధావిభక్తము. పొడుపులకు శాస్త్రములని తట్టని మాండలికనామములు. కథలలో పురాకథలు (**Myths**), ఐతిహ్యములు (**Legends**), జానపదకథలు (**Folktales**) అను శాఖలున్నవి. జానపదకథ లందును జనప్రియకథలు (**Popular tales**), కిన్నెరకథలు (**Fairy tales**),

అద్భుతకథలు లేదా కట్టుకథలు (Marchen), స్థలము-వ్యక్తి-సంఘటనములకు సంబంధించిన కథలు (Sage - సాగే) అను ఉపశాఖలున్నవి. అల్పాక్షరములం దనల్పార్థమును, అనుభవసారసర్వస్వమును, పెక్కుమంది యనుభవము నొక్కని వివేకముగను, లయబద్ధముగనో యనుప్రాసయుక్తముగనో యలంకార యుతముగనో సంక్షిప్తముగా ప్రదర్శించునవి సామెతలు. వీనినే లోకోక్తు లందురు. ఈసామెతలనుకూడ గేయములవలె వచనకథలవలె వివిధశాఖోప శాఖలుగా విభజింపవచ్చును. గూఢవస్తుమయము, ఉక్తివైచిత్రీవిలసితము, బుద్ధి కుశలతానికషోపలము, ఆలోచనాలోచనము, విజ్ఞానవినోదసాధనములైన పొడుపు లనే మన ప్రాచీనులు ప్రహేళికలనిరి. దండివిశ్వనాథభోజరాజాదులు వీనిని తీరుతీరులుగా విభజించిరి. పాశ్చాత్యులు సామెతలకువలెనే పొడుపులకును సులభ మైన దశాంకవిభజనపద్ధతిని సూచించినారు. మూడవ ప్రధానశాఖయగు రూపక ములగూర్చి యిదివరకే (పుట ౧౩) ముచ్చటించితిని. ఇది స్థూలమైన జానపద సాహిత్యకల్పకస్వరూపము. దీని ప్రధానశాఖాత్రయమందలి ప్రథమశాఖ - కథా సహిత, కథావిరహితగేయములను రెండువలువలున్న-గేయశాఖయే ప్రస్తుతము నాకాలంబము.

## జానపద గేయలక్షణము - ఉత్పత్తి

జానపదగేయలక్షణములగూర్చి విచారించుటకుపూర్వము వాని "పుట్టు పూర్వములు" విచారించుట ముఖ్యము. ఏలయన లక్ష్యమున్నగదా లక్షణము చర్చ. శిష్టసాహిత్యవిషయమునగూడ నింతియ. వైయాకరణులు. ఆలంకారికులు మున్నగు లక్షణకర్త లందరికి పనికలిగినది కవియో రచయితయో తొలు దొలుత తనపని తాను చేసినతరువాతనే. పద్యమునకన్న ముందుగా పదము (పాట - గేయము - గీతము) పుట్టినదని పెక్కురు సాహిత్యమీమాంసకు లభిప్రాయపడిరి. 'సంతోషం కలిగినపుడు ప్రథమమానవుడు చిందులు వేస్తూ కూనరాగాలాపనముతో సామాన్యపదకవిత్వము ప్రారంభిస్తాడు గాని, సంస్కృతీభూతమైన పద్యకవిత్వము మొదలుపెట్టడు. అందువల్లనే సాహిత్య వేత్తలు పద్యంకన్నా పదమే మొదట ఏసారస్వతంలోనైనా ఉద్భవిస్తుందనటంలో ఏకీభవించారు. అదేవిధంగా మన భాషలోనూ ప్రథమంలో పదసాహిత్యము

ఉన్మీలించిఉంటుంది.'[1] ''నాగరకత ప్రారంభంలో నాట్యము పుట్టింది. మనుషులు పగలంతా కష్టపడి రాత్రి నలుగురూ ఒకచోట ఉల్లాసముగా కాలము గడిపేటప్పుడు నాట్యము ప్రారంభమవుతుంది. క్రమేణ కూనరాగము బయలుదేరుతుంది. ఆతర్వాత మనస్సులోమాట బయటికి అనేటప్పుడులయ మేర్పడుతుంది. ఆ శబ్దజాలము పాట ఔతుంది. కొద్దిమంది సాహిత్య తత్త్వవేత్తల మతము మరొకవిధంగా కనబడుతుంది. మనుషులు పనిపాటలు చేసేటప్పుడు కష్టము కనబడకుండా ఉండడముకోసము అప్రయత్నముగా కూనిరాగాలుతీయడము ఏమో మాటలు లయతో అనడమూ సంభవిస్తుంది. పడవ లాగేవాళ్ళూ, కళ్ళాల దగ్గర పనిచేసేవాళ్ళూ, బండ్లు లాగేవాళ్ళూ, వడ్లు దంపేవాళ్ళు, పిండి విసిరేవాళ్ళూ, పాటలు పాడడము వింటూనే ఉన్నాము. ఆ విధముగా పాటలు ఏర్పడుతవి. ఏది సిద్ధాంతమయినప్పటికీ, కవిత్వము కష్ట నివారణకో ఉల్లాసముకో ఉదయ మవుతుంది.''[2] జానపదగేయనిర్వచన సందర్భమున దాని ప్రధానతత్త్వమునుగురించి వివరించునప్పుడు జనపదము లందున్న యనాగరకజనమును గూర్చి కొంత మనవిచేసి యుంటిని. అట్టి యనాగరకజనహృదయమునుండి వెలువడినదే జానపదగీతము. పై యిరువురి యభిప్రాయ మిదియే. ఈవిషయమై పాశ్చాత్యవిమర్శకు లేమనిరో గమనింతము.

**"Opposed to that memorial and prophetic dreamer on the peak there is seen, in the primitive stages of poetry, and in certain survivals, a throng of people without skill to read or write, without ability to project themselves into the future, or to compare themselves with the past, or even to range their experience with the experience of other communities, gathered in festal mood, and, by loud song, perfect rhythm, and energitic dance, expressing their feelings over an event of quite local origin,present appeal and common interest.'** [3] ఇదే యభిప్రాయ మింకొకపండితుడు వెల్లడించెను. పైన పేర్కొన్న

1. 'ప్రతిభ' జూలై ౧౯౪౦. వావిలాల సోమయాజులుగారి 'గేయ రచనలు - ప్రాచీనులు' అను వ్యాసము.

2. 'వ్యాససంగ్రహము'న పదకర్తలను వ్యాసము. తల్లావజ్ఝల శివశంకర శాస్త్రి గారు.

3. **The Popular Ballad. F. B. Gummere.**

సంఘమొక యుత్సవకాలమున నొకచో గూడును. అటుపైన "Different members of the throng, one after another, may chant each his verse, composed on the spur of the moment and the sum of these various contributions makes a song. This is communal composition, though each verse taken by itself, is the work of an individual. A song made in this way is no man's property and has no individual author. The folk is its author.

"One begins the song, another follows, and so on till the result of this act of strictly communal composition is a piece of verse which, in some instances, is retained in the memory and achieves a more or less permanent local reputation. Every body has heard children engaged in the communal composition of satirical rhymes".

"The origin of poetry, like the orgin of language, lies too far back for us to find. The singing, dancing throng, with its few rude staves, primitive as it seems, in comparison with the multifariousness of artistic literature, must still be very far from primitive in the literal sense."[1]

జానపదగేయోత్పత్తి విషయమై పాశ్చాత్యపండితులందు పెద్దవాదములు బయలుదేరినవి. కొంద రేకకర్తృత్వమనిన మరికొందరు పండితులు సామూహికకర్తృత్వమును బలపరచి సిద్ధాంతీకరించిరి. 'Thus Grimm's famous apophthem "a folk song composes itself" is not after all a piece of misty emotionalism but represents the hard commonsense facts of the case"[2]

అని విజ్ఞులు తీర్మానించిరి. సారాంశమేమన ఆదిమమానవుడు సుఖమో దుఃఖమో యనుభవించినప్పు డాతని యుద్విగ్న హృదయమునుండి లయాన్వితమగు గేయమో గేయపాదమో వెడలుననియు అదియే యితరుల నోటబడి తరిగి పెరిగి స్వయంభువుగా నుండునని యనుకొనవచ్చును. ఇది సంభవమేనాయని

1. By G. L. K. in, "English and Scottish Ballads" of F. J. Child.
2. The Encyclopaedia Britannica, Ralf Vaughan Williams.

శంకింప పనిలేదు. భాషాశాస్త్రవేత్తలు కొన్నికొన్ని శబ్దముల పుట్టువును గూర్చి యిట్టివే సిద్ధాంతములు చేసిరి. 'నాయన' 'నాగలి' 'పుల్ల' శబ్దము లెవరు సృజించినారు ? ఎవరైన చెప్పగలరా ? సామూహికకర్తృత్వమే యిట్టి శబ్దములకు కారణము. భాషాశాస్త్రవిషయమున నిట్టిది యంగీకరించినచో నిక జానపదగేయములగూర్చి వేరే చెప్పనక్కరలేదు. ఇట్టి పాటలు నేటికిని ఆటవికజాతులందు హెచ్చుగా మనకు లభింపగలవు. మన కొండ రెడ్లనుగూర్చి పరిశోధనమొనర్చిన యొక పాశ్చాత్యనృశాస్త్రవేత్త ఆ ప్రాకృత బాలబాలికలు పాడిన తెలుగుపాట నొకదాని, నింగ్లీషు భాషలో ననువదించి గ్రంథస్థమొనర్చినాడు. దాని మూల మా గ్రంథకర్తచెంత నుండియుండును. "Children playing on flutes and singing snatches of songs that are artless and a few phrases repeated again and again."

"On the hill the long tailed monkey
In the valley stalks the tree-bear
The bear with the tail
Along the stream-bed runs the monkey
The monkey without a tail.
Ants and mosquitoes girding their loins
Stormed the house of the sugar-goddes
Mutyalamma, the village mother
Joined in the raid on the sugar-goddess
Victory won, they returned
See the stars
See the sun
The day is dawning
The sun is rising
The bright light comes
The brilliance comes."[1]

ఇదే గ్రంథమున వారి సాంఘికజీవనము ఆచారవ్యవహారములు పెండ్లి పేరంటములగూర్చి వ్రాయుచు నొక పెండ్లి నిర్ణయములో నిరుపక్షముల

1. The Reddis of the Bison Hills. By Haimendorf. Page 112.

వియ్యాలవారు సంవాదరూపముగా పాడిన పాట ననుపదించినాడు. పిస్తరభీతి వలనను, అది మూలము గామియును ఇట నుదాహరింపను. ఈ పరిశోధకుడే మన చెంచువారలగూర్చి యొక గ్రంథమును వ్రాసినాడు. దానితో నొక బాలికల జట్టు చేసిన నృత్యమును సంపూర్ణముగా నభివర్ణించుచు వారు నృత్యమొనర్చు నప్పుడు పాడిన తెలుగు పాటను ఇంగ్లీషు లిపిలో వ్రాసినాడు. ఆపాటనే నేను తెలుగు లిపిలో నుటంకింతును.

కొండన్న మాదన్న నారికేళో (Two Brothers who live in the sky)
వేటపోయ్యో రాములు నారికేళో

| | | |
|---|---|---|
| బంగారి Pasela | ,, | (Shoes) |
| బంగారి బొడ్లెబాకు | ,, | |
| పిడికెడు వడ్లు తీసి | ,, | |
| కొనగోర వొలిచె | ,, | |
| చిక్కుడు పువ్వులు | ,, | |
| సిరిగె తోమి | ,, | (కుండ) |
| కొనగోర బియ్య మొలిచె | ,, | |
| మాచేత పోటేసి రా | ,, | |
| అమ్మలా వాయమ్మ | ,, | |
| నీళ్లైన ఇయ్యవమ్మ | ,, | |
| మీ అమ్మ మరదల | ,, | |
| నేను ఉండా మరది | ,, [1] | |

పై పాటయందలి 'కొండన్న మాదన్న' 'పాశెల' 'సిరిగె' శబ్దముల కాతడే యర్థమును వ్రాసినాడు. ఈ రెండు గేయములును సామూహికకర్తృకములే. ఆసమూహ మెన్నిమారులైన కూడి ఈ పాటను తిరిగి తిరిగి పాడుచుండును. అట్టి పాడుటలో గేయముయొక్క (చతురశ్ర) గతికి నిరోధకములైన పాదములు అనుకూలముగా మారిపోవుట జరుగును. ఇంకొకమారు యతులు, మరి యొకమారు ప్రాసలు ప్రవేశించవచ్చును. ఈరీతిగా సమూహముల పాడుకతో

1. The Chenchus. By Haimendorf. P. 239.

జానపదగేయములు మెరుగెక్కుట అతిసహజము. గేయములను పాడుకొను సమూహములు ఈనాటికిని మనకు తారసిల్లుచునే యున్నవి. ఇది సినసరైన జానపదగేయోత్పత్తి కుదాహరణముగా తీసికొనవచ్చును. శ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారు తమ The Yanadis (1962) అను గ్రంథమున తెలుగు వారైన యానాదులను గూర్చియు వారి వాఙ్మయము సారస్వతముల గూర్చియు సమగ్రముగా తెలపియున్నారు. 418-420 పుటలలో పంతంగిరి బైరయ్య యను యానాది పాడిన చెంచునాటకమందలి చెంచితనరసింహస్వామి సంవాద మునకు ఆంగ్లానువాదమును పొందుపరచినారు. ఐనను సమూహముచే యున్ని జానపదగేయములను తీర్చి యుండుననుట సంభావ్యము కాదు. మెల్లగా సాగు పత్తైన పరిగడ్డి బండిపై పండుకొని గొంతు విచ్చెడు యువకుడు, చెఱువు నీట నీదు బఱ్ఱెపై 'సవారి' చేయు గోపబాలుడు, గుడ్డ యూయల కట్టి బిడ్డనూచు తల్లి, కపిలపై నధిష్ఠించి వాలువెంబడి దిగు తోటమాలి, ఏకాకిగా నేతము ద్రొక్కు రైతు, అల్లగల పాటలు తొలిసారికే పరిణతములుగా రాజాలవు. ఎన్ని మారులో తిరిగితిరిగి రూపు దిద్దుకొన్న పాటమాత్రమే సహజముగా జానపదులలో ప్రవేశింపగలదు. నాకు జూడగా అనేకములగు ఏలపదము లీరీతిగనే ఆవిర్భవించి యుండు ననిపించుచున్నది. సమూహముతే వానిని రచించియుండినచో వాని యందలి రాగము తగ్గి లయ ఇప్పటికంటెను బిగువుగా నుండియుండవలెను. కాని యీసందర్భమున మరియొక విషయము గమనింపదగినది కలదు. ఈరకపు గేయములు పుట్టుకలో వైయక్తికములైనను, దేశపరిభ్రమణమందు వరుసగా నొక వ్యక్తినుండి మరియొకవ్యక్తి కందుటలో, అనేకవ్యక్తుల "బొటన వ్రేలి సంస్కారము"ను పొంది మారుచుండును. ఈ మార్పులు వైయక్తికములతే యగుటచే సామూహికగేయముల సౌందర్యముకంటె వీని సౌందర్యము భిన్నముగా నుండునని మనవి చేయుచు జానపదగేయోత్పత్తి చర్చ నింతటితో చాలించి వాని లక్షణముల వివరింప నుపక్రమింతును.

## జానపదగేయ లక్షణములు

పై చర్చయందు, ఆదిలో వైయక్తికమే యైనను, క్రమపరిణామమున నితరవ్యక్తుల దిద్దుబాట్లకు లోనై సాగిపోయెడి ఏలపదములవంటి గేయములును, ఆదియందే పలువురి యలంకారమునకు గురియైన జట్టుపాటలును, రెండును కూడ పరిణతదశలో ప్రత్యేక వైయక్తికములు కావని సూచించి యుంటిని.

అనగా జానపదగేయమున కొక ప్రత్యేక కవి యుండడన్నమాట. అదియే జానపదగేయప్రథమలక్షణము. కవి లేకయే పదము పుట్టునను మాట పైకి కొంత అప్రత్యయజనకముగా నగుపడినను పైన జరిగిన చర్చాసారాంశముగా జానపదగేయమున నెవరేని యొకే ప్రత్యేకరచయిత కంతగా ప్రమేయము లేదనియు, అది సమష్టిసృష్టియనియు కనుక రచయిత పేరు మనకు దానితో నగుపడదనియు తెల్పుకొనుట కష్టసాధ్యమైన పనికాదు. జానపదగేయములను వినునప్పుడు మన ధ్యానమా గేయరచయిత వైపు పోదు. దీనికి కారణము బహుశః స్వయముగా నా 'రచయిత' కు గూడ తన్ను గూర్చి ఇట్టి 'శ్రద్ధ' లేకపోవుటయే యందును. జానపదగేయరచయిత లందరును మన గుళ్ళ గోపురములు కట్టిపోయిన అజ్ఞాతశిల్పుల వంటివారు. వారికి తమ యూరు పేరులనుగురించి శ్రద్ధయే యుండదు. ఈ విషయప్రసక్తిగల వింతసంఘటన మొకటి వంగదేశమున జరిగినదాని నిచ్చోట నుదాహరించుట యప్రస్తుతము కాదనుకొందును.

"Mr. Khitimohan Sen once asked a Baul why is it that they make no effort to preserve the names of the composers of their songs. The elderly Baul, pointing first to the full river where boats were passing under sail and then to the almost dry canal where boats stood on the mud, answered, "Do the boats under sail leave any trace of their passage? The track of the boat being pushed along the canal is marked plainly in the mud. Which is the simpler and more natural way? Ours is the simple way. The leaving of foot prints is artificial and unimportant."[1]

జానపదగేయములగూర్చి కృషిచేసిన పండితులందరు ఈ గేయమున కొక ప్రత్యేకరచయిత యనువాని లేమిని బలపరచినవారే. ఒకపాశ్చాత్య పండితుడిట్లు నుడివెను.

"Perhaps we might say it is a kind of song not known to have been composed by any one person, a song handed down over the years from singer to singer without aid of print, a song containing within itself some of the character and history and customs of the people who have sung it, a song willing to

1. The March of India (Mystic minstrels of Bengal) Vol. II No. I Sept., Oct. 1952.

change along the way of its travel according to the needs or creativeness of any particular singer or group."[1]

ఈ మాటలయందు రచయితనుగూర్చియేకాక మరికొన్ని జానపదగేయ లక్షణములను చెప్పబడినవి. ఈలక్షణములగూర్చి చర్చించుటకు పూర్వము మరికొందరు పండితుల యభిప్రాయములను గూడ పేర్కొందును.

"......Though a man, not a people, has composed them still, the author counts for nothing, and it is not by mere accident, but with the best of reasons that they have come down to us anonymous."

The proper destiny of its author is inglorious obscurity and its appropriate place is enshrinement in the heart and memory of the people.[2]

కనుకనే జానపదగేయము సమష్టిసంపద యైపోయినది. నీరు, గాలి, వెలుతురుల వలెనే అది యందరును అనుభవింపవలసిన భాగ్యము. దానిపై నెవరో యొకరికే అధికార ముండదు. శిష్టసాహిత్యమున నొక రచయిత తన రచనను తనదిగా భావించును. దానిపై నితరుల కధికార ముండదు. మార్పు కూర్పు లితరులు చేయరాదు. కాని జానపదగేయ మట్టిది కాదు. అది షణ్ముఖుని వలె పలువురి చేతులలో పెరిగినది. 'జానపద గేయమునకు రచయిత లేడు' అను ప్రవచనమందలి ముఖ్యాభిప్రాయము, రచయిత యనువానికి శిష్టసాహిత్యమున నున్న ప్రాధాన్యము జానపదగేయమున లేకపోవుచున్నదనుట. ఇది జానపదగేయ ప్రథమలక్షణము.

ఈ ప్రథమలక్షణము ననుసరించి రెండవ లక్షణ మేర్పడును. జానపదగేయమునకు ***పరిణతస్వరూపము లేదా నియమితస్వరూపము లేకపోవుట రెండవ లక్షణము***. శిష్టసాహిత్యమున నొకరచనకు దాని కర్తచేత రూపురేఖలు ఏర్పడుటచే పరిణతస్వరూప మేర్పడును. కాని జానపదగేయ మొక్కొక్కచోట నొక్కొక రూపము దిద్దుకొనును. ఒకచో తరుగును, ఇంకొకచో పెరుగును. ఒక చోట నొక క్రొత్త మాండలిక మేరుకొనును. వేరొకచో నొక క్రొత్త పలుకుబడి కూర్చుకొనును. ఒకచో నొక చరణమో కొంత భాగమో

1. Animal folk songs for children. Ruth Crawford Seeger.
2. The Ballad in Literature T. F. Henderson

ఎగిరిపోవును. మరొకచో నొక చరణమో కొంత భాగమో క్రొత్తది వచ్చిచేరును. గేయస్వరూపము దానిని పాడుకొనువారి మనోభావముల కనుగుణముగా మారి పోవుచుండును. భాషాశాస్త్రవేత్తలు శబ్దములు వాని నుచ్చరించెడు మనుజుల ముఖాంగయంత్రము ననుసరించియు నాయా ప్రదేశముల శీతోష్ణపరిస్థితులను బట్టియు మార్పునొందునని చెప్పుదురు. ఈ పరిస్థితులను తోడుగా జానపద గేయములను పాడెడువారి మనోభావములును వారి పరిస్థితులును మనము చేర్చుకొన్నచో జానపదగేయమున కొక నిర్ణీత (నియమిత - పరిణత) స్వరూపముండదను సూక్తి సమగాహనము చేసికొనవచ్చును. ఈ రెండవ లక్షణముగూర్చి పాశ్చాత్యపండితాభిప్రాయము లిట్లున్నవి.

**"It follows that a genuinely popular ballad can have no fixed and final form, no sole authentic version. There are texts but there is no text"** [1]

దీనికి కారణము (**Das Volk Dichter**) 'సామూహిక కర్తృత్వము' అను **Grimm** పండితుడు చెప్పిన ప్రథమలక్షణమేయని తొలుతనే మనవి చేసితిని.

జానపదగేయమునకు పరిణతస్వరూపముండదను రెండవ లక్షణము ననుసరించి మనము దానియొక్క మూడవ లక్షణము ఊహింపవచ్చును. ***గేయ రచనాకాల మిదమిత్థమని యుండకపోవుట మూడవలక్షణము.*** శిష్టసాహిత్య రచనాకాలము మన మెన్నియో ఆధారములతో తెల్పుకొనగలుగుచున్నాము. రచనాకాలమును కనుగొనుటకు సాహిత్య చరిత్రకారులు బాహిరములును ఆంతరములునునగు సాక్ష్యముల నాధారముగా చేసికొందురు. బహిస్సాక్ష్యము ముఖ్యమైనప్పుడు ఆంతరసాక్ష్యము, రచనాస్వరూపము సాయపడునని మన కందరకు తెలిసిన విషయమే. కాని జానపదగేయమున నీస్వరూపమే యెప్పటికప్పుడు మారుచుండును, కావున కాలము దెలిసికొనుటకు వీలుపడదు.

**"One of the marked tendencies of popular narrative poetry is to alter or eliminate specific names of persons and places in the course of oral tradition."** [2]

---

1. **English and Scottish Ballads. F. J. Child**
2. **Ibid**

బహిస్సాక్ష్యము మొదలే మృగ్యమని యెరుగవలెను. కొన్నికొన్ని సమయములందు దక్క రచనాకాలము నిదమిత్థముగా తేల్చలేము. కనుకనే "A popular ballad as we have seen seldom or never, has an assertainable date"[1] అనునది రూఢియైపోయినది. గేయ స్వరూపమును బట్టికూడ దాని ప్రాచీనతనుగాని అర్వాచీనతనుగాని మనము నిర్ణయింపజాలము. సిసలైన జానపదగేయము సనాతనమునుగాదు, అర్వాచీనమును గాదు. అది ప్రాచీన కాలగర్భమున వేరుదన్ని ఎడతెగక నవనవోన్మేషముగా క్రొత్త కొమ్మలు వైచి, క్రొత్తచివుళ్లు క్రొత్తపువ్వులు కొత్త పండ్లుగల మహావృక్షము. How old is that folk song? అను ప్రశ్నమున కొక పాశ్చాత్యపండితుడిచ్చిన సమాధాన మెంత సమంజసముగా నున్నదో పరికింపుడు.

"A folksong is neither new nor old because it is continually taking on new life; it is an individual flowering on a common stem."[2]

నిజము విచారించినచో జానపదగేయమును విన్నప్పుడు దాని రచయితను గూర్చి గాని లేక కాలమునుగూర్చిగాని యడుగగూడదు. ఏలయన మనకు కావలసినది దాని రచయిత కాదు; కాల మంతకన్నను కాదు. దానిలో నున్న వైశిష్ట్యము, అందము ననుభవించుటయే సరసులైనవారు సహృదయులైనవారు చేయదగిన పని. ఈ విషయమై యింకొక యుదాహరణ మిచ్చుట యప్రస్తుతము కాదనుకొందును.

"When a collector now a days hears a song sung by a traditional singer he may be pretty sure that if the singer is a true artist, he will have unconsciously added something of his own to what he sings. A folk song then is always grafting the new on the old."[3]

ఇంతవరకు జరిగిన చర్చల ఫలితముగా జానపదగేయలక్షణ మింకొకటి మనకు స్పష్టపడినది. ఈ గేయములు వ్రాతపూతలతో గాక కేవలము

---

1. English and Scottish Ballads, F. J. Child.
2. The Encyclopaedia Britannica. R. V. W.
3. Ibid

మౌఖిక ప్రచారమునసనే జీవించును. వినుకలియే వీని వ్యాప్తికి సాధనము. జానపదులకు చదువుసంధ్య లుండవుకదా. కలము కాగితముల ప్రసక్తి యసలే యుండదు. ఒకరు పాడగా మరియొకరు విందురు. అటనుండి మరియొకరి నోటబడును. ఇటులే జానపదగీతములు ఒకనోటినుండి మరియొకనోటి కెక్కును. ఒక చెవినుండి మరియొకచెవికి బారును. క్రొత్త పొలిమేరలను ద్రొక్కి గ్రామముల కెగబ్రాకి సీమలు గడచి దేశదేశములు పయనించును. ఈయనుశ్రుతప్రచార లక్షణముననే జానపదగేయములందు మార్పులు కూర్పులు గలుగుచున్నవి.

"A further and very important limitation of folk song must be mentioned, namely that it survives by purely oral tradition. By our hypothesis the inventors and disseminators of folk music are unlettered, and are therefore unable to stereotype their inventions by means of reading and writing. It is on this that the whole nature of folk song and all questions of its origin and development depend."[1]

అత్యంతప్రాచీనమైన వేదవాఙ్మయము మనదేశమున తరతరములనుండి యనుశ్రుతముగా వచ్చుట మన కందరకును తెలిసిన విషయమే. వేదము లలేఖ్యములు. వాని నొకరినుండి మరియొకరు విని నేర్చుకొనెడువారు. కనుకనే వేదములను శ్రుతులందురు. ఇదిగాకను వేదము లపౌరుషేయములని మనవారి యభిప్రాయము. అనగా వేదములు మనుష్యులచే నిర్మింపబడినవి కావనుట. అవి భగవద్దత్తములని మనవారి నమ్మకము. భగవద్దత్తములైనను కాకున్నను అపౌరుషేయములను మాటలోని యంతరార్థము జానపదగేయ ప్రథమ లక్షణమున (ప్రత్యేకరచయిత లేకపోవుట)కు సన్నిహితముగా నున్నది. శ్రుతము- అపౌరుషేయము అను నీరెండు లక్షణములను దృష్టియందుంచుకొని కొందరు పండితులు [2] వేదములుగూడ ప్రాచీనార్యుల జానపదగేయములై యుండునని భావించిరి. ఈ భావన కొంత సమంజసముగానే యున్నను వివాదాస్పదమైనది. ఏలయన జానపదగేయమునకు మౌఖికప్రచారలక్షణముచే మార్పులు కూర్పులు జరుగుచుండుట మనము తెలిసికొనియున్నాము. కాని వేదమున మార్పులకు కూర్పులకు తావులేదు కదా. వేదముల కుత్పత్తిదశయందు సామూహికకర్తృత్వ

1. The Encylopaedia Britannica R. V. W.

2. డాక్టరు సత్యేంద్రగారి 'వ్రజలోక్ సాహిత్యకా అధ్యయన్'

లక్షణము కొంతవరకు సరిపడవచ్చును ప్రచారదశయందు మాత్రమొక నోటినుండి మరియొక నోటికెక్కినను మార్పులకు కూర్పులకు నవకాశముమాత్రము లేదు. కొంతవరకెందుకన మంత్రద్రష్టలుగా నున్నవారే ఆయా వేదమంత్రములకు కర్తలని పండితులందరు గనుక.

జానపదగేయముల మరియొక లక్షణము వాని **సహజ (అకృత్రిమ) శైలి.** ఇదివరకు పరిణతస్వరూపము చెప్పబడినది. స్వరూపమునకును శైలికిని భేదము కలదు. స్వరూపము రచనముయొక్క బాహిరరూపము. శైలి ఆంతర రూపము. **Style in man** అనునపుడు మనము గ్రహింపవలసినదీ యాంతర రూపమేకదా. జానపదగేయోత్పత్తిగురించి చర్చించునపుడు దాని తత్త్వమగు అప్రయత్నశిల్పమునుగూర్చి తెలిపియుంటిని. ఆతత్త్వమునకు సంబంధించినదే యీ యకృత్రిమశైలియను లక్షణము. జానపదగేయముల శైలి నిరలంకృతమై, స్వచ్ఛందమై, సరసమై సాధారణముగా నుండును. ప్రయత్నపూర్వకములైన శబ్దాలంకారములుగాని, అర్థాలంకారములుగాని, కవిప్రౌఢోక్తులుగాని వానియందుండవు. వక్రోక్తియే కావ్యాత్మయని వక్రోక్తిజీవితకారుడు చెప్పెను. శిష్టసాహిత్యమునందీ ప్రసక్తి యంతగా లేదు. వ్యంగ్యార్థముల కిట అంతగా తావులేదు. కాని సుకుమారభావములు, చక్కని దేశీయములగు పదప్రయోగములు మరియు రసధ్వని మాత్రము జానపదగేయములందు కానవచ్చును.

జానపదగేయముల మరియొక లక్షణము ***పాడుకొనుటకు వీలుగానుండుట.*** జానపదగేయశబ్దమందే యీ లక్షణ మిమిడియున్నది. గేయమనగా పాడుకొనుట కనువైనది. జానపదగేయోత్పత్తి నృత్యముతో జరుగునని మన మిదివరకే తెలిసికొంటిమి. ఆ నృత్యమున కుండెడు తాళలయలు గేయమునకును సంక్రమించును. ఈగేయములం దక్కడక్కడ నొక చరణము పునరావృత్తి నొందును. దీనినే **Refrain** అందురు. ఇది మన పల్లవి వంటిది. గేయలక్షణమున కిది మరింత తోడ్పడునదిగా నుండును. తాళలయలతో గూడిన ఈ గేయములు శిష్టసాహిత్యమున కాదిరూపమైనటులే సంగీతమునకును తొలి రూపములు. మార్గదేశిభేదములతో నొప్పారు సంగీతమున నివి దేశిశాఖకు చేరినవి. జానపద గేయముల ఛందోరూపముల గురించి విచారించునపుడీ విషయమై విపులముగా చర్చింతును. కథాగేయము **Ballad** నుగూర్చి చెప్పుచు **"The ballad, of coruse, like any real lyric, must be sung, it must have a tune,**

and this tune usually rustic unsophisticated, is provocative as well as reminiscent of accompanying steps, but the same thing is true of many a song utterly foreign to ballad''.1 అనుటచే జానపదగేయముల గేయత్వము సర్వజనాంగీకృతవిషయమని తెలిపోయినది. మన దేశీయు లంగీకరింపరు గాని నిజముగా సంగీత మారంభమైన దిచ్చటినుండియే యని నామతము. ఈవిషయమున (జానపదసంగీతమున) కృషిచేసిన ఒక పాశ్చాత్యపండితు డిట్లభిప్రాయపడినాడు.

"We find the unlettered people have both the desire and the power to express themselves musically and these attempts at musical expression are not mere clounish nonsense nor are they, as we are some times told, degraded reminiscenses of "cultured" music, but are some thing suigeneris; moreover among these spontaneous expressions are to be found melodies which are the most treasured possessions of our art."[2]

జానపదములలో నారంభమైన ఇట్టి సంగీతమే క్రమపరిణామమునంది శాస్త్రమును పెంచుకొని గొప్ప కళగా రూపొందియుండును. ఒక్క గానకళయే కాదు, తక్కిన కళలన్నియుగూడ నిటులనే క్రమవికాసము పొందినవి. ఇక ప్రకృతమునకు వత్తము.

ఇప్పటికి జానపదగేయలక్షణము లారు ముఖ్యమైనవి చెప్పబడినవి. ఇవిగాకను మరికొన్ని లక్షణము లున్నవి. ఇవి పైన జెప్పబడిన లక్షణములందు జేరిపోదగినవియే. జానపదగేయము లన్నిటిని *ఆశురచనము* లని చెప్పవచ్చును. ఆశువనగా వేగము. చతుర్విధకవిత్వములం దాశుకవిత్వమొకటి. యోజన లేకుండ, కలము కాగితముల ప్రసక్తి లేకయే వేగముగ జెప్పు కవిత్వమాశుకవిత్వ మనబడును. శిష్టులైనవారు చెప్పు ఆశుకవిత్వమువంటిది కాదు జానపదాశుకవిత్వము. తిరుపతివెంకటకవులు కొప్పరపుకవు లాశువుగా కవిత్వము చెప్పినను వారి కవిత్వమున దాని స్పృహతోబాటు శిల్పమున్నది. అటులగాక, జానపదుడు చదువుసంధ్యలు లేనివాడు. కలముకాగితమనునదిలేక, చెప్పదలచిన విషయములను లయానుగుణముగా ఒక్కొకప్పుడు లయకుసరిపోవుటకై శబ్దములు

1. The Popular Ballad, F. B. Gummere
2. The Encyclopaedia Britannica. R. V. W.

పెరిగి పొట్టిదైనను లేక పెరిగి పొడుగైనను చెప్పుట జానపదుల ఆశురచన మగును. ఈ ఆశువున తాను చెప్పునది చక్కగానున్నదా లేదా యను పట్టింపు జానపదున కుండదు. ఈపద్ధతి రచనమును పాశ్చాత్యులు (improvisation) అనెదరు.

మరియొక చిన్న లక్షణము జానపదగేయమందు ప్రతి చరణాంతమునందో లేదా యొక ఖండము (Stanza) చివరనో లేదా అచ్చటచ్చటనో ఒక పదమో, ఒక చరణమో పదేపదే మరల వచ్చుట. ఈ లక్షణమును పునరావృత్తి యన వచ్చును. ఈ లక్షణము జానపదగేయముఖ్యలక్షణములం దొకటియగు గేయత్వమును నిమిడిపోవును. ఈ పునరావృత్తిచే గేయత్వము మరింత పెంపొందును. దీనిని పాశ్చాత్యులు (Refrain) అందురు. రానురాను సంగీతకళ పెరిగినకొలది ఈ పునరావృత్తియే పల్లవి యనుపల్లవిగా మారిపోయియుండును. పల్లవియనగా గేయమునకు ప్రారంభమందుండి చరణముల కన్నింటికి చేరి వచ్చునది. Refrain పల్లవి కానక్కరలేదు. పల్లవిమాత్రము Refrain వంటిదే.

జానపదగేయముల మరియొక లక్షణము '*జనసామాన్య పరిచిత వస్తుక మగుట*. ఈ గేయమునందలి వస్తువు 'ప్రజాసామాన్యము యొక్క జీవితము, వారి ఆశయములు, వేడుకలు, కష్టనిష్ఠురములునై యుండును. పదకవి వస్తువునకై తడుముకొనడు. అతడు పౌరాణికగాథలను ఇతిహాసమునందలి వృత్తాంతమునుగూడ తన కవితలో చేర్చుకొనును. మరొకపుడు తన గ్రామము నందో సమీపప్రాంతమునందో జరిగిన వీరకథనో కరుణాత్మకమైన వృత్తాంతమునో స్వీకరించి పదముగా పాడును. అతనికి నాయకుడు ధీరోదాత్తుడు నాయిక స్వాధీనపతికాదిభేదములలో నొక్కతె కావలెనను చింతలేదు. లక్షణ భేదము లాతని బాధింపవు. ఇతివృత్తము ప్రఖ్యాతమే కావలెనను దృష్టి యాతనికి లేదు. తన శ్రోతలైన ప్రజల మనముల నుఱ్ఱూత లూగించగల వృత్తము సమీపకాలికమైనను అతనికి సమ్మతమే'.[1] పురాణాదులయందలి వృత్తము తీసికొన్నను సామాన్యప్రజానీకపు మనస్తత్వమున కనువుగా, తన మనోభావముల కనువుగా నద్దాని తీర్చిదిద్దుకొనును. ఉదాత్తపాత్రముల కా

1. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారి అముద్రిత వ్యాసములు.

మార్పువలన మనవంటి శిష్టుల దృష్టిలో యనౌచితి సంభవించినను జానపద కవి లెక్కింపడు. సాధారణముగా నీగేయములు ఖండకావ్యములవలె నుండును. ప్రబంధములందుండెడు దైర్ఘ్యముగాని, అష్టాదశవర్ణనములుగాని, ప్రకృతి వర్ణనములుగాని, ప్రకృతి పరిశీలనముగాని, తత్త్వచింతనగాని యుండవు. వీనియందు మనుష్యత్వమే, మానవజీవితచిత్రణమే మెండుగా నుండును.

ఇక రసవిషయము, జానపద గేయమంతయు నొక రసఘుటిక. భావకవిత్వమునందువలె పల్లెపాటలందు ఆత్మపరకవిత్వాంశము (Subjective Poetry) హెచ్చు. కాని కథాగేయములందు మాత్రము బహిర్వస్తు కవిత్వము (Objective Poetry) హెచ్చు. భావకవిత్వమే కాదు. అసలు ఏ కవిత్వ మైనను ఆత్మపరమైనదే యనవచ్చును. రసప్రతీతియందీ రెండుకవిత్వము లేక మార్గముననే సాగిపోవును. సమగ్రమనుష్యజీవితమును గాని రసమునకు స్థాయిత్వము కలుగునంతటి పరిపూర్ణత్వముగాని మనకు దీనియందు గోచరించవు. జానపదగేయములందును రసరాట్టగు శృంగారమునకే యగ్రతాంబూలము. తరువాత లెక్కింపదగినది కరుణము. ఇదియొక యాశ్చర్యకరమగు విషయమే. కరుణము తరువాత నద్భుతవీరముల కానగను. తరువాతి స్థానము ఇతరేతర రసములకు. ఈ విషయమై విపులచర్చ ఆయాభాగములందు జేయుదును. ఇంత వరకు జెప్పబడినవి జానపదగేయమునకుండు ఆరు ముఖ్యలక్షణములు, నాలు గుపలక్షణములు, మొత్తము పది లక్షణములు. ఇంకను స్వల్పములు వెదకును కాని యవి పైవానియందే యిమిడిపోవును. కథా విరహిత గేయములకన్న కథా సహిత గేయములందధికముగా నుండు లక్షణములలో అభ్యాసనాటకీయత, పరాశ్రయత (objectivity), వారానువర్తనములు (Ballad Common Places) ఏకసూత్రత, ప్రబోధములనునవి ముఖ్యములు.

## ప్రమేయము

ఇంతవరకు జానపదగేయనిర్వచనము, జానపదవిజ్ఞానములోని శాఖలు, గేయోత్పత్తి, దాని లక్షణములగూర్చి మనవి చేసితిని. ప్రకృతము జానపద గేయములగూర్చిన నా పరిశోధనాప్రమేయమును నివేదింతును. దీనికై మరల నొకసారి వెనుకకు మరలవలయును. జానపదగేయము లనుమాటను పైన చెప్పబడిన లక్షణముల గిరియందే బంధింపవలయునా యను నొక ప్రశ్న యుదయించును. అట్టియెడ ఉత్తమలక్షణములు కలిగిన గేయములు మనకు

అల్పసంఖ్యలోనే లభించును. పరిశోధనావిషయము సంకుచితమైపోవును. ఐన నేమి ? అట్టివానినే జానపదగేయము లందమన్న నితరగేయములకు పెక్కింటికి అన్యాయము జరుగును. వానికి జరిగెడు యన్యాయమేమికాని బహుళప్రజానీక మందు ప్రచారమందున్నట్టి పాటలను విడిచినచో - జానపదగేయ ప్రధాన తత్త్వమైన (Unconscious art) అప్రయత్నపూర్వకమైన శిల్పముగల పాటలను విడిచినచో - మన యుద్దేశమునకే భంగము వాటిల్లును. అజ్ఞాతశిల్పము-అవిదిత కర్తృత్వము - అనునవి (మిక్కిలి ప్రాచీనములు) కొలది గేయములకే వర్తించును. ముద్రితములైన అర్వాచీనగేయములు కొన్నింటిలో తత్కర్త పేరుండుట కలదు. దీర్ఘములగు కథాగీతములందును వేదాంతపరములగు తత్వములందును రచయిత పేరులుండును. అంతమాత్రమున నివి జానపదశాఖనుండి బహిష్కృతములు కానక్కరలేదు. కనుక నా పరిశోధనా పరిధిని, నా జానపద గేయప్రమేయమును గూర్చికూడ కొంత చర్చింతును. ఉత్తమలక్షణములు గలిగిన గేయములే కాక జానపదగేయములనునప్పుడు మరికొంత విశాలదృష్టి యవసరము. ఒక పాశ్చాత్యపండితుడు జానపదసంగీతమును గూర్చి యిట్లనెను.

"It is some times held that the word 'folk song' should be used in what is called a 'broad' sense so as to include not only genuinely traditional music, but all those songs of a popular character which are habitually sung by the people of a country."[1]

ఈమాటలు జానపదగేయమునకును చెల్లునని నా యభిప్రాయము.అనగా పై నిర్వచనములుగల జానపదగేయములే కాక (సార్వజనీనత) ప్రజాసమ్మతములై జనపదములందు బహుళముగా ప్రచారమందున్న గేయములును జానపద గేయములే. జానపదగేయప్రథమలక్షణము ననుసరించి గేయకర్త యెవరో తెలియగూడదు. కాని నిసర్గమైన జానపదగేయములందును ఏకారణముననో మనకు కొన్నికొన్ని తావులందు ఆయా గేయకర్తలు గోచరింతురు. 'జానపద గేయమునకు రచయిత లేడు' అను లక్షణమందలి ముఖ్యాభిప్రాయము రచయిత యనువానికి శిష్టసాహిత్యమునందున్న ప్రాధాన్యము జానపదగేయమున నుండ కుండుటయే యని తొలుతనే మనవిచేసితిని. నిజముగా నదియే మనకు కావలసినది. బొబ్బిలిపద మున్నది. దానిని రచించినవాడు పెద్దాడ మల్లేశమని

1. The Encyclopaedia Britannica. R. V. W.

యందురు. కవిపేరు ఏకారణముననో మనకు తెలిసినంత మాత్రమున బొబ్బిలి పదము జానపదవీరగాథ కాకపోవునా ? దానికెంత సార్వజనీనత యున్నదో మన మెరుగనిది కాదు. "రామరామ అనంతకాలము రాజ్య మేలలేము - చచ్చిన వారికి వీరస్వర్గము యిక్కడ కలుగును" అన్న బొబ్బిలి బెబ్బులి వీరగర్జనము ప్రతిధ్వనింపని తెలుగునేల చేరడైనను లేదన్న నతిశయోక్తి కాదుగదా ? కనుక బొబ్బిలిపదము సిసలైన జానపదకృతి. ఇట్టి గేయములన్నియు నీ పరిశోధనమున నుండును. ఇంతియకాదు. కొమనాల గోత్రాబ్ధిచంద్రుడైన "పినయెల్ల యనువాడు ప్రియము దీపింప, వలనొప్ప శ్రీనాథువచనపద్ధతిని" బాడిన యదుశాస్త్ర చరితమును (కాటమరాజు కథ) జానపదగేయమే. లిఖిత పూర్వకముగా లభింపబడలన నాతనిపేరు మిగిలినది కాని లేనిచో మనకా కవియెవరో తెలిసి యుండకపోవును. తెలిసినను తెలియక పోయినను ఆ పాటయందాతని ప్రాముఖ్య మేమియును లేదు. వీరావేశముతో బాడెడు ప్రతి గొల్లడాపదము తనదే యను కొనును. అది విన్న ప్రజానీక మాపాట తమదే యనుకొనును. కనుక కాటమరాజు కథయును జానపదకథాగేయమే. పై యిర్వురు కవులును శిష్టుల దృష్టిలో నంతగా చెప్పుకొనదగిన కవులు కారు కనుక నీవిషయము సామాన్యమే. కాని కవితాసనాథుడును గౌడడిండిమభట్టు కంచు ఢక్కను బగులగొట్టించిన పండితాఖండలుడును, బహుళాంధ్రోక్తిమయప్రపంచమును బ్రోచినవాడునగు శ్రీనాథభట్టారకుడు రచించిన పల్నాటివీరభారతమును కూడ జానపదగేయ మనుటకు సాహసించుచున్నాను. ఏలయందురా ?

"On the other hand, a good popular ballad differs from these refrains and improvised stanzas in that it has coherence in structure, definite contents and what is surely an aesthetic if not a literary appeal. Either, then, the ballad, which carries such popular elements as the refrain or chorus and those peculiarities of structure which we shall presently examine in detail, is originally a product of the people under conditions of improvisation and choral dance, but ennobled and enriched on its traditional course in such a way as to endow it with some thing of the dignity or art; or else it is originally a poem, made like

any other poem, but submitted by tradition to influences which give it a popular character."[1]

శ్రీనాథవిరచితమగు నీ పల్నాటివీరచరిత్రపదము శ్రీహరకులవార్ధి ఓదర కరుడు రచించిన నలుని చరిత్రమున కాంధ్రానువాదము గాదు. అయఃపిండమని పేర్గాంచిన కాశీఖండమును గాదు. ఇది శ్రీనాథుడు 'చిత్త మువ్వొంగి' పాడిన 'శౌర్యంబు పుణ్యంబు సమకూర్చునట్టి, పలనాటివీరుల భాగవతంబు'. దీని విశేష మేమందురా ? ''దీంట్లో ద్వితీయాక్షరపు ఆట లేకపోవడంవల్ల నగం తుక్కు-వదలటం మొదటి విశేషం. ఇది తెలుగు సంప్రదాయానికి సరిపడని సంస్కృతవృత్తాలైన శార్దూలమత్తేభాదుల్లో కాక దేశ్యపద్యంలో బసవపురాణాదుల వలె వుండటం రెండవవిశేషం. అనువాదం కాక మూలగ్రంథంగా ఉండటం మూడవవిశేషం. మనకు సన్నిహితమైన స్థలాలు మహాశూరనిలయాలై నిద్రించే ఆంధ్రుల్లో వీరత్వాదులను ప్రబోధిస్తూ ఇందు కార్యరంగాలుగా వుండడం నాల్గవ విశేషం. వీరగీతాలనే వాఙ్మయశాఖయం దిది ప్రథమగణ్యమై వుండటం ఐదవ విశేషం"[2] ఈ విశేషములన్నిటికన్న (Popular Character) సార్వజనీనత యుండుట ముఖ్యవిశేషమని నాభావము. కాశీఖండాదులందున్న శ్రీనాథుడు పల్నాటివీరచరిత్రమున లేడు. దీనియందు శ్రీనాథున కెంత స్థానమున్నదో పదము పాడుకొనెడు ఆంధ్రజానపదునికిగూడ నంతే స్థానమున్నది. ఇది శ్రీనాథుని (నిజ) శ్రీగాదు, ప్రజల-అందును జానపదుల-సొమ్మైపోయినది. ఇది రచించినది దక్షిణాధీశు ముత్యాలశాలలో దీనారటంకాల తీర్థమాడిన శ్రీనాథుడు కాడు. తా నెత్తుకొన్న యితివృత్తమునకును దానిని విను శ్రోతలకును గల సంబంధప్రవాహమున నోలలాడు శ్రీనాథుడు. ఆ యితివృత్త మాతనిది గాదు. అది ప్రజలది, జానపదులది. అది వారి తాతముత్తాతలనాటినుండియు చెవుల గింగురుమనుచున్న కథ. అది కేవల మాతని ముఖోద్గతము. దాని నాతనికి సూత్నపద్ధతిని సంధానించు కోరికయే లేదు. దానిగురించి తన ప్రత్యేకభావములు చెప్పవలెననిగాని దానిపై తన వ్యక్తిగతప్రభావముద్ర నచ్చొత్తవలయుననిగాని యాతడు కోరలేదు. మనకొక సందేశ మందీయవలెనను వాంఛయును లేదు.

1. The Popular Ballad. F. B. Gummere
2. శ్రీ ఉమాకాన్తవిద్యాశేఖరులు. పల్నాటివీరచరిత్ర పీఠిక.

గడించుకొనవలసిన కీర్తియును లేదు. అతడొనర్చిన కార్యమింకే జానపదుడైనను చేసియుండెడువాడే. ఆ కార్యమును వాతడు తనకు తెలియకుండగనే తన వ్యక్తిత్వమును విడినాడు. ప్రతి జానపదుడు పొందెడు అనుభూతి నాతడు నోట పలికినాడు. అతడొక వ్యక్తి కాడు; కేవలము వాక్కు. చుట్టు శ్రోతలు నిలిచి విను చుండగా శ్రీనాథు డాశువుగా పాడినట్లున్నది వా వీరచరితము. పల్నాటివీరచరిత్రమును పాడినది ప్రసిద్ధపండితకవియగు శ్రీనాథుడు కాక పిష్ణభట్టుడను మతియొక శ్రీనాథుడైనను మన కభ్యంతరముండదు. వీరచరిత్రమునకే ప్రామాణ్యముగాని కవికి గాదు. రచయితలెవరో తెలియకున్నను గేయము బహుజనామోదపాత్రమై జానపదుల నోళ్ళలో నలిగిన జాలును. కనుక పల్నాటివీరచరిత్రమును గూడ జానపదగేయములందు చేర్చుటకు శంకింపగూడదని నా యభిప్రాయము. ఇట్టిని దేశిసారస్వతము నంతటిని జానపదగేయములందు జేర్చను. గేయము లన్నియు జానపదగేయములు కాజాలవు. ద్విపదలైనను పాల్కురికి సోమనాథుడు రచించిన పండితారాధ్యచరిత్రముగాని, బసవపురాణముగాని జానపదగేయములు కాజాలవు. పాల్కురికి సోమనాథుడు తాను 'ఆరూఢగద్యపద్యాదిప్రబంధ-పూరిత సంస్కృత భూయిష్ఠరచన, మానుగా సర్వసామాన్యంబు గామి, ఉరుతరగద్య పద్యోక్తుల కంటె-సరసమై పరగిన జానుతెనుంగు, చర్చింపగా సర్వసామాన్యమునట-గూర్చెద ద్విపదలు కోర్కి దైవార'నని చెప్పుకొనినను 'అల్పాక్షరముల ననల్పార్థరచన కల్పించుటయెకాదె కవివివేకంబ'నుటవలన (Conscious art) ప్రయత్నపూర్వకశిల్పమునకు దొరకొని "...పటుగద్యపద్యప్రబంధసామ్యముగ, కావ్యకళాప్రౌఢి గల్పింతు ద్విపద" అని యటులనే చేసెను. కాదు కాదు ఇంకను కొంచె మెక్కుడుగానే చేసెను. పాల్కురికి పండితుడు వేసిన బాటయందు నడచిన మరికొందరు పండితకవుల రచనలగు రంగనాథరామాయణము గాని గౌరన హరిశ్చంద్ర, నవనాథచరిత్రములు గాని జానపదగేయములు కాజాలవు. వాని నన్నింటిని దేశిసారస్వతసంపదలో చేర్చుకొనవచ్చును. కాదేని శిష్టసాహిత్య మన్నను దోషమేమియును లేదు; ఇదిగాకను పదసారస్వతమును పరాంకోటి కెక్కించినట్టియు, శ్రీరామచంద్రుని తెలుగుమాటల నిల్పిపోయిన మహాభక్తుడగు త్యాగరాయలవారి కృతులుగాని, మువ్వగోపాలుని మోహనాకారమున కొంతలు మరచి భక్తిశృంగారముల నివాళు లెత్తిన క్షేత్రయ్య పదములుగాని, సారంగపాణి పదములుగాని జానపదగేయములు కావు. అవి మార్గసంగీతమున సాగిపోయిన

తెలుపును. కాని త్యాగరాయలకు సమానభక్తుడై గోదావరీతటమున శ్రీరామునొక బంటువాని జేసి సీతమ్మకు చింతాకుపతక మర్పించుకొన్న గోపన్న వ్రాసి పిదిలి పెదవి కదపినంతనే వెడలిన కీర్తనలు జానపదగేయములు. ఇటుల వేరు విమర్శింపబూనుకొన్న జానపదగేయములేవో కానివేవో ఒక్కొక్కటిగా విడమరచి చెప్పబూనుకొనుట సైకతస్థలి గూర్చుండి రేణువుల లెక్కించుటగును. జానపదగేయములుగా స్వీకరింపదగినవి రెండువిధములుగా నుండవచ్చును. మొదటిదియును ప్రధానమైనదియునగు భాగమునందు జానపదకవులు వ్రాసి నట్టియు అచేతనాశిల్పములైనట్టియు రచనలు చేర్చనగును. రెండవ భాగమున శిష్టకవికోటిలోచేరిన మహాకవుల రచనలుకూడ కొన్ని సకృత్తుగ జానపదశాఖలో చేరగల్గును. అట్టిరచనలు జానపదజీవితమునకు సంబంధించిన ఇతివృత్తము, ఛందస్సు, భాష, రచనావిధానములతోనుండి, జనులలో బహుళప్రచారము గాంచి వారి సొత్తుగనే పరిగణింపబడుచున్నవై యుండవలెను. పలనాటివీరచరిత్ర, కాటమరాజుకథ మున్నగునవి ఇట్టి ధర్మము కలవగుటచే జానపదవాఙ్మయశాఖ యందు చేర్చుకొననగుచున్నవి. కనుక మరల నొకమారు వెనుదిరిగి ఉపర్యుక్త సాహిత్యతత్త్వముగల (అప్రయత్నపూర్వకశిల్పము) ప్రాక్తన మానవుని మనోగతభావవ్యంజకములైన లయాన్వితములగు నుడుగులు మొదలుకొని పండితాఖండలవిరచితములైన జనామోదముగల పదకవితలవరకును జానపదగేయ పరిశోధనమున జేరిపోవునని మనవి. కథావిరహితములగు పల్లెపాటలు **folksongs** కథాసహితములైన గాథాగేయములు **Ballads** రెండును జానపదకవిత్వమందలి ప్రధానశాఖలుగా ఆధునికులు గుర్తించుచున్నారు. లక్షణములందు ఈ రెంటికి కొంత సామ్యము మరికొంత వైషమ్యము కలదు. ఈ నా గ్రంథమున పల్లెపాటలతోపాటు గాథాగేయముల గూర్చిన పరిశీలనముగూడ నుండును. జానపదకవిత్వమను నాణెమున కీ రెండును రెండు ముఖములు.

## జానపదగేయ ప్రశస్తి

ఏ సాహిత్యమందైనను శ్రోతనుగాని పఠితనుగాని రసప్రపంచయాత్ర చేయించునవి ప్రధానముగా గేయరచనములని చెప్పినచో సత్యదూరము కాదు. రసికులను సహృదయులను ఆనందపరవశుల జేయుటకు గేయము లుపకరించి నంతగా రసవంతములైనను పద్యము లుపకరించవు. దీనికి కారణము గేయముల

గానానుకూలతయేయని నా యభిప్రాయము. గేయములు తాళలయబద్ధములు, గానకళతో సంబంధము కలిగియుండును. ఇటులని పూర్తిగా శాస్త్రీయసంగీత యుతములగు కీర్తనల నీ జానపదగేయములందు చేర్చుటకు వీలులేదు. పండితసారస్వతమునకు నిత్యజీవితము నలముకొనుశక్తి తక్కువ. జానపద గేయములందీపాలు హెచ్చు. రాజపోషణమున పండితప్రకాండుల యాదరణమున శిష్టసాహిత్య మభివృద్ధినందినది కాని జానపదగేయసాహిత్యము మాత్రము కేవలము ప్రజానీక మిచ్చిన కేలూతచేతనే కాలు నిలద్రొక్కుకొన్నది. ప్రౌఢోక్తులచేతను, కవిసమయములచేతను, పాండిత్యప్రకర్ష ప్రకటనముచేతను శిష్టసాహిత్యము (పద్యసాహిత్యము)జానపదులకు 'బెదురుబొమ్మ'యైనది. జానపదగేయములందిట్టి ప్రౌఢోక్తులుగాని పాండిత్యప్రకర్షగాని యుండుటకు వీలులేదు. ప్రజల నిత్య జీవితమందు వాడుకొనెడు వ్యావహారికభాషయందు సులభశైలితో సాధారణరీతితో మనోభావములు వెలార్చునట్టి యీ జానపదగేయములే వారికి ప్రీతిపాత్రములు. ఇదిగాకను జానపదగేయము లాయాదేశములందలి మతపరిణామములను, మనస్తత్వములను, వీరుల యుదంతములను, పతివ్రతల కథలను, ఆచార వ్యవహారములను, విశ్వాసములను, వినోదములను, విందులను, వేడుకలను, అన్యోన్యానురాగములను, సంయోగవియోగములను, సౌందర్యసౌభాగ్యములను, సుఖదుఃఖములను, జాతీయతను ప్రతిబింబించుటచే నీ జానపదగేయములు నిసర్గమనోహరములుగా నుండును. ఆంధ్రజానపదగేయముల నుద్ధరించి ఆంధ్రులను మేలుకొలిపిన బోయల్ అను పాశ్చాత్య పండితుడీ జానపదగేయ సారస్వతమునుగూర్చి యిటుల ప్రశంసించెను.

"Simplicity of thought and subject is one undeniable characteristic of the first fruits of national composers".[1]

కనుకనే యీ పాశ్చాత్యపండితుడు మన జానపదగేయముల నుద్ధరించుటకు పూనుకొనెను. జీవితముతో పెనవేసుకొనిపోవు జానపదగేయములందు కృత్రిమ వర్ణనము లుండవు. అవి సహజముగా నుండును. జీవితముతో సన్నిహిత సంబంధముండని సాహిత్యము కృత్రిమముగా నుండును. ఫ్రెంచ్ సాహిత్యమును విమర్శించుచు నొక ప్రఖ్యాతవిమర్శకుడు.

1. The Indian Antiquary Vol. III 1874, Page 1.

"Art lapses into artificiality when it gets out of touch with the realities of life....It is from foundations in the solid ground from the life of the people, that a literature draws vigour and rejuvenation"[1] అనెను. జానపదగేయములందలి శక్తి వానికి ప్రజాజీవితము నుండి లభించినదే. మన శిష్టసాహిత్యమందున్న లోపములను జానపదగేయము లందున్న గొప్పదనమును చూచిన పాశ్చాత్యపండితుడొక డిట్లభిప్రాయపడినాడు.

"Indian literature is still concerned with personal emotions and reactions. It has not on the whole been related to the life of the people, perhaps in the crude ballads and folksongs of the peasantry the literature of future may have its most fruitful stimulus."[2]

ఈ పండితుని మాటలు సత్యములే యనిపించును. ఆపండితు డాశించినది నేడు స్వతంత్రభారతావనియందు మిక్కిలి యవసరము. పరాధీనభారతమున శిష్టసాహిత్యము నిజస్వరూపము గోల్పోయినది. అనుకరణ మెక్కువైనది. జాతీయత లుప్తమైనది. కృత్రిమత్వమే పెచ్చుపెరిగినది. కనుక "A nation reborn must be inspired by its folksongs."[3] తరతరములు జానిసత్వమును జాపుకొని పునరుజ్జీవితమైన భారతజాతి పురాతనజానపదగీతముల వలన నుద్దీపితము కావలయును. నిరక్షరాస్యులు, నాగరికతాగంధము లేనివారు, బుద్ధివికాసము లేనివారు, ఆటవికులైనవారేమి, వారి గీతములేమి, భారతజాతి పునరుద్దీపనమేమి ? ఇదియంతయు నతిశయోక్తియని భావింపవచ్చునుగాక. ఒకమారా యాటవికుల గీతములను సవిమర్శముగా జూచిన చాలును; వాని యాంతర్యము తేటతెల్లమగును. మన నాగరకతయందు వానికిగూడ ప్రముఖ స్థానముండును. శిష్టసాహిత్యమునకున్న సాధనసంపత్తిగాని ప్రోత్సాహముగాని లేకున్నను అవి ఇన్నిదినములు బ్రతికియుండుట ఒకనోటినుండి మరొక నోటికెక్కి ప్రాణము నిలుపుకొనుటయే వాని ప్రాశస్త్యమును చాటుచున్నది.

---

1. Andre Gide 'The Rural India' August 1942.

2. The present condition of India, By Leonard M. Schiff.

3. Devendra Satyarthi. The Illustrated Weekly of India. November 12, 1944.

మొనర్చినాడని పండితుల యభిప్రాయము. ఆరణ్యకములు మన యాటవిక గీతములవంటివే. **Songs of the Forest** అను **V. Elwin** మహాశయుని గ్రంథమీ యర్థమును ధ్వనించును. బహుశః వేదములు వ్యాసుడు చేయి వేయక పూర్వము మార్పులు కూర్పులు పొందియుండెడివేమో. వేదములకు స్థిరత కలిగినది తరువాతి కాలమున గావచ్చును.

పండితులు భారతమునుకూడ ఇట్టి క్రమపరిణామ మొందినదే యందురు. కృష్ణద్వైపాయనవ్యాసుడు భారతయుద్ధమును వస్తువుగా గొని 'జయము' అను నొక వీరకావ్యమును గాన మొనర్చెనట. దాని నాతని శిష్యుడగు వైశంపాయను డందుకొని స్వకపోలకల్పితవర్ణనలతో పెంచి యుపన్యసించి భారతము చేసెనట. ఈభారతమునే 'నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండ'గు సూతుడు శౌనకాదిమహామునులకు చెప్పునపుడు తనకు దెలిసిన మనోహరవ్యాఖ్యానములతో, ధర్మోపన్యాసములతో, రాజనీతిప్రశంసలతో పెంపొనర్చి గానము చేయగా మహాభారతమను గ్రంథము రూపొందెను. ఇటువంటి క్రమపరిణామము ప్రపంచమందలి భాషలకు సాహిత్యములకు కలిగియుండునని తలంచుటలో తప్పేమియును లేదు. ఆంగ్లోసాక్సను భాషలోని ప్రాచీన గ్రంథమైన బేవుల్ఫు (**Beowolf**) కావ్యమునందు దానికి పూర్వయుగమందలి వీరపదము లెన్నియో యంతర్భూతములైనవని తజ్ఞులు చెప్పుదురు.[1] ఇట్టి పరిణామమును ఒక పండితుడు చక్కగా చిత్రించినాడు.

"...... A Russian scholar, who had studied the ritualistic songs of his race, comes to a theory of poetic origins embraced in the formula of "ceremony to song, song to poetry."[2]

ఆంధ్రకవిత్వముకూడ ఇట్టి క్రమపరిణామమునకు వెలియైనది కాదు. ఈ జానపదగేయములే దేశికవితగా పరిణమించినట్లు మన కనేకాధారములున్నవి. సీస. గీత, ద్విపద, తరువోజ, రగడ, మధ్యాక్కర మున్నగు దేశీయ ఛందములు కొన్ని జానపదగేయముల కొలది మార్పులతో అల్లబడినవేయని నిశ్చయముగా తెలియుచున్నది. తెనుగులో నిజముగా వ్యక్తిత్వము, జాతీయతగల రసకవిత్వ

---

1 English and Scottish Ballads F. J. Child.

2 The Popular Ballad F. B. Gummere.

షే పదకవిత్వమేయని చెప్పుకొనవలయును. అందును 'Italian of the East' అని, 'ఆంధ్రత్వ మాంధ్రభాషా చ' అనియు ఆంధ్రేతరులచేతనే కీర్తింపబడినది గనుక 'దేశభాషలందు తెలుగు లెస్స' యైనది. తెలుగుభాష యజంతమై, శ్రవణపేయమైనది గనుక గేయత్వమును మరింత పెంచుకొన్నది.

"Mr. Henry Morris writes 'Of all Dravidian languages Telugu is the Sweetest and most musical. It is exceedingly mellifluous and sounds harmonious even in the mouth of the most vulgar and illiterate. It has justly been called the Italian of the East."[1]

తక్కిన భాషలందలి జానపదగేయముల సేకరణము జరుగుచుండి ఇంతటి మృదుమధురమైన భాషాగీతము లనాదరింపబడి సేకరింపబడకపోవుటచేతనే J. A. Boyle గారికి బాధకలిగెను

"It is therefore to be hoped that while the treasures of national poetry are being gleaned from so many languages, the store of the sweetest dialect of Southern India may not be overlooked, and that the popular songs of the Telugu people may be collected."[2]

ఒక పాశ్చాత్యునకే మన జానపదగేయములం దంతటి వైశిష్ట్యము గోచరించినదన తెనుగుభాషామర్మజ్ఞుల సంగతి వేరే చెప్పనక్కరలేదు. మన దేశమున కళవలెనే కావ్యమును నిత్యజీవితము నాక్రమించి యలముకొన్నది. కట్టు, బొట్టు, జుట్టు, గుమ్మము, గోడ, పీట, అరుగు, ఇంటికప్పు, పాత్రలు, ఆభరణములు కళామయములైనట్లే కూలిపని, పడవలాగుట, విసరుట, వడ్లు, జొన్నలు దంచుట, నాగలి దున్నుట, మోట దోలుట, ఏతమెత్తుట, బరువులు మోయుట, ఉగ్గు పోయుట, పిల్లలను లాలించుట, నిద్రబుచ్చుట, మేల్కొలుపుట వంటి ప్రతిక్రియకును కవిత్వ మూతగా నిలబడినది. ఈ పదకవితలే దేశికవితలుగా పరిణతి పొందినవి. దేశీయులగు కవులు మార్గకవిత్వముపై తిరుగుబాటొనర్చి దేశీయవృత్తము తీసుకొని దేశిచ్ఛందములందు దేశీయుం

1. Castes and tribes of South India E. Thurston Vo. III P. 308
2. The Indian Antiquary Vol. III. 1874

కనుపై నట్లు చెప్పిరి. ఇంగ్లీషు కవిత్వమునకును జానపదగేయముల గాథలే మూలములైనట్లు ఈ క్రిందివాక్యమువలన తేటపడగలదు.

"What ever may be thought of the importance of such verse in its bearing on the origin of poetry in general, or of epic poetry in particular, the ballad like other forms of popular material, has in the last two centuries exercised a powerful influence on artistic literature and it will always have to be reckoned with by the literary historian."[1]

కాని సంస్కృతము చదువుకొన్న పండితులకు కవులకు నాగరకులకు ఈ విధానము నచ్చలేదు. సంస్కృతకవులకును ప్రాకృతకవులకును ఇట్టి వైమనస్య మున్నట్లు తెలియనగుచున్నది.

## అనాదరణము

నవనాగరకము బలిసినకొలది. నవ్యవిజ్ఞానము ముదిరినకొలది ప్రాత సంస్కృతి, ప్రాత యలవాటులు, కట్టు, బొట్టు మోటైపోవుట మన మందరమును ఎరిగినదే. 'క్రొత్త నీరు వచ్చి ప్రాత నీరు కొట్టుకపోవు' ననుమాట, 'క్రొత్తొక వింత ప్రాతొక రోత' యను నుడి, 'క్రొత్తది గొర్లమడుగు, ప్రాతది బర్లమడుగు' అను సామెత లీయనుభవమునే ఘోషించును. నవనాగరకతకును ఈ జానపదగేయములకును ఎంత వైరుధ్యమో చూడుడు.

"To this oral literature, as the French call it, education is no friend. Culture destroys it, some times with amazing rapidity when a nation learns to read, it begins to disregard its traditional tales, it feels a little ashamed of them; and finally it loses both the will and the power to remember and transmit them. What was once possession of the folk as a whole, becomes the heritage of the illiterate only, and soon, unless it is gathered up by the antiquary, vanishes altogether."[2]

---

1. G.L.K. in "English and Scottish Ballads" F.J. Child.
2. English and Scottish Ballads. F. J. Child.

పాశ్చాత్యదేశములందు వీనికి బట్టిన దుర్గతిని తెలుపు పంక్తులను గమనింపుడు.

"As civilization advanced, they were banished from polite society–but they lived on among the humble, among shepherds and plough boys and 'the spinters and the knitters in the sun', until even these became too sophisticated to care for them and they were heard no more."[1]

ఇట్టి దుర్గతియే పదములకును పట్టినది. ఆదిగ్రంథమని చెప్పబడు భారతమునకు పూర్వమున్నవి 'గాసట బీసటే చదివి గాథలు త్రవ్వి'[2] నట్టిపని చెప్పిపొడిచినారు. తరువాత నీకృతులు రూపుమాసిపోయి, కొంతవరకు జనసామాన్యగౌరవము నందుకొని భిక్షుకగీతములందును, భక్తులు పాడుకొన్న పాటలందును, స్త్రీల నోళ్లయందును, తమ ప్రాణములు నిల్పుకొన్నవి. కాని పదచ్ఛందములగు తరువోజ మధ్యాక్కరలు కొంతవరకు ప్రథమకావ్యముతో పరిచయము కలిగించుకొన్నవి. మనభాషలో జరిగిన యన్యాయము తక్కిన భారతీయభాషలందు వీనికంతగా జరుగనట్లున్నది. మహాపండితుడైన పాల్కురికి సోమనాథుడే ద్విపదకవిత్వము వ్రాసినందుకు పరాభవింపబడెను.

సీ. ఒకనాడు శివభక్తు లోరుగంటను స్వయం
భూదేవు మంటపమున వసించి
బసవపురాణంబు పాటించి వినువేళ
హరుని గొల్వ ప్రతాపు పడచి కేగ
ఆ సంభ్రమం బేమి యనుడు భక్తులు బస
వని పురాణం బర్థి వినెదరనిన
విని యా పురాణంబు విధ మెట్లొకో యన్న
ధూర్తవిప్రు డొకండు భర్త జేరి

పాలకురికిసోమపతితుడీ నడుమను
పెనచె మధ్యవళ్లు బెట్టి ద్విపద

1. English and Scottish Ballads, F.J. Child.

2. ఎఱ్ఱన నృసింహపురాణము–పీఠిక 9.

యప్రమాణమిది యనాద్యంబు పదమన్న
అరిగె రాజు భక్తు లది యెఱింగి.[1]

శ్రీనాథుడే పదకవిత్వమును దూషించినటుల నొక చాటూక్తి కలదు. అది యెంతవరకు సత్యమో తెలియదు.

క. ముదివిటులు విధవ లంజలు
పదకవితలు మాఱుబాస బాపనవారల్
చదువని పండితవర్యులు
కదనాస్థిరవీరవరులు కడిదిపురమునన్[2]

ఇది శ్రీనాథుని యభిప్రాయమే యైనచో పల్నాటివీరచరిత్ర రచనమునకు పూర్వపు అభిప్రాయమై యుండును. స్వయముగా తానే మహోద్రేకముతో పల్నాటివీరభారతమును బాడుకొన్న శ్రీనాథుడిటుల పదకవితలను పరిణతుడైన తరువాత తెగడునాయని నా యనుమానము. ఎవరైన మహానుభావుడు తనకు పదకవితలపైనున్న కోపము వెల్లడించి శ్రీనాథకవికి అంటగట్టెనేమో! ఇట్టి వింతసంఘటనలు మన వాఙ్మయచరిత్రమున పెక్కులున్నవి. తెనాలివాని కంటగట్టిన గాథ లెన్ని లేవు ? తిమ్మనకును ముక్కు నతికించినది మనవారే కదా. వేమన పద్యములు వేలకు బెరిగినవి. హృదయమందలి దుర్గంధపంకమంతయు చౌడప్ప యొడలికి కలపమలదిరి.

'అల తాళ్లపాక చిన్నన్న రోమములైన
తంబుర దండెకు తంతులౌనె'

'ద్విపద కావ్యంబు ముదిలంజ దిడ్డి కంత
యియ్యనేరని రండ నాగ్లేకరాశి'[3]

ఆనాటి పండితులకు దేశికవిత్వముపై నెంత నిరసన ముండెడిదన్నమాట. అట్టిపండితులను గుండెనిబ్బరముతో నెదుర్కొన్నవాడు పాల్కురికి సోమనాథుడు. గద్యపద్యోభయప్రబంధములే గొప్పవన్నవారి గూబలదరునట్లు,

1. బసవపురాణము. పిడుపర్తి సోమనాథుడు.
2. చాటుపద్య మణిమంజరి. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి.
3. వేణుగోపాల శతకము. 93, 55

'పటు గద్యపద్య ప్రబంధ సామ్యముగ,
కావ్యకళాప్రౌఢి గల్పింతు ద్విపద, కావ్యంబు భావ్యంబు గాన'

నని శంఖమూదినాడు. వినసివారిని జూచి 'వడ్లును బెరుగు బిసుకు చందంపు బిలిబిలి కృతుల్ కృతులె' యని యాక్షేపించినాడు. తెలుగులో నీ మార్గదేశికవులకు మధ్యన జరిగిన 'రగడ' సంస్కృతప్రాకృతకవులకును జరిగినట్లున్నది. సంస్కృతకవులు 'సంస్కృతము' ప్రకృతి యనియు దాని యపభ్రంశరూపము ప్రాకృతమనియు చెప్పిపోడిచిరి.[1] సంస్కృతము గీర్వాణభాషయని తమను పొగడుకొనిరి.[2] కాని సోమనాథుడు మార్గకవుల నెదుర్కొనినటులే ప్రాకృతకవులు సంస్కృతకవులను ఎదుర్కొనిరి.

'లలియే మహురక్ఖరయే
జువఈజణ వల్లహేస సింగారే
సంతే పాయియకవ్వే
కోసక్కయి సక్కయం పఢివుం' (వజ్జలగ్గ, జయవల్లభ)

లలితమై మధురాక్షరమై, శృంగారమై, యువతీజనవల్లభమైన ప్రాకృతముండగా సంస్కృతము నెవ్వడు చదువునని-యాకవి వేయు ప్రశ్న.[3] హాలశాతవాహను డెంతగా వెక్కిరించెనో చూడుడు.

'అమిఅం పాఉఅ కవ్వం పఢిఉం సోఉంఅ జే నఆణన్తి
కామస్స తత్తతంతిం కుణంతి తే కహం ణ లజ్జంతి' (గాథా సప్తశతి)

దీనికి సంస్కృతపు ఛాయ ఇట్లున్నది

అమృతం ప్రాకృతకావ్యం పఠితుం శ్రోతుం చ యే న జానన్తి।
కామస్య తత్త్వచిన్తాం కుర్వన్తి తే కథం న లజ్జన్తే॥

1. 'ప్రకృతే సంస్కృతాయాస్తు వికృతిః ప్రాకృతీ మతా' (రూపకపరిభాష)
2. 'సంస్కృతం స్వర్గిణాం భాషా శబ్దశాస్త్రేషు నిశ్చితా' (కావ్యాలంకారము)
3. శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు. పరిశోధన ౫వ సంచిక.

ప్రాకృతకవులు సంస్కృతమే ప్రాకృతభవ మనిరి. ఇదియే నిజమని తోచును. జానపదగీతములే తరువాతి శిష్టసాహిత్యముగా పరిణమించెనను బుధుల మాట లున్నవికదా! ఇట్టిదే మరియొక్క యుదాహరణము జూపి ఈ వివాదము సరిపుత్తును.

'పాఇయ కవ్వం పఢిఉం, గుంపేఉం, తహఅ, కుజ్జపసూణం,
కుపియం చ పసాయేవుం, అజ్జవి బహవే ణ యానంతి' (వజ్జలగ్గ)

దీనికి జయవల్లభుని సంస్కృతానువాద మిట్లున్నది.

"ప్రాకృత కావ్యం పఠితుం గుంఫితుం తథా చ కుటజప్రసూనం
కుపితాం చ ప్రసాదయితుం అద్యాపి బహవో న జానంతి''

పండితులకు శిష్టులకు నాగరకులైనవారికిని, తద్భిన్నులైన జానపదులకును మరియు వారి సాహిత్యమునం దభిమానముగల కొందరు శిష్టులకును నిట్టి సాహిత్యయుద్ధములు చెలరేగినను, ఆదేశికవితయు, దానికి మాతృకయగు జానపద గేయవాఙ్మయమును పండితులచే నిరాకరింపబడినను, చదువు సంధ్యలు లేని జానపదులు, వారిని వినోదపరచెడు జంగములు, జక్కులవారు, బవనీంద్రులు, శారదకాండ్రు, పిచ్చుకుంటువారిచ్చిన కొద్ది యాలంబనముతోనైనను కాలూని నిలిచినవని మన మూహింపవచ్చును.

## శిష్టసాహిత్యమున గేయముల ప్రసక్తి

గేయసాహిత్యము చిరకాలమునుండి తెలుగునాట వృద్ధియైనదనుటకు శిష్టకవులు పేర్కొన్న సమకాలికగేయరీతులే గొప్ప సాక్ష్యము. గేయములన్నియు మాత్రాచ్ఛందమున నుండును. గేయకవితలు దేశికవితలుగా పరిణతి నొందినట్లు పూర్వమే నివేదించితిని. గేయముల వరుసలు మరియు ఛందమునుగూర్చి తరువాత విపులముగా చర్చింతును. ప్రకృతము గేయములు మాత్రాచ్ఛందమున నుండుననియు దేశిసారస్వతమంతయు నిట్టి ఛందములందే యుండుననియు గుర్తించుకొందము. ఈ దేశిసారస్వతమును ప్రప్రథమమున దడవినవాడు నన్నెచోడుడు.

క. మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుఁ
గున నిలిపి రంధ్ర విషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగ బలువుర్. (కుమారసంభవము, ఆ. ౧ - ౨౩)

ఈ పద్యముగూర్చి మన తెలుగునాట కొంత దుమారము రేగినది. నన్నయ ముందా నన్నెచోడుడు ముందా యనునది ఇచ్చట ప్రసక్తము కాదు. 'దేశికవితఁబుట్టించి' యనుమాట కర్థమేమి? నన్నయగారి భారతము దేశి రచనయా? యనునవి వివాదాస్పదవిషయములు. నన్నయయే దేశికవితను బుట్టించినవా డనుకొన్నను అతనికి పూర్వపుశాసనములందే దేశికవితారీతులు గాన్పించుచున్నవి. ఆదికవి యెవరనుదానిలో నభిప్రాయభేద ముండినను పండితులందరును ఈ శాసనస్థమాత్రాచ్ఛందములగూర్చి యేకాభిప్రాయము గలవారే. వీనికితోడు క్రీ. శ. ఆరవ శతాబ్దినాటికే తెనుగులో జానుతెనుగు దేశికవిత కలదనుట కొక ప్రాదెనుఁగు రగడ శిలాశాసన ప్రమాణమును శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు చూపించినారు.

"అణపోతులు రేవణకాలుపు
ద్దణకాలు
ఇచ్చిన పన్నస పెన్పాఱ
ఇళరేనికిన్"

కడపజిల్లా - పొట్లదుర్తి - మాలెపాడు శిలాశాసనము క్రీ. శ. ఆరవ శతాబ్దిలో వచనముగా వ్రాసినప్పటికిని ఇందులో ద్విరదగతి రగడ గర్భితమై యున్నది. ఇది చోడమహారాజు పుట్టించిన దేశికవిత కాకపోదు.[1]

నన్నయ భారతములో రగడలు వ్రాయకపోయినను అతని కాలమునాటి కోరుమిల్లి తామ్రశాసనములో (సంస్కృతమున) రగడలున్నవి. యుద్ధమల్లుని బెజవాడ శాసనములో గల మధ్యాక్కరలగూర్చి వేరే చెప్పనక్కరలేదుగదా. తరువోజ తొమ్మిదవ శతాబ్దమందలి వేంగీచాళుక్యుడగు గుణగవిజయాదిత్యుని

1. 'పరిశోధన' ప్రథమ సంచికలో 'తొలి తెలుగు శాసనం - దేశి కవిత' యను వ్యాసము.

అద్దంకి శాసనమందు గలదు. స్వయముగా నన్నయభట్టారకుడు తరువోజ, మధ్యాక్కర, అక్కర, మధురాక్కరలను వాడెను. నాలెక్కకు నన్నయ వాడినవి తరువోజలు ౧౧, మధ్యాక్కరలు ౩౩, అక్కర ౧ మధురాక్కర ౧. నన్నెచోడుడు దేశికవిత్వమును దేశిసత్కవులను సంస్తుతిచేసినాడు. తన కాలమందు ప్రచారమునందున్న కొన్ని గేయరీతుల నాతడు పేర్కొనెను.

సీ. హరు మోల సద్భక్తి నాడుచోటన నాట్య
విషయమ్ము లన్నియు వెలయఁ గలుగె
లీల నీశ్వరు సంకమాలికల్ వాడుచో
గీతభేదంబుల రీతు లెఱిఁగె' (౩-౩౮)

ఈ సంకమాలికలు రాగయుక్తగేయములై యుండును. ఈశ్వరుని సంకమాలికల్ పాడుచో పార్వతీదేవి గీతభేదంబులు నేర్చినదట.

ఆ. నెలమి జింకపిండు దొలుమేనఁజేసిన
తపముపండఁబండెఁ దరువనంబు
లువిద లింపుమిగుల నూయలపాటలు
పాడ మధుమదమున బాడె నళులు. (౪-౮౯)

క. సోలుచు సమ్మదరసమునఁ
గ్రోలుచు వనపాలబాలికలు నవలతికాం
దోలముల వేడ్క నలుపుచు
నాలతు లూగిఁ జేసి పాడి రభినవలీలన్. (౪-౧౧౨)

ఉ. జీజీక కల్లు ద్రావి మదసింధురగామినులన్ని కేళియల్
వాఱుచు గౌడుఁగీతములు పాడుచుఁ బొల్పుగ గ్రాలియాడుచున్
గోఱదమాడుచున్ బతులకున్ వశవర్తులుగాక మేరకున్
మీఱుచు వన్నెకాంతలు రమింతురు తద్వీపినాంతరంబునన్. (౬-౪౩)

చ. పటికపుఱోల ముత్యెదురుఁబ్రాలొగిఁబోయుచు గౌరుకొమ్మ రోఁ
కటఁగొని దంచుచున్ శబరకామిని వెక్కులు రాగముల్ రసో
త్కటముగఁబాడెఁ జుట్టిన మృగంబులు సోమమనుష్యరూపధూ
ర్జటి మునిముఖ్యలోకగురు జంగము లింగము మల్లికార్జునున్ (౬-౪౭)

క. వేణుజమౌక్తికముల్ దొడి
పీనుల కింపెసఁగ నెఱుకు వెలఁదులు ప్రీతిన్
వాణీధరుఁ బాడిరి గీ
ర్వాణాధిపభోగి భువనవంద్యు ననింద్యున్ (౬-౪౮)

ఉ. వాసనగా శివాగమము వర్ణనకెక్కఁ దగ్రియాసదర్థముల్
దేసిగ నాత్మశిష్యులకుఁ దెల్పుచు సద్విధినున్న నిష్కళా
భ్యాసమునందు లీనమగు భావము నిల్పి వెలుంగుచున్న స
ద్భాసురముఖ్యు విప్రమునిపుంగవు జంగమమల్లికార్జునున్ (౬-౩౯)

నన్నెచోడునినాటి ఈ యంకమాలికలు సాహుళి ఫలమంజరమున పాడబడెడివి. గౌడుగీతములు ఎట్టివో? ఊయల పాటలు, ఆలతులు ఆనాటివి మిగులకున్నను ఇప్పటికిని ప్రచారమందున్నవే. ఆలతులు, బౌరాళి, అందోళి, భైరవి, నాటరాగముల బాడెడువారు (౯-౧౩౫). ఇంకను 'దేసిగ' బాడినట్టి గేయము లెన్నియుండెడివో. నన్నెచోడుని తరువాత మనకీ గేయములజాడ యధికముగా గనపడునది పాల్కురికి సోమనాథుని రచనములందు. స్వయముగా సోమనాథుడు శైవమతప్రచారమున కనుకూలమగు నీ దేశిచ్ఛందమును చేపట్టి 'ఉరుతరగద్యపద్యోక్తులకంటె-సరసమై పరగిన జాను తెనుంగు, చర్చింపఁగా సర్వసామాన్యమగుటఁ-గూర్చెద ద్విపదలు కోర్కిదైవార' నని సాహిత్యమందొక నూతనమార్గమును ద్రొక్కెను. ఈ ద్విపదలు తరువోజనుండియో లేక కన్నడ త్రిపదినుండియో వచ్చియుండును. తరువోజలు రోకటిపాటలు. "తలకొని తగఁ బ్రాలు దంపెడిచోటఁ దరుణులచే సొంపుదనరుఁ దర్వోజ" యని లక్షణము.[1]

శ్రీ నిడదవోలు వెంకటరావుగా రాంధ్రకవితాపరిణామముగూర్చి వ్రాయుచు "తెలుగుకవిత యేకపదమై, ద్విపదమై, త్రిపదమై, చతుష్పదమై పరిణతిఁజెందినట్లు కానవచ్చుచున్న"దనిరి.[2] పరిణామమార్గమున జూచిన నీ యభిప్రాయము సమంజసమే. కాని ప్రత్యక్షప్రమాణమునుబట్టి మనకు ద్విపదలకన్న ప్రాచీనములైన తరువోజలు లభించినవే కాని తరువోజలకన్న ప్రాచీనమైన ద్విపదలు మాత్రము లభించలేదు. ఈ విషయమింకను పరిశోధింపదగినదే.

1. కావ్యాలంకారచూడామణి, అష్టమోల్లాసము.
2. ఉదాహరణవాఙ్మయ చరిత్ర, పుట ౩.

సోమనాథుని కవిత్వమున కాధారము లానాడు ప్రజలు భక్త్యుద్రేకములతో బాడుకొన్న గేయములేనట. 'మేటియై చను భక్త కూటుపలందు, పాటలుగా గట్టి పాడెడువారు......మునుమాటి పేరువారననేల కూడి, కనుగొన రోళ్ళ రోకళ్ల బాడెదరు'. 'అతతబసవపురాతనభక్తగీతార్థసమితియే మాతృక గాగ' తాను రచించెనట. సోమనాథుడు 'శంకరగీత భాస్వత్పదావళిని, శంకరు చరిత భయంకరు ***బాడు, నానంద గీతంబులను పదంబుల*** సదానందు భక్తగణానందు బొగడు, బండరు బసవన్న భవ్యగీతముల, బండరు బసవన్న ప్రాణేశు బొగడు, ప్రాక్తననూతనభవ్యగీతప్ర, సూక్తుల వెండియు భక్తాత్మ బొగడు' వారిని వర్ణించెను.

"......శ్రీ బసవపురాణంబు, నేలలు పెట్టంగ నింపు సొంపారు, శైలిచే గాలుచుఁ జదివెడువారు, సకలపురాతనచారుగీతములు, ప్రకటించి ప్రకటించి ***పాడెడువారు"*** అప్పటికే యుండిరట. నాటి ప్రజలు కోడంగియాటలు, బహురూపములు... 'ఆదట గంధర్వయక్షవిద్యాధరాదులై ***పాడెడు*** నాడెడువార'ట.

సోమనాథు డెన్నితీరుల పదములను, గేయములను వినెనో గమనింపుడు.

"మదినుబ్బి సంసార మాయా స్తవంబు, పదములు తుమ్మెద పదముల్ ప్రభాత,
పదములు పర్వతపదము లా నంచ, పదములు శంకరపదములు నివాళి,
పదములు వాలేశు పదములు గొబ్బి, పదములు వెన్నెల పదములు సంజ,
వర్ణన మరి గణవర్ణనపదము' లర్ణవఘోష ఘూర్ణిల్లుచునుండ,
బాడుచు నాడుచు బరమహర్షమున, గూడి సద్భక్త సంకుల మేగుదేర"

కన్నులార జూచిన జానపదగేయప్రియుడు సోమనాథుడు ధన్యుడు. సోమనాథుడు పేర్కొన్న సంసారమాయాస్తంబు పదములు వైరాగ్యగీతములై యుండును. తుమ్మెద, నివ్వాళి, వాలేశు, గొబ్బి, వెన్నెలపదములీ మాటలనే పాదాంతములందు గలిగిన ఈనాటి పాటలవంటివే కాబోలు. ప్రభాతపదములనగా మేలుకొలుపులు స్ఫురించుచున్నవి. పర్వతపదములు (శ్రీశైల) పర్వత ప్రశంస చేయునవి కాబోలు. శంకరపదములు భక్తిగీతములై యుండును. సంజవర్ణన, గణవర్ణన పదములు మాయమైపోయినవో లేక మారువేషమున నజ్ఞాతవాసము గడుపుచున్నవో తెలియదు. సోమనాథుని తరువాతివాడు సుప్రసిద్ధ శైవగేయకర్త ఏగంటి లక్ష్మయ్య. ఏగంటివారి వచనము లాంధ్రదేశమంతట ప్రాకిపోయినవి.

'శివశివయన మేలు తుమ్మెదా
శివయంటేనె విన మేలు తుమ్మెదా
శ్రీకంఠుడను పువ్వు తుమ్మెదా - మూడు
లోకమ్ము లయ్యేనె తుమ్మెదా'

యను తుమ్మెదపదమును 'సూర్యాచంద్రా పహ్పా నడుమా - శౌర్యామానే చిలుకా గంటీ - సూర్యాదీప్తి కాయుచుండగా - ఓ యాగంటీలింగా - చూడచూడాశ్చర్య మాయెగా" - యను ఏలపాటయును ఈకవి రచనములే. 'పోసెట్టి లింగకవిచే నవచోళచరిత్రప్రస్తావనలో నాదిమశివకవిస్తుతిలో బాల్కురికి సోమనాథుని పిమ్మట సుప్రసిద్ధగేయరచయితగా స్తుతింపబడిన గార్లపాటి లక్ష్మయ్యగారే' యాగంటి లక్ష్మయ్యగారని శ్రీ మల్లంపల్లి శరభయ్యగారి యభిప్రాయము.[1] ఈ కవికృతములగు గేయము లనేకము లిప్పటికిని బహుళ ప్రచారమందున్నవి. నాచనసోము డుత్తరహరివంశమేకాక వసంతవిలాసమను గోష్ఠీవిషయక ఏకాశ్వాస ప్రబంధము రచించెనట. దానియందలి ఈ క్రింది జాజరపాటను లక్షణకారు లుదాహరించిరి.

"వీణాగానం వెన్నెలతేట - రాణ మీరగా రమణులపాట
పేరు చెప్పిన పిన్నబాహ్మణుపీట - జాణలు మెత్తురు జాజరపాట"

ఆనాడీ 'వసంతవిలాస' మెన్ని కోకిలల గొంతుకలకు పని కల్పించినదో. ఈ ఛందముననే యిప్పటికిని తెలంగాణమున జాజరపాటలు 'కాముని పున్నమ' పండుగ దినములందు జానపదులు పాడెదరు. నేటి జాజరపాటల కిది మాతృకయై యుండనోపు.

తిక్కనకు తన కృతి నంకితమిచ్చిన కేతన తన దశకుమారచరిత్రములో (౬-౧౫౭) నొకడు తలవరులను మోసగింపనెంచి, 'మరులుదనం బెక్కించుకొని కలమాటలాడుచు మొలపుండ్ల మల్లని\< **బాడుచు** నొడలెల్ల బరికికొనుచు' తప్పించుకొనెను. మొలపుండ్లమల్లని\< బాడుట యననేమో ? దీనికి మూలమున నేమియు లేదు. ఇది కేవలము కేతనగారి కల్పనము.

విప్రశాపం బెరిగి ప్రాయోపవిష్టుడైన పరీక్షిన్మహారాజు,

---

1. **Bulletin of the Govt. Oriental manuscripts library, Madras Vol. III No. 1. 1954.**

క. చూడుడు నా కల్యాణము
పాడుడు గోవిందుమీఁది పాటలు దయతో
నాడుడు హరిభక్తులకథ
లేడహములలోన ముక్తికేగగ నిచటన్'

అని యన్నటుల భాగవతమున (౧౦-౫౦౫) గలదు. పోతనగా రింకను '**బాలు నంకించి పాడెడి పాట** వలన దరువు లిగురొత్త పెరుగింతి దరువజొచ్చె' నని (౧౦-౩౫౫) యశోదను వర్ణించెను.

శ్రీనాథుని రచనములందు పెక్కుచోటుల నీ గేయముల ప్రసక్తి కానుపించును. భీమేశ్వరపురాణమున వ్యాసాదులు, దక్షారామంబు ప్రవేశించునపుడు 'కీర్తింతురెద్దాని కీర్తి గంధర్వులు గాంధర్వమున *యక్షగానసరణి*'నని దక్షారామపురము వర్ణింపబడినది. కొంతకుకొంత యక్షగానములు పాల్కురికి సోమనాథుని కాలముననే యున్నట్లు తెలిసికొంటిమి. శ్రీనాథునికాలమున కవి బహుళప్రచార మందియుండును. యక్షగానములందు ప్రయుక్తములగు గేయములు లెక్కకు మిక్కిలి. దరువులు, ఏలలు, ధవళములు, మంగళహారతులు, శోభనములు, ఉయ్యాలజోలలు, జక్కులరేకు పదములు, చందమామ సుద్దులు, అష్టకములు, ఏకపద ద్విపద చతుష్పద అష్టపదులు, రగడలు మున్నగు గేయభేదము లన్నియు నాడు ప్రచారమందుండెనని భావింపవచ్చును. ఈ యక్షగానములు నాటకముల వంటివి. ఈ దృశ్యరచనములందు సంగీతాభినయములు రెండును సమ్మేళన మందినవి. యక్షగానములనగా నేమి? వాని లక్షణమేమి యను ప్రశ్నల విచారించుటకిట తావులేదు. కాని ఒక్క విషయము మాత్రము చెప్పక తప్పదు. ఈ యక్షగానముల తొలిస్వరూపము పూర్తిగా గానాభినయములతో నున్నట్లున్నది. వీనికి తరువాత తరువాత నాటకత్వ మలవడినది. పాల్కురికి సోమనాథుడు, శ్రీనాథుడు పేర్కొన్న నాటకత్వములవడని ఇట్టి యక్షగానములు గోదావరి మండలమున ఇప్పటికి నున్నట్లు శ్రీ తిరుమల రామచంద్రగారి యభిప్రాయము.[1] మొదట ఏకపాత్ర ద్విపాత్రాభినయగేయముగా నుండి యీ స్వరూపము నొందినట్లున్నదనుటకు నాచెంత నొక చక్కని యాధారము గలదు. నేను జానపదగేయములు సేకరించుచుండగా మెదకు మండలమున నిట్టిదే యొక ద్విపాత్రాభినయముతో గూడిన గేయము దొరికినది.

1. గ్రంథ విమర్శనము, భారతి, మార్చి 1959.

దానిపేరు '**జాంబ పురాణము**'. మాదిగలు, లేదా పంచములనబడువారు తాము జాంబవంతుని సంతానమని చెప్పుకొందురు. ఈ దీర్ఘగేయమందొక పృచ్ఛకు డొకమాదిగను నీవెవరవనియు, నీ వైశిష్ట్యమేమనియు, నీ పుట్టు పూర్వము లేమిటనియు, నీవృత్తి యేమిటనియు మధ్య మధ్యన ప్రశ్నించుచుండును. ఆప్రశ్నముల కామాదిగ గీతవచనరూపముల సమాధాన మిచ్చుచుండును. నాయభిప్రాయమున నిట్టివే రానురాను యక్షగానరూపమున దృశ్యప్రబంధ రూపమును మరింత పెంచుకొనియుండును. ఇది కొంతవరకు విషయాంతరమై పోయినది. యక్షగానముల పేర్లొన్న భీమఖండమునందే మరియొకచోట వసంతర్తు వర్ణనమున జాదుర (జాజర) పాటల ప్రసక్తి యున్నది.

ఉ. జాదుర జాదురంచు మృదుచర్చరిగీతులు వారుణీరసా
స్వాదమదాతిరేకముల జంద్రికి గాయగ దక్షవాటికా
వేదుల మీదటన్ గనకవీణలు మీటుచుఁ బాడి రచ్చరల్
మోప మెలర్పఁగ్రాల్భువనమోహనవిగ్రహు భీమనాథునిన్. (౫-౧౦౩)

దీనిలోని 'జాదుర జాదురంచు' అన్నమాటలనుబట్టియు అన్నమయ్య (౧౪౨౪-౧౫౦౪) గారి 'చాలుంజాలు నీ జాజర' పాటనుబట్టియు నీ జాజరపాటలు నేటి తెలంగాణా జాజరపాటలవంటివే యనిపించుచున్నది. కొందరు పండితులు సంస్కృతమందలి చర్చరీగీతమే తెలుగున జాజరగా నవతరించినదందురు. ఆంధ్రబ్రాహ్మణుడు మంచనశర్మ. అతని కోమటి చెలికాడు టిట్టిభశెట్టి. ఈ మిత్రద్వయ మొకప్పు డోరుగల్లు పట్టణము చూడబోయెను. వారచ్చట చూచి చెప్పిన విశేషములం దానాటి గీతప్రబంధములున్నవి. వారు పట్టణము దిరుగుచు 'పలనాటి వీరపురుష పరమ దైవత శివలింగ భవనవాటి'కి బోయినపుడు ఈ దృశ్యములను జూచిరి.

మ. ద్రుత తాళంబున వీరగుంభితక ధుంధుంధుంకిటాత్కారసం
గతి వాయింపుచు నాంతరాళిక యతిగ్రామాభిరామంబుగా
యతిగూడం ద్విపదప్రబంధమున వీరానీకముం బాడె నా
కృత ప్రత్యక్షరముం గుమారకులు ఫీట్కారంబునం దూలగన్.

సీ. గర్జించి యరసి జంఘాకాండయుగళంబు
వీర సంఘటకోల వేయు నొకడు

ఆలీఢపాదవిన్యాస మొప్పఁగ వ్రాలి
కుంతాభినయముఁ గైకొను నొకండు
బిగువుఁ గన్నుల నుబ్బు బెదరు జూపులతోడ
ఫీట్కార మొనరించుఁ బెలుచ నొకడు
పటుభుజావష్టంభపరిపాటి ఘటియిల్ల
ధరణి యాస్ఫోటించి దాఁటు నొకఁడు

ఉద్ది ప్రకటింప నొక్కరుం డోలవాఁడు
బయలు గుఱ్ఱంబు భంజళ్ళ బఱపు నొకఁడు
కొడుము దాటింపుచును బెద్ద కొలువులోనఁ
బడఁతి పల్నాటి వీరులఁ బాడునపుడు. (క్రీడాభిరామము-పుట 32)

ఈ పల్నాటివీరులకథ శ్రీనాథవిరచితమో లేక యాతని బ్రేరేచిన మూలమో. ఏది యెట్లైనను అప్పటికే పల్నాటివీరులకథను దేశదేశముల బాడుకొనెడువారు. ఆపాటలు పాడునపుడు "కోలదాపున ద్రిక్కటిఁగూడియున్న గచ్చుచేసిన చిత్రంపు గద్దెపలక, శీలబ్రహ్మాదివీరనాసీరచరిత, వ్రాసి" యుండెనట. ఈ పద్ధతి నిప్పటికిని పాండవులవారు సుద్దులవారు తాము చెప్పెడు కథలందు పాటించుచునేయున్నారు. ఆ మిత్రద్వయ మొకింత ముందు జన 'బవనీల జవనికపాటల నిల్లాంధ్ర రమణఁ ద్రుల్లాడించు రంతుకత్తె' యైన ఏకవీరాదేవి యుండెను. ఆమె చెంగట,

సీ. "కక్ష నిక్షిప్త వికస్వర స్వరవిలా
స శ్రీనివాసంబు జవనికందుఁ
గట్టిన తంత్రికిఁ గంఠ శ్రుతికిఁగూడఁ
జొక్కంబుగా నారి సొబగుమీఱ
నాలాపముల శుద్ధ సాళవ సంకీర్ణ
వివిధరాగంబుల చవులు చూపి
దమడమధ్వనులఁ బొటారించి యెదనెదఁ
గత్తెర మార్గంబు బిత్తరిల్ల
వాద్యవైఖరిఁ గడు నెఱవాది యనఁగ
నేకవీరా మహాదేవి యెదుట నిల్చి
పరశురాముని కథలెల్లఁ బ్రౌఢిఁబాడెఁ
జారుతరకీర్తి బవనీలచక్రవర్తి"

(బవనీలనే తెలంగాణమున 'బైండ్లవారు' 'పంబాలవారు' అందురు. వీరిప్పటికిని పరశురామునికథలు లేదా యెల్లమ్మకథలు పాటలుగా బాడుచుందురు.) మిత్రు లిరువురు ఏకవీరాంబకుం బ్రణమిల్లి యట చనునప్పుడు,

సీ. కోణాగ్రసంఘర్ష ఘుమ ఘుమధ్వని తార
కంఠస్వరంబుతో గారవింప
మసిబొట్టు బోనాన నసలుకొల్పిన కన్ను
కొడుపుచేఁ దాటించు నెడపదదప
శ్రుతికి నుత్కర్షంబుఁ జూపంగవలయుచోఁ
జెవిత్రాడు బిగియించు జీవగఱ్ఱ
గిల్కు గిల్కున మ్రోయు కింకిణీ గుచ్ఛంబు
తాళమానంబుతో మేళవింప
రాగముననుండి లంఘించు రాగమునకు
నురుమ యూరుద్వయంబుపై నొ తిగిల్ల
కామవల్లీ మహాలక్ష్మి కైటభారి
వలపు వాడుచు వచ్చె జక్కులపురంధ్రి.

ఈ జక్కులపురంధ్రి పాడిన కామవల్లీమహాలక్ష్మి కైటభారి వలపే నేడు ప్రచారమందున్న 'అక్కలపాట' యనబడు కామేశ్వరిపాటయై యుండును. ఓరుగంట తిరిగి తిరిగి మిత్రులకు మధ్యాహ్నమయ్యెను. ఆసమయమున కాకొన్న వీరికి 'కరణబ్రాహ్మణవిటముఖ్యు'డొకడు పూటకూటింటి జాడ నెరింగించి యచటి సౌభాగ్యము నిట్లు వర్ణించినాడు.

ఉ. కోయిల పంచమస్వరము క్రోల్చిన భంగిని విద్ది కంచి రా [కూచి పా.]
మాయణ మాటుకాండములు నచ్యుతజాగరవేళఁబాడె నా
రాయవింతతురత్న మనురాగముతోడ 'నమశ్శివాయ శాం
తాయ సమస్తదోషహరణాయ' సమానమె దాని కెవ్వరున్.

రామాయణమంతయు పాటలుగా నుండెనన్నమాట. ఇప్పుడు ప్రచారమందున్న రామాయణ సంబంధములగు పాటల కన్నింటికి నిది మాతృకయో! కొరవి గోపరాజు ౧౪౫౦ ప్రాంతమువాడందురు. ఆతడు తన సింహాసన ద్వాత్రింశికలో వేసవి నిట్లు వర్ణించెను.

సీ. విసనకఱ్ఱలు వట్టివేళ్ల చప్పరములుఁ
 జందనంబులు ఘనసారములును
జల్లని నీళ్ల నిచ్ఛాభోజనంబులు
 గలవారి కిష్టసౌఖ్యంబు జరుగఁ
బనిచేసి గంజియైనను నంబలైనను
 నెదచల్లఁగా ద్రాగి యెచటనైనఁ
బవెయుండి వెన్నెలగుడిపాట వాడఁగా
 బేదల కాత్మసంప్రీతి గలుగు. (౯-౧౬)

ఇవి వెన్నెలపదములే కావచ్చును. ఈ పాటలన్నియు జనప్రవాహముల నోటబడి మార్పులుకూర్పులతో నేటి రూపములు ధరించియుండును. ఇంతవరకు చెప్పబడిన దాయాపాటల ప్రసక్తియేకాని యానాటి వాని స్వరూపము పూర్తిగా మన మెరుగము. ఒక్క శ్రీనాథుని పల్నాటి వీరచరిత్రము మాత్రము లిఖితమై నేటికి నిల్చి యున్నది. యక్షగానము లిప్పటికే బహుళవ్యాప్తి నందియుండును. వానియందుండు పాటలకుగూడ నదియే ప్రశస్తి.

పదకవితాపితామహుడని పేరెన్నికగన్న తాళ్లపాక అన్నమాచార్యులవారు తమ కాలమందు వినబడుచుండిన జానపదగేయముల మాదిరుల కన్నిటికిని సరిపోవునట్లు సంకీర్తనల రచించి పెట్టిరి. ఆయన యే శుభముహూర్తమున పద కవితామదవతికి పల్లకిదండె నెత్తెనోగాని యప్పటినుండి యామె విహరింపని తెలుగు పొలమే లేదు. ఈయన భార్య తొలితెలుగుకవయిత్రి తాళ్లపాక తిమ్మక్కగారి కృతి సాగినదీ పాటబాటయందే.

"అవనిలో తాళ్లపాకాన్నయ్యగారి
తరుణి తిమ్మక చెప్పె తాను సుభద్ర
కల్యాణమను పాట కడుమంచి తేట" (సుభద్రాకల్యాణము)

ఈపాట నిప్పటికిని మనయిండ్లయందున్న బోసినోటియవ్వలు పాడు కొందురు. అన్నమయ్యగారి యధ్యాత్మసంకీర్తనములు, శృంగారసంకీర్తనములు, శృంగారమంజరి మున్నగునవి తిరుపతి దేవస్థానమువా రచ్చువేసిరి. తాళ్లపాక దంపతులు మన జాతికి పురాణదంపతులు. వారి సంతానమంతయు పదకవితలకు పంటపొలము. వీరి మనుమడు చినతిరుమలాచార్యులు. ఆయన పదములు

వ్రాయుటయేకాక 'సంకీర్తనలక్షణము' గూడ రచించెను. తాళ్లపాకవారి రచనములు జానపదగేయపరిశోధనమున జేరకపోయినను, గేయస్వరూపములను వాని పరిణామమును సూచించును. 'సంకీర్తన లక్షణము'నందు ఏలలు, గొబ్బిళ్లు, చందమామ పదములు, అర్ధచంద్రికలు మొదలగు గేయముల లక్షణములు వివరింపబడియున్నవి. గేయకవితకు తాళ్లపాకవారు తిరుపతిస్వామి సన్నిధిని పట్టాభిషేకము చేసినారు. అనాగరకుల నడుమ సెలయేరువలె పరుగెత్తుచుండిన జానపదగేయస్రవంతి వేంకటేశ్వరస్వామి పాదములకడ సంగీతము నింపుకొని పూర్ణసరస్వతి యైనది.

దిగ్విజయార్థము బయలుదేరనున్న శ్రీకృష్ణదేవరాయల కపరిమితోత్తేజ మొక జానపదుని గేయము కలిగించిన యైతిహ్యము మనమందర మెరిగినదే.

"కొండవీడు మందేరా - కొండపల్లి మందేరా
కాదనువాడుంటే - కంటకం దాకా మందేరా"

యనుపాటయందున్న శ్రీ కృష్ణదేవరాయల వీరవిహారచరిత్రమును త్రవ్వి తండములు పోయవచ్చును.

శ్రీకృష్ణదేవరాయలు ప్రాతర్వేళల "సంధుయంత్ర సతికృతోప్ప్రోద్గీత గేయౌఘముల్" వినెను.[1] ఏతాము పాట లిప్పటికిని పల్లెపట్టులందు వినబడుచునే యున్నవి. మనోరమాస్వరోచుల వివాహసందర్భమున "వేల్పుగాణలు బాడు ***లక్ష్మీనారాయణుల కళ్యాణంపు బాటలం*** దీటుకొను తిన్నని రవంబులుం గలసి బలసికొను కోలాహలము"ను పెద్దనగారు వర్ణించిరి.[2] తెనాలి రామకృష్ణ ప్రభృతులకు గురువనంబడు భట్టరుచిక్కాచార్యుల గూర్చి యొక చాటుపద్య మిట్లున్నది.

క. "పద పద్యంబులు చదివిన
విదలించుక లేచిపోక వేడుకతోడన్ "[3].

లభించినంతవరకు చక్రపురి రాఘవాచార్యుల (1545) విప్రనారాయణ చరిత్రము, కందుకూరి రుద్రకవి సుగ్రీవవిజయము తొలి యక్షగానములు.

---

1. ఆముక్తమాల్యద ౨-౫౨ 2. మనుచరిత్ర ౩-౭౧

3. చాటుపద్య మణిమంజరి. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి సంపాదితము పుట.౧౦౮

వీనికన్న పూర్వపు యక్షగానము సౌభరిచరితము ప్రోలుగంటి చెన్నశౌరికృత మింకను మృగ్యము. రుద్రకవి క్రీ. శ. ౧౫౫౦ – ౧౫౮౦ ప్రాంతమందుండిన ఇబ్రాహీంషాహ వలన చింతలపాలెము సగ్రహారముగా బడసిన కవి. ఈ యక్షగానములందెన్నియో పదకవితలు గలవు.

క్రీ. శ. ౧౫౫౦ – ౧౬౦౦ నడుమ నున్న దామరల వెంగళభూపాలుడు వసంత ర్తు వర్ణనమున "జాజులఁ తేటుల జాడల వీఁచెన్, **జాజరపాటల** జాగులు రేగెన్" (౨–౧౩) అనియు, శ్రీరామచంద్ర వివాహసమయమున నలుగిడునప్పుడు "**ధవళము** పాడి రిద్దరు సుధాకరబింబముఖీశిఖామణుల్" (౪–౭ ) అనియు

క. ఆ కల్యాణంబున గౌ
రీకల్యాణంబుల రఘుహరిం బొగడిరి నా
నాకల్యాణులు కోకిల
కాకల్యాణపదకంఠకమనధ్వనులన్ '' (౪–౮౭)

అనియును తన బాహుళాశ్వచరిత్రమున వర్ణించెను. ఈ పాటలన్నియు నేడు ప్రచారమందున్నవే.

నాయకరాజుల కాలమందు పదకవిత్వము పరాంకోటి నందినది. రంగాజి, రామభద్రాంబ, కృష్ణాజి మొదలైన కవయిత్రులేకాక స్వయముగా విజయరాఘవ నాయకుడే గేయరచనలు చేసెను.

క్రీ. శ. పదునేడవశతాబ్ది ప్రారంభమందున్న పాలవేకరి కదరీపతి నాయకుడు నూలువడుకు స్త్రీలను వర్ణించుచు "ప్రాయంపు పడుచులఁ బనిగొంటివే దూది యనెడి పాటల దేనెచినుకు లీన" ననెను (శుకసప్తతి ౨-౪౨౨). ఇవి రాటముపాటలై యుండును. ఈతడింకను సువ్వాలలు, శోభనములు, ధవళాలు మొదలగు పాటలేకాక ఏలపాటలు, గొబ్బిళ్లు, పరశురాముని పాటలు పేర్కొనెను. (శుకసప్తతి ౧౩౨౩; ౨౧౩౨, ౪౩౭, ౪౨౩)

క్రీ. శ. ౧౬౮౦ ప్రాంతపు భద్రాచలరామదాసు (కంచర్ల గోపన్న) పాడిన పాటలు జానపదగేయములుగా ప్రచారమందినవి. క్షేత్రయ్యగారు మొవ్వ గోపాలుని మోహించి పాడిన పాటలన్నియును లభించలేదు. కర్మవీరులు శ్రీ విస్సా అప్పారావుగారు మూడువందలముప్పదింటిని సంపాదించి ప్రచురించినారు. 'అస్మదాచార్యుని భక్తిసంకీర్తనపథమున నడచిన త్యాగయ్య వ్రాసిన పాటలు

ద్రవిడ కర్ణాటాంధ్ర కీర్తనవాఙ్మయమునకు మేలుబంతులు'.[1] క్షేత్రయ్య, త్యాగరాజాదుల రచనములందు సంగీతము హెచ్చు. పదకవిత్వమునకు గల ప్రచారమును జూచి పండితకవుల పండ్లుగూడ పులిసినవి. ఎలకూచి బాలసరస్వతి, కంకంటి పాపరాజు, గోగులపాటి కూర్మనాథకవి, ఆలూరి కుప్పనవంటి పండితకవులుకూడ పదరచనలు చేసిరి. అప్పకవి లాలి, ధవళము, సువాల, పెండ్లిపాటలు మున్నగువానికి లక్ష్యలక్షణములు సమకూర్చెను. ఆనందరంగ రాట్ఛందమున కొట్నములు, ధవళములు, ఆరతిపాటలు, జోలపాటలు,ఏల పాటలు, శోభనములు, గొబ్బిళ్లు వంటి పాటలు పేర్కొనబడినవి.

పైన పేర్కొన్న కవుల రచనములు (బాలసరస్వతివంటివారివి) పద కవిత్వములే యైనను ప్రౌఢములు. ఇవి జానపదగేయములు కావు. కాని నిబద్ధదేశి సారస్వతమున జేరిపోవును. నన్నయ నన్నిచోడులనుండి త్యాగరాజు వరకు వచ్చిన సాహిత్యమున గేయముల ప్రసక్తి క్లుప్తముగా సాగించితిమి. త్యాగ రాజునకు తరువాత స్వయముగా జానపదులు రచించినవి, లేక జనపదములందు ప్రచారము గాంచినట్టివి గేయము లనేకములు దక్కినవనుకొనవచ్చును. కొన్ని కాలగర్భమున గలసిపోయియుండును. ఏసాహిత్యమునకును ఈ విపత్తు తప్పినదికాదు భద్రపరచెడువారుండినచో యాగంటి లక్ష్మయ్యగారి వచనముల వలెనే అతిప్రాచీనములగు గేయములు మనకు మరికొన్నియైనను దక్కియుండును. మనకా యదృష్టము లేదు. ప్రాత తాళపత్రగ్రంథములం దచ్చటచ్చట కొన్ని పాటలు గలవు. ముద్రణాసౌకర్యములు వచ్చిన పిమ్మట, ప్రకాశకులు తమ లాభముకొరకు చేసిన పనియేయైనను, ఈ గేయవాఙ్మయమునకు కొంత మేలే జరిగినది. ముద్రితవాఙ్మయమున నధికభాగము ఆధునికరచనములే. ఇవి యన్నియు చాల వరకు దీర్ఘగేయములు; బృహద్గేయములు. మౌఖికప్రచార మందున్న చినచిన్న గేయము లింకను సేకరింపవలసినవి గలవు. వాని సంఖ్య లక్షలవరకుండునని తోచుచున్నది. వాని చావుపుట్టుకలు పెరుగుటవిరుగుటలు జానపదుల జిహ్వాంచలములందే జరుగుచున్నవి. ఏ గీతమెప్పటిదో ఎన్నియెన్ని మార్పుల నొందినదో తెలిసికొనజాలము.

---

1. ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము. ఖండవల్లి లక్ష్మీరంజనంగారు.

## జానపదవిజ్ఞానమునుగూర్చిన కృషి

భారతదేశమును రాజకీయముగా బంధించి యుంచినను పాశ్చాత్యులు కొంత సేవయు మన దేశమునకు చేసినారనుటలో సందియము లేదు. కొందరు చేసిన సేవలు రాజకీయముగా, వారి ప్రభుత్వమునకు పరోక్షముగా బలము కూర్చునట్టివే యనుకొన్నను మరికొందరు మాత్రము నిస్వార్థముగా స్నేహ భావముతో ప్రజాహితకార్యము లొనర్చిపోయినారు. ఆంధ్రదేశమునకు పొగడ రాని మేలు చేసిపోయినవారట్టి పాశ్చాత్యులెందరో కలరు. వీరిలో నందరికన్న మిన్న **C. P. Brown** గారు. శిష్టసాహిత్యోద్ధరణమునకు బ్రౌను మహాశయుడు పడిన పాట్లాదేవునికెరుక. మనదేశమున కాతడు రాకున్నచో మనకు గర్వ కారణమైన చక్కని సాహిత్యసంపద యంతయు చెదపురుగుల పాలయ్యెడిది. తెలుగు భాషయందున్న గొప్పతనము తెలిసికొని ప్రపంచమునకు చాటినవాడు బ్రౌను మహాశయుడే. అతడే మన యాంధ్రవాణిని '**Italian of the East**' అని ఘోషించి తన స్వాయైకదృక్పథమును చాటెను. మనజాతి యీవిషయమున నాతనికి ఋణపడినంతగా మరి యెవ్వరికిని ఋణపడియుండలేదు. శిష్టసాహి త్యోద్ధరణసమయమున నాతని కన్ను జానపదగేయములపైగూడ పడినది. బొబ్బిలి కథ, కుమారరాముని కథ, కామమ్మ కథ మొదలగు గాథాగేయములను తొలుత సేకరించినది బ్రౌనుగారే. దేశిసారస్వతమునకు చెందిన అనేక మంజరీద్విపదలు, కథలు పాటలు మున్నగునవి ఆతడు సేకరించినాడు. బ్రౌను మహాశయుడు యక్షగానములగూర్చి చెప్పుచు నీ జానపదగేయగాథలగూర్చి యిట్లు నుడివినాడు.

**"Finally there are other ballads (Cathalu) of great length framed in a peculiar chant on principles different from all other sorts of poetry. Some of these, as the Bobbili-catha or Ranga Rao charitra the Nagamma catha and the like are chiefly preserved by oral recitation, with-out having been until now committed to writing. These are every where popular, though despised, as illiterate, by professed scholars"** 1

ప్రజలయందీ గాథల కెంత ప్రాచుర్యమున్నదో పండితులకీ సారస్వతమన్న నెంత యీసడింపో బ్రౌను పండితుడు చక్కగా చెప్పినాడు.

---

1. **Asiatic Journal Vol. 34. 1841**

అయనయే సేకరణకు పూనుకొన్నచో శిష్టసాహిత్య మెంత సమృద్ధిగా మనకు సంక్రమించినదో అంతియ జానపదసంపదకు మనము నోచుకొనియుందుము. బ్రౌనుగారి యీప్రాత తరువాత ముప్పదేండ్లకు మరల నొక పాశ్చాత్యపండితుడు జానపదగేయముల సేకరించుటకు బద్ధకంకణుడయ్యెను. ఆయన J. A. Boyle M.C.S. గారు. రాయలసీమలో రాజకీయోద్యోగిగా ౧౮౭౪ ప్రాంతములందుండినవాడు. అప్పటికే Charles E. Gover అనునాతడు Folk songs of Southern India అను గ్రంథమును ౧౮౭౧ లో ప్రకటించెను. కాని దానిలో మన తెలుగుపాటలు లేవు. తమిళ కన్నడ మళయాళ భాషలందున్న గేయములనే కూర్చి తెలుగు గేయములకు మారుగా వేమన పద్యములను చేర్చెనట. ఈవిషయము Boyle గారికి చాల బాధ కలిగించినది. వారు ౧౮౭౪ లో Telugu Ballad Poetry పేరుతో నొక వ్యాసము ప్రకటించుచు ఇట్లనిరి.

"When the late Mr. Gover Compiled his Folk-songs of Southern India the only dialect of the Dravidian Tongues which went unpresented in his collection was the Telegu"[1]

తెలుగు భాషకు కలిగిన యన్యాయమును జూచి యామహానుభావు డెంత నొచ్చుకొనెనో ! అతనికి గలిగిన బాధ మనపై దయగా వర్షించినాడు. తెలుగు తన మాతృభాష కాకున్నను అసలాతడీదేశీయుడు కాకున్నను తాను నిజమైన సేవ చేయజాలుదునో లేదో యని యాత్మవిమర్శనము చేసికొన్నను తనకు గలిగిన తలపునకు మాత్రము కొంత యాకారమిచ్చి పోయినాడు. ఈ విషయమున నాతడిట్లనెను.

"It is therefore to be hoped that while the treasures of na tio nal poetry are being gleaned from so many languages the store of the sweetest dialect of Southern India may not be over looked and that the popular songs of Telugu people may be collected. That such exist, it is the object of the present writer to show, but his fitful gleanings are worthless, except as they may lead other and more competent gatherers to the field.

"The specimens of popular Ballads which are now offered are undoubtedly the composition of rural bards. They have been

1. The Indian Antiquary Vol. III Page I. 1874 A. D.

gathered by the roadside from rude men that could neither read nor write. The plough man who sang to his team and the carter as he sat between his bullocks have contributed snatches of song, of which they often only half-knew the meaning, and which they changed and corrupted into their rough and vulgar tongue. The very simplicity and boldness of the verses are their certificate of genuineness, and attest the unskilled rudeness of the singer's thought, and the uncritical patience of the simple listeners"[1]

ఈ పాశ్చాత్యపండితుడు మొత్తమూరు పాటలు సేకరించి ప్రకటించెను. మొదటి పాట చారిత్రక గేయము. తక్కినవి శృంగారగీతములు, చారిత్రక గేయము నాతడు బళ్లారివాస్తవ్యుడగు నొక బోయనుండి సేకరించెనట. శృంగారగేయములు నాలుగు ఒకరైతు మోటగొట్టుచు పాడుచుండగా విని వ్రాసికొనెనట. బోయల్ పండితుడు సేకరించిన మొదటి గేయము సర్వాయి పాపని వీరగాథ. సర్వాయపాపడు రాయలసీమకు సంబంధించిన పాళెగాడనుకొని (పొరపాటున) బోయల్‌గారు ఆతనిగురించి విచారించి నిష్ఫలులైరట.

సర్వాయి పాపడు రాయలసీమవాడు కాడు. అతడు తెలంగాణమువాడు. శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారీవిషయమై పరిశోధనము చేసి సత్యమును చాటిరి.[2] వారి యడుగుజాడలందు నేను కొంత చరిత్ర త్రవ్వితిని. చారిత్రక గేయములగురించి చెప్పునప్పుడు దీనిగూర్చి విపులముగా చర్చింతును. బోయల్ పండితుని ప్రశంస యిట వచ్చినందుకు ఆతడీ వాఙ్మయమునకు చేసిన సేవకు నాతని యెడగల గౌరవముతో నాతడు సేకరించిన గేయమొకటి—అది యిట అప్రస్తుతమైనను-ఉదాహరింతును.

౧. యేగి యేగి యెండలైన—యెదురు గుమ్మి నీడలైన
దూడవాడు మొగడైన—వుండవలె కొండనడుమ

౨. యెదురింటి యెఱ్ఱిపాప—చూతమన్న కానరాదు
పాపిష్టి తల్లి దండ్రి—బై లెల్లనివ్వరు

౩. ఎతు గుబ్బలు ఎఱ్ఱిదాన్ని—కోరగుబ్బలు ఎవ్వనిపాలు
ఆలులేని బాలునికి-ఆరునెలల అరణం ఇస్తును

1. The Indian Antiquary Vol. III I874 A. D.

2. అమరావతీస్తూపము - అనాదృతవాఙ్మయము

౪. గుబ్బలుండే తీరు సూచి-గుడ్డికొంటే తీరునంటె
గుండెగలబంటు ఐతె-గుండ్లపల్లె కనుమకు రా.

తక్కిన పాటలగురించిన ప్రస్తావన తరువాత, ఆ వ్యాసము చివరన
పండితుడిట్లు నుడివెను.

"With this I will leave my poor attempt to illustrate Telugu
c poetry; those who are qualified by a knowledge of the lan-
.ge to criticise the text of these songs will find many errors to
don; and those who test the translation by a high standard
. hold them very cheap. They have, however already served
ighten the monotony of some lonely hours in my camp life;
if they now induce others to glean the same field; return with
cher sheaf, they will have completed my purpose."[1]

ఎంత సహృదయు డీతెల్లదొర ! జానపదగేయోద్ధారకుడు గనుక
విగూర్చి ఇంత దీర్ఘముగా వ్రాయవలసి వచ్చినది. ఆతరువాత మనవారి కీ
ములగురించి కొంతశ్రద్ధ కలిగినది. "క్రీ.శ. ౧౯౦౦ లోను, ౧౯౦౩ లోను
ందిరాజు చలపతిరావు గారు స్త్రీలపాటలను సంపుటాలుగా అచ్చువేశారు.
కంటె ముందు స్త్రీలపాట లేవి అచ్చైనట్లు నాకు సాక్ష్యము దొరకలేదు.
తరువాతనే కాకినాడవారైన మంగు వెంకటరంగనాథరావుగారు ౧౯౦౫ లో
పాటలను కొన్నికొత్తవి కూడ సమకూర్చి వేరేవేరే అచ్చువేయించారు."[2]
'స్త్రీల పాటలు' పేరుతో 1889 లో రాజా మంత్రిప్రెగడ భుజంగరావు
ను, 1898 లో జె. వెంకటరమణయ్యగారును, జె. రామలక్ష్మయ్యగారును
థములు ప్రకటించినట్లు ఆంధ్రవాఙ్మయసూచిక తెలుపుచున్నది. ఇదే
మున ఎం.ఎన్. వెంకటస్వామి ఎం.ఆర్.ఎ.యస్., ఎం.ఎఫ్.ఎల్.ఎస్. గారు
ome Telugu folk songs"[3] మరియు "Some Telugu Nursery songs
l catches"[4] పేర్లతో కొన్నిపాటలు సేకరించి ప్రకటించినారు. 1904 లో
నానంద నవీనకల్యాణ పాటలు, 1910 లో స్త్రీల వేడుకపాటలు (గూడ

1. Indian Antiquary Vol. III.
2. శ్రీ శ్రీపాద గోపాల కృష్ణమూర్తి, దేశి సారస్వత విభూతి.
కిన్నెర సంక్రాంతి సంచిక ౧౯౫౫
3. Tne Indian Antiquary vol. xxxiv 1905
4. ,, ,, vol. xxxv 1906

కృష్ణయ్య) 1911 లో స్త్రీజనవినోదిని పెండ్లిపాటలు (వి.కన్నయ్యదాసు), 1913 లో స్త్రీల పూజపాటలు (తెలకపల్లి నరసమాంబ), 1915 లో స్త్రీలవేడుక పాటలు (ఘాలి సుబ్బారావు), 1919 లో స్త్రీజనానందకర కల్యాణ పాటలు (ఎస్. గోపాలకృష్ణయ్య) వెలువడినవి. సుప్రసిద్ధ సాహిత్య చరిత్రకారులు విమర్శకులు చేకమళ్ళ అచ్యుతరావుగారు కృష్ణాపత్రికలో 1916-17 లో తాము ప్రకటించిన వ్యాసములను 'ఆంధ్రపదములు - పాటలు' గ్రంథముగా 1924 లో వెలయించిరి. జానపదగేయ వైశిష్ట్యమును గమనించి వానిని వెలుతురు లోనికి తెచ్చిన మన పండితులలో అతిరథులు కీ.శే. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, శ్రీ చిలుకూరి నారాయణరావుగారు, పండిత అక్కిరాజు ఉమాకాన్తవిద్యాశేఖరులు, సురవరం ప్రతాపరెడ్డిగారు, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు. వీరిలో వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సేవ ఇంకను గొప్పది. ఆతరువాత చాలమంది సారస్వతాభిమానులు జంకుగొంకు విడిచి ఈ యుద్యమమును బలపరచి వ్యాసములు ప్రకటించిరి. మరికొందరు తమ జీవితములనే ఈ గేయముల సేకరించుట కంకితమొనర్చిరి. వి. ఎన్. భూషణ్ గారు, ఎ. గోపాలకృష్ణగారు, వావిలాల సోమయాజులుగారు, యనమండ్ర శ్రీరామమూర్తిశాస్త్రిగారు, చింతా దీక్షితులుగారు, తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారు, అడిదము రామారావుగారు మున్నగువారు వివిధపత్రికలందు వ్యాసములు ప్రకటించిరి. జానపదగేయముల నత్యధికముగా సేకరించినవారు ఆయాత్రలో తమ జీవితము గడుపుచున్నవారు రాజమండ్రి వాస్తవ్యులు శ్రీ నేదునూరి గంగాధరంగారు. వారు మొత్తమారువేల జానపదగేయములేకాక జానపదవిజ్ఞానము folklore కూడ అధికముగా సేకరించినారు. చేకుమళ్ల కామేశ్వరరావుగారు, శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారుకూడ ఈగేయముల నధికసంఖ్యలో సేకరించుటయేకాక విమర్శనాయుతమగు వ్యాసము లిప్పటికిని ప్రకటించుచునే యున్నారు. చేకుమళ్లవారు ౧౯౪౦ లోనే "ప్రాత పాట"లను పేరుతో నొక చిన్న సంకలమును ప్రచురించిరి. ప్రస్తుతమువారు గృహలక్ష్మి, సౌభాగ్య కిన్నెర మున్నగు పత్రికలందు వ్యాసములు వ్రాయుచున్నారు.[1] శ్రీపాదవారు

1. 1958-55 వరకు ధారావాహికగా వెలువడిన చేకుమళ్ళవారి వ్యాసములు 'ఆంధ్ర - జానపదగేయవాఙ్మయ చరిత్ర' (మొదటి సంపుటము) గా సంగ్రహితము.

భారతి, కిన్నెరపత్రికల నలంకరించుచున్నారు. తెలుగుభాషాసమితివారి బహుమతి నందుకొన్న శ్రీ హరి ఆదిశేషువుగారి 'జానపదగేయవాఙ్మయ పరిచయము' ౧౯౫౪ లో ప్రకటింపబడినది. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, శ్రీ తూమాటి దొణప్పగారు గేయములను కొల్లలుగా సేకరించినట్లు వింటిని. శ్రీ దొణప్పగారు రెండు చక్కని వ్యాసములుగూడ ప్రకటించిరి. శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య, తిరుమల రామచంద్రాచార్యులు, శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు మున్నగువారు కూడ వ్యాసములు ప్రకటించియున్నారు. శ్రీ యల్రోజు మాధవాచారిగా రీవిషయమై కొంత కృషిచేసి మానుకొనిరట. శ్రీ కె. సభాపతి పిళ్లగారు చిత్తూరు ప్రాంతపు జానపదగేయముల సేకరించిరి. తెలంగాణములో నా పరిశోధనమునకై సుమారు వేయి గేయములను సేకరింప గలిగితిని. సుప్రసిద్ధ ఆయుర్వేదాచార్యులు వేదాల తిరుమల రామానుజస్వామిగారు ౧౯౩౯ ప్రజామిత్ర సంక్రాంతి సంచికయందును ౬-౫-౧౯౪౦ గోలకొండ పత్రిక యందును జానపదగేయములందున్న కొన్ని ఆయుర్వేదరహస్యములనువెల్లడించియున్నారు.సర్వశ్రీగిడుతూరిసూర్యం,సీతారామ నాయుడు వకీలు (హుజూరాబాదు) గంగుల శాయిరెడ్డి, ఇల్లిందల సరస్వతీదేవి, గూడూరి, కనపర్తి, అచ్యుతరాజు గారలు తెలంగాణపు పాటలు సేకరించిరి. ఆంధ్రప్రభ వారపత్రికలో నెందరో యువతీయువకులు పాటలు సేకరించి ప్రకటించుచున్నారు. ఆంధ్రజానపదగేయములను తెలుగుదేశము మేరలందుంచక యావద్భారతమునకే కాక ప్రపంచమునకును చాటినవారు శ్రీ దేవేంద్రసత్యార్థి గారు.వారు ప్రకటించిన హిందీ, ఇంగ్లీషు గ్రంథములందును వివిధపత్రికలందును, ఆంధ్రగేయముల ననువదించి యున్నారు. **Furer Haimendorf** గారి ఆటవికుల గేయములగూర్చి ఇదివరకే చెప్పియుంటిని. రాజమహేంద్రవరమున ప్రిన్సిపాలుగా నుండిపోయిన **Oswald J. Couldrey** గారును[1] ఆచార్య పి. సాంబమూర్తి గారును[2] జానపదుల సంగీతకళనుగూర్చి వ్రాసినారు. వింజమూరి సీతాదేవి గారు జానపదసంగీతముగూర్చి పరిశోధన మొనర్చి ఎం.లిట్ పట్టమునొందినారు. గుజిలి పాటల పుస్తకములుగా నచ్చొత్తించిన ప్రకాశకులు ప్రచురణకర్తలు పెక్కురు. ఆయాసంస్థల పేరొన్నచో నొక గ్రంథమగును. మహాపండిత

1. **South Indian Hours 1924**
2. **Indian Art & Letters Vol. VI, New Series 1937**

పరిశోధకులు కీర్తికాయులునైన డా. చిలుకూరి నారాయణరావుగారు ఒక లక్ష సామెతలు సేకరించిరట. అవి వెలుగు చూచుటెన్నడో! M.W. Captain Carr తెలుగు సామెతలను ఇంగ్లీషు అనువాదముతో 1949 లో ప్రకటించినారు. శ్రీ గంగాధరంగారు సేకరించిన కొన్ని పాటలను నా సంపాదకత్వమున తెలంగాణా రచయితల సంఘమువారు 'సెలయేరు'గా పారించిరి (౧-౧-౧౯౫౫). 'కృష్ణశ్రీ' గారి సంకలనముల కొన్నింటిని హైద్రాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తువారు ప్రచురించినారు. విశాలాంధ్ర ప్రచురణలవారు 'ఎల్లోరా' గారు సేకరించిన పాటలను, చింతా దీక్షితులుగారి "జానపదవాఙ్మయము"ను ప్రకటించినారు. ఆంధ్రజానపదగేయములగూర్చి కృషిచేసిన కొందరు ప్రముఖుల పరిచయమున కిది దిఙ్మాత్రసూచికయని మనవి.

కడచిన యిరువదిరెండేండ్లలో అనగా ఈనా సిద్ధాంతగ్రంథ రచనము పూర్తియైన (జూలై 1955) నాటినుండి ఈనాటివరకు జానపదవాఙ్మయమునకు- ప్రత్యేకముగా జానపదసారస్వతమునకు- చెందిన వివిధప్రక్రియలలో మంచి కృషి జరిగినది. ఈకృషి ఆయా విశ్వవిద్యాలయములందు పరిశోధకసిద్ధాంత గ్రంథరచనల రూపమునను, వివిధసంస్థలపక్షమున వెలువడిన గ్రంథముల రూపమునను, వ్యక్తిగతముగా విమర్శకులు పండితపరిశోధకులు సంకలనకర్తలు ప్రచురించిన పుస్తకములు వ్యాసముల రూపమునను జరిగినది; ఇంకను జరుగుచున్నది. ఈకృషినిగూర్చి సంగ్రహముగా పేర్కొందును.

ఆంధ్రవిశ్వవిద్యాలయమున, ఈనాడు తెలుగుశాఖాధ్యక్షులుగానున్న డా.యస్వీ. జోగారావుగారు 1956 సంవత్సరమున యక్షగానవాఙ్మయచరిత్రమను సిద్ధాంతగ్రంథము సమర్పించి 1957లో Ph.D. పట్టము పొందిరి. ఈగ్రంథమా విశ్వవిద్యాలయమువారే 1961లో ప్రకటించిరి. యక్షగానవాఙ్మయసర్వస్వమని చెప్పదగిన ఈగ్రంథమున 465 రచయితల 802 లబ్ధాలబ్ధయక్షగానకృతుల గూర్చియు యక్షగానావిర్భావము, దాని యభివృద్ధి, ప్రదర్శనమందలి పద్ధతులు, ఆంధ్రదేశమునను బయటను యక్షగానములరచనము, వాని వ్యాప్తి, సాహిత్యమున వాని స్థానము, యక్షగానములందలి భాషాచ్ఛందోసంగీతసంస్కృతీ విశేషములును వ్రాసియున్నారు.ఆంధ్రవిశ్వవిద్యాలయముపక్షమున యక్షగానముల సంపుటములు 10 ప్రకటితమైనవి. ఆ విశ్వవిద్యాలయము హిందీవిభాగమున రీడరుగానున్న

కర్ణరాజ శేషగిరిరావుగారు హిందీలో తెలుగు జానపదగేయములగూర్చి కవ్యాసములు ప్రకటించుటేగాక తెలుగులో జానపదగీతములను సిద్ధాంత ంథమును వ్రాసి 1965లో Ph. D. ఉపాధినందిరి.

ఈనాడు బెంగుళూరు విశ్వవిద్యాలయమున తెలుగు శాఖాధ్యక్షులుగానున్న తంగిరాల వెంకటసుబ్బారావుగారు శ్రీ వెంకటేశ్వరవిశ్వవిద్యాలయమున 38లో తెలుగు వీరగాథాకవిత్వము (Ballad Poetry in Telugu) అను ంతగ్రంథము సమర్పించి 1969లో Ph. D. పట్టానందిరి. ఇది 25 కరణముల గాథాగేయవిమర్శసర్వస్వము. వీరగాథల పుట్టుపూర్వములు తీయ భారతీయేతరవీరగాథల చరిత్రము, వీరగాథావిభజనము, శ క్తికథా కము, పలనాటివీరకథాచక్రము, కాటమరాజుకథాచక్రము, బొబ్బిలివరుస లు, పదములు, జంగంకథలు, లఘువీరగాథలు, వీరగాథానుకరణములు, గాథలందలి రసము, భాష, ఛందస్సు వీరగాథల వైశిష్ట్యము, గాథాకారులు దితాముద్రితములగు 980 వీరగాథల సమాచారమున్న అమూల్యగ్రంథమిది.

శ్రీ వెంటేశ్వరవిశ్వవిద్యాలయమున తెలుగు హిందీ జానపదసారస్వత క్రియల తులనాత్మకపరిశీలనముకూడ జరిగినది. 'తెలుగు ఔర్ హిందీ కో క్తియాం' తెలుగు హిందీ లోకోక్తుల తులనాత్మకముగా పరిశీలించి A. Disseration వ్రాసినవారు(1962) డా. వై. వెంకటరమణరావుగారు. ఏర హిందీప్రచారసభవారీ గ్రంథమును 1970లో ప్రకటించినారు. 'తెలుగు హిందీ క్రియావత్ ప్రయుక్త మహావిరే' తెలుగు హిందీ నుడికారముల నాత్మకముగా పరిశీలించి M. A. Disseration వ్రాసినవారు (1973) ఏతి ఫజులున్నిసా బేగంగారు.

ఆంధ్రదేశము బయట డా. ఎస్. దక్షిణామూర్తిగారు 'హిందీ ఔర్ గు కహావతోంకా తులనాత్మక అధ్యయన్' అను సిద్ధాంతగ్రంథమును 35 లో వ్రాసి అలహాబాదు హిందీసాహిత్యసమ్మేళన విశ్వవిద్యాలయమున హిత్యమహోపాధ్యాయ బిరుదమందినారు. వీరి గ్రంథమును నంజన్‌గూడ ప్రకాశన్‌వారు 1966లో ముద్రించినారు. శ్రీ కారుమూరి వీరవెంకట మనరసింహారావుగారు 'తెలుగు ఔర్ హిందీ లోకోక్తియాం' అను సిద్ధాంత ంథమును వ్రాసి ఆగ్రావిశ్వవిద్యాలయమువారి Ph. D. ఉపాధినందినారు

(1967). ఈ గ్రంథము మైసూరు భారతీయభాషాసంస్థ C.I.I.L పక్షమున 1967లో ప్రకటితమైనది.

బెంగుళూరు విశ్వవిద్యాలయమున శ్రీ. G.S. మోహన్ అనంతపురం జిల్లా స్త్రీలపాటల గూర్చి Ph.D. పట్టమునకై కృషిచేయుచున్నారు. వీరి 'తెలుగు కన్నడసామెతలు సమానార్థకములు' ఇటీవలనే ప్రకటితమైనది. శ్రీ G. అశ్వత్థ నారాయణగారు 'తెలుగు వ్రజభాషలలోని జానపదకృష్ణకథల' గూర్చి Ph. D. పట్టమునకై కృషి చేయుచున్నారు.

మైసూరు విశ్వవిదాలయమున జానపదవిజ్ఞానశాఖలో అధ్యాపకులుగానున్న డా. R.V.S. సుందరంగారు 'తెలుగు కన్నడ జానపదగేయముల' గూర్చి తులనాత్మక పరిశోధనమొనర్చి1978లోPh.D పట్టము నందినారు. తెలుగుకన్నడములందలి పనిపాటలు, పారమార్థికగేయములు, స్త్రీలపాటలు, పిల్లలపాటలు, వేడుకపాటలు, నవ్వులాటపాటలు, కన్నీటిపాటలు మొదలగువాని పోల్చి సవిమర్శకపరిశీలన మొనర్చి ఆపాటలందలి భాషాచ్ఛందోసంగీతసాహిత్యసాంఘిక విషయములనుగూర్చి వ్రాసినారు. మైసూరు విశ్వవిద్యాలయమున శ్రీ. పి. ఎన్. గోపాలకృష్ణ 'తెలుగు కన్నడ సామెతల తులనాత్మక పరిశీలనము' గూర్చియు, శ్రీ టి. గోపాలకృష్ణరావు 'తెలుగుకన్నడములలో జానపద రామాయణముల' గూర్చియు Ph.D. పట్టములకై కృషిచేయుచున్నారు.

ఉస్మానియావిశ్వవిద్యాలయమున తెలుగుశాఖలో రీడరుగానున్న డా. నాయని కృష్ణకుమారిగారు 1969లో 'జానపదకథాగేయము'లను సిద్ధాంతగ్రంథము వ్రాసి 1970లో Ph.D. పట్టమునందినారు. గేయగాథలను Anthropology మానవశాస్త్రదృష్టితో పరిశీలించిన తొలిప్రయత్నమిది. ఇందులో జంతుపూజాపద్ధతి (Totemism) మాతృపూజాపద్ధతి(Mother Goddes Worship) వీరారాధనము (Hero worship) వాని పరిణామములు విపులముగా పరిశీలించుటయే కాక జానపదుల మతాచారములు, విశ్వాసములు, సాంఘికరాజకీయవిషయములు భాషాస్వరూపము వివరించినారు. జడ్చర్ల కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగానున్న శ్రీయెల్దండ రఘుమారెడ్డిగారు వేలకొలది జానపదగేయములను సేకరించి 'తెలుగు పల్లెపదములందు ప్రజాజీవన'మను సిద్ధాంతగ్రంథమును వ్రాసి 1974లో

యావిశ్వవిద్యాలయపు Ph.D ఉపాధినందినారు. జానపదమన స్తత్వము ంల కుటుంబజీవనము, జానపదసామాజికజీవనము, ఆచారవ్యవహార ము, జానపదశృంగారజీవనము, కవితాసౌందర్యము, భాషాస్వరూపము ఏడు ప్రకరణముల గ్రంథమిది. పల్లీయుల జీవితమును సామాజిక 'ముతో పరిశీలించి శ్రీ రఘుమారెడ్డిగా రెన్నియో మౌలికవిషయములు రు. శ్రీ జి. లింగారెడ్డిగారు 'గ్రామికగేయాలు' సిద్ధాంతవ్యాసము వ్రాసి tt పట్టమందినారు (1976).

శ్రీమతులు నాయని కోటీశ్వరి 'ముద్రిత జానపదగేయములందలి ంవులకెక్కని పదముల' గూర్చియు, K. సుమతి 'జానపదకథల' ము, ప్రేమలత 'పౌరాణికగాథల' గూర్చియు వసుంధర జానపద ంలందు ప్రతిబింబించు మతము ఆచారముల గూర్చియు P. సరస్వతి ాటల' గూర్చియు Ph. D పట్టములకై కొంత కృషి చేసినారు. శ్రీమతి ్మయి వేదాంతపుపాటల గూర్చియు శ్రీ దామోదరరావు తెలుగు సామెతల ు M.Litt పట్టమునకై కృషిసాగించినారు.

శ్రీ పిరాట్ల శివరామకృష్ణమూర్తి 'గిరిజనుల పాటల' గూర్చియు శ్రీమతి ంంతలక్ష్మి 'జానవదగేయములందలి సంగీతము' గూర్చియు, శ్రీ కసిరెడ్డి ెడ్డి పొడుపుకథలగూర్చియు Ph.D పట్టములకై కృషి ప్రారంభించినారు.

అమెరికా విస్కాన్సిన్ విశ్వవిద్యాలయమున శ్రీ Gene. H. Roghair వీరగాథలగూర్చి పరిశోధనము చేయుచున్నారని తెలిసినది.

హైదరాబాదు ఆంధ్రసారస్వతపరిషత్తువారు మూడు చక్కని గేయ ముులను ప్రకటించినారు. ఈ మూడింటిని సంపాదించినవారు జానపద తమున అశేషకృషి యొనర్చి దాని యందచందములను ఉపన్యాసముల ంనను పరిశీలనాత్మకవ్యాసముల ద్వారమునను తెలుగులోకమునకు చాటిన ష్ఠ విమర్శకులు డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు. ఈ సంకలనము మొదటిది 'పల్లెపదాలు' (1955). దీనిలో 187 పల్లెపాటలు చిన్న ్యాతములతో నున్నవి. రెండవ సంకలనము స్త్రీల రామాయణపు పాటలు ). దీనిలో రామాయణమునకు సంబంధించిన 42 కథాగేయములున్నవి. వారి యుపోద్ఘాతమీ సంకలనమునకు కలికితురాయి. మూడవ సంకలనము

స్త్రీల పౌరాణికపు పాటలు (1963). దీనిలో భారతభాగవతములకును తదితర పురాణములకును సంబంధించిన 63 కథాగేయములున్నవి.

ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ పక్షమున 1959 లో వెలువడిన 'తెలుగు సామెతలు' చెప్పుకొనదగిన గ్రంథము. దీనిలో వేలకొలది సామెతలు అకారాదిగా కూర్చబడినవి. 'జానపదగేయాలు-సాంఘికచరిత్ర' పేరుతో 19 గాథాగేయములు (Ballads) సుదీర్ఘమైన పీఠికతో 1974 లో అకాడమీవారే ప్రకటించినారు. దీనిని శ్రీమతి నాయని కృష్ణకుమారిగారు, నేను సంపాదించితిమి. ప్రపంచ తెలుగుమహాసభల సందర్భమున శ్రీ జి. శంకరరావుగారు సంపాదించిన 'పొడుపు కథల'ను లఘుపుస్తకమును ప్రకటించినారు. ఇటీవల డా. తంగిరాల వెంకటసుబ్బారావుగారు సంపాదించిన 'కాటమరాజు కథలు' మొదటి సంపుటమును కూడ అకాడమీవారు ప్రకటించినారు(1976). దీనిలో కాటమరాజుకథాచక్రమందలి ఆవులవలరాజుకథ, పంపాద్రికథ, పెద్దిరాజుకథ, పోలురాజుకథ, బల్లికురవ పోట్లాట, కాటమరాజుకు పట్నంకట్టినకథ, కరియావులరాజుకథ, పాపనూక కథలున్నవి. ఈగ్రంథమునకు సంపాదకులు వ్రాసిన సుదీర్ఘపీఠికలు గొప్పవి.

ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీవారు 'త్రివేణి' యను జానపదగేయముల సంకలనమును 1960లో ప్రకటించిరి. ఇందులో యావదాంధ్రమునకు సంబంధించిన 243 పాటలు తొమ్మిది శీర్షికల క్రింద వింగడింపబడి ప్రతిపాటకు చిన్నయుపోద్ఘాతము; మాండలికపదముల కర్థములు, ఆయాపాటలు వినిపించినవారి యూరుపేరుల వివరములీయనైనవి. సాగరాంధ్రపు పాటలు శ్రీ నేదునూరి గంగాధరంగారు, శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారును, రాయలసీమపాటలు శ్రీ తూమాటి దొణప్పగారును, తెలంగాణపుపాటలు నేను సేకరించినవి. కొంతవరకు శాస్త్రీయముగా వెలువడిన గేయసంకలనములందు త్రివేణి మేలుబంతి. దీనిని సంపాదించు భాగ్యము నాకు దక్కినది. సంగీతనాటక అకాడమీవారు 1970లో పెద్దయెత్తున జానపదకళోత్సవములు నిర్వహించిన సందర్భమున 'నాట్యకళ' ప్రత్యేకసంచిక (ఫిబ్రవరి-మార్చి 1970) వెలువరించిరి. దీనిలో జానపదసారస్వత సంగీత నృత్యములు తదితర కళారూపములనుగూర్చిన 30 వ్యాసము లున్నవి. ప్రపంచతెలుగు మహాసభల (1975 ఉగాది) సందర్భమున డా. తంగిరాల వెంకటసుబ్బారావుగారి

'జానపద సాహిత్యము వీరగాథలు' అను లఘుపుస్తకమునుగూడ సంగీతనాటక అకాడమీవారే ప్రకటించినారు.

కేంద్రప్రభుత్వమువారు **The Census of India, Vol II PartVII–B, Fairs and Festivals of Andhra Pradesh** పేరుతో ఇరువదిజిల్లాల కిరువది సంపుటములుగా వెలువరించిన గ్రంథము అత్యుత్తమము. వీనిలో ఆంధ్రజానపదుల ఆటవికుల, గిరిజనుల ఆచారవ్యవహారములు, పండుగలు, వేడుకలు తిరునాళ్ళు మున్నగువానిగూర్చిన విశేషసమాచారమున్నది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారి **The Tribal Cultural Research & Training Institute** పక్షమున ఆసంస్థ డైరెక్టరు శ్రీ **D. R.** ప్రతాప్‌గారు ప్రకటించిన (1976) 'ఆంధ్రప్రదేశ్ ఆదిమజాతులు' గ్రంథమున మన తెలుగుదేశమునన్న 32 తెగల ఆదిమజాతులవారి సమాచారమున్నది. ఈ సంస్థ ప్రచురించు **Tribal** పత్రికలో ఆదిమజాతులకు సంబంధించిన సాంస్కృతికవిషయములగూర్చిన వ్యాసములు ప్రకటింపబడుచున్నవి. ఆంధ్రదేశమందలి ఆకాశవాణి వివిధ కేంద్రములనుండి ప్రతిదినము జానపదగేయములు ప్రసారమగుచున్నవి. అన్ని గేయములు సిసలైన జానపదగేయములు కాకున్నను, అన్నిగేయములందలి సంగీతము సిసలైన జానపదసంగీతము కాకున్నను ఆకాశవాణివారి సేవ గణనీయమైనది. ఈ గేయములలో కొన్నింటినైన వారే ప్రకటించిన బాగుండును. ఆంధ్రప్రభ ఆంధ్రపత్రిక వారపత్రికలం దొకప్పు డుత్సాహవంతులు సేకరించిన నూర్లకొలది చక్కని గేయములు ప్రకటితమైనవి.

వైయక్తికముగా జానపదవిజ్ఞానరంగమున కృషిచేసినవారిలో ప్రాత స్స్మరణీయులు కీ. శే. నేదునూరి గంగాధరంగారు. వారి జీవితమంతయు ఈ విజ్ఞానగవేషణమున కంకితమైనది. నిరుపేదయైనను తనకున్న ఆస్తిపాస్తులను అమ్మి జానపదగాయకులను సత్కరించిన వదాన్యుడాయన. గంగాధరంగారు దాదాపు పదివేలపుటల జానపదవిజ్ఞానమును సేకరించిరి. నూర్లకొలది గేయములు వ్యాసములు వివిధపత్రికలందు ప్రకటించిరి. వారు ప్రకటించిన గ్రంథములు 1 మేలుకొలుపులు 1949. 2 మంగళహారతులు–రెండు సంపుటములు 1951. 3 సెలయేరు – దేశోద్ధారకగ్రంథమాలవారు 1955 లో ప్రకటించిన ఈ సంకలనమును సంపాదించిన భాగ్యము నాకబ్బినది. దీనిలో ఏడు శీర్షికలక్రింద 250 పాటలున్నవి. 4 వ్యవసాయసామెతలు– విశ్వసాహిత్యమాల పక్షమున

ప్రకటితమైన (1958) దీనిలో 912 తెలుగు సామెతలతోపాటు అరబ్బీ, ఇంగ్లీషు, ఇటలీ, అఫ్ఘనిస్థానము, కర్ణాటకము, చీనా, జపాను, జర్మనీ, తుర్కీ, తమిళము, పరాసు, ఫారసీ, బెంగాలీ, బడగ, బైబిల్, మలయా, మలయాళము, మరాఠీ, రష్యా, స్పెయిన్, హిందుస్థానీభాషలకు చెందిన 199 సామెతల తెలుగు అనువాదములున్నవి. 5 పసిడి పలుకులు - జాతీయ జ్ఞానమందిరంవారు ప్రకటించిన (1960) ఈగ్రంథమొక లఘువిజ్ఞానసర్వస్వము. దీనిలో సామెతలు, జాతీయములు, పలుకుబడులు, పారిభాషికపదములు, నుడికారములు, జమిలిపదములు, పొడుపుకథలు, కిటుకుమాటలు, సాంకేతికపదములు, మాండలికములు వేలసంఖ్యలో నున్నవి. 6 స్త్రీలవ్రతకథలు - రెండు సంపుటములు - కొండపల్లి వీరవెంకయ్య & సన్సువారు 1960 లో ప్రకటించిరి. వీనిలో నూరునోముల కథలు - కొన్నింటికి పాటలుకూడ కలవు. 7 జానపద గేయవాఙ్మయ వ్యాసావళి (విశ్వసాహిత్యమాల 1960). ఇందులో 10 వ్యాసము లున్నవి. 8 ఆటపాటలు 1964. 9 మిన్నేరు (ప్రాచీనగ్రంథమాల 1968). ఇందులో 9 శీర్షికల క్రింద 382 పాటలున్నవి. 10 మున్నీరు (ప్రాచీన గ్రంథమాల 1978). ఇందులో 7 శీర్షికల క్రింద 270 పాటలున్నవి. చివరి గ్రంథము గంగాధరంగారు కీర్తిశేషులైన తరువాత వెలువడినది.

శ్రీ చింతా దీక్షితులుగారు పెక్కుపాటల నుదాహరించుచు విమర్శనాత్మకమైన ఆరువ్యాసముల సంపుటమును 'ప్రజావాఙ్మయము'(విశాలాంధ్ర ప్రచురణాలయం 1955) పేరుతో ప్రకటించినారు.

'ఎల్లోరా' కలముపేరుతో ప్రసిద్ధిగాంచిన శ్రీ గొడవర్తి భాస్కరరావుగారు కూడ ఈరంగమున చక్కని కృషిచేసినారు. వారి 'జానపదగేయాలు' - ప్రథమసంపుటమున (విశాలాంధ్ర 1955) 98 పాటలు, రెండవ సంపుటమున (విశాలాంధ్ర 1959) 71 పాటలు, 'సరాగాలు'లో (విజయ పబ్లిషింగ్ కంపెనీ 1961) 114 పాటలు, 'మధురకవితలు'లో (విజయ పబ్లిషింగ్ కంపెనీ 1961) 17 శీర్షికల క్రింద గచ్ఛద్వ్యాఖ్యలతోడి నూర్లకొలది గేయములున్నవి. 'మన ప్రాచీనకళలు పుట్టుపూర్వోత్తరాలు' ( ఆదర్శగ్రంథమండలి 1960 ) లో తోలుబొమ్మలు,బుఱ్ఱకథలు పగటివేషాలు మొదలైన జానపదకళారూపాలగూర్చిన వ్యాసములున్నవి.

సుప్రసిద్ధనాట్యాచార్యులు శ్రీ నటరాజ రామకృష్ణగారు తమ నాట్యకళ (1956), నర్తనమురళి (1959), ఆంధ్రుల నాట్యకళ(1959) గ్రంథములందు మన జానపదుల, ఆదిమజాతుల నృత్యరీతులను సంప్రదాయములను వివరించినారు. ప్రసిద్ధ సినీనటులు శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు ప్రకటించిన 'ఆంధ్రనాటకరంగచరిత్ర' (1969) వివిధజానపదప్రదర్శన కళారూపములను సమీక్షించినది. శ్రీ జి. వెంకటేశ్వరరావుగారు రంగవల్లులగూర్చి 'గృహాలంకరణము-ముగ్గులు' అను గ్రంథమును సచిత్రముగా 1956 లో ప్రకటించిరి.

శ్రీ నేదునూరి గంగాధరంగారి సంకలనములందు దక్క పొడుపుకథల సేకరణముగాని ప్రకటనముగాని ఎక్కువగా జరుగలేదు. కొండపల్లివారి 'పొడుపుకథలు' (1931) లో 116, వేణుగోపాల్ బుక్‌డిపోవారి 'తెలుగు సామెతలు లేక పొడుపుకథలు' (1953) లో 63, తెనాలి ఆంధ్రరత్న బుక్‌డిపోవారి 'అత్తకోడండ్ర కథలు' (1964) లో 137 పొడుపుకథలు ప్రకటితమైనవి.

సుప్రసిద్ధ నరశాస్త్రవేత్తలు **Haimendorf** గారి కొండరెడ్లు, చెంచుల చరిత్రముల తరువాత ఆ రంగమున చెప్పుకొనదగిన గ్రంథము **The Yanadis** అనునది. దీనిని వ్రాసినది ఆ రంగమున విశేషకృషి చేసిన శ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారు. ఈ గ్రంథమును భారతీయ ఆదిమజాతిసేవకసంఘమువారు 1962 లో ప్రకటించిరి. సుప్రసిద్ధ పండితులు శ్రీ ముసునూరి వెంకటశాస్త్రి గారు 57 'తెలుగుజాతీయముల కథలు' ప్రకటించినారు (1959). కాశీమజిలీ కథలు, సహస్రశిరచ్ఛేద అపూర్వచింతామణి వంటివి దక్క మన వచన కథా వాఙ్మయమంతయు గుజిలీప్రతులందును, చెల్లాచెదరుగను ఉన్నది. సి.పి. బ్రౌన్ మహాశయుడు సేకరించిన 'తాతాచార్ల కథలు' శ్రీ బంగోరెగారి సంపాదకత్వమున ఎమెస్కోవారు 1974 లో ప్రకటించినారు. ప్రాత భారతి, గృహలక్ష్మి మున్నగు పత్రికలందెన్నియో పిట్టకథ లచ్చైనవి. వాని నొకచో చేర్చిన బాగుండును. మన ప్రాచీనార్షేయకథలను కొన్నింటిని 'ఉపనిషత్కథలు' పేరుతో శ్రీ శ్రీధరబాబుగారు వ్రాసినవానిని ఎమెస్కోవారే 1970 లో ప్రకటించినారు.

తమ కంఠమాధుర్యముతో ఆకాశవాణి ద్వారమునను, వివిధసభలందు హాస్యప్రసంగములద్వారమునను జానపదగేయములకు విశేషప్రచారము కలిగించిన శ్రీ ప్రయాగ నరసింహశాస్త్రిగారు 40 గేయములను 'తెలుగు పల్లెపాటలు' పేరుతో (కవితా పబ్లికేషన్స్ 1960) ప్రకటించినారు. శ్రీ బాదగౌని నరేంద్రగారు చిన్న ఉపోద్ఘాతములతో నాలుగు శీర్షికలక్రింద 62 'మోటపదాలు' (నవోదయ సమితి 1962) ప్రకటించినారు. సర్వశ్రీ రాళ్ళపల్లి సుందరం, ఘట్టమరాజు అశ్వత్థనారాయణ, తంగిరాల వెంకటసుబ్బారావుగారలు సంపాదించిన 'ఆలిచిప్పలు-ఆణిముత్యాలు' బెంగుళూరు జానపదసమితి పక్షమున 1972 లో వెలువడినది. దీనికి సంపాదకులు వ్రాసిన ప్రస్తావన ప్రశస్తమైనది. దీనిలో 32 పాటలున్నవి. శ్రీ చొక్కాపు నారాయణస్వామిగారు ప్రకటించిన 'తేనెసోనలు' (గాయత్రీప్రచురణలు 1974) పరిచయవాక్యములతోడి 42 పాటల సంకలనము. బెంగుళూరు జానపదవిజ్ఞానసమితివారు 1976 లో ప్రకటించిన 'జానపదసాహిత్య స్వరూపం' డా. ఆర్వీ యస్. సుందరంగారి బహుముఖజిజ్ఞాసకు నిదర్శనము. దీనిలో జానపదసారస్వతమునకు చెందిన ఆరు ప్రక్రియలగూర్చిన ఉత్తమ వ్యాసము లున్నవి.

ఈనాడు నాగార్జున విశ్వవిద్యాలయము తెలుగు శాఖాధ్యక్షులుగానున్న ఆచార్య తూమాటి దొణప్పగారు నూర్లకొలది రాయలసీమ పాటలు ప్రత్యేకముగా కపిలెపాటలు సేకరించినారు. విమర్శనాత్మకమైన ఉత్తమవ్యాసము లెన్నియో ప్రకటించినారు. వారి 'తెలుగులో కొత్త వెలుగులు' రేడియో ప్రసంగముల మొదటి సంపుటమున (1972) జానపదసాహిత్యమునకు సంబంధించిన ఉదాహరణాత్మకవ్యాసము లున్నవి. వారి 'జానపదకళాసంపద' (1975) విమర్శనాత్మకమైన ఎనిమిది ఉత్తమవ్యాసముల సంపుటము.

సర్వశ్రీ **M. V. T.** రాజు, కె. విశ్వనాథరెడ్డి, డి. పి. ముఖర్జీగారలు కలకత్తానుండి వెలువడు **Folklore** పత్రికలో అమూల్యవ్యాసము లనేకము ప్రకటించినారు.

పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములకు సమకాలీనులైన మరొక మహాయోగి శ్రీ పూదోట లింగావధూత స్వామివారు. వారు చెప్పిన 700

తత్త్వములను పాటలను 12 దళములుగా 'శ్రీ పూదోట తత్త్వగీతామృతము' పేర ఆ మఠాధిపతులైన శ్రీ ఆనందనాదస్వామి వారు 1962లో ప్రకటించినారు.

తెలుగుభాషాసమితిలో పనిచేయుచున్న శ్రీ బి. సుబ్బరాయన్‌గారు 40 గంటలకు సరిపడు వివిధజానపదప్రదర్శనాప్రక్రియలకు గేయములకు సంబంధించిన సారస్వతమును టేపురికార్డు చేయుటేకాక వాని ఛాయాచిత్రములను కూడ సంపాదించినారు. శ్రీ కోడూరి రామమూర్తిగారు జానపదభౌతిక సంస్కృతికి జానపదప్రదర్శనకళలకు సంబంధించిన వస్తుసంపదను కొల్లలుగా సేకరించినారు. తెలుగు ప్రపంచమహాసభలు జరిగినపుడు (1975 ఉగాది) ఈ సంపద 'తరతరాల తెలుగు'గా ప్రదర్శింపబడినది. సుప్రసిద్ధ చిత్రకారులు సిద్దిపేట వాస్తవ్యులు శ్రీ కె. రాజయ్యగారు మన ప్రాచీనజానపదచిత్రములను సేకరించినారు. సుప్రసిద్ధచిత్రకారులు, కళావిమర్శకులు పరిశోధకులు శ్రీ జగదీశమిత్తల్‌గారు జానపదకళావస్తువులను తెరపటములను పడగలను సేకరించి తమ మ్యూజియంలో నుంచినారు.

నా పరిశోధనకాలమున తెలంగాణమంతయు తిరిగి సేకరించిన కొన్ని పాటలను చిన్న సంకలనములుగా ప్రకటించినాను. 'తెలంగాణా పిల్లల పాటలు' (చందా నారాయణశ్రేష్ఠి, సికింద్రాబాదు 1960) పిల్లలపాటల సంకలనము. దీనిలో 58 పిల్లలపాటలు పరిచయవాక్యములతో పాడినవారి యూరుపేరులతో టిప్పణులతో నున్నవి. The Institute of Indo - Middle East Cultural Studies సంస్థ పక్షమున జరిగిన గోష్ఠిలో నేను చదివిన 'Moharram Folksongs in Telugu' అను వ్యాసము పీరీలపండుగ పాటలు ఇంగ్లీషు అనువాదముతో 1964 లో అచ్చయినది. గురుదేవులు ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారి షష్ట్యబ్దపూర్త్యుత్సవముల సందర్భమున (1968) వారికి అంకితముగా 227పాటలు, పాడినవారి యూరుపేరులతో తేదీలతో పరిచయములతో టిప్పణులతో 'తెలంగాణా పల్లెపాటలు' ప్రథమభాగముగా ప్రకటించినాను. నేను సేకరించిన కొన్ని జానపదకథల యాంగ్లానువాదము Sterling Publishers వారు Folktales of Andhra Pradesh పేరుతో 1974 లో ప్రకటించినారు.

సుమారేబది వ్యాసములు తెలుగులోను ఇంగ్లీషులోను వివిధపత్రికలలో ప్రకటించినాను. **National Book Trust** వారికి **Folklore of Andhra Pradesh** అను గ్రంథమును వ్రాసి యిచ్చితిని. ఇది ఇటీవల జరిగిన కృషి. మరికొందరు ఈ రంగమున కృషి చేసినవారిని పొరపాటున విడిచియుందును. అది నా జ్ఞాపకశక్తిలోపమే గాని తెలిసిచేసిన యపచారము గాదని మనవి.

# పౌరాణిక గేయములు

జానపదగేయములుకూడ శిష్టసాహిత్యము వలెనే వివిధపురాణేతి వృత్తములు కలవి, బహుళప్రచారమందున్నవి. సంస్కృతవిషయ మెట్లున్నను ఆంధ్రమున మాత్రము శిష్టసాహిత్యమందలి వస్తువు జానపదగేయములందలి వస్తువు ఈ రెండును ఒకదానికొకటి సహాయపడిన ట్లాధారములు కలవు. స్వయముగా పాల్కురికి సోమనాథుడు బసవపురాణరచనమునకు మూలము ప్రజలందు ప్రచారముననున్న భక్తులచరిత్రములని చెప్పియున్నాడు. కనుక ఈ పరిస్థితి కొంత తక్కిన గ్రంథములకు గూడ కలిగియుండునని తలంచినచో దోషమేమియు లేదు. ఈ యభిప్రాయము సమంజసమైనదే కావచ్చు ననుటకు బలము కూర్చునది సంస్కృతమున లేని విషయము లాంధ్రానువాదమున నుండుట. ఇట్టి మార్పులు సంస్కృతమునుండి ఆంధ్రానువాద మొనర్చిన శిష్టులు చేసిన తరువాత నాగాధలు విని జానపదులు వానిని స్వీకరించిరో లేక జానపదులలో ప్రచారమందున్న ఈ మూలభిన్నవిషయములు తమకు రుచించుటచే పండితులు చేపట్టిరో ఇదమిత్థముగా తేల్చి చెప్పుట కష్టము. కేవలమూహింప వచ్చును; కొంత తర్కింపవచ్చును. అంతియ. జానపదగేయములలో మన శిష్టసాహిత్యమందున్న ప్రసిద్ధపౌరాణికగాధలన్నియు కలవు. ఇంక కొన్ని విశేషములతో గూడ కలవు. పౌరాణికగాథలపై మన ప్రజానీకమునకున్న భక్తి చెప్పరానిది. వేదవిజ్ఞానము సామాన్యజనమున కందనిది. అందును అది ప్రభుసమ్మితము. కనుకనే మన పూర్వులా వేదములందలి యమూల్యోపదేశములను తీరుతీరులుగా పండితుడు మొదలు పామరుడు వరకును గ్రహించునటుల పురాణాదులలో సుహృత్సమ్మితముగా రచించిరి. అక్షరాస్యులా యాగమార్థముల వివిధపురాణములవలన నెరిగి ధన్యులైరి. శిష్టుల రచనలు పండితులకు పరమార్థమును సాధించిచూపిన జానపదగేయములీ జ్ఞానామృతమునే పామరులకు వారికి తెలియునట్టి భాషలో వారి చిత్తవృత్తుల కనుకూలముగా నుండున ట్లందించినవి. వారివారి చిత్తవృత్తుల ననుసరించి ఆయాకథలందు వింతవింత

మార్పులు కలిగినవి. కూర్పులు కుదింపులైనవి. ఒక కథకు కాళ్లు వచ్చిన మరియొకదానికి కొమ్ములు పెరిగినవి. మార్పులు కూర్పులెట్లున్నను ఈ గేయములే మన జాతీయతను నిలిపినవి. నేటి భారతదేశమున పామరులైన జానపదుల సంఖ్య నూటికి తొంబది. తక్కిన పదిమందిలో సగము పాశ్చాత్య విద్యాప్రభావితులు. ఇక మిగిలిన ఐదుగురే ఆర్షసంప్రదాయబద్ధులు. అట్టి తొంబది మంది జానపదులను గూడ ఆర్షవిజ్ఞాన సూత్రముల - వైయాసిక నాగరకతా సూత్రముల - భారతజాతీయతాసూత్రముల బంధించియుంచినవీ జానపదగేయములే. ఈ విజ్ఞానసూత్రములుకూడ లేకుండినచో భారతదేశమున చొచ్చుకొని వచ్చిన భారతేతరనాగరకత లెప్పుడో భారతీయతను రూపుమాపి యుండెడివి. భారతదేశమందంతటను ప్రాంతప్రాంతమున నాయా ప్రాంతీయభాషా జానపదగేయములందున్న సామ్య మిట్టిదే. కనుకనే భిన్నజాతి, భిన్నభాషా యుక్తములగు ప్రాంతము లుండినను భరతమాతృస్వరూప మఖండజ్యోతివలె ప్రకాశించుచున్నది. వేదముల తరువాత మనకు రామాయణభారతభాగవతములే మాననీయములు. రాముడు కృష్ణుడు ధర్మరాజు భారతీయులకు పూజ్యులు. వారి పేరు తలవని భారతీయు డుండడు. సుఖమునకు దుఃఖమునకు మనకు రామనామస్మరణము తప్ప వేరేమున్నది ? అరికాల ముల్లు నాటినను అరచేత వైకుంఠ మబ్బినను రామచంద్రుడు మనకు కొననాలుక నిల్లుగట్టుకొనును. ఇది భారతదేశమంతటను సమానము. కనుక సంస్కృతమునను ఆదికావ్యమైన రామాయణగాథాప్రభావ మాంధ్రజానపదుల హృదయములపై నెంత కలదో ముందుగా విచారింతము.

## రామాయణ సంబంధములు

శ్రీరామచంద్రు డాంధ్రులకు కన్నతండ్రి. సీతమ్మ కన్నతల్లి. తక్కిన దైవతములకన్న సీతారామచంద్రులకే తెలుగుల హృదయము లర్పితములైనవి. ఆదికవి తన కరుణార్ద్రహృదయమునుండి వెడలిన శోకశ్లోకముల కుశలవులచే గానము చేయించెనట. అది విన్న సంస్కారులు సంస్కృతాది భాషలలో రామాయణములను వ్రాసికొనిరి. కాని తెలుగుజానపదులు స్వయముగా సీతారామచంద్రులనే చూచినట్లున్నారు. ఆ దంపతులు విహరించిన పర్వతములు, వనములు, పర్ణశాల, గోదావరీతటములు మున్నగునవి తమ హృదయములకు

సూటిగా చెప్పిన కథలు తమకు తోచిన రీతిగా మలచుకొనిరీ జానపదులు. పర్ణశాలాప్రాంగణమున పెంచిన లతకూనలకు, సీతమ్మ నీళ్లు పోసినపుడు రామలక్ష్మణులు గోదావరీజలము లందించిరట. అప్పుడా ముగ్గురాడుకొన్న ముచ్చటలు గోదావరి తన గుండెలలో రంగరించుకొన్నది. అదియే గోదావరి గలగలలు. నాటినుండి నేటివరకా గలగలలు వినుచున్న జానపదులకు తెలిసినంత శ్రీరామచరిత్ర పండితులకు తెలియదేమో! జానపదు లప్పుడప్పుడు పాడుకొనగా ఛిన్న చరిత్రము కొంతకు కొంత మాత్రమే భాస్కరుడు పదరకున్న బండ్ల కెక్కింతుననుకొన్న పోతన్న కర్థమైనది. పోతన్న పరిదేవనము కంచెర్ల గోపన్న కవగతమైనది. అందుకే సీతమ్మకు చింతాకు పతకము దొరికినది. ఆపతకమున శ్రీరామచంద్రుని తొమ్మిదికోట్ల ప్రతిబింబములు త్యాగయ్యకు కనబడినవి. అంతియ. తక్కిన లెక్కలు ఆంధ్రజానపదులకు - అందులో సీతమ్మ హృదయ మెరిగిన ఆంధ్రపురంధ్రులకు బాగుగా తెలియును. రామాయణము వారి నోళ్లలో చిలువలు పలువ లల్లుకొన్నది. తెలుగునాట కలముబట్టనేర్చిన ప్రతి మానిసియు పూర్వము రామాయణగాథను తడవెను. శిష్టవాఙ్మయమున రామాయణమూలక గ్రంథముల కున్నంత సంఖ్య యితరములకు లేదు. ఐనను ఇట్టి పండితు లల్లిన రామాయణముల సంఖ్య పరిమితమే. కాని తెలుగు జానపదుల పందిరి కల్లుకొన్న రామాయణలత కాద్యంతములు లేవు. భాస్కరరంగనాథాదులకు తెలియని విశేషములు తెలుగు జానపదులకు తెలియును. ముద్రితములైనవి నాకు లభించి నట్టివే రామాయణసంబంధగాథలు సుమారేబది. అముద్రితములును అంతియ. నా దృష్టికందని ముద్రితగేయములు ప్రజాముఖములందున్న యముద్రితగేయము లింకెన్ని కలవో? కూచకొండ రామాయణము, శారద రామాయణము, ధర్మపురి రామాయణము, రామకథాసుధార్ణవము, మోక్షగుండ రామాయణము, సూక్ష్మరామాయణము, సంక్షేప రామాయణము, గుత్తెనదీవి రామాయణము, అధ్యాత్మరామాయణము, చిట్టిరామాయణము, శ్రీరామదండములు, లంకాసారథి, రామాయణ గొబ్బిపాట, శ్రీ రామజావిలి, అడవి, శాంత, పెండ్లి, సేతుగోవింద నామము లన్నియు రామాయణగాథాపాథఃపరిపూరములు. ఇంకను "విద్ధి, కూచి రామాయణ మారుకాండములు నచ్యుతజాగరవేళ బాడి" నట్టి వెన్ని మృగ్యమై పోయెనో తెలియదు.[1] ఇక రామాయణమందలి కొన్నికొన్ని భాగములనే

1. క్రీడాభిరామము.

తెలుపునవి శాంతాకల్యాణము, పుత్రకామేష్టి, కౌసల్య బైకలు, కౌసల్య వేవిళ్లు, శ్రీరామజననము, శ్రీరాముల ఉగ్గు పాట, రాఘవ కల్యాణము, రాములవారి అలుక, సుందరాకాండపదము, ఋషుల ఆశ్రమం, సుగ్రీవవిజయము, కోవెల రాయబారం, అంగదరాయబారము, లక్ష్మణమూర్ఛ, లంకాయాగము, గుహభరతుల అగ్నిప్రవేశము, శ్రీరామపట్టాభిషేకము, లక్ష్మణదేవర నవ్వు, ఊర్మిళాదేవినిద్ర, కుశలాయకము, కుశలవ కుచ్చలచరిత్ర, కుశలవ కుచ్చెల కథ, కుశలవయుద్ధము, వేపూరి బతుకమ్మ కుశలవపాట, పాతాళహోమము, శతకంఠరామాయణము, వంటివి లెక్కకు మిక్కిలి. ఇంత యెందులకు? తొలుతనే సీతమ్మ తెలుగువారికి కన్నతల్లియని మనవిచేసితిని. ఆయమ సుఖదుఃఖములు తెలుగువారి జీవితములం దంకితమైపోయినవి. ఆమె ఆట యాటగా, ఆమె పాట పాటగా, ఆమె యరణ్యవాసము తమ యరణ్యవాసముగా ఆమె చెర తమ చెరగా ఆమె యగ్నిప్రవేశము తమ యగ్నిప్రవేశముగా జానపదుల హృదయములు వలపోసినవి. ఒక్క సీతాదేవినిగురించి పెరిగిన గేయము లెన్నికలవో చూడుడు. సీత పుట్టుక, సీతాకళ్యాణం, సీత నత్తవారింటి కంపుట, సీత సమర్త, సీత శుభగోష్ఠి, సీత గడియ, సీత వామనగుంటలు, సీతామ్మవారి అలుక, సీత వసంతం, సీత దాగిలిమూతలు, సీత సురటి, సీత మేలుకొలుపు, సీత ముద్రికలు, సీత చెర, సీత ఆనవాలు, సీత అగ్నిప్రవేశం, సీత వేవిళ్లు మున్నగునవి కలవు. ఉదాహృతములైన పై గేయములన్నియు ముద్రితములు; మన పల్లెటూళ్లయందు ప్రచారముననున్నవి. ఇన్ని విషయములు శిష్టులు రచించినట్టి యే రామాయణములందును లేవని నా యభిప్రాయము. ఈ సంపద యంతయు తెలుగు జానపదులకే దక్కినది. ఎంత భాగ్యవంతులు - అదృష్టవంతులీ జానపదులు! అవాల్మీకీయములగు విషయము లెన్నియో రంగనాథ, భాస్కర, గోపీనాథ రామాయణములందు కలవు. పాల్కురికి సోమనాథునివలెనే రంగనాథాదులు ప్రజలనోట విన్నవానిని కూడ తమతమ రామాయణములందు చేర్చియుందురు. అవాల్మీకీయములను జానపదులనుండి రంగనాథాదులు స్వీకరించిరో లేక రంగనాథాదులనుండి జానపదులు గ్రహించిరో తెలియదు. ఒకరినుండి మరియొకరు స్వీకరించిరని తలచుట సమంజసము. జంబుమాలి వృత్తాంతము, సులోచన కథ, కాలనేమి కథ, రావణునకు శుక్రునుపదేశము, రావణుని పాతాళహోమము, మొదలైన కథలు రంగనాథ

రామాయణమున మూలమున లేనివి కలవు. జానపదులం దివికాక నింతకన్న స్వల్పంతలు మూలములో లేని కథలు ప్రచారముననున్నవి. కనుక రంగనాథాదులు తమ కుచితముగా నగుపడిన కొన్ని విశేషములను జానపదులనుండి గ్రహించి తమ రామాయణములందు జొప్పించియుందురని యూహించుట యసమంజసము కాదేమో ! ఏది యెటులైనను ఈ గాథలన్నింటికి రామాయణముతో పనియే లేదంటురా ? ఉన్న రామాయణములో నున్న సంగతులు మాత్రము నిజమా ? అధ్యాత్మరామాయణవిదుల నడుగుడు. రాముడు, రావణుడు, సీత, హనుమంతుడు వీరందరు నొక్కరే యందురు. కనుక పండితులు వ్రాసిన రామాయణాంతర్గత విషయములందు మనకెంత విశ్వాసమో జానపదులకు తాము కల్పించుకొన్న గాథలపై నంతియ విశ్వాసము. కాదనుటకు మనకు హక్కులేదు. ఐనను ఇట పరిశోధింప దలచినది ఏది నిజము ఏది అబద్ధము అని కాదుగదా ! ఇది గాకను రామునిగూర్చి జానపదులకున్నంత యనుభవ మితరులకు లేదని నా నమ్మకము. కర్మ, జ్ఞానయోగముల నతికష్టముతో పండితులకు దెలిసెడు రాముడు పామరులకు భక్తియోగమున సులభసాధ్యుడయ్యెను. జానపదులు తమ రామాయణముల నిట్లు మలచుకొనుటకు కారణమేమై యుండును ? బహుశః వారు పామరులగుటయే కారణము. జ్ఞానప్రవచనములు వారికి సహించవు. ఇచ్చిపుచ్చుకొను పట్ల లెక్కలు కాగితములపై దేల్చియో మనమున గుణించియో జానపదుల నెత్తి కెక్కింపుడు చూతము ? మీరెంతటి లెక్కల పండితులైనను వారు వినరు. చింతగింజలనో చిల్లరాళ్లనో వారిముందు పోసి కుచ్చములుగా, కొత్తలుగా, ఏగాండ్లుగా లెక్కపెట్టిన గాని వారికి తృప్తికలుగదు. దీనికి వారి మనస్తత్వమే ప్రధానకారణము. జానపదకవులు సీతారాములతో తాదాత్మ్యమందిరి. వారికి సీతారాము లవతారపురుషులు గారు. తమ జీవితమే వారి జీవితము, తమ కష్ట సుఖములే యీ పురాణదంపతుల కష్టసుఖములుగ జానపదులు కల్పించుకొని తాదాత్మ్య మనుభవించిరి. తమ దైనందినజీవితమునందలి ప్రతిరేఖయు, ప్రతి కంపనమును ప్రతినిశ్వాసమును సీతారాములవిగనే వారు భావించిరి. తుదకు ఈ కవులు వర్ణించు జీవితవృత్తములు తమవియు కావు; సీతారాములకు సంబంధించి నవియును కావు. కేవలము లోకసామాన్యములు. దీనినే యాలంకారికులు సాధారణీకరణ మనుచున్నారు. వారి మనస్తత్వమెట్టిదో దానికి తగినట్టుగా వారు కల్పించిన రామాయణవిశేషము లెట్టివో ముందు వచ్చును. కీ. శే. సురవరం

ప్రతాపరెడ్డిగారు వాల్మీకిరామాయణమంతయు సమగ్రముగా పరిశోధించి రామాయణవిశేషములను నొక గ్రంథము ప్రకటించిరి. అటులనే యీ జానపదుల రామాయణవిశేషముల నన్నింటిని కూర్చినచో నొక బృహద్గ్రంథ మగును. జానపదగేయపరిశోధనమున నేను చదివిన రామాయణకథాగేయము లన్నింటి గూర్చి వ్రాసినచో నిట స్థలము చాలదు. కనుక కొన్నింటినే యిట చర్చింతును.

రామాయణగాథను సంపూర్ణముగనో లేక అధికభాగమునో చుట్టివచ్చిన పాటలు శాంతగోవింద నామములు, అడవి అనే చరగోవింద నామములు, సూక్ష్మ రామాయణం, పెండ్లి గోవిందనామాలు, లంకాయాగం, శారద రామాయణం, కుశలవకుచ్చల చరిత్ర, రామకథా సుధార్ణవము, శ్రీరామ దండములు, శ్రీమద్రామాయణ గొబ్బిపాట మున్నగునవి. ***శ్రీరామదండములు శ్రీమద్రామాయణము గొబ్బిపాట*** రెండును చిన్నగేయములు. వీనిలో రామాయణకథ క్లుప్తముగా చెప్పబడినది. గొబ్బిపాట్ల కర్త వెంకటరామయ్య యని కలదు. '***సూక్ష్మరామాయణము***' సూక్ష్మరామాయణయే. దీని కర్త కరణము ఆదినారాయణదాసు; తాటీపురగ్రామవాసి. శూర్పణఖను వర్ణించుచు "ముండ్ల వెంట్రుకలు మొండిచేతులది ముసలి రక్కసొచ్చెన్ – ఆసఖియ కండ్లు గచ్చకాయల్, దాని బలుపండ్లు దంతికోరల్, ఘనత పాలిండ్లు రెండు బారల్, అది కండ్లజూచి శ్రీరామలక్ష్మణుల కనుసైగలు చేసెన్, ఆశూర్పణఖ యొడలు మరచి వచ్చెన్" అని హాస్యరసపూరితముగా వర్ణించెను. ***రామకథా సుధార్ణవము***నకు కర్త లాడె సుందరనారాయణ. శ్రీకాకుళ మండలాంతర్గత హీరమండలవాసి. ఇది గేయవచనోభయాత్మకము. ఇందు శ్రీ రామజననమునుండి పట్టాభిషేకమువరకును గల గాథ వర్ణితము. రచయిత చదువుకొన్నవాడుగా దోచును. చక్కని శైలి. రాక్షసులు రావణునితో "సీతమ్మండగు కుంభకర్ణుడొక నిముషము లోపలను – అవనీనాథుల రక్తపూరముల నాపోశనమెత్తు" నని పొగడిరి. భాస్కర రామాయణమున ప్రహస్తుడను రాక్షసుడు విభీషణుతో కుంభకర్ణుగూర్చి యిటులే యనెను. "అవనీనాథుల రక్తపూరముల మున్నాపోశనంబెత్తి జాంబవదాదిత్యతనూభవప్రభృతులం బ్రాణాహుతుల్ చేసి"[1]

---

1 భాస్కర రామాయణము. యుద్ధ – ౧౨౦

తనకు హితబోధ చేయవచ్చిన విభీషణుని జూచి రావణుడు "నీటన బుట్టిన తామరాకులు నీటికంటనట్లు, కలియవు నీ మాహృదయంబులు కడు కపటాత్మ్మడ వగపట" నని నిందించెను. ఈ భావమునకు మూలము,

కం॥ ఉదకము నలినీపత్రము
గదిసియు నెరవైనయట్లు కలయవు నీమా
హృదయములు గజస్నానము
తుది మఱి నీతోడి పొందు దుష్టచరిత్రా.1

గ్రంథాంతగద్యమున గ్రంథకర్త తలిదండ్రులను గురువులను పేర్కొనెను. ఇట్టి గేయములను నిబద్ధదేశిసారస్వతమున చేర్చవచ్చును. *కుశలవకుచ్చల చరిత్ర*మనునది పెద్ద కథాగీతము. దశరథ రాజ్యపాలనమునుండి సీతాదేవి భూగర్భప్రవేశమువరకు జరిగినకథ వర్ణితము. ఇది రచించిన కవయిత్రి యెవ్వరో తెలియదు. చివరన "ఇది వాల్మీకి రామాయణము, తలపున వ్రాసెను అనతి తాను" అని యుండుటచే రచయిత్రి యని తేలినది. వాల్మీకిరామాయణము దలంచి వ్రాయుట జరిగినదని చెప్పకొనెనే కాని యవాల్మీకీయవిషయము లిందు పెక్కులు. చిత్రవిచిత్రములగు కల్పన లున్నవి. రావణవధానంతరము సీతారాము లయోధ్య చేరినతరువాత సీతాదేవి పౌరస్త్రీలతో అంతఃపురకాంతలతో జరిపిన సంభాషణము స్త్రీస్వభావ సహజముగా నున్నది. సీత పౌరులతో "అమ్మలారా మీరందరు నన్ను - తలతుర మరతుర తానలలోను - కాంతరో నీ కడసారపు కూతురు - చిన్నది గద నేవెళ్లెడినాడు-ముగ్గురు బిడ్డల కన్నాదటవే-రేపయినా తోడుకు రమ్మనెను-వెలదిరో నీ పెద్దకొడు కిప్పుడు-వేరుబాసెనా నీతోనయినా-కొమ్మరో నీ కోడలి గుణములు-వింటిని గదనే వేడుకతోను-శాంత చెప్పగా చోద్యములాయె-...... (దాని)-కోరి తెస్తివే అక్కరో నీవూ-అనుభవిస్తివే మక్కువదీరా"-యనెను. పౌరకాంతలు సీత సెలవంది తిరిగి పోవుచు "పదియునాలుగు వత్సరమ్ములూ-వనములు దిరిగిటు వచ్చిన కొమ్మా-మరచిందిగాదే మనలందరనూ-" అని

1 భాస్కర రామాయణము. యుద్ధ - ౧౩౮

కొనియాడిరి. ఒకనాడు సీతారాములు 'చక్కపగడాలు' (పాచికలు) ఆడిరి. అందులో "శాంతారాఘవు లోకవై పైరీ-సీతాలక్ష్మణు లోకవై పైరీ-". ఒకనాడు సీతమ్మ శాంతతో సరసములాడుచు శ్రీరామచంద్రు డెంతసేపు పిలిచినను అంతఃపురమునకు పోదు. శ్రీరాముడు కుపితుడై లక్ష్మణునితో తన విల్లునమ్ములు తెప్పించుకొని వానిని పరిచారికలుగా నొనర్చుకొనెను. ఆ స్త్రీలు "వేడుకతో వింజామర విసరచు - ఆకులమడుపులు అందిచ్చుచునూ-పాదము లొత్తుచు శ్రీరాములకు-కూడియుండిరా రామునితోను-" ఈ సందడి విని "చూచివత్తమని జానకిదేవి - జాలకర్రలా వెంటనె చూచుచు - విభ్రాంతి గొని యిట్లని పలికె-ఏకపత్నీవ్రతుండవు అనుచూ-ఇచ్చెగాక మా తండ్రయితేను-యేకపత్నీవ్రతములు అన్నీ-తెలిసెగదా ఇక్కడ ఈలాగు" అనెను. అది విన్న మాయాస్త్రీలు "యెక్కడిదానవె జానకి నీవు - యెప్పటికి మేమే వున్నాము-అడవులలో నీవు బాసినప్పుడు-అంత వేడుకతో మాతో వుండె-విల్లు విరువగా వచ్చినదానవు-యెక్కడిదానవె జానకి నీవు-" అని సీత నవమానపరచిరి. శాంత వచ్చి రాముని మందలించి జరిగిన విషయము తెలిసికొని ఇరువురికి సంధి యొనర్చెను. ఇది విచిత్రమైన కల్పన. స్త్రీల మనస్తత్వము చక్కగా ప్రదర్శించు ఘట్టమిది. బాణములు (మాయాస్త్రీలు) చెప్పిన సమాధానము చమత్కారముగా నున్నది. ఒకనాడు మిథిలలో జనకుని సభకు నారదుడు పోయి సీతారాముల వనవాసము, రావణవధానంతరము తిరిగిరాక, మున్నగు కథ చెప్పునంతవర కాతని కేమియు దెలియదు. జనకుడు తాను బిడ్డను అల్లుని "అయిదువేల వత్సరముల క్రిందట-అయోధ్యలో నుండగ నేగంటి" ననెను. ఇంత రామాయణము జరిగినను జనకుని కీవార్త లేమియు దెలియకపోవుట యీ పాటలోని మరియొక చిత్రము. బిడ్డను జూచి యైదువేలేం డ్లయ్యెనట. జనకుడీవార్త తన భార్య (వసంత) తో చెప్పుకొని విచారపడుచుండగా యంతర్వత్నియగు సీతను చూడబిలుచుటకై అయోధ్యనుండి వార్తాహరులు వచ్చిరి. జనకు డయోధ్యకు ప్రయాణమగుచుండ వసంత (రాణి) తానుగూడ వత్తునన వద్దని ఒక్కడే వెడలెను. జనకు డయోధ్యనుండి తిరిగిపోవునప్పుడు సీతమ్మను పంపవలసినదిగా కోరెను. కాని రాముడంగీకరింపడు. ఎవరెంత బతిమాలినను వినడు. జనకుడు కుపితుడై వెడలిపోయెను. పుట్టినింటికి తననంపడయ్యెనని సీత యలిగెను. సీత యలుక దీర్చి శ్రీరామచంద్రుడు

వేటకు సిద్ధమయ్యెను. సీత వలదన్నను రాముడు వేటకు పోయెను. ఈ సందర్భమున నీగేయములో నొక యద్భుతకథాకల్పన మున్నది. ఇది జానపదుల చిత్తవృత్తిని విశదీకరించునట్టిది. చూలాలగు సీతాసాధ్విని కనికరము వీడి రామచంద్రుడు కానల కంపెనని మనమెరిగినదే. దీనికి కారణమేమి? చాకిదాని కొట్లాటయని పండితు లందురు. ప్రజలందు వ్యాపించిన ప్రవాదమునకు తట్టుకొనలేక రాముడు సీత నడవికి పంపెనను పండితులకు రామచంద్రునిపై భక్తి ప్రజావాక్కుపై నిరాదరము. జానపదులీ సీతావనవాసకారణ మెంత బలవత్తరముగా కల్పించిరో చూడుడు.

సీతావనవాసమునకు రాముడుగాని, సీతయుగాని ప్రజలుగాని సమాధానము చెప్పజాలనంత బలవత్తరమగు కారణ మొకటి కలదు. రాక్షస మాయలకు దేవతలు కూడ ఎన్నియో మారులు మోసపోవుట మన మెరుగుదుము. రాముడు స్వయముగా తానెన్నిమారులు వంచితుడు కాలేదు? రాముడు సన్యాసి వేషమున వచ్చిన రాక్షసరాజు కతిథిసత్కారము చేసినట్లు భాసుని ప్రతిమా నాటకములో గలదు. మాయలేడివలె వచ్చిన మారీచుని యెత్తుగడలో కావలసినంత మోసము జరిగినది. ఇంద్రజిత్తు మాయసీతను వెచ్చి తల నరిగి రామాంజనేయుల నేడ్పించెను. సీతకు శాంబరీమాయచే కల్పితమైన శ్రీరాముల శిరోధనువుల జూపించి రావణుడెంత వెరపింపలేదు? విభీషణుడు తన పక్షమున లేకున్నచో రామలక్ష్మణు లింకెన్ని మాయల జిక్కువడియుందురో? రాక్షసులు చేయజాలని మోసము లేదు. రామరావణయుద్ధములో నెందరో హతులైరి కాని చుప్పనాతి బ్రతికిపోయినది. శత్రుశేషము పనికిరాదను పెద్దలమాట యర్థము లేనిదా? శూర్పణఖ సామాన్యురాలు కాదు. ఒకపరి ముక్కుచెవులు కోతపడినను దానికి రామలక్ష్మణులపైనున్న మోహ ముపశమింపదయ్యె. మొదటకూడ తన కడ్డుపుల్ల సీతాదేవి యని భావించినది. అందుకే రావణున కామెపై మోహము కల్గించినది. కాని యాప్రయత్నము విఫలమగుటయేకాక రాక్షస సంహారము పెద్దయెత్తున జరిగినది. సీతారాము లెప్పటివలెనే యుండిరి. ఇప్పుడు శూర్పణఖ వారిపై పశుబల ముపయోగింపలేదు. బుద్ధిబలము నాశ్రయించినది. రామునకు నచ్చునంతటి మోసము చేసినగాని సీతకు విపత్తు కలుగదని తలంచినది. అప్పుడుగాని చుప్పనాతి కసి తీరదు. అది అసలే

మాయలమారి, అందులో బుద్ధిబల ముపయోగించినది. ఎండుగడ్డికి నిప్పంటు కొన్నట్లయినది. దాని ప్రతాపము చూడుడు. ఏమనుచున్నదో! "వాడిగట్టి చుక్కల నేరగనేర్తు – ఏరినచుక్కలు విడువగనేర్తు – పారెడు పిడుగుల బట్టగ నేర్తు – పట్టిన పిడుగుల విడువగనేర్తు – మంచు కుంచాన బోసి కొలువగ నేర్తు – అరచేయి పాత్రగ వాడగనేర్తు – వాన త్రాడుగా పేనగ నేర్తు – మడుగుపై చెంగు వేసి నిద్రింపనేర్తు – చట్రాత పత్రి కొయ్యగనేర్తు – బోడ తలకు బొద్దుమల్లెలు ముడువగ నేర్తు – మోకాటావగింజ విరువగనేర్తు – ఉసిరి కాయ దొంతులు పెట్టగనేర్తు – ఆలుమొగల నెడబాపగనేర్తు – చింతలెక్కి చిగురు గొయ్యగనేర్తు–సీతారాముల కెడబాపగనేర్తు." నిజముగా సీమాయలమారి యన్నంత చేయగల సమర్థురాలు. స్వసమయమునకై చూచినది. "కావి వస్త్రములు కట్టుక మేన – దండకమండలువును దాల్చి – యతివేషము తా తప్పక దాల్చి"నది. అయోధ్య చేరినది. రామలక్ష్మణుల సందర్శించి కొంత విద్య ప్రదర్శించినది. వేటాడబోవు రామచంద్రుడు తొందరలో లక్ష్మణుడు వలదన్నను "అయినా యీ యతి ఆడది గనుక – సీత శాంతకడకు తోడుక పొమ్మ"నెను. అంతఃపురమందా రాక్షసికి యడుగులకు మడుగులొత్తి గద్దెపై కొలువుంచిరి. శాంతమ్మ కిది నచ్చలేదు. సీతమ్మ మాత్రము యతికి "అచ్చ రత్నంబులు మాణిక్యంబులు – కనకపుచీరలు కట్నా లిచ్చినది". యతికీ కట్నములు నచ్చవయ్యె. "చోరులు చూచిన నపహరింతురూ – రాజులు చూచిన తల గొట్టుదురూ" కనుక ధనము నాకక్కరలే దనినది. కాని "రావణుపటమూ వ్రాసియిచ్చితే – బ్రతుకుదు నేనీలోకములోనూ" అని కోరినది. జానకి గుండె గుభాలు మనినది. ఈ విపరీతపుకోర్కె యేమిటో సీతకు తెలియలేదు. తనకు తెలియదన్నను అంతఃపురమున నొత్తిడి జరిగినది. అప్పుడామె "పదినెలలు చెరనుంటిని గాని – పాపకర్ముని కన్నుల జూడ – జనకునిగా భావిస్తిని నేను – అంగుష్ఠ మొక్కటి యెరుగుదు నన్న"ది. "అంగుష్ఠము తా జానకి వ్రాసి"నది. యతికి కావలసినది లభించినది. ఆమె యా పటము గొని వెడలిపోయెను. "ఆ మీదట యతి అంతా వ్రాసె – కాళ్లు వేళ్ళు పిరుదులు పిక్కలు–ఆ భాగము లన్నియు వ్రాసె – ఎరుపు నలుపు తెలుపు వన్నెలు – పేర్లు పేరుకొని చెక్కెను దాన్ని." పటము పూర్తి చేసికొని చుప్పనాతి బ్రహ్మసన్నిధికి పోయి బతిమాలి, "అన్న చచ్చిపోయి ఆరునెలలాయె – నాటినుండి నే నన్నను గాన – అన్న

మాపగా జూచుకొందును - పటముకు ఆయుస్సు పోయుమని పలికి" నది. బ్రహ్మదేవుడీ యేడ్పు నిజమనుకొని కనికరించెను. చేతనైనపని గనుక బ్రహ్మదేవుడు పటమునకు ప్రాణము బోసెను. శూర్పణఖ పటము నయోధ్యలో విడిచి తనదారిని తాను పోయినది. అనుకొన్నంత చేసినది. ఇంక నా "పట మొచ్చి ముందర నిలుచుండి - రావే పోదము లంకకు ననుచు - సీతను బట్టుక ఆపదబెట్టెను - జానకి బట్టుక యీడ్వదొడంగెను". అంతఃపురమువారా విపరీతము జూచి "పాడునూతిలో పటమటు వేసిరి - పాషాణమ్ములు పైద్రోసిరిగా - పాషాణమ్ములు పగలదన్నుక - పరుగున వచ్చెను పట మక్కడికి - గొప్పజ్వాల లప్పుడు గావించి - అందులోను పటమప్పుడు వేసిరి - అగ్నియంత చల్లార్చుక నప్పుడు - పరుగున వచ్చెను పట మక్కడికి - రావే పోదము లంకకు ననుచు - జానకి పట్టుక నీడ్వదొడంగెను——". ఇది జరుగునప్పుడు రాము డయోధ్యలో లేడు. అతడు వేటనుండి తిరిగిరాకపూర్వమే చుప్పనాతి యింత చేసిపోయినది. సీతాసాధ్వి చివరకు శ్రీరాముపై ఆనలుంచి పటమును తన మంచములో పరుపు క్రింద నణచిపెట్టెను. అది రామునానపై కదలక పడియుండినది. సద్దణగినది. రాముడు తిరిగివచ్చిన పిమ్మట అంతఃపురమువా రెవ్వరును రామునికీ వైపరీత్యము చెప్పలేదు. రహస్యమును కప్పిపుచ్చిరి. స్త్రీస్వభావ మిట్టిదేకదా! కాని యారాత్రి రాముడు జానకి సరస పడుకొనియుండ "పడద్రోసెను రాముని యాపటము" సీతమ్మ సరసము లాడుచున్నదని రాముడు తొలుత భావించి "ఆడుదురు పాడుదురు నవ్వుదురుగాని - పడద్రోసుట లివి సరసములటవే" యని మంచముపై గూర్చుండెను. కాని యాపటము రాముని కెదురుగా వచ్చి నిలుచుండెను. ఇంకేమున్నది! రాముని కనుమానము కలిగినది. అతడెవరెన్ని చెప్పినను వినలేదు. తత్ఫలితముగా సీతాసాధ్వికి మరల నరణ్యావాసమైనది. సీతారణ్యావాసమునకు జానపదులు చెప్పెడు కారణమిది! ఎంత చిత్రముగా మలచినారీ కథను! వారి మనస్తత్వమున కనుగుణముగా మలచుకొన్న కథ యిది. జైన రామాయణములందును, బెంగాలీ రామాయణములందును ఇట్టి కల్పనలే ఉన్నవందురు. తమిళమందును ఇట్టి జానపదగేయము లున్నవట. ఈ పాటలో నింకను రెండు మూడు చక్కని కల్పన లున్నవి. విస్తరభీతిచే మానుచున్నాను. యతి యొనర్చు ప్రదర్శనములు చూచుటకై పౌరకాంతలు

ఇరుగుపొరుగువారు అంతఃపురమునందు చొచ్చుకొని రాగా, శాంత వారిని చూచి "అతికోపమ్మున ఇట్లని పలికె—అత్తింటి కోడండ్లు గారబె మీరు—ఆజ్ఞ (అగ్ని) శిక్షలు లేవా మీకు – పసిబిడ్డలు పాలకు యేడవరే – బావల మరుదుల ఆజ్ఞలు లేవే – రాచనగరికి అడ్డులేదాయెనె – సంతసోవి డాయెను మీకెల్ల – దశరథులూ చనిపోయినవెనుక – సంతసావిడీ మీకందరికీ" అని కోపగించెను. అప్పుడు వచ్చినవారందరు భయపడి వెడలిపోయిరి. ఇది స్త్రీల చిత్తవృత్తిని సూచించు సహజవర్ణనము. మరియు ఆడకూతురు తన పుట్టింట నెరపు ప్రభుత యిందు ద్యోతితము. సీత నడవికి చంపబంపుటకు రాముడు కృతనిశ్చయుడై యుండగా కౌసల్య శాంత మున్నగువా రెంత చెప్పినను వినడు. అప్పుడు ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తి మున్నగువా రేకమై రామునితో మాటలాడ సిద్ధమైరి. వారు శాంతను చాటుచేసుకొని బావగారితో నిట్లు మనవిచేసిరి. "అక్క మాత్రమే కాదు చూడుడీ – ఒక్కయింటనే పుట్టినవారము – ఒక్క యింటనే చొచ్చిన వారము – రావణునిపై మోహము లిప్పుడు – అక్కకు మాత్రమే కాదు చూడుడీ – మాకందరికి కలిగున్నవి దేవ – అందరినీ తెగటార్చుం డనిరి – సీత చేసిన నేరము చెప్పక – చంపనీయము మిమ్మని పలికిరి". ఇది వారి సోదరీ ప్రేమకు తార్కాణము. అప్పుడు రాముడు మండిపడి దగ్గరనున్న ఋషులతో "జనకచక్రవర్తి కూతుళ్ల మహిమలు – తెలిసెగదా మీకందరి కనెను". ఇవి చెప్పిపొడువు. ఈ కథలో కుశకుమారుని జననముగూర్చి వింతకథ యున్నది. విస్తరభీతిచే వివరించుటలేదు.

రామాయణకథను వర్ణించు పెద్ద రచనములందు "*శారదరామయణ*" మొకటి. శారదకాండ్రు పాడి వినుపించునదన్నమాట. శారదకాండ్ర పదము లంత్యనియమములతో నుండుట ప్రత్యేకత. ఈ శారదరామాయణమున దశరథుని పుత్రకామేష్టి మొదలు రావణవధానంతరము శ్రీరామపట్టాభిషేక పర్యంతముగల కథ యున్నది. ఇది వాల్మీకిరామాయణానుసారముగా చెప్పబడినదట. "శ్రీరామచంద్రుని చరితంబు, వాల్మీకి రామాయణంబు, కథాసారముగా జేర్చి బలు డంబు, గులకగా మంచి మృదువగు పదంబు, చేర్చి కూర్చితినీ శారదపదంబు, సేతురాముని పదంబు, రామభక్తకవి చెప్పు కథనంబు, వినవినగ వేడుకను మధురంబు" అని చివరన గలదు. రచయిత రామభక్తకవియట.

రచయిత కొంత చదువుకొన్నవా డగుటచే నక్కడక్కడ చక్కని వర్ణనములు వచ్చినవి. కొన్ని యౌచిత్యరహితవర్ణనలును కలవు. సీతను గోలుపోయిన రాముడు "తరమా - దాని సోయగం బెన్నగ తరమా - మరి పరరూపమైన సుందరమా - దాని పలుకులును కోకిలస్వరమా - చూడ సొగసైన కంబుకంధరమా - దాని కుచగిరులు ఎంతో సుందరమా - దాని కెమ్మోవి అమృత సాగరమా - దాని పలువరుస ముత్యాల సరమా - దాని మేనెల్ల మేల్మిబంగరమా - తలచుకుంటేను మది నిల్వతరమా - బ్రహ్మరుద్రాదులకు నెన్నతరమా - ఇదేగద చూడ శోకసాగరమా -" యని విలపించుట ప్రబంధమార్గము ననుసరించి నట్లున్నది. ఇందాంజనేయుడు లంకాపురస్త్రీలను వర్ణించు ఘట్టము సుందరముగా నున్నది.

రామాయణకథాగేయములందు *లంకాయాగము* పాట బహుళ ప్రచారము గల గేయము. కైకమ్మ కోరిక ప్రకారము రాము డరణ్యావాసమునకు బయలుదేరగనే లక్ష్మణుడు తల్లియగు సుమిత్రతో "మాయన్న మాపదినె పదునాలుగూ యేండ్లు వనము ప్రవేశమమ్మా - వారి వెంటా నేను తల్లి వెళ్లతాను దీవెనలు ఇవ్వవమ్మా-" యని కోరగా కన్నకడుపైనను సుమిత్ర "శ్రీరాములు తండ్రిగా సీతమ్మ తల్లిగా భావింపు లక్షుమన్నా - ప్రొద్దు ప్రొద్దున లేచి పదినె పాదంబులకు దండమైనా బెట్టుము - తోటలా పండ్లన్ని దొన్నెలో బెట్టుకొని మీదుగా దెచ్చి యిమ్ము - పదునాలుగూయేండ్లు తర్లిపోయిన మీరు కలయరంచని పలికెను". రామునితో అరణ్యావాసమునకు కౌసల్య తాను బయలుదేరెద ననియెనే కాని సుమిత్ర మాత్రము పుత్రవియోగమునకు సిద్ధపడి అన్నగారి సేవలు చేయుమని దీవించి పంపుట యామె గొప్పతనమును సూచించును. రాముడు వలదన్నను సీతమ్మ "మాను పారిన తీగ మాను తప్పిన వెనుక మరియెట్లు నిల్వగలదూ, చమురు లేని దివ్వె ఎంతకాలముదాక వెలిగేది యని పలికెనూ -". సీత రాముని వెంబడి బయలుదేరినది. లక్ష్మణునితో నూర్మిళ తానుగూడ వత్తుననెను. కాని "బావ నడచిన మార్గమున నడువరాదందురు యేలాగు వేగింతునూ - బావ మాట ధ్వని భూమిపయి వినరాదు యేలాగు వేగింతునూ" అని లక్ష్మణుడామె నొక వ్రతము పట్టుమని చెప్పి యడవికి పోయెను. పర్ణశాలలో నుండగా నొకనాడు సీతమ్మ నేనొంటిగా నుండజాలను; చెలికత్తెలను తెండని

రాముని కోరగా నీయడవిలో నేనెటు తేగలనని రాముడనెను. అప్పుడు సీతమ్మ మాతండ్రి సముద్రునిచెంత నేను చిన్ననాడాడుకొన్న పగడశాల లున్నవి తెప్పింపు డనెను. రాముడు కమ్మపై కత్తితో వ్రాసి కాకి కాలుకు గట్టి సముద్రునికి వర్తమాన మంపెను. సముద్రుడు పగడశాలలు పంపించెను. సీతారాముల కాహారమునకై లక్ష్మణు డరణ్యమున పండ్లు తెచ్చియిచ్చెడువాడు. కాని ఒకనాడైనను లక్ష్మణుని పిలచి "ఇద్దరిలో నొకరైన రమ్మని వొకపండు చేతిలో పెట్టరైరి."

ఒకనాడు లక్ష్మణుడు పండ్లకొర కడవిలో తిరుగుచుండెను. శూర్పణఖ కొడుకు(చక్రభూపాలుడు) ఘోరతపమొనర్చుచుండెను. చంద్రుడాతని తపమునకు మెచ్చి ఒక యద్భుతఖడ్గము బంపెను. లక్ష్మణునకా ఖడ్గము దొరికినది. దాని నాతడు పదును చూచుకొనుటకై ప్రాంతమున నున్న వెదుళ్లగుంపు నరికెను. దానిలో కూర్చుండి తపము చేయుచున్న చక్రభూపాలుడు తెగిపడి రక్తము ప్రవహించుచుండ లక్ష్మణు డది చూచి తాను పొరపాటున నొక తాపసిని జంపితినని బ్రహ్మహత్యకై వగచుచు నా ఖడ్గముగొని యన్నకడకు పోయెను. ఆ ప్రాంతమున నున్న పిల్లలు కొందరు పోయి శూర్పణఖతో నామె కొడు కొక 'జోగి' వానిచే (లక్ష్మణునిచే) చంపబడిన వార్త వినిపించిరి. ఈ కథ యవాల్మీకీయము. దీనియందలి యనౌచితిని కొంత తీసివేసి రంగనాథుడు చేపట్టి జంబుని వృత్తాంతము చక్కగా దిద్దియుండును.[1] అవాల్మీకీయములైన వింతలు జైనరామాయణములం దున్నవందురు. కాకతీయుల తొలికాలమున ఆంధ్ర దేశమునను జైనము బాగుగా వ్యాప్తియందుండెను. అంతకుపూర్వమే కన్నడమున జైనప్రభావ మున్నది. రంగనాథుడు కూడ ఈ ప్రభావమునకు లోనై యుండును. శూర్పణఖ భర్త విద్యుజ్జిహ్వుడు. రావణుడాతని చంపియుండెను. విద్యుజ్జిహ్వుని కొడుకు జంబుకుమారుడు. తమకు గలిగిన పరాభవ మీగికొన నాతడు సూర్యునిగూర్చి ఘోరమైన తపమొనర్చుచుండెను. అతని చుట్టు పుట్టలు పెట్టి వెదుళ్లు మొలచెను. అతని తపమునకు మెచ్చి సూర్యుడు దివ్యఖడ్గమంపగా జంబుడు, స్వయముగా సూర్యుడు వచ్చి ఖడ్గము తనచేతి కీయడయ్యెనని దాని

1. రంగనాథరామాయణము, పుట ౧౩౪.

గ్రహింపక తప మొనర్చుచుండెను. లక్ష్మణున కది లభించినది. అతడు కత్తిపదును చూచుటకా వెదుళ్ళగుంపు నరికెను. జంబుడు చచ్చెను. రంగనాథు డొనర్చిన మార్పు సూర్యునిగురించి తపమొనర్చుట బాగుగా నున్నది. జానపదులు చంద్రునిగూర్చి తప మొనర్చినట్లు పాడుకొందురు. కుమారుని మరణవార్త విని శూర్పణఖ కోపముతో రామలక్ష్మణులకడకు వచ్చెను. వారి దివ్యమోహన సౌందర్యమును చూచి శూర్పణఖ కోపము కామముగా మారెను. ఆమె తన్ను చేపట్టుమని రాముని గోర నాతడు "ఇంటి పూరి తీసి ఇటు మళ్లుమనుచును వీపున వ్రాలు వ్రాసెను"ను. ఆమె యావ్రాలును లక్ష్మణునికి చూప నాతడు అన్నగారి యాజ్ఞచొప్పున నామె ముక్కు చెవులు తరిగి పెట్టెను. రావణునితో తనకు కలిగిన పరాభవము చెప్పుకొనుటయే కాక శూర్పణఖ ఆతనికి సీతపై వ్యామోహము కలిగించెను. సీతను "మండోదరికన్న మరి చక్కనీ కన్య! లోకాన లేదురన్నా" యని వర్ణించి, రామలక్ష్మణులు "పొద్దున్నె పోదురూ మాపటికి వత్తూరూ మరి దిక్కులేదురన్నా" యని రావణుని పురికొల్పినది. సీతమ్మ నపహరింప వచ్చిన రావణుడు మూర్ఛితురాలై యున్న సీతను ముట్టక "ఉదయశూలము దెచ్చి గడ్డతో పెకలించి రథముపైనా యుంచె"నట. లంకలో సీతమ్మ అశోకము క్రింద సశోకయై విభీషణుని పుత్రిక (త్రిజట) తో తన నపహరించినగాధ చెప్పుకొనును.

"వేగుచుక్క వినుమ వెడలు శృంగారు బంగారుబొమ్మ వినుమా, తీగమెఱుపా వినుమ చీకటింటద్దమా విభీషణుని పుత్రి వినుమా" యని తనగాధ చెప్పుకొనెను. వేగుచుక్క, తీగమెఱుపు, చీకటింటియద్దము శబ్దములందలి సారస్యము గొప్పది. విభీషణుని పుత్రిక సీతమ్మకు తన కష్టాల రాత్రిని తొలగించు వేగుచుక్కగా భాసించినది. చీకటిలో మెరయు శంపాలతికవలె (మార్గదర్శిని) తోచినది. ఆయసురకన్య యందమును గూడ ఈ శబ్దము చిత్రించును. రాక్షసులకొంపలు చీకటిండ్లు. అంతయు నిశి యనగా రాక్షస మయము. అందులో విభీషణుని పుత్రిక 'చీకటింటద్దము'. అసురకన్యయైనను హృదయము దర్పణమువలె స్వచ్ఛమైనదని భావము. ఈయమ పెంటపై మొలచిన తులసిమొక్క. విభీషణుపుత్రిక కప్పటికే రామాదులు వాలిని చంపి

సుగ్రీవాదులతో వచ్చెడు వార్త తెలిసినది. ఆ విషయములు చెప్పి యామె సీతమ్మ నూరడించినది. రామునాజ్ఞచే సీతను వెదకవచ్చిన హనుమంతుడు సీతతో "వాలిసుగ్రీవులకు మేనల్లుడను నేను వల్లభుల బంటునమ్మా" యనెను. ఆంజనేయు డాకలిగొని యశోకవనమున నొక ఫల మిప్పింపుమని సీతను కోరగా సీత "ఇనుప గుగ్గిళ్లవి విషముష్టిపండ్లు అవి అంటరాని గరళ"మని పద్దనెను. రావణుని శక్తిచే మూర్ఛితుడైన లక్ష్మణుని గాంచి రాముడు విలపించు ఘట్టము కరుణరసపూరితము. "......యింకెన్ని జన్మాల తపసునా నీవంటి ఆత్మబంధుడు గల్గునూ, వినవోయి లక్ష్మణా సీతవంటి స్త్రీని పడయంగవచ్చు గాని, అరణ్యవాసములు యవనిజకు తనకునూ ఆహారనిద్రలేక, యిటువంటి సోదరుడు తనకెట్లు కల్గునో యెన్నిజన్మాలకైనా,......జడలొల్లిక తపసు చరియించి నీవిపుడు యెందుపోతివి లక్ష్మణా.......భరతు పట్టముగట్టి పారిపోదలచితివి పగవాన్ని గాను నీకు, ఉప్పుకోసము వచ్చి సుగ్రీవుడా నేను కప్పురము గోలుపోతి, ఆలికోసము వచ్చి జాంబవా నేనిపుడు అనుజుణ్ణి గోలుపోతి, ధరణిసుతకై వచ్చి నీలుడా నేనిపుడు తమ్మున్ని గోలుపోతి, యేలోకానికి పోతివో తమ్ముడా ఆలోకమునకు నన్నూ, గొంపొమ్ము లక్ష్మణా కూడి వస్తిమి మనము కూడియుండుట ధర్మము". ఈ లంకాయాగము పాటలో నవాల్మీకమగు రావణుని పాతాళహోమప్రసక్తియు గలదు. సుగ్రీవపట్టాభిషేకా నంతరము రాముడు లయోధ్యకు తిరిగి చేరుకొనునంతదనుక నీ పాటలో వర్ణింపబడినది.

రామాయణకథ నధికభాగము జెప్పునవి మరి మూడు పాటలు : పెండ్లి గోవిందనామాలు, శాంతగోవిందనామాలు, అడవి అనే చరగోవిందనామాలు. గోవిందనామములను పేరు ఈ పాటలలో ప్రతిచరణము చివరన గోవిందా యను పదముండుటవలన గలిగినది. స్త్రీలు (అధికముగా వితంతువులు) గోవిందనామస్మరణము చేయుచు రామాయణగాథను చెప్పుకొను పాటలివి. ఈ మూడుపాటలం దనేకాచారవ్యవహారములు కలవు. అవి సాంఘికవిభాగమున చర్చింపబడును. ***పెండ్లి గోవిందనామాల*** పాటలో శ్రీరామజననమునుండి సీతావివాహమువరకు జరిగిన గాథ వర్ణితము. రాముదులు "వక్కో-మాసమున పత్తిగిల నేర్చిరి – రెండోమాసమున కూర్మము నిలిపిరి (కూర్మాకారముగా

ప్రోగిలబడిరని కాబోలు) మూడోమాసమున పెదవుల విరిచిరి - నాలుగో మాసమున నవ్వులు నేర్చిరి - అయిదో మాసమున ఆటలు నేర్చి"రట. రామ లక్ష్మణభరతశత్రుఘ్నులకు వివాహము జరుగు ఘట్టమున అలుక సమయమున పెద్దవారికి ముగ్గురికి అలుక కట్నములు లభించినవి కాని శత్రుఘ్నునికి జనకుడు అలుకకట్న మీయలేదు. శత్రుఘ్నుడు బిడియపడక చేయిచాచి కట్న మడిగెను. కాని జనకుడు "కడసార్ని పుట్టిన - కాంతను పెండ్లాడి - తగవు సరికాదురా - ధనము లివ్వం మేము" అనెను. చిన్నబిడ్డ గారాల కూతురు కదా! ఆమె నిచ్చుటయే ఘనమైన కార్యము; ఇంక కట్నము లిచ్చుటెందులకని యర్థము.

*శాంతగోవిందనామాలు* పాటలో శ్రీరామవివాహమువరకుగల కథ వర్ణితము. ఈపాటలో ప్రధానపాత్ర శాంత. అందుకే దీనికి శాంత గోవిందనామాలను పేరు వచ్చియుండును. లక్ష్మీనారాయణులు క్షీరసాగరమున పవళించియుండగా అష్టదిక్పాలురు వచ్చి రావణుని ఘోరచర్యలు నివేదించి యభయము వేడిరి. ఆదిలక్ష్మి వారి కభయ మిచ్చి శ్రీమన్నారాయణునితో "భూమి మీదను పుడుదు-భూమి మీద పెరుగుదును-జనకునింటా బుట్టి-జాతకం వ్రాయింతు-మరి పన్నెండేండ్లకు-మిమ్ముల కలియుదు"నని చెప్పి సెలవుగొని లంకయం దొక కొలనులో నున్న కమలమున ప్రవేశించెను. శివపూజార్థము రావణునకు కమలములు గోసితెచ్చెడు భటు లానాడు సీత చొచ్చియున్న కమల మంటబోయి దానినుండి మాట విని భయపడి రావణునితో చెప్పిరి. స్వయముగా రావణుడే వచ్చి కమలము గోసెను. అప్పు డందునుండి "ఎక్కడి నరుడవుర-నా శిరసు ముట్టితివి-నిన్ను నీ బలగముతో - తెగటార్తు" నను ధ్వని వెడలెను. రావణుడా కమలము నట్లే కొనిపోవుచుండ భారమయ్యెను. అతడు మండోదరికా కమల మందించెను. విచ్చిచూడగా "కనిపెంచనీ బాల - కన్నులకు అగపడెను". రావణుడా బాలిక సౌందర్యమును చూచి మోహించి రెండవ భార్యగా పెండ్లిచేసికొందును; పెంచి పెద్దజేయు మనెను. దైవజ్ఞులామె జాతకము చూచి "అష్టమి శనివారం - అయిదు ఘడియలు పొద్దెక్కి - చిత్తనక్షత్రమున - సీత పుట్టిన దినము" కనుక లంకకు చేటు కలుగునని చెప్పిరి. మండోదరి, మరది విభీషణునితో ఆదిలక్ష్మి మన యింట బుట్టినది; కొలది కాలమునకు మన లంక నాశనమగునని చెప్పినది. మండోదరి యామెకు మ్రొక్కి "వెఱ్ఱి రావణుడు సుమీ-సుతునివలె జూడుమీ -

చల్లగా రక్షించు-లంక రక్షించుమీ-" యని ప్రార్థించి యొక మందసమందుంచి సముద్రమున విడిచెను. సముద్రుడామెను మూడేండ్లు పెంచి క్షీరసాగరుని కిచ్చెను. మూడుమాసము లటనుంచి యాదిశేషు డామెను భూదేవి కిచ్చెను. భూదేవి పండ్రెండేండ్లు పెంచినది. దశరథుడు వేటకు పోయి పొరపాటున చంపిన అంధమునిదంపతుల కుమారునిపేరు సుమంతుడని యున్నది. సంతానము లేమి దశరథుడు చింతించుచుండగా కౌసల్య యాతనితో "ఉత్తరపు భూమిని ఋషివర్యు డున్నాడు" అతని సేవింతమనెను. దశరథు డుత్తరభూమి కేగి మునిదర్శనము చేసికొన నాతడు "దక్షిణభాగమందు-రాజఋషి వున్నాడు- అచటికి యేగితే - పుత్రులు కలుగుదురు - పుణ్యాత్ము లౌతారు - అరువై వేల సంవత్సరముల కచ్చటా- లేకలేక వార్కి-ఒక కన్య జన్మించు-ఆ బాలను పెంచితె-మీకు సుతులు కలుగు - యిత్తురో ఇవ్వరో - సంశయముగా బల్కె-మీ వంటివారికి-తప్పకా యిత్తురు-ఆడవారితోను-అతివేగ వెళ్ళండి'యనెను. దశరథు డచ్చటికి సపరివారముగా వెడల సిద్ధమగుచుండెను. కాని కైక తాను రాననెను. ఈ పాటలో కైక దుర్మార్గురాలుగా చిత్రింపబడినది. దశరథుడు బతిమాలి విసిగి "నాకు వశముగాదు - నల్లరాయి అది" యనెను. కౌసల్య పోయి బతిమాలగా కైక "అక్కరో కౌసల్య-అతి పరాక్రమశాలి-(నీవు) కోరి కొడుకుల గంటె - గొడ్రాలనై యుందు - పట్టమ్ము నీవేలు - బానిసను అయివుంచు"ను కాని నేను రాననెను. కౌసల్యకు కలిగెడు సంతానము రాజ్యాధికారము వహించు ననెడు యీర్ష్యగలది కైక. చివరకు సుమిత్రి యెంతో బతిమాలగా విని కైక మందరతో బయలుదేరినది, తాను దశరథుడున్న రథమెక్కి కదలెను. కౌసల్యా సుమిత్రలు వెనుక కాలినడకనే బయలుదేరి "మందరాతో కూడ ముగ్గురూ బానిసల" మనుకొనిరి. మధ్యేమార్గమున తేరు చక్రము విరిగెను. దాని నెత్తగల సమర్థురా లొక్క కైకేయి. కాని యామె "భమిడి కలము దెచ్చి - బంగారు పట్టమీద-శ్రీకారము పెట్టి - రాము వనవాసము-భరతు పట్టంకట్ట-పదు నాలుగేండ్లని వ్రాసె - కాగితం బుచ్చుకొని - కైక మహాదేవి - చిటికెన వేలుతో" తేరు నెత్తినది. ఇది మందర చెప్పిన మాయోపాయము. రాజర్షి దంపతులు "అరువది వేలేండ్లకు-ఒక బాల జన్మించె - ఆ బాల నిచ్చియు-ఎట్లు తాళగల"మని బాధపడినను దశరథుని ప్రార్థనమున నియ్యకొనిరి. ఆ బాలపేరు [illegible]

ంతను కౌసల్య కప్పగించిన కోకిలాదేవి (శాంత తల్లి) "ఆట ప్రియము నాడు - ఆట చూడగలేదు - పాట ప్రియమునాడు - పాట జూడగలేదు - వేకువ జామున లేచి-తద్ది వుండాలేదు-విత్తనం లేకుండ-వకరికి విత్తనం బెడితి-మొక్క లేకుండా-మొక్క వకరికి ఇస్తి-వీధిలో విస్తరి-ప్రాప్తమాయెను మాక"ని కరుణ ముగా విలపించినది. శాంత దశరథునింట పెరిగి పెండ్లీడునకు వచ్చెను. "దిన దినంబూ శాంత-దీప్తి పెరుగుచునుండె-కన్య పెరుగా వారికి-కంటకంబయి తోచె" నట. ఆడవారిని గన్న తల్లిదండ్రులకీ విషయ మనుభవైకవేద్యము. ఆమె నిచ్చి పెండ్లిచేయుటకు ఋశ్యశృంగుని జాడ చెప్పి దశరథుడు "అడిగిన ధనమిత్తు-విదియ శుక్రవారం - ఆరుఘడియల ప్రొద్దుకు-అల్లుని దేవలెనని" అప్సరసల నంపెను. ఆడవారిని ప్రథమముగా జూచిన ఋశ్యశృంగుడు తానొంటికొమ్ము వాడు కనుక "రెండు కొమ్ములు వుండె - వీరెట్టి తాపసులో - ఏపూజ చేసిరో" యని యాశ్చర్యపడి "రెండుకొమ్ములు మీకు-యేరాజు యిప్పించె-ఈశ్వరుడు ఇచ్చెనా-బ్రహ్మ యిచ్చినాడ" యని ప్రశ్నించెను. ఈ పట్టున చక్కని హాస్యము పోషింపబడినది. శాంతాఋశ్యశృంగుల వివాహము తరువాత ఋశ్యశృంగుని యాధ్వర్యవమున దశరథుడు పుత్రికామేష్టి యొనర్చి సంతానము బడసెను. రామాదులకు మాండవ్య (విభాండక) ఋష్యాశ్రమమున (ఋశ్యశృంగుని తండ్రి)అన్న ప్రాశనము జరిగినది. అప్పుడు "బంగారు తబుకుతో-క్షీరాన్నమును దెచ్చి - పసిడిగిన్నెలో నుంచ - ఆయుధంబులు పండ్లు - ఆభరణంబులు - ఛత్రచామరములు-చక్క మెదుటను వుంచ" "పట్టాభిషేకపుంగ్రం-భరతుడు తీసెను-వజ్రాయుంధంబును-శత్రుఘ్నుడు పట్టె-చామరం బొక్కటి-లక్ష్మణుడు తాదీసె-రత్నకవచం బొకటి-రామచంద్రుడు దీసె"నట. ఈ విషయములు రామాదులకు మునుముందు గలుగు పరిస్థితులను ధ్వనిగా సూచించునట్టివి. అనగా భరతుడు రాజ్యాభిషిక్తుడగుననియు, నాతనికి బాసటగా శత్రుఘ్నుడుండు ననియు, లక్ష్మణు డన్నగారికి సేవలు చేయుననియు, రాముడు రావణునితో యుద్ధము చేయుననియు ధ్వనితము. ఇది సూచ్యార్థసూచనమువలె నున్నది. ఈ పాటలో పరశురామగర్వభంగము వరకుగల గాథ యున్నది.

మూడవది ***అడవి అనే చరగోవిందనామా*** లను పాట. ఇది పైపాట తరువాతి కథను చెప్పును. బహుశః పై మూడు పాటలుకూడ నొకటే పాటయై

యుండును. మొదటిదానిలో శాంతను దెచ్చి పెంచుట, శ్రీరామాదుల జననము, వృద్ధి, మున్నగు విషయములును, రెండవది పెండ్లి గోవిందనామములను దానిలో కేవలము సీతాకల్యాణకథయు, మూడవదానిలో నరణ్యావాసము మొదలు రావణవధానంతరము శ్రీరామపట్టాభిషేకము వరకుగల కథ వర్ణింపబడి యున్నది. మూడింటి ఛంద మొకటిగానే యున్నది. మూడు భాగములుగా చేసినచో స్త్రీలు సులభముగా కంఠస్థమొనర్చి చదువుకొందురని యూహించి యుందురు. ఈ మూడవ పాటను, శ్రీరాముడు పట్టాభిషేకభంగమై అడవి పొలగుట, సీత చెర (చర) పోవుటను వర్ణించుటచే కాబోలు, అడవి లేక చరగోవిందనామము లనిరి. లేక వనచార వనేచర శబ్దములు 'అనేచర'గా మారినవో తెలియదు. పై రెంటికన్న నిది కొంత పెద్దగా నున్నది. శాంత గోవిందనామములందువలె గాక దీనిలో కైక కొంత మంచిదిగా చిత్రింపబడినది. స్వతస్సిద్ధముగా కైక మంచిదే కాని మందర దుర్బోధలచే చెడిపోయినట్లు చిత్రింపనైనది. శ్రీరామపట్టాభిషేకవార్తను దెచ్చిన మందరకు కైక తొలుత ముత్యాలహారము బహుమతిగా నీయబోవ 'నీ కొంప మునింగె' నని మందర చింతించును. కాని కైక "నీకిట్టి చింతేల – నాకు సంతోషంబు – శ్రీరామ చంద్రుండు – జ్యేష్ఠుండు గాడటవె – సుగుణసంపూర్ణుండు–సుమనః ప్రియుండు సుమి – భరతునికన్ననూ – పరమప్రియుడు నాకు – కన్నతల్లి కన్నను – నను భక్తితో గొల్చు – రాజ్యాధికారంబు – రామునికి తగును – భరతు పట్నము గట్ట – భావ్యంబుగాదు సుమి" యని ప్రత్యుత్తరమిచ్చెను. కాని మందర "కౌసల్య కెప్పుడు – దాసిగా నుందువె – నీవు దాసీవైతె – నీకునే దాసినా"యని దెప్పిపొడిచి కైక మనమును మార్చెను. సీతారామలక్ష్మణు లడవికి పోయినప్పు డయోధ్యానగరవాసు లందరు వారినే వెంబడించిరి. ఎంత వలదన్నను వినరైరి. కొంత యడవి గడచి రాముడు పౌరులతో "యీ రాత్రి ఇచటను – ఇరవుగా నిద్రించి – తెల్లవారిన వెనుక – తేరు దోలింతాము – కావునను మనమింక–కలసి నిద్రింతాము – అని రామచంద్రుండు – ఆదరంబున బల్క – ఆమాటలకు వారు – ఆనందమొందుచు – గాఢంబుగా వారు – కనుమూసి నిద్రించి"రట. కాని "ఆ రామలక్ష్మణులు – అర్ధరాత్రిని లేచి –" తమ రథమును దోలుకొని వారి కందకుండ వెడలిపోయిరట.

సీతను గోలుపోయిన రాముడు పంపాసరోవప్రాంతశోభను తిలకించి సీతావిరహమున, "మడుగులో పుష్పముల్ — మదనబాణము లయ్యె - నీలోత్పలంబులు-నెలత కన్నులబోలు-యీచక్రవాకముల్—ఈపద్మ ముకుళముల్ ఇంతి కుచములబోలు - ఈహంసనడకలు - యింతి నడకల బోలు - చారు శైవాలంబు సీత కురులనుబోలు - మీనుల మిలమిలలు-మెలత చూపులబోలు - ఆవర్తమును జూడ - అతివనాభినిబోలు - పంకజంబులు జూడ - పడతి వదనం బోలు-యీ వనంబులు చూడ - యింతినే దోపించె-మల్లె మొగ్గలు జూడ-మగువ పలువరుసాయె-చిలుక పలుకులు వినిన-చెలువమాటగ దోచె-కోకిలారావముల్-కోమలి గీతముల్-దొండపండును జూడ-తొయ్యలి మోవయ్యె-ఎది చూచినను నాకు-ఇంతి రూపంబయ్యె" నని ప్రబంధధోరణితో విలపించెను. కుంభకర్ణుని నిద్రలేపు ఘట్ట మతిశయోక్తులకు హాస్యముల కునికిపట్టు. "కాలమృత్యువుబోలె-కలవరించుచు వాడు-బుస్సలు కొట్టుచు ఘోరుడ నిద్రింప-వారందరును జేరి-వాని శరీరమును-ముసలముల మొత్తిరి-ముష్టుల బొడిచిరి-మదపుటేనుగులచే-మట్టించి రప్పుడు-గునపముల గాలిచి-తనువెల్ల గాల్చిరి-సీసంబు మరగించి-చెవులలో బోసిరి." సీతారామలక్ష్మణులు పుష్పకముపై తిరిగి అయోధ్యకు వెడలునప్పుడు వానరకాంతలను చూచిన సీత మన స్త్రీత్వము స్త్రీ స్వభావమును తెలుపును.

పై కథలందు రామాయణకథ సంపూర్ణముగనో చాలభాగమో చిత్రింపబడి యున్నది. ఇక రెండవ వర్గము సంగతి విచారింతము. వీనిలో రామాయణమందలి యేదో యొక ఘట్టము ప్రధానముగా చిత్రింపబడియుండును. ఇట్టి పాటల నింతవరకే పేర్కొంటిని. వానినన్నింటి చర్చించుటకు తావు చాలదు. కనుక కొన్ని పాటలనే - కొంత ప్రత్యేకత గలవానినే - వాని యందలి విశేషములనే తెలిపెదను.

**పుత్రకామేష్టి :** ఈ పాట వ్రాసినది శ్రీమతి పి.పి.బి. గోదానాయకమ్మ; (ప్రకటించినది కొండా శంకరయ్య). "ధరలో దీనిని యెవ్వారు-బతుకమ్మ పండుగలో చమవూచు కోలలు వేసిన-సంతానము గలుగున్"అని చివరన గలదు. కనుక దీనిని కోలాటము వేయుచు బతుకమ్మ పండుగ సందర్భములోకూడ పాడెద రనియు అందును తెలంగాణపు విశిష్టపర్వమును సూచించుటచే రచయిత్రి కూడ తెలంగాణ వాసినియై యుండునని భావింపవచ్చును. పాట పేరునకే పుత్రకామేష్టి కాని ఇందు శ్రీరామాదుల వివాహమువరకునుగల కథయున్నది.ఇందులో నొకచోట

చిత్రమైన కల్పన మున్నది. విశ్వామిత్రుని వెంబడి వెడలిన రాముడు శివధను ర్భంగమునకు ముందే సీతాదేవితో మారువేషమున గలసి మాటలాడును. సాయం సమయమున సీతాదేవి చెలులతోకలిసి పుష్పాపచయమునకై యుద్యానవనమునకు పోయెను. అప్పుడు "మునివేషముతో రాముడు- ముచ్చాటించే వేడుకగలిగి- సంధ్యావందన నెపముచేత-సాగివచ్చెనూ-బాలయోగివేషము చూచి-సీతా సంత సించి వేగ-పాదములను గడిగి పూల-పూజ జేసెను॥ యెచ్చటినుండి వచ్చినారు- యేపనికొరకు మీ పేరేమి-యెవరి శిష్యులూ మీరు-తెలియజెప్పుమా॥ విశ్వామిత్రుని శిష్యుడాను-రమణుడ యోగిహృదయమున-ధనుసు పందెము చూడ మేము-తర్లి వస్తిమీ॥ యెందుకీ సన్యాసాము-బాల్యమందే పొందితిరి-రాజకాంతి ముఖముమీద- తేజరిల్లగా॥ - మొదట వీరక్షత్రియుడై -యోగామున బ్రాహ్మణ్యాము-పొందినట్టి విశ్వామిత్రుని-పుణ్యా మిట్టిదే - యోగులాకు ధనుసుపందెపు-వివాహాము గూడు నయ్యా-గురువుగారు యేమి చెప్పిరి-గుర్తు దెలుపుమా॥ బాలయోగికి మా గురువు- భక్తితో నిచ్చునట్టి - కన్యాకా వివాహాము- కరుణతో జేయునూ॥ పూజ శివ ధనుస్సును-యెత్తి బాణము చేర్చువానికి- సీతా నిచ్చును జనకుడు-యితరుల కివ్వడు ॥ పూజయందునుండు ధనువు-పందెమునకు యెందుకు వచ్చె-ధనుసు బరువు యెంతటిదో-సుదతి జెప్పుమా॥ చెలులాతొ బంతియాడగ-భోషాణము క్రిందబడిన-ధనసు నెత్తి సీతాదేవి-బంతిని దెచ్చెనూ ॥ యింతేకదా ధనుసు బలము-యింతులకు సాధ్యంబై నది-మంతనమ్మతో వీరున-కెంత గొప్పదీ ॥ రాజాధిరాజులు-రమ్యశివధనుస్సును-లేవనెత్తక వారందరు-క్రిందానే పడిరి ॥ రాజులకు సాధ్యముగాని-కార్యములు యోగీశ్వరులు-చేయుచుందురాని సభలో- వినియుండలేదా ॥ ఐతే మీకు సాధ్యంబగుచో-మా సీతాదేవికి-యోగివరుడు భర్త యగుట-యుక్తంబగునా ॥ పుష్పములో బుట్టి సీత-పెంపూబడినదాని కిపుడు- రాజులతో సంబంధాము-కూడా దెన్నటికీ ॥ నేనే సీతాదేవినండి-నా తప్పులా క్షమించండి-రామచంద్రుని నాకు-పతిగా గూర్చండీ ॥ దుస్సాధ్యంబగు నీ కార్యం బిది - సిద్ధించాదు నాపలన - మహర్షిబృందము చెంతాజేరి సేవా జేయుము ॥ శరణాగతి జేసినవారిని - సంరక్షింప సమర్థులు - పాదములపై బడుము - కాపాడుదు వేగ ॥ దీనజనుల బాధాలను-దీర్చుటాకు నేటినుండి-దీక్షతో ప్రతిజ్ఞ నేను-జేయుచుంటినీ ॥ రాముడే నీకు భర్త-రమ్యముగా గాగలడూ - యిచ్చోటికి వచ్చినా-దెవో టను లేడూ ॥ వింత నేవనువాని మాటల-యింతూంతో వినచు

సీత-యెంతో సిగ్గూ పడుచు వెంటనె-యింటి కేగెనూ॥" కుమారసంభవమున మునివేషమున శివుడు వచ్చినటులే యిచట రాముడు సీతతో మాటలాడ వచ్చినట్లున్నది. "రాములవారి యెఱుక" యక్షగానమున శ్రీరాముడు ఎరుకలసాని వేషమున బోయి సీతకు ఎరుక చెప్పును.

సీతారాముల యీ పూర్వరాగమును ప్రోదిచేసిన తొలి మహాకవి భాసుడు. ఆటుతరువాత తమిళ మహాకవి కంబన్, హిందీమహాకవి గోస్వామి తులసీదాసు మున్నగువారు వివాహాత్పూర్వమే సీతారాములు ఒకరినొకరు చూచి ప్రేమించుకొన్నట్లు చిత్రించినారు.

కంసలక్క బైకలు, కౌసలక్క వేవిళ్లు, శ్రీరాములవారి ఉగ్గుపాట వంటివి రామాయణమునకు సంబంధించినవి కాకపోయినను ఆంధ్రపురంధ్రులు తమ యనుభవములను గృహజీవితమును కౌసల్య పేరుతో రామచంద్రుని పేరుతో పాడుకొన్నట్టివి. కంసలక్క బైకలు వ్రాసినది శిరుగంబూరు అన్నపూర్ణమ్మ బైకలన్నను వేవిళ్ళన్నను బయ్యంకలన్నను నొకటే. ఈ గేయములను సాంఘిక గేయములందు చేర్చి చర్చింపనగును.

శుక్రుని నుపదేశానుసారముగా రావణుడు రాము నెదిరింప మహాశక్తిసంపన్నుడగుటకై "పాతాళహోమ" మొనర్చెడు కథ రంగనాథ, భాస్కరరామాయణములందు గలదు.[1] దీనికి మూలము అధ్యాత్మరామాయణము. ఈ కథ జానపద గేయముగా రచించిన కవి విద్వాన్ మంథా రాయుడు శాస్త్రి విశాఖమండలము గళ్ళపల్లె వాస్తవ్యుడు. శా.శ. ౧౮౭౮ దుందుభి పుష్య శు॥ ౩ గురువారము నాటికి కృతి పూర్తిచేసినటులు చెప్పుకొనినాడు. ఈతని నీకృతికై ప్రోత్సహించినది గౌరమ్మపేట వాస్తవ్యుడు ముత్యాలు దొరయట. దీనిలో రావణుడు శుక్రుని చెంతకు బోయి యుపాయ మడుగుటనుండి పట్టాభిషేకము వరకుగల కథయున్నది. జయోపాయమడిగిన రావణున కసురగురుడు "పాతాళహోమంబు పట్టి వేల్చితివేని రథము బాణములు గుఱ్ఱము లందు బుట్టు - ఆసాధనముచేత వాసిగా రణములో - జయ మొందగలవు రాక్షసనాథ నీవె- మధ్య విఘ్నము గల్గ మరి గెల్వగాలేవు. - నిక్క మిదేనమ్ము నీ మనమ్మునను'' అని హోమమునకు

1. రంగనాథ రామాయణము, పుటలు ౪౪౯ - ౪౫౦

కావలసిన సామగ్రి, "నవధాన్యనవజంతు నవపత్షనవపద్మ - నవవిధాజ్యంబులును నవరసములు" కావలెననెను. రావణు డటులనే పాతాళహోమము చేయును. హోమకారణముగా వెడలిన ధూమమును రాముడు చూచి యిది యేమిటని విభీషణు నడుగ నాతడు పాతాళహోమము సంగతిచెప్పెను. రామాదులా యజ్ఞము భంగముచేయ వానరసైన్యముల నంపిరి. కాని వానరుల కా జాడ తెలియదు. అంగదుడే స్వయముగా బయలుదేరెను. అతడు సరమచే (విభీషణుని భార్య) రావణుడున్న తావు తెలిసికొనెను. ఆమె "ఆడవారలతోడ ఆలోచనలు చేయ, ముప్పు లెప్పటికైన తప్పక వచ్చు, అందుచే మగవారు ఆడవారలతోడ ఆలోచనలు చేయ రవనిలో నెపు" డనియును రావణుని జాడ నోటితో చెప్పక చేసన్న చూపించెను. వానరులెంత ప్రయత్నించినను రావణు డచలుడుగా నుండి యజ్ఞము చేయుచుండెను. అప్పుడు జాంబవంతు డుపాయ మాలోచించి మండోదరిని భంగపరచిన, రావణు డది సహింపక యజ్ఞము విడుచుననియు వానికి దగినవాడు "ఆమెకు ప్రియపుత్రు డంగదుడే కాన, పాప మెన్నడు రాదు పట్టి యీడ్చినను" అని చెప్పెను. అంగదుడు తన తల్లియగు మండోదరి తలపట్టి యీడ్చి రావణుని గదలించి యజ్ఞభంగముచేసి వెడలిపోయెను. (అంగదుడు వాలికిని మండోదరికిని గలిగిన కుమారుడను నొక యైతిహ్యము గలదు. విశ్వకర్మ తన కూతురగు మండోదరి నొకవజ్రభవనమున నుంచి దానిని భేదించినవానికా కన్య నిత్తుననెను. రావణుడది భేదింపజాలక ప్రథమఫలము నిత్తునని వాగ్దానము చేయ వాలి యా మందిరమును భేదించి ఆమెవలన నంగదుని గని తరువాత నామెను రావణున కిచ్చెను. అప్పటినుండి మండోదరి రావణుని భార్య; అంగదునికి తల్లి; కనుక అంగదుడామె నంటి గలిగెను.) తరువాతి కథ సాధారణమే.

'లక్ష్మణమూర్ఛ' వాల్మీకీయమే యైనను దీనిలో జేరిన కాలనేమి వృత్తాంతమువంటివి, యవాల్మీకీయములు. రంగనాథ భాస్కరరామాయణములందు గూడ కాలనేమికథ యున్నది.[1] ఆనందరామాయణము, అధ్యాత్మరామాయణములు దీనికి మూలములు. ఈ కథ నే పుణ్యపురుషుడో "అనేకాలమునాడు ఛందంబుగాను-పదముగా రచియించి ప్రజలకు నొసగగా-చదువుచుండిరి మీకుల సంతోషముగను" కాని 'ఆకులపై వ్రాసి అవియు చదువుటనో - యేరీతినోగాని

---

1. రంగనాథ రామాయణము, పుట ౪౩౩

యీ రమ్యపదము —— బొత్తిగా చెడి తుదకు బుద్ధిమంతులకు - మానసములకు క్షేమ మిరి యించితకములేక'' పోయినది. అది చూచి వైశాఖపురవాసి వెంకటరామయ్య "పూడిపెద్దికులాబ్ధి పూర్ణసోముని" "చక్కగా నీ పదము సమకూర్చు దనిన'' ''రామాయణంబును రంగుగా జూచి - వెనుకటి పదములు వింతగా శోధించి'' వ్రాసెనట.

విభీషణున కడ్డువోయి లక్ష్మణుడు రావణుని శక్తిచే మూర్ఛితుడయ్యెను. అతని జూచి "చేరు తెగి ముత్యములు చెదరి రాలినగతి, రాలెను కన్నీరు రాము కన్నులను." సుషేణుడు రామునోదార్చి ఆంజనేయుని సంజీవి దెమ్మనెను. రాము డాంజనేయుని 'ఇలలో నల్గురము ఇపు డన్నదమ్ములము, ఇటుపైని మాతోటి హితవు మీరంగ, ఐదవవాడగుచు అలరుచుందువు నీ' వని బతిమాలి సంజీవికై పంపించెను. ఇది తెలిసిన రావణాసురుడు ఆంజనేయుని కడ్డు తగులుటకై కాలనేమియను రాక్షసుని బంపించెను. ఆతదాంజనేయుని మార్గమున పెక్కు మాయలు పన్ని తాను మౌనివలె నటించి తప్పుదారి బట్టించెను. ఈ కపటమౌని కల్పించుకొన్న తాపసాశ్రమమున "ఎలుక పిల్లులును ఏమి వైరము లేక, కూడియాడుచునుండు వేడుకలు మీర, సింహంబు లేనుగులు చింతాకు వాసైన, వయిరంబు లేకుండ వనములను తిరుగు, పులులు పందులు గలిసి పోరేమియును లేక, సంతసింపుచునుండు సర్వకాలంబు". ఇది భారతమందలి కణ్వాశ్రమవర్ణనమును కళాపూర్ణోదయమందలి తపోవనమును దలపింపును. ఆంజనేయుడు కాలనేమి కపటముచే నొక కొలనిలో నీరు త్రాగబోయి మొసలిచే మ్రింగబడి దానికి (ధాన్యమాలియను యప్సరస) శాపవిమోచనము కలిగించి కాలనేమితో యుద్ధముచేసి వాని జంపి సంజీవిపర్వతముకడ కాపున్న గంధర్వులను జయించి దానిగొని తిరిగి బయలుదేరి నందిగ్రామము మీదుగా వచ్చుచుండెను. భరతున కప్పటికే రామునిగూర్చి కలిగిన దుస్స్వప్నముచే కథ యంతయు దెలిసెను. అత డాకాశముపై బోవు ఆంజనేయుని గూడ రాక్షసమాయాప్రభావ మనుకొని చంపనెంచెను. కాని యాకాశవాణి వారించెను. ఆంజనేయుడు భరతుని జూచి భ్రాంతితో "శ్రీరామచంద్రుడు సీతను దిగనాడి, లక్ష్మణుని దిగనాడి రణములోపలను, రావణుని తమ్మునికి లంక నిత్తునటంచు, అభయ మిచ్చిన యట్టి ఆరాముడిటను", ఏల వచ్చెనని వితర్కించెను. ఇట్టి మనోహరభావములు కల్పనలు రంగనాథ రామాయణమునందును, భాస్కరరామాయణమందును

గలవు. రావణు డాంజనేయుడు సంజీవి దెచ్చు వార్త విని మాల్యవంతు నంపెను గాని మారుతి వానిని గూడ చంపి వచ్చి లక్ష్మణుని బ్రతికించెను.

రామాయణగాథలో చిన్న ఘట్టమైనను 'గుహభరతుల అగ్నిప్రవేశ' మను పాట ఉత్తమ గేయము. అయోధ్యకు బయలుదేరుటకు ముందు రాము డాంజనేయునితో నారాక కెదురుచూచి భరతు డగ్నిప్రవేశము చేయును కాన నీవు వేగిరముగా పోయి మేము వచ్చెడువార్త నాతనికి నందిగ్రామమున నెరుకపరుపుమని యాజ్ఞాపించును. అప్పుడు జానకి గుహుని సంగతి జ్ఞాపకముచేసి తమ కాతడిచ్చిన పండ్లనుగూర్చి చెప్పి గంగ దాటించిన వర్తమాన మెరిగించి మాకొరకెదురుచూచి పదునాలుగేండ్ల తరువాత పంచమినాడనలము జొత్తుననెను కనుక శృంగిబేరపురమున నాతనితో చెప్పి పొమ్మనెను. ఆంజనేయుడు శృంగిబేరము చేరునరికి గుహుడు తన కుమారునికి నీతులు గరపి యగ్ని జొచ్చుటకు సిద్ధముగా నుండెను. ఆతనికి శుభవార్త నెఱిగించి ఆంజనేయుడు నందిగ్రామము వెడలెను. అచ్చోట భరతు డనలప్రవేశము చేయనుండగా నాతని వారించి శుభవార్త వినిపించెను. ఈ విషయము కంబరామాయణమందును రంగనాథ రామాయణమందును కలదు. రాముని అయోధ్యాప్రవేశము, అయోధ్యా వాసుల యుత్సాహానందములు, గుహునిభక్తి ఈ పాటలో చక్కగా చిత్రింపబడినవి. అందరయోధ్య చేరెనపిమ్మట కైకను తెలిసికొనని హనుమంతుడు "అడవులకు బొమ్మనె అతిభక్తితోను-అంపిరమ్మ యెవరు యిందారిలోను" అని ప్రశ్నింప లక్ష్మణు డామెను కనుసన్నచే చూపించెను. అప్పుడాంజనేయుడు మరల "నావొక్కడనా రఘురాము డుండగను, పొమ్మని పంపగా పోయెనుమి తల్లి, నేడింవరకు గంటు నెలతరో వినవె, క్రొత్త గలిగిన పనులు మరచితి వేమొ, పను లానతిచ్చి మము బంపవే తల్లి," యని మర్మస్ఫురక్కులగు మాటల చెప్పి పొడిచెను.

'శ్రీరామ పట్టాభిషేకము' చిన్న ఘట్టమైనను పాట పెద్దది. శ్రీరామ పట్టాభిషేకోత్సవములు బ్రహ్మాండముగా జరుగుచుండెను. పదునాలుగేండ్లనుండి పవళించియున్న యూర్మిళను లక్ష్మణుడు సమీపించి శయ్యపై గూర్చుండి "కురులు చిక్కులు దీసి శిరసు బట్టెత్తి-కౌగిట జేర్చుకొని కన్నీరు దెచ్చె"ను. ఆమెను లేపి పట్టాభిషేకవార్త చెప్పి మంగళస్నానము చేసిరమ్మని అన్నకడకు బోయెను. లక్ష్మణుని సంతోషమును జూచి శివుడు రామునితో "ఇన్నాళ్లవల గాదు ఇన

క్షకోత్తముడా-సౌమిత్రి వచ్చేటి సంభ్రమ్ము జూడు-సతి లేపుకొని రాగ సౌమిత్రి సుఖము-పొందుచున్నది పుండరీకాక్షా - పదునాలుగూయేండ్ల బడలికలు వీరా-లక్ష్మన్న ముఖారవిందమును జూడు"మని పరిహాసములాడెను. సింహాసనము సిద్ధపరచుటకై వసిష్ఠుడు "పదునాలుగూ యేండ్లు పై కప్పుతోను, ఉంటివి నిన్నెక్కు యుర్వీపతి లేక" యని పైనున్న కప్పు తొలగించి దానిని శృంగార మొనరించెను. పట్టాభిషేక సమయమున సీతారామచంద్రులకు కట్నములు చదివించిరి అప్పుడు "నడుమ మాణిక్యమూ నమరించి గుచ్చి, సరమొకటి దెచ్చి సుగ్రీవ మహరాజు," సీతకు చదివించెను. రాముడు సీతతో "ఎవ్వరి మూలమున వృద్ధి బొందితివో" వారి కిమ్మనెను. సీతమ్మ "నా యాత్మబంధుండ జీవ రక్షకుడా-మాయన్న హనుమంత రమ్మనుచు బిలిచె - తన చేత కంఠహారం హనుమంతు కేసె". సీతాదేవి కెంతటి ప్రేమ! చేసినమేలు మరువలేదామె. సీతమ్మ ఆంజనేయునికి కంఠహారము వేసినట్లు రంగనాథ రామాయణమున గూడ కలదు. దీనికి మూలము అధ్యాత్మరామాయణము. ఆంజనేయుడు తానేమి చేయలేదనియు రాముడు తమకు ప్రభువగుట తామే ధన్యుల మనియు తనభక్తి నిట్లు చాటెను. "వనచరులు జాంబవులు వనరాక్షసూలు-కలలోను రఘుపతిని జూచి యెరుగుదుమా, మన భాగ్యమున కైక వరమడిగెగాన-అడవిమ్రుగములు నేం అవనిపతి గలిగె - కోతులు కడుపెద్ద కొనియాడునట్టి - భ్రాంతి పడగలయట్టి ప్రభువులు గలరా" యనెను. ఆ పరమభక్తుని జూచి "సంజీవిపర్వతం బెత్తిన హస్తములా-సుమిత్ర పచ్చలా కడియాలు బెట్టె" నట తన కొడుకును బ్రతికించినాడన్న కృతజ్ఞతాభరమున సుమిత్ర ఆ రామభక్తునికి చేతులకు కడియాలు దొడుగుట యెంత మనోహరభావన.

ఆంధ్రదేశపు నాలుగు చెరగుల కరుణము, భక్తి భావముల నుప్రపతి చేసికొని స్త్రీల కంఠములనుండి వెడలి, గాలి యూలలందుగూడ వినబడునట్టివి, 'ఊర్మిళాదేవినిద్ర,' 'లక్ష్మణదేవర నవ్వు,' పాటలు. ఊర్మిళాదేవినిద్ర పాట బహుళప్రచారమందిన గేయములం దొకటి. వాల్మీకి మొదలు దేశభాషలందు రామాయణములు వ్రాసిన కవులందరును ఊర్మిళామహాసాధ్విని మరచి పోయిరి. కాని తెలుగుస్త్రీలు మాత్ర మామెను మరచిపోలేదు. ఈ పాట ఆంధ్రుల ప్రత్యేకధనము. ఇప్పటికే ఈ పాటను గూర్చి పలువురు వ్రాసినారు.

బందా కనకలింగేశ్వరరావు గారు[1] అడివము రామారావుగారు[2] ఇల్లిందల సరస్వతీదేవిగారు[3] వ్రాసియున్నారు. దేవేంద్రసత్యార్థిగారి పాటను భారతదేశ మంతటికి వాటి ఆంధ్రుల ప్రత్యేకతను కొనియాడిరి[4]. అదియేమి విపరీతమో కాని ఇంతమంది రామాయణకర్త లున్నారు గదా! ఒక్కరైనను ఊర్మిళా మహాసాధ్వి త్యాగమును గుర్తింపరైరేలనో? ఆ పతివ్రత కన్నీటికతను పండితు లెందుకు మరచిరో! వారికి సీతయందున్న యభిమానమే కారణమేమో. శివధనుర్భంగము, సీతాకల్యాణముల కోలాహలమున నూర్మిళావివాహము సడి చప్పుడు లేకుండ జరిగిపోయినది. సీతాదేవివనవాసవిషాదమున నూర్మిళా విరహము నిస్తేజమైనది. కాని ఆంధ్రజానపదులు మాత్రము సీతమ్మ కగ్ర తాంబూల మిచ్చియు నూర్మిళామహాసాధ్విని మరచిపోలేదు. నాథు డడవికి బయలుదేరవలదన్నను సీతాదేవి వెంబడించినది. వారికి సేవలు చేయ లక్ష్మన్న బయలుదేరెను. నేను వచ్చెదనని ఊర్మిళ లక్ష్మణుని వేడుకొనినది. లక్ష్మణునికి యూర్మిళ "పానకములోని పుల్ల" వలె కన్పడినది. ఏవో కుంటిసాకుతో "బావ నడచిన మార్గమున నడువరాదంటరా యేలాగు వేగింతునూ-బావమాటల ధ్వని భూమిపై వినరాదు యేలాగు వేగింతునూ" అని లక్ష్మణుడామె నింటనుండ నాజ్ఞచేసెను. పాపమా పతివ్రత భర్తగారి యాజ్ఞ శిరసావహించినది. ఇందులో నెవరి త్యాగము గొప్పది? పతిని వెంబడించిన సీతమ్మకా లేక పతి నెడబాసియున్న ఊర్మిళకా వనవాసము? సీతమ్మ చెరవోయి బాధపడుట వేరే విషయము. ఒకవేళ ఊర్మిళకూడ వీరి వెంబడే యున్నచో రామాయణగాథ యెట్లు మారియుండెడిదో? అన్నగారి సేవ తప్ప అన్యమెరుగని లక్ష్మణునికి స్త్రీ హృదయ మేమి తెలియును? పాపమా సాధ్వి యెంత కుమిలిపోయినదో? నాటినుండి ఊర్మిళా సాధ్వికి పదునాలుగేండ్లు నిద్దుర. "నాడు మొదలుగ శయ్యపై కనుమూసి నాతి పవళించుచున్నది." ఇట్లు నిద్రాయోగమున పతిని ధ్యానించిన పరమసాధ్వి ఊర్మిళ. వనవాసము గడచి తిరిగివచ్చిన తరువాత లక్ష్మణుని ప్రథమకర్తవ్య

1. గృహలక్ష్మి.
2. వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రులుగారి సచ్ఛాత్రసంపుటము.
3. జాతిరత్నాలు.
4. Modern Review, April 1940.

మేమిటిః తన విరహమున కృశించిన భార్యను దరియుటగదా. లక్ష్మణస్వామి అదియును చేయడయ్యెను. శ్రీరామ పట్టాభిషేకసంరంభమున అన్నగారికి వింజామరలు వీచుటలో భార్యనే మరచిపోయెను. స్త్రీల హృదయము స్త్రీలకే తెలియును. ఒకనాడు,

''శ్రీరామభూపాలుడూ పట్టాభిషేకుడై కొలువుండగా
భరతశత్రుఘ్ను లపుడూ సౌమిత్రి వరుస సేవలు సేయగా
మారుతాత్మజు డప్పుడూ రాఘవుల జేరి పాదము లొత్తగా''

జానకీదేవి వచ్చి శ్రీరామచంద్రునితో,

''దేవ దేవేంద్ర వినుమా విన్నపము తెలిపేను చిత్తగింపూ
ముందు మన మడవులకును పోగాను ముద్దుమంది వెంటనూ
పయనమై రాగ జూచి తన చెలియ పవసమూచెను ఊర్మిళా
వద్దు నీవుండుమనుచూ సౌమిత్రి మనల సేవింపవచ్చె
నాడు మొదలుగ శయ్యపై కనుమూసి నాతి పవళించున్నదీ
ఇకనైన యానతిచ్చి తమ్ముణ్ణి యిందుముఖికడ కంపుదీ''

యని సిఫారసు చేసి లక్ష్మయ్యగారికి సెలవిప్పించినది. అప్పటికిగాని లక్ష్మణస్వామికి తెలియవచ్చినదికాదు. జాగు సేయక అతడూర్మిళాశయ్యా గృహము చేరుకొనెను. చేరినవాడు కన్నులు మూసికొని శయ్యపై నిద్రాముద్రిత యైన యూర్మిళను లేపి తానెవరో చెప్పి తన తప్పిదమును మన్నించవలసినదిగా కోరియుండినచో బాగుండెడిది. అటులగాక పాన్పుపై గూర్చుండి "కొమ్మ నీ ముద్దుముఖమూ సేవించగోరినాడే చంద్రుడూ'' అని వర్ణించుచు తన విరహమును వెడలబోయ మొదలిడెను. ఎంతమోటుగా ప్రవర్తించినాడీలక్ష్మణుడు! ఒకటియా రెండా? పదునాల్గు వత్సరములు మూసిన కన్నులు తెరువక పడి యున్న-ఊర్మిళ కెవ్వరో పరపురుష లంతఃపురప్రవేశ మొనర్చినట్లుగా తోచినది. అప్పుడామె,

''అయ్య మీరెవ్వరయ్యా మీరింత యాగడమ్మున కొ స్తిరీ
సందుగొందులు వెదకుచూ మీరింత తప్పు కాయగ వస్తిరీ
యెవ్వరూ లేనివేళా మీరిపుడు యేకాంతమున కొస్తిరీ
మాతండ్రి జనకరాజు వింటె మిము ఆజ్ఞ సేయక మానరూ

మాయక్కా బావ విన్నా మీకిప్పుడు ప్రాణముకు హానివచ్చా
మాయక్క మరది విన్నా మిమ్మిప్పుడు బ్రతుకనిచ్చేరు జగతిలో"

యని మందలించినది. ఈ మందలింపులో ఆమె సిగ్గు సౌశీల్యము అభివ్యక్తములు. ఇంతటి దుర్గతి తనకు పట్టినందులకు.

"హెచ్చైన వంశానికి అపకీర్తి వచ్చె నేనేమి సేతూ
కీర్తిగల యింట బుట్టి యపకీర్తి వచ్చె నేనేమి సేతూ''

అని తహతహ పడినది. ఈ తహతహలో నామె యాభిజాత్యము వెల్లడియైనది. హితవు గరపిన మంచిదనుకొని,

"ఒకదాలి కోరిగాదా ఇంద్రునికి ఒడలెల్ల హీనమాయె
పరసతిని కోరిగాదా రావణుడు మూలముతో హతమాయెను
ఒకదాలి కోరిగాదా కీచకుడు ప్రాణములు గోలుపోయె
ఇట్టి ద్రోహములు మీకూ యెరుగుంటి యింత ద్రోహము కొ స్తిరా
ఇపరోపన్న బుట్టిరా మావంటి తల్లి లేదా మీకునూ"

అని పరకాంతాగమనేచ్ఛను గర్హించినది. కీచకప్రస్తావన మూర్మిళ చేయుట యప్రస్తుతమే యైనను అది జానపదుల హృదయము ఊర్మిళ మాటలకు తమ మాటలు కొన్ని చేర్చి యీ విషయమును తెలుగుస్త్రీలు బలపరచినా రనుకొనవలెను. లేదా యోగులకు భూతభవిష్యద్వర్తమానములు కరతలామలకములు కనుక విరహయోగినియైన ఊర్మిళామహాసాధ్వి భవిష్యద్వర్తమానమును ఇందు జోడించె ననుకొనవలెను. లక్ష్మణుడు తన్నుతా నెరుకపరచుకొన్నప్పుడు ఆ దంపతులకు జరిగిన సంభాషణ మధురాతిమధురము. ఇంకను కన్నులు తెరువని యూర్మిళను భయపెట్టుటకో యేమో,

"కత్తి వరదీసి యపుడూ లక్ష్మణుడు తా వేసికొందుననెనూ"

తననింత నిర్దయతో విడిచిపోయినవాని కాసంత సేపైన నుడికింత మనుకొన్న యూర్మిళకు భర్త నిజముగా ప్రాణములు వదలునేమో యను భయము కలిగినది. పాప మూర్మిళ భర్తపాదములపై కరగిపోయినది. ఐనను ఆమె హృదయోద్వేగ మాగలేదు.

"మాతండ్రి జనకరాజా మిము నమ్మి మురచి పెండ్లిజేసెనూ
చిత్త మొకదిక్కునుంచి సమయమున చిన్నబుత్తురు పురుషులూ''

అని ముత్తెమంత చెప్పిపొడిచినది. లక్ష్మణు డప్పటికామె పరితప్తహృదయ మెరిగెను. తానుగూడ నిద్రాహారములు మానినసంగతి తెలిపి పూర్వ మేపుణ్య దంపతుల కెడబాటు కలిగించితిమో యని హృదయభారమును వెలార్చెను. ఆ దంపతుల స్థితి జూచిన కౌసల్యాది కాంతలు వారి నోదార్చి ఇరువురికి తలలంటి భోజనము లిడిరి. ఆనాటి యూర్మిళాముఖమున గనుపించిన ఆశారేఖ వర్ణనాతీతము. అందుకే వదినె శాంతమ్మ ఇన్నాళ్ళవరకు

"కుంచనపు ప్రతిమకళలూ యీ కళలు యెందుండి దాగున్నవో
దృష్టి తగలాకుండను నీలాలనిన్వాళు లివ్వరమ్మా"

యని పరిహాసమాడినది. పాప మూర్మిళ మాటాడలేదు. కాని శాంతకు తగిన సమాధానము సీతమ్మ చెప్పినది. శాంతమ్మ కొంత గడుసరి. సీతమ్మకు కూడ నొక చురుకంటించినది కాని సీతమ్మ.

"మాయన్న ఋశ్యశృంగుని వనములో కూడి యెడబాయకున్నా
యేమి యెరుగని తపసినీ వో వదినె కేశించ్చి విడిచినావూ"

అని నురల నోరెత్తకుండ జేసినది. అబ్బ! ఎంత సరసులీ యాంధ్ర జానపద సృష్టియిది! వాత్సల్య సందేశ్య స్పృహము సుసజ్జితమైనది. లక్ష్మణుడామె ప్రక్క గూర్చుండి,

'కీలుకొప్పమర విడిచి లక్ష్మణుడు నేర్పుతో జడలల్లెనూ
బొండుమల్లెలు జాజులూ జడపయుని శృంగారముగ జుట్టెనూ
తాంబూలములు వేయుచూ దంపతులు కలసి ముచ్చటలాడిరీ'

ఊర్మిళాసాధ్వి కరుణారసభరితాంతఃకరణమున కింకొక్క యుదాహరణము. ఆలుమగ లిన్నాళ్లకు కలిసికొన్నప్పు డెంతటి శృంగారలోలురై యుండవలెను? లక్ష్మణుడు తన జడలో బొండుమల్లెలు సవరించుచుండగా నామె హృదయము అక్కగారి విషాదగాథవైపు మరలినది. స్త్రీకదా! ఆమె సోదరీప్రేమను గమనింపుడు.

'సింహవిక్రములు మీరు ఉండగా సీతెట్లు చెరబోయెనూ
రాజ్యాధిపతులు మీరు ఉండగా రఘుఁనెట్లు చెరబోయెనూ'

అని ప్రశ్నించినది. లక్ష్మణుడు సీతాపహరణగాథ వినిపించెను. ఆకథ విని దుఃఖించినది ఊర్మిళయే కాదు, తెలుగు స్త్రీలంపరును. ఊర్మిళ సీత కష్టములను

చెల్లెం డ్రకు వినిపించినవి. వారవవులబడిన కష్టములకేడ్చి తిరిగి సుఖముగ వచ్చినందుల కుప్పొంగెనవి. ఇవి సుఖదుఃఖముల మధురసన్ని వేశము. రసికజనైక వేద్యము. తెలుగువారి ప్రత్యేకత. అనాదినుండి,

"ఊర్మిళా విరహమ్ములూ యివి యెవరు పాడినా విన్నగానీ
శ్రీవిష్ణు కైవల్యమూ సౌమిత్రి విష్ణులోకము నిచ్చునూ". ఇది కాక

తాము ను విరహబాధం నొందరు. ఊర్మిళాదేవి నిద్ర పాటవరుసలో ఆ రీతిగనే సుదీర్ఘకథనముసేయు పాట మరియొకటి కనబడదు. ఈ వరుస విశాఖమండలపు స్త్రీల పాటల వరుస ఎన్నిటికిని భిన్నమైనవి. ఇది తెలంగాణపు గౌరమ్మపాట:—,

౧ ౨ ౩ ౪ ౫ ౬ ౭ ౮
శ్రీలక్ష్మి, నీనుహిమ, లూ, గౌరమ్మ, చిత్రమై, తోచు, నమ్మా..."

వలె ఎనిమిది 'కిటతకిట' ఆవృత్తముల చరణములలో నడచుచున్నది. ఈ వరుస పాటలు తెలంగాణమున నధికప్రచారమం దుండుటనుబట్టి, ఊర్మిళాదేవి నిద్రకు సిగేమరచ్చునుచ్చినది తెలంగాణపు జానపదులై యుండురని నాయూహ.

ఊర్మిళాదేవి పాటతో దగ్గర సంబంధముగల పాట "లక్ష్మణదేవర నవ్వు" దీనిలో జానపదుల మనస్తత్త్వము గోచరించును. మానవాతీతవిషయములను నమ్ముటకు శిష్టుల కర్థాంతరన్యాస మక్కరకు వచ్చునట్లు జానపదులకు విషయాంతరన్యాస మవసరము. శిష్టుల కర్థము ప్రధానమైన జానపదులకు విషయము ప్రధానము. ఇది మన లక్ష్మణదేవరనవ్వు పాటలో కాననగును. ఊర్మిళాదేవి పదునాలుగేండ్ల నిద్రపును, లక్ష్మణుని పదునాలుగేండ్ల నిద్రాహార రహితమైన సోదర సేవకును జానపదు రొక చక్కని కథాకల్పకమును నిలిపిరి. దానికి చిలువలు పలువ లెదిగినవి.

రావణవధానంతరము సీతారాము లయోధ్యకు తిరిగివచ్చిన పిమ్మట శ్రీరామపట్టాభిషేకము సకలదేవతాసమక్షమున జరిగెను. ఆ నిండుకొలువులో.

"కలకల నవ్వె లక్ష్మణదేవ రపుడూ-కలతలు పుట్టెనూ కపులందరికినీ
కిలకిల నవ్వే లక్ష్మణదేవ రపుడూ-కిలకిల నవ్వగా భిన్నుడయె రాజూ"

లక్ష్మణు డకారణముగా నవ్వినందుకు సభలందరును సమ్ముఖికాయము మోసినట్లు తమ భుజములు తడుముకొని కించపడిరి. 'జాలారి'పదుమును నె వి

కెక్కించుకొన్నందుకు నవ్వెనని శివుడనుకొనెను. అన్నగారిని జాపించి తాను రాజైనందుకు నవ్వెనని విభీషణుడనుకొనెను. ఆతరాని మాటలాడినను ఆడువారిని నమ్మరాదని నవ్వెనని జానకి సిగ్గుపడెను. దశకంఠుని చెరయుంచుచున్న యాలిని తొడపై కూర్చుండపెట్టుకొన్నందులకు నవ్వెనని శ్రీరాముడనుకొనెను. దీనినే శిష్టులు చేష్టావ్యంగ్య మందురు. 'అ స్తమేతి గభస్తిమాన్' అను వాక్యమువలన వివిధవ్యంగ్యార్థము లుత్పన్నమయినట్లే ఒక్క నవ్వువే నిందరిలో నిన్ని భావము లుప్పతిల్లుట ఒక విచిత్రసన్నివేశము. అటులే యెవరి లోపముల వారు తలంచుకొని తలలు వంచుకొనిరి. సభనాతి నిట్లవమానపరిచినందుకు రామునికి కోపము మిన్నుముట్టినది. ఒరనున్న కత్తి దూసి లక్ష్మణుని తలదఱుగ నుద్యమించి నవ్విన కారణమడిగెను. లక్ష్మణు డన్నగారి పాదములపై నొరిగి కారణమిట్లు చెప్పెను. 'మన మడవులకు పోయినప్పు డొక రాత్రి పర్ణశాలలో మీరు నిద్రించుచుండగా శరచాపహస్తుడనై నేను కావలియుంటిని. ఆ నిశీథమున చీమ మొదలు సింహమువరకు నిద్రలో మునిగియుండెను. నేనొక్కడనే మీ సేవకై మేల్కొనియుంటిని. నన్ను సమీపించుటకు గుండెలు చాలని నిద్రాదేవి గోదావరి గలగల లుపశ్రుతిగా నేడ్చుచుండెను. ఆమెను జరిసి కారణమడుగ, నాయనా నేను నిద్రాదేవిని, 'అష్టదిగ్గజములు ఆగి మహాఋషులు సప్తసాగరములును సుషుప్తి మున్గినని.' కాని నాప్రభావము నీపై బడవయ్యెను. ఇది ప్రకృతికి విరుద్ధము. నాకు తలవంపని పలికెను. అప్పుడు నేను నిద్రాదేవికి సాష్టాంగపడి,

"మాయన్న రఘుపతికి మా వదినకూనూ
ఈపర్ణశాలకు తాను కావనెనూ
పోపో మ్మయోధ్యాపురీ నగరునకు వేగా
ధవుని బాసినట్టి సతియుంత తగదూ
రాత్రియును పవలునూ లేవకుండగనూ
తను విడిచి పొందుమీ ధవళాక్షి నిద్రా"

యని బతిమాలితిని. ఆమె పట్టెయని వెడలిపోయినది. మరల నీనాడు నిండు సభలో నన్నావరింపవచ్చినది. అందుచేతనే నవ్వితిని.' ఇది జానపదులు ఊర్మిళానిద్రకు, లక్ష్మణుని నిద్రారాహిత్యమునకు కల్పించిన కథ. (లక్ష్మణ దేవర నవ్వు పాటలో నింతవరకున్న విషయమును రంగనాథుడుకూడ తడవెను)

ఈ కథను రాముడు వినెను. అతని గుండె జారిపోయినది. తమ్ముడొనర్చిన త్యాగము, అతని నిస్స్వార్థ సేవ, నిష్కళంకమగు సోదర ప్రేమకు తన కృతఘ్నతను, తొందరపాటును దలంచుకొని రాముడెత్తినకత్తి నట్లే యెత్తి తన కంఠమే యుత్తరించుకొన జూచెను. కాని చెంతనున్న వసిష్ఠవామదేవాదు లడ్డుపడిరి. దీనికి ప్రాయశ్చిత్తముగా వసిష్ఠుడు,

"ఘామీర మీకిట్లు బుద్ధికాదయ్యా
మీరు లక్ష్మన్నకు నిద్రపట మమర్చి
పాదాలు వత్తుమని పలికె రామూని"

రాముడు వల్లెయనెను. లక్ష్మణస్వామి కానాడు పదునాలుగేండ్లనిద్ర. రాముడాతని సమీపించి నిద్రాభంగము కలుగకుండ (లక్ష్మణుడు మెలకువతో నున్నచో శ్రీరాముని తన పాదము లంటనీయడుకదా) "ఒయ్యన పాదమ్ము లొత్తుచున్నారు" లక్ష్మణుడెంత నిద్దురలో నున్ననేమి? "ఒకమారు ఒత్తితే ఊరుకొనియుండె రెండవమాటికి కలగంటి ననెనూ- మూడవమాటికి కనువిప్పి చూచీ- కలగాదు నిజమని కడుభీతి నొందీ- ధరణీశ తాజూచి ధరణిపై వ్రాలె"ను. మరియు "అహల్య పావనమైన అడుగు మీ అడుగూ - బలి శిరస్సున నున్న అడుగు మీ యడుగూ-మీ యడుగులో తెవరు సకలదేవతలు-మా యడుగులోత్త శ్రీమన్నాథ జగద"ని లక్ష్మణు డన్నగారి కాళ్లబడెను. లక్ష్మణుని నవ్వెన కిట్టి పూర్వాపర గాథలు కల్పించిన జానపదులు తాము స్వయముగా లక్ష్మణునితోపాటు శ్రీరామ చంద్రుని పాదపద్మములు పట్టుకొన్నవారేయని నా యభిప్రాయము. రాముడు తమ్ముని లేవదీసి "చంద్రుడు లేని రాత్రి యెట్టివటులోను- తమ్ముడా నీవు లేని సభ యట్లెబోలు" నని గౌరవించెను. శ్రీరామచంద్రుని కానాడు కల్గిన మధుర భావములు వర్ణనాతీతములు. క్రొత్త పెండ్లికొడుకుల ట్లానాడు తమ్ములందరికి శోభనమహోత్సవములు నిర్ణయింపజేసెను. ఇంటిపనులందేమి రాజకీయములందేమి శాంతమ్మదే పైచేయి. ఆమెగారి నడుగనిదే యేపనియు నెవ్వరు చేయరు. ఇదికూడ ఆంధ్రులింట్లనున్న పెద్దయాడుబిడ్డల పెద్దరికమే. శ్రీరాముని కానాడు తన మరదండ్రను చూడవలెనని కుతూహలము కలిగినది. రాచవారు బావగారి కెదురుగా రారుకదా. శాంతమ్మ, సీతమ్మల కీవిషయము చెప్పి తగిన ఏర్పాటు చేసికొని తాను శత్రుఘ్నుని హాముగా పెట్టుకొని వారి నొక్కొక్కరినే అటునుండి

పోవుచుండగా చూచి మెచ్చెను. కాని "వెయ్యికన్నుల జూచి తీరదాపేక్షా." చివర కటనుండి పోవుచున్న తన్ని యెవరని శత్రుఘ్ను నడుగ నాతడు, "ఆస దేవి జెప్పక తానూరకుండె". భవభూతివిరచితమగు ఉత్తరరామచరితమున లక్ష్మణుడు సీతమ్మకు పటములు చూపుచుండగా సీతమ్మ ఊర్మిళను చూపి వత్సా ఈమె యెవతె యని యడుగును. ఇక్కడ రాముడు శత్రుఘ్ను నడిగినట్లున్నది. రాము డది గ్రహించి తమ్ము డుబ్బునంతగా నామెను పొగడి, "అష్టవంకరలతో మీ వదిన జూడు" మని సీతమ్మను పట్టిగనే వెక్కిరించినటుల జేసెను. కాని తమ్ముడు "అలాగు ననరాదు అన్న రాఘవులా- ఆదిలక్ష్మి సీత ఆలోకమాత" యని సమాధాన మిచ్చెను. అంతఃపురమున నానాటిరాత్రి యెంతయు శోభనమే. చెల్లెండ్ర తమతమ శయ్యాగృహముల జేర్చి సీతమ్మ తానును తన శయ్యాగృహము చేరబోయెను. "అల్లంతట శ్రీదేవి రాక తా జూచీ-కలకల నవ్వుతూ పలికె రాఘవులూ, వేసవి కాలాన పచ్చన్నిపూరీ- మేసిన గోవులకు ఆనందమౌనూ- పరమపతివ్రతలయిన స్త్రీలకందరికీ- పతిరాక జూచితే సంతోషమౌ" ననెను. "పాలూను పంచదార కలిసియున్నట్లు- శ్రీరాములూ సీత కలిసి రవ్వాడు- పాలూను బెల్లమ్ము కలిసియున్నట్లు- భరతడూ మాండవీ కలిసి రవ్వాడూ- జీలకఱ్ఱ బెల్లమ్ముకలిసియున్నట్లు-సౌమిత్రి యూర్మిళా కలిసిరవ్వాడు." శ్రుతకీర్తి యింకను పడకగది చేరకొనలేదు. ఆమె ఆటపాటలలో సఖులతో నుండెను. శత్రుఘ్నుడు స్వయముగా తల్లితో తన సతిని రప్పుమని చెప్పకొనెను. పాపమామె కింకను కన్నెప్రాయము గడువలేదేమో. కౌసల్య తన చిన్నకోడలిని "శత్రుఘ్నుని పానుపున ఆడుముపు రమ్మ" యని పిలుచుకొని పోయెను. "శ్రుతకీర్తి వచ్చేటి తేజమ్ము చూచీ- కంచు శ్రీ స్తంభాలు కాంతులు మణగె-మాణిక్యదీపాలు మరి వెలుగవాయె"నట. మొదట వారికి కొంత ప్రణయకలహము కలిగినను తరువాత "పాలూను పంచదార కలిసియున్నట్లు" కలిసిపోయిరి. తెల్లవారి జాము ప్రొద్దెక్కినను వారు లేవనేలేదు. ఇదిచూచి హనుమంతుని బిలిచి "వేగమే భేరిలు వేయించు"మనిరి. అప్పుడు "భేరీ మృదంగములు భోరుకొల్పగనూ, అదిరిపడి లేచిరి అన్నదమ్ములు" కాని "భరతునిపైనుంచి పసుపు డాగూలు- సౌమిత్రి లలాటమున కుంకుమబొట్టూ- శత్రుఘ్నుని చెక్కిటా కాటుకా రేఖా- ఆకుంకుమా బొట్టు అమరి" యుండెను. ఋశ్యశృంగుడు చూచి వెక్కిరించునేమోయని వారు సిగ్గుపడి తుడుచుకొనిరి. ఇక్కడ సంభోగశృంగారము నెంత సున్నితముగానో

ఈ పాటలో జానపదుల మరియొక సునోపకారము చూడనగును. అది వారి సహజభావనమందలి పామరత్వము. దీనికొక యుదాహరణము. శిష్టులకు వలెనే హనుమంతుడు జానపదులకు గూడ పరమదైవతము. కాని వారు హనుమంతునికి కొన్నియైన కోతిచేష్టల గల్పింతురు. ఆమాత్రము లేకున్నచో వారికి హనుమంతునిపై భక్తి కలుగదు. వారిది సహజమైన భక్తి. దానియందు పామరత్వము సూచించెడు హాస్యమున్నను వారికిష్టమే. పైన చెప్పబడిన శోభనపురాత్రి గడచిన తెల్లవారి అయోధ్యలో గొప్ప విందు జరిగినది. ఆ సందర్భమున సిద్ధమైన వంటకముల నిట పేర్కొన్న నోమారుకు. రామచంద్రుడు బంధువులు, మిత్రులు, ఆప్తులు అందరితో కలిసి భోజనము చేయుచుండెను. భోజనకాలమున మధమధ్యన గోవిందలుగొట్టుచు లంకావిశేషములు ముచ్చటించుచు తినుచుండిరి. అన్నియు బాగుగనే యున్నవి కాని వారు హనుమన్నను మరచి యుండిరి. పాపమా భక్తు డెవ్వరికిని జ్ఞప్తికి రాలేదు కాబోలు. అప్పుడు మెల్లగా "పులుతు పులుతూమని వచ్చె హనుమాను" రామునికి తన పొరపాటు తెలిసినది. ఏమి చేయగలడు: ఏదో విధముగా హనుమంతుని బతిమాలి భోజనమునకు కూర్చుండబెట్టవలెను. హనుమంతుని సమీపించి మెల్లగా "ఇంటివాడవు గనుక ఊరుకుంటిమి - పొత్తున గూర్చోమ్మి ఉత్తమాపురుష - నీ వుండగా గదా సీత దెచ్చుకొని- అయోధ్యపట్నమ్ము ఏలగలిగితినీ- నీవుండగా గదా తమ్ముల పంక్తి - భుజియింపగలిగితిని హనుమన్న వినుమా - పొత్తునా గూర్చోమ్మి ఉత్తమా పురుష " యని రాముడు వేడుకొనెను. ఈ మాటలు విన్న హనుమంతునికి కోపమువచ్చినది. ఇంటివాడవని సవరించి చెప్పినంతమాత్రమున సత్యము నెరుగజాలనివాడు కాడుగదా. ఇంతమాత్రపు వేడికోలుచే హనుమంతుడు ప్రసన్నుడు కాలేదు. అతని కోప మేవిధముగా తీరునో కదా! ఎత్తినది కోతి జన్మ; రామభక్తికి లోపము కలుగకుండునట్లుగా "పొత్తునా గూర్చుండ ఉత్తముడ గాను" అని రామచంద్రునితోబాటు అచట పొత్తున గూర్చున్నవారికి గూడ వడ్డించెను. ఎంతైనను రామభక్తుడుగదా. రామప్రసాద మనుభవింపగోరినవాడై యా భక్తుడు 'సర్వేశు భోజనం తా రాగజూచి- పందరా పళ్ళెమ్ము ఎత్తుకొని పోయె- తా బోయి హనుమన్న ఆపిసిపెట్టెక్కె" (ఇది జానపదుల కిష్టమైన హనుమంతుని గుణము). ఇంతటితో ఊరకొనెనా? "ద్వాదశి ఒకముద్ద కొమ్మపై నుంచె - ఆకుమీద పళ్ళెమ్ము అందీ పడవేసె" ఇపుడికైనాని హనుమంతునికి

కనిదీరినట్లులేదు శ్రీరాము డవిసెచెట్టు క్రింద నిలబడి "ఏమి జాలి హనుమన్న రమ్మని పిలిచే''. రామభక్తునికి కోపము తగ్గినది అప్పు డాతడు 'రామచిలుకా వలెను చేయిపై వాలె'ను. రామచంద్రుడు 'చేతిపై హనుమన్న ధరణిపై దించి- ముత్యాలహారమ్ము మెచ్చి మెడవేసె'ను. హారము వేసికొన్న హనుమంతుడు ఎప్పటివలె జానపదులకు పరమదైవతము. అంతవనుక కోతియే. ఇది జానపదుల మనఃప్రవృత్తి. రంగనాథరామాయణములో శ్రీరామచంద్రుడు భోజనసమయమున ఆంజనేయుని మరువలేదు. పొత్తున గూర్చుండ బెట్టుకొని భుజింపుమని కోరెను. రాము డొక్క కబళ మెత్తగనే ఆంజనేయుడు "ప్రబలమౌ భక్తి నప్పళ్ళెరం బెత్తి, తలమీద నిడుకొని తనర నాడుచును, జెలగుచునో కపిశేఖరులార, రండు రాముని పళ్ళెరము ప్రసాదంబు, దండిగా దొరకె నందరకు నేడనుచు, మునివృక్షమెక్కి యిమ్ములదాని దళము, లనువొందగా ద్రుంచి యా ప్రసాదమును'' కపినాయకులకు పంచినట్లున్నది. రంగనాథుని భక్తాంజనేయుని జానపదులు కోతిగా చిత్రించిరో, జానపదుల కోతిబత్తుని రంగనాథుడు సంస్కరించెనో తెలియదు.

భాస్కరరామాయణమందలి సుందరకాండము నంతయు పదముగా వ్రాసినది శాప గోపాలుడు. ఆనందగజపతి మహారాజును అతని భార్య వనకుమారీదేవిని పొగడుటచే విజయనగరవాసి యనియు ఆనందగజపతి సమకాలీనుడనియు తెలియనగును. రచయిత కొంత సంస్కారము గలవాడు. ఆంజనేయుడు లంకను ప్రవేశించిన రాత్రి "శ్రీరామకార్యములు సిద్ధిబొందుండునని ఆకాశమును పూసినట్లు" గనపడెను. "దేవతలు యెత్తినా దీపమన్నట్లుగా చీకట్లు తొలగింప చంద్రు డుదయించె"నట. దీనికి మూలము,

పావనికి సీత వెదకం
గా విశ్వము గానిపింప ఘనతమ మడగన్
దేవత లెత్తిన దీపము
కైవడి చందురుడు వెలిగె గగన తలమునన్ [1]

---

1. సుందరకాండము 89 (భాస్కర రామాయణము).

ఆంజనేయుఁడు తన విశ్వరూపమును సీతమ్మకు చూపించినప్పుడు "జలనిధులు కులగిరులు చాల క్రిందాయె" "తారలును తలపువ్వులాయె" నట. దీనికి మూలము,

> జలనిధులు జానుదఘ్నం
> బులుగా కులగిరులు గజ్జ పొదవులుగా తా
> రలు తల పువ్వులుగా ది
> క్కులు కడవం బెరిగె కనకకుధరము భంగిన్ 2

రామాంగుళీయకమును సీతకిచ్చి తిరిగివచ్చిన ఆంజనేయుడు రామునితో "చిత్తగించుము నీదు చిటికెనే లుంగరము, ఆదిలక్ష్మి చేతి కమర కంకణ"మనెను. దీనికి మూలము,

> బాతిగ నిడ గ్రైవేయక
> మై తోచెదు నాకు నాదు ప్రాణేశునకున్
> చేతం బెట్టగ కంకణ
> మైతో కేయూర మైతొ అచ్చట చెపుమా.3

లంకాపురవర్ణనము, రాక్షసస్త్రీల వర్ణనము, ఆంజనేయాదులు సుగ్రీవుని మధువనమున జేయు అల్లరులు అద్భుతముగా నున్నవి.

ఉత్తరరామాయణమునకు సంబంధించిన గాథను- అనగా చూలాలగు సీత వనవాసము, కుశలవ జననము, వాల్మీకి చెంత వారి విద్య, శ్రీరామాశ్వమేధము, కుశలవయుద్ధము, సీతమ్మ భూప్రవేశము మొదలగువాని - వర్ణించుపట్టి పాటలు పెక్కులు. వేపూరి బ్రతుకమ్మ కుశలవపాట, కుశలాపకము, కుశలవుల యుద్ధము, కుశలవ కుచ్చల చరిత్రము వంటివి దీర్ఘగేయములు. 'వేపూరి బ్రతుకమ్మ కుశలవ పాట' హనుమద్దాసుకృతము 'మన్నెముగిరిధామా వలలో వేపూరినగరేశా వలలో" యనుటచే వేపూరి ప్రాంతమున నున్న మన్నెముకొండ శ్రీరాముడు కృతికర్తకు ఆరాధ్యదైవతమని తెలియుచున్నది. ఈ రెండు

---

౨. సుందరకాండము ౩౦౮ (భాస్కరరామాయణము)

౩. ,, 293 ,,

గ్రామములు పాలమూరు మండలములోనివి బతుకమ్మ పండుగ సమయమున చేతులు తట్టుచు కాని కోలలు వేయుచు గాని పాడెదరు కుశలవగాథ యిది కృతికర్త తెలంగాణమువాడు. చుప్పనాతి విడిచిపెట్టిపోయిన రావణుని పటము కారణముగా రాముడు సీతాదేవి నడవులకు పంపించెను. వాల్మీకి యాశ్రమమున సీతమ్మ ప్రసవించి ఒక్క కుశకుమారునే కనెను. వాల్మీకి మట్టిబొమ్మకు ప్రాణముపోసి లవుని సృజించుట ఇందులో గల వింత. తక్కినదంతయు సాధారణమే. అశ్వమేధయజ్ఞపరిసమాప్తివరకే కథ సాగిపోయినది.

పెద్దమజ్జపాళెము "కాపురస్తులు" వూరి పాపరాజు జగ్గమ్మ దంపతుల తనయుడు రామచంద్రరాజు. దుందుభినామసంవత్సర కార్తీక బహుళ దశమి నాటికి కుశలాయకమును పూర్తిచేసెను. ( దుందుభి 1863 ). ఈతడు రామాయణము, విచిత్రరామాయణములను చూచి ఈపదము వ్రాసెనట. కుశలవుల కథనే నోరు దిరుగనట్టివారు కుశలాయకం బందురట. పదగుంభనలు చేయ సమర్థుడయ్యును "కఠినము లుంచితె కాపులకు తెలియదని, మరుగు లుంచుట మాని మాటలుంచె" నట. శ్రీరామజననమునుండి రావణసంహారము వరకున్న కథను క్లుప్తముగా వర్ణించి పట్టాభిషేకమునుండి శ్రీరాముడు వైకుంఠమునకు పోవువరకు దీర్ఘముగా వర్ణించినాడు. విచిత్రరామాయణమును చూచి వ్రాయుటచే కాబోలు దీనిలో నతి విచిత్రములైన కథలున్నవి. శక్తిభద్రుని "ఆశ్చర్య చూడామణి" నాటకమున గూడ నిట్టి విచిత్రములు గలవు. శ్రీరాముని మరల వైకుంఠమునకు రప్పించుటకై దేవతలంద రాలోచనలు సల్పిరి. తత్ఫలితముగా సరస్వతి చాకితయై అయోధ్యలో భర్తతో తగవులాడుట, దాసివలన కలిగిన జనాపవాదమున రాముడు సీతాసాధ్వి నడవులకు పంపించుట దీర్ఘముగా వర్ణింపబడినది. వాల్మీకి జానకిని మిథిలానగరమునకు ప్రసవమునకై కొనిపోవుచుండ నామె మధ్యేమార్గమున ప్రసవించి కుశలవుల గనెను. వారు జనకునికడ చేరి యటనే యుండిరి. వాల్మీకికూడ అచ్చటనే యుండి కుమారులకు విద్యలు చెప్పెను. ఉత్తరకాండ తప్ప తక్కిన రామాయణ మంతయు నాతడు వారికి చెప్పెను. గురుదక్షిణకై భిక్షకు పోయెడువారా రాకుమారులు. తల్లి వారి నుత్తరదిక్కుకు పోవలదన్నను వారు పోయి అయోధ్యలో రామునికి రామాయణము వినిపించిరి. రామాదులు వారిని గుర్తించి అందరు కలిసి సీత చెంతకు వచ్చిరి. కాని యామె దుఃఖముతో భూప్రవేశ మొనర్చి లక్ష్మియై వైకుంఠము చేరెను. కౌసల్య,

సుమిత్ర, మున్నగువా రగ్నిప్రవేశ మొనర్చిరి. కుశలవపట్టాభిషేకము చేసి లక్ష్మణవియోగమున శ్రీరాముడు సన్యాసము స్వీకరించి స్వర్గమునకు పోవుటకు ముందు విభీషణాదులకు వరము లొసగెను. ఈ వరములు వింతగా నున్నవి. శ్రీరాముడు విష్ణువై, లక్ష్మణు డాదిశేషువై, భరతశత్రుఘ్నులు శంఖచక్రములైరి. ఇది క్లుప్తముగా కుశలాయకమందలి కథ. అక్కడక్కడ వర్ణనములు ప్రబంధ ధోరణిలో నడచినవి.

'కుశలవుల యుద్ధము' వ్రాసినదెవరోకాని దాని చివరన "వరుసగ ఇది వాల్మీకిరామాయణము, తరపున వ్రాసెను ఈకవి తాను'' అని చెప్పుకొనెనే కాని ఇందు విచిత్రమైన కల్పన లున్నవి. "కుశలవకుచ్చల చరిత్ర" కును ఈ పాటకును చాలచోటుల పోలిక లుండుటయేకాక కొన్ని ఘట్టములందున్న వాక్యములుకూడ అటులనే యున్నవి. ఒక్క లక్ష్మణునికి మాత్రమే కుశలవులు రామపుత్రులని తెలియును. తక్కినవారికి తెలియక యుద్ధమొనర్చిరి. లక్ష్మణుడు తొలుత కుమారులచెంతకు ఒంటరిగా పోయి రహస్య సంభాషణము చేసి తరువాత అందరివలె తానును పోరాడెను. కుశలవులు యుద్ధమున నాంజనేయుని బంధించి ఆ కోతిని తల్లికి కానుకగా నిత్తురు. శ్రీరాముడు అంగదవిభీషణాదులను కుశలవులకడకు యాగాశ్వమును విడువ రాయబార మంపును. విభీషణుడు కుశలవులతో శ్రీరాము డాదినారాయణుడన వారు లక్ష్మి యేదనిరి. అతడు 'వారిజాక్షు వక్షస్థలమందున - వరలక్ష్మి వున్నదని పలికితే' వారు 'లక్ష్మిని గనుక నీవు చూపకుందువా- నీదే బిరుదు గాదని రపుడు- నాడు లంకాపట్నము గట్టుటకైన-రావణుతోడ కయ్యము చేసె- ఆయువు చెప్పి అన్నను జంపి- అతి క్లేశంబులు బడితివి నీవు-నేడ యోధ్యపట్నము గట్టించెదను, చూపించుమ శ్రీలక్ష్మిని' అనిరి. రాముడు కుశలవులతో యుద్ధము చేయుటకు వైకుంఠమునుండి గరుడుని రావించెను. కాని యా గరుడుడును కుశలవులకు భయపడి వాహనకార్యమునకు అంగీకరింపడు. రాము డేనుగు నెక్కి యుద్ధము చేసెను. రామునికి కుశలవులకు జరిగిన సంవాదము చిత్రముగా నున్నది. రాముడు వారితో "పట్టర బాలుర బాణం తొడిగితి- తలచుకోర నీ దైవములను'' అనగా వారు "తల్లినైన తలచి మ్రొక్కుటకు-తగినటువంటి తల్లులె కారు- అడవుల కంపిన అమ్మలు లేరు" అనియు, రాముడు వారి శౌర్యముచూచి, "ఎన్ని తపంబులు చేసికొందురో-ఎన్నగ మీవంటి తనయులు కల్గ"ననగా ''తపములు జపములు చెయ్యగలేదు—పుత్ర

కామేష్టులు చెయ్యఁగలేదు" అనియు దెప్పిపొడిచిరి. రాముడు యుద్ధమున బ్రహ్మ శంకరదేవేంద్రులను తనకు సహాయులుగా రమ్మన వారి భార్యలు సరస్వతి, పార్వతి, శచీదేవులు వారి నాపివైచి తాము కుశలవుల పక్షమున నుండిరి. వారే రాయబారములు జరిపిరి. శ్రీరామాదులు తమకు మ్రొక్కిననేగాని కుశలవులు యుద్ధము విరమింపమనిరి. పార్వతి వారికోర్కి చెల్లింపుమని రాముని గోరెను. అతడీ కుఱ్ఱల కెట్లు నమస్కరింతునాయని చేయునదిలేక హృదయమున గురువులను తండ్రి నుంచుకొని అది సాకుగా వారికి నమస్కరించెను. "శరణు శరణు మాతండ్రి దశరథరాజు పాదంబులకు కులగురువు వసిష్ఠులకు, శరణు శరణు మా కౌసల్య చరణారవిందములకు, శరణని చక్రధరుడే పలికె" నట. ఇది విజయనగర రాజులు తమ సింహాసనముపై ఖురాను గ్రంథము నుంచుకొని తురకలచే మ్రొక్కించుకొనిన కథవలె నున్నది. సీతారాములు కలిసిన తరువాత మరికొన్ని చిత్రము లున్నవిగాని యవి యనౌచితీదోషదూషితములు.

'కుశలవ కుచ్చల చరిత్రము'అనుపాట కుశలవయుద్ధముమరియు కుశలవ కుచ్చల చరిత్రయను పూర్వోదాహృతముల రెండిటి కలయిక. దీనియందు మరికొన్ని విలక్షణములగు కథలున్నవి. శ్రీరాముని ఊర్మిళ మొదలగు మరదండ్రు సీత నడవికి పంపవలదని బతిమాలినప్పటి సంభాషణములు దెప్పి పొడుపులు అత్యద్భుతముగా నున్నవి. సీతమ్మ కుశలవులకు రామాయణగాథ చెప్పునప్పుడు కైకేయీదశరథులను గూర్చిన వింతకథ నొకటి చెప్పెను. కైకకు దశరథు డేవిధముగా లోబడెనో చీమలు సంభాషించుకొన్న ఘట్టము చిత్రముగా నున్నది. కుశలవులతో శ్రీరాము డయోధ్య చేరుకొని కౌసల్యాది అంతఃపురవాసు లందరను వారివారికిగల కోర్కు లడుగును. తల్లులు తమ్ములు మరదండ్రు బంధువులు హితులు వారివారి ఇష్టానుసారముగా కోర్కులు తెలిపిరి. అంజనేయుడు తన కోరిక నిట్లు తెలిపెను. "సిరితోగూడ మిమ్ముల మోయుట-కెక్కువ గోరనన్నా నేను". ఇది యాతని భక్తికి తార్కాణము. సీతను ఋషికాంతలు "నిగమాద్రీశుడు నీ చింతాల దెగజిమ్మగలడూ, మగువా నీవీ ఘనమ్మృగమూల నడుమ పగవాగ పనియేమొ అగుపడదయ్యో" ననిరి. ఇందులోనున్న సీతారాముల జోలపాటలో "రహి పాటి పార్థసారథీ దాసునకునూ మహితసంపదల సమ్మతి నిచ్చు రామా" యని కలదు.

తిరునగరు అనంతదాసుని "రామనాటకము" లో నిగమాద్రీశుడను మకుటముగల పాటలున్నవి. కనుక నీ పాట కుశలవ కుచ్చల చరిత్రమున ప్రక్షిప్తముగా చేరియుండును. ఇక రహిపాటి పార్థసారథి లాలిపాట. ఈ పాటయే వెస్టువార్డు కంపెనీవారు ప్రకటించిన"నూతన వేడుక పెండ్లి పాటల"లో నున్నది. కనుక నిదియును ప్రక్షిప్తమేయని భావించవలెను. కుశలవ కుచ్చెలకథ నడచిన వరుసయందున్నవికాక తక్కినవన్నియు దీనిలో చేరిన ప్రక్షిప్తములు.

పసగాడ సన్యాసి యనునాతడు రావణునికన్న పదిరెట్లు బలశాలియగు మరియొక రాక్షసుని కథ వ్రాసెను. దశకంఠుని ధాటికే సమస్తలోకములు దద్దరిల్ల నీ యాంధ్రజానపదకవి శతకంఠుని పేరుతో నొక "శతకంఠ రామాయణము'' రచించెను. ఈ కథను తొలుత కల్పించిన వాల్మీకి యెవరో తెలియదు. వసిష్ఠోత్తర రామాయణమున నీ గాథ కలదు. బెంగాలీ రామాయణము లందును సీతావిజయమను పేర శతకంఠరామాయణగాథ లున్నవందురు. తెలుగులో శతకంఠరామాయణమను యక్షగానములును, ద్విపదలును ప్రబంధములును కూడ కలవు. పందొమ్మిదవ శతాబ్దము మధ్యభాగమందుండిన పరశురామపంతుల అనంతరామ పండితుడు సీతావిజయచంపువను పేరుతో శతకంఠరామాయణమును సంస్కృతములో రచించెను. దశకంఠుని జంపిన రామునిపై పగదీర్చుకొన నీశతకంఠుడు తపమొనర్చి బ్రహ్మచే వరముల బొందెను. కాని ''నిస్సారబుద్ధిచే నెలతచే చావు, తను బొందకుండంగ తానడుగడాయె''ను. దీనికి కారణ మాతడు కణ్వుని పెంపుడు కూతురును బలిమిని చెరపట్టి స్త్రీచే మృతుడవౌదువని కణ్వునిచే శప్తుడగుట. శతకంఠుని తల్లి చిత్రగంధి. ఆమె కొడుకునకు బుద్ధులు చెప్పినను వాడు వినడయ్యెను. సప్తసాగరముల కవ్వల నున్న ప్రతాపలంక వాని పట్టణము. మునీంద్రులు వాని ఘోరచర్యలు రామున కెరిగించి వాని మారణ రహస్యమును చెప్పిరి. శ్రీరామునికి విభీషణుని రాక్షసబలము, సుగ్రీవుని వానరబలము తోడయ్యెను. ఆదిశక్తి సీతమ్మ యుద్ధము చేయ బయలుదేరెను.ఆంజనేయుడు విశ్వరూపము ధరించి సమస్తసైన్యముల మోసికొని వార్ధుల దాటెను. రామశతకంఠులకు జరిగిన యుద్ధము రామరావణయుద్ధముకన్న గొప్పది. కాని శతకంఠుడు చివరకు సీతాదేవిచే నిహతుడగును. పాలివాడగు విభీషణుడే వాని కగ్నిసంస్కార మొనర్చి యచ్చటనే ''సరయూనదియందు స్నానములు జేసె"నట. సప్తసముద్రము లేమైపోయినవో కాని సరయూనది

ప్రత్యక్షమైనది. రాముడు శతకంఠుని కుమారుడు నీలకేతునికి పట్టాభిషేక మొనర్చి ససైన్యముగా తిరిగిపోయెను. రచయిత కొంత చదువుకొన్నవాడు కనుక పూర్వకవుల ఛాయలు కనబడుచున్నవి. ఆంజనేయుడు విశ్వరూపము ధరించునపుడు భాగవతమందలి వామనమూర్తి విజృంభణమును, సీతయుద్ధము సత్యభామానరకాసురయుద్ధమును జ్ఞప్తికి దెచ్చును. ఇట్టి విచిత్రములతో కూడిన శతకంఠరామాయణము వంటివి, ప్రజావాఙ్మయమున నెన్నియో కలవు. ఈ యద్భూతకల్పనలు ఆదిమానవుని పామరత్వము అనంతమైన ప్రకృతియెడ వానికిగల మనోభిప్రాయములను సూచించు.[1]

ఇక కేవలము సీతమ్మ నాధారముగా చేసికొని పెరిగిపోయిన పాటలను చర్చింతము. ఈ పాటలందు కొన్ని రామాయణమునకు సంబంధించినవి కాని యధికభాగము మన యిండ్లలో జరుగు సంఘటనములే సీతమ్మ కంటగట్టబడినవి. ఇట్టి పాటలను సాంఘికములు లేదా గృహజీవనమునకు సంబంధించిన పాటలలో చేర్చి యటనే విమర్శింపవలయును. ప్రస్తుతము కొలదియో గొప్పయో రామాయణముతో సంబంధముగలవాని నొండు రెండు పేర్కొందును.

'సీతాకల్యాణము' పాట నెవరు వ్రాసిరో తెలియదు. జనకునింట సీతమ్మ ఆడుచు పాడుచు నొకనాడటనున్న శివధనువు నెత్తెను. అది చూచిన జనకుడు శివధనువునెత్తి వంచెడువానికే కూతురు నిత్తునని చాటించెను. తక్కినకథ యంతయును సాధారణమైనదే. ఈడేరిన సీతమ్మ నిటుల వర్ణింపనైనది.

"పండువెన్నెల మించు యాపణతిమోము,
గండుమీనులబోలు కలికి కన్నులవి
తోరంపు బొమ్మలవి తోయజగంధి,
కీరపలుకులబాల కువలాయతాక్షి

---

1. "Such Myths have their Source in the attempt ofthe human mind, in a primitive and unscientific age, to explain the Various forces and phenomena of Nature with which man is confronted. They present in fact the conjectural sciencet of of primitiv mental condition." Vedic Mythology By A, Macdonell P, I.

తిలపుష్పములబోలు తీరునాసికము,
　　　తళుకుటద్దము మించు తరుణి చెక్కిళ్లు
పగడంపుచాయల పణతి పెదవులవి
　　　తగు ముత్యములబోలు తరుణి దంతములు
నునుపు శంఖముబోలు నళినాక్షి గళము,
　　　తొలకరితీగె యా తోయజగంధి
అరటిబోదెల మించు అతివ పెందొడలు,
　　　కరిదంతములబోలు కలికి పిక్కలది
మదగజగమనంబు మగువ నడకలది,
　　　కొదమ తాబేల్వంటి కుదురు నడకలది"

ఈ వర్ణనము ప్రబంధమార్గమునకు దగ్గరగా నున్నది. పిక్కలను సాధారణముగా వరిపొట్టలతో బోల్చుట వాడుక కాని దీనిలో ఏనుగు దంతములతో పోల్చుట జరిగినది. క్రొత్త యుపమానము.

'సీతాదేవి యానవాల'న్నపాట చాలమనోహరమైనది. సీతాన్వేషణమునకు బయలుదేరు హనుమంతుడు శ్రీరామచంద్రుని తాను సీత నెటు లానవాలు పట్టవలెనో చెప్పుమని యడిగెను. శ్రీరాముడు సీతాదేవి యందచందములను కొన్నింటిని చెప్పెను. అటులనే తమ దాంపత్యజీవితమున గడచిన కొన్ని మధుర సన్నివేశములనుకూడ చెప్పెను. ఇవి యన్నియు కలసి సీతాదేవి యానవాళ్ళను పాట యయ్యెను. ఆంజనేయుడు లంకకు పోయి సీతకు రామముద్రిక నిచ్చి తిరిగి శ్రీరామునకు వార్తదెచ్చు పర్యంత మీపాటలో నున్న విషయము. దీనిలో శ్రీరామచంద్రుడు సీతాదేవి సౌందర్యమును వర్ణించి చెప్పిన ఘట్టము జానపద వాఙ్మయమునకేకాదు సకలప్రపంచశిష్టవాఙ్మయమునకు తలమానికము. ఇందులో తుచ్ఛమైనట్టి అంగాంగవర్ణనముగాని బాహిరసౌందర్యముగాని అవేలముగా వర్ణింపబడలేదు. సీతమ్మ "తలఅంటు ఆడకే ఆడినట్లుండు, పచ్చిపసు పలదకే అలదినట్లుండు, పెట్టక కాటుక పెట్టినట్లుండు,, దిద్దక తిలకమ్ము దిద్దినట్లుండు. అలదక పరిమళ మలదినట్లుండు, మసిపాతగట్టిన మాణిక్యంవలెను, శీతకాలము

నాటి ఉదకమ్మువలెను, పాడ్యమి జదివిన వేదమ్మువలెను,[1] పరమసతి ప్రభావ మెల్ల జెడియుండు" నట. ఒకనాడు సీతమ్మ అలంకరించుకొని "అద్దములోపల అతివ తనరూపు, అందులో జూచి పురు లంకించి ముడువ, ఈ అద్దములోను ఈ రూపుతోను, ఇంత చక్కని దేవి ఇది ఎవ్వరనుచు" తానే భ్రమపడి శ్రీరాము డింకెవరో స్త్రీని తెచ్చిపెట్టుకొనెనని భావించి "ఏకపత్నీవ్రతుడవని ఇచ్చె మాతండ్రి ఏకపత్నీవ్రతుడవని ఎరుగుదు మేము, ఇట్టి మాయల సతిని పిలిపించదగునా" యనెను. రాముడది గ్రహించి ఆమె మౌగ్ధ్యమునకు నవ్వుకొని సీతతో పతిలేని సతిజూచి అట్లనుకొంటివేగాని ఆమె పతిని కూడ పిలిపించెదను చూడుమని తాను సీతమ్మ ప్రక్కన నిలబడెను. అద్దములో నిరువురి బింబము లగుపడ సీతమ్మ వారెవరని ప్రశ్నించెను. రాముడు వారు సీతారాములనెను. ఈ ముగ్ధభావన వారి జీవితమందలి మధురసన్నివేశము. ఇట్టి వెన్నియో ఈపాటలోనున్నవి. ఇంకొకటి. ఒకనాడు చిత్రకూటసమీపమున స్నానము చేయుటకై "పచ్చిపసు పలదుకొని పద్మాయతాక్షి, కొలని దగ్గర కెళ్లె గోవిందుదేవి". కాని కొలనులో దిగుపరికి "మింటచంద్రుడు వచ్చి ధరణి నున్నాడు, కొలనులో తుమ్మెదలు ఆడుచున్నావి." సీత తిరిగిపోయి రామునితో చెప్పి చంద్రుని తుమ్మెదల నటనుండి పారద్రోలిననే కాని తన స్నానమునకు వీలుకాదనెను. రాముడామె వెంబడి కొలను సమీపించెను. కొలనులో నామె యిదిగో చంద్రుడు, ఇవిగో తుమ్మెదలని చూపించెను. శ్రీరాముడు నవ్వి ఇతడు చంద్రుడు కాడు నీముఖము, ఇవి తుమ్మెదలు కావు నీకురు లనెను. సీత సిగ్గుపడెను. అతిశయోక్తి యైనను ఎంతసుందరముగా నున్నదీ సన్నివేశము. ఇటులనే రాము డాంజనేయునికి కాకాసురవృత్తాంతమును చెప్పెను. అత్రియాశ్రమమున అనసూయ సీతమ్మకు కానుకగా "పాయని శృంగారం మాయని మడత, కందనీ భూషణములు కాంత తానిచ్చి"న సంగతికూడ ఒక ఆనవాలుగా చెప్పెను. అరణ్యవాసమున సీతమ్మకి మహాపతివ్రత యిచ్చిన భూషణములే కాపైనవి. వినువారిని భావాంబరవీధిని విహరింపజేయు నిట్టివిశేషము లీపాటలో ఇంకను కలవు. తమిళమందలి పెరియాళ్వార్(విష్ణుచిత్తుడు) రచించిన

---

1. స్మాత్రుకృత్త్వేవ తన్వంగీ తద్వియోగాచ్చ కర్శితా,
   ప్రతిపత్పాఠశీలస్య విద్యేవ తనుతాం గతా.
   వాల్మీకిరామాయణము, సుందరకాండము ౕ౨-౩౫.

భక్తిగీతములందును శ్రీరాముడు తనకు చెప్పిన విషయములను ఆంజనేయుడు ఆనవాలుగా సీతమ్మకు వినిపించినట్లున్నది.

'కోవెల రాయబారము'ను పాటలో లంకయం దశోకవనముననున్న సీత ఒక వెన్నెలరాత్రి శ్రీరామవిరహమున తపించుచు కోయిలతో శ్రీరామునికి తన దీనావస్థ నెరిగించి తోడ్తెమ్మని బతిమాలు గాధ గలదు.

"మెదది హారంబిస్తు కోవెలారో
ప్రాణేశు దోడ్తెమ్ము కోవెలారో
పక్షిజేసిన పనులు కోవెలారో
ఉపకారములు ఉండు కోవెలారో" యని బతిమాలును.

"సీతమ్మ అగ్నిప్రవేశము" పాటలో మారీచుడు మాయామృగమై వచ్చుటనుండి శ్రీరామపట్టాభిషేకము వరకుగల గాధ వర్ణితము రావణ వధానంతరము రాముడు లక్ష్మణునితో ''కుక్కముట్టిన కుండ కొరగాదు సుమ్మి" యని సీతమ్మను విడిచియే అయోధ్యకు పయనమయ్యెను. సీతమ్మ ''భూదేవి పుత్రికను శ్రీరాము సతినంచు'' ఆనలుపెట్టి రథము నాపి''పతితిగా గొని యిట్లు బలుకంగ దగున, పక్షులలోనయినవృక్షములనైన,పశుమృగంబులనైన పుట్టలేనైతి తప్పున్న శిక్షింప ధాతవే నీవు'' అని బతిమాలెను. సీత అగ్నిప్రవేశ మొనర్చినను రాముడు స్త్రీలు ''అగ్నిమంత్రంబున అగ్ని బట్టేరు, వేడివస్తువు లెల్ల పట్టిచూచేరు'' అని సీతమ్మను నమ్మడు. స్త్రీలు వంటలు చేయుటవలన కలిగిన దోషమిది. దేవతలు ప్రత్యక్షమై సీత నిర్దోషియని చెప్పిరి. శ్రీరాము డయోధ్య చేరుకొనెను. శ్రీరామపట్టాభిషేకసమయమున "వాయుదేవుడు వచ్చి వసుంధర నూడ్చె. వరుణ దేవుడు వచ్చి వాకిండ్లు దడపె, దేవకన్యలు వచ్చి దేదీప్యముగను, ముత్యాల ముగ్గులు ముదముతో బెట్టి''రట. జానపదులకిట్టి యద్భుతవిషయములందు అభిమానము హెచ్చు.

ఇక నేను సేకరించినవానిలో ఒక్క రామాయణగేయమును పేర్కొని ఇంతటితో నీ రామాయణసంబంధగేయముల ప్రసక్తి చాలింతును ఈ గేయము

పేరు 'మాయ లేడి పాట'[1]. పర్ణశాలలో సీతారామలక్ష్మణులుండగామాయామృగము వచ్చుట, దాని జూచి సీతమ్మ రామునితో నా లేడిని పట్టి తెమ్మనుట, మాయా మృగము పరుగెత్తి రాముని మోసగించుట, లక్ష్మణు డన్నను వెదకబోవ రావణుడు సీత నపహరించుట ఇందలి కథ.

## మాయలేడి పాట

రామయ్య గట్టించే కోలు-రత్నాలా మేడ కోలు
సీతమ్మ గట్టించే ,, -సిరిపరినాసోలా ,, (చిరు పర్ణశాల)
సిరిపర్న సోలాలా ,, -సిత్తారి ముగ్గు ,, (చిత్రపు)
సిత్తారి ముగ్గుపైనా ,, -రత్నాల కమ్మడీ ,, (కంబళి)
రత్నాల కమ్మడిపైనా ,, -రాలు మల్లేలూ ,,
రాలు మల్లెలపైనా ,, -వాలు చిలుకాలు ,,
వాలు చిలుకలపైనా ,, -వారిద్దారయ్యా ,,
రామయ్య సీతమ్మా ,, -జూద మాడంగా ,,
(ఆడుచునాడుచు) ఆడుతాడుత వచ్చే ,, -అది మాయలేడి ,,
మాయలేడికైనా ,, మడిమే లందమ్మా ,, (మడమ)
అటుజూడు రామయ్యా ,, -అటు జూడావయ్యా ,,
పిల్లలేడికైనా ,, -పిక్క లందమ్మా ,,
(చేరెడు-చేటెడు) చేరాడు చేటాడు ,, -చెవ్వు లుంటంగా ,,
మంచిలేడీ గాదు ,, మాయలేడీ సీత ,,
మాయలేడీ గాదు ,, -మంచీ లేదయ్యా ,,

---

1. నల్లగొండ మండలమున నకిరెకల్లు గ్రామములో పోలీసు అధికారుల సహాయముతో సేకరించిన పాటలం దిదియొకటి. పాడినవారా గ్రామమువారు కారు. వారిది కేతెపల్లి నల్లగొండ తాలూకా, వృత్తి కట్టెకోత. 13-4-1952 రాత్రి 9 గంటలకు వారితో నకిరెకల్లు పోలీసుస్టేషను వెనుక కోలాటము వేయించితిని. కోలాటములో మధ్యననుండి పాటలు చెప్పినవాడు కోడెరెక్క దైర్నప్ప. కోలలు వేసినవారు చింతపల్లి అంతయ్య, చప్పిడి పీరయ్య, గండిమల్ల జయ్యన్న మున్నగువారు.

ఆలేడి నెయ్యంది ,, -రాము డుండేమీ ,,
ఆలేడి చర్మంబు ,, -రవికే గావలెనూ ,,
(తాపిన) ముత్యాలు దాపిన్నా ,, -రవికే లుండంగా ,,
పగుడాలు దాపిన్నా ,, -రవికే లుండంగా ,,
వట్టితోలుకు నువ్వూ ,, -వలసినవా సీతా ,, (వలచు)
పచ్చితోలుకు నువ్వూ,, -బమిసినావా సీతా ,, (భ్రమయు)
నీముఖం చూచేనా ,, -ఓ నీతిపరుడా ,,

రాముడెంత చెప్పినను సీత వినదు. చివరకు రాముడు లేడిని పట్ట సంసిద్ధుడయ్యెను.

(వడివేసి) కుడిమీసం ఓడేసి కోలు- గుడ్డెత్తా జేసి కోలు
ఎడమ్మీసం ఓడేసీ ,, - ఎన్నెత్తా జేసీ ,,
విల్లునమ్ముల పోదీ ,, - వీపున వేసిండూ ,,
సందెడమ్ముల కట్టా ,, - సంకన బెట్టిండూ ,,
వంపున రామయ్యా ,, - మిట్టన ఆ లేడీ ,,
ఆలేడి లేసిందీ ,, - రెండు వోజనంలూ ,, (యోజనము)
రామయ్య లేసిండూ ,, - ఒక్క వోజనమూ ,,
ఆలేడి లేసిందీ ,, - మూడు వోజనంలూ ,,
రామయ్య లేసిండూ ,, - రెండూ వోజనంలూ ,,

ఈవిధముగా నా మాయలేడి రాముని ఎనిమిది యోజనములవరకు తీసికొనిపోయెను.

ఏడు పొలిమెరలైనా కోలు- ఎల్లా దాటిండూ కోలు
తలమీంచి తంగెళ్లు ,, - తా దూకుకుంటూ ,,
పాయెనె రామన్నా ,, - లేడీ జాడానా ,,
అంతాటింతట బోయి ,, - నీలా గుండంలా ,,
నీలాగుండం మీదా ,, - నిలబాడి సూసే ,,
పుట్టసాటున లేడీ ,, - పూని మెయ్యంగా ,,
కాలొంచి పెట్టిండే ,, - ఎక్కు బాణాలూ ,,
హరియని పడ్డాదీ ,, - ఆ మాయాలేడీ ,,
హరియన్న మాటల్లూ ,, - ఆ సీతా వినే ,,

మల్లెతోటల వున్నా ,, - మరదీ లక్ష్మయ్యా ,,
అడవిల మీయన్నకూ ,, - అతిభారామాయే ,,
అడవిలో మాయన్నకు ,, - అతిభారమైతే ,,
నీనొష్టి కుంకుమ్మా ,, - రాలు నేలానా ,,
నీచేతి గాజుల్లు ,, - చిట్లిపో వాపెనా ,,

(నల్లపూసలు) నీమెడ నల్లల్లూ ,, - తెగి నేలాబడునూ ,,
నీళ్లల్ల గొడ్డంల్లూ ,, - తేలాడూ వాదినా ,,

(చెదలు) నిప్పుకు చేదాలు ,, - ఎక్కుగా వాదినా ,,

మరిది తనమాట కెదురాడినందులకు సీతమ్మ లక్ష్మణుని శంకించినది.

అన్నజస్తే తమ్ముంది కోలు- అయోధ్యా కాదా కోలు
చేనికిందీ బీడూ ,, - చేనోరిది కాదా ,,

యని నిందించినది. లక్ష్మణు డామాటలు సహింపనేరక

కుడిమీసం వోడేసీ ,, - గుడ్లెఱ్ఱజేసి ,,
ఈమేర దాటాకే ,, - కంసల్యా కోడలా ,,
ఈమేర దాటాకే ,, - సుమిత్రా కోడలా ,,
,, ,, - శాంతమ్మ కొదినా ,,
,, ,, - లక్ష్మయ్య కొదినా ,,
,, ,, - రామయ్యా సీతా ,,

(గెర, బెర) ఏడు బెరా లైనా ,, - ఎల్లా గీసిందూ ,,
ఈ బెర దాటితే ,, - నువ్వు చెరలాపాలూ ,,

ఈ విధముగా అనలుంచి లక్ష్మణుడు,

విల్లునమ్ముల పొదీ ,, - వీపున వేసిందూ ,,
సందెడమ్ముల కట్టా ,, - సంకన బెట్టిండూ ,,
తలమీంచి తంగెళ్లా ,, - తా దూకుకుంటా ,,
హాయెనె లక్ష్మన్నా ,, - అన్నా జాడలకూ ,,

(ఒకచెట్టు) ఇల్లెంద పొదకిందా ,, - రాముడు గూసుండూ ,,
ఏమీర తమ్మూడ ,, - ఇట్లా వచ్చినవూ ,,

అయోధ్యపట్నంబు ,, - పాడుబడ్డాదే ,,
అక్కడ కథలన్నీ ,, - అలాగున వుండే ,,

ఇక రావణుని ప్రవేశము సీతాపహరణము జరిగిన భాగము వేరు. నేనీపాట నింతవరకే వ్రాసికొంటిని. ఇది సిసలైన జానపదగేయము. భాష, భావము, నడక కల్పన మున్నగునవి యన్నియు జానపదవాసన వెలార్చుచున్నవి. శ్రీ తూమాటి దొణప్పగా రుదాహరించిన రాయలసీమ పాటలలోని "సీతమ్మచెఱ"*కును ఈ పాటకును కొన్ని పోలికలున్నవి.

"చేనిపంచ బీడు ఎవ్వరిది మరిదీ
చేనిపంచన బీడు చేనోడిదే వొదినా
అన్న జస్తే భార్య ఎవ్వరిదీ మరిదీ
ఏమి మాటాడితివి ఎత్తి మాతల్లీ" యన్నపాట

'శ్రీరామరామ వినవే' యను పాదాదిపాదాంతనియమములతో నున్నది. రామాయణసంబంధగేయముల ప్రసక్తి నింతటితో విరమింతును.

## భారత సంబంధములు

రామాయణము తరువాత భారతీయులకు భారతభాగవతగాథలు ప్రీతి పాత్రములు. పాండవుల ధర్మనిరతి, కౌరవుల దుశ్చేష్టితములు, శ్రీకృష్ణుని ధర్మపక్షపాతము, శిష్టజనపరిపాలనము, భారతీయు లందరకును పరిచితములు. ఆయాగాథల ప్రభావము మన జీవితములందు మనకు తెలియనంత గాఢముగా నచ్చుపడిపోయినది. ధృతరాష్ట్రుని గ్రుడ్డితనము, భీష్ముని ప్రతిజ్ఞ, ద్రోణాచార్యుని విలువిద్య,- శిష్యవాత్సల్యము, దుర్యోధనదుశ్శాసనుల మాత్సర్యము, కర్ణుని వదాన్యత- రాజభక్తి, విదురనీతి, శకుని మాయోపాయములు, (శకున గిసిగాడు) ధర్మరాజు ధర్మదీక్ష, భీముని బలము, అర్జునుని విక్రమము, నకులసహదేవుల సోదరభక్తి, అభిమన్యుని పరాక్రమము, ఘటోత్కచుని మాయలు, ద్రౌపది భంగపాటులు, గొంతెమ్మ (కుంతి)కోరికలు, ఉత్తరప్రజ్ఞలు, నలభీమపాకములు, యక్షప్రశ్నలు, కావలసినది గంధర్వులే తీర్చుటలు, ఏకలవ్య శుశ్రూష, శల్యసారథ్యము, (మొండి శిఖండి) శిఖండి మొండితనము వంటివి తెలుగువారికి

---

* ఆంధ్ర యూనివర్సిటీ కాలేజి పత్రిక vol. 18.

గారెలకన్న ప్రీతిపాత్రములు. "వింటే భారతము వినవలె తింటే గారెలే తినవలె" అనుమాట ఇందుకే వచ్చినది కాబోలు. భారతములోని కొన్నికొన్ని ఘట్టములును, కొన్ని పర్వములును జానపదులు గేయములుగా మలచుకొనిరి. రామాయణమునకు చిలువలుపలువలు లేచినటులే భారతకథలకును కొమ్ములు మొలచి చిత్రభారతము లైనవి. నలచరిత్ర, దేవయాని చరిత్రము, సుభద్ర కల, సుభద్రాకల్యాణము, సుభద్ర సారె, ధర్మరాజు జూదము, ద్రౌపది వల్వలు, పండుపాట, విరాట పర్వాంతర్గత కీచకవధ, విరాటపర్వము (పదము), విరాటపర్వము (జంగంకథ), పద్మవ్యూహము, విశ్వరూపము, భగవద్గీత కథాగీతము, సావిత్రి (బ్రతుకమ్మ) పాట, శశిరేఖా పరిణయం, శశిరేఖా పరిణయం (బ్రతుకమ్మ పాట), శశిరేఖ పెండ్లిపాట, గయోపాఖ్యానం (జంగం కథ), పరాశరమత్స్యగంధీసంవాదము వంటివి జానపదుల నోళ్లయందు బ్రతికియున్న భారతకథలు. "అయ్యగారి కూర్మనాథుని విరాట, కర్ణ, శల్య,పర్వములు, చంద్రగిరి తాతయ్య ఉత్తరదక్షిణ గోగ్రహణములు" పెద్ద పదములు[1]. ఈ పాటలందున్న కొన్ని విశేషములను క్లుప్తముగా పేర్కొందును.

'నలచరిత్ర-పదము' వ్రాసినది తోలేటి సీతారామయ్య భీమసింగి గ్రామ వాస్తవ్యుడు; పూసపాటి విజయరామ గజపతి మహారాజతనూజుడగు ఆనంద గజపతికి సమకాలీనుడు. కృతిభర్త భీమసింగిలో వెలసిన గోపాలకృష్ణుడు. వైశాఖ పురవాసి కలగర్ల వెంకటరామయ్య కృతికర్తతో "భూసురోత్తమ నీవు పూర్వంబు శశిరేఖ, పరిణయక్రమ మెల్ల పదము గావించి, ప్రచురంబుగా జేసి ప్రఖ్యాతి గాంచితివి, వలనొప్పగా నిపుడు నలుని చరితంబు, మృదుతరంబుగ నీవు పదముగా రచియింపు" మని కోరగా "పామరజనంబులకు బహుసులభముగను, వర్తించుటకు పదము వరుసరీతి రచింప" దొరకొనెను. ఈతడు దేవతావందనము కవిస్తుతితోపాటు నవగ్రహస్తోత్రముకూడ చేసినాడు. ఇది వింతయే. ఈ కవి భారతమందలి కథను మరియు శ్రీనాథుని నైషధకావ్యకథను రెంటిని చూచినట్లున్నది. కథారంభము భారతమందువలెనే ధర్మజుని ప్రశ్నమునకు సమాధానముగా బృహదశ్వ ఊకథను చెప్పినట్లున్నది. జానపదగేయములం దిది ప్రౌఢరచనగా చెప్పుకొనవచ్చును. ఏలయన అచ్చటచ్చట శబ్దాలంకారములు

1. శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, 'దేశి సారస్వతవిభూతి' - కిన్నెర డిసెంబరు 1953.

'దేవయాని చరిత్రము'ను జంగంకథగా వ్రాసినది వెంకటసుబ్బరాయగుప్త. తన సహపాఠియగు వెంకటకృష్ణయ్య (కమ్మదొర) ప్రోత్సాహమున వ్రాసెనట. మల్లికార్జునస్వామి కృతిభర్త. ఈపదము నన్నయభారతమునకు అనుకరణమని చెప్పవచ్చును. కొన్నిచోట్ల భారతమందలి మాటలే యుద్ధరింపబడినవి. దేవయాని తన్ను పరిణయ మాడుమని యయాతిని గోర నాతడు పురుషుడు తనకన్న నెక్కువ కులపుత్త్రిని వివాహమాడుట విజ్ఞానేశ్వరీయాదిగ్రంథములు నిషేధించు చున్నవని చెప్పెను. భారతము ననుసరింపనిది ఈయొక్క కల్పనము మాత్రమే. భారతము నీతడెంతగా ననుకరించెనో చూడుడు.

క. చను బొంకగఁ బ్రాణాత్యయ
ముస సర్వధనాపహరణమున వధగా వ
చ్చిన విప్రార్థమున వధూ
జనసంగమమున వివాహసమయములందున్.

వ. ఈయేనింటియందు నసత్యదోషంబు లేదని[1].

దీనికి పదకర్త,

"చను బొంకగ బ్రాణవ్యయమందున ధనహరణంబునను
వధగా వచ్చిన విప్రార్థంబున వైవాహికవేళ
మొదవాళనయానంబులనైదిట నొాదవదు దోషంబు" అని వ్రాసినాడు.

క. ఋతుమతియై పుత్రార్థము, పతిగోరిన భార్యయందు బ్రతికూలుండై
ఋతువును విఫలము సేసిన్నతనికి మతి భ్రూణహత్యయగునండ్రు బుధుల్[2]

అను పద్యమునకు పదకర్త

"ఋతుమతియై పుత్రార్థము సత్సతి పతిని గోరినపుడు
ప్రతికూలుండై ఋతుఫలత్వము క్షతి యొనర్చినట్టి
యతనికి తప్పదు భ్రూణహత్యయని యవని బుధులు జెప్ప" అని వ్రాసినాడు. కథ ప్రసిద్ధమైనదే కనుక నిట వ్రాయుటలేదు.

1. భారతము, ఆది పర్వము తృతీయాశ్వాసము 178-179
2. భారతము, ఆదిపర్వము తృతీయాశ్వాసము 188.

తెలిసినంతవరకు తాళ్లపాక తిమ్మక్క తొలి తెలుగు కవయిత్రి. పదకవితాపితామహుడని ప్రసిద్ధిగన్న తాళ్లపాక అన్నమాచార్యుల అర్ధాంగి. అన్నమాచార్యులవారు క్రీ. శ. 1408-1503 నడిమి కాలమున నుండెను. అన్నమయ సంకీర్తనల రేకులపై "స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౪౬ అగు నేటి క్రోధి సంవత్సరమందు తాళ్ళపాక అన్నమాచార్యులు అవతరించిన పదారు యేండ్లకు" అని యున్నది. శక.౧౩౪౬-౧౬ = ౧౩౩౦ అనగా ౧౩౩౦ + ౭౮ = క్రీ.శ.౧౪౦౮ యగును. శాసనకాలము ౧౪౨౪ అనగా ౧౪౨౪ + ౭౮ = క్రీ.శ.౧౫౦౨ వరకును ఆయన సంకీర్తనలు రచించుచునే యుండెను. తిమ్మక్క స్త్రీజనోపయుక్త మగునట్లుగా 'సుభద్రా కల్యాణ'మను పాటను మంజరీద్విపదలో వ్రాసెను. తిమ్మక్క చక్కని శయ్యతో కోమలరచన చేయగల సమర్థురాలు. కథ మొత్తముమీద శృంగారరసోచితముగా నడచినది. గుజిలీప్రతులలో చాలతప్పులున్నవి. 'వెలయ కృష్ణునిపేర విఖ్యాతిగాను, ప్రబల పార్థునిపేర అంకితంబుగను, వరకవి తాళ్ళపాక తిమప్ప, చెప్పెను విష్ణుకథ జగతిలోపలను' అని ౧౯౧౦ లో కాకినాడ కమలాముద్రాక్షరశాలవారు అచ్చువేసిరి. కాని కీ. శే. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారొక ప్రాత తాళపత్ర గ్రంథము సంపాదించి పరిష్కరించి ప్రకటించినారు. దీనిలో 'అవనిలో తాళ్ళపాకాన్నయ్యగారి, తరుణి తిమ్మక్క చెప్పె తాను సుభద్ర, కల్యాణమను పాట కడుమంచి తేట' యని కలదు. గుజిలీప్రతి స్త్రీలనోళ్ళ ప్రచారమున నున్నట్టులే పాడుట కనువగు దీర్ఘములతో తప్పులతో ఛందోభంగములతో నున్నది. పరిష్కృతమైన ప్రతిలో చాల మార్పులు కలిగినవి. గుజిలీప్రతిలో కథ పరిష్కృత ప్రతియందువలె సుభద్రార్జునుల శోభనమువరకు గాక యభిమన్యుజననమువరకు సాగినది. ఈ విషయము లెట్లున్నను పాట ఒకటియే యనియు కవయిత్రి తాళ్ళపాక తిమ్మక్కయే యనియు భావింపవచ్చును. స్త్రీలనోళ్ళ ప్రచారమందున్న గేయములో మార్పులు కూర్పులు సంభవమే కనుక గుజిలీ ప్రతులందు మూలాతిశాయివిషయములు కొన్ని గలవు. చేమకూర వెంకటరాజీ పదమును చూచియుండును. విజయవిలాసమునం దక్కడక్కడ సుభద్రాకల్యాణపు పోలికలున్నవి.[1] 'ఈపాట భారతకథారచనము నధికముగా ననువర్తించుచున్నది'[2]

1 తొలి తెలుగు కవయిత్రి వ్యాసము, పరిశోధన ౩ వ సంచిక. శ్రీమతి. బాణగిరి రాజమ్మ.

2 శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి. సుభద్రా కల్యాణము పీఠిక.

కొన్ని కొన్ని వాక్యములు భారతమునందును నీపాటయందును సమానములు. సుభద్ర అర్జుని నిట్లు వర్ణించెను. 'చిగురొప్పు చంద్రికా చెలగు పాదంబులు, కర్పూర నెలవాలుగడ్డమ్మువాడు, వెన్నున మచ్చగల విభవమ్ము వాడు, వెన్నున పదివేలు వెస డాగవచ్చు' (గుజిలీప్రతి). శ్రీకృష్ణుడు తన చెల్లెలి నివిధముగా పిలిచెను. 'అమ్మ రా ముద్దులగుమ్మ రా వేగ, కొమ్మ రా సవకంపుబొమ్మ రావమ్మ, ముత్యాలసరము రా ముద్దరాలా రా, చిత్తజు బాణమా చెలియ రావమ్మా, చిలుకల కొలికి రా శృంగారకన్య, తొలకరిమెరుప రా తోయజగంధి, పండువెన్నెల రావె భాగీర్తి రావె, గండుకోవెల రావె కమలాక్షి రావె, మచ్చెకంటీ రావె మాధవశి రావె, అమృతంపుతెప్ప రా అరవిరిమొగ్గ, బంగారుపెట్టె రా భాగ్యాలభరణి' (పరిష్కృత ప్రతి) సుభద్రార్జునుల గర్భాధానపు రాత్రి ద్రౌపది మనోభావము లత్యంత మనోహరములు ఉదాత్తములును. "వెయ్యికిరణంబులా వెలిగేటి యతని, చంచలపడి కృష్ణ తగ జాలిబొంది, ఏవస్తువయినను ఇత్తును గాని, ప్రాణవల్లభు నిచ్చి బ్రతుకంగలేను, అనుచును విజయుని పాన్పున నుంచి, తల్పులు మూసియు తానేగుదెంచె"ను. కాని తరువాత "కొలువున దుశ్శాసనుడు తన్నుబట్టి, వలువలు విప్పగా వలువల నిచ్చి, మానంబు గాచిన మాహాత్మ్యశాలి (అటువంటి శ్రీకృష్ణు కనుగు చెల్లెలట) నా ముద్దు చెల్లెలు ఇంతి సుభద్ర, అతివకును నాకును అరమరలు లేవు, అని మనంబున చాల హర్షంబు నొంది, పానుపున నిద్రించె పాంచాలి యపుడు". (గుజిలీప్రతి)

వింతవింతలగు కథలను కల్పించుట మానవస్వభావము కాబోలు. పూర్వమున్న కథలను పూర్తిగా మార్చివేయుట, పూర్వగాథల నాధారముగా జేసికొని క్రొత్త గాథలు కల్పించుట, ప్రాత కథలకు కొంత తమ కల్పనను జోడించుటవలననే "కాళిదాసు కవిత్వము కొంత తమ పైత్యము కొంత" యనుమాట ప్రసిద్ధికెక్కినది. రామాయణము నాధారముగా జేసికొని క్రొత్తకథలు బయలుదేరినట్లే భారతము నాధారముగా జేసికొని కొన్ని కథలు పుట్టినవి. ఇట్టి కల్పనము చేయునది జానపదులేకాదు. దీనిలో శిష్టులును సిద్ధహస్తులే. ఇట్టి కథా కల్పనములు మానవుల హృదయానుభూతులవలన(చిత్తవికారమువలన)కలుగును. ఇట్టి చిత్తవికారమున కెంత స్థానము లభించిన నంతగా నిజమైన కథ వెనుకకు నొదుగును. సంబంధములేని క్రొత్త కూర్పులు మార్పులు కలుగును. ఇంకొక కథాభాగము రెక్కలు కట్టుకొనివచ్చి దీనిలో నదుకుకొనిపోవును. అట్టి సమయమున

ఈ క్రొత్త కల్పన లెటనుండి చేరెనవో ఆ కథకు మూల మెట్టిదియో కనుగొనుట కష్టము[1]. ఇట్టి వింతగాథ యొకటి ఆంధ్రదేశమున బహుళవ్యాప్తి గాంచినది. 'గయోపాఖ్యానము' కథలో శ్రీకృష్ణార్జునులు 'తన్నుకొనగా తమాష చూచుట' మనకనుభవమే. ఈకథ భారతమున లేదు. చరిగొండ ధర్మన చిత్రభారతములో నిట్టి కథాచ్ఛాయ గలదు. "ఈకథ కొంతవరకు మరుత్తరాట్చరిత్ర మందలి యొక కథను పోలియున్న" దని శ్రీ జయంతిరామయ్య పంతులుగారు 'ఆధునికాంధ్ర వాఙ్మయవికాస వైఖరి' పుట- 78,79లో నాకథను వ్రాసియున్నారు. నాదిండ్ల గోపమంత్రి ఈ కథను కృష్ణార్జున సంవాదమను ద్విపదకావ్యముగా వ్రాసెను. తరువాత వెలివేరు వెంకటరామ ప్రధాని, కస్తూరి రంగకవి, రామయామాత్యుడు మున్నగువారు పద్యకావ్యములుగా వ్రాసిరి. కీ.శే. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి నాటకరచనాసామర్థ్యమును దిగంతవిశ్రాంత మొనర్చినదీ వింత కథయే. భాషోద్ధారకులు బ్రౌనుదొరవారీ గ్రంథములనుగూర్చి యిట్లు వ్రాసియున్నారు. (బ్రౌణ్యనిఘంటువు ఇంగ్లీషు ౧౮౫౨. పుట ౫౧౮) 'పంచదబ్బు (పంచ శబ్దభవము దబ్బు) A mere fiction. The name is given to apocryphal Poems that are not grounded on any classical tradition as the - ౧. మైరావణ చరిత్ర, ౨. శతముఖ రామాయణము, ౩. కృష్ణార్జున సంవాదము, ౪. గంగా గౌరీ సంవాదము ౫. జైమినీభారతము'[2]. గయోపాఖ్యానకథను జానపదులకొరకు జంగంకథగా వ్రాసినది ధేనువకొండ తిమ్మయకవి. దీనినే సాధుపల్లి చంద్రశేఖరశాస్త్రిగారు కన్నడమున ననువదించిరట.[3] మహారాష్ట్రమందును నిట్టి కథ యొకటి కలదని వింటిని. కృతికర్త "కరమగు నాంధ్రకవిత్వనాటకాల్ గావించిన మేటి-ఘనుడగు

---

1. When met with a late stage of its development a myth may be so far over grown with Secondary accretions unconnected with its original form, that its analysis may be extremely difficult or even impossible.

   Vedic Mythology. A. A. Macdonell.

2. విద్యారత్నగారు, కృష్ణార్జున సంవాదము - పీఠిక
3. ,, ,, ,, ,,

శ్రేష్ఠపకొండను పిచ్చయ కవివరు డనబరగి'న వాని 'నాలవ తనయుడ వెంక యామాత్యుడ సహరిభక్తుడను' 'చాలగ మునుసే నాటకముల నవలీల రచించితి' నని చెప్పుకొనెను. దీనికి కృతిపతి యోబయనాయుడు. ఈకథ జానపదులందేకాక శిష్టులందు కూడ బహుళవ్యాప్తి నొందినదే కనుక కథావివరము లిందు పొందు పరచుట లేదు. పాండవు లొకవైపు యాదవు లొకవైపు యుద్ధమునకు సన్నద్ధు లగుటయే వింతగా దోచుచుండ కౌరవులీ జగడములో పాండవపక్షము నవలంబించుట వింతలోవింత. పాండవయాదవఖండనము నారదునివలన విన్న ధృతరాష్ట్రుడు భీష్మాదివృద్ధుల కర్తవ్యబోధనమున సదుద్దేశముతోడనే పాండప పక్షపాతమున కాయత్తము గండనిన దుర్యోధనాదులు కుత్సితులై (ముందు కృష్ణుని నిర్జించిన తరువాత పాండవుల నతిసులభముగా జయింపవచ్చునని) పాండవసహాయమునకై తరలిరి. అటు అన్నగారిని ఇటు భర్తను సంతృప్తి పరచజాలక సుభద్ర పడినపాట్లు పాపమా యీశ్వరున కెరుక. చక్రాయుధ పాశుపతాస్త్రములవలన కలుగనున్న ప్రళయమును శంకరుడు చెప్పి కృష్ణార్జునులకు సంధి పొసగించి యాపెను. చివరకు కృష్ణు డర్జునుతో "కౌరవ్యులకును నీకును ముందనిగా గలదని తలచి, అపుడు వారిని గెల్చెదొ గెలువవొ యని మది నూహించి, ఇపుడు నిర్నిమిత్తము తారసిల్లి నేనింత జేసినా''ననెను. కొన్నిచోట్ల నీరచన మతిప్రౌఢముగా నున్నది.

శ్రీకృష్ణుడు సపరివారముగా వనవిహారమునకు బోయెను. అచ్చట,

"పారిజాత హరిచందన వరమందార మహీజములు
నారికేళ హింతాల తాల జంబీర వృక్ష తతులు
సరసకదంబ తమాల బిల ఘనసారమహీజములు
మరువక మల్లిక సింధువారములు మదనమహీజములు
పనస జంబు జంబీరవృక్షములు బదరీభూజములు
వనకాంచన కరవీర కేతకీ వకుళభూరుహములు"

కాక మరికొన్ని వృక్షము లున్నటుల వర్ణించినాడు. అచ్చట కృష్ణుడు 'అబ్బురంబుగా నొక్క తలోదరి గుబ్బచన్నులబట్టి-కబ్బ మొసంగిన రీతిగ నీ జడ దెబ్బ గొట్టుమనుచు' పల్కెనట,

"సురకాంతమణి దేవిరత్నముల మెరుపు దీపమనగ
గురుతుగ పూర్వదిశాంగన దీర్చిన కుంకుమబొట్టనగ" సూర్యోదయ మైనదట. ఈ కవివరునికి సంగీతమున గూడ చక్కని ప్రవేశ ముండియుండును. నారదుడు,

'మానిత సుందరమైన వీణె చేబూని మీటుకొనుచు
హరికాంభోజ మహానట భైరవి యారభి దర్బారు
ఖరహరప్రియ భోగి శంకరాభరణము సావేరి
భూపాళము మణిరంగుమ్మ కాంభోజ తోడి నాట
కాఫి దేవగాంధారి నీలాంబరి కన్నడ కానకాంగి
మాళవి మలహరి బిలహరి మలయానిల చర నాట
గౌళ శుద్ధసావేరి మారువాందోళి తోడి శ్యామ
సేనాపతి గమనశ్రమ మోహన ధేనుక రత్నాంగి
మానవతి సరసాంగి వరుస ప్రియగానమూర్తి యమున
ఇట్లు వనస్పతి మొదలగు రాగము లేర్పడ బాడుచును
కట్టు స్వరాయి లయోక్తము ముదము గానంబులతోను,

అంబరవీథి విహారమొనర్చినటుల వర్ణించినాడు. గయు డర్జును జూచి

'హరుడో భారతివరుడో మందరధరుడో యాఘనుడు
మరుడో నలకూబరుడో చంద్రుడో హరిహయుడోయిత'డని

యాశ్చర్యపడెను.

భారతమందలి సభాపర్వాంతర్గతమగు 'ధర్మరాజు జూదము' కూడ తెలుగు స్త్రీల నాలుక నిల్లుగట్టుకొన్న చక్కని పాట. భారతమందలి కథకు తెలుగువారు మరికొన్ని కల్పనలు చేర్చుటయేకాక మార్పులుకూడ చేసినారు. రాజరాజు పిలుపున ధర్మజుడు హస్తినాపురికి జూదమాడ బోవ సంసిద్ధు డగుచుండ సహదేవు డన్నతో జూద మాడవలదని చెప్పెను. కాని ధర్మజుడు సాటివారు రమ్మన తాను పోకుండు టుచితము గాదని చెప్పిపోయెను. భారతమున ధర్మరాజుతో జూదమాడినది దుర్యోధనుని పక్షమున శకుని; కాని పాటలో

దుర్యోధనుడే జూదమాడెను. ఒక వైపు ధర్మజుడు మరియొకవైపు రాజరాజు పూర్వాని యాడిరి. "ధర్మరాజుకు జిక్కె కనకమ్ము నేడు, రాజు చేతికి చిక్కె బలపమ్ము (బలపము. పాఠాం.) నేడు". జూదమందు మొదట ధర్మజుడే గెలిచెను. రాజరాజోడిపోయెను. భారతమున రాజరాజు గెలిచెను. తానోడి పోవుచుండుట జూచి రాజరాజు పాచికలు శకుని చేతికిచ్చి లోని కేగి జ్యేష్ఠాదేవిని (పెద్దమ్మ-దారిద్ర్య దేవతను) కొలిచెను. పెద్దమ్మ రాజరాజుకు ధైర్యము చెప్పి తాను తన చెల్లెలగు లక్ష్మీదేవికడ కేగెను. "అల్లంత తమయక్క రాకను జూచి, ఎదురులేచి వెళ్లి మహాలక్ష్మి యపుడు, వలగొని ముమ్మారు ప్రణతులు చేసి, ఏమిటో యక్క నీవచ్చినపనుల'ని యడిగెను. అప్పుడు జ్యేష్ఠాదేవి లక్ష్మికి రాజరాజధర్మరాజుల జూద మెరిగించి తన నొకప్పుడు పాండవు లవమానపరచినట్టికథ నిటుల చెప్పెను. ధర్మజుడు రాజసూయ మొనర్చినప్పుడు నేనుగూడ భోజనమునకై పోయి బంతిలోగూర్చుంటిని. అప్పుడు భీము డచ్చటికి వచ్చి "అడదానవు నీవు ఇది నీతిగాదు, మగవారితో గుడువ సాటిలేదనుచు, ఆకులు దీయించి పారవేయించె"ను. అప్పుడు "ఆభీము కిస్తినే శాపమ్ము నేను, చేటలోపల వడ్లు నెరపిన్నినాడు, నాడు నిను గొలుతునని పలికితి నేను, అరికాలు ఇంచుక తడుపన్నినాడు, నాడు మిము గొలుతునని పలికితి నేను, నాటికార్యము నేడు సమకూడె ననుచు" చెప్పి "నీవేగి ధర్మనందనులను బాసి, రారాజును పొందవే రమణిరో నీవు" అని బతిమాలెను. కాని లక్ష్మీదేవి ధర్మజుని సల్లక్షణముల బేర్కొనుచు తానాతని విడువజాల ననెను. (చేటలో వడ్లు నెరపుట, సగమే తడియునట్లు కాళ్లు కడిగికొనుట దారిద్ర్య లక్షణములని యిప్పటికిని మనవారి నమ్మకము). రాజరాజు దుర్మార్గుడని నిందించెను. కాని జ్యేష్ఠాదేవి కోపించుటచే లక్ష్మీదేవికీపని తప్పదయ్యెను. లక్ష్మి ధర్మరాజును విడిచి రారాజును చేరెను. ఈ విషయములన్నియు జానపదుల కల్పనలే.

జూదమాడుచున్న "రాజు చేతికి జిక్కె కనకమ్ము నేడు, ధర్మరాజుకు జిక్కె బలపమ్ము నేడు". ఈ యాటలో ధర్మజుడు సర్వస్వ మోడిపోయెను. తనను తమ్ములను చివరకు పాంచాలినిగూడ నోడెను. రాజరాజు ద్రౌపదిని సభకు పిలుచుకొనిరా గాంధారి యనువాని బంపెను. భారతములో ప్రాతికామి పోయినట్లున్నది. పాంచాలి ఆతనితో "తలలంటి పసుపు బూసి జాజుల్లు ముడిచి భంగుష్ఠ వారధి (శారధి) రారాధు యనెను" ? ( రజస్వలయనుటకు శాఖోలు )

అతడూరక తిరిగిరా, రాజరాజు దుశ్శాసనుని బంపెను. పైనన్న మాటలే ద్రౌపది దుశ్శాసనునితో ననెను. కాని వాడామెపై నీళ్లుబోసి (ముట్టుదోషము పోవుటకై) పట్టుకొని సభకీడ్చి తెచ్చెను. నీళ్లుపోసి తెచ్చుట భారతమున లేదు. ఇది కల్పించిన జానపదు లౌచితి నెరిగినవారు. ఈకల్పన స్త్రీలే చేయగలరు. కనుక దీనిని రచించినది స్త్రీయని నా నమ్మకము. ఇట్లు బలవంతముగా సభ కీడ్పించి రాజరాజు ద్రౌపది ననరాని మాటలనెను. ఆమె క్రుద్ధయై "గాజు మెరసితేను పుష్యరాగ మగునా, మాణిక్యము నలుపైతే మసిబొగ్గగునా, గాడిద యదియెంత గజమౌనటోరి, కాలువ లెన్నయిన కలిసి పారితే, గంగానదితోటి సాటియగునటరా, ఏరులు ఎన్నయిన ఎత్తి పొంగితే, సముద్రమ్ముతో నవి సాటి యగునటరా, అధికులమని తమరు పడగ లెత్తినను, శేషునితో సరియగున చిలువ లెన్నయిన, పక్షులమని తమరు వృక్ష మెక్కినను, గరుత్మంతునితో సరియగున ఆపక్షులెల్ల, కరుణాలమని తమరు కవిలె బట్టినను, శ్రీరాములతో సరియగున సృష్టికరణాలు,రాజులామని తమరు రచ్చ లెక్కినను, ధర్మరాజులతో సరియగున సకలరాజులెల్ల"అని దుర్యోధనుని తూలనాడెను. (సృష్టికరణాలు నియోగులుకారు. వీరే శిష్టుకరణములు.) రాజరాజు దుశ్శాసనునితో ద్రౌపది వలువ లీడ్పింప నామె శ్రీకృష్ణుని ధ్యానించెను. లక్ష్మీదేవితో వైకుంఠమున పాచికలాడెడు విష్ణువు ద్రౌపది మొర విని "అక్షయ" మని పాచికలు వైచి వస్త్రము లిచ్చెను. ద్రౌపది దుర్యోధన దుశ్శాసనుల జంపింతునని శపథము పూనెను. రాజరాజుతో ద్రౌపది తాను పాచిక లాడుదుననెను. రాజరాజందులకు అంగీకరించెను. తననింతగా నవమానపరచిన దుర్మార్గుని, ఆటలో ద్రౌపది యోడించి పరాభవించినది. "సింహాసనం మీద రాజు గూర్చుండె, కూర్మాసనం మీద పాంచాలి యుండె, పాపకర్ముని ముఖము తాజూతననుచు, నడుమనా వేయించె గండభారాము" రారాజు ముఖము చూడ నొల్లక మధ్యన ద్రౌపది తెరపటము గట్టించుకొన్నది. "రారాజు తన చేత వేసె పాచికలు, పాంచాలి తన కాళ్ల దోసె పాచికలు"—ఓహో ఏమి యీ ద్రౌపది యభిమానము! రచయిత్రికి ద్రౌపదిచే నింత చేయించినగాని స్త్రీ జాతికి దుర్యోధనునివలన కలిగిన భంగపాటుకు సరియైన ప్రతీకారము జరిగినట్లనిపించలేదు. ధర్మరాజోడినవన్నియు ద్రౌపది యొక్కటొక్కటే మరల గెల్చెను. ఇంతలో శకుని వచ్చి అడ్డుపడెను. లేనిచో రాజరాజేమైపోయెడువాడో! శకుని రాజరాజుతో స్త్రీలు మాయావులనియు

"ఆడవారికి అగ్ని సహాయమేకావ, ఉడికేటి అన్నములు తొణికి పూసేరు, మండేటి మంటకు మారుమసలేరు, కాలేటి కౌరవులు కాళ్ల తన్నేర"ని వారించెను. ఈ మాటలు సహజములు. ఈ కల్పనము లన్నియు భారతమున లేనట్టివే. కాని కొలచెమార్ప్సలతో నీకథ భారతమునకు గూడ నెక్కినది. "కొందరు తాటాకులలో నున్నదని చెప్పెడు నమూలమును సందర్భశుద్ధిలేనిదియునగు నధిక గ్రంథ"మని నావిళ్లవారీ కథను గూడ ప్రకటించియున్నారు.[1] ఇంతలో ధృతరాష్ట్రుడు వచ్చి రాజరాజును మందలించి ద్రౌపదిని వేఁడ్కొని వరము లడుగుమనెను. రాజ్యము ఇచ్చెను. కాని యామె "ఆడవారు రాజ్యములు ఏలంగ దగున, పతిగూడి వనములకు పోయెద ననుచు, పాంచాలి గోరెనే పతుల నేవురిని, తప్పక ధృత రాష్ట్రుడు తా ధారబోసె". ఎంత యభిమానవతి యీ పాంచాలి! భారతమున ధర్మరాజు రెండవమారు ద్యూతమాడి మరల నోడిపోయి యరణ్యవాసమున కేగినట్లున్నది కాని పాటలో ధృతరాష్ట్రుడు ద్రౌపదికిచ్చిన రాజ్యములు వదలి రణమున గెల్చి పొందెదమని పాండవు లరణ్యముల కేగిరి. ఈ పాటయందలి ద్రౌపదిపాత్ర మత్యద్భుతముగా నాంధ్రజానపదులు సృష్టించిరి.

కృష్ణశ్రీ గారి మాటలలో "పండుపాట అనే పాట ద్రౌపది యొక్క ఆరవ పతికాంక్షను చెప్పే మిషతో స్త్రీలను దిగదీసే చండాలపు పాట"[2]. ఇది రచించినదెవరో పురుషుడై యుండును. ఖాండవమున్యాశ్రమమున పాండవు లున్నప్పుడు మునికి నాహారమగు ఒకేయొక చూతఫలమును బాణముతో కొట్టి అర్జునుడు పడవేసెను. ధర్మజుడు కీడు శంకించి కృష్ణుని ప్రార్థింప నాతడు పాండవులను ద్రౌపదిని వారివారి హృదయములందు దాగియున్న సత్యముల చెప్పిన పండెప్పటియ ట్లదుకుకొను ననెను. నీతిశాస్త్రమందున్న శ్లోకములను పాండవులు (ఈ పాటలో కొంత అ స్తవ్య స్తముగా)పల్లించిరి. పండు క్రమముగా పైకి లేచెను. చివరకు ద్రౌపది ''సుందరం పురుషం దృష్ట్వా" మరియు "పంచ మే పతయస్సంతి'' యన్న శ్లోకముల జదువ పండెప్పటియట్లతుకుకొనెను. స్త్రీలను నమ్మరాదని నకులుడన కృష్ణుడాతనికి ద్రౌపది తొలుత అర్జునునకు లభింప నాతడు తల్లితో ఫలము దొరికినదన్నప్పు డామె మీరేవురు భక్షింపుడన్న నాటి

1. భారతము-సభాపర్వము, ద్వితీయాశ్వాసము ప. 264

2. స్త్రీల-గేయకథలు, కృష్ణశ్రీ. భారతి. జులై 1953.

మాట జ్ఞాపకము చేసి సమాధానపరచెను. స్త్రీల చంచలస్వభావమును చిత్రించుట కుద్దేశింపబడినదీ పాట.

నల చరిత్రము వ్రాసిన తోలేటి సీతారామయ్యయే 'శశిరేఖాపరిణయ' మను పదము వ్రాసెను. ఇదియే యాకవి మొదటి కృతి. కృతిపతి భీమశృంగి గోపాలరాయుడు. ఆంధ్రుల కత్యంతప్రీతిపాత్రమైన చుట్టరికము మేనరికము. శశిరేఖాభిమన్యులు మేనమామ మేనత్తబిడ్డలు. మధ్యన కొంత అంతరాయము ఏర్పడినను చివరకు వారి వివాహము శుభాంతముగా జరుగుటచే తెలుగువారి స్వత్వము నిలబెట్టినట్లయినది. ఈ వివాహసంబంధముచే శశిరేఖాభిమన్యులు వారి తలిదండ్రులు తెలుగువారై పోయిరి. పాండవు లరణ్యవాసమునకు పోయినప్పుడు సుభద్రాభిమన్యులు ద్వారకలో నుండిరి. శశిరేఖ రేవతీబలరాముల గారాబుకూతురు. శశిరేఖాభిమన్యుల బాల్యమైత్రి ప్రణయముగా పరిణమించెను. శశిరేఖ ఈడేరగనే బలరాము డామెను రాణివాసమున నుంచెను. వారి కలయిక లప్పటినుండి కావ్యములందలి నాయికానాయకులకువలె నుద్యానవనములందు. కనుక వనవర్ణనము నాయికావర్ణన మదేమార్గమున నడచినది. అభిమన్యుడు శశిరేఖను "ఇది మనోహరమైన మదను కీరంబు, కీరంబు యిదిగాదు కెంపమ్మి మొగ్గ, తమ్మి మొగ్గయుకాదు తళుకు వజ్రపుబొమ్మ, బొమ్మగాదు సువర్ణపూత విగ్రహము, విగ్రహం బిదికాదు సనవెండి దొర బాకు, బాకుగాదిది రతిభామ పూదోట, పూదోటయును గాదు పూర్ణేందుబింబమ్ము, ఇందుబింబము గాదు కుందనపురేకు, రేకుగాదిది తావిరేకు పువ్వులపోక, పోకగాదది శశిరేక గాబోలు" నని ముక్తపదగ్రస్తమున వర్ణించును. శశిరేఖ చిలుకతో నభిమన్యు నుద్దేశించి "రాజులకు చిలుకలకు రాజీవదళనేత్ర, పక్షపాతంబెపుడు దీక్షమైనుండు, వనములో దిరిగేటి వారి కెల్లప్పుడును, ఫలభంగగుణములే పదతి గల్గుండు" నని శ్లేషగా సంభాషించినది. ఇది శ్రీనాథుని "పక్షివంశవతంస పక్షపాతము నీకు, గతియంద జాదు సద్వ్రతతియందు"[1] అన్నమాటను జ్ఞప్తికి దెచ్చును. శశిరేఖాభిమన్యుల వివాహమున కువ్విళ్ళూరుచున్న సుభద్ర కాశాభంగము కలిగెను. శశిరేఖను దుర్యోధనపుత్రుడగు లక్ష్మణకుమారున కడుగ వచ్చిన భీష్మద్రోణులు బలరామునితో "ఆతడును నీవు వియ్యంకులైతేను, కనకంబునకు తావి కలిగి నట్లుండు, పరగ చెరకున పండు బండినట్లుండు" నని పొగడగనే బలరాముడు

1. శృంగారనైషధము ౪-౭౮

ఉబ్బిపోయి కూతురును కౌరవవంశమునకు కోడలిగాజేయ నిశ్చయించుకొనెను. శ్రీకృష్ణుడు సుభద్రకు తన నిస్సహాయస్థితిని చెప్పుకొనెను. సుభద్ర తొలుత బతిమాలి తరువాత తిట్టి శపించి కుమారునితో పాండవులున్న యడవికి బయలుదేరెను. శశిరేఖ అభిమన్యుని వెదకుటకై తన పెంపుడుచిలుక నంపెను. చిలుక అభిమన్యునితో మాటలాడి తిరిగిపోయెను. మధ్యేమార్గమున అభిమన్యునకును భీమునికి హిడింబవలన కలిగిన కుమారుడగు ఘటోత్కచునకును ఘోర యుద్ధమయ్యెను. నారదుడు ఇరువురన్నదమ్ముల నొకరికొకరి నెరుకపరచి సంధి చేసెను. ఘటోత్కచు డభిమన్యునకు జరిగిన పరాభవము విని తన మాయచే శశిరేఖను గొని వచ్చి ఇంద్రాదుల రావించి శశిరేఖాభిమన్యుల వివాహము చేసి తాను శశిరేఖాకారమున ద్వారకయందుండి కౌరవులను ముప్పుతిప్పలు బెట్టి హస్తినాపురికి పరుగెత్తించెను. ఈ ఘట్టములందు హాస్యము పోషింపబడినది. శ్రీకృష్ణస్వామి కీవిషయము లన్నియు దెలిసి మిన్నకుండెను. తరువాత బలరామ కృష్ణులు పోయి శశిరేఖాభిమన్యుల దోడితెచ్చి వైభవోపేతముగా మరల పెండ్లి చేసిరి కథ శశిరేఖాభిమన్యుల శోభనముతో ముగిసెను. ఈ పాట ''సరవిగా స్వభాను సంవత్సరమునను- పరగ శ్రావణకృష్ణపాడ్యమి దినంబు - వరుసగా నాదిత్య వాసరాంతమునకు - సొంపుగా నీ కథయు సంపూర్ణమయ్యె''నట. ఇది క్రీ.శ. 1883 సంవత్సరమునకు సరిపోయినది.

ఇదే కథను 'శశిరేఖాపరిణయము-బ్రతుకమ్మపాట'గా వట్టెము దశరథయ్య వ్రాసెను. పైనున్న కథకంటె నిందు మరికొన్ని స్వల్పవిశేషము లున్నవి. ఈకథలో సుభద్రాబలరాములు పరస్పరము నిందించుకొనిరి. బలభద్రుడు సుభద్రను మెడబట్టి గెంటించెనట. ఇది కొంత అనౌచిత్యమేయని నా భావము. ఈయనౌచిత్యము నీకవి యింకొకచో మెరుగుపెట్టి దిద్దుకొనెను. నారదుడో యింకెవరో లేకుండనే ఘటోత్కచాభిమన్యులు యుద్ధముచేసి తమతమ యాభి జాత్యము లుచ్చరించుకొని ఒకరినొకరు తెలిసికొనిరి. ఇదియే సహజముగానున్నది.

కాలయముని కర్కశపాశమునుండి పతిప్రాణము లరచేతబట్టి తెచ్చుకొన్న పరమపతివ్రత సావిత్రీదేవి. అరుంధతి అనసూయ సావిత్రివంటి మహాసాధ్వులు భారతనారీమణుల కాదర్శస్త్రీమూర్తులు. వారి మాహాత్మ్యములుగాని వారి కథలుగాని తెలియనిస్త్రీ భారతదేశమున నుండదన్న నతిశయోక్తికాదు. భారతమందున్న సావిత్రీయుపాఖ్యానమును "సావిత్రీ-బ్రతుకమ్మపాట" గా

చెర్విరాల భాగయ్యయను వైశ్యకవి వ్రాసెను. ఈయన నిసలైన జానపదకవి. శతాధిక గ్రంథకర్త. సులభవ్యావహారికముగ నీ కథ చకచక సాగిపోయినది. భారతమందలి కథకును పాటలోని కథకును కొన్ని భేదము లున్నవి. అశ్వపతిరాజు సాళ్వదేశాధీశుడని పొరపాటున వ్రాయబడినట్లున్నది. అశ్వపతి ద్యుమత్సేనుల విషయమున రచయిత పొరపడెను. భారతమున సావిత్రి సత్యవంతుని గూర్చి విని ప్రేమించియుండగా పదములో నారదు డామెకు సత్యవంతు నెరుక పరచినట్లున్నది. భారతమున సావిత్రి యమునివలన తనతండ్రికి శతపుత్రుల వరమడిగినట్లుండగా పాటలో నా వరము సావిత్రి తానే కోరుకొని అది సాకుగా తన భర్తను బ్రతికించుకొన్నట్లు చిత్రించినాడు. యముడు కోరుకొనుమన్న తృతీయవరముగా సావిత్రి శతపుత్రులను గోరెను. అతడు వరమిచ్చితి ననెను. వెంటనే సావిత్రి,

"పకపకనవ్వెయు ఉయ్యాలో
చిక్కితివో యముడ ,,
దక్కెను నావిభుడు ,,
పతిలేక నేనెట్లు ,,

సుతులను బడయుదు" అనెను. యముడామె చాకచక్యమున కాశ్చర్యపడి పాతివ్రత్యమునకు మెచ్చి పతిప్రాణము లిచ్చి పంపెను. యముడు ఈమాత్ర మాలోచింపడయ్యెనా? ఇంత తెలివితక్కువవాడాయని మనము తర్కింప నవసరములేదు. జానపదుల యూహ యంతవరకే పరుగిడినది. సావిత్రికి భర్త ప్రాణము లిప్పించుటకు జానపదులకు దోచినట్టి యుపాయ మదియే. కనుకనే అది జానపదగేయము.

విరాటపర్వము కథ మూడు పాటలుగా నాకు లభించినది. 'విరాటపర్వము జంగం కథ'గా వ్రాసినది ధేనువకొండ వెంకయ. ''అవని ధేనుగిరి శ్రీగోపాలుని యంకిత మొప్పగనూ, ప్రమదముతో శ్రీభారతము విరాటపర్వమందు కథనూ, రమణీయముగా మధురసోక్తి బలు చమత్కారములను, రగడలు దరువులు పద్యంబులుగా రచియించెద నిపుడూ" అని రెండాశ్వాసముల గ్రంథముగా వ్రాసెను. పాండవులు మారువేసముల విరాటు కొలువు జేరువరకొక యాశ్వాసము నడచినది కీచకవధతో రెండవయాశ్వాసము పూర్తియైనది. పండితకవి రచన కనుక భాషాశుద్ధి పదసౌష్ఠవములున్నవి. పద్యములు కావ్యశక్తి ననుకరించినవి. మూలమున కెచ్చటను భిన్నముగా లేదు.

రెండవది **'విరాటపర్వము-పదము'**. కర్త అయ్యగారి కూర్మనాథుడు. "భారతమున విరాటపర్వమందున గలుగు, కథ జూచి చెప్పెదను ఘనమైన పదము, ప్రబల ప్రబంధములు పండితార్హములనుచు, పామరులకొరకు నీ పదము జెప్పెదను, కఠినశబ్దములున్న కావ్యములకు తెలియదని, మదుపుపదములు మాని మాటలుంచెద"నని కవి ప్రతిజ్ఞ. కథ మూలానుసారముగా నొడుదొడుకులు లేక నడచినది. గోగ్రహణమునకై వచ్చి పారిపోవు దుర్యోధనుని అర్జునుడు "రాచజూదంబాడ రమ్ము నాతో నీవు, నిలిచి గెలిచితివేని నీవి రాజ్యంబు, నేను గెలిచితినేని నీవు రాజ్యము విడువు, శకునిగెలు పస్థిరం బిక తిరిగి రమ్మ"ని చక్కగా దెప్పిపొడిచెను.

పై రెండు పాటలును దీర్ఘగేయములు. కాని **"విరాటపర్వాంతర్గత కీచకవధ"** యనునది చిన్నపాట; మూడవగేయము. సాధారణముగా స్త్రీలధికముగా పాడుకొనుపాట ఇదియే. భారతకథయే చాల క్లుప్తముగానున్నది. స్త్రీలే యీపాట నల్లిరేమోయని నాయూహ. సైరంధ్రియైన ద్రౌపది సుదేష్ణతో తన కేవురు గంధర్వపతులు గలరనియు తనకెట్టి భయము లేదనియు 'కాకయినుమున యీగ ముసురునా చెపుమా - నిప్పు చెదలంటునా నీవు యెఱుగవా' యనెను. కీచకుడు ద్రౌపదిని మోహించి అక్కగారితో నిట్లు వర్ణించి చెప్పెను. "అతివ యాకారమను జలధిలో మునిగి - అంకుశం బైనట్టి యామెసలిచేత - పట్టుబడి యున్నాను బ్రదుకనదెరువేది". చక్కని యుపమానము. అక్క కీచకునితో "ఆడదాని చిత్త మరటాకు మొవ్వా - ఎన్నరేమున్నాను యమునకు బాధించు"నని బుద్ధులు చెప్పెను. ద్రౌపది తన భంగపాటును విరటుని కొలువులో చెప్పుకొన్నప్పుడు కుపితుడై "ఒకమ్రాను చేబట్టి ఉగ్రుడై భీము,కట్టెలకు ఈమ్రాను ఖండింతుననెను" కాని "పచ్చది ఈమాను పాటిగాదనుచు, వద్దనుచు ధర్మజులు వారించి పలికె"ను. ద్రౌపది నుద్దేశించి "ఆడదానవు నీవు సభనకును నిలువా, తగదు నీకని పలికె తాను ధర్మజులు". అవమానితురాలైన ద్రౌపది "ఒక్కడు మగడగును వనితలకునెల్ల, ఏవురు మగలుండి తనకు ఈ పాట్లు, వచ్చెనని పలికెను పాంచాలి తాను" భారతమందున్న సర్మగర్భమగు మాటలే పాటలో నింతసులభముగా జెప్పబడినవి.

తెలుగుభారతమున లేని భగవద్గీతను స్త్రీజనోపయుక్తముగా **'భగవద్గీత కథాగీతము'** పేరుతో భాస్కరుడను రచయిత వ్రాసెను. గీతార్థసారమంతయు

ఇరువదియొక్క ఖండికల (Stanza)లో నిమిడ్చి చక్కని శైలిలో వ్రాసినాడు. నడకగూడ ఉదాత్తముగా నున్నది. విషయము ప్రసిద్ధమైనదే కనుక దానిని విడిచి కేవలము మచ్చునకుగా నాదియంత్యములందున్న రెండు ఖండికల పేర్కొందును.

గీతార్థసారాము వినుమూ-నవ-
నీతాము చేకోను విధమూ-
భూతాదయా పరహేతురతిచే కపి
కేతానునకు ఖగకేతాను డెరిగించు
జ్ఞాతివధచే పాతకము సా
జాతమౌ నేనేతెరంగున
జేతునని యుద్ధమొల్లక పురు
హూతసుతు డీరీతి బల్కెను ॥గీ॥  అని యారంభమై

మంగళమిదె జగన్మోహనా-శ్యామ-
లాంగ సుందర గరుడవాహనా
శృంగార రసభర సంగీతవాద్య ప్ర
సంగ శ్రీఅలమేల్మంగా సమేత శ్రీ
రంగ భాస్కర పుంగవుని స
త్సంగతునిగా జేసి బ్రోచుచె
రంగు శేషభుజంగగిరి వర
మంగళము మాతంగరక్షక ॥గీ॥[1] యని ముగిసినది.

## భాగవత సంబంధములు

రామాయణభారతములవలెనే భాగవతము కూడ జానపదులకు కవితా వస్తువైనది. నన్నయభాస్కరాదులు భాగవతమును చేపట్టక పోతనగారికి

---

1. ఈ పాటను శ్రీ రంగం సూర్యనారాయణశర్మగారు 19వ శతాబ్దాంతముననో 20వ శతాబ్ది ప్రారంభముననో వ్రాసిరి. ఈ రచయిత మన అభ్యుదయ కవిచక్రవర్తి శ్రీశ్రీ గారికి పితామహులు. మొదటిసారి కవియే దీనిని ప్రచురించిరట. రెండవ ముద్రణము 1923 లో జరిగినది. ఈ విషయము నా కెటీపల తెలిపినవారు శ్రీ పూడిపెద్ది లక్ష్మణమూర్తిగారు.

విడుచుటే మంచిపనియైనది. (వారు మహాకవులేయైనను భాగవత మంటినచో నది యంతగా రాణించియుండదు (భాగవతవస్తుతత్త్వమే యది.) అది సన్న్యాసుల కవలీలగా జిక్కునట్టిదిగాదు. మహాభక్తుడగు పోతన జన్మించునంత దనుక భాగవతమట్లే కాచుకొనియున్నది. పోతన గూడ అదియట్లుండుట తన పూర్వ సుకృత మనుకొనెను.

మ. ఒనరన్ నన్నయ తిక్కనాదికవులీ యుర్విం బురాణావళుల్
తెనుగుం జేయుచు మత్పురాకృతశుభాధిక్యంబు దానెట్టిదో
తెనుగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబు జేసెద బునర్జన్మంబు లేకుండగన్.

మహాకవి పోతన కలవడిన భక్తిసాతత్య మితరాంధ్రకవులందు విరళము. శ్రీకృష్ణపరమాత్ముడు భక్తసులభుడగు శృంగారమూర్తి. జానపదుల పామర హృదయములం దాతని పాదపంకజము అతిసాంద్రముగా ముద్రితములు. వేదాంత వేత్తయగు పోతనను భక్తి విషయమున జానపదు లందుకొనగలిగిరి. శృంగారమున వారిదే ముందడుగు. భక్తి యాత్మగా శృంగారము శరీరముగా జన్మించిన జానపదులు (గోపస్త్రీలు)తాము కృష్ణతత్త్వ మనుభవించి తెల్పినప్పటి పరమరసమే శిష్టుల కాస్వాదయోగ్యమైనది.

శ్లో. మదశిఖణ్డిశిఖణ్డ విభూషణం, మదన మన్థర ముగ్ధ ముఖామ్బుజమ్
వ్రజవధూ నయనాఞ్చల వఞ్చితం, విజయతాం మమ వాఙ్మయజీవితమ్.

శ్లో. అపాఙ్గరేఖాభిరభఙ్గురాభి రనఙ్గరేఖారసరఞ్జితాభిః
అనుక్షణం వల్లవసున్దరీభి రభ్యర్చ్యమానం విభుమాశ్రయామః. అని

కొనియాడిన లీలాశుకుని మాటలు పరమసత్యములు. భక్తిశృంగారములతోపాటు జానపదులను శ్రీకృష్ణుని చిలిపిచేష్టలు మరింత పరవశులను చేసినవి. అంతటితో వారి హృదయోద్భూతమగు భక్తిని, శృంగారమును, కొంటెపనులను అన్నింటిని కృష్ణుని కంటగట్టి తమ హృదయభారములను దించుకొనిరి. తనపై నింత భారము పడినను భక్తసులభుడగు నాపరమాత్ముడు - శృంగారమూర్తియగు నా మారజనకుడు - కొంటెవాడగు నా గొల్లకృష్ణుడు కిమ్మనక యూరకుండెను. కృష్ణు డూరకొన్నకొలది జానపదులు నోటికివచ్చినట్లు పాటలు పాడిరి. భాగవత కథలలో దశమస్కంధము- గొప్పపాట, ప్రహ్లాద చరిత్రము, వామన

విజయము, వామన చరిత్రము, అంబరీషోపాఖ్యానము, గజేంద్రమోక్షము. ధ్రువ చరిత్రము, శ్రీకృష్ణుని జననము, కాళింగమడుగు, శ్రీకృష్ణుని చల్దులు, బాలకృష్ణ లీలలు, బాలక్రీడలు, గుమ్మడుపాట, యశోదకొంగపాట, గోపికాస్త్రీల జలక్రీడలు, కృష్ణజలక్రీడలు, బేరిపంతుపాట, కృష్ణుని ముద్దులు, బృందావన క్రీడలు. చిలుక రాయబారము, రుక్మిణీకల్యాణము, రుక్మిణీదేవి విజయము, రుక్మిణీదేవి ముచ్చట, రుక్మిణీదేవి సారె, రుక్మిణీదేవి వేవిళ్లు, రుక్మిణీదేవి సీమంతము, సత్యభామ సరసము, పారిజాత పల్లవి, కుచేలోపాఖ్యానము, గోపికాగీతలు, భ్రమరగీతలు, ఉషాస్వప్నము మున్నగునవి జానపదులందు ప్రచారము గాంచిన పాటలు. భాగవతకథలు జానపదులు కొన్ని యున్నవియున్నట్లుగా మరికొన్ని కొంత మార్పుతో ఇంకకొన్ని లేనివి కల్పించి పాడుకొందురు. జానపదులందు ప్రచారముగాంచిన కొన్ని భాగవతకథల నిట పేర్కొందును.

నలచరిత్రము, శశిరేఖాపరిణయము మున్నగు పదములు వ్రాసిన తోలేటి సీతారామయ్య ''ప్రహ్లాదచరిత్రము పదము" గా రచించెను. పదముగా "ప్రచురంబు జేసితే బహుమంది కుపయోగ" పడునని యాతని యభిప్రాయము. సనకసనందనాదులు జయవిజయుల శపించుటదగ్గరనుండి ప్రహ్లాదపట్టాభిషేకము వరకు గల గాథ ఇందు వర్ణితము. భాగవతమందలి కథకును పదమునకును భేదము ఏమియులేదు. పోతనగారి భావశరీరమునకు తోలేటి సీతారామయ్య తన భాషా వస్త్రములు గట్టెను. "సరవిగా క్రోధిసంవత్సర చైత్రమాసమున, వరపౌర్ణమీ స్థిరవాసరమునకు" ప్రహ్లాదచరిత్రపదము పూర్తిచేసి సింహాద్రిస్వామికర్పితము చేసినటుల చివరన కలదు. క్రోధి క్రీ.శ. 1904 సంవత్సరమునకు సరిపోవును. 'హరిహరీ నారాయణాదినారాయణ'యను వరుసలో ఐదేసి మాత్రల యావృత్తములతో సాగినదీపదము.

ఇంతింతై వటుడింతయై యనెడు వామనమూర్తి కథను రాయగుప్త, నంబూరి మల్లేశ్వరస్వామి కంకితముగా పొట్టి పానయగుప్త ప్రోత్సాహమున 'వామన విజయము' పేరుతో జంగంకథగా రచించెను. భారతసంబంధగాథలందు దేవయాని చరిత్రము జంగంకథగా వ్రాసినదీ కవియే. ఈ కవియే రచించిన మరియొక జంగంకథ 'తులసీ మాహాత్మ్యము'. దీనిని ప. యతిరాజులు నాయుడు 1909 సంవత్సరమున ప్రచురించెను. కథ ప్రసిద్ధమైనది కనుక దాని ప్రసక్తి యనవసరము. భాగవతకథకును జంగం కథకును భేదము

ఏమియు లేదు. కొన్నికొన్ని చోటులందీ గేయకర్త పోతనగారి పద్యపాదములనే గేయములుగా మలచినాడు. భాగవతమున కత్యంతసన్నిహితముగానున్న కొన్ని భాగముల నుట్టంకింతును.

సీ. పురుహూతుచే నొచ్చి పోయి భార్గవులచే బలి యెట్టకేలకు బ్రదికి వారి
చిత్తంబురా గొల్చి శిష్యుడై వర్తింప వారు నాతని భక్తివలన మెచ్చి
విశ్వజిద్యాగంబు విధితోడ జేయింప భవ్యకాంచనపట్టబద్ధరథము
నర్కవాజులబోలు హరుల కంఠీరవధ్వజము మహాదివ్యధనువు బూర్ణ

గీ. తూణయుగళంబు కవచంబు తొలుత హోమ
పావకుండిచ్చె నమ్లాన పద్మమాల
కలుషహరుడగు తనతాత కరుణ నొసగె
సోమసంకాశశంఖంబు శుక్రు డిచ్చె. (భాగ.)

దీనికి గేయానువాదము

"పురుహూతునిచే నొచ్చి పోయి బలి గురువు కడకు జేరి
పరమభక్తి శుశ్రూష లొనర్చియు భార్గవు కృప వడసి
అపుడు విశ్వజిద్యాగ మొనర్చిన నరదము హయములను
విపరీతంబగు కేసరిధ్వజమును విల్లు శరంబులును
కవచంబును మొదలైన వస్తువుల కానుకగా ప్రేమ
సవనంబున హోమానలు డిచ్చెను సంతోషముతోడ
మరి ప్రహ్లాదుడు పద్మమాల నమ్లాన మొసగె వేడ్క
గురువు సోమసంకాశ శంఖమును పరమప్రీతి నిచ్చె" (వామనవిజయము)

క. పాణియు రథియు కృపాణియు
తూణియు ధన్వియును స్రగ్వి తురగియు దేహ
త్రాణియు ధిక్కృత విమత
ప్రాణియు మణి కనకవలయ పాణియు నగుచున్ (భాగ.)

"తూణియు ధిక్కృత విమతప్రాణియు త్రాణి శరీరియును
ప్రాణియు సత్వతురంగియు రథియు గృపాణి యగుచు దాను" (వా.వి)

ఆ.వె. ఘనసమాధినుండి కశ్యపు దచ్యుతు
నంశమాత్మ నొలయ నదితియందు
దనదు వీర్యమధికతరము సేర్చెను గాలి
శిఖిని దారువందు జేర్చినట్లు (భాగ.)

"అంతట నొకదినమున సమాధి కశ్యపు డుండియు వేడ్క-
కంతుజనకుడగు నచ్యుతునంశము కరమాత్మన్నొలయ
నదితియందు తనదగు వీర్యంబును అధికతరము జేర్చె
ముదమున వాయువు శిఖిని దారువందొనర జేర్చినట్లు" (వా.వి.)

ఇటులనే 'గొడుగో జన్నిదమో కమండలువో' యను పద్యమునకు
"గొడుగో జన్నిదమో కమండలమొ కోరను నే వేడ్క-
వడుగేనెక్కడ భూములెక్కడను వనితార్థములేడా
ప్రాప్తంబగునది లేశంబైనను పదివేలనుచు మదిన్
తృప్తింజెందని మనుజుల కంటును తప్పక దోషములు"- (వా.వి.)
కథయంతయు నిట్టిశైలితోనే నడిచినది.

ఈకథనే 'వామనచరిత్రము పాట'గా స్త్రీలు పాడుకొనుట కనువగునట్లుగా నెవరో రచించిరి. ఇందులో రెండు కల్పనములు మూలభిన్నములు కలవు. వామనుడు బలిచక్రవర్తి చెంతకు బోవుటకుముం దాతని నేమి దాన మడుగ వలయునని తల్లియగు నదితి నడుగ నామె మూడడుగుల నేల అడుగుమనును. ఇది యంత యుచితముగా లేదనుకొందును. పరమాత్ముడగు వామనమూర్తి యట్లడుగుట భావ్యముకాదు. తానీయవతార మెందుకెత్తెనో తనకు తెలియదా? ఇది మన తర్కమేకాని జానపదు లిట్టి కల్పనములు చేయుట పరిపాటి. ఇక రెండవ కల్పనము. చివరకు "ప్రహ్లాదుని బిలిచి హరి యిట్లు బలికె - మీతాత బలియుని స్వర్గలోకముకు- ఏడాది కొకతూరి మూడు దినములును- మాసన్నిధిని యుండ సెలవిస్తిమయ్య" యనెను. మూలమున సావర్ణి మనువు వేళ బలికి ఇంద్రపదవి నిత్తునని విష్ణువు పలికెను కాని ఇటులనలేదు. బలికి ప్రహ్లాదుడు మనుమడనుట పొరపాటు. బలియే మనుమడు. 'ఒరులు నాకు కారు నే నొరుల కగుదు' 'భూములు పురములూ కనకసౌధములూ, సింహాసనంబులు గజ అశ్వములునూ ఇన్ని సంపదలును ఇట నిండియుండ, కోరితి నొక వెఱ్ఱిదానంబు యిపుడు."

నారాయణుడు క్రిందు నేను మీదాయె'నను చరణములు పోతన కవితకు అనుసరణములుగా గ్రహింపవచ్చును.

ఉప్పలపాటి వెంకటరామయ్య యనునాతడు 'అంబరీషోపాఖ్యానము'ను జంగంకథగా విరచించెను. ఇది మొదటిసారి ౧౯౧౨ లో పంత్రాయల కృష్ణస్వామిశెట్టిగారు ప్రచురించిరి. దీనిలో కవి ప్రకాశకులకు వ్రాసిన పద్యముల లేఖ కలదు. కాన కవి ఈ శతాబ్దారంభమున నున్నవాడుగా భావింపవచ్చును. సలక్షణమగు భాష ; చక్కనిధార. అంబరీషుడను పరమవైష్ణవభక్తుడైన రాజు చేయు హరివ్రతమును పరమకోపియగు దుర్వాసుడు చెరుపవచ్చి పరాభూతుడైన కథ యిది. వైష్ణవభక్తిపారమ్యము నిది స్థాపించును. అంబరీషుని జంపుటకు ముని కృత్తిని పుట్టించెను. కాని కృత్తి సుదర్శనముచే పరాభూత మగుటయే కాక ముక్కోపి మునికి ప్రాణము మీదికి వచ్చెను. అంబరీషుని వేడుకొమ్మని హరి చెప్పినను దుర్వాసుడు దురభిమానముతో భూలోకమున కరిగెను. చక్ర మాతని వెంబడింప దారి నెమర్కొన దుర్వాసుడు తన మంత్ర ప్రభావమున సైన్యములు కల్పించెను. ఈ విషయము మూలాతిశాయి. ఇంకొక కల్పనముగూడ మూలభిన్నమైనది కలదు. దుర్వాసునికి గర్వభంగమైన పిమ్మట నంబరీషుడు మునిని భోజనమొనరింపుమని కోరెను. ముని కపటముతో వల్లెయని బ్రాహ్మణులందరకు సిద్ధపరచిన భోజనపదార్థము లన్నింటిని తానొక్కడే తిని రాజు నవమానపరుపవలెనని 'తెగతినెను.' కాని భక్తుని పదార్థములు తరుగని ధనమయ్యెను. మునికి రెండవ మారుసు నిటుల పరాభవము జరిగెను. అతడు అవమానముతో వెడలిపోయెను. ఇదికూడ మూలమున లేనిదే. తక్కిన కథ సాధారణమే. పోతనకు భాగవతరచనాభాగ్యము కలిగినటులె ఈ కవికి నీకథ లభించినదట.

"శ్రీమహాభాగవతంబులో నవమస్కంధమునందునను
భూమీశ్వరుడగు నంబరీషుడను పుణ్యశాలికథయు
సూచనగా నాబమ్మెరపోతన భూచక్రంబునను
యోచన చేసియు పద్యకావ్యము తోచినట్లు చెప్పె
అదిమొదలుగ నీపద్యకావ్యము ఆదికవులు నెవరు
పృథివిని రగడగ జేయరైరి నాపుణ్యఫలము కొలది
దొరికె దరిద్రుకు దారిలొ లిబ్బియు దొరికినట్లుగాను."

ఉని చెప్పుకొనెను. పైనున్న కావ్యమనుమాట గమనింపదగినది. ఉపాఖ్యానము లైనను భాగవతమందున్న వామనమూర్తి కథ, అంబరీషోపాఖ్యానము, గజేంద్రమోక్షము, రుక్మిణీపరిణయము మున్నగునవి ఉపక్రమోపసంహారముల బట్టి చూడ సంపూర్ణ కావ్యములవలె నున్నవి. కనుకనే దీనిని కావ్యమన్నాడీ కవి.

పోతనగారి మాటలతోడనే. అదే వర్ణనాక్రమ మనుసరించి క్లుప్తముగా ౧౫ ఖండికలందు 'గజేంద్రమోక్ష'మును గేయముగా స్త్రీలు పాడుకొనుట కనువుగా మలచినవాడు రామకృష్ణుడను కవి. ఈ కవి గుంటూరు జిల్లా మందపాడుకు చెందిన మందపాటి రామకృష్ణయ్యగారని శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి అభిప్రాయము. ఈకవి ౧౫౦ సంవత్సరములనాటి వాడట. గజేంద్రుడు ప్రవేశించిన వనవర్ణనము, గజేంద్రుడు శ్రీమన్నారాయణుని స్తోత్రము చేయుట, విష్ణువర్ణనము ఆదిగాగలచోటుల పూర్తిగా పోతనపద్యప్రతిబింబము గేయరూపమున కాననగును. ఆరంభమున,

రాజేంద్ర వినుమీ విరాజితముగ గజరాజమోక్షణకథను
మహాసుధను, రహితమనోవ్యధను
రాజిల్లు భువి సుధారాశి త్రికూటాద్రి
యోజనాయుతాయామ మున్నతత్వంబు-వి
భ్రాజితంబున కాంచనంబన రాజితంబు నయోమయంబన
రాజెలంగెడి శృంగముల మూడతులమణి ధాతువుల వెలుగును ॥రా॥

అను ఖండము పూర్తిగా "రాజేంద్ర విను సుధారాశిలో నొకపర్వతము త్రికూటంబన దనరుచుండు" నను పద్యమునకు ప్రతిబింబము. ఇటువంటివే తక్కిన చరణములు. ఈపాటను స్త్రీలు ఆనందభైరవిరాగమున మృదుమధురముగా పాడుకొందురు. ఇటుల "ఉపక్రమణిక మొదలు ఫలశ్రుతివరకు మూలము లోని పదాలు సమాసములు కూడ దింపేస్తు రచించడము ఎంతో కష్టపడితేనేకాని సాధ్యము కాదు"[1].

"ఇంటి వెలుగును గన్న ప్రతి తెలుగు తల్లి కంఠమెత్తియు, కనసున్న తల్లి లోలోపలను "కస్తూరి రంగరంగా నాయన్న కావేటి రంగరంగా-శ్రీరంగ రంగరంగా నిను బాసి యెట్లు నేమరచుందురా-కంసుణ్ణి సంహరింపా సద్గురుడు అవతారమెత్తె నపుడూ - దేవకీ గర్భంబునా కృష్ణావతారమై జన్మించెనూ"

1. కృష్ణశ్రీగారు, భారతి, జులై 1958

-ని 'శ్రీకృష్ణజననము-లాలిపాట' పాడుకొనుచు పుత్రవాత్సల్యమును ప్రోత్సాహపరచుచుండుట మన మెఱిగినదే. దుష్టశిక్షణకై శిష్టరక్షణకై భగవంతుడు 'భూలోకమున జననమైతే తనకు బహుమోసంబు వచ్చుననుచు-యెదురుకాళ్లను బుట్టెను మేనమామ దాచులను జంపె నపుడూ". పుట్టుకతోడనే యా పసికందు "నన్నేల యెత్తుకొనవే నాతల్లి దేవకీ వందనంబు" అని యేడ్వదొడగెను. అప్పుడు దేవకీదేవి "వొళ్లెల్ల హీనంబుతో ఈరీతి నున్నాను కన్నతండ్రీ - నిన్నెట్లు యెత్తుకొందు దేవాకృష్ణ నిమిషంబు తాళరన్నా" యని యోదార్చి గంగను ప్రార్థించెను. ఉప్పొంగివచ్చిన గంగలో స్నానమాడి కామధేనువును ప్రార్థించి పాలవానలో తడిసి బాలునికి పాలతో స్నానమాడించెను. తరువాత నా చిట్టికృష్ణు నెత్తుకొని "అద్దాలపై వేసుక ఆబాల చక్కదనమూ చూచెను" శ్రీకృష్ణుని వర్ణన మత్యద్భుతముగా నున్నది. "వసుదేవపుత్రుడమ్మా ఈబిడ్డ వైకుంఠవాసుడమ్మా-నవనీతచోరుడమ్మా ఈ బిడ్డ నందగోపాలుడమ్మా- సీతాకళత్రుడమ్మా ఈ బిడ్డ శ్రీరామచంద్రుడమ్మా- శిరమునా చింతామణి నాతండ్రి నాలుకను నక్షత్రము-పండ్లను పరుసవేది భుజమందు శంఖుచక్రములు గలవు- వీపునా వింజామరా నా తండ్రి బొడ్డునా పారిజాతం- అరికాళ్ళ తామరములు అన్నియు వున్నవిక నాచుతండ్రి-నీరూపు నీచక్కనా ఆ బ్రహ్మ యెన్నాళ్ల వ్రాసె తండ్రి." ఇది జానపదుల ప్రత్యేకవర్ణనాపద్ధతి. గొప్పవారిని వర్ణించునప్పుడెల్ల నాలుకను నక్షత్రము, పండ్లను పరుసవేది, వీపున వింజామరలు తప్పవు. ఇది వరాహావతార పదమునను బొబ్బిలిపదమునను కాననగును. ఏడ్చుచున్న శ్రీకృష్ణుని దేవకి

"అల్లదుగో జోగివాడు నా తండ్రి వస్తాడు పవళించరా-
అల్లదుగో పాము వచ్చె నాతండ్రి గోపాల పవళించరా"

యని భయపెట్టెను. కాని సమాధానముగా "జోగిమందుల సంచులు యేవేళ నాచంక నుండగాను- జోగేమి జేసునమ్మా నాతల్లి జోగి నన్నెరుగునమ్మా" యనియు "పాములకు రాజు బనా శేషుండు పానుపైయుండగాను - పామేమి జేసునమ్మా నాతల్లి భయము నాకేలనమ్మా" యనెను. వసుదేవుడు శ్రీకృష్ణుని వ్రేపల్లెకు గొనిపోవుటవంటి కథయంతయు భాగవత సామాన్యమే. వ్రేపల్లెలోనున్న కృష్ణుని జంపుటకు పోయిన పూతన, శకటాసుర, వృషభాసుర భంజనములు కూడ వర్ణింపబడినవి. కృష్ణుని చిలిపిపనులు, గోపికల వస్త్రములను దాచుట, పంటి ఘట్టములు మనోహరములు, తమ యిండ్లలో కృష్ణుని కట్టివేసి యశోదతో

చెప్పబోవుచున్న గోపికల కచ్చట కృష్ణుడు కనబడ వారు తెల్లబోయి, ''సిగ్గుపడి లేచి తాము తమతమ యిండ్లకు వేగ వచ్చి- ఇదియేమి ఆశ్చర్యమే చెలులార యిది యేమి చోద్యమికను- కనుపాపలను తీసునే కృష్ణుండు దొంగతనములు జేసునే" యనుచు గుసగుసలు వోయిరి. ఈ పాటను పాడుకొనుచు ప్రతి తల్లియు తన యింటనే శ్రీకృష్ణుడు జన్మించినట్లుపొంగి పోవును.

శ్రీశుకుడు పరీక్షిన్మహారాజునకు జెప్పిన శ్రీకృష్ణుని కాళియమర్దన కథ స్త్రీలు 'కాళింగమడుగు' పాటగా పాడుకొందురు. కాళీయశబ్దము స్త్రీల నోటబడి కాళింగశబ్దముగా మారినది కాబోలు. కాని కృష్ణశతకకారుడుగూడ "మడుగుకు జని కాళింగుని పడగలపై"నని కాళింగశబ్దమే వాడెను. కళింగ అనగా మడుగు లేదా గుండము అను అర్థమున ''కళింగలలో ఈదులాడుటకును బోయిరి" అని శ్రీ వల్లూరి జగన్నాథరావుగారి "హాస్యపు పాటలు"లో ప్రయుక్తము.

క. తొల్లుల గాచిన నందుని
కుఱ్ఱని చరితామృతంబు గొనికొని చెవులన్
జుఱ్ఱంగ దనివి గల్గునె
వెఱ్ఱులకయినను దలంప విప్రవరేణ్యా. (భాగ.) యను పద్యమునకు

'అమృతమ్ము దోసిటను హత్తిపోసినను
జుఱ్ఱనేరని వట్టి వెఱ్ఱివెంగలియా' యను చరణములు పోలికలు.

కాళింగమడుగు వర్ణన మిట్లున్నది. "ఆమడుగు జలములు నీలమేఘములు, ఆణి ముత్యపుచాయ ఆమలపరాళ్లు, పసడంపు రేవులాపాటిబంది నదీ (?), వజ్రంపు తళుకులా వద్రువ (వట్రువ?) ఇసుకా, చెదరిన కెంపులా సన్నంపు యిసుకా, నీలముల యవిబోలు నిండయిన జలము, రత్నములతో కాంతి ధవళమై యొప్పు". శ్రీకృష్ణుడు ఆవులపాలు పిడికి త్రేపల్లెను క్షీరసాగర మొనరించెనట. ''ప్రతిబట్టి కృష్ణమ్మ పాలు పితుకగనూ, క్షీరసాగరమాయె రేపల్లెవాడ, గుమ్మున పితుకగా చెదరి యాపాలు, నదులయి పారెను నడిమందలెల్ల''. కాళింగ మర్దనోద్దేశముతో శ్రీకృష్ణుడు ఆవుల గాయబోదునని తల్లినడుగ నామె కాళింగుని మడుగు దరికి బోవలవని భయపెట్టెను. ఆమెను నమ్మించుటకై కపటభయము నటించెడు శ్రీకృష్ణుడు ''చెప్పంగ భయమాయె అమ్మరో మనకు, పన్నెండు శిరసులా బూచునే పాము, నాలుక గిటుతూ యుండునే పాము, యిక దుష్టతనములూ

చేయనెన్నటికీ, పాము చేతికీ నన్ను పట్టివ్వకమ్మ, ఇక్కడ కృష్ణుడూ ఏడు ఏడ్చెనుచూ, యేశోద చెప్పమీ సర్పమ్ముతోనూ, తలుపును వేసుకొని దాగి యుండేనూ, అక్కడికి వచ్చునా అమ్మా యాపాము, శిఖదర్శన (?) మందు దాగియుండేను, అక్కడికి వచ్చునా అమ్మ యాపాము, జమ్మికొమ్మ పట్టుకొని యెక్కినిలుచుందు, అక్కడికి వచ్చునా అమ్మ యాపాము'' అనగా యశోద "జమ్మికొమ్మా మనకు యిలువేల్పు గాదా, యెక్కేము యనరాదు మ్రొక్కు శ్రీకృష్ణా" యనెను. మరల శ్రీకృష్ణుడు "గోవర్ధనగిరి కొండెక్కియుందు, అక్కడికి వచ్చునా అమ్మ యాపామ"ని భయపడెను. తల్లి యాతని నోదార్చి భయము లేదనెను. తల్లి కనుగప్పి గోవుల గాయవచ్చి కాళింగుని మడుగు దరికేగి కదంబమెక్కి

"చుంచు నున్నగ దువ్వి హారాలు సర్ది
సందిటి దండలు యెగసన దోచి
పీతాంబరము విప్పి బిగువుగా జుట్టి
అంకించి ఆమడుగు నడుమనే దుమికె"ను.

శ్రీకృష్ణుడు మడుగులో దూకినంతనే ''ఇది జూచి గోపకులు శ్రీకృష్ణ మమ్ము దిగవిడిచి, ఆమడుగు దుమికితివి న్యాయమా నీకు" అనుచు విలపించిరి. ''కరచిన పూరులు మేయజాలకా, అరచి చూచుచునుండె అపుడు గోవూలు" గోవులకు గూడ పరమాత్ముడన్న నంత ప్రీతి. కాళింగుని పడగలపై నెక్కి ''కోనాంగి(కోణంగి)గా బక్కె గోవర్ధనూడూ, అరువయినాలుగూ ఆలాపములూ, గతుల గతులకు నాడె కరుణాకరులూ, అచ్యుతు లాడినాయట్టి తాండవమూ, ప్రాణావస్థకుడాయె కాళింగుడంతా''. కాళింగుని భార్యలు శ్రీకృష్ణుని దరిజేరి "మాపతి యెన్ని జన్మంబుల తపసు, చేసెనో మీపాదపద్మములు సోకా, మీపాదపద్మములు శిరసుపైనున్న, అతని పత్నులమేము అధిక ధన్యుల''మని ప్రార్థించిరి. ''అబల ప్రాయమునాటి దది పెండ్లిగాదు, నీవు చేయుము మాకు నిక్కముగ పెండ్లి''యని బతిమాలిరి. కాళింగుడు కూడ "అవని యొక్కడుగుగా గొలుచు పాదములు, అహల్యశాపము బాపిన పాదమూలు, బలి శిరమ్మున మోపినట్టి పాదములు, తన శిరస్సుపైనున్న పాదపద్మములు, భమిడి పళ్లెమ్ములో భక్తితోనుంచి'' కడిగి పూజించెను. ఇటువంటి చోటులందు మూలమందలి శోలికలు కొన్ని కాననగును,

'శ్రీకృష్ణుని చల్దు'లను పేరుతో రెండు మూడు పాటలు ప్రచారమున నున్నవి. కథమాత్రమీ మూటిలో సమానమే యైనను కొంచెము మార్పులున్నవి. ఒకదానిలో శ్రీకృష్ణకర్ణామృతమందలి శ్లోకములు సందర్భానుసారముగా నిరికించబడినవి. భాగవతములో గోపకుమారులతో చల్దులు గుడువ బుద్ధిపుట్టిన కృష్ణుడు తానై గోపకుమారుల పిలిచినట్లుండ, పాటలో గోపకుమారులకే ఇట్టి బుద్ధిపుట్టి తెల్లవారగనే లేచి తలిదండ్రులతో చెప్పి 'చేకోలలు చేతన పట్టుకవచ్చి' శ్రీకృష్ణుని మేలుకొల్పిరి. మేలుకొల్పులలో దశావతారస్తోత్రములు చేసిరి. యశోదమ్మ కొడుకుకొరకు 'దధి చాలా కొంతి వేసీ మృదువుగా కలిపెను చల్దీ, ఓయమ్మా కలిపెను చల్దీ, ఒప్పా చిక్కములో నుంచీ, మృదువైనా పచ్చళ్లన్నీ, చల్దిపై యుంచెను తల్లీ, వాక్కాయ వద్దీకాయా (?) ఒప్పైన మారేడుకాయా, ఊరినా అల్లము తోటీ ఉసిరికా యొప్పుగ నుంచీ, చల్లించిన మిరియాలూ జన్నావుల పెరుగుతోను, అల్లమ్మ ఆవాకాయా అనేకము లుంచెను తల్లి". తీరుతీరుల యీ చల్దులపేరు విన్నంత మనకును నోరూరును. కాని ఏమిలాభము. ఆనాడు గోపకుమారులమై పుట్టిన ధన్యులమై యుందుము. యశోదమ్మ కృష్ణుని నిట్లాయత్తము చేసినదట. "తుల దువ్వి పాపిటదీసి, గండూకొప్పు వొప్పుగ ముడిచే, చామంతులు చంపాకమ్ములు చెంగల్వ నడుమా నుంచీ, అతివరులైనా మల్లెలు అనేకా పుష్పములన్నీ " తలలో ముడిచి గంధము పూసి మేలైన సొమ్ములుపెట్టి పంపించినది. అడవిలో కృష్ణుడు గోపకులతో కలిసి చల్దులు గుడిచి వేణువు పూరించెను. "హేసాక్షి భోజనగమనా (?) సావేరి భూపాళమునా, సరసిజా శ్రీరాగమునా సర్వంబున నాదంబుట్టెను". ఆవేణునాదము విన్న గోపికలు రాధ మున్నగువారు సుతులను పతులను విడిచి వచ్చిరి. ఇది చూచి గొల్లలు సమావేశమై కృష్ణు నెదిరింత మనుకొనిరి. కృష్ణమహిమ తెలిసిన యొక గొల్ల ''సతినైనా యిచ్చేగాని చావంగ నోపాననెనూ'' కాని ఇంకొకడు, ''సతినిచ్చిన కష్టముకంటె చచ్చుండుట మేలని పలికెను.'' సర్వము తెలిసిన గొల్ల యొకడు 'మనమెవ్వరు మన సతులెవ్వరు – అచ్యుతుడు మన కందరకూ, ఆత్మబంధుడని పలికె'ను. ఇది విన్న మనకు 'సాయుజ్యపదవీ గలదూ, సంసారభీతి తొలగూ, విష్ణులోకము గలదూ'.

'బాలకృష్ణలీల'లను పాటలో వలువ లెత్తుకొనిపోయిన కృష్ణుని కొలనులో నిలిచిన గోపికలు ప్రార్థించుట, తరువాత గోపికలు యశోదతో కృష్ణుని

యాగడములు విన్నపముసేయుట, అది విన్న యశోద కృష్ణుని మందలించుట కలదు. శృంగారరసభూయిష్ఠమైనవీ పాటలు. ఒక గోపిక "కంటెలిస్తా కాసులిస్తా, పంటనొక్కి పాట బాడెదరా, చల్ మోహనకృష్ణా, వాదమేల వలువలీయుమురా" యని ప్రార్థింప మరొక గోపిక "నీలాద్రిదేవుతోన నీటుగాను జలకమాడి, నీతోనా లీనమయ్యెదరా, చల్ మోహనకృష్ణా, చేలమిచ్చి ముందు బంపుమురా" యని ప్రార్థించెను, "చల్ మొహనరంగ" పాటవరుస దీనిని చూచి పుట్టినదో లేక దానిని చూచి యిది పుట్టినదో తెలియదు. గోపికలు యశోదతో కృష్ణుని దుడుకు పనుల గురించి చెప్పిన పాటలో "నాయక్క రూపముతో, నాయింటికిని వచ్చి, రేయెల్ల నాతో శయనించి, తిరిగిపోయే వేళను రూపము మార్చి, మాయమైనాడు నేనెట్లు మన్నింతు నీ సుతుని" అని కలదు. రచయిత యెవరో తెలియదు.

శ్రీకాకుళాంధ్రవిష్ణువు భక్తుడగు హరిదాసు రచించిన '**గుమ్మడుపాట**' ఆంధ్రదేశమందంతటను ప్రాకిపోయిన గేయము. గుమ్మడనగా సొగసుకాడని నిఘంటువు లనుచున్నవి. ఈసొగసుకాడు కృష్ణుడో లేక పామో?ఇది ధ్వన్యనుకరణ శబ్దమని నా నిశ్చయము. ఒకనాడు యశోదమ్మ పెరుగు తరచుచుండెను.

ఘుమ్మఘుమ్మన పెరుగు తరచగ కోరి విని ప్రార్థించి కృష్ణుడు
అమ్మ వెన్నా యనుచు కవ్వము నణచి పట్టగనూ
నమ్మరా కృష్ణమ్మ పెరుగులో నడుమ గుమ్మడు తిరుగులాడును
నమ్మకున్నను ఘుమ్మఘుమ్మను నాదమిటు వినుమీ ॥కృష్ణా గుమ్మడిడుగో॥

శ్రీకృష్ణుడు భయపడక,

"వామహస్తము నణచి పాదము, వసుధ లోపల కాలు యెత్తక
భూమి నడవగ నవయవమ్ములు, బొజ్జ గదలగనూ
కోమలీకంబైన చక్కని, గునిసియాడెడి నడుము వంచక
ప్రేమ లెన్నుచు చేయి చాచెను, పెరుగు తరచగనూ". ఈ వర్ణనమునకు

బొమ్మ గీయవచ్చు ననుకొందును. యశోద ఇంకొక మారిట్లు బెదరించెను.

"కాటబోయినవారి పాపడు, కడవలోపల చెయ్యి ముంచెను
తూటు బొడిచీ కరచె గుమ్మడు, తొలగిపోవగనూ
మాటలేటికి విడువు కవ్వము, అన్న నీకు వెన్న బెట్టెద
ఏటికి అందున్న గుమ్మడు, ఎగిరి కరచెడినీ ॥కృష్ణా గుమ్మడిడుగో॥

కృష్ణుడు భయపడలేదు, సరికదా గుమ్మడిని చూపించుమనెను.

"గుమ్మడేడే గోపిదేవి, గుమ్మడేడే కన్నతల్లీ
గుమ్మడిని పొడచూపగదవే, అమ్మ గోపెమ్మా ॥అమ్మా గుమ్మడేడే॥

ఇంతటితో నూరకుండక నా బాలకృష్ణుడు తానెత్తిన దశావతారములను వర్ణించి ఆయవతారములం దెప్పుడును గుమ్మడిని చూడలేదనియు విననైన లేదనియు చెప్పి తన నోటియందుండెనేమో చూడుమని తల్లికి నోరుతెరచి చూపించెను. బ్రహ్మాండ భాండోదరుడగు

"నందనందను నోటిలోపల, నాతి పొడగనె చరాచరంబులు
చంద్రసూర్యులు మొదలుగాగల, సకలదేవతలన్."

తన తప్పిదమెరిగిన గోపెమ్మ

"కన్నబలిమిని గుమ్మడంటిని, కరుణ జూడుమి దేవమణి నను
చిరుతను వెరపించు చందము, చేస్తినో తండ్రీ
వెరవవలెనని గుమ్మడంటిని, వెరచితిని తెరువాకు మాయుము
కరుణతో హరిదాసు నేలిన, కాకుళాధీశా" యని వేడుకొనెను.

ఇది చిన్నదైనను చక్కనిపాట. అత్యంతప్రచారము గాంచినది. మనకు మువ్వురు హరిదాసులు పరిచితులు. 'తిరుమంత్రపుపాట' రచించినవాడొక హరిదాసు. అక్కెనప్రగడ హరిదాసు 'బాలకృష్ణ లీలలు' రచయిత. 'గుమ్మడు పాట' రచయిత ఇంకొక హరిదాసు. ఈ ముగ్గురు వేర్వేరు కావచ్చును.

పైనున్న గుమ్మడుపాట వంటిదే 'యశోదకొంగపాట'. గుమ్మడు పాట కిదియో లేదా దీనికదియో యనుకరణములు. ఘుమ్మఘుమ్మని యశోద పెరుగు తరచుచుండగా కవ్వము పట్టుకొని కదలనీయని కృష్ణుని గుమ్మడను పేరుతో బెదిరించినట్లే ఆవులపెయ్యల విడువబోవు యశోద కొంగు పట్టుకొని వ్రేలాడుచు అడ్డగించి కదలనీయక తానుకూడ ఆవులకడకు వత్తునని పోరుచేయు కృష్ణుని యశోద, కొంగపేరుతో భయపెట్టినది. ఈరెండు పాటల శీర్షికలును ధ్వన్యనుకరణముమీద నాధారపడియున్నవనియే నా యూహము. యథాలాపముగా యశోదనోటినుండి వెలువడిన మాటలివి. ఈ రెండు పాటలకును పెక్కు పోలికలున్నవి. కొంగపేరున భయపెట్టిన యశోదతో శ్రీకృష్ణుడు తానెత్తిన దశావతారములందా కొంగను చూడలేదనియు విననుగూడ లేదనియు తన

నోటియందా కొంగ యుండెనేమో చూడుమని తల్లికి విశ్వరూపము గనబరచుటయు రెండు పాటలయందును సమానవిషయములు. నోటిలో సూర్యచంద్రులను బ్రహ్మాండమును జూచిన యశోదమ్మ భయముతో కృష్ణుని "వెన్నుడా నిన్ను నే కన్న బలిమి, కొంగంటె వెరతువని మరచి పల్కితిగాని, మురవైరి మాయమీ మ్రొక్కెదను" అనుచోటుల నవియే మాటలున్నవి. గుమ్మడు పాటలో లేని విశేష మిందొకటి కలదు. కృష్ణుని శాంతుని చేసి యశోద జోకొట్టుచుండగా గోపికలు వచ్చి కృష్ణునిపై నిందలు మోపి యశోదను తమతమ యిండ్లయందు దొంగిలించబడిన వెన్న, పెరుగు, పాలకుండలు చూడరమ్మని తీసికొని పోయిరి. కాని కృష్ణమాయచే నాయా భాండములన్నియు సంపూర్ణములై యుండి వారికి శృంగభంగమగును. తొలుత యశోదమ్మ నిజముగా కృష్ణుడట్టి దొంగపనులు చేసెనేమో యని భయపడెను. కాని "గొల్లవాడలు దిరుగ కల కుంభములన్ని, కలశలన్నియు నిండె దండి క్షీరములతోను" ఇంతియకాదు 'కలశతో ఒక వనిత జలము చేబూని', యశోద కాళ్లు కడుగుట కివ్వగా "కలశలో నీరంత క్షీరంబులయిపోయి, సిగ్గుపడి యాచేడె శిరసు వంచె"ను ధైర్యము గలిగిన యశోద "వెన్న డిన్నా గురుతులు వేళ్లు జూపారమ్మ, పాల్దాగిన చుత్తలా జాడలేవి, ఏపాలు యేనేయి ఏర్పడక దిన్నాడు, నాకొడుకు ముచ్చెన్న నిచ్చెదను" (మ్రుచ్చిలిన వెన్న నిచ్చెదనని కాబోలు) అని యడుగ "నీ కొడుకు ముచ్చుగా దచ్చుతుల యోగ్యుడూ, ముచ్చులం మేమని ముగుదలనిరి." అచ్చుతుల కరుణాకరులు అనుమాటలు స్త్రీలపాటల రచయితలు విష్ణువునకిడిన పేరులు.

'గోపికాస్త్రీల జలక్రీడ'లను పాటకూడ బాలగోపాలుని చిలిపిపనులను వర్ణించునట్టిదే. వ్రేపల్లెలోనున్న గోపకన్యలొకరినొకరు విచారించుకొని మార్గశిర మాసమున నోములు నోచి కామితార్థములు బడయుటకై యమునాతీరము చేరిరి "పరికింప నందగోపాలునికి కంట, పడకుండ మనమేగి పరిశుద్ధముగను లోస్పర్శ స్పర్శలో (?) స్నానంబు చేసి, యమునాతీరము బోయి ఏకాంతమున నుందమనుకొన్న వారి జాడ కృష్ణున కెటులో తెలిసినది. కొలను గట్టున తమ కట్టుపుట్టములు విడిచి వారు ''చెలగుచు నొకరొకరి చేతులంబట్టి, నవ్వులు నవ్వుచ నొవ్వారి మించి, కొదమ సింగపు పిల్ల ఎమరైనరీతి, పడిపడి జలముల పారజల్లుచును'' జలక్రీడలు సల్పుచుండిరి. ''కంధరములు దడియ హృదయము కధలి నిరులు దడియ, చేడెల హృదయము హృదయము ధడియగ జలక్రీడలు

ఆడుచు నుండి"రట. సిరులా? సరులా? సిరులైనచో మానధనమని సాభిప్రాయ మేమో? హృదయము పడియుటయన హృదయార్ద్రత కలుగుట కాబోలు. ఎంత చక్కనిమాట ! కృష్ణుడటువైపు వచ్చి "అన్నియు తాజూచి యనువైన మూట, తిన్నగా జుట్టుచు తిరుసుర్లరేక, కన్నుల నెవ్వరు గానరాకుండ" ఎత్తుకొనిపోయి చెట్టెక్కెను. స్నానములాడి గట్టెక్కి చీరలు కానమి గోపికలకు దుఃఖము అవమానము భయము కలిగెను. తమతమ చీరలగురించి ఒకరితోనొకరు చెప్పుకొని మిడికిరి. "విలువలేని చీరె కలువ పువ్వులదె, నా మగడది యెంతో ప్రేమతో గొనెనే"యని యొకతె యన "మల్లెమొగ్గల రవికె మామామగారు, విలువపెట్టి కొనెను విఖ్యాతిగాగ"నని మరియొకతె చెప్పుకొనెను. అటునిటు చూడగా వారికి శ్రీకృష్ణుని పాదపద్మాంకము లగుపడినవి. "ఇందువదన చూడే ముద్దుల కుందరదన చూడే, అందమైన గోవిందు పాదముల నందముతో గనరే" యని జాడలు పట్టుకొని చెట్టుపైనున్న కృష్ణుని జూచి కోపముతో మందలించి సంవాదమునకు డిగిరి.

గోపికలు "ఏమిరా బాలగోపాల యమునలో గొల్లభామలు స్నానము లాడంగ వస్తివి" యని ప్రశ్నింప. కృష్ణుడు "స్నానంబులాడంగ పూని దానములు చేయుదురని నేను చేరితిని తరుణి" యని సరసము లారంభించెను. గోపికలందరు మ్రొక్కినగాని చీరలివ్వనని చిలిపికృష్ణుడు పట్టుబట్టెను. చేయునదిలేక వారంద రొక్కొక్క తీరుగా నా ముడుపు చెల్లించుకొనిరి. సిగ్గుగల గోపిక యొకతి,

"అందరూ మ్రొక్కగనూ వొక చెలి యిదియే సందనుచూ
అందర నడుమను అందముతోడుత అందందీ మ్రొక్కెన్."

ఇది చక్కని యుపాయము. కృష్ణుడు ఎవరి చీరెలు వారి కిచ్చెను. చివరన "రామానుజుల పురమూ మాకు నమ్మాళ్వారి కృపనూ, ప్రేమతోను శఠకోపదాసుడూ చేసిన రామసంకీర్తన్' అని యుండుటచే శఠకోపదాసు ఈపాటను రచించెనని యనుకొనవచ్చును.

గోపికావస్త్రాపహరణ వృత్తాంతమునకు చక్కని హేతు కల్పనమును త్యాగరాజుగారు తమ "నౌకాభంగ" యక్షగానమున చేసిరి. శ్రీకృష్ణుని చిలిపి తనమున కిట ప్రసక్తి లేదు. త్యాగయ్యగారి కల్పన మిట్లున్నది. శ్రీకృష్ణుడు

ఒకప్పుడు తరుణులైన గోపికలతో నౌకావిహారము చేయుచు వారిని పరీక్షింప దలచి నౌక కొక రంధ్రమును కల్పించెను. ఆ రంధ్రమువెంట నీరుపడ్చి పడవ మునిగిపోవుచుండెను. రంధ్రమును గప్పుటకై యెక్కడలేని బట్టలను దానిలో గ్రుక్కుచుండిరి. ఎంతకును అది కప్పబడదయ్యెను. అప్పుడు గోపికలు సిగ్గువిడిచి తమ కట్టిన పుట్టములు తామే విప్పుకొని శ్రీకృష్ణునిముందు వివస్త్రలై దేహాత్మభేదమును మరచిరి.

రుక్మిణీకల్యాణము భాగవత మందొక కథాఖండము. దాని నతిక్లుప్తముగా సరళమైన భాషలో " రుక్మిణీ కళ్యాణము-బ్రతుకమ్మ పాట " పేరుతో స్త్రీలు పాడుకొనుట కనువుగా కొండూరు నారాయణగుప్త వ్రాసెను. ఈతడు తెలంగాణపు కవి.

రుక్మిణీకల్యాణకథయే **"చిలుక రాయబార"** మను పాటలో కొంత విపులముగా మరికొన్ని విశేషములతో నతిమనోహరముగా చెప్పబడి యున్నది. మధ్యన అక్కడక్కడ భాగవతమందలి పద్యములును చేర్పబడినవి. ప్రణయ దౌత్యమునకు హంసలకు మరియు చిలుకలకు పెట్టినది పేరు. అనేక కావ్యములందుందీ పక్షిదూతల చాకచక్య మనేకవిధములుగా నున్నది. ఈ పాటలో రుక్మిణి తన పెంపుడు చిలుకతో తనను పరిణయమాడుటకు శ్రీకృష్ణుని దోడ్కొని రమ్మని పంపెను. తన తండ్రియు మరియు అన్నగారలును తనను శిశుపాలున కిత్తురనియు నెట్లైనను కృష్ణుని త్వరగా ద్వారకనుండి తీసికొనిరమ్మనియు బుజ్జగించెను. లంచము లిత్తునని యెట్లాశకొలిపినదో చూడుడు.

''అగాగే మమ్మాదిశేషులూ మమ్మాదరించితే
ఘనమైన వజ్రాల యందెలు కాళ్ళకు గట్టేనూ
ఎఱ్ఱన్ని ముక్కుకి వెండిభమిడి పొదిగేనూ
పచ్చన్ని రెక్కలకు హెచ్చైన ముత్యాలు గుచ్చేనూ."

రుక్మిణి తనకు శ్రీకృష్ణుని పొందు లభించినచో నా చిలుకకు కలుగు పుణ్య ఫలముల నిట్లు దీవించి చెప్పినది. 'ఇంకొక్క జన్మాన రాజాధిరాజూల పట్టిపీ కొడుకూలు కోడళ్లు అల్లుళ్లు ఆడుబిడ్డాలూ, మనమాలూ సకలసంపదలు కలుగ కోరావే'. కాని చిలుక యాశించినదా సుఖములు కాదు. ''అదియేమే ఓ అక్క అందూకు నే నాశిస్తినా, పుట్టిగ వైకుంఠపురమందు తప కిల్లూ గట్టావే, ఎన్నాడ

తన్నెడబాయకూ." ఎంత చక్కని కోరిక కోరినదీ చిలుక ! ఎంత స్వామిభక్తి కలది! చిలుక ద్వారకాపురమునకు పోయి శ్రీకృష్ణునితో మాటలాడి రుక్మిణీ వివాహమును ఆమె తండ్రి మరియు సన్నగారల ప్రయత్నముల నెరిగించి కృష్ణు నియ్యకొనఁ జేసి తిరిగి వచ్చి శుభవార్తను రుక్మిణి కెరిగించెను. భాగవతమందు బ్రాహ్మణు డొనర్చిన కార్య మీపాటలో చిలుక చేసినది. ఆతరువాత రుక్మిణీకల్యాణ భాగమంతయు భాగవతకథను పోలినట్టిదే.

విరహోత్కంఠితయగు సత్యభామ కృష్ణునకై చూచి చూచి కనుల నీరు గ్రమ్మెను. ఆలస్యముగా వచ్చిన నాథునిపై సత్యభామ యలిగెను. కృష్ణుడామెను బతిమాలెను. ఈ పాటయే "సత్యభామ సరసము". బతిమాలి బతిమాలి చివరకు "పట్టి శిక్షింపుమని అచ్యుతులు బలికె, కొట్టుమని బంగారు కోల చేతికిచ్చె''ను. అప్పుడు సత్యభామ కోపము చల్లారినది. "బంగారపుకోల తాను పారవేసుకొని, అక్కడ నా యింతి అట్టిట్టు నిలిచె, ఎక్కువలు తక్కువలు ఏను ఆడితినో, పట్టుకొని విభునికి పాదాలు వొత్తె"ను.

కోమలతరభావములకును, స్త్రీల హృదయములకును దర్పణమువంటిది 'రుక్మిణీదేవి ముచ్చట'. దీనికి మూలముతో – భాగవతముతో – నెట్టి సంబంధమును లేదు. కేవలము స్త్రీల సృష్టి యిది. 'ఆటకూటంబులోను రుక్మిణీ నాటకపు శాలలోను, పారిజాతపు శయ్యపై రుక్మిణి పవళించి యొక్కనాడు,కలికి శ్రీగోపాలుడు రుక్మిణిని కౌగిటను జేర్చుకొనెను'. అట్టి సమయమున రాధ వచ్చి కృష్ణుని చేయిబట్టి యెటకో తీసికొని పోయెను. ఏ భార్యలకును, ఏ గోపికలకును లేని యిట్టి స్వాతంత్ర్యము, చనువు రాధ కబ్బినదని రుక్మిణి తన విరహము నొక చెలియతో చెప్పుకొనెను. కృష్ణుడు రాధవలలో చిక్కుకొనెను. అందులకా రాధకు చెప్పరాని గర్వము. 'వంచినా వంగదమ్మా దానిదగు వయ్యారమేమో కాని, చూచినా చూడదమ్మా దాని కండ్లు మింటనే అంటున్నవి'. ఆమె యిట్లగుటకు కృష్ణుడిచ్చిన చనువే కారణము. కృష్ణునికి రాధపై నంత మక్కువ యెందులకో? "యేమి జూచి వలచెనే కోమలీ అది యెంత సుందరమ్మా, పాలిండ్లు జూచి వలచె దాని మంచి పలువరుస జూచి వలచె, వలచితే వలచె గాని విభుని తన వశము చేసుక పాయెనూ". తన యెదుటనే కృష్ణుడు రాధకు పరిచర్యలు చేసెనని రుక్మిణికి చెప్పరాని బాధ. 'కురులు సన్నగ దువ్వియూ శిరముపై గొప్పగా

బెట్టె తురుము, సొగసైన దాని నొసట కస్తూరి సోగ చక్కాగ దిద్దెనూ, ఆ మగువ చనుగవలపై ప్రేమతో అలదెనే శ్రీగంధమూ, కూడి వచ్చినవారికి ఇంతేసి కూటములు కలిగెనమ్మా". అంచరిలోన జవ్వనినని కడు గర్వితురాలైన 'సత్యభామ యుండుగానీ అది తమా ఇండ్లకెన్నడు రాదుగా'. కూడివచ్చిన రాధ మాత్రము కృష్ణుని లాగికొని పోయినది. అప్పటినుండి ఆమె కన్నులు నీటి కుప్పలై కురిసినవట. కృష్ణుడింకొక విధమున గూడ రుక్మిణి నవమాన పరచెను. "లక్షవేలూ జేసెడి తన మెడను పచ్చలాపతక మూంచె, అచ్యుతుని కంఠమాల తగులుకొని అది చిక్కుబడి యుండెను, ఆ చిక్కుదీసి తాను అద్దాని పరుపుపై బెట్టుంటినీ, ఎంత వలపే కోమలీ దాని (రాధ) ముఖము చూచుచు లోలుడాయె, చూచుచును లోలుడయ్యి దాని మెడ వేసెనే ఆ పతకమూ". ఇంత జరిగిన తా నెట్లోర్వగలదు ? ఇదిగాకను ఆ పతకము తనది కూడ కాదయ్యెను. "నాదిగాదే పతకము ఆ సత్యభామదే ఆ పతకము, అచ్యుతుని పెండ్లినాడు అల్లునికి అరణమిచ్చిన పతకము". గోరుచుట్టుపై రోకటి పోటసినట్లు 'అంతలోనే కోమలి ఆ సత్య అడగబంపెను పతకము". చిక్కులోబడిన రుక్మిణి 'పతకంబు తీరుగానూ పతకంబు చేయించ వేడినాను, ఎల్లుండి ఈపాటికి నీ వొచ్చి కొంచబోవె పతకము, అని యిట్లు అయింతికి ఈయింతి ఒప్పగా చెప్పంపెను.' కృష్ణుడు తన నిట్లవమానపరచుట మొదటిసారి కాదు. ఇదివర కొకమారు సత్యభామ మూలకముగా నవమాన పరచెను. నారదుడు తెచ్చియిచ్చిన పారిజాతమును తనకిచ్చిన కృష్ణుడు, 'ఇచ్చి సిలాపర్ణుడూ తనలోనె తాను తాపపబందెను, అవేళ అప్పగించి ఆ పారిజాతమే కొంచబోయె, దాని (సత్య) కాళ్ళ పట్టుకా దాని పెరట వేసెనె చెట్టునూ". పాపమూ రుక్మిణి తనకు జరిగిన పరాభవముచే నెంతగా కుమిలిపోయినదో ! ఇన్ని బాధలకు తానే కారణమట. రుక్మి మున్నగువారు వలదన్నను తానే చేతులార చేసికొన్న పెండ్లియట తమది. ఆ పెండ్లి ఎవ్వరికిని ఇష్టము లేకుండెనట. "ఇంద్రుడూ మెచ్చడాయె నా తండ్రి చంద్రుడూ మెచ్చడాయె, జారుడికి తెచ్చిచ్చెనే తమతండ్రి చోరుడికి తెచ్చిచ్చెనే, తండ్రేమి చేసెనమ్మా తన్నిచ్చి తానె తెచ్చుకుంటిమీ, రుక్మాంగు డన్నమాట అదియె తారుకాణాలాయెనూ". పాపము ఒకప్పుడా కృష్ణుడు "సరసంబు లాడుచుండు తనతోను సయ్యాట లాడుచుండు, అద్దంబు జూపుచుండు తనకతడు ఆకు మడచీ యిచ్చునూ, కలియు పీవన భక్తితో బంగారు వింజామరలు విసరునూ

నడువలేదని రుక్మిణీ తన్నతకు చంకపెట్టుక తిరుగునే". అటువంటి కృష్ణుడు ఒక్కసారి యిట్లు చేసిన పాపమామె హృదయ మెట్లుండును? ఈపాట రచించినది తెలంగాణపు కవియై యుండును. కొంచబోవు పంటి మాండలికపదములు ఇందుకు సాక్ష్యములు.

"రుక్మిణీదేవి సీమంత" మనుపాటలో శ్రీకృష్ణుని దక్షిణనాయకత్వము స్త్రీల వేనోళ్ల పొగడ్త కెక్కినది. శ్రీకృష్ణుని పట్టమహిషి రుక్మిణి ఆరునెలల గర్భిణి. ఆమెకు సీమంత మొనరింప దేవకీవసుదేవాదులు నిశ్చయించిరి. కాని కృష్ణుడు రుక్మిణీభవనమునకు రాక అప్పటికి నాలుగైదు నెలలైనదని వసుదేవునికి తెలిసి కోపించెను. వసుదేవుని కోపమునుగన్న పరిచారికలు కృష్ణున కెరిగించి తోడ్తెచ్చుటకై సత్యాభవనమునకు పోయిరి. కాని వారు సత్యకు భయపడి, "స్తంభాల చాటె నిలిచి కనుసంజ్ఞలు చేయుచు" కృష్ణుని పిలిచిరి. కృష్ణుడది కనిపెట్టి సత్యకు భయపడి "భామామణిరొ సత్యభామామణిరొ వినవే, మన భక్తుడు అక్రూరుడు మనకు విందు లమరించె, ఆరగించి నే అతిశీఘ్రంబున నేనూ" వత్తునని బొంకి పోయెను. రాకరాక వచ్చిన కొడుకును చూచి తలిదండ్రులు "బాలుడవై తిరిగేవూ గోపాలకుల గూడి" యని నర్మగర్భముగా మందలించిరి. కృష్ణుడు రుక్మిణి మేడకు పోయెను. గర్భభరాలసయగు రుక్మిణి నిద్రించుచుండెను. ఆమె ముఖముపై చిరుచెమటల ముత్యాలుండెను. "మా స్త్రీలకు ముఖశృంగారముయెడ ముత్యమ్ములు గలవా, భూషణములుగలవింకాభర్మసరములు గలవూ, స్త్రీలకు ముఖశృంగారము చూడను తానెన్నడునూ" అని దగ్గరకు పోయి చూచి చెమటయని తెలిసికొని "తాగప్పిన బంగారూ శాలువ చెంగున దుడిచే"ను. ఇంతలో సత్యభామ తన చెలులను కృష్ణు డక్రూరునింటికి పోయెనో లేక మరెచ్చటకు పోయెనో చూచిరమ్మని పంపెను. వారు వచ్చి రుక్మిణీకృష్ణుల సరసములు చాటుగా చూచుచుండిరి. రుక్మిణికి కలప మలదుచు కృష్ణుడు 'నీ చేతులు యెరుపేమే' యని ప్రశ్నింప. రుక్మిణి "కస్తూరికన్నా యెరుపు కమలనాభా మీకరము"లని పరిహసించెను. కృష్ణుడు మాటమాటలలో తన "పుట్టుపూర్వములు" రుక్మిణి కెరుకపరచి కోరికలేమైన నున్నచో కోరుకొమ్మనెను. ఆమె, "ముందు రామావతారములో మునుపడిగిన కోరికలూ, తమ్ముని యదవుల కిచ్చి చంపబంపితిరి మీరనెనూ". (స్త్రీలపాటలలో రాముడు, కృష్ణుడు, వామనుడు అందరు నొక్కరే. అటులే సీత, రుక్మిణి అలమేలుమంగలును) రుక్మిణీకృష్ణుల



సరసములు చెలికత్తెలు చూచిపోయి సత్యభామకు చెప్పగా నామె దుఃఖించి "పైల వస్త్రము గట్టి మత్సరముతో, పూరింటిలో నొక్క కీలడుగు మంచమున పవళించెను." రుక్మిణీసీమంతమున కందరు సవతులును గోపికలును వచ్చి పోయిరి గాని సత్య మాత్రము రాదయ్యెను. రుక్మిణి కృష్ణుని సత్యభామ యలుకదీర్చిరమ్మని బతిమాలెను. "సత్రాజిత్తుని పుత్రిక సత్యాంగన యలిగినది, పచ్చల పతకము లిచ్చెద పరమాత్మా" తోడుకొని రండని రుక్మిణి యన "భామామణిరో సత్యభామకు అలుకలు దీరవు, పాషాణము ఆ సత్యాభామామణి కోపము" అని కృష్ణుడనెను. కృష్ణుడు సత్యమేడకు పోయెను. కాని యామె కోపగృహము లోపల తలుపులు వేసికొనెను. కృష్ణుడు పామై దూరి లోని కేగి మరల కృష్ణుడై సత్యభామకు వీవనసేవ చేసెను. అప్పుడామె "ఇందాక లేని వింతా ఈ వింతా వాసనలూ, వింత వాసనలకు తా ముసుగు తొలగించీ తా చూచే, హరి యని తెలిసీ భామా మళ్లీ ముసుగులు బెట్టే" (ఇవి పారిజాతాప హరణకావ్యపు పోలికలు) కృష్ణుడు బతిమాలగా నామె "అక్రూరుని నగరికి విందులు అరగింతుమని వెళ్లీ, మము బొంకించి వేగ వనజాక్షా మీరు వెళ్లీ, అక్రూరుడె సతి యాయెన అతి వేగంబున మీ" కని దెప్పి పొడిచెను. కృష్ణుడు లోలోపల నొచ్చుకొని, "ముందుగ చెలులకు లంచమివ్వక నే మోసపోతి" ననుకొనెను. పచ్చల పతకము జూచిన సత్య ప్రసన్న యయ్యెను. కృష్ణుడు వచ్చిన కార్యము మరచి ఇటనే నిలచిపోయెను. రుక్మిణి ప్రసవించి మన్మథుని గనెను. శ్రీకృష్ణుడు మరల పిలుపు వచ్చునంతవర కిచ్చటనే యుండెను ఎంత తియ్యని కథ కల్పించినారీ జానపదగృహిణీమణులు!

"ఉషాస్వప్న"మను పాట చక్కని రచన. ఇది 'గోపికాస్త్రీల జలక్రీడలు' పాట వెంబడి నుంటచే తత్కర్తయగు శఠగోపదాసే దీనిని రచించి యుండునని నా భావము. రెండు రచనములందు కొన్ని పోలికలున్నవి. ఇది యమూల్యమగు పాట. దీని యందున్న ఆటపాటలు వేరొకచో పేర్కొందును. భాగవతమందలి ఉషాపరిణయగాథకును దీనికిని నెట్టి సంబంధము లేదు. ఇందు మూలవిరుద్ధములగు కల్పనము లున్నవి. ఒకనా డుషాకన్యకు మధురస్వప్న మొకటి కలిగెను. ఆమె నిద్రాహారములు మానెను. అలంకరణములు ఆట పాటలు వినోదవిలాసములు విడిచెను. తనకు నచ్చిన చెలి (చిత్రరేఖ) భూతము

కలలో వచ్చెనా యని యడుగ నామె" అతివరో ఆత్మచోరుడు వచ్చెనే" యనెను. "అనగానె చెలికత్తె అంతయును దెలిసికొని అతివ యింద్రుడు వచ్చెనా" యనెను. "అనగానె కాదమ్మ అమరనాయకునన్న నతిపాపమబ్బు నా"కని ఉషాకన్య సమాధాన మిచ్చెను. ఇటులే శివుడు, బ్రహ్మ, కుబేరుడు, సూర్యుడు, చంద్రుడెవ్వరును కాదన చెలికత్తె "అంబుజాక్షుడు వచ్చెనా" యని ప్రశ్నించెను. "అనగానె కాదమ్మ అంబుజాక్షుని రూప మమరెనే చాలవర"కనెను. మన్మథుడేమో యనుకొని మరల నడుగ "ఆ మన్మథుని రూప మమరెనే చాలవర"కనెను. అనిరుద్ధుడా యని ప్రశ్నింప, "అనగానే కాదంచు నౌనంచు బల్కాక అతివ శిరమును వంచెను, చేతితో తలయెత్తి చెలికత్తె నవ్వినను సిగ్గుచే తలయెత్తదూ, కాలి వ్రేలితోడ నేలనూ వ్రాయుచును కాంత తా తలయెత్తదూ, పయట సవరించుచును పాపటా దిద్దుచును పడతి తా తల యెత్తదూ, మురుగు బొత్తుకొనుచు ముక్కెర దిద్దుచును ముదిత తా తలయెత్తదు, ముఖముపై చెమ్మటను ముదముతో దుడుచుచు సఖియ తా తలయెత్తదు, రత్నాల హారమును రదనముల గొరుచును (గీరుచును) రమణి తా తలయెత్తదు, రవిక ముడి గిల్లుచును రాయిడి నొవ్వుచును ఉవిద తా తలయెత్తదు." ఇట ఉషాకన్య సిగ్గును సాత్త్విక భావములను అత్యంతమనోహరముగా చిత్రించినాడు. చిత్రరేఖ ఉషాకన్య స్వప్నవృత్తాంతము నామె తండ్రియైన బాణాసురున కెరిగింప నాత డనిరుద్ధునకు కూతునిచ్చి పెండ్లి సేయుట కంగీకరించెను. ఇది విచిత్రమైన కల్పన. మూలమునకు పూర్తిగా విరుద్ధము. ఉషానిరుద్ధుల ప్రేమకారణముగా భాగవతమున యుద్ధము సంభవించినట్లుండ పాటలో రాక్షసరాజు దేవతలతో కయ్యమునకు బదులు వియ్యమునకు సిద్ధపడెను. తండ్రిగా రంగీకరించినవార్త చిత్రరేఖ మరల ఉషాకన్య కందించుటతో నీ పాట ముగిసినది.

ఇక నేను సేకరించినవి ఒండురెండు భాగవతమునకు సంబంధించిన పాటలనిట పేర్కొందును. నందగోకులగోపికాజనమధురభక్తి నత్యుజ్జ్వలముగా చిత్రించునవి "భ్రమరగీతలు". భాగవతమున 'భ్రమరగీతము' దశమ స్కంధము పూర్వభాగమున నున్నది. ఉద్ధవుడు శ్రీకృష్ణు డంపగా నంద గోకులమునకు వచ్చి విరహార్తులైన యశోదానందులకు గోపికలకు కృష్ణుని వర్తమానము దెలుపును. గోపికలు తమ విరహము నుద్ధవునితో చెప్పు చుండగా నొక తుమ్మెద వచ్చి బాధింపజొచ్చెను. ఒక గోపిక "హరి తన్నుం

ప్రార్థింప బుత్తెంచిన దూతయని కల్పించుకొని యుద్ధవునికి నన్యాపదేశంబై యొుక నయ్యాళితో"1 నన్నమాటలకు భ్రమరగీతమని పేరు వచ్చెను. ఈ భ్రమరగీతము నాధారముగా గొని యెందరు భ్రమరగీతలు పాడిరో తెలియదు. "భ్రమరగీతలని ధవళాచలపు ప్రతివాదిభయంకర వేదాంతాచార్యులు రచించిన పాట కిటతక ఆవృత్తాల పాదాలతో నడిచేది ఉంది.'' అని కృష్ణశ్రీ గారు వ్రాసియున్నారు2. ఆ భ్రమరగీతములందలి విశేషములను వారందు చర్చించి యున్నారు. నేను సేకరించిన '*భ్రమరగీత*'లకు కృతికర్త కోనప్ప: కృతిభర్త నీలాద్రి నాయకుడు; నీలాద్రియను ప్రదేశమున నున్న దైవతము. ఆరంభమున నిట్లున్నది.

శ్రీ జగన్నాయకులను చిత్తకమలమందు నిలిపి
రాజసముగ పఠనజేతు భ్రమర గీతలూ
అమల నీలాద్రిపతిని ఆత్మకమలమందు నిలిపి
విమలముగను సన్నుతింతు భ్రమర గీతలూ.

అంతమున నిట్లున్నది.

నీలాద్రినాయకులకు నిఖిలభ్రమరగీత లనగ
మేలు రత్నహారములను మురిసి యిచ్చిరీ
వెలయ కోనప్ప హృదయ నీలమందు నిఖిలచరిత
నిలయుడుండి పలుకజేసె భ్రమరగీతలూ
పాహి నీలాద్రినాథ పాహి శివసురేంద్రచరిత
పాహి దీననిఖిల మాం పాహి రాఘవా

నీలాద్రి యనగా నీలాచలము. అది జగన్నాథక్షేత్రము. కోనప్ప జగన్నాథభక్తుడై యుండును. ఈ పాట భాగవతమందలి భ్రమరగీతమునకు సన్నిహితముగా నున్నది. ఇది చాలా పెద్దపాట. పుల్‌స్కేపు సైజులో సుమారు 30 పుటలున్నది. పూర్తిగా వ్రాసికొంటిని3. శ్రీకృష్ణు డుద్ధవునితో గోపికలగూర్చి,

1. భాగవతము దశమస్కంధము పూర్వభాగము, ప. ౧౪౨౪ పుట. ౩౦౩.

2. భారతి సంచిక ౯. సంపుటము ౩౦

3. నా మిత్రులు శ్రీ సురమౌళిగారి ద్వారమున నేనీ పాటను సేకరించితిని. ఇది వినిపించిన దొక వృద్ధబ్రాహ్మణి. పేరు చొప్పకట్ల రాజలక్ష్మమ్మ; కరీంనగరు మండలమున వేములవాడయను బ్రాహ్మణాగ్రహారము. ఆ యూరనున్న ప్రతి బ్రాహ్మణి యొుక పాటల పుట్ట.

"నన్ను స్వామి ప్రియుడననుచు నన్ను ఆత్మసర్వ మనుచు
నన్ను నమ్మియుండ్రి గోపనాథ ఉద్ధవా
నన్ను నమ్మి లోకసుఖము లన్ని విడిచి లజ్జ విడిచి
ఉన్న స్థితిని మరచి మగువలుందు రుద్ధవా
దినము నన్ను జూచి కాని దివ్యభూషణమ్ము లిడరు
అలర నా పొత్తె కాని అన్నము వల్లరూ
మరియు నాకు దాచి కాని మంచిగంధ మలదుకోరు
విరులు నన్నుజూచికాని వేడ్క ముడవరూ
వినుము నన్ను జూచికాని వింతచీరె కట్టుకొనరు
వెరచి సతులు పిడెపు రుచులు ఇచ్చగించరూ
పలచినపుడు నన్నెగాని తలువ రన్యవార్తలెపుడు
తలపులోన నన్నెకాని తలువ రితరులా
పలికినపుడు నన్నెకాని పలుక రన్యవార్త లెపుడు
పలుకులోన నన్నెకాని పలుక రితరులా" యని చెప్పెను. ఆ గోపికలు

కృష్ణునితో చింతాకంత యెడముగూడ సహింపనేరరట. "అలర కలసినపుడు హార మడ్డమైతె దూరమనుచు" నుండిరట. అట్టి వారెట్లు తన విరహమును భరించుచుండిరో యని కరుణామయుడగు కృష్ణుడు మథురనుండి యుద్ధవుని ప్రేపల్లెకంపెను. బయలుదేరుటకు తనకెంత సన్నాహము వలయునో యంతటి సన్నాహమే యుద్ధవునకు చేసెను. ఉద్ధవుడు రథమెక్కి "గుంపు మామిళ్లవనము గుప్త (గుత్త) మైన పనసవనము, డాకపందిళ్ల జంబీరవనములూ, వేడుకైన వెలగవనము, కూరనేరేడువనము, గంగరేణుపండ్లవనము గణితమొప్పగా, నారికేళవనములూ నారింజవనములూ, దాళిమ్మ వనము ఖర్జూరవనములూ,..." దాటి గోధూళిసమయమునకు గోకులము చేరబోయెను. పాలు పితుకు గోపికలు రామకృష్ణుల వేడ్కలు పాడుచుండిరి. "అడగుకడుగు కుద్ధవుండు అడుగు కొనుచు నందునిల్లు" ముందునకు సాగి నందునిల్లు చేరుకొనెను. నందుడాతని కౌగలించి గౌరవించి లోనికి గొనిపోయెను. "రంగుమీరినట్టి మంచి బంగారు గోపురములో, రత్నచావళ్ల మంచి ముత్యపరుగులూ, రామకృష్ణులు నడచినట్టి రాజమార్గమూలు జూచి, పూని యుద్ధవుండు హర్షమొంది నడచెనూ". ఉద్ధవుని అడుగులకు మడుగులొత్తి యతిథిసత్కారములు చేసిరి.

"హరినిగాను మదిని దలచి అర్ఘ్యపాద్యవిధులు జేసి
సరసభక్ష్యాన్నములను సౌఖ్యపదవినా

అప్పనావుం పెరుగు దెచ్చి శొంఠి నిమ్మకాయ గలిపి
ఒనర యశోదదేవి వడ్డించెనూ"

ఈచరణములు,

శా. ఆ పుణ్యాత్ముని గౌగిలించుకొని సంబాధీయ మానందియై
మా పాలింటికి గృష్ణ దీతడనుచున్ మన్నించి పూజించి పాం
ఛాపూర్ణంబుగ మంజులాన్నమిడి మార్గాయాసమున్బాపి స
ల్లాపోత్సాహముతోడ నిట్లనియె సంలక్షించి మోదంబునన్.

అను పోతనగారి పద్యమును జ్ఞప్తికి దెచ్చును.

ఆతరువాత యశోదానందులు కృష్ణునిగురించి తమ పూర్వస్మృతులు, అనుభవములు, మహిమలు, దుష్టశిక్షణము, శిష్టరక్షణము మున్నగునవి జ్ఞాపకము చేసికొని బాధపడిరి. యశోద,

"హరీ పవ్వళించినట్టి అట్టి రత్నాలతొట్టె
చూచి నేను మదిని వెతను బొందుచుంటినీ" యనెను.

అంతియకాదు. అప్పుడు,

"వనిత కుచములందు పాలు వచ్చి వరదలై పారె
మరియు కన్నులందు జలము తరము కురిసెనూ"

ఉద్ధవుడామె ప్రేమ కలరి శ్రీకృష్ణతత్త్వము నుపదేశించెను.

"అరయ కాష్ఠమందు ఎపుడు అగ్నియుండురీతి హరీ
వసుస జగమునందు జ్యోతివలెనె వెలుగునూ" ఇటులచెప్పి
"మనోవాక్కాయములను మరువకెపుడు హరిని దలచి
తనియు భాగ్య మబ్బె మీరు ధన్యులైతిరి" అని కొనియాడెను,

ఆరాత్రి యటగడచెను. తెల్లవారుజామున గోపికలు కవ్వపు చప్పుడు శ్రుతిగా శ్రీ కృష్ణుని విరహమును పాడుచుండగా మేల్కాంచెను. గోపికలు విరహముచే శ్రీ కృష్ణునినిటు లుపాలంభించుచుండిరి.

"పరగ తుమ్మెద పూల మమత తరచు తేనె దొరుకు దనుక
అరయ జారస్త్రీల మమత అర్థప్రేమకై

మరియు రాజు ప్రజల మమత మంచికార్య మయినదనుక
పరగ పక్షి మమత పండ్లు దొరికెదనుకనూ
యాచకునికి ప్రభువు మమత అచట ధనము దొరికెదనుక
కానువర్ణములకు ? స్త్రీలు ధనము గృహముకూ
అనుచు వారివలెనె శౌరి కపటమాయ దలచిరీ"

కాని వెంటనే దుఃఖ నిమగ్నలైరి.

"అంత నొక్క భ్రమర మచట అలర ధ్వనులు పాడగానె
సంతోషించి చూసిరి గోపసతులు మూకలై
ఆర్యుడుద్ధవుండు వినగ హరికి దూతగాను తెలిసి
తరుణులెల్ల తుమ్మెద జూచి వరుస బల్కిరీ
మధుప మా హితవునికిని మక్కువవాదౌట వలన
మధురధ్వనులచేత ముట్టకు మా పాదములన్
భ్రమర మా పాదయుగము పట్టరాకు విడువుమింత
కమలనాభు దూతవగుటకంటె జాలునే"

భ్రమరమును సంబోధించి కృష్ణుని, ప్రస్తుత మాతడు తమను విడిచిపోయి రాచనగరులం దనుభవించు సుఖములను ఏకరువు పెట్టిరి.

"కనకరత్నమయపుటిండ్లు కావు మా యిండ్లు హరికి
ఘనులు రాజు లుండేటి నగరు కాదు మా గోకులం
శృంగారవనము గాదు భృంగ మా వనము హరికి
పొంగు గజతురంగములు గావు పొసగు గోవులూ
అందమైనస్త్రీలు గారు హరికి గోపసతులు మధుప
మునుపటి సతులకంటె క్రొత్తలు మోహ మెక్కువ"

చివరకు హృదయ మాపుకొనలేక,

"ఎన్నడు హరి యిటకు వచ్చు ఇంతుల దుఃఖ మెన్నడణచు"
ఉన్నమాట జెప్పవయ్య ఒనర ఉద్ధవా" యని బతిమాలిరి.

అప్పుడుద్ధవుడు కృష్ణుడు గోపికలకు చెప్పినవాక్యము లిట్లు వల్లెవేసెను.

"వినగబడ్డ క్రియలు నేను వినికి నేను నిశ్చయముగ
వినుచునున్నవాడ నేను ఇంతులరయుడీ

పలుకబడ్డ క్రియలు నేను పలుకు నేను సర్వముగాను
పలుకుచున్నవాడ నేను భావ మరయుడీ”

సర్వము తానె కావున గోపికలకు శ్రీకృష్ణవిరహముండబోదని దీని భావము. దీనినే

సీ॥ ఎల్లకార్యములకు నేను ప్రధాన కారణము గావున మీకు వియములారి
కలుగదు మద్వియోగము చరాచరరూపములలో మహాభూతములు వసించు”

అని పోతన చెప్పెను. ఇంకను.

“పతులు దూరముండుటకును సతుల ప్రేమ అధికమౌను
పతులు చేరువైతె సతుల భ్రాంతి తక్కువ
మీకు నాయందు భక్తి మిక్కిలుండవలెనె ఎంక
జోకతోని దూరమైతి సొంపుమీరగా” నని పలికెను. ఈ చరణములు,

మ. చెలువల్ దవ్వులనున్న వల్లభులపై చిత్తంబులం గూర్తు ర
త్యాలితం జేయువారికంటె నదియుంగా కెప్పుడున్నన్ను మీ
రలు చింతించుచు నుండగోరి యిటు దూరస్థత్వముం బొందితిన్
దలకం బోలదు నన్నుఁగూడెదరు నిత్యధ్యానపారీణలై' యను

పోతనగారి పద్యమున కనుకృతులు. ఉద్ధవు డచట కొన్నిదినములు గడపెను.

గోపికలు ఉద్ధవునకు కృష్ణునకును కానుకలిచ్చి సాగనంపుచు కృష్ణు నొకమారు రమ్మనుమని కోరిరి. ఉద్ధవుడు తిరిగివచ్చి కృష్ణునకు గోపికల కోరిక నెరిగించి వారి భక్తికి, ముగ్ధుడై తానా గోకులమందు తృణమై పుట్టకపోయితిని గదాయని విచారించెను. ఎందులకన భగవద్భక్తులైన “ఒనర సతుల పాదధూళి తనకు సోకునూ”. ఈ పాటయంతయు మధురభావములతో తొణకుచున్నది.

శ్రీ నేదునూరి గంగాధరంగారి సహాయమున సన్యాసిరాజు రచించిన “కుచేలోపాఖ్యాన”మను 35 ఖండముల దీర్ఘగేయమొకటి సేకరించితిని. ఇదికూడ భాగవతమందలి కుచేలోపాఖ్యానము చూచి వ్రాయబడినట్లున్నది. కృష్ణుని సెలవంది కుచేలుడు స్వగ్రామమునకు తిరిగిపోవుచు ఇటులనుకొనెను. “ఏమయ్యె శౌరీ నీ కేమిచ్చెననిన మా యింతితో నేమందునూ, తెచ్చెదను యింకేమొ యనుచు ఘూచునూ, శ్రీకృష్ణుదయయో వృధాచేసెనూ, పోనీ సర్వకామితఫలప్రదాయిని గాంచితినీ భాషించితిని, నాకేమి కొరత యటంచు

పల్లియ కేగి గాంచె హరిప్రభావము". కొంత కీర్తనము కొంత దరువు బలిసిన పీగేయమున.

## ఇతరములు

ఇంతవరకు పరిశీలించినవి కొద్దిగనో గొప్పగనో రామాయణ, భారత, భాగవతములకు సంబంధించిన గేయములు. ఇక నితరపురాణములకు కావ్యములకు సంబంధించిన గేయములగూర్చి విచారింతును. ఏ పురాణమునుండియో మరే కావ్యమునుండియో ఇతివృత్తము తీసికొని పాడబడుచున్న పాట లున్నవి. వీనినన్నింటిని అనగా పురాణమునకొక్కటి తీసికొన్నను ఈపౌరాణిక జానపదగేయప్రకరణము మరింత పెరిగిపోవును. కావున కేవల మత్యంత ప్రచారమందున్న గేయములనే కొన్నింటిని పేర్కొందును. సత్యవాదిత్వమునకు అడితప్పనితనమునకు మనము మొదట చెప్పుకొనుపేరు హరిశ్చంద్రుడు. సత్య హరిశ్చంద్రుడని యాతని సార్థకనామము. ఇది మనభాషయందొక జాతీయముగా పరిణమించినమాట. వేదమందలి హరిశ్చంద్రకథకును పురాణమునందలి హరిశ్చంద్రకథకును భేదముండుట సర్వవిదితము. పురాణమునందున్న కథయే కావ్యకారు లాధారముగాగొని పెక్కు కావ్యములు దేశభాషలందు మలచు కొనిరి. ఈ పురాణకథయే ప్రజాసామాన్యమున ప్రచారమందున్నది. వేద హరిశ్చంద్ర మందరకు తెలియదు. అది సత్యహరిశ్చంద్రముకూడ కాదేమో, సత్యహరిశ్చంద్రకథ మార్కండేయపురాణమున నున్నది. దాని నాధారముగా గొని పెక్కురు కవులు కావ్యములు రచించిరి. నాటకములను వ్రాసిరి. ఆ నాటకముల ననుసరణ చెర్విరాల భాగయ్యయను తెలంగాణా జానపదకవి "*సత్యహరిశ్చంద్ర-బ్రతుకమ్మపాట*"ను స్త్రీలు పాడుకొనుటకై వ్రాసెను. సత్యహరిశ్చంద్ర కథ ప్రసిద్ధమైనది. ఆంధ్రదేశమున నాబాలగోపాల మాకథ నెఱుగుదురు. కనుక నిట కథపేర్కొనుట యనవసరము. మార్కండేయ పురాణాంతర్గత హరిశ్చంద్రకథకును నాటకహరిశ్చంద్రమునకును కొంత భేద మున్నది. హరిశ్చంద్రుడు వేటకుబోయినచోట విశ్వామిత్రునకు రాజ్యమిచ్చినట్లు మార్కండేయపురాణమున నున్నది. కాని నాటకమున తద్భిన్నముగా నున్నది. పాటలోకూడ నంతియ. మాతంగకన్యకల వృత్తాంతము పురాణమందు లేదు. కాని జనసామాన్యమున నీ వృత్తాంతము ప్రబలినది. ఈ పాట,

శ్రీ కరంబై యొప్పు ఉయ్యాలో శ్రీ అయోధ్యాపురము ఉయ్యాలో
అపురం బెన్నగా ,, ఆదిశేషుని తరమె ,,

అని అయోధ్యాపురవర్ణనముతో నారంభమై సరళభాషలో సాగిపోయినది. పైన పేర్కొన్న రెండు విశేషములు తప్ప ఇతరము లేమియు లేవు. పాట యంతయు కథాప్రధానముగా చకచక నడచిపోయినది. దీనిని ప్రచురించినది కొండా శంకరయ్య.

పై కథనే 'చంద్రమతీదేవి-బ్రతుకమ్మపాట'గా నరసింహామూర్తియను నాతడు వ్రాసెను. ఈ పాటలో గమనింపదగినవి రెండువిషయములు. పై పాట యందువలె నింద్రసభలో జరిగిన వసిష్ఠవిశ్వామిత్రసంవాద మీపాటలో లేదు. ఇంకొక విషయమేమన చంద్రమతిపై చౌర్యనిందకు మారుగా హత్యానేరము మోపబడియున్నది. ఇంతియ భేదము. (కొండా శంకరయ్య ౧౯౫౧)

సమస్తభువనములకు సృష్టిస్థితిలయకర్తలైన త్రిమూర్తులను పసి బాలురుగ జేసి బ్రహ్మాండముల నన్నింటి నిద్రపుచ్చుటకు జోలలు పాడినది పరమపతివ్రత యనసూయాదేవి; అత్రిముని యర్ధాంగి. స్త్రీలోకమున కామె యారాధ్యమూర్తి, శిరోభూషణము. ఆయమ గాధను "అనసూయాదేవి బ్రతుకమ్మపాట'గా రచించినది బూరెల సత్యనారాయణమూర్తి. (వల్లిషరు చందా నారాయణ ౧౯౫౧) అనసూయ సేవల కలరి యత్రిమహాముని యామె నేదేని వరమడుగుమన "పసుపు కుంకుమ చాలు" ననెను. ఒకనాడు త్రిమూర్తులు మేరుపర్వతము జూడ బోవుచుండిరి. అత్రి యాశ్రమము మీదుగ బోవునపుడు వారి వాహనములు కదలవయ్యెను. అందుకు కారణము,

ఆ పతివ్రత మహిమ ఉయ్యాలో అగ్నిజ్వాలలయటుల ఉయ్యాలో
మిన్నువరకును బ్రాకె ,, మీ వాహనంబులను ,,
అరికట్టజేసినవి ,, అని నారదుడు చెప్పె ,,

త్రిమూర్తు లామెను పరీక్షింపగోర నారదు డింతకుమున్నె ఇనుప గుగ్గిళ్ళు చేసిపెట్టి తనకు అనసూయ యొనర్చిన శృంగభంగమును నివేదించి వలదనెను. కాని త్రిమూర్తులు వినక బ్రాహ్మణవేషమున నామెయింటి కతిథులై పోయిరి. భోజనసమయమున వారామెను "వస్త్రవిహీనవై వడ్డించు భోజనము" అని

కోరిరి. ఆ పతివ్రత పంచాక్షరీమంత్రమును పఠించి భర్తను ధ్యానించి వారిపై ఉదకసేచన మొనర్చెను. ఇంకేమున్నది; వారు చంటిబిడ్డలైరి. బ్రహ్మాండ భాండోదరు లనసూయ యింట పారాడుచుండిరి. భర్తకీ వృత్తాంతము చెప్పి యామె వారిని పెంచుచుండెను. త్రిమూర్తుల భార్యల కిది తెలిసి వారు వచ్చి అనసూయను పతిభిక్ష వేడిరి. అప్పుడామె,

స్త్రీల నవమానింప ఉయ్యాలో చిత్తమున దలపోసి ఉయ్యాలో
కపట స్వభావాన ,, కాంతలను చెరపగా ,,
పలచగా తగునమ్మ ,, దండివారైనాను ,,

అని మందలించెను. ఈ కథకీ చరణము లాయువుపట్టులు, ఉపదేశకములు. వారి ప్రార్థనపై బాలుర త్రిమూర్తుల జేసెను. త్రిమూర్తులు వరము గోరుమన మీరు మాయింట పసిపాపలై యుండుడనెను. వారు తమ మువ్వురి యంశములను చేర్చి దత్తాత్రేయుడుగా అనసూయ గర్భమున జన్మించిరి.

ఈ కథనే వస్తువుగా గొని వెంకటనారాయణకవి. "*దత్తాత్రేయ జనన*"మను పదునేడు ఖండముల గేయమొకటి రచించెను. *ఇది యింకను ముద్రింప బడలేదు.* శ్రీ నేదునూరి గంగాధరంగారి సహాయమున దీనిని నేను సేకరించితిని. "దాసవరేణ్యులు తగుభక్తితో వినుడీ దత్తాత్రేయుల చరితము" అను పల్లవితో నారంభమైనదీ గేయము. ఇది కవి వాక్యము. పదునైదవ చరణమున దత్తాత్రేయ జనన మిట్లు చెప్పబడినది.

హరివంశమున నీ వయడు దుర్వాసు డత్రికి జన్మించెను
సరసిజభువనవంశమున సుధాకరు డిరవంది జన్మించినాడు
మేమీ చరితాము మార్గశిర శుద్ధచతుర్దశి....లగ్నము
నందు వరగ దత్తాత్రేయు లత్రికి బాగుగా జన్మించె సుతుడై

"*గోవుపాట*" నెవరు వ్రాసిరో తెలియదు. ఇది కరుణరసపూరితము. సత్యసంధత, ధర్మభీతి, పశువులనుండి మానవుడు నేర్చుకొనవలసినదిగా నుద్బోధించు గేయమిది. ఈ పాట అనంతామాత్యుని (౧౪౩౫) భోజరాజీయ మందలి గోవ్యాఘ్రసంవాదకథ కనుకృతి. భోజరాజీయమున నీకథ మిక్కిలి రసవంతముగా ననేక ఉపకథలతో పెద్దదిగా నున్నది. పదకర్త దీనినే క్లుప్తపరచినట్లున్నది. సంస్కృతమందలి భోజచరితమునకు కొమ్మలు పెరిగి

లుగులో భోజరాజీయమైనట్లున్నది. సంస్కృత మూలమున లేని విషయము లాంధ్రభోజరాజీయమందు పెక్కులున్నవి.

> క॥ సూత్రకథ భోజరాజ చ
> రిత్రమ యానడుమ ధర్మరీతుల్ నీతుల్
> చిత్రకథలై తలిర్పగ
> శ్రోత్రసుఖముగా నొనప్ప జొప్పడి యుండున్.1

అని కర్తయే స్వయముగా చెప్పియున్నాడు. కనుక నీ గోవ్యాఘ్ర సంవాదకథ కూడ మూలభిన్నమైనదై యుండును. ఈకథ (గోవినహాడు) కన్నడమునగూడ కలదు. తెలుగువారినుండి కన్నడిగలు గైకొనిరో లేదా కన్నడిగలనుండి తెలుగు వారు చేపట్టిరో తెలియదు. భోజరాజీయమున నీగోవొక విప్రునిదిగా చెప్పబడి యుండ, పాటలో శ్రీకృష్ణు గోవుగాని వర్ణింపబడినది. శ్రీకృష్ణు డొకనాడు తూరుపు గుట్టలవైపు తన యాలమందను దోలుకొనిపోయెను. అతడు "పెద్ద కాలపు యావులారా పేరుపడ్డా మందలారా, కపిలయావు దూడలార కర్రియావు దూడరావె, తెల్లయావు దూడ రావె, బొల్లి యావు దూడ రావె, కామధేనువ కల్పతరువా, శ్రీలక్ష్మి పేరందేవి అన్నపూర్ణా విశాలాక్షీ, తెల్లమచ్చ గోవు రావె, నల్ల మచ్చగోవు రావె, చిన్న యావుదూడరావె" యని పేరుపేరున పిల్చి పాలు పితికి గోపాలకుల కిచ్చి పంపెను. ఆవులు మేయుచు కొండకోనలకు పోయెను. ఇంతలో నొకపెద్దపులి గాండ్రుగాండ్రుమని పైబడ వచ్చెను. ఆవులమందనుండి యొక యెల్లావు వచ్చి పులి ముందు నిలిచెను. తక్కినవి కొన్ని వెనుక నిలిచెను. మరికొన్ని వెనుకవెనుకకు జారిపోయెను. ఎల్లావునకును వ్యాఘ్రమునకును సంవాదము జరిగినది. తనను దినుటకు సిద్ధపడిన పులితో నా గోవు, "మూడు దినముల క్రింద నేను, కవల దూడల కన్నదానను, నన్ను పెంచిన దాతలెల్లా, పాలు పితికి యుండగాను, రెండు దూడల బెంచుచుంటిని, నాదు రాకకు దూడలెల్లా, యెదురుచూచు బెంగతోను, శలవు యిచ్చిన పాలు యిచ్చి, మళ్లి వచ్చి నీదు యాకలి" తీర్తునని పలికెను. గోవు మాటలు పులి నమ్మదయ్యెను. ఎట్లు నమ్మగలదు? ఎవరైన తన చావు గోరి మృత్యుముఖమున ప్రవేశింతురా? కాని సత్యము, ధర్మము మూర్తీభవించిన గోవట్టిదికాదు. గోవు సకలదేవతలపై పుట్టినింటిపై, మెట్టినింటిపై ఆనలుంచి

తప్పక తిరిగి వత్తునని బాసలు చేసెను. అది యేమి మహిమయో కాని వ్యాఘ్రరాజు మనసు కరగిపోయెను. పాలిచ్చి తిరిగి రమ్మని విడిచిపెట్టెను. సంతోషముతో పొంగులువారుచు పుత్రవాత్సల్యము పాలచేపులై ధారలు గురియ ఆవు ఇంటికి వచ్చి బిడ్డలకు కడుపార పాలు గుడిపి వానికి బుద్ధులు గరపెను. "బుద్ధి కలిగి మసలుచుండుడి, పచ్చిచేనులో మేయబోక, పొదలచాటున మేయబోక, పులులనోటి కందబోక, ఇండ్లలోన తిరుగబోక, కఱ్ఱదెబ్బలు తినక మీరు, కాపువాడు మేపబోవు, బీళ్ల యందు నిలిచి కసవు, కడుపునిండ దినుచు మీరు, దొడ్డికొచ్చి నిద్రజెందుడి". బిడ్డలకీ విధముగా జెప్పి యా గోవు తన తోడి యావుల పేరు పేరున బిలిచి, "నాదుకొడుకుల చూచి మీరు, ముందుకొచ్చిన పొడువబోక, వెనుకకొచ్చిన తన్నబోక, మందచేర్చుక బుద్ధిగరపుడి, నాదు కొడుకుల దయను చూడుడి''యని ప్రార్థించినది. ఈఘట్టమత్యంతకరుణా పూరితము. ఆవు తనతోటి వారి సెలవంది పెద్దపులి చెంతకు తిరిగిపోయెను. అచ్చట పులి కనపడలేదు. గోవు బిగ్గరగా పులిని పిలిచినది. పులి గోడు గోడున ఏడ్చుచు వచ్చి గోవు కాళ్లపై బడి దాని సత్యసంధతను కొనియాడి ప్రాణములు విడిచినది. హింసపై అహింస గెలిచినది. క్రూరమైన వ్యాఘ్రము శాంతస్వరూపిణి యగుట ఈ కథయందలి పాఠము. త్రిమూర్తులు ప్రత్యక్షమై గోవును దీవించి "నీవు యున్నా గ్రామమందు, పంటలెల్ల పూర్తిగాను, నెలకు మూడు వర్షమూలు, సకలజనులు సుఖమునొందే"రని దీవించి పోయిరి. గోవు తన బిడ్డలకడకు తిరిగిపోయెను. ఎంత యద్భుతమైనదీ కథ. ఇది 'తకిటకిటతక' యని యేడుమాత్రల యావృత్తములతో సాగిన గేయము.

ఇంకొక్క మధురగేయమునుగూర్చి ముచ్చటించి ఈ ప్రకరణము నింతటితో ముగింతును. నారదుని కలహప్రియత్వము దేవతలకుగూడ సమస్యయే. అతని మూలమున శ్రీకృష్ణునింట జగడములు పుట్టి చివరకు స్వర్గమునుండి పారిజాతవృక్షమే భూలోకమునకు దిగిరావలసివచ్చెను. ఈ కథ హరివంశమందున్నది. దీని నాధారముగా గొని ముక్కు తిమ్మయ్యగారు ముద్దు పలుకులతో పారిజాతాపహరణకావ్యమును సంతరించిరి. కొలదిమార్పులతో నీకథ నెవరో 'పారిజాతపల్లవి'గా స్త్రీలు పాడుటకనువుగా వ్రాసిరి. రచయిత అటు హరివంశమును ఇటు పారిజాతాపహరణమును చదువుకొని సొంతకల్పనలతో చక్కని కథాగేయముగా మలచినాడు. స్త్రీల సహజమనో

భావము లిందు మృదువుగా పొదుగబడినవి. "శ్రీకృష్ణుం డొకనాడూ శృంగారా హాసుండై • శ్రీకాంతామణి నగరుకు వచ్చెను చెలువముతోడుతనూ" రుక్మిణీకృష్ణు లేకాంతమున నుండ నటట నారదుడు వచ్చి సత్కారములు బడసెను. తరువాత "కుచ్చితుడై నారదుడూ, కృష్ణునికొక కానుకగానూ" పారిజాతము నొక చిగురాకున పొదివి యిచ్చెను. కృష్ణుడది చేసవమున్న రుక్మిణి కిచ్చెను. ఆమె దానిని తల ధరించెను. వెంటనే "తలకురులూ వకవింకా మేలుగ నిలువులు యెక్కె, అరుదుగ కోమలి వడలికి వక వన్నధికమయ్యె తోచె"ను. "మగమీల నగజాలు తెగ గీలుకొను వాలుకనుగవ కొకవింత కాంతి యొదవె"నన్న ముక్కుతిమ్మన పద్యభావమున కిది దగ్గరగా నున్నది. నారదుడా పారిజాతప్రసూనమహాత్మ్య మిట్లు చెప్పెను. "శుకవాణీ ఈ పుష్పో ద్యం అకలంకముగా వినుమీ, వికసించుండును వాడదు యెన్నడు విరి వాసన చెడదూ". ఈ చరణములు,

క॥ పరిమళము చెడదు వాడదు, పటువము దప్పదు పరాగభరభరితంబై
నిరతము జగదేకమనో,హరమగు ఏ కుసుమరాజ మంబుజవదనా.

అను పద్యభావమును వెల్లడించును. ఇచ్చట జరిగెడి వృత్తాంతమంతయు సత్యభామ చెలులు చూచిపోయి యామెతో చెప్పిరి. ఇంకేమున్నది; సత్య తోక త్రొక్కిన త్రాచయ్యెను. "పూరింటిలోనొక్క కీలడుగు మంచముపై చీరొక్కటి పరచుక పవళించెను శ్రీహరులను దలచీ". జానపదులు తమ చిత్తవృత్తికి దగినట్లు మలచినదీ ఘట్టము. పూరింట మంచముపై చీరపరచుకొని నిద్రించుట జానపదులకు సహజము. రాజాంతఃపురముల పరిచయముగల తిమ్మన సత్య భామను కోపగృహమున చీకటింటి కడకంకటిపై మాసినచీరతో వాసెనకట్టుతో నిడువాలిక కస్తురి పట్టుతో జలదాంతచంద్రరేఖాసదృశాంగిగా చిత్రించినాడు. ఇది ఆయనగారి జీవితమునకు సహజమే. శ్రీకృష్ణుడు సత్యభామమందిరమునకు వచ్చెను. అతనికీ విషయము లేవియును తెలియవు. ఎప్పటియట్లు సత్యభామ ఎదురు రాదయ్యెను. కృష్ణుడు సత్యభామకై "మెత్తని పానుపు వెదకే మేడా మడుగుల్లు వెదకే చిత్తరు చవికెలు వీక్షింపుచు తన చిత్తము కిట్లనెనూ". అతని కేదో మారుపు దోచెను. "కలహంసలు నడవవుగా కలియరు యింతులు రారూ, అమర మృదంగము తంతులు బట్టరు హరి బాడగ రారూ, ఇన్నాళ్లావలె లేదూ సుదతీమందిరమేమో, చిలుకకు పద్యం చెప్పదు కోవెల కెలమియ్యదు ఫలమూ"

ఈ చరణములు "కనకపంజరశారికలకు జక్కెరవెట్టి చదివింపరేలకో సఖియ లిపుడు" అను తిమ్మనగారి పద్యమునకు మారు రూపములవలె నున్నవి. కృష్ణునకు నిజము తెలిసినది. "పన్నుగ ముని దెచ్చిన యా పారిజాతపు మాట, విన్నపములు చేసికాటోలు మావెన్నెలమొలకకును" అని తలంచెను. సత్యభామను సమీపించి వీవనలు వీచి బతిమాలి చివరకు కాళ్ళ మ్రొక్కెను. ఇందులో సత్యభామ శ్రీకృష్ణుని శిరమును వామపాదమున దొలగంద్రోయదు. మ్రొక్కినంత నామె యలుక దీరెను. తరువాత శ్రీకృష్ణు డమరావతినుండి పారిజాతము దెచ్చి సత్యభామ పెరటిచెట్టుగా నాటెను. సత్యభామ తనకు చెట్టే లభించినదని తన మంచము నాచెట్టుక్రింద వేయించుకొని పవ్వళించెడిది. కాని ఏమిలాభము! "పూచిన పువ్వులన్నీ రుక్మిణీకడ కపుడూ వెళ్లే, తుమ్మెదలై పూలన్నీ రుక్మిణిపై వ్రాలె". ఇంతకన్న సత్యభామ కేమి గర్వభంగము కావలెను! జానపదు లెంత కల్పనము చేసినారిచ్చట! ఇది మూలమున లేని కల్పనము; హాస్యరసపూరితము. అగ్నికాజ్యము తోడైనట్లు నారదుడు వచ్చి రుక్మిణితో "పారుజాతపుచెట్టు సత్యభామ పెరటా, వేయుట గాని పూచిన పూవులు అన్నీ నీపైనే" యనెను. ఇందు సత్యభామను దెప్పిపొడుచుటయు కలదు. రుక్మిణి నారదునికి మ్రొక్కి శ్రీకృష్ణ స్తోత్రము చేసెను. మిక్కిలి మనోహరమగు పాట యిది. ఇది 'కిటతక కిటతక'యని ఎనిమిది మాత్రల యావృత్తములతో నడచుచున్నది. తొలిభాగములో సాహిత్యాక్షరములు తక్కువగా నున్నవి. మలిభాగములో ఎక్కువగా నున్నవి. 'సీతముద్రిక'లను పాటలోగూడ నిట్టి వరుసయే కలదు. ఇటులే రామదాసుగారి 'గరుడగమన రారా' 'అదుగో భద్రాద్రి' యను పాటలును నడచినవి.

ఈ పౌరాణికగేయములందు కొన్ని పురాతనములు మరికొన్ని యాధునికములు. పారుజాతపల్లవి వంటి పాటలు కొంత ప్రాచీనగేయములే. హరివంశము పారిజాతాపహరణము మున్నగు కావ్యములు వెడలిన తరువాత బయలుదేరిన దీపాట. శైలియందును పదప్రయోగమందును కొంత ప్రాచీనతా సౌరభము వాసించుటయే దీనికి కారణము. రామాయణకథాగేయములందు పేర్కొన్న గేయములు కొన్ని అత్యంతప్రాచీనములు. ఆంధ్రదేశమున జైన బౌద్ధమతముల ప్రభావముల స్పష్టాస్పష్ట చిహ్నముల కివి యుదాహరణములు. సంస్కృతమూలగ్రంథములందు లేని విషయముల నీగేయములు శిష్టకవుల కందించినవి. సార్వజనీనత, బహుళప్రచారము మున్నగునవి వాని

పౌరాతన్యమును బలపరచును. చెర్విరాల భాగయ్యవంటి ఆధునికులు రచించిన గేయములు నవీనములు. ఈతడు రచించిన కొమిరెల్లి మల్లన్నకథ, హరిశ్చంద్ర పాట మున్నగునవి ఆధునికములు. కవి సజీవుడుగనుక ఆధునికములని తెలిసినది గాని లేనిచో ఎట్లుతెలియునను శంక జనించును. అది వాస్తవమైన శంకయైనను ఆ యా పాటలకున్న ప్రచారము దానికి సాక్ష్యముగా నుండును. జానపద గేయములు సాధారణముగా ప్రాచీనములయ్యు యుగయుగమున భావశరీరము నట్లే నిలుపుకొనుచు భాషావస్త్రములను మాత్రము మార్చుకొనుచుండును. పూర్వగాథలు గేయములు పీఠముగాగొని ఆధునికులైన భాగయ్యవంటివారు వ్రాసిన గేయములు కేవలపాక్షిక ప్రచారము గాంచినవి. కొమిరెల్లి మల్లన్నకథ బీరన్నలవారు చెప్పునది ప్రాచీనగేయము. తెలంగాణ మంతటను ప్రచారమందున్నది. ఆ భావశరీరమునకు భాగయ్య తన భాషావసనములు దొడిగించి ప్రచురించిన గేయమంత ప్రచారము గాంచలేదు. కనుక నిట్టిగేయముల పౌరాతన్యము గాని నవీనతగాని వాని ప్రచారము, శైలి, భాష మున్నగువాని సహాయమున కొంతవరకు తెలిసికొననగును.

ఈ ప్రకరణమందలి గేయములను నిశితముగా పరిశీలించినచో శిష్ట సాహిత్యమునకును, జానపదసాహిత్యమునకును గల పరస్పరసంబంధము గోచరమగును. కేవలము తెలుగు గ్రంథములనుండియేకాక సంస్కృత గ్రంథములనుండి కూడ, భావములు ఉపమానములు కొన్నిచోట్ల భాషకూడ జానపదగేయములకు దిగుమతి యైనది. 'సీత ఆనవాలు' పాటలోని "పాద్యమి జదివిన వేదమ్మువలె" ననెడు పంక్తిని "ప్రతిపత్పాఠశీలస్య విద్యేవ తనుతాం గతా" యనెడు ఆదికవివాల్మీకి మాటలకును గల పోలికలను చూచినప్పుడు జానపదులపై శిష్టుల ప్రభావము సుస్పష్టముగా గోచరించును. ఇటులే తెలుగు రామాయణము, భారతము, భాగవతము మున్నగు గ్రంథముల ప్రభావ మనంతముగా మనకీ గేయములందు కాననగును. పోలికలున్న ఆయా భాగములను సందర్భానుసారముగ సూచించితిని. ప్రత్యేకముగా పోతన్నగారి ప్రభావము జానపదులపై నధికముగా పడుట ఆంధ్రదేశమున పోతన భాగవతమునకున్న ప్రచారము సూచించెడిని. ఇక రంగనాథభాస్కరరామాయణము లందున్న మూలభిన్నవిషయములకు, జానపదులు తమతమ చిత్తవృత్తుల కనుకూలముగా మలచుకొన్న కథల నందించియుందురని నా భావము.

ఇంతకు గ్రహించవలసిన దేమన జానపదసాహిత్యము శిష్టసాహిత్యమునకును శిష్టసాహిత్యము జానపదసాహిత్యమునకును, ఒకచో కాకున్న మరియొకచో ఆలంబనములుగా నిలిచినవి. లేదా మహాకవి భవభూతి యన్నటుల "సలిల మొక్కటె బిందు తుషారభంగ, బుద్బుదావర్త రూపముల్ పొందునట్లు"[1] విశ్వజనీనమైన భావములు, లోకసామాన్యమైన యుపమానములు, కల్పనలు మున్నగునవి, వేరువేరు సాహిత్యప్రక్రియలందు, భిన్నజనములందు, భిన్న భాషలందు, భిన్నదేశములందు, మానవాత్మను ప్రతిబింబించుచుండునని భావింపవలెను.



1. శ్రీ మల్లాదివారి యనువాదము, ఉత్తరరామచరిత్ర నాటకము 3-47.

# చారిత్రక గేయములు

జానపదగేయవాఙ్మయమున చరిత్రకు సంబంధించిన గేయముల కొక విశిష్టస్థానము గలదు. వస్తువునందును, శైలియందును, కథాకథనపద్ధతి యందును తక్కిన జానపదగేయములకన్న నివి భిన్నముగా నుండును. చారిత్రక గేయములను పాశ్చాత్యులు Historical Ballads అందురు. ఈవాఙ్మయ విమర్శకులు కొందరు వీనినే వీరగీతములనిరి. ఇట్లనుటకు కారణమీ గీతములందు వీరరసము ప్రధానముగా నుండుటయే. వీరుల పోరాట మాధారముగాగొని పాడుకొనునవి గనుక నివి వీరరసగుంభితముగ నుండి వీరగీతము లనబడుచున్నవి. పాశ్చాత్యులు కూడ వీనిని Heroic Ballads అనిరి. చారిత్రక– వీరగీతములు తత్తదుచితవీరసంఘటన మేదియో జరిగిన వెంటనే యుద్భవించును. ఆసన్నివేశమును కన్నులార గాంచియో లేక చెవులార వినియో జానపదు డొకడుద్వేగముతో గానమొనర్చును. ఆపాట యంతట ప్రాకి పోవును. ఇట్లు విస్తరించుటలో పాటయొక్క వస్తువు కాలక్రమమున మార్పులు పొందును. ఒక క్రొత్తపాటయం దభివర్ణింపబడిన సంఘటనములకు ప్రాత కాలపు గేయప్రవాహమందలి సంఘటనము తోడై ఊహింపరాని మార్పులు కలుగును. క్రొత్తనీరు వచ్చి ప్రాతనీరు కొట్టుకొనిపోయినట్లును, క్రొత్త ప్రాత రెండు నీరములు వేరువేరు రంగులతో నేకధారగా ప్రవహించినటులును ఈవీరగీతములలో కూడ "క్రొత్త పాతల మేలుకలయిక క్రొమ్మెరుంగులు" జిమ్మును. ప్రాతపాటలందలి పేరులు క్రొత్తపాటలందో లేదా క్రొత్తపాటలందలి పేరులు ప్రాతపాటలందో దూరును. ఇటులే గ్రామనామములు, వ్యక్తులపేరులు, సన్నివేశములు, యుద్ధతంత్రములు, ఉపకరణములు, కాలబద్ధము కాని విషయము లొకదానిలో నొకటి కలిసిపోవును. ఎప్పుడో లిఖితమైపోయిన నిట్టి చారిత్రకగీతములందు సిసలైన చరిత్రము లభించును. కేవలమౌఖికప్రవాహ మందున్న గీతములందు కొంత మార్పు కలిగినను వానికి నాధారమైన చారిత్రక గాథలను ఒకొక్కప్పుడు గుర్తించుటకు వీలగును. ఇట్టి గీతముల

రానురాను పూర్తిగా మారిపోయి గుర్తించుటకు వీలుకాక అస్పష్టచారిత్రకములు (Quasi-historical)గా పరిణమించి మరికొన్ని దినములకు పుక్కిటి పురాణములుగా కల్పితకథలుగా మారిపోవును. మన ముసలవ్వలు చెప్పుకొనెడు కాళ్లు లేని కథలందెట్టి వెన్ని సత్యమైన చారిత్రకేతివృత్తములుగల కథలు మరుగుపడి పోయినవో తెలియదు. పుక్కిటిపురాణములై పోయినవానినుండియు అస్పష్టచారిత్రకములనుండియు నిజమైన చరిత్ర త్రవ్వివోయుట కష్టసాధ్యము; కొన్ని సమయముల పూర్తిగా నసాధ్యము. ఇట్టి పరిస్థితి ప్రతిదేశమునకు ప్రతిభాషకును కలదు.

వీరగీతము లాయాసంఘటనము లాధారముగా గొని "సీతారామరాజు కథ" "ఉప్పుపాట"లవలె వెనువెంటనే బయలుదేరి యుండవచ్చును. లేదా "బొబ్బిలికథ", "దేసింగురాజు కథ"లవలె కొంతకాలము గడచిన పిమ్మట నైన పుట్టియుండవచ్చును. ఇంకను వీరావేశముతో జైత్రయాత్రకు వెడలు వీరుల సుత్తేజపరచుటకు గాని లేదా రణరంగమున వెన్ను జూపనున్నవారికి కర్తవ్యబోధనము సేయుటకై గాని యేనాయకుడో లేదా తదాశ్రితుడైన యేవీర(చారణ) గాయకుడో కాని గొంతెత్తి యిట్టి వీరగీతములను వెలార్చవచ్చును. పృథ్వీరాజ వీరవిహారయశమును (పృథ్వీరాజ రాసో) దిగంతవిశ్రాంత మొనర్చినదా కీర్తికాయుని యాస్థానకవియగు చంద్రభట్టని మన మెరిగిన విషయమే. మన కాలములోనే తెలంగాణా వీరులు నైజాం నిరంకుశప్రభుత్వము నెదిర్చి పోరాటము సాగించినప్పుడు — ఆయావీరులు వీరస్వర్గ మలంకరించినప్పుడు— తత్క్షణముననే వారి పేరులతో వీరగీతములు బయలుదేరుట కాంచనగును. సైనికుల నుత్సాహపరచుటకు, పూర్వము మన సైనికవ్యవస్థయందు వీరపాణముండినటులే వీరగానములుకూడ నుండియుండును. ఆయా రాజుల యొక్కయు, దండనాథుల, పాలెగార్ల, వీరుల యశోగాన మొనర్చుటకు వారి ఆస్థానములందు వారి పరిపోషణమున వంధిమాగధులో, భట్లో, పిచ్చుకుంటువారో శారదకాండ్రో, గొల్లసుద్దులవారో యుండెడువారు. అట్టివారే తమ వంశము వారికిని తదితరులకును ఈ వీరగీతములను నేర్పుచుండెడువారు. కాలక్రమమున వీరయశోగానమే వారికి వృత్తిగా పరిణమించెను. ఇప్పటికిని ఆయారాజులు, పాళెగార్లు, ఆ వీరులు అంతరించినను, వారి వంశములు కూడ నిశ్శేషమై పోయినను, వారు కట్టించిన కోటగోడలు దిబ్బలై పోయినను, వారి సంతతివారు

కొందరు దక్కి. కత్తి విడిచి కలమో, హలమో, పట్టుకొని బ్రాకులాడు చున్నను, వారి యశస్సునుమాత్ర మీజాతులవారు పాడుకొనుచునే యున్నారు. వీరగేయములకును తదితరజానపదగేయములకును ధ్యేయము వేరువేరు. ఉత్సాహోల్లాసములకు గాక ఈ వీరగీతములు ప్రబోధమును కలిగించుటకై పాడబడును. చారిత్రకగీతములందు తక్కిన జానపదగేయములం దున్నంత ప్రకృతిపరిశీలనమో, వర్ణనమో, అలంకారప్రాబల్యమో యుండదు. కొన్ని కొన్ని చరణములు మాత్రమే పదేపదే పునరావృత్తినొందుచు శ్రోతల నాకర్షించుచుండును. ఈ లక్షణమును వారానువర్తనము (Ballad Common Places) అందురు. వీరగాథలు పరాశ్రయకవిత్వమునకు (Objective Poetry) ఆకరములు. వీరగాథాగేయము లెక్కువగా చారణవృత్తులవారి అళు కవనములు. కథాగమనమున ఏకసూత్రత పాటింపబడును. ప్రతి వీరగాథ ఏదేనొక నీతిని ధ్వనించుచునేయుండును. ఉత్తరదేశమున పంజాబు రాజపుత్ర స్థానములు వీరగాథల పుట్టిలు. వీరగాథలను హిందీలో 'రాసో' అందురు. పంజాబీలో 'వార్' అందురు. మరాఠీభాషలో 'పొవాడా' యనెదరు.

ఆంధ్రదేశము తొలినుండి వీరప్రసువు. తెలుగుతల్లి తన చలువ దోసిళ్ళతో నెందరెందరో వీరాధివీరులకు పుటముపోసినది. ఇచట బుట్టిన చిగురుకొమ్మైన చేవ. ఈ పోతుగడ్డపై బ్రహ్మనాయనివంటి బాహుబలప్రౌఢులే కాదు, బాలచంద్రునివంటి కుమారులే కాదు, మాంచాల, రుద్రమదేవి, పార్వతీదేవి వంటి వీరనారీమణులు నుద్భవించిరి. వారొలుకవోసిన మగసిరి ఇంతంతకాదు. కదనరంగమున విశృంఖలవిహారమొనర్చిన వారి కత్తులమెరుపులు, శత్రువక్షముల గాడిపారిన వారి యుక్కు బల్లెముల ఖసిక్కుమను చప్పుడులు, శరీరములతో కలసిపోయిన వారి కాసెబిగింపు లీనాడు వినబడకున్నను కనబడకున్నను ప్రజలనోళ్ళ నిల్లు గట్టుకొన్నవి. తెలుగువారికి వీరాభినివేశము మెండు. కనుకనే వీరోత్సవములు వీరపూజలు తెలుగునాట పాదుకొన్నవి. కారెంపూడి తిరునాళ్ళలో పల్నాటివీరారాధనము, నెల్లూరు గంగజాతరలు, మన మతప్రస్థానములు. వీరగీతప్రాశస్త్యమును కీ.శే. ఉమాకాంత పండితులు ఇట్లు చెప్పియున్నారు. "....తెలుక్కు మతభాషాగౌరవ మేర్పడ్డదీ వీరచరిత్రయందేనని, ఇప్పటికీ ఔర్ధ్వదైహికక్రియల్లో బ్రాహ్మణేతరు లనేకులు, వైష్ణవులు నాలాయిరాన్నివలె పితృప్రీతి నుద్దేశించి వీరచరిత్ర గానం చేయిస్తారు." వీరగీతము లన్నిభాషల

యందుండియున్నను, వీరపూజ, —వీరగీతమునకు మతప్రశస్తి మాత్రము మన దేశముననే కలిగినది. వీరగీతము దేశభాషలందే కాదు; సంస్కృతముననూ కాననగును. అత్యంతప్రాచీనమైనదనబడు ఋగ్వేదమున గూడ వీరగీత బీజము లున్నవి. గాధా, గాధానారాశంసీ అను మాటలు వైదికవాఙ్మయమున వీరగాధలను తెలుపును. ఆనాటి వీరుల మగటిమి ఈనాడాంధ్రజాతిలో లేకున్నను ఆయుద్రేకసాతత్య మింకను నశించలేదు. ఆంధ్రుల యుద్రేకమనునది ఈనాటి రాజకీయములలో తప్పుదర్శ మిచ్చుచున్నను తెలుగుజాతి ప్రత్యేకత మరియు వెన్నెముక బలమని గౌరవింపవలసినదే యనుకొందును.

ఇకనిట్టి వీరగీతముల చరిత్రమును విచారింతము. మొదట చారిత్రక గీతముల నటుతరువాత అస్పష్టచారిత్రకముల పరిశీలింతము. వాని వెంబడి నేను సేకరించినట్టి యముద్రితగేయములుకూడ విమర్శింపనగును. చారిత్రక గీతములుకూడ పెక్కులున్నవి. "తెలంగాణమందే మియాసాబ్, సోమనాద్రి, రామేశ్వరరావు, రాణీ శంకరమ్మ (మెదకు), సవై వెంకటరెడ్డి (వనపర్తి), కుమారరాముడు (కంపిలి యువరాజు — సవతితల్లి మోహము నిరాకరించి కాలుసేతులు కోలుపోయిన సారంగధరు డితడే), కర్నూలు నవాబు తుదివాడు క్రీ.శ. ౧౮౩౪ మున్నగు వారి కథలున్న"వని కీ.శే. సురవరం ప్రతాపరెడ్డిగారు సెలవిచ్చియున్నారు1. ఇవి కాకను సదాశివరెడ్డి, పర్వాతాల మల్లారెడ్డి సర్వాయిపాపడు, బల్గూరి కొండ్రాయుడు వంటి తెలంగాణమునకు సంబంధించిన గేయములను నేను సేకరింపగలిగితిని. కాని వీనినన్నింటిని విమర్శించుట కిట తావులేదు. ముద్రితములై ప్రసిద్ధములైన వానిని, బహుళవ్యాప్తి గాంచినవానిని, అముద్రితములైనను నేను సేకరించి చరిత్ర తర్వ్వినవానిలో కొన్నింటినే విమర్శింతును.

## పలనాటి వీరుల చరిత్రలు

"వడతి పల్నాటి వీరుల బాడునపు"డని క్రీడాభిరామమున (౧౪౩౦) వర్ణింపబడియుండుటచే పలనాటివీరచరిత్రము శ్రీనాథుడు ప్రజాముఖమున విని యుండి తన చరమదశయందీ వీరుల చరిత్రమును గేయకావ్యముగా వ్రాసి

1. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారి ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహమునకు పీఠిక

యుండెనని భావింపవచ్చును. క్రీడాభిరామమునకు మూలమైన సంస్కృత ప్రేమాభిరామమున గూడ పలనాటివీరుల ప్రసక్తి యుండవలెను గదా! తత్కర్తయైన రావిపాటి త్రిపురాంతకుడు (1295-1326) పేర్కొన్న వీరుల చరిత్రకు సంబంధించిన ద్విపదప్రబంధములు త్రిపురాంతకునికి పూర్వుడైన మఱియొక శ్రీనాథుడెవరో చెన్నకేశవస్వామి భక్తుడు వ్రాసినదైనను కావచ్చును. ఆశ్రీనాథుడు పలనాటి వీరుల చరిత్రమును సమగ్రముగా ద్విపదలలో కూర్చి యుండును. ఆ గ్రంథమంతయు ఏమైనదో కాని యమూల్యమగు పీఠికతో ఇప్పటికి ప్రకటింపబడినది ఒక్క బాలచంద్ర యుద్ధఘట్టము మాత్రమే. ఈ గ్రంథమునకు సంబంధించిన సమస్తవిషయములు శ్రీ ఉమాకాన్త విద్యాశేఖరులు సమగ్రముగా చర్చించియున్నారు. బాలచంద్రయుద్ధ మొక్కటియే కాక ఇంకను ముఖ్యములగు గ్రంథము లనేకములు పలనాటివీరుల చరిత్రమునకు సంబంధించినవి యముద్రితములుగా ప్రా. పు. భాండాగారమున మూలుగు చున్నవి. వాని వెలికిదీసి ముద్రించుట ఆంధ్రులకర్తవ్యము[1]. ప్రకటింపబడని కథాభాగములను కొన్నింటిని విద్యాశేఖరులవారు "పల్నాటి వీరుల కథ"లను పేరుతో వచనరూపమున ప్రకటించియున్నారు. దీనిలో మందాదివలస, మంద పోటు, అలరాజు రాయబారము, బాలచంద్రుడు, కొమ్మరాజు యుద్ధమను కథలున్నవి. గేయరూపమున నింకను పెక్కుగాథలు ప్రా. పు. భాండాగారమున గలవు. నేను చూచినంతవరకే తొమ్మిది కథలున్నవి. అవి యివి.

1. డి. నెం. 1112. కోళ్ళపోట్లాట — గోపు యుద్ధము.
2. డి. నెం. 1113. రాయబారము — యుద్ధసన్నాహము.
3. డి. నెం. 1114. గురజాల యుద్ధము -- పూర్వభాగము.
4. డి. నెం. 1115. కల్లు ప్రతిష్ఠ
5. డి. నెం. 1116. బాలుని కథ.

---

1. విశాలాంధ్ర ప్రచురణాలయంవారు కీ॥శే॥ పింగళి లక్ష్మీకాంతం, అవసరాల సూర్యారావుగారలు పరిష్కరించిన పలనాటి వీరచరిత్రమును 1961 లో ప్రకటించినారు. ఇందులో 1. అనుగురాజు పలనాటి సంపాదనము 2. పలనాటి రాజ్యవిభాగము 3. కోళ్ళ పోరు; గోపన్న విరుగు 4. అరణ్యవాసము (అనగా మందాది వలస) 5. మందపోటు లంకన్నవిరుగు 6. గురజాలయుద్ధము 7. అలరాజు రాయబారము 8. కల్లుప్రతిష్ఠ 9. బాలచంద్రుని యుద్ధము 10. కొమ్మరాజు యుద్ధము 11. బ్రహ్మన్నవిరుగు అను పదునొకండు ప్రకరణములున్నవి.

6. డి. నెం. 1117 బాలుని యుద్ధము—మరణము
7. డి. నెం. 1118 చిన్నమనేని యుద్ధము - గోవు సంస్కారము
8. డి. నెం. 1119 కొమ్మరాజు యుద్ధము
9. డి. నెం. 1120 బ్రహ్మనాయుని విరుగు

పై కథలకు పాఠభేదములు వేరే కలవు. ఇవి కాకను మరికొన్ని ఘట్టముల కథలు శిథిలావస్థలో కలవు. ఈ పాటలను సేకరించిన భాండాగారాధికారు లాయా పాటలు సేకరించిన ప్రదేశములు మున్నగు వివరములగూడ నిచ్చియున్నారు. కనుక నివి యింకను ప్రజాముఖమున బ్రతికియున్న గేయములుగా భావింపవలెను. గుంటూరు మండలమున నీపాటలు పాడెడువారింకను కలరు. వీరవిద్యావంతులు కారెంపూడి తిరునాళ్ళసమయమున వీనిబాడెదరు. పూర్వము వీని ప్రశస్తి ఓరుగల్లు పట్టణమున గూడ కలదని క్రీడాభిరామము చాటుచున్నది. "గచ్చుచేసిన చిత్రంపు గద్దెపలక"పై "శీల బ్రహ్మాదివీరనాసీర చరిత" వ్రాయబడి యుండినట్లు వర్ణింపబడి యున్నది. ఈ వీరానీకము కథల నొక్కతె "ద్రుతతాళంబున వీరగుంభితక ధుంధుంధుంకిటాత్కారసంగతి వాయింపుచు నాంతరాళిక యతిగ్రామాభి రామంబుగా యతిగూడం ద్విపదప్రబంధమున" బాడినట్లున్నది. ఆనాడు వ్యాప్తిలోనున్న ద్విపదప్రబంధము లెట్టివో తెలియదు. ఆనాటి ద్విపద ప్రబంధములే ప్రజాముఖముల నలిగిపోయి నేటి రూపములు ధరించియుండును. జానపదగేయములు కాలము గడచినకొలది స్వరూపము మార్చుకొనుట సాధారణమే కదా. పలనాటి వీరకథాచక్రమున మొత్తము 25 గాథలున్నట్లును, వీరులసంఖ్య 66 ఉన్నట్లును, పలనాటి వీరాచారము వీరపూజలు నెరపుట అవ్యాహతముగా సాగుచున్నదనియు, కారెంపూడిలో వీని నిర్వహణమునకై యొక పీఠమున్న దనియు, తత్పీఠాధిపతులు పిడుగు వంశీయులైన ఆరువేల నియోగులనియు, పల్నాటి వీరులకథలు వీరోత్సవములందు సాధికారముగా గానము చేయువారు వీరవిద్యావంతులనబడు మాలవారనియు, డా. తంగిరాల వెంకటసుబ్బారావుగారు తెలుపుచున్నారు1.

పలనాటి వీరులకున్న ప్రచారమునుబట్టి భారతభాగవతములవలె తెలుగునాట పల్నాటి వీరచరిత్రముకూడ ప్రసిద్ధమన్న నతిశయోక్తి కానేరదు. భారత భాగవతముల పోలికలుకూడ నీవీరచరిత్రమున కాననగును. ఆర్యులకు

1. తెలుగు వీరగాథాకవిత్వము (అముద్రితము)

భారతమెట్టిదో ఆంధ్రులకు వీరచరిత్రమట్టిది. యుద్ధతంత్రముల తనివిసనక భారతవీరులే మరల పలనాట నవతరించిరనియు, భారతగాథయే తెనుగుతనములవరించుకొని ఆంధ్రావనిపై రూపాంతర మందినదనియు కొందరందురు[1]. ఈ రెంటికిని పోలికోటు సమానము. భారతమున పాచికలతో నాడిన మాయాద్యూతమున్న పలనాటిభారతమున కోళ్లపోరాటము సమాహ్వయమున్నది. భారతమున నరణ్యాజ్ఞాతవాసములున్న దీన మండాదివలస యున్నది. భారతమున గోగ్రహణము వీరచరితమున మందపోటు. రాయబారములు విఫలమగుట రెండింటను సమానము. జూదమున, యుద్ధమున, ధర్మపక్షపాతమున, భారతమున నజాతశత్రువగు ధర్మరాజునకు వీరచరిత్రమున బ్రహ్మనాయుడుద్ది. బలమున నాతడు భీష్మున కీడుజోడు. అభిమన్యుడే బాలచంద్రుడు. ఉత్తర మాంచాలయై జన్మించియుండును. భారతకాలమున పురుషజన్మమైనను తన దుశ్చేష్టల ఫలితముగా శకుని వీరచరిత్రకాలమునాటికి స్త్రీజన్మమెత్తి నాయకురాలయ్యె కాబోలు. వీరిద్దరు కపట తంత్రములం దొకరినొకరు తలదన్నినవారు. కనుక నీ గాథను మనము పలనాటివీరభారత మనుకొనవచ్చును. మాచెర్ల చెన్నకేశవుడు స్వయముగా శ్రీనాథునకు స్వప్నసాక్షాత్కారముచేసి '*శౌర్యంబు పుణ్యంబు సమహార్చినట్టి, పలనాటి వీరుల భాగవతంబు,* ప్రకటితంబుగ నీవు రచియించి మాకు,అంకితం బొనరింప ననువొందు సూవె' యనుటచే పైన భాగవతపు పోలికలు గూడ కలిగి యున్నదంటిని. బ్రహ్మనాయనికి పల్నాటి విష్ణువు (కృష్ణుడు) అను నామమేర్పడినది. పోతరాజు అద్వైతులింట బుట్టిన విశిష్టాద్వైతివలె గన్పట్టి 'ఈశ్వరార్చనకళాశీలుండ' ననియు ''శ్రీనాథుడనువాడ శివభక్తిపరుడ'' ననియు చెప్పుకొన్నను "మాచెర్ల-చెన్నకేశవ పాదసేవారతుండ'' నని చెప్పుటయేకాక శ్రీనాథుడీ వీరచరితమును చెన్నకేశవస్వామి కంకితమొసగుటకూడ వైష్ణవ మాయవలెనే తోచును.

పల్నాటి వీరచరిత్రమునకు సమగ్రమగు పీఠికను వ్రాసిన కీ. శే. అక్కిరాజు ఉమాకాంతవిద్యాశేఖరులవారు పల్నాటియుద్ధము క్రీ. శ. 1173-1182 మధ్యన జరిగియుండునని సిద్ధాంతీకరించినారు. మాచెర్ల గురజాల రాజధానులుగా పరిపాలించిన హైహయరాజుల వంశావళి, తెలియనగునంతవరకు

1. శ్రీమ్మ కొనమంచి జోగయ్యశర్మ 'తెనుగు ఛందము - దేశిరచన' భారతి-నందన ఫాల్గునము.

వారి పూర్వచరిత్రము ప్రస్థానము, రాజ్యస్థాపనము, కలహములు, జూదములు, వేరుపాటులు, వలసలు, యుద్ధములు మున్నగు విషయములగూర్చి వారు సమగ్రముగా చర్చించియున్నారు. పెక్కురు చారిత్రకులుకూడ పల్నాటి వీరచరిత్రమునకు సంబంధించిన చారిత్రకవిశేషములను మథించియున్నారు. కీ. శే. చిలుకూరి వీరభద్రరావుగారును[1], శ్రీ భావరాజు వెంకటకృష్ణారావు గారును[2], శ్రీమతి వారణాసి యశోదాదేవిగారును[3], మెకంజీగారి సేకరణలను విమర్శించిన విల్సనుగారును[4], స్మిత్తుగారును[5], ఇంకను పలువురు చారిత్రకులీ విషయముల తరచియున్నారు. అందరేకాభిప్రాయముగలవారు కాకపోయినను మొత్తముమీద నీపల్నాటియుద్ధము మాత్రము కాకతీయప్రథమరుద్రుని కాలమున జరిగినట్లు పలువు రభిప్రాయపడుచున్నారు. శాసనాధారముననేకాక వీరచరిత్ర గేయకావ్యాధారమునను మనమీ విషయమును నిశ్చయింపవచ్చును. ఇట్లని వీరచరిత్రమున వచ్చు పేరులన్నియు చారిత్రకములని నిశ్చయింప వలనుపడదు. కేవలము ధరణికోట భీమదేవుడు, కోట కేతరాజు, కాకతి ప్రథమ ప్రతాపరుద్రుడు, వీరభల్లాణుడు, మరియు కొందరు హైహయరాజుల పేరులకు మాత్రమే చారిత్రకాధారములు గానుపించును. బాలచంద్రునివంటివారిని గూర్చిన సిసలైనచరిత్రము శాసనములందు లభించదు. ధరణికోట భీమదేవుడు మరియు కోటకేతుడు ప్రసిద్ధులగు తండ్రికొడుకులు. పల్నాటి యుద్ధకాలమున భీమదేవుడు రాజుగా నున్నను అతని కుమారుడు కోటకేతుడు కూడ రాజకార్య నియుక్తుడని తెలియుచున్నది. నలగాముని పక్షమున నాయకురా లంపిన రాయబారులందు కోటకేతు డున్నట్లు 'బాలచంద్ర యుద్ధము' వలన తెలియుచున్నది. నలగామునికి యుద్ధమున తోడ్పడుటకై వచ్చినవారిలో "ధరణికోట పురికి దక్షుడైనట్టి, భీమదేవుండను పృథ్వీశుడు"కూడ కలడు. కనుక కోటకేతుడు తండ్రి రాజ్యము చేయునప్పుడే ప్రబలుడై యుండెనని యూహింపవచ్చును. అమరావతీశాసన మొకటి కోటకేతుడు క్రీ.శ. 1182 నుండి రాజ్యము నేలుచున్నట్లు తెలుపుచున్నది. ఈ శాసనములో "స్వస్తిశ్రీ చతుస్సముద్ర

1. ఆంధ్రుల చరిత్రము 5 వ సంపుటము. 170—212
2. ఆంధ్రేతిహాస పరిశోధకమండలి సంచిక. సంపుటి 12. 1 వ భాగము
3. „ „ „ 19 „
4. ఇండియన్ ఆంటిక్వరీ సంపుటి 1. పుట 273
5. **Early History of India**

ముద్రిత నిఖిలవసుంధరాపరిపాలక శ్రీమత్త్రిణయనపల్లవ ప్రసాదాసాదిత.... శ్రీమన్మహామండలేశ్వర కోటకేత మహారాజులు శకవర్షంబులు 1104 అగు నేటి మాఘ శు. 10 గురువారంనాడు శ్రీమద్బుద్ధదేవరకు నాచంద్రతారార్కంగా" నిచ్చిన దానములు పేర్కొనబడినవి. ప్రతాపరుద్రుడు నలగామునికి సహాయ మంపినట్లు పదములో కలదు. ఇది వాస్తవమై యుండును. కాకతి రుద్రదేవుడు క్రీ.శ. 1158–1195 ప్రాంతముల నున్నట్లు చారిత్రకు లిదివరకే నిర్ణయించి యున్నారు. వీరభల్లాణుడు క్రీ. శ. 1173-1224 వరకు ద్వారసముద్రము నేలినవాడు. ఇక హైహయులగూర్చిన శాసనములుగూడ తెలుగుదేశమున పెక్కు గలవు. మాచెర్ల చెన్నకేశవస్వామి యాలయమునగల నాగస్తంభముపైనున్న శాసనము హైహయ వీరకామనృపతిని పేర్కొనుచున్నది.

1. శకాబ్దే శరవహ్నిఖేందు గణితే జేష్టాభిదే వైజయే మా
2. సే నాగదివి........సితే చ గురుయుగే మేడాంబికానంద
3. నే ప్రిధ్విం శాసతి వీరకామనృపతౌ శక్రేందుతుల్య
4. క్రమే నాగస్తంభ సమున్నతిం సదుచితా మాదిత్యనా
5. మాకరోత్॥ నావోజు బిప్పోజు సూత్రధారు(లు) 1

శాలివాహనశకము 1035 అనగా క్రీ. శ. 1035 + 78 = 1113 అగును. ఈ వీరకాముని కుమారుడే చాగిబేతరాజు. ఈతని గూర్చిన శాసనముకూడ చెన్నకేశవాలయమునందే కలదు. ఇది మొత్తము 94 పంక్తులలో నొక నాగస్తంభమునకు మూడువైపుల నున్నది2.

పంక్తి 10 ... ..శీతాంశువంశ మభివర్ధయితుం రమే
11 శస్వాశుదివ క్షితితలేజని చాగిబేతః.......
12 .........అనుంగుగా
13 మన్నృపోస్య సుతోగ్రజో బిరుదుంగామనృప స్తమనోత్తమః తమను
14 రాయపదేవ సమాహ్వయః స్తమనుచాహవమల్ల నృపో భవతి॥
17 చరితైర్వా సార్వభౌమో గణః బేతక్షోణిపతిః కలాసు చతు
18 రై ఫుతైశ్చతుర్భిబభౌ ॥ అదితిరివ రమేశం కశ్యపాద్విక్ర

1 దక్షిణ భారత శాసనములు సంపుటి 10-నెం. 72

2 ,, ,, నెం. 66

19 మోత్కం మృదుకర మనసూయాపుత్ర మత్రేరివాఢ్యం అజన
20 యదథ భేతక్ష్మాపతిం దారమార్యా నయభుజవిజితా
21 రిం వీరకామక్షితీశాత్ ॥ స బేత భూపతిః......
30 తదనుజః అనుంగుగామ
31 రాజః మాడువులాభిధా
33 నే గ్రామే ప్రాగ్భాగే పంచాశం
34 నివర్తనపరిమితాం ప్రాదాత్॥

ఇది చాగిబేతరాజు మరికొందరును ఆదిత్యేశ్వరస్వామి కిచ్చిన దానములను తెలుపు శాసనము. ఈ శాసవమువలన చాగిబేతరాజు తండ్రి వీరకాముడనియు, వీరకాముని తండ్రి మరియొక బేతరాజనియు తెలియుచున్నది. ఇది శా.శ. 1033 అనగా క్రీ. శ. 1033+78=1111 నాటిది. ఈ చాగిబేతని శాసన మింకొకటి వీరభద్రేశ్వరాలయము (గురిజాలలో) కలదు[1]. దీనిలో నీ బేతరాజుకు బిరుదాంక రుద్రుడను మారుపేరున్నట్లును ఈతడు భూలోకమల్లదేవునకు (చాళుక్య సోమేశ్వరుడుIII) సామంతుడనియు కలదు.

పంక్తి 18 స్వస్తి సమస్తభువనాశ్రయ శ్రీ పృథ్వీవల్లభ
20 సత్యాశ్రయకులతిలక చాలుక్యాభరణ
21 శ్రీమద్భూలోక మల్ల దేవర విజయరాజ్యము
22 త్తరోత్తరాభివృద్ధి......
23 ............రాజ్యంబు సేయు
24 చుండగా తత్పాదపద్మోపజీవి......
35 ......................తస్యా
36 గ్రసూను ర్బిరుదంకరుద్రః శ్రీ బేత
37 భూప క్షితిపాగ్రగణ్యః శౌర్యార్జితానే
38 క ధనప్రదాన సంతోషితార్థి ద్విజ దీనలోకః ॥

ఈ శాసనము శా.శ. 1051 అనగా క్రీ.శ. 1129 నాటిది. చాగి బేతని తరువాతి చరిత్రము . మనకు తెలియరాదు. బేతరాజు మున్నగువారలగూర్చి పదమున నేమియు లేదు. పదములో హైహయులు కార్తవీర్యుని వంశమువారనియు వారిలో నొకడగు అనుగురాజు ఉత్తరదేశమునుండి (చేదిదేశము) తన పూర్వుల పాపపరిహారార్థమై బయలుదేరి దక్షిణమునకు వచ్చెననియు కలదు. అనుగురాజు

1 దక్షిణ భారత దేశశాసనములు. సంపుటి 10 నెం 27

తండ్రి వీరకామేంద్రుడట. అనుగురాజు కృష్ణానదిలో స్నానమొనర్చి పాపముల పోగొట్టుకొని మరల నుత్తరదేశమునకు బోనొల్లక దక్షిణదేశముననే స్థిరపడి పోయెనట. చందవోలు నేలెడు రెండవ గొంకరాజు (వేంగీ చాళుక్యుల ప్రతినిధి) తన కూతురు మైలమాదేవిని అనుగురాజున కిచ్చి పల్నాడరణముగా నిచ్చెనట. ఈతనికి మంత్రి రేచర్ల జేతినాయుని కుమారుడగు దొడ్డనాయుడు. అనుగురాజునకు మైలమదేవి కాక మరి యిరువురు భార్యలుండిరి. మైలమదేవికి నలగాముడును, వీరవిద్యాదేవికి పెదమల్లదేవుడు, పినమల్లదేవుడు, బాలమల్ల దేవుడును, భూరమాదేవికి కామరాజు, నరసింగరాజు, ఝట్టిరాజు, పెరుమాళ్ళ రాజును, కుమారులు. పాలి పోరాటములో నలగాముడు మరియు భూరమాదేవి సంతాన మొకవైపును వీరవిద్యాదేవి సంతాన మొకవైపును చీలిపోయి గురిజాల, మాచర్ల రాజ్యము లేలిరి. దొడ్డనాయని కుమారుడు బ్రహ్మనాయుడు అనుగురాజు కాలమునగూడ కొన్నాళ్లు మంత్రిగా నుండెను. అనుగురాజు తన కుమారుల బ్రహ్మనాయుని చేతిలో బెట్టి మరణించెను. బ్రహ్మనాయుడు నలగాముని రాజుగా నొనర్చి తాను మంత్రిగా నుండెను. కాని నాయకురాలి కుట్రచే నలగాముడు మలిదేవరాజాదులతో వైరము పెంచుకొనెను. బ్రహ్మనాయుడు మలిదేవరాజాదుల పక్షమున నుండెను. నాయకురాలు నలగామునికి కుడిభుజమయ్యెను. ఇరువురు మంత్రుల మంత్రాంగమున పల్నాటిరాజ్యము గురిజాల మాచెర్ల రాజధానులుగా రెండుగా చీలిపోయెను. తరువాతి కథ అందరెరిగినదే. నలగామరాజు (అనుంగు కామరాజు)కు సంబంధించినవి యొండు రెండు శాసనములు లభించుచున్నవి. పిన్నలిగ్రామమున (పల్నాడు తాలూకా) సీతారామస్వామి యాలయముకడనున్న స్తంభముపైగల శాసనమొకటి[1]. ఇది శా.శ. 1069 అనగా క్రీ.శ. 1147 నాటిది.

పంక్తి 16 మహామండలేశ్వర

17 కామరాజు రాజ్యాభి

18 వృద్ధి యాచంద్రార్కతా

19 రకంబుగా రాజ్యంబు॥ చేయుచున్నట్లున్నది. పై గ్రామముననే రామలింగస్వామి యాలయమున మరియొక శాసనము కలదు[2]. ఇది క్రీ. శ. 1163 నాటిది.

---

1 దక్షిణభారత దేశ శాసనములు సంపుటి 10 నెం 120

2 ,, ,, నెం 115

పంక్తి 1 స్వస్తిశ్రీ శకవర్షములు 1085 అనేంటి శుభాను
2 సంవత్సర భాద్రపద శుద్ధ ౧౦ ఆదివారమున
3 శ్రీమన్మహామండలేశ్వర మైలమదేవి కామరా
4 జు కొడుకు సమధిగత పంచమహాశబ్ద మహా
5 మండలేశ్వర అనేకోత్తుంగ తరంగ సంఘాత
6 లవణోదధి వేలావలయ వలయిత గంగా
7 పార్యాయమధ్య దేశాధీశ్వర మాహిష్మతీ పు
8 ర వరేశ్వర హైహయ వంశోద్భవ నాత్రేయ
9 గోత్ర పవిత్ర నత్యుగ్రనరశిరోదర్పణ ధ్వజ
10 మహా (బ్బా) రఘోషణ సంపన్నులైన శ్రీమన్మహా
11 మండలేశ్వర యనుంగుం గామరాజులది
12 రాజ్యముత్తరోత్తరాభివృద్ధి ప్రవర్ధమాన
13 మాచంద్రార్క స్థాయియై యుండం...............

మొదట పేర్కొన్న బేతరాజాదులకును ఈ నలగామరాజాదులకును నెట్టి సంబంధముండెడిదో తెలుపగల శాసనాధారములు లేవు. హైహయులకు సంబంధించిన మరికొన్ని శాసనములు గలవు[1]. కాని వానివలన నీ సంబంధమును కుదిరింపజాలము. కాని వీరు తద్వంశీయులనియే భావింపవచ్చును. మధ్యన ఒకరో యిద్దరో మాయమైరి. కనుక మొదటి బేతరాజును, అతని కుమారుడు వీరకాముడును, కులోత్తుంగ చోళుని (క్రీ. శ. 1070 - 1118) సామంతులని నిర్ధరింపవచ్చును. వీరకాముని కుమారుడు చాగిబేత (బిరుదాంకరుద్రుడు) మాత్రము వేంగీ చాళుక్యులపై తిరుగుబాటొనర్చి పశ్చిమచాళుక్యులకు సామంతుడైనట్లుగను భావింపనగును. పశ్చిమచాళుక్యుడగు ఆరవ విక్రమాదిత్యుడు వేంగిపై దండెత్తివచ్చినప్పుడు (క్రీ. శ. 1118) బిరుదాంకరుద్రు డాతనికి సహాయపడినట్లు చారిత్రకు లనుచున్నారు. వేంగీచాళుక్యులు మరల బలపడిన తరువాత పలనాటి సామంతులపై పగ దీర్చుకొని సర్వనాశన మొనర్చినట్లు చరిత్రలు తెలుపుచున్నవి. ఆ యుద్ధములం దెవ్వడో చాగిబేత క్రీ. శ. 1130 ప్రాంతమున నిహతుడై యుండనోపు. చాగిబేత తరువాతి వృత్తాంతము

---

1, ఎపిగ్రాఫిక్ కలెక్షన్స్ 77 - 1929 - 30.

| | |
|---|---|
| 80 - ,, | 333 - 1931 |
| 304 - 1931 | 316 - ,, |
| 307 - ,, | 263 - 1933 |

తెలియరాదు. తద్వంశీయుడగు అనుంగురాజు తమ పూర్వుడొనర్చిన తప్పిదమునకు వేంగిచాళుక్యుల క్షమాపణము వేడికొని పూర్వముటులే మరల తూర్పు చాళుక్యులకు సామంతుడై తమరాజ్యమును పొందుటయేగాక, చాళుక్య చోళుల ప్రతినిధియై చందవోలుప్రాంతము నేలుచున్న వెలనాటి గొంకరాజుతో సంబంధ బాంధవ్యము లొనర్చినట్లు నిశ్చయింపవచ్చును. అనుగురాజు తరువాత నతని జ్యేష్ఠపుత్రుడు (కాముడు) నలగామరాజు పరిపాలన చేసెను. ఈతడే మన కథావాఙ్మయమున నొకపక్షమునకు నాయకుడు. ఈతని వియ్యంపుడు కొమ్మరాజు. కొమ్మరాజు కుమారు డలరాజు-మామ చెంతకు రాయబారమునకు బోయి నాయకురాలి దుస్తంత్రముచే మరణించెను. కొమ్మరాజు కల్యాణమండలి కలచూరి వంశమువాడనియు, అతని తండ్రి క్రీ.శ. 1165 నుండి 1176 వరకు పాలించిన కలచూరి సోమేశ్వరుడనియు, ఈతడే మల్లదేవుని మామయనియు, శ్రీ అక్కిరాజు ఉమాకాంతవిద్యాశేఖరులవారు నిర్ణయించియున్నారు. పల్నాటివీర చరిత్రమున కొమ్మరాజు పాత్రముగూడ ప్రధానమైనదే. కాని యీతనిగూర్చి మనకధికముగా చారిత్రకాంశములు లభింపకున్నవి. కలచూరివంశమువారి పాలనము క్షీణించిన తరువాత కొమ్మరాజు కల్యాణప్రాంతములు విడిచి ఆంధ్ర దేశమునకు వచ్చియుండును. నలగామరాజువలె ఈతడుగూడ వేంగిచాళుక్యులకు సామంతుడైయుండును. అమరావతి శాసనమొకటి కొమ్మనాయకుని బేర్కొనుచున్నది. ఈ కొమ్మనాయకుడు కొమ్మరాజగునో కాదో దెలియదు. దీనిలో కొమ్మనాయకుడు చతుర్థకులజుడని కలదు. ఇది క్రీ. శ. 1155 నాటిది. ఇక పలనాటి వీరచరిత్రమున ప్రముఖపాత్రము వహించిన బ్రహ్మనాయనిగూర్చి కూడ శాసనాధారములు తక్కువగనే యున్నవి. ఇట్లనుట బ్రహ్మనాయని యునికిని శంకించుట కాదు. పలనాటివిష్ణువని ప్రఖ్యాతిగన్న యీ మహానుభావుని గూర్చిన సిసలైన చారిత్రకాంశములు తక్కువగ నుండుట కొంత వింతగనే యున్నది. కారెంపూడి వీరులశాసనము శా. శ. 1367 అనగా క్రీ.శ.1445 నాటిది. జీవరక్ష తిమ్మనయనువాడు వీరస్మృతికై యొక మేడ నిలిపి వేయించిన శాసనమిది1.

పంక్తి 1 స్వస్తిశ్రీ శకవర్షంబులు 1367
2 అగు నేంటి రక్తాక్షిసంవత్సర కా

1. దక్షిణభారత శాసన సంపుటి 10. నెం 585.

3 త్రిక కు ౫ జీవరాక్ష మాచెర్ల
4 చెన్నని కొడుకు వీరుల కొమ
5 ర జీవరాక్ష తిమన చీలమ నా
6 యిని కొంతపు పురినచోట మేడ కా
7 వించినాండు .. ......... ...

ఈ శాసనములో కొందరు వీరుల విగ్రహములు చెక్కబడి వాని క్రింద నీ పేరులున్నవి.

| | | | | |
|---|---|---|---|---|
| పినమలి దేవరాజు | (తొ)మలి దేవరాజు | చీలమ నాయిండు | పెదమలి దేవరాజు | రాక్షతి |

బ్రహ్మనాయడు రేచర్లగోత్రమువాడని తెలియుచున్నది. ఇప్పటికిని గల వెంకటగిరి సంస్థానమువారు రేచర్లగోత్రమువారే. కనుక బ్రహ్మనాయనివంశ మవిచ్ఛిన్నముగా వచ్చుచున్నదనియే భావింపవలయును. చారిత్రక విషయముల నింతటితో విడిచి గేయకావ్యములందున్న విషయము నారయుదము.

పల్నాటి వీరగాథాచక్రమునగల ముద్రితాముద్రిత గేయము లన్నింటిని సమీక్షించి డా. తంగిరాల వెంకటసుబ్బారావుగారు వానికీక్రమ మేర్పరచినారు. 1. పెద్దన్న పెండ్లిరాయబారము 2. బ్రహ్మన్న పుట్టుక 3. యాత్రకథ 4. పేర్నీడు యుద్ధము 5. తెప్పలినీడు యుద్ధము 6. అరణగండ్ల యుద్ధము 7. నాయకురాలి కథ 8. అనుగురాజు మరణము 9. రాచ గావు 10. రాజుల పెండ్లి కథ 11. బాలుని పుట్టుక 12. కోడి పోరు 13. మందాది వలస 14. మంద పోటు 15. గురజాల యుద్ధము 16. అలరాచమల్లు రాయబారము 17. కల్లు ప్రతిష్ఠ 18. బాలుని కథ 19. బాలుని యుద్ధము 20. గుత్తాల చాటువ 21. అమ్మవారి పుట్టుక 22. కొమ్మరాజు యుద్ధము 23. పేర్నీడు సన్నిగండ్లయుద్ధము24. కన్నమ నీడు చింతపల్లియుద్ధము 25. బ్రహ్మన్న విరుగు1.

కాలక్రమము ననుసరించి చూచినచో ప్రా.పు. భాండాగారమందలి పల్నాటివీరచరిత్రమునకు సంబంధించిన ఇతరకథల మొదట విమర్శింప వలయును కాని వీరచరిత్ర రచనమునకు దొరకొన్న ప్రథమ కవి శ్రీనాథుని

---
జానపద సాహిత్యము వీరగాథలు 1975.

బాలచంద్ర యుద్ధఘట్టము మధ్యన వచ్చునదైనను ప్రథమమున విమర్శింపదగినది. తక్కిన కవులందరును శ్రీనాథుని రచనము జూచిన తరువాతనే తాము రచనకు గడంగినవారు. కనుక శ్రీనాథకృతియే ప్రప్రథమమున విచారింపదగును. శ్రీనాథుడిట్టి రచనమునకు గడంగెనా లేదా యను విషయములగూర్చి ప్రథమప్రకరణముననే మనవి చేసియుంటిని. దాని మరల చేయుట యున్న చర్వితచర్వణ మగును. శ్రీనాథుడు బాలచంద్రుని యుద్ధఘట్ట మొక్కటే విరచించి యుండడు. వీరభారత మంతయు నాకవి రచించియుండును. కాని మన దురదృష్టవశమున గ్రంథమంతయును లభింపదయ్యెను. శ్రీ ఉమాకాంత విద్యాశేఖరుల యపార కృషిచే వెలుతురు చూచినది బాలచంద్ర యుద్ధ మొక్కటియే.

ఈ కృతి '*శ్రీరఘునాయక చిత్తమందెంచి — శ్రీకంఠు పరమేశు శిష్యు నాత్మదలచి*' యని యారంభమైనది. అటుతరువాత సకలదేవతా ప్రార్థనంబును, శీలము బ్రహ్మనాయుని భావనమును, పూర్వకవి స్తుతియును, కృతికర్తవిషయమును, కృతిభర్త మాచెర్ల చెన్నకేశవస్వామి - విషయమును గలవు. చెన్నకేశవుడు స్వప్నమున సాక్షాత్కరించి కవితో "శౌర్యంబు పుణ్యంబు సమకూర్చినట్టి, పలనాటి వీరుల భాగవతంబు, ప్రకటితంబుగ నీవు రచియించి మాకు, అంకితం బొనరింప ననువొందు సూవె" యనెనట. శ్రీనాథుడు మహాప్రసాదమని 'ప్రచురింతు వీనుల పండువు గా'నని రచించిన బాలచంద్ర యుద్ధఘట్టమున గల కథాక్రమ మిట్లున్నది.

నాయకురాలి కుట్రచే రాయబారమునకు బోయిన అలరాజు చనిపోయిన వార్త తెలిసి బాలమల్దేవునకు పట్టము గట్టి బాలచంద్రుని "సచివకార్యంబున సమ్మతి నుంచి, అట కరణపుకార్య మనపోతు కిచ్చి" మాదచిని "రాణివాసము గావ రక్తితో నుంచి" బ్రహ్మనాయుడు మలిదేవరాజాదులతో కార్యమపూడి యుద్ధరంగమునకు ససైన్యసపరివారముగా బయలుదేరి, "త్రిపురాంతకమునకు తిన్నగా వచ్చి.... శివపురిలోనుండి చేర్చినయట్టి" భూతరాట్సంభమును బండ్ల కెత్తించెను. ఆశకటంబుల కెద్దుల బూన్చుటకై నాయకులు "అందెల బసువన్న ఆదినాథుండ, నందుల పిడిఘంట నాగవాసయ్య. గోవుల విటకాడ గోగుబయ్యన్న, వంటరి పలిజంకు వర పెరుమాళ్లు, కట్టని కలుకోల కరినంది రంకె, బిరుదు గరుత్మంత భీముని గజమ, నెలబాల చంద్రుడ నీలవర్ణుండ"

యని పేరుపేరున బిలచి "నెత్తురు కొమ్ముల నేలైనవాని, గణుపు తోకలుగల కరిబొల్లివాని, అచ్చుగా కరివన్నె లమరినవాని, తెల్లని వెన్నెల తెలివైనవాని, గ్రక్కున యెద్దుల కాండ్ల గట్టించి"రి. మర్రివేముల, గుమ్మడంపాడు, గరికెపాడు, పైడిపాడు గ్రామములు గడచి "మేళ్లవాగున నిల్చె మించిన దండు". "అంతలో దినకరు డస్తాద్రికేగె, సాంద్రమై చీకట్లు జగమెల్ల గప్పె, విలసిల్లె చుక్కలు వినువీధియందు". ఆ నడిరేయి బ్రహ్మనాయుడు కార్యమపూడి రణరంగమును జూచి రమ్మన "వాసన పెల్లయిన వనమాల గదల, కరముల గుజ్జరి కడియముల్ మెరయ, నేలైన పిడిఘంట నెమలి సోగలును, నల్లని దట్టిని నయమొప్ప గట్టి, అర్ధనారీ ఝల్లకాదులు నమర, ఘోరభైరవగద కోరమీసములు, ఎగుభుజంబులు మించ నెరజేయ గ్రుడ్లు, ఘనమైన దేహంబు కాలి పెండెరము, వెరపైన భీకరవేషంబుతోడ, కదలె కన్నమనీడు కదన భూమికిని". కన్నమనాయడట నడి కలనిం జొచ్చి యెరుకలసానితో మాటాడి యామెకడ శుభవార్త గొనిపోయి బ్రహ్మనాయనికి జెప్పెను. బ్రహ్మనాయడు యుద్ధరంగమునకు బోయి యారుద్రభూమియందున్న బీభత్సప్రదర్శకములగు పీనుగు పెంటల గడిగిపైవ విష్ణువును ప్రార్థించెను. వర్షము గురిసి రణరంగము శోశితమయ్యెను. "అప్పుడా జలమధ్యమందుండి యొక్క పునుక జలముపైన బొర్లాడుకొంచు" వచ్చి విష్ణురూపుడైన బ్రహ్మనాయని బొగడి తన పూర్వ చారిత్రము జెప్పి శుభము గల్గుననెను. నాయడు తిరిగి వచ్చెను. తెల్లవారగనే ససైన్యముగ మలిదేవాదులు కార్యమపూడి చేరి "తెచ్చిన కంబంబు ధీరత తోడ" నడి కలన నిల్పిరి. గంగధార మడుగురో స్నానాదులు గావించి కొలువు దీరిరి. మంత్రాలోచన మొనర్చి భట్టును గురిజాల నలగాముకడకు రాయబార మంపిరి. భట్టు నలగామరాజునకు దెల్పిన రాజనీతివిశేషము లారయ దగినవి. "పగ వృద్ధి బొందించు భ్రష్టులేకాని, అడగించు నేర్పరు లవనిలో లేరు, . . . పోరు మంచిది గాదు భూమి నెక్కడను, పాడౌను దేశంబు పగ మించెనేని, ప్రజలెల్ల నశియించి పారిపోవుదురు, తెలిసిన శాస్త్రవుల్ ధీరతతోడ, భూమిని గొనుటకు బుద్ధి వెట్టుదురు, మేకొని మీలోన మీరు పోరాడ, చూచెడు వారికి చులకన యౌను, చెడును బలంబును చెడును భాగ్యంబు, చెడును యశంబును చెడును శౌర్యంబు, మనసులో బుట్టిన మంచి తలంపు, లాచరణమునందు అలవి కాకున్న, జన్మఫలంబేమి చచ్చుటే మేలు, ఉభయవారలు మీర లొక్కటైయున్న· సకలకార్యంబుల సమకూర్పవచ్చు,

ప్రజలకు సుఖమౌను పంటలు పండు, కలహించి వెనుకటి కౌరవులెల్ల, గతిచెడి పడినట్టి కష్టముల్ వినమె" యని భట్టు మంచిని బోధించిన నాయకురాలు "సిరపోస్త్ర చేయుట చెల్లునుగాని, ఆజ్ఞ పొత్తిచ్చుట అది నీతి గా"దని నలగామమునకు సంధివై ముఖ్యము బోధించెను. రాయబారము కుదురదయ్యెను. భట్టు తిరిగిపోయెను. నలగాముడు యుద్ధసన్నాహములు చేయ మొదలిడెను. "కాంచెము ఫణియైన కొట్టెడు కొరకు, ఘనమైన దండమే కావలె కాని, కూడను సన్నని కోలల గొట్టి, తప్పెనా తమకౌన దరుముక వచ్చు, హెచ్చయిన బలముతో ఏగుట నీతి" యని తనకు సహాయులుగా రమ్మని నలగాముడు "ఘరణికోటపురికి దక్షుడై నట్టి భీమదేవుండను పృథ్వీశునకును, గోలంకి ప్రత్తకు ఘూర్జరపతికి, ఉరగసేనుండను ఉర్వీశ్వరునకు, బంగాళ పతికిని పాండ్యేశునకును, మళయాళ కర్ణాట మానవేంద్రులకు" మున్నగువారికి జాస పత్రికలు వ్రాయించి పంపెను. వారును తమకు గల యప్పనము లింతటితో దీరిపోవునని బయలుదేరి వచ్చిరి. నలగాముడు ససైన్యముగా దండు వెడలెను. మధ్యన కొదుమగుండ్ల పౌరులు యుద్ధము వలదని మనవిచేసిరి. కాని లాభము లేదయ్యెను. నలగాముడు కార్యమపూడి చేరెను. అతనికి దాపట నరసభూపతుడు, కొండ మన్నెమరాజు, కోటకేతుండు, వలపట రెడ్డి, కొలువుదీరిరి. రాజు వెనుక రమణి నాగమ్మ "కార్యఖడ్గము ప్రజ్ఞావిశేషముల, తెలుపుచు గూర్చుండెదీరతతోడ".

ఈ సమయమున మేడపిలో బాలచంద్రుడు బంగారు బొంగరము లాడదలచి నిజౌదార్యమును దెలిపి తల్లియగు ఐతమ్మకు "కలుములు నిత్యంబు గావు మాతల్లి, మెరపు మెరయురీతి మేఘంబులట్లు, బుద్బుదంబులభంగి పోవు"నని వైరాగ్య ముపదేశించి, భౌతిక రహస్యంబులు తెల్ప నామె మంగలి మాధవునకు, కమ్మరపట్టికి, చాకల చందుకు, కంసాలి చందుకు, వెలమపట్టికి తన కొడుకునకు బంగారు బొంగరము లిచ్చి "చాలురావులకాడ సరసమైనట్టి, రమణీయమగు మొల్లరావి క్రిందటను, ఆడుడి బొంగరా లానందమొనగ"నని పంపించెను. వారు పోట్టేళ్ళపై నెక్కి పోయిరి. వారి యాటపాటల జూడ కొంద రమ్మలక్కలు వారిని తిట్టుచు దీవించుచు బోయిరి. ఆటలలో బాలచంద్రుని బొంగరము అన్నమ్మయను వైశ్యకాంతకు దగుల నామె మూర్ఛిల్లెను.

సేదదీర యామె బాలుని చెడదిట్టి "మీ యయ్యలెల్లను మించిన బలిమి, చేరి పైపడలతోడ శ్రీ యుద్ధభూమి" నున్నారు, "వారిలో గలయు నీ వడి కానవచ్చు"నని తూలనాడెను. బాలచంద్రు డామెను ప్రార్థించి ఆమెకు మంచులు కాల గట్టించి "చూస్కొనుటకును చూడ లేనూరి"చ్చి రోషముతో నింటికేగి తల్లితో యుద్ధరంగవిషయము లడుగ నామె భయపడి యుద్ధవిముఖ వచనములు బోధించెను. బాలుడు "తండ్రి కష్టంబును దప్పింపలేని పుత్రుడుండిన నేమి పోయిననేమి" యని బ్రహ్మాండ"ములబట్టి బంతులాడుదును, మృత్యు దేవతనైన మెదపి పేసెదను. బాలుండనని నన్ను భావింపవలదు, చిన్న మిరియమందు చెడునె కారం"బని తన ప్రతాపమును జెప్పుకొనెను. ఐతమ్మ ఎన్నియో నోములు నోచి కన్నట్టిపుత్రుని విడువలేక "వర్లలో వజ్రంబు వడిగన్న మాడ్కి, గుడికొచ్చి దేవు గన్గొనిన విధంబు, కంటిని పుత్రుడ కాంక్షతో నిన్ను, లాదెక్క పురుషుని తల్లికి అల్లె, గడమీద నాడు కన్యకుని తల్లికిని, కూరుని తల్లికి సుఖమేమి లే"దని పలవించెను. బాలచంద్రుడు "కార్యమష్టరమంచు ఘనపరాక్రమత, తండ్రులు నిల్చుండి దండు చేయంగ, నేనింట నుండుట నీతియే తల్లి, ఉండుమనుటకు నీకు ఒప్పునా మనసు, కాయ మనిత్యంబు కల్మి పూశక్కి, జలబుద్బుదవిధంబు క్షణభంగురములు, షట్చక్రవర్తులు సకలభూపతులు, చనిరి బ్రహ్మేంద్రాది సకలదేవతలు, శౌర్యసత్కీర్తులు సమయ వెన్నటికి, జననమరణములు జనులకు నిక్క, మాలయంబున నున్న అడవిలో నున్న"నని వీరధర్మమును "వెలమల మైత్రిమి వీరజీవనత" నుందుమని స్వధర్మమును చెప్పెను. ఐతమ్మ కొడుకుతో భార్యాదీవన గొనిపొమ్మని చెప్పెను. బాలచంద్రు డగ్నిసాక్షిగా గొన్న తన భార్య మాంచాల నింతవరకు కాదరించి యుండలేదు. వేశ్యావ్యామోహమున నుండెను. అతడిన్నాళ్లు "వెలయ భుజించుట వేశ్యగేహమున, విడియంబు చేయుట వెలయాలి యింట, సౌఖ్యంబు పొందుట సాని ధామమున." కనుకనే తన్ను బతిమాల వచ్చిన యత్తతో మాంచాల "భోగంబు నొందెదు పొలతులు వారు, చావ నోచినయట్టి సఖియను నే"నని హృదయవిదారకముగా వనెను. బాలుడు తన వేశ్య శ్యామాంగి - సబ్బాయి - కడకు పోయి "వీరుల కలయంగ వెస బోవుచుంటి, ప్రియురాలివని నిన్ను బిలువ వచ్చితిని, వడువడి నీవును పైనపై రమ్మ"నెను. కాని యా సానిది, "అడవిలో గాసిన యామ్లఫలంబు,

ఉదధిలో లవణంబు నొగి గూడినట్లు, జరిగె నీకు నాకు సంగతి వినుము, ఇంకేమి ఇహసౌఖ్యా సాధనాలేము, పరసౌఖ్యమునకు నీ పదతి సాధన"మనెను. బాలచంద్రుని కది కనువిప్పు కలిగించెను. "ఇంటిలో భోజనం బిచ్చుకు రాక, పరుల ఎంగిలి కాసపడితిని గాదె"యని బాలచంద్రుడు పశ్చాత్తాపపడెను. శ్యామాంగి "పెరిగిన రొండియు వ్రేలు చన్నోయి, ఉడిసిపోయిన ఒళ్లు నూచనలు కాళ్లు, వంగిన నడుమును వదలిన పండ్లు, పీల చేతులు గూని పీనుగు మోము, చిక్కగ నరిసిన చింపిరి తలయు, వ్రాలిన బొమముడి వదలిన మేను, మెడమీద కణతియు మీగాళ్ల పూత, పలుచని గడ్డంబు పైన పుల్పిరియు, మూతిమీసపు మొలక ముక్క రోమములు, తలవడంకును మాట తబ్బిబ్బు మరపు, కంపు గొట్టుచు చొల్లు గారెడు నోరు, కన్నుల పుసులును కాంక్ష మిక్కుటము, కోతివంటిది వృద్ధ గురుకోపయుక్త"యగు తన తల్లితో గలిసి కపటంబు పన్ని బాలచంద్రుని వలన ధనము లాగెను. అనపోతు బాలచంద్రుని చర్యల దెగడెను. బాలచంద్రుడు సిగ్గుతో శిరము వంచుకొని అత్తవారింటి బాటపట్టెను. అట చెలికత్తెలు మాంచాల నలంకరించిరి. బాలచంద్రుడు భార్యతో కొన్ని జాములుండి తన పూర్వప్రవర్తనమునకు పశ్చాత్తాపము దెల్పి, కేళీలోలుడై యనుజులవలన కర్తవ్య మెరిగి భార్యను సెలవుగోరెను. మాంచాల తెలుగు స్త్రీలోకమున కొలికిపూస. వీరోచితముగా నామె భర్త చేతికి కరవాల మందించినది. ముఖమున చిరునవ్వు దీపింప "రతిరాజసుందరా రణరంగధీర, కమల బాంధవతేజ కరుణాలవాల, వినతాత్మజుని లావు వెస నీకు కలుగు, సామీరి కుండిన సాహసంబబ్బు, కృష్ణుని కీడుగా కీర్తి ఘటిల్లు, రవి కాంతియుతుడవై రంజిల్లుచుండి, అలరాజు పగ దీర్పు మనుజులతోడ, పటుతరవిక్రమవైభవం బలర, శ్రీగిరిలింగంబు చెన్నకేశవుడు, వరము లొసంగగ వర్ధిల్లగలరు, శాత్రవ విజయంబు సమకూరు మీకు, కలియుగంబున మీకు ఘనపూజ లమరు" అని ప్రాణనాథుని ఆశీర్వదించినది. బాలచంద్రుడు మరల తల్లి సెలవంది తమ్ములతో యుద్ధభూమికి బయలుదేరెను. కాని "విప్రుడా అనపోతు వెంట రాదలచు, బ్రహ్మహత్య ఘటిల్లు పాపము వచ్చు, బహుజన్మములకైన పాయదా కీడ"న్న మాంచాల మాటలు బాలచంద్రుని చెవుల గింగురుమనుచుండెను. అతడు [illegible] మున్ముగు

తమ్ముళ్లతో సెత్తుగడ పన్ని అనపోతు నొక కార్యముపై ఇంటి కంపి తిరిగి వచ్చునందాక నుండుమని చెప్పి, అతడు పోయిన వెనుక యుద్ధరంగమునకు బిరబిర పోయెను. అట నంతవరకె నాయకురాలు మలిదేవాదులకడకు కుట్రతో పేటునట్టు మాత్రమొక రాయబారిని పంపించియుండెను. వీరలు సంధి వలదన్నను కొమ్మరాజు శాంతమునే సాధించుచుండెను. ఇంతలో బాలచంద్రుడు కార్యమపూడి చేరెను. అతని జూచి "సంధికార్యమునకు చనుదెంచినట్టి, దొరల మొగంబులు తొలగె తేజంబు". వారు "ఇతడు రాకుండిన నెసగును సంధి, ఇక సాగ దెవ్వరి హితవిచారంబ"నిరి. ఇట బాలచంద్రునకు గండు కన్నమనీనికిని జరిగిన సంవాద మత్యద్భుతము. విస్తరభీతి నుట్టంకించుటలేదు. బాలచంద్రుడు యోధులకు రోషపు ప్రాణములుపోయు పట్టు మరువరాయ మానము. "ముక్కు మూలముమీద దొడిచిన యమృతము, గద్దమనగలేని కోప మెన్నటికి" "కట్టితి విడె కాళ కత్తి పట్టితివి, పగ యీదలేనట్టి పౌరుషమేల" "మేటి శూరుల నాటి మెచ్చునియట్టి, నమ్మిన జంగిలి నాయకులార, తగు జల్లి కేడెముల్ దండచక్రములు, పోగొట్టి పోరయ్య పోరు మీకేల, వీర యోధులుగదా పెను మాలవారు, గాయగోవాళాఖ్యగల బిరుదములు, పగతురు గనకుండ పాతుడి భూమి, బాదన్న రాహుత్త పాటవ మేడ, సంపెట నారన్న జయమగు బిరుద, మెక్కుడి కేగె నీవెంపు దాగితి"వని బాలచంద్రు డొక్క రొక్కరికే పురి నెక్కించెను. కొమ్మరాజు బాలచంద్రు శాంతుని జేయ ప్రయత్నించుచుండెను. అక్కడ అనపోతు, బాలచంద్రుడు తన్ను వంచించు టెరిగి "వెంగలినైతిని వెలమలవద్ద, కలిమికోసము వచ్చి కలియుట లేదు, కులమున కొదవని కూడుటలేదు, తల్లిని దండ్రిని దాయాదజనుల, ఎడబాసి నీ పొందు నే నమ్మియుంటి, పగవాడనైతిని బాంధవతతికి, పాసిపో తగునయ్య బ్రహ్మన్న తనయ, ఎన్నడు నాలావు నిసుమంతయైన, కనుగొనవైతివి కట్టిడివాడ, బ్రాహ్మణు డీతడు బవరంబు చూచి, భయపడునంచును భావించి తకట" యని బాలుని నిందించి, "వీరవిక్రమయుద్ధవిభవంబు గనగ, భాగ్యంబు లేదాయె పాపిని నేను. తనవారి రక్షింప తరి వచ్చినపుడు, వినియోగ పడనట్టి వీరక్తంబు, రక్తమే కలుషనీరంబగు గాక" అని తనను నిందించుకొని, "ఉప్పొంగుచున్నది యుజ్వలశక్తి, అడగదు నేనెంత అడచిననైన దహియించుచున్నది దావాగ్నిరీతి, ప్రాణంబులిక నేను పట్టగజాల, తివిరి

స్వర్గంబైన దేహంబు విడుచు"నని పిరసోద్వేగ మాపుకొనలేక "బంగారు జంధెంబు పాదంబు బిగుదు" మాదచి కిచ్చి "బాలుని కిమ్మని ప్రణతికి జెప్పి, తన తల గోసుక ధరమీద వ్రాలె"ను. ఓహో ! ఏమి ఈ వీరతేజము. 'ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్ర' మన్న తెగ కనపోతు నాయకమణి. పలనాటి గడ్డయందా జిగి యుదెండిదేమో ! బాలచంద్రుని క్షాత్రతేజమును గూడ మించినదీ బ్రాహ్మణ శౌర్యము. భోజనసమయమునకు మాదచి అన పోతుని రక్తసిక్తమైన జంధెమును బిగుదును బాలచంద్రుని కందించెను. బాలుడు పెదబొబ్బపెట్టి "ఒప్పు బాపను వీరు నొక్కటియైన, శంకింప కెదురెక్కి శాత్రవచయము, బాపలపై బడి ప్రకటశౌర్యమున, పీనుగుపెంటలు పెల్లుగ జేసి, తమకించి నరసింగు తలను ఖండించి, కొమ్మ భూపతికిచ్చి కులవిరోధంబు, తీరిచి పంతంబు తీర్చెద చూడు" మనెను. ఇక సంధి పొసగదని యందరు నిరాశులైరి. బాలుడు తమ్ముల నందర బిలుచుకొని తన పూర్వజన్మముల జెప్పి, "తలిదండ్రులను బ్రోవ తనయుడే కర్త, మానంబు దక్షత మగటిమి బెంచ, ప్రబలింపగలవారు బాలురే సుమ్ము, బాలురే పెద్దలు బల్లిదుల్ వారె, కీర్తికైనను నపకీర్తికైన, బాలురపై నుండు భారమంతయు"నని తన కర్తవ్యమును బోధించెను. బాలచంద్రుని తొలుత వారించి యాతని పట్టుదల చూచి, తండ్రియగు బ్రహ్మనాయడు, "మండలేశుల కెల్ల మది తల్లడమయి, చెల్లిన మన పేరు చెడిపోవనీకు, ముల్లుచూ శౌర్యంబు మొక్కపోనీకు"మని రణధర్మమును "శౌర్యంబునకు పాదు స్వర్గంపు త్రోవ, యెల్లసుఖంబుల కిది పట్టుగొమ్మ, హెచ్చయిన వీరుల కిది పుట్టినిల్లి"ని యుద్ధరంగతత్వ ముపదేశించి "తలపడునప్పుడు తలకకుమన్న, అలుగుల దీప్తికి అలుకకుమన్న, వారణధ్వని విని వడకకుమన్న, శరముల దీప్తికి జడియకుమన్న, సమరకాలంబున జంకకుమన్న, బిరుదులు జారిన బెదరకుమన్న" యని రణనీతి నుపదేశించి "తగినట్టి కర్పూరతాంబూల మిచ్చి, శంఖతీర్థ మొసంగి జయమొందు మంచు" దీవించి రణరంగమునకు పంపించెను. రణరంగమున బాలు డొనరించిన వీర విహారము వర్ణనాతీతము. వీరాధివీరుల ఖండఖండములుగా, గజాశ్వముల నుగ్గునుగ్గుగా జేసిన దాతని యడిదము. అతని ధాటి కాగలేక నలగామని సైన్యములు కలత నొందినవి. అతని జూచి భయపడిన యుద్ధభీరువుల వర్ణనము హాస్యమును జాలిని కలిగించునట్టిది. "పారిపోవగ లేక బ్రతుకుపై నాశ,

బతిమాలుచుండెడు బలనిచయంబు, లిటువంటి జగడంబు లెన్నడెఱుంగ, మేలాగు పోదమన్చేడ్చెడువారు, పణతులు దిట్టిన పడలేక వచ్చి, చచ్చుచు నుంటిమీ సమరరంగమున, పారిపోనిచ్చిన బ్రతుకుదుమయ్య, అని మ్రొక్కు చుండెడు అతిదీనభటులు, బోయవారము మేము పూర్వంబునందు, బుజములు కాయలు పూని కన్గొనుడి, పగవారు మము గని పారిపోవుదురు, మీకేమి భయమని మెలత నాగమ్మ, బాగుగా నమ్మించి పంప వచ్చితిమి, అని యంజలి యొనర్చి అవమానమొంది, మగసిరి విడిచిన మానహీనులును, చనలేక భయమున చచ్చినవారు, మీద ద్రోసుక యుండి మెదలనివారు, చచ్చిన గజముల చాటున దాగి, పందతనంబున పడియుండువారు, పెండ్లాల దలచుక బిట్టేడ్చువారు, వల్మీకములమీద వసియించువారు, గడ్డిలో జొరబడి కదలనివారు, వ్రేళ్ల చీకెడువారు వెన్నిచ్చువారు''నై యుండిరట. బాలచంద్రుని వీరవిక్రమమును జూచి పారిపోవుచున్న సైన్యముల నతికష్టముమీద నరసింహభూపతి నిలుపగల్గెను. బాలుడు నరసింహుని తల యనుకొని, వేరొకని తల గోసి తండ్రి యొద్దకు పోవ బ్రహ్మనాయడు పొరపాటు తెలిపి కొడుకును వెక్కిరించెను. రోషముతో బాలుడు తిరిగిపోయి నరసింగునితో దలపడెను. వారి ద్వంద్వయుద్ధ మసమానము. నరసింగుడు బాలు నంకుశముతో బొడిచెను. బాలుని ప్రేవులు బయటికి వచ్చెను. బాలుడు రోషమున "సామంత రాగోల చక్కగ బట్టి, వక్షస్థలంబున వడితోడ గ్రుచ్చ" నరసింగుడు కూలెను. బాలు డాతనికి "వలగొని ముమ్మారు భక్తితో మ్రొక్కి, అనుగుభూవరపుత్ర అంబుజగాత్ర, అపరాధి గాను నే నపకారిగాను, అలరాజు జంపిన అపగ దీర్చ, పట్టి చంపితిగాని పాపం బెఱుంగ''నని దుఃఖించి నరసింగుని తలగోసి ఒకచేత బట్టుకొని వే "రొకచేత (తన) ప్రేవుల నొయ్యన నెత్తి, సామంత రాగోల చంకన బెట్టి, తన తండ్రి తావుకు తల గొనిపోయె''ను. బ్రహ్మనాయుడు మొదలగు నాయకులు "నరసింగు శిరమును నమ్రత గొనియు, తపనీయపీఠిపై తలనుంచి మంచి, గంధము కస్తూరి కలయంగ నలది, కొలువెల్ల మ్రొక్కిరి కోపంబు లణచి". వారి రాజభక్తి వారి రణధర్మములు వారి పగ సాధింపులు ఈనాడు మనకు వింత గొలుపునవిగా నుండును గదా! శత్రువుల కింత గౌరవ మిచ్చుట ఆ వీరయోధులకే చెల్లినది. నరసింగునిపై గల భక్తితో బ్రహ్మనాయుడు కొడుకు పరాక్రమము కొనియాడక "విభునకు సేనకు

విష్ణువైతి వకట'' యని దూరులాడెను. మనసు నొచ్చిన బాలుడు తండ్రి కపటంబుల నెన్ని, అనుజులతో ''తెంపుచే కలనికి తిరిగి పైనమున'' వెలయించిన యాచరణమును "వాణీశుడైనను వర్ణింపలేడు". కామాక్షిని దలచి కమ్మర కాచన, పాతాలగంగను ప్రార్థించి బాకల చందన్న, మాచెర్ల చెన్నుని దలచి వెలమదోర్నీడు, కలని కొరగిరి. ఒక్కరొక్కరే తక్కిన తమ్ములను కూలిరి. అశేషజనముల తెగటార్చి "బాలుడు రోషంబు పట్టగ లేక, చండవిక్రమమున సాహసం బెసగ, ప్రేలాడు ప్రేవులు వేగమే పెరికి, గంగధారం గలిపి కలనికి వచ్చి, తమ్ముల దలచుచు కడు విలపించి, అలుగులపై వ్రాలె నైతాంబ సుతుడు''. వైరులు వచ్చి "గ్రుచ్చిపట్టిరి మెత్తి గురుశౌర్యఘనుని". బాలుడు ''వేంచేసె దివియందు వీరుల గలిసె''ను. యుద్ధరంగమున పల్నాటిఖానుడు క్రుంకినంతనే "అంతట భాస్కరుడస్తాద్రికేగె"ను. యుద్ధరంగమున పిశాచగణములు తమకు పూటిగా నాహారము లభించినదని స్వేచ్ఛావిహార మొనరించినవి. "ఘనుడైన శ్రీనాథకవి రాజరాజు, చెన్నుని కృపచేత చిత్తముప్పొంగి, బాలుని విక్రమప్రావీణ్య మెల్ల, జనులకు వివరించె సద్భక్తితో దీని, పాటించి చదివిన వ్రాసిన వినిన, శ్రీయు ఆయుస్సును స్థిరముగా గలుగు''.

పల్నాటి వీరచరిత్రమునకు సంబంధించిన కథలనేకము లముద్రితములు ప్రా. పు. భాండాగారమున గలవు. వానిలో కొన్నింటిని మాత్రమే క్లుప్తముగా నిట పేర్కొందును. పల్నాటివీరచరిత్రమును శ్రీ నాథుని తరువాత మరి యిరువురు పదకర్తలు చేపట్టిరి. వీరు కొండయ్య మరియు మల్లయ్య యను రచయితలు. కాని శ్రీ నాథుని రచనములట్లు వీరి రచనములు కూడ సంపూర్ణముగ లభ్యమగుటలేదు. వీరిరువురను శ్రీనాథు నుదాహరించినట్లు శ్రీ అక్కిరాజు ఉమాకాంతవిద్యాశేఖరులు వ్రాసియున్నారు. ఉమాకాంతపండితులకు వీరి సమగ్ర రచనములు లభించియుండవోపు. ఉమాకాంతపండితులు కొండయమల్లయల గూర్చి ''వీరు తమ గ్రంథముల చాలవరకు శ్రీనాథు ననుసరించియే చెప్పిరి. వీరొక్కొక చోట లేనివి కొన్ని కలిపి, యున్నవి కొన్ని తీసివేసిరి.... కొండయ్య శబ్దసౌష్ఠవము పాటింపక యిచ్చ వచ్చినట్లు చెప్పినాడు. మల్లయ రచనలో చాలవరకు శ్రీనాథుని వాక్యములే యున్నవి" అనిరి.

ప్రా. పు. భాండాగారమునగల కథలలో "కోళ్ళ పోట్లాట–గోష్ఠ యుద్ధము" ఒకటి[1]. ఇది మల్లయ విరచితము. పైన పేర్కొనబడిన మల్లయయే ఈ మల్లన. కృతికర్త తన్ను గూర్చి "రాజశేఖర పదరాజీవలోల, మధుకరుండైన రామన మంత్రి మణికి, నమలాంబికను పరమానందసుతుడ, మల్లికార్జునదేవు మన్ననవాడ, మల్లన యనుపేర మహి బరగువాడ" నని చెప్పుకొనెను. ఈతనికి కౌండిన్య గోత్రము. తాత గౌరయాచార్యుడు. "తత్వసారం బెల్ల తలపోసి కూర్చి, తేటతెల్లముగాను తెలుగువారలకు, స్వరమంజరి యనంగ జగములో వెలయ, జేసిన పుణ్యుండు శివపదార్చకుడు". ఈ పదములో క్లుప్తముగా నీ కథ గలదు. నలగాముని యాహ్వానముపై బ్రహ్మనాయడు మాచెర్లనుండి గురిజాలకు దరలిపోయెను. అట నాయకురాలి మంత్రతంత్రములచే బ్రహ్మనాయని కోడి మరణించెను. నిర్ణయముచొప్పున మలిదేవరాజు తన రాజ్య మేడు సంవత్సరములు నలగామరాజుకు వదిలిపెట్టి తాను పరదేశగతుడు కావలసి వచ్చెను. నాయడంగుల కంగీకరించి బయలుదేరుచుండ నాతని బంటు గోపుడనువాడు నాయకురాలి కుతంత్రముల కామెను మరియు నలగాముని నిందించెను. నాయకురాలు గోపుని నిందింప నాతడు రోషావేశమున ననేకుల జంపి తానును నిహతుడయ్యెను. ఇది యిందున్న కథ.

కోడిపోరునకు గురిజాలనుండి వచ్చిన యాహ్వానము నాయు డంగీకరించి యందులకు సంసిద్ధుడై నగరులోనికి జని విజ్జలదేవి (ఈమెయే వీరవిద్యాదేవి-మలిదేవరాజాదుల తల్లి) సెలవందె, స్నాన సంధ్యలు ముగించి, ఆయుధపూజ గావించి, భోజన మొనర్చి, శృంగారించుకొని, "శ్రీ కృష్ణరాయని చెలువంబు నొంది, యా చీలమాంబ (న) యా అర్ధనారి, చిట్లుమల్లన గోరి చిత్రమున నపుడు" (ఇది బ్రహ్మనాయని కోడి పేరు) శకునములు జూచుకొని 'శీలమ్మ పెట్టిన సేస గైకొనుచు' (బ్రహ్మనాయని తల్లి) భూసురాశీర్వాదములతో, చెన్నకేశవుని తీర్థప్రసాదము లందుకొని, సపరివారముగా కన్నమనేనితో గదలి, గురిజాల మార్గము బట్టెను. అప్పుడు చెవులగోపుడు మాచెర్లలో లేడు. గోపునకు నాయుడు కోడిపోరునకు బోవు వార్త దెలియగనే మహావేగముతో నాయని వెన్నంటెను. నాయ డప్పటికే కంభముపాడు దాటి యుండెను. గోపు వెనుక వరుగెత్తి వచ్చుట దెలిసికొన్న బ్రహ్మనాయుడు గోపును వెనుకకు మరలించు నుద్దేశమున

1. డి. నెం. 1112. ప్రా.పు. భాండాగారము మద్రాసు

న్నపవాసుతో నీ వెదురుగా నేగి "పరుసతో నానలు వ్రాయించి పోతవు, నానలన్నియు ద్రోచి యరవాయి గొనక, వచ్చెనా రానిమ్ము వలదనరా" దని కంపించెను. గోపును రావలదనుటకు కారణ మాతడు మహాశూరుడగు స్వామిభక్తుడగుట. గోపును గొంపోయినచో, తప్పక యుద్ధము సంభవించునని బ్రహ్మనాయని నమ్మకము. కన్నమనీడు గోపున కెదురుగా బోయి రావలదని మొదట నలగామునిపై, తరువాత మలిదేవునిపై ఆనలుంచి బెరలు వ్రాసెను కాని గోపడవి దాటి వచ్చెను. చివరకు కన్నమనీడు "బరి వ్రాసి దాటితే బ్రహ్మన్న యాన" యనెను. కాని గోపు "అపసరంబున ప్రాణ మరవాయి గొనక, యిచ్చువానికి గాక యేనేల నిలువ, నీ యాన కిక నిలువ నెట్టంగినైన, వచ్చెద కాపుండవలదన్న మాన" నని దాటెను. కన్నమదాసు మరల "బరి వ్రాసి దాటితే పరివారమాన" యనెను. పరివారము పేరుతో నాన లుంచినంతనే గోపుడు కొంతసేపాగిపోయెను. ఇచట పరివారమునకు గల గౌరవము చక్కగా వర్ణింపబడినది. చెలియలికట్ట దాటిరా వెరచు సముద్రుని భంగి గోపు బెరను దాటక "పరివారమాన భూపతి ద్రోయ వెరచు, పరివారమే లోకపాలకు లెందు, పరివారమే ధర్మపాలకు లరయ, పట్టభద్రునినైన పలుచ జేయుదురు, న్యాయార్జితంబగు నవని బాలించు, పడుచునైనను పట్టభద్రు జేయుదురు, తమ రాచ కార్యంబు తరియాయెనేని, ప్రాణంబు సరుకుగా బట్టరయ్యెడల, మానమే ధనముగా మలయుచుండుదురు, మగతనంబున నున్నసాహసులు, ... బంధురమై యున్న పరివారమాన, పొడవుగ దన కేల పొడచితి వీపు, ద్రోసిన జగములో ద్రోహిని నగుదు, ఈయాన ద్రోయ నేనెంతటి వాడ"నని విచారించెను. పరివారమన్న నింత గౌరవముండుట మిక్కిలి హర్షింపదగిన విషయము. ఈ గ్రంథమున కీభాగ ముదాత్తత చేకూర్చునది. గోపు కన్నమదాసుతో 'కోడిపోరును జూడ కొరగానె చెపుమ, కొరత లేకుండగ గొన్ని ఎన్నితివి, సిగ్గె మాచెర్లకు శీఘ్రమే చనగ, వనధిని గనుగొని వడి బారుచున్న, నది కడ్డమైయున్న నగము చందమున, బెర వ్రాయగా నీకు పాడియే దీని'నని కరుణముగా ననెను. బ్రహ్మనాయడను రత్నాకరునితో గలిసిపో నిచ్చగించు నదీతుల్యుడగు గోపును కన్నమదాసను పర్వతు డడ్డగింపలేడయ్యెను. గోపు మథనపడి మథనపడి బెరదాటి పరుగిడి బ్రహ్మన్న పాదములపై నొరిగి స్తోత్ర మొనర్చెను. కాని నాయడాతని నాజ్ఞ ధిక్కరించినందులకు మొదట తూలనాడి

తరువాత శాంతుడయ్యెను. గోపు "కోడిపోరుకు నన్ను గొనిపోవ దగున" యని దీనముగా బతిమాలెను. గోపుడు తనకును బ్రహ్మనాయనికిని గలిగిన శకునముల ఫలితముల వివరించి చెప్పెను. చెవుల గోపడు (గోపాలుడు) దుశ్శకునముల ఫలితముల జెప్పినటులే కాటమరాజు కథలో సంధ్యగోపాలుడు కూడ శకునఫలముల జెప్పెను. చెవులగోపుడు చెప్పిన శకునముల వివరములు కనీసము పది పుటలలో నున్నవి. శకునశాస్త్రమున జానపదులకున్న విశ్వాసము నీ ఘట్టము చాటును. బ్రహ్మనాయుడు శకునఫలితముల విని యాతని మాహాత్మ్యమున కచ్చెరువంది గోపుడు కేవలము వ్రేపల్లె యందలి నందగోపుడే "భూమిపై మనుజుడై పుట్టినవాడ"ని భావించెను. కీడు శంకించిన నాయుడు గోపుని మాచెర్లకు తిరిగి పంపించుట కెంతయో శ్రమపడెను కాని గోపడు మాత్రము "వత్తు నీముందట వలదన్న చత్తు"నని తన పట్టు వీడడయ్యెను. నాయుడు యోగముద్ర ధరియించి "సోమసూర్యగతులు శోధించి పట్టి" ప్రాణము నాధారచక్రమున బంధించి, కుండలి బెకలించి, లోపల దీప్తమైన వెలుగున పలనాడు పాడగుట, గోపు మృతి, యుద్ధము, బాలచంద్రుని మృతి, మున్నగు భవిష్యముల జూచికొని కానున్నది కాకమానదని గోపుని రాక కంగీకరించి విడియ మందింపబోవగా గోపుడది గ్రహింపక 'గురిజాల ముందర కోడిపోరప్పుడు, కయ్యంబుగలిగిన కణకతో నీవు, కుంత మందగలేదు కోపింపలేదు, పోరెంత గలిగిన బోరు నాకు సెలవు, గాజేసితేనియు కంభముపాడు, మహాదేవిచర్ల (మాచెర్ల) కు మధ్యమందున్న, విఘ్నేశ్వరుడు జూడ విన సాక్షిగాగ, విడియంబు పెట్టిన వెస నందుకొందు, కాదన విడియంబు కరమున ముట్ట'ననెను. బ్రహ్మనాయ డందుల కనుమతించి తాంబూల మిచ్చి చిట్టిమల్లని (కోడిపుంజు) చేతి కందించెను. 'అతడును వేడ్కతో నా యర్ధనారి, చిట్టిమల్లని నెద జేరంగ జేర్చి, యుపలాలనము జేసి యొరుపుకు రాని, ఈకెల జక్కగా నింపారదీర్చి, పుంజు చక్కనిదంచు పొగడుచు గోపు, చెన్నొంద గనవని చేరంగ బిలచి, చిట్టిమల్లని వాని చేతికినిచ్చి' నాయని వెంబడి పయనము సాగించెను. కంభముపాటి కాపులు నాయుని తమకడ విందారగించుమని కోరిరి. నాయుడు వారికి కృతజ్ఞతలు దెలిపి విందున కిది నమయముగాదని నచ్చజెప్పి, మంచికల్లు చేరి కాలేరు దాటి, తమకై ఏర్పరుపబడిన వీడుబట్టు (మాడుగుల) చేరుకొనెను. అచట మాడుగుల బ్రహ్మారెడ్డి వారి కాతిథ్య మొసగెను.

నాయుడు తన రాక నెఱింగింప గురిజాలకు వార్తాహరుల నంపెను. నాయుడానాడు మాడుగులలో గడపెను. (ఈ పట్టున సూర్యాస్తమయము, కమలములు ముకుళించుట, చక్రవాకములు, చీకట్లు, నక్షత్రములు, చంద్రోదయము, కువలయ వికాసము, చకోరములు వెన్నెల గ్రోలుట మున్నగు విషయములు కావ్యరీతిని వర్ణింపబడినవి.) మాడుగుల రెడ్డియింట బ్రహ్మనాయునికి మఱియు నాతని పరివారమునకు జరిగిన విందు పెద్ద ఘట్టము. నాయుడు గోపన కప్పుడే వైష్ణవము సాధికారముగా నిప్పించి శిష్యునిగా జేసికొనెను. నాయుడు బ్రహ్మ రెడ్డితో, పలనాటి రెడ్లతో, మాటలాడి శయనించుటకు తమ విడుబట్టునకు పోయెను. తెల్లవారగనే సర్వమాయత్తము చేసికొని కోడిమేడెమునకు దరలెను. అట గురిజాలలో నలగాముడు నాయకురాలు కోడిపోరునకు బయలుదేరుటకు ముందు చేసిన సైనికసన్నాహములు, సైనికవిన్యాసములు, నలగాముని కొలువు కూటములో జరిగిన సాహిత్యనాట్యవినోదములు పది పుటలకన్న నెక్కుడుగా వర్ణింపబడినవి. నాయకు రాలేర్పరచిన ఆశ్వికబలములో తురకల పేర్లధికముగా నున్నవి. అప్పటికింకను తురకలు దక్షిణభారతమున ప్రాబల్యము నందలేదు. ఇది కవికల్పనమైయుండును.

ఇరుపైపులవారు కోడిమేడెముకడ జేరుకొనిరి. బ్రహ్మనాయుని పక్షమున గోప, నాయకురాలి పక్షమున రెడ్డి (చింతపల్లిరెడ్డి?) కోళ్లను విడిచిరి. కోళ్ల పోరాట మత్యద్భుతముగా వర్ణింపబడినది. "పోరుకు విడిచిన పుంజులు రెండు, పొంగుచు రెక్కలు పొంగారి నార్చు, కన్నులు నిప్పుల కైవడి నొగల, .... కుంభిని యదరంగ గూయుచు జేరి, ముక్కు ముక్కున జేర్చి ముదిసి రోషమున, మెడయీక లుబ్బెను మెడ లొంచి రెండు, నుప్పరం బెగయుచు నురువడి దన్ను ... వలయంబుగా వచ్చి వడి దన్నుటయును ... పరగ భూసురుడు జంభారియునట్లు, వలనొప్ప బోరుచు వచ్చి యీపగిది .... చేకొని తాకిన జిమ్మిన నొడలు, నాటిన సీకెలు నడపెంపు దనర్చి, వెడలిన నమ్ముల విధములై యొప్పు, సీకె లన్నియు డుల్లి యిలమీద డుల్లు, మాంసపు ముద్దల మంది బోరాడి, వడి చిట్లుమల్లుకు వలపగ్గలించె, నలగాము పుంజుకు నశియించె లావు'. తమ కోడి యోడిపోవుట జూచి నాయకురాలు కోడిపో రాపుమనెను కాని నాయుడేదో యొక కోడి చచ్చువరకు కాపుటకు వీలులేదనెను. నాగమ చిన్న బోయెను. బ్రహ్మన్న కోడి "గరుడుండు బాలనాగము వేయు

ఖాతి, చివ్వంగి లేడిని జేకొన్న కరణి, సింహంబు మదకరి పెనకిన భంగి ,, చిట్టుమల్లడు జయము చేకొనె నపుడు.'' చిట్టుమల్లడు (బహ్మన్నకోడి) నల్లమల్లిని (నాయకురాలి కోడిని) 'నేరుపు పచరించి నిటలంబు దన్ని, మెడదన్ని యటు కొన్ని మెరపడి దన్ని, చుట్టును దిరుగుచు జూటంబు దన్నె'ను. నాగమ్మకోడి 'భుగులున నెత్తురు భూమిపై గ్రక్కి, తల వెగి యల్లంత ధరణిపై బడియె'ను. నాయకురాలును నలగాముడును చిన్నబోయిరి. నాయకురాలు రోషముతో 'గోష్ఠ లేనుగులును గుఱ్ఱముల్ ధనము, లాదిగా గుంజేసి యాడెద'మనెను. బ్రహ్మ నాయడు వల్లెయనెను. చిన్నబోయిన నలగాముని నాయకురాలు 'తొదరి సామాది చతురుపాయముల, ఇంద్రజాలంబుల నెరవులు బన్ని' నాయని గెల్తునని యూరడించెను. వేళయైనందున నలగాముడు సపరివారముగా గురిజాలకు తిరిగి పోయెను. నాయుడు తన వీడుబట్టు చేరుకొనెను. ఆనాడు వారికి భోజనములు గురిజాలనుండి పంపబడెను. నాయకురాలంపిన విషాక్త భోజనములపై నాయుడు తులసితీర్థము జల్లి యారగించెను. వంటలవారది చూచి నాయని మాహాత్మ్యమున కాశ్చర్యపడి తిరిగిపోయి నాయకురాలితో "హరిదాసు లిటువంటి యక్రియలందు, సుడివడ రెమ్మెయి సురిక్కరటన్న" నామె ఇంకొక యుపాయ మాలోచించి, గురిజాలలోనున్న కట్టుబోతుల రావించెను. 'వాకట్టు మరకట్టు వణికెడు కట్టు, పొట్ట పొంగెడు కట్టు పొంగుల కట్టు, కూత పెట్టెడు కట్టు కోపించు కట్టు, కాళ్లను చేతులు కదలని కట్టు, ప్రాణంబు వోయెడు బలువైన కట్టు' నేర్చిన దయ్యాల మల్లాయె మున్నగువారు వచ్చి తమతమ విద్యలు నాయకురాలి యెదుట బ్రదర్శించిరి. ఆమె వారిని గొనిపోయి నలగామునితో "రౌతు లేటికి నీకు రాజు లేటికిని, పరివార మేటికి పడవాళ్లు యేల, ఏనుగు లేటికి నేల నాయకులు, వీరు మువ్వురు మన వీటిలో నున్న, నిలనున్న పగవారి నేలంగ జాలుదు"మనెను. కట్టుబోతులు తమతమ విద్యలు మరల ప్రదర్శించిరి. నలగాముడు వారితో చిట్టుమల్లని పోరులో గట్టుడని చెప్పి బహుమతు లిచ్చి పంపెను. జానపదులకు మంత్రతంత్రములం దధికమగు విశ్వాసముండును. ఆ మనస్తత్వ మిట ప్రదర్శితము. నాయురా లింకొక కుట్రనుగూడ బన్నెను. బ్రహ్మనాయుడు గూర్చుండు తమగ "మూడ్పించి క్రొత్తగా నారపు చేయించి, యేవంక నెక్కినో యెక్కిన దెసను, గెంతెడు నట్టుగా కీలు పన్నించి, తప్పుచీలలు పెట్టి తమగంబు క్రింద, పాతర ద్రవ్వించి బలు నారసముల,శూలాల

పెల సురియలు నిలిపి, కలయంగ బాతించి కప్పు బెట్టించె"ను. కొండవసారి డీపోరున కిరుపక్షములవారు వచ్చిచేరిరి. బ్రహ్మన్నకూ స్పందెడు తమగము ంతటు కన్నమదా సెవ్వరిని (కీడు శంకించి) రానీక తానే కాపుంచెను. యకురా లేర్పాటుచేయించిన మంత్రతంత్రములచే బ్రహ్మనాయుని కోడి ఓడిపోయెను. పోరులో నోడినచో పూచెర్ల విడిచెదమని చేసిన ప్రతినకు యు బొడంబడెను. నలగాముడు నాయునికి వీడియ మిచ్చి వీడ్కొల్పెను.

బ్రహ్మన్న బయలుదేరునప్పుడు తమగము కూలి నాయకురాలి కుట్ర యటపడెను. అది చూచి కన్నమనీడు 'గోపు! యానాగమ కుటిలత జూడు' పని గోపు కెరుకపరచెను. బ్రహ్మనాయని నమ్మినబంటగు గోపు నాయకురాలు కోడిపోటులో చేసిన మంత్రతంత్రములకు, అధర్మమునకు, తమగము నేర్పరచిన విధానమునకు కోపించి నాయకురాలిని నలగాముని చెడ దిట్టెను. నాగమ గోపును 'మా పురిలో నొక మాలని బోల'వని తూలనాడినంతనే యాతడు కుంత మందుకొనెను. అటు నలగాముని లెంకలు కూడ సిద్ధపడిరి. గోపు వాబంట్ల నందరిని చంపివేసెను.

'బ్రహ్మనాయని యాజ్ఞ బరచాట వెరచి, నలగాముపై గోపు నడుపడు నాక' లేనిచో నాతనిగూడ గోపు చంపియుండును. నాయకురాలు తన పరివారము నంతటిని గోపుపై పురికొల్పెను. కాని యాతడు 'ప్రళయకాలమునాటి భైరవు భంగి, పురముల గాల్చిన భూతేశు పగది, పసుల బట్టిననాటి పార్థునిరీతి' విక్రమించి "పటుచిత్రగపులతో బవరంబు చేసి" వారినందరిని బరిమార్చెను. విలుమూకవారు "చందపువంకలు చల్ల జంపులును, పొట్టిల పొంగులు పుణ్య తీర్థములు ..., యొక పెకుప్ప నమ్ములు యోకవోకలును, తామర కూనలు తల్లి మెరుగులును,చీకటిమిణుగుర్లుకిగు సుగండెలును,గుండెలు భీతిలుకూత పెట్టులును, కుత్తిక వీపులు కుప్పకోలలును, మొదలైన మంచియమ్ముల దొనలందు" దోపుకొని వచ్చిరి. ఆనా డిన్నితీరుల యమ్ములు వాడుకలో నుండెె కాబోలు, గోపు వీరవిహారము చేయుచుండెను. అతనితో బోరువారు యుద్ధమొనర్చుచు, 'కడుపులో ప్రేవులు కరమున నెత్తి, మొలపిడియమ్ములు మును బెరికికొనుచు, గోపు కొంతముమీద కూలెడువారు, నొక చేయి తెగిపడ్డ నొకచేత సురియ, చాలించి యెదిరించి చచ్చెడివారు, మెడ నిలువ లేకున్న మీసాలు తీడి, యొకచేత

పైబడి చచ్చేడు వారునై యుండిరి. గోపు 'జలరాశి గలచిన శైలంబుబోలె, కల మొనలన్నియు కలగంగ జేసె'ను. ఒక్క గోపు ఇంతమందిని చంపె ననుటచే మన పూర్వులు ఒక్కవీరు నొక్కరే యెదిరించెడువారని తేలుచున్నది. లేనిచో వందలమందిని ఒక్కగోపు చంపెననుట అతిశయోక్తిగా దోచును. ఒక్కొక్క వీరునితో నొక్కొక్కడు తలపడుటచే హైందవయుద్ధధర్మము. పల్నాటి వీరచరిత్రమందేమి కాటమరాజు కథలో నేమి ఈ ధర్మమే పాటింప బడినది. ఒక్కొక్కరినే యనేకుల జంపినవాడే నిజమగు వీరుడుగా పరగణింప బడుచుండెడివాడు. బ్రహ్మనాయుడు కోడిపోరున నోడి మాచెర్ల మార్గము పట్టినపిమ్మట అతని వెనుక నెక్కడనో నడచెడు గోపున కీయుద్ధము సంభవించినది. కొంత యుద్ధమైన తరువాత గాని బ్రహ్మనాయుడు వెనుదిరిగి చూడలేదు. నలగామునుడు గోపుని పరాక్రమమున కాశ్చర్యపడి నాయకురాలితో చెప్పుచుండ నామె యోర్వలేక రోషముతో ఒక్కుమ్మడి తన సేనల గోపుపై పురికొల్పెను. వారందరు కలిసి వచ్చి గోపుపైబడిరి. అప్పుడు 'దారి పాయగ జారి తనువున బడ్డ, జందెంబు బెట్టుగా జారిన పునక, లైపడ్డగతి గోపు అల్లన నొరిగె'. కాని యాతడు 'శిలము బ్రహ్మన్న శ్రీపాదయుగము, కనుగొను వేడ్క లా కనుమూయకుండె'ను. గోపు జంపినవా రుత్సాహముతో "అరుచుచు బహ్మపై నరుగుదేరంగ, అరవం బాలించి ఆ బ్రహ్మనేడు, వెనుక నార్పులు బుట్టె వెగ్గలంబనుచు, అని తలవోయుచు నంతటనుండి"నట్లు చివరన గలదు. ఈ భాగ మింతటితో ముగిసినది. గోపు పడిపోయిన కలకలము విని నాయుడు వెనుదిరిగి చూచెనట.

పైకథాభాగము తరువాత ఘట్టము "కన్నమనేని యుద్ధము"ను పేరుతో నున్నది[1]. కాని ఈకథ పై దాని ననుసరించియే లేదు. మధ్యన మరికొన్నికథ లున్నవి. పైకథలోనున్న చివరభాగము నంటియే యీకథ ఆరంభింప బడినట్లున్నది. అనగా కథాసూత్రముగాని వాక్యసూత్రముగాని తెగిపోలేదు. అందుచేత నిది కూడ మల్లన రచన మనుకొంటిని. కాని కన్నమనేని యుద్ధకథాంతమున ఫలశ్రుతి తరువాత 'వలను భరద్వాజవంశవర్ధనుడు, మారయ్య పుణ్యాభిమాంబ కడుపునను, స్థిరముగా గలిగిన తేజంపు ఘనుడు, గారవంబైనట్టి ఘనుడు శ్రీనాథు, చేపట్టి వీరుల చరిత మంతయును, తగ జెప్పె నాచంద్రతారార్కముగను' అని ముగిసినది. ఇది శ్రీనాథుని వీరచరిత్రమందలి యొక భాగమో లేక మల్లన

1. డి. నెం. 1118 ప్రా. పు. భాండాగారము. మద్రాసు.

రచనమో ఇదమిత్థముగా చెప్పజాలము. నేను మాత్రము మల్లన రచనమనియే భావించుచున్నాను. పై కథకును దీనికిని కథాసూత్రము వాక్యసూత్రము వేరుకుండ నుండుటయేగాక రచనావిధానమున గూడ సామ్యముండుటే నా యూహమునకు కారణము. చివరన నతుకబడిన శ్రీనాథుని పేరు ప్రక్షిప్తమని నాభావము. దీనిలో గోపు పడిపోయిన తరువాత కన్నమనీడు గురజాల సైన్యములను ప్రజలను చిందరవందర గావించి గోపు శవమును దీసికొనివచ్చుట, మాచెర్లలో గోపు శరీరమున కగ్నిసంస్కారము చేయుట మున్నగు కథా విషయము లున్నవి.

"గోపు యుద్ధము" కథలో చివర ఘట్టమున గల బ్రహ్మనాయుని వాక్యముల పేర్కొని యుంటిని. ఆ వాక్యముల తక్కిన భాగముతో నీ కథాభాగ మిట్లారంభమైనది. 'గోపు చిక్కడు కదా గోసంగి కన్న, మటు విచారింపరమా యనినను వాడు' గోపు ఆరె జాగనచే నిహతుడయ్యెనని బహ్మనాయుని కెరిగించి తమ వెన్నంటి వచ్చుచున్న గురిజాల సైనికుల కెదురొడ్డి నిల్చి గోపును జంపిన ఆరె జాగననే చంపవలెననుకొని చంపెను. ఇది చూచి తక్కిన యారె బలములు వచ్చి కన్నమనీనిపై బడెను. ఆరెవారాసాడు తెలుగుదేశమున నున్నట్లును అందులో సైనికులుగా నున్నట్లును ఈ పదమువలన మనము తెలిసికొనగలము. అట్లు పై బడినవారితో కన్నమదాసు 'గోపు జంపిన జూచి కోపించి యారె, చాగని జంపితి జనులెల్ల మెచ్చ, చావుకు సరిచావు చంపిన పనికి, మీకు రాబని లేదు మున్నక పొండ'నెను. ఇది కన్నమనీని యుద్ధ ధర్మము. కాని ఆరెబలములు వినలేదు. ఈపట్టున కన్నమనీని వీరహార మద్భుతముగా వర్ణింపబడినది. 'నలుగుర నేనుర నజ్జుగా గొట్టి, కరములు తునకలుగా జేసి వేసి, భుజములు నేలపై బ్రుంగుడు బరచి, తొడలును మెడలును పునకలు జేసి, జబ్బలు పేగులు చక్కగా గొట్టి' ఆరె యోధుల నందరిని హతమార్చెను. గురిజాలవారు బండ్లు గట్టుకొని పారిపోవుచుండ కన్నమ వారి కడ్డము దిరిగి బండ్లచీల లూడదీసి, ఇరుసులు నరికి బండ్లను గూల్చెను. ఏన్గుబలములవారు పై బడ కన్నమ వారిని 'ఊరక తోటలో నుండక పారి, వంటిల్లు జొచ్చిన వరున కుందేళ్లు, వండి చెండిన భంగి వంచనలేక, చిడిముడి ఖండించి చెక్కలు జెక్కె'ను. 'కొండల మీదికి గుప్పించి దుముకు' సింహమువలె నేన్గులపై దాటి పోయెను. అశ్వికబలముల నణచెను. అందరిని గురిజాల పట్టణములోనికి

దరిమెను. గురజాల ప్రజలు కన్నమ పట్టణమునంతయు నాశనము చేయుననీ భయపడిరి. ఈఘట్టమున చక్కని హాస్యము పోషింపబడినది. భయావహమౌ మనోభావము లతిసహజముగా వర్ణింపబడినవి. 'అదె వచ్చె బ్రహ్మ నేడెక్కడ జొత్తు, మెక్కడ దోదుము ఎక్కడ నిలుతు' మని 'తలచీర లెడలంగ దరలి యాప్రజలు, సుడివడి దిశలకు సొక్కుచు బారి'రి. నాగమ్మ ప్రజల మాటలు విని కన్నమ కోటపై కెత్తివచ్చెనని భావించి సేనాసన్నాహము లొనర్చుచుండెను. గురజాల ప్రజలు కోటలో తలదాచుకొంద మనుకొనిరి. 'యిండ్లలోపలి సొమ్ము లెడలించి తెచ్చి, పనిలంబు గాదని భావింప లేక, పెంట బూడిదలోన పెట్టేటివారు, తమవారి నతిభీతి దలపంగలేక, నొక తెరువువారల నింటికి బిలిచి, కోటలోనికి బోయి గురుతుగా దాచు, మని వారి చేతికి నాయింతు లిచ్చి, యొకకొంత సేపున కొయ్యన దెలిసి, తమవారు గాకున్న తల్లడమంది, వారి గానక పోయి దనరెడువారు'నై యుండిరి. భయావేశమున నజ్ఞానులై తమ సొమ్ము లొకరికిచ్చి తరువాత, వారు తమవారు కారని తెలిసికొనుట సున్నితమైన హాస్యము. ఇంకను ఇట్టి భ్రమప్రమాదసంజనితమగు హాస్యఘట్టము లొండురెండు గలవు. "ఏమి సేయుదమంచు నెంతయు దలకి, పెట్టిన తావున పెకలించి ధనము, బలువుగా మూటలు బంధించి కట్టి, నూతుల లోపల నూకెడువారు, బ్రహ్మనాయుడు వచ్చె బలు విడిదన్న, తత్తరమును బొంది తారుమారాడి, పాతిన సొమ్ములు ప్రాప్తింప లేక, తప్పు ద్రవ్వినయెడల ధనము లేకున్న, నిచ్చటి ధనమెల్ల నెవ్వరో మరగి, కొనిపోయి రనుచును గుందుచు నాది, తెలియక లోగిళ్ళ దిరుగాడువారు' నై యుండిరి. 'ఊబ పాతరలలోనుండెడివారు, పొరుగిండ్లలోనున్న పొణకలు జొచ్చి, యణకువతో నుండి యణగెడువారు, తలపూస పోగులు కవిలె వ్రాయించి, ఊరక నగరిలో నుండెడివారు.' నాగమ్మ మాత్రము యుద్ధ సన్నాహములు కోటలో పెద్దయెత్తున చేయుచుండెను. బ్రహ్మనాయుడు గోపు కొన యూపిరితో పడియున్నచోటికి వచ్చి 'నీవంటి శూరుని నీవంటి హితుని, నెవ్వని నేనెరుగ నింతకాలమున' కని దుఃఖించెను. గోపు బ్రహ్మనాయునితో "నాటిన బాణముల్ నాయుడ పెరికి, పుణ్యలోకమునకు బుచ్చుము నన్ను, మాతల్లి దారమ[1] మహితవిక్రమకు, పగవకుమని చెప్పవలయుజుమ్మనిన" నాయు డటులనే చేసి నారాయణ యనుచు గోపునోట తులసితీర్థము బోసెను.

1. ఈమెనే దారసాని యనియును పేరు.

గోపు "బ్రహ్మరంధ్రంబున ప్రాణముల్ విడిచె"ను.కన్నమదాసు నాయునికడకు తిరిగివచ్చెను. వారు పందెమున చచ్చిన కోడిని మరియు పోరున మడిసిన గోపును అందలముపై నిడుకొని మాచెర్ల చేరబోయిరి. ఏకక పుత్రుని చావువార్త విన్న గోపు తల్లి దుఃఖము శిలలనుగూడ కరగించును. దారసాని 'గోపును జూపరే గుణములకుప్ప, నాముద్దు పాపని నను జేరదేరె, నా సయిదోడైన నా చెలికాని, చూపరో నాకిట చూపరోవేడ్క, వలయ దా నెట్లున్న వాడొకో గోపు, యెక్కడ నున్నవా డెరిగింపుమన్న, నొయ్యెన వోయెద వోయక్క యనుచు, నప్పుడు వెడలెను నడలుచు వనిత, పుణుకుచు వెరచుచు పొరలాడుచుండె". అప్పుడు విజ్జలదేవి[1] శీలసాని[2] మొదలుకొని పట్టణమున నాబాలగోపాలము దారసాని నూరడించి గోపున్న కడకు దోడ్కొనిపోయిరి. దారమ చనిపోయిన కొడుకును చేరి"…. వదనంబు నురము, తెగవ్రేసికొనుచును ధీరతలేక, చేతులు భూమిపై చేరంగ నూది, కూర్చుండి దుఃఖంబు గుదికొనుచుండ, గోపు నాతో బల్కగూడదానీవు, పలుకరా యొకమాట పలుకరా యన్న నను దేరి చూడరా నా ముద్దు కుట్టి, కోడిపుంజుల పోరు గోపన నీకు, గావచ్చెనా యన్న కటకట యనుచు" దుఃఖించెను. అందరు కలిసి గోపున కగ్నిసంస్కారము జేసిరి. అటు తరువాత 'ఈవీర చారిత్ర మెవ్వరేనియును, చదివిన వ్రాసిన సద్భక్తి విన్న, నాయువు శ్రీయును నైశ్వర్యవిజయ, సౌభాగ్యభోగముల్ సంపద గలిగి, చల్లనై యుందురు జగము లోపలను' అను కవివాక్యము గలదు. దీని తరువాత ఇంతకుమున్నే పేర్కొన్న కృతి కర్త (శ్రీనాథుని) గూర్చిన వాక్యములు గలవు. కాని ఈ భాగము ప్రక్షిప్తమైయుండునని తొలుతనే మనవిచేసియుంటిని.

ఈ కథానంతరమున్న విషయములు 'మండాదివలస' 'మందపోటు' మున్నగు భాగముల శ్రీనాథుని రచనములను శ్రీ ఉమాకాంత విద్యాశేఖరులవారు వచనరూపముగా తమ 'పల్నాటివీరుల కథల'లో పేర్కొని యున్నారు.మందపోటు జరిగిన తరువాత 'గురిజాల యుద్ధమను'[3] నొక కథాభాగము కలదు. దీనిలో పూర్వోత్తరములని రెండు విభాగములు కలవు. గురిజాలవారు మందపోటు జరిపిన తరువాత బ్రహ్మనాయుడు వారొనర్చిన యన్యాయమునకు మహాకుపితుడై గురిజాల విరుగబొడిచి వచ్చుట ఇందులోనున్న కథా వృత్తాంతము. ఇదికూడ

1. మలిదేవరాజాదుల తల్లి. ఈమెకే వీరవిద్యాదేవి యనిపేరు.
2. బ్రహ్మనాయుని తల్లి
3. డి. నెం. 1114 ప్రా. పు. భాండాగారము, మద్రాసు.

శ్రీనాథుని రచనము కాదు. ఏలయన శ్రీనాథుని రచనములకు వచనరూప మిచ్చిన శ్రీ ఉమాకాంత విద్యాశేఖరులవారి వ్రాతలబట్టి శ్రీనాథుడిట్టి పట్టును కల్పింపలేదని తెలియుచున్నది శ్రీనాథుని 'మందపోటు' కథలోనే బ్రహ్మనాయుడు పెంపుడు గుర్రాలకు పశువుల దోలుకొనిపోవు వార్త తెలిసి, వాని కడకు దిగి హతమార్చి పశుగణమును మరలించికొని వచ్చినట్లున్నది. అంతియే కాని నాయుడు గుర్రాలమీద కెత్తిపోయినట్లు లేదు. కనుక నిది శ్రీనాథుని రచనము కాదని మన మనుకొనవలయును. అప్రాంతములందు చెప్పుట నేడుండు లేదు కనుక నిదికూడ మల్లన రచనమనియే నా యభిప్రాయము. మధ్యమధ్యన కొంత గ్రంథపాతమైనను ఈ కథాభాగమున నిది యెంతకలదో హాస్యముకూడ నంతియే కలదు. "కిన్నెరసానిని యుద్ధమున" గల హాస్యమే ఇంకను విపులాకృతి దాల్చియున్నది.

ఈ కథాపూర్వభాగ మిట్లారంభమైనది

'కాటుని కిటనోడి కలహంబు కూర్చి, రామచంద్రునిగతి రాజులు దాను మందాడినుండంగ మంద బోడిచినను, నిండిన కోపమున సిటబుర్రుండు' (సింవర్తుడన బ్రహ్మనాయుడు; జరిగిన సమాచారమును నాయుడు తల్లికి మ్రొక్కక, దైవమును గొలువక, కొడుకును జూడక, మజ్జనము దినక, కడు విచారమున 'పలనాటి లెంకను బలుపరాక్రముని తిరులెంక[1] జన్నయని తగ కోపముంచి, గుర్రాల బోయలను నిర్బంధించుకొనెను. మలిదేవరాజాదులు నాయకురాలు మాయావి యనియు గుర్రాలపైకి ఎత్తిపోవుట ప్రమాద మనియు వలదని కన్నమదాసుకూడ వలదని గుర్రాల యమరావతిపై నభేద్య మనెను. కాని నాయుడు సమాధానముగా "ఒక్క యొకడె సాధించి యమృతంబు తేడె" యని గరుడు దమరావతినుండి సుధ తెచ్చిన కథ (కద్రూవినతల కథ సుమారు పది పుటలు) వినిపించెను. బ్రహ్మనాయుడు రాజు సెలవంది పిజ్జలదేవి కడకు బోయెను. ఆమెకూడ తొలుత వలదన్నను తరువాత నంగీకరించెను. మందాడి వలసకై బయలు దేరినప్పుడు బ్రహ్మన్నకు కలిగిన యాపదలకు (పెందోటకడ పులి వచ్చుట, ఏలేశ్వరముకడ కృష్ణను దాటునప్పుడు మొసలి యడ్డగించుట

1. లంకన్న. ఈతనికే వెంకజోదని మరియొకపేరు; మందగాచిన బోయలకు నాయకుడు. మందపోటులో లంకన్న యొకగు ప్రధానఘట్టము.

వంటి విపత్తులు శ్రీ ఉమాకాంతవిద్యాశేఖరులు తమ గ్రంథమున పేర్కొనియే యున్నారు1) మాచెర్ల చెన్ననికి పులిగోరు, కనక పద్మము, పసిడి పిల్లనగ్రోవి, తిరునామము మ్రొక్కుకొంటిననియు నవి చెల్లించి గురిజాలకు దొమ్మరియు నామె నాయని కిచ్చి సాగనంపెను. బ్రహ్మనాయుడు తన తల్లి శీలమ్మ సెల పడిగినప్పు డామె నాయునికి గరపిన నీతి ప్రశంసనీయము. “చొచ్చి పొడువకుమన్న పారిపోరి నీవు, అంతకంతకు డాగి యధములైయున్న, కట్టెమోపుల వారి కల కూలివాండ్రనే” కాక భట్లను బ్రాహ్మణులను జంగములను దాసరులను శిశువులను స్త్రీలను, సైన్యమునకు సంబంధించని వారిని బాధింపకుమని చెప్పి రాత్రివేళనుగాని ఉభయసంధ్యలందుగాని యెత్తిపోగూడదనియు శత్రువునకు తొలుత నెఱుకపఱచి సమయమిచ్చి ఏడుగడియల ప్రొద్దుండగా నెదిరించవలసినదని యాజ్ఞాపించెను. కుమారు నాశీర్వదించునప్పుడు తల్లి యెవరితో నిను బోల్తు నని పేరుపేరున ఇంద్ర, సముద్ర, సూర్య చంద్ర, వాలిసుగ్రీవుల నుదాహరింప బ్రహ్మనాయుడు వారియందున్న లోపములు చూపించి వారితో పోల్పవలదనెను. ఇచ్చట కొంత గ్రంథపాతము జరిగినది. గురిజాల త్రోవలో నాయుడు బ్రహ్మరాక్షస్సుతో వాదించిన ఘట్టమువరకు కథాసూత్రము తెగిపోయినది.

అటుతరువాత ఉత్తరభాగమున బ్రహ్మనాయుడు రక్షస్సును వీడ్కొలిపి గంద్రకోట, అనుగురాజుపల్లె ఆరెముపల్లె కడచి మాచెర్ల జొచ్చెను. జనావాసము లేని మాచెర్ల పాడుబడియుండెను. 'యేపున చిగిరింత యెంతయు పొడుగు, పెరిగి యాపురమంత పెనగొనియుండె... ,కోరాడి తిరిగెడు కొమ్ము పందులును, తేటిపిండులు మంచి లేడి పిల్లలును, మనుబోతు దుప్పులు మంచి కణుజులును, మాచెర్లలో దిరుగాడుచుండెను. బ్రహ్మనాయుడు కొంత విచారపడి చెన్నని గుడిలో జేరి స్వామికి దీపము బెట్టి ఎజ్జలదేవి పంపిన మ్రొక్కుబడులు చెల్లించెను. అడవిమృగములు స్వామి యాలయములో నుండగా జూచిన నాయుడు చేసిన ప్రార్థనము చక్కగా నున్నది. “పొందైన నెమలును బోగము వాళ్లు, వేడుక బొదలగ వెన్నుడ నీకు, అడవుల దిరిగెడునట్టి జంతువులే, కోరితివా యెల్లుగొడ్డుల కొలువు, కోరితివా పులుల్ గొలువ చెన్నుండ' యని స్తోత్రిమొనర్చ వేడ్కొనెను. నాయుడు గుడి వెడలి వచ్చునప్పుడు స్వామి వృద్ధబ్రాహ్మణవేషమున దర్శన మొసంగెను. నాయుడాజ్ఞగొని “కుంతము

1. పల్నాటి వీరుల కథలు, పుట 14.

సవరించి గొబ్బున గదలె”ను. కంభముపాడు, మంచికల్లు, మాడుగుల గాడ్డెలవాగు గడచి రేవంతులబయలు చేరుకొనెను. (ఇచ్చోట పూర్వపు అశ్వికులకు శిక్ష గరపెడువారు గాబోలు) అచట కొ_త్తివీరుడు - కొరతవేయ బడిన ఒకానొక గజదొంగ-కాననయ్యెను. ఇచట కొ_త్తివీరుని పూర్వజీవితపు సాహసచర్యలు మున్నుగునవి విపులముగా వర్ణింపబడినవి. నాయుడు వానికి వైష్ణవము ప్రసాదింప వాడు స్వర్గస్థుడయ్యెను. నాయు డారాత్రియే గురిజాల చేరుకొని కోటచుట్టు తిరిగి అచటి విశేషములు తెలిసికొని రాత్రివేళ కోట విరుగబొడువగూడదను తల్లిమాట దలచుకొని యారాత్రి కోట బయట నున్న ‘కామేశ్వరుని గుడి గ్రక్కున జొచ్చి, గుడి మంటపములోన కుంతంబు నిలిపి, కరములు ముకుళించి కట్టెదుట నిలిచి’ శివస్తోత్రము చేసెను అటుతరువాత “విఘ్ననాయకునకును వీరభద్రునకును” మొదలుగాగల పరివారదేవతలకును మ్రొక్కులు చెల్లించెను. బ్రహ్మనాయుడిట చేసిన శివపూజలు చూడ నాతడు *మతమున వైష్ణవుడయ్యును శివవిరోధి కాడని తెలియుచున్నది.* జాముదాత్రి యున్నదనగా నాగుడి పూజారి తమ్మల కొమ్మన, నాయుడు గురిజాల బొడుచుచున్నట్లు కలగని లేచి భార్యతో “కడు వేగ నాకును గంట బొడుపిమ్ము, వేగ నాయుని దగిలి ప్రేయంగ వలయు”ననెను. ఇచట కూడ కొంత హాస్య మున్నది. కాని తంబళి భార్య వాని వీపు జరచి మరల పరుండజేసెను. వాడామె కౌగిట ‘వలనొప్ప నముకొని వనితరో నీకు, దేవర సొమ్ములు తెచ్చి రేపకడ, భావించి తొడవులు పరగ చేయింతు, దేవర పూజింప తెల్లమి యయ్యె, పోవలె జాగంట బోనకావడియు’తెమ్మనెను. ఆమె వలదని వారింప తంబళి తనభార్యను మోది నాయు నెదురింతునని పోయెను. పురజనులను నాయుడు వచ్చెనని మేల్కొల్పెను. వారు తంబళిని వెక్కిరించి వెడల గొట్టిరి. చేయునది లేక తంబళి శివమందిరము చేరుకొనెను. అచట రాత్రి శివునకు పూజలు గావించి బ్రహ్మనాయు డుంచిన నాల్గు బంగారు మాడలు చూచెను. తంబళి వాని గొని “ఇటువలె పూజింప ఈభూమిలోన, పాటించి పూజింప ప్రమథులో గాక, కన్నడ బ్రహ్మయ్య గాక చోడండో, కన్నప్పరాయుడో కరికాలచోడో, సృష్టిలో వెలసిన చిరితొండ నంబొ, ఘనుడు *శీలము బ్రహ్మ* గాక కనకంబు, అభిషేకమొనరించి యరిగెడు వారు, ఈభూమిలో లేరు ఈ పురి లే”రని బ్రహ్మనాయుని పూర్వశైవభక్తులతో బోల్చి మెచ్చుకొనెను. గుడిలోనే ఒక ప్రక్కన పడుకొనియున్న బ్రహ్మనాయు

క్షీవియంతయు జూచుచుండెను. ఇచ్చోట తంబళికిని నాయునికిని జరిగిన వాదము, తంబళి విపరీతచర్యలు మున్నగునవి హాస్యరసపూరితముగా విపులముగా వర్ణింప బడినవి. బ్రహ్మనాయుడు తన రాక నలగామున కెరిగింపుమని యంగుళీయక మిచ్చి పంపెను. నలగాముడు నాయురాలితో 'పన్నించు కోటపై పడగలు వేగ, గవనికి సూర్వర కదనవిక్రముల, వశిగొయ్యీవడిశల వాలుదొంకెనలు, గణికెలు మాలాలు గాలదుంచుభులు, మకరబిజ్జెలులును మంచి కత్తులును' మొదలగు కట్టుదిట్టములు చేయించుమనెను. నాయకురాలు చతురంగబలములు సిద్ధమొనర్చెను. నాయుని వీరవిహార మత్యద్భుతముగా వర్ణింప బడినది. బలము లన్నింటిని బ్రహ్మనాయుడు చీకాకుపరచెను. వీరుల నందరిని హతమార్చి 'పుటమెగసి నాయుండు భూమి పగులంగ, పటుగతి కోటపై పక్షివలె నురికె'ను. కోట యందున్న సైన్యములు కొంతసేపు పోరాడి చిందర వందర య్యెను. నలగాముడు నాయకురాలు కోట విడిచి కొదమగుండ్లకు పారిపోయిరి. నలగాముడు మరియు నరసింగుడు మున్నగువారి భార్యలు వచ్చి బ్రహ్మనాయుని ప్రార్థించిరి. నాయుడు వారికిని వారి భర్తలకును అభయ మొసంగెను. నలగాముడు నాయకురాలు కొదమగుండ్ల విప్రుల శరణువేడి నాయుని వారినుండి కాపాడుమనిరి. నాయుని శాంతుజేయ బ్రాహ్మణులు బయలుదేరి వచ్చిరి. బ్రహ్మనాయుడు బ్రాహ్మణుల మాట కెదురాడడని దీని భావము. బ్రాహ్మణవచనానుసారము నాయుడు నలగాముని నాయకురాలిని వదలిపెట్టిన ట్లిచోట్ననే కాక మరియొక కథలో గూడ కలదు. నాయుడు బ్రాహ్మణుల సెలవంది ఇనుగంటి గంగ (స్థానిక దేవత) నొరబరచి నలగాముని కభయపట్టము గట్టి బయలుదేరి గ్రామములు గడచి మరల ఏలేశ్వరము చేరుకొనెను. అచట కృష్ణ దాట జూచుచుండ వెనుకనుండి పంతాల పలినేడు వచ్చి నాయు నెదుర్కొనెను. గురిజాలపై నాయు డెత్తిపోయినపు డీవీరు డచట లేకుండెను. గురిజాల బొడిచెనని తెలిసి గ్రామాంతరమున నున్న వీరుడు నాయుని పైకెత్తి వచ్చి 'సింహము లేనిచో చిరునక్క తాను, చట్టుపై గంతులు సరి వేసినట్లు' చేసితివని వెక్కిరించెను. ఇరువురికి కొంతసేపు యుద్ధమయ్యెను. బ్రహ్మనాయుడు పంతాలపలినేని నరికి గంగ కర్పించెను. అచటనున్నది నిడుగంటి గంగయట. గురిజాలపై నెత్తిపోవునపుడు నాయు డామెకు మ్రొక్కుకొని యుండెను. నాయు డవియన్నియు చెల్లించెను. కాని

గంగ యింకను 'ఒక ముక్కు కడవాయెనో బ్రహ్మ'యనిన' నాయుడు కోపించి 'నీ ముక్కు గూడకోసి నిడుగంటి గంగ' యని కరవాల మెత్తెను. గంగ గజగజవణకి 'బొంకితి నేనయ్య బొంకవు నీ'వని ప్రార్థించెను. నాయుడు మరల గంగను ప్రార్థించెను. నాయుడు దేవతలకుకూడ సత్యధర్మముల యెడ భయపడువాడు గాడని జానపదుల నమ్మకము. ఈకథ యింతటనే యాగి పోయినది. తరువాత కొంత గ్రంథపాతము జరిగినది. పాతమైన చోట నాయుడు కృష్ణ దాటి మరల మంచాది చేరుకొన్న కథాభాగముండి యుండును.

'గురిజాల యుద్ధము' తరువాత కథాక్రమము ననుసరించి '*అలరాచమల్లు గారి గురిజాల రాయబారము*'[1] కలదు. అలరాచమల్లు అనగా అలరాజు. ఈ కథయే "అలరాజు రాయబారము" పేరుతో పల్నాటివీరుల కథలందు గలదు. మందపోటు జరిగిన తరువాత మండాదివలన విడిచి బ్రహ్మనాయుడు మలిదేవ రాజాదులతో కరణాలు కాపులు గదలిరా మేడపికి బోయెను. మేడపిలో నొకనాడు బ్రహ్మనాయుడు సభకు వచ్చి "అన్న కామునితోడ నాడిన మితియు, నేడేండ్లు గడచియు నేడు నెలలయ్యె' నని మలిదేవరాజాదులతో గురిజాలకు రాయబార మంప సంప్రతించెను. సభలోనున్న వీరులందరును సరియనిరి. రాయబారిగా నెవరిని పంపవలెనని ఆలోచించిరి. ఎవరిని బంపినను వియ్యమునకు మారుగా కయ్యమే సంభవించునని బ్రహ్మనాయుడు 'అల్లుమల్లన బంచు టది బుద్ధి మనకు, ఈ వీటి కల్లుడు ఈమాట లేల, నావీటి కల్లుడు అనుమాన మేల' యని తేల్చి చెప్పెను. అలరాజు కొమ్మరాజు తనయుడని ఇదివరకే తెలిసికొని యుంటిమి. బ్రహ్మనాయుడు కొమ్మరాజుతో 'వినవయ్య కొమరగిరి వీరశేఖరుడ, సోమవంశమునందు శోభిల్లు రాజ, సూర్యవంశమునందు సురరాజు మెచ్చ ముక్కంటి నిను జూచి మోదంబుతోడ, జంగమై నిత్యంబు సరిబంతి కొచ్చు" నని పొగడి కుమారుని రాయబారమున కంపుమనెను. బ్రహ్మనాయుడు మరియు నాతని సేనలో నున్న కొందరు దక్క తక్కినవారందరును శైవులే. మలిదేవ రాజాదులు, కొమ్మరాజు, సేనలోనున్న కొందరు ప్రముఖవీరులును శైవులే. బ్రహ్మనాయుడుగూడ శైవద్వేషి కాడు. శివపూజ చేసినట్లు పదములో పెక్కుచోట్ల కాననగును. (పల్నాటియుద్ధకారణములందు, శైవవైష్ణవద్వేష మొకటియని మనపండితులందురు. అట్లనుట కాధారము లేమికలవో; పదములందు మాత్రము బ్రహ్మనాయు డెచ్చటను శివద్వేషి యన్నట్లు లేదు.) కొమ్మరాజు నాయునితో రాయబారమునకు భట్లు బ్రాహ్మణులు పోయెదరు గాని "నాకుమారుని

1. డి. నెం. 1113 ప్రా. పు. భాండాగారము, మద్రాసు.

బంప న్యాయమా నీక"ని యడిగెను. నాయు డలరాజున కేమి ప్రమాదము వాటిల్లదనియు అలరాజునకు మారుగా తన కుమారు నిత్తుననియు 'నీకు యిల్లెడ యుక్తి నిజముగా నమ్ము. ఎముక డాయని చెప్పి ఆరాజు కిచ్చెను. కొమ్మ రాజులు అంగీకరించెను. కాని తల్లి గూడ ఒప్పుకొనుమని చెప్పెను. బ్రహ్మ నాయుడు వల్లమదేవి (కొమ్మరాజు భార్య - అలరాజు తల్లి) నగరు కేగెను. వల్లమదేవి నాయుని గౌరవించి 'ఎన్నడు మానగ- కేతెంచు పెరుగ, వచ్చితి మా భాగ్యవశమున మీరు,లేమి యానతి యిత్తు సెలవింపు'డన్న నాయుడు రాయబారము గూర్చి చెప్పెను. ఆ మాట వినగనే వల్లమ పిడుగడచినట్లు మూర్ఛిల్లి, కొంత సేపటికి తేరుకొని పుత్రశోకమున 'ముత్యపుకన్నీరు ముక్కున జార' బ్రహ్మన్నతో "తరుణి మాయత్తకు తనయు లేగురు. యేగురి కొక్కడే మేలిమి నాసుతుడు, మీరె కివచ్చిన మిగుల బెరుకాము[1] నమ్మివచ్చినవార నడపవలెగాక, మహిలోన గూల్చేటి మహిపతుల్ గలరె, యల సుతు నొక్కని యమునికి నిచ్చి, ఏ దేశమునకైన నేగెదమయ్య, నాకుమారుని బంప న్యాయమే నీక'ని దుఃఖించెను.నాయు డామెకు ధైర్య వచనములు జెప్పి తన కుమారు నిత్తుననియు 'ఇంటింట నేగురు మేలిమి నీ సుతుకు, నిత్తము శిరముల నిందరు నెరగ'నని యూరడించెను. వల్లమ చివరకు కొడుకును రాయబారమునకు పంపుట కంగీకరించెను. అలరాజు 'సాటి శత్రులకెల్ల సమరంబునందు, గుండె దిగ్గను బెదురు పెంపెంబు బెట్టి, తాత వీరసోము తన కిచ్చినట్టి, మణుల కిరీటంబు మరి ధరియించి' తల్లి యాజ్ఞ గొని బయలుదేరెను. నాయు డాతనికి చెప్పవలసినది చెప్పి కన్నమనీని తోడిచ్చి సపరివారముగా పంపించెను. అలరాజా దంతయు ప్రయాణము సాగించి త్రిపురవరము (త్రిపురాంతకము కాబోలు), మటుకుల, మజ్జివేముల, కంబాల కనుమ, చంద్రవంక, కంభముపాడు, గోలేరు, రెంటాల, కడచి తెల్లవారి గురిజాల చేరుకొనెను. తొలుత నలగామునిసభకు భట్టు నంపి తరువాత తాను పురము ప్రవేశించి, *గడియారప్పు*[2] *మొగసాల* కడకు నేతెంచి, పల్లకీ దిగి రాజు పావాలు దొడిగి' నలగాముని సభాప్రవేశ మొనర్చెను.

1. బెరికి యనగా న్యూనత, తెలంగాణమున నిది వాడుకలో నున్నది. భేదమని కూడ అర్థము గలదు.
2. ఆనాటి గడియారములు వల్లభరాయుడు క్రీడాభిరామమున పేర్కొన్నటు వంటివై యుండును.

నలగామునికి కట్నములు సమర్పించి కుశలప్రశ్నమైన తరువాత నలగాము నాజ్ఞచొప్పున వచ్చినవనికి పూనుకొని 'ఏడేండ్లు మితి దప్పె యెరుగవే రాజ, యేడు నెలలు మీకు నెక్కువ యయ్యె, మాభూమి మాకిమ్మ మైలమసుతుఁడ' యనెను. నలగాము డందుల కంగీకరింపడయ్యెను. ఎవరి బలముల వారు దలచుకొనిరి. అలరాజు సభనుండి లేచి యర్థులకు కట్నము లిచ్చి 'సూర్య ఖేతాళమను సుఱియ ఝళిపించి, మొగసాల ముందర ముదముతో నున్న, ఉక్కుకంబము నఱికె నుగ్రకోపమున.' మఱియును నలగాము నుద్దేశించి 'కార్యమపూడి యాకలని మధ్యమున, కయ్య మిచ్చెద'మని పోరుగైకొని విడిదికి బోయెను. ఆనాడు రాత్రి గుడారాలయందే గడపెను. నాగమ్మ అలరాజుకు విషాక్త భోజన మంపెను. అలరాజది తినక పారవేయించి తెల్లవారగనే కన్నమతో సపరివారముగా బయలుదేరెను. నాగమ్మ పూవులందు విషముంచి తమ్మళ్ళకిచ్చి అలరాజునకు మధ్యేమార్గమున నెదురై కాన్కపెట్టిరండని యాజ్ఞాపించెను. అలరాజు తన పరివారముతో చెర్లగుడిపాడు సమీపమునకు బోయెను. అచ్చోట 'అంతట తమ్మళ్లు అతివేగ రాక, నెగువ గాలికి రాజు కెదురుగా వచ్చి, కవగూడి కస్తూరి గంధవాసనలు, పరిమళంబుల గాలి పట్టె నారాజు, రమ్మని పిలిపించి రాజడిగె వార్ని.' మోసకారులైన తంబళ్లు 'పూల పచ్చడమును పువ్వు బంతులును' అలరాజు కిచ్చి బహుమతు లందుకొనిపోయిరి. ఆ వస్తువుల పల్లకిపై నుంచుకొని యలరాజు బయలుదేరెను. ఇట్లు నడచుచు అలరాజు "విరజాజి సంపెంగ విరుల జాజులును, అన్నిటి నడుమను అధికవాసనలు కేరుచు సుమబంతి కేలను బట్టి, మూర్కొనె మది ప్రేమ ముప్పిరిగొనగ, నెరయ లలాటంబు నెరి వెంట్రు కలను, ననవిషంబటు ముక్కు కనామున కెక్కెను. అలరాజు కళ దప్పెను. కన్నమదాను మరియు పరివారమువారును మోసము జరిగినదని గ్రహించిరి. దుఃఖించి దైవమును దూరిరి. అలరాజు 'తను జేర కన్నమ దగ్గర బిలిచి, తన బిరుదు లన్నియు ధరమీద బెట్టి, యీ బిరుదు లన్నియు నిలమీద నేడు, నాకు చెలికాడును నమ్మినవాడు, నాతోడునీడతడు నాయుని సుతుడు, బలువైన బిరుదులు బాలున కిమ్ము, ఎనయంగ వీరులు నిందరు నెరుగ, నవరాలగోడిగను[1] నయ్యన నిమ్ము, బాలుని మామేలు పాలించుమను'మని చెప్పి, 'రాచదేవిడి కడకు రయమున నీవు, విన్నపము సేయుము వేగమే పోయి' యనెను. కన్నమ

1. అలరాజు గుఱ్ఱము.

వెనుదిరిగి భూమి దద్దరిల్ల గురిజాలవరకు పరుపువెట్టి యంతఃపురము జొచ్చి అందఱు వినుచుండగా అలరాజు చావు నెరిగించెను. ఇచ్చట కొంత గ్రంథపాత మైనది. నలగాముని కూతురు, అలరాజు భార్య, రత్నాల పేరమ్మ భర్తృమరణ వార్త విని 'నాతండ్రి నలగామ నరసింగరాజ, వోడక పాపంబు నొడిగట్టుకొంటి, నాపతి జంపుట న్యాయమే నీకు' అని నిందించి 'నిండిన కొలువున నీరాటి కడవ, తగ గుభుల్లున వేసి తప్పక నవ్వి, ప్రజలెల్ల వినగను పడతి శపించె'. 'నీ రాజ్య మొకతెరువు నీవొక తెరవు' అని శపించి 'దాపల వలుపల తయిఱులు గొలువ, గోసంగికన్నమ కొమరొప్ప నడువ, చైరగుడిపాటికి చేరంగ వచ్చె'ను. అల రాజప్పటి కింకను మరణించలేదు. కాని స్మృతి తప్పియుండెను. రత్నాల పేరమ్మ భర్తశరీరము సమీపించి మ్రొక్కి విలపించి నాగమ్మను దూరి "నీవంటిరాజుకు నీమంబుతోడ, మందులబంతిచే మదయంగ గలిగె, పుష్పావలె నొరిగితో భూపాలతిలక, నాయుదేమని పంపె నరనాథ నిన్ను'ని విలపించినది. "పసిడి నీరు చెంబు పత్తిరి దెచ్చి, కుతికెలో బడవేసి గోరెదుపత్రి శివశివ యనుచును శివుని దలచుచును, అభవుని పుఱకేగె నల్లుమల్లన్న.' పేరమ్మ భర్తశవమును పూలబంతులను పాలికిలో నుంచి తాను గుఱ్ఱమెక్కి కదలెను. అప్పటికే ప్రొద్దు గ్రుంకెను. ఐనను నారాత్రియే దివిటీల వెలుగున పయనము సాగించి మిరియాల, కంబాలకనుమ, మఱ్ఱివేముల, ముటుకుల గడచిరి. తెల్లవారెను. కన్నమను బిలిచి పేరమ్మ "మనమేలు వార్తలు మల్లిదేవునకు, మా మామగారికి మరి వీరులకును, ఏపుమై మన రాక నెరిగింపుమయ్య'యనెను. కన్నమదాసు మేడపికి ముందుగా బోయి యీ విషాదవార్త నెరిగించెను. మేడపి యంతయు దుఃఖసముద్రమున మునిగి పోయెను. అందరును కదలి శవమున కెదురుగా బోయిరి. చల్లమాదేవి దుఃఖము కరుణాపూరితము. 'కొడుకును జూపరే గుణముల కుప్ప, నా ముద్దు పాపని నను జేరదేరె.... కన్నులు గలిగిన కారణ మిదియ, వలయు దానెట్లున్నవాడొకో రాజు, యెక్కడ నున్నవా డెరిగింపరమ్మ ... తనయుని మోముపై తన మోము మోపి, విధి నిన్ను భూమిలో వెదకెనో యన్న'యని విలపించెను. అందరామె నూరడించిరి. రత్నాల పేరమ్మ సహగమనము చేయ పూజించుటకు జంగముల బిలిపించెను. మిండజంగములు, కొమర జంగములు, కోడె జంగములు వచ్చిరి. ఆమె వారిని పూజించి శివుని ధ్యానించి సహగమనము చేసెను. మేడపిలో కొలువు కూటమున బాలుని

బిలిపించి మలిదేవరాజు, అలరాజు బిరుదము లాతని కొసంగెను. బాలు డవిగొని 'అలరాజు పగ దీర్పు అది నాకు భార'మనెను. 'ఇత్తుము శిరసులు ఇందరము మేమ'ని వీరు లనిరి. ప్రతిజ్ఞలు గొనిరి. బ్రహ్మనాయుడు కుమారుని ప్రతిజ్ఞ కలరెను. నలగామునితో యుద్ధము తప్పదనుకొనిరి. బ్రహ్మనాయుడు బిరుదు రాజునకు (మలిదేవరాజు కుమారుడు) రాచపట్టమును, బాలచంద్రునకు ప్రధాని పట్టమును, అనపోతునకు కరణికమును, చౌయుట్టికి సేనాధిపత్యమును, మాదచికి రాణిపట్టమును గట్టి తన సేనాశిబిర మెత్తించెను. తక్కిన రాజులు వీరులుగూడ తమతమ శిబిరము లెత్తిరి. 'అంతట బాలుడు అతిసంతసమున' నుండెను. ఈకథ ఇంతటితో ముగిసినది. ఆద్యంతములందు కవినిగూర్చి ఏమియును లేదు. ఇదికూడ మల్లన రచనమై యుండును.

పైకథ తరువాత 'కల్లుప్రతిష్ఠ'[1] గలదు. ఇది శ్రీనాథుని పేరున గలదు. కొలది మార్పులతో నీకథ నంతయు శ్రీ ఉమాకాంత విద్యాశేఖరులవారు ప్రకటించిరి. వారు ప్రకటించిన 'బాలచంద్రుని యుద్ధము' కథలో 37 పుటల వరకు గల కథయే 'కల్లు ప్రతిష్ఠ'గా జెప్పబడినది. త్రిపురాంతకమునుండి భూతరాత్త్స్తంభమును దరలించుకొనిపోయి కారెంపూడి కదనరంగమున నాటిన కథయే 'కల్లు ప్రతిష్ఠ'. పల్నాటివీరుల కథలందలి మొట్టమొదటి కథలోనే దీనిని గూర్చి వ్రాసితిని. కనుక మరల వ్రాయ నవసరముండదు.

'కల్లు ప్రతిష్ఠ' తరువాత "బాలుని యుద్ధము-పూర్వభాగము'[2] కథ గలదు. ఇది కూడ ముద్రింపబడిన 'బాలచంద్రు యుద్ధ'మందలి యొక భాగమే. ముద్రితగ్రంథమున 77 పుటలవరకున్న కథాభాగ మిందులో గలదు.

'బాలుని యుద్ధము-ఉత్తరభాగము - మరణము'[3] కథలో తొలుత కొంత క్రొత్త కథ యున్నది. దీనిలో లింగప్రతిష్ఠ మున్నగు విషయము లధికముగా గలవు. దీని యారంభ మిట్లయినది. 'శ్రీ వీరప్రమథులు శ్రీ కలనిలోన, వీరపురుషుల మహిమ విన్నవించెదను ....ప్రాకటంబైనట్టి పలనాటి వీర్ల, ఈకథ వృత్తాంత మిది యెట్టిదనిన'. ఇది కవివాక్యము. కారెంపూడి యుద్ధ

1. డి. నెం. 1115 ప్రా. పు. భాండాగారము, మద్రాసు.
2. డి. నెం. 1116 ప్రా. పు. భాండాగారము, మద్రాసు.
3. డి. నెం. 1117 ప్రా. పు. భాండాగారము, మద్రాసు.

రంగమున నున్న మలిదేవరాజాదులు హరిహాసరిముదనుక యుద్ధము చేయక వేచియుండిరి. నాయు దేశాదళీవ్రత మాచ-ంచుకొని తెల్లవారి గంగధార మడుగున అలుకుపూతలు గావించి చెన్నుని గొల్చెను. మలిదేవరాజాది వీసలతో నాయుడు 'భూమిలోపల వెలసి పూజ బడయుద'మని తమతమ పేర లింగములు ప్రతిష్ఠింప నిశ్చయించెను.నాయుడు గంగధార మడుగున మునిగి లింగముల దెచ్చి'ప్రణుతి కెక్కిన గోగు భైరవుపేర,వడిగల యనుగుభూవల్లభుపేర, వీరసోముని పేర విక్రమునిపేర, తోరంపు మై దొడ్డనాయునిపేర, వాసికెక్కిన బ్రహ్మరాక్షసిపేర కోడిపోరున జెల్లిన గోపనపేర, మందలో జెల్లిన మగవీర్లపేర' అలరాచమల్లు మున్నగు వారి పేరుల లింగప్రతిష్ఠ యొనర్చెను. ఇటులే తక్కిన వీరులందరును వారివారి యిష్టుల పేసలతో తమపేరులతో లింగములు నిలిపిరి. ఈలింగప్రతిష్ఠ సుమారు పది పుటలు వర్ణింపబడినది. కొమ్మరాజు బ్రహ్మనాయునితో 'గంగధార మడుగున లింగాల బట్టి, పలికింతునంటివి వరమపుణ్యుడవు. చెలువార నామాట చెల్లించు నాక'ని యడిగెను. బ్రహ్మనాయుడు కొమ్మరాజు తండ్రి వీరసోముని పేరిటి లింగమును పలికించెను. (ఇట్టి ఘట్టమొకటి కాటమరాజు కథలోగూడ కలదు. ఇట్టి కల్పనములు బ్రహ్మనాయనికిని కాటమరాజునకును మాహాత్మ్య మాపాదించునట్టివి) 'ఆరాత్రి నిద్రించి ఆవీరవరులు, అలవేగ మరునాడు ఆది వారమున, చాప ప్రసాదములు నవరించు మనిరి.' వారిలో కొందరు 'కూర్చుండి మనబంతి కుడువనివార్న, రయమున కలనికి రానియ్యవల'దనిరి. కాని ఆణెమువారు మాత్రము (మహాదేవుడు మున్నగువారు) 'శూద్రాన్నమును మాకు చూడంగ రాదు, అంట ముట్టగరాని అధికు లున్నారు, వీరపుంగవులెల్ల వినగ బలికెదను, శంఖతీర్థము మాకు చలి శరీరముకు?'[1] కేవలము కన్నులతోడనే భోజనము చేతుమనిరి. నాయుడు 'కనుగొన్న మాత్రాన కడుపెట్లు నిండు'నని యడుగ మహదేవుడు మీరు దిన్నతరువాత ఆయన్నమునే మా యుదరముల జూపింతుమని పంతము పలికెను. నాయు డందుల కంగీకరించెను. ఆణెమువారు దక్క తక్కిన వీరులందరు చాపకూడు దినిరి. మహదేవుడును అతని తమ్ములును వీరశైవవేషమున వచ్చి యందరి యెదుట శివుని ధ్యానించి కత్తులతో తమతమ పొట్టలు చించి చూపించిరి. 'చాప లోపలనున్న సకలవస్తువులు, ఆత్మలోపలనుండి అటు పోగుపడియె'ను. నాయుడు మరియు తదితరవీరులా

1. చాలు శరీరముకు కాబోలు.

శివభక్తుల మాహాత్మ్యమున కాశ్చర్యపడిరి. బ్రహ్మనాయుడు 'తులశీ తీర్థము తన దోయిట జల్లి, పరగ తిరుమంత్రంబు పఠనంబు జేసి' వారి పొట్టలు మరల నతికించెను. ఈ చాపకూటి వృత్తాంతము శైవవైష్ణవద్వేషమును సూచించు ననుటకన్న రెండింటి సౌహార్దమును సౌమనస్యమునే చాటుచున్న దనవలెను. ఆనాటిరాత్రి వీరులందరును జాగరణ మొనర్చిరి.

ఇది ఇట్లుండ నచట నాగమ్మ సైన్యముల సిద్ధపరచుకొని గురజాలనుండి వచ్చుచుండెను. ఇటు బ్రహ్మనాయుడు తదితరవీరులందరును యుద్ధమునకు దిగదలచినవారుండి మలిదేవరాజాదులను, భట్లను, బ్రాహ్మణులను, కోమట్లను, కొంతసైన్యము తోడుగా నిచ్చి మేడపికి పంపివేసిరి. నాగమ్మకిది తెలిసి కొంత సైన్యమును మలిదేవాదుల నడ్డగింప బంపెను. పెమ్మినేడనువాడు సేనతో వచ్చి మేళ్ళవాగుకడ మలిదేవరాజాదులకై కాచుకొనియుండెను. రెండుసేనలకు కలపటమయ్యెను. మలిదేవాదులతోపాటు వారికి కుడిభుజముగా నున్న ఋట్టి బోయడు విక్రమము నెరప గురిజాల సైన్యమును హతమార్చి మేడపి చేరుకొనిరి. గురిజాల సేనలకు ప్రతిగా మాచెర్లవారు తమసేనలు 'పంద్రెండు మొనలుగా పరువడి జేర్చి'యుండిరి. ఇంతవరకున్న కథాభాగమంతయు ముద్రిత గ్రంథమున లేనిదే. దీనితరువాత బాలచంద్రుడు యుద్ధసన్నద్ధు డగుటనుండి ముద్రితగ్రంథమున (పుట 101) గలదు. అచ్చు పుస్తకములో బాలుడు తన పూర్వజన్మవృత్తాంతమును చెప్పుకొనుట (అతిశయోక్తులతో) ఉచితముగా లేదు. కాని దీనిలో బాలుడు తన వృత్తాంతము గాక పూర్వులగు బాలురకథలు (ప్రహ్లాదాదులవి) వర్ణించి చెప్పుట ఔచితీవంతముగా నున్నది. అచ్చుపుస్తకమున పుటలు 78-101 వరకు గలభాగ మిందులో లేదు, ఇందులోనున్న పై విశేషము లచ్చుపుస్తకమున లేవు. తక్కిన భాగమంతయు నొకటే. కనుక శ్రీనాథుని రచనములో నీవిశేషభాగము ప్రక్షిప్తముగా చేరిపోయినదని భావింపవలయును.

పలనాటి వీరుల చరిత్రమునకు సంబంధించిన కథలందు 'కొమ్మరాజు యుద్ధ'మొకటి[1]. ఈకథ 'శ్రీరమావతి దాశ్రితవత్సలుండు. వారిజనేత్రుండు వనజగాత్రుండు, సౌందర్యవరమూర్తి శాశ్వతకీర్తి, కందర్పజనకుండు కనకాంబరుండు'అని యారంభమైనది. శ్రీఉమాకాంత విద్యాశేఖరులు ప్రకటించిన

1. డి. నెం. 1119. ప్రా.పు. భాండాగారము, మద్రాసు.

'బాలచంద్ర యుద్ధము'లో మొదటి రెండుపుటల పీఠిక (కొన్ని చరణములు ముందుంచ వలసినవి తరువాత, తరువాత నుండవలసినవి ముందు) అటులే నడచినది. 'భూమిలో శ్రీనాథు ప్రఖ్యాతిలో యనగ, పలనాటి వీరుల భాగవతంబు, తెనుగున ద్విపదగా తెలియంగ జెప్పె, వినుపింతునే జగద్విఖ్యాతిగాను' అని యుంటచే మల్లన శ్రీనాథుని రచనమును బాగుగా జూచెనని భావింపనగును. కనుకనే శ్రీ ఉమాకాంతపండితులు మల్లన శ్రీనాథుని బాగుగా ననుకరించె ననిరి.

దీనిలో మొదట యుద్ధరంగమున స్తంభమెత్తుట, బాలుని వ్రుతి, పెద్దన్న చావు మున్నగు వృత్తాంతములు క్లుప్తముగా చెప్పబడినవి. పెద్దన్న[1] కూలిన వెంటనే 'అది జూచి కొమ్మరా జధికరోషమున, తన మది కోపించి తమకంబు మించి' ఏనుగు నెక్కి గుణధ్వని జేయుచు, తాను యుద్ధ రంగమునకు దరలెను. అది గని సుంకరితో నెత్తము లాడుచున్న బ్రహ్మ నాయుడు నవ్వెను. (యుద్ధారంభమునుండి బ్రహ్మనాయుడు తన మరది సుంకరితో పాచిక లాడుచుండినట్లు ఇతర కథలలో గూడ వర్ణింప బడినది. యుద్ధములందు పూర్వమీ పాచికలాట సాధారణమని తోచుచున్నది. కాటమరాజు కూడ పద్మరాఘవునితో పాచికలాడును.) ఏల నవ్వితివని సుంకరి యడుగ, బ్రహ్మనాయుడు 'కొమ్మరా డిప్పుడు కోపాగ్నితోను, గమకించి సంగరాంగణమున కేగి, యొప్పార జేసేటి యుద్ధకర్మంబు, చాలించి సర్వము జాలించినట్లు, మన వేలమున కిప్డు మరలి రాగల'డనెను. కొమ్మరాజు వడిగ నేగి సేనలో జొచ్చెనే కాని 'అంధకారము గప్పె నారాజు నపుడు'. అతని కేమియు గనరాదయ్యెను. కొమ్మరా జాశ్చర్యపడి తిరిగివచ్చి బ్రహ్మనాయునితో తాను గాంచినదంతయు చెప్పెను. అప్పుడు నాయుడు 'తన విష్ణుమాయ యా ధరణీపాలునకు, తెలుపంగవలెనని దిగ్గునలేచి' శంఖతీర్థమున కొమ్మరాజు కన్నుల దుడిచెను. అప్పుడాతని నావరించిన యంధకారము వొలగెను. నాయుడు 'పంచ చతుర్భుజములు శంఖచక్రములు, గరుడవాహనమును కాంచనాంబరము'తో విష్ణువువలె దోచెను కొమ్మరా జాతని స్తోత్రమొనర్చి 'సరగున నీ చెంత సెలవు గైకొనక, వేగిరంబున నడచి వెర్రినై పోతి, నీ సెలవు నాకిచ్చి నీకృప యుంచి' పంపుమని ప్రార్థించెను. (బ్రహ్మనాయుని సెలవుగొనక పోయినందున

1. ఈతడు బ్రహ్మనాయుని యగ్రజుడు.

కొమ్మరాజు నంధకారము చుట్టినదని చెప్పుట (బ్రహ్మనాయుని మాహాత్మ్యమును దెలుపుచున్నది) నాయుడు కొమ్మరాజుతో రాజులకు సెలవీయ నే నెంతవాడనన కొమ్మరాజు 'నీవు స్వతంత్రుడవు నీవు దేవుడవు, గట్టిగా సెలవియ్య కర్తవందరికి, నని కృతత్రేతాయుగములం దాతదెత్తిన యవతారముల బేర్కొని కృష్ణావతారమందలి ప్రమథుల కథయు, కామవల్లి కథయు జెప్పి, ఈయవతారమున రేచెర్ల గోత్రమున పొత్తనాయునికి శీలమకు జన్మించి, 'నిలిచితి వటుగాన నీ మూర్తి వలన, పలనాటి వీరుల భాగవతంబు, ఆచంద్రతారార్కమై యుంద వలయు'నని పొగడి సెలవిమ్మని ప్రార్థించెను. నాయు డప్పుడు కొమ్మరాజునకు మంత్ర ముపదేశించెను. కొమ్మరాజు వంశమువారికి, తోడుగా నుండెడు నొక శక్తి గలదట దానిని డించి సమరమునకు బొమ్మని నాయుడనుమతి నిచ్చెను. 'సొంపార వజ్రాంగి జోడుగా నున్న, హంకాళ దేవత నందంద భువికి, దింపించుమో రాజ ధీరాగ్రగణ్య' యనెను. ఆశక్తి యటులే యున్నచో, కొమ్మరాజు నేటను ఎదుర్కొనజాలరట. కొమ్మరాజు నాయుని యాజ్ఞ పాలించెను. హంకాళశక్తి నాయునితో "మావారు కల్యాణమందున నుండి, ఘనరాజ్యసంపదల్ కడకు బోద్రోచి, పొలుపొంద నీ విష్ణు ప్రోగు కందరము, లోనుగా వచ్చితిమి లోకంబు లెరుగ, అందరి నీ మాయ హతము జేసితివి, పరగంగ యిటువంటి పని యూహచేసి, నన్నొడబాపను న్యాయమా' నీకనెను. (దీనినిబట్టి అంకాళదేవత కల్యాణమునుండి వచ్చినట్లుతెలియనగును. కొమ్మరాజు తండ్రి కాలమునాడే కాల్యాణరాజులు పలనాట పాదుకొనిరి. కనుక ఆనాటినుండి వారి ఇలువేలుపు అంకాళదేవతకు పలనాట స్థానము లభించినది. కారెంపూడిలోగల అంకాళమ్మకు వీరుల అంకమ్మయని పేరు.) నాయుడా శక్తిని వగవకు మనియు, రణములో 'నిన్ను ఘనముగ జేసి నీకు ముందరను, ఆహూతి చెల్లింపు నది కల్లగాద'నియు, మేముండునందాక నీవును మాతో నుండి పూజ లందగలవనియు నూరడించెను. శక్తి సంతసించి నాయుని పరిచారకులందు గలసిపోయెను. కొమ్మరాజు యుద్ధమునకు బయలుదేరగానే నలగాముని సేనలు బెగడొందెను. నాయకురాలు సేనలను హెచ్చరించుచుండెను. కొమ్మరాజు తన యాస్థానపు భట్టు రాఘవుని తనరాక నలగామున కెరుకసేయ బంపెను. రాఘవుడు నలగాముని చెంతకు బోయి కొమ్మరాజు బిరుదులు పఠించి 'రహి మించు జగతిలో రాజుల కెల్ల' రణము కుత్తికబంటి రమణతో దనకు,బవరంబు

మోకాలిబంటి యెన్నరాజు, ప్రేమ నీళ్ళపని మెప్పించిన రాజు, కొమ్మభూపాలుండు బలిరేఖ యందు వచ్చుచున్నాడని యెరిగించెను. ఇతరరాజులకు కుత్తికబంటి యుద్ధము కొమ్మరాజునకు మోకాలిబంటి యనుటచే నాతని పరాక్రమము తెలియనగును. రాఘవభట్టు నలగామునకు అలరాజు మరియు రత్నాలపేరిదేవి వాసికథ వినిపించి యా దంపతుల నీవే చంపించితివని చెప్పి కొమ్మరాజు పక్షమున యుద్ధమున కాహ్వానించెను. నలగాముడు కొంతతడవు చింతించి తానున్నాడ నొకతప్పదనుకొని భట్టునకు బహుమతు లిచ్చి సాగనంపి తాను యుద్ధ సన్నద్ధుడయ్యెను. తరువాతి వృత్తాంతము గ్రంథపాతమైనది. ఈ భాగమున బహుశః కొమ్మరాజు యుద్ధము మరియు నాతని చావు వర్ణింపబడియుండును.

పల్నాటి వీరచరిత్రమున చివర ఘట్టము 'బ్రహ్మనాయుని విరుగు'[1] ఇరుపక్షములందు నెందరెందరో వీరాధివీరులు మడసిరి. అంతకుమున్నె అడప కేశవదాసి పడుటయు జూచి యా బ్రహ్మనాయుడు 'కడు నుగ్రుడై మండి కార్చిచ్చుమాడ్కి' తానే సంగరరంగమునకు వెడలెను ప్రతిపక్షమునుండి బ్రహ్మనాయు నెదుర్కొనుటకు పచకుల బ్రహ్మయను యోధుడు వచ్చెను. బ్రహ్మనాయు డాతనితో '*సరిపిల్లో నొక గరిడి సాము జేసితిమి, మనకు గురువొక్కడె* మరి చూడు నీవు. మనకు బేధము లేదు మానుమ రణ'మనెను. కాని పచకుల బ్రహ్మ కురుపాండవులకు ద్రోణుడే గురువైనను వారు యుద్ధము మానిరాయని నాయు నొడబరచి 'బాహుబలంబున బహుచిత్రముగను, ఆహవంబును సేయ నభిమతమయ్యె' నని తలపడెను. ఇరువురును వాలి సుగ్రీవులవలె, ఇంద్రదనుజేంద్రులవలె, చాణూరకృష్ణులవలె, పోరిరి. పచకుల బ్రహ్మ శిరము దెగి నాయుని కాళ్ళకడ బడ నాయుడు 'పాదము సోకునని పరగ వెన్కకును, బోయెను అంత నాశిరము 'వెనుకకు బారుట వెరచుటగాదె, యో పుండరీకాక్ష యోదైత్యదమన' యని స్తోత్రిమొనర్చెను. నాయుడు 'నీ నొసట తిరుమణి యుండియుండగను, పూనినే వెన్కకు బోయితి గాని' వేరుకాదని సమాధానము చెప్పి వరమడుగుమనెను. ఆ శిరము 'వీరులలో నొక వీరుని జేసి, వీరగంధము ముందు వెలయించుమా'కని కోరెను. నాయడందుల కంగీకరింపగనే పచకుల బ్రహ్మతేజము నాయునిలో లీనమయ్యెను. నాయకురాలును నలగాముడును పైపైకి వచ్చుచున్న బ్రహ్మనాయుని ధాటి కాగలేక పారిపోయిరి. బిరుదురాజనునాతడు నాయు నెదిరించి మరణించెను. నాయుడు పారిపోవు

1. డి. నెం. 1120 ప్రా.పు.భాండాగారము. మద్రాసు.

నలగాము వెంటనంపెను. ఇంతలో చింతపల్లి రెడ్డి యడ్డుపడెను. నాయుడాతని స్వామిభక్తికి మెచ్చి పోరాడవలదని పెడబొబ్బపెట్టెను నాయుని ధ్వని విన్న రెడ్డి చేతి కత్తి జారిపోయి కన్నులకు చీకట్లు గ్రమ్మెను. నాయుడా రెడ్డితో 'మలిదేవరాజుల మరి వేగ దెచ్చి, మాచెర్ల యేలించు మహిమతో నీవు, కామునికి బుద్ధి చెప్పు కడమ లేకుండ'నని చెప్పి, విడిచి పెట్టి మరల నలగామని వెంటబడెను. గజభీముడగు నిజసింగుడు నాయు నెదిరించి చచ్చెను. నాయురాలే గుఱ్ఱమెక్కి వచ్చి నాయు నడ్డగించి పొడువుమనగా నాయుడు 'ముగురు మూర్తులలోన ముఖ్యుడై నట్టి, యీశ్వరు డీశూల మిచ్చెను నాకు, ఇంతుల మీదను ఏయంగ దగ' దనెను. (నాయు డీశ్వరునకుగూడ నమ్మిన భక్తుడని స్పష్టముగా దెలియుచున్నది.) నాయురాలే ముందుగా నాయుని బొడిచెను. నాయుడామె నేమి యనక 'గుదికొని యశ్వమును కూలంగ బొడిచె'ను. నాయకురాలు పారిపోయి మరల రాజును గూడెను. బ్రహ్మనాయుడు వారిని మరల వెంటనంట వారి సైన్యములు పికాపికలై నలుదెసల బారిరి. నలగాముడు నాయకురా లిరువురును కొదమగుండ్లకు బారి విప్రుల శరణుజొచ్చిరి. వారల దాచి నాయుని కెదురుగా 'బొజ్జకడుపు తిప్పన బొనకూచిభొట్లు' మున్నగాగలవారలు వచ్చి 'కాముని ప్రాణముల్ గావవే బ్రహ్మ'యని వేడి స్తోత్రము చేసిరి. నాయుడు నలగాముని రావించి యభయపట్టము గట్టి బ్రాహ్మణులకు దానధర్మములు చేసి నలగామునితో '**అనుగుభూపతి మరణమైనది మొదలు, కట్టితి పట్టంబు కరుణ భూపాల** .... తగవెంత దప్పితి ధరణీశ్వరుండ, తమ్ముల నాగిన తప్పు గాచితిని, మతమని పాల్గొని మాచెర్ల కొరకు, కోడిపోరును బెట్టి క్రూరమార్గమున, గోపన జంపితివి క్రోధంబుతోడ' నని మందపోటు, అల్లునిచాపు మున్నగునవి యుట్టంకించి తెగడి 'నీ మన్నెనాయకుల్ నీ సేనలెల్ల, మడిసిరి యాకలన మరి సమము గాను, విను దోలి పట్టంబు నిలిపితి నే'డన నలగాముడు మున్నగువారు 'విజయంబు నీదేను వినుము బ్రహ్మన్న,' యని చెప్ప రాజుచే నంపించుకొనియె కదువేడ్క నాయుడు కలని మధ్యమున, రాకల నట్లుండి అమరులు పొగడ'. గ్రంథ మింతటితో సమాప్తమైనది. బహుశః ఇచటగూడ కొంత గ్రంథపాతము జరిగియుండును. పల్నాటి వీరచరిత్రమున బ్రహ్మనాయుని పాత్ర మత్యంత ప్రధానమైనది. తెలుగుజాతి మగసిరికి బ్రహ్మనాయుడు కోటికి పడగ. ఆ మహావీరుని కథ తుదిగా నీ వీరచరిత్ర మింతటితో విడుచుట లెస్స.

## కాటమరాజు కథ

గుంటూరు మండలమున పల్నాటి వీరచరిత్రమువలెనే నెల్లూరు మండలమున కాటమరాజు కథకు ప్రచార మెక్కువ. అయ్యలరాజు నారాయణామాత్యుడు

> "కొమ్ములు వీరణాలు జిగి గుల్కెడు వ్రాతల కృష్ణలీలలం
> గ్రమ్మ గుడార్లు వీరుడగు కాటమరాజు కథానులాపముల్
> పమ్మిన పుస్తకాలు ముఖపట్టిడి కట్టు రుమాలలు న్నెతా
> సొమ్ములు నామముల్ వెలయు సుద్దుల గొల్లలు వచ్చిరెంతయున్".1

అని వర్ణించినటులే కాటమరాజు కథను గొల్ల లత్యంతభక్త్యుద్రేకములతో చెప్పి పొట్టవోసికొందురు. ఈ కథను మాదిగలలో నొక తెగవారగు కొమ్మువారును గొల్లలలో నొక తెగవారగు పికిలివారును ప్రచారము చేయుదురని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగా రనిరి. తెలంగాణమున ఎఱ్ఱగొల్లలును, మందుచ్చువారును (మంద ఎచ్చు శబ్దమునకు భ్రష్టరూపము) బీరన్నలవారును కాటమరాజు కథను చెప్పెదరు. మా గ్రామమున (దేవునూరు, ఓరగల్లు మండలము) బీరన్నలవారు చెప్పగా నేనీ కథ వింటిని. "కాటమరాజునకు నతులు చేకూర్చుట, వీరులను భక్తితో పూజించుట, యాదవుల ప్రధానదైవతమైన గంగకు వేటలు, బోనములు, సిడులు కావించుట ఈ యాచారము లిప్పటికిని నడుచుచున్నవే. నెల్లూరు జిల్లా దర్శి డివిజను దొనకొండలోని గంగకు ఏటేట గొప్ప జాతర జరుగును. ఆవిధముగనే కనిగిరి తాలూకా పాలేటి యొడ్డున నున్న పెద్ద అలవలపాటి గ్రామములో గూడ ఏటేట వైశాఖ పౌర్ణమికి గంగ తిరునాళ్లు జరుగును2." శర్మగారి వాక్యములకు సరియైన యాధారమన్నట్లు హంసవింశతిలో గూడ నీ ప్రశంస యున్నది. నెల్లూరు నేలిన చోళ నల్లసిద్ధిరాజునకు కనిగిరి నేలిన యాదవరాజగు కాటమరాజునకును పుల్లరి విషయమై కలిగిన పోరు కాటమరాజు కథ. ఈ యుద్ధకాల మిదమిత్థముగా నిర్ణయించుటకు సరియైన యాధారములు లేవు. "తెలుగు వీరకథావాఙ్మయంలో కథావిషయాన్ని బట్టి అతిప్రాచీనమైంది కాటమరాజు కథే. నెల్లూరిమండల శాసనసంచయములలో కాటమరాజుకీ మనుమసిద్ధికీ క్రీ. శ. 1170 ప్రాంతంలో యుద్ధం జరిగినట్లు

1. హంస వింశతి 2—88.
2. నా నెల్లూరు మండలయాత్ర.

ఆధారం కనిపిస్తోంది" అని శ్రీ హరి ఆదిశేషువుగారు వ్రాసిరి[1]. కాని వారే యా శాసనాధారమును శంకించిరి. అది గుండ్లషాలెముశాసనమే యైనచో సరియైనదికాదని ఇదివరకే చారిత్రకులు నిర్ణయించియున్నారు. నల్లసిద్ధి రాజునకు దండ నాథుడు ఖడ్గ తిక్కన. ఈతని పినతండ్రి కుమారుడే మన కవిబ్రహ్మ తిక్కన. కవిబ్రహ్మ మనుమసిద్ధి కాలమువాడు. మనుమసిద్ధి క్రీ.శ. 1250 ప్రాంతమువాడందురు. కాకతి గణపతిదేవుని తిక్కన సందర్శించెనట. గణపతి దేవుడు క్రీ. శ. 1198-1262 ప్రాంతమువాడు. కవి తిక్కనకన్న 50 సంవత్సరములు వెనుకకు నెట్టినను ఖడ్గతిక్కన క్రీ. శ. 1200 ప్రాంతమువా డగును. అటులైనను పల్నాటియుద్ధ మింతకు పూర్వమే జరిగిపోయినది. పల్నాటి యుద్ధము రుద్రదేవుడని ప్రఖ్యాతుడైన కాకతి ప్రభువు కాలమున జరిగినట్లు తెలియుచున్నది. ఇది గాకను ఖడ్గతిక్కన్న తమ్ముడు బాచడు కేత భాస్కరమంత్రి దశకుమార చరిత్రమున (1215) ప్రశంసింపబడెను. ఖడ్గ తిక్కన తండ్రి, చోడతిక్క నృపాలుని మంత్రి. చోడ తిక్క క్రీ. శ. 1209-10 ప్రాంతమున నున్నట్లు తెలియుచున్నది. కనుక ఖడ్గతిక్కన క్రీ. శ. 1220-30 ప్రాంతమున నుండియుండును. నల్లసిద్ధిరాజుగూర్చి ఇదమిత్థముగా తేల్చిచెప్పజాలము. నల్లసిద్ధులెందరో కలరు. కాటమరాజుతో పోరిన నల్లసిద్ధి యెవరో? ఆంధ్రుల చరిత్రయం దధికభాగము సంశయాస్పదమే గదా! పాటలో నున్న యుద్ధకాలము మరింత వింత గొల్పును. ఆనాటికి ఖడ్గతిక్కన తండ్రి కూడ ఉండియుండడు. కాటమరాజు కథకు పీఠిక వెలయించిన శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారే ఈ సమస్యను తీర్చుటకు నేటికి తెలిసిన వస్తువు చాలదనిరి. కనుక నీముడివిడని విషయ మింతటితో విడిచిపెట్టెదను.

ఇటీవల డా. తంగిరాల వెంకటసుబ్బారావుగారు కాటమరాజు కథలందలి చారిత్రక విషయము లన్నింటిని సాకల్యముగా పరిష్కరించినారు. ఈ యుద్ధము క్రీ. శ. 1280-1297 మధ్య జరిగినట్లు వారి అభిప్రాయము[2]. శ్రీ ఆరుద్రగారు కాటమరాజు పూర్వులు విశాఖమండలమందలి యలమంచిలి ప్రాంతము లేలినట్లును, కాటమరాజు గోవులమేతకై కర్నూలు, కడప మండలములు తిరిగి నెల్లూరు ప్రాంతములకు వచ్చినట్లును తేల్చినారు[3].

1. జానపద గేయవాఙ్మయ పరిచయము.
2. తెలుగు వీరగాథాకవిత్వము (అముద్రితము).
3. ఆంధ్రప్రభ. దిన పత్రిక ఆదివారపు సారస్వతానుబంధము 27-11-1960.

కాటమరాజుకథకూడ పల్నాటి వీరభారతమువలె పెద్దగ్రంథము. కాటమ రాజు కథ, దీని కనుబంధముగా భట్టురాయబారము, కోటపాటి తాటివృక్షము తెచ్చేకథ, ఎఱ్ఱగడ్డపాటిపోట్లాటలను గేయములు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సంపాదకత్వమున ప్రచురితమైనవి. శ్రీ ప్రభాకరశాస్త్రిగారికి పూర్వమెప్పుడో మెకంజీ మరియు బ్రౌనువంటి పాశ్చాత్యపండితు లీపాటలు సేకరించి మద్రాసు ప్రా.పు. భాండాగారమున నుంచిరి. కాటమరాజుకథకు సంబంధించిన మరికొన్ని చిన్న కథలపాట లింకను అముద్రితములు. శ్రీ వేటూరి ఆనందమూర్తిగారు 'అగుమంచి కథ'ను ప్రకటించియున్నారు1. శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య గారు కూడ ఈ విషయమున విశేషకృషి చేసియున్నారు2. పలనాటికథాచక్రము వలెనే కాటమరాజు కథలచక్రము కూడ అనేకకథలసంపుట మనియు దీనిలో మొత్తము 32 కథ లున్నవనియు, వల్లురాజు కథతో నారంభమై భక్తిరన్నకథతో నీ కథాచక్రము ముగియుననియు ఈ విషయమై సాకల్యముగా పరిశోధించిన డా. తంగిరాల వెంకటసుబ్బారావుగారి యభిప్రాయము. వారీ కథల కేర్పరచిన క్రమ మిట్లున్నది. 1. వల్లురాజు కథ 2. పంపాద్రి కథ 3. పెద్దిరాజు కథ 4. సింహాద్రిరాజు కథ 5. ఎరనూకరాజు కథ 6. నలనూకరాజు కథ 7. పోలు రాజు కథ (దీనిలో ఆరు ఉపకథ లున్నవి) 8 బల్లికురువ పోట్లాట 9.కరియావుల రాజు కథ 10. కాటమరాజు పట్టాభిషేకము 11. పాపనూక కథ 12. ఆవులమేపు 13. పాలేటికథ 14. ఎఱ్ఱయ్య తర్కవాదము 15. జన్నివాడ కథ 16. భట్టు రాయబారము 17. కోటపాటి తాటివృక్షం తెచ్చేకథ 18 బొంగరాలకథ 19. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట (దీనిలో ఏడు కథలు-కాండములు-ఉన్నవి) 20. అగుమంచి కథ 21. భక్తిరన్న కథ3. కాటమరాజు యుద్ధముగూర్చి ఆంధ్రచరిత్రకు లందరును చర్చించినారు. వీరిలో అధికసంఖ్యాకులు కాటమ రాజును దోషిగా చిత్రించిరి. కాని శ్రీ యం.ఆర్. నాగేశ్వరరావుగారు మాత్రము నల్లసిద్ధియే దోషియని వ్రాసినారు4.

కాటమరాజు కథను శ్రీనాథుడు ద్విపదగా వ్రాసెనట. పల్నాటి వీరచరిత్రమును వ్రాసిన శ్రీనాథుడు కాటమరాజు కథనుకూడ చేపట్టుట

1. పరిశోధన, 5, 6, 7 సంచికలు.
2. ఆంధ్రపత్రిక-విజయ ఉగాది సంచిక, భారతి-విజయవైశాఖము.
3. జానపద సాహిత్యము-వీరగాథలు.
4. పంచలింగాల కొండ యుద్ధము.

వింత కాదు. కాని మన దురదృష్టవశమున నది యింతవరకు లభించలేదు. శ్రీనాథు ననుసరించి గుఱ్ఱముకొండ భక్తవత్సలకవి కాటమరాజు కథ పద్య ప్రబంధముగా వ్రాసినట్లు చెప్పుకొనెను.

సీ. ఒక శుభదినమున నొగి శుభ్రమతి శౌరి, పూజావిధానంబు పొందుపరచి
హరికథ వినివిని యారాత్రి నిద్రింప, శ్రీనివాసుం డిట్లు చెప్పె కలను
శ్రీనాథుడను కవిశ్రేష్ఠుండు ద్విపదగా, రచియించె కాటమరాజుచరిత
మది నీవు నాపేర నంకితంబుగ పద్య, గద్యాత్మకంబుగా ఘనత నుడువు

గీ. మని వచించి తిరోహితుడయ్యె నంత
నేను మేల్కాంచి యా స్వామి నెంచి మదిని
కాలకృత్యంబులను దీర్చి కడు దలిర్చి
పండితావళి గనుగొని భక్తిమెయిని 1.

ప్రకృతము నేను పరిశీలించు "*కాటమరాజు కథ*" పాట యవతరణికలో 'గురుతైన కొమనాల గోత్రాబ్ధిచంద్రు, డెనయంగ గంగుల యెల్లయ్య కూర్మి, తనయుడు సర్వన తగు సహోదరుడు, వినయెల్ల యనువాడు ప్రియము దీపింప, వలనొప్పు శ్రీనాథు వచనపద్ధతిని '2 యదుశౌర్యచరితమంతయు పాడినట్లున్నది. ఈకవి ఎప్పటివాడో తెలియదు. నల్లసిద్ధికి సహాయముగా 'చన్నపట్టణమేలు చంద్రశేఖరుడు' వచ్చెనను యసందర్భముచే కవి చెన్నపట్టణ

1. కాటమరాజు చరిత్రము. పద్యకావ్యము.

2. 'వచన పద్ధతిని' అన్నమాటలు చిత్రములు. శ్రీనాథుడు వచించిన పద్ధతియని కొందరు సర్దుకొనినటుల కానవచ్చును. నాకుజూడగా వచనపద్ధతియనగా పాడిన పద్ధతి యని తోచుచున్నది. కాకతీయుల కాలమువారని ప్రసిద్ధిచెందిన ఏగంటి వారి వచనములు గేయములే. ప్రతాపరుద్రుని కాలమువాడగు కృష్ణమాచార్యులవారి సింహగిరి వచనములు (లక్ష్మణరాయ పరిశోధకమండలి వారి తాళపత్ర గ్రంథములందున్నవి) పాడుకొనునట్టివే. నేడు స్త్రీల పాటలుగా అచ్చగుచున్న శ్రీరంగ మాహాత్మ్యములో గూడ కృష్ణమాచార్యుల వచనగేయములు కావవచ్చుచున్నవి. తాళ్ళపాకవారి వచనములు రాగయుక్తముగా నున్నవి. వానికి చిన తిరుమాలాచార్యుల 'సంకీర్తన లక్షణము'లో లక్షణశుద్ధి ఏర్పడినది. వచనములకు జనకుడగు బసవేశ్వరుని వచనములు కూడ పాడెడువారేమో! కనుక శ్రీనాథుని వచనపద్ధతి ఈగేయకథలను పాడెడుపద్ధతికి పేరనుచున్నాను. కాటమరాజు కథ వచనపద్ధతినే పాడబడుచుండెడి దనుటకు దీని ఛందమంతయు నొక్కతీరుగా నుండక పోవుట యొక తార్కాణము. మంజరీ ద్విపదయని పేరునకేగాని పెక్కుచోట్ల పాడుకొనుట కనువగునట్లు చరణములు మార్పునొందినవి.

సంస్థాపన (క్రీ.శ 1632) తరువాతివాడై యుండునని యూహింపవచ్చును. మైసూరు సమీపమున మరియొక చెన్నపట్టణము గలదు. దాని నిర్మాతలు రాణావంశీయులైన తెలుగు రాజులే. కాటమరాజు కథలో వచ్చెడు చెన్నపట్టణము మద్రాసుగా మారిన చెన్నపట్టణమో మరి కన్నడదేశములోని చెన్నపట్టణమో తెలియరాదు. నెల్లూరుకు సమీపమున నున్న మద్రాసు చెన్నపట్టణమే కావలెను. లేదా పాట పాడెడువారైనను ఈమాట చేర్చియుందు రనవచ్చును. ఇదిగాకను నల్లసిద్ధి పక్షమున 'తుపాకి విలుమూక తొమ్మిది లక్ష' లున్నట్లు వర్ణింపబడినది. నిజముగా నాకాలమున తుపాకులు పాశ్చాత్యదేశమునగూడ పుట్టియుండవు. ఈ విషయముగూడ చెన్నపట్టణమువంటిదే. కాటమరాజు కథ పండితుల పరిశ్రమచే శిష్టులును, పాటకజనము కృషిచే జానపదులును ఎరిగినదే. కనుక కథావివరము లుట్టంకించను. గేయరచనము చక్కగానున్నది. జాతీయములు, సామెతలు, నానుడులు పెక్కులున్నవి. సిసలైన దేశిరచన మనిపించును. ఈవిషయములు భాషాభాగమున చర్చింతును. ప్రస్తుతము గ్రంథమందున్న మరికొన్ని చారిత్రక విషయములతోపాటు కొన్ని సాహిత్యవిషయముల పరిశీలింతము.

యాదవనాయకులు యుద్ధమునకు సన్నద్ధులగుచు "పుడమి యాకాశంబు పొడమనినాడు, ఏకజలంబువై వెలుగుచుండితివి, అండబ్రహ్మాండంబు లఖిలంబు నీవు, అందు బుట్టినవారి కాదరువు నీవ...వల్లవుల్ గొల్చేటి వరదయామూర్తి" యని గంగను ప్రార్థించిరి. గంగ వారి కారాధ్యదైవతము. పశువులకు కావలసినది తృణజలసమృద్ధియేగదా !

సిద్ధిరాజుకు సహాయముగా "తిరువణామల తిప్పరాజు తిరుకంటరాజు, అర్లుకొండచ్చిరా జాదివన్నె మాదిరాజు, గయకొండ నేలేటి ఘన గంగరాజు, చెన్నపట్టణమేలు చంద్రశేఖరుడు, రాకోట యేలెడి రాయశృంగుండు, పరగ కాళహస్తి యేలు పాప తిమ్మరాజు, వెలికంచి యేలెడు వెంగళపతియు, ప్రభగిరిపట్న మేలు పద్మశేఖరుడు, నార్ణవము నేలు నంగభీతినేడు, పెచ్చమల తిమ్మరాజు పెదభావరాజు, మన్నెమదిరి నేలేటి మంచిగంధం మాదిరాజు" మున్నుగాగలవారు వచ్చిరట. వీనిలో కొన్ని ప్రదేశనామములు దక్క తక్కిన రాజుల పేరు లేచరిత్రమున లభింపవు. ఇవి కేవలము కల్పిత నామములై

యుండును. తిరువణ్ణామల, ఆరెగొండ, చెన్నపట్టణము,1 కంచి, ఆరణి, పచ్చమలై యనునవి నెల్లూరికి దక్షిణపుటూళ్ళు. ప్రదేశనామములతో మైత్రి పొసగుటకు పదకర్త రాజులపేరు లల్లియుండునని నా నమ్మకము. వీరేకాక "మాళవసౌరాష్ట్ర మగధభూపతు" లాదిగా సుమారు ఛప్పన్నరాజ్యాధిపతులును పేర్కొనబడిరి. ఇది మన కావ్యములందంతట నొక సంప్రదాయముగా వచ్చునట్టి వర్ణనమే కాని వేరేమియు కాదు. వీరి బలముల సంఖ్య గమనింపుడు. "ఎనుబదెనిమిదివేల ఏకాంగ వీరు, లొలయ తొమ్మిదివేల యుత్తమాశ్వములు, సొరిది తొమ్మిదివేల చొక్కపు చిల్వి పెలును, యిరువది లక్షల ఈనుగోడిగలు, కరులును మూడువేల్ గడ లైదులక్ష, పరగంగ లొటిపిటల్ పదునైదువేలు... తోపాకి విలుమూక తొమ్మిదిలక్ష". జానపదుల కెంత సంఖ్యయైనను ఒక లెక్కలోనిది కానట్లున్నది. ఖడ్గతిక్కన నల్లసిద్ధిని పలుమా రీగేయమున 'పల్లవ నలసిద్ధి పట్టాభిరామ'యని సంబోధించినట్లున్నది. నల్లసిద్ధి నిజముగా చోళుడు. చోళులు పల్లవవంశము తరువాత అధికారమునకు వచ్చినారు. మొదట వీరు పల్లవులకు సామంతులై వారి బిరుదములను దాల్చియుందురు. ఇదియునుగాక, ఆంధ్రదేశ మందలి సామంతరాజకుటుంబము లెన్నియో పల్లవులచే స్థాపింప బడినవని తెలియవచ్చుచున్నది. వారి గౌరవసూచకముగ పల్లవబిరుదమును తెలుగుచోళులు దాల్చియుందురు. మొదట కాకతీయులు తమ ఏలికలైన పశ్చిమ చాళుక్య చక్రవర్తుల బిరుదావళిని దాల్చుట మన మెరిగిన విషయమే.

తనబలమంతయు సమసిపోవ తానేకాకియై నిల్చిన ఖడ్గతిక్కనతో ఎదిరిబలమున నున్న పిన్నమనేడు "పోరు నిల్పగదోయి భూసురోత్తముడ, సంగాదు మీతోను సమరంబు సేయ, *అగ్రజన్ములు మీరు యాదవులమేము,* భట్టుల బ్రాహ్మణవైష్ణవోత్తముల, వెట్టిచెరల్ మాన్పి వెనుక వేసికొని, ప్రాణాలొసగి కీర్తిప్రబలి యున్నా'మని బ్రాహ్మణభక్తిని దెలుప తిక్కన 'యతిప్రాస లుండని యాకైత లేల· నుతిగూడి నడవని సొగసు పదమేల, *పతిసూచి మెచ్చని బంటుతనమేల, యితరులు మెచ్చని యీాజి సాధనమేల'* అని తిరిగిపోయెను. రణమునుండి తిరిగివచ్చిన తిక్కనను జూచి తండ్రియగు సిద్ధనామాత్యుడు 'కొడుక యీా వంశంబు కడుదొడ్డదోయి, పెద్దకాలమునాడు

1. చెన్నపట్టణమాపేరుతో నెప్పటినుండి వెలసెనోగాని తిరువళిక్కేణి పార్థసారథి యాలయములో పల్లవులనాటి శాసనములున్నవి. అచ్యుతరాయల కాలమున నీ యాలయ భాగము మరింత పెంపుగాంచినది. ఇది తెలుగుచోళల కాలమున నుండియుండ వలెనుగదా?

పేసమోసినవని, పులికడుపున గొఱ్ఱె పుట్టుచందమున, గలిగితి నాయింతి గర్భంబునందు, .... మగతనంబున బుట్టి మగవాడవనుచు, పగతుకు వెన్నిచ్చు ప్రాణంబదేల, యసులకు నోడి యీయవని మనుకన్న, సరగ రణభూమిలో సమయుట మేల'ని వీరోచితముగా బల్కెను. ఇవి సిద్ధయామాత్యుని గుణశీలముల చెల్పుమాటలు. విరిగివచ్చిన తిక్కనను పౌరులు చేసిన గేలి యింతంతకాదు. 'తాటాకులను మోసి తగ వ్రాయగాని, చెలగి యుద్ధము చేయ చేతనేమౌను, ఎదిరించి నిలిచిన హెచ్చుసేనలను, సరిసేయ నవి యజ్ఞశాలలు గావు, అసల పోటులుగాని యక్షతల్ గావు, మారణాగ్నులుగాని మంత్రాలు గావు, చనుదెంచు చక్రాలు చక్కిలాల్ గావు, ఘనచక్రబాణాలు గారెలు గావు, కుంతముల్ రుచి పప్పుకూరయు గాదు, కమ్మని పాయసము కాదు కయ్యంబు, వండిన యా పిండివంటయు గాదు, బంటుతన మేయూరు బ్రాహ్మదేయూర'ని పౌరులు చప్పట్లుగొట్టుచు జాతులాడిరి. తిక్కన భార్య స్వయముగా భర్తకు స్నానమునకు నీళ్ళుదోడి 'అక్కడ మంచంబు నడ్డంబుబెట్టి, అర్ధసేరు పసుపు నమరంగనుంచి, కూష్పండిస్నానంబు గొబ్బున జేయు'డని చెప్పిపొడిచి అత్తతో 'గొబ్బున నీరాడి కూతురు వచ్చు. తీర్చి యడ్డబొట్టు స్థిరముగా బెట్టు, గంధంబు చెక్కిళ్ళ ఘనముగా బూసి, పళ్ళాన నన్నంబు బాగుగా బెట్టు'మన్నది. తల్లి తిక్కన్న కన్నము బెట్టి విరిగినపాలు బోసి కొడుకు కారణమడుగ 'అరుణోదయమువేళ నదియెట్లొకాని, యావులు బెయ్యలు నటు మేయబోయి, యరులతో బోరాడి యటుమీద నీవు, విరిగిన నిను జూచి విరిగెను పాల'ని సమాధానమిచ్చినది. అబ్బ! ఒకనాడాంధ్రదేశ మెట్టి యాడబడుచుల కన్నది! వీరధర్మము ముందు పతిసుతబాంధవ్యము వారికొక లెక్కకాదు. అందరిచే నవమానింపబడిన తిక్కన రెండవమారు యుద్ధమునకు బోవునప్పుడు తండ్రితో నన్నమాటలు వీరోచితములు. "ఓ తండ్రి వినవయ్య యొక విన్నపంబు, నాయొక్క కీర్తి యానందంబునొంద, యదుబలంబులమీది కరుగుచున్నాడ, వారిని దునుమాడి వచ్చినా మేలు, పోరాడి వారిచే పొలసితినైన, నీవట కావార్త నిజమని తెలిసి, వేవేగ రణభూమి వెదకంగ రమ్ము, ఆముకొని పగవారి హతముసేయంగ, కవగొని పగరు నా కండలు నరుక, పరగ నెమ్మలె యున్న పగతుర ద్రుంతు, నొకచోట నుండబో దొనరగా బొంది, కదనంబులో బొంది కానకుంటేను, నచ్చట నిచ్చట నాయుద్ధభూమి, పరగ గండలు నెగిరిపడుచుండెనైన, తిక్కన్న కండలని తెలియంగ జూడు". తిక్కన్న

మగటిమి యంతటిది. ప్రాణము పోయినవెనుక తెగిన కండలుగూడ రణరంగమున దూకులాడునట. జానపదులు వీరరసము నెంత ప్రగాఢముగా జీర్ణించుకొనిరో కదా! తిక్కనతో యాదవులు బ్రహ్మహత్యా భయమున పోరున కియ్యకొనకుండగా బ్రహ్మరుద్రయ్యయను శైవబ్రాహ్మణుడు 'బ్రాహ్మడాతడు శివబ్రాహ్మడ నేను, బ్రాహ్మణులము పోరు పాటింపగల'మని తాను హతమైనచో "గోదావరియు నెట్టిగొండ లెన్నాళ్ళు, ఆదిత్యచంద్రులు నవని యెన్నాళ్ళు, అన్నాళ్ళు వెలయు నీ యాదవకథయు, కలియుగ మెన్నాళ్ళు కలుగు నన్నాళ్ళు, నవనిలో నాపేరు నర్చితంబగు"నని యుప్పొంగి-పోరునకు గడంగెను. ఒకరు గుట్ట మెక్కిన మరియొక రెద్దు నెక్కిరి. వారి యుద్ధము వర్ణనాతీతము. యుద్ధమున గూలిన బ్రహ్మరుద్రయ్యను యాదవులు 'మాఘమాసమున నమావాస్య తిథిని, మంగళవారాన మధ్యాహ్నవేళ' సమాధి యొనర్చిరట. దీని బట్టుకొని ప్రాకులాడినను యుద్ధకాలము సరిగా తేలదయ్యెను. ఖడ్గతిక్కన వీరస్వర్గ మలంకరించిన వార్త విని సిద్ధనామాత్యుడు రణరంగమునకు వచ్చి కొడుకును వెదకెను. అప్పుడు 'జలధిలో మీనముల్ చలియించునట్టు, నెత్తుటి వట్టులో తుత్తునియలుగ, తిక్కన కండలు తేలాడుచుండె, నెగినెగిసి పడుచుండె నీవలావలకు'. తిక్కన తన పౌరుషము నెరిగిన వీరుడు. తండ్రి కొడుకు కండలు కావిడోవతిలో పొదిగి నెల్లూరికి బోవ తిక్కన భార్య మామతో 'పురుషుకంటెను ముందు పోయెనా ప్రాణి, తగ బ్రాణనాథుండు తను జేరుదనుక, నాగి ప్రతీక్షించు నా పుణ్యకాంత, పురుషుడే ముందైన బుణ్యకాంతలకు, బతిగూడి యొక్కెపై పరలోకయాత్ర, పుణ్యప్రదంబని పొగడును శ్రుతులు. పతి నెడబాయుట పరగ దోషంబు, నా ప్రాణవిభునితో నన్నంపు మనుచు' సహగమనము చేసినది. ఆమె యెంతటి వీరపత్నియో అంతటి పతివ్రతగూడ.

పిన్నయ్య తనవారితో శత్రువులను 'తొలికి చంపకుడన్న దోషంబు వచ్చు, మార్గాని నిలచిన మరువకుండంగ, చెండాడి చంపను సెలవ'ని పలుకుట అతని ధర్మనిష్ఠను సూచించును. యాదవులు బొల్లావును స్తోత్రము చేయునప్పుడు '*భువి గంటకుల జంప బుధులను నిలుప, నీకు జెల్లెనుగాక ఎవ్వరి వశమ*'నినప్పుడు 'పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం' అను మాటలు జ్ఞప్తికి వచ్చును. బొల్లావు విష్ణ్వంశమున జన్మించినదని గదా యాదవుల నమ్మకము. బొల్లావు యుద్ధమతిలోకముగా వర్ణింపబడినది. ఇది జానపదులకున్న

అద్భుతరసప్రీతిని చాటునట్టిది. దాని ధాటి కాగలేక 'పడలేక యాపదల్ పడకుల చేత వస్తి మేమిటికని వగజెందువారు, నడ్తక త్తెలు భేదె లటు పారవైచి, మళ్ళి చూచువారు మఱియు నురకంగ, బడి వారి పాదాల బడి లేవలేక, హరిహరీ మము గావు మనియెడువారు, చక్కని మేడ్యంబు సందున దూరి, పఱుగున నుసకంగ బుఱియలు పగిలి, యాపద నొందుచు ననిరిట్లు వారు, కడతేరితిమ యైన గండంబు గడచి, బోనాలు పెట్టుదుము పోలేసు తల్లి'యనెడు యుద్ధభీరువుల వర్ణనము పల్నాటివీరుల చరిత్రమందలి శ్రీనాథుని వర్ణనమును దలపించును. బొల్లావునుండి తప్పించుకొనిన తరువాత భటులాడు బీరములు హాస్యరస పూరితములు. 'తఱిమితి నావును తల సూపకుండ, దోదెవ్వరును లేక తొణకి పోదువంగ, వచ్చితి నాయావు వచ్చునో యేమొ, యేవంక వచ్చునో యెఱగి పోదుతాము, కాచి యుండుడి చక్కగను వీరులార'యని యొకడన 'శకునంబు గాదాయె సాగి రాగాను, కాని శకునంబున కదలినందునను, కలనిలో బొల్లావు కల్లుగా జంపె, నికనైన నెల్లూరి కిప్పుడే పోయి, మంచి శకున మరసి మరలి వచ్చెద'మని యొకడు, 'తెల్లవారిన నావు తేటపడ జూచి, యొక్కండనే పోయి యొద్దిక దాని, పరగ దోలుకవత్తు పంతంబు జూడు' మని యింకొకడు ప్రగల్భములాడిరి. బొల్లావు రాగా సేనలు పరుగువారిన ఘట్టమున సహజమైన వర్ణనము లున్నవి. 'పొదల దాగినయట్టి పోటుమన్నీలు, వఱ్ఱెల దాగిన వరుసు మన్నీలు,(వఱ్ఱెయనగా నీటి ప్రవాహవేగమున నేర్పడిన బీటిక) మోకాళ్ళమోపున మోరెత్తి చూచి,వంగి వంగియు నావు వడిఁ దేడి రంత'.'అదె వచ్చె అదెవచ్చె ననుచుండగాను, జడియకుమని పీపు చరిచేటివారు, ఎదుఱొమ్ము చరిచిరి ఏమి లేదనుచు, భయము బోగొట్టి లే పదపద మనుచు, సిద్ధిరాజుల యొద్ద జేరి రందఱును'.సంధ్యగోపాలుడు ఘంట వృత్తాంతము జెప్పెను. కృష్ణావతారమును వర్ణించుచు ఇంద్రుడు వాన గురిపించ కృష్ణుడు గోవర్ధనగిరి యెత్తిన, దానిక్రింద 'కరులు సింగంబులు గదిసె హితమునను, మేకలు తోడేళ్ళు మిళితమైయుండె, నెలుకలు బిల్లులు నేకమైయుండె, గండభేరుండముల్ ఘన శరభములు, నేకమై పక్షులు వెలయుచునుండె, వైరివర్గము లేక వసుధ జీవులను, కాపాడుచుండెను గోపాలకుండు' అను వర్ణనము భారతమును కళాపూర్ణోదయమును దలపించును. పారిన వీరులు నల్లసిద్ధికి బొల్లావు నిట్లు వర్ణించి చెప్పిరి. 'పాదాలు నాలుగు పరగ చక్రాలు, పైపిల్లగిట్టలు బాణాల బోలు, నది తోక గాదయ్యె హనుమంతు వాలు, వంటి కొమ్మదిగాదు వజ్రాయుధంబు, శంఖు చక్రంబుల

చాడ్పున నాడు, నసురతలాటాల నాయావు నెగసె, గట్టిగా శ్రీహరి కైవడి దోచు, పరగ నావు ముఖంబు పద్మంబు బోలు, గల్వరేకుల బోలు కన్నులతీరు, ఆ కర్ణముల జూడ నానందమౌను, ఆ దివ్యనామంబు నమరంగ జూడ, గట్టిగా శ్రీహరి గరుడవాహనమే'. ఇది జానపదులకు నచ్చిన వర్ణనావిధానము. (బొల్లి యావునకు ఒకే కొమ్ముండుట గమనింపదగిన విషయము. ఋశ్యశృంగుడు తలపై కొమ్మున్న మానవుడు. ఖడ్గమృగమునకు బలిష్ఠమైన యొక కొమ్ముండును. పాశ్చాత్య జానపదసాహిత్యమున Unicorn అను ఒంటికొమ్ము జంతువు ప్రసక్తిగలదు. అది బలమునకును పావిత్ర్యమునకును చిహ్నము. పాశ్చాత్య జానపదసాహిత్యవేత్త లీమృగమునకు జన్మభూమి భారతదేశమనియే తలంచిరి[1]) బొల్లావును బోయలు గదిసి చంపెడు ఘట్టము హృదయ విదారకముగా నున్నది. బాణములు వేసి ఈటెల బొడుచుచుండగా 'ఆకొని బొల్లావు అలుగుల దినుచు, దాహంబు గొని రక్తధార ద్రావుచును, ధీఋలొ బోయల దిండ్లు ద్రిప్పుచును, వింతగా బున్నమ వెన్నెలగాయ, నంతంత బిల్లదీపు లాడినయట్లు'ండెనట, (పిల్లదీపులన బాలక్రీడావిశేషమని నిఘంటువు) ఇట బీభత్సము కరుణము రెండును మేళవించినట్లున్నవి.

అయితమరాజు పగల నేర్పాటుచేసిన ఘట్టమున నిరుపక్షముల నున్న వీరుల పేర్లుగ్గడింపబడినవి. వీరు మరుగుపడిన చరిత్ర పుటలందున్నవారో లేక కల్పితనాములో! ముమ్మయ్య మృతికి పోచయ్య విచారించిన పట్టులు కరుణాపూరితములు. 'మామ! యీకాంతిసంపదగల మేను,బొత్తెపు నేజాల బొడిచిరా మామ, నేను వచ్చినదాక నేరేడువద్ద, నిలువక పగరపై నేల యెదిరితివి, కదిసిన పగతుర కలని లోపలను, బాహుపుల్ నొచ్చెనే బారులు నరుక, నటు తిరిగి చూచితే యండ లేదనుచు, అప్పుడు సంధించి యాపాటు జూచి, మాయగా బొడిచిరటె మామ! బల్లాన'. యుద్ధము చేసిచేసి యాదవు లలసి అవులన్నకడ కిట్లు పోయిరట. 'బూరుగు వృక్షాలు పూసినయట్లు, పారిజాతంబులు పర్వినయట్లు, పోటుగాయాలవి పూలబంతులుగ, నారసా లెర్ర గన్నేరులే యనగ, మల్లెపూవులవలె మరి దేహమందు, వేసిన బాణాలు యెడలేక నాటి, తెలిగొప్ప

1 Standard Dictionary of folklore Mythology & legend. 'The Unicorn' by Dieter Schlingloff. German Scholars on India Vol I Page 294. Chowkhamba Publication. 1973.

బూవులై తేజంబు మెరసి, పనసలు మావిళ్లు ఫలమందినట్లు, నెసగంగ పూవులు వికసించినట్లు, ఆరీతి యాదవుల్ హరికృపవలన, యశ్వాల గోల్పోయి యాచోటు జాసి, యుచ్ఛ్వాసనిశ్వాస యూపిర్ల తోడ, నయితన్న వెనువెంట నంటియాదవులు, పొందుగా దాసాని పూల్గూర్చినట్లు, అప్పుడు వచ్చిరి యావులన్న కడకు.' ఈతీపగా వచ్చిన యాదవులను నలనన్న 'మీ తనువులు డస్సెనా తమ్ములార, పరగంగ మల్లెల పాన్పులమీద, మసలేటి దేహాల మరి నాటినావి, పరగ జాజుల మీద బండుదేహాల, నందరికి నాటిన పతిబలులార, పన్నీట స్నానంబు పంచ ప్రాణాలు, పల్లికొండ పంచిన ప్రజ్ఞ ఈడేర్చి, కత్తిపోటుల నెత్రు కారు చున్నదియు, కమ్మని కస్తూరి గంధంబు నలదు, మేన గారెడు నెత్రు మెరసి కరుండ్ల, తగ రణంబున రాము తమ్ముల వలె'నున్నారని యోదార్చిన ఘట్టము కరుణాపూరితము. నలనన్న పద్మనాయుడు పల్లికొండ ముచ్చటించుకొన్నప్పుడు (పుట 122) యుద్ధము మాఘ బ. 30 అమావాస్యనా డారంభమై 14 దినములు గడచినట్లు చెప్పబడినది. తరువాత పుట 140 లో 'అంతట మరునాడు అమావాస్య నాడ'నియు పుట 147 లో 'మాఘ మాసమున నమావాస్య'నాడు నల్లసిద్ధి మరియు కాటమరాజులు పోరినట్లు వర్ణింపబడినది. యుద్ధమెన్ని దినములైనట్లు? సరిగా తెలియుటలేదు. సిద్ధిరాజు సైనికులు యాదవుల ఆవులను పట్టవచ్చుట, అవి వారి నదరించుట పహజ వర్ణనములతో నలరారుచున్నవి. ఎఱ్ఱయ్య ఆవులను పేరుపేరున బిల్చుట మనోహరదృశ్యము.

'అరురాజ్యపు మూక లాదుకొని వచ్చె, సొచ్చి పొడుతువు రావె సోగలనెవలి, మొరసరాజ్యపు మూక మునుకొని వచ్చె, భాగీరథీగంగ బలముతో బొడువు, వాగర్తమూకలు వచ్చెను దండు, శ్రీలక్ష్మి గుత్తాల జీరుదు రమ్మ, గోదావరీ రమ్మ గొంతి గాంధారి, భూదేవి సరస్వతి పొందుగా రమ్మ, భూతేశ యోగిరిజ భూమిదేవమ్మ, భైరవి విరాళ భద్రగిరి వినుత, దుర్గమహంకాళి దుందుభి రావె, సౌమిత్రి జాంబవతి సౌభద్రుదేవి, కౌసల్య రేవతి కాళింది రమ్మ'. ఆవుల పేర్లు జానపదవాఙ్మయమున స్త్రీల పాటలలో కూడ వినబడును. (గోవుపాట చూడుడు.) నలనన్న విగ్రహము జూచి నల్లసిద్ధి యిటు లాశ్చర్యపడెను. 'చాత గుంతము పట్టవాయెను గాక, బలభద్రరాముతో బాటింపదగును, శరచాపముల పీడు చేబూనితేను, బరికింప శ్రీరామభద్రు డనవచ్చు, గాండీవశస్త్రముల్ కడు లేవుగాని, పాండవార్జునునికి ప్రతి యనవచ్చు.' కాటమరాజు

నల్లసిద్ధి యుద్ధము చేయుచుండగా 'దక్షుడు శంభుండు తారసిలినట్లు, ధరణి గహ్వార మెగయ దగను బోరాడి, కడు రామ రావణుల్ కలిసినయట్లు, పృథివి ఘూర్ణిల్లగా బోరిరిద్దరును, మత్స్యంబు మత్స్యంబు మల్లాడినట్లు, వారిధివారిధి వడి గలసినట్లు, వడికొని పోరిరి వసుధపై నంత, మేరువు మేరువు తారసిలి నట్లు'ండెనట. యుద్ధరంగ మతిబీభత్సముగా వర్ణింపబడినది.

'పల్లవరాజుల పాలేట జంపి, పగవారి రక్తాన ప్రదక్షణము తిరిగి, పాలేటి గంగకు పగవాని శిరసు, పాదకానుక పెట్టి ప్రస్తుతి జేసి, యల్లకాశికి యాత్ర యటుబోయి నట్టి' భక్తిరన్న వచ్చువరకును కాటమరాజు ప్రార్థనమున 'ఈగ వ్రాలకయుండ నీలె యిడకుండ, (ఈలె యనగా మురుగువలన బుట్టెడు పురుగు. ఇది Fungus జాతికి చెందినది) కాకులా రణమందు గదిసిరాకుండ, నక్కలు రణమందు నడయాడకుండ, నీచుకు భూతాలు నీగి రాకుండ, కౌజుకు గ్రద్దలు కొరాడకుండ, నాకాశపక్షులు నట్టు వంచకుండ, మేదిని పందులు మెర వాల్చకుండ, పుట్టలో జీమలు బొలసిరాకుండ, పెట్టిన తిరుమణి పేటెత్తకుండ, పూసిన గంధంబు పురి చిట్లకుండ, కాంతిగల దేహాలు కందిపోకుండ' రణ రంగమును గంగ కాపాడినట్లు వర్ణింపబడినది. ఇటులీపాట ఖడ్గతిక్కన యుద్ధముతో నారంభమై నల్లసిద్ధి కాటమరాజుల మరణముతో ముగిసినది.

ఇక అనుబంధముగా నున్న 'భట్టు రాయబారము'లో నల్లసిద్ధి పక్షమున కాటమరాజుకడ కొక భట్టు పుల్లరి యడుగ వచ్చెను.అతనికి యాదవుల పక్షమున నున్న భట్టునకును జరిగిన సంభాషణమే ఈ రాయబారము. ఇది కాటమరాజు యుద్ధమునకు పూర్వమే జరిగిన సంఘటనము. రచనమున నీ యనుబంధమున నున్న పాటలన్నియు నొకదానికన్న మరియొకటి విశిష్టముగా నున్నవి. సిద్ధిరాజు కడనుండి వచ్చిన రాయశృంగావళిభట్టు నెల్లూరి పట్టణపు టెల్లలు మరియు సిద్ధిరాజు వంశమును విస్తరముగా చెప్పినాడు. మనుమసిద్ధిని మూడుకన్నులవాని (త్రిలోచనపల్లవుడు కావచ్చు) వంశమువాడుగా చెప్పినాడు.ఇది ఎంతవరకు చరిత్రసమ్మతమో తెలియదు. కాటమరాజును పొగడి దీవించిన భట్టుతో కాటమరాజు పక్షపు భట్టు 'ఏమి నీ మనమున నేమి కోరెనను, కామితార్థము లిచ్చు కాటమరాజు, దాసి వేశ్యలు రెండు తప్పక పడిచి, యెంతైన నాశించి యేమి యడిగెదవు, అడుగుమా రాయశృంగావళి భట్టు'యనెను. ఇది కాటమరాజు గుణసౌశీల్యములను దెల్పును. పాటలో పుల్లరి విషయమై యిరుపక్షములవారు.

రాగి శాసనములు వ్రాయించుకొనట్లున్నది. నేడవి యున్నవో లేవో తెలియదు. ఇద్దరు భట్లకు వాదోపవాదములు పెరిగినవి. యాదవుల భట్టు కాటమరాజాదులను పాండవులుగా ఎఱ్ఱగడ్డపాడును కురుక్షేత్రముగా చెప్పినాడు. తరువాత రామాయణముతో పోల్చినాడు. కాటమరాజును రామునితో, ఎరనన్న లక్ష్మణునితో, అయితమరాజుభరతునితో, కరియావులన్న శత్రుఘ్నునితోడను, ఇటులే పర్ణశాలతో పకువ్వలున్న కోన,సీతమ్మచెరతో చేకూరిజగడము,రావణునితో సిద్ధిరాజు, వాయుసుతునితో కంపటి, పక్షినేసిన బాణముతో పవనజు వాలు పోల్చబడెను. యాదవరాజుల నధికముగ పొగడెడు భట్టును రాయశృంగావళిభట్టు 'అవునోయి యాదవఅవనీశుభట్ట, కవితకు పోషణము కలదు మీవల్ల, నేనుగు నొక కొంత యెరిగి పాడిచినను, నీవలావల దూరి యేగ నేర్పరివి, కానొక టీయక కల్లలు నాటి, యీగి కర్ణుండని యెంచ నేర్పరివి, గంధంబు కస్తూరి యందనివాని, జందనంబేయని చెప్ప నేర్పరివి, యెన్నడు సుఖమనుపెరుగనివాని, దేవతాసఖుడని తెలుప నేర్పరివి, స్త్రీలతో చెలిమిని చేయనివాని, నల మన్మథుండని యనగ నేర్పరివి, వలుకు రూపెరుగని పనికిమాలినవాని, వాల్మీకుడని గొప్ప పలుకనేర్పరివి, ఎవరి ముందర నీవు ఎంచబొయ్యేవు, బూరె గంపలకాడ బొర్లుదండాలు' అని చెప్పి పాడిచెను. ఇది భట్ల స్తోత్రముల గురించి చెప్పినమాట. ఇద్దరికి సమానముగా వర్తించును. యాదవులభట్టు గొల్లరాజగు కాటమరాజును శ్రీకృష్ణునితో పోల్చి యాతని ఘనత నిట్లు చాటెను.

"మాటమాటకు గొల్లగొల్లడని యేవు, ముదముగా నీ భూమి మోసెను గొల్ల
తరికొండ లూగంగ త్రాడాయె గొల్ల, సాగరము రెక్కల జల్లెను గొల్ల
వేడుక వ్రేపల్లె వెలదుల గూడి, కొల్లలాడినవాడు గొల్లతడు కాడ
కన్నులు దెరువని కడుచిన్న బాలుడై, కోపించి శకటంబు గూల్చెను గొల్ల
ముద్దుల బాలుడై మూడవ నెలను, దానవి చనుబాలు దాగెను గొల్ల
యేడాది కుర్రడై యిల తృణావర్తు, మెడబట్టుకొని వాని మృతుజేసె గొల్ల
తల్లి వెన్నలకునై తను రోల గట్ట, కొమరుడై మద్దులు కూలంగ నీడ్చె"

ఇది పోతనగారి 'కన్నులు దెరువని కడుచిన్న పాపడై కోపించి శకటంబు గూలదన్నె' పద్యమునకు కేవలము ద్విపదరూపము. ఇరువురు భట్ల వాగ్వివాదమున గొప్పసాహిత్యము పుట్టినది. సామెతలు కుప్పతెప్పలుగా నున్నవి.

అనుబంధమున రెండవ గేయము 'కోటిపాటి తాటివృక్షము తెచ్చేకథ' దీనిలో రాయబారమునకు వచ్చిన నల్లసిద్ధిభట్టును పంపించిన తరువాత

కాటమరాజు తన బావమఱదియగు పద్మరాఘవునితో విచారించి యుద్ధ సహాయమునకై ఐతమరాజాదులకు లేఖలు వ్రాయించుటకు 'సమ్మతంబుగ మంచి సవరని యాకు, కొనగల మోవాకు కుదురు చక్కనిది' కావలయుననగా పద్మరాఘవుడు చట్టువారి ఎఱ్ఱనను కోటపాటిలోగల తాటిమోవాకు తే బంపెను. ఎఱ్ఱన మార్గమధ్యమున గలిగిన యవాంతరముల గడచి, తాటిచెట్టుకడకు పోయి ఎట్టియాకు తీసికొని పోవలయునో తెలియక 'అచ్యుతవరభక్తు డాత్రేయగోత్రు, డలనాడు రామకార్యార్థమై పోయి, తెలివొప్ప సంజీవి తెచ్చిన వాయునందను దన మది నపుడు ప్రార్థించి' చెట్టునే పెరికి భుజముపై నుంచుకొని బయలుదేరెను. అడ్డగించిన కోటపాటిని సైన్యము నొంటరియై తరిమివైచి చెట్టుగొని కాటమరాజు కడకు వచ్చెను. అచ్చట కావలసిన పత్రముల దీసికొని మరల నెప్పటి స్థానమున తాటిచెట్టును నిల్పిరమ్మన ఎఱ్ఱన ఆంజనేయుడు సంజీవి పర్వతమును తిరుగ కొనిపోయినట్లు తీసికొనిపోయినిలిపివచ్చెను. ఇట్టి కథాకల్పనము పూర్వకథానుకరణము. జానపదుల కిట్టి అతిలోకకథాకల్పనమం దాసక్తిమెండు. దీనినే '....... new touches totally unconnected with its original significance may be added or even transferred from other myths'[1] అని ఒక పాశ్చాత్యపండితు డనెను. కాటమరాజు రామచంద్రుడను వ్రాయసకానిచే తన బావ పల్లికొండకును, కొమరక్క సిరిదేవులకును కమ్మలు వ్రాయించి ధనకొండకు కొలారి మారన్న నంపెను. వచ్చిన లేఖలు అయితమరాజు బిడ్డ సిరిగిరి - బహుభాషలు దెలిసిన యాదవపడుచు-చదివెను. అయితమరాజాదులు యుద్ధమునకు సన్నద్ధులైరి. తల్లి సిరిదేవి భవితవ్యమును చింతించి దుఃఖించెను. ఆయమ కొడుకునకు జయము గోరి సిద్ధిరాజును శపింపగా నయితమరాజు తల్లితో 'తల్లిరో మామీది దయచేత నీవు, పల్లవరాజుల బలముల విడిచి, తల్లి మము దీవింప దగునటోయమ్మ.... దూషింప వలదమ్మ దుర్జనులనైన, భూషింప దగవలె పుత్రులవలె' నని తన హృదయవైశాల్యమును చాటెను. అయితమరాజు ససైన్యముగా వెడలి కాటమరాజు సేనకు కొలది మేరలో పాలేట విడిసి చేసెను. ఒక చోటినుండి మరియొక చోటికి భట్లు వార్తలు దెత్తురు. తరువాత వారును వీరును కలిసికొనిరి.

---

1. Vedic Mythology. A. A. Macdonell.

మూడవదగు "ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట"లో సిద్ధిరా జావుల తోలుకొని పోయినప్పు డవి పోట్లాడుటనుండి గోవులు బెజవాడ బెబ్బులి పెయ్యలెట్టిన్నతో ముందుముందు జరుగనున్న యుద్ధమును చెప్పుట, ఆవార్త నాతడు కాటమ రాజుకు చెప్పుట, కాటమరాజు రణసన్నాహము, అతని శంక, కాటమరాజుకు పద్మరాఘవుడు ధైర్యము చెప్పుట, బొల్లావు ప్రశస్తి, తదలంకరణము, ప్రార్థనము, మున్నగు విషయములు వర్ణింపబడినవి. పద్మరాఘవుడు కాటమ రాజుకు ధైర్యము చెప్పునప్పుడు 'మీరె, కొమకొప్పుబెట్టి కోట మామదిని, నమరు కోటకు కొమ్మలనదగు మేము, కొమ్మలు గూలక కోటలు పడునె, ముమ్మరంబుగ ధనపు ముద్దులు మీరు, ముడుపులపై నుండు ముద్రలు మేము, కడు ముద్ర గోల్పోక కనకంబు పోదు, ఉన్నతంబగు కన్ను లెన్నగా మీరు, పన్నుగా కనుల రెప్పలము గద మేము, కనురెప్ప గోల్పోక కను మోసమగునె' యని తన రాజభక్తిని చక్కగా చాటుకొనెను.

యాదవభారతమునకు సంబంధించిన పై మూడుభాగములు ముద్రితములే కనుక వానియందలి కథా విశేషముల నే నధికముగా చర్చింపనైతిని. 'అగుమంచి కథ' వంటివి ఇప్పుడిప్పుడే వెలుతురు చూచుచున్నవి. కాటమరా జాంధ్రదేశమున దేవుడై వెలసినాడు. "కాటమరాయుడా కదరీ నరసింహుడా" యని ప్రజలు పాడుకొందురు. వర్షాభావము కలిగినప్పుడు కర్షకులు, నిస్సంతులైనవారు సంతానముకొరకును ప్రార్థింతురు తెలంగాణమున గౌడజాతివారికి కాటమయ్యే ఇలువేల్పు. ఆతనికి బోనములు పెట్టనిదే గౌడులు తాటిచెట్టు ముట్టరు. కల్లు గీయరు. గౌడులకు కాటమహేశ్వరుడు, కాటమఋషి, కాటమరాజు, కాటమయ్య, కాటయ్య యను పేరులతో బిలువబడు ఇలువేల్పు కలడు. కాని యాతడే యాదవుల కాటమరాజు కాదేమో! శ్రీ మార్గని సుబ్బారావుగారు తమ గ్రంథమున[1] యాదవుల కాటమరాజును తమ కాటమహేశ్వరుడుగా భావించి పొరపాటున కాటమరాజుకు సంబంధించిన (పైన చర్చింపబడిన) కథలన్నియు తమ గౌడకులజుడగు కాటమహేశ్వరునివే యని పుట 91లో వ్రాసినారు. ఇది కేవలము పొరపాటై యుండుననుకొందును. యాదవుల కాటమరాజునకు గౌడుల (కల్లుగీతవారి)తో నేమిపని? గౌడుల కాటమహేశ్వరునిగూర్చి యిచ్చిన కథలకును యాదవరాజగు కాటమరాజు కథలకును పోలికలే మాత్రము

---

1. గౌడ వంశోత్పత్తి మార్తాండము

లేపు. గౌడుల కాటమహేశ్వరుడు పౌరాణికవ్యక్తివంటివాడు. యాదవుల కాటమరాజు చారిత్రకపురుషుడు.

గోరంత చారిత్రకాంశము కొండంత పురాణముగా పెరిగిన కథలందు "కుమారరాముని కథ" యగ్రగణ్యము. కర్ణాటాంధ్రసీమల పొలిమేరలందున్న ఆనెగొంది రాజ్యమున వసవల్లి దుర్గమునకు సంబంధించిన గాధ యగుటచే నిది కొలది భేదములతో నిటు ఆంధ్రదేశమునను అటు కర్ణాటక దేశమునను వ్యాప్తి గాంచినది. ప్రా.పు. భాండాగారమువా రటీవల నీకథను ప్రకటించి యున్నారు. సుప్రసిద్ధ చారిత్రకులు డా. శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు కన్నడాంధ్రము లందు గల కథాభేదములను, పుక్కిటి పురాణములను, సిసలైన చారిత్రమును ద్రవ్వి తీసి యొకకొక యమూల్యమగు పీఠిక వ్రాసియున్నారు. శ్రీకృష్ణదేవరాయల కాలమున వచ్చిన న్యూనిజను విదేశీయుని వ్రాతల యాధారమునను (Forgotten Empire) మహమ్మద్ బిన్ తుగ్లక్ ఢిల్లీ చక్రవర్తిగా నున్నపుడు వచ్చిన మరియొక విదేశయాత్రికుడగు ఇబ్నెబతూతా వ్రాతలవలనను (Foreign notices of South India) ఇదే చక్రవర్తి యాస్థానమునందలి ఈసామీ యను చారిత్రకుని వ్రాతలవలనను (Futuh-us-Salatin) శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు కంపిలిరాయల చరిత్రమును ద్రవ్విరి. కంపిలి రాజ్యము క్రీ.శ. 1300 తరువాత పేరు పొందినది. ముమ్మడి సింగెయ నాయకుడు (దేవగిరి రామరాయల కాశ్రితుడు) పదమూడవ శతాబ్దాంతమున నట పాలించెను. అతని కుమారుడు కంపిలిరాయలు తండ్రి యనంతరము రాజ్యభారము మోపి కంపిలి, యానెగొంది, హంపి, కుమ్మట, హొసమలె. దుర్గముల నేలెను. ఈతడు కాకతిప్రతాపరుద్రునికి సమకాలీనుడు. కంపిలిరాయల కొడుకు కుమారనాథుడు (కుమార రాముడు) శౌర్యశాలి, తండ్రికి కుడిభుజము. కంపిలి రాయలు ఇటు ప్రతాపరుద్రునితోడను అటు ముమ్మడి బళ్ళాలునితోడను అప్పుడప్పుడు పోరుచుండెడువాడు. దేవగిరి యదవరాజులకును ఓరుగంటి కాకతిరాజులకును వైరము కనుక యాదవుల కాశ్రితుడగు కంపిలి రాయలు ప్రతాపరుద్రునితో జగడమాడుట వింతకాదు. వీరి వైరము మన సాహిత్య గ్రంథములకు గూడ నెక్కినది. శ్రీనాథ కవిసార్వభౌముడు ప్రతాపరుద్రుని మంత్రియగు ప్రోలయ యన్నయను 'ధాటి విఘటిత కుమ్మటోద్యానుడనగ'1

1. భీమేశ్వర పురాణము 1–49

ఆని కీర్తించుట వీరి వైరమును చాటుచున్నది. కాకతీయసామ్రాజ్యభానుడు క్రీ.శ. 1323 లో నస్తమించెను. అటుతరువాత యవనసేనావాహినులు దక్షిణ భారతము నంతయు ముంచెత్తినవి. కంపిలిరాయలు ఢిల్లీ సుల్తానుతో కోరి జగడము దెచ్చుకొనెను. లేనిచో నాతని రాజ్యము పతనము గాకుండెడిది. మహమ్మద్ బిన్ తుగ్లక్ ఢిల్లీ సుల్తాను మేనత్తకొడుకు బహావుద్దీన్, చక్రవర్తిపై తిరుగుబాటు చేసి పారిపోయి కంపిలిరాయల శరణుజొచ్చెను. ఆర్తత్రాణ పరాయణత హిందూరాజుల కాభిజాత్యధర్మము. బహావుద్దీన్‌ను కాపాడుటకై కంపిలిరాయలును అతని కొడుకు వీరవిక్రముడు కుమారరాముడును క్రీ. శ. 1327 ప్రాంతమున కుమ్మరదుర్గపతనమున మడసిరి. యుద్ధభూమిలో నసహాయ శూరుడై వీరవిహారముచేసిన కుమారరాముని మహమ్మదీయులు పలువు రేకమై బల్లెములతో గ్రుమ్మి చంపిరి. భారతీయుల యుద్ధనీతి ప్రకారము పలువు రొకని జంపుట యధర్మయుద్ధము. అభిమన్యునివలె అధర్మయుద్ధమున కాహుతియైన కుమారరాముని కథను చిలువలు పలువలుగా జేసి, అతిలోక ఘటనలు జేర్చి, జానపదులు పాడుకొనుచున్నారు. కథానాయకుడగు కుమారరాముని యుద్ధ మరణము చారిత్రకము. తక్కిన దంతయు జానపదుల కల్పనము. కుమార రాముని సైదోడు పోలిక రాముడు, అతని వర్తనము, కుమారరాము డాతని రక్షించుట, కుమారరాము డెల్లిభూపతిరాజు నోడించుట, ప్రతాపరుద్రుని జమాబందికి రప్పించుట, ఢిల్లీకోట గొట్టి తాళమువేసి వచ్చుట, శ్రీరాము డాంజనేయునితో కుమారరామ, పోలికరాముల నొసటి వ్రాతలు దుడిపించి వారికున్న యలౌకికశక్తుల నణగించి తురకలచే మడియునట్లు జేయుట, మున్నగు కల్పనలు జానపదులకు వారిపై గల యభిమాన జన్యములు, 'ఇదికథ ఇది మార్గ మినుపింతు వినుడి, పురజనులార యో పుణ్యాత్ములార' యనెడు మాటలచేతను మధ్యమధ్యన గల వచనాధిక్యముచేతను కుమారరాముని కథ గాంధారికథను బోలుచున్నది.

వీరగీతము కాకపోయినను రెడ్లనాటి యశఃప్రాభవమును వెలార్చు చిన్నగీత మొకటి కలదు. శ్రీనాథునిచే కాశీఖండము కృతినందిన రాజ మహేంద్రవర రెడ్డిరాజగు వీరభద్రారెడ్డి (1440 ప్రాంతము) నామాంకితముగా నీగేయమున్నది. ఇది సిసలైన జానపదగేయము. స్త్రీలు పాడుకొనునట్టిది. ఈ గీతికాశకలమును కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారు ప్రకటించి యున్నారు[1]. గేయము చిన్నదగుట దాని నిట పేర్కొనుట యప్రస్తుతము కాదనుకొందును.

1. ఆంధ్రుల సాంఘిక చరిత్రము. పుట157.

"రెడ్డొచ్చె రెడ్డొచ్చె రెడ్డొచ్చె నమ్మా
వీరభద్రారెడ్డి విచ్చేసె నమ్మా
ప్రొద్దున్నె మారెడ్డి పొరకూడిపించు
నిలువెల్ల నడివీధి నీరు జల్లించు
సందుగొందులలోన సాన్పు పోయించి
చేకట్ల పసుపుకుంకుమలు పూయించు
రంగవల్లుల నూప రాజింపజేయు
తోరణా పంక్తులా తులకింపజేయు
దివ్వెలను వెలిగించు దివ్యమార్గాలా
మాపెల్లి పాలించు మంచి మార్గాలా
ఎండలకు పందిళ్ల వేయించుతాడూ
పొందుగా మారేళ్ల పోయించుతాడూ
ఊరి బావులలోన ఉప్పు సున్నాలా
వెదజల్లి నేకేట నింపుపున్నానా ॥రెడ్డొచ్చె"

ఈగేయము రెడ్డిరాజుల కాలమునాటి ప్రజాజీవితమును చక్కగా చాటుచున్నది. ప్రజోపయోగములకై యా కాలపు రాజులు పురాలంకరణమును, పారిశుద్ధ్యమును, నీరు వెలుతురు సదుపాయముల నెట్లు చేయుచుండెడివారో దీనివలన గ్రహింప గలిగితిమి. ఈనాటి గ్రామ (పట్టణ) పారిశుద్ధ్యసంఘముల బాధ్యత లానాడు రాజులే నిర్వహించుచుండెడివారు. రెడ్డిరాజుల యొక్కయు ఆనాటి ప్రజలయొక్కయు కళామయ జీవితమును గూడ మనకీ గేయము చాటు చున్నది.

ఇట్టిదే చిన్న దింకొక గేయము శ్రీకృష్ణదేవరాయల కాలమునకు సంబంధించినది ప్రజలు పాడుకొందురు. దానిలోని రెండు చరణములు మాత్రమే శిష్టులకు పరిచితములు. ఈరెండు చరణములు కూడ శ్రీ ప్రతాపరెడ్డిగారు ప్రకటించియున్నారు[1].

"కొండవీడు మనదేరా కొండపల్లి మనదేరా
కాదని వాదుకు (ఎవరైనా) వస్తే కటకందాకా మనదేరా"

పూర్వకాలమున రాజులు యుద్ధయాత్రకు బయలుదేరునప్పుడు 'ఉపశ్రుతి' శకునము చూచుకొనెడివారు. శ్రీకృష్ణదేవరాయలవారు కటకముపై దండెత్తి పోవుటకు పూర్వము తిమ్మరుసు మంత్రి ఉపశ్రుతి సంభారము లొక చాకివాని

1 ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పుట. 230.

ఇంటిపై నుంచి పొంచి చూచుచుండెనట. ఆ యింటి రజకుడు తనకొడుకును లాలించుచు నీవీరగీత మాలపించెనట. అది శుభశకునముగా గొని మంత్రి సత్తముడు శ్రీకృష్ణదేవరాయల కెరిగింప నాతడు జైత్రయాత్రకై బయలుదేరెనని కథ చెప్పుకొందురు. ఇది రాయలసీమలో పుట్టిన గేయము. సాహితీసమరాంగణ సార్వభౌముని పరిపాలనమున రజకులు గూడ నిట్టి వీరగీతము లాలపించి రనుట ఆంధ్రుల వీరప్రతిభకు జయపతాక.

పదునెనిమిదవ శతాబ్ది ప్రారంభమున అటు ఓరుగల్లు మండలమునుండి ఇటు గోల్కొండవరకున్న భాగము నట్టుడికించినట్టి యొక పాళెగాని చారిత్రక గాథను పరామర్శింతము. ఇప్పటికిని తెలంగాణముననే కాక, రాయలసీమ మరియు సర్కారాంధ్రమున గూడ సర్వాయి పాపని కథకు ప్రసిద్ధి గలదు. ఈ గేయమున కింకొక ప్రత్యేకత కలదు. ఆంధ్ర జానపద గేయములను సేకరించవలెనని యుద్దేశముగలిగిన J. A. Boyle సేకరించిన ప్రథమ గేయమిది. J. A. Boyle గారొనర్చిన సేవను ప్రథమప్రకరణముననే మనవి చేసియుంటిని. ఆయనగారు సేకరించిన తొలిగేయ మిదియే. దీని గురించిన వారి అభిప్రాయము గమనింపదగినది[1]. సర్వాయిపాపని కథ యా

---

1. "The first ballad is apparently a modern composition sung by the family minsterl of a poligar, or petty chieftain in the Ceded districts. The man of the Boya Caste from whose mouth I wrote it, was a native of Bellary. The name of the hero, Papadu, marks him as a member of the Nayadu or Kapu Caste, but I have been unable to identify his family or history. Not only local traditions but sober records and offical history preserves the memories of turbulant poligars. Their forts or now crumbling ruins and their descendants have sunk up on the dead level of strugg- ling farmers but their stories live in the ballads that the family minstrel once sang at the little court, and which now linger in the memories of a whole country side.

The minstrel tells us nothing of the hero's parentage except his mother's name, Saramma but plunges in mediasres at once with a kind of war cry of the hero."

The Indian Antiquary Vol. III. 1874.

పాశ్చాత్యపండితుడు పూర్తిగా సేకరించెనో లేదో కాని ఇదే వ్యాసమున రోమను లిపిలో దీనికి సంబంధించిన గేయభాగముల కొన్నింటి నుట్టంకించెను. అవి ఇవి.

వస్తావై తాను సర్వాయిపాపడు
తల్లి కొలువుకు వడిగా వెళ్లేను
తల్లికి వందనముగా నిలిచేను.
మేను కట్టి వ్యవసాయము అమ్మ
ఎంగిలి ముంతా ఎత్తా లేను
కొట్టుదును గోల్కొండ పట్నము
ఢిల్లికి హుజూరు[1] సౌదును
మూడు గడియల బందరు కొట్టుదును
మూలకోట కందనూరు సూచి
బంగారు కడియాలు పెట్టుదును
మనకంతా బంట్రోతుతన మేలు
మన కులకాయి[2] మానవద్దురా సర్వాయి పాప

... ... ...

అదిగో పాపడు వస్తాన్నంటే
కుంటేళ్ల కమ్ముండ పడెను
లేడి పిల్లలు లేవ లేవు
పసిబిడ్డలు పాలు తాగరు
నక్కలు సింహాలు తొక్కబడును

... ... ...

పాపడు తాగేటి కల్లు
మేతాటి తాటికల్లు
వేలు పెట్టితే వేలు తెగును
చిటికి పెట్టితే బగ్గున మండును
తాగేటప్పుడు తియ్యగ వుండును
తాగినవాణ్ణి లేవనివ్వదు
లేచినవాణ్ణి పోనివ్వదు

1. హుజూరేమో?

2. కులకాయి యనగా కులవృత్తి. తెలంగాణమున నిది వాడుకలో నున్నది. కులకశిపి యను పదముగూడ గలదు.

ఈ గేయభాగములకు బోయల్ పండితు డాంగ్లానువాదము గూడ ఇచ్చి యున్నాడు. ఈ భాగములు తరువాత నచ్చైన ప్రతులందు లేవు. కాని యీ యర్థ మిచ్చునట్టి మాటలున్నవి. ఈ ఏకవు చారిత్రకగేయములను దేశమం దంతటను ఎవరి యిష్టము వచ్చినటుల వారు పాడుకొనుట యాచారమైపోయినది. సేకరణము కూడ అటులే జరిగియుండును. నాకు లభించిన ప్రతి గుండు జగన్నాథం అండ్ సన్స్, రాజమండ్రి వారు 1934 లో అచ్చువేయించినది. వెస్టువార్డ్ అండ్ కో వారు 1931 లో అచ్చువేసిరట[1]. బోయల్‌గారు కథా నాయకుడు రాయలసీమవా డనుకొని పాపడి చరిత్ర త్రవ్వి విఫలులైరి. శ్రీహరి ఆదిశేషువుగారు కూడ ఇట్లనిరి. 'ఈ సర్వాయిపాపడి కథకు చారిత్రకమైన ఆధారాలు కన్పించవు. పారంపర్యా పాడుకలో ఉన్న ఈకథనీ, ఇలాంటి ఇతర రచనల్నీ సేకరించడమూ, వాటికి చరిత్రదృష్టిలో ఏమైనా విలువ ఉందా అని పరిశీలించడమూ మంచిది[2].' ఈ కథ తెలంగాణమునకు సంబంధించినది. మాయూర శారదకాంద్రు చెప్పగా విని అచ్చుపుస్తకముతో పోల్చి చూచితిని. కథలో భేదములేదు. వాక్యపద్ధతి వేరువేరు. అచ్చు ప్రతిలో లేని ఒండురెండు సంఘటనలు ఈ పాటకులు చెప్పగా వింటిని. అంతియ. ఇక అచ్చైన ప్రతి యందున్న కథావివరములు.

కథానాయకుడగు సర్వాయిపావన్న 'పుట్టినాది షులగాము (బెలగాము?) పెరిగినాది తాటికొండ, ఇంటిపేరు నాశనోళ్లు' వృత్తి ఆవుల గాయుట. ఆవుల గాయుచు అడవిలో నిద్రబోవుచుండగా 'పన్నెండుశిరసుల నాగసర్పం'పడగలెత్తి గొడుగు పట్టినది. రామేశ్వరము బోవు బ్రాహ్మణులిది చూచి 'గోల్‌కొండ యేల డానికి, యేడు గడియలు యేలడానికి, పాపడికి వంతమున్నా'దనిరి. పాప డింటికి వచ్చి తనకీ వృత్తి వలదనెను. తల్లి కులవిద్య మానవద్దనినది. 'ఇంటి ఆవుల మేపమంటాది సర్వమ్మ తల్లి—ఈతచెట్టు గీయమంటాది సర్వమ్మతల్లి— తాటికల్లే కట్టమంటాది, అంచకల్లే[3] కట్టమంటాది సర్వమ్మ తల్లి' పావని కామాటలు రుచింపవు. పాశెగా డనిపించుకొనవలెనని యాతని కోరిక.

1. కిన్నెర. సంక్రాంతి సంచిక. 1955.

2. జానపద గేయ వాఙ్మయ పరిచయము.

3. అంచెలపై దీసికొని పోయెడి కల్లని భావము. గుఱ్ఱములపై నెడ్లపై కల్లు నొక చోటినుండి మరియొక చోటికి గొంపోవుట అంచెలపై బోవుట యందురు.

గోలుకొండ, నెల్లూరు, బందరు, కడప, కందనూరు (కందనవోలు) మైసూరులను కొల్లగొట్టవలయు నని వాని యాశ. పాపని పేరు చెప్పినంత మాత్రమున.

"ఊరపిచ్చుక ఊరు చేరదు
పొట్టి పిచ్చుక పొలము చేరదు
కొజులూ కారాడుతుందు
నక్కలు నాట్యము దొక్కును. ఇంతియ కాదు.
పందికొక్కు దోలు కొడ్తావో వాదేటంటే
దొంతి కుండలు గంతు లేస్తాయి ,,
పసిబిడ్డలు పాలు తాగారూ ,,
గుజ్జాలూ గుగ్గిళ్ల తినవూ ,,
యేనుగుల మేత అందావూ వాడిపేరంటే" అతనికి చేదోడు వాదోడుగా

తురక హసేన్ హుసేన్ గాడు, హిమామ్ (మ్) గాడు, దూదేకుల పీరుగాడు, జక్కుల పెరుమాళ్లు, నెల్లూరి హనుమంతు, చాకలి సర్వన్న, మంగలి మాసన్న, కుమ్మరి గోవిందమ్మ(న్న) మున్నగు నేస్తకాండ్రుండిరి. వీరందరిలో కోత్వాల్ మీర్ సాహెబు పెద్ద. ఈ పేర్లన్నియును యతులు మలచినట్టివే. పాపడు వీరందరితో సాయుధముగా బయలుదేరి వచ్చుచుండగా చాకలి ఎల్లి తుమ్మెను. అందుకు తగిన శాస్తి చాకిదాని కయ్యెను. పాపడు మొగల్ గుంట తాటితోపు ప్రవేశించెను. అప్పు డచట కేవలము 'మాట్లాడే కల్లు, మైకమెత్తే కల్లు నిద్రపోయే కల్లు, దోవనడిచే కల్లు'మ్మబడుచుండెను. పాపనికి కావలసినది నరుకులాడెడు కల్లు. పాప డచ్చోటు విడచి ముందు నడచెను. కావలసిన కల్లొక తాటిచెట్టు వంగి వానికి పోసినది. పాపడు మిత్రులతో కల్లు త్రాగి బయలుదేరెను. మార్గమధ్యమున నొక ఎరుకత కనబడి ఏడుగురు పెండ్లాలు, 12 మంది లంజలతోపాటు ఏడుగడియలు గోలుకొండ నేలుదువని గద్దె చెప్పెను. పాప డింటికి వచ్చి తనకు కావలసిన ధనమీయనందున తల్లి సర్వమ్మను వేడినూనెలతో కాల్చి, ఆమె దాచుకొన్న ఏడు కొప్పెరల ధనరహస్యమును కక్కించెను. ధనమునకు కావలియున్న ఎల్లమ్మ దేవరకూడ పాపనికి భయపడెను. పాప డాధనముతో 'పన్నెండువేల దండురాణువను' సిద్ధము చేసికొని గోలకొండ నవాబుపై దండు వెడలెను. అచట ఏడుగడియల యుద్ధము జరిగినది. పాపడు,

"గిరగిర మంటూ పటాలు దిరిగెనేని
కొట్టితేనుగా పడిఉన్నాది క్రొవ్విదబ్బలు
నరికితేను మరి పడిఉన్నాది నాలికై పేగూలు
చేప చేప (శేరు?) బంగీ ఆకసముద్దలే భూమిన పడతాది
అప్పుడు తిన్నా పప్పు అన్నమే తెప్పలు వడుతుంది
యెగిరే వక్క శిరస్సులాకు యెవా సందు లేదు"

పాపనికి తాత్కాలికజయ మున్నదని నవాబు యుద్ధము మానెను. పాపని నవాబు గద్దె నెక్కించెను. ఆ తరువాత నవాబు 'మూడువేలకే తుపాకిబారు తయారు చేపించె'ను. అప్పుడు, 'అసి దెబ్బ తగిలినాది పాపడికై తేను.' ఇందరిని చంపిన తాను నవాబుచేతిలో చచ్చుట కిష్టపడక పాపడు 'బాకు ఎగుర వేసిగా రొమ్ము ఒగ్గినాడు, గరగరమంటా బాకు డిగ్గినాది, రామారామా అంటా ప్రాణ మిడిచినాడు.' పాపని వీరస్వర్గపు కథ పాడినవారికి విన్నవారికి భోగ భాగ్యములు కలుగును.

ఇందులో చరిత్ర, పుక్కిటి పురాణము రెండును కలిసిపోయినవి. పాపనికి పాము గొడుగుబట్టు కథ ఇతరకథలనుండి వచ్చినది. ఈ విషయము సాళ్వ తిమ్మరుసు కథయందేకాక నేను సేకరించిన తెలంగాణ వీరులగు సదాశివరెడ్డి సోమనాద్రి కథలందు గూడ నున్నది. కథానాయకునకు మహాత్మ్య మాపాదించుటకై జానపదు లొనర్చెడు కల్పన మిది. ఎరుకత గద్దె చెప్పుటకూడ అట్టిదే. పాపని ప్రతాపమును చెప్పునట్టి అతిశయోక్తులు ఇతరపదములం దితరవీరుల వర్ణించునప్పుడు కూడ కనబడును. ఇవి మన కతిశయోక్తులైనను జానపదగేయములందివి సాధారణములే. తాటిచెట్టు వంగి పాపనికి కల్లుబోయుట జానపదుల యద్భుతరసప్రీతికి తార్కాణము.

దీని చరిత్రను త్రవ్విపోసినవారు తొలుదొల్త శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు[1]. కాని తెలంగాణావాసులకు ఈ పాటతోపాటు కొంత చరిత్రము కూడ ఇదివరకే పరిచితము. ఓరుగల్లు నల్లగొండ మండలములందీ కథకు విశేషప్రచార మున్నది. మల్లంపల్లివారి యడుగుజాడలయందు నడిచి నేను మరికొంత చరిత్ర త్రవ్వితిని. ప్రాతకాలపు చరిత్ర గ్రంథములలో పాపని గూర్చిన విశేషము లున్నవి. ఇంగ్లీషు గ్రంథములకంటె[2] మౌలికములైన

1. అమరావతీ స్తూపము.

2. **Historic land marks of Deccan. T.W. Haig. Pages 77-78**

ఫారసీ గ్రంథములం[1] దధికాంశములు చూడగలిగితిని. T. W. Haig గారు ఖాఫీఖాన్ వ్రాసిన ఫారసీచరిత్రమునుండియే వస్తువు నేరుకొని యుండును. ఈ ఫారసీ చరిత్రమున పాపనిగూర్చి 630 నుండి 643 వరకు అనగా 13 పుటలు వ్రాయబడినవి. దానినంత నిట వ్రాయుటకు స్థలము చాలదు. వ్రాసినది మహమ్మదీయ చరిత్రకారు లగుటచేతనో, పాప దెదిర్చినది మహమ్మదీయ పాలకుల నగుటచేతనో, అతడు చెరబట్టినవారిలో కొందరు మహమ్మదీయ మతగురువులు కూడ నుండుటచేతనో, పాపడు దుర్మార్గుడుగా క్రూరుడుగా చిత్రింపబడినాడు. ఇదిగాకను ఈచరిత్రమున సర్వాయె వేరు పాపడు వేరుగా చెప్పబడినారు. వీరిరువురును మిత్రులట. (కథ చెప్పెడువారు సర్వమ్మ తల్లి యనియు పాపడు కొడుకనియు తల్లిపేరుతో కూడ ప్రసిద్ధుడై సర్వాయి పాపడయ్యె నందురు.) చరిత్రమందున్న విషయములు క్లుప్తముగా నివి.

పాపడు గౌడకులమున బుట్టెను. పెరిగి పెద్దవాడై దారులు కొట్టి ధనవంతుడయ్యెను తన బంధువులలో నొక విధవ (బహుశః అక్క)ను హింసించి ఆమె దాచియుంచిన నిధులు కైవసము చేసికొనెను. వెలిగందల పరగణాయందలి కోలాన (పోలాస?) జమీందారగు వెంకటరావు చెంత జమేదారుగా నుండి హనుమంతనెడు మరియొక దోపిడిగాని కలిసికొని దారులు కొట్టెను. అటనుండి పారివచ్చి భువనగిరి పరగణాలో చేరిన షాహపురమను చోటు చేరి సర్వాయెతో మైత్రి యొనర్చి సైన్యము కూర్చుకొని షాహపురమున మట్టికోట గట్టెను. ప్రజలు చక్రవర్తికడ మొరపెట్టుకొన, కొలిపాక నేలు రుస్తుమ్‌దిల్‌ఖాన్ పేర పాపని పట్టుకొన చక్రవర్తి యుత్తర్వు చేసెను. ఖాసింఖాన్ అను సర్దారుడు సైన్యముతో వచ్చి మొదట పాపని నోడించి పిదరకు తానే చచ్చెను. తురక సైన్యములు పారివచ్చెను. స్వయముగా రుస్తుమ్‌దిల్‌ఖాన్ సైన్యముతో వెడలి షాహపురపు కోటను నాశనముచేసి వచ్చెను. సర్వాయె, పాపడు ఇద్దరు కలిసి మరల నట రాతికోట కట్టించిరి. తోపులు ఫిరంగుల వంటి ఆయుధసామగ్రి కూర్చుకొనిరి. ఒకనాడు సర్వాయెకును పుర్‌దిల్‌ఖాన్ అను జమేదారునకును జగడమై యుద్ధరు కొట్టుకొని చచ్చిరి. పాపడు షాహపుర పాలకుడయ్యెను. రుస్తుమ్‌దిల్‌ఖాన్ షాహపురమును మూడు నెలలు ముట్టడించి పాపనినుండి కప్పముగొని తిరిగిపోయెను. పాపడు క్రీ. శ.

1. ఖాఫీఖాన్ చరిత్రము – రెండవభాగము.

# సర్వాయి పాపడు



విక్టోరియా & ఆల్బర్ట్ మ్యూజియం ( లండన్ ) లోని సర్వాయి పాపని చిత్రము ( 1750 ప్రాంతం ) శ్రీ జగదీశమిత్తల్ గారిచ్చినది.

# జానపదుల వాద్యములు



1, 20. పీరణములు, 2. గుమ్మెట (బుఱ్ఱ), 3. ఒగ్గు, 4. కోలలు, 5. శంఖము, 6. శారద, 7. అందెలు, 8. కటి వాద్యము, 9. డప్పు, 10. తప్పెట (జేగంట), 11. తాళాలు, 12. తంబూర, 13, 14. జమిడికలు, 15. చిరుతలు, 16. నాగస్వరము, 17. గజ్జెలు, 18. డక్కి, 19. పిల్లనగ్రోవి, 21. కొమ్ము.

౧౭౦౮ లో ఓరుగల్లు కోటను మూడునాల్గువేల పదాతివర్గము నాల్గయిదువందల అశ్వికదళముతో ముట్టడించి కొల్లగొట్టి లక్షల ధనము గొని వేలమందిని బందీలుగా గొనెను. ఖాజీమహమ్మదు భార్యను చెరపట్టెను. ఇంకకొన్ని దోపిడులు చేసి ధనము సేకరించి సైన్యమును పెంచుకొని పాపడు భువనగిరి దుర్గముపై కన్ను వేసెను. ఒకనాడు భువనగిరి చేరి కొల్ల గొట్టెను. షాహపురమునకు సమీపమున టాటికొండలో నొక దుర్గమును నిర్మించెను. దోపిడులు మరింత యధికమయ్యెను. తురక స్త్రీలను చెరపట్టి తెచ్చినవారికి పారితోషికము లిచ్చుచుండెను. ఈపట్టులందు పాపని మహాక్రూరునిగా చిత్రింపనైనది. షాహ ఇనాయత్ అను ముస్లింయోగి పాపని బాధలకు తాళలేక ఢిల్లీ చక్రవర్తితో మొరపెట్టుకొని 40 దినములలో చనిపోయెను. ఢిల్లీ చక్రవర్తి యూసుఫ్‌ఖాన్ రూజ్‌బిహానీ యనువాని హైదరాబాదు సుబేదారుగా నియమించి పాపని బట్టుకొనుటకు శాసించెను. రూజ్‌బిహానీ సైన్యమిచ్చి దిలావర్‌ఖానును పాపని పట్టుకొనుటకు పంపెను. దిలావర్‌ఖానునకు పాపనికి కొలిపాకలో యుద్ధమయ్యెను. పాపడు చాలమందిని గోలుపోయి రామలక్ష్మణులను తోపులతో చేరెను. (ఈ రామలక్ష్మణులను తోపులజంట రెండుమూడు కథలందు వచ్చినది. గద్వాల సోమనాద్రి కథలోకూడ నీ విషయమున్నది ) పాపని తమ్ముడు తురకలచే పట్టుబడి బందీగా నుంచబడి భార్యాసహాయమున నత్యంతనిపుణముగా తప్పించుకొనిపోయెను. తురకల సైన్యము లటుతరువాత షాహపురముపై దాడివెడలెను. అచ్చట పాపనికి పరాజయము కలిగెను. పాపడు తప్పించుకొని టాటికొండ దుర్గము చేరెను. అచ్చట నాల్గు నెలల యుద్ధము జరిగినది. చివరకు పాప డొంటరియై మారువేషముతో హుసనాబాదు చేరుకొని తన కులమువారి మోసమున పట్టుబడెను. యూసుఫ్‌ఖాను పాపడు దాచిన ధనమును లాగికొన్న తరువాత చిత్రవధ చేసి శిరమును ఢిల్లీకి పంపించి మొండెమును హైదరాబాదు ద్వారమున వ్రేలాడ గట్టించెను....ఇది కథ.

నిజానిజము లటువిడచి కేవలమీ చారిత్రకాంశములు కొన్నింటినిబట్టియు వ్రాయనకాని రచనావిధానము ననుసరించియు ఈ పాఠము పాక్షికమని మనము సిద్ధాంతీకరించుట కవకాశమున్నది. ముస్లిం వనితలను చెరపట్టి తెచ్చినవారికి పాపడు బహుమతులు పంచుట, ఓరుగల్లు ఖాజి భార్యను తన రాణివాసమున జేర్చి, యాతని బిడ్డను వేశ్యల కిచ్చి నాట్యాదులు నేర్పుమనుట,

తురకలు మొహర్రం పండుగలో నిమగ్నులైయుండ ఓరుగల్లుపై బడి పాపడు దోచుకొనెననుట, ముస్లిం మతగురువు పాపని చర్యలు ఢిల్లీ చక్రవర్తికి తెల్పి ఆ దుఃఖముతోడనే 40దినములలో మరణించెననుట వంటివి పాపడు తురకలకు విరోధియని తేల్చుచున్నవి. గోరంతలు కొండంతలు చేసి అతని మతపాక్షిక దృష్టితో ముస్లించరిత్రకారులు మహాక్రూరునిగా చిత్రించిరి. పైన పేర్కొన్నవి సంఘటనలు. ఇక రచనావిధానమున నున్న దోషముల నెత్తిచూపెదను. ఇంత దేశమును ఇంతమంది పాలకులను గడగడలాడించినవానిని కేవలము నీచుడగు, బందిపోటు దొంగయగు, క్రూరుడగు, మూర్ఖుడగు పాపడుగా వ్రాసినారు. అతని యనుచరు లత్యద్భుతముగా తప్పించుకొని పారిపోవు ఘట్టములందు దొంగలవలె మోసగ్రాండ్రవలె పారిపోయిరనియు తమ సేనలు పరాభూతములై యోడిపోయి వెన్నిచ్చి వచ్చినప్పుడు కేవలము తిరిగివచ్చెనను మాటలతో క్లుప్తపరచినాడు, పాపనిచేతిలో చనిపోయినవారిని-యుద్ధమున చనిపోయినవారిని-తురకలను వీరస్వర్గ మలంకరించిరనియు యుద్ధనిహతులై రనియు గౌరవముగా చెప్పి, పాపని సైనికులు నాశమైరనియు, కోటగోడలు నేలమట్టమయ్యెననియు చెప్పెను. తురక సర్దారులను భీమపరాక్రములుగా (రుస్తుమెసాని అనగా అపరరుస్తుములుగా) చిత్రించి పాపని దోపిడి దొంగగా చిత్రించినారు. కనుక వీరి వ్రాతలు పాక్షికములుగా భావింపవచ్చును.

పాటలో పాపడు గోలుకొండ సింహాసనము ఏడుగడియ లెక్కినట్లున్నది. దీనిలో తప్పక సత్య ముండియుండును. ఏడు గడియలు కేవలము ధ్వనిగా తీసికొన్నచో పాపడు ఏడుదినములైనను గోలకొండ నాక్రమించెననుకొనవచ్చును. అది గోలకొండ కాదందురా? ఓరుగల్లు భువనగిరి దుర్గములు తురకల యధీనమందున్నవానిని కొల్లగొట్టినట్లు ముస్లిం చరిత్రకారులే యంగీకరించిరి. ఇక నాత డేడుగడియలు పాలించిన పట్టణమేది? భువనగిరియే యందురా? అతడు హైదరాబాదును గూడ గడగడలాడించిన మాట వాస్తవము. దీని కాధార మీ క్రిందనున్న ముస్లిం చరిత్రకారుని మాటల కాంధ్రానువాదమును గమనించిన తెల్లమగును.

"సామ్రాజ్యాధికారముల మార్పు కాలమున నల్లరులు లేపినట్టి పాపడు మరియు నితరవిద్రోహుల నరికట్టుటకై హైదరాబాదును పరిసరప్రాంతములను పటిష్ఠము, సర్వసౌకర్యయుతముగా నొనర్చి హైదరాబాదు రక్షణకై యూసుఫ్

ఖానుని నిల్పి అతని కట్టివారి నణచుటకై నొక్కిచెప్పి షాహఆలం ఢిల్లీకి వెడలిపోయెను.'' మార్పుకాల మనునది కాంబజు (ఔరంగజేబు కుమారుడు) కాలమును సూచించును. ఆ కాలమున పాపడు అతని సహచరులు తప్పక హైదరాబాదునకేదో యుపద్రవమును కలిగించి యుందురు. పాటలో పాపడు వైరుల చేతజిక్కి వారిచే చచ్చుటకన్న తనచేత తానే చచ్చుట మంచిదని వీరోచితముగా పొడుచుకొన్నట్లుండ చరిత్రకారులు పాపని యూసుఫ్‌ఖాన్ చిత్రవధ చేసి శిరమును ఢిల్లీకి పంపించి మొండెమును హైదరాబాద్ ద్వారమునకు వ్రేలాడ గట్టినట్లు వ్రాసినారు. పాటలో నున్నది సమంజసముగా సహజముగా నున్నది. అభిమానము గల వీరులందరు శత్రువుల చేజిక్కినపుడు ఆత్మహత్యలు చేసికొన్నట్లును తమ ఆడుబిడ్డలనుకూడ నరికినట్లును మన కెన్నియో నిదర్శనము లున్నవి. ఇటు ఓరుగల్లునుండి అటు హైదరాబాదువరకు గడగడలాడించిన తెలుగు వీరుడు పాపడు చిత్రవధ గావింపబడె ననుట యసత్యము. ఐనను పాపడు స్వయముగా ఆత్మహత్య చేసికొని చనిపోయిన పిమ్మట కసిదీరని తురక లాతని కళేబరమును ఖండములుగా చేసి చరిత్రలో చెప్పుకొనినట్లు చేసియుందురు.

ఇట్లనుటచే పాపడు పూర్తిగా ధర్మస్వరూపుడని నా నిశ్చయము గాదు. ధనము కొరకు చరిత్రలో అక్కను, పదములో తల్లిని హింసించినట్లున్నది. తల్లినో, అక్కనో ఈ రీతిగా హింసించినవా డట్టిక్రూరుడే యై యుండ వలయుననుట మాత్రము సరికాదు. అతడు ధనము కోరినది ఏ జూదమునకో విలాసమునకో కాదు. సైన్యము కొరకు. రాజ్యకాంక్ష ఎంతలేసి పనులైనను చేయించగలదు. చక్రవర్తులు మహారాజులు రాజ్యముకొరకై, తండ్రులను కొడుకులు, కొడుకులను తండ్రులు, రాజులను మంత్రులు, దండనాథులు చంపి చంపించిన ఘట్టములు ప్రపంచచరిత్రమున పెక్కులున్నవి. వానియందిది యొకటి. కొల్లగొట్టుట యనునది ప్రతి బలముగల రాజు బలహీనుడగు రాజుపై బడినప్పుడు చేసిన పనియే! చరిత్రమం దున్నట్లు పాపడు శత్రురాజ్యములపై బడి కోటల బొక్కసములు ధనాగారములు కొల్లగొట్టి యుండును. అంతేకాని దారి దోపిడిగాడు మాత్రము కాడు. అది యాతని వృత్తిగాదు. తక్కువ కులమున జన్మించి కల్లుగీత వృత్తిగా, మొదట బ్రతికిన పాపడు తెలుగు దేశమును గడగడ లాడించుటయే కాక ఢిల్లీ చక్రవర్తికి సైతము తీరని సమస్యగా పరిణమించినాడన్న అతనిధైర్యసాహసములు వీరవిక్రమములు కొనియాడదగినవి.

ఇంచు మించుగా నిదే కాలమునకు సంబంధించినది 'దేశింగురాజు కథ'. కథాస్థలము తమిళదేశమైనను ఈ కథ ఆంధ్రదేశమంతను ప్రాకిపోయినది. ఈ జంగంకథ వ్రాసినది రావూరి వెంకటసుబ్బయ్య. వావిళ్లవారు ప్రచురించిన 1923 ముద్రణమున

"ఈ వసుధను వెలయుచు పురావాసుల నింపుమీర నేను
రావూరి వెంకట సుబ్బయార్యుండను పండితుండగాను
సంతసమున దేశింగురాజుకథ చక్కగ జెప్పెదను
వింతగ నీధరలో నందరు విస్మయమందగను" అని యున్నది.

N. V. Gopal & Co వారి 1952 ముద్రణమున,

"ఈ వసుధను నెల్లప్పుడు వాసిక నింపుమీర నేను"

అని మాత్రమే యున్నది. రెండవపాదము మాయమైనది. కాపీరైటును కాల గలుపుటకు ముద్రాపకులు చేయు భద్రతాచర్యలం దిది యొకటి. ఇందలి కథ చారిత్రకమైనను అలౌకికము, నమానుషమునగు విషయము లిందు చేరిపోయి నందున నిది పౌరాణికగాథవలె గన్పట్టును. దేశింగురాజు కథవలన తెలియవచ్చు చారిత్రకాంశములను చర్చించినవారు రావు బహద్దరు శ్రీనివాసాచారిగారు[1]. వారి కథనము ననుసరించుచు తెలుగుపాటలోని విశేషాంశములను శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు చర్చించియున్నారు[2]. కథాప్రదేశము నాధారముగా గొని నేను చరిత్ర పుటలు తిరుగవేయ మరికొంత సిసలైన చరిత్రము తెలిసినది. పదములో నున్న యభూతకల్పనములు తొలగించి చారిత్రకాంశములతో జోడించి నేను రెండు సంవత్సరముల క్రిందట దీనిని మరికొన్ని కథలతోపాటు వ్రాసితిని. హైదరాబాదు ప్రభుత్వ విద్యాశాఖవారీ కథలను ప్రచురించినారు[3]. వివరము లందు చూడనగును. ఇక పదమందలి కథను క్లుప్తముగా జెప్పి తరువాత చారిత్రకాంశముల నుల్లేఖింతును.

'నాకాధిపుడగు పాకారియు తా నధికభోగమునను
లేఖుల తోడుత సింహాసనమున తేజరిల్లగాను'

---

1. History of the rules of Jinji
2. Triveni
3. బాలసాహిత్యమాల - 6 వీరగాథలు

...ము వచ్చెను. ఇంద్రు డడుగ భూలోకమందలి వింతకథగా నారదుడీ ...సింగురాజు కథను చెప్పెను. (కొంతం నృసింహకవి రచించిన బొబ్బిలిరాజు ...కూడ ఈరీతిగనే ప్రారంభమగును.)

'పరమ ప్రసిద్ధము హైదరాబాదు పురమనె గోల్కొండ
ఢిల్లీ భాగ్య మేలుచుండె మరి సల్లలితంబుగను'.

...ప్పుడు మేపపుకడ గోగుఫకీరనువాడు తపమాచరించి లోకాలోకములు ...బనగజాలనట్టి మహిమాన్వితమగు బారాహజారియను గుఱ్ఱమును బడసి ఢిల్లీ ...కొనెను. దాని గంభీరహేషారవ మాలకించి పాదుషా ఫకీరునకు బహుమతు ...చ్చి దాని గొని

'ఈగుఱ్ఱము నెక్కినవారల కిక బహుమతు లిప్పింతు
బాగుగ ఎక్కనివారల ఖైదులో వేగమె పెట్టింతు'

...టి చాటించెను. ఎందరో వీరు లాప్రయత్నము చేసి విఫలులై కారాగారము ...కొనిరి. పాదుషాగారి దివానగు రాజలింగబాబు, చెంజికోట నేలెడు శూర సింగు ధరణిసింగులను సోదరశూరుల నెరుకపరచెను. పాదుషా 'పెద్ద కరణమగు ...సింగపిక్కను బిల్వుమనుచు పంపి' చెంజికి లేఖలు వ్రాయించెను. పాదుషా లేఖలందుకొని శూరసింగు వచ్చి గుఱ్ఱమెక్కజాలక కారాగారబద్ధుడయ్యెను. శూరసింగు బయలుదేరిన ఏడు దినముల కాతని భార్య రాంబాయి ప్రసవించి మగశిశువును గనినది. పుత్త్రోత్సవవేళ తామెకు భర్తృకారాగారవాస వార్త తెలిసి 'పురుషుడు లేని యిల్లేటికి కాపుర మిక నేమిటికి, పురుషుడు లేని పుర మేమిటికి పుత్రుం డేమిటి'కని విలపించెను. పుట్టిన శిశువునకు దేశింగని నామకరణము చేసిరి. దేశింగు పెరిగి ఐదేండ్లవాడయ్యెను. అతనికి తురక స్నేహితుడు మహమ్మదు బహిఃప్రాణము. అంత పిన్నవయసుననే దేశింగు

'పందెముచే నొక గుక్కకు మూడు పరువులు పారుచును
పంచేహించక పెద్ద ప్రాకులను నరగువ పెరకుచును
పులుల సింహముల నెదిరించుకొని పొడిచియు చంపుచు'నుండెను.

(ఇట బారాహజారికి యలౌకికశక్తిని ప్రసాదించినటులే ముందుముందు దాని నెక్కగల దేశింగునకుగూడ ఐదేండ్ల ప్రాయముననే జానపదు లమానుషశక్తి నంపద లిచ్చిరి.) దేశింగు తనతండ్రి చెరలోనున్న వార్త విని 'పన్నగశయనా

పంకజలోచన పద్మనాభ రారా' యని యిలువేల్పగు రంగనాథుని ప్రత్యక్ష మొనర్చుకొని, తల్లి సెలవంది ఢిల్లీకి బోయి, బారాహజారి నెక్కి తండ్రిని చెర విడిపించుకొని, తనకు బారాహజారిని, మిత్రునకు నీలవేణియను గుఱ్ఱమును పాదుషాకడ పారితోషికముగా గొని చెంజి చేరెను. రెండేండ్లలో దేశింగు తల్లి దండ్రులు చనిపోయిరి. పినతండ్రి ధరణీసింగు దేశింగునకు పట్టముగట్టెను.

అక్కడ ఢిల్లీ పాదుషా తన కూతును సాదుల్లాకును సర్దాపన కిచ్చి అరణముగా నార్కాడు మండలమిచ్చెను. ఈ మండలమున చేతిపట్టు, పాళ పాలెము, కళ్ళకురంజి, కళ్ళికోట, తిరువణ్ణామల, చెంగల్పట్టు, వెంకటగిరి కాళహస్తి, తిమిరికోట, కార్వేడు, చింజి, మున్నగు సంస్థానము లుండెను. పొరపాటున పాదుషా దేశింగునకిచ్చిన చెంజి ఇనామును అల్లునకిచ్చిన యరణమున చేర్చెను. ఆర్కాడు నవాబు అందరు సంస్థానాధీశ్వరుల వెంత దీసికొన్నట్లే దేశింగువెంత కప్పము దీసికొనుటకును, పన్నెండేండ్ల బాకీ వసూలు చేయుటకును, తోండ్రమల్లును సైన్యమిచ్చి చెంజికి పంపెను. మార్గ మధ్యమున ఆరణి వెంకట్రావువలన

'పదిపేల్తాలముల మెత్తు కత్తి చే పదిలంబుగ దాల్చి
పదవడి మెనిమిది వేల తులంబుల ఖాలా ధరియించు
మూడు మణుంగుల పేష్కజ్జా తన మొల దట్టిని జెక్కు'

దేశింగు పరాక్రమము విని భయపడెను. అప్పటికి దేశింగు వయసు 22 ఏండ్లు. దేశింగు వైష్ణవుడని తెలిసి తోండ్రమల్లు "పూని యెంగిలి యుమిచి సున్నమున పొసగ నామమేసి, యేనుగు నెత్తురు నడి నామముగా మానితముగ నేసి' దొంగ వైష్ణవుడై చెంజి చేరి భయముతో దేశింగును పైక మడిగెను. కాని దేశింగు కుపితుడై,

'తినిసిన చేపల నమ్మేది లబ్బికి కిస్తి కట్టవలెనా
కోటకు వెలుపల గుండురాళ్లను కొంచుక పొమ్మనుము
ధైర్యము గలిగిన మగవాడైతే తరలి వేగరమ్మనుమ'ని నవాబును నిందించి

పైకమీయక పంపించెను. బంగారునాయుడు నవాబునకు కుడిభుజ మయ్యెను.(ఇట సుమారిరువదిమంది పాళెగార్ల పేర్లున్నవి. రావు బహద్దరు శ్రీనివాసాచారిగారి ప్రదేశనామములను వ్యక్తుల నామములను చాలభాగము కనుగొనగలిగిరి)

నవాబు లక్షలసేనతో చెంజిమీదికి దండు వెడలెను. చెంజిక్రింద నున్న శేషనూరి యేటిగట్టున విడిసెను. దేశింగుకూడ యుద్ధమునకు సన్నద్ధుడై సహాయమునకు రమ్మని మహత్ఖానునకు మలకనూరికి వార్త పంపెను. పెండ్లి పీటలమీద గూర్చొనియున్న మహత్ఖానుడు వివాహకంకణమును వీరకంకణము గావించుకొని నీలవేణి నెక్కి మిత్రునకు తోడుపడ వచ్చెను. యుద్ధమునకు బయలుదేరనున్న దేశింగు తనభార్య సెలవందుకొన బోవ నామె 'ఘన విక్రమమున దండున జొచ్చి గ్రక్కున మీరలును, ముందు నరుకునకు పుడమిన ఒరిగినను ముఖ్యంబుగ నేను, సందేహము లేకను చేసెద సహగమనము నేను, వెన్నుపోటుచే ధరగూలిన మిము కన్నులతో గనను' అని వీరనారీమణి కుచిత మనునటుల బలికెను. దేశింగు బయలుదేరునపు డన్నియు నపశకునములే పుట్టెను. ఎన్నడు లేనిది బారాహజారి కన్నీరు గార్చెను. ఇలువేల్పు రంగనాథు డపశకునములే సూచించెను.

'పటువగు దేవుని మెడలో హారం బట తెగి భువి పడెను
పటపటమని గోపురశిఖరంబులు పడెను భూమియందు
గ్రక్కున స్వామియు ముఖమును పడమటిదిక్కు త్రిప్పె నటను'.

దేశింగు బయలుదేరుచున్నవార్తతెలిసి ఇంతవరకు సేనావ్యూహము బన్నని నవాబు మరియు బంగారునాయు డాలోచించి దేశింగున కాటంకము కలిగింప నుద్దేశించి మలయనూరు, తాయనూరు, చెరువుల తెగకొట్టించి రెండు సేనలకు మధ్యన ప్రవహించు శంకరాభరణ నది ఉప్పొంగున ట్లొనర్చిరి. దేశింగది సరకుగొనక తన సేనతో నుప్పొంగు నదిలో దుమికి, కొలదిమందితో దాటివచ్చెను. శత్రువు లీదృశ్యమును చూచి యాశ్చర్యపడిరి. దేశింగు వలదన్నను మహత్ఖానుడు తానొంటరిగా ముందు యుద్ధమునకు దలపడెను. అతడు సుభంగి సేనను హత మార్చి, షేకు మహమ్మదను సర్దారును చంపి, బంగారునాయుని సేనను కలత పరచి, తిరిగి దేశింగును చేరబోవుచుండ ఫిరంగిగుండు దెబ్బ తగిలి చనిపోయెను. శత్రువులు నీలవేణిని పట్టుకొన యత్నించిరి కాని యది చిక్కక మిక్కిలి చాకచక్యముతో తుపాకిగుండ్ల వర్షమును తప్పించుకొని

పొంచెను మించెను బలు యుక్తుల దలంచె నీలవేణి
వంగుచు లేచుచు వ్రాలుచు దుముకుచు వచ్చె నీలవేణి

కుంకుమ జాజులు త్రొక్కినట్లు చిలుకలు సొంపై నవచే నట్లు
చిలుకల నవ్వులు నాంతారాల పాడేటొంటె నట్లు'

నీలవేణిని జూచి దేశింగు తన మిత్రుడు యుద్ధనిహతు డయ్యెనని తెలిసికొ
రానే బయలుదేరి తన సైనికులకు,

'పరుగెత్తువారల పడవేసి మీరలు పట్టవద్దు సుమ్మీ
జడిసినవారల జవిసినవారల జంపవలదు సుమ్మీ
మేకువేయుండినవారల మీరలు ముట్టించగ వలదు
పైకురాకయు లాహిరిచే నుండినవార్ని జంపవలద'ని బోధించెను.

(ఇది దేశింగు యుద్ధధర్మమును ధీరోదాత్తతను సూచించును.) దేశింగు
రణరంగవిహార మద్భుతముగా వర్ణింపబడినది. అతడు మొదట దావూద్‌ఖాను
నెదుర్కొనెను.

'తురుమును సరికెను దేశింగురాజు కరకువలన మనుద
మరి గుఱ్ఱంబుల దుంట్లు దుంట్లుగా నరికి నరికి వేసి
తొండ్లదంట్లు తెగవేసిన తీరున పొరబడి దండులను
ఉన్నవారి నటు జానకట్టుగా ఉక్కడగించుచును'

దేశింగు 50 వేల గుఱ్ఱపు దళముల నరికి, నవాబనుకొని దావూద్ఖానుని చంపెను.
కాని తన పొరపాటు వెంటనే తెలిసికొనెను. మరల యుద్ధమునకై పూనుకొన
రంగనాథుడు యుద్ధము వలదనెను. కాని దేశింగు వినక యుద్ధము చేయుచుండెను.
నవాబుని విక్రమము గాంచి సంధికై ప్రయత్నించెను. కాని దేశింగు అంగీకరింప
డయ్యెను. పారాహజారిని లేపి దేశింగు నవాబుదండు పైబడి సర్దారుల నందరి
బరిమార్చి నవాబును పట్టుకొనెను. నవాబుతో దేశింగు 'చెంజి పైకము తీసి
కొనుము నా చేతికత్తి మొనను' అన్నమాట యత్యంత వీరరసగర్భితము.
దూఖిర్షము వీ తెనుగుమాటలు తీయగా చెప్పినవి. దేశింగు ఏనుగుపై నున్న
నవాబును చంపుటకు తన గుఱ్ఱమును వెనుక కాళ్ళపై లేపగనే, యేనుగు కడుపు
తొట్టినుండు మాష్టికుడు పారాహజారి వెనుక కాళ్లు తెగనరికెను. దేశింగు
పాదచారియై యుద్ధ మొనర్చి ఎందరినో చంపెను. అతడిప్పటికే పూచిన
మోదుగయ్యెను. భగవంతుని ధ్యానించి శత్రువు చేజిక్కక పొడుచుకొని
చచ్చెను. దేశింగు కళేబరమును సమీపించి నవాబు,

'ఇంత శూరుడని తెలిసితె నేను అప్పుడు దేశింగూ
ఇంత రాజ్యము యేలుమనుచు నీ కిత్తుర దేశింగూ' అని సగౌరవముగా

నా కళేబరమును చెంజి కోటలోనికి గొంపోయెను. భర్త వీరమరణ మందెనని తెలిసికొని దేశింగు భార్య సహగమన మొనర్చెను.

ఈ జంగం కథ రచయిత కొంత చదువుకొన్నవాడై యుండును. యతి ప్రాసలు చక్కగా పాటించినాడు.

'రూఢముగా దెల్పుము నీ వనగా ద్రుహిణపుత్రు డనియెన్' అనుటచే కవికి యతిగురించిన పట్టింపు తెలిసిపోయినది. నారదుని ద్రుహిణపుత్రుడనుట యతికొరకే. ఈ శబ్దము సామాన్యునికి తెలియదు.

ఇక నీకథ నభూతకల్పనలనుండి వేరుచేసినచో మిగిలెడు చారిత్ర కాంశముల పరిశీలింతము. మహారాష్ట్రుల పాలనమందున్న జింజికోట ఔరంగజేబు కాలమున నతికష్టముతో మొగలుల వశమయ్యెను. ఇది ఆర్కాటు మండలమందున్న కోటలందు బలవత్తరమైనది. దావూదుఖానుడు ఆర్కాటు సేనాపతిగానున్న కాలమున ఔరంగజేబు పాదుషా, క్రీ.శ. 1700 సంవత్సరమున సురూపసింహుడను బుందేలుఖండక్షత్రియున కాతని శౌర్యమును మెచ్చి, అతడొనర్చిన సహాయమున కలరి, జింజికోటను ఇనాముగా నిచ్చెను. చుట్టునున్న 12 లక్షల ఆదాయముగల పాళెములా జింజికోటక్రింద నుండెను. రామకృష్ణుడు దివానుగను షేక్ నూర్ దళాధిపతిగను నియమింపబడిరి. 5000 సర్కారీ సిబ్బంది సురూపసింహుని యధీనమందుండెను. అతడు ఔరంగజేబుచే 'పంచ్ హజారీగా' నియమింపబడెను. సురూపసింహునకు 300 రాజపుత్ర సైన్యముండెను. క్రీ. శ. 1704 సంవత్సరమున సాదతుల్లాఖానుడు ఆర్కాటు సేనాపతి యయ్యెను. ఈతడే 'నవాయతు' అనబడు ఆర్కాటు నవాబులకు మూలపురుషుడు. నాటి దుర్గాధిపతులు ఆర్కాటు నవాబు ద్వారమున ఢిల్లీ చక్రవర్తికి కప్పము చెల్లించుచుండగా సురూపసింహుడు స్వతంత్రునివలె వ్యవహరించెను. ఔరంగజేబున కాతనిపైగల యభిమాన మట్టిది. ఔరంగజేబు తరువాత బహద్దరుషా చక్రవర్తియయ్యెను. ఆకాలమున రేగిన యల్లరులవలన బహద్దరుషా జింజి విషయమున నెట్టి జోక్యము కలిగించుకొనడయ్యెను. బహద్దరుషా తరువాత ఫఱ్ఱూఖ్‌సియర్ ఢిల్లీ సుల్తానయ్యెను. సాదతుల్లాకు

సురూపసింహుని స్వాతంత్ర్యప్రియత్వము నచ్చక చక్రవర్తితో ...
మొదటినుండియు నీయవలసిన కప్పము పదమూడేండ్ల ధనము ...
తేల్చిచెప్పెను. ఢిల్లీ సుల్తాను ధనమును వసూలుచేయుటకు సాదతుల్లాఖా...
పంపెను. ఔరంగజేబు తనకు ఇనాముగ నిచ్చెనేకాని కప్పము కట్టుటకు ...
సురూపసింహుని భావము. ఇదిగాకను 70 లక్షల ధన మెక్కడ...
తేగలడు ? ఈ చింతతో నాతడు మంచము పట్టెను. తమ్ముడు ...
వార్తను సురూపసింహుని కుమారుడగు తేజసింగు(దేశింగు)నకు ...
మందుండగా (బుందేల్ ఖండ్) వర్తనంపెను. తేజసింగు మహా...
యువకుడు. మూడువందల అశ్వికులతో భార్యా సమేతుడై యాతడు ...
బయలుదేరెను. కన్నడదేశము చేరి తన తండ్రికి మిత్రుడును, మహా...
విపత్తులో మునిగినవాడునగు బేదనూరు పాలకునికి సహాయమొనర్చి, ...
వలన వెలలేని భూషణములు 1200 రూకలు పెట్టి కొన్న ఉత్తమా...
(ఇదే బారాహజారిగా పదకర్త వర్ణించినాడు) కానుకలంది జింజికి ...
దేరెను. కాని యాతడు జింజి చేరునప్పటికే సురూపసింహుడు కాలధర్మము...
దేశింగు జింజీ దుర్గాధిపతి యయ్యెను. అతని వయస్సు అప్పటికి 25 ...
కొంతకాలమూరకుండి సాదతుల్లా మరల దేశింగును కప్పమడిగెను. ఆ ...
వృత్తాంత మతిశయోక్తులతో పదకర్త వర్ణించినాడు. దేశింగునకు కుడిభుజము...
నున్న మహాబత్తానుని మైత్రి ప్రశంసనీయము. వారిరువురు కొలది సైన్యము...
ఆర్కాటు నవాబు మహాసైన్యములను గడగడలాడించిన వీరులు. తేజసిం...
3 వ అక్టోబరు క్రీ. శ. 1714 శనివారము సాయంకాలము మరణించెను ...
యుద్ధమొనర్చినచోట పతేపేటయను గ్రామము వెలసినది. వీరుల సమా...
గోరీలు నిర్మింపబడినవి. ఈ చారిత్రకాంశములు నాకు లభించినవి. 'South Indian History' అను గ్రంథమున. మౌలిక గ్రంథములు వెదకిన ... నెన్ని విశేషాంశములు లభించునో !

తెలుగువారు వీర విక్రములనియు, ధైర్యసాహసోపేతులనియు, అభి... ధనులనియు, వారి శౌర్యమఖండమనియు, చేయెత్తి చాటునది 'బొబ్బిలికథ'. ఈ కథ నెరుగనివారు (జానపదులు) తెలుగు దేశమున నొక్కరైన నుండరన్న అతిశయోక్తి కాదు. వీరగీతములందింత సార్వజనీనతగల పదమింకొకటి లేదు. సిసలైన జానపదవీరగాథాగేయమున కుండవలసిన లక్షణము లన్నియు దీని

ని, సమకాలము, భాష, భావములు, పద్ధతి పూర్తిగా జానపదములవి. బొబ్బిలి
పైన కిప్పుడు మూడు పాఠములు గాన్పించుచున్నవి. మొదటిది, ప్రా. పు.
గారమున నున్నది; పెద్దాడ నాగేశము కొడుకు మల్లేశము చెప్పినది,¹
మల్లేశము బ్రౌనుగారికి కథ చెప్పినవాడో, అతనకు పూర్వుడైన రచయితయో
ము ఇది చక్కగానున్న నిర్దుష్ట చారిత్రక పదము. రెండవది పార్లపల్లి
ంట కొంతం నృసింహాచార్యులుగారి బొబ్బిలిరాజు కథ. దీనికి నాలుగవ
ప్రతిలో (1896) ప్రభల సీతారామయ్యగారు పరిష్కర్త, కాపీరైటు గుడిమెళ్ల
వారాప్పలది. దీనిలోనే బొబ్బిలి కథను నారదు డింద్రునకు చెప్పినట్లున్నది.
పీరైటు బాధను తప్పుకొనుటకు కాబోలు దీనిలోని మూడు పాదములకు రెండు
దముల చొప్పున(అనువ ; దించుకొని దేనువకొండవారట యెవరో నేడచ్చులో
న్న 'పెద్దబొబ్బిలి కథ' రచించిరి. ఈ మూడవది అందరి అస్తియైనది.

బొబ్బిలి పదమున వీరకరుణములు రెండును పెనవేసికొన్నవి. దీనికి
నిర్ణాణము

'రామరామ యనంత కాలము రాజ్య మేలలేము
జగము వుండు కాలమువరకు మనము వుండబోము'

అనునది బొబ్బిలివారి యుద్ధనినాదము (War Cry). రంగారావు, తాండ్ర
పాపయ్య, అచ్చముగా మూర్తీభవించిన ఆంధ్రపౌరుషము. భేరీ రామకృష్ణ
వైశ్యకులమునకు వీరపతాక, బొబ్బిలిలో పుట్టిన ప్రతి ప్రాణి శౌర్యావతారము.
కనుకనే ఈ పదము ప్రజలందు వ్యాప్తి చెందుటయేకాక శిష్టుల చేతులందు
కావ్యములుగా² నాటకములుగా³ వెలసినది. కథ సుప్రసిద్ధమైనదే యైనను
మూడింటియందును కొంచెము కొంచెము భేదములున్నవి. బొబ్బిలి నిర్మాణము
వెంకటగిరి సంస్థానాధిపతులలో 18వ వారైన పెదరాయనింగా రొనర్చిరట.
శ్రీకాకుళము నవాబు షేర్‌మహమ్మదుఖానుని పేరుతో నీదుర్గనిర్మాణము
జరిగినదట. ఉర్దూ భాషలో బెబ్బులిని షేర్ అందురు. ఆ బెబ్బులి బొబ్బిలి
యైనదట. షేర్‌మహమ్మద్‌ఖాను పేరుతో బొబ్బిలి వెలసినదనుట భ్రమ

1. డి. నెం. 2556 ప్రా. పు. భాండాగారము, మద్రాసు.
2. రంగరాయ చరిత్రము-దిట్టకవి నారాయణకవి క్రి. శ. 1790.
3. బొబ్బిలి యుద్ధము-శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి.

సురూపసింహుని స్వాతంత్ర్యప్రియత్వము నచ్చక నక్రౌర్యముతో అతని
మొదటినుండియు నీయవలసిన కప్పము పదమూడేండ్ల వరకు 70 లక్షల
తెచ్చిపెట్టెను. ఢిల్లీ సుల్తాను ధనమును వసూలుచేయుటకు సాదతుల్లాఖానును
పంపెను. ఔరంగజేబు తనకు ఇనాముగ నిచ్చెనేకాని కప్పము కట్టుటకు కాదు
సురూపసింహుని భావము. ఇదిగాకను 70 లక్షల ధన మొక్కసారి ఎట్లు
తేగలడు? ఈ చింతతో నాతడు మంచము పట్టెను తమ్ముడు మరణించెను
వార్తను సురూపసింహుని కుమారుడగు తేజసింగు(దేశింగు)నకు బుందేల్
ఖండమందుండగా (బుందేల్‌ఖండ్) వార్తనంపెను. తేజసింగు మహావీరుడు
యువకుడు. మూడువందల అశ్వికులతో భార్యా సమేతుడై యాతడు జింజికి
బయలుదేరెను. కన్నడదేశము చేరి తన తండ్రికి మిత్రుడును, మహారాష్ట్రుల
విపత్తులో మునిగినవాడునగు పేరునూరు పాలకునికి సహాయమొనర్చి, అతని
వలన వెలలేని భూషణములు 1200 రూకలు పెట్టి కొన్న ఉత్తమాశ్వము
(ఇదే పారాహజాతిగా పదకర్త వర్ణించినాడు) కానుకలంది జింజికి బయలు
దేరెను. కాని యాతడు జింజి చేరునప్పటికే సురూపసింహుడు కాలధర్మమందెను.
దేశింగు జింజీ దుర్గాధిపతి యయ్యెను. అతని వయస్సు అప్పటికి 25 సంవత్సరములు.
కొంతకాలమూరకుండి సాదతుల్లా మరల దేశింగును కప్పమడిగెను. ఆ తరువాతి
వృత్తాంత మతిశయోక్తులతో పదకర్త వర్ణించినాడు. దేశింగునకు కుడిభుజముగా
నున్న మహాబత్తాని మైత్రి ప్రశంసనీయము. వారిరువురు కొలది సైన్యముతో
ఆర్కాటు నవాబు మహాసైన్యములను గడగడలాడించిన వీరులు. తేజసింగు
3 వ అక్టోబరు క్రీ. శ. 1714 శనివారము సాయంకాలము మరణించెను వారు
యుద్ధమొనర్చినచోట పతేపేటయను గ్రామము వెలసినది. వీరుల సమాధులు
గోరీలు నిర్మింపబడినవి. ఈ చారిత్రకాంశములు నాకు లభించినవి. 'South
Indian History' అను గ్రంథమున. మౌలిక గ్రంథములు వెదకిన నింక
నెన్ని విశేషాంశములు లభించునో!

తెలుగువారు వీర విక్రములనియు, ధైర్యసాహసోపేతులనియు, అభిమాన
ధనులనియు, వారి శౌర్యమఖండమనియు, చేయెత్తి చాటునది 'బొబ్బిలికథ'.
ఈ కథ నెరుగనివారు (జానపదులు) తెలుగు దేశమున నొక్కరైన నుండరన్న
అతిశయోక్తి కాదు. వీరగీతములందింత సార్వజనీనతగల పదమింకొకటి లేదు.
పిసరైన జానపదవీరగాథాగేయమున కుండవలసిన లక్షణము లన్నియు దీనికి

న్నవి. సుపరికారము, భాష, భావములు, పద్ధతి పూర్తిగా జానపదములవి. బొబ్బిలి యుద్ధమున కిప్పుడు మూడు పాఠములు గాన్పించుచున్నవి. మొదటిది. ప్రా. లి. భాండాగారమున నున్నది; పెద్దాడ నాగేశము కొడుకు మల్లేశము చెప్పినది.[1] ఈ మల్లేశము బ్రౌనుగారికి కథ చెప్పినవాడో, అతనికి స్వాధ్యుడైన రచయితయో తెలియదు. ఇది చక్కగానున్న నిర్దుష్ట చారిత్రక పదము. రెండవది పార్లపల్లి వాస్తవ్యులు కొంతం నృసింహాచార్యులుగారి బొబ్బిలిరాజు కథ. దీనికి నాలుగవ కూర్పులో (1896) ప్రథల సీతారామయ్యగారు పరిష్కర్త. కాపీరైటు [illegible] వారివాచ్యులవి. దీనిలోనే బొబ్బిలి కథను నారదు డింద్రునకు చెప్పినట్లున్నది. కాపీరైటు బాధను తప్పుకొనుటకు కాబోలు దీనిలోని మూడు పాదములకు రెండు పాదముల చొప్పున(అనువ దించుకొని ధేనువకొండవారట యెవరో నేడప్పులో నున్న 'పెద్దబొబ్బిలి కథ' రచించిరి. ఈ మూడవది అందరి అప్తియైనవి.

బొబ్బిలి పదమున వీరకరుణములు రెండును పెనవేసికొన్నవి. దీనికి ప్రాణము

'రామరామ యనంత కాలము రాజ్య మేలలేము
జగము వుండు కాలమువరకు మనము వుండదోము'

అనునది బొబ్బిలివారి యుద్ధనినాదము (War Cry). రంగారావు, తాండ్ర పాపయ్య, అచ్చముగా మూర్తీభవించిన ఆంధ్రపౌరుషము. భేరీ రామకృష్ణ వైశ్యకులమునకు వీరపతాక, బొబ్బిలిలో పుట్టిన ప్రతి ప్రాణి శౌర్యావతారము. కనుకనే ఈ పదము ప్రజలందు వ్యాప్తి చెందుటయేకాక శిష్టుల చేతులందు కావ్యములుగా[2] నాటకములుగా[3] వెలసినది. కథ సుప్రసిద్ధమైనదే యైనను మూడింటియందును కొంచెము కొంచెము భేదములున్నవి. బొబ్బిలి నిర్మాణము వెంకటగిరి సంస్థానాధిపతులలో 18వ వారైన పెదరాయనింగా రౌనర్చిరట. శ్రీకాకుళము నవాబు షేర్‌మహమ్మదుఖానుని పేరుతో నీదుర్గనిర్మాణము జరిగినదట. ఉర్దూ భాషలో బెబ్బులిని షేర్ అందురు. ఆ బెబ్బులి బొబ్బిలి యైనదట. షేర్‌మహమ్మద్ ఖాను పేరుతో బొబ్బిలి వెలసినదనుట భ్రమ

1. డి. నెం. 2558 ప్రా. పు. భాండాగారము, మద్రాసు.

2. రంగరాయ చరిత్రము-దిట్టకవి నారాయణకవి క్రి. శ. 1790.

3. బొబ్బిలి యుద్ధము-శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి.

సురూపసింహుని స్వాతంత్ర్యప్రియత్వము నచ్చక వక్రదృష్టితో అతడు మొదటినుండియు నీయవలసిన కప్పము పదమూడేండ్ల ధనము 70 లక్షలని తేల్చిచెప్పెను. ఢిల్లీ సుల్తాను ధనమును వసూలుచేయుటకు సాదతుల్లాకు ఫర్మాను పంపెను. ఔరంగజేబు తనకు ఇనాముగ నిచ్చినదేకాని కప్పము కట్టుటకు కాదని సురూపసింహుని భావము. ఇదిగాకను 70 లక్షల ధన మొకసారి యెట్లు తేగలడు? ఈ చింతతో నాతడు మంచము పట్టెను. తమ్ముడు ధరణీసింహుడీ వార్తను సురూపసింహుని కుమారుడగు తేజసింగు(దేశింగు)నకు స్వదేశ మందుండగా (బుందేల్‌ఖండ్) వార్తనంపెను. తేజసింగు మహావీరుడగు యువకుడు. మూడువందల అశ్వికులతో భార్యా సమేతుడై యాతడు జింజికి బయలుదేరెను. కన్నడదేశము చేరి తన తండ్రికి మిత్రుడును, మహారాష్ట్రులచే విపత్తులో మునిగినవాడునగు చేమనూరు పాలకునికి సహాయమొనర్చి, అతని వలన వెలలేని భూషణములు 1200 రూకలు పెట్టి కొన్న ఉత్తమాశ్వమును (ఇదే పారాహజారిగా పదకర్త వర్ణించినాడు) కానుకలంది జింజికి బయలు దేరెను. కాని యాతడు జింజి చేరునప్పటికే సురూపసింహుడు కాలధర్మమందెను. దేశింగు జింజీ దుర్గాధిపతి యయ్యెను. అతని వయస్సు అప్పటికి 25 ఏండ్లు. కొంతకాలమూరకుండి సాదతుల్లా మరల దేశింగును కప్పమడిగెను. ఆ తరువాతి వృత్తాంత మతిశయోక్తులతో పదకర్త వర్ణించినాడు. దేశింగునకు కుడిభుజముగా నున్న మహబత్ఖాను మైత్రి ప్రశంసనీయము. వారిరువురు కొలది సైన్యముతో ఆర్కాటు నవాబు మహాసైన్యములను గడగడలాడించిన వీరులు. తేజసింగు 3 వ అక్టోబరు క్రీ. శ. 1714 శనివారము సాయంకాలము మరణించెను వారు యుద్ధమొనర్చినచోట పతేపేటయను గ్రామము వెలసినది. వీరుల సమాధులు గోరీలు నిర్మింపబడినవి. ఈ చారిత్రకాంశములు నాకు లభించినవి. 'South Indian History' అను గ్రంథమున. మౌలిక గ్రంథములు వెదకిన నింక నెన్ని విశేషాంశములు లభించునో!

తెలుగువారు వీర విక్రములనియు, ధైర్యసాహసోపేతులనియు, అభిమాన ధనులనియు, వారి శౌర్యమఖండమనియు, చేయెత్తి చాటునది 'బొబ్బిలికథ'. ఈ కథ నెరుగనివారు (జానపదులు) తెలుగు దేశమున నొక్కరైన నుండరన్న అతిశయోక్తి కాదు. వీరగీతములందింత సార్వజనీనతగల పదమింకొకటి లేదు. సిసలైన జానపదవీరగాథాగేయమున నుండవలసిన లక్షణము లన్నియు దీనికి

యున్నవి. సమకాలము, భాష, భావములు, పద్ధతి పూర్తిగా జానపదములవి. బొబ్బిలి పదమున కిట్టివి మూడు పాఠములు గాన్పించుచున్నవి. మొదటిది, ప్రా. లి. భాండాగారమున నున్నది; పెద్దాడ నాగేశము కొడుకు మల్లేశము చెప్పినది.[1] ఈ మల్లేశము బ్రౌనుగారికి కథ చెప్పినవాడో, అతనికి సహాయుడైన రచయితయో తెలియదు. ఇది చక్కగానున్న నిర్దుష్ట చారిత్రక పదము. రెండవది పొన్నపల్లి వాసుడు కొంతం నృసింహాచార్యులుగారి బొబ్బిలిరాజు కథ. దీనికి నాలుగవ కూర్పులో (1896) ప్రభల సీతారామయ్యగారు పరిష్కర్త. కాపీరైటు గుడిమెళ్ల వరదాచార్యులది. దీనిలోనే బొబ్బిలి కథను నారదు డింద్రునకు చెప్పినట్లున్నది. కాపీరైటు బాధను తప్పుకొనుటకు కాబోలు దీనిలోని మూడు పాదములకు రెండు పాదముల చొప్పున(అనువ దించుకొని ధేనువకొండవారట యెవరో నేడచ్చులో నున్న 'పెద్దబొబ్బిలి కథ' రచించిరి. ఈ మూడవది అందరి ఆప్తమైనది.

బొబ్బిలి పదమున వీరకరుణములు రెండును పెనవేసికొన్నవి. దీనికి తార్కాణము

'రామరామ యనంత కాలము రాజ్య మేలలేము
జగము వుండు కాలమువరకు మనము వుండబోము'

అనునది బొబ్బిలివారి యుద్ధనినాదము (War Cry). రంగారావు, తాండ్ర పాపయ్య, అచ్చముగా మూర్తీభవించిన ఆంధ్రపౌరుషము. భేరీ రామకృష్ణ వైశ్యకులమునకు వీరపతాక. బొబ్బిలిలో పుట్టిన ప్రతి ప్రాణి శౌర్యావతారము. కనుకనే ఈ పదము ప్రజలందు వ్యాప్తి చెందుటయేకాక శిష్టుల చేతులందు కావ్యములుగా[2] నాటకములుగా[3] వెలసినది. కథ సుప్రసిద్ధమైనదే యైనను మూడింటియందును కొంచెము కొంచెము భేదములున్నవి. బొబ్బిలి నిర్మాణము వెంకటగిరి సంస్థానాధిపతులలో 18వ వారైన పెదరాయనింగా రొనర్చిరట. శ్రీకాకుళము నవాబు షేర్ మహమ్మదుఖానుని పేరుతో నీదుర్గనిర్మాణము జరిగినదట. ఉర్దూ భాషలో బెబ్బులిని షేర్ అందురు. ఆ బెబ్బులి బొబ్బిలి యైనదట. షేర్ మహమ్మద్ ఖాను పేరుతో బొబ్బిలి వెలసినదనుట భ్రమ

1. డి. నెం. 2556 ప్రా. పు. భాండాగారము, మద్రాసు.
2. రంగరాయ చరిత్రము-దిట్టకవి నారాయణకవి క్రీ. శ. 1790.
3. బొబ్బిలి యుద్ధము-శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి.

ప్రమాదజనితము. జానపదనిరుక్తి Folk etymologyవలన నిట్టి కల్పనములు జరుగుచుండును. నిశ్శంక కొమ్మన (1435) తన శివలీలా విలాసమున "చిద్వల్లి బొబ్బిలి క్షితినాథసుతులు సొంపలర వెంజామరములు వీవంగ" అనుటచే బొబ్బిలి 15 శతాబ్దమునకు పూర్వమే వెలసియుండవలెను. నిజాంనవాబుల కిది సామంతరాజ్యము. పెదరాయనింగారి కుమారుడు లింగపరాయనింగారికి నిజాంనవాబు 'రంగారావు' బిరుద మిచ్చెను. అది వంశక్రమానుగతముగా నడచినది. కొంతకాలమునకు బొబ్బిలి సంస్థానము విస్తీర్ణమును పెంచుకొనినది. బొబ్బిలి యుద్ధము జరిగిన కాలమున(24-1-1757) రంగారావు పాలకుడు. ఈకాలమున నిజాంరాజ్యమును పాలించినది నిజామల్లీ ఖానుడు; ఆసఫ్షాహి వంశమున రెండవవాడు. ఆనాడు హైదరాబాదులో ఫ్రెంచి వారి ప్రాబల్య మధికము. సుప్రసిద్ధ ఫ్రెంచియోధుడు 'బుస్సీ'గారికి నిజాం నవాబు కళింగ సర్కార్ల నిచ్చెను. కళింగసర్కార్ల జూడబోయిన బూసి (బుస్సీ) కెదురుగా రాజమహేంద్రవరమునకు సకలసామంతులు వచ్చిరి. కాని బొబ్బిలివారు రారైరి. విజయనగరరాజు విజయరామరాజునకును బొబ్బిలివారికిని ప్రాత పగలుండెను. బొబ్బిలివారు బుస్సీ శ్రీకాకుళపు సర్కారుకు విజయ రామరాజుకు కౌలుకిచ్చి తమను కించపరచు ననుకొని రారైరి. 'ఈవిజయ తమకును తమకును విరోధము లున్నను ఫ్రెంచివారిని దేశమునుండి వెడల నడపవలెనన్న యుద్దేశ్యముతో పూర్వవైరములను గట్టిపెట్టి బొబ్బిలిసంస్థానాధీశు లగు రంగారావుగారు జాఫరల్లీతో గూడియున్న విజయనగర ప్రభువులగు విజయరామరాజుగారితో కలియుట కంగీకరించి వచ్చి చేరిరి. అందరి సైన్యముల నొక్కటిగా కలిపిరి. కాని రాజమహేంద్రవరము శ్రీకాకుళము సర్కారులను, అసలు వారికి వచ్చు శిస్తుకన్న తక్కువ కౌలున కిచ్చెదనని చెప్పి మొరాసిన్ విజయరామరాజుగారిని జాఫరలీఖాన్నుండి విడదీసెను. ఆవిధమున రెండు సర్కార్లను మొరాసిన్ విజయరామరాజుగారి కిచ్చుట తమ స్థితికి క్షేమము కాదని యాలోచించి రంగారావుగారు ఫ్రెంచివారి కుద్వాసన చెప్పు విషయమున దీక్షను వహించి యా యుద్యమమున తా మొక ప్రధానపాత్రమును గైకొనిరి[1]." అందుకే రంగారావుగారు బూచి కెదురేగలేదు. దిట్టకవి నారాయణకవి మాటలు గమనింపుడు.

ఉ॥ పాయని పేడ్క విద్విషద పాయకరాయత బాహుశౌర్య లా
పాయకరాయడుం గిమిడి పట్టణపుం బృథివీశ్వరుండు నా

1. పెద్దాపుర సంస్థాన చరిత్రము. పుట. 73.

రాయబారమ్మున్ బుస్సిరాజు మరిన్ గెలుపుంత మన్నెపున్
రాయడు నావిగాదె దరావసు లందరు వచ్చి రత్తరిన్.

పట్టితిరయుద్ధ సంపద్రనోత్సుకత్వ
మాత్ర చిక్కాక రావాక నలుదు మన్నె
కాంచ వచ్చి యమానుషోగ్రప్రసంగ
దలిటుచిగి రంగరాయ ధాక్షుపుడు దక్షు'1

ఇదే యదనుగా గొని విజయరామరాజు బుస్సీకి బొబ్బిలివారిపై కొండెములు చెప్పి, బుస్సీకి దండనాథుడుగా నున్న హైదరుజంగును, లంచ మిచ్చి వశపరచుకొనెను. 'తమదేశములోనుండి విజయనగర రాజ్యములోనికి వారెడు కొంతకాలువను మళ్ళించి బొబ్బిలి రంగారావుగారి కాపులు తమ భూములకు పెట్టుకొనుచున్నందునను, దేశస్వభావమునుబట్టి బొబ్బిలివారిని సాధించుట సులభసాధ్యము కాకపోయినందునను, విజయరామరాజుగారు బుస్సీని తన వాక్ఛక్తిని వినియోగించి రంగారావుపై పురికొల్పెను. అందుమీద బుస్సీగారు బొబ్బిలి రాజ్యమును విడువవలసినదనియు, దానికి బదులుగా నధికవైశాల్యము నమూల్యమునైన దేశ మియ్యబడుననియు రంగారావుగారికి వ్రాసిరి. రంగారావుగారు పితృపితామహాగతమైన బొబ్బిలిరాజ్యమును విడుచుట కంగీకరింపక పోవుటయేగాక తక్కిన సంస్థానాధిపతులతోపాటుగా రాజమహేంద్రవరమునకు వచ్చి యాతనిని దర్శింపకపోయెను'2. కాని రంగారావు దీనికి ప్రతివిధాన మాలోచించి బందరు గోరుందొర, ఆయన యొద్దనున్న మద్దాలరెడ్డినాయుని నుండియు బూచికి సిఫారసు తెచ్చెను. ఈలోపల బుస్సీ మున్నగువారు ససైన్యముగా కసింకోటవరకు నడచివచ్చిరి. సిఫారసు ఉత్తరముతో మద్దైను, మంఛెన బుచ్చనలు వచ్చిరి. బొబ్బిలిపై నెత్తివచ్చు బుస్సీ హృదయము మారిపోయి శ్రీకాకుళమార్గము పట్టెను. తమ ప్రయత్నము విఫలమయ్యెనని విజయరామరాజు హైదరుజంగులు చకితులైరి. కాని బొబ్బిలివారినుండి కొంత ధనమైనను లాగుదమని బుస్సీకి జంగు మంత్రమూదెను. అది పారెను. రంగారావు దామెన్లదమ్మన్నను జంగుకడకు రాయబారమంపెను. కాని యాతడు

---

1. రంగరాయ చరిత్రము.

బొబ్బిలివారికి కోట విడిచి పొమ్మనెను. సైన్యములు నడచి యిప్పటికి ఒడ్డాది మీదుగా దేవులపల్లి చేరెను. రంగారావు చెలికాని వెంకయ్యను మరల రాయబార మంపెను. విజయరామరాజుకు తక్క తక్కినవారికి కోటవిడుతు మనిరి. ఖానుడు వినకపొయ్యెను. ఇది గాకను ఒకప్పుడు బొబ్బిలివారు కొందరు పరాసు సైనికులను (హైదరాబాదు) చంపియుండిరట. వీని నన్నింటిని ఖానుడు బుస్సీకి రంగారావు గారి యపరాధము గర్వముగా కల్పించి చెప్పెను. యుద్ధము తప్పదయ్యెను. జనవరి 24, 1757 నాడొక్క దినమున బొబ్బిలి యుద్ధయున సంఘాతమరణము సంభవించెను. మహావీరులు మరణించిరి. పరస్పరకలహమున నాంధ్రశౌర్యము ప్రాంసుపాలి యపాకిగుండ్ల కెరయైనది. పదములో నీచారిత్రకవిషయములు కొంచెం మార్పులతో కొన్ని యతిశయోక్తులతో క్రొత్త చరిత్రమును నిర్మించు కొన్నవి. 'హరిపాటివారి కైఫీయ' లో బొబ్బిలి నాశనమైన పిమ్మట విజయ నగరములో నున్న విజయరామరాజు డేరాలో తాండ్రపాపయ్య ప్రవేశించి పోరాడెను. ఆ పోరాటమునం దిరువురును మరణించిరి. పెద్దాడమల్లేశము మాత్రము తాండ్ర పాపయ్య విజయరామరాజును చంపిన తరువాతనే ఆత్మ హత్య చేసికొన్నట్లు వర్ణించెను[1]. ఇది జానపదులా వీరుని యందుగల యభిమానముచే చేసిన కల్పనమని నా భావము. సంఘాతమరణము పాలైన బొబ్బిలివారియెడ జానపదులకు పక్షపాతము. ఆ పక్షపాతమే విజయ నగరమువారిని దోషులుగా చిత్రించినది. నిజమగు చరిత్రము మాత్రము దీనికి విరుద్ధము. పదములో 'ఇరువై నాలుగు వేల దళముతో బూచే వచ్చెను'. విజయ రామరాజు 'తన లక్షతొంభై వేల దళముతో తానే వచ్చెను'. ఈ విధముగా మొత్తము సైన్యసంఖ్య రెండులక్షల పదునాలుగు వేలైనది. ఇది జానపదుల యతిశయోక్తి. దిట్టకవి నారాయణకవి విజయరామరాజుగారి బలసంఖ్య నిట్లు దెలిపినాడు.

ఉ॥ పదువదివేల కాల్బలము నాలుగువేల తురంగమంబులున్
పలువదియేబదేనుగు లనంతములైన శతఘ్నికాచయం
బలు నొకవేయి లొట్టియ లపూర్వ విభావిభవంబు దెల్పుచున్
గొలువ పరాసురేని గనుగో బనుదెంచెను రాజతిత్వరన్[2].

'కాని ఆయన వెంట నిజముగా వచ్చిన సేన 10,000 మాత్రమే యని

1. బొబ్బిలికథ, పుట, 122. డి.నెం. 2550 ప్రా.పు. భాండాగారము, మద్రాసు.
2. రంగరాయ చరిత్రము.

యాంగ్లేయ చంద్రికాపద్రైన ఆర్మ్ వ్రాసియున్నాడు. 250 గుఱ్ఱపు రౌతులును నాలుగు ఫిరంగులును 750 యూరోపియనులతోను విజయరామరాజుగారి భటులును సిపాయిలును గలిసిన 11000 స్వదేశీయ పదాతిబలముతోను బుస్సీగారు బొబ్బిలి కోటమీదికి దండు వెడలిరి.'[1] పదములో వెంకటలక్ష్మమ్మ, పసిపాప వెంకట్రావును తీసికొని రాజాం చేరి పాపారావుతో 'కోట విడిచి మీరిక్కడ కొచ్చిన తొమ్మిదోనాడూ, కోటమీదికే దళము దెచ్చెను విజయరామరాజు, మూడు దినములబాట యుద్ధము జరుగుచు యున్నాది' అనగా పాపారాయుడు 'మూడు దినములనుంచి యుద్ధము జరిగితే, కబురు లేక చేసినాడా రంగారాయుడు' అనెను. కాని నిజముగా బొబ్బిలి యుద్ధము జరిగిన దొక్కదినమే. ఉదయమున నారంభమై సాయంకాల మగువరకు బాల, స్త్రీ, వీర, వృద్ధ మారణముతో నిది ముగిసినది. పదకర్త విజయనగరమువారికి బొబ్బిలివారికి ప్రాతపగలు 'తుమ్మలగుంట యుద్ధము' మరియు 'జలజపాటీ యుద్ధము'ల నాటినుండియు నున్నట్లు వర్ణించినాడు. చరిత్రమున వీని కెట్టి స్థానము కలదో పరిశోధనీయము. పదకర్త శత్రువులు బొబ్బిలిచుట్టు 'పెద్దఫిరంగి బండ్లంతయు మొహర్లా లెత్తిరి, *రామలక్ష్మణ ఫిరంగికి మొహర్లా లెత్తిరి*' యనెను. ఈ రామలక్ష్మణ ఫిరంగులు ఇంతకు పూర్వమే వచ్చినవి. గద్వాల సోమనాద్రి కర్నూలు నవాబు నోడించి తన కోటపై నిలుపుకొన్నవి కూడ రామలక్ష్మణ ఫిరంగులే. జంట ఫిరంగు లెచ్చట తారసిల్లినను జానపదులు రామలక్ష్మణులని నామకరణ మొనర్తురు. ఇది రామలక్ష్మణసౌదర్యము పైనున్న మక్కువ.

బొబ్బిలి గడ్డపై జన్మించిన మనుజులే కాదు ప్రాణులన్నియు పౌరుషమున సాటిలేనివి. కోడిపందెము జరుగునప్పుడు బొబ్బిలివారు తమకోడితో

'చావంటెను మీకు భయపడవద్దు బారాకోడీ దా
యెన్నాళ్లు బ్రతికినా చావు సిద్ధము బారాకోడీ దా
బొబ్బిలియందున పుట్టినావురా బారాకోడీ దా' యని వీరబోధన

మొనర్చుట ప్రశంసనీయము. శత్రుసైన్యము లెటునుండి వచ్చునోయని కావలి కాయుచున్న తెలగబిడ్డలు మరచి నిద్రవోవుచుండిరి. అప్పుడు,

'గుర్రపు సందడి విన్నారయ్యా తెల్గా బిడ్డాలూ
పడకయుండె దట్టి కట్టిరి తెల్గా బిడ్డాలు.'

---

1. పెద్దాపుర సంస్థాన చరిత్రము. పుట, 77, 79.

బొబ్బిలివారిని కోట విడిచి పొమ్మనెను. సైన్యములు నడచి యిప్పటికి ఒడ్డాది మీదుగా దేవులపల్లి చేరెను. రంగారావు చెలికాని వెంకయ్యను మరల రాయబార మంపెను. విజయరామరాజుకు తక్క తక్కినవారికి కోటవిడుతు మనిరి. ఖానుడు వినవయ్యెను. అది గాకను ఒకప్పుడు బొబ్బిలివారు కొందరు పరాసు సైనికులను (ఫిరంగిపాటును) చంపియుండిరట. వీని నన్నింటిని ఖానుడు బుస్సీకి రంగారావు గారి యౌద్ధత్యము గర్వముగా కల్పించి చెప్పెను. యుద్ధము తప్పదయ్యెను. జనవరి 24, 1757 నాడొక్క దినమున బొబ్బిలి యుద్ధమున సంఘాతమరణము సంభవించెను. మహావీరులు మరణించిరి. పరస్పరకలహమున తాండ్రశౌర్యము ఫ్రాంసువారి తుపాకిగుండ్ల కెరయైనది. పదములో నీచారిత్రకవిషయములు కొంత మార్పులతో కొన్ని యతిశయోక్తులతో క్రొత్త చరిత్రమును నిర్మించు కొన్నవి. 'పూసపాటివారి కైఫీదు' లో బొబ్బిలి నాశనమైన పిమ్మట విజయ గర్వముతో నున్న విజయరామరాజు డేరాలో తాండ్రపాపయ్య ప్రవేశించి పోరాడెను. ఆ పోరాటమునం దిరువురును మరణించిరి. పెద్దాడమల్లేశము మాత్రము తాండ్ర పాపయ్య విజయరామరాజును చంపిన తరువాతనే ఆత్మ హత్య చేసికొన్నట్లు వర్ణించెను[1]. ఇది జానపదులా వీరుని యందుగల యభిమానముచే చేసిన కల్పనమని నా భావము. సంఘాతమరణము పాలైన బొబ్బిలివారియెడ జానపదులకు పక్షపాతము. ఆ పక్షపాతమే విజయ నగరమువారిని దోషులుగా చిత్రించినది. నిజమగు చరిత్రము మాత్రము దీనికి విరుద్ధము. పదములో 'ఇరువైనాలుగు వేల దళముతో బూచే వచ్చెను'. విజయ రామరాజు 'తన లక్షాతొంభై వేల దళముతో తానే వచ్చెను'. ఈ విధముగా మొత్తము సైన్యసంఖ్య రెండులక్షల పదునాలుగు వేలైనది. ఇది జానపదుల యతిశయోక్తి. దిట్టకవి నారాయణకవి విజయరామరాజుగారి బలసంఖ్య నిటుల దెలిపినాడు.

చ॥ నలువదివేల కాల్బలము నాలుగువేల తురంగమంబులున్
నలువదియేబదేనుగు లనంతములైన శతఘ్నితాచయుం
బలు నొకవేయి లొట్టియ లపూర్వ విభావిభవంబు దెల్పుచున్
గొలువ పరాసురేని గనుగొ ననుదెంచెను రా జతిత్వరన్[2].

'కాని ఆయన వెంట నిజముగా వచ్చిన సేన 10,000 మాత్రమే యని

1. బొబ్బిలికథ, పుట. 122. డి.నెం. 2550 ప్రా.పు. భాండాగారము, మద్రాసు.
2. రంగరాయ చరిత్రము.

యాంగ్లేయ చరిత్రకారుడైన ఆర్మ్ వ్రాసియున్నాడు. 250 గుఱ్ఱపు రౌతులును నాలుగు ఫిరంగులును 750 యూరోపియనులతోను విజయరామరాజుగారి భటులును సిపాయిలును గలిసిన 11000 స్వదేశీయ పదాతిబలముతోను బుస్సీగారు బొబ్బిలి కోటమీదికి దండు వెడలిరి.'[1] పదములో వెంకటలక్ష్మమ్మ, పసిపాప వెంకట్రావును తీసికొని రాజాం చేరి పాపారావుతో 'కోట విడిచి మీరిక్కడ కొచ్చిన తొమ్మిదోనాడూ, కోటమీదికే దళము దెచ్చెను విజయరామరాజు, మూడుదినములదాక యుద్ధము జరుగుతు యున్నాది' అనగా పాపారాయుడు 'మూడు దినములనుంచి యుద్ధము జరిగితే, కబురు లేక చేసినాడా రంగారాయుడు' అనెను. కాని నిజముగా బొబ్బిలి యుద్ధము జరిగినదొక్కదినమే. ఉదయమున నారంభమై సాయంకాల మగువరకు బాల, స్త్రీ, వీర, వృద్ధ మారణముతో నిది ముగిసినది. పదకర్త విజయనగరమువారికి బొబ్బిలివారికి ప్రాతపగలు 'తుమ్మలగుంట యుద్ధము' మరియు 'జలజపాటి యుద్ధము'ల నాటినుండియు నున్నట్లు వర్ణించినాడు. చరిత్రమున వీని కెట్టి స్థానము కలదో పరిశోధనీయము. పదకర్త శత్రువులు బొబ్బిలిచుట్టు 'పెద్దఫిరంగి బండ్లంతయు మొహర్లా లెత్తిరి, రామలక్ష్మణ ఫిరంగికి మొహర్లా లెత్తిరి' యనెను. ఈ రామలక్ష్మణ ఫిరంగులు ఇంతకు పూర్వమే వచ్చినవి. గద్వాల సోమనాద్రి కర్నూలు నవాబు నోడించి తన కోటపై నిలుపుకొన్నవి కూడ రామలక్ష్మణ ఫిరంగులే. జంట ఫిరంగు లెచ్చట తారసిల్లినను జానపదులు రామలక్ష్మణులని నామకరణ మొనర్తురు. ఇది రామలక్ష్మణసౌదర్యము పైనున్న మక్కువ.

బొబ్బిలి గడ్డపై జన్మించిన మనుజులే కాదు ప్రాణులన్నియు పౌరుషమున సాటిలేనివి. కోడిపందెము జరుగునప్పుడు బొబ్బిలివారు తమకోడితో

'చావంటెను మీరు భయపడవద్దు బారాకోడీ దా
యెన్నాళ్లు బతికినా చావు సిద్ధము బారాకోడీ దా
బొబ్బిలియందున పుట్టినావురా బారాకోడీ దా' యని వీరబోధన

మొనర్చుట ప్రశంసనీయము. శత్రుసైన్యము లెటునుండి వచ్చునోయని కావలి కాయుచున్న తెలగబిడ్డలు మరచి నిద్రపోవుచుండిరి. అప్పుడు,

'గుర్రపు సందడి విన్నారయ్యా తెల్గా బిడ్డాలూ
పడకయుండె దట్టి కట్టిరి తెల్గా బిడ్డాలు.'

---

1. పెద్దాపుర సంస్థాన చరిత్రము. పుట, 77, 79.

బొబ్బిలివారిని కోట విడిచి పొమ్మనెను. సైన్యములు నడచి యిప్పటికి ఒడ్డాది మీదుగా దేవులపల్లి చేరెను. రంగారావు చెలికాని వెంకయ్యను మరల రాయబార మంపెను. విజయరామరాజుకు తక్క తక్కినవారికి కోటవిడుతు మనిరి. ఖానుడు వినడయ్యెను. ఇది గాకను ఒకప్పుడు బొబ్బిలివారు కొందరు పరాసు సైనికులను (పొరపాటున) చంపియుండిరట. వీని నన్నింటిని ఖానుడు బుస్సీకి రంగారావు గారి యౌద్ధత్యము గర్వముగా కల్పించి చెప్పెను. యుద్ధము తప్పదయ్యెను. జనవరి 24, 1757 నాడొక్క దినమున బొబ్బిలి యుద్ధయుస సంఘాతమరణము సంభవించెను. మహావీరులు మరణించిరి. పరస్పరకలహమున నాంధ్రశౌర్యము ఫ్రాంసువారి తుపాకిగుండ్ల కెరయైనది. పదములో నీచారిత్రకవిషయములు కొంత మార్పులతో కొన్ని యతిశయోక్తులతో క్రొత్త చరిత్రమును నిర్మించు కొన్నవి. 'పూసపాటివారి కైఫీదు' లో బొబ్బిలి నాశనమైన పిమ్మట విజయ గర్వముతో నున్న విజయరామరాజు డేరాలో తాండ్రపాపయ్య ప్రవేశించి పోరాడెను. ఆ పోరాటమునం దిరువురును మరణించిరి. పెద్దాడమల్లేశము మాత్రము తాండ్ర పాపయ్య విజయరామరాజును చంపిన తరువాతనే ఆత్మ హత్య చేసికొన్నట్లు వర్ణించెను[1]. ఇది జానపదులా వీరుని యందుగల యభిమానముచే చేసిన కల్పనమని నా భావము. సంఘాతమరణము పాలైన బొబ్బిలివారియెడ జానపదులకు పక్షపాతము. ఆ పక్షపాతమే విజయ నగరమువారిని దోషులుగా చిత్రించినది. నిజమగు చరిత్రము మాత్రము దీనికి విరుద్ధము. పదములో 'ఇరువైనాలుగు వేల దళముతో బూచే వచ్చెను'. విజయ రామరాజు 'తన లక్షాతొంభై వేల దళముతో తానే వచ్చెను'. ఈ విధముగా మొత్తము సైన్యసంఖ్య రెండులక్షల పదునాలుగు వేలైనది. ఇది జానపదుల యతిశయోక్తి. దిట్టకవి నారాయణకవి విజయరామరాజుగారి బలసంఖ్య నిటుల దెలిపినాడు.

చ॥ వలువధివేల కాల్బలము నాలుగువేల తురంగమంబులున్
నలువదియేబదేనుగు లనంతములైన శతఘ్నికాచయం
బులు నొకవేయి లొట్టియ లపూర్వ విభావిభవంబు దెల్పుచున్
గొలువ పరాసురేని గనుగో ననుదెంచెను రాజతిత్వరన్[2].

'కాని ఆయన వెంట నిజముగా వచ్చిన సేన 10,000 మాత్రమే యని

1. బొబ్బిలికథ, పుట, 122. డి.నెం. 2550 ప్రా.పు. భాండాగారము, మద్రాసు.
2. రంగరాయ చరిత్రము.

యాంగ్లేయ చరిత్రకారుడైన ఆర్మ్ వ్రాసియున్నాడు. 250 గుఱ్ఱపు రౌతులును నాలుగు ఫిరంగులును 750 యూరోపియనులతోను విజయరామరాజుగారి భటులును సిపాయిలును గలిసిన 11000 స్వదేశీయ పదాతిబలముతోను బుస్సీగారు బొబ్బిలి కోటమీదికి దండు వెడలిరి.'[1] పదములో వెంకటలక్ష్మమ్మ, పసిపాప వెంకట్రావును తీసికొని రాజారం చేరి పాపారావుతో 'కోట విడిచి మీరిక్కడ కొచ్చిన తొమ్మిదోనాడూ, కోటమీదికే దళము దెచ్చెను విజయరామరాజు, మూడుదినములదాక యుద్ధము జరుగుచు యున్నాది' అనగా పాపారాయుడు 'మూడు దినములనుంచి యుద్ధము జరిగితే, కబురు లేక చేసినాడా రంగారాయుడు' అనెను. కాని నిజముగా బొబ్బిలి యుద్ధము జరిగిన దొక్కదినమే. ఉదయమున నారంభమై సాయంకాల మగువరకు బాల, స్త్రీ, వీర, వృద్ధ మారణముతో నిది ముగిసినది. పదకర్త విజయనగరమువారికి బొబ్బిలివారికి ప్రాతపగల 'తుమ్మలగుంట యుద్ధము' మరియు 'జలజపాటి యుద్ధము'ల నాటినుండియు నున్నట్లు వర్ణించినాడు. చరిత్రమున వీని కెట్టి స్థానము కలదో పరిశోధనీయము పదకర్త శత్రుపులు బొబ్బిలిచుట్టు 'పెద్దఫిరంగి బండ్లంతయు మొహరా లెత్తిరి, రామలక్ష్మణ ఫిరంగికి మొహర్లా లెత్తిరి' యనెను. ఈ రామలక్ష్మణ ఫిరంగులు ఇంతకు పూర్వమే వచ్చినవి. గద్వాల సోమనాద్రి కర్నూలు నవాబ నోడించి తన కోటపై నిలుపుకొన్నవి కూడ రామలక్ష్మణ ఫిరంగులే. జంట ఫిరంగు లెచ్చట తారసిల్లినను జానపదులు రామలక్ష్మణులని నామకరణ మొనర్తురు. ఇది రామలక్ష్మణసౌదర్యము పైనున్న మక్కువ.

బొబ్బిలి గడ్డపై జన్మించిన మనుజులే కాదు ప్రాణులన్నియు పౌరుషము సాటిలేనివి. కోడిపందెము జరుగునపుడు బొబ్బిలివారు తమకోడితో

'చావంటెను మీరు భయపడవద్దు బారాకోడీ దా
యెన్నాళ్లు బ్రతికినా చావు సిద్ధము బారాకోడీ దా
బొబ్బిలియందున పుట్టినావురా బారాకోడీ దా' యని వీరబోధ

మొనర్చుట ప్రశంసనీయము. శత్రుసైన్యము లెటునుండి వచ్చునోయని కావ కాయుచున్న తెలగబిడ్డలు మరచి నిద్రపోవుచుండిరి. అప్పుడు,

'గుఱ్ఱపు సందడి విన్నారయ్యా తెల్గా బిడ్డాలూ
వడకయుండె దట్టి కట్టిరి తెల్గా బిడ్డాలూ.'

---

1. పెద్దాపుర సంస్థాన చరిత్రము. పుట. 77, 79.

బొబ్బిలివారి చాకచక్యము, చురుకుదనము, శౌర్యము అన్నియు ఒక్క చరణములో కుదించినట్లున్న విచట.

మల్లమ్మదేవి లక్ష్మమ్మను విజయనగరం రాజుచెంతకు రాయబార మంపినప్పు డన్నమాటలు కరుణాపూరితములు. 'విజయనగరము బొబ్బిలికోటా కావడి కుండాలు, కావడికుండలు తప్పించొద్దు కన్నతండ్రి నీవు' అని తన రాజనీతిని ప్రదర్శించి

'నల్లగాజులు నల్లపూసలు నాకు నిల్పండి
బొట్టు కాటుకా నిల్పుమయ్యా వో విజయరామరాజా
పసుపుకుంకుమ నిలుపుమయ్యా ఓ విజయరామరాజా
పూసపాటివారిల్లే నాకు పుట్టిల్లనుకొంటీ
దామర్లవారి సంస్థానమే మరచిపోయినాను.'

అని శిలలు గరగించు సోదరప్రేమను వెల్లడించినను విజయరామరాజు కఠినముగా ప్రత్యుత్తర మిచ్చెను.

'బొట్టు కాటుకా నిల్పను నాకు తరముగాదు తల్లి
ముండమోసితే మూడుపల్లెలే ఇనాము లిస్తాను
ముండకోక ముందుగ నిత్తు మల్లమ్మదేవీ దా
ముందు కూర ముందు యన్నము నీదే నన్నాడు.'

వంశాంకూరమును కాపాడుకొనుటకై మల్లమ్మ తన చంటిబిడ్డ వెంకట్రాయునికి కడసారి పాలిచ్చి లక్ష్మమ్మతో మారువేషమున రాజాదమునకు సాగనంపు సట్టము కరుణాపూరితము. పట్టుబడిన పాప వెంకట్రావును వెలమబిడ్డ యగునో కాదోయని విజయరామరాజు బుస్సీ మున్నగువా రొక పరీక్షచేసిరి.

'పండ్లు ఫలాదులు తాకలేదు వెంకట్రాయుడు
దుడ్డు దుగ్గాని తాకలేదయ్యా వెంకట్రాయుడు
చంద్రాయుధము చేతబట్టెను వెంకట్రాయుడు'

వీరరసగర్భితమగు కల్పనమిది. బాలుని పౌరుషము గాంచిన బుస్సీ తగురా నాయన తగురా నాయన బొబ్బిలివారికి' యని బాలుని మెచ్చి 'క్రూర ముండా కులద్రోహి విజయరామరాజా, యింతటి వస్తాదు బిడ్డలు బొబ్బిలి

దొరలు' అని పిల్లవానికి తగు రక్షణము నేర్పరచి సాగనంపుట యాతని నిష్కళంకప్రవర్తనమును చాటెడిని.

యుద్ధమునకు పోవుటకుముందు వెలమదొరలు తమ రాణివాసములను కడతేర్చుట, గర్భిణులు తామే పొడుచుకొని చచ్చుట, గర్భస్థపిండముల సైతము బొబ్బిలివారి శత్రువుల చేజిక్కకుండునట్లుగా చంపుకొనుట, వారి పౌరుషమునకు, వారి యభిమానమునకును పరాకాష్ఠ యనుకొనవచ్చును. బొబ్బిలివారి యుద్ధము సహజముగా, అత్యద్భుతముగా వర్ణింపబడినది. వీరు లందరును (నల్లమందు) తుపాకిగుండ్ల కెరయైరి. నిర్వక్రపరాక్రముడు మానధనుడు, వీరము మూర్తీభవించిన రంగారాయుడు రణరంగమందు పడిపోయి యుండగా శత్రువులు భయపడుచు భయపడుచు చూడవచ్చిరి. ఆ వీరమూర్తి క్షతగాత్రుడై పూచినమోదుగువలెనుండగా జానపదు లిట్లు వర్ణించిరి

"ఈ కెతోను కదలించినారు రంగారాయుణ్ణి
బొందిలోన జీవములేక తానే యున్నాడు
దగ్గరకైన యప్పుడు వచ్చె ప్రాంచి దొరగారు
అడ్డము పొడుగు చక్కదనమును కన్నుల చూచేను
వీపునందు వింజామరలే రంగారాయునికి
బొడ్డునందు చింతామణి రంగారాయునికి." గొప్పవారిని వర్ణించు

నప్పుడు జానపదకవులు వీపున వింజామరలు బొడ్డున చింతామణి చేర్చెదరు. ఇది సాధారణమే కాని జానపద కవి కింకను తృప్తి కలుగక ఏ సాహిత్య మందును ఏ శిష్టుడును చెప్పనటువంటి మాట నొకటి చెప్పి రంగాయుని వీర మూర్తిని మన కన్నులకు గట్టునటుల జేసెను.

'*ముంజేతికి మీసమున్నదీ రంగారాయునికి*'. ఆనాడు పౌరుషచిహ్నము మీసము. మీసముల వర్ణనము సాంప్రదాయికముగా నొకతీరుగా నిశఃపూర్వ ముండెడిది. పెద్ద మీసములనియో, వడివేసి నిమ్మకాయలు నిలుపజాలు నంతటివి యనియో వర్ణించెదువారు. ఈ పద్ధతిని విడిచి జానపదకవి యిచ్చట ముంజేతికి మీసమున్నట్లుగా వర్ణించుట అత్యపూర్వము. (కత్తిపట్టెడు) చేతికి మీసముండుట రంగారావు ప్రతాపపు వేడికిని అతని కత్తి వాడికిని రూపకల్పనము. రంగారాయుని బాహుబలము, శౌర్యము, ప్రతాపము ఇంత చిన్నమాట స్ఫురింప జేయునట్లుగా నెన్ని కావ్యములు వ్రాసినను స్ఫురించవు. వీరమున కిది

ంకోటి. దీని తరువాత నింకే విషయము లెత్తినను నీరసములని యెంచి విషయ మింతటితో విరమింతును.

ప్రాంతీయముగా బహుళప్రచార మందినను ఆంధ్రదేశ మంతటను కను పరిచితము కానట్టి చారిత్రకగాథ 'పెద్దాపురపు కోడిపందెముల పాట' ఎవరో తెలియదు కాని దీనిలో మధ్య మధ్యన వచనము గూర్చి స్కరించినవారు సుప్రసిద్ధ జానపదవాఙ్మయోద్ధారకులు శ్రీ నేదునూరి గాధరంగాడు. 1943 లో దీనిని కొండపల్లివారు ప్రకటించిరి. ఇది పున ద్రణము కాకపోవుటచే ప్రతులు లభించుటలేదు. తెలుగువారి శౌర్యప్రీతికి కి పందెములు వినోదచిహ్నములు. పల్నాటియుద్ధమున, బొబ్బిలి యుద్ధమున లు రేపిన కారణములందు కోళ్ల పందెములుకూడ చేర్చియుంటిమి. ఈ పాటలో విషయము ప్రాధాన్యము వహించుటచే పాటకా పేరే వచ్చినట్లున్నది. త్రకముగా బొబ్బిలియుద్ధము తరువాత జరిగిన దీకథ. విజయనగరం సపాటి ఆనందగజపతి మహారాజులుంగారికిని పెద్దాపురపు వత్సవాయ మ్మజగపతి రాజులుంగారికిని జరిగిన పోరాటమిది. ఇద్దరికిని అన్నదమ్ముల న లున్నవి.

బొబ్బిలి యుద్ధమున వచ్చిన విజయనగరపు రాజు, విజయరామరాజుగారే దండ్రులు లేని తిమ్మజగపతిని తమ యన్నకుమారుడైన ఆనందరాజు తోకూడ పెంచి పెద్ద చేసిరి. ఈ యిరువురు రాజకుమారులకు చిన్నప్పటి డి వైర మేర్పడెను. విద్యయందేమి వినోదమందేమి ఒకరి నొకరు చవలెనని ప్రయత్నించుచుండిరి. తుదకు కోడిపందెములందు సైతము, వత్తులైరి. ఒకప్పు డానందరాజు కోడి యోడిపోయెను. తిమ్మ జగపతి కి గెలిచెను. ఆనందరాజు చిరునవ్వుతో పరిహాసవచనముల 'పెంపుడు కియే గెలిచిన'దని జగపతిరాజును గేలిచేసెనట. విజయరామరాజుగారే మ్మజగపతికి 16 ఏండ్లప్రాయమున తమ ప్రధానామాత్యులైన బుజ్జా ప్పన్నగారితో మంత్రాలోచనము చేసి క్రీ. శ. 1749 వ సంవత్సరమున పురమున పట్టాభిషిక్తులం జేసిరి. బొబ్బిలియుద్ధమున విజయరామరాజుగారికి యముగా జగపతి సైన్యములుకూడ వచ్చెను. ఈ జగపతి రాజ్యకాలము 19 నుండి 1758 వరకు. ఈయన భార్య దంతులూరి రామరాజు కూతురైన

పాలించు జాఫరలీకి ప్రక్కబల్లెమైనట్లు రామవిలాసమున కలదు.

గీ॥ వత్సవయ జగపతి మహావసుమతీశ
విజయఘాటీ సమాటీక విజిత విముఖ
జాఫరలిఖాన మానసస్తంభన ప్ర
గల్భరూఢ భయావేశ గాఢతమము.

చ॥ పదములు కీర్తనల్ రుచిర పద్య శతంబులు రాగమాలికా
మృదుపద దండకంబులు సమిద్ధగతి న్రచియించి కామిత
ప్రదునకు భద్రశైలవిభుభర్తకు కానుకగా నొసంగె నే
త్రిదశులు మెచ్చ దా జగపతి ప్రభుచంద్రుడు భక్తి పెంపునన్-1

అని ఈతని ఆస్థానకవి వర్ణించెను.

ఇక పదమందున్న కోడిపందెములు, తరువాత జరిగిన యుద్ధములు మున్నగునవి విచారింతము. పైన పేర్కొన్న ఈ కోడిపందెములు జగపతి పెద్దాపురపాలకుడై యుండగా ఆనందరాజు విజయనగర యువరాజుగా నున్నపుడు జరిగినవి. ఇది బొబ్బిలి యుద్ధమునకు పూర్వమే జరిగిన సంఘటనము. యుద్ధము మాత్రము బొబ్బిలి యుద్ధము తరువాత అనగా విజయరామరాజు చనిపోయి ఆనందగజపతి రాజైనతరువాత జరిగినది.

'విజయనగరము యేలెటివారు ఆనందమహరాజూ
చారుకమానులో తఖ్తు దీర్చిరి ఆనంద మహారాజూ'

అని యారంభమైనది. (ఇది పొరపాటు. ఆనందరాజు యువరాజే కాని ప్రభువు మాత్రము కాదు.) ఈ యానందరాజు కొలువులో చింతలపాటి శివరామరాజు, కటకం వెంకటకృష్ణంరాజు, జంపన బుచ్చిసుబ్బరాజు, సాలూరి సన్యాసిరాజు, సాగి అప్పలరాజు, భూపతి వెంకటరాజు మున్నగువారుండిరి. ఆనందరాజుకు కోడి పందెములన్న మక్కువ. ఆతని కోడి విడికోడి. రాజుల కోడికి అలంకరణము గూడ అదే పద్ధతిలో నుండుట గమనింపదగిన విషయము.

"అందెల సరసను బంగారంపు గొలుసు లుంచినారు
పట్టెడ (దుః)జట్టుకు బంగారంపు జూలే కట్టారు

---

1 ఏనుగు లక్ష్మణకవి 'రామవిలాసము.'

ముక్కుకు అయినా మూడువేలది బులాకు పెట్టారు
సింహతలాటం కడియముంచిరీ విడీకోడికండి
మెడలోపలను పదివేలాది వజ్రపు పేరుంది" ఇప్పటికే యీ 'విడీకోడి'

ఎన్నియో పందెముల గెలిచినది. పెద్దాపుర జగపతి చెంతనున్న కోడి 'పూల కోడి.' 'విడీకన్నా పై చెయ్యండీ పూలకోడి పుంజు'. ఆనందరాజునకీ విషయము తెలిసి జగపతిని పందెమునకు పిలిపించవలెనని గుండాలప్పన్నతో,

'మిమ్ములబెంచిన పినతల్లయినా చంద్రమ్మదేవి
మిమ్ముల జూడ తల్లిగారికి భ్రాంతి కలిగినాది
అన్నమయిన భుజించకాను ఆతురపడుతూంది
తాంబూలము లేయకుండానూ తలకట్టున్నాది
మీమీదైతే తలపుబెట్టుకు సగమైయున్నాది' యని వ్రాయించి
'వచ్చే రాజా వూరికె రాకు జగపతి మహరాజా
దాపున వున్నా పూలకోడిని చేతబట్టుకొని' రమ్మని వార్తనంపెను.

లేనిచో వినాశము తప్పదని హెచ్చరించెను. చల్లారాజన్న వార్తాహరు డయ్యెను. (బొబ్బిలియుద్ధమున విజయరామరాజు సేవకుడు చల్లారామన్న. వీరిరువురి కెట్టి సంబంధమున్నదో!) పెద్దాపుర జగపతి కొలువునందు చింతలపాటి సింహాద్రి రాజు, ఉప్పలపాటి జోగిరాజు, దాట్ల తిరుపతిరాజు, దంతులూరి శివరామరాజు, నల్లపరాజు నారాయణరాజు, కాకర్లపూడి పద్మరాజు, వెదురుపాక రామరాజు, తామరపల్లి జగన్నాథరాజు, పాశర్లపూడి బుచ్చిరాజు, పత్తిపాటి పాపయరాజు, మున్నగువా రుండిరి. జగపతి పోట్టేళ్లను, డేగలను, పోట్లాడగల తీరుతీరుల పక్షులను సిద్ధము జేయించి పూలకోడి నిట్లు సింగారించెను.

పాతికవరా ల్బంగరుగొలుసు కాలికి పెట్టారు
ఆర్లకు అయినా బంగారపు రేకులు పొదిగారు
జోడురెక్కలకు బంగారంపు సీరానించారు
ముక్కునకు మూడువేలది బూలాకు పెట్టారు
పట్టెడు జుట్టుకు బంగారంపు జూలే కట్టారు
మేలిమి అయినా పికిలి కుచ్చులా బిరుదులు కట్టారు
వజ్రాల మొహరీలవి అయినా పేర్లు వేసినారు.'

జగపతి విజయనగరమునకు సిద్ధమై తన కుమారుడగు తిమ్మరాజుకు వివాహ మొనర్చి పట్టము గట్టెను. 'అదృష్టముంచే వారంనాటికి కోట చేరుతాను,

ఖజానకాడ భద్రమండి ఓ జగ్గరాజుతాత' అని బయలుదేరెను. (చరిత్రమందీ విషయము లేదు. అప్పటికి తిమ్మరాజు చంటిపాప. అతనికి పట్టము కట్టుట యసంభవము. ఐనను తన కేమైన కీడు సంభవించునని జగపతిరా జటులచేసి యుండెనేమో!) జగపతి విజయనగరము చేరిన తరువాత ఇరువురన్నదమ్ములకు పొట్టేళ్ళ పందెములు, గుఱ్ఱపు పందెములు, దేగల పందెములు, కోళ్ళ పందెములు జరిగినవి. కాని యన్నింటను పెద్దాపుర జగపతికే విజయము లభించెను. అప్పుడు 'కోపం వచ్చి ఆనందరాజు కోటకేగినారు'. ఆనందరాజు 'మాయలు పన్ని జగపతిరాజును మరణం చెయ్యాలి' యని సంకల్పించెను. వంటలుచేసెడి పేరిభొట్లతో జగపతికి విషప్రయోగము చేయించనుండగా 'బ్రాహ్మణ రూపము తోనూ రంగడు ఎదురుగ వచ్చాడూ, భూమిమీదికి పడగొట్టాడు పేరిభొట్ల నండీ'. అది విఫలమైన రంగసాని (దాసి)తో 'రసకర్పూరం అరఖులురాచి ఆకు లన్నకిమ్మీ' యనెను. గనేరు సాహెబును వేటకుపోవు త్రోవలందుంచి అన్న గారిని తుపాకితో కాల్చి చంపుమనెను. పేరిభట్ల తమ్ముడు కొండుభట్లు చంద్రమ్మ (విజయరామరాజు భార్య)గారికీవిషయము తెలుపగా నామె చల్లారాజన్న సహాయముతో జగపతి ఆరాత్రియే పెద్దాపురము చేరునటు లేర్పాటులు రహస్యముగా చేయించెను. జగపతి ఆరాత్రి రహస్యముగా మేఘ రంజి నెక్కి అంచె గుఱ్ఱములపై దాటిపోయెను. ఆనందరాజుమనుష్యు లాతని చంప ప్రయత్నించిరి కాని వారికి చిక్కక జగపతి పెద్దాపురము చేరుకొనెను. కీడు శంకించి పట్టపురాణి సీతమ్మగారు సహాయార్థమై పిఠాపురము నీలాద్రి రావుగారికి లేఖ నంపినది. నీలాద్రిరావుగారా రాత్రియే వచ్చి జరిగిన విషయము తెలిసికొని ఒకరకొకరు సహాయమనుకొని తిరిగిపోయిరి. ఒకప్పుడు జమాబందికై వచ్చిన కళింగరాజు (నవాబు) వీరినిరువురిని (గజపతిని జగపతిని) కలహించవలదని మందలించెను. ఇంతలో బొబ్బిలియుద్ధము సంభవించి తాండ్రపాపయ్య చేతిలో విజయరామరాజు చెల్లిపోయెను. ఆనంద గజపతి రాజయ్యెను.(ఫ్రెంచివారితో విజయనగరమువార మైత్రి బెడిసిపోయినది) 'తన పినతండ్రితో బుస్సీగారు చేసిన ఏర్పాటు లాయనకు సంతృప్తికరముగ నుండకపోవుటచేత ఆనందరాజుగారు ఫ్రెంచివారిని దేశమునుండి వెడలగొట్టి వారికి బదులుగా నాంగ్లేయులను రప్పించవలెనని యోచించి కలకత్తాలోను చెన్నపట్టణములోను నున్న ఇంగ్లీషువారిని ఆహ్వానించెను. 1758 లో ఫ్రెంచివారికి ఆంగ్లేయులకు యుద్ధమై ఉత్తరసర్కారు లాంగ్లేయులకు

లభించెను.'[1] ఆనందగజపతి చంద్రమ్మగారి సెలవంది విజయరామరాజుగారి యస్థినిమజ్జనమునకై కోటిపల్లి క్షేత్రము చేరి యట కర్మలాచరించి జగపతికై కుట్రబన్ని వార్తనంపెను.

'విజయనగరము యేలుబడికినీ సంతతి లేదండీ
తిమ్మరాజును యిప్పిస్తీరో కోట గట్టుతాను
పుత్రభిక్ష పెట్టి మాకు వంశము నిల్పండీ
పాతవైరములు తలపెట్టకుమీ ఓ అన్నయరాజా
తిమ్మరాజును జూడవలెనని తలపు బుట్టినాది'

జగపతి నిజమనుకొని బాలుడగు తిమ్మరాజు నంపెను. కాని క్రూరుడగు ఆనందరాజు 'ఏడుగడియలు ఎండలలోను కొడుకు నుంచినాడు, తిమ్మరాజుకు వళ్ళంతాను బొబ్బలు బొక్కింది'. జగపతికూడ ఆనందరాజును చూడ బోయెను కాని ఆనందరాజు 'బార్లు కట్టి కొట్టండని ఫైరు చేసినారు'. జగపతి తప్పించుకొని కోట చేరుకొని ఆనందగజపతి చెంత చిక్కుబడి పోయిన తనయునికై విలపించెను. భార్య సీతమ్మ

'బిడ్డలు లేని ఇల్లేమిటికి వత్సవాయి రాజా
తిమ్మరాజును తీసుకవస్తే భోజన మవుతుంది
లేకుంటే వజ్రం తిని తనువే విడవాలి' యనగా అటులేయని

ప్రామాణ్యములూ చేసి రాజు తిరిగి వెళ్ళలేదు
గుర్రాన్నమ్మీ జగపతిరాజు తంబుర గొన్నాడు'

ఆతడు విరక్తితో అడవులలోబడి భద్రాచలము చేరి రామభక్తుడై కాలము గడపు చుండెను. ఇక నీ సంఘటనము నింకొక గ్రంథ మిట్లు చెప్పుచున్నది.

'గజపతిరాజుగారు పెద్దాపుర మార్గమున రాజమహేంద్రవరము పోవుచు నల్లచెరువు గ్రామము దగ్గర దండు విడిసి జగపతిరాజుగారిని వంచించు కృత్రిమోద్దేశ్యముతో పెద్దమనుష్యులద్వారా తమ్మొక్కమారు కలిసికొన రావలసినదని నమ్మకముగా నాయనకు కబురు పంపించెను. జగపతిరాజుగారు గౌరవపరివారముతో పాలకిపై ప్రయాణమై యెల్లచెరువును సమీపించిరి. గజపతి వారిపై యొక్కుమ్మడి ఫిరంగులు ప్రేల్పించెను. వత్సవాయిరాజు

---

1. పెద్దాపుర సంస్థాన చరిత్రము

ఆనందరాజుగారి కాపట్యమును తెలిసికొని యొకానొకని యొక గుర్రమెక్కి తమకోటలో చేరుకొనిరి. రాజుగారిని (ఆనందగజపతిని) నిగ్రహించుట కష్ట మనియు, కావున మరణమే శ్రేయమనియు నగర్లలో తుపాకిమందు పరపించి స్త్రీలతోడ చిచ్చంటించుకొని మృతినొందుటకు సిద్ధపడియుండిరి. అప్పుడు గజపతిరాజుగారు వచ్చి మీరు చనిపోవలసినంత యగత్యమేమియు లేదనియు, మీ కొమారులైన తిమ్మరాజుగారిని, రాష్ట్రమును తమ కప్పగింతచేసి మీయిష్టము వచ్చిన యేస్థలమునకైన పోవలసినదనియు జగపతిరాజుగారితో చెప్పిరి'1 జగపతిరా జటులే చేసెను. పిదప ఆనందరాజు జగపతి భార్యాపుత్రులను తమ 'యామాని' లోనుంచి పెద్దాపురపు కోటలో ఠాణా వేయించి తమ యుద్యోగుల నిల్పిరి. ఇట్లు పెద్దాపురము కొంతకాలము గజపతుల యధీనమందుండెను.

పదకర్త పై చారిత్రక విషయములను కొలది మార్పులతో ఇంతవరకు జరిగిన కథలో వర్ణించినాడు. ఆ తరువాత పదకర్త జగపతి భద్రాచలమున రామభక్తుడై మారువేసమున నుండగా 'వాసి మాసినా వయసు మారినా వన్నె జెడనులేదూ'. భద్రగిరికిపోయిన అప్పారావు అశ్వారావు గారలు(వెలమరాజులు) జగపతిని గుర్తించి 'మాణిక్యం మసిపాతను గడితే మకిలీ పట్టేనా' యని తానాషా పంపించిన పొగరుబోతు గుఱ్ఱము నెక్కించి (ఇది చారిత్రకముగా నసంబద్ధము. తానీషా కాలమురాదిది) గజపతితో యుద్ధముచేయ పురికొల్పి తాము సాయమొనర్తుమని సిద్ధమైరి. మన్నెపు సైన్యములతో శ్రీరామగిరికొండ, దేవీ పట్నం, పురుషోత్తమ పట్నం, పొంతికొండ, యేలేశ్వరం, జగ్గంపేట, మీదుగా జగన్నాథపురం చేరుకొనిరి. ఆనందరాజు కీవార్త దెలిసి ససైన్యముగా కాకినాడ చేరుకొనెను. జగపతికి ఒలందులు, గజపతికి ఫ్రెంచివారు బాసటగా నిలిచిరి. యుద్ధములో జగపతి సైన్యము లోడిపోయెను. 'జగపతిరాజును గుళ్ళపైరుతో తమ్ముడు గూల్చాడు'. గాయపడిన జగపతి 'చావబోతు కొడుకును జూచి సంతోషించాడు, తమ్ముడి మీది కక్షలచేత మోము ద్రిప్పినాడు. మొలను వున్నా కైజరుతోను ప్రాణం వదిలాడు, జగపతిరాజుకు ఉత్తర క్రియలు వారు చేసినారు'. ఈ విషయములు 'పెద్దాపుర సంస్థాన చరిత్రము'న నిట్లున్నవి.

"గోదావరి దాటి పశ్చిమముగా నేగి జగపతిరాజు కంభముమెట్టుకు బోయి

1. పెద్దాపుర సంస్థాన చరిత్రము.

అనన్నమాటలు.

'దండూ దండిగ తెచ్చి దారులన్నియు కాచి
తప్పక పట్టేస్తడంట
వాడు బాంబూల వాదేస్తడంట
వాడు గురిపెట్టి గుండ్లేస్తడంట
అయ్యో దండ్లూ గుండ్లు వాడి తాత వనుకున్నాడు అల్లూరి శ్రీరామరాజ'

తనపైన ఎత్తివచ్చిన ప్రభుత్వ సైన్యములోనుండి సీతారామరాజుగారు నల్లవారిని చంపక తెల్లవారినే గురిపెట్టి చంపువాడట.

'నూరుమంది నల్లవారిలో దొరలున్న ఏరించి చంపించినావు
నల్లవారిని చంపనన్నావు, తెల్లవారిని విడువనన్నావు
నీదు దేశాభిమానంబు దేదీప్యమానంబు అల్లూరి శ్రీరామరాజ'

మరియొక అసంపూర్ణ చరణము.

'రవి యస్తమించని రాజ్యాన్ని శ్రీరామ రాజేమి చేస్తానన్నాడు'

మహాత్ముని శాంతిసమరవిధానము రాజుగారిట్లు విమర్శించిరట.

గాంధీతత్వమెల్ల గాజులు గలవారి మోజు నందుచునుండె రాజ
వారికి రాట్నంబె రాజ్యంబు రాజ, వారు తన్నారు లిట్టారు రాజ
ఈ తత్వాన దాస్యంబు తరలూ తెన్నదో రాజ, అల్లూరి శ్రీరామరాజ'

సీతారామరాజు మరణవార్తను ప్రజలు చాలాకాలము నమ్మలేకుండిరి.

'ప్రకటన మొకటిరు ప్రజల దోరటి వేరు
నిజము తెలియగ లేదు దారి,
నీదు మరణ వార్తను నమ్మరైరి...........'

ఈగేయము సంపూర్ణముగా సేకరింపదగియున్నది. సీతారామరాజుగారికి అత్యంతసమీపకాలములో వెలసినదగుటచే ఇది బుఱ్ఱకథకన్నను ప్రామాణికమై జానపదగేయలక్షణములతో వీరము మొక్క మొలచినట్లున్నది. కలియుగార్జున యం. కృష్ణారావుగారు రచించిన 'అల్లూరి సీతారామరాజు' (కొండపల్లి వీర వెంకయ్య అండ్ సన్సు-రాజమండ్రి, ఏడవకూర్పు 1940)లో పై పాటను బోలిన మరియొకపాట కలదు. రాజుగారి చరిత్రమును, అప్పటి పత్రికల

నములు రాళ్ళపల్లి కాశన్న. యమ్మల బాపన్న దొరల వాజ్మాలములు
ంచి ప్రకటించిన కృష్ణారావుగారు జానపదులలో ప్రచారమందున్న
షను విని అదే వరుసలో నాముకూడ వ్రాసియుందురు.

ఇంతవరకు బహుళ ప్రచారమందున్న కొన్ని చారిత్రక వీరగేయముల
వ్రాసితిని. ఇవి కేవలము మచ్చుకుగా చిత్రింపబడినవి. ఇంకను చారిత్రక
ములెన్నియో మిగిలిపోయినవి. వానిగూర్చి వ్రాయుట పొసగదు.
గాణము వీరపదములకు పుట్టిల్లు. పిచ్చుకుంట్లు, జంగములు, శారదకాండ్రు
కముల బాడుచు పొట్టవోసికొందురు. *గద్వాల సోమనాద్రి, శంకరమ్మ,*
*వరెడ్డి, మియాసాబు, సర్వాతాలమల్లారెడ్డి, రాజారామేశ్వరరావు* వంటి పూర్వ
కగేయములు తెలంగాణమున బహుళప్రచారము గాంచినవి. సర్వాయి
కథ నిదివరకే చర్చించి యుంటిని. హైదరాబాదు స్వాతంత్ర్యసమరమున
లుగా, సంఘములుగా 'సాయుధులుగా పోరాడి నిరంకుశ ప్రభుత్వము
తమ ప్రాణము లొడ్డిన మొన్నటి స్వాతంత్ర్యవీరుల గాథలు సముద్ర
గములట్లంతటను వ్యాపించుచున్నవి. వానికింకను సార్వజనీనత కలిగిన
'త పూర్వచారిత్రకగేయములవలె వింతవింత మార్పుల నందుననుటలో
నము లేదు. గద్వాల సోమనాద్రి కథ నిదివరకే ప్రకటించియున్నాను1.
ందలి చారిత్రకవిషయములు మొట్టమొదట ప్రకటించినవారు కీ. శే.
రం ప్రతాపరెడ్డిగారు2. వివరములకై నేను ప్రకటించినకథ చూడనగును.
తము నేను సేకరించిన మరియొక చారిత్రకగేయమును దాని చరిత్రమును
ందును. ఇది *'సదాశివరెడ్డి కథ'* రెడ్డిగారి దర్శకత్వమున నేనీ
పందలి చరిత్ర త్రవ్వితిని. 'తెలుగు వీరు'డను పేరుతో దీనిని చారిత్రిక
గా 1953లో ప్రకటించితిని. పదమం దొండురెండు పేరులు తప్ప
నదంతయు పుక్కిటి పురాణమే. పదము పాడుచు తిరిగెడివారు తమకు
నవి కొన్ని, ఇతర పదములనుండి కొన్ని, సంఘటన లిందులో చేర్చి
న్నది. చరిత్ర తక్కువగా కల్పన లెక్కువగా నున్న యీకథయందలి
కకవిషయములను, సిసలైన చరిత్రను, తెలిసికొనుట చాల కష్టమైనది.
చెప్పెడువా రొకతీరుకథ చెప్పుచుండ వచనములుగా చెప్పుకొను

1. బాల సాహిత్యమాల-8. హైదరాబాదు విద్యాశాఖవారిచే ప్రచురితము.
2. రెడ్డిరాణి సంచిక మరియు హైందవ ధర్మవీరులు

వారిలో నీకథ ఇంకొక తీరుగానున్నది. గేయములో నున్న కథకన్న వచన రూపకముగా విన్న కథయే చరిత్రకు దగ్గరగా నున్నది. గేయకథ, వచనకథ, మరియు చరిత్రములందున్న కథ మూడింటిని జోడించి నేను 'తెలుగువీరుడు'గా రచించితిని. మొదట గేయమందలి కథను క్లుప్తముగా నభివర్ణించి తరువాత చారిత్రకవిషయములను విన్నవింతును. గేయారంభమున సదాశివరెడ్డి నిట్లు వర్ణించినాడు.

'రాజా ఓరాజా రజాభోగతిగలిగి తందానతాన (ఇది వంతపాట)
మనది యా దేశంబు ,,
మనది ఏది భూమి ,,
పట్నానికి పడమటిదిక్కు ,, (హైదరాబాదు)
రగా రంగంపేట ,,
బీదరు తాలూకా ,,
అందోళి జోగిపేట ,,
సతాశివనంపేట ,,
ఏలెవాడు రాజు ,,
రెడ్డి వుదిమారెడ్డి ,,
వుదిమరెడ్డి భార్య ,,
తల్లి శివరంగమ్మ ,,
శివరంగమ్మ కన్నకొడుకు ,,
ఖాల్ బహద్దురు శివారెడ్డి ,, (సదాశివరెడ్డి)
వెంకటేశ్వర్ల వరముచేత ,,
కలిగినవాడు శివారెడ్డి ,,
అయిదు రేఖలు గల్లవాడు ,,
పట్నములో భేషైనవాడు ,,
రాజా భోగతిగలిగి ,,

హైదరాబాదులో బాదుషా నవ్వాబుసాబు అతని భార్య అమ్మ బేగముసాని. వీరికిద్దరు కుమారులు. పెద్దవాడు హల్లీజా, రెండవవాడు పల్వారుజంగు. పల్వారుజంగు పెండ్లికై నవ్వాబు ఆరె (మహారాష్ట్ర) గుండేభాయికడ మూడు లక్షలపైక మప్పుగా గొనెను. పెండ్లియైన ఆరునెలలకు తిరిగి యిత్తుననెను. పెండ్లియైన ఆరునెలలకు నవాబు పైకము ప్రోగుచేసి యుంచెను. ఇంతలో 'ఆదివారము దినమునాడు, ఉత్తరాన ఉరుము ఉరిమెను, దక్షిణాన మెరుపు

మెరసెను, పిడుగువచ్చి ఖజానమీద, కొట్టిడిమీద దుమికినాది, దుడ్డెల్ల హతమై పోయెను'. నవాబు చింతాసాగరమున మునిగెను. సిద్ది యబ్దుల్లాయను నవాబు సేవకు డొకయుపాయము బన్నెను. అతడు నవాబుతో 'హైదరాబాదు నాకు సెలవు ఇవ్వుము, నీ దుడ్డు వసూలు చేస్తా'ననెను. నవాబనుజ్ఞ నొసగినంత నగరమునకు బయటికి రాకపోక లరికట్టించి రూపాయికి 'ఒక్క శేరు జొన్న లేసినాడు, అర్ధశేరు బియ్యమేసినాడు'. ఈ విధముగా నాతడు ధనము ప్రోగు చేయుచుండెను. ప్రజలు కూటికి మలమల మాడి చచ్చుచు హల్లీజా దగ్గర మొర పెట్టుకొనిరి. అతడు తండ్రితో మాటాడి ధర లెప్పటియట్ల చేసెను. సిద్దీకి హల్లీజాపై కోపము కలిగెను. అతడు నవాబుతో 'ఇట్లయిన ధనము ప్రోగుజేయ లే'నని ఊరకొనెను. అప్పుల బాధయున్న నవాబు సిద్దీ వాని యిష్టమే చెల్లించెను. దానికై హల్లీజాను కారాగారమం దుంచవలసివచ్చెను. హల్లీజా చెరలో క్రమ్గుచుండెను. అతని తల్లి పుత్రప్రేమచే దుఃఖించి అతని చెర విడిపింప నుపాయ మాలోచించెను. తన కుమారుని సహపాఠియగు సతాశివనం పేటలో నున్న శివరంగమ్మ కొడుకు సదాశివరెడ్డియే తగునని నిశ్చయించుకొని అతనికి జాబు వ్రాసెను. హర్కారులు వచ్చునరికి సదాశివరెడ్డి అందోల్ కోటలో ఐదుగురు భార్యలతో పుత్రోత్సవము (నరసింహారెడ్డి) జరుపుకొనుచుండెను. ఉత్తరము చూచి రెడ్డి మాలమట్టెల పాపన్న, తెలుగు బడపల చెన్నయ్య, తెలుగు బుట్టిన్న, ఎట్టిగొల్ల సూరకుకాడు, బావమరిది రుక్మారెడ్డి మున్నగు వారితో నాలోచించి హల్లీజాను విడిపింప నిశ్చయించుకొని 'పిడుగు తాపిన కత్తి పట్టినడు'. పై యైదుగురు భటులతో నాతడు మెతుకు (మెదకు) వచ్చెను. అక్కడ తన అవ్వ (అమ్మమ్మ) శంకరమ్మ గలదు. ఆమెగారికి వర్తమాన మెరిగించి యనుజ్ఞనొంది హైదరాబాదు చేరుకొనెను. హల్లీజా యున్న కారా గారమునకు పోయెను. అచట 'పారామీద పారలు కమ్మినావి, పిడుగు తాపిన కత్తి గుంజినాడు, చెక్కులు ముక్కలు తుండపడ నరికినాడు, అందరిని సాపుగ గొంతు గోసినాడు'. హల్లీజాను చెర విడిపించి రెడ్డి రంగంపేట కోటకు తెచ్చెను.

హైదరాబాదులో ఒకనాటి రాత్రి సిద్దీవాడు తన నూరుగురు కొడుకులను బిలిచి బందీలో నున్న హల్లీజాను చంపు డనెను. వారు రాత్రి పోయి చూడగా యువరాజు పారిపోయినట్లు తెలిసెను. ఇది తెలిసిన సిద్దీవాడు,

'పటపట పండ్లు కొరికినాడు
ఎద్దు ముడ్లు పొడిచె కాపుకొడుకు
ఏటి మడులు దున్నె కాపుకొడుకు
నాకు సమము రాబోయినాడు
శివారెడ్డిని పట్టి కొట్టెదను
రెండు రెక్కలు బిగించి కొట్టెద
బీదరు తాలూకా అతనిదయ్యె
నూరుమంది కొడుకులు నేను
బీదరు తాలూకా ఏలెదము'

అని రెడ్డిపై కోపించెను. ఈ యుద్దేశముతోడనే సిద్దీ తన కుమారులతో సాయుధుడై కోవూరికి మౌలాలీ ఉరుసు సాకుగా పోయెను. రుక్మారెడ్డి ఇది కనిపెట్టి సదాశివరెడ్డితో చెప్పెను. రెడ్డి సపరివారముగా బీదరు మార్గమున గోనపల్లి గ్రామమున అచటి పటేలు నాగిరెడ్డి సాయముతో కొమ్మురావుల చెరువు అలుగుబండలలో సిద్దీకై పొంచియుండెను. సిద్దీ తన కుమారులతో బిదరు కోట పట్టుకొనుటకై గోనపల్లి చేరవచ్చి నగారా మ్రోగించెను. రెడ్డి తుపాకిగుండ్లు కురిపించి వాని కొడుకుల నందరిని చంపెను. సిద్దీ అబ్దుల్‌ఖాదరు పారిపోవ నుద్యుక్తుడయ్యెను. రెడ్డి యడ్డముగా తిరిగి వాని నెదుర్కొని పాల్కిబోయల చంపెను. సిద్దీ మహామాంత్రికుడు. అతడు,

'పిడికెడంత మన్ను పట్టినాడు
పటపట మంతిరించినాడు
రెడ్డిపైన మన్ను చల్లినాడు
రెడ్డి రాయియైపోయినాడు
ఎక్కిన గుఱ్ఱము రాయి యైనది'

కాని ఎఱ్ఱిగొల్ల సూరతికాడు ప్రతిక్రియ చేసి రెడ్డి నెప్పటియట్ల చేసెను. అప్పుడు రెడ్డి,

"బొడ్లో వుండిన బాకు పెరికినాడు
సిద్దివాణ్ణి ఎదల గుద్దినాడు
వాణ్ణి పట్టి వత్రున చీల్చినాడు
రక్తముతో తిరుమణి దిద్దినాడు"

సిద్దీమరణవార్త విని తనకొడుకును రెడ్డిచేతినుండి మరల తన గృహమునకు రప్పించుకొనుటకై నవాబు తనకు శక్తి చాలక

'రాణికి ఉత్తరంబు వ్రాసే
అమ్మా రాణమ్మ దొరసాని వినుము
నీచేతి క్రింది జాతీయవాండ్లను తోలు
మంచి సూత్రకాల్లను చూచి తోలు'మని ప్రార్థించెను.

(బహుశః ఇంగ్లీషు ప్రభ్వి విక్టోరియా రాణియని పదకర్తయభి ప్రాయము.) రాణి ఫిరంగుల సైన్యమంపినది. వారుకూడ రెడ్డిని పట్టుకొనుటకు భయపడిరి. అందులో నొకడగు ఠాకూరుసాబు దొరవారితో

"కాపువానికి భయముపడితె మనము
రాణి ఎట్లు నమ్మవలెను మనల
మైదు చేసి పట్టుకొని వత్తమయ్యా"యనెను. (మంత్రము)

అప్పుడాతని స్నేహితుడు చిల్లంగి దొర

'అతనిమీద మన మైదు పారదండీ
పిక్కలలోనా తాయితలు కలవాడు
నరునిచేత చావు లేనివాడు
వాణ్ణి మనము ఏమి చంపుతాము
వూరికె పట్టుకొని తెచ్చి ఇస్తమయ్యా' యనెను. తెల్లదొరలు

సాయుధులై రంగంపేట చేరుకొనిరి. వారిని చూడగనే మాల బడపల చెన్నడు తన 'చాగరోకలి చేత బట్టినాడు, బత్తెగొడ్డుల బాదినట్లు బాదినాడు' అప్పుడు వారు కేవలము రెడ్డిగారిని దర్శింప వచ్చితిమనిరి. రెడ్డి వారికి దర్శన మీయ దలచెను కాని హల్లీజా యాతని వారించి వారిచెంత 'మైదు అద్దములు ఉన్నవయ్యా, మైదు కాగితము లున్నవయ్యా' యనెను. రెడ్డి హల్లీజా భయముడిపి వారిని చూడబోయెను. తెల్లదొర లాతని పట్టి బంధింప జూచిరి. రెడ్డి వారిలో నార్గురిని హతము చేసెను. తక్కినవారు

'మైదుజాబు తీసి రెడ్డి ముందు వేసిరయ్యా
రెడ్డి ఎరుగక ఆ జాబును పట్టెనయ్యా

అతడు మూడవ పంక్తి చదివినాడిా

రెడ్డికి ఎల్లమల్ల అయ్యెనయ్యా'.రెడ్డికి తనవారిపై మచ్చిక లేకుండ పోయెను జాతివారిపై మక్కువ కలిగెను. హల్లీజాతో రెడ్డి జాతివారిల వెంబడించెను. వారు హైదరాబాదు మార్గము పట్టిరి. కొంత దూరము వచ్చినపిమ్మట హల్లీజ కిది యవమానముగా దోచెను. తన తండ్రి ముఖము జూడనొల్లక నాతడు విషము దిని మధ్యేమార్గమున మరణించెను సవాబు తన కొడుకు శవము జూచి దుఃఖించి కోపముతో రెడ్డిని కారాగారమం దుంచెను. శంకరమ్మ రాణి కీవార్త తెలిసి నవాబు నెదిరింప 'గజ్జల కొడవలి పట్టుకొని' నగరము వచ్చినది. దొరలు రెడ్డికి భూతద్దము చూపగనే పూర్వస్మృతి కలిగి యాతడు కోపావేశముతో నవాబుపై దూకెను. 'అరబ్బుల పార కమ్మినాది'. రెడ్డి 'ఆరువేల అరబ్బుల నరికినాడు'. నవాబు దాగియుండెను. 'ఫరంగీలు మరియు అద్దము జూపినారు' రెడ్డి మరల స్మృతి దప్పెను.రెడ్డిని వారు సతాశివనం పేటకుతెచ్చి వెంకటేశ్వరుల గుడిలో వేసి దానిలో భూతద్దము పెట్టి తాళమువేసి వెడలిపోయిరి. తెల్లవారగనే రెడ్డి అద్దమును చూచినంత పూర్వస్మృతి మరల గలిగెను. స్వామిని తన కుమారుని బీదరు తాలూకాకు రాజుగా చేయుమని ప్రార్థించి రెడ్డి వైకుంఠమునకు వెంకటేశ్వరుడు తెచ్చిన రథముపై ప్రయాణమయ్యెను. తిరుపతిలో అతనిని (రెడ్డిని) నిలిపినారు. 'స్వామి యెడమట సదాశివరెడ్డి, స్వామి కుడిప్రక్కన నల్లసోమనాద్రి'. ఇంతటితో పదము సమాప్తి.

పదములో చరిత్రకు సంబంధించిన విషయములు కొన్నింటితో పాటు అమానుషములగు విషయములు గూడ చేరినవి. సదాశివరెడ్డికి పిక్కలలో తాయెతు లుండుట, సిద్దీ మంత్రించి రెడ్డిని శిలగా చేయుట, జాతివారు 'మైదు కాగితము' 'అద్దము'మున్నగువానితో రెడ్డిని వశపరచుకొనుట వంటివి జానపదుల కల్పనలు. బహుశః ఈ మంత్రతంత్రములు బాలనాగమ్మ కథయందలి మాయల ఫకీరు(మరాఠి)వానినుండి సంక్రమించి యుండును. జానపద లొక పాటయందలి విషయము నొక పాటయందు జొప్పింతు రనుట నిదివరకే మనవిచేసియుంటిని. రెడ్డి పట్టుబడిన తరువాత రాణిశంకరమ్మగారు నవాబు చెంతకు బోవుట యనునది చారిత్రకవిషయము తారుమారైనది. రెడ్డి పట్టుబడు కాలమునాటి కామె నిజముగా బ్రతికియుండలేదు. కాని సదాశివరెడ్డిని పట్టాభిషిక్తు జేసిన పిమ్మట సంస్థానమున కలిగిన యల్లపలకు కారణమైన నిజాము ముఖ్యమంత్రి మీరాలం

గురించి చెప్పుటకు మాత్రమామె నిజాము చెంతకు బోవుట, అట నామెను నిజాము గౌరవించి పంపుచుండగా ముఖ్యమంత్రి కుట్రచేసి ఆమెపై సాయుధ దౌర్జన్యము జరిపించుట, అదే బాధతో నామె కొంతకాలమునకు స్వర్గస్థురాలగుట వంటివి చారిత్రకవిషయములు.

సిసలైన చరిత్రమునంతటిని నేను 'తెలుగు వీరుడు'లో చేర్చితిని. నాకీ చారిత్రక పరిశోధనమున ననేక గ్రంథములు, రికార్డులు, స్థానిక వృత్తాంతములు తోడ్పడినవి[1]. ఈవీరగాథ మెదకు పాపన్నపేట సంస్థానములకు సంబంధించినది. ఈ సంస్థానము ఫిరోజ్‌షా చక్రవర్తి కాలమున స్థాపింపబడినట్లు మెదకు రాజుల రికార్డులు, వంశవృక్షావళి (అముద్రితములు) మున్నగువానివలన దెలియు చున్నది. ఈ వంశమున పన్నెండవ తరమున నధికప్రసిద్ధి గాంచిన రాజ్ఞి రాయెబాగన్ (పెంటి సింగపు రాణి) రాణి శంకరమ్మ; రాజా వెంకట నరసింహా రెడ్డి భార్య. ఈయమ అసఫ్జా వంశమున రెండవ సుల్తానగు నిజామలీకి సమ కాలీనురాలు. ఖర్డ్లా యుద్ధమున నిజాము ప్రాణముల గాపాడినదీ వీరనారీమణి. (ఈయమగురించి కూడ ఒక వీరగీతము తెలంగాణమున ప్రచారమందున్నది) నిజాము నామెను పదునెనిమిది లాంఛనములతో బహూకరించెను. నిజామున కామె ఎంత చెప్పిన నంత. ఆమె రుద్రమదేవి యపరావతారమని ప్రజలు నమ్ముదురు. రుద్రమ్మవలెనే శంకరమ్మకు సంతానము లేదు. రుద్రమ్మకు వీరప్రతాపుడు దత్తపుత్రుడు. శంకరమ్మకు వీరసదాశివుడు దత్తపుత్రుడు. ఈమె కాలమున సంస్థాన మతివిస్తీర్ణమైనది. ఖర్డ్లా యుద్ధానంతరము శంకరమ్మ కాశికి బోవ సంస్థానమున కుట్రలు ప్రబలినవి. హిమవంతుడను నాతడు రాజ్యము హస్తగత మొనరించుకొనెను. ఆమె తిరిగివచ్చి వానిని చంపివేసి, చెల్లెలి (రంగమ్మ) కుమారుడైన సదాశివరెడ్డియను మహావీరునికి పట్టముగట్టినది. గద్వాలరాజు బిడ్డలు శివాయమ్మ లింగాయమ్మ పార్వతమ్మలను సదాశివరెడ్డికి పెండ్లి చేసినది. (పార్వతమ్మ గద్వాలవారి యాడబడుచు కాదని స్థానికులు చెప్పిరి.) ఈ సదాశివ రెడ్డియే మన కథానాయకుడు. ఆయన భార్యలలో పార్వతమ్మ వీరనారీమణి.

---

1. హైందవ ధర్మవీరులు, **Our faithful Ally the Nizam, Histoy of Deccan, Asafjah II,** గంజీనె ఆసఫియా, తారీఖె ఖుర్షీద్‌జాహీ, సమస్తానె ఆసఫియా.

కామలీగారికి ముఖ్యమంత్రి మీరాలం నవాబు. ఒకప్పుడు వేములకొండచెంత చికుంద సీటిగురించి సదాశివరెడ్డికి నాందారుఖానునకు జరిగిన యుద్ధమప్పటి ండి మీరాలం మంత్రికి మెదకు సంస్థానముపై ద్వేషము పెరుగ జొచ్చినది. కామలీతో మాటలాడబోయిన రాణిగారి నొకప్పుడు అతడు చంపింప యత్నించి విఫలుడయ్యెను. కాని రాణి ఆయేడే మరణించినది. సదాశివుని పించుట కాతడు సిద్దీయంబరువంటివారిని పురికొల్పెను. కాని సదాశివరెడ్డి తిలో సిద్దీయంబరుడే చనిపోయెను.

ఆకాలమున హైదరాబాదు రాజకీయములు వింతగా నుండెను. ముఖ్య ంత్రి మీరాలం మున్నగువా రొకవైపు, మహారాష్ట్రీ పేష్వాల రాయబారి కృష్ణ ందురీని బలమొకవైపు, శ్రీరంగపట్టణ సుల్తానుల రాయబారి రాయరాయాన్ ంత్రము లొకత్రోవ, తమతమ బలములు పాదుకొనుటకై కృషిచేయు ాంసువారి మూసారేమూ Raymond మరియు బ్రిటిషువారి రెసిడెంటు Captain Kirk Patrick) గారి పరస్పరవిరుద్ధతంత్రము లొకవైపు ాదరాబాదు రాజకీయవాతావరణము నత్యంతకలుషితముగా నొనర్చెను. నిజాము ాడుకాళ్ల ముదుసలియైనను రాజ్యకాంక్ష తీరక మీరాలం చేతిలో కీలుబొమ్మవలె ుచుండెను. రాజ్యమందలి యల్లరుల జూచి యువరాజగు అలీజా తిరుగుబాటు సెను. కాని మీరాలం సలహావలన వృద్ధనిజా మాతని బంధించెను.

ఆకాలమున హైదరాబాదు రాజ్యముననున్న సంస్థానములం దన్నిటికన్న దకు సంస్థానము బలవత్తరమైనది. సదాశివరెడ్డి మహావీరుడు; శూరుడు. జాము నెదిర్చి నిలువగల సమర్థుడు. నాజిముల్ముల్కు (నిజాము బావమరది) రియు కృష్ణచంద్రులతో నాలోచించి అలీజా తన్ను విడిపింప సదాశివరెడ్డికి హస్యవార్త నంపెను. అదనుకై ఎదురుచూచు సదాశివరెడ్డి 500 బలముతో ంజాన్ పండుగ దినములలో 28 జూన్ 1795 నాడు హైదరాబాదు పైబడి వలీలగా అలీజాను విడిపించుకొని బిదరు మార్గము పట్టెను. నిజాము నవాబు మునదిలేక దాగియుండెను. మహామంత్రి మీరాలం పారిపోయెను. కాని ల్లవారగనే పెద్ద సైన్యమిచ్చి సిద్దీ యబ్దుల్లాను రెడ్డిని వెంటాడ పంపెను. సనాబాదు పరగణా కృష్ణాపుర ప్రాంతారణ్యములందు యుద్ధము జరిగినది. ద్దీ యబ్దుల్లా మరణించెను. తురక సేనలు విరిగెను. అమితమగు నాయుధ మగ్రి రెడ్డి చేతికి చిక్కెను. బిదరు ఖిల్లాదారుడు జాకిరుద్దీన్‌ఖానుడు రెడ్డికి

కోట నప్పగించి పారిపోయెను. సదాశివరెడ్డి అలీజాను బీదరు కోటలో నుంచి సంగారెడ్డి, వెల్మకన్నె, మెదకు, షాగూరు, రాజంపేట మున్నగు తమ ఏలుబడిలోనున్న దుర్గములను యుద్ధమునకై సైన్యపటిష్ఠ మొనర్చెను. నిజాము రెండవమా రొక గొప్పసేనను బీదరు కోటపై కొందరు ఫ్రెంచి సైనికుల సహాయమిచ్చి పంపెను. కాని అప్పుడుకూడ జయము సదాశివరెడ్డికే లభించినది. ఇక తన సేనలతో, కొద్దిపాటి ఫ్రెంచి సేనలతో లాభము లేదనుకొని నవాబు పెద్దయెత్తున సైనిక సన్నాహము లొనర్చెను. ఈమారు బ్రిటిషు బలములు, ఫ్రెంచి బలములు, తన యపార సేన, జాగీర్దారుల సేన లన్నింటిని నిజాము కూర్చుకొనెను. మొదట వారు మెదకు కోటపై దండెత్తిరి. సదాశివుని కోటలో నున్న యొక సిద్దీవాని కుట్రచే మెదకు తురకల వశమయ్యెను. అటనుండి మూసారేమూ ఆధిపత్యమున సకలసేనలు బీదరు కోటను 22 వ సెప్టెంబరు, 1795 నాడు ముట్టడించెను. మహాయుద్ధము జరిగినది. ఇరువైపుల సైన్యములు నాశనమైనవి. మహాయోధుడగు మూసారేమూ సదాశివరెడ్డి ప్రతాపమునకు సంభ్రమాశ్చర్యచకితుడయ్యెను. యుద్ధములో నాతడు తీవ్రముగా గాయపడెను. పార్వతీసదాశివులు అలీజాను మధ్యనుంచుకొని బీదరు విడిచి తప్పించుకొని పోయిరి. సదాశివరెడ్డి అలీజాకు కొంత సైన్యమిచ్చి ఔరంగాబాదు దుర్గమున కంపి తాను షాగూరు కోట చేరుకొనెను. తక్కిన హిందూసంస్థానాధీశుల సాయ మర్థించెను కాని లాభము లేదయ్యెను. మీరాలం తగు సేనతో అలీజాను పట్టుకొనుటకు ఔరంగాబాదు వెడలెను. సదాశివ రెడ్డిని పట్టుకొనుట సాధ్యము కాదని ఫ్రెంచి మరియు బ్రిటిషు సైన్యములు తిరిగి పోవుచుండెను. మీరాలం హైదరుద్దౌలా యనువానిం బంపి మోసగించి అలీజాను పట్టి బంధించి హైదరాబాదు మార్గము పట్టెను. 22 వ నవంబరు 1795 నాడు మార్గ మధ్యమున ఖేర్ సమీపమున అలీజా యవమానముచేత విషము మ్రింగి చనిపోయెను. 28 వ నవంబరు నాడు సదాశివ రెడ్డి 3000 సైన్యముతో 'చిక్పన్' చెంత మూసారేమూ నెదుర్కొని పోరాడి గాయపరచి తన సైన్యము నష్టమై పోవ మరల తప్పించుకొని యడవుల బడి పోయెను. ప్రతి యుద్ధమున సదాశివునకు పార్వతి తనుత్రాణమై యుండెను. ఆమె కూడ యుద్ధములు చేసిన వీరనారీమణి. వారిని జయించి పట్టుకొనలేమని నిజా మనుకొనెను. ఇక మోసగించి బంధింప వలయు ననుకొనెను. వారికడ నున్న రాయరాయాన్ ఈపనికై గద్దె తినెను. పార్వతీసదాశివుల నాతడు మోసగించి బంధించి నవాబున కప్పగించెను.

కారాగారమున వారి జీవితము దుర్భరమయ్యెను. ఒకనాడు ఆత్మహత్యకై ప్రయత్నించి విఫలులైరి. సిద్దీ అబ్దుల్లా కుమారుడు తన తండ్రి పగ నీగికొన కారాగారము ప్రవేశించి కాలుసేతులు కట్టబడియున్న సదాశివరెడ్డి తల నరికెను. వీరనారీమణి పార్వతి సిద్దీపైబడి మహాకాళివలె వాని గొంతు బిగించి చంపినది. తానుకూడ వాని బాకుపోటుతో నేలకూలినది. పార్వతీసదాశివుల వీరమరణ మత్యద్భుతము. వారి గాధ తెలంగాణా శౌర్యమునకు మచ్చుతునక. యుద్ధవివరములు ఆనాటి రాజకీయవాతావరణము ఇచ్చట చెప్పుటకు వీలులేక విడిచితిని. వివరములకై 'తెలుగు వీరుడు' చూడ ప్రార్థితులు.

ఇంకను మిగిలిపోయిన చారిత్రకగీతముల విడిచిపెట్టుచున్నాను. వాని విమర్శనమున కిట స్థలము చాలదు. ఈ వీరగేయములందు కొన్ని కేవలము వీరుల వైయక్తికజీవితమును ప్రతిబింబించునట్టివి. ఉదాహరణమునకై కోటప్ప కొండ పితూరీదారు చిన్నపరెడ్డి, పల్నాడులోని పిల్లుట్ల గ్రామపు గుత్తాల గోపిరెడ్డివంటివారి కథలకు చరిత్రతో నంతగా సంబంధము లేదు. కథలు, వారి వీరజీవనము సత్యములే యైనను దేశచరిత్రముపై వారి ప్రభావ మల్పము. కనుక నట్టివానిని విడిచివేయుచున్నాను. ఈ పాటలగూర్చి ఇదివరకే కొందరు వ్రాసినారు. చిన్నపరెడ్డిగురించి 'జానపద గేయ వాఙ్మయ పరిచయము' నందును, 'గుత్తాల గోపిరెడ్డి' గురించి 'భారతి' అక్టోబరు, 1954 సంచికలోను చూడనగును.

ఇంతవరకు పరిశీలించినవి చారిత్రకగేయములు. వీనిలో కొన్నింటి చరిత్ర సుప్రసిద్ధము. మరికొన్నింటి చరిత్రము పరిశోధకులు బయటపెట్టిరి. నేనుకూడ చరిత్ర త్రవ్విన ఒండురెండు గేయములు చేర్చితిని. ఇక అస్పష్ట చారిత్రకగేయములు (Quasi historical) గూర్చి విచారింతును. ఇప్పటికి లభించిన యాధారములనుబట్టి వీని నస్పష్టచారిత్రకములుగ పరిగణింపవలసి వచ్చుచున్నది. పండితులు భావిపరిశోధకులు ముందుముందు వీని చరిత్ర త్రవ్వి తండములు పోయవచ్చును. మొదట ముద్రితములగు గేయములను దెల్పి తరువాత నేను సేకరించిన యస్పష్టచారిత్రక గేయములగూర్చి మనవిచేయుదును.

ఇంతవరకును చరిత్రము సరిగా తెలియనట్టి గేయములందు '*బంగారు తిమ్మరాజు కథ*' యొకటి. చంద్రశేఖర శతకకారుడు తడవిన దీపాటయే యని

పండితుల యభిప్రాయము.

'యింటిని తిమ్మరాజుకతె యింటిని యీర్లకతా ప్రెసంగముల్
యింటిని పాదుసా యిజవ మింటిని నాయకురాలి శౌర్రె మె
ట్టుంటదొ మాలకొండడి కతొక్కటి యిగ్గల బాగ్గె మింక యె
ప్పంటికి గల్గునో యనుచు బల్కెను మూర్ఖుడు చంద్రశేఖరా'1. ప. 67

పెనుగొండలో నెవరో పేరులేని దేవరాయలు పాలించుచుండ జరిగిన వృత్తాంతమటుల పదకర్త చిత్రించినాడు. ఈ రాయలవారి తమ్ముడు రఘుపతి రాయలు శేషపట్నము ఏలిక. రఘుపతిరాయల కుమారుడు బంగారు తిమ్మరాజట. చరిత్రమందీ పేరులు కానరావు. కాని బంగారు తిరుమలుడనునాత డొకడు కాన్పించును. మధురరాజ్యము నేలిన పదిరాణి మీనాక్షి (1732-1739). ఈయమ విజయరంగ చొక్కనాథుని భార్య. ఈ మీనాక్షి కాలమున మధుర రాజ్యమున దళవాయి వెంకటాచార్యునితో గలిసి రాణిగారిపై కుట్రలు పన్ని చివరకు రాజ్యనాశనమునకు కారకుడైనవాడు బంగారు తిరుమలుడని చరిత్రములు చెప్పుచున్నవి[2]. విజయనగరసామ్రాజ్యమునకు వినాశము గూర్చినవా డొక తిరుమలనాయకుడు కలడు. మొదటి ముద్దువీరప్పనాయకుని తరువాత అతని సోదరుడగు తిరుమలనాయకుడు (1623-1659) మధురను పాలించెను. శ్రీరంగరాయలవారిపై కుట్రలు పన్ని గోలకొండ నవాబులకు విజయనగరరాజ్య నాశన మొనర్చుట కవకాశమిచ్చినవా డితడే[3]. పదమునందున్న తిమ్మరాజు ఇతడగునో కాదో. ఈ విషయమై శ్రీహరి ఆదిశేషువుగా రిట్లు వ్రాసినారు. 'ఆ రాయలవారు కృష్ణదేవరాయలని జనసామాన్యంలో పుక్కిటి పురాణమున్నట్లు మెకంజీ దొరవారు సేకరించిన గాథల్లో వుందట. రాయలవారు పెనుగొండలో అప్పుడప్పు డుండేవారనీ వారి రాణులలో ఒకామె హాశెగార్లందరిలో అత్యంత సుందరుడైన బంగారుతిమ్మనాయుడిని మోహించిందనీ, విఫలమనోరథురాలై రాయలవారితో కొండేలు చెప్పిందనీ, జనశ్రుతి. రాయలు ఆమాటలు నమ్మి తిమ్మనాయుడిమీద కోపంతో అతణ్ణి ముక్కలు ముక్కలుగా నరికించాడట.

---

1. శ్రీ మద్దులపల్లి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి పరిష్కరణము, వావిళ్ళ ప్రచురణము 1969.

2. ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి, శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం పుట. 383

3. ,, ,, ,, పుట. 381

తిమ్మనాయుడి గోరీ ఇదిగోనని క్రిందటి శతాబ్దంవరకూ ఒకచోటు చూపించి జనం పరంపరగా చెప్పుకునేవారట[1]. శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు ఇట్లనుచున్నారు. 'ఒకానొక సమయమున ఘనగిరి ప్రాంతములను దేవరాయ అనునాతడు పరిపాలించుచుండెను. ఈ దేవరాయ లేకాలమువాడో చరిత్రయం దింకను తేలలేదు. అట్లే యాతడు స్వతంత్రుడో ఒక మండలేశ్వరుడో గూడ మన మెరుగము. ఈతనిగురించిన గాథ యింకను పల్లె పాటలలోనే ప్రాణము బోసికొనుచున్నది[2].' పదమందు ప్రచారము గాంచిన కథనే కొలది మార్పులతో నారాయణాచార్యులవారు 'దేవరాయల చరిత్ర' మను పేరుతో తమ 'విజయ తోరణము'న గూర్చినారు. చరిత్ర మింకను పరిశోధించి కనుగొనవలసిన విషయమని చెప్పి పదమందున్న కథను క్లుప్తముగా నివేదింతును.

'పెనుగొండా తా నేలుతున్నడూ రాయలు దేవాఋ
రామా రామా రామా రామా రామా రఘురామా'

ఈ (దేవ) రాయలకు ఏడుగురు తమ్ములు. విఠ్ఠలరాజు, వీర్రాజు, కటకంరాజు, కళింగరాజు, రఘుపతిరాజు, భూపతిరాజు, కూర్మరాజులు. వీరిలో రఘుపతి రాయలు శేషపట్నము చెంగల్పట్టుల యేలిక. పెద్దరాయలకు పదకొండుగురు భార్య లున్నను సంతానము కలుగలేదు. వీరికి తోడు బోగము రంగసాని వచ్చి చేరినది. అది,

'కర్ణాటకము భరతవిద్యలూ కండ్ల జూపినాది
మొగ్గలు వాలీ మోళీ బగానా కండ్ల పూనినాది
చితార్చిచే పిడేళ్లాతో పాటలు పాడింది'

రాజుగారు దాని విద్యల కలరి ఖామందుంచిరి. మేడలు మిద్దెలు కట్టించిరి.

'నూనె పోసి యెత్తవచ్చునూ రంగసాని మేడ
పాలు పోసి యెత్తవచ్చునూ రంగసానిమేడ'

రంగసాని తమ్ముడు సవరము నారప్ప, కడు దురాత్ముడు. శిశుహత్య. స్త్రీల నవహరించుట, కొంపలు గాల్చుట వాని పని. క్రీ. శ. 1630-1642 నడుమ

---

1. జానపద గేయ వాఙ్మయ పరిచయము, పుట. 66.

2. విజయ తోరణము. శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు. పుట 3

విజయనగరమును పరిపాలించిన ముమ్మడి వేంకటపతిరాయల కాలమున సవరము చిననారాయణనాయకుడు 'కువలయాశ్వ చరిత్ర' కృతికర్తయుండెను. ఈ రెండుపేరుల కెట్టిసంబంధమో !

శేష పట్నపు ఏలిక రఘుపతిరాజు భార్య మేనయ్య. వీరి సంతానము 1. బంగారు తిమ్మరాజు, 2. పూల రంగరాజు, 3. కృష్ణ రాజులు; తిరుపతి వెంకటేశ్వర వరప్రసాదమున నుద్భవించిరి.

నారప్ప తండ్రి జవలాగోవిందు ఒకప్పుడు దేవరాయల దివానుగా నుండి శేషపట్నమునకు 'దస్తు'కై వచ్చెను. అప్పుడు రఘుపతిరాజు మున్నగువారు

'కోట యివతలీ నున్నపురాళ్లూ తీసుకెళ్ల మనిరీ
బురుజు మీదిదీ అరికి గడ్డీ పట్టుకెళ్ల మనిరీ'

మాటల పట్టింపుపై జవలాగోవిందును 'కోట వెలుపలీ నల్లరాళ్ళకూ బలి నరకీనారూ'. ఈ పగ సాధించుటకై యొకప్పుడు రంగసాని మరియు నారప్ప ఆలోచించుకొనిరి. వారు రాయలను సంతోషపరచి బంగారు తిమ్మరాజును చూచుటకై పెనుగొండకు రప్పించుమనిరి. రాయలు రంగసాని విద్యానైపుణ్యమున కలరి 'గోలకొండ చెన్నపట్నము జాగీరిస్తా'ననెను. (పదకర్త చెన్నపట్టణ నిర్మాణమైన తరువాతవాడు కావచ్చు) రాయలవారు బంగారు తిమ్మరాజును పంపుమని తమ్మునికి జాబు వ్రాసిరి. వార్తాహరులు పెద్దాడ, ఎగువతిరుపతి, శివకంచి, అనంతగిరి, మంగపట్నముల మీదుగా శేషపట్నము చేరుకొనిరి బంరారు తిమ్మరాజు జాబు చూచి పెనుగొండ ప్రయాణమునకు సన్నద్ధుడై రణభేఠ (ప్రయాణ ఖేఠయా?) వేయించెను. 'భేరీలోనే అపజయమానీ వాణీ పలికింది'. రఘుపతిరాయలు కీడు శంకించి కుమారుని ప్రయాణము నాపదలచెను. కాని తిమ్మరాజు వినడయ్యెను. అప్పుడు రఘుపతిరాయలు.

'దండాము దండాము మీకు తిరుపతి వెంకన్నా
వరానబుట్టిన వరప్రసాది పెనుగొండొస్తాడు
వెన్ను దగిలి వెంటనుండుమీ తిరుపతి వెంకన్నా' యని ఇటులే

అలమేల్మంగను, వరదరాజస్వామిని, కంచి కామాక్షిని వేడ్కొని సెలవిచ్చెను. తల్లులు దుశ్శకునముల జూచి కుమారు నాపదలంచిరి, కాని లాభము లేదయ్యెను.

(మునుముందు జరుగనున్న యుద్ధములు విపత్తు మున్నగునవి యన్నియు ముందుగనే ప్రశ్నజూచినప్పుడు తెలిసినటుల వర్ణింపబడినది. ఈ విధముగా. నొకమారును సంఘటనము జరుగునప్పు డొకమారును ఈవిషయము లిట్లు రెండు పర్యాయములు వర్ణింపబడినవి) తిమ్మరాజు భార్య మాణిక్యదేవి. ఆమెకు శోభనమైనను కాలేదు. దేశింగురాజు కథలోకూడ ఇట్టి సందర్భమే యున్నది. శోభనము కూడ జరుగక పూర్వమే దేశింగు యుద్ధమునకు ప్రయాణమై భార్య దీవనల నందుకొనెను. ఈ యిరువురు వీరనారీమణులకు గలిగిన దుశ్శకునములు సమానములు. తిమ్మరాజుకు పాలిచ్చి పెంచిన దాది పల్లెపు రమణమ్మ; జాలరి కులమున బుట్టినది. మాణిక్యదేవి రమణమ్మను అత్తగారివలె గౌరవించెడిది.

'నా భర్తకు పాలతల్లివి రమణమ్మా దేవి
భర్తను పెంచి నాకిస్తివి ముద్దుల ఓ యత్తా' యని సంబోధించినది. భర్త

పెనుగొండకు పోవునప్పుడు మాణిక్యదేవి పడిన దుఃఖము కరుణాపూరితము.

'పతిపాదముపై పడి యేడ్చిందీ మాణిక్యాదేవి
అన్నెకారి భగవంతుడు మనకు ఇట్లు కూర్చినాడు
ఆడపుట్టుక యేల పుట్టితిని హే దైవమ యనుచూ
కొరగాని స్త్రీ జన్మము యేలా పుట్టిస్తివి బ్రహ్మ
రాళ్లలోపలా నల్లరాయిగా నే బుట్టగనైతి
అడవి లోపలా వృక్షంబయ్యి నే పుట్టగనైతి'

తిమ్మరాజు వెంబడి అతని మిత్రులు హస్సేను హుస్సేననువారు సిద్ధమైరి. వారితల్లి వారిని

'పెనుగొండాకు పోవను యేలా ఓ బిడ్డల్లారా
యేకులు వడికీ మిమ్ము బెంతునూ ఓ బిడ్డల్లారా
కట్టెలు అమ్మీ మిమ్ము బెంతునూ ఓ బిడ్డల్లారా'

యని వారింపజూచెను. కాని వారును వినరైరి. తిమ్మరాజు సకలసేనలతో పల్లెపు రమణమ్మతో ప్రయాణ మయ్యెను. తల్లిదండ్రులు కూడ బయలుదేరిరి. కాని యన్నియు దుశ్శకునములే కలిగినవి. ఐనను తిమ్మరాజు ప్రయాణము సాగి పోయెను. శేషుపట్నము, చెంగల్పట్టు, మంగపట్నముల మీదుగా అనంత పట్నము చేరుకొనిరి. అచ్చట తిమ్మరాజు మామ అయ్యపురాజు ఏలిక.

'అయ్యపురాజు డాలుకత్తులే ఆరుగురీ మోత
అయ్యపురాజు పరాను కత్తులు పన్నెండుమంది మోత'

అయ్యపురాజు గూడ తిమ్మరాజుననుసరించెను. వారు శివకంచి చేరుకొనిరి. కంచి కామాక్షిని తిమ్మరాజు 'నల్లబోళ్ళకు దండం బెడితే ఫలమేమిటి తంత్రీ' యని హేళనచేసెను. ఆమె బ్రాహ్మణకన్యయై వచ్చి దర్శన మిచ్చినది. ఆమె 'యెచ్చట కష్టం కలిగితె రాజా అప్పుడు తలచూమి, ఆకాశమూ విఱిగీ పడితే అడ్డం పడతాను' అని అభయమిచ్చినది. కాని 'పగటి యుద్ధమునకు పరవాలేదూ నా ముద్దుల కొడుకా, రాత్రి యుద్ధమునకు సహాయము రాము బాబు తిమ్మరాజా' యనినది. విష్ణుకంచిలో వరదరాజస్వామి యవే మాటలనెను. తిరుపతి వెంకటేశ్వరుని గూడ తిమ్మరాజు 'నల్లరాళ్ళకూ దండంబెడితే మోక్షాలే లేవు' అని అవహేళన చేసెను. 'నరుకుదు నిన్నూ వెంకట్రెడ్డీ నాలుగు ముక్కలుగా, నిన్ను చంపీ నేనే చస్తా ఓ వెంకట్రమణా' యని బెదరించెను. వేంకటపతి గూడ కామాక్షి యన్నమాటలే యనెను. (ఇది చూడగా యుద్ధమందు రాత్రి పూట నేదో కీడు మూడునని యూహింపవచ్చును.) తిరుపతినుండి పెద్దాడ చేరు కొనిరి. అచట భేరి వేయించగనే పెనుగొండలో నది వినపడెను. దేవరాయలు కొడుకు నెదుర్కొని తోడ్కొని వచ్చుటకు సిద్ధపడెను. కాని నవరమునారప్ప వలదని, తానే పోయివత్తునని సిద్ధపడెను. కాని తిమ్మరాజు కడ, కారుమాట లాడి తన్నులు తిని తిరిగివచ్చి దేవరాయలతో కొండెములు చెప్పెను. రాయ లది గ్రహించి నారప్పను ఖైదులోనుంచి తానే తిమ్మరాజును దోడితెచ్చుటకై వెడలెను. ఇరువైపులవారు కలిసికొనిరి. రాయలవారు తిమ్మరాజాదులతో 'మీ సేనలకూ మా సేనలకూ వంటలు చేతాము, భత్యం దిని రాత్రిపూటవే యింటికెళ్ళుదా' మనెను. వంట లగుచుండెను. రాజపుత్రులు స్నానములకై పోయిరి. అచ్చట గుండములలో రాయలవారు పెంచిన మొసళ్ళుండెను.

'చంద్రగుండముకు సూర్యగుండముకు తామే వెళ్ళారు
పావుకోళ్ళు తా వొడ్డున విడిచీ పరికించీ చూచే
వేలకొలదీ కోట్లకొలదీ మొసళ్ళు గలవండీ
ముంగు ముక్కెరల కర్ణపుష్పముల మొసళ్ళు గలవండీ
కంఠకోరల కాలియందెల మొసళ్ళు గలవండీ'

మొసళ్ళ నీ విధముగా పెంచుటకు కారణము,

'రాయలవారికి పిల్లలు లేక మొసళ్ళ బెంచారు'. వీనికి మేత లెట్టివో చూడుడు. 'నల్లమేకలు నాలుగువేలు మేతలు వేయించె'. స్నానసంధ్యాదులు నిర్వర్తించుకొని భోజనమున కందరు సిద్ధపడిరి. కాని వంటబ్రాహ్మణు లింత

మందికి వంట చేయలేక పారిపోయిరి. అప్పుడు బంగారుతిమ్మరాజు తలపుచేత, వెంకటేశ్వరస్వామి మరియు కంచికామాక్షి వంటలు చేసి వడ్డించిరి. రాయలవారు కుమారుని మాహాత్మ్యమున కాశ్చర్యపడెను. 'దైవాలంతా నీకు దాసులా నా ముద్దుల కొడుకా' యని మెచ్చెను. భోజనము ముగిసిన తరువాత 'పాలవర్షము కురిపించైనా ఆకులు తీయించె'నట. అందరును 'నరుడు కాడు నారాయణమూర్తి బాలతిమ్మరా'జనిరి. అందరు కలిసి పెనుగొండ చేరుకొనిరి. కాని బోగము రంగసాని యెటులైన తిమ్మరాజును చంపవలయునని ఆలోచించుచుండెను. ఒకనాడది 'తల్లి జచ్చినా శోకము వలెను ఏడుస్తున్నది'. రాయలవారు కారణ మడుగ బంగారుతిమ్మరాజు తనను చెరుపుటకు నాటి రాత్రి వచ్చినాడనియు అట్టివానిని చంపించవలయు ననియు దొంగయేడ్పు లేడ్చినది. రాయలు దాని కాపట్యము గుర్తించి తన నగరునకు పోయెను. ఆనాటి రాత్రియే నవరము నారప్ప స్వయముగా రాయలవారినే చంపుటకు ప్రయత్నించి పట్టుబడెను. రాయలవా రాతని తలగొట్టి తలవరుల కాజ్ఞాపించెను. నారప్ప అడవిలో తలవరులకు లంచ మిచ్చి తప్పించుకొనెను. రాయలు పీడ వదలినదని మన మూరటజెంద కాశికి బోయెను. ఇది యదనుగా గొని బోగము రంగసాని పంద్రెండు వేల సైన్యము సిద్ధపరచి బంగారు తిమ్మరాజును చంపుటకు యత్నించినది. కాని పల్లెపు రమణమ్మ దాని నెదుర్కొనినది.

'జట్టీ లాగు తొడిగినదయ్యా పల్లెపు రమణమ్మ
పురుషవేషమే వేసినదయ్యా పల్లెపు రమణమ్మ
ఢాలు కత్తులు చేతబట్టెను పల్లెపు రమణమ్మ
మేఘరంజి గుఱ్ఱము నెక్కె పల్లెపు రమణమ్మ
ఆరువేలను గడియలోపల నిలువున నరికింది
ముక్కముక్కలుగ నరికినదయ్యా సానిదాని దండు'

చివరకు రంగసాని బల్లెము రమణమ్మ హృదయమున దూరిపోయినది. బంగారు తిమ్మరాజు కంతవర కీసంగతియే తెలియదు. అతడు 'గాయము మాన్పి కుదురు పరతునే పల్లెపు రమణమ్మా' యనెను. కాని యామె వీర నారీమణి కనుక

'బాలుడ విన్ను పెంచినందుకే బల్లెము తియ్యాలి
ప్రేటు పడ్డా ప్రాణము నాది యెంగిలి జీవమురా
నీ చేతులతో దానం చేయి నా ముద్దుల కొడుకా' యని ప్రాణములు

విడిచినది. తిమ్మరా జటులే చేసెను. రంగసాని సేనతో వచ్చి తిమ్మరాజుపై

పడెను. తిమ్మరాజు 'ఆడదానితో యుద్ధం చేస్తే అసురయుద్ధ మగు'నని మాయచే నుక్కు వలలో బంధించి 'శేషపట్నము వస్తే నిన్నూ పోషిస్తానమ్మా, కన్న తల్లులతోపాటు నిన్ను కండ్ల జూచుతాను' అనెను. రంగసాని బదులుగా 'వావి వరుసలు భోగం వారికి తలుప నేటికయ్యా, పట్టపు దేవిగ నన్నుంచితే నేను వస్తనయ్యా' యనినది. బంగారు తిమ్మరాజా నీచురాలిని చంపుటకు ఆజ్ఞాపించెను. ఇంతలో సవరము నారప్ప 'ఫిరంగులును తుపాకులును మందుగుండుతోను' తిమ్మరాజు మీదికి యుద్ధమునకు వచ్చెను. కాని నారప్ప సైన్యము నాశనమై పోయినది. నారప్పను బంధించి. వాడు దాచిన ధనమునకు బలిగా వానినే నరికి తిమ్మరాజా ధనముతో శేషపట్నమునకు తరలెను. ధనమును పంచుకొనుటలో నతనికిని బావమరది మేఘపు రాజునకును తగవు వచ్చినది. మేఘపురాజు దుశ్చింతతో కాశికి రాయలవారికి

'పెనుగొండా పట్నపు ధనము కొల్లపెట్టినాడు
నీవు వుంచినా రంగసానిని తానె వుంచినాడు
వెంకటేశునకు పీ ధనమెల్ల వేలకొలది యిచ్చె'నని తిమ్మరాజుపై

నిందలు వ్రాసి పంపెను. కాశినుండి రాయలవారు దండుతో కదలివచ్చి బంగారు తిమ్మరాజును తిరుపతిలో ఢీకొనెను. 'ఘోర యుద్ధము జేసిరి వారు ఆ తిరుమలలోన' (చరిత్ర త్రవ్వట కీవిషయ ముపకరించు ననుకొందును) రాయల బాణముచే తిమ్మరాజు కూలిపోయెను. కాని మేఘపురాజు చేసిన మోసము తెలిసి రాయలు తన తొందరకు పశ్చాత్తాపపడి మేఘపురాజును చంపెను. యుద్ధమందు జచ్చిన 'హసేనుసేను'లు పెనుగొండలో 'పీర్లు' ఐరి. తిమ్మరాజు పోయినందులకు రాయలు, తలిదండ్రులు, బంధువులు పొడుచుకొని చచ్చిరి. తిమ్మరాజు వెంకటేశ్వరునిలో,మాణిక్యదేవి కామాక్షమ్మలో నైక్యమైరి.తిమ్మరాజు తమ్ములు కృష్ణమరాజు శేషపట్నమునకును, పూల రంగరాజు పెనుగొండకును ప్రభువులైరి. పదమందున్న కథ యిట్టిది. మార్పొందిన కథకై 'విజయతోరణము'ను చూడనగును. ఈ పదమందున్న కొన్ని పేరులు, తిరుపతి యుద్ధమువంటివి చారిత్రకపరిశోధనమున కాధారములగు ననుకొందును. భావిపరిశోధకులు దీని చరిత్రమును త్రవ్వవలయును.

చరిత్ర మిదమిత్థముగా దెలియబడక బహుళప్రచారమందిన ఇంకొక గేయము 'అరు(రె) మరాఠీల *కథ*'. ఈ మాట 'కత్తి చాకు' వంటిది. పొరపాటున

ప్రచురణకర్తలు 'ఆరు మరాఠీల కథ' అని అచ్చొత్తించిరి[1]. ఆఱు సంఖ్యావాచకమున కాగేయమున కెట్టి సంబంధమును లేదు. ఆరె యనునదొక జాతిని తెలుపు మాట. తెలంగాణమునం దనేకగ్రామములందు ఆరెజాతివారు కలరు. ఆరె యనునది ఆర్యశబ్దమున కపభ్రంశరూపమై యుండును. మహారాష్ట్రిమున కపభ్రంశరూపమగు నొకవిధమగు 'ఆరెబాస' వారి మాతృభాష ఆభాష మౌఖికమే గాని లిఖితము గాదు. వారియందు కొంత సంస్కారమున్నవారు తాము మహారాష్ట్రిలమని చెప్పుకొందురు. వ్యవసాయము వీరి ప్రధానవృత్తి నారు దృఢగాత్రులు. జొన్నయన్న మధికముగా తినెదరు. వారిలో శ్రీమంతులు, గ్రామోద్యోగులు, జమీందారులును కూడ కలరు. కనుక ఈ కథ 'ఆరె మరాటిల కథ'యై యుండవలయును. ఆరెవారు తెలంగాణమున పూర్వమునుండి యున్నట్లు ఆధారములు కలవు. పాల్కురికి సోమనాథుడు ఆరెభాషలో కూడ కవిత్వము చెప్పియుండెను.

ఉ॥ దేవపరీ తుమ్హీచ గురుదేవ మణూను తరీ తుమ్హీచ గో
సావితరీ తుమ్హీచ తుమచాచ ప్రసాద చమ్హీకృపాకరా
హేవరదా యటంచు నుతియించెద నిన్నును నారె బాస చే
వా పినుతార్యలీల బసవా బసవా బసవా వృషాధిపా.[2]

మా గ్రామమున నధికసంఖ్యాకు లాజాతివారలే. వారిని యాచించి బ్రతికెడువారీ పాటను పాడుచుండగా వింటిని. ఈ కథాప్రదేశము గాని నాయకుల చరిత్రము గాని వారి సంస్థానావశేషములు గాని స్పష్టముగా తెలియుట లేదు. విషయములు మాత్రము చారిత్రకముగా గన్పట్టును. కనుకనే దీని చరిత్రము బయటపడు నంతవరకు దీనిని అస్పష్టచారిత్రకములందు చేర్చుట యుచితమని తలంచితిని. గేయమందున్న కథ యిది.

మరాటీల దేశమున్నదీ సై సై
ఆరెవాండ్ల దేశమున్నదీ సై సై
పడమటొక్క దేశమందునా సై సై

పత్తికొండ తాలూకాలో (కరిజెకల్లు) పంద్రెండు కోటలు గట్టుకొని ఆరెవాండ్రు పాలించుచుండిరి. కర్నూలు మండలమున గల పత్తికొండ తాలూకాకును దీని

1. ఎం. వి. గోపాల్ అండ్ కో, మద్రాసు, 1938
2. వృషాధిప శతకము. ప.58.

క్రేమైన సంబంధము కలదో తెలియదు. ఏలిక భజేరావు. భజేరావుకు ముప్వురు కుమారులు. 1. నారాయణరావు, 2. సిద్ధోజీరావు. 3. ఖండేరావులు, అంతః కలహములు పుట్టి వేరుపడిరి. సిద్ధోజీరావు ఖండేరావులు బడేగాఁవు (పెద్ద గ్రామ మని యర్థము) పాలించుచుండిరి. నారాయణరావుకు సంతానము కలిగెను. 1 సోమోజిరావు, 2 చెప్పుల పోగు ఫీరోజీ, 3. చేతుల కడియాల సుబందిరావులు ముగ్గురు కుమారులు. సిద్ధోజీరావు ఖండేరావులకు సంతానము లేదు. పడమటి దేశపు బంగిసింగిరావు కూతురు అంతుబాయితో సోమోజిరావు వివాహ మయ్యెను. వీరి కుమారుడు తులేరావు జన్మించిన ఆరు నెలలకు పెద్ద కాటకము సంభవించెను. భజేరావు నారాయణరావులు చనిపోయిరి. సోమోజిరావు తన తమ్ములతో విచారించి తమ నాదుకోవలసినదిగా పినతండ్రులగు సిద్ధోజీరావు ఖండేరావు గారలకు బడేగాఁవ్‌కు వార్త లంపిరి. వార్తాహరుడు, మోదుగాండ్ల కనుమ, కండె రాయుడు కొండ, ఉప్పునీరువాగులు దాటి బడేగాంవ్ చేరుకొని సిద్ధోజికి వార్త నందించెను. ప్రాత పగలు తీర్చుకొనుట కిదే సమయమని సిద్ధోజిరావు ఆరువేల సైన్యముతో కరిణెకల్లు మీదికి దాడి వెడలి కాటకముతో బాధపడెడువారిని కొల్ల గొట్టిన ధనము 'ముంగరలు ముక్కు పోగులును, మూడుబండ్ల బరువు పెట్టి' రట. ఈ యతిశయోక్తి జానపదులకు ప్రియమైనది బొబ్బిలి యుద్ధమున చని పోయిన స్త్రీల నల్లపూసలు కొన్ని పుట్లు ప్రోగైనట్లుగా వర్ణింపబడినవి. ఇటులే తెలంగాణమందు జరిగిన ఘోరములప్పుడు రజాకార్ నాయకుడు ఖాశింరజ్వీ హైందవస్త్రీలను దోచి వారి భర్తలను చంపి తెచ్చిన పుస్తెలు, మంగళ సూత్రములు-రెండు బస్తాలైనవని పల్లెపాటలందు కలదు. ఈచిన్న యాభరణముల ద్వారమున సంఘటనమందలి ఔద్ధత్యము కాననగును. ఇటుల దోచికొని వారు బడేగాంవ్ తిరిగి పోయిరి సోమోజిరావు అన్నదమ్ములు దిక్కులేనివారై 'గొల్ల పల్లె' త్రోవ పట్టిరి. అచ్చట వారిని గొల్లలు కొన్ని దినములు పోషించిరి. ఫిరోజిరావు తన ఐదు కుక్కలతో ప్రాంతములందు వేటకు పోయెను. అచ్చట 'కల బాయి' (పాడు బాయి) అనుచోట నొక కుందేలు కుక్కలతో యుద్ధము జేసెను. 'పగవాడి గాలి మళ్లితే, పడవేసి గొంతులు కొరికే' కుక్కలు. 'అయితు కుక్కలు వక తట్టురా, అప్పుడు కుందే లొకతట్టురా, విడబడి యుద్ధము చేసెనూ, కలబడి కార్యంబు చేసెను' విజయము కుందేలుకు లభించెను. ఇది స్థలమాహాత్మ్య మని మహారాష్ట్రులు నిశ్చయించి అచ్చట క్రొత్తగా కోటనిర్మింప దలచిరి. (కుందేలు కుక్కలతో పోరాడువట్టి వృత్తాంతము కూడ పెక్కుగీతములందు వచ్చినది.

సోమనాద్రి కథలో నిట్టి వృత్తాంత మున్నది. విజయనగరనిర్మాణమున నున్న కథ సుప్రసిద్ధము) వారు కొల్లపోయిన కరిణెకల్లు కోటలో ఎల్లమ్మ దేవాలయములో ఏడుకోట్ల ధనముండెను. ఓరుగంటి ఎల్లమ్మకు మ్రొక్కగా వారికి ధనమిచ్చెను.

'అప్పుడు చెన్నపట్నము జాబులు వేసిరీ
బేలదారులకు జాబులు వేసిరీ (ఉప్పరులు)
అప్పుడు బొంబాయికి జాబులు వేసిరీ
బొంబాయి వడ్డెవాండ్లు ఇరువైవేలకు వచ్చిరీ.

నూతనపట్టణము నిర్మించి ప్రజల కుచితముగా నన్ని సౌకర్యములు కలిగించిరి. బందరునుండి ఆరువేల దండుతో భోగముసుందరి వచ్చి దిగెను. పగలు చూచిన మల్లె పూచినట్లు రేయి చూచిన రేల పూచినట్లు పట్టణముండెను. వారు బలవంతులైరి. తరువాత పినతండ్రుల నిర్జించి తమ భూములు తీసికొనవలయునని యాలోచించిరి. వీరి తలంపులు అచ్చట బడేగాంవ్‌లో సిద్ధోజి యెక్కుడు గుఱ్ఱమునకు తెలిసెను. పైసువాడగు యాదారియెల్లుగా దశ్వహృదయ మెరిగినవాడు. సిద్ధోజి ప్రభృతులు 'మా అన్నకొడుకులు పగలున్నారా, మా దాదా బిడ్డలు పగలున్నారా' యని గుఱ్ఱము నడుగ 'అప్పుడు అశ్వంబు పటపట పండ్లు గొరికెను'. అంత వారు చెంబెగాడు, మంబెగాడు, గిరదాల గిరమోజిగాడు, మంత్రాల మహిమగాడిని, వాని యన్న యసరాబు దొంగను పిలిపించి అన్నకొడుకుల తలలు దెమ్మని పంపిరి. వారు కృషికులవలె మోసపు వేషములతో కోట జొచ్చిరి. ఆనాటి రాత్రి సోమోజిరావు దుస్స్వప్నము గనెను. అతడు కోట బయటకు వచ్చి దుశ్శకునములు గాంచెను. అంతలో ఐదుగురు దొంగ లాతనిపై బడిరి. వారితో పోరాడి సోమోజి కోటలో దుమికెను. కాని తలపాగ బయట పడిపోయెను.

'నాకు ప్రాణము పోయినా మేలు - నాకు పాగ పోయినది హాని' యని తలంచి మరల బయటికి వచ్చెను. దొంగలు మంత్రమహిమచే నాతని బట్టి గొంతు కోసి మొండెము విడిచి శిరము గొని దాటి పోయిరి. 12 ఆమడలు నడచి ఉప్పునీటి వాగుకడ పొదరింటిలో నిద్రించిరి. చనిపోయిన సోమోజీ చిలుకయై భార్య కలలో వచ్చి జరిగిన సంగతులు తెలిపెను. కోటలోవారందరు లేచి జరిగిన యన్యాయమును గుర్తించి దొంగలను పట్టుకొనుటకై కుక్కలను విడిచిరి. ఇచ్చట కుక్కల తెలివితేటలు, పసికట్టుటలో వాని చాకచక్యము వర్ణింపబడినది. కుక్కలు దొంగల జాడలు పట్టి వారిపై బడి కొరికి చంపెను. ఫిరోజి వచ్చి

అన్నగారి శిరము కొనిపోయి దహనకృత్యములు గావించి తాను కరిణెకల్లును పాలించెను.

చరిత్ర సరిగా తెలియనివి ఒకదాని చరిత్ర మింకొక కథలో దూరిపోయి నట్టివి జానపదగాథాగేయములు పెక్కులున్నవి. '*సారంగధర చరిత్రము*' కూడ అస్పష్టచారిత్రకగేయ మనుకొనవచ్చును. రాజరాజనరేంద్రుడు చారిత్రకపురుషుడే కాని సారంగధరు డాతని కుమారుడనుట, రత్నాంగి చిత్రాంగి భార్యల వృత్తాంతములు రాజమహేంద్రవరమును పాలించిన రాజరాజునకు సంబంధించినవి కావని పండితుల యభిప్రాయము. మాళవదేశపు రాజు కథ నామసామ్యముచే రాజనరేంద్రునకంటుకొన్నదని కొందరును, కంపిలి యువరాజు గాథయే సారంగధరుని గాథయని కొందరును నభిప్రాయపడిరి. కనుక దీనిని అస్పష్ట చారిత్రము నుండికూడ వేరుచేసి ఇంకొకచోట పరామర్శింప నిశ్చయించితిని.

ఇక నేను సేకరించిన పాటలందొక యస్పష్టచారిత్రకగేయము నిట నుదాహరించెదను. తెలంగాణమందు '*బల్గూరి కొండ్రాలాయుని కథ*' బహుళప్రచారము గాంచిన గేయము. చెరువునీటి మూలముగా రెడ్డివీరు లొకవైపు వెలమవీరు లొక వైపు తలపడి సమరమొనర్చినదీ గాథ. ఆ కాలమునుగూర్చికాని ఆవీరుల వంశముగూర్చికాని ప్రస్తుతము స్పష్టముగా తెలియకున్నది. శారదకాండ్రు ఈ పాటను బాడి పొట్టవోసికొందురు. ఈ పాటను నే నిరువురు శారదకాండ్రనుండి వేర్వేరు చోటుల సేకరించితిని. రెండింటిలో కొంత భేదమున్నది. ఇది దీర్ఘ గేయము. ఒక గేయము ఓరుగల్లు మండలమున లింగంపల్లి గ్రామమున (4. 4. 1954.) సేకరించితిని. చెప్పినవారు వెంకట్రావుపల్లి గ్రామవాస్తవ్యులగు శారదకాండ్రు. రెండవది 16.3 .1954 నాటి రాత్రి హైదరాబాదు నగరములో కప్పె రామయ్య అతని భార్య ఎల్లమ్మ (శారదకాండ్రు) చెప్పుచుండగా వ్రాసికొంటిని. ఈ రెండవదానిలో కొన్ని క్రొత్త కల్పనములతోపాటు కథ కూడ పెద్దగా నున్నది. అనగా మొదటి కథలో లేని బల్గూరి కొండ్రాలాయుని తండ్రి రఘుపతిరావుగారి 'పుట్టు పూర్వములు' వారి తాతతండ్రులనుగూర్చిన కథా భాగము కూడ కలవు. మొదటి కథ రఘుపతిరావుచరిత్రతో నారంభమై కొండ్రాలాయుని మరణముతో సమాప్తమగు చిన్నకథ. రెండవదానియందలి యతిశయోక్తు లిందులో లేవు. అనవసరమగు కథాభాగములను విడిచి క్లుప్తముగా

కథను పేర్కొందును. వంతపాట ఇట్లున్నది.—

'రాయుడా కొండ్రాయుడా
భళ్ళా రా మన రాయుడా (భళిరా మనరాయుదా కాబోలు)
మధ్య మధ్యన రామ రామో రామో రామో
రామా రఘురామో' యంచురు కూడ.

'మానువాల' జమీందారు రఘుపతిరావు అతని భార్య దమ్మమ్మ (దమ్మక్క—జమ్మమ్మ—జమ్మక్క—జాంబమ్మయనికూడ కలదు). వారికి 'ముందర ముత్యాల రాసులు, వెనుక వెండిరాసులు, ప్రక్కన పైడిరాసులు' మున్నగు సకలసంపద లుండెను కాని సంతానము మాత్రము లేదయ్యెను. ఈతనికి హైదరాబాదు నవాబు (నాసిరుద్దౌలా - తానీషా - ఈ రెండు పేర్లును కలవు) అరుపై పుట్ల తుకుం (విత్తనాలు) పండునంతటి భూమి నిచ్చెను. ఈతని కోటకున్న నాల్గు బురుజులు 'భీమ బురుజు, రామ బురుజు, రక్త బురుజు, రణరంగ బురుజు'లు. గోలకొండ నవాబుగారి యేనుగు మదమెక్కి బీభత్సము చేయుచుండ నీరఘుపతిరాయుడు దాని మదమణచి నవాబు మన్నన బొందెను. ఇంకొక గేయములో వశముగాని గుఱ్ఱము నెక్కి స్వారి యొనర్చినట్లున్నది. సంతానము లేమి భార్యాభర్త లిరువురును ప్రయాణమై తూర్పుదేశమున కోనాపురమను గ్రామమునకు పోయిరి. అచ్చట సిరిగిరి పోశన్న (పోచన్న) యను ఎఱ్ఱగొల్ల యుండెను. (కాటమరాజు కథలో అయితమరాజు బిడ్డ బహుభాషాకోవిదురాలు సిరిగిరి కలదు. ఆమె పేరు ఇంటిపేరుగా గలవాడీ పోచన్న) ఈతడు కడు దరిద్రుడు. కుచేల సంతానము మాత్రముండెను. రఘుపతిరాయ డాతనితో నీ 'యంబటి కుంద కాశపడితి'నని పుత్రభిక్ష మడిగెను పోచయ్య పుత్రు లేవురిలో చిన్నవాడు మల్లయ్య. వెలమ రఘుపతిరావు తనకు దగిన కుమారు నెంచుకొనుటకై వారి ముందు పంచభక్ష్యపరమాన్నములు, పట్టువస్త్రములు, కత్తులుంచెను. చిన్నవాడు మల్లయ్య ఛురిక నందుకొనెను. రఘుపతిరాయు డాతని దత్తుగొనెను. (ఇట్టి పరీక్ష బొబ్బిలి పదములో నున్నట్లిదివరకే చెప్పియుంటిని. జానపదులు బాలుర వీర్యమును పరీక్షించుట కిట్టి సాధనములు నిర్ణయించుకొనిరి) మల్లన్నను దత్తు దీసికొన్న ముహూర్తబలమున రఘుపతిరావుకు నలుగురు కుమారులు గలిగిరి. వారు 1. ఎల్లారావు, 2. మల్లారావు, 3. నరసారావు, 4. కొండ్రావులు'

కొండల్రాయుడు జన్మించినపుడు

'కొంగల్ కోలాట మేసెను - నక్కలు నాటకం దొక్కెను
కోతులు నిగాలూగెను - కొఱ్ఱమట్టలు గుద్దులాడెను
చేపలు చల్లాట మాడెను.'

(ఈ వర్ణన మింకొక గేయములో మానువాల పెద్దచెరువు ఎండిపోయినప్పటి వర్ణనమున కలదు) తన కుమారులు పెరిగి పెద్దవారైన పిమ్మట రఘుపతిరాయుడు దత్తు తెచ్చుకొన్న కుమారుడు గొల్ల మల్లన్నకు మిర్యాలగూడెం తాలూకా — నల్లగొండ జిల్లా —లో, కోనాపురమందలి భూములిచ్చి (౩౫ గ్రామము లిచ్చి) వసతులు గల్పించెను. మల్లన్న అతిపరాక్రమశాలియై తన గ్రామములు పాలించుచుండెను.

ఇట్లుండగా మానువాలలో (నీటి) కాటకము వచ్చెను. ఆయూరి చెరువు ఎండిపోయెను. చేనులు 'కుండ కింది గడ్డివోలె మాడిపోయినవి.' రఘుపతిరావు సమర్థుడగు మల్లయ్యను పిలిపించి మీద పంద్రెండామడ దూరముననున్న పొలాస (పోలారము, పోలవరము అని ఇంకొక గేయమున కలదు) చెరువు నుండి నీరు తెచ్చి మానువాల చెరువు నింపవలయునని ఆలోచించెను. మల్లయ్యనే యచటి రెడ్డిదొరల నడిగి నీరు తెమ్మని పంపించెను. మల్లయ్య పరివారముతో వెడలి పోలారము చెరువుకు గండి పెట్టుచుండగా నీరటికాంద్రడ్డగించి యుద్ధమునకు దిగిరి. వారు 'కారు దున్నపోతులు కలబడ్డట్లు, మదపు ఏనుగులు మరలబడ్డట్లు' పోరాడిరి. అప్పుడు 'నిమ్మకాయంత రాయి నిల్వు కెగరబట్టె, పోకంతరాయి పొడిపొడి కాబట్టె'ను. మల్లయ్య బల్గూరి వంశమునకు దొంగదెబ్బ పనికిరాదని బొడ్డులో గుండు తీసి కాలి వ్రేళ్ళతో పట్టి 'తొమ్మిది లఘువులమీద విసిరికొట్టి' నీరటికాంద్రను చంపి తలపండ్లను దింపి ఒంటి జన్నిదుకు కట్టి చెరువుకు గండిపెట్టెను. ఇరుపక్షముల చచ్చిన పీనుగులు నీటితోపాటు ప్రవహించి మానువాల చెరువులో చేరెను. పోలాస దొరలకు కోపము వచ్చెను. ఈ విషయ మెరిగిన రఘుపతిరావుగారికి మల్లన్నపై క్రోధము కలిగెను.

ఇల్లటపుటల్లుడు ఇంటికి చేటు — పేడిమూతివాడు పెండ్లానికి చేటు
ఊసుకండ్లవాడు దోమలకు చేటు — పెంపుడుకొడుకు ఇంటికి చేటు'

అని దూషించి చెంపలు గొట్టి కోనాపురము పంపెను. (ఇంకొక గేయమున

పోలారము దొరలకు నష్టము కలిగినదని తెలిసినవెంటనే రఘుపతిరావు వారికి-జ్యోతి కృష్ణారెడ్డి, రామిరెడ్డి, రంగారెడ్డి సోదరులకు దండుగ కట్టుటకై సగము దూరము పోవునప్పటికి మల్లన్న ఎదురై తండ్రిని మరలించుకొని వచ్చి ఆపద వచ్చిన నేను వారి నెదుర్కొనగలనని చెప్పి వెడలిపోయినట్లున్నది) పోలాస దొరలు కొంత సైన్యమిచ్చి అరవెల్లి కటారిజిముకడను యోధుని (మాలవాని) రఘుపతిరావు మీదికి పంపించిరి. రఘుపతిరావుగారి మంత్రి, పంతులుగారి మోసమువలన రఘుపతిరావు శత్రువుల చేజిక్కెను. వారాతని తల నరికిరి. అతడు తల పోయినను మొండెముతోడనే శత్రువులను మూడు లక్షల మందిని చంపెనట. చిన్న పిల్లవాడగు బల్గూరికొండల్రాయుని ఒడిలో పెట్టుకొని దమ్మక్క రక్త గ్రుడ్ల కృష్ణారెడ్డిని ఎంత బతిమాలినను అతడు వినలేదు. రెడ్లు ఆపట్టణము దోచుకొని తిరిగి పోవుచుండగా దమ్మవ్వ మల్లయ్యకు వార్త నంపెను. అతడు చవుడూరు, లంకాలపల్లి, నవాబుపేట, బింకనోలు (ఇది బిక్కనోలు కావచ్చు), వడ్లకొండ మీదుగా పోలాస కడ్డముగా తిరిగి శత్రువులపై బడెను. ఆతని సేనాని గోసంగి లింగడు తన 'కిరమెల గుంపు'తో చేసిన యుద్ధ మద్భుతము. పోలాస దొరలు పారిపోయిరి. మల్లయ్య, తండ్రి కళేబరమునకు దహనసంస్కారములు చేసి తిరిగిపోయెను. దమ్మవ్వ బ్రతుకుటకై కొండల్రావు నెత్తుకొని దేశదేశములు తిరిగి దొమ్మకొండకు (దోమకొండ కాదుగదా?) పోయెను. అచటి పాలకు డొక తురకనవాబు (జల్దర్‌ఖాన్ అనిపేరు). అతని పరివారముతో కొండల్రాయుడు (13 ఏండ్ల బాలుడు) పోరాడి నవాబును మెప్పించెను. అచ్చట కొన్నాళ్ళుండి వారు మానువాల చేరుకొనిరి. మానువాలలో కొండల్రాయుడు క్రమక్రమముగా పెరిగి యోధుడై తండ్రి పగ సాధింప నెంచెను.

'తలలు కుచ్చెలు గడుదునూ—దొబ్బలు దోరణాలు గడుదుసూ
రోకండ్ల గట్టుమీద రోయక యుద్ధం చేస్తా-లింగంపల్లి గట్టుమీద నిలబడి కాసెలుబోస్తా
కలివితోని గుండంల కత్తులు కడిగి వస్తా' నని సిద్ధమయ్యెను. తల్లి వలదని

బతిమాలెను. కాని కొండల్రాయుడు తన పరాక్రమమును మునుముందు ప్రజలు 'విసరే రాళ్లమీద, దంచే రోకళ్లమీద, చెరిగే చేటలమీద, యాలలుగా పాడుతా' రనెను. తల్లి దమ్మమ్మ తనకొడుకు యుద్ధమున గెల్చునో లేదో యని మొదట తానే యుద్ధమొనర్చి మూడుమారు లాతని నోడించి ధైర్యమును

పురికొల్పెను. అప్పుడా వీరుని 'వీపున ముల్లు బొడిచెను'. మల్లయ్య తన సైన్యముతో సహాయమునకు వచ్చెను. (కొండ్రాయుడు సైన్యమునకు కావలసిన ధనమునకై తల్లిని కాల్చి బాధించినట్లు కలదు. సర్వాయిపాపని కథలో నున్న సంఘటనమే యిందును కలదు. కాబట్టి యిది రెండింటను అభూత కల్పనగా భావింపవచ్చును. ధనప్రసక్తి వచ్చినచోట్ల నిట్లుండును కాబోలు) సైన్యముతో నెత్తిపోయిన రెడ్లు లభింపరని కొండ్రాయుడు, మల్లయ్య, కొందరు యోధులతో భాగవతుల వేషము ధరించి పోలాస చేరుకొని యచట 'సుంకరి కొండయ్య' ఆట నాడిరి. భాగవతమును చూడ వచ్చిన పోలాస దొరలను - కృష్ణారెడ్డి ప్రభృతులను — తమ్ము మోసగించిన పంతులును చిత్రవధ చేసి బయటపడిరి. ఇది విని గోలకొండ నవాబు, కొండ్రాయుని మీదికి దండు బంపెను. కొండ్రాయుడా సైన్యముల హతమార్చెను. పారిపోవు సైన్యములపై కొండయ్య ఒక యెత్తైన 'సూది మానుగుండు' నుండి దుముక నాతని కొక కొయ్య గ్రుచ్చుకొని వ్రణమై దానితో నాతడు మరణించెను. ఇంకొక గేయములో నాతడు శత్రువుల సంహరించి తానే బాలచంద్రునట్లు అలుగులపై నొంగెనని వర్ణింపబడినది. ఇప్పటికి కొండయ్య వయసు 24 ఏండ్లు. బాలచంద్రుని దలపించు పరాక్రమశాలి బల్గూరి కొండ్రాయుడు. కొండ్రాయుని మరణానంతరము మల్లయ్య హనువాడ ప్రాంతములకు అధికారి యయ్యెను.

పేర్లనుబట్టియో స్థలములనుబట్టియో పరిశోధన మొనర్చిన గాని కొండ్రాయుని సిసలైన చరిత్రము బయటపడదు. ఆనాడు సత్యాసత్యములు నిజానిజములు తెలియును. అప్పుడీ గేయమునకు చారిత్రకప్రసిద్ధి కలుగును. పోలాస యనునది కరీంనగర మండలమునకు ప్రాత పేరుగా తెలంగాణా శాసనములందు కాననగును1. కనుక నిది కరీంనగర మండలమునకు సంబంధించిన యస్పష్టచారిత్రకగేయముగా భావింపవలెను.

జానపదుల దృష్టిలో శౌర్యము వీరమనగా నెట్టివో తెలిసికొనుటకు చారిత్రక వీరగేయములు సహకరించును. పల్నాటివీరుల కథలు, సదాశివరెడ్డి కథ, ధర్మ పక్షము యొక్క ధైర్యశౌర్యాదులను వర్ణించునట్టిగాథలు. పల్నాటి వీరుల కథల

1. తెలంగాణా శాసనములు. పుట 7.

కన్నను సదాశివరెడ్డి కథ ఉదాత్తధర్మకీర్తనము చేయునట్టిది. నిజమైన వీరగాథ యిది యొక్కటే. పల్నాటికథ, ఆరె మరాటీల కథ దాయాదుల పోరాటములు. శౌర్యమే ప్రధానముగా వానియం దాకర్షణముగల గుణము. కాటమరాజు కథ బొబ్బిలికథ ధర్మముకన్న పగ తీర్చుకొనుట నెక్కువగా కీర్తించునట్టివి. ఏదో సాకున ప్రాతపగల తీర్చికొననెంచిన కాటమరాజు, రంగారావు ఒకే స్థాయిగల వీరులు. సంఘమరణములు, సహగమనములు (కాటమరాజు కథలో అగుమంచి వంటివారు సహగమనము చేసిరి) మాత్రము జానపదుల జాలిగుండె గరగించినవి. బొబ్బిలి వెంగళ్రాయుడు బాలచంద్రుడువంటి వీరులయనాలోచితము మరియు నంధశౌర్యము జానపదుల మెప్పునకు వెలి కాలేదు. ఇక బంగారు తిమ్మరాజు దేశింగురాజుల యుద్ధమరణములును, వారి పక్షముననున్న న్యాయమును వారిని శాశ్వతముగా వీరుల నొనర్చినవి. కుమారరాముడు, నోమోజి, చిన్నపరెడ్డివంటివా రధర్మయుద్ధములో పరాజితులై పట్టుబడిరి. భారతీయరణనీతిని పాటింపక నల్లసిద్ధిరాజు తన సైన్యమునంతటిని పురికొల్పియున్నచో తొలినాడే కాటమరా జోడియుండును. ఒక వీరునితో నొక్క వీరుడే తలపడవలయు ననునది భారతమునాటినుండి బొబ్బిలినాటి వరకున్న మన యుద్ధనీతి. మ్లేచ్ఛుల తోడను, తురకలతోడను, పాశ్చాత్యులతోడను చేసిన యుద్ధములందు భారత వీరు లెందరో ఇట్టి యుద్ధసమయమునకే బలియైరి. అట్టివారలందరును జానపదులకు వీరులే. విశేషించి మోసమునకు పట్టుబడిన బందిపోటుదొంగ చిన్నపరెడ్డి వంటివాడు కూడ జానపదులకు 'బంగారపు కడ్డీ' యయ్యెను. ఇట్టి గుణములే జానపదులకు శౌర్యవీరములందు ప్రగాఢాభిమానమును కలిగించినవి. ఆ సంస్కారబలమున వారాయాపదముల తరతరములనుండి పాడుకొనుచు వచ్చు చున్నారు. క్రొత్తగా జరిగెడు సంఘటనములందీ గుణలేశములు గన్పించినంతనే వానినిగూడ వీరపదములుగా బాడుకొనుచున్నారు. వీరారాధనము-వీరకీర్తనముతో పాటు – తెలుగుజాతి మనసు కెక్కినది. కనుక నీ వీరగీత-చారిత్రక-ప్రకరణ మింతగా పెంచవలసి వచ్చినది. ఇంకను కొన్నిపదము లస్పృశ్యముగనే యుండిపోయినవి.



# మతసంబంధ గేయములు

నవనాగరకులగు ఏకొలదిమందికో మతముపై విశ్వాసము సడలినదిగాని అధికసంఖ్యాకులకు మతమే కనువెలుగు. జనసామాన్యమున జీవితమునందు మతమునకున్న ప్రాధాన్యము మరొకదానికి లేదు. రాజకీయ, సాంఘిక, ఆర్థిక, నైతిక సమస్య లన్నియును మనదేశమున మతమునకు లోబడి తదనుగుణముగ రూపు దిద్దుకొనుచు వచ్చినవి. మతమునకున్న ప్రాముఖ్యమును చెప్పుటయేకాని దాని మంచిచెడుగులు విమర్శించుట ప్రస్తుతకర్తవ్యము కాదు. భారతదేశముననే పుట్టి గిట్టిన మతము లెన్నియో కలవు. ఇవి గాకను ఇతరదేశములనుండి చొచ్చుకొనివచ్చిన మతములు మరికొన్ని గలవు. మతమనునది భారతదేశమున ప్రాముఖ్య మందిననాటినుండి నేటివరకును (మతవర్గము లెన్ని యున్నను, ఏయే కాలములం దేయేమతములు విజృంభించి, ఏయే మతములు సన్నగిల్లినను) దాని యవిచ్ఛిన్నస్వభావము మాత్రము స్పష్టముగా గాననగును. భారతమున నెన్ని మతము లెంతెంత స్థానమును సంపాదించుకొన్నవో వాని ప్రభావము తెలుగు దేశమునకూడ ఇంచుమించుగా నంతియ. తెలుగుదేశమున వైదికములు నవైదికములగు మతము లెన్నియో పరిఢవిల్లినవి. ఒకప్పు డొకమతము విజృంభించిన మరొకప్పుడింకొక మతము విజృంభించినది. ఒక యవైదికమతము పారిపోయిన, మరొక యవైదికమతము పుట్టినప్పటి రూపమునే మార్చుకొని వైదికత్వము కలిగించుకొన్నది. ఆయా మతములకు కాలానుగుణముగా రాజ ప్రాపకము ప్రజావ్యాప్తి మున్నగునవి కలిగినవి. ప్రజలందు మతభక్తియున్నపుడు అట్టిదానిగురించిన వాఙ్మయ మనునదిగూడ నంతియ ప్రాధాన్యము వహించి యుండుననుట వేరే చెప్పనవసర ముండదుగదా. స్వమతమందలి దృఢవిశ్వాసమో పరమతద్వేషమో పరాంకోటి నందినప్పుడు గాని లేదా వాని ప్రచారము గావించవలెనను ఉద్దేశము కలిగినప్పుడు గాని యా మతావేశము రసావేశముతో గలిసి వాగ్రూపము ధరించును. మతము పోయినప్పుడు దానితోపాటు దానికి

సంబంధించిన వాఙ్మయముగూడ పోవుట పరిపాటి. ఒకప్పుడు జైనబౌద్ధము లాంధ్రదేశమున బహుళవ్యాప్తి గాంచినట్లు ఆ మతస్థులగు శిల్పులు గండరించిన శిల్పములే చెప్పక చెప్పుచున్నవి. ఆకాలమున నాంధ్రదేశమున తెలుగులో జైన బౌద్ధవాఙ్మయమెంత యుద్భవించినదో యెవడెరుగును? కాని ఆవాఙ్మయ మిప్పుడు మచ్చునకైన కానరాదు. సంస్కృతమున మాత్రము దిఙ్నాగాదుల నాటకములు ఏవో కొన్ని నిల్చినవి. శిష్టసాహిత్యమున నప్పటి చిన్నెలు లభించుట లేనప్పుడు నిత్య పరివర్తన మందెడు జానపదవాఙ్మయమున నాజాడ లరయుట లాభములేని పని. నేలలో తలదాచుకొన్న శిలలు తప్ప తక్కిన విగ్రహము లాకాలము నాటివి కొంగ్రొత్త యవతారము లెత్తినట్లెన్నియో నిదర్శనము లున్నవి. జైన విగ్రహములు బౌద్ధవిగ్రహములు శైవవైష్ణవవిగ్రహములుగా (మతము మార్చుకొని) అవతారమెత్తిన గుళ్లగోపురములు హన్మకొండ, వేములవాడ, కొలనుపాక, రామతీర్థము, పిఠాపురము, పట్టిసము, నందేశ్వరమువంటిచోటులం దిప్పటికిని కలవు. కనుక వానిగురించిన జానపదగేయములు మనకు లభింపవు. ఇప్పటికిని సజీవముగా అనగా ప్రజాబాహుళ్యమున వ్యాప్తియందున్న మత సంబంధములగు గేయములే మనకు లభించును. ఆయా కాలములందు కొంచెము ఎచ్చుతచ్చులైనను శైవవైష్ణవములు రెండును తెలుగుదేశమున సమానముగనే వ్యాపించినవి. ఇప్పటికి వాని బలాబలము లంతగానే యున్నవి. మొదట శైవమత గేయములను విచారించి తరువాత వైష్ణవమతగేయములను విచారింతము.

## శైవమత సంబంధములు

శైవమతభేదములు, వాని ప్రభావము, మన దేశమున వాని వ్యాప్తి మున్నగు విషయములు కీ. శే. డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు పండితారాధ్యచరిత్రమునకు వ్రాసిన పీఠిక, కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు బసవపురాణమునకు వ్రాసిన పీఠిక, శ్రీ బండారు తమ్మయ్యగారి రచనములు, కీ. శే. చిదిరెమఠం వీరభద్రశర్మగారి వ్యాసములు వివరించుచున్నవి. ప్రాంత (కర్ణాటక) దేశములకన్న తెలుగుదేశమున బసవేశ్వరుడు ప్రతిపాదించిన (అవైదిక) వీరశైవము కొంత తక్కువగనే యున్నదనవచ్చును. కారణము పండితారాధ్యుని వంటివారు 'భక్తిమీద వలపు బ్రాహ్మ్యంబుతో పొత్తు, పాయలేను నేను బసవలింగ' యనుటయే. పండితుడు వీరశైవమును వైదికమార్గమున ప్రచారమొనర్చిన ఘనుడు. అట్లయినను ఆమతసహజమగు ఉద్రేకము, భక్తి

సాతత్యము, శైవేతర నిరసనమువంటి లక్షణములు తప్పలేదు. 'అవగింజంత బూదిమై నలదికొనిన, వెలది గుమ్మడి కాయంత వెట్టి పుట్టు'1 నన్న మహాకవి వాక్యములు పరమసత్యములు. సామాన్యశైవుడగు (అద్వైతశైవము) శ్రీనాథ మహాకవియే యిట్లన్న వీరశైవులమాట వేరు చెప్పనక్కర లేదుకదా. అనాదిగా నున్న సాధారణశైవము వేదచోదితమే. 'వైదికమంత్రోపస్థితుడైన రుద్రుడు వేదాంతమునందు శివరూపపరిణామమును బొందుచు శివోఽహం అను తత్వమును సువ్యక్తము చేయుచున్నాడు'2. శైవాగమము లీతని పరబ్రహ్మ మనెను. భారతదేశ మంతటను వ్యాపించిన శైవములో రానురాను కొన్ని భేదము లేర్పడెను. జైనబౌద్ధాది యవైదికమతములను ఖండించిన శంకరాచార్యులు శైవవైష్ణవాదివైదికమతములను స్వీకరించి యద్వైతమును ప్రచారము చేసిరి. ఇట్లీ జ్ఞానమార్గ మొకవైపు ప్రచారమగుచుండ నింతకన్న నధికవేగముతో కుమారిలభట్టు ప్రతిపాదించిన కర్మమార్గముగూడ ఆంధ్ర దేశమున ప్రచారమగుచుండెను. కాని కర్మజ్ఞానమార్గములు రెండును కొలది మందికే కొరుకబడిన కొయ్యలు. జనసామాన్యమునకీ విజ్ఞాన మందునట్టిది కాదు కనుక, రామానుజాది భక్తులు శంకరుని మాయావాదమును ఖండించి విశిష్టాద్వైత భక్తిమార్గమును చాటిరి. బసవేశ్వరాదు లిదే భక్తిమార్గమును శివపరముగా చాటిరి. సూక్ష్మములకు దిగినచో కొంత భేద మారయవచ్చును గాని స్థూలదృష్టికి నీ శైవవైష్ణవములు రెండును విశిష్టాద్వైతములే. కీ. శే. కాశీ నాధుని నాగేశ్వరరావు పంతులుగారు వీరశైవమునుశివాద్వైతమనిరి. శైవములో పాశుపత, కాలాముఖాదిశాఖాభేదము లున్నవి. పూర్వము వీనిలో నాంధ్రదేశమున ప్రబలిన శైవము పాశుపతము. 'ఈ మతము ప్రకారము బ్రహ్మాదిపిపీలికా పర్యంతము సమస్తప్రాణికోటి పశువులు; సంసారబంధమే పాశము. ఈసకలపశురాశికి పతియగు శివుడనగా పశుపతి తద్భక్తునకు పాశచ్ఛేదము గావించి ముక్తినొసగును3. ఈశైవము బసవేశ్వరుని కాలమునాటికి వీరశైవమయ్యెను. కర్మజ్ఞానమార్గతిరస్కారము, భవ నిరసనము, జంగమభక్తి, లింగధారణము, విభూతి రుద్రాక్షధారణము, పంచాక్షరీ మంత్రము, లింగపసాయిత శస్త్రధారణము, వర్ణలింగావివక్షతాది

1. హరవిలాసము.

2. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి. బసవపురాణ పీఠిక.

3. వీరశైవాంధ్ర వాఙ్మయము పుట. 17 శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి.

ముఖ్యలక్షణములతో పాటు నీ మతప్రచారమున వీరోద్రేకముతో దండనీతి కూడ ప్రయోగార్హమగుటచే నిది వీరశైవమయ్యెను. ఈ వీరశైవమున నిది పుట్టిన కాలముననే రెండు భేదము లేర్పడెను. ఒకటి లింగాయతము. రెండవది యారాధ్యము. మొదటి శాఖకు బసవేశ్వరుడు రెండవశాఖకు మల్లికార్జున పండితారాధ్యుడు ప్రవక్తలు. వేదాగమముల ప్రతిఘటించి జాతి తారతమ్యముల నిరాకరించి సంఘసంస్కరణము చేసినవాడు బసవేశ్వరుడు. వేదాగమముల ననుసరించి వర్ణాశ్రమధర్మముల పాటించినవాడు పండితుడు. లింగాయతము కర్ణాటకమునందును ఆరాధ్య మాంధ్రదేశమునందును నధికప్రచారము గాంచెను. కాని ఈ రెండును రెండుదేశములందు గూడ ప్రాకిపోయినవి. ఆంధ్రదేశమున బ్రహ్మక్షత్రవైశ్యు లారాధ్యమును శూద్రులు లింగాయతమును నధికముగా పోషించిరి. బసవేశ్వరుడును పండితారాధ్యుడును సమకాలీనులు. బసవేశ్వరుడు కర్ణాటకమున పండితారాధ్యు డాంధ్రదేశమున వీరశైవమతప్రచారము చేసిరి. బసవేశ్వరుని మహిమలు విన్న పండితుడు బసవని వీరశైవవమున నంతియ ఉద్రేకము గలవాడయ్యెను బ్రాహ్మ్యంబుపై వలపు వీడజాలనని చెప్పి పంపెనట. బసవేశ్వరుడు లింగైక్యమందిన కొలది దినములకే పండితుడుకూడ లింగైక్యమయ్యెను. పండితుడు తలపెట్టిన పని యావదాంధ్రముననే కాక కర్ణాటకమునగూడ కొనసాగించినది పాల్కురికి సోమనాథుడు. సోమనాధుడు మల్లికార్జున పండితారాధ్యుని పాండిత్యము బసవేశ్వరుని భక్తి రెండును మూర్తీభవించిన వ్యక్తి. కనుకనే యాతడు పండితపామరు లందరిని వీరశైవము వైపునకు లాగగలిగెను. వీరశైవ లీతని భృంగి యవతార మందురు. పండితులకు సోమనాథభాష్య రుద్రభాష్యములను, పామరులకు పండితారాధ్యచరిత్రము బసవ పురాణములను ప్రసాదించిన మహాపండితకవి భక్తుడు. పండితులను శ్రుతి స్మృతిపురాణాదిప్రమాణములతోడను, పామరులను వీరశైవభక్త మహాత్మ్యోపాఖ్యానముల యర్థవాదలతోడను సంతృప్తిపరచి వీరశైవమత వాఙ్మయమునకు వైదికవాఙ్మయమంతటి ప్రామాణ్యమును గల్పించెను. మహానిరంకుశుడై సంస్కృతసంప్రదాయానుగతరచనావిధానమును తృణీకరించి మతప్రచారదృష్టి గలవాడై ఛందమున ఇతివృత్తమున రచనా విధానమున భిన్నమార్గ మవలంబించి ఆంధ్రవాఙ్మయముపైన జాతీయతాముద్రను ప్రగాఢముగా వేసెను. దేశీయములగు ద్విపద రగడాది ఛందములకు గౌరవము

గూర్చి యానాటి దేశీయఛందములను ప్రజాబాహుళ్యమున ప్రచారముననున్న పదముల ననేకము పేర్కొనియుండుటచే జానపదసాహిత్య విమర్శనమున పాల్కురికి సోమనాథునికి ప్రథమమున నమస్కరించి తరువాత కార్యమునకు గడంగవలయును. ద్విపదలగూర్చి సోమనాథుడు చెప్పిన మాటలను ఆనాటి గేయఫణితులను ప్రవేశికలో పేర్కొని యుంటిని. సోమనాథుని దయవలన ఆనాటి కొన్ని గేయముల పేర్లయినను మనకు దెలియవచ్చినవి. లేనిచో నా గేయములు మిగులకుండ పోయినటులే వాని పేర్లుకూడ రూపరియుండును. ఆనాటి శైవకవులెందరో యీ దేశిచ్ఛందములందు కవితలల్లిరి. పండితారాధ్య చరిత్రమున పేర్కొనబడిన 'ఆనందగీతంబు లర్థి పాడుచు శివానంద లీలల నలరి యాడుచును, శంకర గీతముల్ సరస బాడుచును' వీ రశైవభక్తు లుండిరి. తుమ్మెద పదములు, ప్రభాత పదములు, వాలేశు పదములు, గొబ్బి పదములు మున్నగునవి యన్నియును శివపరముగా పాడుకొనుచుండిరి. వాని స్వరూపము నేడు మిగులకున్నను అట్టి పేరుతోనున్న గేయములు ప్రచారమందున్నవి. 'సంస్కార శూన్యమై, పండితానాదృతమై, ప్రాచీనకాలమునుండి దేశమున జీర్ణమైయున్న గేయరచనమును, సర్వజనాదరపాత్రము చేసి, సారస్వతగౌరవము కూర్చి, అందు కావ్యరచనము జేసిన ప్రప్రథముడు పాల్కురికిసోమనాథుడు'1. శైవుల కాలమున జానపదవాఙ్మయమునకు జరిగిన దోహద మీక్రింది వాక్యముల వలన దెలియును. 'వైదిక సంప్రదాయములో స్త్రీలకునూ బ్రాహ్మణేతరులకునూ మంత్రపూజార్హత లేకపోయినది. వీరశైవమతవిజృంభణము భక్తినే పరమాధికారముగా పేర్కొని అన్ని జాతులవారికీ, స్త్రీలకూ, పూజార్హతను కలిగించినది. సౌభాగ్యమూ సంతానమూ కోరి, స్త్రీలు వ్రతములు చేయుట వీరశైవ మత ప్రచారముతోనే మొదలు. మన స్త్రీల వ్రతాలలో నూటికి తొంభయి గౌరి వ్రతాలే. మత వ్యాపనమును జానుతెనుగు రచనలవల్ల సాగించిన వీరశైవులు ఈవ్రతకథలను కూడ జానుతెనుగు ద్విపదల్లోనూ, వాటి పాటల వరుసలలోనూ రచించి ప్రచారము చేసినారు. ఈవ్రతకథలవంటి ఇతరకథలను గూడ ద్విపదలూ సీసములూవలె సాగిపోయే వరుసలలో రచించడము ప్రారంభమై

1. వీర శైవాంధ్ర వాఙ్మయము. పుట 41. శిష్టా రామకృష్ణశాస్త్రి

స్త్రీలపాటలనే దేశిసారస్వతశాఖకు కారణమైనది'1. ఇంతియ కాక జంగములు వీరశైవభక్తులు చెప్పెడు కథలుకూడ వారి పేరుతోడనే జంగంకథలని పిలువబడుచున్నవి. తొలుత నివి వీరశైవులగూర్చి వీరశైవులచే చెప్పబడిన కథలై యుండును. కాని తరువాత ఆపద్ధతిలో నడచినవి గాని లేదా జంగమువారిచే జెప్పబడు ఇతరకథలు గాని అదేపేరుతో జంగంకథలుగా ప్రసిద్ధి గాంచినవి. ముఖ్యముగా చెప్పవలసిన దేమన వీరశైవము జానపదసాహిత్యమును - దేశి సాహిత్యమును-ఇతోధికముగా నాలంబనము చేసికొని ప్రజాబాహుళ్యమున ప్రచారము గాంచినది. శివభక్తుల కథలనో శివపారమ్యమును చాటునట్టి కథలనో చేపట్టి వీరశైవకవులు పద్యకావ్యములు గేయకావ్యములు పెక్కులు రచించిరి. 'ఊరూర సిరియాళు చరిత, పాటలుగా గట్టి పాడెదువారు' సోమనాథుని కాలముననే యుండెడివారు. నన్నిచోడుడు పేర్కొన్న శివాంక మాలికలు, జంగమ మల్లికార్జునుని పాడిన రోకటి పాటలు శైవగేయములే కదా! సోమనాథుడు తన బసవపురాణము పండితారాధ్య చరిత్రములందు ఎన్నియో శైవగాథల వివరించినాడు. అంతవరకు అక్కడ నొకటి ఇక్కడ నొకటి బయలుదేరిన శైవగాథలు సోమనాథుని బసవపురాణము (స్వయంభూ ఆలయాది) దేవాలయప్రవేశము చేసిన తరువాత మరింత విస్తరించియుండును. క్రీడాభిరామముకాలపు జక్కులపురంధ్రి పాడిన కామవల్లి వలపు, బవనీల చక్రవర్తి పాడిన పరశురాముని కథ శైవములు కాకపోయినను నాటి శైవగాథలకు ప్రతిద్వంద్వులనుట కాక్షేపణము లేదు. క్రమముగా వీరానీకముం బాడు ద్విపదప్రబంధములవంటి, శైవప్రబంధములును వెలసినవి. 'పాపహరణమయ్యె బసవపురాణంబు' అని వేమన్న నాటికి పారాయణకు బసవపురాణ మట్టివానిలో నాయకమణి. శైవగేయములలో దక్షుని యజ్ఞము, మేనకాదేవి నొప్పులు, మేనకాపార్వతీ సంవాదము, పార్వతీ కల్యాణము, గంగావివాహము, గంగాగౌరు సంవాదము, సవతుల కయ్యము, లక్ష్మీపార్వతుల సంవాదము, త్రిపురాసుర సంహారము, సురాభాండేశ్వరము, మార్కండేయుని జననము, చిరుతొండరాజు కథ, భల్లాణరాజు కథ, కుమ్మరగుండయ్య కథ, కొమిరెల్లిమల్లన్న కథ మిక్కిలి ప్రచారమందున్నవి.

*దక్షుని యజ్ఞము* : శివుడు తపోనిమగ్నుడై యుండగా నొకనాడు దక్షుడు యజ్ఞము చేయసంకల్పించి, తొలుత, పెద్దకూతురగు సతీదేవిని, పెద్దయల్లుడగు శివుని ఆహ్వానించుటకై కైలాసగిరికి వచ్చెను. శివుని సన్నిధికేగి 'దండంబు

1. దేశి సారస్వత విభూతి. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి - కిన్నెర. డిసెంబరు 1953.

దండంబు దండంబులని పలికి, దండంబు ఓదేవ దండమని పలికె'ను. కాని 'దీక్షబట్టుక శివుడు వివరాము తెలియకా, విరసాముతో నుండె'ను. జరిగిన పరాభవమున కతికుపితుడై దక్షుడు కూతురు చెంతకు పోయెను. సతీదేవి 'అల్లంతట దక్షుని రాక తా పొడగని, శీఘ్రాన గద్దెపై వేగమున తా లేచి, కాళ్ల గడగడవణక పాదార్చనము చేసి,వెలది తా నిలుచుండెనూ'.దక్షుడు రూక్షేక్షణముల నిప్పులురల శివుని దూషించి 'పార్వతీ నీవు నా పాలింటనే లేవు, ఇంతి నీకు నాకు యింతె కడలాయెనని, అతివేగమున తర్లెనూ'. సతీదేవి తండ్రిని బతిమాల జూచెను కాని దక్షుడు తిరిగి చూడకనే వెడలిపోయెను. 'అసురుల బిలిపించి అతిశీఘ్రముతోను, వన రెరిగి యజ్ఞశాలలు గట్టింతమని, ఆట కూటమ్ములూ నాటకపు శాలలు, చిలుకలు గోడలా చిత్తరువు లేయించి, భమిడి స్తంభాలతో పందిళ్లు వేయించి, అగ్నిహోత్రుని కరుగు అయిదు గుండంబులు, మొదలుగా గల సమస్తనిర్మాణములు గావించెను. కాని యాతడు 'అప శకునముతో గట్టె ఆయజ్ఞశాల'. దక్షుడు కొంత శాంతచిత్తుడైన తరువాత నాతని సతి భర్తను సమీపించి 'అలనాడు కైలాసగిరికి వేంచేస్తిరీ, ఈశ్వరులాదేవి యేమనెనో చెప్పుడీ, పరమేశ్వరుతో గాక పార్వతి రానసెన, అటుగాక కైలాసగిరి పర్వతమ్మీద, తను లోకధారుడై తపసు చేయుచుండెనా, భయమున భీతిని పలుకరించదాయెనా, *వెనుక రమ్మని పలికి వేగిరం వస్తిరా,* కైలాసగిరిమీద ఘనుడు పాలించుచు, *హరునికీ రాతీరదా'* యని ప్రశ్నించెను. దక్షుడు జరిగినది వినిపించెను. దక్షసతి కూడ కూతురుపై నలిగి కొంత దుఃఖించెను. కాని దక్షుడామెను మందలించి కూతురుపై మమత వీడుమని బోధించి 'ఆ యింతి మన పాలింట లేదని తలచి, పూజితమయిన సుత లిందరే యనుకొనీ, మనసు కుదురజేసుకో మలపరాయీ వలెను, చెర వదలి యైనను చేడె వచ్చినగాని, ప్రియము జేసి మీరు పీట వెయ్యగవద్దు. వెలది రమ్మని మీరు కౌగలించగబోకు, దెక్కడున్నా స్త్రీలు అక్కడేయుండు'దని యాజ్ఞాపించెను. సతీదేవి స్నేహితు లదివిని తమలో తాము దుఃఖించి యూరకుండిరి. యజ్ఞమునకు బంధువులు మునులు దేవతలు వచ్చుచుండిరి. కైలాసగిరి మీదుగా వచ్చెడు దేవతలను జూచి 'ఎటనుండి వచ్చెదరు ఓ దేవతల్లార, ఎక్కడికి మీరు విజయము చేయుచున్నార'ని సతీదేవి యడిగి తన తండ్రి యజ్ఞము చేయు చుండెనని తెలిసికొని దుఃఖించెను. దేవతలుగూడ నీ విపరీతమును గాంచి భయపడిరి. సతీదేవి హృదయ మాపుకొనలేక తానును సిద్ధమై శివునను జ్ఞ వేడెను.

శివుడు పిలువని పేరంటమునకు వలదనెను. కాని సతీదేవి 'నాడు మా తండ్రొచ్చె నగధరా మీ కడకు, దీక్షబట్టుక మీరు తపసులో నుండగా. నా సన్నిధికి వచ్చి నాతో రమ్మని పలికె, హరుడును నీవును అతివేగ రమ్మాని, అతని పురమున కేగెనూ' అని సవరించి చెప్పెను. కాని పరమశివుడు వినదయ్యెను. సతీదేవి దుఃఖించి బతిమాలెను. వలదన్నను వినక పోయినచో నవమానము పాలగుదు వనియు 'కూడికలు లేవికా కుందరదనా మనకు' ననియు శివు డూరకుండెను. సతీదేవి 'రాగిభూషణాలు రమ్యముగ ధరియించి, ముత్య వజ్రము తొడుగులు ముగుద తా దొడిగి, వజ్రాల వడ్యాణము వనిత తా ధరియించి, పొగడరేకులు జాజి మల్లి దండలు ముడిచి, పీభూతి చేర్చుకొ- తిలక మమరగ దీర్చి' విఘ్నేశ్వరుని నందిపై నెక్కించి తాను పుష్పకమెక్కి- కైలాసమునుండి దక్షపురికి బయలుదేరెను. ప్రయాణసమయమున నపశకునములైనను ఆమె గణింపదయ్యెను. దక్షవాటిక చేరుకొని సతీదేవి 'నందీశ్వరుడ నేను పోయి వచ్చినదాక, పొరుగునా యుండుమని తోపున బంధించి' లోని కేగెను. 'గవిని కాపులవారు గడగడా వణకుచూ, నెలతకూ తెరవిచ్చి పాయ నిలుచుండిరి'. సతీదేవి లోనికేగుచు నచటి వైభవము గాంచి 'ఇంత వైభోగము జూడక దేహ మేటికి, అనుచు తన మదిని సంతోషమును బొంది, వచ్చి దక్షుని యజ్ఞశాల ముందర భమిడి, స్తంభమున తా నిలిచెనూ'. ఆమెను పలుకరించక సఖులు చంకనున్న గణనాథుని తీసికొని పూజించిరి. దక్షకాంత మనుమనికి చెరకుగడలు ఉండ్రాళ్లు తినుటకై ముందుంచెను. గణనాథుడు 'పార్వతిమీదనూ చింత యించుకలేక, భక్షించుచూ నుండెనూ'. సతీదేవి చెల్లెండ్రు తమ తమ పుత్రుల నెత్తుకొని యటనుండి లేచిపోయిరి. సతీదేవి మాత్ర మేమనుకొనదయ్యెను. యజ్ఞము చేయుచున్న దక్షుడు సతీదేవిని క్రీగంట చూచి కోపావేశముతో 'ఎంత జెప్పినగాని యెరుగరాదే బుద్ధి, నాడె కడజేస్తినీ నాకు నీవు లేవని, నేటిదాకా నీవు నిజమొటయెరిగితే, ఉన్నట్లు యెరిగితే ఉవిద యీశోభనం, తలపెట్టకేపోదు పరివారిలోపలా, అల్లుడూ కూతురూ రాకతీరాదని, అక్షంతలు గంధాన అర్పించి పిలిచితినా?, శోభనానికి మీకు సొంపుబుట్టాదనీ, జోడీలుబెట్టించి తోడితెప్పిస్తినా, అతివ యిందరిలోన హీనపడకా నీవు, అధికురాలని వస్తివా' యని నిందించెను. ఇంతటితో నూరకొనక 'నీ పతికి గలయట్టి నీమమ్ములూ లేవు, ప్రతిప్రతీ భూములూ చరియింప నేరము, ఈశాన్యమందునా తిరుగాడ నేరము, శ్మశాన మందునా మట్టుజేర్చుకు మేము, మునివృత్తి తోడను తపసు చేయనేరము,

యెక్కి తిరుగను మాకు యెద్దు దున్నా లేదు, కప్పుకు తిరుగను మాకు కావి బొంతా లేదు, భద్రాసనమ్ముకే పులిచర్మమూ లేదు, హస్తమ్ము వూతకే అడవి యెముకా లేదు, అడవిమృగముల జంపి ఆ యెముకలూ దెచ్చి, పాతగట్టుక మేము శంఖూద నేరమూ, పూటకూళ్లు గుడిచి బూటకము నేరమూ, వచ్చినవారికి వంచనలు సేయకా, మీదు జూచుచు హర హరా యననేర, మటువంటి పున్నమాచంద్రుణ్ణి నీవు బాసి, నెలత నీ హృదయాన ప్రాణమ్ములుండెనా, అధఃపాతాళాన అణగియుండగలేక, అధికురాలనని వస్తివా'యని దెప్పిపొడిచెను. సతీదేవి 'పోతరించకు దక్ష పొంగు కూడూగాదు, వ్యధపెట్టి నన్నూ యేమనుభవించే'వని 'పతిమాట విననిస్త్రీ పాపిష్టురా'లని తన్ను తా నిందించుకొని 'భూమిలో దుష్టదక్షుని పుత్రినగుకంటె, అడవిలో నొక గ్రామునయి యుండుటే మేలు, దక్షపుత్రీననే లోకనిందయు వేగ' బాపుకొందునని భావించి 'భస్మంబు చేయుమని పావకుని ప్రార్థించి' హృదయ మాపుకొనలేక తల్లిని సమీపించి 'పూదోట నీరులే పాదములు నోకినా, వెన్న కరగినరీతి తల్లిగర్భంబగును, కదలకున్నావేమి కరకు రాయివలెను, నీవేమి జేసేవు నా జన్మఫలమిదీ, అక్క చెల్లెళ్లు నా కడ్డుపడ రారుగా' యని దుఃఖించి కోపమున దక్షుని శపించి 'యెన్నిజన్మంబులూ యెత్తి పుట్టినగాని, చావుపుట్టుకలేని సదాశివున కేను, భార్యను గావలెనని పావకుని ప్రార్థించి, మిట్ట మధ్యాహ్నమున మహామునులు జూడగా, బొటనవ్రేలుతోను కట్టిడయి వ్రాయగా, మధ్యాహ్నమున మహామునులంత జూడగా మండి తామగ్గ సఖియా.' మునులు దేవత లదిజూచి కీడు శంకించి యజ్ఞమును విడిచి పోవనుండగా దక్షుడు వారిని వారించి 'కడతేర యజ్ఞంబు గావింతుమని పలికి' కార్యమునకు గడంగెను. నందీశ్వరు డిచ్చట జరిగినదంతయు చూచి పోయి శివున కెరిగించెను. శివుడు ప్రళయమూర్తియై 'శ్రీఘ్రాన లలాటముపై చెమటలూ దీసి, శ్రీఘ్రాన చట్రాతిపై చినుకూలె చల్లె'ను. అంత వీరభద్రుడుదయించి, 'కాస్త నో పూస్తునో విష్ణులోకమంత, కొందును తిందునో సకలలోకము లెల్ల, అంత వృత్తాంతమ్ము తనతో జెప్పుమనీ తండ్రిపాదములకొరిగెను'. శివుడు వీరభద్రునితో 'దక్షుడీ పురికేగి పురము పాడుచేయు' మనెను. మహాప్రసాదమని వీరభద్రుడు 'ధవళశంఖులు రెండు తళతళా మెరయగా, వీభూతి వెండికట్లు విరివైన తలజడలు, హావీర హావీర వీరరుద్రా యనుచు' దక్షుని పురము చేరుకొని ఒక్కొక్కరిని పట్టుకొని తన్నుచుండెను. దక్షుడీశ్వరుని తూలనాడగా, కనుగీటి నవ్విన భృగువును,

శివుని శపింపగా జూచి నవ్విన పూషుని చండీశ్వరుడు దంతములు విరుగదన్నెను. మునులను దేవతలను తలలు నఱికి వీరభద్రుడు 'దక్షునీ తల ద్రుంచి పావకునికీ వేల్చి, అచ్చటా గూర్చున్న దక్షసతినీ జూచి, సోమయాజులు నేను సోమిదేవివి నీవు, అనుచు అగ్నిహోత్రునికి హోమములు వేల్తుమని, హస్తమ్ములో యెముక ఆజ్యమ్ములో ముంచి, స్వాహాయమని వేల్చెనూ'. పురమును యజ్ఞవాటికను బీభత్సము చేసెను. మునులు దేవతలు కొందరు పారిపోయి యచటి బీభత్సమును బ్రహ్మకు విన్నవించిరి. బ్రహ్మ దేవతలను దోడ్కొని అందఱు కలిసి శివుని కడకు వచ్చి 'వీరన్న చెయ్వులు వింతలుగా చెప్పి, దక్షప్రజాపతిని బ్రతికించుమని వేడి, యజ్ఞమ్ము సాంగముగ గావించుమని చెప్పి, పాదాలకే మ్రొక్కిరీ'. ఈశ్వరుడు దేవతలతో 'దుష్టులను శిక్షించ సుజనులను రక్షింప, అవతార మెత్తితిమి అవనిలోపల మేము. ఇంచుకా క్రోధము మనసునా లేదని' పదమని అందరును కలిసి దక్షపురి చేరుకొనిరి. గొఱ్ఱెతలను దక్షుని మొండెమున తతికించి దక్షుని బ్రతికించి యజ్ఞము సాంతము చేయించి ఈశ్వరుడు, బ్రహ్మ విష్ణువు తమ తమ యజ్ఞభాగములు గొని తిరిగిపోయిరి. దగ్ధమైపోయిన సతీదేవి మేనకాహిమవంతుల గర్భమున పార్వతియై జన్మించెను. ఆమె 'శివశివ యనకనూ పాలైన త్రాగదూ. హరహరా యనకనూ బుగ్గైన త్రాగదూ, ఘణఘణ మనుచునూ ఘంటలే మ్రోయకా, కన్నులానే జూడదూ.' శివభక్తితో పెరిగి పెద్దదై తల్లిదండ్రులతో 'ఈశ్వరుని జూడకా యిక నిలువజాలనూ, వనములకు నే బోయి తపసు నొనరించుకొని, ఈశ్వరుని పెండ్లాడి ఇంటికీ వచ్చెద'నని యనుజ్ఞ వేడెను. పర్వతరాజు బిడ్డను గారవించి 'నీవు కోరినయట్టి వరునినే వెతికించి, పెండ్లి జేసెదనమ్మ చేడెరో నే నీకు, తపసుకూ బోవద్దు తరుణి నీ వెక్కడికి, నిను బాసియు మేము నిముషమోర్వాలే'మని చెప్పినను పార్వతి తన పట్టు వీడక వనములకేగి 'ఆకుమీదాకుంచి సోకమీద సోకుంచి, పంటిసూదిమీద వనిత కాలూయుంచి' ఘోరమైన తపమొనరించెను. శివుడు జంగమరూపమున సాక్షాత్కరించి 'నీవుగోరిన వరుడు నినుగోరి తావచ్చు'నని పార్వతికి చెప్పి తిరిగి కైలాసమునకు వచ్చి భృంగిని హిమవంతుని కడకు వియ్యము గుదుర్ప బంపెను. సంబంధము కుదిరినంతనే శివు డింద్రాదిసకలదేవతలతో తరలివచ్చి పార్వతి నుద్వాహమై, ఉత్తమామల సెలవంది 'నాతిని దీసుకొని నందిపై తానెక్కి కైలాసమూ వచ్చెనూ'.

"ఈ పాట యెవరైన పాడినా విన్ననూ,
ఇష్టసంపద లిచ్చు ఈశ్వరులాదేవి, కైలాసం బిచ్చునూ". ఈ పాటను

చిన కవి యెవరో తెలియదు. దీనిని 1905 లో కాకినాడ వాసులు ప రంగనాథరావుగారు ముద్రించిరి. 'చూస్తివా' 'తెస్తామని' 'యోచనం ండు' 'ఉండుకొని' 'ఉచితార్ధము' 'చెరుకుకోలలు' వంటి రాయలసీమ డలికము లుండుటచే కవి యక్కడి వాడై యుండుననుకొందును.

*గంగా వివాహము* : శైవులకు పరమప్రియమైన కథలందు గంగా హమొకటి. శిష్టకవులు కూడ ఈ కథను చేపట్టిరి. కవి సార్వభౌముడగు మంచి తిమ్మకవి ఈ కథనే 'శివలీలావిలాస'మను పద్యకావ్యముగాను, రు గంగాధరుడు 'గంగా వివాహము-ద్విపద కావ్యము'గాను రచించిరి. తెలియని కవులు 'శివ పారిజాతము', 'సాంబశివ విలాసము'లనియును, మూర్తికవి మరియు పెద కెంపరాయడను కవులు మఱిరెండును, మొత్తము గు యక్షగానములు రచించినట్లు శిష్టా రామకృష్ణశాస్త్రిగారు తెలుపుచున్నారు1. థనే జానపదులు పాడుకొనుట కనువుగా పసకాడ సన్యాసియను కవి హరీ నారాయ ణాదినారాయణా, కరుణించి మమ్మేలు కమలలోచనుడా' ఎత్తుగడతో సీసపద్యమందలి పెద్ద పాదమునకును, ద్విరదగతి రగడకును పముననుండు ఛందమున రచించెను. ఈ ఛందమున ననేకు లనేకగేయ ్యములు రచించియుండుటచే నిట్టివానికి 'హరిహరీ పదాల'ని శ్రీ ఏకుమళ్ల ్శ్వరరావుగారు నామకరణము చేసినారు2. ఈ వరుస యక్షగానములలో పెలనుపేరిట ప్రసిద్ధి గన్నట్టిదే. అయిదేసి అక్షరముల ఆవృత్తాలు నాలుగు ప్పన నుండు రెండు పాదములకొక ఖండమగును. రోకటిపాట, సువ్వాల, ాటపు (చతురశ్రగతి) పాటలు సుదీర్ఘములై కథనము నేర్చినటులే ఈజంపెలు క గతశతాబ్దముననే విశాఖమండలముననే దీర్ఘకథనము నేర్చినట్లు కనబడు ్నది. ఇవి 'పదము' లన్న పేరుతో ప్రచారములో నున్నవి. పదములను క్షేత్రయ్య పాటలకు కూడ నున్నది. వానినుండి వేరుచేయుటకు వీనిని కావ్యము లనవచ్చునేమో। జానపదసారస్వతములోని వీరగాధలు, తందాన ములు, జంగం కథలు, స్త్రీల పాటలు, ఏలపాటలవంటి వేవియును పద

1. వీర శైవ వాఙ్మయము, పుటలు 399-400
2. [illegible] 1955

కావ్యములన్న మాటవలన స్ఫురించవు. కనుక, వీనిని 'హరహరీ పదము' లనుటకన్న పదకావ్యములనుట సమంజసము. పనకాడ సన్యాసి తాను,

జగతిలోపల నరస్తవము చేయక నేను, నీకంకితముచేతు నా కవిత్వంబు
సారంగధరచరిత శతకంఠయుద్ధంబు, పరగ నీకృతిజేసి పాటబాడితిని
కడు భక్తితో నిపుడు గంగావివాహంబు, పదముగా గూర్చియు పాటబాడెద'నని

చెప్పుకొన్న ఆదర్శకవి. తన కథ కాధారముగా,

'స్కాందపురాణ గంగావివాహంబు, పుడమి నాయికకవి పూర్వము జెప్పె
ఆకథా శృంగార మంత జేర్చితి నేను, నిఖిలలోకాధార నీదయనుబట్టి'

అని చెప్పుకొనెను. ఈతడు విజయనగర సంస్థానమందలి మరువాడ పురవాసి. పూసపాటి విజయరామగజపతికి (1844-1879) సమకాలీనుడు. ఈపదము 'సరణిగా నళనామసంవత్స రాశ్వయుజ, బహుళపంచమి నరికి పరిపూర్ణమయ్యె' నట. నళసంవత్సరము 1796, 1856, 1916 సంవత్సరములందు వచ్చినది. కవి విజయరామగజపతిని (1844-1879) పేర్కొనుటచే ఈనడుమ వచ్చిన 1856 నళసంవత్సరమున రచన జరిగినది. సన్యాసికవి ప్రసిద్ధజానపదగేయకర్త. సరళమైన భాషలో, చక్కని నడకతో, అనేకములగు జానపదుల సామెతలతో, కథాచిత్రణము చేయగల సమర్థుడు. గ్రామీణులందు జరిగెడు సవతుల కయ్యములు చూచిన కవియగుటచే గంగాగౌరీవివాదము నతిమనోహరముగా చిత్రింపగలిగినాడు. కథాప్రారంభ మిట్లు జరిగినది. ఒకనాడు పంచపాండవులు భీష్మునితో,

'తాత గాంగేయ మీతల్లి గంగాదేవి, లోకపావని సర్వలోకముల జనని
జీవకోటులకెల్ల జీవనంబై పరగు, కల్మషంబులులేని గంగాభవాని
కరివేల్పు పదములం దరయ బుట్టిన కొమ్మ, కరివేల్పు నిల్లాలు కన్నట్టి తల్లి
అఖిలపావనియైన అటువంటి తల్లికి, జాలరి కులమందు జన్మ మెటుగలిగె'

అని కుతూహలముతో ప్రశ్నింప నాతడు పాండవుల కీకథ వినిపించెనట. బ్రహ్మకల్పాంతమున గంగ తన సరివారెవ్వరు లేరని యుప్పొంగి అంతటను వ్యాపించి తుంపరలు చెదరగా దూకుచుండెను. ఆతుంపరలు కైలాసమున నున్న శివునిపైనను పడెను. అంత నాతడు కుపితుడై,

'నీకు సరి కన్నియలు లోకమున లేరనుచు, పొంగి మిన్నక నీవు బుద్ధిహీనతను
విష్ణుపదముల బుట్టి వెలసినానని నీవు, గర్వమొందుట తగదు గంగరో నీకు
నీచువాసనచేత విలయమై యున్నట్టి, జాలరి కులమందు జన్మించబొమ్మా'

శపించెను. గంగ వేడుకొన శివుడు,

'నీచజన్మమంచు నీవు చింతింపకు, పడతి నిన్నును నేను పరిణయం బొదు
పరిణయంబై నిన్ను శిరమందు దాల్చెద' నని యభయ మొసంగెను. గంగ
ంలే శివుని శాపప్రకారముగా భూలోకమున నేలాపురమున జన్మించెను.
్యసి కవి గంగ జన్మించినది ఏలాపురమని (ఏలూరు) తన యాంధ్ర
భిమానము చాటుకొనుటయే గాక కథకుకూడ నాంధ్రత్వము కలిగించెను.

'వసుమతీస్థలి కెల్ల వన్నెదెచ్చిన పురము, ఎల్లెడల వైభవము ఏలూరిపురము
పాడి పంటలు నిత్యభాగ్యములు కలిగి, ధనధాన్యములు కలిగి దనరిన పురమని'యు
ారును ప్రబంధములందుండెడు పురవర్ణనములతో (చాతుర్వర్ణ్యములు,
రంగబలములు, వేశ్యలు) చిత్రించెను. ఏలూరున జాలరి కులమున శంకు
య్య యను ఐశ్వర్యవంతుడగు భక్తుడుండెను. అతని భార్య చక్రమ్మ. ఆమె
నము ప్రబంధమార్గమున నడచినది.

'చెలియ చక్కందనము చెప్ప శక్యముగాదు, పున్నమచంద్రుని బోలు నెమ్మోము
తరుణి నేత్రంబులు తామర తుల్యములు, అంగన నెన్నుదురు అర్ధచంద్రుండు
చెక్కిళ్ళు అద్దములు శ్రీకారములు చెవులు, చక్కని నాసికము సంపంగి మొగ్గ
గళము శంఖము వీపు కదళికా పత్రంబు, భామ పాలిండ్లు యాబంగారు గిండ్లు
నళినాక్షి నూగారు నల్లచీమలబారు, వళులు యలలకొప్పు కౌను గగనంబు
కాంత భుజములు లతల్ కటియు పుడమినిబోలు, జలములోపల సుడి జలజాక్షి నాభి
అరటి బోదెలబోలి అతివ పెందొడలుండు, సఖియ పాదములు సరసీరుహములు'

క్రమ్మ శంకుదేవయ్యలకు సకలసంపద లుండియు సంతానము లేదయ్యెను.
కనాడు వారింటికొక మిండజంగము భిక్షకై వచ్చి,

'బిడ్డలేని యింట భిక్ష పట్టనటంచు, మాటాడి జంగంబు మరలి పోయెనుగ'.
క్రమ్మ అందులకు నొచ్చుకొని సంతానములేనట్టి, 'కలిమేల బలమేల ఘన
ాసములేల, బ్రతుకేల సుఖమేల జీవనము లేల' అని దుఃఖించి జరిగిన
ంగతి భర్త కెరిగించి 'ఈభోగభాగ్యము లీపదవి మనకేల, గర్భవాసపు పంట
ందారి చూడు'మనెను. దంపతు లిరువురు నిశ్చయించుకొని సాగర సమీపము బ

నతిభక్తితో శివునిగూర్చి తపమొనర్చిరి. శివుడు ప్రత్యక్షమై 'పదునాల్గు లోకములు పావనము గావించు, పరమపావని గంగ బాలరూపమున' మీకు జన్మించునని వరమిచ్చి వారిని పంపించెను. వారు స్వగ్రామము చేరుకొనిరి. కొన్నాళ్ళకు చక్రమ్మ గర్భము ధరించ శుభముహూర్తమున గంగ జన్మించెను. పురజనులు,

> 'లాలి గంగాదేవి లాలి శ్రీహరిపుత్రి, లాలి యంబుజనేత్రి లాలి శుభగాత్రి
> పాపహారిణి లాలి పరమపావని లాలి, పద్మలోచన లాలి భద్రఖని లాలి'

యని పాటలు పాడిరి. బాల్యకౌమారములు గడచి విద్యాబుద్ధు లెరింగి గంగ కన్యాత్వ మందెను. ఆమె వర్ణనము మరల ప్రబంధముల రీతినే సాగినది. ఇంతియకాక,

> 'కొమ్మగాదది మంచి కుదురైన కెందమ్మి, తమ్మిగాదది మంచి ఘనమైన దండ
> దండగాదది మంచి తగుమేలు చెంగలువ, కలువగాదది మంచి ఘనమైన చిలుక
> చిలుకగాదది మంచి చిత్తజుని చేబంతి, బంతిగాదది మేల్మి బంగారుదండ
> దండగాదది మంచి దనరు కప్పురగంధి, గంధిగాదది హొయల్గల్గు పొన్నారి
> నారిగాదది మంచి తీరైన పూబోణి, బోణిగాదది మంచి పొలుపైనవాణి
> వాణిగాదది మంచి వాసించు పన్నీరు, నీరుగాదది మంచి నెనయంపుతీరు
> చిన్నారి పొన్నారి చెల్వుమీరు మిటారి, మెరుపైన వయ్యారి యున్నతాకారి'

యను ముక్తపదగ్రస్తాంత్యప్రాసాది శబ్దాలంకారములు గూడ ప్రవేశించినవి. ఇట్లుండ నొకనాడు నారదుడా పట్టణమునకు వచ్చి యామె సౌందర్యము గాంచి 'ఈబాల ఈగోల ఈ పద్మగంధి, శివున కర్పితముగా చెన్నారుచున్న'దని ఎరుకత వేషముతో బోయి హరుడు భర్తయగునని గంగ కెరుకచెప్పి సెలవు తీసికొని, ఆ వేషము విడిచి యెప్పటి రూపమున కైలాసమున కేగెను. ఇచ్చట ఎరుకత వేషభాషలు, ఎరుక చెప్పెడు విధానము మున్నగునవి విపులముగా చక్కగా వర్ణింపబడినవి. నారదుడు శివుని దర్శించి గంగనుగూర్చి చెప్పి 'విరహతాపము చేత వేగుచున్నది కన్య, కన్యకామణిపైన కరుణింపవయ్య'యని వేడ్కొని తనదారిని బోయెను. శివుడు 'కలకంఠి పార్వతికిని తెలియకుండగను, కైలాసగిరి నున్న ఘనుల కెవ్వరికిని, తాను వెళ్ళినజాడ కానరాకుండ' ఏలూరు చేరుకొని జాలరివారుండు వీధి తెలియక నీలాటిరేవు సమీపించి నీళ్ళకై వచ్చిన నెలతల జాలరి వీధుల జాడ లడిగెను. వారు,

'పసుపుచెట్టున్నాది బ్రాహ్మణుల వీధి,సురసాలయున్నది శూద్రుల వీధి
విరజాజి యున్నది వెలయి కోమటి వీధి, పుపుదోట యున్నది శివభక్త వీధి
మందార మున్నది మహిమ పంజారవీధి, కుసుమ చెట్టున్నది గుజరాతు వీధి
పాలమ్రా నున్నది శీలవంతుల వీధి, కలపొన్నయున్నది కంసాలి వీధి
శింశుపం బున్నది చిట్టికర్ణపువీధి, మొగిలి చెట్టున్నది వెలమల వీధి
కరవీర మున్నది కాపు ధనికుల వీధి, చామంతి యున్నది జంగాల వీధి
మారేడు ఉన్నది మహాకర్ణికుల వీధి, దేవదా రున్నది దేవాంగ వీధి
పొన్నమ్రా నున్నది భోగకాంతల వధి, జాబరాయున్నది జట్టిస వీధి
నిత్యమల్లెలు గలపు నెరయ జడ్డి వీధి, బొండుమల్లున్నది బొండీల వీధి,

సుమారేబది వీధులపేర్లు చెప్పి చివరకు 'చందనం బున్నది జాలారు వీధి' జాడ లెరిగించిరి. శివుడు జంగమవేషము ధరించి ఏలూరి పురవీధులు తిరిగి జాలరి వీధి కేగెను. అచ్చట,

'సోరమీనుకలకంపు సొరది మిన్నంటెను-పచ్చిచేపలకంపు పరిఢవించెనుగ
మురికి చేపలకంపు ఏకమై వెలసెను- బొలసు చేపల కంపు నిలుకడైయుండె
జుమ్ముమని ఈగలు సొరపు బుట్టె-నల్లచీమలబారు కొల్లలై యుండె' ను.

కేమాత్రము రోతపడక శంతుదేవయ్య ఇంటిముందు చేరి భిక్షమడిగెను. మ్మ భిక్ష పెట్టి జంగమును పలుకరించెను. కాని యాతడు మరుమాటాడక శివాలయమువైపు పోయెను. అంత గంగ యాతని ప్రవర్తనమున ర్యపడి, 'జంగము కాడితడు సాక్షాత్తు శంభుండు, నను జూడవచ్చిన ండు నిజమ'ని భావించెను. గంగ విరహతాపమున అన్నపానము లుడిగెను. మ్మ బిడ్డ స్థితి గాంచి 'ఆకుచాటు కాయ అమరయున్న విధాన, తల్లిచాటు న దాగుండవచ్చు, తల్లిచాటున నెంత తప్పుచేసిన గాని, యది పైకి పోవునా ంమ్మ లోకమున' నని కారణమడిగెను. గంగ తల్లికి కలరూపెరిగించి, శుగుడిలో చేరి పరమేశు డున్నాడు, అతని నన్ను గూర్చవమ్మ ఈక్షణమని' ను. చక్రమ్మ ఆశ్చర్యపడి 'ముష్టి జంగము చూచి మోహపడ్డావేమో, నేమి పాపమో యెరుగంగరాదు, మాయజంగమువాడు మరులుకొల్పె నిన్ను, లేల కొంటివే మాయజంగముకు, చెలియ మన జాలారి జాతి మహపెద్దది, వెయ్యరా మనకు కులమంత గూడి, వెలివెయ్యడం కాక కులమంత కూడు , తప్పు తెమ్మందురే తగ కోటిధనము, కక్కుర్తి పడితేను కడుపునిండగ

తిట్టినా, జాతి మాలిన మాట సహియింపదే నా'కని కూతురునకు హితబోధ యొనర్చెను. కాని గంగ తల్లితో నాతడు వట్టి జంగము కాడనియు పరమ శివుడనియు చెప్పెను. ఐనను చక్రమ్మ,

'హరుని సంచారంబు అదియు నెట్లంటివో, వినిపించెదను నేను వినవె నా తల్లి
పెట్ట సొమ్ములు లేవు పెనుబాములే గాని, పూయ గంధము లేదు బూడిద కాని
కట్ట కోకలు లేవు గజచర్మమే గాని, పునుక కంచమె గాని తిన గిన్నెయును లేదు
ఎక్క వాహనము లేదెద్దుగుజ్జుమె కాని, తలకు పువ్వులు లేవు నెలపువ్వెగాని
ఉండ నిల్లు లేదు వండ పొయ్యి లేదు, ఊరిలో బిక్షంబు గుడిలోన నిద్ర
ఇంతిరో చూడగా ఎగుదిగు కన్నులు, మెడను రుద్రాక్షలు మేనంత బొల్లి
రసము ఉడిగిన మహా ముసలితనమువాడు, కులగోత్రములు రెండు తలపంగ లేవు
బాలరో నీవెర్రి బంగారమైపోను, ఇట్టివానిని నీవు ఎట్టు వలచితి'వని నివారింప

బూనెను. చక్కని వ్యాజస్తుత్యలంకారము. ఇంకను 'సాగని బ్రతుకొకటి సవతి పోరొకటి, ఏల పుట్టెను నీకు ఈ పాపబుద్ధి' యని నిందించెను. (సాగని బ్రతుకనుమాట సాభిప్రాయము కానోపు. శివుని జటాజూటమున బంధింపబడి యుందువని యర్థము) చక్రమ్మ తన బిడ్డకు గరపిన బుద్ధులు, నీతులు, సవతి పోరువలని కష్టనష్టములు సహజముగా నున్నవి. మరునాడు జంగము భిక్షకై యరుదెంచగా చక్రమ్మ యాతని నిందించి ఇందేల వచ్చితివి మరింకెట్టకైన నేగరాదాయని కోపింప శివుడామెతో,

'నెలతరో కోపింప నేనేమి చేసితిని, జంగమ పద్ధతిని జనుదెంచి తిటకు
కడుపే సముద్రమై కడులోకముల నెల్ల, సంచరించగవలనె జంగమేశ్వర్లు
నాతు లెవ్వరైన నను జూచి వచ్చుటకు, నా సొంపు పెంపేమి నా యందమేమి
రసము ఉడిగినయట్టి ముసలివాడను నేను, రూఢిగ సతులైతె రోయరే నన్ను
మా వెంట నెందరు మగువ లొస్తున్నారు, జోలెలో నెందరు సుదతు లున్నారు
కొమ్మ చెప్పెద నాకు కొడుకు లిరువురు గలరు, పేరైన యిద్దరు పెండ్లాలు గలరు
మహిమ శోభిల్లు ధనపతి నాకు నేస్తుండు, కొండమీదను యిల్లు కొనసాగియుండు
పడుచుతనమున బ్రహ్మహత్య చేసితి నేను, బ్రహ్మహత్యాదోష పరిపూర్ణమాయె
బ్రహ్మ హత్యాదోష పరిపూర్ణమై నాకు, బొల్లి దేహంబయ్యె పొలతిరో చూడు
శరధి తరచిననాడు గరళంబు మ్రింగినా, పొలతిరో ఈ బొల్లి పోయినదికాదు
బొల్లి దోషంబెల్ల పోవుటకు నేనిట్లు, సంచరింపగ వలనె జంగంబు నగుచు'

అని సాభిప్రాయముగా జెప్పి, ఇంక భిక్షకై రానని వెడలిపోయెను. చక్రమ్మ జరిగిన సంగతి గంగతో చెప్పెను. ఆమెకు పట్టుదల మరింత యధికమయ్యెను.

ఆమె స్వయముగా తండ్రికడకేగి జరిగినది చెప్పి తన నీశ్వరున కర్పింపుమని కోరెను. శంకుదేవుడు బిడ్డను బుజ్జగించి, జంగము శివుడైనచో,

'మారువేషముచేత మనయూరు జొరనేల, పరికించి నిను జూచి పారిపోనేల
దయనిండగా నాకు దర్శనంబీరాద, బాల నర్పించుమని పలుకంగరాదా
తాను రాకుంటేను తగు పెద్దలను బంపి, యబల నర్పించుమని యడిగించరాదా
నిజముగా జంగంబు నిటలాక్షుడై తేను, దర్శనం బిచ్చును తప్పకుండగను
నాకు నమ్మకముగా నాగకంకణధరుడు, నిజరూపుగా వస్తె నిను పెండ్లిసేతు'

నని పలికెను. గంగ శివుని తానై సాక్షాత్కరింప నిచ్చగింపనిచో తగువారిని బంపుమని ప్రార్థించెను. శివుడు కరుణించి సనకసనందనాదుల నిచ్ఛామాత్రమున రావించెను. మునులు శివునాజ్ఞ గొని యరుంధతిని దోడ్కొని శంకుదేవయ్య ఇంటికి పోయి వియ్యము కుదిర్చిరి. హరిబ్రహ్మాదులు వచ్చి గంగాశంకరుల వివాహము గావించిరి. వివాహమువేళ శంకరుడు 'తాలిబొట్టు' కట్టెను.

'అఖిలబంధము లెల్ల నణగించు గంగను, బంధించె పోగుచే పార్వతీశ్వరుడు
పదునాల్గు లోకాలు ప్రౌఢిమీరిన గంగ, తనరగా నూలుపోగున కట్టబడె' నట

అప్పగింతల సమయమున చక్రమ్మ శంకుదేవయ్యలు శివునితో,

'అత్తవారింట భాగ్యం బెంత గల్గిన, మొదట పుట్టింటాశ వదల దింతులకు
ఆకాశము పొడవు తన కాపురంబుండిన, మొదట పుట్టింటాశ వదల దింతులకు
పరమాత్మ! నిజముగా పగవారికైనను, ఆడసంతానంబు కూడదెవ్వరికి
తప్పువచ్చినవేళ తాల్మిపడి రక్షించు, కోపగించకు నీవు గోల యీబాల
ప్రాణనాథుడు భార్య పక్షమైయుంటేను, మిన్ను విరిగినకాని మీదపడబోద'నియు

తమ కూతురుతో,

'కన్నవారల యిల్లు కలలోని భోగంబు, నిజముగా పతియింట నిల్చిపోయమ్మ
పెద్దది గౌరమ్మ చిన్నదానవు నీవు, ఎరిగి వర్తించుమీ యింతి మా తల్లి' యని

చెప్పిన ఘట్టము లతిమనోహరములు. (ఈ ఘట్టమున వివాహప్రయత్నములు, పెండ్లిపాటలు, కట్నములు కానుకలు, వేషభూషలు, పెండ్లివేడుకలు, భోజన సంభారములు, పాకములు, అప్పగింతలు మున్నగునవి అతిమనోహరముగా వర్ణింపబడినవి.) శివుడు గంగాసహితుడై కైలాసమునకు దరలెను. కలహభోజనుడగు నారదుడు గంగాశివుల వివాహము పార్వతి కెరిగించెను. శివుడు

కైలాసము సమీపించి భయముతో మామగారిచ్చిన సంపదలు వెండికొండపై నొకమూల దాచి గంగను జటాజూటమున నుంచి ఏమి యెరుగనివానివలె ఇల్లు చేరుకొనెను. గౌరీదేవి శివుడు లోనికి రాకుండ తలుపులు వైచికొనెను. ఈ సమయమున గౌరీశంకరులకు నడచిన సంవాదమొక చక్కని కళాఖండము. నీవు గంగను తెచ్చుకొన్నావనెడు గౌరికి శివుడబద్ధములాడి సమాధానమిచ్చును.

'నాతి నిన్నిక నేను నమ్మించగాలేను-బాస చేసెద నమ్మ భామ శ్రీగౌరీ
బాస చేయుట యెంతపని నీకు శంభుడా-అధికమాయలవా రెవరయ్య సర్వేశ
కాలసర్పంబును కరమందు పట్టెదను-నామాట యికనైన నమ్మవే గౌరీ
కాలసర్పంబులు కరకంకణములయ్యె-అదియెంత పని నీకు మదనసంహరుడా
విషము పానము చేతు వేయునింకేటికి-నెమ్మదిని నామాట నమ్మవే గౌరీ
కాలకూటము నీవు కబళించి యున్నావు-విషమెంత పని నీకు విరూపాక్షుండ
అట్లయిన నిప్పుల నరచేత బట్టెదను-నామాట నికనైన నమ్మవే గౌరీ
తేటమీరగ నగ్నిదేవుండు నీ కన్ను-నిప్పులెంతటి పని నీకు పురహరుడ
పదినిలువు నీటిలోపల జొచ్చి నిలిచెదను-నామాట నికనైన నమ్మవే గౌరీ
నిండియుండిన గంగ నీజడం బెట్టితివి-పదినిలువు నీరెంతపని నీకు శివుడా'

... ... ... ... ... ... ... ...

బాసలన్నియు నీకు పాటిగాకుండిన-ఎట్లునమ్మింతునె యిక నిన్ను గౌరి
కలబాసలే నీవు తెలియ జెప్పితివయ్య-నిన్నెట్లు నమ్ముదును నీలకంధరుడ
అచ్చ జాజులు నీకు నర్పించె నెవ్వతె- ఇక నెట్లు బొంకేవు ఈశ్వరా చెపుమ
ఆకాశమార్గమున నతడు గొనిపోవంగ-చెలువైన జాజులు చెయిజారిపోయె
అవనిపైబడిపోవ హరున కర్పితమనెను- అవి నా శిరమునం దమరియుండెనుగ

... ... ... ... ... ... ... ...

పరమాత్మ నీమేన పసుపు కుంకుమమును-పరిమళగంధ మెబ్బంగి యంటెనుగా
పసుపు అక్షంతలు పరిమళద్రవ్యములు-విఘ్నేశ్వరునకిచ్చు విప్రవరులెల్ల
పుత్రుడౌటను మేన పొర్లాడ నాతడు-అంటెను మేనుపై నగరుగంధంబు
గళమునందున నీకు కస్తూరిరేఖలు-కలిగియుండుటకేమి కారణము స్వామి
కాలకూటము నేను కడిగివేసికొంటిని-గళము నలుపురేఖ కలిగెనే గౌరీ
కర్పూర వీడెంబు కలుగుటకు విధమేమి-ఇక నెటుల బొంకేవు ఈశ్వరా చెపుమ
తాంబూల మదియొక్క తప్పులో పనిగాదు-చెలువైన వీడెంబు చేసితినే గౌరీ
మోవి ముక్కారగంట్లు ముదమారనున్నవి-ఈమాట దప్పదన వామదేవుండ

కాయజుపైని ముక్కన్ను దెరచిన నాడు- మరుని గుణ్ణపుచిలుక కరచెనే గౌరీ
తప్పక జడలెల్ల తడిసె నెవ్విధమున-సరిపడగ బొంకుమీ సాంబ మహదేవ
సఖి దేహమున మాకు సద్భక్తు లందరు-శిరమున పన్నీరు చేత జల్లుదురు
నిజమైన నీ మేను నీచువాసన వేసె - చెన్నుగా కారణము చెప్పవోస్వామీ
మత్స్యావతారమున మాధవు ండగుపేళ - సహజముగ నేనటకు చనుదెంచినాను
అతనితో కలిసి నే నబ్ధిలో తిరుగంగ - పరసువాసన మేన నమరెనే గౌరీ
సైపజాలక జనులు చాడీలు చెప్పుదురు — నమ్మ ధర్మముగాదు నళినాక్షిగౌరీ
ఇడుములబెట్టు జను లెందరైనా గలరు - అలరు సఖ్యత జూడ నొందజాలరుగా

... ... ... ... ... ... ... ...

పదివేల నేరములు ఖామరో నా వల్ల - పదివేల దండములు ఖామరో నీకు,

తవరకు బిగించుకొని తలుపు దీయక కూర్చుండిన గౌరీదేవి 'దండముతో ంని తప్పులు సరిపుచ్చెను. తలుపు దీసి లోనికి గొనిపోయెను. శంకరుడు ంలనే కొంతకాలము తన రహస్యమును గాపాడుకొనెను. కాని యొకనాడు ర్వతీశివులు పాచికలాడుచుండగా పదేపదే పందెమోడుచున్న పార్వతిని, జటా టమందు డాగిన గంగ తొంగి చూచెను. అప్పుడామె పార్వతి కంటబడెను. ర్వతీదేవి తోక త్రొక్కిన త్రాచయ్యెను. శివుని శిరమెక్కి ఇన్నాళ్ళు దాగి న్న సవతి తన కన్నులబడుటయే కాక తానోడిపోవుచుండగా సంతోషమున ంచూచుట తన్ను పరాభవించినట్లయ్యెను. గంగాగౌరీదేవుల కిచ్చట జరిగిన వాద మత్యంతమనోహరముగా నున్నది.

'ఎవతివే శంభుని శిరమెక్కి కూర్చుంటి — గయ్యాలి నా సవతి కండ్లు గానకను
కండ్లు గానని యంత గయ్యాళి నే గాను — గౌరమ్మ ఆకాశగంగనే నేను
గంగవైతే నీవు గగనమందుండకను – మగని శిరమెక్కుట తగునటే గంగా
మగని యాజ్ఞకు నేను మారుజెప్పకను – ఉండుమన్న చోట నుంటి గౌరమ్మ
అట్లయితె మరుమాట లాడకుండగ నీవు – వదిగుండు ఒకమూల వయ్యారిగంగ
మదనాంతకుని కరుణ నా మీద గలిగుంటె – వదిగుంటె మనకేమికొదువగౌరమ్మ
గతిమాలి నా యింటికడ జేరియున్నావు — మత్సరము నాతోటి మానవే గంగా
ముందున్న శ్రవణముల కంటెను మిక్కిలి – వెనుక కొమ్ములు వాడి వినవె గౌరమ్మ
అచ్చికలు బుచ్చికలు మచ్చికలు చేసుకొని–మర్లుకొని నా మగని తగిలితివి గంగ
వచ్చితిని యికను నే వద్దన్న మానను – కచ్చుకొనుటకు నీతిగాదు గౌరమ్మ
హీనజాతివి నీవు యింత పని వచ్చెనే – గతిమాలి వచ్చిన గయ్యాళి గంగ

ఇసుకలో బంగారు ఎలమితో బుట్టద-ఎచ్చోట బుట్టితే యేమి గౌరమ్మ
హిమవంతుని పుత్రి నెల్లలోకంబులను-పూజ్యురాలను నన్ను బోలుదువె గంగ
పాలసముద్రములోన కాలకూటము బుట్టె-ఎచ్చోట బుట్టిన నేమి గౌరమ్మ
వలపు మందులు బెట్టి వలపించుకొంటివీ-గడప దాటని శివుని గయ్యాళిగంగ
వలపుమందులు చాల కలవు కొండలయందు-నీకు పుట్టిల్లది నిజము గౌరమ్మ
చేపలమ్మే నీవు జాలారి దానవు-నిన్నెటుల వలచెనే నీలకంఠుండు
కులమెంచి తేలేదు గుణమెంచి తెచ్చెను-జాతు లెన్నగబోకు సవతి గౌరమ్మ
పతి సముద్రుని విడిచి పావమున కొడిగట్టి-ఈ మగని వరియిస్తి వింతిరో గంగ
తండ్రి దక్షుని శిరము ధవునిచే గొట్టించు-తీర్వరిని గాలేదు తెరవ గౌరమ్మ
నీచు నాయేరాల నెరజాణవే నీవు—గంపదింపులమారి గయ్యాళి గంగ
నాజోలి నీకేమి నీజోలి నాకేమి—ఉన్నచోటను నీవు ఉండు గౌరమ్మ
ఉన్నచోట నన్ను ఉండమన్నందుకు- తప్పక నీ జిహ్వ తరిగింతు గంగ
నీవు తరిగిన కూర నేను తరిగిన కూర-వడ్డింతుమే వడి వనిత గౌరమ్మ
చెంపకాయలు గొట్టి చెవు లూడదీతునా-జగడపోతులమారి జాలారి గంగ
నీవు గొట్టిన కాయ నేను గొట్టిన కాయ-గంప నిండింతునే కాంత గౌరమ్మ
అతి చమత్కారము లాడకుండగ నిన్ను—పండ్లు జలజల రాల పడగొడుదు గంగ
నీవు గొట్టిన పండ్లు నేను గొట్టిన పండ్లు-దాలురకు పంచేమె భామ గౌరమ్మ'.

ఇరువురు సవతు లిటుల నీవెంతయన నీవెంతయని వాదులాడిరి. చివరకు గౌరీదేవి గంగను తన్నెదనని 'అని లేవబోవంగ ఆజడలలో గంగ, ఆశ్చర్య కరమొప్ప నణగిపోయెనుగా'. గంగ దాగిపోయిన తరువాత చేయునది లేక గౌరీదేవి శివుని నిష్ఠురములాడి,

'మధ్య నేనుంటేను మచ్చటలు తీరవు – కేళీవిలాసముకు చాల అడ్డములు
నెలవిమ్ము పుట్టిల్లు చేరబోయెద చాల - దయయుంచు పదివేల దండములు మీకు
పుట్టినింటికి వెళ్ళిపోతినని నామీద—తగని కోపంబున దయ దప్పబోకు
నీ పదధ్యానంబు నిల్పి కలలోనైన—మరువకుండెద నీదు మహిమ లన్నియు' నని

గౌరీదేవి పుట్టింటికి బయలుదేరెను. శివుడామెను బతిమాలుకొనెను. 'కలనైన నేను నీ నెలవు దాటనటంచు-బాస లొనరించెనా పరమేశ్వరుండు' 'అగ్నిసాక్షిగ బాస లపుడీశ్వరుడు బలుక-మగని మాటకు గౌరి మాటాడకుండె'. గౌరీశివు లెప్పటియట్లు కలసిమెలసి సరససల్లాపముల దేలుచుండిరి. అదిచూచి గంగ భరింప జాలదయ్యెను. జడలనుండి క్రిందికి దుమికి శంకరుని నిష్ఠురములాడి పుట్టింటికి బయలుదేరి గౌరీదేవితో చివరమాటలుగా,

'నీలకంఠుడు నీవు నిఖిలసంతోషమున-కేశవపాదముల నోలలాడండి
ఇంత పని కలిగిన ఇంతి నీవద్దకు - రాను వస్తే వట్టు పూనుకుంటాను
నీకింత పనియున్న నీవు నావద్దకు - నెరయంగ వస్తివా నిజముగా వొట్టు
కోరివచ్చే నైదారు రోజులలోన - తెలియు నాసీయొక్క బలవెంతమెల్ల' నని

పుట్టింటికి పోయెను. తన మాయచే గంగాదేవి సకలప్రదేశముల యుదకముల నింకింపజేసెను.

'వనిత శ్రీగంగ పెళ్లిన మరురోజున - భాండ దూరంబాయె పార్వతీదేవి'. స్నానపానాదులకు నీటికరువు ప్రాప్తించెను. నీటికై దేశదేశములు వెదకించెను. కాని ఎచ్చటనుగూడ పుడిసెడు నీళ్లయిన లభింపవయ్యెను. పార్వతీదేవి చేయు శివపూజాదు లాగిపోయెను. చేయునది లేక దుఃఖముతో గణేశ్వరుని బిలిచి కర్తవ్య మాలోచించెను. విఘ్నేశ్వరు డిదియంతయు గంగాదేవి మహాత్మ్య మనియు మీరిరువురు సమానలనియు,

'హిమవంతు దేహమం దింపారగా వెలసి - విష్ణుపాదాబ్జమున వెలసె శ్రీగంగ
హిమవంతు భార్యయగు ఇంతి మేనకదేవి - గర్భవాసమునందు కలిగితివి నీవు'

కనుక నీవు వెడలి గంగాదేవిని ప్రార్థించు మనియెను. గౌరీదేవి గంగమ్మ పెట్టిన ప్రతిజ్ఞ దలచి పోజాలనని బెట్టు చూపెను. కాని శివునాజ్ఞచే విఘ్నేశ్వరుని దోడ్కొని కాలినడకన బయలుదేరెను. గంగమ్మ గౌరీదేవికి మార్గమున నెన్నియో యాటంకములు కలిగించెను. తన యింటి చుట్టు చేపల వాసన భరింపరానంతగా కల్పించెను. గౌరీదేవి ఎటులో శంకుదేవయ్య ఇల్లు చేరుకొనెను. గంగ గణపతినే లోనికి రానిచ్చెను. పార్వతిని భటులచే బయటనే అడ్డగించెను. విఘ్నేశ్వరుని పూజించి పార్వతిని దెప్పిపొడిచి, పార్వతిని బయటనుంచిన కారణము నిటుల చెప్పెను.

'మలిన కొంపకు వచ్చి మసలరాదని నేను-ఆమె నచ్చట నుండుమంటిరా కొడుకా'

విఘ్నేశ్వరుడు గంగాదేవిని ప్రార్థించి జలములు లేమి లోకమున జరిగెడు క్షోభమును నివేదించి సవతులు కలిసియుండుడని ప్రార్థించెను. గంగాదేవి గౌరమ్మను లోనికి గొనివచ్చి ఉచితరీతి సత్కరించెను. శంకుదేవయ్య జరిగిన దంతయు తెలిసికొని పార్వతిని బతిమాలి గంగమ్మ నప్పగించి మరల

నిరువురిని కైలాసమున కంపెను. గంగాగౌరీదేవు లిరువురు సఖ్యముతో శివుని జేరుకొని సుఖముగా నుండిరి. ఇటుల చక్కని భావములతో సులభగ్రాహ్యమగు భాషతో జాతీయములు సామెతలతో సన్యాసి ఈకథను జానపదులకొరకు రచించెను. రచన జానపదమేయైనను శిష్టసాహిత్యమునకుండెడు సమస్తసాహితీ సంపద, ధ్వనులు రసములు అలంకారములు భావములు ఈ గేయమందున్నవి.

పసగాడ సన్యాసి రచించిన పెద్దపాట కాక మరిరెండు చిన్న పాటలు ప్రచారమందున్నవి. తెలుగునాట పాట బాడనేర్చిన ప్రతి స్త్రీ పాడుకొను పాటలివి. దీనిలో నొకటి '*గంగా గౌరు సంవాద*' మను పేరుతో నున్నది. ఒకనాడు గౌరమ్మ తాను ముడిచికొన్న తరువాత మిగిలిన పూలను గంగమ్మకు పంపించెను. వాడినపూలు నాకెందుకని గంగ గౌరీదేవితో వాదులాడెను. నా సరిదానవా యని గౌరీదేవి యన ఔనని గంగయనెను. గౌరీదేవికి కోపము మెండై తన్నుటకు కాలెత్తెను. అప్పుడు గంగమ్మ,

'అక్కా మీ పాదాల్ని రాలిన్న మన్ను - సందుల్ని గట్టిస్తు గొందుల్ని గడుదు
కొడుకు వీరన్నకు కోట గట్టిస్తు - కోడలు భద్రాద్రికి మేడ గట్టిస్తు
బసవన్న పడుకునే పంచ టరుగేస్తు - శివునికీ శివపూజ గద్దె గట్టిస్తు
నీకు నాకు తినగ సరిగద్దె గడుదు' నని బదులు పలికెను. ఇచ్చట నిరువురు సవతులకు జరిగిన సంభాషణము మనోహరముగా నున్నది. గంగ పార్వతిపై నలిగి తన మేడలకు బోయెను. గంగ బోయిన తెల్లవారే '*అంతట గౌరమ్మకు చెంగు తామాసె*'నట. దీనినే సన్యాసికవి గంగావివాహమున 'భాండ దూరమగుట'గా చెప్పెను. స్నానపానములకు నీరెచ్చటను లభింపదయ్యెను. పార్వతీదేవి వీరన్నను (వీరభద్రుని) నీరు దెమ్మని పంపెను. వీరభద్రు డంతట తిరిగెను, కాని

'చిలుకసముద్రం జూడ చిన్నమెత్తూ లేవు - పాలసముద్రం జూడ పాతికెత్తూ లేవు
వీభూతిగుండాన ఇనికిపోయినవి - మల్లయ్యగుండాన మణగిపోయినవి
సవతుల్ల గుండాన చట్టుబోయినవి'.

గౌరీదేవికి మరింత పట్టుదల హెచ్చి వీరన్నను తన తండ్రిచెంతకు దక్షునింటికి బంపెను. అచ్చటకూడ నీళ్ళు కరువయ్యెను. దక్షుడు కూతురుకు నీటికిబదులుగా పాల కావళ్ళు, నేతి కావళ్ళు పంపించెను. గౌరీదేవి వానితో స్నానాదులు చేసెను కాని 'చీమలు దోమలు చెడకుట్టసాగె, గండుచీమలు మేను చెండుతూ

పుండె'. ఈబాధ పడజాలక గౌరీదేవి వీరన్నను శివునిచెంతకు బంపెను. శివుడు గంగను ప్రార్థించుమని వర్తమాన మంపెను. ఆత్మాభిమానముచే గౌరీదేవి తాను పోలేక వీరన్నను గంగమేడలకు పంపించెను. కాని గంగమ్మ నాలుగుమాటలు వినిపించి ఉదకములజాడ లెరుగనని ఊరకే పంపించెను. చేయునది లేక గౌరమ్మ గర్వమును దిగమ్రింగి వీరన్నను విఘ్నేశ్వరుని వెంటనిడుకొని గంగ మేడలకు పయనమయ్యెను. ఇది తెలిసి గంగమ్మ, 'పచ్చి చేపలు దెచ్చి పందిళ్లు వేసె, యెండు చేపలు దెచ్చి తోరణాల్ గట్టె, పెద్దచేపల పంచటరుగు తా కట్టె, కప్ప జచ్చిన నీళ్లు కళ్ళాపు జల్లె'ను. వీని నన్నింటిని భరించి గౌరమ్మ మేడలోపలికి బోయెను. గంగమ్మ అక్కగారిని వచ్చినపని యడిగి ఉదకముల జాడలే నెరుగనని బదులు చెప్పినది. గౌరీదేవి తన కొడుకుల కోడండ్ర సొమ్ముల చీరెల నిత్తునని ఉదకముల రప్పించుమనెను. తనకుగూడ నా వస్తువులే కలవని గంగమ్మ యనెను. చివరకు గౌరీదేవి 'నావాక్క శివుణ్ణి నీకిచ్చెగాని, ఉదకాల జాడలు చెప్పవే గంగా' యని బతిమాలెను. వెంటనే గంగ 'ఇప్పుడన్నమాటలు తప్పకుమి అక్కా' అని భూమి యాకాశముల సాక్షిగానుంచి సంతోషమున నుప్పొంగి నదులను జలనిధులను పొంగించినది. గౌరీదేవి స్నానపూజాదికము లెప్పటియట్లు గావించుకొని శివుని గంగ కప్పగించినది. సవతులు సఖ్యముతో నుండిరి.

రెండవది 'సవతుల కయ్యా'మను చిన్నపాట. గంగాగౌరు లిరువురు ప్రాకృతులట్లు కొట్లాడినారని చెప్పుకొనుట జానపదులకు స్వభావమే. తమ జీవితమునే వారు దేవతల కంటగట్టి ఆత్మానంద మనుభవింతురు. ఈ పాటలో గంగ పార్వతితో,

> 'వడ్లు దంచిన బియ్యం నీవుచ్చుకుంటె, ఉత్త ఊకాకేల ఈ వాదులాట
> చల్లజేసిన వెన్న నీవుచ్చుకుంటె, చల్లనీళ్లాకేల ఈ వాదులాట
> విడెము జేసిన తమ్మి నీవుచ్చుకుంటె, వట్టి పిప్పికేల ఈ వాదులాట
> పట్టెమంచం పరుపు నీవుచ్చుకుంటె, నులక కుక్కికేల యీ వాదులాట
> వయసు ప్రాయమెల్ల నీవుచ్చుకుంటె, వార్ధక్యమునకేల యీ వాదులాట'

యని వాదించుచుండెను. శివుడు వారిరువురను శాంతింప జూచెను.

> 'ఇద్దర్ని ఓదార్చలేకనే శివుడు, శిరసునా జాలారి గంగనే యుంచి
> తొడపయి పార్వతీదేవినే యుంచి, వెళ్లెనే ఆ శివుడు కైలాసగిరికి'.

ఇంతటితో సవతుల కయ్యము ముగిసినది. కాని శ్రోతలము పఠితలమగు మనక మాత్రము కొంత మేలే కలిగినది

'శివుని కథ లెవ్వరు పాడినా విన్నా · మోక్షసిద్ధియు గల్గు ముక్తియూ గల్గు
ధనధాన్య సమృద్ధి చాల గలిగుండు — సర్వేశు చరణారవిందములె గలుగు'

పేర్కొనబడిన మూడుకథలు శైవవాఙ్మయమునకు సంబంధించినవగుట శైవుల కత్యంతప్రీతిపాత్రము లగుటయేగాక శైవేతరులందుగూడ నంతియ బహుళప్రచారమును మెప్పును గాంచినవి.

గంగావివాహకథయందు శివుడు గంగను వివాహమాడిన వర్తమానమ రహస్యముగా నారదుడు పార్వతి కెరిగించి తనదారిని తాను బోయెను. పార్వ శివుడు వచ్చిన తరువాత వాదులాడెను. ఈ వృత్తాంతమే 'ఈశ్వర భృంగివాద మను చిన్నపాటలో నున్నది. నారదుని పాత్ర మీపాటలో భృంగి నిర్వహించెను భృంగి పార్వతితో,

'రాజనరేంద్ర పురవరమున రాచకార్య మేమొ గాని
రమ్యముగ కోటీశ్వరూడు రమణి నొకతె తెచ్చినాడట
ఎరుగవా పార్వతీ ఎరుగవా' యనగా నామె

'తేజమలరగ నఖండగౌతమీతీరమందున నుంటి గాని
రాచకార్యపు వార్తలేమి తెలియలేదు భృంగీశ్వరూడ
వేగ తెల్పరా నాతో బల్కరా' యనెను అప్పుడు

'బంగారపు బొమ్మవలె పార్వతీ నీవుండగాను
గంగమాంబను తోడితెచ్చుక పొంగి శిరమున బెట్టుకున్నా
డెరుగవా పార్వతీ యెరుగవా' యని భృంగి పుర నెక్కించినంత పార్వతి శివు

'గంగమాంబను దోడితెచ్చి పొంగుచూ శిరమూన బెట్టుక
ఇంగితా మెరుగని మరిమే రంగడు బోధించినాడు (?)
యేమయా స్వామి యేమయా' యని ప్రశ్నించెను. అందుకు శివుడు

'నిండు వేసవికాలమున జలముండునో లేకుండునోయని
దండిగా నది దెచ్చి జడలో దాచియుంచినాను గాని
ఎరుగనే పార్వతీ ఎరుగనే' యని సమాధాన మిచ్చెను. కాని భృంగి శివు ధరించినది వట్టి నీరమైనచో దానికి ముఖము, కనులు, కురులు, కంఠ

గుబ్బలు, నూగా రెండులకుండునో యడుగుమని ఒకటొక్కటే పార్వతికి చెప్పెను. శివుడు నిపుణముగా నవి తామరలు, మీనములు, తుమ్మెదలు, శంఖము, జక్కవలు, నాగుబాములని సమాధానము చెప్పి 'గంగ గాదే ముద్దు గౌరు కయ్యమూ బెట్టూకొరకు-భృంగిగాడికి సాధుజనులు బోధజేసిన వార'ని తానే నిందమోపెను. కోమలభావములతో నొప్పారు నీగేయమును రచించినది.

'వాసిగా శ్రీ గౌరి రామదాసురాలిది జేసినాదట
ఉల్లాసముతో నాదు మనవి చేసినాను గాని నేను
రామ లక్ష్మణ దాసురాలట రమ్యముగ కృతిజేసినాదట
కామితార్థము లిచ్చుతాడట కరుణతో రక్షించుటకు' నని యుండుటచే నొక

కవయిత్రి యని నిశ్చయముగా భావింపవచ్చును. ఇది 14 ఖండముల గేయము.

శైవగేయవాఙ్మయమున నిట్టివే సంవాదములు మరికొన్ని గలవు. అట్టి వానిలో మేనకాపార్వతులకు, లక్ష్మీపార్వతులకు జరిగిన సంవాదములగూర్చి విచారంతము. *'మేనకకు పార్వతికి సంవాద'* మను పేరేగాని నిజముగా నా సంవాదము మేనకకును ఆమె చెలులకును జరిగినది. పార్వతి శివుని వలచు టెరిగి చెలులు మేనకతో శివుడు తల్లిదండ్రులు లేనివాడనియు, దరిద్రుడనియు, దేశద్రిమ్మరి యనియు, విషభోక్త యనియు, నాగభూషణు డనియు, గజచర్మధారి యనియు, కావున నట్టి వరుడు తగడనియు చెప్పిరి. వారికి మేనకాదేవి శివుడు జగత్ప్రభువనియు, మహానుభావుడనియు సమాధానము చెప్పి తన కూతురున కబ్బిన భాగ్యము నిట్లు కొనియాడెను.

'చెదరాని కుంకూమ తరుగాని పసుపూ—అరుగాని తెగని మంగళసూత్రము
తరుగాని వయసు చిత్తము బుద్ధి ముక్కంటి— మరణము లేని విభుచే నాపట్టికి'

ఈ సంపద భారతనారీమణు లందరును కోరుకొనునట్టిది. తానుగూడ భాగ్య శాలినని తలపోసినది మేనక.

'నల్లాని కంఠాము తెల్లాని దేహము-చల్లగ తలనుండు చందమామ
ఎల్లలోకములకు నా అల్లుడు రాజాయె-ఎల్ల జీవులకెల్ల తల్లి నాపిల్లాయె
పరమభక్తులపాలి వరకల్పవృక్షము-నరసిపురి విశ్వనాథుడమ్మ
చలమేలనయ్య ఈ జంగాము లింగాము'.

ఇందులో పేర్కొనబడిన నరసిపుర మెచ్చటిదో ! నరసాపురముతో దీనికేమైన సంబంధమున్నదో !

'లక్ష్మీ పార్వతుల సంవాద' మొక మనోహరకళాఖండము. ఇందు
స్త్రీలు ఒకరినొకరు దెప్పిపొడుచుకొనుట, తామే గొప్పవార మనుకొనుట వం
భావములు సూచింప బడినవి. లక్ష్మీదేవికి శివునిలో నన్నియు లోపములే కనపడె
ఆమె వాని బేర్కొని పార్వతి నెత్తిపొడిచెను. పార్వతి ఆదోషములే విష్ణుదేవు
కున్నటుల నిరూపించెను. చిన్నగేయమే యైనను మనోహరముగా నున్నది.

లక్ష్మి : గౌరిదేవి నీశంభుని గళమున నలుపేమిటె ఓయమ్మా-నలుపేమిటె ఓకొమ్మా
పార్వ : నారీమణి నీ విష్ణుదేవుడు నలుపుగాడటె కొమ్మా-నలుపుగాడటె యమ్మా
లక్ష్మి : బిరుదులేక నీ కాంతుడు జగములొ భిక్షమెత్తుటేమమ్మా-భిక్షమెత్తుటేమమ్మా
పార్వ : బలము లేకను బలిచక్రవర్తిని అడుగలేదటె కొమ్మా-అడుగలేదటె కొమ్మా
లక్ష్మి : శంకలేకను శంకరు కరమున జింక యుండుటేమమ్మా-జింక యుండుటేమమ
పార్వ : శంకలేక వనవాసముకేగుట జింకకొరకు సుమి కొమ్మా-జింకకొరకుసుమికొమ
లక్ష్మి : హద్దులేక నీ మగడు సగము ఆడురూపమేమమ్మా-ఆడరూపమేమమ్మా
పార్వ : ముద్దుగుమ్మ నీపెనిమిటి మురహరి మోహినిగాడా కొమ్మా-మోహినిగాడాకొమ
లక్ష్మి : చింతలేక నీకాంతుడు బ్రహ్మ శిరముద్రుంచుటేమమ్మా-శిరముద్రుంచుటేమమ
పార్వ : పంతముతోడుత రావణబ్రహ్మ తలద్రుంచడా ఓ కొమ్మా-తలద్రుంచడాఓకొమ
లక్ష్మి : పార్వతి మరి నీ విభునకు నిలువున పాములున్న వేమమ్మా-పాములున్నవేమమ
పార్వ : జలనిధితనయ నీ పెనిమిటి పన్నగశయనుడుగాడా కొమ్మా-పన్నగశయనుడు
గాడా కొమ
లక్ష్మి : ఏమిలేక నీ కాంతుడు ముసలియెద్దు నెక్కుటేమమ్మా-ఎద్దు నెక్కుటేమమ్మా
పార్వ : పంతముతోడుత రేపల్లెవాడలో పసులు గాయడా కొమ్మా-పసులు గాయడా కొమ

ఈ చిన్నగేయమున లక్ష్మీదేవి పరమశివునకున్న లోపము లనుకొన్నవి
పతికిగూడ నున్నట్లు తెలిసికొన్నది. ఇదికూడ ఒక విధమగు వ్యాజస్తుతి
దీనిలో శివకేశవ భేదరాహిత్యము చక్కగా సూచింపబడినదని భావించవలె

*త్రిపురాసుర సంహారము* :- త్రిపురాసురులు త్రిదివంబులను త్రిదశుల
బాధింపజొచ్చిరి. దేవతలు మునులు శివునికడ కేగి 'శరణు జగదధీశ శరా
హృదయేశ శంకర పరమేశ శరణు శరణ'ని రాక్షసులు చేయు ఘోరకృత్య
లెరిగించిరి. పరమశివుడు 'దానవులకూ తొల్లి ధాత యిచ్చిన వరము తప్పి
ఎవరితరము'గాదని సమయమునకై వేచియుండు దనెను. త్రిమూర్తి

సంప్రతించుకొనిరి 'ముగ్గురూ మూర్తులు మూడు పురంబులు సంహరించెద మనిరి సాహసమున'. శివుడు మహాయోధు డయ్యెను. పృథ్వి రథముగా, సూర్యచంద్రులు రథాంగములుగా, వేదము లశ్వములుగా, బ్రహ్మ సారథిగా, కనకక్ష్మాధరము కార్ముకముగా, ఆదిశేషు డల్లెత్రాడుగా, శరధి తూణీరముగా, హరి యమ్ముగా, 'ఫాలాగ్ని నేత్రంబు బాణంపు నొకముల్కి సంధించి యుద్ధ సన్నద్ధుడై' శివుడు త్రిపురముల మీదికి దాడివెడలెను. దేవదానవులకు ఘోరయుద్ధ మయ్యెను. రాక్షసులందరు హతులైరి. 'పురహరుం డంతట పురుషోత్తముని బిలిచి జయభేరి వేయించె జగతి మెరయ, తలచిన కార్యంబు తక్షణములో నాయె తేరు మరలించమని తెలియబలికె'. దేవతలు పరమ సంతోషమున నేలలు పాడుచు తిరిగిపోయిరి. ఈ పాట సీసార్ధములలో నున్నది.

శైవ వాఙ్మయమున 'సురాభాండేశ్వరము' వింతకథ. శిష్టులు గూడ ఈ కథను చేపట్టి పద్యకావ్యములు ద్విపదకావ్యములు రచించిరి. లక్ష్మణరాయ పరిశోధకమండలివారి చెంత రెండుమూ డముద్రితతాళపత్రగ్రంథము లిట్టివి కలవు. పాటలో ద్వైతవనమున ధర్మజునకు మార్కండేయు డీకథ వినిపించి నట్లున్నది. ఇది కాశీవిశ్వనాథమహాత్మ్యమును ప్రబోధించును. కాశీపట్టణమున గంగాతీరమందొక శైవబ్రాహ్మణుడు 'పులితోలు వస్త్రముల్ భూమందు బరచి, కాయవస్త్రంబులు కటి ధరించి, వల్లెల్ల వీభూతి వనితేరగాను, రుద్రాక్ష తావళాల్ మెడనిండ వేసి, జపము చేయుచుండె జగతి లోపలను'. ఒకనాడొక గౌడస్త్రీ 'గంగ నీళ్ళకు బోను కడవ చేబూని, శృంగారకంఠముకు చేపువ రాగా' బ్రాహ్మణుడు చూచి మోహపరవశుడై 'వలరాజు ప్రేరేప వర్ణింప మొదలిడె'ను.

> 'చంద్రరేఖయు బోలు సఖియ నీ నుదురూ, చంద్రముఖి సింగిణి సాటి కనుబొమలు
> ముద్దులు గారెడు మృదువైన ముఖము, అద్దంబుకంటె మెరుపైన చెక్కిళ్లు
> జోక తోడుత పుప్వుసాటి నాసికము, బిగిమించు వజ్రాల బోలు పలువరుస'

అని వర్ణించెను. ఆమె గంగోదకములు గొని 'కుచ్చెళ్లు మీగాళ్ల గునిసి గునిసాడ' పల్లె చేరబోయినది. బ్రాహ్మణు డామెను వెన్నంటెను. వలదన్న నాతడు 'తిక్కపట్టినరీతి తెలియక నుండె'ను. గౌడస్త్రీ బ్రాహ్మణునితో,

> 'ఇది యేమి యెరుగవా ఈడిగయిల్లు, కిల్లుకుండవారి కట్టిన పందికోళ్ళు
> కూడులు మిగిలిన కుక్కదాగినటు, పిల్లులు గతకగా పెట్టిన తొట్టి

గుదిగూర్చినటువంటి గొడ్డుమాంసంబు, చాల దుర్వాసనలు సుమ మోడినట్లు
కల్లుదాగిన వాళ్లు కాకయు జడా, మాల మాదిగలెల్ల మనలు ఈ చోటు
హీనమ్మై వచ్చెని ఈ యిల్లు నీకు, సహ్యమెట్లాయెనో సద్బ్రాహ్మణుడ'

అని మందలించెను. బ్రాహ్మణు డామెను వర్ణించి తన మోహము దెలిపెను. అంత నామె,

'నెడరేజు ప్రేలయిన నీ వెర్రి తీరిగి, తడియపె రోకలి తల జుట్టుమన్నా
పతివ్రతను నేను నా పతిమాట లేక, మతి తప్పి తిరుగుటా మేరయే గలుగు
ఈ తుచ్ఛతనమున సుఖమేమి గలదు, జనులు యెరిగుంటేను సిగ్గెల్ల పోను
పెనిమిటి చూచితే బెట్టుగా జంపు' నని బెదరించి కొన్ని హితోక్తులు చెప్పినది.

ఐనను భూసురుడు తన పట్టు వీడలేదు. అతడు 'నిన్ను పొందకయున్న నీరజనేత్రి, నిర్ణయము ప్రాణంబు విడుతు నీవేళ' నని బెదరించెను. బ్రహ్మహత్యా పాపమునకు భయపడి యా గౌడస్త్రీ యందుల కంగీకరించి బ్రాహ్మణుని తన శయ్యాగృహంబున నుంచి తా నలంకరించుకొని పోయి బ్రాహ్మణు నర్చించి భాషించి 'సయ్యాటల పేరుగా' నాతని వాసనలు దీర్చెను. ఇరువురును నిద్రించిరి. ఇంతలో నామె భర్త కల్లు గీసికొని ఇల్లు చేరెను. ఆమె బ్రాహ్మణుని సురాభాండమందు దాచి భర్తను సమీపించి యాతనికి కలరూపు ఎరింగించి 'ఈ తప్పుకొరకై ఈ వేళ నన్ను, ఘాతచేసిన పనికి కైవల్యపదవి, ఇకను ఈ పుణ్యంబు నీకు సిద్ధించూ, అనుచు పాదంబుల వెలదియు పడెను'. ఇంతలో సురాభాండమున దాగియున్న 'బ్రహ్మచారి యనియేటి ఆబ్రాహ్మణుండు, బ్రహ్మరంధ్రంబునా విడిచె ప్రాణములు.' గౌడు బ్రాహ్మణుని కళేబరము చూచి, భయపడి సురాభాండమున దాచినందులకు భార్యను 'పచ్చి కొయ్యవుగదే భామరో నీవ'ని బ్రహ్మహత్యాపాపమునకు జంకి ఆత్మహత్యకు పూనుకొనెను. గౌడస్త్రీ దుఃఖముతో పరమశివుని ధ్యానించెను. సురాభాండమున చచ్చిన బ్రాహ్మణుడు 'ఏనుగు చర్మంబు ఎలమితో గప్పి, ఘనమైన పులితోలు కాశికా వేసి, పుర్రె పేరులు వేసి భూతి మైబూసి, తలయందు దళకళలు తళతళా యనగ, తన కాంతి దళదిశల ధవళంబు పట్ట, చెండికేశ్వరుడపుడు చెయ్యెత్తి పొగడ, రమణ భృంగీ తండురిటినందితోడ, ప్రౌఢి రమ్మని కొంత భక్తవత్సలుడు, భరతవిద్యలు చూప పణతులు పాడ, నిలువక దబ్బున ఈశ్వరుండాయె'ను. గౌడదంపతు లాతని నర్చించిరి. ఈశ్వరుడు సురాభాండేశ్వరుడయ్యెను. భక్తులను రక్షించుటకు

శివు డిటువంటి కృత్యములు చేసినటుల నెన్నియో కథలు శైవవాఙ్మయమున గలవు. 'మిండ జంగము కథలో' శివుడిట్టి పనులే చేసెను. జంగమార్చనము పవిత్రకార్యమనియు జంగమప్రాశస్త్యమును దెలుపు కథలందీ సురాభాండేశ్వర మొకటి. ఈ గేయము 'స్త్రీల పాట'లను సంకలనమున కథ సమగ్రముగా తెలియరానంతటి యచ్చు తప్పులతో నున్నది. నా చెంతనున్న రెండుప్రతు లిట్టివే. శ్రీహరి ఆదిశేషువుగారు కూడ ఈ కథనుగూర్చి వ్రాసియున్నారు. వారు సవరించుకొన్న కొన్ని గేయ చరణములగూడ నే నిట ఉదాహరించితిని.

శివభక్తులం దగ్రగణ్యుడు మార్కండేయుడు. ఆతడు చిరంజీవి. బహు పురాణములందును, భారతభాగవతాదులందును మార్కండేయుని ప్రశంసలున్నవి. '*మార్కండేయుని జనన*'మను గేయము స్త్రీలయందు ప్రచారము గాంచినది. ఈ కథను సూతుడు శౌనకాదులకు వినిపించినట్లు వర్ణింపబడినది. 'మృకండు డనియేటి మునివరుడు గలడు, ప్రకటింపగా వేదపారాయణుండు, అతనికి గుణవతియగు ధర్మపత్ని, శత పద్మనాభుల శ్రీదేవి బోలు.' వారికి సంతానము లేనందున కావేరీతీరమున నున్న బిల్వవనము జేర తపమొనర్ప నిశ్చయించు కొనిరి. బిల్వవనమునందున్న చెట్లవర్ణన మిట్లున్నది.

> 'తాళహింతాల మాలూర వృక్షములు, వారక నిమ్మలును నార దబ్బలును
> తియ్యని ఖర్జూరములు దేవదారులును, వెయ్యారు విధములౌ పేరు పనసలును
> నారికేళములు పొన్నలు పోకచెట్లు, పేరైన పెలగలు పెద్ద యుసిరికలు
> కర్పూర తరువులు కదళీ తరువులును, ఒప్పారు చుండెడు విప్పమానులును
> జాజి తీగలు విరజాజి తీగలును, రాజిల్లు మల్లెమొగ్గల తీగెలూను
> పన్నీటి కాల్వలు బయలు తామరలు, యిన్నిగల కొలనులు యేపార గలవు'.

ఇట్టి వనమందు మృకండమునిదంపతులు 'ఇందుకళాధరుని ఇష్టదాయకుని'గూర్చి 'పంచాగ్నిమధ్యమున పగలెల్ల నుంద్రు, మంచులో బొరలుదురు మహితముగ ధాత్రి, జలములో నుండెదరు చలికాల మెల్ల, బలు వాన కాలాన బయట నుండెదరు, ఈ రీతినీ తపము హెచ్చుగా' చేసిరి. వారి తపమునకు మెచ్చి శివుడు ప్రత్యక్షమయ్యెను. వారు శివుని స్తోత్రము చేసి పుత్రభిక్ష వేడిరి. శివుడు మునిపత్నితో 'సామాన్యపుత్రులు చాల గావలెనా, శ్రీమించు గుణములచే నలరుచున్న, సకలవిద్యలయందు సంపూర్ణుడైన, సుదతి పదు నారేండ్ల సుతుడు గావలెనా?' యని ప్రశ్నించెను. మునిదంపతులు 'కులము

రక్షింప బద్ధులుగాని సుతులు, పదుగురు బుట్టిగా ఫలమేమి గలుగు, కలుగగా నేమి ఫలమునకు నీచమతులు, చెదపురుగు పుట్టలో జన్మించ పెన్ని' యనుకొని ఈశ్వరునితో 'హరుడ పదునారేండ్లు అయినాను చాలు, శ్రీలు డొక్కడు చాలు శీఘ్రమున నిమ్మ'ని కోరిరి. శివుడు వారి కటులే వరమిచ్చెను. మునిపత్ని గర్భము ధరించి శుభముహూర్తమున 'పూర్ణచంద్రుని బోలు పుత్రరత్నంబును' గనెను. అతనికి మార్కండేయుడని నామకరణము చేసిరి. మార్కండేయుడు శుక్లపక్షచంద్రునివలె పెరిగి పెద్దవాడై వేదవేదాంగములు పురాణములు మున్నగునవి సమగ్రముగా నేర్చెను. తల్లిదండ్రులయెడ నతిభక్తితో నుండెను. 15 సంవత్సరములు గడచిపోయెను. ఇంకొక వత్సరమున నతని యాయువు తీరిపోవునని తలిదండ్రు లొకనాడు చింతాక్రాంతులై యుండ మార్కండేయుడు వారి దరి జేరి, 'ఖిన్నులై యున్నారు కిదేమి దోచె, ఎన్నగ నెవరైన హెచ్చు బెట్టితిర, నేరిక నేమైన నేను జేసితిన, వేరేమి చేసి మిము విడిచి కుడిచితిన' అని యడిగెను. వారాతని కౌగలించి 'నాయన్న నాతండ్రి నా ముద్దులయ్య, ఏతప్పు నీవల్ల ఎరుగ మెన్నటికి, కొడుకు మాత్రుండవా గుణసముద్రుడవు, చేకొని వినుమన్న చెప్పెదము నీక'ని యాతని జన్మప్రకార మంతయు చెప్పిరి. మార్కండేయుడు తలిదండ్రుల నోదార్చి 'ముంగిటిలో ధనము మునికొంగు పసిడి' యగు శంకరుడుండ భయమేలయని తప మొనర్చి శంకరుని మెప్పించి మరణము లేకుండ 'వరము గైకొని వత్తు వగువనేమిటి కని' వారి సెలవంది బిల్వవనము చేరి 'మొదట కామక్రోధమోహాలోభములు, మదమత్సరములన్ని మది కట్టు గట్టి' ఏకాగ్రతతో శివుని పూజించుచుండెను. మార్కండేయుని ఆయుర్దాయము నిండినంతనే యముడు భటులను పంపించెను. కింకరులు వచ్చి 'ఫాలలోచనుపయి భక్తిగలవాని, పరమాత్మ మంత్రంబు పఠియించు వాని' మార్కండేయుని జూచి అతని సమీపింప తమ తరము గాదని తిరిగిపోయి యమునితో విన్నవించిరి. యముడది విని క్రోధముతో 'ఉర మప్పళించి కనుబొమ లెగరవేసి, తొందరించి మీసమ్ము వడిబెట్టుకొనుచు, కాలదండము చేత గీలించుకొనుచు, భుజగేంద్రు కైవడి బుసలు కొట్టుచును' మహిషముపై నెక్కి 'ప్రళయకాలమునాటి పావకునిరీతి' బిల్వవనము జొచ్చి మార్కండేయుని తూల నాడుచు నోత్కర్ష చేయుచు నాతనికి పాశము దగిలించి లాగుచుండగా మార్కండేయుడు శివలింగమును కౌగలించుకొని శివుని వేడుకొనెను. అప్పుడు 'ఘనమైన రవికోటితేజమ్ముతోను, కాలకంఠుడు తాను కలకల నగుచు'

ప్రత్యక్షమై యముని 'ఎడమకాలు నెత్తి యెదురొమ్ము దన్నెను'. కాలుడు నేల గూలెను. మార్కండేయునితో శివుడు 'నిన్ను జంపెడువాడు నిర్మూలమయ్యె, అన్న వెరువకుమని అభయంబు నిచ్చె'ను. యమునితో నా భక్తుల నీవంట రాదని చెప్పి పంపివేసెను. మార్కండేయునకు దీర్ఘాయు వొసంగెను. మృత్యుంజయుడై తిరిగివచ్చిన కుమారుని గాంచి తలిదండ్రులు సంతోషించిరి. దేవతలు పూలసోనలు గురిసిరి. మార్కండేయుని చరిత్రము పాడినవారికి విన్నవారికి 'కైలాసపదవిచ్చు ఘన సాంబమూర్తి, సంతోషపద మిచ్చు సాంబమూర్తెపుడూ'.

పాల్కురికి సోమనాథుని బసవపురాణమం దెందరో వీరశైవభక్తుల కథలు వర్ణింపబడినవి. వారిలో చిరుతొండడు లేదా సిరియాళు డొకడు. ఈ సిరియాళభక్తునికథ ద్రవిడకర్ణాటాంధ్రములం దెన్నియో గ్రంథములందు వర్ణింపబడినది. ఇదేకథ '*సిరియాళ (శ్రీయాళ) మహారాజు చరిత్రము-జంగంకథ*'గా '*శ్రీయాళరాజు చరిత్ర-పదము*'గా రెండు గేయములు జానపదులందు ప్రచారము గాంచినవి. ఈ కథనే గరికిపాటి తిమ్మయ్య పద్య కావ్యముగా, చిత్తూరు గంగాధరుడు ద్విపదకావ్యముగా, వాలె కోటయ్య యక్షగానముగా రచించిరి. కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగా రీభక్తునిగూర్చి ఇటుల వ్రాసినారు 'చిఱుతొండడు-సిరియాలుడు, దభ్రభక్తుడు నామాంతరములు. ఈతడు రెండవ పులకేశిని జయించి వాతాపికోటను బట్టుకొని, తన రాజున (మొదటి నరసింహవర్మ?) కొసగెను. ఈతడు సేనాధిపతి. కాంచీపుర వాస్తవ్యుడు. కీ. శ. 630 నాటివాడగును ఈతని కొడుకు సీరాలుడు, భార్య తిరువెంగాణి, దాసి చంద(న)నంగ'[1] పైన పేర్కొనబడిన రెండు గేయము లందు ముందుగా '*శ్రీయాళ మహారాజు చరిత్రము-జంగంకథ*'ను పరిశీలింతము. దీనిని రచించినది గంజి నాగదాసు; పద్మశాలికులుడు. ఈ జంగంకథలో నధిక భాగము రగడ. తక్కినది వచనము, పద్యములు, దరువులు. శ్లోకములు కవి రచనము కావు. ప్రసిద్ధశ్లోకము లిందు చొప్పింపబడినవి. ఇష్టదేవతా ప్రార్థనాదులు ముగిసిన తరువాత కథాప్రారంభ మిట్టుల జరిగినది.

శ్రీకాత్యాయని మానసలోలా శ్రితజనపరిపాలా
పాకారినుర వినుత సుశీలా భవ్యయోగలీలా

1. బసవపురాణ పీఠిక, పుట 60-61.

శ్రీకరముగ పాంచాలదేశమును శ్రీయాళ భూపతియు
వాసిగాను నారాజ్యమేలెను వైభవంబు మెరయ'.

శ్రీయాలుని భార్య దేవమణి. ఆమె,

'పున్నమ చంద్రుని మించిన మోము ఎన్నదగిన కళలు
సరసీరుహముల బోలుచున్నవి సఖియ నేత్రయుగము
పలుకులు చిలుకల గారవించును పరమసాధ్వి కెపుడు
నడకలు జూచియు హంసలు చేరెను వడిగ సరసులకును'.

ఈ దంపతులకు సంతానము లేకుండెను. సంతానమునకై వారు కాశికి పోయి విశ్వనాథునిగూర్చి తపమొనరించిరి. శివుడు ప్రత్యక్షమై వర మొసంగెను. ఆ ప్రభావమున దేవమణి గర్భము ధరయించి యొక శుభముహూర్తమున చక్కని పుత్రుని గనెను. సీరాలుడని నామకరణము చేసిరి. సీరాలుడు శుక్లపక్షచంద్రుని వలె వృద్ధి బొందుచుండెను. సిరియాళు డధికధర్మమున రాజ్యపాలనము చేయు చుండగా నొకనాడు నారదు డరుదెంచి సత్కృతుడై, 'ధర్మ మధికము గూడ దిప్పుడు ధరణీపతి కనుచు, వీని కెట్టులైనాను భంగము పూని వెదుకవలయు' ననుకొని 'పరమసాధ్వనని గౌరియు తనలో మురియుచుండు నెపుడు, శంకరుండు మహి ధార్మికుడనుచును బొంకముగా బలుకు'ను గాన 'పురహరు కడకును జేరి వేగమే పోరు వెట్టగల' నని నిశ్చయించుకొని కైలాసమునకు బోయి వారికి సిరియాళుని చరిత్రమును చెప్పెను. శివు డాతని పరీక్షించుటకై ముని వేషము ధరించి బయలుదేరి సిరియాళుని యాస్థానము జేరి సత్కృతుడై కపట క్షుద్బాధను నటించి భిక్ష సేయుమనెను. భోజనమందు నరమాంసము కావలెనని కోరెను. రాజదంపతు లిది విని 'దారము తెగిన గాలిపడగవలె తల్లడమందుచును, పెను గాడ్పులచే భూస్థలి గూలెడు భూరుహముల క్రియను' మూర్ఛనొందిరి. తరువాత తేరుకొని 'జీవహింస జేయంగ జెల్లదని చెప్పుదు రార్యులును, మనుజ మాంసము గోరుట మీకిది మర్యాదగునయ్యా' యని వేడ్కొనిరి. కపటముని తన పట్టు వీడక 'అన్యుల మాంసము నే భక్షింపను యన్యాయముగాను, నీ సంబంధుల మాంసంబును నే నిప్పుడు భక్షింతు' ననెను. శ్రీయాళుడు తన దేహ మర్పింతు నన ముని శ్రీయాళుని, రాజవైయుండి నీవు 'తెలిసితెలియకను పాపకృత్యములు పలికి బొంకితివో, నీదు మాంసము భిక్షకు తగినది కాదుర రాజేంద్రా'

యనెను. రాజపత్ని దేవమణి తన దేహమర్పించుటకు సిద్ధపడ ముని 'కాంతామణిరో నిన్ను జంపి నీకాంతు డపత్నికుడు, అవును గాన నీ మాంసము భిక్షకపవిత్రంబగు'ననెను. శ్రీయాళు డప్పుడు తన ఏకకపుత్రునిగూర్చి తెలిపి వాని మాంసము పెట్టెద ననెను. దేవమణి పుత్రునికై విలపింప శ్రీయాళుడు,

'రాకన్ మానవు హానివృద్ధులు రాజవదన వినవే
కాననమందున దాగిన తప్పున కాలకర్మములును
పోకన్ మానునె దేహ మనిత్యము పోషణ జేసినను
చింతనొందగా నేల మనకును శ్రీకంఠుండె గలడ'ని యోదార్చెను. ఇది 'రాకన్ మానవు హానివృద్ధులు మహారణ్యంబునన్ దాగినన్' అనెడు పద్యమున కనుకరణమువలె నున్నది. శ్రీయాళుడు సీరాలుని బడినుండి తోడ్తెచ్చుటకు సేవకు నంపెను. అప్పుడు సుబుద్ధియను మంత్రి శ్రీయాళున కంతటి సాహసము వలదని బోధించెను. కాని రాజు,

'మునియు కోరినరీతి జేతునని ముందుగ బల్కితిని
అనృతము లాడిన జూచి నవ్వరే అవనిలో సుజను'లని కృతనిశ్చయు డయ్యెను. సీరాలుడు బడినుండి వచ్చెను. తల్లిదండ్రు లపుడు దీనముగా విలపింప నాతడు కారణ మడిగెను. తల్లి పుత్రునికి జరిగిన దంతయు వినిపించెను. సీరాలుడు సంతోషముతో తన చావున కంగీకరించెను. ముని బాలుని మాటలు విని సంతసించి ఆతని మాంసమే కావలయునని పట్టుబట్టెను. శ్రీయాళ దంపతులు పుత్రహననదుఃఖమున జాగుసేయుకొలది ముని కోపవశుడై రాజును దూరుచుండెను. తలిదండ్రులు దుఃఖించి దుఃఖించి మనము రాయి జేసికొని పుత్రుని ఖండించి మాంసము వండి మునికి వడ్డించిరి. కపటముని వారినిగూడ పంక్తికి గూర్చుండి తనతోపాటు మాంసము భుజింపుడని శాసించెను. అప్పుడు దేవమణి,

'కన్న తనయుని మాంసము తిందురె కన్న తల్లిదండ్రి
ఎన్నిక జేసియు లోపంబులు నిటు నెన్నుచుండెద' వని వేడుకొనెను. కాని ముని వినడయ్యెను. దుఃఖమును దిగమ్రింగి యా పరమభక్తులు పుత్రమాంస భక్షణమునకుగూడ సంసిద్ధులైరి. అప్పుడు కపటమౌని వారినింకను కష్ట పెట్ట దలచి అందులో శిరోమాంసము లేదనియు అట్టి భోజనము పనికిరాదనియు సీరాలుని శిరము దెచ్చి రోటిలో వేసి త్రొక్కి తనకు వడ్డింపవలయు ననెను.

ఇంతియకాక రోట మాంసము దంచునపుడు.

'చిన్నవాడు పుట్టినదియు మొదలుగ నిన్నటి రోజునకు
వాడు నీ యింటిలో నడచిన నడవడి వేడుక లన్నియును
పాటలు బాడుచు ద్రొక్కగవలయు ముమ్మాటికి నాముందు
మరియును కంటను నీరును వదలిన మానుదు నీ భిక్ష' యని కఠోరముగా శాసించెను. తల్లిదండ్రు లాఘోరకార్యముకూడ భక్తితో చేసి మాంసము వడ్డింపగా నాతడు 'నిత్యము నలుగురు నాతో భోజన నియమంబును గలదు, ఒక్కడు దప్పిన భోజనమునకును వొప్పజాల సుమ్మి' యనెను. తాము భక్తితో నిట్టి ఘోరమునకు కడంగిరి కాని మరొకడు నరమాంస భోజనమున కెట్లు ఒడబడునని వారు దుఃఖించిరి. ఇంతియకాక ముని వారితో నపుత్రకులిండ్ల భోజనము చేయ నొల్లననెను. ఉన్న యొక్క కుమారుని చంపించి భిక్ష గైకొనననన్న కపటమునిని రాజదంపతులు బతిమాలుకొనిరి. అప్పుడు పరమ శివుడు వారి భక్తికలరి పరీక్ష చాలింపనెంచి నిజరూపముతో ప్రత్యక్షమై వరము గోరు మనెను. దేవమణి పుత్రభిక్ష గోరెను అప్పుడు పరమశివుడు,

'కాంతామణీ నీ తనయుని జూడుము కైలాసమునందు
నా కుమారుడగు గణనాథునితో నాటలాడుచుండు' నని దివ్యదృష్టి ప్రసాదించి పుత్రదర్శనము చేయించి రాకుమారుని కైలాసమునుండి రప్పించెను. తలిదండ్రులు పుత్రుని బడసి సంతోషించిరి. సీరాలుడు కొంత కాలము రాజ్యము నేలినపిమ్మట వారు ముప్వురును విమానారూఢులై కైలాసమునకు పోయిరి. ఇట్టి వీరభక్తిప్రతిపాదకములగు కథలు వీరశైవ వాఙ్మయమున లెక్కకు మిక్కిలి కలవు. ఇది జంగం కథ

రెండవది 'శ్రీయాళరాజు చరిత్ర-పదము'. శ్రీరామభక్తుడును రాజ మహేంద్రవర నివాసియునగు అప్పల నరసింహదాసు ఈపదమును శ్రీరామున కంకితముగా రచించెను. ఈకవి పూర్వులు విశాఖమండలములోని పాలకొండ పార్వతీపురములవారు. కావ్యాంతమున నీ పదము రక్తాక్షిలో (క్రీ.శ. 1924) రచింపబడినట్లున్నది క్రీ.శ. 1926లో ముద్రింపబడినది. పైన పరిశీలించిన జంగంకథ క్రీ. శ. 1907 నాటికే చెన్నపట్టణము ప. యతిరాజులు నాయుడుగారి

మొదటిదనియు పదము తరువాతిదనియు గ్రహింపనగును. రెంటికిని కొన్ని పోలిక లున్నవి. జంగంకథకన్న పదముమాత్రము కొంత సరళముగా నున్నది. పదమునందొక చిన్నిషట్టు మెక్కుడుగా నున్నది. శ్రీయాళుని వదాన్యతను చాటిచెప్పు సన్నివేశమిది. బీదబ్రాహ్మణు డొకడు యాచింపగా కోరినంత ధనము శ్రీయాళు డొసంగినట్లున్నది. తక్కిన కథయంతయు జంగంకథయందున్నదే. జంగంకథలో 'రాకన్ మానవు హానివృద్ధులు రాజవదన వినవే' యన్న చరణములకు పోలికలు 'కానున్న పనులన్ని కాక మానవుగ. అడవి యందున నున్న ఆకసంబున నున్న. తప్పునా యిది మనకు తరుణీలలామ,' యను చరణములు. ఇటువంటివే మరికొన్ని పోలికలున్నవి. నారదుడు శ్రీయాళుని జూడవచ్చినప్పుడు ద్వారపాలకు లాతని రాకను శ్రీయాళునితో చెప్పినప్పుడు కొంత హాస్యము పోషింపబడినది. ద్వారపాలకులు రాజుతో,

'ఇంచుమించుగ పిశాచంబు రూపంబు—మట్టిపూడలవంటి మరి జడలు కట్టుకొని
చేతిలో తంబురా పూపగాబూని—గారడీ వేషంబున గవనిలో నున్నాడు
అతడు నారదుడంట అవనీశనాథ' యనిరి. ద్వారపాలకులీ మాట లనుటవలన నౌచిత్యమున కంతగా భంగము వాటిల్లదు. ఈ పదము,

'రంగుగా రక్తాక్షి (1924) నామసంవత్సరము — ఆశ్వీజమాసమున
కృష్ణ పక్షములో
విజయదశమి సరికి వివరముగ ఈకథ—పరిపూర్ణమయ్యెను ప్రౌఢిమీరంగను—
అక్షయంబుగ లక్ష్మివాసరదినమందు—సొంపుగా యీ కథ సంపూర్ణమయ్యె' నట

భక్తియందును వీరవ్రతమునను చిరుతొండనికి తీసిపోనటువంటివాడు భల్లాణరాజు. భార్యనుగూడ జంగమార్పణము చేసిన వీరవ్రతాచార నిష్ఠాగరిష్ఠుడు. వైష్ణవులందలి మధురభక్తి కథలకు శైవులందీకథ దీటుగా నుండును. దీనినే జానపదులు మిండజంగముకథ యందురు. శివుడు మిండజంగముల సృజించి తానును మిండజంగమైనందున కాబోలు ఇట్టిపేరు వచ్చినది. ఈ కథనే 'రాజశేఖర చరిత్రము'గా కూచిమంచి తిమ్మకవి రచించెను. ఇంకను పలువురు కవులీ భల్లాణచరిత్రమును చేపట్టిరి. వాలేశ్వరుడు, కోకలూరి వీరన, కూచిమంచి తిమ్మకవి పద్యకావ్యములుగాను, చిత్తూరు గంగాధరుడు ద్విపదకావ్యముగాను, జిక్కన పాపయ్య, అలపాక పెద్దికవులు యక్షగానములుగను, నడిమింటి రామ

యోగికవి దండకముగను, భల్లాణచరిత్రమును చిత్రించిరి1. జానపదులకొరకు 'భల్లాణరాయకథ' జంగంకథగా కిలారి బ్రహ్మయోగియను కమ్మకులజుడు చింతలపాలెము వాస్తవ్యుడు రచించెను. దీనియం దధికభాగము జంగంకథలందు సాధారణముగానుండు రగడతోపాటు దరువులు, కందార్థములు, ఏలలు, వచనమును కలవు. నైమిశారణ్యమున సూతుడీకథను శౌనకాదులకు చెప్పినటుల వర్ణింపబడినది. సింధుకటకము కథారంగస్థలము. పెద్దాడ మల్లేశం తన బొబ్బిలి కథలో 'సివాకోళమే సింధుకటకమే బూసికి అములాయె' ననెను. ఈ సింధు కటకము కటకమా ? 1878 నాటి కట్టోజు వీరాచారి 'భల్లాణచరిత్ర-పదము'లో కూడ సింధుకటకమని కలదు.

'శ్రీకరముగ నీలోకము లోపల సింధుకటక మనెడి
పాకశాసనుని నగరికి సరియగు పురము గలదు వినుడి
కోటలు పేటలు కొత్తళంబులును నాటకశాలలునూ
చీటు లేని గోపురములు గలవటు కోటులు నేటుగనూ
ఆటకూటములు పాఠశాలలును సూటిగ గలవటులా
మేటి మేడలు మిద్దెలు గలవటు మేలిమిగా మిగులా

... ... ... ... ... ... ... ...

భువనేశ్వరములు దేవాలయములు భువికి వెలయగానూ
భవు మందిరముకు బోల్పదగిన యాశివమందిరములునూ'. ఇంకను,

దరువు: శృంగారవనములు గలవూ, అందు-లింగార్చనకు పూలు సెలవు
అంగజహరునకు సంగతిగా భక్తి, లింగాల పూజించె జంగాలకును దేవ ॥శృం॥
ఫలమూలు భరితమైయుండూ, అందు—ఫాలాక్షునకు పూజ నిండూ
వికసితంబుగ కల్పతరువులాదిగ గల్గు, ఫలవృక్షములుగల్గి లలితమై యొప్పెడి॥శృం॥
శుకపికబకకోకిలములూ, అందు-చకచకలాడు పల్వలములూ
అకలంకముగ నామ్లకపురి వెలసిన-సకలేశ్వరునకు శ్రీకరమై యొప్పిన మేల్॥శృం॥

ఆపురమందలి చాతుర్వర్ణ్యములవారును, వేశ్యలు, చతురంగబలములు కావ్యములందువలె వర్ణింపబడినారు. వీరందరును,

'జంగమార్చనలు చేయుచునుండెడు లింగభక్తులంతా
గంగాధరునకు పూజలు చేయుచు పొంగుచు ప్రజలంతా'.

1. వీరశైవ వాఙ్మయము. శిష్టారామకృష్ణశాస్త్రి. పుట 399

ఇట్టి పట్టణమున కధీశ్వరుడు భల్లాణరాజు. అతడు,

'పరోపకారుడు దానపరుడు మహాస్థిరగుణధైర్యుండూ
సుప్రచిరవైభవ మనుభవించుచును ధరణి నేలుచుండూ
సూర్యవంశవర్ధనుడు ఘనుడు రణధైర్యుడు శూరుండూ
శౌర్యపరాక్రమశీలుడు తను హరిశ్చంద్రవంశజుండూ
పురికెల్లను ప్రఖ్యాతిజెందు శివదేవరాజు సుతుడూ
సవినయముగ మరి సత్యకీర్తి జపసత్వముగలవాడూ
భసితత్రిపుండ్రములు ధరియించెటి విశద కీర్తి పరుడూ'.

భల్లాణరాజునకు భార్యలిరువురు; చల్లమదేవి మల్లికాదేవి యనువారలు. వారు పరమపతివ్రతలు. రాజొకనాడు తమ గురువు వసిష్ఠుని సేవించి 'ఎవ్వరే మడిగినగాని, నే నొవ్వక నిచ్చెద పూని, రవ్వనొందక భీతి జెందనివ్వకను న న్నవ్వల బ్రోవవె చివ్వన శీఘ్రమె' అనియు, నట్టి కఠోరవ్రతధారణకై దీక్షాభూతిని యాచించెను. వసిష్ఠు డట్టివ్రతము కష్టమనియు వలదనియు నుపదేశించెను. అట్టివ్రతము పూనినచో,

'కడుపున బుట్టిన కన్యకనైనను జడియక నడిగెదరూ
కడువడి కండలు గుండెలు కండ్లును కానుక లడిగెదరూ
మెల్లగాను యిల్లాలినినైనా చల్లగ నడిగెదరూ' కనుక వలదనెను. కాని భల్లాణుడు తన పట్టు వీడడయ్యెను. వసిష్ఠుడాతని కటులే దీక్షనొసంగెను. (ఇచ్చట వెన్నెలరేయి, చంద్రోదయము, రాజుగారి రతికేళి, సూర్యోదయము, కావ్యరీతిని వర్ణింపబడినవి.) రాజు నిండుసభలో తన వ్రతమును చాటి,

'అడుగబోయిన జంగమునకు నే పెడుదును ఒక వట్టు
అడిగిన లేదని నుడివితినైనను నాకగు ఆ పట్టు
ఇష్టముగా యీవిధమున చాటుడి అష్టదిక్కులందూ
కట్టుడి పట్నము మొగసాలను వొక ఘంట వేగ ముందూ' అని శాసించెను. మంత్రులటులే చాటించిరి. ఇది విని జంగము లందరు ఒకరినొకరు,

'విడువని వీరశైవము గలిగిన జడముని బసవయ్యా
నడువుడి ఎడిగా తడవేలను ఇక పిడిఘట చిక్కయ్యా
పురహరు మనువక పూజలు చేసే పర్వతనాథయ్యా

గరళకంఠపుని స్మరణ జేసెడి చరలింగదేవయ్యా
గంట దీసుకొని గ్రక్కున చెమ్మెటు ఘంటా శరణయ్యా
సిద్ధలింగమా బుద్ధవీరయా ముద్దులవీరయ్యా
నాథసుందరం బోధనందయా మేధామరిశయ్యా
వేదములో ప్రసిద్ధి కెక్కినా మేఘశ్వేతగిరీ' అని పిలుచుకొనుచు బయలుదేరిరి.

వారు కోరిన కోరికలన్నియు భల్లాణరాజు తీర్చి పంపెను. ఇట్లుండ ఒకనాడు భల్లాణరాజు సభకు నారదుడు వచ్చి సత్కృతుడై పోయి కైలాసమున పార్వతితో చెప్పెను. పార్వతి శివభక్తుని దీక్ష కాశ్చర్యపడి శివునితో చెప్పెను. పరమశివుడు భల్లాణుని పరీక్షింపగోరి సింధుకటకము చేరుకొనెను. పురకాంత లుండెడు వీథి కేగి ఒక్కొక్క యింట నొక్కొక్క పెట్టుని (జంగమును) ఏర్పరచి కావలసిన ధనము లొసగి తానొక జగన్మోహనాకారుడయ్యెను. శివుని జంగమవేషము చక్కగా వర్ణింపబడినది.

జంపె: కురులు నున్నగ దువ్వి విరులు శిరమున దాల్చి, పురహరుడు చేరె నరపతికొలువునకును
సిగను తాయెత్తులను మొగలి పువ్వుల దాల్చి, పొగచపువ్వులదండ పొందమరగను
వక్కలాకులసంచి వలెవాటు సేటుగా - చక్కగా చుక్కబొట్టమరంగ దీర్చెన్
అందెలను చిరుగజ్జె పసిడిపావాలును - నందివాహనుడు చెన్నొందంగ ధరియించెన్
నీలాల పోగులను వాలారి గోళ్లను - మొలనొక్క కత్తియును చెలువమున దాల్చెన్

ఇట్టి వేషముతో వచ్చెడు జంగమును చూచి పౌరకాంతలు,

'అమ్మలారా అక్కలారా ఓమ్మా ఎరే మనవాడని, కొమ్మరో ఈకోమలాంగుని
ఓఓ చెలియలారా - బ్రహ్మదేవు డెటులజేసెనే' యనుచు నేలలు పాడిరి.

'అక్కలార ఈచక్కని పురుషుని మక్కువ గనుగొనరే
చక్కదనంబును మిక్కుటమై మన దిక్కుకు దోచినదే
మొగతనమున యిటువంటి పురుషుడీ జగమునందు గలడే
వగమీరగ వలెవాటు సేటు మొగ మొగలు గుల్కువాడే
చందమామను మించు మోము పసందు గల్గువాడే
కందర్పుని మేనందము మించిన సుందరమగువాడే' యని మరులుకొనిరి.

మిండజంగము పురవీథిని జనుచుండగా మరికొందరు స్త్రీలాతని జూచి,

'మారుడేమొ ఈ శూరుడు జారుడు పేరే ఎవడనుచూ
మారుడైతె ఈ వయసి చేతిలో చెఱుకువిల్లు యేదీ
ఇంతులార ఇత డింద్రుడేమొ మేనంతయు చూడండీ
కాంతలార యిత డింద్రుడైతె వెయికండ్ల కాంతులేవీ' యని భ్రమల పాలైరి.

ఇట్లు బయలుదేరి మాయాజంగము భల్లాణరాజు కొలువుకూటమునకు చేరు కొనెను. అచటనున్న మంత్రులతో,

'జారుడుగా చరియించకపోతె ధారుణి ఘనమేమి
ఇంద్రియముల నిగ్రహమందజేయుటే ఇంద్రచంద్ర పదవి
పుత్రవీర్యమది బుద్ధి గలుగుటే భద్రమైన పదవి
కామిగాక మోక్షకామి గాడు యిది న్యాయమె నెవ్వడైనా' యని వాదించెను

భోజనమునకై భల్లాణరాజాతని నిమంత్రణముసేయ నాతడు,

అన్నముపై మా కాశ లేదు నా చిన్నమనవి వినుమూ
వెన్నెలతేటకు మించిన మంచిది కన్నియ గావలయూ
మంజులభాష సమంచిత రంజిత కంజపత్రనేత్రా
*లంజ లేంది వెయి లంచ మిచ్చినను గంజిబోదు నాక*'ని సమాధాన మిచ్చెను. రాజాకోరిక వలదనెను కాని లాభము లేదయ్యెను. పెండ్లి చేతునన్నను వినడయ్యెను. ఇంతటితో నూరకొనక తనకు కావలసిన లంజియ కుండవలసిన లక్షణము లన్నియు చెప్పెను. పద్మినీజాతిస్త్రీ కావలెనని కోరెను. రాజుగారు చివరకు అంగీకరించి సర్వలక్షణలక్షితయగు స్త్రీకై వేశ్యావాటికకు భటుల నంపెను. కాని శివమాహాత్మ్యంబున ప్రతివేశ్యయింట నాపూట నొక పురుషు డుండెను. ఒక్కతెయైనను అనాడూరకలేకుండెను. వారు తిరిగివచ్చి రాజుగారితో మనవిచేసిరి. రాజది నమ్మక మారువేషముతో తానే వేశ్యావాటికకు పోయి చూచి నిష్ఫలముగా తిరిగివచ్చెను. (ఇచ్చట జారకాంతలు వారి లక్షణములు విటులతో జగడమాడుమాటలు మున్నగునవి విపులముగా వర్ణింపబడినవి.) తన ప్రతిజ్ఞకు భంగము వాటిల్లునని భల్లాణుడు జంగమునకు తనభార్య నర్పింప నిశ్చయించుకొని భార్యలకీవార్త నెరింగించెను. పతియాజ్ఞ శిరసావహించుటకు నేననిన నేనని యా పరమపతివ్రతలు సిద్ధపడిరి. కాని చివరకు పెద్దదగు పట్టపుదేవి బయలుదేరెను. పౌరు లిది విని తమలో తాము గుసగుసలుపోయిరి. రాజామెను తోడ్కొని జంగమును సమీపింపగా నాలస్యమైనందుకు 'కన్నియకోసము నిన్ను నమ్ముకొని *చూచి,కొన్నాలు మూడాయె కాకమెండాయెనో శౌర్యధైర్యా*'యని నిరాకరించెను. రాజాతని బతిమాలి యొడబరచెను. జంగము రాజుగారి శయ్యాగృహముననే నిదురింతుననెను. రాజటులే యని యంగీకరించెను. చల్లమాదేవి తన శయ్యా గృహమున జంగము నర్చించి పాదము లొత్తెను.

'నీలకంఠు డా నెలతను కనుగొని కలగక చిత్తమునా
ఫాలలోచనుడు పవ్వళించె నటు పలుకు లేమిలేకా
తల్లి పక్కలో తనయుని తీరుగ మెల్లగ పవళించే'

జంగము నిద్రించుట జూచి చల్లమాదేవి తానే పలుకరించెను. జంగమామె మాటలు విననట్లూరకుండెను. చల్లమాదేవి పతియాజ్ఞను పాలింపదలంచి జంగము కోరిన లక్షణములుగల స్త్రీవలె చొరవచేసికొని,

'మిండజంగమా మరుడు శరంబుల మెండు వేయసాగె
మృదంగమని చెయి ముందెయ్యక మునుపే గిరిత వెయ్యరాదు
లేచి పెగ చెయి జాచి నన్ను మేల్జూచి బ్రోవవయ్యా
రాచకార్యమా యోచనచేయను తోచక లేవయ్యా' యని ఎన్నియో విధముల బతిమాలెను కాని 'చలిదికూటిపై వెన్నచందమున నిలిచెను ఆవిటుడు'. చల్లమాదేవి మరల నొకమారు బతిమాలి తానే చేయిజాచెను. అంతలో,

'ఫాలలోచనుడు బాలుండగుచును వాలలాడుచూను
నెలబాలుండై కిలకిలమని యా పొలతికి గనుపించే'. చల్లమాదేవికి సంతోషాశ్చర్యములు కలిగెను. బయటనున్న భర్త కీబాలుని రోదనము వినవచ్చి అతడును ఆశ్చర్యపడెను. లోనికి వచ్చి పరమశివుడని తెలిసి ఎత్తుకొని దంపతు లిరువురును కొనియాడిరి. పార్వతీశివులు ప్రమథగణములతో ప్రత్యక్షమైరి. రాజదంపతులు వారిని స్తోత్రమొనర్చిరి. శివుడా రాజును భార్యాయుక్తముగా కైలాసమునకు దోడ్కొనిపోయి ప్రమథగణమునకు ప్రభువుగా పట్టము గట్టెను.

శైవులకు శివునితోపాటు శివాంశసంభూతులుకూడ ఆరాధ్యదైవతములు. శివుని కుమారులం దొకడగు విఘ్నేశ్వరుడు సాధారణముగా నందరిచే పూజింపబడును. తొలుత నవిఘ్నమస్తనక నేపనియు సాగదుకదా! తారకాసుర సంహారార్థమై సకలదేవతాప్రార్థనమున శివుడు తన యంశమునే కుమారుగా ప్రభవింపజేసెను. పార్వతీపరమేశ్వరుల తొలిచూలు కుమారస్వామి. ఆతనినే షణ్ముఖుడనియు సుబ్రహ్మణ్యేశ్వరుడనియు శైవులు పూజింతురు. సుబ్రహ్మణ్యేశ్వర భక్తు లాంధ్రదేశమునకన్న నరవదేశమునం దధికముగా గలరు. సుబ్రహ్మణ్య నామవ్యక్తు లరవదేశమున పెక్కురు. సుబ్రహ్మణ్యేశ్వరాలయములుకూడ నంతియ. తెలుగువారిలో కూడ సుబ్బారావు, సుబ్బయ్య, కుమారయ్య, నామము లిట్టివే. కాని తమిళదేశమున సుబ్రహ్మణ్యభక్తుల సంఖ్య బహుళము. చిరతని

(తిరుత్తణి) సుబ్రహ్మణ్యస్వామి తెప్పతిరుణాళ్ళను వస్తువుగా గ్రహించి 'తెప్పోత్సవ ఓడపాట'గా పెదుగుమి పురవాసుడగు రావూరి వెంకటసుబ్బయ్య రచించెను. ఆడినక్షత్రమున క్షణకాద్రిపై వెలసియున్న సుబ్రహ్మణ్యస్వామిని దర్శించుటకు తైర్థికులు మహాసంరంభముతో బయలుదేరుదురు. ఈపాట యంతయు నొకచక్కని దృశ్యవర్ణనము. తైర్థికులు వెంకటగిరినగరమునుండి బయలుదేరి నంది కాలువగట్టున స్నానసంధ్యలు ముగించుకొని, దేవాలయమున సమారాధనలు గావించుకొని, మద్రాసునుండి రాయపురము చేరి రైలెక్కి తిన్నసూరు, పెద్దకుప్పము, కడమత్తూరు, చిన్నముపేట మీదుగా అరక్కోణం చేరుకొని బండ్లపై చిరతని చేరుకొని పుష్కరిణిలో స్నానములు చేసి యలంక రించుకొని కొండనెక్కి స్వామిని సేవించుకొని స్వామి తెప్పోత్సవమువెంట వీధివీధుల తిరుగుట, తెప్ప చూడవచ్చిన బ్రాహ్మణులు, వైశ్యులు, శూద్రులు, వైష్ణవులు (అరవమున) మాధ్వులు (కన్నడమున) మాటలాడుకొనుట, జన సమ్మర్దమున దొంగల యల్లరులు, తెప్ప మూడుచుట్లు తిరుగ స్వామి మరల కొండనెక్కుట లాటగాగల దృశ్యము లతిమనోహరముగా వర్ణింపబడినవి. తెప్ప చూడవచ్చిన బ్రాహ్మణు లిట్లు మాటలాడుకొనిరి.

ఎప్పుడొస్తిరి మీరు కుప్పాపధాన్లు. ఇప్పుడే వస్తిమి యీ పరుషనికి
వాలయ్య కోటయ్య బాగ వున్నారా, చాలగా నందరు చక్కనున్నారు
సుఖమె మనవారెల్ల సూరయ్యగారు,
వరిపంట లేపాటి వర్షమేపాటి, కరువుపో యీసారి నిరుడె మేలాను
పిల్లేది మీచిన్న పిల్లవాడేడీ. తల్లిదగ్గర చన్నుదాగు వాడిదిగో
ఆదెమ్మ మీరాక ఆశ్చర్యమిపుడు, యీదేవుని జూడ ఇట ప్రాప్తి నేడు
పెన్నమ్మ మీకోడ లెన్నేండ్లదమ్మా, మున్నేండ్లు చెప్పనే యీసిగ్గుదాట్లు,
యేడుతో పద్దెనిమి దేండ్లాయెనమ్మా
చిన్నవాడికి పెండ్లి చేయలేదటవే, కన్య యెక్కడ కుదరగాలెదు పోవే
బిడ్డ లెందరోయి పేరయ్య నీకు, అడ్డి తీరగలేదు మాయాడ దికను'.

వైష్ణవుల సంభాషణ మరవములో సాగినది.

ఎప్పోవో దేవరీ రేశుందరుళి నీరుం-యిప్పొదా నడియేనుం యిదె వందేన్ పారుం
వరదయ్యంగారె నీర్ వందదెన్నిపొ-పెరుమాళ్ శేవైక్కి ప్రీతియాయ్ వందేన్

ఇక మాధ్వుల ప్రసంగము గమనింపుడు.

'దావాగబందిరో తమ్మణ్ణార్రె-యీవాగ బందవే యీగ తెప్పక్కె
తుంబిదినవాయిత్తు నిమ్మ దర్శనవు—తంబిగె నీపెల్లి తక్కొండుబంది
స్నానెల్లి మాడిదిరి శామణ్ణాచార్రె—నానాగి బందుకేళిదనె నిమ్మల్లి
పత్రావళి గళాకి బడిశి నాటక్కె-తె—సత్రక్కె హోదరె క్షణదల్లి యీగ
బహళ హోళిగె తుప్ప పాయస యథేచ్ఛ-సహజమండిగె ఫేణి క్షణదల్లి బడిశి'

ఇందరి సంభాషణము లొకయెత్తు **శూద్రుల** సంభాషణము లొకయెత్తుగా నున్నవి.

'లచ్చమ్మ నేడాడి నక్షత్రమంట-లచ్చనంబుగ సామి వచ్చేది సూపే
పెదపాప చినపాప పెద్దక్క తిమ్మక్క-వదిలి వచ్చిరి గొల్లకనికి మూర్ద్రి
యీడిగె పెదపోలు యీరమ్మబుచ్చి-వాడు? వచ్చిరే కూడొంటి యిపుడు
అందరు పైనమై నండేటిలోన—ముందుగా మునిగొచ్చి ఎందు వున్నారొ
తెప్పున పోయి పండి తిరు(వ)ళక్కు వేసి—యిప్పు డొత్తామె మన మీతెప్ప సూడ
లచ్చి సూడే పఱను లచ్చోపలచ్చి లచ్చకోపేమి యింకెచ్చుగా నుండు
సూటిగా లెక్కెసి సూసితీ యిపుడు—యేటిమీదను నూటయెబ్బై పొలిందు
యినికెయ్య పస రాల దీచోద్యమేమే - వనిగూబలతొ గూడ పైనుండుగాని
ఒగు యేడికిది సూడె బాగ యీతెప్ప - దిగువ పారాళాన దిగి యుంటదేమొ
ఆదిదబ్బరె తెప్ప కదల దది సూడు - యిరనీల తేలవా దీయింత లేమొ
మునుగునో పొల్లునో మోస మొచ్చేనో - లారె ఒస్నోచేడ తప్పెనో సూడే
భోగమమ్మగాండ్లు బాగ యాడేరే -
సంత యాకును వక్క సూడె చెన్నెంగి - యింత కానుకు దీసి యింకుండునంటే
బొరుగులు తమ్మేడు వొళ్లా యేసోక్కని-కొంటుకుతూ సూదామె కూకుండుకోసి'

జానపదుల భాషను సంపూర్ణముగా నాకళించుకొనినా డీకవివరుడు. ఉత్సవ సమ్మర్దమున దొంగలు తమ కైంకర్యము తాము చేయుచుండిరి. లోకములో నంద రొకతీరుగా నుండరుకదా. హరికథ వినుటకు వచ్చెడు భక్తులు వేరు. అచ్చటి పాదరక్ష లపహరించుటకు వచ్చెడు భక్తులు వేరు.

'కుప్పావధాన్లది గుండుచెంబొకటి - యిప్పుడు దొంగలు యెత్తుకేగిరట
మనపెద్దిభట్లవి మడువు దోవతులు - మడిసంచితో కూడ మరి దాచికొనిరె'
'నాగయ్య చౌకట్లు పోగులా జోళ్లు, పోగొట్టుకొని యీణ్ణె పొర్లుచున్నాడు
రామయ్య చేనున్న సామాను మూట, యామరించీ దొంగ లెత్తుకొనిపోయిరే
శేషమ్మ పెద గోదుంపూసలూ యిపుడు, మోసగించీ యెవరొ తీసుక పోయిరే
అత్త చెవిమన్న కత్తిరిబావి లొకటి, కత్తిరించీ దొంగ లెత్తుకొనిపోయిరే
ముచ్చులు వేరెవరు వచ్చియున్నారా, యిచ్చటి స్థానికు లింక యెవరమ్మా
వంట చేసినచోట వక మూట యిపుడు, యింటివా రెత్తుకొని యిచట లేదనిరీ',

ఇట్టి సహజములగు భావములు మనకు నిజముగా నాయుత్సవమును కన్నులకు గట్టించునటుల వర్ణింపబడినవి.

తెలంగాణమున సుప్రసిద్ధశైవక్షేత్రము లెన్నియో కలవు. వేములవాడ, పాల్కురికి, కొలనుపాకవంటివి చారిత్రకప్రసిద్ధి గాంచినవి ఇవిగాకను ఐలోని, కొమురెల్లివంటి జానపదశైవక్షేత్రములు లెక్కకు మిక్కిలి కలవు. వీనిని జానపద శైవక్షేత్రములని యేల యంటిననగా నిచ్చోటులయందు గూడెడు తైర్థికు లధికముగా జానపదులే. ప్రత్యేకముగా కొమిరెల్లి శైవక్షేత్రమునందు గొల్లలు, కురుమలు తక్కినవారికంటె బహుళసంఖ్యలో చేరుకొందురు కొమిరెల్లి మల్లన్న మల్లేశ్వరస్వామి, తెలంగాణమందలి గొల్లకురుమ లందరికి నిలువేల్పు. ఈ 'కొమిరెల్లి మల్లన్న కథ'ను గొల్లలు, బీరన్నలవలె, కాటమరాజు కథవలెనే చెప్పుచు పొట్టవోసికొందురు. కొమిరెల్లిమల్లన్న కథను చేపట్టి వ్రాసినది చెర్విరాల భాగయ్య యను వైశ్యకవివరుడు. కొమిరెల్లిమల్లన్న కథను తెలంగాణమున నెరుగని జానపదు డుండడు. ఇంతియకాక యీ కథ నృశాస్త్రవేత్తల దృష్టికిగూడ వచ్చినది. హైదరాబాదు రాష్ట్రమందున్న జాతులగూర్చి పరిశోధన మొనర్చిన సయ్యదు సిరాజుల్హాసను అను విమర్శకుడు కురుమవారిని గూర్చి వ్రాయుచు నీ కథను తన గ్రంథమున పేర్కొనెను[1]. భాగయ్యగారు శ్రీశైలమల్లికార్జున స్వామియే కొమిరెల్లిమల్లన్న యనిరి.

'కలియుగ కైలాసమనెడు, కొమరవెల్లిభూమునందైన
శ్రీకరంబైయొప్పునట్టి, శ్రీశైలమునందైన
భ్రమరాంబాహృదయములోలు పరగు మల్లికార్జునుని
కథను చెప్పబూనినాడ, కొంతతోడ వినుడీ మీరు'.

కొల్లాపురి పట్టణమును ఆదిరెడ్డియను నాతడు పాలించుచుండెను.
ఆతడు 'రూపమందు మన్మథుడు-ఓపికందు ధర్మరాజు
ధైర్యమందు భీముడయ్యె-శౌర్యమందు అర్జునుడు
విద్యలందు బృహస్పతి-వైభవమందు యింద్రుడయ్యె
దానమందు కర్ణుడయ్యె-ధర్మమెపుడు తప్పనివాడు'. ఆదిరెడ్డికి తగిన భార్య నీలమ; పరమపతివ్రత; సద్గుణరాశి. ఆదంపతుల కార్గురు కుమారులు కలిగిరి. సకలసంపదల తులతూగుచు ఆదిరెడ్డిదంపతులు 'పుణ్యవంతులనగ నొప్పి భూమి

1. The castes and tribes of H.E.H. The Nizam Dominions.

నేలుచుండిరయ్య'. ఇట్లుండ కైలాసమం దొకనాడీ దంపతుల కథ విని వారి పరీక్షింపగోరి జంగమవేషముతో ఈశ్వరుడు వేళగానివేళ ఆదిరెడ్డి వాకిట నిలి భిక్షమడిగెను. ద్వారపాలకులవలన నీవార్త విని ఆదిరెడ్డి 'వేళగానివేళ నేడు వృద్ధజంగ మెందుకొచ్చె, నేడు తిరిగి పొమ్మనియు-రేపు మళ్లిరమ్మనుమి' యని చెప్పిపుచ్చెను. కాని మాయాజంగము పోక కేవలము 'పిడికెడు తనచేత నాకు భిక్షమిడు మటంచు దెల్పు'మని మరల వార్తనంపెను. ఆదిరెడ్డి కుపితుడై 'వెనుక ముందు జూడకుండ మెడబట్టి నెట్టివేయు'డని ఆజ్ఞాపించెను. మాయాజంగమ రెడ్డిని కష్టపెట్టదలంచి ధైర్యపీరుడు, శౌర్యవీరుడను రాజులను సకలసేన సమూహములతో కొల్లాపురపై దండువెడల బంపెను. ఆదిరెడ్డి వారి నెదిరింప జాలక 'ప్రాణములతో బ్రతికియున్న-బలుసుగూర దినియునైన బ్రదుకవచ్చు'నని భార్యాపుత్రాదులతో ఘోరారణ్యంబుల బడి పారిపోయెను. శివుడరణ్యమున పెను గాలివానలు కార్చిచ్చులు కల్పించెను. వారెటులో తప్పించుకొని 'పూర్వము బసవేశ్వరు డేలు పుణ్యభూమి' యగునట్టి కల్యాణపురము చేరుకొనిరి. కల్యాణము నప్పుడు కలగంగరాజు పాలించుచుండెను. కల్యాణపురము శివభక్తుల కాస్పదము.

'ఆగ్రామవాసులెల్ల అభవుని సద్భక్తి పెంచె
పురుషుల పేర్లన్నియూను పురహరుని నామమూలె
స్త్రీల పేర్లన్నియూను శ్రీకంఠుని నామమూలె
యే పురుషుని జూచినను యే స్త్రీని జూచినను
నుదుటను వీభూతిరేఖ యెదలో రుద్రాక్ష పేర్లు
మెడలో లింగపుకాయలు మిగుల సత్యభాషణములు
శూలిభక్తి లేనివారు శోధించిన దొరకబోరు'. అట్టి పట్టణమునకు ఆదిరెడ్డి కుటుంబము చేరినంతనే పౌరులు,

'అంగమందు భక్తితో లింగము ధరియించనట్టి
దుర్మార్గులు మీరలెవరో తొలగిపొం డటంచు' బల్కిరి. వారు పట్టణమును విడిచి బయటికి వచ్చిరి. కూలికి పోవ నొకకాపు,

'యిక్కడి మర్యాదలను ఎరుగకుండ వస్తిరేల
మిమ్ముల జూడంగరాదు మీతో మాటలాడరాదు
అంగమందు మీరలకు లింగధారణంబు లేద'ని పల్కెను. గ్రామబహిష్కృతులై ఆదిరెడ్డికుటుంబమువా రూరిబయట నొక గుడిసెలో నివసించుచు తమకు గలిగిన విపత్తుకు దుఃఖించుచు ఈశ్వరుని ధ్యానించుచుండిరి. పరమేశ్వరుడు

'ఇంక వీన్ని పరీక్షించి సంకటముల బాపెదనని, జంగమయ్య వేషమూని సరగున నట కేగుదెంచి' భిక్షమడిగెను. నీలమ అతిభక్తితో తన చెంతనున్న తప్పుడు నూకలు జంగమదేవరకు భిక్ష చేసెను. పరమేశ్వరుడు, 'భక్తి గలిగినట్టి భిక్ష పట్టెడైన జాలునంచు' స్వీకరించి గుణవంతుడగు కొడుకు గల్గునని వర మిచ్చెను. సంతానమేల సంపదల నిమ్మని నీలమ కోరెను. కాని పరమేశ్వరుడు సంతానముతోపాటు సంపదలు గల్గునని చెప్పి విభూతి నొసగి పోయెను. కుమారునకు మల్లన్నయని పేరుబెట్టుమనెను. పరమేశ్వరుని యనుగ్రహమున నీలమకు కొంతకాలమునకు పుత్రు డుదయించెను. మల్లన్నయని పేరు బెట్టిరి. మల్లన్న శుక్లపక్షచంద్రునివలె పెరిగి పెద్దవాడై సకలసద్గుణ విద్యాసంపన్ను డయ్యెను. ఒకనాడు కల్యాణాధీశ్వరుడగు కలగంగరాజు మల్లన్నను చూచి ఆకృష్టుడై సంగన్నద్వారమున నతని రావించి వాని వర్తమానమంతయు విని కొల్లాపురి రాజ్యము మరల వానికి పిచ్చెని స్థైర్యాపుచేసి సంగన్న నిచ్చి కొల్లాపురమంపి మల్లన్నకు కొల్లాపుర పట్టణము పట్టము గట్టించెను సంగన్న పెద్దవారి నార్థురిని వ్యవసాయమునకై నియోగించెను. మల్లన్నచే రాజ్యము చేయించుచుండెను. ఆదిరెడ్డికుటుంబమువారు మనుమటికన్న సుఖముగా కాలము గడపుచుండిరి. దేవగిరినేలు కటాల్ రెడ్డి కూతురు పద్మాక్షి: అందచందముల పుట్టిల్లు. మల్లన్నకు పద్మాక్షితో వివాహ మగుటకు కొంత ధనలోపము కలిగెను. మల్లన్న సంగన్నతో నాలోచించి అట్టిధనమును కల్యాణపురిపు కలగంగరాజుకడ సంపాదింపబోయెను. ధనాగారమున కావలియున్న మైసమ్మను దివ్యాస్త్రములచే సాధించి ధనముగొని వివాహము చేసికొనెను. కొంతకాల మిట్లు జరిగిన తరువాత పద్మాక్షి తోడికోడండ్రగు వన్నెలక్కమ్మ, ఉత్తరమ్మ, సుజనమ్మ, మాణిక్యమ్మ విమలమ్మ యనువారలు ఈర్ష్యాళువులైరి. వన్నెలక్కమ్మ చెల్లెండ్రతో,

'మన భర్తలు పెద్దవారు మల్లేశుడు చిన్నవాడు
పెద్దవారు కృషిచేయుట చిన్నవాడు భువి నేలుట
పద్మాక్షికి దాసీలమై పడియుండెగవలసె మనమని వుర నెక్కించి
'శక్తిచేత మల్లేశుని చెడగొట్టలేము మనము
యుక్తిచేత కార్యములు ఒనగూడుట నిజము సుమ్మని ప్రబోధమొనరించి
'మల్లేశుని ఈనాడె మనవద్దకు పిలిపించియు
చేనినిండ నొకటి మనము వానిమీద మోపుదా'మని నిశ్చయించెను.
తరుణముచూచి వన్నెలక్కమ్మ సారంగధర కథయందలి చిత్రాంగిపాత్రమును

బారు క్రిములని చంపజూచెను. వాని శిష్యుడు ప్రత్యక్షమై చంపవలదనియు వానిని పోషింపుమనియు. సహాయమునకై 'భైరవుని నీవద్దకు బంపెదను' ననియు, నాయాగొర్రెల పేర్లను చెప్పి వానిని 'పలుపులు విప్పుచు నిటు లేమో చేయుటంచు-ప్రేమ మీరి నెల్లప్పుడు. కంచనాను పీని బొడ్డు కంబిష్టను సేయవచ్చు' ననియు వాని గప్పుకొన్న 'అఖిలమైనవర్ణాలకు ఆక్షేపణ నుండబోదు. దేవతలకు మెప్పునమ్మి దేహము ఆరోగ్యముండు 'నని బోధించి తిరోహితుడయ్యెను. మల్లన్న గొర్రెలను కాచుటలో భైరవుడు (కుక్క) తోడ్పడెను. అటపై నొకనాడు రత్నాంగియను కన్య బ్రాహ్మణుల బిడ్డయయ్యు యమగొండ రాక్షసిచే పెంచబడి మల్లన్నను మోహించెను. (ఈ రత్నాంగికథ కాంభోజరాజుకథయందలి రత్నాలగంధి కథవలె నున్నది) మల్లన్న యమగొండ రాక్షసిని సంహరించి శివుని దలంచెను. శివుడు రత్నాంగీమల్లన్నలకు ఉన్నిదారము కంకణము గట్టి వివాహము చేసెను. మల్లన్న తన యిల్లు చేరుకొని రత్నాంగిని పద్మాక్షికి నప్పగించి యామెతో

'పలుపులు పగలాయ పేని - పరగను పిలుచుట మంచు
ఈ గొర్రెలు రత్నాంగికి - ఇంపుగాను ఒప్పియుంచు
పట్టె కంకణంబు నీకు - పరగను వాటిల్లుచుండు
ఉన్నిదారము రత్నాంగికి - ఒప్పియుండు సుపథముగ' నని యాజ్ఞాపించెను.

కొన్నాళ్లకు మల్లన్న పుణ్యక్షేత్రములు సందర్శింపబోయెను. కంచుభేం పట్టణ మందు సిద్దప్పయను దీక్షితునికి జగదంబవరమున భ్రమరాంబికయను కూతురు జన్మించెను. ఈ భ్రమరాంబనే కొందరు మ్యాదల-మేడల-మాడల దేవియని పిలుతురు) ఆమె యొకనాడు తన యుద్యానవనమున విహరించుచుండగా మల్లన్న ఆమెను చూచి మోహించెను. (ఇచ్చట భ్రమరాంబ వర్ణనము కావ్యమార్గమున నడచినది) భ్రమరాంబ మల్లన్నను మోహించెను. (ఇచట మల్లన్న ప్రవర్తనము కూడ శిష్టుల దృష్టితో జూచిన నౌచితీవంతముగా లేదు) బ్రహ్మ ప్రత్యక్షమై మల్లన్నను భ్రమరాంబను మీరుపురు పార్వతీపరమేశ్వరు లనియు కారణజన్ము లనియు పరిచయమొనర్చి వివాహమొనర్చెను. శివకంచి పురమున కాలసేన వీరసేనులను దైత్యుల నిర్జింపుమని బ్రహ్మ మల్లన్నను కోరెను. మల్లన్న శివకంచికేగి రాక్షససంహార మొనరించి గృహోన్ముఖుడయ్యెను. మధ్యేమార్గమున మల్లన్న గొల్లపడుచగు కేతమ్మ సుద్వాహమై భ్రమరాంబ గ్రామమువ కేగెను. ఇరువురు సవతులు పోరాడుకొనగా నశరీరవాణి నాంతో మీరు గంగా

గౌరులనియు చెప్పి 'నామరూపములు వేరైనందువల్ల దెలియకుంటిం, సవతిపోరు లేక మీరు చక్కగా కలుసుండరమ్మ' యని పల్కెను మల్లన్న నారి నిరుప్పరి దోడ్కొని కొల్లాపురికేగి రత్నాంగిని పద్మాక్షిని కలిసికొనెను. కొన్నాళ్లు కొల్లా పురమున నుండి మల్లన్న భార్యలందరిని దోడ్కొని శివకంచికేగి పట్టాభిషిక్తు డయ్యెను. ఇది మల్లన్న కథ. కొమిరెల్లి స్థలమాహాత్మ్యమును జానపదకవి చెర్విరాల భాగయ్య సరళభావములతో వ్యావహారికభాషలో చక్కగా నీతిమన నడిపించెను. ఇది శివపారమ్యమును బోధించునట్టిగాథ. అనేకాద్భుతములు నమానుషవిషయము లున్నను కథాకథనము చక్కగా సాగినది.

పైన వర్ణింపబడిన గేయములన్నియు శివపారమ్యమును ప్రబోధించు నట్టివే. ఇవికాకను పెక్కుగేయములు శైవసంబంధకములు కలవు. మెకంజీ దొర సేకరించిన బసవేశ్వరుని జీవితము దాని యంతర్భాగములుగా నున్న మడివాళయ్య, మాదయ్య, కూనపాండ్యరాయుడు, కక్కయ్య మున్నగువారి కథలను శ్రీ హరి ఆదిశేషువుగారు తమ గ్రంథమున నుదాహరించియున్నారు. ఆగేయములు నాకు లభింపమి నే నుట్టంకించుటలేదు. నిజలింగ చిక్కయ్యయను శివభక్తుని గాథ యక్షగానమందు లభించుటజేసి దానిని కూడ విడిచితిని. శ్రీహరి ఆదిశేషువుగారు సారంగధరుని కథను గూడ శైవవాఙ్మయమున జేర్చిరి. నేనీ కథను కరుణరసప్రధానగాథలందు చేర్చినాను. ఇటుల శైవవాఙ్మయమనంతముగా మనకు లభించును. జానపదవాఙ్మయమునకు ప్రోత్సాహము కలిగించుటయేకాక దాని మనుగడకు కూడ కారణమైనది శైవమని మరల నొకసారి చెప్పి శైవ వాఙ్మయవిమర్శ మింతటితో విరమించుచున్నాను.

## వైష్ణవమత సంబంధములు

త్రిమూర్తులందు స్థితికారకుడు విష్ణువు. వేదములం దాతనికి బ్రహ్మ రుద్రాదులకు వలెనే ప్రాధాన్యమున్నది. ఇక దుష్టశిక్షణ మాతని వ్రతము కనుకనే అనేకావతారము లెత్తవలసివచ్చెను. భాగవత, విష్ణుపురాణాదులు విష్ణుపారమ్య ముద్ఘోషించునట్టివి. శైవమువలెనే వైష్ణవముకూడ భక్తిమతము జ్ఞానమార్గము నందువలె కాక ఈ భక్తిమార్గమున ధ్యానమునకు చిత్తైకాగ్రతకు మూర్తి యవసరము. శైవవైష్ణవభేదము లీమూర్తిభేదములనే సూచించును. శైవులు శివుని పరమదైవతముగా నారాధించిన వైష్ణవులు విష్ణువునకు పట్టము గట్టెదరు.

ఈ రెండు మతములును భరతఖండమం దంతటను చాలకాలమునుండి ప్రచారమం దున్నవి. అవైదికములగు జైనబౌద్ధముల నెదుర్కొని శంకరాచార్యులద్వైతమును ఎనిమిదవ శతాబ్దమున స్థాపించిరి. శంకరునకు పూర్వమే వైష్ణవులగు ఆళ్వారులు జైనబౌద్ధాది యవైదికమతములందున్న వర్ణవ్యవస్థారాహిత్యమును తాము నంగీకరించి వైదికమతమునకే బలము చేకూర్చిరి. 'దక్షిణ హిందూస్థానమందు భక్తిప్రధానమైన వైష్ణవమతము, శఠకోపుడు, నాథముని, పుండరీకాక్షుడు, రామమిశ్రుడు, యామునాచార్యుడు మొదలగు పరమ భాగవతోత్తములచే బోధింపబడుచుండుటచేత తక్కువజాతివా రనేకులు వైష్ణవ భక్తాగ్రేసరులై యున్నతస్థితికి వచ్చి భాగవతులచే పూజింపబడుచుండిరి. అయినను వైష్ణవమతముకూడ రామానుజు లవతరించువరకు కర్మప్రధానమైన వైదికమతమును గాని, వైరాగ్యప్రధానమైన శైవమతమునుగాని మించి విశేష వ్యాప్తిజెంది యుండలేదు.'1 బసవేశ్వరుడు మున్నగు శైవులు కులతత్వము నంగీకరింపక పోవుట మన మెరుగుదుము. దీనిని మొదట ప్రతిపాదించినది వైష్ణవులే. పన్నిద్దరాళ్వారులలో నధికులు శూద్రులే. వీరిలో ముఖ్యుడగు నమ్మాళ్వారు (ఈయనకే శఠకోపుడను నామాంతరము కలదు) తిరుమంగయాళ్వారును తిరుప్పాణాళ్వారు(హరిజనుడు)ను శూద్రులే. ఈ యాళ్వారులు రచించిన వైష్ణవ భక్తిగ్రంథము 'నాలాయిరం' అనబడును. ఇందు శ్రీకృష్ణుని యవతారలీలలు మున్నగునవి పద్యములు. నమ్మాళ్వారు రచించిన 'తిరువాయ్‌మొయ్' వైష్ణవ వాఙ్మయమున ప్రధానమై భక్తిప్రేమల నుద్బోధించు గ్రంథము. 'చండాలోఽస్తు సతు ద్విజోఽస్తు గురురిత్యేషా మనీషా మమ'2 యన్న శంకరులు దక్క తక్కిన యద్వైతులీమార్గము నవలంబింప సమర్థులు కారైరి. వైష్ణవులం దీమార్గము ననేకు లవలంబించిరి. శంకరుడు స్థాపించినది అద్వైతమతము. ఈతని తరువాత సుమారు మూడు వందలేండ్లకు 11వ శతాబ్దపు ప్రారంభమున జన్మించిన శ్రీ రామానుజాచార్యులు 'సోఽహం' 'జగన్మిథ్యా'ది యద్వైతవాదముల నెదుర్కొని విశిష్టాద్వైతమును స్థాపించిరి. విశిష్టాద్వైతబీజము లప్పటికే బోధాయన మహర్షి మరియు నాళ్వారాదులు నాటియుండిరి. సంప్రదాయజ్ఞులీ యాళ్వారులందు ప్రథముని క్రీ.పూ. 4203 నకు గొంపోవుదురు. చారిత్రకులు మాత్రమీ యాళ్వారులను క్రీ.శ. 6 నుండి 9 శతాబ్దముల మధ్యనున్నట్లు నిశ్చయించిరి. ఉభయవిధమయిన

1. ఆంధ్రుల చరిత్రము ఐదవ సంపుటము 273 పుట. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు
2. మనీషాపంచకము

ఆత్మల కైక్యమును బోధించుటవలన నీ సిద్ధాంతము విశిష్టాద్వైత మనబడినది. జీవేశ్వరుల కావయం దద్వైతమును ఒప్పుకొనుచునే మోక్షస్థితి సృష్టిస్థితి లయాదికాలికశక్తుల భేదముతో విశిష్టమైనది కనుక నిది విశిష్టాద్వైతమైనది. దీని ననుసరించి మరణానంతరమే ముక్తి లభించును. జీవన్ముక్తిలేదు. పరమాత్మ జీవాత్మల సంబంధము - పండు దాని రుచి, అగ్ని దాని దహనశక్తి, పాలు వాని తెలుపువంటి సంబంధము. అద్వైతమునందే విశిష్టతగలది కాన విశిష్టాద్వైతము[3]. దీనియందు చిత్తు, అచిత్తు, ఈశ్వరుడని తత్వములు మూడు. చిత్తు జీవస్వరూపము, జ్ఞానానందమయము. నిత్యము, శేషమునైనది. ఇది మోక్షదశయం దీశ్వర సాధర్మ్యమందును అచిత్తు ప్రకృతి, జడము, వికారాస్పదము; భగవంతునకు కేవలము క్రీడోపకరణభూతము; సంసారమునకు మూలము. ఇక నీశ్వరుడు నిత్యుడు; సకలకల్యాణగుణాకరుడు; చేతనాచేతనముల కంతర్యామి. చిదచిత్తు లతని కపృథక్సిద్ధవిశేషణములు. కారణావస్థయందును కార్యావస్థయందును క్రమముగా సూక్ష్మస్థూలావస్థల నొందెడు చిదచిత్తులచే నీశ్వరుడు విశిష్టుడై యుండును. ఈ యుభయవిధపరమాత్మైక్యమే విశిష్టాద్వైతము. శంకరుడు బ్రహ్మము (ఈశ్వరుడు) నిర్గుణమనగా రామానుజు లాబ్రహ్మము సగుణ స్వరూపమై ప్రేమాదికల్యాణగుణయుతమైన దనిరి. రామానుజులు భారతదేశ మంతటను తిరిగి తమ మతప్రచారమొనర్చిరి. శంకర రామానుజుల మతములకు భిన్నమైన ద్వైతవాదమును స్థాపించిన మధ్వాచార్యులును, ఆయన అనుయాయులగు మాధ్వులును, భక్తివిషయమున విష్ణువునకే పట్టము గట్టిరి. పండితారాధ్యుడు పాల్కురికి సోమనాథుడు మున్నగువారు శైవమును పండితులకును పామరులకును సరిపోవునట్లుగ నందించినటులే రామానుజులు వైష్ణవమును పండితపామరు లిరువురకును గ్రాహ్యమగునట్లు బోధించిరి. ఆళ్వారులు భక్తులు. వారి శిష్యులు, పండితులగు ఆచార్యులు, వేదాంతవేత్తలు; జ్ఞానులు. వైష్ణవమున ఆళ్వారులు భక్తిసాహిత్యమునకును, ఆచార్యులు వేదాంతము విజ్ఞానములకును ప్రాతినిధ్యము వహింతురు. బసవని భక్తిమార్గమునకు పండితుడు, పాల్కురికివంటివారి వేదాంతము జతపడినట్లు పూర్వాళ్వారుల భక్తికి రామానుజాచార్యుల వేదాంత విద్య తోడ్పడినది.

సంస్కృతమందున్న ప్రస్థానత్రయభాష్యములు (బ్రహ్మసూత్రభాష్యము

---

3 విశిష్టం సత్ అద్వైతం - విశిష్టాద్వైతం

గీతాభాష్యము, ఉపనిషద్భాష్యములు) సహస్రనామభాష్యము సిద్ధిత్రయము మున్నగునవి వాదక్షమమయి పండితులను మెప్పింపగలిగినచో, భక్తిప్రపత్తి జ్ఞానవైరాగ్యాదులను బోధించు దేశభాషావాఙ్మయము ద్రవిడవేదములు, కీర్తనలు మాహాత్మ్యములు, ఆళ్వారుల చరిత్రములు, వారి రచనములు మున్నగునవి పామరుల నాకర్షించినవి. వీరశైవము ప్రబలుటకు పూర్వము శైవవైష్ణవముల కధికసంఘర్షణము జరిగినట్లు లేదు. యామునాచార్య చరిత్రము, విష్ణుచిత్తుని కథ, చోళదేశాధీశ్వరుని (రాజరాజనరేంద్రుని కుమారుడగు కులోత్తుంగ చోడ దేవుని) బాధవలన రామానుజులు శ్రీరంగమును విడిచి మైసూరుప్రాంతముల కేగుట వంటివి క్వాచిత్కముగా నగుపించును. మధ్వాచార్యుల యనంతరము వరకును ఈ మతత్రయము లధికసంఘర్షణము లేకయే భారతదేశమంతటను ప్రబలినవి. కాని 16వ శతాబ్దమునాటికి మతత్రయ శిష్యపరంపరలవారు తర్కము పెంచుకొని అన్యోన్యము కలహించుటయేకాక ఆయామతములం దాంతరంగిక భేదములుకూడ నేర్పరచిరి. శైవాభిమానులచే వైష్ణవులును, వైష్ణవాభిమానులచే శైవులును హింసింపబడిరి. వైష్ణవము చీలి 'వడగల' 'తెంగల' విభేదము లేర్పడినవి. ఇవి ప్రపత్తి సిద్ధాంతమున కలిగిన భేదమున కుదాహరణము. వీరిలో నొకరిది మర్కటకిశోరన్యాయము, మరొకరిది మార్జాలకిశోరన్యాయము. 'చాపకూడు' పెట్టించిన బ్రహ్మనాయనివంటివారు బాసట యున్నను శైవము ప్రబలినంతగా వైష్ణవము తెలుగుదేశములో తొలుత ప్రబలలేదు. ఐనను 'వీరశైవముతోనే వీరవైష్ణవముకూడ తెలుగునాట వ్యాపించినది. శ్రీకూర్మము సింహాచలములందలి శివాలయములు విష్ణ్వాలయములుగా మార్పబడినవి. మంగళగిరి, అహోబిలము, కదిరి, సింగరాయకొండ, నెల్లూరు, అంతర్వేది, ఉపమాకలలో విష్ణుదేవునికి ఆలయములు వెలసినవి. కోరుకొండకు శ్రీరంగ పరాశరభట్టు వచ్చి ముమ్మడిరెడ్డిని శిష్యునిగా జేసికొని వైష్ణవమతవ్యాపనము చేసెను (1325). ఈ ప్రచారమువల్ల వైష్ణవగాథలును, ముఖ్యముగా శ్రీకృష్ణుని చరిత్రా, మహాత్మ్యమునూ జనసామాన్యమునకు విభ్రమము కల్గించెను'[1]. రామానుజుని తనదేశమునుండి పారద్రోలిన కులోత్తుంగచోడుని మరణానంతర మాతని కుమారుడగు విక్రమచోడుడే రామానుజుని మరల తనదేశమునకు రప్పించి యాదరించెను. చోళదేశమున వైష్ణవమతవ్యాప్తి బాగుగా జరిగెను.

---

1. దేశిసారస్వతవిభూతి - శ్రీపాదగోపాలకృష్ణమూర్తి. కిన్నెర, డిసెంబరు 1953.

మొదట పాలుపోయినప్పుడు రామానుజుడు బిట్టిదేవరాయలు పరిపాలించు గంగవాడిదేశమున తన మాహాత్మ్యముజూపి జైనుడగు ఆరాజును విష్ణువర్ధనునిగా చేసి వైష్ణవమతవ్యాప్తి గావించెను. వేలూరు, తలక్కాడు, గదగు, హరడనహల్లి, తొండనూరు మేలుకోట, మున్నగుచోట్ల జైనుల నిర్మూలించి వైష్ణవధ్వజ మెత్తించెను. విజయనగరసామ్రాజ్యమునను దాని సామంత మండలములందును వైష్ణవమునకు విశేషదోహదము కలిగి బహుళవ్యాప్తి గాంచినది. వాశాచార్యులముద్ర భుజము దప్పినను వీపు దప్పదనునంత ప్రగాఢముగా వైష్ణవము వ్యాపించెను. అల్లసానివంటి నందవరీక బ్రాహ్మణుడే వైష్ణవమతాభిమాని యయ్యెను. విష్ణుచిత్తీయము, పారిజాతాపహరణమును వెలువడినవి. తరువాత మన్నారుదాసవిలాసము, విష్ణుమాయావిలాసము మొదలగునవి నాటకములుగా వచ్చినవి. పురాణములుగా, కావ్యములుగా, యక్షగానములుగా, వైష్ణవవాఙ్మయము పెరిగిపోయినది. జానపదులందుగూడ వైష్ణవప్రభావమధికమై గేయసాహిత్య మద్భుతించినది. ఇట్టిదానిలో భక్తిసారస్వతమే అధికముగా నున్నది. దీని భక్తిగేయములక్రింద చర్చింతము. ప్రస్తుతము మాత్రము విష్ణుపారమ్యమును, మాహాత్మ్యమును సూచించు గేయములను విచారింతము. వీనిలో వరదరాజు పెండ్లిపాట, ఆండాళ్ చరిత్రము - శ్రీరంగమాహాత్మ్యము, తిరుమంత్రముపాట, దశావతారములపాట, శ్రీలక్ష్మీదేవి సొగసులాట, వెంకటేశ్వరులపాట, చెంచీతకథ, సవతుల కయ్యము, ఏకాదశీమాహాత్మ్యము, రుక్మాంగదమహారాజుకథ, చిన్నమ్మకథ, వరాహావతార చరిత్రము, నూట యెనిమిది దివ్యతిరుపతులు వెంకటేశ్వరమాహాత్మ్యము, జాణవందారుపాట, రామానుజప్రభావము, శ్రీరంగప్రభావము ముఖ్యములు.

కంచి వరదరాజస్వామి వివాహగాథను గోపయగారి రామయ్య 'వరదరాజు-పెండ్లిపాట'గా రచించెను. పాటచివరన 'కోర్కెతోను లింగంపల్లి గోపయారాముపేర. కరుణ కలిగియుండె చాల కంచివరదుడూ' అని కలదు. లింగంపల్లి గ్రామనామమై యుండును గోపయ యనునది ఇంటిపేరైనను లేదా తండ్రిపేరైనను కావలెను రామయ కృతికర్త. కవి తెలంగాణమువాడని నా యూహము. బాగాలు, (పోకలు) గూడ, (పూలబుట్ట) వంటి తెలంగాణపు మాండలికప్రయోగములుంటచే తెలంగాణమువాడంటిని. కాకపోవచ్చునుకూడ. కవి కాళిదాసును ధ్యానించి వరదరాజస్వామి నిట్లు వర్ణించెను. 'పెక్కు సూర్య

మండలములు ఒక్కచోట పొడిచినట్టు-చక్కనీ వరదరాజు చాయ లెట్టివో' 'భుజాశంఖుచక్రమూలు ధగధగా మెరయగాను—పరగ రెండువేలు పరిచారులూ.' సముద్రునింట అతని కూతురు పెరుందేవి (లక్ష్మీదేవి) పెరిగి పెద్దదయ్యేను. 'తుమ్మెదా గుంపులనగ తోయజాక్షి కురులనంగ-శింగినీ విండ్లబోలు చెలియ బొమ్మలూ.' ఒకనాడు పెరుందేవి చెలులు 'పొన్నపూలు గోయుటాకు పోదమనుచు చెలులు గూడి — రాడపడుచు పిలుతమనిరి అతివలందరూ'. కాని పెరుందేవితో ఆమె తల్లి 'రాణివాసమెల్ల విడిచి రమణి తోట్లవెంట నేగ — భావ్యమా ఇది నీకు పద్మలోచనా' యని వారింపజూచెను. పెరుందేవి వినక పోరుపెట్టెను. 'తల్లిగర్భ మపుడు కరిగి తనయ నప్పు డెత్తుకోని—పూలుగోయ బోవుమాని బుజ్జగించెనూ'. తల్లియాజ్ఞ గొని పెరుందేవి అలంకరించుకొని తన చెలులతో పొన్నపూలతోటకు పోయెను. అచ్చట 'ఆరాత్రి రుద్రవీణ లతివలంత మీటగాను — తక్క గావించిరా తరుణులందరూ — సన్నపూల సురటిగాలి సఖియలంత విసరగాను-కుందరదన చేతులెత్తి గుణిసియాడెను'. విహారమునకై వచ్చిన కంచివరదు డామె నాట్యమును చూచెను. 'ఇంత చక్కదనముగలది ఇందువదన యెవ్వరనుచు' వరదరాజస్వామి తన యొడలంతయు కనులుజేసికొని చూచెను. స్వామిని చూచి ఎవరో పరపురుషుడనుకొని పెరుందేవి తన సఖులతో అభ్యంతరమున కేగెను. వారానాడచట నుండి తెల్లవారగనే స్నానములు గావించుకొని ఒక్క ప్రొద్దుండ దలచి పొన్నపూలు గోయుటకు తోటలోనికి వచ్చిరి. స్వామిమహిమచే కోయకుండనే గూడలు పూలతో నిండెను. అప్పుడు వరదరాజస్వామి 'పరుగునా చనుదెంచి భామ యెదుట నిలుచుండి - చంక చాచి బెదరించెను సఖియ లందర్నీ.' సఖులు పాఁటిపోయిరి. స్వామి పెరుందేవిని పొన్నపూల సుంక మడిగెను. ఆమె స్వామిని ధిక్కరించెను. అప్పుడతడు 'గూడ కొక్కమాడ యిచ్చి భామ చనుదెంచుమంటె - పసిడిబొమ్మ కోపమేల పణతి నీకునూ' యని కోపముడిపి నర్మవాక్యము లాడెను. సుంక మిచ్చుటకు చేత కాసులేక పెరుందేవి కోపముతో 'కోసిన పూవులన్ని కోమలి పారజల్లుకోని-పుత్తడిబొమ్మ అప్పున చిక్కుబాడెనూ—' కొంత సేపటికి సఖులు వచ్చి తమపూల నామెకిచ్చిరి. తొందరగా నందరును కలిసి స్వగృహముల కేగిరి. అందరును కలియబలుకుకొని తమ సంభ్రమమునకు కారణము రాణిగారితో 'కుంజరమ్మ అచ్చోట కొమర నెదురువచ్చె ననుచు' బొంకిరి. కాని వరదరాజుపై పెరుందేవికి

వలపు కలిగి తనతల్లితో చెప్పుకొనెను. తల్లి తన బిడ్డతో 'అంత ధనపుకొండ మనపాలికొచ్చునా' యనెను. వరదరాజస్వామి బ్రహ్మరుద్రాదుల రాపించి సముద్రునికడకు వియ్యము కూర్పబంపెను. వైశాఖ పంచమినాడు ఆకాశమంత పందిరి వేసి భూమియంత గద్దె వేసి పెండ్లిచేసిరి. 'జీలకఱ్ఱ బెల్లంబు చేడె శిరసునందు నుంచే వరదరాజు శిరమునందు వనిత వుంచెనూ, అగ్నిహోత్రుని సాక్షిగాను అతివను పరిణయంబు జేసి, అగ్నిసాక్షి ప్రమాణమ్ము వారు జేసిరి'. అపరంజి తాళిబొట్టు కట్టబడెను. అప్పగింతలయ్యెను. 'పూలు కోయబోయి విభుని పొలతి తెస్తివా' యని పెరుందేవిని హాస్యమాడిరి. అత్తవారిచ్చిన కోట్లకొలది యరణంపు ద్రవ్యముతో 'నాభి మాణిక్యమూను నాల్గుదిక్కుల మెరయగాను, పక్షివాహనంబు రూపు నెక్కి భ్రమయగా, గరుడ పచ్చల పల్లకెక్కి కామాక్షమ్మ తాను గరుడవాహనంబు యెక్కి కంచికరిగె వరదుడూ'. కంచిలో పూలపాన్పున గూర్చుండి స్వామి 'సుంకరీడుతోటి నీవు జూదమాడి ఓడితివె, అంత ధనము గెలుచుకోవె ఇందువదనా,' యని పిలిచెను. ఇద్దరును కలిసి 'పచ్చి యాకు పోకలూను పండుతెల్లనాకులూను, తాంబూలమేసిరా దంపతు లిద్దరూ'.

శ్రీ వంగీపురం వెం. రంగాచార్యులు తన తండ్రియగు మంగళాద్రి అయ్యంగారి కంకితముగా 'శ్రీఆండాళ్ చరిత్రము-శ్రీరంగమాహాత్మ్యము'ను రచించెను. 'తోహరారూపకంబైన 600 పంక్తులుగల ఈ కృతిలో భూదేవి గరుడాళ్వారులు, ఆండాళ్, పెరియాళ్వార్లుగా భూమియందు జననమొందుటయు అష్టోత్తరశతదివ్యదేశముల నాథములను పెరియాళ్వారులు తనయ కెరిగించిన సంపూర్ణమయిన శ్రీరంగమాహాత్మ్యంబును, ఆండాళ్ తిరువాయిమొయి సారాంశంబును శ్రీరంగనాయకీనాయకుల కల్యాణవిభవంబును సంపూర్ణముగా'. వ్రాయబడినవి.

గురుపరంపరాప్రభావములో చెప్పబడిన గోదాదేవి కథను సాహితీ సమరాంగణ సార్వభౌముడు ప్రబంధమున కుచితమగునట్లుగా మలచి 'ఆముక్త మాల్యద'ను రచించెను. ఈకథనే రంగాచార్యులు పాడుకొనుటకు వీలగునట్లు గేయకృతిగా మలచెను. కథారంగము శ్రీవిల్లిపుత్తూరు వర్ణన మిట్లున్నది.

'శ్రీవిల్లిపుత్తూరనియెడి నగరక్షేత్ర మొండు గలదు
భూవలయంబున పాండ్యదేశమను పుణ్యభూమియందు

నగరమేది సమమైనది దానికి జగములోన లేదు
ఖగవాహనుడగు శ్రీకరుకృపచే కరువు వచ్చుట లేదు
మాసమునకు మున్మూరు వర్షములు మానక వచ్చుట గురియున్
వాసుదేవుడు వటపత్రంబున పవ్వళించియుండగా.' శ్రీ విల్లిపుత్తూరునకు

మారుపేరు శ్రీధన్వినవ్యపురము అచ్చట శ్రీమహావిష్ణువునకు వాహనమగు గరుడుడు పెరియాళ్వారను పేరుతో జన్మించెను. అతనికే విష్ణుచిత్తుడనియు భట్టనాథుడనియు నామాంతరములు. అతడు సకలసద్గుణసంపన్నుడు; మహాభక్తుడు ప్రహ్లాదునకు సమానుడు. విష్ణుచిత్తుడు గార్హస్థ్యధర్మావలంబియై, 'కమలాక్షునకై కష్టముపడనిది కాయము గాదనుచున్' ఒక పుష్పోద్యానము పెంచి యాపూలతో పరాత్పరుని సేవించుచుండెను. ఒకనాడు 'నలవత్సరమున కర్కాటక మాసమున నమలచతుర్దశిని, పూర్వఫల్గునీ జయవారంబగు పుణ్యదినమునందు' విష్ణుచిత్తుడు తులసీదళముల గోయుచుండగా భూదేవి యచట కన్యకాకృతి నవతరించెను. దంపతు లిరువురు 'మనకు దొరికె నిధి మాధవురాణి యును జానకికరణి'నని ఆండాళనియు గోదాదేవి యనియు నామములిడి పెంచుచుండిరి. ఆమె దినదిన ప్రవర్ధమానయై

'సుగుణము లన్నియు నేకంబై యీసుదతియయ్యె ననగన్,
తగియా పెరియాళ్వారులకును ప్రియతనయ యగుచు పెరిగెన్'.

విష్ణుచిత్తుడు నిత్యము విష్ణువునకు మనోహరములగు పూలమాలలు గూర్చి

'పూలసజ్జ నిడి స్నానాదులకును బోవుచుండునపుడు
బాలిక యందలి పూలమాలికల పైకి దీసి యపుడు
తనదు శీర్షమున ముడిచి చూచుకొని తక్షణంబె వానిన్
జనకుని యాగమనము గని వెరపున సజ్జలోన నుంచున్
విష్ణుచిత్తుడీ సంగతి నెరుగక వినయముతో మాలికలన్
విష్ణుదేవునకు నర్పణచేయును విబుధులెల్ల బొగడన్'.

గోదాదేవి ఇటుల తన తలనుదాల్చు మాలికలను భగవంతు డతిప్రీతితో ధరించుచుండెడివాడు. ఇట్లుండ నొకనాడు గోదాదేవి యెప్పటియటుల వనమాలికలు తలదాల్చి యద్దమున జూచుకొనుచుండ విష్ణుచిత్తు డది గాంచి బిడ్డను మందలించి యామాలికల బారవైచి క్రొత్తవాని గూర్చి తీసికొనిపోవ 'ప్రేమమీర నవి యందుకొనడు హరి ప్రేయసి దాల్చనివగుటన్'. విష్ణుచిత్తుడది గ్రహింపలేక

చింతతో గృహమునకు తిరిగివచ్చెను. ఆనాటిరాత్రి భక్తుని చింత బాపుటకు స్వామి స్వప్నమున సాక్షాత్కరించి

'ఇటనుండి నీవు నిర్మించు మాలికల నింతి కొసగి మరి యిమ్ము
పటుతరముగ నేనాదరింతునని భట్టనాథ మది నమ్ము' మని చెప్పెను.

విష్ణుచిత్తుడు మహాసంతోషముతో కూతుం గొనియాడి

'చూడి ధరించి కొడుత్త యిచ్చిన సుందరాంగివగుటన్
చూడికొడుతయని నామం బిడెదన్ సుదతీ నీకనుచున్' అటులే చేసెను.

ఇటుల కొంతకాలము గడచెను. చూడికొడుతకు పెండ్లివయసు వచ్చెను.

'చక్కలరాయుని ధిక్కరించు నా సుందరి వదనంబు
చెక్కు లద్దములు నాగజెల్లి నెచ్చెలి నేత్రద్వయంబు
కలువరేకులను గేరుచుండె నాకలికి కంటికొనలు
నలువుగలిగి విలువలెను వంగె నళినాక్షి మేను హొయలు
కలవాణి వేణి చెలరేగి పారు యళిబృందంబులగేరు
బొలుపారన్ శ్రీకారంబన తగు పొలతి చెవులతీరు
చంపకమన తగు నాసికంబు కడు సొంపెసగుచునుండె'.

ఈవర్ణనమిటులే ప్రబంధకవుల కవిసమయములతో కడుదీర్ఘముగా సాగినది. విష్ణుచిత్తుడు కూతురునకు తగిన వరాన్వేషణమున నుండెను. అది తెలిసి చూడికొడుత తనకు హరితో వివాహము గావింపుమని తండ్రిని గోరెను. హరిని దప్ప అన్యుల వివాహమాడ ననెను. ఇంకను

'ఏయే దేశములందు ముకుందుం డేయే పేరులతోడన్
ఏయే రూపుల దాల్చియుండెనో యెరుగబలుకుమని వేడెన్. భట్టనాథుడు పరమసంతోషమున

'భరతభూమియందుండె తిరుపతులు, పదిపదులును పైనెనిమిది' యని నూటయెనిమిది దివ్యతిరుపతులను పేర్కొనెను. ఇటుల శౌరిసత్కథలను వినివిని ఆండాళు శ్రీరంగేశుని చరితము వివరముగా తెలుపుమని తండ్రిని గోరెను. విష్ణుచిత్తుడు 'చూడికొడుతకును రంగధాముపై చూడ్కులు గలవని యెంచి' శ్రీరంగమాహాత్మ్యము నభివర్ణించెను. ఇంతవరకు నాండాళ్ చరిత్రమైనది, గేయమందలి రెండవభాగమగు శ్రీరంగమాహాత్మ్యమిటనుండి యారంభమగును.

పూర్వము బ్రహ్మ పాలకడలికడ విష్ణువునుగూర్చి తపమాచరించెను. విష్ణువు ప్రసన్నుడై యాతనికి శ్రీనారాయణమంత్ర ముపదేశించెను. బ్రహ్మ యామంత్ర ముపాసించి తపమాచరింప క్షీరాబ్ధినుండి విష్ణువు సకలదేవతా పరివారముతో బయలువెడలి శ్రీరంగధాముడై దర్శనమిచ్చెను. బ్రహ్మకోరిక ప్రకారము విష్ణువు సూక్ష్మరూపముతో నేగి సత్యలోకమున నుండెను.

'ఇటులుండ భువిని నీమనువు తనయు డిక్ష్వాకుండనువాడు
ఎటులైనను శ్రీరంగధామమును ఇలకు దేవలయుననెడు
తలపుతోడ శ్రీహరినిగూర్చి ఘనతపము చేయసాగెన్'

ఇంద్రపదవి నాశించి ఇక్ష్వాకుడు తపమొనర్చుచున్నాడని ఇంద్రుడు భయపడి

'ఎందరు తుచ్ఛులు నారాజ్యంబున కెసరుపెట్టజూచి
చెందిరి మోసము అందు నొక్కడై పొందు ఫలము చైజాచి' యని యారాజర్షిని సంహరింప తన వజ్రాయుధము ప్రయోగించెను. కాని విష్ణుచక్ర మడ్డుపడి వజ్రమును దరిమెను. ఇంద్రుడు తనకు జరిగిన పరాభవము బ్రహ్మతో మొరపెట్టుకొన నాత డిక్ష్వాకుని తపఃకారణము రాజ్యతృష్ణచేగాక

'నాకడనుంగల రంగధామమును చేకొన దలంచి రేడు
శ్రీకరు కొరకై తీవ్రతపంబును చేయుచున్నవాడ'ని చెప్పి సంశయ ముడిపెను. రంగధాముడు బ్రహ్మతో

'వారిజసంభవ నీలోకంబున వాసముంటి నిన్నాళ్లు
అరిగెద భూలోకమున వసింప ధరపతికడ కొన్నాళ్లు
అటుపై వసింతు కావేరీనది యంకభాగమునను
ఇటకు కలియుగానంతర మరిగెద ఇమ్మతనికి నన్న'ని పలికెను.

బ్రహ్మ యటులే రంగధామమును ఇక్ష్వాకున కొసంగెను. ఇక్ష్వాకుడు రంగధామము నయోధ్య కభిముఖముగా తమసాసరయ్యంకముల బ్రతిష్ఠించెను. దశరథుని కాలమువర కటనే యుండెను. దశరథు డొనర్చు పుత్రకామేష్టి జూడ వచ్చిన ధర్మవర్మయను చోళరాజు రంగధామమునుగని యాశ్చర్యపడి రంగధామ వృత్తాంత మంతయు దెలిసికొని స్వదేశము వెడలి రంగధామమునకై చంద్ర పుష్కరిణి కడ తపమాచరించుచుండెను. అచ్చటి బ్రాహ్మణులు ధర్మవర్మకు, పూర్వము శ్రీహరి దాల్భ్యుని కోరికప్రకారము శ్రీ రామావతారమున కావేరి తీరమునకు వత్తునని చెప్పిన వృత్తాంతము వినిపించి యాతని తపము మాన్పించిరి.

ఇట్లుండ రావణవధానంతరము శ్రీరామపట్టాభిషేక సమయమున విభీషణుడు శ్రీరామచంద్రుని 'పావనమగు నీపదపల్లవముల బాయని వర మొకటి' యిప్పింపు మని కోర శ్రీరాము డాతనికి రంగధామము నిచ్చెను. విభీషణుడు లంకకు బోవుచు మధ్యేమార్గమున ధర్మవర్మచే సత్కృతుడయ్యెను. రంగధామమును కావేరి తటమున నుంచెను. చోళరాజు రంగేశునకు నవరాత్రము లుత్సవములు చేసెను. విభీషణుడు బయలుదేరి రంగధామమును కదలింప కదలదయ్యెను. విభీషణుడు వేడుకొన రంగేశు డాతనితో 'ఈనది సన్నిధినుండ మాకు కడు నిష్టంబై తోచెన్' అని పూర్వ మొకప్పుడు గంగాకావేరీజలములు తమతమ పావిత్ర్యములగూర్చి తగవులాడుకొన గంగకే గౌరవ మబ్బినందున కావేరి తననుగూర్చి తపమాచరింప కావేరికడ నుండుటకు వరమిచ్చిన సంగతిని కారణముగా చెప్పి, 'లంకా ముఖమున కావేరిని మాలగ గైకొని యుందు'నని సమాధానపరచెను. శ్రీరంగేశు డచ్చటనే నిలిచిపోయెను. అప్పటినుండి.

'వినుమీ స్థలంబు శ్రీరంగంబన వృద్ధిగాంచియుండి
అష్టోత్తరశతదివ్యదేశముల యందొకటై విలసిల్లు' నని విష్ణుచిత్తుడు

శ్రీరంగమాహాత్మ్యమును, ఆపట్టణమును విపులముగా వర్ణించి గోదాదేవికి వినిపించెను. ఇదియంతయు విన్న చూడికొడుత, 'శ్రీరంగేశుని దక్క నన్యునిన్ స్వీకరింప పతిగాన్' అని శపథమూనెను. తత్ప్రాప్తికై యామె తండ్రిని సాధనము లడుగ నాతడు మార్గశిరవ్రత మాచరింపుమని బోధించెను. ఆమె యటులే

'తీరుగ ముప్పది పాశురయుతమగు తిరుప్పావు బాడి
వారిజనేత్రుడు రంగేశుండే వరుడగుటకు వేడి' వ్రతము పూర్తి

గావించుకొనెను. శ్రీరంగ డామెకు స్వప్నమున సాక్షాత్కరించి 'ప్రసన్నుడై యారాత్రి యంతయును పడతితోడ భోగించెన్' కనుకనే ఆదినము మనకు భోగి యయ్యెను. అది మొదలుగ చూడికొడుతకు రంగనాథునిపై ప్రేమ మిక్కుటమై భరింపరాని విరహముతో బాధపడుచుండెను. సఖులతో తనకు గలిగిన యను భూతిని చెప్పుకొనెను. వారీవార్త విష్ణుచిత్తున కెరిగించిరి. విష్ణుచిత్తుడీ పరిణయ మెట్లు చేతునాయని చింతించి నిద్రింప స్వామి స్వప్నమున సాక్షాత్కరించి నేను నీకూతును పెండ్లాడెదను. శ్రీరంగమునకు తోడ్కొని రమ్మని చెప్పెను. విష్ణు చిత్తుడు తన స్వప్నవృత్తాంతము బిడ్డకెరిగించి తన భాగ్యమును పొగడికొనియు

'అర్చారూపుండగు హరి నిన్నెట్లాదరింపగలడు
చర్చింపగ మనకేల నన్నిటికి చక్రపాణియే కలడని' నిశ్చయించుకొనెను.

ఆకాశవాణి యాతనికిగల సంశయ మడిపి చూడికొడుత భూసతియనియు చెప్పెను. అచ్చట శ్రీరంగేశు డర్చకముఖమున ధర్మకర్తకు శ్రీధన్వినవ్యపుర మేగి గోదాదేవిని తోడ్కొనివచ్చి తనకిచ్చి పెండ్లి సేయుమని చెప్పెను. వైష్ణవభక్తులు మహాసన్నాహముతో శ్రీవిల్లిపుత్తూరు చేరుకొని విష్ణుచిత్తునిచే సత్కృతులై చూడికొడుతను శ్రీరంగమునకు గొనివచ్చిరి. పాండ్యేశుడు వారి వివాహమునకు సకలసన్నాహము లొనర్చెను. మాధవుడు మానవాకృతి ధరించి పెండ్లిచేసికొనెను. ఆ పెండ్లికి వచ్చిన బ్రాహ్మణుల వర్ణనము చాల సరసముగా నున్నది.

'సుబ్బంభొట్లూ విన్నావషరా చూడికొ_డ పెళ్లషరా
అబ్బాయిని అచ్చయ్యాసు మరి మన అవధాన్లను కేకెయిరా
సంతర్పణలష సంతసమొదవగ గొంతువరకు తిందాం
పుంతమామిడి పప్పు మిషాయష ముందు మనం పోదాం
అడిగినంతమటు కొడ్డిసాస్పరష అరటికాయ యిగురు
వడియము లప్పడ మటుకులు తేనెయు వడలు పొంగలియు చాప
చెయ్యి దిగజార గోఘృతమషరా చెప్పతరమె యనుచున్,

అయ్యేడలంగల శాస్త్రిలు' పెండ్లిభోజనములకు వచ్చిరట. పెండ్లి ఐదుదినములు మహావైభవముగా జరిగినది. ఐదవనాటిరాత్రి శోభనము జరిగెను కాని.

'మరునాడుదయము పటకుటీరమును మగువయు మాధవుడున్
వరవిగ్రహరూపంబుల వెలసిరి నరులెల్లను గొలువన్,' విష్ణుచిత్తుడు

పుత్రీవియోగము భరింపజాలక 'ఆండాళ్ గోదా చూడికొడుత యని అతిప చర్యలం దలచి' విలపించుచుండ

శిలారూపముననున్న శౌరి

'చెట్టబట్టి నీ తనయను నాయెద జేర్చితి మామయ్యా
గోదాకొరకై యిటు విలపించి కుందతగునె మదిలోన్
ఛేదింపుము మమకారబంధమును చిత్తము జొరనీకన్
నను పూజించుటకై పుట్టెను ఈసతి నన్నుజేరె భక్తిన్
జనములు నను గొలువగ ఫలమిదియని చాటించెను ముక్తిన్
ఎపుడు నీసుతను జూడ దలచెదవొ అపుడు నన్ను మదిలోన్

జపమును జేయుము మామా క్కోర్కె సఫలంబగునటులన్
తరుణితోడనే దర్శన మొసగెద దయయుంచుము నమ్మి' మని చెప్పెను.
విష్ణుచిత్తుడు కొంతకాలము వారి నారాధించి శ్రీహరి సన్నిధిని చేరెను. ఇట్టి మధురభక్తిపూరిత మగునది యాండాళ్ చరిత్రము. వైష్ణమునందిట్టి మధురభక్తి యపారము. భక్తినిగూర్చి చర్చించునప్పు డీవిషయము విపులముగా విమర్శింప వచ్చును.

వైష్ణవభక్తి సంప్రదాయమునకు సంబంధించిన 'తిరుమంత్రము పాట' హరిదాసనునాతడు(హరిపురవాసి) తిరుమంత్రార్థమై గురువును సేవించి, గురువు గారి చరమదశలో సన్నిధియందు లేకపోవుటచే నామంత్రము గురువునుండి పడయజాలకపోవుటయు, ఆమంత్రరాజ మయాచితముగా నొక భోగినికి లభించుటయు,హరిదాసు ధర్మరాజుద్వారమున మరల నామంత్రమును భోగినినుండి సాధించుటయు నీ కథావృత్తాంతము. ఇది వడగల సంప్రదాయమునకు సంబంధించియుండునని 'కృష్ణశ్రీ'గారి యభిప్రాయము. 'హరిదాసుని పురుష ప్రయత్నాన్నే ఎక్కువగా వర్ణించడాన్నిబట్టి ఈపాట రచించిన హరిదాసు వేదాంతదేశికుల సంప్రదాయమువాడేమో ననుపిస్తుంది. తెలుగునాట గల వడగల్ సంప్రదాయపు వైష్ణవులు అరవమును కాక సంస్కృతాన్నీ ఆంధ్రాన్నీ అభి మానించడానికీ సరిపోతున్నది.'1 భక్తితో ప్రపన్నుడగు జీవుడు స్వప్రయత్నము కూడ చేసినప్పుడే భగవంతుడు మోక్షమిచ్చునని వడగలవైష్ణవుల నమ్మకము. దీనినే మర్కటకిశోరన్యాయమందురు.స్వప్రయత్నమును పూర్తిచేసి అధికారమును సంపాదించిననే మర్కటకిశోరమువలె భక్తుడు పరమేశ్వరునే యంటుకొని యుండవలయుననుట వడగల సంప్రదాయము. ఇటులకాక జీవుడు పరిశుద్ధ భక్తితో ఈశ్వరునియందే భారముంచినచో స్వప్రయత్నము లేకయే భగవంతు డాతనికి మోక్షమిచ్చునని తెంగలవైష్ణవుల నమ్మకము. దీనినే మార్జాలకిశోరన్యాయ మందురు.ఈపాటలో నీరెండు న్యాయములును కలవు. తిరుమంత్రసాధనమునకై ప్రయత్నము చేసి తొలుత విఫలుడైనను తరువాత మహాకష్టముమీద సాధించిన హరిదాసు వృత్తాంతము మర్కటకిశోరన్యాయమును తెలుపును. ఏ మాత్రము ప్రయత్నము లేక నయాచితముగా తిరుమంత్రమును పొందిన ఈటిసాని (వీటిసాని) వృత్తాంతము మార్జాలకిశోరన్యాయమును తెలుపును. కాని సానిదానికి

1. భారతి విజయ భాద్రపదము పుట 227 (సెప్టెంబరు 1953.)

మంత్రము దక్కలేదు. ధనలోభమున నది మంత్రమును విడిచినది. మంత్రమునకై మహాప్రయత్నము చేసిన హరిదాసు చివరకు కృతకృత్యు డగుటజేసిమర్కట కిశోరన్యాయమే ప్రతిపాదింపబడినదని భావింపవచ్చును. శిష్యుడు (హరిదాసు) గురువుతో (రామానుజులతో).

'హరిహరీ రామానుజా మీమతమందె నమ్మియున్నవాడనూ'

అని గురువుగారి పరిచర్య లొనర్చుచు వెంటనంటియుండెను. గురువుగారి కప్పటి కింకను శిష్యునిపై కటాక్షము గలుగలేదు. గురుశిష్యులు సంచారము చేయుచుండగా మధ్యారణ్యమున గోవత్సస్థలప్రాంతమున గురువుగారికి దాహము కలిగెను. శిష్యుడు గురువుగారి నొక చెట్టునీడ దిగవిడిచి జలములకై బయలుదేరెను. ఆకసమున నైదుపక్షులు పోవుచుండ శిష్యుడు వానిని జలములజాడ తెలుపుమనెను. అవి 'వినవయ్యా హరిదాసుడా మేమెల్లేటి నీడ దప్పక రావయా' యనెను. హరిదాసు వాని ననుసరించి కొలను జేరి కమండలువున జలములు గొని గురు వేమయ్యెనోయని పరుగుపరుగున వచ్చుచుండెను. గురువుగారికి ప్రాణోత్క్రమణ సమయమున శిష్యునిపై దయగలిగెను. అతడు 'ఇంతకాలమునుండియూ ఈబిడ్డ కంటబడాయే మంత్రమూ' అనుకొని 'తన మనసు జాలినొంది మేదినిపయి హస్తమునంచీ తుడిచియూ - ఘనమైన తిరుమంత్రమూ అచార్యులు వినయముగా వ్రాసిరీ - దేహ మక్కడ విడిచియూ ఆచార్యులు చేరిరీ పరమపదమూ'. ఆ మార్గమున బోవుచున్న ఈటిసాని (వీటిసాని కావచ్చును) అయాచితముగా తనకు లభించిన మంత్రము నొక కమ్మపై వ్రాసికొని నేలపైనున్న వ్రాలును చెరిపిపోయెను. శిష్యుడు వచ్చి గురువుగారి మరణమునకును తన వ్యర్థ ప్రయాసమునకును వగచి నేలపై నున్న తుడిచివేతను గాంచి మోస మెద్దియో జరిగినదని గ్రహించి యటనున్న పసులకాపరుల నడుగ గోపాలుడుగానున్న పరమాత్ముడు జరిగిన వృత్తాంతమును వినిపించెను. గురువుగారి దేహమున కంత్యక్రియ లొనర్చి భోగిని జాడలరయుచు హరిదాసు హస్తినాపురమ్ము చేరుకొనెను. భోగిని హరిదాసునకు మంత్ర మీయలేదు. సరికదా తన నైజగుణమును వీడక దాసునే తనయింట నుండుమనెను. హరిహరీ యని హరిదాసు ధర్మజుడు యజ్ఞము చేయుచుండగా నటకు బోయెను. ధర్మజుడు హరిదాసునకు దక్షిణ లీయబోవ నాతడు 'ఈటిసానివద్దనూ తిరుమంత్ర మిప్పిస్తె పదిలక్షలూ' అని యాచించెను. ధర్మజుడు' వేయి బ్రాహ్మణులెల్లనూ సమకూడ వక వైష్ణవుండెక్కడా' యని

గౌరవించి ఉపాయము బన్ని సానిదానిని పిలిపించి నృత్యమున కేర్పాటులు చేసి మెచ్చి దానికి మేడలుమిద్దెలు ధనకనకము లొసంగెను. ధనాశయేప్రధానముగాగల వేశ్య మంత్రము వ్రాసిపెట్టుకొన్న కమ్మను తన మిద్దెక్రింద పడవేసెను. 'ఆయాకు తీసుకొని ధర్మజుడు హరిదాసు కివ్వగాను' హరిదాసు మంత్రమును పఠించి తరించెను. ఈ పాటయందు ముక్తిగోరు హరిదాసు ప్రకృతియు, భుక్తిగోరు వేశ్యాప్రకృతియు, చక్కగా చిత్రింపబడినవి. ఈ కథలో ధర్మరాజును ప్రవేశపెట్టుట కల్పనమే కావచ్చును. ఈ కథను విన్నవారికి చదివినవారికి

'ఘనమయిన తిరుమంత్రమూ దొరుకు సుమ వినయంబుగా నమ్మిడీ'

* * * * *

శ్రీమన్నారాయణున కర్థాంగియగు శ్రీదేవిగూడ వైష్ణవులకు పరమారాధ్య. ఎట్టి కథయు లేకుండ నామెను భక్తులెవరో వర్ణించినది 'లక్ష్మీదేవి వర్ణన' మనెడు పాట.

అమృతంబు దరువంగ అందు జనించిన ఆదిలక్ష్మి
పూర్ణచంద్రునితోడ పుట్టిన సిరిదేవి పుణ్యశాలి' (ని)యని యారంభమై లక్ష్మిదేవి వర్ణనము సమగ్రముగా చేయబడినది. ఆమెకు సమస్తోపచారములు భోగములు సమకూర్పనైనవి.

'అంటరాని చూతఫలము వంటిది కలకంఠివంటిది
పచ్చివసువు కొమ్మ విరిచినగతి మేను చాయవంటిది
మూకమామిడి తోపువంటిది పోకబోదె వంటిది
నల్లకొండలమీద ఉదయచంద్రుని రేఖ పొడచిన రీతి
సన్నమయిన పాపిటిలోని చంద్రవంక కదలకున్నదీ' యని సహజమగు వర్ణనలతో నీపాట సాగిపోయినది. ఇది యొక ఖండగేయకావ్యము.

శ్రీమన్నారాయణుడు దుష్టశిక్షణ, శిష్టరక్షణములు సేయుటకై ఎన్నియో యవతారము లెత్తవలసివచ్చెను. వానిలో సుప్రసిద్ధమైనది యవతారదశకము. వానిని క్లుప్తముగా 8౩ ఖండికలలో నెవ్వరో 'దశావతారముల పాట'గా రచించిరి.

'జాలము యేలనురా – నీలమేఘశ్యామ
నీలమేఘశ్యామ–నిన్నె నమ్మితి రామ' యను పల్లవితో నీపాట నడచినది.

అన్ని యవతారములకన్న రామావతారకథ కొంత దీర్ఘముగా అనగా 14 నుండి 46 ఖండికలవరకు సాగినది.

'అరచేత వైకుంఠ మందించి పక్షికిని-యెట్టెటులో నడచి ఋష్యమూకంబు జేరిన, రామునిపై నధికప్రేమ గల ఈ భక్తుడెవరో తెలియరాదు.

ఆర్తత్రాణపరాయణుండగు శ్రీవిష్ణువును - కృష్ణుని - అసహాయయగు ద్రౌపది మానసంరక్షణార్థమై ప్రార్థించి వలువలు పొందిన కథ 'శ్రీ లక్ష్మీదేవి సొగటాలాట' పాట. ఇది భారతసంబంధగాథ. ఐనను దీనిలో కృష్ణత్వమునకన్న విష్ణుత్వ మధికముగా నుంటచేతను విష్ణుపారమ్యము బోధించుటచేతను దీనిని వైష్ణవవాఙ్మయమున చేర్చుకొనవచ్చును. ఒకనాడు కమలనాభుడు కమలాలయను 'పొడిచినప్రొద్దు పోవలె మనకు - వేడుక జూదం బాడుదు రమ్మ'ని పిలిచెను. లక్ష్మీనారాయణు లిరువురును మహావైభవముగా నలంకరించుకొని సొగటాలాడుచు ప్రొద్దు బుచ్చుచుండిరి. ఇంతలో దుశ్శాసనుడు ద్రౌపదిని బట్టుకొని సభలో వలువలు లాగుచుండెను. 'అన్నన్నా నీవే దిక్కనుచు' ద్రౌపది శ్రీకృష్ణుని వేడుకొనెను. శ్రీకృష్ణుడు 'అక్షయమనుచు పాచికలేయ, కోట్ల పొడుగునా చీరెలు పడెను.' దుశ్శాసనుడా వలువల నూడ్చలేక విసిగిపోయెను. లీలామానుషుడగు పరమాత్ముడది తెలిసి పక్కున నవ్వెను. రుక్మిణికి కోపము వచ్చి,

'సిరజనాభుడ నవ్విన విధము నీతితోడుత నెరిగించు
కమలనాభుడ నీతో బొంకి పాచిక వైచితినా
భువననాభుడ నవ్విన విధము బొంకక నాతో నెరగించూ
నాతిరూపు నల్లనిదాని నాకు తగదనీ నవ్వితిరా
వనిత వలచి వచ్చినదాని వలచుట తగదని నవ్వితిరా
పదహార్వేల మగువలలోపల పణతి తగదని నవ్వితిరా' యని కొంగు బట్టెను.

కొంగు బట్టుట తప్పుగాదా యని కృష్ణుడడుగ నామె 'ధరణిలో నాకొంగు బట్టితే మీకు నేరము లేమైన' గలవాయని మరల ప్రశ్నించెను. అందు కాతడు 'నేడుగాదె నీ కొంగుబట్టి బహుకాలం అయెనె లక్ష్మి' యని లాలించి ద్రౌపదీవృత్తాంతమును చెప్పెను. ఇరువురు సంతోషముతో నతఃపురములోనికి వెడలిరి. ఇది శ్రీవిష్ణువుయొక్క ఆర్తత్రాణపరాయణత్వమును సూచించు గాథ.

పారువేట కథల పేరుతో శ్రీమన్నారాయణుడు-వెంకటేశ్వరుడు-వేటకు

పోయి వచ్చుటయు, అమ్మవా రాతనితో వాదించుటయు మున్నగు విషయములు గల పాటలు దేవాలయములందు పాడెదరు. ఇట్టి వానిలో 'వేంకటేశ్వరుల వేట' యొకటి. దీనిని వెంకటనాథుడు రచించెను. ఒకప్పుడు 'శ్రీవరదుడగు శ్రీవేంకట నాథుడు, శ్రీతో కొలువై కూడి' యుండగా చెంచు మగువలు జుంటి తేనియలు కానుకలిచ్చి పరమాత్ముని వేటకు రమ్మని పిలిచిరి. 'ఆపలుకులు విని వేంకట నాథుడు అలమేల్మంగను జూచి నవ్వుచూ—మానవతి నా మాణిక్యమ వేటకు పోవగ కోర్కె యున్నద'ని సెలవడిగెను. ఆమె పురుషులను నమ్మరాదని భావించియు స్వామితో

'చెట్లలోపలా వేటలాడుమీ – చెంచిత లేమన్న పంపుబోకుమీ
ఒట్టుసత్యాల్ ఒప్పుకోకుమీ – కపట్వ జాలిలో కలియబోకుమీ
గట్టినమ్మికలు ఇయ్యబోకుమీ – నాయందున దయ తప్పబోకుమీ'

యని సెలవిచ్చెను. వేంకటేశ్వరస్వామి

'ఆదిలక్ష్మిరో నీ మాటకు తియగా – అడుగుదాటి నేనెప్పుడు నడువా
మాటలు జెప్పుట వేయానేలా – మనసుకు మనవే సాక్షి గాదా'యని నమ్మించి

సకల సన్నాహములతో

'గుండు ఫిరంగీ కాల్బలముతో–గుఱ్ఱము లేనుగు లొట్టిపిట్టల దండుతో'చెంచులతో నరణ్యమునకు దరలెను. అరణ్యమందు వెదుక నక్కరలేకయే కోనేటయ్య (వెంకటేశ్వరున) కెదురుగా

'సంతసమంది జిల్లిమృగంబులు ఝూడీ మెకములు
చిన్న మృగంబులు చిరుతప్పులులూ కోట్లకొలది గుమిగూడుకొనీ
వచ్చి నిలిచెనూ వరదుని సన్నిధినీ'. ఆ మృగములను వేడుకతో స్వామి

చూచుచుండగా చక్కని చెంచితలు కనుపించిరి. వారి యందచందముల జూచి స్వామి 'పారుటాకులు కట్టుకున్నారు — పర్ణశాలలో దిగియున్నారు — అడవి మృగములలో కలుసున్నారు—ఎవరో మీరు వివరము దెల్పండి' యని ప్రశ్నించి వారిని వెంటనంటి చెంచుపల్లెకు బోయెను.

చెంచు స్త్రీలు స్వామితో 'కమ్మల చీరలు యెరుగమెన్నడూ, చెవులను బెట్టము పొమ్మ లెన్నడు, గురువిందలేకాని - గోవను పెరిగినవారము మేమూ – కూరగాయలతో ప్రొద్దులు పుచ్చెదుము, కందమూలములె భక్షింతూము—మహాఘోరమగు అరణ్యములో మహాఋషులము మేమూ—పలుగర చెయ్యము మొఖము కడుగమూ—పారుటగానిన జలక

పాడమూ తలచిక్కులనూ విప్పనేరమూ - అందపు కొప్పులు పెట్టనేరమూ-కలిగిన పుష్పాలు ముడువనేరమూ-గట్టుల తిరిగెదమూ-మానవకోటుల మే(వాసులమూ-మమ్ముల జూచితె మనసు రోయదా' యని ప్రశ్నించిరి. స్వామి వారియం దొక చక్కని కన్నియను జూచి గాంధర్వవివాహమాడెను. చెంచువనితను గొని స్వామి తిరిగి వచ్చుట చూచిన లక్ష్మీదేవి తలుపులు వైచి సంవాదములాడెను. 'నీపెదమేటికి నొక్కు బోయెను-నీ కన్నుల కాటుక లెక్కడిపీ-నీపై సొమ్ములే వెలదుల కిస్తివో' యని ప్రశ్నించెను. స్వామి చక్కని 'మామిడి పండూ దినగా జీడి సోకి (పెదవి) పగిలె'నని కొంటె సమాధానము లిచ్చి అలమేల్మంగను శాంతమొనర్చి వశపరచుకొనెను ఇట్టి పాటలనుగూర్చి కృష్ణశ్రీగారి యభిప్రాయము గమనింప దగినది. 'సత్కాలక్షేపానికి దేవాలయాల్లో చేరుకునే భక్తులకు ఈ పాటలు కొంత వినోదము కలిగిస్తాయి. కాని ఎంతసేపూ స్వామి విభూతిని తెరవేసి కీర్తించే యత్నాలేగాని లౌకికవాతావరణము స్ఫురింపజేసి రసానందము సమకూర్చే యత్నాలు మట్టుకు కావు ఇవి. ఇమిడ్చిన కాస్త లౌకికశృంగారము, భక్తులు లౌకికులు కనుక ప్రవేశించిన శృంగారమే కాని వేరు కాదు. పారువేట కథల్లో ప్రాపంచికవిలాసము పరమేశ్వరుని ఆలయములో ప్రవేశించి మానవ భక్తుల లోకానుభవాన్ని పారమార్థిక మట్టానికి ఎగవొయ్యడము కనబడుతుంది[1]'.

పైకథనే మరియొక రచయిత 'చెంచీత కథ'గా వ్రాసెను. ఈ రెంటికిని కొంత భేదమున్నది. చెంచితకథ అహోబలనరసింహుని కారోపితము. 'గరుడాచల యక్షగాన'మీకథనే కీర్తించును. కాని ఈకథను శ్రీకృష్ణమూర్తి కంటగట్టిన ఈకవి 1914 సంవత్సరమునకు కొంచెము పూర్వుడై యుండును.. 'శ్రీరమాధిపుడైన శ్రీకృష్ణమూర్తి యాద్వారకాపురిలోన నుండగా, ద్వారావతీ పురిలో నుండగా' నాతని లాలనపాలనలచే సత్యభామాదికొంతలు గర్వించి శ్రీకాంతునితో మాటలు చాలించియుండిరి. వారి గర్వ మణచదలచి శ్రీకృష్ణుడు 'మీరింత గర్వింప మీకంటె హెచ్చైన-వారిజాస్యల కోరి తెచ్చేనే-చాలసొమ్ములు చీరలిచ్చేనే-మేలైన సంపదలి నిచ్చేనే' యనెను. వారును 'మాకంటె హెచ్చైన వారిజాస్యల నీవు తేలేవు తేలేవు కృష్ణుడ, నీవు తెస్తేను చూతాము కృష్ణుడ-నీవు తేపోయి చూతాము నాసామి' యని ప్రతిజ్ఞచేసిరి. శ్రీకృష్ణ డొకనాడు వేటకు పోయి యరణ్యమృగముల సంహరించి యొక పొదరింట అందమగు చెంచు

1. భారతి - విజయభాద్రపదము, పుట 226.

పడుచును జూచి తానును చెంచు వేషముతో నామెను డాసెను. శ్రీకృష్ణునకును చెంచితకును జరిగిన సంభాషణము లతిమనోహరము. స్వామి చెంచితను ఊరుపేరడిగి తన్నుగూర్చి చెప్పుకొని తనను పెండ్లియాడుమని బతిమాలెను. అప్పుడామె 'పోవయ్య పోవయ్య కృష్ణుడా, నీకు ప్రొద్దేల పోదయ్య నాసామి, మాయన్న లొచ్చేరు కృష్ణుడా, అంబులే తెచ్చేరు నాసామి, అలుగులే వేసేరు నాసామి' యని బెదరించెను. కృష్ణుడు చుట్టరికము కలుపజూడ నామె తిట్టులు తిట్టెను. కృష్ణుడామెను బతిమాలి కాళ్లబట్టుకొనువరకు వచ్చెను. చెంచిత మనసు కొంతమెత్తనై యాతని చదువు సాములను పరీక్షింపగోరి 'పెద్దపెద్ద పాములు పెంజారిగున్నాలు-కొంద చిలువలు రెండు గండి కొచ్చిన జాడ లెరుగుదువా. అనువులున్నా తావు నెరుగుదువా — అనుమాన ముండేది యెరుగుదువా' యని ప్రశ్నింప కృష్ణు డౌననెను. ఆమె మరల 'నిమ్మాకులగిరిమీద నిమ్మూకగ తిరిగేటి, కొమ్మూకల గురిపోతు నేసేవా, ఏదుపందూల నెయ్యానేరుతువా, అడవిదుప్పుల నెయ్యనేరుతువా, అనువులున్న జాడ లెరుగుదువా, పుట్టతేనెలు బట్ట నేరూతువా, పరిగతేనెలు పట్టనేరుతువా' యని ప్రశ్నింప కృష్ణుడు తనసామర్థ్యమును మరల చాటెను. ఇరువురికి వాదోపవాదములైన తరువాత చెంచిత 'నీమీద మోహంబు కృష్ణూడ, నేను పట్టలేకున్నాను కృష్ణూడ, నేను తాళలేకున్నాను నాసామి, వట్టి మాటలచేత కృష్ణూడ—ఇంత వాదేల పోదాము కృష్ణూడ'యని తన సమ్మతిని తెలియపరచెను. ఇరువు రొక శుభముహూర్తమున పెండ్లి చేసికొనిరి. శ్రీకృష్ణుడు చెంచితను తోడ్కొని ద్వారక చేరబోయెను. సత్యభామాదికాంతలు కుపితలై కృష్ణు నేమనలేక చెంచితతో వాదులాడిరి.

'పుల్లదుప్పులవెంట పొలములో తిరిగే-పొలతుక మాతోడ సరియటవే
వోచెంచిత మాతోడ సరియటవే-చేడెరొ మాతోటి సరియటవే' యని రుక్మిణి ప్రశ్నింపగా,

'తల్లిదండ్రులమాట తలమీరి యన్నను - తలవంపు శాయదగునటవే
బలిమీరి మగనివి బతిమాలి గతిమాలి - పిలిపించుకోలెదె రుక్మిణీ-అన్నితలవంపు శాయవే రుక్మిణీ' యని సమాధానమిచ్చెను. సత్యభామకు కోపము వచ్చి 'చెంచిత నీవింత వంచన మాటలు మించి యాడెదవేమె వేమారు గర్వించి- గర్వించి పల్కెదవేమె వేమార'నగా నామెకు సమాధానముగా చెంచిత 'చంచలాక్షి

పారిజాతముకయి మగని వంచనా చేసినా దెరుగవా-చాలించు మాట లింక తరుగవా, ఆలించి వినెడివారి యెరుగవా'యనెను. వారి వాదోపవాదము లింకను ముదిరెను. చెంచిత వారి కెందునను తీసిపోక సమాధానము లిచ్చెను. ఇంతలో శ్రీకృష్ణుడు వచ్చి వారికి సఖ్యమొనరించెను.

స్వామి వేటకు బోవుట మున్నగు పూర్వకథ లేమియు లేకుండ కేవలము అలమేలుమంగకును చెంచితకును జరిగిన సంవాదమే 'సవతుల కయ్యాము'గా వర్ణింపబడినది. పరస్పరదూషణములతో పాటు వారివారి పుట్టింటివారిని, కుల శీలములను కూడ రచ్చకీడ్చి సవతు లిరువురు నిందించుకొన్న దీర్ఘగేయ మిది. చెంచిత అలుమేలుమంగను 'అరవ బ్రాహ్మడి కూతురా నీకింత అణుకువ లేదాయెనే' యని దెప్పిపొడిచెను. అరవ బ్రాహ్మణుని (పెరియాళ్వారు) కూతురు ఆండాళు. ఈకవి రంగనాయకికిని అలమేలుమంగకును అభేదము చేసినాడు. 'వన్నెమృగమును దెమ్మంటినా నేను - రక్కసుని వరియించి రథముపైకెక్కి-లంకలోకి వెళ్లియుంటినా' యని రామావతారమందలి కథను జ్ఞాపకము చేసెను. 'ముడిచి విడిచిన పూలు - రంగనాధుని కంపి-వలపించుకున్నట్టి నెరజాణ వోవే' యని నిందించెను. ఇందులో కొంత వ్యాజస్తుతిగూడ స్ఫురించుచున్నది. ఇరువురిటు లెంతయోసేపు జగడమాడినతరువాత శ్రీకృష్ణుడు వచ్చి ఇరువురిని శాంతపరచి సఖ్యమొనరించెను.

శ్రీవిష్ణువును పరమదైవతముగా నెంచి వైష్ణవేతరులచే గాని లేక తదితరులచే గాని అనేకబాధలకు లోనైన భక్తుల కథ లెన్నియో గలవు. వైష్ణవవాఙ్మయమున నిట్టికథ లింకను అధికముగా గలవు. ఇట్టి పురాణవైష్ణవ భక్తులందు ప్రహ్లాదు డగ్రగణ్యుడు. నలచరిత్రపదమును వ్రాసిన తోలేటి సీతారామయ్యయను కవియే 'ప్రహ్లాద చరిత్రము'ను రచించెను. విష్ణుద్వేషియగు తండ్రిచే ప్రహ్లాదు డనుభవించిన బాములు హృదయవిదారకములు. ఎన్ని యిడుములు కలిగినను మహాభక్తుడగు ప్రహ్లాదుని యచంచలభక్తియం దావ గింజంత యైనను తరుగు రాదయ్యెను. ఇంకకొంత యధికమే యయ్యెను. ఈ కథను భాగవతకథలం దిదివరకే పరిశీలించియుంటిమి.

రుక్మాంగదుడు కూడ పరమవైష్ణవభక్తాగ్రేసరుడగు రాజు. ఈతని చరిత్రమును సుప్రసిద్ధ జానపదవాఙ్మయ పరిశోధకులగు శ్రీ నేదునూరి

గంగాధరంగారు 'ఏకాదశీ మాహాత్మ్యము—రుక్మాంగద మహారాజుకథ' గా రచించిరి. మోహినీరుక్మాంగదుల వృత్తాంతము పద్యకావ్యములందును, ద్విపదలందును, యక్షగానములందును, నాటకములందును, హరికథలందును కాననగును. ఈకథ ఏకాదశీవ్రతమాహాత్మ్యప్రతిపాదకమగుటచే వ్రతకథలందును గూడ చేర్చవచ్చును. కాని సాధారణముగా వ్రతకథలన్నియు స్త్రీలకుసంబంధించినవి. ఈకథ యన్ననో పురుషుడగు రుక్మాంగదునకు సంబంధించినదగుటచే దీనిని వైష్ణవవాఙ్మయమున జేర్చవలసి వచ్చెను. త్రినాథవ్రతమువంటి మరి యొండురెండు పురుషులకు సంబంధించిన వ్రతకథ లున్నవి.

విదిశాపురమును సూర్యవంశీయుడగు రుక్మాంగదుడు పాలించుచుండెను అతడు 'దయ దాన సత్యంబు, ధర్మంబు గలిగి, భక్తి యుక్తి శక్తి ప్రబలంగ గలిగి' రాజ్య మేలుచుండెను. అతనికి మూర్గురు భార్యలు. పట్టపుదేవి సంధ్యావళి సకలసద్గుణరాశి. ఒకనాడు శుకశౌనకాదిమునులు రాజుగారి సభకు వచ్చి సత్కృతులై పుణ్యకథలు వినిపించిరి. రాజు వారిని 'అన్ని వ్రతములకన్న అధిక్యమగుచు, మోక్షసాధనముకు మూలంబునగుచు, శ్రీవిష్ణుమూర్తికి ప్రీతికరమగుచు, ఆబాలగోపాల మందరు జేయ, పాపముల్ హరియించి భక్తి నెలకొల్పి, భోగభాగ్యాయువుల్ పుణ్యంబు నిచ్చు, వ్రతరాజమేదియో వచియింపు డనుచు' కోరెను. వారు రాజుగారికి ఏకాదశీవ్రతమును తన్మాహాత్మ్యంబును వివరించి యది యాచరించెడు విధమును బోధించిరి. రాజా వ్రతమును తానాచరించుటయే కాక తన ప్రజలందరిచేత చేయించుచుండెను. ఆ వ్రత ప్రభావమున ప్రజలందరికి సమస్తభోగభాగ్యము లబ్బుటయేకాక 'ధరను యెవ్వరేని మరణంబు నొంద, వైకుంఠపురమునకు వార్పోవు' చుండిరి. కొన్ని దినములకు భగవంతుని కృపచే సంధ్యావళికి కుమారుడు కల్గెను. అతనికి ధర్మాంగదుడని నామకరణము చేసిరి. ధర్మాంగదుడు పెరిగి పెద్దవాడై సమస్త విద్యల నభ్యసించి మాళవభూపతి కూతురు చంద్రరేఖ నుద్వాహమయ్యెను. ఇట్లుండ కొన్నిదినములకు కలహభోక్తయగు నారదుడు రుక్మాంగదుని వ్రత మాహాత్మ్య మెరిగి యమధర్మరాజుకడకు బోయి ప్రజలందరు వైకుంఠమునకే పోవుటను నరకమున కెవ్వరును రాకుండుటను తెల్పెను. యముడు బ్రహ్మకడ మొరపెట్టుకొనెను. బ్రహ్మ మోహినిని సృజించి 'పుత్రికా నీవిపుడు భూలోక మేగి - రుక్మాంగదు డనెడి రూఢైన ప్రభుని, వంచించి ఏకాదశీవ్రతము

మాన్పించు'మనెను. రుక్మాంగదుని రాజ్యమందు పెక్కు అడవి జంతువులను పుట్టించెను. ప్రజల మొర విని రుక్మాంగదుడు వేటకు పోయి మృగముల సంహరించి మందరపర్వతప్రాంతమున వామదేవఋషిని గొల్చి తిరిగిపోవు చుండగా మోహిని యాతని కంటబడెను. ఆమె సౌందర్యమును గాంచి రుక్మాంగదు డామెను పట్టపుదేవిగా నొనర్తునని బాసజేసి గాంధర్వ వివాహమాడి తిరిగి నగరము చేరుకొని మోహినితో సుఖము లనుభవించుచుండెను. ఒకనాడాత డేకాదశీవ్రతమునకై వేయింపబడిన 'దండోరా' విని అప్రమత్తుడై వ్రత మాచరించుటకు సిద్ధపడ మోహిని యాతని నిరోధింప ప్రయత్నించెను. కాని రాజామెతో వ్రతము సమాప్తి యొనర్చి నీ కోరిక లీడేర్తునన ఆమె రాజు చేసిన పూర్వపు బాసలను జ్ఞప్తికి దెచ్చి అసత్యదోష మాతని కంటగట్టజూచెను. రాజామెతో 'సాంగత్య వరమొకటి సఖియరో మాని-వ్రతము మానిపించు వరమొకటి మాని-కోరుకో ఏదైన కోరిక దీర్తు'నని పల్కెను. మోహిని 'వ్రతమైన మాను లేక వరపుత్రు శిరము-నీభార్య చూడంగ నెరి నరికి యిమ్మ'ని కోరెను. రాజా ఘోరమగు కోరిక విని మూర్ఛితుడయ్యెను. సంధ్యావళి యిట్టి కోరిక తగునా యన మోహిని యామెను దూషించెను. ప్రాణనాథు డసత్యమాడ కుండునట్లును వ్రతభంగము కాకుండునట్లును సంధ్యావళి 'ప్రాణేశ కైవల్యప్రాప్తి విడువకుము, ఆడితప్పక పుత్రు అరుతను యిమ్మ'నెను. సుపుత్రుడగు ధర్మాంగదుడును అందులకు సిద్ధపడెను. రాజు కుమారుని శిరము ఛేదింపబోవ మోహిని 'పుత్రప్రేమ లేద భూపాల నీకు; కొడుకును జంపంగ కులమంతరించు, వంశనాశనమైన వ్రతమేలనయ్య, సుతులు లేనివార్కి గతు లెట్లుగల్గు, సుతులు లేనివారు వ్రతములు జేసి, సుతుల బడయుచునుండ సుతు జంపనేల' అని వ్రతము చెరిపింప జూచెను. కాని పరమభక్తుడగు రుక్మాంగదుడు వ్రతము విడువ నిష్టపడక ఖడ్గమెత్తి కొడుకు తల నరుక నొక వ్రేటు వేసెను. కాని యా కత్తి వ్రేటు శ్రీవిష్ణుప్రభావమున ధర్మాంగదుని మెడలో పూలమాల యయ్యెను. దేవతలు ప్రత్యక్షమై యాతని భక్తికి మెచ్చిరి. వారికి వైకుంఠపదవి నొసంగిరి.

వీరశైవుల దౌష్ట్యమునకు గురియైన వైష్ణవభక్తులందు చిన్నమ్మ కథ సుప్రసిద్ధము. ఉత్తరభారతమున శ్రీకృష్ణు నారాధించి భర్తవలన పలు బాధలు పడిన మీరాబాయివలె వీరశైవులగు తన అత్తింటివారిచే ననేక బాధలుపడి

దృఢదీక్షతో మద్దులేటిస్వామి దయవలన చివరకు తన అత్తమామలను గూడ తన పక్షమునకు త్రిప్పుకొనజాలిన భక్తురాలు చిన్నమ్మ. మద్దులేటిస్వామి కదిరి సమీపమున గల వేంకటవిఠలస్వామి. ఆయన ఆలయసమీపమున మద్దులేరు కలదు. చిన్నమ్మ కులమున రెడ్డి, శీలమువారింటి ఆడబిడ్డ. కథాస్థలము పల్నాడు. బ్రహ్మనాయని ఇంటిపేరు కూడ శీలమువారే. బ్రహ్మనాయనియందున్న భక్తిచే అక్కడి రెడ్డికులజులు కూడ తమ ఇంటిపేరు శీలమువారని పెట్టుకొని యుందురు. ఇంటిపేరెటుల వచ్చినను ఆపేరున్నందుకు బ్రహ్మనాయని వీరవైష్ణవము చిన్నమ్మకు కూడ అబ్బుట వింత.

'చిన్నమ్మ కథ' ను వ్రాసినది చెంగల్వరాజను కవి. బాలనాగమ్మ, కామమ్మ, లక్ష్మమ్మ కథలవలె చిన్నమ్మ కథకూడ బహుళప్రచార మందిన గేయము. తెలుగు దేశపు పొలిమేరలు దాటి ప్రచారమందిన గాథలలో చిన్నమ్మ కథ మేటి. కన్నడ ప్రాంతములందును వ్యాపించినదీకథ. తెలంగాణమందలి శారదకాండ్రు పిచ్చుకుంటువారు పాడగా దీనిని వింటిని. చిన్నచిన్న మార్పులతో రెండుమూడు చోట్ల నిది వింటిని. వీనియందు ముద్రితమైన చెంగల్వరాజు రచనమే సమగ్రముగా నున్నది.

పాగొండ పట్టణమున శీలము అచ్చమ్మకు మద్దులేటిస్వామి వరమున చిన్నమ్మ జన్మించినది. చిన్నమ్మ పుట్టుకతోడనే 'లలాటమందు తిరుమణిగాను తాను బుట్టినాది'.చిన్నమ్మ పెరిగి పెద్దదై వైష్ణవభక్తియందలి గాఢాభిమానముతో 'కోటిదాసర్ల గనుకా పిలిపించినాదీ, శనివారము దా సమారాధన చేయించెనమ్మ, ఒక్కప్రొద్దు వారలతోను చిన్నమ్మ, వుత్సవంబులు స్వామికి చేయించెనమ్మ'. ఇట్లుండగా వోలుగొండపట్టణమున నుండు పసుల రాఘవరెడ్డి (భార్య నాగమ్మ) తన కడగొట్టు కుమారుడగు వెంగళరెడ్డికి భార్యను వెదుక ఎద్దుల బేరము సాకుగా బయలుదేరెను. పాగొండ చేరుకొని శీలము వారితో వియ్య మందుటకు నిశ్చయించుకొనెను. చిన్నమ్మకు వెంగళరెడ్డికి వివాహము మహా వైభవముగా జరిగినది. చిన్నమ్మ ఎంతటి విష్ణుభక్తురాలో అమె యత్తవా రంతటి వీరమాహేశ్వరులు. ఆమె తన యత్తవారిల్లు చేరుకొనగనే తోడికోడండ్రు అత్తమామలు వైష్ణవమును వదలి శైవమును స్వీకరింపుమని నిర్బంధించిరి. చిన్నమ్మ యందుకంగీకరింపకున్న వారామెను ఇంటినుండి వెడలనడచి పూరిగుడిసెలో నుంచి.

'చిన్నమ్మకు చెప్పలేనిగా హింసలు పెట్టేరి
ఏనూప దొడ్ల యెడవు యెత్తమన్నారు
పూటకు పుట్టెడు జొన్నలు దంచమన్నాప
బట్టల కంతకు పచ్చిక మోయమన్నారు'

ఇన్ని పనులు చేసివచ్చి చిన్నమ్మ తిండి యడుగ అత్తగారు,

'ఓసి ఓసి గుండాముండా ఓ లేకిముండా
నీకు వండిపెట్టుటకు కూలికత్తెలు మా యింట్లోను లే'రని దూషించి

'మూడు చిట్టెలు పుచ్చుజొన్నలు వాళ్ళో పోసింది
ఎంచి యేడు మిరపకాయలు విసిరిపేసినాదీ
ఎద్దులకేసే చవుటుప్పు చేరెడు కొలిసిచ్చె
ఎంగిలి చేత గోరెత్తు వెన్న చేతికి యిచ్చిందీ
మూడుదినముల పులిమజ్జిగను దుత్తకు పోసిందీ
మెడాబట్టి నెట్టించినాది దరబాజాగుండా'.

చిన్నమ్మ దుఃఖించి మద్దులేటి స్వామిని వేడుకొన్నది. స్వామి ప్రత్యక్షమై 'చిన్నమ్మా నిన్ను పెట్టే బాధలుగాదు నన్ను పెట్టుతార'ని యోదార్చెను. చిన్నమ్మ తన కత్తగారిచ్చిన గోరెత్తు వెన్నలో స్వామికి పులికాపు చేసి భక్తితో కొలిచి అంబలి త్రాగి యాకలి చల్లార్చుకొనెను. స్వామికి,

'అనాడా చిన్నమ్మ దీపము బెట్టితే - యేడుయేడు
పద్నాలుగు యేండ్లు వాక్కుచే దీపంబూ,
అప్పుడు వత్తిలోనె నెలకొన్నాడు వరదారాజులుగా
దీపములోనే నెలకొన్నాడు మద్దులేటయ్యా'

సకలదేవతలు చిన్నమ్మకు ప్రత్యక్షమై యభయ మొసంగిరి. చిన్నమ్మ బావలు, భర్త, జీతగాండ్రతో పొలము దున్నబోయినప్పుడు తోడికోడండ్రు అత్తమామలు, ఆమెను బాధించి భరింప శక్యముకానంత పెద్ద కుండలో భోజన ముంచి పొలముకడకు కొనిపొమ్మనిరి. 'చిన్నమ్మతో యిరువై యిద్దరు కడవ నెత్తినా'రు. చిన్నమ్మ క్రిందపడి స్వామిని తలచుకొన్నంతనే

'చిన్నమ్మను రెట్టపట్టి లేవనెత్తెను మద్దులేటయ్య

చిన్నమ్మ స్వామిదయవలన నాకూటికుండ నెత్తిపై ధరించి పొలము బాటబట్టెను. మార్గమధ్యమున కొందరు గోపబాలు రామెను బాధించి స్వామి మహిమచే తామే బాధలపాలై యామెను వేడుకొనిరి. స్వామి యామె భక్తి పరీక్షింపగోరెను.

'చిన్నమ్మ ఎక్కె దారియందు కోలుపైయున్నాడు
గోవిందలుపెట్టినాడు అదాసరయ్య'.

స్వామి దాసరివేషముతో వచ్చి చిన్నమ్మను భోజనమడిగెను. చిన్నమ్మ తన నెత్తిపైనున్న కుండ దించుకొని దాసరికి భోజనమిడెను. దక్షిణతాంబూలము లిచ్చి పూజించెను. స్వామిమహిమచే నాకుండ పంచభక్ష్య పరమాన్నములతో నిండెను. రెడ్లా భోజనము చూచి తల్లిపెట్టిన భోజనమది కాదని శంకించి చిన్నమ్మను చితుకగొట్టిరి. మొండికొడవలి చేతికిచ్చి మండుచున్న ఎండ కాలములో ఎడ్లకు పచ్చిగడ్డి తెమ్మనిరి. స్వామి సాయమున చిన్నమ్మ గడ్డి తెచ్చెను. రెడ్లు ఆమె మాయావియని తిట్టి అన్నపుకుండ గడ్డిమోపు ఆమె నెత్తిపైనుంచి అందరును ఇంటికి మరలిరి. మద్దులేటిస్వామి రెడ్లను బాధింప దలచి కుంభవర్షము కురిపించి నడియేటిలో సుడిగుండము గావించి యారెడ్లను చావనీక బ్రతుకనీక బాధలు పెట్టెను. చిన్నమ్మ,

'దండం దండం నీకు మద్దులేటన్నా
స్వామి మారెడ్లకు పెట్టే బాధలు తప్పించు' మని వేడ్కొనెను. స్వామి వారిని రక్షించెను. ఇంటికి వచ్చిన పిమ్మట తమ గండము గడచినందుకు రెడ్లు కోటిజంగమార్చన చేయ మొదలిడిరి మద్దులేటిస్వామి దాసరివేషముతో,

'గోవిందా గోవిందాయంటా నడిబంతిలో చూసే
హరహర శబ్దము తల్లి అణగిపోయిందీ
స్వామిగారి గోవిందలు తల్లి హెచ్చిపోయినాయి'.

రాఘవరెడ్డి మున్నగువారు స్వామి నవమానపరచి సాగనంపిరి. స్వామి చిన్నమ్మ గుడిసెకు బోయి సత్కృతుడయ్యెను. ఆతరుణమున ఊరివారందరు చిన్నమ్మను బాధించిరి.

'అప్పుడు పూరంత కాలపెట్టెనే మద్దులేటయ్యా
అత్త నాగమ్మరు చెంపనొప్పి తగిలే

భూమి యేలే రాఘవరెడ్డికి రెండుకండ్లే పోయే
ఏడుగురు వో కోడండ్రకైనా కడుపునొప్పులూ
ఏడుగురు వో కొడుకులకైనా ఒడుపునొప్పులూ
ఉడుకుసన్ని కాచిచ్చే దిక్కూ ఇండ్లోనూ లేదూ
వోలుగొండ పట్నమంత కాలిచేసేనే
తన కొంప చేరబోరెను మద్దులేటయ్యా'

స్వామి ఎరుకల వేషముతో వచ్చి మద్దులేటయ్యకు మ్రొక్కుకొన్న మీ బాధలు తొలగునని నాగమ్మకు గద్దెచెప్పెను. నాగమ్మ 300 వరహాల మూట కట్టి కొండకు వచ్చి సేవించుకొందుమని మ్రొక్కినంతనే వారెప్పటియట్లైరి. మ్రొక్కు చెల్లించుకొనుటకు వారందరు బయలుదేరి చిన్నమ్మ నింటి యొద్దనే కావలియుంచిరి. కాని మధ్యేమార్గమున స్వామిమహిమచే బండ్లు కూలిపోయి వారందరు బాధలపాలైరి. చిన్నమ్మ వచ్చి వారి నుద్ధరించి కొండకు వచ్చి స్వామికి సేవలు చేసెను. ఆమె భక్తికి మెచ్చి అప్పుడు స్వామి 'అడగవమ్మ చిన్నమ్మ తల్లి అడిగిన వరమిస్తా' అనెను. చిన్నమ్మ స్వామిని వేడ్కొని తమవారందరికిని వైకుంఠప్రాప్తి కలుగజేసెను.

'స్వామి కుడిచేతిలో బంగారు శిలయై నిలచె చిన్నమ్మ తల్లి
అప్పుడు వెనుకటి వెండిశిలయై నిలచె ఎడమ చేతిలోను'

తనతోపాటు తనవారినిగూడ తరింపజేసిన చిన్నమ్మ వైష్ణవభక్తి ప్రశస్తమైనది.

వీరశైవ వీరవైష్ణవములకు జరిగిన సంఘర్షణము నొక చక్కని కథా కల్పనముతో బోధించి చివరకు హరిహరుల కభేదమును ప్రతిపాదించెడు సిసలైన జానపదగేయము 'వరహావతార చరిత్రము'. శ్రీశైలము అహోబిలము శైవవైష్ణవ క్షేత్రములు కథారంగములు. పాత్రములు కల్పితములో లేక యానాటి ఇరుపక్షముల ప్రతినిధులకు మారుపేరులో యైయుండును. వరాహావతార వర్ణన మిట్లున్నది.

'ఆదివిష్ణువు సింహాచలమందున - పరశురాముచే పరహావతారం - నరకాసురుని సంహారించిన - కార్తవీర్యార్జునునికోసం - స్వామివారు అవతారమెత్తెను - యే విధమున అవతారమెత్తెను అరికాలున తామర పద్మం-వీపునాను వింజామరలండి-ఉర్వతోక నొష్టా చుక్కండి-కన్నులాను చింతామణి గలదు-తిరుమణి శ్రీచూర్ణంబు మెండు-శంఖచక్ర గదాధరుండై-తొండిమొకచే లేదా మృగము-పొత్తయేనుగు లావంతది-అటువంటి అవతార

మూర్తి-అహోబిలపర్వతమందునా-ఆదివిష్ణు సింహాద్రియప్పడు - అవతారమనే కొమ్ము పంది'. పెద్దనగారు మనుచరిత్రమున (IV-18) వరాహమును వర్ణించుచు 'అప్పొలము వరాహపోతములు భూవర తొండములేని ఏనుగుల్' అనెను. ఇట్టి యవతార మూర్తితో వైరముగలవాడు 'శ్రీశైలపర్వతమందున, కార్తవీర్యుండను మహారాజు, సహస్రబాహువులు కలిగినవాడు, శివభక్తుడనే ధురంధరుండు, చాతుర నాలుగు పర్వతంబులు, ఏకచక్రంబుగ ఏలుచున్నాడట్లు. ఈరాజుగారి క్రింద 'చీకటిపాలెం చినరాయుండు-నాచసముద్రం వెంకటప్పారావు' సరదార్లు. వీరిక్రింద 'గండుపల్లి భయ్యన్నలింగమూ, భటుడంటే సామాన్యుడు కాడు, కూరుచుంటె ఒకగున్నాచింత, లేచితేను ఒకతాటిపొడుగు, ఆజానుబాహువులు కలిగినవాడు. అతనిపేరు భయ్యన్నలింగము'. రాజుగారి యాజ్ఞ చొప్పున భయ్యన్న లింగము సేనలతో వేటకు కావలసిన సన్నాహముతో వరాహమూర్తిమీదికి వెడలెను. 'కోడివాం కోనేటికాడ' వారికి పంది తారసిల్లెను. నన్నెదిరింప మీ తరముకాదు; తిరిగిపొండని వరాహమూర్తి సైనికులకు చెప్పెను. అప్పుడు వారు 'అత్తేరి నీ యమ్మ్కముండ, నగరికి వెళ్లమనేటిదానవు, పరగడ దిగే మృగజంతూవు, గరికవ్రేళ్లు నమిలేటిదానవు, అడవులన్నీ తిరిగెడిదానవు, బురదలోను పొర్లేటిదానవు, నీవు అనగా నీ ప్రతాపమెంత' యని తిరస్కరించిరి. వరాహమూర్తిని వర్ణించునప్పుడు మొదటి వాక్యములును తిరస్కరించునప్పుడీ వాక్యములును పలుమారు వచ్చుచుండును. సిసలైన జానపదగేయలక్షణములం దొకటగు పునరావృత్తి కిదియొక యుదాహరణము.1 ఇట్టి యుదాహరణములు సిసలైన జానపదగేయములం దన్నిచోట్ల కాననగును భయ్యన్నలింగముతోపాటు భటులందరును ఒక్కుమ్మడి 200 తుపాకులు పందిపై ప్రేల్చిరి. కాని యాపంది వాని నన్నింటిని చప్పరించి పోగతో వారిపై దూకి చెల్లాచెదరు చేసెను. ఆ

---

1. దీనినే F.B. Gummere అను పాశ్చాత్య వాఙ్మయ పరిశోధకుడు Incremental repetition as final proof of popular origin అను ఉపశీర్షిక క్రింద 'So vital is this incremental system in the Structure of ballads, that it not only dominates the main progress of a borrowed story, but even treats a detail of this story so as to make it conform in pattern with the rest' అని చెప్పియున్నాడు.

యవతారమూర్తి విజృంభింపగా 'సప్తయేడు లోకములు గదిలెను, దేవేంద్రాది దేవతలెల్లను, వలపటదాపట దివిటీ వైచిరి, ఆదివిష్ణుబ్రహ్మాదులెల్లను, పంది యందు ప్రత్యక్షంబైరీ, సూర్యుండును చంద్రుండును, పందికి వింజామరలు వేయబూనిరి'. భయ్యన్నలింగము భయపడి 'ఏడుకౌగిళ్ళ నల్లామద్ది, ఏటవాలుగ చౌకలించి' నెక్కి ప్రాణములు కాపాడుకొనెను. భయ్యన్నలింగము కభయమొసగి వరాహమూర్తి క్రిందికి దిగుమనెను. అతడు బలమున్నచో చెట్టునే పెకలింపుమనెను. పంది తన కోరలకు పదును పెట్టి మద్దిచెట్టును కూల్చెను. భయ్యన్నలింగము దాని పాదము లంటగనే 'అజ్ఞానములే విడచెను బంటూ, శిష్యభూత విజ్ఞానుడాయె'ను. 'పందివి గా నాపాలిటి పరమాత్ముండవని' స్తోత్రమొనరించెను. తన్నంపిన యేలికను గూర్చి చెప్పెను. వరాహమూర్తి కోపముతో 'కార్తీక సోమవారమంచున-పూరిమీదికి ముట్టడివత్తును, చుట్టురాతి కోటకట్టుంచేని, ముందు మాకు గోచరమైయున్నది, తెల్లవారేటప్పటికి నేను, పూరుమీదికి ముట్టడి వత్తును, కంచుకోట కట్టించుమన్నడి, నాలుగుతట్టుల కోటలతోటి, జానెడుకొక్క ఫిరంగితోటి, బందోబస్తుగ వుండుమన్నది, భల్లున తెల్లవారేవరకు, ఊరుమీదికి ముట్టడివత్తు' నని చెప్పెను. భయ్యన్నలింగము తన నెదిర్చినందులకు రాజుగారికి ఆనవాలుగా 'గజ్జలోది కస్తూరి రోమము, యెడమకాలిదే పుల్లారోమము, వెన్నుమీదనే బెగటరోమము, పిర్రమీదిదే ఫిరంగిరోమ'మిచ్చినది. భయ్యన్నలింగము తన భటులచే నారోమములను కావడిపెట్టి మోయించవలసివచ్చినను రాజుగారీ వార్తలు తెలిసికొని పంది నెదుర్కొనుటకు సన్నాహములు గావించుచుండెను. వరాహమూర్తి తానాయూరు చేరుకొని యొక శివబ్రాహ్మణుని 'వెనుకజుట్టు పట్టుక తెగ కొరికింది'. ఇట్లుకొరికి, కొరికిన జుట్టు 'నీయది కాదు నీరాజు జుట్టు కొరికితి నన్నది'. ఈ పరాభవమువలన రాజుగారు పట్టుదలతో 'ఏలూరి పట్టణమందండి జలకంఠీశ్వరు వరముచేతను, భువియందు బుట్టెను భైరవుండు, సామాన్యుండుగాడు, పుట్టె జక్క యిద్రాక్షలతోటి, విభూతిరేఖతో ప్రకాశించె, పాలు త్రాగేటప్పుడు భైరవుండు, పదివేల రూపాయలు బోసి, కొని తెచ్చి పోషించుచున్న' కుక్కను తెప్పించెను. ఆ భైరవుడు రాజుగారికా వరాహము హిరణ్యాక్షదుల సంహరించిన కేవల మాదివిష్ణువనియు తనచావు దానిచేతిలో మూడుననియు చెప్పి ససైన్యముగా బయలుదేరెను. రాజుగా రద్దానితో 'శివమతమే నిలుపుమన్నడు, భూమియందు నాకీర్తి నిలుపుమన్నడు' వరాహము నెదుర్కొనుటకు భైరవుడు 'స్థూలదేహము చంపినదండి, సూక్ష్మరూపముతో' బయలుదేరెను. రెండింటికి

ఘోరయుద్ధము జరిగెను. పగలంతయు విష్ణుసమయమున పందికిని, రాత్రి రుద్రభాగమున భైరవునకు బల మతిశయించెడిది. వరాహము భైరవుని కోరతో సరికివైచి 'శివకేశవులకు భేదమెంచినా, రాజు యేడి చక్రవర్తి యేడని, రాజుమీద పడనున్నది పంది'. ఆరాజుకు 'రాత్రి పగలు చావు లేదట, కత్తి కఠారితో చావు లేదట, గొప్ప తపస్సు చేసినవారు. శివభక్తులలో ధురంధరులు, కత్తికి లింగము కట్టినవాడు, కర్రకు లింగము కట్టినవాడు, ఆకాశంబున చావులేదు, భూమియందున చావు లేదు, రాత్రిపగళ్ళు చావు లేదు. హిరణ్యాక్షునికున్న వరములట్లు కార్తవీర్యునికిగూడ ఈ వరములుండుట వింత. వరాహము అసుర సంధ్యవేళ రాజును కోరతో చంపి కోటపెల్లగించి అంతఃపురము ప్రవేశించి మూడు దినములు కొలువుదీరెను. కార్తవీర్యుని తమ్ముడు సోమయ్యాలింగము వరాహముతో యుద్ధము చేసి యోడి క్రిందపడెను. వరాహమూర్తి యాతని జంపక 'నీకు విద్యాబుద్ధి చెప్పినవాడు, శివకేశవులకు భేదము లెంచి, వీర శైవము ఎవరు చెప్పిరి, నాకు ఆగురువును చూపించితివేని, ప్రాణములతో నే విడుతునన్నది' అప్పుడా సోమన్నలింగము 'రావయ్యా అవతారమూర్తివి, లోకములోని పందివనుకొంటిని, నాకు విద్యాబుద్ధి చెప్పినవాడు, లింగమతము బోధించినవాడు, లింగధారణము చేసినవాడు, కులగురువు కోటయ్యాలింగము, అతని తమ్ముడు పిల్లన్నలింగము, నాలుగు బారల మనుజుడు వాడు, నన్నూరేండ్లాయువు గలవాడు, నాలుగు పళ్యముల భోజనము, హఠము గల్గిన చోటునాను, చక్రాతను నారి తీసును, మానసంబున శివుని తలచును, వానియొక్క పేరు దలచితే, గుర్రాలు గుగ్గిళ్ళు తినవు, ఏనుగులు మేత తినవు, పసిపిల్లలు పాలారగించరు, నీవంటి అవతారములాను, అనేకులను తెగటార్చినవాడు, వాని వధించి మళ్ళివస్తివా, వీరశైవము విడుతునన్నడు, వీరవైష్ణవము పుచ్చుకొందు ననెను. సోమయ్యాలింగమును వెంట నిడుకొని వరాహమూర్తి చంద్రగిరి పర్వతము దాటి శైవాచార్యులున్న పిక్కారివారిపాలెము చేరుకొనెను. మొదట పాపమ్మలింగము పందినెదుర్కొని పోరాడి విసిగిపోయెను. తరువాత చిన్నవాడు పిల్లన్నలింగము పోరాడి మరణించెను. చివరకు పెద్దవాడు కోటయ్యాలింగము హఠయోగమున శివుని ధ్యానించెను. శివుడు ప్రత్యక్షమై వరాహమూర్తిని శరణు వేడకున్న మరణింతువని చెప్పెను. కోటయ్యాలింగము వీరావేశముతో 'బత్తీసాయుధములు'1 ధరించి వరాహమూర్తితో పోరాడెను. కొంతకాల మాతనిదే

1. ద్వాత్రింశదాయుధా పృధ్వీ-ఖడ్గాయుత్తైవ దృశ్యతే

పైచేయిగా నుండెను. కాని తరువాత కాళ్లు విరిగెను. శివుడు ప్రత్యక్షమై 'దాని చేతిలో నీవు చల్లవు, నీచేతిలో అది చెల్లిపోవు'నని వాస్తవము చెప్పెను. కోటయ్యలింగము పందిపై నెక్కి పట్టినపట్టు విడువడయ్యెను. కంపలలో ముండ్లలో పొరలించి పంది యాతని ప్రేవులు చర్మము డుల్లినట్లు చేసెను. అహోబల తటాకమున మూడు దినములు మునిగినను కోటయ్యలింగము జల స్తంభనముచే ప్రాణములు కాపాడుకొనెను. వరాహ మాతని శివభక్తికి మెచ్చి తన గడువు తీరినదనియు, తులసి దళములతో తన నామము తీసి హృదయమం దుంచుకొమ్మనియు నీవు కైలాసమునకు నేను వైకుంఠమునకు పోవుదమనియు చెప్పెను. కోటయ్యలింగ మటులే చేయ 'అంత్యకాల సమయమందున హరి మంత్రము వాని హృదయమందున, ఉప్పొంగుచువచ్చె నతనికి'. దేవతలు ప్రత్యక్షమైరి. వారొకరు కైలాసమునకు ఒకరు వైకుంఠమునకు పోయిరి.'మీద వున్న కోటయ్యలింగము, పందిమీద తన శిరము బెట్టుకొని, ప్రాణము విడిచెను కోటయ్యలింగము, భూమియందు జనులకు తెలియగను, శివకేశవులకు భేదము లేదని, పానవట్టమై నిలిచిపోయెనట, అప్పుడు చూడవచ్చిన దేవమానవులు, గుడికట్టి శిఖరంబు నిలిపిరి, ఒకవైపున వరాహరూపము, మధ్యమందున శివ స్వరూపం, భేదములేక తెలియుటకొరకై, యిప్పటి యీవేళరోజుకు, అహోబిల దివ్యస్థలమందు, పూజలు నమస్కారములును, ధూప దీప నైవేద్యంబులు, మరి జరుగుచున్నవి'.

వీరశైవవీరవైష్ణవుల పరస్పరమతకలహములను జూచిన జానపద కవి యెవరో కవిబ్రహ్మ తిక్కనవలె తాను శివకేశవుల కభేదము కల్పింప నెంచి హరిహరనాథస్వరూపమును చిట్టచివర ఘట్టమున ప్రతిపాదించెను.

శిష్టులు రచించిన వైష్ణవవాఙ్మయమున చూర్ణికలు వచనములు నున్నటులే జానపదవాఙ్మయమున గూడ నవి కలవు. 'శ్రీమన్నారాయణా మీ మూర్తినే శ్రీరంగముం జేరి పుణ్యాత్ములం గూడి కావేరీస్నానంబు చేసి మహాపాపముల న్విదలించి రంగమందిరద్వారంబు జేర నచ్చోట సప్తప్రాకారంబులం జూచి' యనెడు '*శ్రీరంగమాహాత్మ్యంబు*'ను (కాకతీయప్రతాపరుద్రుని కాలమువాడై 'ఓరుగంటి వృత్తాంతము' చెప్పిన కృష్ణమాచార్యుల 'సింహగిరినరహరి వచనము' లతో పాటు శ్రీరంగనాథుని పైగల వచనములును ఒకే తాళపత్రగ్రంథమున నున్నవి. ఇవికూడ కృష్ణమాచార్య విరచితములై యుండును.) 'శ్రీపురుషోత్తమా

శ్రీకూర్మం, లోలార్కం, వైకుంఠం, రంగనాథం, సర్పవరం, కనకగిరి, కనకాంబరగిరి, గోవర్ధనగిరి, అంజనగిరి, రామగిరి' యని సాగిపోవు 'నూట యెనిమిది దివ్యస్థలములు'ను, 'దేవా మీదివ్యతేజస్సు సూర్యుండెరుగు, మీ భుజబలంబు కోదండంబెరుగు, మీ మహిమ విశ్వామిత్రుండెరుంగు, మీ వందనంబు వసిష్ఠవాల్మీక్యాదు లెరుంగుదురు,మీ భక్తి దశరథుండెరుంగు' ననెడు 'శ్రీవేంకటేశ్వర మాహాత్మ్యము'ను అట్టి వాని కుదాహరణములు ఇవి వచనము లైనను వైష్ణవులు కొంత దీర్ఘములు తీసి గేయములవలెనే పాడుకొందురు. ఈ వచనములను, 'భారత సావిత్రి'యు జానపదుల రచనలు కావు నిర్నిబంధములగు గేయము లగుటనుబట్టి జానపదవాఙ్మయములోనికి వచ్చి చేరినవి.

వైష్ణవవాఙ్మయమునకు సంబంధించినట్టి యముద్రితములగు గేయములు కీర్తనములు వచనములు నాకు తెలంగాణమున పెక్కు లభించినవి. సాగరాంధ్రమునకన్న తెలంగాణమున వైష్ణవ మధికముగా నున్నట్లున్నది. మహబూబు నగరం, ఆదిలాబాదు, ఓరుగల్లు మండలములందు గొప్ప ప్రపన్నకుటుంబము లిప్పటికిని కలవు. గ్రామాధికారులగు రెడ్లు వెలమలు నియోగులు (గోలుకొండ వ్యాపారులు) అధికముగా వైష్ణవులు. కనుకనే కొన్ని ప్రదేశములందు స్మార్త బ్రాహ్మణులు లేని గ్రామము లున్నను వైష్ణవకుటుంబ మొక్కటియైనను లేని గ్రామములు లేవు.

నేను సేకరించినవానిలో 'ఆళవందారు ఉయ్యాలపాట' 'తిరునామము' 'శ్రీరంగస్తోత్రము','రామానుజ ప్రభావము'వంటివి ప్రశస్తములు. వీనిలో చివరి మూడును చిన్నగేయములు కనుక 'ఆళవందారు ఉయ్యాలపాట' నొక్కదాని నిట నుదాహరింతును. ఈ పాట ఆర్నకొండయను గ్రామమున (కరీంనగరం మండలము) శ్రీ బి. మంగయ్యగారి ద్వారమున సేకరించితిని. పాడి వినిపించినది కేశమ్మయను రెడ్డివనిత.

ఈ గేయమందు కథాభాగము తక్కువ. కేవలవేదాంతభాగము మరియు నాచార్యప్రపత్తియే అధికముగా గలవు.

శ్రీమన్నారాయణుని ఉయ్యాలో చిత్తమందున నిలిపి ఉయ్యాలో
సౌఖ్యంబు గనవలె ,, చక్కగా మనసుతో ,,
మూలాధారమందు ,, మరి విష్వక్సేనుండు ,,
తొలుత పూజలు చేసి ,, తోరంపు గణపతికి ,,

ఆరువందలపూజ ఉయ్యాలో
కుంకుమవర్ణంబు ,,
మొదటిచక్రము దాటి ,,
ఆనందమయుడైన ,,
ఉత్పత్తికారకుడు ,,
అట ఆరుదళములు ,,
శ్వేత వర్ణంబును ,,
మరి దాని దాటితే ,,
పదియు దళంబులు ,,
శ్యామల వర్ణంబు ,,
నాల్గువేలా జపము ,,
అదియు దాటిపోతె ,,
ద్వాదశ దళములు ,,
శంఖనాదము గలదు ,,
నాల్గువేలా జపము ,,
వపన నది దాటితె ,,
షోడశదళములు ,,
కంఠస్థానంబందు ,,
మేఘనాదంబును ,,
అదియు దాటిపోతె ,,
భ్రూమధ్యమందున ,,
ఇచ్ఛశక్తియు గలదు ,,
పొన్నది త్రయమూర్తి ,,
ప్రణవనాదము మ్రోగె ,,
మూలమంత్రంబయ్యె ,,
నాల్గువేల జపము ,,
పరగనది దాటితె ,,
సహస్రార చక్రంబు ,,
ఝుంకార నాదంబు ,,
క్రియశక్తితో మూడు ,,
అజపయోగముచేత ,,
భవిష్యదాచార్యులు ,,
ద్వయమంత్రరత్నము ,,
చరమశ్లోకార్థము ,,

అట చతుర్దళములు ఉయ్యాలో
కూర్మితో నుండును ,,
స్వాధిష్ఠానమందు ,,
ఆబ్రహ్మ యధిపతి ,,
ఊహించి వినరయ్య ,,
నాల్గువేలపూజ ,,
చెలి జ్ఞానశక్తుండు ,,
మణిపూరకంబుండు ,,
పరమాత్మ డధిపతి ,,
సరివేణునాదంబు ,,
అతడె రక్షణకర్త ,,
అనాహతచక్రంబు ,,
ధవళకుంభపుకాంతి ,,
శంకరుం డధిపతి ,,
నలరు లయకర్త ,,
విశుద్ధచక్రంబు ,,
శఠగోపు లధిపతి ,,
కడు ధూమ్రమవర్ణంబు ,,
నాల్గువేలా జపము ,,
అజ్ఞేయ మున్నది ,,
ఘూరిమణుల కాంతి ,,
ఇల రెండు దళములు ,,
పెన్నిధి త్రికూటముల ,,
పరగ నష్టాక్షరి ,,
మునులకు నెల్లను ,,
నయముతో జేసియు ,,
ఫాలభాగము గలదు ,,
చిత్రవర్ణమునుండు ,,
జపములు వెయ్యాయె ,,
క్రియశక్తు లాయెను ,,
అన్ని చూడగవలె ,,
భాష్యకార్లధిపతి ,,
దర్శనం బాయెను ,,
సర్వసారాంశము ,,

సకలపాపవినాశి ఉయ్యాలో
వారిసేవలు చేసి ,,
కాయపురిని దెలిసి ,,
సంసారదుఃఖంబు ,,
మంటిబొమ్మలవంటి ,,
మమకార మణచియు ,,
మనసు జయించియు ,,
చిల్లులు బోయితె ,,
ఇట్టి ఘటముతో మనకు ,,
జననమరణము లేసి ,,
గురుడు శ్రీనాథముని ,,
కలియుగాదివరకు ,,
ఫలసిద్ధి గాంచియు ,,
పూర్వపు యోగులు ,,
కలికాల మహిమచే ,,
అప్పటినుండియు ,,
పరగ యోగంబును ,,
ఖలిన మొందిననుండి ,,
కష్టముల జాసియు ,,
కారణ కర్తయు ,,
ఇతడె దేవుండనుచు ,,
ఉభయ విభూతులకు ,,
విశిష్టాద్వైతంబు ,,
భక్తి యోగముకన్న ,,
ఇహపర సాధనము ,,
పరగ యోగముకన్న ,,
రామానుజాచార్యులె ,,
పన్నిద్దరాళ్వార్లు ,,
ఈనిష్ఠతో సాటి ,,
పరగ ప్రపన్నులకు ,,
ధర నుస్తులావురీ ,,
తిరునహరాహ్వయుడు ,,
పరవస్తు శ్రీనివాస ,,
పట్టుమని బోధించె ,,

సద్గుణుడు గలడమ్మ ఉయ్యాలో
వరయోగనేర్పుచే ,,
కలిని దాటగవలె ,,
చాల దాటగవలె ,,
మాయ శరీరాలు ,,
మాయ దాటగవలె ,,
మార్గము గనవలె ,,
మల్లి అక్కరరాదు ,,
ఎక్కువ కష్టాలు ,,
ఘనయోగసాధన ,,

కడువాడి జేసియు ,,
పరమపద మొందిరి ,,
పోయిరి మోక్షము ,,
కష్టమని యోగంబు ,,
ఆళవందారులు ,,
ప్రయోగ మొనరించె ,,
కలికాల మనుజులకు ,,
కడు సులభమాయెను ,,
కరుణ యామునముని ,,
ఇల యోగీశ్వరుల జూపె ,,
విభవుండు ఇతడనె ,,
విశదంబుగా జేసె ,,
బలమే ప్రపత్తియు ,,
ఇందువెంటనె గలుగు ,,
ప్రపత్తియే మేలు ,,
రక్షించువారలు ,,
పట్టిచూపిన నిష్ఠ ,,
ఏనిష్ఠ లేదండి ,,
పరమపదమేనండి ,,
వరరామయాత్మజుడు ,,
తిరువేంగళదాసునకు ,,
పరమ గురువరుండు ,,
ఇట్టి రహస్యంబు ,,

| | | | |
|---|---|---|---|
| ఎన్నటికి వారికిని | ఉయ్యాలో | కన్నట్టివారికిని | ఉయ్యాలో |
| చదివినవారికి | ,, | సకలార్థములు నబ్బ | ,, |
| యోగ్యప్రపత్తుల | ,, | యోగ్యతకలవారు | ,, |
| అనుభవజ్ఞులైతె | ,, | అంత్యకాలంబున | ,, |
| లక్ష్మీశు డిచ్చును | ,, | మోక్షసాయుజ్యంబు | ,, |

ఈ గేయమును రచించినది నుస్తులాపుర గ్రామవాసియగు తిరునహరి తిరువెంగళదాసని తెలియుచున్నది. ఈతనికి గురువు పరవస్తు శ్రీనివాసాచార్యులు.

మన దేశమున మతమున కెంత స్థానమున్నదో ప్రజాజీవితము ఆయా మతముల ప్రభావమున నెట్లు పరిణతినందినదో వేరుగా చెప్పనక్కరలేదు. పండితులు శిష్టులైనవారియందువలెనే పామరులు గ్రామీణులైనవారియందును మతమునకు గల యధికారమును, దానికి వారి సాహిత్యమున గల స్థానమును ఇంతవరకు విమర్శించిన మతసంబంధగేయములు చాటునని తెలుపుచు నీ ప్రసక్తి నింతటితో విరమించుచున్నాను.



# పారమార్థిక గేయములు

భక్తి కర్మజ్ఞానమార్గములు మూడును మోక్షసాధనములని భారతీయుల నమ్మకము. ఈమూడింటికి నాయా మతములవారు విపులవ్యాఖ్యానము లొసంగిరి. ఒకరు భక్తిమార్గమునకే ప్రాధాన్య మిచ్చిన మరియొకరు కర్మమార్గమునకు ప్రాధాన్య మిచ్చిరి. ఇటులే ఇంకొకరు జ్ఞానమార్గమునకును ప్రాముఖ్య మొసంగిరి. ఒకే మార్గమందు గాఢాభిమానముగలవారు కొందరితరమార్గముల నంగీకరింపకపోవుటయేగాక వానిని దూషించిరి కూడ. కొందరు విజ్ఞులీ మూడును పరస్పరభిన్నములే కాక పరస్పరవిరుద్ధములనిన మరికొందరీమూటిని సమన్వయ పరచి పరస్పరోపకారకము లనిరి. కుమారిలభట్టు వంటి కర్మఠుడు సాంఖ్య యోగమును నాస్తికము (వేదవిరుద్ధము)గా భావించిన1 ప్రాచీనుడగు శంకరుడును, అర్వాచీనుడగు రామకృష్ణుడును అద్వైతవేదాంత (జ్ఞాన) మార్గావలంబులైనను భక్తిసంకలితులై మూర్తి పూజలు చేసినవారే.

'స్వస్వరూపానుసంధానం భక్తి రిత్యభిధీయతే
స్వాత్మతత్త్వానుసంధానం భక్తిరిత్యపరే జగుః' 2 ' అని శంకరుడు

ఆత్మపదార్థయాథార్థ్యవిచారతత్త్వమును భక్తితో మేళవించెను. భగవంతుని యపారకృపావిశేషములు, లీలలు, మాహాత్మ్యములు మహోద్వేగముతో కొనియాడెను సూక్ష్మములకు దిగి తర్కములు పెంచుకొన్నచో నాయా విభేదములు పండితులకు గానుపించునేమో కాని స్థూలదృష్టికి వానియందంత భేదము లేదు జానపదులందీ విషయమున కించిన్మాత్రము భిన్నాభిప్రాయమును లేదు. అనగా 'కృష్ణా రాంరాం గోవింద హరిహరి' యని ఏకతార మీటుచు, పాడుకొనెడు భక్తుడే 'గూట చిలుకేదిరా చిన్నన్నా గూడు చినబోయెరా'యని

---

1. తంత్ర వార్తికము.
2. వివేకచూడామణి.

తత్త్వమును పాడుకొనుచు, తెల్లవారగనే ఏ వ్రతమునకో ఏకర్మకో కావలసిన సంభారములను సిద్ధము చేయుటలో నిమగ్నుడగును ఇంతకు చెప్పవలసిన దేమన జానపదులం దీమూడు మోక్షమార్గములను ఆదరణ గాంచినవి. కనుక నీమూడు సాధనముల ప్రభావము జానపద గేయములం దెంతకలదో ఒక్కొక్కటిగా విమర్శింతము.

# భక్తి గేయములు

కర్మ భక్తి జ్ఞాన మార్గములందు భక్తిమార్గము సులభసాధ్యము. తక్కిన రెండుమార్గములకున్న విధినిషేధపు కట్టుదిట్టము లీమార్గమునకు లేవు. కనుకనే వీరశైవవీరవైష్ణవాది భక్తిమతములు ప్రజాబాహుళ్యమున నధికవ్యాప్తి గాంచినవి. బ్రహ్మజిజ్ఞాసకు సాధనచతుష్టయము(వివేకము, వైరాగ్యము, శమాది షట్కసంపత్తి ముముక్షుత) అవసరమని శంకరులును, సమగ్రవేదాధ్యయన మావశ్యకమని జైమిన్యాదులును, ఆవేదాధ్యయనమునకు బ్రహ్మక్షత్రియ వైశ్యజాతులవారే యర్హులని వేదాంతులును మీమాంసకులును తీరుతీరుల కట్టుదిట్టము లేర్పరిచిరి. భక్తిమార్గమున కిట్టి యాటంకములు లేవు. భక్తి మార్గ మవలంబించుటకు చదువుసంధ్యలు కాని, అభిజాత్యము కాని యవసరము లేదు. భగవదనుగ్రహమున విశ్వాసమును తదనుగ్రహమున మోక్షప్రాప్తి కలుగునను నిశ్చయముండిన చాలును.

శ్లో. అపిచేత్సుదురాచారో భజతే మామనన్యభాక్
సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః

శ్లో. మాం హి పార్థ వ్యపాశ్రిత్య, యేఽపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాంతి పరాం గతిమ్.

అని భగవద్గీత (9-30·32)లో శ్రీకృష్ణ భగవానుడును,

కిరాత హూణాంధ్ర పుళింద పుల్కసా
ఆభీర కంకా యవనాః కసాదయః
యేఽన్యే చ పాపా యదుపాశ్రయాశ్రయాః
శుద్ధ్యంతి తస్మై ప్రభవిష్ణవే నమః అని భాగవతము (2-4-18) లో శ్రీ శుకుడును,

శ్లో. నరత్వం దేవత్వం నగవనమృగత్వం మశకతా
పశుత్వం కీటత్వం భవతు విహగత్వాదిజననమ్
సదా త్వత్పాదాబ్జస్మరణ పరమానందలహరీ
విహారాసక్తం చేత్ హృదయమిహ కిం తేన వపుషా.

అని శివానందలహరిలో శంకరుడును భక్తికి అర్హులగువారినిగూర్చి చెప్పియున్నారు కనుకనే యిట్టి సులభసాధ్యమగు మార్గము నవలంబించి జానపదు లనేకులు తరించిరి. భక్తికి పూజ్యపూజకభావము బీజము. పూజ్యమూర్తి నాయా మతములవారు తమకు తోచినటుల నిర్ణయించుకొనిరి కొందరు శివకేశవాది సాకారసగుణబ్రహ్మమును, కొందరు తద్బ్రహ్మప్రతీకమును, కొందరా సగుణ బ్రహ్మ యవతారమూర్తులను, కొందరు జీవత్వమును, కొందరు సమస్త విశ్వాకారమును, మరికొందరు కేవలమాత్మను పూజ్యపదార్థముగా నారాధించి భక్తి చేతురు. ఇట్టి భక్తి పదునొకండు రూపములు.

'గుణమాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, వాత్సల్యాసక్తి, కాంతాసక్తి, ఆత్మనివేదనాసక్తి తన్మయతాసక్తి పరమవిరహాసక్తి, రూపా ఏకధా అపి ఏకాదశధా భవతి' [1]

భక్తులు తమతమ మనోభావముల కనుకూలముగా నయ్యైతీరుల భగవంతు నారాధించి సంస్కృతమునను దేశభాషలందును వేనవేలు గేయములు రచించిరి. భక్తిసారస్వతము దక్షిణమున ఆళ్వారులచేతను, మతాచార్యుల చేతను, నాయన్మారులచేతను పెంపొందినది. అటులనే ఉత్తరభారతమున రామానందుడు, రవిదాసు, నరసింహమెహతా, కబీరు, మీరాబాయి, తులసీదాసు, వల్లభాచార్యులు నానకు, మున్నగు వారును; మహారాష్ట్రప్రాంతమున నామదేవు, తుకారాం, సమర్థరామదాసు మున్నగువారును; వంగదేశమున చైతన్యుడు, విద్యాపతి, చండీదాసు, గోవిందదాసు, రామప్రసాదు, మున్నగువారును భక్తిసారస్వతము నితోధికముగా రచించిరి. ఆంధ్రదేశమున శైవవైష్ణవభక్తిగేయములు కీర్తనలు లక్షలకొలది రచింపబడినవి. పూర్వ శైవుల తుమ్మెదపదము లిప్పటికి నిల్చియుండుట మన భాగ్యవిశేషము. తాళ్ళపాకవారి సంకీర్తనలకు లెక్కయే లేదుకదా! క్షేత్రయ్య నాల్గువేలు సుమారుగా పదములు రచించెనట. త్యాగరాయ లెన్నికీర్తనలు రచించిరోకాని మిగిలినవి మాత్రము వందలలెక్కలో నున్నవి. కాని ఈ భక్తుల రచనములందు వ్రేళ్ళపై లెక్కింపదగు కొలది గేయములే

1. నారద భక్తి సూత్రములు, సూ. 82.

జానపదుల కందినవి. తక్కినవి సంగీతజ్ఞుల సొమ్మైపోయినవి. ఈవిషయము గూర్చి శ్రీపాదవారిటులభిప్రాయపడిరి. 'సాహిత్యమునుంచి సంగీతములోనికి తప్పుకున్న క్షేత్రయ పదములూ, దాసు శ్రీరాములు కీర్తనలూ, సంగీతరచనలే కాని దేశిసారస్వతము (జానపదవాఙ్మయము) లోకి రావేమోనంటాను. వాటి ప్రచారము వాటిలోని సంగీతమువల్లనే కాని సాహిత్యమువల్ల కాదు. అధ్యాత్మ రామాయణకీర్తనలు మట్టుకు కథాప్రాధాన్యము కూడ లెక్కపెట్టి సాహిత్యము మీద మొగ్గుంచి రచించినవి' 1

జానపదులం దధికాదరణము పొందిన గేయకర్తలలో నగ్రగణ్యుడు భద్రాచల రామదాసు(కంచెర్లగోపన్న). తూము నృసింహదాసు, పరాంకుశదాసు, నిట్టల ప్రకాశదాసువంటి భక్తుల గేయములుకూడ బహుళప్రచారము గాంచినవి. 'దండము తిరుపతికొండ - యిది - దండము సిరిగలకొండా' 'పరాకు సేయుట పాడిగాదురా - పరమపురుష వరద' యని పాడుచు ఊరూరు తిరిగెడు హరి దాసుల కన్నము బెట్టించినవాడు తాటంకము వెంకటదాసు. ఇప్పుడిప్పుడు తగ్గి పోవుచున్నను ఈ శతాబ్దము ప్రథమార్ధమువరకును తెలుగుదేశ మంతటను గ్రామగ్రామమున భజనమందిరములో భక్తకూటములో యుండెడివి. స్థానిక భక్తులు రచించిన గేయములుగాని సంచారకపుస్తక విక్రేత లమ్ముకొనెడు చిట్టిపొట్టి పుస్తకములందలి కీర్తనలుగాని, రాత్రి తొమ్మిది యగుటతోడనే చిరుతలో, చిటితాళములో, కాళ్ళగజ్జెలో, కోలలో లేదా తంబురయో ఎదేనొక యుపకరణ మాధారముగా ఊరంతయు గింగురుమని మ్రోగిపోయెడివి. పసుల కాపరులు పనిపాటలవారు ముసలివారా కీర్తనలు గేయములు విని వల్లించెడువారు. ఇట్టి పాటల పుస్తకము లసంఖ్యాకముగా నచ్చైనది. రఘుపతిదాసు గురుపూజ కీర్తనలు, కరిమేల హనుమయ్య రామనామము, చెంచురామకవి రామనామ మాహాత్మ్యము (ఎన్. వి. గోపాలకంపెనీ వారి) భగవన్నామ సంకీర్తనలు, రామానుజదాసు ప్రసన్నరాఘవ దివ్యనామము, ముదిగొండశంకరదాసు శివనామసంకీర్తనలు, భోజదాసు హరిభజనకీర్తనలు కొల్లామల్లయ్య రామ భజనామృత కీర్తనలు, కొంతం కొండలరావు భజనకీర్తనలు, అల్లూరి వెంకటాద్రిసాముల హరినామసంకీర్తనలు, నిట్టల ప్రకాశదాసు కీర్తనలు

1. కిన్నెర, డిసెంబరు 1953

ప్రకాశదాసు కీర్తనలు, రఘునాథాచార్యుల చెన్నకేశవ భజనకీర్తనలు, నరసింహదాసు సీతారామ భక్తికీర్తనలు, గుండదాసు విఠలేశ్వర భజనకీర్తనలు, మునుస్వామి పండరినామావళికీర్తనలు, ఆదిశేషశర్మ హరిహరనామ సంకీర్తనలు, నరసింహాచార్యుల తిరునామములు, నారాయణదాసు పాండురంగ బృందావన సంకీర్తనలు, నిత్యానందస్వామి భజన కీర్తనలు, నాగదాసు భక్తిసారసంగ్రహ కీర్తనలు, రాపాక రామకవి (కాశీనాథకవులు-పర్కాల) భజనమాల, ఇంద్రగంటి సూర్యకాంతము (గోకవరము) కాలేషామస్తాన్‌దేవుని కీర్తనలు, చందనసాంబ శివరావు కుసుమహరనాథ కీర్తనలు, సుమారు 20 రచయితల కీర్తనలున్న భగవన్నామసంకీర్తనలు (కో. లక్ష్మణ మొదలియారు ప్రచురించినది 1932), శ్రీశైలభ్రమరాంబికాష్టకము. నూతనభజన కోలాటకీర్తనలు, రాకమచెర్ల వెంకటదాసు కీర్తనలు, దివిలె నరసింహరాజు భజనకీర్తనలవంటి వెన్నియో అచ్చైనవి కలవు. ప్రత్యేక భక్తిగీతములుగ కాక ఇతరములగు పాటల పుస్తకములందు స్త్రీలపాటలు(కాళహస్తి తమ్మారావు అండ్ సన్సువారి ప్రచురణ) స్త్రీలపాటలసంచిక (బళ్ల వెంకన్న అండ్ సన్సువారి ప్రచురణ) మరిరెండు స్త్రీలపాటల సంపుటములందును, శ్రీ నేదునూరి గంగాధరంగారు సేకరించిన మంగళహారతులు ప్రథమద్వితీయభాగములందును, 'సేలయేరు' జానపదగేయ సంకలనమందును అచ్చైన పాటలు కొన్ని కలవు. అచ్చుకానివి లక్షోపలక్షలు మౌఖికప్రచారమున ప్రాణములు నిలుపుకొని యున్నవి. అచ్చుకానట్టి తెలంగాణా జానపదగేయముల కొన్నింటిని నేను సేకరించితిని. ఇన్ని పుస్తకములగూర్చి కాని ఇందరు రచయితలగురించి కాని వ్రాయబూనుట ప్రకృతము తరముగాని పని కనుక కొన్ని ప్రసిద్ధములగు (కీర్తనముల) గేయములనే విచారింతము. భక్తిగేయములందు సంకీర్తనములు, పదములు దరువులతోపాటు మేలుకొలుపులు, లాలి పాటలు, జోలపాటలు, మంగళహారతులును చేరును.

ఆంధ్రదేశమున పోతరాజు, గోపరాజు, త్యాగరాజు మహాభక్తులు. పోతన్న భక్తి భాగవతకల్పతరువుగా నవతరించినది. త్యాగరాయలవారి భక్తి నాదసుధారసమై దక్షిణభారతీయసంగీతము నమరము చేసినది. దీనిలో సంగీతము పాలు హెచ్చు. ఇరువురి మధ్యనున్న గోపన్నగారు సంగీతసాహిత్యములను సమముగా మేళవించి భక్తిసారస్వతసస్యముల దేశము నలుమూలల వెదజల్లిరి. శ్రీరామచంద్రున కాంధ్రత్వము కల్పించినది గోపరాజు. రాముడు, లక్ష్మణుడు,

సీతమ్మ మనలోనివారై పోయిరి. అనగా జానపద సాహిత్యలక్షణములం దొకటగు సాధారణీకరణము గోపన్నగారి కీర్తనలం దధికముగా గానవగును. రాముడు సీత వంటి యవతారమూర్తులను సజీవులనుగా, మనలోనివారివిగా గోపన్న చేసెను. కనుకనే యాతని గేయము లందరి గేయములకన్న నధిక వ్యాప్తి గాంచినవి. తరువాత భక్తకవులెందరో రామదాసుగారి కీర్తనల కనుకరణములుగా తాము రచించిరి. రామదాసుగారి యడుగుజాడల నడచిన తూము నృసింహదాసు రామదాసుచరిత్రమునకు ప్రచారము గల్పించెను. 'భద్రాచల మాహాత్మ్యము'న రామదాసు మరియు నరసింహదాసుల కవిత్వములు పాలుపంచదారలై పోయినవి. సింగరిదాసుకూడ నృసింహదాసు కోవలోనివాడే. వీరు సమకాలీనులగు భక్తులు. గోపన్న తానాషా కాలమువాడని కొందరు నిర్ణయించిరి. మరికొందరిది పుక్కిటిపురాణ మనిరి. ఈసుల్తాను క్రీ. శ. 1658-1687 ప్రాంతమున గోలకొండ రాజ్యమును పరిపాలించెను. గోపన్న తన మేనమామలగు అక్కన్నమాదన్నగారల ప్రాపకమున రాజకీయోద్యోగి యయ్యెను. భద్రాచలప్రాంతములకు తహసీలుదారుడై ప్రభుత్వద్రవ్యమును వెచ్చించి శ్రీరామాలయము మున్నగునవి నిర్మించి, యా నేరమునకు 12 వత్సరములు కారాగారమునం దుండెననియు, తుదకు రామలక్ష్మణులు వచ్చి నవాబునకు పైకము చెల్లించి గోపన్నను విడిపించిరనియు చెప్పుకొందురు. గోపరాజు రామభక్తి యపారము. కనుకనే యాతడు రామదాసని పేరు గాంచెను. దాశరథీశతకము రామదాసుగారి పద్యకవిత్వమునకు చక్కని యుదాహరణము. రామదాసు మూలముగా తానాషాకు కూడ శ్రీరామదర్శన మయ్యెను. 'భద్రాచల మాహాత్మ్యము' 'రామదాసు చరిత్రము' మున్నగు గ్రంథములందు గోపన్న (రామదాసు) జీవిత చరిత్రమంతయు విపులముగా వర్ణింపబడినది. హరిదాసుల చేతను, దాసరులచేతను, భక్తులచేతను రామదాసు పేరుతో బహుళ ప్రచారము గావింపబడిన కొన్నికీర్తనలను స్థాలీపులాక న్యాయమున విచారింతము.

కబీరుదాసు రామదాసుగారికి తారకమంత్ర ముపదేశించిరట. అప్పుడే యాభక్తుడు మహాసంతోషముతో నుప్పొంగిపోయి

'తారకమంత్రము కోరిన దొరికెను ధన్యుడనైతిని ఓరన్నా
మీరిన కాలుని దూతలపాలిటి మృత్యువయని నమ్మిక యున్నా' యను

కీర్తనమును పాడుకొనెను. ఈకీర్తనమున రామదాసు 'అన్నిటి కిది కడసారి

జన్మము సత్యం బిక పుట్టుట సున్న' యనుటచే భక్తియే మోక్షసాధనముగా నాతడు భావించెనని మనము నిశ్చయింపవచ్చును. ప్రేమరూపమైన భక్తి,ముక్తి రూపమగు బ్రహ్మానందమేయని 'అమృతస్వరూపా చ'1 యను సూత్రము వెల్లడించుచునే యున్నది. గోపన్న శ్రీరామచంద్రుని కాలమున పుట్టకపోయితిని గదా యని పరితపించిన గేయమత్యద్భుతము. 'ఆశ పుట్టెనే శ్రీరాములతో హాహా నే పుట్టనైతిని రఘురాములతో అయ్యో నే పుట్టనైతి'. ఈ కీర్తనమున తాళప్రాధాన్యము హెచ్చి సంకీర్తనము దరువై మద్దెలను గుబిగుబి మోదినను కొన్ని చక్కని భావములున్నవి. 'జనకుడు హరికి జానకిని పెండ్లి సేయగా వారిద్దరికి శేష (సేస) బియ్యము నే దెత్తునా, అమ్మకు హరికి ఆకులు మడచి యిత్తును.... కైకేయిని నే కాదందునుగద, రాముల కయినా రాజ్యమిత్తు గద, ప్రభువై యేలగ పను లొనర్తుగద, అడవికి పోగా నంటి పోదుగద, .... హరి దుఃఖింపగా అమ్మజాడ నే దెత్తును. సర్వజ్ఞమూర్తి చాలు నీ విరహమందును, విశ్వములో నందరు విననట్టె ఊరకుండిరి, సురవరు లందరు ముఖము చూచుచుండిరి,అయ్యో యిదియేమని,ఆ బ్రహ్మాదుల శోధింతునుగద, అమ్మకు మారుగ అగ్నిలో జొత్తును,బ్రహ్మాదులు హరి ప్రస్తుతింపగా,తల్లి మారుతికి దండ వెయ్యగా, నా తల్లి యప్పుడు నాకు వేయునుగద, కష్టపడితినని కరుణించును గద' యని భావించిన గోపన్న భక్తి జ్ఞానమువలెనే అవస్థా, కాల, స్థితి భేదములు లేనిది. జ్ఞానమార్గమున నీయభేదస్థితి గహనమైనది, గోపన్న యింతటి గహన విషయమును భక్తిమార్గమున సాధారణీకరణ మొనర్చెను.

'శ్రీరామనామం మరువాం మరువాం, సిద్ధము యమునికి వెరువాం వెరువాం'అను కీర్తనము ఆబాలగోపాలము నోటికెక్కినది. దీనిలో 'శ్రవణం, కీర్తనం విష్ణోః, స్మరణం పాదసేవనం - అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్'2 అని ప్రహ్లాదుడు చెప్పిన వివిధభజనము లున్నవి.

కోదండరామ కోదండరామ - కోదండరామ కోదండరామ
నీదండ నాకు నీవెందు బోకు - వాదేల నీకు వద్దు పరాకు
ఏ బుద్ధి వీడు ఎరుగనివాడు - పాపడు వీడు బడలియున్నాడు
పాపను లేపి ప్రజలను గల్పి - ఆపద బాపి అటు ప్రీతి జూపి

---

1. నారద భక్తిసూత్రములు. సూ. ३
2. భాగవతము. సప్తమస్కంధము.

నమ్మిన మాచిన్నవాడెందు నున్న - మమ్మేలగన్న మాయన్నవన్నియని వేడుకొని చనిపోయిన కుమారుని బ్రతికించుకొన్నప్పటి గేయము కూడ మిక్కిలి వ్యాప్తిగాంచినది. ప్రభుత్వధనము వ్యయమొనర్చిన నాపద సంభవించునని యితరులన, గోపన్న ధైర్యముతో,

'తక్కువేమి మనకు రాముం డొక్కడుండువరకు,

ప్రక్కతోడుగా భగవంతుడు మును చక్రధారియై చెంతనె యుండగ' అని పాడుకొనెను. ఇది 'యత్ ప్రాప్య న కించిద్వాంఛతి న ద్వేష్టి న రమతే నోత్సాహీ భవతి'1 అను సూత్రమునకు వ్యాఖ్యానము. ఇటులనే

'ఏతీరుగ నను దయచూచెదవో యినవంశోత్తమ రామా
నాతరమా భవసాగర మీదను నళినదళేక్షణ రామా' యను కీర్తనమును

'గరుడగమన రారా నను నీ కరుణ నేలుకోరా -
పరమపురుష యేవెరవు లేక నీ మరుగు జొచ్చితి నరమర చేయకు -
పాలకడలి శయనా దశరథబాల జలజనయనా-పాలముంచు నను నీటముంచు
నీ పాలబడితి నిక జాలము సేయక'అను కీర్తనమును' ఏమిరా రామా నావల్ల నేరమేమిరా రామ'యను కీర్తనమును, 'ఇన్ని గల్గి మీరూరకున్న నేనెవరివాడ నౌదు-కన్నతండ్రివలె రక్షించుటకును కరుణ యేల రాదు-పక్షపాత మెదలించిన చేతిలో పరుసవేది లేదా, ఈక్షణమున దయగలిగిన సంచిత ధనమున్నది కాదా, కనుగొని నిర్హేతుకకృప జూచిన కల్పతరువు లేదా' యను కీర్తనమును,

'శ్రీరామ నీనామ మేమి రుచిరా - ఓరామ నీనామ మెంత రుచిరా'
'చరణములే నమ్మితి నీ దివ్యచరణములే నమ్మితి-వారధి కట్టిన వర
భద్రాచల వరదా వరదా వరదా నీ దివ్యచరణములే నమ్మితి' -
'సీతారామస్వామి నే జేసిన నేరము లేమి' -

పలుకే బంగారమాయెనా కోదండపాణి'యనుకీర్తనములునుయావదాంధ్రమున మారుమ్రోగుచు గోపన్న భక్తిస్రవంతిని తెలుగునేల నాల్గుచెరగుల ప్రవహింప జేయుచున్నవి.

---

'యద్ (జ్)జ్ఞాత్వా మత్తో భవతి, స్తబ్ధో భవతి, ఆత్మారామో భవతి'[1] అనుమాటచే భగవద్భక్తుడు పిచ్చివానివలె ఒకపరి నవ్వును, ఒకపరి యేడ్చును, ఒకపరి నృత్యమొనర్చును, ఒకపరి కుపితుడగును, ఒకపరి నిందించును, ఒకపరి స్తోత్రమొనర్చును. ఈ భావమునే

శ్లో. ఏవం వ్రతస్స్వప్రియనామకీర్త్యా, జాతానురాగో ద్రుతచిత్త ఉచ్చైః
హసత్యథో రోదితి రౌతి గాయ, త్యున్మాదవన్నృత్యతి లోకబాహ్యః[2]

అను శ్లోకము చాటుచున్నది. ఈలక్షణము లన్నియు రామదాసులో కానవగును. చెరలో పలుబాధలు పడుచున్న రామదాసున కెంత వేడుకొన్నను రామచంద్రుడు దర్శనమీయడయ్యెను. అప్పుడాతడు

'ఇక్ష్వాకుకులతిలక ఇకనైన పలుకవే రామచంద్రా-నన్ను రక్షింప
కున్నాను రక్షకు లెవరయ్యా రామచంద్రా' యని పాడిన కీర్తనలో శ్రీరామ

చంద్రుని చక్కగా నుపాలంభించెను.

చుట్టు ప్రాకారములు సొంపుతో చేయిస్తి రామచంద్రా
ఆ ప్రాకారమునకు పట్టె పదివేల వరహాలు ,,
సీతమ్మకు చేయిస్తి చింతాకు పతకాము ,,
ఆపతకమునకు పట్టె పదివేల వరహాలు ,,
కలికి తురాయి నీకు పొలుపుగ చేయిస్తి ,,
నీవు కులుకుచు తిరిగేవు ఎవరబ్బ సొమ్మని ,,
మీ తండ్రి దశరథమహారాజు పెట్టెనా ,,
లేక మీమామ జనకమహారాజు పంపెనా ,,ఇటుల భగవంతు నుపాలంభించి

'అబ్బ తిట్టితినని ఆయాసపడబోకు రామచంద్రా
ఆదెబ్బల కోర్వక అబ్బ తిట్టితినయ్య రామచంద్రా'యని వేడుకొనెను. ఇట్టివే

'నిన్ను బోనిచ్చెదనా సీతారామ నిన్ను బోనిచ్చెదనా'
'ఒడియ మేలనిక మోక్షమిచ్చి నీ వడుగు దాటిపోరా
తడవాయెను నే నోర్వలేను దొరతనము దాచుకోరా'
'అడుగు దాటి కదలనియ్యను నా కభయ మివ్వక కదలనియ్యనూ'
'రామా నీ చేతేమిగాదుగా, సీతాభామకైన చెప్పరాదుగా,
సామాన్యులా నన్ను సకలబాధలు పెట్టు, మొరాలకించియు మోమైన జూపవు॥రా॥

1. నారద భక్తి సూత్రములు. సూ. 6
2. భాగవతము 11-2-40

శరచాపశక్తులు దప్పెనా నీ శౌర్యము జలధిలో జొచ్చెనా ॥రా॥
శంఖచక్రా ల్బట్టినందుకూ, దాసజనుల రక్షింపవదెందుకూ
పంకజాక్ష భక్త పరిపాలనము లేని, బొంకాములేగాని బింకాము లేదయ్య ॥రా॥అను

కీర్తనములు. సీతారామచంద్రులపై రామదాసునకున్న స్వాతంత్ర్యము వారితోగల చనువు ఇంతంతకాదు. రామచంద్రుని వేడుకొని విసిగి యాపరమభక్తుడు సీతమ్మ తల్లి నాశ్రయించెను. తండ్రికన్న తల్లి హృదయము మెత్తన కదా, అందును సీతమ్మ హృదయము నవనీతము. తల్లితో తండ్రిగారికి 'సఫారసు' చేయించుకొననెంచి రామదాసు

రామచంద్రులు నాపై చలము చేసినారు సీతమ్మ చెప్పవమ్మ'యనియు
'నను బ్రోవుమని చెప్పవే సీతమ్మ నను బ్రోవుమని చెప్పవే
నను బ్రోవుమని చెప్పు నారీశిరోమణి, జనకుని కూతుర జననీ జానకమ్మ' యని

వేడుకొనెను. ఈకీర్తనలో మృదుమధురములగు భావములున్నవి. రామచంద్రునికి 'సిఫారసు' చేయుటకై తగినవేళ భక్తుడిట్లు సూచించుచున్నాడు.

'ప్రక్కను చేరక-చెక్కిలి నొక్కుచు-చక్కగ పవళించె-చొక్కియుండెడు వేళ॥నను॥
లోకాంతరంగుడు-శ్రీకాంత నినుగూడి-ఏకాంతమున నేక-శయ్యనుండెడు వేళ॥నను॥
అద్రిజవినుతుడు-భద్రగిరీశుడు-నిద్ర మేల్కొను వేళ-నెలతరో బోధించి ॥నను॥

నిజముగనే రామదాసుగా రెత్తిన యెత్తు ఫలించినది. సీతమ్మ రామచంద్రునికి 'సిఫారసు' చేయనే చేసినది. రామలక్ష్మణులు భటులుగా వచ్చి పైకము చెల్లించి రామదాసును విడిపించిరట. ఆతరుణమున తానీషాకును రామలక్ష్మణులకును జరిగిన సంవాదము కూడ జానపదుల నోటికెక్కినది.

'ఏదేశమున నుండువారు మీరు ఎందుండి ఇట వచ్చినా'రను సంవాదము ప్రసిద్ధము. విముక్తుడైన రామదాసు రామనామజపము చేయుచు భద్రాద్రి చేరుకొని పాడిన పాటలు భక్తిసాహిత్యమున నెనలేని మణులు. 'రామా నీ ముద్దుమోము జూపరా సుందరరామా'యను కీర్తనమున 'మురిపెంపు కొప్పు బిగి వీడగా, ఆణిముత్యాలసరు లల్లాడగా, లేమి కిరవయిన నడుము సిరి యాడగా, అట్టె బిరబిర వచ్చి మీ పినతల్లి సుమిత్ర స్థిరముగ కస్తూరి తిలకము దిద్దినట్టి ॥రా॥' అనుభావములు సుకుమారములు.

'రామజోగిమందు కొనరే పామరులారా' వంటి గేయములు గ్రామఫోను

రికార్డులకుగూడ నెక్కినవి. ఈవిధముగా మహాభక్తుడగు కంచెర్లగోపన్న ఆంధ్ర దేశమంతటిని భక్తిసారస్వతమున ముంచియెత్తెను. ఈ శాఖయందు గోపన్న కీర్తనములు మకుటాయమానములు. కనుకనే ఒక్క రామదాసుగారి గూర్చి ఇంత విపులముగా చర్చించవలసి వచ్చినది. తరువాత భక్తులందరును రామదాసు తరువాతివారే. జానపదులందు రామదాసు కీర్తనలువలె మరింకే కీర్తనములు వ్యాప్తిగాంచలేదన్న నతిశయోక్తి కాజాలదు. పోతన్నతోపాటు రామదాసును గన్న తెలంగాణము ధన్యము. భాగవతమందును 'ఓయమ్మ నీ కుమారుడు' వంటి పామరుల నోటికెక్కిన పద్యము లుండుట మహాభాగ్యముగదా.

గోపన్న తరువాత నెందరో భక్తులు భక్తిగేయములు రచించిరి. మొదటనే ఇట్టి రచయితలను, వారి రచనములను స్మరించితిమి. ఆయా గ్రంథములందున్న గేయముల విమర్శించినచో నిది పెరిగిపోవును. కనుక ప్రసిద్ధమగు మరికొన్ని గేయములగూర్చి విచారించి భక్తిసారస్వతమందలి ఇతరశాఖల నరయుదము.

పల్లెల మునిస్వామినాయుడుగారు కొందరు భక్తుల కీర్తనలు ముద్రింపించి '*భగవన్నామసంకీర్తన*' లని పేరిడిరి. దీనిలో మొత్తము 89 కీర్తన లున్నవి. కొన్ని వేదాంతకీర్తనము లున్నను వీనియం దధికభాగము భక్తికీర్తనములే. అన్ని కీర్తనముల రచయితలు తెలియరారు. కాని పరాంకుశదాసు, పుష్పాల రామదాసు, రామానుజదాసు, బంగారుదాసు, ఘటికాద్రి రామదాసు, మీనాక్షిదాసు, భద్రాచల రామదాసు, త్యాగరాజు, సుదర్శనదాసు, భోజదాసు, నరసింహదాసు, పోతుల నారాయణదాసు, నిట్టల ప్రకాశదాసు, హిందీ తులసీదాసువంటి పేర్లు కొన్ని మకుటములను బట్టి తెలియవచ్చినవి. ఈ పుస్తకమందున్న కొన్ని ప్రసిద్ధకీర్తనములు ప్రజాబాహుళ్యమున ప్రచారము గాంచినట్టివాని నిట పరిశీలించుట యావశ్యకము.

ఆనంద భైరవి

నిలచి మాట్లాడరా నీలజీమూతవర్ణా ॥ని॥
పిలచిన పలుకవు బిగువు జేసెవు నాతో ॥ని॥
అలసి మీ పాదము లాశ్రయించితి తండ్రి
చలము చేయుట మేలా జలజలోచన నాతో ॥ని॥

యమునా కల్యాణి—చాపు: పాలించరా పాండురంగా—యిక చాలించు కోపము స్వామి శుభాంగా యను కీర్తనములు పుష్పాల రామదాసు రచనములు.

'పరాకు చేయుట పాడిగాదురా పరమపురుష వరదా—బిరాన బ్రోవక నిరాకరించుట బిరుదు నీకు తగురా వరదా' యను కీర్తన మెవ్వరిదో తెలియదు. ఎడ్లరామదాసు శిష్యు లెవ్వరో 'ఎంత వేడినా చింత దీర్చవూ కంతుజనక శ్రీరామ-శాంతమూర్తి వని భ్రాంతినొందితిని పంతమేల గుణధామా' యను కీర్తనమును రచించిరి.

'కలశాంభోనిధి కన్యామణియే కన్నతల్లి మాకు—తలపగ శ్రీమన్నారాయణుడే తండ్రి గారు మాక' నెడు కీర్తనము వైష్ణవప్రపన్నత్వమును చాటునట్టిది.

రామనామమే లడ్డంట - అది తినేవారికే తీపంట' యను కీర్తనము బాలురు కూడ సులభముగా పాడుకొందురు. దీని కనుకరణములు దేశమున నెన్నియో పుట్టినవి.

పరజు - ఆది :

రాముని మరువకువే ఓ మనసా రాముని మరువకువే
రాముని మినహా రక్షకుడెవడే - పామరత్వము లెడబాపెడివాడే'

యున్న కీర్తనము చక్కనిది. పరమభక్తుడగు పరాంకుశదాసు రచనమిది. నిజమగు భక్తుని లక్షణ మిట్లుండును. 'హెచ్చుగ సంపద వచ్చినగాని - ఏనుగు గుఱ్ఱము లెక్కినగాని-పిచ్చివాడని పేర్వచ్చినగాని-ప్రియముతొ పెద్దలు పిలచిన గాని - దుష్టజనులు దూషించిన గాని - దోషరహితుడై యుండిన గాని - కష్టము మిక్కిలి కలిగిన గాని-కాయము వ్యాధులు గ్రమ్మిన గాని-నిందకు లోబడి నిలచిన గాని_నిండు చదువులను నేర్చిన గాని-బంధుజనుల నెడబాసిన గాని - పరాంకుశ దాసులై ప్రబలినగాని - రాముని మరువకువే ఓ మనసా'-'సర్వదా సర్వభావేన నిశ్చింతైః భగవానేవ భజనీయః'1 యను సూత్రమున కిది వ్యాఖ్యానమువలె నున్నది.

'శ్రీశైల భ్రమరాంబికాష్టకము' నెవరు రచించిరో తెలియదు కాని

'వేడ్క వెలసిన మీ ప్రభావము విష్ణులోకమునందునా
పల్లవించిన యింద్రలోకము బ్రహ్మలోకమునందునా
మొల్లముగ కైలాసమందున మూడులోకములందునా
చెల్లునమ్మ త్రిలోకపావని శ్రీగిరిభ్రమరాంబికా' యను వరుసలో

చక్కగా సాగిపోయినది.

1. నారదభక్తి సూత్రములు సూ. 79

భక్తి నన్నిమతములవా రంగీకరించిరి. నమ్మిక మనునది కుదుర వలయును గాని ఒక మతమువా రింకొక మతమందలి దేవతలనుగూడ నారాధించుట కలదు. తురకలు హిందూదేవతలను హిందువులు తురక పైగంబరులను కొల్చిన యుదాహరణములును గలవు. ఇంద్రగంటి సూర్య కాంతము(మ్మ)రచించిన'కాలేషా మస్తాన్ దేవుని కీర్తన' లిట్టితెగకు చెందినట్టివే. ఈమె సుమారు రెండు సంవత్సరములుగా గాలిదయ్యములచే పీడింపబడి ఈ తురక దేవుని సేవాభాగ్యముచే మరణాపాయమునుండి తప్పింపబడి బ్రతికినట్లును సంపూర్ణారోగ్యము పొందినట్లును తెలియుచున్నది. తనకు కలిగిన భగవ దనుగ్రహమున కుప్పొంగి ఈమె తన సర్వస్వ మాదేవుని కప్పగించి యటనే కాలము గడపుచు దేవునిపై కీర్తనలు రచించినదట. బహుశః వీనికా ప్రాంతమున (గోకవరమున) ప్రచార ముండియుండును. రచయిత్రి హిందువు తనుక తురక (దైవతమును) సాధువును వర్ణించునప్పుడు కూడ 'జలద సన్నిభగాత్రము - చెలువమరగ కనకచేలము....మునిజనములు కొనియాడ' నని వర్ణించినది. 'ఘనశ్యామసుందర శుభాకారా'యని పొగడినది. 'రామకృష్ణుల యవతారంబు నీవే కదా' యని హైందవావతారములతో నైక్యమొనరించినది. 'పరదైవములను గొలుచుట నే మానితినయ్యా — నిన్నే నేను మనసునందు నిలిపితినయ్యా' యనునంతవరకు పోయినదీమె భక్తి. 'హరికి మస్తానుకు భేదము లేదరయ' నని చాటినది. ఈ మస్తాన్‌దేవుడు కస్మూర్ పురమున వెలసిన తురకదేవుడట. 'వల్మీకమున వసుధయందు బుట్టెన'వాడట. 'మహబూబు సుభాను ఖాదరువలీలు కొలువ అమీరుద్దీను పాదములు బట్టగా మౌలాలీ ప్రముఖులు వినుతి సేయగా' నున్నవాడట.

రాపాకకవులు (పరకాల తాలూకా) రచించిన కీర్తనలు ఓరుగల్లు కరీం నగరం మండలములం దధికప్రచారము గాంచినవి. వీరి రచనలందు శబ్దాలంకార ప్రియత్వము గాంచనగును.

శ్రీరాగము — ఆదితాళము ;

పల్లి॥ రామరామరామ యనుమా-సులభముగ తారకనామ మిది
మోక్షమును గనుమా ఓ మనసా ॥రా॥

అ.పల్లి॥ రామ రవికులసోమ-సుగుణస్తోమ నుతసుత్రామ జగదభిరామ
భార్గవరామగర్వ వి-రామ సీతారామ హరి శ్రీ ॥రా॥

మోహన - ఆది

పల్లి॥ సాంబశివ హర సాంబశివ హర ॥సాం॥
అ.పల్లి॥ అంబరకేశ దిగంబర వరపీతాంబరనుత ధృత శంబరహర శివ ॥సాం॥
చ॥ శంభో దీనదయాంభోధే ధృత - దంభోళినుత పదాంభోరుహ శివ ॥సాం॥
కంధరసమ శితికంధర నిఖిలధురంధర దుర్భవబంధరహిత శివ ॥సాం॥
రామకవి హృదభిరామ సంతతక్షేమకర పరంధామ మాం పాహి ॥సాం॥

ఐనను సరళమైన చక్కని కీర్తనములుగూడ కలవు.

దేవగాంధారి-చాపు

పల్లి॥ శివశివ యసురా ఓనరుడా-అనిన చెడిపోవు వినుర పామరుడా
అ. పల్లి॥ భవసాగరములోన బడి దరిగానక-వివరమెరుంగక విడిబడి తిరిగెదవు॥శివ॥
చ॥ మూలము లేని దేహంబు -నమ్మి మురువకు క్షణభంగురంబు
కాలవశముచేత గనిపించు మెఱుగుడు-పూలవంటిది తెలియజాలవదేలనో ॥శివ॥
పలుమారు వదిరెదవు చాల-శివుని బలుకవదేమి నీ(వాల? సులభముగను జిహ్వ
కలిగినప్పుడు నీపె-ద్దలముల్లె చెడినట్లు వెలవెల బోయెదవు ॥శివ॥
తెలివి యున్నంత లోపలనె-గురుని దెలిసి సద్గతి గానవలెను-తెలివి మరచి కొండ
చిలువసాటి నిద్ర-కలిగినపుడెట్లు-తలచెదవు కొలచెదవు ॥శివ॥

రామకచెర్ల వెంకటదాసు కీర్తనములు కూడ చక్కని పదముల కూర్పులతో శబ్దాలంకారములతో నొప్పారుచుండును. ఈత డనేకకీర్తనములను రచించెను. కవికాలము తెలియరాలేదు.

కృపా రాం రాం గోవింద హరి హరి
విష్ణు సదానంద వేణుగోపాల బాల'యను కీర్తన మీతనిదే. ఇందలివే యీ చరణములు.

నందనందన, ముచికుందవందిత సనందనందన శరదిందీవరేక్షణ ॥కృ॥
గోపాల యికనే నీపాల బడితిని కాపాడి రక్షించు ఓపాప సంహార ॥కృ॥
శ్రీలలనామణిలోలా రాకమచెర్లఖేలా వెంకటదాసపాలా దయాళో రామ ॥కృ॥

పాండురంగని పేరుతో వెలసిన గేయము లనేకములు బహుళప్రచారములో నుండెను. నేడవి అంతగా వినవచ్చుట లేదు. దివిలె నరసరాజు, పుల్లమరాజు వంటి 19 వ శతాబ్దపు తెలంగాణా భక్తుల గేయములు స్థానిక ప్రచారము

నందినవి. వీరిరువురిలో ప్రథముడు మహాభక్తుడు. ఈతని గేయములు కీర్తనలు ముద్రితములు. రెండవకవి మహాపండితుడు; భక్తుడు. చివరకు సన్యాసాశ్రమ స్వీకార మొనర్చినవాడు. ఈతని రచనలు అముద్రితములు. పానుకోట తాలూకా ప్రాంతములం దీతని కీర్తనములు ప్రసిద్ధి గాంచినవి. 'సతతాశ్రితజన వితతి వినుతిగను మతిచేకొను శివసతినుత శౌరి'యను ధోరణిలో సాగిన వీరి రచనలు కొంత భ్రష్టరూపమునన్నైనను పల్లెపట్టుల కెగబ్రాకుట వింతగా నున్నది. ఇంకను మిగిలిపోయిన పలువురు భక్తకవుల కీర్తనములు శ్రీ శ్రీపాదవారు తమ కిన్నెర వ్యాసములందును, శ్రీహరి ఆదిశేషువుగారు తమ 'జానపదగేయ వాఙ్మయ పరిచయము'నను పేర్కొనియున్నారు.

ఇదివరకు పేర్కొనబడిన పదునొకండు రూపములుగా నుండు భక్తి యందలి కాంతాసక్తి, మరియు పరమవిరహాసక్తియను రెండు రూపములును మధురభక్తి పేరుతో ప్రసిద్ధమైనవి. మధురభక్తిలో భక్తిశృంగారములు కలిసి పోవును. 'త్రిరూపభంగపూర్వకం నిత్యాదాస్యనిత్యాకాంతా భజనాత్మకం ప్రేమ కార్యం ప్రేమైవ కార్యమ్'1 అని చెప్పబడియుండుటచే పరమాత్మని కాంతునిగా తమ్ము ప్రేయసిగా భావించి పాడుకొన్న భక్తులెందరో కలరు. అతని యెడబాటు నేమాత్రము సైపజాలని గోపికల భక్తి మధురభక్తి. భ్రమర గీతలలో గోపికా గీతలలో, శ్రీకృష్ణ కర్ణామృతము, జయదేవుని గీతగోవిందము వంటి వానిలో మధురభక్తి యత్యుజ్వలముగా గాననగును. తెలుగు కీర్తనములు కూడ మధురభక్తికి సంబంధించినవి వేనవేలున్నవి. క్షేత్రయ్య మొవ్వ గోపాలుని మోహించి పాడుకొన్న పదములందీ భక్తిమెండు. జానపదులుకూడ భగవంతుని మధురభావములతో పాడుకొన్న కీర్తన లున్నవి.

'ఒక చీటి వ్రాసి పంపవే-హాటకమరుని నర్సారావు పేటకు రమ్మని ||ఒక||
మించి మదనుడు తూపులెంచి చాపముల కెక్కించి గుణనాదమును గావించి చెలియ దా
లక్ష్య ముంచి వేయగ నపుడు చంచలాక్షి నీకొరకై పరికించి చూచుచున్నదని ||ఒక||
సారెసారెకు పికకీరారవములు చెవి జేర, మనమున కలకబార, నిట్టూర్పులను వి
స్తార, మైన నీతోటి కూరిమి పలుమారు గోరి, నారీమణి యున్నదని ||ఒక||
చల్లచల్లని గాడ్పు మెల్లమెల్లగ వీవ నల్ల పసిండి యొడలెల్ల గంపింప సుదతు
లెల్ల. నూరార్చుచున్న యుల్లమెల్ల తల్లడిల్లి ఒళ్లు తెలియకున్నదని

1. నారద భక్తిసూత్రములు. సూ 66

వీక పండువెన్నెల కాక దేహమందున సోక విరహ మాపగలేక దిగులొంది నీదు
రాక కెదురుచూచుచున్న యాకలకంఠి మాటాడలేక సొక్కియున్నదని ||ఒక||
మండితాంగుని నాదు దండ జేర్చిన బంగరుదండ వేతును మెడనిండ సతతము సరి
కొండ అప్పలరాజు నండజేర్చి బ్రోచునట్టి కుండలిశయనున కొక్క ||చీటి|| 1

ఈ సరికొండ అప్పలరాజే శాకుంతలచరిత్రమను జంగంకథను రచించెను. ఈ కీర్తనము క్షేత్రయ్యగారి 'అల తమ్మి పగదాయ, వెలగి వెన్నెల కాయ-కలక యగ్గలమాయ కరుణించు విటరాయ.... అలరులపింటిజోదు, అలుక కోరువరాదు-నిలకొన్న తమి పోదు నిదుర కంటికి రా'దను చరణముల దలపించుచున్నది.

పండితకవులు రచించిన భజనకీర్తనములందు రచన మతిప్రౌఢముగా నుండును. నేను సేకరించిన వెలిదండ రామచంద్రరాజుగారి కీర్తనములం దొక కీర్తనములో మచ్చునకై యొక చరణ ముదాహరింతును.

'సీతారామా, జీమూతశ్యామ ||సీతా||
సీతారామ విధాతృ జనక జలజాతనయన ఘనసీతాంబరధర
శాతశరోత్కర ఘాతనాధనుత పాతకహర సాకేతపురీశా ||సీతా||

పల్లెటూళ్లయందు స్త్రీలు, పురుషులు బంతులు కట్టి కోలాటము వేయుచు భజనలు చేయుచురు. కోలలచే నాడుకొనుటచే నిది కోలాటమైనది. కోలాటమున ననేకవిధము లున్నవి. జడకోలాటము (వేణీకోలాటము) వీనియందొక యద్భుతప్రక్రియ. కోలాటములు కన్నడప్రాంతములందును ఉత్తరదేశమందును కలవు. ఔత్తరాహులు దీనిని లకుటరాసక మందురు. కోలాటముల గూర్చిన వివరములకై 'స్రవంతి' మూడవసంచికలోని వ్యాసము చూడదగును. సంగీతసాహిత్యములతో పాటు కోలాటములందు కొంత నృత్యమునకు గూడ స్థానముండుట గమనింపదగినది. కోలాటపు పాటలు చాలవరకు కిటతక, కిటతక, యను చతురశ్రగతియందే నడచుటచే ఈగతియే కోలాటకు తొలి నడక యనిపించుచున్నది. ఈగతిలో అన్నమాచార్యుల కోలాటపుపాట లెన్నియో కలవు. అవి యన్నియు వేంకటేశ్వర సంకీర్తనలే. ఐనను కాలక్రమమున

---

1. దీనిని 13-1-1953 నాడు ప్రసిద్ధ చారిత్రకప్రదేశమగు ఆలంపురమున లక్ష్మణరావుగారను భక్తునికడ సేకరించితిని.

కోలాటపుపాటలు కూడ సువ్వి, జంపె, మిశ్రవరుసలవలె కథనము నేర్చి అనేక విధముల వస్తువును వహించినవి. నేడన్నితీరుల పాటలు కోలాటములుగా పాడుకొందురు. కాని వీనియందు మధురభక్తికి సంబంధించిన పాటలధికము. శ్రీకృష్ణుని చిలిపిచేష్టలుకూడ వీనియందలి కవితావస్తువుగా నుండును. శ్రీరంగ విలాసముద్రాక్షరశాలవారు (1912) ప్రత్యేకముగా 'నూతన భజన కోలాట కీర్తనలు' ముద్రించిరి. ఇదికాకను స్త్రీలపాటల సంచికలందును, నేదునూరి గంగాధరంగారి ప్రచురణములందును కోలాటముపాట లనేకము ముద్రింప బడినవి. అచ్చుకానివి మౌఖికప్రచారమున నింకను అధికముగా నున్నవి. మచ్చునకై కొన్ని కోలాటము పాటలను పరిశీలింతము.

కోలాటము ఆరంభించునపుడు గణపతిస్తోత్రము చేయుదురు. 'శివశివ మూర్తివి గణనాథా – నీవు శివుని కుమారుడవు గణనాథా - గణనాథా స్వామి లోకనాథా - సకలావిద్యలకెల్ల స్వామినాథా' యను పాట దేశమంతట ప్రచారము గాంచినది. 'పెద్దమనుష్యు'లను సినిమాలో దీనికొక హాస్యానుకరణ మున్నది. నేను 1952 సంవత్సరమున జూకల్లు గ్రామమున సేకరించిన గణపతి స్తోత్రమిట్టిది.

రావే గాననాయకా - పోవే గాననాయకా
విద్యలాదికెల్ల నీవె - వీర గాననాయకా
తొండామూతో నీళ్ళు దెచ్చి – తోరంపు బొజ్జాలు కడిగి
తండ్రిచేత పూజలుగొన్న - సామి గాననాయకా
అల్లమూ అరటిపండ్లూ బెల్లమూల మోరుండాలు
తెచ్చి నీకిచ్చెదమయ్య , సామి గాననాయకా

శ్రీకృష్ణుని పరముగా నున్న కోలాటములందు మధురభావము లుండుట సాధారణము.

ముఖారి – ఆది

మెడలో ముత్యాల్ పేరు ముద్దుగుమ్మా – బంగారుబొమ్మా - చక్కని
గోపాల కృష్ణుడమ్మా - వేణునాదుడమ్మా' యనుపాటలో
'రాతిరి వచ్చినాడు బాలుడమ్మా-గోపాలుడమ్మా,
మేటిచాకుల్ మీటి పోయెనమ్మా, కుమ్మిపోయెనమ్మా'యని కలదు.

పంతువరాళి — ఆది

గొల్లవారి వాడలాప కృష్ణమూర్తి - నీవు ఏమి పనులకొచ్చినావు కృష్ణమూర్తీ'

యను పాటలో

'బుడ్డికాయవలె నున్నాడు కాని - బుద్ధులు పెద్దవి ఓయమ్మా
పిల్లలు పుట్టేచోటు చూపుమని -కొల్లపెట్టుచా వోయమ్మా
గొల్లభామలయి చల్లలుచేయగ - మెల్లగ పాముల మీటించె
కిర్రుమనగ మము కిందవేసి మొగ - విరుదు జూపినాడోయమ్మా'

యని కలదు. ఒక కోలాటముపాట రచనము గమనింపదగినది.

'తరుణి నీ తలకుసుమలసందు, ఘుమఘుమా-విరజాజులే పుదువమందూ
కరువుదీర నీదు - కలసొంపులెల్ల నా, కసురార నేరోజు గందూ
పైరగాలికి పైట జార, వయ్యారి పాలిండ్లు చేబట్టుకోరా
అయినవారిలో నీకు, అపకీర్తి వచ్చునని అనుకుంటె ననుగూడనేరా'.

మరియొక కోలాటము గమనింపదగినది.

'చీరెలు లేవుగదే, యిక మన సిగ్గులు బోయెగదే
చీరెలు లేవిటు నేరము లెంచక' యనుపాటలోనొక గోపిక
'తొగరుపూల చీరె నాది - నెమలికన్నుఁ రవికె
పెండ్లినాడు నా పెనిమిటి దెచ్చిన-చె౹్రపట్టు చీరె'పోయినదని వాపోవుట

మనోహరముగా నున్నది. 'అక్కా విననమ్మా—కోలను అతి చిత్రము కొమ్మా' యను ఉట్టిజడకోపు (వేణీకోలాటము) పాటలో కోలాటము చరిత్రము, అయా పాటలు వ్రాసి ప్రచారము చేసినవారు, అడుగులు వేయనేర్పినవారు, వారి శిష్యులు మున్నగువారి వివరము లున్నవి. ఇది పెద్దపాట యగుటచే నుదాహరింప లేకపోవుచున్నాను.

భక్తిగేయములందు మరియొక శాఖ మేలుకొలుపు పాటలు. స్త్రీలుపురుషులు తమతమ యిష్టదైవతములను ప్రాతఃకాలముననే లేచి మేలుకొలుపులు పాడుచు ధ్యానించుచు తమతమ పనులు నెరవేర్చుకొందురు. గుడి గోపురములందు ప్రభాతసేవలో నీ మేలుకొలుపులు పాడెడు అలవాటు గలదు. పాల్కురికి సోమనాథుడు పేర్కొన్న ప్రభాతపదములు మేల్కొలుపులె యుండునని తలంప

వచ్చును. 'మేలుకో' యని చివరన నుండు మాటవలన నివి మేలుకొలుపు లైనవి. వీనినే భూపాలము లందురుకూడ. భూపాలరాగమున పాడబడుటచే నివి భూపాలములైనవి. పండితగాయకుల 'బౌళి' జానపదుల 'భూపాల' రాగములకు పోలిక లున్నవట. భూపాలములు పరమేశ్వరుని విభూతిని తెలుపును. కొన్ని వేదాంతపరములగు మేలుకొలుపులును కలవు. వైష్ణవపరముగా నున్న మేలుకొలుపులందు — సాధారణముగా కృష్ణు నుద్దేశించిన వానిలో-మధురభక్తి గాన్పించును. ఈ మేలుకొలుపు లధికముగా ముద్రణభాగ్యమందలే దెందువలననో, శ్రీ నేదునూరి గంగాధరంగారి 'మంగళహారతులు' రెండు భాగములందు పదునారు మేలుకొలుపులును, 'సెలయేరులో' నాలుగు, 'వేడుక పెండ్లిపాటలు' పుస్తకమున ఐదు, స్త్రీలపాటల సంపుటములందు పదమూడు ఈ తీరుగా మొత్తము ఏబదికి తక్కువగనే అచ్చులో చూడగలిగితిని. శ్రీ గంగాధరం గారి సేకరణమున శ్రీవిష్ణు, శ్రీరామ, శ్రీకృష్ణ పరముగను, ఈశ్వర పరముగను, సీతాతులసీదేవుల పరముగను, వేదాంతపరముగను మేలుకొలుపు లున్నవి. తెన్నేటి తిరుమలదాసుగారి వేడుక పెండ్లిపాటల పుస్తకమున మూడు శ్రీకృష్ణపరముగను, రెండు శివపరముగను నున్నవి. స్త్రీల పాటల సంపుటము లందు పై దేవతాపరములేకాక రంగనాయక, గంగాపరములును కలవు. ఆయా పాటలందు రచయితలగు నరసింహదాసు, కందుకూరంబయ, కురుమద్దాల వేంకటదాసు, వేంకటశివదాసు, వేంకట సుబ్బయార్యుడు, తిరుమలదాసు మున్నగువారి పేర్లున్నవి. అచ్చయినవానిలో కొన్ని ప్రసిద్ధములగువాని నుట్టంకించి తరువాత నేను సేకరించిన యముద్రితములగు మేలుకొలుపుల పేర్కొందును.

> 'బంగారు చెంబుతో పన్నీరు పట్టుక - పణతి రుక్మిణి వచ్చె మేలుకో
> రంగైన బంగారు కెంగేర బూనుక - (?) తరుణి సత్య వచ్చె మేలుకో
> దంతకాష్ఠము బూని తామరసాక్షి సు - దంత వచ్చినాది మేలుకో'

అను పాటలో సేవాభావము పరిస్ఫుటము.

> 'తెల్లవార వచ్చె తెలియక నాసామి - మళ్ళీ పరుండేవు లేరా'

అను పాటలో మధురభావము లున్నవి.

> 'కేశవ యని నిన్ను వాసిగ భక్తులు - వర్ణింపుచున్నారు లేవరా,
> వాసవవందిత వసుదేవనందన - వైకుంఠపురవాస లేవరా'

అను పాట స్తోత్రరూపకముగా సాగినది.

'మేలుకొనవే చంద్రశేఖర - మేలుకొనవే ఇంద్రవందిత
మేలుకొనవే ఫాలలోచన - నీలకంఠ హరా, యను పాట శివపరము.

'మేలుకో ఆకాశగంగ - మేలుకొ శివకాశి గంగ
మేలుకో శంభూనిరాణి-మేలుకొనవమ్మా' యనుపాట గంగాపరము.

కృష్ణపరముగా నున్న మేలుకొలుపులందు

తీరైన కస్తూరి తిలకము జారెను - తీర్చిదిద్దవలె మేలుకో
మరది జూదరిగాడు మరియాద నెరుగాడు - మాటవచ్చును కృష్ణ లేరా
పరమపావన నాపై పంతాము బూనక - కరుణించి నిద్దూర లేవరా
గొల్లభామలు తాము చల్ల లమ్మగ రే - పల్లె కొచ్చిరి వేగ లేరా
కల్లగాదు రేపె మళ్ళివత్తును నమ్మి - అల్లారి మెండౌను లేవరా
ఆడబిడ్డ బహు ఆరడి సేయగ - అడ్డులే రెవరట లేరా
క్రూరుడు నాభర్త కూటికై వచ్చును - ధీయడ చేరెద లేవరా'

అను మధురభావము లున్నవి. సాధారణముగా నీ మేలుకొలుపులు వ్రాసిన వారందరును కొంత సాహిత్యజ్ఞానము కలవారే. యతిప్రాసాది నియమములు చక్కగా పాటింపబడుటయే కాక శబ్దాలంకారములు, ప్రౌఢపదబంధములును వీనిలో నక్కడక్కడ కాననగును.

'అత్రివసిష్ఠాది మునులు మీ కృపగోర - పాత్రులై యున్నారు లేరా
మిత్రవంశోద్భవ గోత్ర నిర్మల చా - రిత్ర పవిత్ర లేవరా'

వంటి రచనలు పూర్తిగా జానపదులవి కావు.

'మేలుకొనవే రామతులసీ - మేలుకొనవే లక్ష్మితులసీ
మేలుకొనవే కృష్ణరాయల లక్ష్మి తులసమ్మా - తులసీ మేలుకొనవే
అమ్మ నీ బృందావనమ్మా అధికమైన భక్తి నలికి'అనెడు మేలుకొలుపు తులసి

పరముగా నున్నది. సీతాదేవి మేలుకొలుపు పాటలో

'కాకులన్నియు లేచి కావుకావు మని - కూయుచున్న వింక లేవే
కాకాసురుని మీద కోపగించియున్న-కలికి చిలుకలకొలికి లేవే
జనకు నింట నీ వెప్పుడు ఈలాగు - జాగుచేయుట లేదు లేవే
జల్దారు నీ కొంగు చక్కజేసుకొని - జనక పుత్రిక వేగ లేవే'యని కలదు.

కావుకావుమను మాట 'కావుకావనుచుం గదిసి తుంగపయోధర పదాంతరంబు చేరంగనీద'ను రామరాజభూషణుని పద్యపాదమును దలపించును. జాగు చేయుట యన్నచోట వ్యంగ్యమును, కొంగు చక్కజేసుకొని యనుచోట శృంగారమును స్ఫురించును.

మాయూర చంద్రయ్య యను పద్మసాలె కులజుడు ప్రతిదినముదయమున బాడెడు భూపాళములను నాలుగైదింటిని 1953 సంవత్సరమున సేకరించితిని. వానిలో గణపతి ప్రార్థన మొదటిది. పాటలను పూర్తిగా పేర్కొనక వాని మొదటి కొన్ని పంక్తుల నిట నుదాహరింతును.

1. 'వేడుకలు చెలువారు తొండము - పేడుపదములు ఏకదంతము
జోడు వింజామరలు బోలెడు ఉచిత కర్ణములూ
చూడ నొప్పగు వామరూపము - చోద్య మలరగ గుండ్రబొజ్జయు
ఆడుచును మూషకము నెక్కియు - అయ్య రావయ్యా గణపతీ రావెరా వె-లేవెలే'

2 'చుక్కపొడుపున లేచి కృష్ణుడు - చూడకుండా పెరటిగోడను
ఎక్కి దిగిరాంగ జూచి మొగవా - రెరిగి పట్టిననూ
బొక్కబోర్లా బడను ద్రొబ్బియు - పొడిచి యాతని కదలకుండా
కుప్పి తొలగుడు జేసిపోయెను - గోడవాటిదిగో గోపమ్మా కృష్ణు డిడుగో'

3. 'పుట్టు దొంగవటంచు రమణులు - పూనుకొని తమ వాడవాడల
కట్టగట్టలు గట్టుకొని నే - కథలు చెప్పగనూ
ఇట్టి యారడి పనులు వద్దని - ఎంతజెప్పిన వినగనేరవు
కొట్టు తిట్టులు పడక రారా - గోపకులతిలకా'

4. 'మద్దు లెద్దులు గూలనేసియు, మామ కంసుని బట్టి చంపిన
గద్దరీడా గరుడవాహన, నిద్ర మేల్కొనవే'

5. నీలికాశయు గట్టినాడట, నిలువు నామము దిద్దినాడట
వాయుసుతుడై యింద్రజిత్తును, గర్వ మణచెనటా',

మేలుకొలుపులకు కూడ జానపదులు (అధిక్షేపములు) హాస్యానుకరణములగు పాటలు కూర్చుకొనిరి.

ప్రాతఃకాలమున పల్లెపట్టులం దిప్పటికిని ప్రాతర్వేళల పూజారులు మందిరములందును, స్త్రీలు చల్లచేయుచునో, ఇల్లలుకుచునో, పురుషులుకార్యములు దీర్చుకొని తమ ప్రక్కలపైననే కూరుచుండియో, భూపాళరాగములందు

భగవంతుని సాక్షాత్తిగా కొనియాడి తమ యాత్మలను, ఇరుగు పొరుగువారలను మేలుకొల్పెదరు. క్రొత్తవారు నీ పదములు నోటికెక్కించుకొనలేక పోయిరి. స్త్రీపురుషు లందరును పాడెడు ప్రాధాన్యత గలిగిన తమ పదకలు వీడుటలేదు

భక్తిగేయములందు మఱియొక శాఖ మంగళహారతులు. వీనిని మంగళారతులని యందురుకూడ. పూజాంతకములందుగాని, శుభకార్యములందుగాని మంగళము పాడుట కలదు. ఈ యాచారము భారతదేశమంతటను గలదు. మంగళహారతి యనగా నివాళి. కాని మనవారు నివాళి యిచ్చునప్పుడు పాడెడు పాట కర్థమైనది. ఈ యర్థమిటుల నెప్పుడు మారెనో తెలియదు. 'ఆరాత్ర్యవరతి విరతయ ఉపరామే' యని అమరకోశము ఆరతి, ఉపరతి, ఉపరామము విరతియు చాలించుటకు పేరులు. మంగళము పాడి (ఏకార్యమైనను) చాలించుటచే ఇది మంగళారతి యైనదో యేమో! అలతి యను మరియొక శబ్దమున్నది. దాని కర్థము రాగాలాపము. 'రలయో ర్లడయోః' అను మతమున నారతియే ఆలతియై యుండును. నన్నెచోడుడు 'అలతు లొగిచేసి పాడి రతినపలీలన్' అనియును 'ఆలాపము నిల్వ హస్తముల' ననియు 'అలతుల్ సూల్కొనచేసి' యనియు ప్రయోగించెను. అభినయము చేయుచు హారతు లెత్తెడు నాచారము ఇప్పటికిని కొన్ని దేవళములందున్నది. గుడారు వెంకటదాసకవి బలరామచరిత్ర, గణపవరపు వేంకటకవి ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసములందు ఆరాత్రికలు పేర్కొనబడినవి. హారతికి నివాళి పర్యాయపదము పాల్కురికి సోమనాథుడు పేర్కొన్న నివాళిపదములు మంగళారతులై యుండవచ్చును. దీపారతులు ధూపారతులు మున్నగునవి తత్సంబంధములే. మంగళారతులు తెలుగుదేశమున లక్షోపలక్ష లున్నవి. వ్రాయనేర్చిన ప్రతి(పద)కవి యొక మంగళారతి రచించి యుండును. పాడనేర్చిన ప్రతి పల్లెటూరి స్త్రీ యొక మంగళారతి పాడగల దనుకొందును. ఈయాదేవత యనక మంగళారతులన్ని దేవతలకు సంబంధించినవి కలవు. వర్ణనాత్మకముగను, స్తోత్రరూపమునను, సేవారూపమునను, భక్తి, వేదాంత, శృంగారపరముగను మంగళహారతు లున్నవి. పెండ్లిపాటలందుండు హాస్యరసపూరితములగు పాటలవలె మంగళహారతులుకూడ హాస్యరస పూర్ణములై వదినమరదుల యొక్కయు, వియ్యపురాండ్ర యొక్కయు సంభాషణ రూపమున కూడ నున్నవి.

శ్రీ నేదునూరి గంగాధరంగారు తమ 'స్వరసహిత మంగళహారతులు' రెండుభాగములందును 'సెలయేరు'నందును సుమారు రెనుబది మంగళ హారతుల ప్రకటించియున్నారు. స్త్రీలపాటల సంచికలందు పది పదకొండును, తెన్నేటి తిరుమలదాసుగారి 'వేడుక పెండ్లిపాట' లందొక పండ్రెండును, రాపాకవారి భజనమామ్నాయం దొక పండ్రెండును, ఇతరములగు పాటల పుస్తకములందు ఎన్నియో మంగళహారతులు ముద్రింపబడినవి. అచ్చయిన మంగళహారతుల కన్న, కానివాని సంఖ్య కనీసము నూఱురెట్లధికముగా నుండును. కొన్నింట రచయితల పేర్లున్నవి కాని మఱికొన్నింట కానరావు. త్యాగరాజు, భద్రాచల రామదాసు, వీరనాగయ్య, గిరికవి, శేషగిరి, శేషదాసు, కస్తూరి శేషాచలదాసు, కూరపాటివారు, పరదేశి, శివలెంక మల్లయ్య, నాగేశ్వరుడు, సుబ్బయ్య, వెంకటకృష్ణదాసు, తిరుమలదాసు, రాపాకకవులు వంటి రచయితల పేరులాయా మంగళహారతులయందు కానవగును. ఇక సుప్రసిద్ధములగు కొన్ని మంగళ హారతుల నిట పేర్కొందును.

దక్షిణభారతమున నెచ్చట సంగీతసభ జరిగినను చిట్టచివరన 'నీనామ రూపములకు నిత్య జయమంగళం'బని పాడని గాయకుడుండడు. ఎంత సంగీతపు కిట్టుదిట్టములతో ఓగింపబడినను త్యాగరాయలవారి యీ కృతి జానపదుల నోటి కెక్కినది. భద్రాచల రామదాసుగారి భక్తికీర్తనలవలెనే వారి 'రామచంద్రాయ జనక రాజజామనోహరాయ - మామకాభీష్టదాయ మహిత మంగళం' అను మంగళహారతికూడ బహుళప్రచార మందినది. ఇటులనే

'ధీరునకు వనధి గంభీరునకు దుష్ట సంహారునకు - ఘనమణీహారునకునూ'
'రమణీ మంగళ మనరే - కమలాలయునకు నిట'
'జయమంగళం నిత్య శుభమంగళం-జయాజయ మంగళం మహోత్సవ మంగళం'
'మంగళమని మంగళమని మంగళ మనరే-మంగళమని పాడరె మాతంగయానలును

(దీనిలో దశావతారవర్ణనము కలదు) మున్నగు మంగళహారతులు సుప్రసిద్ధములు. మంగళహారతి పాడగలవారికి తప్పనిసరిగా వీనిలో నొక్కటియైనను కంఠస్థమై యుండును. శ్రీ నేదునూరి గంగాధరంగారు ప్రకటించిన గంగాదేవి మంగళ హారతిలో గంగమ్మ వర్ణనము సహజమనోహరముగా నున్నది.

'నూనెధారకు మల్లె నురగాలు మెత్తుచు - పాలధారకు మల్లె పరుగెత్తుచూ
మల్లనక ముడికనక కట్లనక కంపనక - చెలరేగి ప్రొద్దేడ కదిలేటి గంగా'

యని వర్ణింపబడినది.

ఒక మంగళహారతిలో శృంగారము ప్రతిమించినది.

'ఇల్లు ఇల్లూ జొచ్చి, యువతూలపై పూల, చెప్పు వేసి పాలిళ్ల జట్టి
కళ్ళజూచి వెన్న,కడవల నెయి చాల,వొళ్ళుబొడిసినట్టి, దొరవైన కృష్ణా॥మంగ॥

చక్కని రచనమున కుదాహరణముగా శివలెంక మల్లయ్య రచించిన సంస్కృత మంగళహారతి జానపదముగాకున్నను ఈసంకలనమున చేరినదానినిచూడనగును.

'ఉమాసమేతాయ మంగళం - ఋత రమాకుమారాయ మంగళం
శమాది బహునిధు, పమాన సుగుణ,క్రమాయ ఘనవి. క్రమాయ సంతత॥ఉమా॥
క్షమా శరాం గో, త్ర పూయ తే నిస్సమానమహిత ము, హిమాయ రే
నమోర్ధచరభవ, దమౌఘ రహితా,యి మందితాచల. సుమందిరాయ । ఉమా॥
సుధామధుర వాక్యశాలినే, గజసుధీశర గిరిత్రిశూలినే సుధీజనావన
విధానకృతినే,విభూతి సురిముఖ విభుత్వగిరిరవే ॥ఉమా॥
శివాయ కరధృత నివాసినే — హర భవాయ శ్రీగిరి నివాసినే
హరాయ శివలెంక వంశమల్లయ కవీంద్ర సుకృతాధి వర్ధనాయ ॥ఉమా॥

ఈ శివలెంక మల్లయ 'పండిత' వంశమువాడై యుండును. శేషాచలదాసు రచించిన తెలుగు కృతి యొకటి.

**మధ్యమావతి - అట**

రంగా నీకిదె మంగళం, కస్తూరిరంగా నీకిదె మంగళం
రంగా ఖగరాడ్తురంగా కలుషావిభంగా నవమోహనాంగా - వయ్యారి ॥రం।
హరీ విబుధవిహారీ ఉభయకావేరీ తీరవిహారీ -వయ్యారి ॥రం।
అన్నా యితరులనెన్నా ఎవరు నీకన్నా నను ద్రోవుమన్నా - వయ్యారి ॥రం॥
లీలా శేషాంశుశీలా కరుణాలవాలా జగత్పరిపాలా - వయ్యారి ॥రం॥
అయ్యా వరము నాకియ్యా నినునమ్మితయ్యా నను బ్రోవుమయ్యా-వయ్యారి॥రం॥
హాసావన చిద్విలాసా శేషాచలదాసార్చిత పరమేశా-వయ్యారి ॥రం॥

'సెలయేటి' లో నున్న నక్షత్రమంగళహారతి గమనింపదగినది. కొంత వ్యత్యస్తముగా నైనను దీనిలో 31 నక్షత్రముల పేరులున్నవి. జానపదులలో జ్యోతిషవిజ్ఞాన మీవిధముగా భద్రపరుపబడియుండును. 'స్వరసహిత మంగళహారతులు' రెండవభాగముననున్న ఏడుగురమ్మవారలమీది మంగళహారతి (పుట 63) చక్కని సంవాదము.

'అంగనామణి సారంగలోచన మేలు - శృంగారమైనట్టి సుదతి యెక్కడికే
గంగపార్వతులకు ఘనమైన నగమున - లింగమైన నీలకంఠు సన్నిధికే'

అను మంగళహారతి

'ఘల్లు ఘల్లున కాళ్ళ గజ్జెలందెలు మ్రోయ కలహంసనడకల కలికి యెచ్చటికే'

యను సుప్రసిద్ధ మంగళహారతిని బోలినది. ఈ రెండవ మంగళహారతి యత్యంత మనోహరముగా నున్నది. కనుకనే శ్రీ పెళ్ళెనాథ సత్యనారాయణగారును దానిని తమ గ్రంథమున కెక్కించిరి. దీనిని బోలిన మంగళహారతి నేనొకటి సేకరించితిని. 1

'తిరుమణి శ్రీచూర్ణం తిరుమోమునందుంచి-తరెగిచూడకపోయే తరుణి యెక్కడికే ||మం||
తిరుమంత్రద్వయనిష్ఠ చరమాధికారైన-సరసిగ రామానుజార్య సన్నిధికే ||మం||
నారాయణా వేదపారాయణము సేయు-చారుసుందరి కీరవాణి యెక్కడికే ||మం||
నారీమణిరో పురుషకారి కటాక్షించు - కోరిక దీర్చేటి ధీమ సన్నిధికే ||మం||
కరమొప్ప కల్యాణ కంకణంబులు మెరయ-వరరత్నభూషిత వనిత యెక్కడికే ||మం||
వరయోగివరులచే నరుల మర్మము గొని - గురిదప్పకున్న సద్గురుని సన్నిధికే ||మం||
కిలకిలనవ్వేటి కలికి సుందరి బాల - పల్కుల పల్కెడు కల్కి యెక్కడికే ||మం||
కల్కిరో పల్కులు కారిమారిసుతుల - విలసిల్లు నమ్మాళ్వారు సన్నిధికే ||మం||
అందెలు పాదారవిందాములను మ్రోయ - చందనగంధి నీకందు పనియేమే ||మం||
అందేవీడందే వేలందేలు మ్రోయగ-ఇందిరారమణుని పొందేటందుకే ||మం||
చెంగావిచీరె పై చెంగులు మెరయగ-ముంగిట నెలకొన్న ముదిత యెక్కడికే ||మం||
అంగనలిరు మంచి శృంగారములు చేయు-రమణిరో రంగాసి భార్య సన్నిధికే ||మం||

శ్రీ వైష్ణవుల యిండ్లలో నధికప్రచారమందున్న శ్రీ భాష్యకార మంగళహారతి రాఘవాచార్యకృతము.

పాపా విమోచనా శ్రీ భాష్యకార శుభహారతిదిగో ||పా||

1. వాసిగ భువి శ్రీకేశవార్యులకు వరసూనుడవై పుట్టి
కాషాయ వస్త్రములు గట్టి — త్రిదండము చేతనుబట్టి
పాషండమతస్థుల గొట్టి - పావనచేసిన పరమపురుష ||పా||

అనునది తెలంగాణమందు పుట్టినదని శ్రీమాన్ కొమాండూరు రామానుజాచార్యులవారి అభిప్రాయము.

రాపాకవారి మంగళహారతులు సాధారణముగా నన్నియుప్రౌఢరచనములే. ఉదాహరణ కొకొక్కచరణము.

---

1. నల్లగొండ మండలమున లింగిగిరి గ్రామవాస్తవ్యురాలు సింహాద్రమ్మ యను వైష్ణవి చెప్పిన మంగళహారతి యిది.

మాయామాళవ గౌళ - ఆది

ప. మంగళం శ్రీసీతారామ మాం పాహి - కృపయా శ్రీరామ ॥మం॥

అ. ప. తుంగవిహంగ తురంగ పతంగజ-సంగసదమల శుభాంగ ధనుర్భంగ ॥మం॥

చ. సారసాప్త వైరినేత్ర సజ్జనాంబుమిత్ర-మేరుధీర రణశూర వైరిసంహార వారధి గభీర వరద రఘువీర ॥మం॥

ముఖారి - ఆది

ప. మంగళములు శ్రీగోపాల నీకొసంగెద కరుణాలవాల ॥మం॥
మంగళంబులు చేకొనుము సా-రంగవరద భుజంగశయన విహంగరాజతు
రంగ కలుషవిభంగ ముదమలరంగ - జయజయ ॥మం॥

నాట - అట

ప. మంగళకర మంగళం - హరే కృష్ణ ॥మం॥

అ. ప. మంగళకర మౌనిపుంగవనుత భుజంగభూషణ
సంగ తుంగ విహంగ తురగ పతంగ జార్చిత భృంగకుంతల ॥మం॥

చ. సదయహృదయ శౌరే - సదమల కుందరదన కైటభారే
ఉదధిశయన నీరదశరీర వరద కుముదహితవదన మృదుపద
మదనమదన ధనదనుత ధరధర దనుజాంతక ॥మం॥

నేను అముద్రితములగు మంగళహారతులు సుమారేబదింటిని సేకరించితిని. ఇవిగాక నేను సేకరించిన నాలుగైదువందల తాళపత్రగ్రంథములందు ప్రతిదానిలో చివరన నొక పాటయో లేదా మంగళహారతియో వ్రాయబడియున్నవి. ప్రత్యేకముగా వ్రతములు, నవరాత్రపూజావిధానములు, యాజ్ఞికము మున్నగు వానికి సంబంధించిన తాళపత్రగ్రంథములందు తప్పనిసరిగా మంగళహారతు లున్నవి. ఈ తాళపత్రగ్రంథముల వయసే సుమారు 100 వత్సరములుండును. ఆనాటివారు పాడుకొన్న ఈ మంగళహారతు లంతకు పూర్వము రచింపబడి యుండవలెనుకదా। ప్రాతకాలపు మందపు (కోరట్ల) కాగితములపై నున్న పుల్లమరాజుగారి మంగళహారతియందు ప్రథమచరణ మిట్లున్నది.

'నారసింహా శుభమంగళారతీ-నారసింహా జయమంగళారతీ ॥నా॥
సతతాశ్రితజన వితతివినుతిగను మతిచేకొను శివసతి నుతశౌరీ ॥నా॥

దుర్గానవరాత్ర పూజావిధానము వ్రాయబడియున్న ఒకానొక తాళపత్ర గ్రంథాంతమున 'శోభకృతునామ సంవత్సర ఆశ్వీజ బ 7 ఆదివారము వరకు

వావిళ్లపల్లి వెంకయ్య ప్రతిలోవున్న క్రమాన వ్రాసినా'డనని కలదు. దాని తరువాత 'మంగళారతి' అను శీర్షికతో అసంపూర్ణముగానున్న ఒక మంగళ హారతి యున్నది. ప్రౌఢముగను అందులో దేవభాషలో నుండుటచేత జానపద సాహిత్యమున జేర్చవలదనుకొంటిని కాని వేములవాడక్షేత్రమునకు పోయినప్పు డచటి పూజారి రాజరాజేశ్వరీపూజానంతర మీ మంగళహారతిలో కొంత చదువగా వింటిని· అతడొక్కడే కాక యచటనున్న భక్తగణ మతనితోపాటు చదివిరి. కనుక నిది సుప్రసిద్ధమై యుండునని యిట నాయసంపూర్ణ మంగళ హారతి నుదాహరించి భక్తిసారస్వతప్రశంస నింతటితో చాలింతును.

జయదేవి జయదేవి జయజనని శరణ్యే జయజనని శరణ్యే ॥జయ॥
జేజే నవచక్రేశ్వరి సకలాగమగణ్యే-జయహిమగిరి కులనందిని సముదిత
లావణ్యే - జయ భగవతి కామేశ్వరి సంతత కారుణ్యే ॥జయ॥
అపరిమితామృతసాగర విపులమణిద్వీపే -విపుల మణిద్వీపే
తపనోపమ చింతామణిధామ నిఘనసీపే ? —
కృపయా పరమా విష్కృత కేవలనిజరూపే కేవలనిజరూపే-
త్రిపురే జయ జగదీశ్వరి ధృతచంద్రకలాపే ॥జయ॥
పకమకృపారససంభృత పరదైవతరూపే పరదైవతరూపే -
కరవినిహిత పాశాంకుశ కౌసుమశరచాపే -
అణిమాది మయూఖావళి రథరూఢసమీపే రథరూఢసమీపే -
సపురందర గిరిధర జయ సముదయ సద్రూపే ॥జయ॥
సిందూర రసారుణరుచి సందోహశరీరే సందోహశరీరే-
సంధానితకుచగిరితట చందన ఘనసారే - సుందర రదహీరే -
కందర్పాతి ప్రియసుందర సుకుమారే ॥జయ॥
కమనీయానన హిమకర కస్తూరీతిలకే -
సురనారీ కరచామర మరుదుల్లలదలకే -
కలయుక్పంతి మందఝంఝర కర్ణోత్పలనలకే కర్ణోత్పల నలకే
నవముక్తామణి రంజిత నాసామణి కళికే ॥జయ॥
కల్పిత కుసుమాలంకృత కచభరమణిమాళే -
ముక్తాతాటంకద్యుతి మండితసుకపోలే , కుంకుమరసపంకిల...

## వేదాంత సంబంధములు

మోక్షసాధనమగు జ్ఞానమార్గ మత్యంతగహనము. భక్తికర్మములు రెంటికన్న నిది శ్రేష్ఠమని పండితుల యభిప్రాయము. స్వయముగా శ్రీకృష్ణ భగవానుడే భగవద్గీతలో ఇటులనెను.

'న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే
తత్స్వయం యోగ సంసిద్ధః కాలేనాత్మని విన్దతి
శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయతేన్ద్రియః
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి మచిరేణాధిగచ్ఛతి'

భారతదేశమునకు తక్కిన ప్రపంచమునకన్న గల వైశిష్ట్య మీ 'జ్ఞానము' వలననే. ఎందరెందరో మహాఋషులీమార్గమున మోక్షము సాధించి ప్రపంచమునకుగూడ నీ మార్గమును చాటిరి. లోకవ్యవహారముకొరకు మన మీజ్ఞానమును వేదాంతమని పిలువవచ్చును. ప్రపంచమందన్ని మతములవారి కేదో యొక (philosophy) వేదాంత మున్నది. కాని మన వేదాంతమందున్న యోగ ద్క్ మున్నగునవి మనకు ప్రత్యేకత నాపాదించినవి. కనుకనే పాశ్చాత్యులు భారత దేశమును వేదాంతులుండు దేశమని పిలిచిరి. ఆయాదేశములందు వేదాంత వాక్యము లేపండితుడో, మహానుభావుడో, నూటికొకడు పల్కును. కాని మన దేశమున పదునారేండ్లు దాటిన ప్రతివాడు దేదో ప్రవచనము చేయును ఇక మన పురాణములందు పదునారేండ్లు కాదుగదా గర్భస్థశిశువులును జ్ఞానామృతపాన మొనర్చిన కథలున్నవి. సంస్కృతమున వేదాంతమునుగూర్చి యపార వాఙ్మయ మున్నది. దానితో పోల్చిచూచిన దేశభాషలం దిట్టి వాఙ్మయము తక్కువ. అందును తెలుగులో చాల తక్కువ. ఇట వాఙ్మయమన శిష్టరచనమని నా యభిప్రాయము. కాని జానపదులు మాత్రము శిష్టులకన్న నెక్కుడుగా నీ సంపదను సంతరించుకొనిరి. శిష్టులగువారీ బ్రహ్మవిద్యను చాల పవిత్ర మగునదిగా భావించి దేవభాషనుండి దేశభాషానువాదము చేయనొల్లరైరి. కాని వారు సంస్కృతమున నేర్చుకొన్న విద్య తెలుగులో అక్షరబద్ధము కాకపోయినను వాగ్రూపమున మహానదివలె ప్రవహించినది. జానపదులు దోసిళ్ళకొలది యా విజ్ఞానమును గ్రోలి నిర్భయముగా తమకు దోచినటుల దమ నాలుక యాడినటుల గేయములుగా పాడుకొనిరి. శిష్టవాఙ్మయ మక్షరబద్ధమై ప్రాణములు నిలుపుకొనును. జానపదవాఙ్మయము వాగ్రూపముననే చైతన్యవంతమగుటజేసి మన కీ వేదాంత సంబంధములగు గేయము లనేకములు తెలుగుదేశ మంతటను లభించును.

జో అచ్యుతానంద జోజో ముకుందా - రార పరమానంద రామగోవింద జోజో
తొలుత బ్రహ్మాండంబు తొట్టె గావించీ - నాలుగు వేదముల గొలుసు లమరించీ
బలువైన ఫణిరాజు పాన్పు నమరించీ - చెలియ డోలికలోన చేర్చి లాలించీ' అని

పరమార్థముల బాడుచు తమశిశువులనేకాదు బ్రహ్మాండములను సైతము జోకొట్టుచు

'ఓం నమశ్శివాయ అనక్షరముల తొట్టి - ఆరంభమాడె నే ఉయ్యాలా
రక్షకుడు చిన్మయా తొట్టిలోపల తాను - ఊగుచూ ఉన్నాడు ఉయ్యాలా'

అని పంచదశిసారమును పాలబుగ్గల కందించు శక్తి తెలుగుతల్లుల కలవడినది. ఆయా గేయములందలి భావములు జానపదుల కెంతవరకు అనుభవసిద్ధము లనుమాట వేరు. కాని పశువుల గాచు బాలుడు మొదలు ముదివగ్గువరకు జంకు మాని 'గూట చిలుకేదిరా చిన్నన్నా - గూడు చినబోయెరా' యను తత్త్వ మాలపించును. తత్త్వవిషయము లుండుటచే గాబోలు నిట్టిగేయములకు తత్త్వము లను పేరు వచ్చినది. ఇట్టి తత్త్వము లధికముగా నద్వైతవేదాంతమయములు. 'వేమనయోగి పద్యాలు, ఇతర రాజయోగులు పాడిన తత్త్వాలు రాజయోగామృతాన్ని తెలుగువారికి చూరలిచ్చాయి. తెలిసినా, తెలియకపోయినా సత్తు, చిత్తు, బ్రహ్మానందం అంటూ కబుర్లు చెప్పేవారి దగ్గర మహత్తుంటుందని ఆశ్రయించే వారూ, తత్త్వాలు పాడి పొట్టబోసుకొనేవారూ తెలుగుదేశములో తయారయ్యారు'[1]. తత్త్వములను వ్రాసినవారును ప్రచార మొనర్చినవారును అధికముగా బ్రాహ్మణేతరులు; శూద్రాదులు అద్వైతమున జీవుని బ్రహ్మత్వము ప్రతిపాదిత మగుటచే సంఘవ్యవస్థయందున్న ఎక్కువతక్కువలు వేదాంతవిచారమున నుండవు. అందును ఇంచుకంత చైతన్యము కనబడినచో 'నీ దే కులమ'ని యవరజులను ప్రశ్నించు బ్రాహ్మణులు మరియు నగ్రవర్ణములవారు శూద్రులా శాస్త్ర విద్యాప్రదర్శనకాలమునుండి కనకదాసు, వీరబ్రహ్మముల కాలమువరకు నుండిరి. వీరి దౌష్ట్యమునకు అద్వైతతత్త్వములును, 'ఏకులమని నను నెవర డడిగితే ఏమని పలుకుదు లోకులకు, లోకులకూ పలుగాకులకూ' అను పాటలును నోటి మూతలు. కనుక అధికారులు బోధనకై, అనధికారులు సంతృప్తికై యిట్టి పాటలు పాడుట యాచారమైనది. కనుకనే అగ్రజన్మములవారి కర్మనిష్ఠ (ఆడంబరము, వర్ణాశ్రమాచార విధులు, పూజాపురస్కారములు, ప్రవచనములు మున్నగునవి కొన్నికొన్ని తావులందు గర్హింపబడినవి. వేమనయోగివంటి సంస్కారపరుల మాటలూతగా గొని యాథార్థ్య మెరుగని తరువాతి యోగి బ్రువులు, కపటసన్న్యాసులు, దొంగ గురువులు చిలుక పల్కులు పలికి ప్రజల కండ్ల మట్టిగొట్టి పొట్టవోసికొనిరనుమాట పరమసత్యము. దీనికొక చిన్న యుదాహరణము. తత్త్వములందు మర్మకవిత్వ ముండును. అది తెలిసికొనుట మహాకష్టము. సాధారణముగా రాజయోగమంతయు (సాంఖ్యతారకామనస్కములు)

1. జానపదవాఙ్మయ పరిచయము. పుట 196.

ఇట్టి మర్మకవిత్వమయముగా నున్నది. తత్వములు వ్రాసి శిష్యగణము గూర్చుకొనియున్న ఒక సజీవుడగు మహానుభావుని చెంతకు వెడలి మర్మకవిత్వమున్న కొన్ని తత్వముల కర్థమడిగితిని. కాని మా గురుశిష్యు లిరువురకు నొకచోట నట్టుపడెను. ఆనాటినుండి యీ కల్పనాతత్త్వములన్నియు బూటకములే యని భావింపదొడగితిని. కాని సీతారామాంజనేయసంవాదము మున్నగు గ్రంథములు చదివిన తరువాత కొన్నింటి యర్థములు తెలిసినవి. అప్పటికిని చాలభాగము తెలియకుండనే మిగిలిపోయినది. పెక్కురు శిష్టులగు వేదాంతవేత్తల నడిగినను వాని యర్థ మవగతము కాలేదు.

'మొనలు మీదుగ తలలు క్రిందుగ మొలచి యున్నది వృక్షమూ
పోది మలరగ పంటిమీదను మదగజము విహరించెరా
చిదిమిపట్టిన బంటుకైవడి చీమ యేనుగు మింగెరా
పుర్రవీగుచు కేకవేయుచు యీగ మంచము మింగెరా'

అను తత్వము నొకదాని నుదాహరించి ఇదియంతయు నయోమయమనియు ఉద్దిష్టప్రయోజనమునకు దూరమైనట్టిదనియు పండిత శ్రీ అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులవారనిరి[1]. కాని మొనలు మీదుగ తలలు క్రిందుగ యనుమాట మనకు క్రొత్తదికాదు. 'ఊర్ధ్వమూలమధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్' మున్నగు ప్రవచనములు మన మెరిగినట్టివే. కాని చీమ యేనుగును మ్రింగుట, యీగ మంచమును మ్రింగుటవంటి రూపకములనుమాత్రము భేదించుట కష్టమే. పరాత్పరుని యిచ్ఛాశక్తి-అవ్యక్తము-నుండి త్రిగుణాత్మకమైన సర్గము వ్యక్తమగుటే దీనికర్థమనియు, మదగజము ఎరుకయనియు, చీమ అగ్నితత్త్వప్రధానమైన లయశక్తి యనియు, ఈగ వ్యానవాయువనియు, అహం బ్రహ్మాఽస్మి యను భావధారణము పిఱ్ఱవీగుట యనియు, శివోఽహమనుటే కేకవేయుట యనియు శక్తి మనోబుద్ధి చిత్తములను నాలుగు పాదముల మనోమండలపు మంచమును గాఢదమను యోగశక్తిచే లయమొనర్చుటే యిందలి తత్త్వార్థమనియు శ్రీ పూదోట మఠాధిపతులైన ఆనందనాదస్వాముల వ్యాఖ్య. ఇట్టి మర్మకవిత్వముగల తత్వములు కొలదియే కనుక విచారింప బనిలేదు. ఇట్టి స్వల్పాంశములచే నా విద్యనుగాని, నిజమైన తత్త్వవేత్తలనుగాని, గురువులనుగాని కించపరచుట నా యభిప్రాయము గాదని భావించునది. ఏగంటివారు, పోతులూరి వీరబ్రహ్మము, పూదోటమఠం

1. నేటి కాలపు కవిత్వం - నా విమర్శ. అయోమయత్వాధికరణం. పుట 85.

లింగావధూత, వేమనయోగి, సిద్ధప్ప, శేషాచలస్వామి, బ్రహ్మానంద సరస్వతీ స్వామి, పరుశురామపంతుల లింగమూర్తి, భోజదాసు, ఎడ్ల రామదాసు మున్నగువా రనుభవజ్ఞులయిన యోగులు మహానుభావు లెందరో యిట్టి రచనలు చేసియున్నారు. వారి నేమాత్రము శంకించుటకు వలనుపడదు. ముద్రితములై నాకు లభించినవి పరుశురామపంతుల లింగమూర్తిగారి 'సీతపాట', కవి యెవరో తెలియని 'నారాయణశతకము', తోట వెంకటదాసు రచనమని చెప్పబడు 'రామరామశతకము', సుమా రిరువదిమంది రచయితల తత్వముల నొకచో జేర్చిన 'ఆత్మబోధామృతతత్వములు', సాతెల్లి బాబదాసు రచించిన 'కలిప్రమాణ తత్వకీర్తనలు', పోతులూరి వీరబ్రహ్మంగారి 'కాలజ్ఞానతత్వములు' (ఇందులో గూడ పదిమంది రచయితల పేర్లున్నవి) పూదోటమఠం లింగావధూత స్వాముల 'తత్త్వగీతామృతము' భాగవతుల కృష్ణదాసు (అవంతి ప్రభువు రచించిన 'శుద్ధనిర్గుణ తత్వకందార్థదరువులు', గుజ్జుల నారాయణదాసు వ్రాసిన 'తారకామృతసారము' అల్లూరి రాజేశ్వరామాత్యుడు చెప్పిన 'శ్రీరామగీత', చెంచు రామకవీంద్రుని 'శ్రీరామనామమాహాత్మ్యము', 'వసిష్ఠ వాక్యములు', సాయం వరదదాసు 'నమశ్శివాయ గేయామృతము' వేదపన్నాల సుందరాత్మజుని 'వేదాంత ఖుచ్చెల కథ' 'ఏగంటివారి వచనములు' మున్నగునవి కలవు. ఇవిగాకను స్త్రీల పాటల సంచికలందును, నేదునూరి గంగాధరంగారి ప్రచురణములందును కొన్ని తత్వములున్నవి. అముద్రితములగువాని నెన్నింటినో సేకరించితిని. వీధి భిక్షుకుల చెంతను, వృద్ధుల చెంతను, పూర్వతాళపత్రగ్రంథములందును అనేకములగు తత్వములు లభించినవి. ఇంకను బేతపూడి పరబ్రహ్మదాసు 'బ్రహ్మానంద కీర్తనలు' యల్లమదాసు 'గురుజ్ఞానామృతము' బీబీపేట హనుమయ్య 'జ్ఞాన బోధాధ్యాత్మలు' గొల్లపూడి రామలింగశాస్త్రిల 'శివైకాంతసేవ' వంటివి శ్రీపాదవారు పేర్కొనియున్నారు 2 పైన పేర్కొనబడిన 'ఆత్మబోధామృత తత్వములు' 'కాలజ్ఞాన తత్వములు' మున్నగు సంకలనములందు కాననగు వివిధరచయితలు పోతులూరి వీరబ్రహ్మం, వేణుగోపాలదాసు, భద్రాచల రామదాసు, వీరదాసు, నరసింహదాసు, భోజరాజు, ఎడ్ల రామదాసు, నారాయణ హరిదాసు, సుబ్బకవి, బాలకృష్ణయ్య, నమ్మయ్య, ఏగంటివారు, అంతరంగయ్య, అప్పలదాసు, కృష్ణయ్య, ఏగంటివారి శిష్యుడు నంజయ్య, పంమి వీరయ్య,

1. **Bulletin of the Govt Oriental Manuscripts library Madras Vol VII. No. 1, 2**
2. కిన్నెర, డిసెంబరు 1953.

(వీరాచార్యులు), యతిపతి, కేశవులు, వీరాస్వామివంటి శైవవైష్ణవులే కాక మహమ్మద్ హుస్సేన్, పీర్ మొహియుద్దీన్, దూదేకుల సిద్ధయ్యావంటి తురకలును దూదేకులవారును కలరు. రచయితల యూరుపేరులు లేని దరువులు కీర్తనలు వచనములు తత్వములు కందార్థ సీసార్థము అనేకము లున్నవి. ఈ వివరము లింతటితో విరమించి ఆ తత్వములందున్న విషయములను తెలిసికొందము.

సాధారణముగా నీ తత్వములందు రాజయోగము, అచల వేదాంతము, గురుభక్తి, నీతిబోధము, సంఘసంస్కారపరాయణత్వము, వర్ణాశ్రమాచార నిరాసము, వైరాగ్యబోధము, సత్ప్రవర్తనము, అహింస మున్నగు విషయము లుండును. కాలమునుబట్టి ఏగంటివారి రచనములును వారి శిష్యుడనని చెప్పుకొన్న నంజయ్య తత్వములను ప్రాచీనములుగా నిశ్చయింపవచ్చును. సంకలనము లందును మౌఖికప్రచారమునను గాన్పించువానికన్న ఏగంటివారి రచన లధికము అముద్రితములుగా నున్నట్లున్నవి. ఇప్పుడిప్పుడే మద్రాసు ప్రాచ్య పుస్తక భాండాగారమువారు వానిని ప్రకటించుచున్నారు. వస్తుగౌరవమునుబట్టి చూచిన పరశురామపంతుల లింగమూర్తిగారి 'సీతపాట' సర్వోత్కృష్టము. వస్తుగౌరవము రచనావిధానము శైలినిబట్టి కాటోలు కృష్ణశ్రీగారు 'ఇది పాటవరసని ఉన్నది. అంతేగాని స్త్రీల పాటకాదు. గొప్ప వేదాంతగ్రంథం మట్టుకొను'1. అనిరి. వారి రెండవ వాక్యము పరమసత్యము కాని మొదటి వాక్యముతో నే నేకీభవింప జాలను. ఐనను వారట్లనుటచే నా పాటకు ప్రాంతీయ (పాక్షిక) ప్రచారమే కలిగియుండునని యూహించితిని. ఏలయన నేనాపాటను మౌఖికప్రచారమున గాంచితిని స్త్రీలు పాడగా సేకరించితిని. రచయిత తెలంగాణమువాడు కనుకను విషయము గహనమయినది కనుకను తెలంగాణము బయట నది యంత ప్రచార మందలేదేమో! కాని తెలంగాణమున కొలది సంస్కారమున్న ఇండ్లయందు సైతము పెద్దతరము ప్రతిస్త్రీ ఈపాట పాడగలదు. (మా నాయనమ్మగారు పాడగా విని నేను వ్రాసికొంటిని. తరువాత తాళపత్రగ్రంథములు అచ్చుపుస్తకములు చూచితిని.) కనుక 'సీతపాట'తో విషయవిమర్శనమునకు గడంగుట లెస్స.

తెలుగులో సర్వోత్కృష్టమగు వేదాంతగ్రంథము 'సీతారామాంజనేయ సంవాదము'ను రచించిన పరశురామపంతుల లింగమూర్తిగారే స్త్రీలకొరకే

1. భారతి-విజయ భాద్రపదము, సెప్టెంబరు 1953. పుట 230.

అప్పుడే తాను సచ్చిదానందపరబ్రహ్మమగును. మట్టితో చేసిన కుండలన్నియు మట్టియైనట్లే ప్రపంచమంతయు బ్రహ్మమని తెలిసిన, విషయ నిర్విషయ భేదము లేక తా నఖండబ్రహ్మమగును. దీనికై విజ్ఞానము, వైరాగ్యము, ఉపరతి యవసరము. ఇది యమనస్కము. సాంఖ్యము పరబ్రహ్మస్వరూప మిట్టిదని తెలియజేయును. తారకము మనస్సును పరిశుద్ధము చేయును. అమనస్కము నీవె పరబ్రహ్మమని నిర్ణయించును.

ఈ మూడువిధముల రాజయోగమును సీతపాట క్లుప్తముగా దెలుపుచున్నది. ఈ పాట

'శ్రీరాము జానకీసీమంతినీకాము ధారాధరశ్యాము దలచీ
ఆరాముడనకును నిత్యానపాయిని యైన ధారిణీసుతను సేవించీ' యను

వాక్యములతో నారంభమైనది. ఇంతవర కుదాహరించిన వాక్యములు కృతికర్త రచనాసారళ్యమున కుదాహరణముగా గొనవచ్చును.

'దుష్టమై వ్యష్టి సమష్టి రూపంబైన దృష్టప్రపంచంబు సీత
దృష్టాంత దార్ష్టాంత శ్రేష్ఠార్థముల నొకట నష్టంబుగా జేసి సీత' కఠినమగు రచన

కుదాహరణము.

'అందుగల చిత్కళల చందంబు విను హృదానందంబుగా నింక సీత
మందాకినీ కుంద మందార సుమబృంద సుందరాచ్ఛప్రభల్ సీత
నీల వైదూర్య ప్రవాళ మౌక్తిక సువజ్రాళి సన్నిభ రుచుల్ సీత'

శబ్దాలంకారములకును ప్రసన్నతకును ఉదాహరణము. పై పాదములు

'మందాకినీ సుధాసందోహ దుగ్ధాబ్ధి సౌందర్య లహరుల చందమునను
మందార మల్లికా కుందారవిందోరు చందన పుష్పరుక్చయము పగిది
నిందిరాసుందరీ మందిరాంత ర్మకరంద నిర్ఝరరుచి ప్రతతి రీతి
నిందుభృన్నంది సంక్రందన కరిమృగేంద్ర ఫణీంద్ర దీప్తి బృందముల భాతి'[1]

అను సీసపాదములకు క్లుప్తీకరణములు. ఇట్టి పోలిక లెన్నియేని చూపవచ్చును.

'శివశివ యనమేలు తుమ్మెదా - శివుడంటేనె విన మేలు తుమ్మెదా
శ్రీకంఠుడను పూవు తుమ్మెదా - మూడు - లోకమ్ములాయెను తుమ్మెదా
సాకారమైయుండు తుమ్మెదా - పర - మైకాంతమున జూడు తుమ్మెదా[2]

1. సీతారామాంజనేయ సంవాదము. 1-138.
2. సాధకుని మనస్సు.

ఆరురేకులపూవు1 తుమ్మెదా - అది - మీరునే వాసనల తుమ్మెదా
వేరుసేయక నీవు తుమ్మెదా - శివు - జేరి భజియింపవే తుమ్మెదా
అష్టదళములమీద తుమ్మెదా - నీ వంటి చరియించవే తుమ్మెదా'

అను తుమ్మెదపదములు మిక్కిలి ప్రసిద్ధములు. వీనిని రచించినది ఏగంటివారు. ఆంధ్రజానపదసారస్వతమున నీ యేగంటివారి రచనము అత్యంతప్రాచీనములు. వీరు కాకతీయుల కాలమువారనుట నిజమేని వీరి తుమ్మెదపదములు మరియు ఏలలే ఇప్పటికి మనకు తెలిసిన ప్రాచీనపుపాట లగును. వీనినే యేగంటివారి వచనము లందురు. వీనిగూర్చి శ్రీ మల్లంపల్లి శరభయ్య గారిట్లు వ్రాసిరి. 'ఏగంటివారి వచనములను శైవవేదాంతప్రతిపాదకములైన యీ గేయములు డి. నెం. 2484 వర్ణితమైన తాళపత్రప్రతినుండి యుద్ధృతములు. వీనిని వచనము లనుటకన్న తత్వములనుట మేలు. గహనములై, సంప్రదాయైక వేద్యములయిన పరమార్థవిషయములు మనోహరముగ నిందు వర్ణింపబడినవి. అపురూపములగు పలుకుబడులును పెక్కులు వీన గలవు. ఇవి ఏగంటి గ్రామమున వెలసిన నంజేశ్వరుని కంకితములు. వివరణ పట్టికలలో నీ గేయకర్తనుగూర్చి ఏగంటి లక్ష్మయ్యగారనియును, పిడుపర్తి లక్ష్మయ్యగా రనియును పేర్కొన్నది సరికాదు. పోసెట్టి లింగకవిచే నవచోళచరిత్ర ప్రస్తావన నాదిమశివకవిస్తుతిలో పాల్కురికి సోమనాథుని పిమ్మట సుప్రసిద్ధ గేయ రచయితగా స్తుతింపబడిన గార్లపాటి లక్ష్మయ్యగారే ఈ పదములకు కర్త. ఈ లక్ష్మయ్యగారే ప్రశస్తగేయకర్తలయిన శివయోగసిద్ధులుగా దోచుచునారు. మూలప్రతిలో కొన్ని గేయములకు మాత్రమే రాగము లుల్లేఖింపబడినవి. మొదటి గేయములుమాత్ర మిప్పుడు ప్రకటింపబడుచున్నవి. మిగిలినవి క్రమముగ రాబోవు సంచికలలో ప్రకటింపబడును.2' ఇంతవర కీరెండు సంచికలయందు కొన్ని గేయములు ప్రకటింపబడినవి. వీనిలో పైన పేర్కొనబడిన తుమ్మెద పదము మరియు 'సూర్యసోమవహ్నినడుమా' యనెడు ఏలయును గలవు. ఇవి ఇంతవరకే మౌఖికప్రచారమునను 'కాలజ్ఞానవచనములు' వంటి తత్వ సంకలనములందును ఉన్నవి. పాల్కురికి సోమనాథుడు పేర్కొన్న తుమ్మెద

1. షట్చక్రములు.

2. Bulletin of the Govt. Oriental Manuscripts library Madras. Vol. VII. No. 1, 1954.

పదముల కుదాహరణములుగా ఏగంటివారి తుమ్మెదపదములను బేర్కొనవచ్చును. పైన పేర్కొనబడిన ఏలలో కొంత మర్మకవిత్వముగూడ నున్నది.

'సూర్యాసోమావహ్ని నడుమా-శౌర్యమానే చిలుకా గంటి
సూర్యాదీప్తి కాయుచుండగా - యాగంటిలింగా-చూడ చూడాశ్చర్యమౌగానా ॥సూ॥
ఇంటిగుంటా చూచుచుండా-కంటి నుదయాగిరీ మీదను
సాముజేసె సంజ్ఞ తెలిసితే - ఓ యాగంటిలింగా-సారమైన పుట్టా జేరూనూ ॥సూ॥
పాముపేరూ1 చెప్పా విషమూ - ఆడాకాడా కక్కగదరా
చీమ యెనుపోతు కడుపూన - ఓ యాగంటిలింగా-దీమసమున మ్రింగియుంటిరా॥సూ॥
ఆకాశానా కూసేకోడి - చీకాటిలో బ్రొద్దుబొడిచే
... .. - ఓ యాగంటిలింగా - ఏకమైన వెన్నెల గానేరా ॥సూ॥
కానరాని యడవిలోన-వానలేని మడుగు నుండే
వానలేని మడుగుమీదటా - ఓ యాగంటిలింగా - మానరాని అగ్ని పుట్టెరా ॥సూ॥
ఆకులేని అడవిలోన-తోకలేని మృగము బుట్టె
తోకలేని మృగమూ కడుపూనా - ఓ యాగంటిలింగా - ఈకలేని పక్షి బుట్టెరా ॥సూ॥
పుయ్యావాలె మేన భూతి-వెయ్యావాలే రుద్రాక్షలు
చెయ్యావాలె శివుని పూజలు-ఓ యాగంటిలింగా-కొయ్యావాలె కర్మబంధములూ॥సూ॥

ఇంకొక ఏలపాటకూడ గమనింపదగినది.

'పన్నెంపూ దిడ్డీ వాకిట-పున్నమావెన్నెల బైటా
కిన్నెరాల నాదమింటిరా-ఓ యాగంటిలింగా-వినగవినగ వింతలాయెనురా ॥స॥
చిచ్చు కడుపున చీకటి బుట్టె-చీకటి కడుపున చిచ్చూ బుట్టే
చిచ్చు చీకటికమైతేనూ - ఓయాగంటిలింగా - చిన్నెలాడి బాల పుట్టేనూ'.

ఇట్టి మర్మకవిత్వమునకు పూర్తిగా అర్థమేరును చెప్పరైరి. వెన్నెల యనగా చిత్కళలనియును కిన్నెరలధ్వని నాదమనియు చిచ్చుచీకటులు జీవుడు మాయలనియు కొంత యన్వయించుకొనవచ్చును కాని ప్రతిమాట కర్థము చెప్పుకొనుట కష్టమే. ఇట్టి మర్మకవిత్వము బెంగాలు దేశమున 'బాల్' జాతివారి జానపదగీతములందును గలదు2.

1. కుండలినీశక్తిని మేల్కొల్పి షట్చక్రముల గడపి సహస్రారమునందు ప్రతిష్ఠించుట కాబోలు.

2. 'Mystic minstrels of Bengal'
March of India Vol. V. No. 1, Sept. Oct. 1952

లక్ష్మయ్యగారు వీరశైవులు గనుక నామతమందలి వీరత్వము అనగా శైవేతరమతముల పట్ల విద్వేషము కూడ గాననగును.

'వీరశైవాచారవిభవము మదిలోన, గోరక శివుని గొలువ నేరక
వేరొక్క మతమున విహరించు హీనుల, జేరంగ నేగంటి సిద్దయ్య నగెబో
వేదస్మృతులయందు జంగమతీర్థ ప్ర, సాదమే ముక్తని చాటంగనూ
కాదన్నయట్టి పరవాదుల ముక్కులు, ఛేదించి ఏగంటి సిద్దయ్య నగెబో'

ఈ సిద్ధయ్య యెవరో? వీరశైవులు గురులింగజంగములను దైవతములుగా గొలుచుట గలదు. ఏగంటివారి రచనములందు నీతిప్రబోధము కూడ కలదు.

పల్ల. తెరవాటుగొట్టి తెచ్చి తేగమిచ్చే కీర్తికంటె-నొరుల నొప్పించక యుండుటే చాలు
పరుల బాధించి సంపదల బొందుటకంటె-ధర దున్నుకొని బ్రదుకుదారిద్ర్యమే చాలు
అ.ప. ఓపితేపుణ్యము నేయుమోపకుంటేఊరకుండు-పాపము నేయకుమంతేపదివేలుజీవుడా
చరణ. ఒరులతో చాడి చెప్పి యుడుగర లందుకంటె-గరిమతో గోచైన కట్టేది మేలూ
వరుసతో కల్లలాడి వాచాలు డగుకంటె-నరయంగ మూగవాడయ్యేది మేలు
వరులచే నప్పుచేసి పప్పుకూడు దినుకంటె-దొరకు నంబలి యొక్క దోసెడే చాలు
వరదైవముల గొలచి పడయు సిద్ధులకంటె-ఒరిమ నేగంటీశునొద్ద నుంటే చాలు

మరియొక గేయమున యోగిలక్షణము లిటుల చెప్పబడినవి.

పల్ల. అరయ నాలుక జిడ్డు నంటకుండిన యట్లు-పరగ దామర నీరు పట్టనట్లూ
గరిమ బూడిద గచ్చకాయ నంటనియట్లు-బురదయును గుమ్మరిపురు గంటనట్లూ
అ.ప. పొరలి సంసారమ్ము బొరయకుండెడు యోగి-యరసి కోర్కెలయందు నంటబోడు
చరణ. అవని మీదను నీడ యంటకుండని యట్లు-తవిలి నీరను రవి తగులనట్లూ
అవలీల రూపంబు నద్దమంటనియట్లు-వివరింప మది పీరు వెన్నంటనట్లూ
పర్వతగుహలందు పలుకు లంటనియట్లు-దర్వి పాకంబు రుచి దగులనట్లూ
ఉర్విని జీడి లోవిత్తు నంటనియట్లు-గర్వులను నేగంటిషుఁ దంటనట్లూ

సహజమగు భక్తి లేనిచో,

'పటులింగతేజ సత్ప్రాణి గాకుంటేను-చెట్టుమీద నొకరాయి చిక్కినటు గాదా
అటుదేహ బహురూప మిటు గానకుంటేను-వట్టిగుళ్ళలో నమశ్శివా యనుట గాదా'

యని వెక్కిరించెను.

మహాయోగియై, ప్రజాకవియై, సంఘసంస్కారాభిలాషియై ప్రసిద్ధి గన్నవాడు వేమన. సమకాలీన మతాచారములను వేమన విమర్శించిన గేయఖండ

మొకటి శ్రీవావిలాలసోమయయాజులుగారు సేకరించి ప్రకటించిరి.1 దాని నిట పొందుపరచుచున్నాను.

'జాతర జాతర సుమ్మీ - జాతర తీతుడు వేమన సుమ్మీ
వేదాతీతుడు వేమన సుమ్మీ-వేమన చెప్పిన వేదము సుమ్మీ
వేదశాస్త్రములు వాదులు సుమ్మీ-వాదులనోళ్ళకు బూదిడు సుమ్మీ
కన్నవారు మరి చెప్పరు సుమ్మీ-
చెప్పిన నెవ్వరు చేయరు సుమ్మీ-చేసినవారే సిద్ధులు సుమ్మీ'

సరళశైలిలో సులభగ్రాహ్య మగునటులుగా అద్వైతామృతము నాబాల గోపాలమున కందించు శ్రీలపాట 'నారాయణ శతకము'. శిష్టవాఙ్మయమున శతకసాహిత్య మొకశాఖగా పంగణింపబడును. నారాయణ శతకము పద్య కావ్యము కాదుగాని శతకములకువలెనే దీనికిని నారాయణా యను మకుటము ప్రతి గేయఖండాంతమున నున్నది. మొత్తము 119 గేయఖండము లున్నవి. ఇది 'శ్రీరంగరంగ రంగా నాయన కావేటి రంగరంగా' యను శ్రీకృష్ణ జననము పాట వరుసలో నున్నది. ఇంత చక్కని గేయమును రచించి తన పేరు చేర్చుకొనని యా మహానుభావుడెవ్వరో తెలియదు. ఈ గేయముకూడ శతకములవలెనే ప్రార్థనతో నారంభమై పశ్చాత్తాపము, ఆత్మనివేదనము వేడికోలు మున్నగువానితో నొప్పుచు రానురాను వేదాంతములోనికి దిగినది.

శ్రీరమా హృదయేశ్వరా భక్తజన, చిత్తజలరుహ భాస్కరా
కారుణ్యరత్నాకరా, నీవెగతి కావవే నారాయణా ॥ యను ప్రార్థనమును

'పాపకర్మముల జేసి నరక, కూపముల బడజాల నికను
నీపాద భక్తి యొసగి యొక్కదరి, జూపవే నారాయణా ॥
దానధర్మముల జేయనేర నీ, దాసులను బొగడనేర
నానేరముల దలపక దయచేసి, నన్నేలు నారాయణా ॥
వేగి లేచినది మొదలు సంసార, సాగరంబున నీదుచు
మీ గుణము నొకవేళను దలప గదె, మేలనుచు నారాయణా ॥
ఎంత పాపాత్ముడైన మిము దలచి, కృతకృత్యుడౌను పుడమి
నింత వరుసము సోకిన లోహంబొ, హేమమౌ నారాయణా॥ యను

పశ్చాత్తాపముతో కూడిన ఆత్మనివేదనమును,

యమకింకరుల దలచిన నాగుండె, యావులింపుచునున్నది

1. గేయరచనలు-ప్రాచీనులు. ప్రతిభ. జూలై 1940

యముని బాధలు మాన్పను మాయప్ప, వైద్యుడవు నారాయణా ॥
శరణుజొచ్చినవాడను నేజేయు, దురితముల నపహరించి
పరమపద మొసగగదవే యికనైన, పరమాత్మ నారాయణా॥ యను వేడికోలును గావించి యద్వైతమును బోధించెను. సచ్చిదానందముల మూటిని ఎంత సులభముగా నరటిపండొలచి చేతికిచ్చినట్లు శ్రీల కందించినాడో గమనింపుడు.

కాలత్రయాబాధ్యమై మరి నిరాకారమై యుండుకతన
చాలగా తత్వజ్ఞులు తెలియుదురు సత్తగుట నారాయణా ॥
జ్ఞాన స్వరూపముననను నజడమై జడపదార్థము నెల్లను
గానగా జేయు కతన చిత్తండ్రు ఘనులు నిను నారాయణా ॥
సుఖదుఃఖముల రెంటికి వేరగుచు సుఖరూపమైన కతన
సకల వేదాంతవిదులు ఆనందమండ్రు నిను నారాయణా ॥

తరువాత ఈశ్వరనిరూపణము, ప్రపంచనిరూపణము, జీవాత్మనిరూపణము మొదలుకొని సాంఖ్యతారకామనస్కములను చక్కగా వ్యక్తపరచెను. ఆత్మను వర్ణించుచు,

అనల తప్తంబుగాదు జలమునను మునిగి తడి జెందబోదు
అనిలశుష్కంబుగాదు నిరుపమంబని తెలుపు నారాయణా॥యను చిన్నమాటలందు

'నైనం ఛిన్దన్తి శస్త్రాణి, నైనం దహతి పావకః
నచైనం క్లేదయంత్యాపో, నశోషయతి మారుతః'యను భగవద్గీత శ్లోకమందలి భావమును దెలిపెను. తుట్టతుదకు

చిలుక పలుకులు పలికితి నాకేమి తెలియు తత్వరహస్యము
వలదు నను నేరమెంచ సాధులకు, నలినాక్ష నారాయణా ॥
శరణు భక్తార్తిహారి గురురూప శరణు సజ్జనరక్షక
శరణు దురితౌఘనాశ శరణిపుడు, కరుణించు నారాయణా॥ యని నమ్రుడై వేడుకొనెను. కృతికర్త చెప్పినదంతయు నద్వైతమగుటచే తన పేరుతోడనే పరమాత్మని 'నారాయణా' యని సంబోధించెనేమో !

'అపగతాఘకృత్యుడై యీరీతి, నభ్యాస మొనరించుచు
నపరోక్ష సిద్ధినొందు బ్రహ్మంబు, తానగుచు నారాయణా'
బ్రహ్మంబు తానగుచు ననుమాటలో ఇది గర్భితమేమో యని నాయనుమానము. లేక నాయనుమాన మసత్యమని బ్రహ్మంబు తా నగుచుండెనా? ఏమైననేమి పోనిండు!

నారాయణశతకమున కనుకరణము 'రామరామశతకము'. సారళ్యమున నిదియే మిన్న. వస్తువులో కించిన్మాత్రము భేదము దక్క తక్కినదంతయు నదే.

శ్రీలక్ష్మిప్రాణలోలా, మౌనిజన చిత్తతామరసఖేలా
ఫాలాక్ష వినుతశీలా, దయజూడు పరమేశ రామరామ ॥ యని యారంభమై

నిక్కమని సంసారము, మదినమ్మి నీ స్మరణ జేయలేక
అక్కటా యముని కిపుడు, పిట్టవలె జిక్కితిని రామరామ ॥
తల్లిదండ్రాదులనియు మరి యన్నదమ్ములని నమ్మికొనుచు
నెల్లకాలంబు మదిని నీభక్తి నేమరితి రామరామ ॥
మోసపోతిని గదయ్యా, యికముందు దోచదేమందునయ్యా
నీచాత్మడను గావున లోనైతి నాసలకు రామరామ' యను నిర్వేదమువున్నగునవి రెంటను సమానములే. వేదాంతము రెంటను ఒక్కటే. ఇక దీని యందధికముగా నున్నవి పిండోత్పత్తి క్రమము మున్నగునవి.

'సతిపతులు గూడినపుడు శుక్లంబు బుతువైన కమలమందు
సతిశోణితమున గలిసి బుద్బుదం బవునుగద రామరామ॥
పదునైదు దినములకును నది గట్టిపడి పిండరూపమౌను
గదినీ యొక నెలకు శిరము నేర్పడును గాదె శ్రీరామరామ ॥

ఇటుల తొమ్మిదవ మాసమువరకు పరిపూర్ణపిండమై
మరి తొమ్మిదవ మాసము రాగానె మురికియౌ గర్భమందు
హరిహరీ నిలిచియుండ లేననుచు వెరపొందు రామరామ ॥
దశమమాసము వచ్చిన సమయమున దగ నధోముఖముగాను
వసుధపై జన్మించియు మాయచే వర్తిల్లు రామరామ ॥
ముసరులు గింకరులును గిసరులును ముట్టు దోషంబులును
బొసగ నెలదోషములును నేవేళ బొందుచును రామరామ॥ ఈరీతిగా సహజముగా సరళముగా వర్ణింపబడెను. శ్రీ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు వ్రాసిన పీఠికలో నున్నదిగాక మరియొక ప్రాత ప్రతియందు గద్యముకూడ నున్నది. 'ఇది శుక్లనామసంవత్సర మార్గశిరబహుళ బుధవాసరంబున తోటవంశ పయఃపారావార సుధాకర నరసింహపుత్ర సుజనవిధేయ వేంకటనరసింహ ప్రణీతంబయిన శ్రీ రామరామ శతకమునందు నీతి సంగ్రహమును, పిండోత్పత్తి ప్రకారంబును, సంసారబంధమోక్షణంబును, పరమాతీతభావంబును, ప్రణవ మహిమంబును, బ్రహ్మానుభవంబునుంగల రామరామ శతకము సంపూర్ణము'—

గద్యమున పేర్కొనబడిన వివరములన్నియు నతిమనోహరముగా చెప్పబడిన వనుటలో సందియము లేదు. పాటలో గూడ చివరన కర్త తన తల్లిదండ్రులు గ్రామము తన పేరు మున్నగు వివరముల నిచ్చెను. వేరొక ప్రతిలో శ్రీ సుబ్రహ్మణ్యశర్మగారు తమ 'విజ్ఞప్తి' లో నిటులనిరి. '........(కర్త) నెల్లూరిమండలవాస్తవ్యుడు.... శూద్రులలో బలిజవంశమున బుట్టినవాడు.... నారాయణ శతకము ననుసరించి ఇయ్యది వ్రాయబడినట్లు తోచుచున్నది. శుక్ల వత్సరమున ననగా నెనుబది వత్సరముల క్రిందట వ్రాయబడిన దనరాదు. రెండు శతాబ్దములనుండియు నిది వాడుకలో నుండినట్లు వినబడుచున్నది.' శర్మగా రభిప్రాయపడినట్లు రెంటికిని పోలిక లున్నవి. ఆరంభమందలి ప్రార్థనము గమనింపుడు.

నారాయణ శతకము :శ్రీరమా హృదయేశ్వరా భక్తజన చిత్తజలరుహ భాస్కరా కారుణ్యరత్నాకరా నీవె గతి కావవే నారాయణా'

రామరామ శతకము: 'శ్రీలక్ష్మి ప్రాణలోలా మౌనిజన చిత్తతామరసఖేలా ఫాలాక్షవినుతశీలా దయజూడు పరమాత్మ రామరామా'

సాధారణముగా బలిజలు వీరశైవులు కాని యీత డద్వైతివలె దోచును. లేనిచో మొదట విష్ణుప్రార్థనముగాని రామరామయను మకుటముకాని ఉండదు. మరియు విష్ణువును 'ఫాలాక్షవినుతశీలా' యని పొగడెను. ఇంకొకచో

'పంచ తత్వంబులందు భ్రాంతి నిర్జించి రెంటియందు
పంచాక్షరీమంత్రము ధ్యానింప పరుడౌను రామరామ' యని యుండుటచే నీతడు శివాద్వైతియై యుండనోపు. మానవుని సంసారదుఃఖమును వర్ణించునప్పు డొకచో

'మగని పలుకులకు నెదురు పలుకుచును మగనితో కలహించెడి
మగువ బెండ్లాడి భ్రమల దగులుకొని మరచితిని రామ రామ' యనెను ఇది లోకసాధారణవిషయమో లేదా కవి స్వానుభవమో తెలియదు. నారాయణ శతకము రామరామశతకము రెండును అత్యంతప్రచారమందిన గేయములు. వీనివి పూర్వసువాసిను లెక్కువగా పాడుకొనుచుందురు.

పంచనపాక వెంకటార్యుని శిష్యుడగు చెంచురామకవి రామనామమును పరబ్రహ్మముగా గొని 'శ్రీరామనామ మాహాత్మ్యము'ను మిశ్రగతిలో వృషభగతి (151) రగడలందు రాజయోగమును క్లుప్తముగా నభివర్ణించెను. ఆరంభ వాక్యము లిటులున్నవి.

శ్రీమహత్తత్వార్థబోధ వి - శేషమైనది రామనామం
సోమసూర్యాగ్నులను మించిన - స్వప్రకాశము రామనామం
మూడు గుణముల ప్రకృతి వికృతికి మూలకందము రామనామం
ఏడుతత్వంబులకు నావల నెసగుచున్నది రామనామం'. చివరన తననుగూర్చి
'పంచపానక వెంకటార్యుని పాదయుగళము రామనామం
చెంచురామ కవీంద్రునికి, కరుణించుచున్నది రామనామం' అని చెప్పుకొనెను.

పైదానివలెనే పరబ్రహ్మమును శివపరముగా సంబోధించి భక్తిజ్ఞాన యోగముల మేళవించి యద్వైతమును '*నమశ్శివాయ గేయామృతము*'గా నందించినవాడు సాయం వరదదాసు. గురువగు మళయాలస్వామి కృతిపతి. ఈ గేయము పైదానికన్న సరళముగా నున్నది. ఇది చతురశ్రగతిలో నడచినది. ఆరంభవాక్యము లివి.

ఓమ్ నమశ్శివాయ నమశ్శివాయ, నమశ్శివాయ ఓం నమశ్శివాయ
నమశ్శివాయని నామనసందున నభినుతి జేసెద నను కడతేర్చుము. ||ఓం||

మచ్చునకుగా నచ్చటచ్చట కొన్ని చరణములు.

ఎంతని వేడుదు పంతమునాపై, సుంతయు దయ రాదేలనయా ||ఓం||
ఝుమ్మను ప్రణవనాదములోపల. గ్రమ్మిన వెన్నెల కాంతివయా ||ఓం||
నీకంటె పరదైవము లేదుర, నిన్నెగొల్తుర నిర్ద్వంద్వా ||ఓం||
మర్మము దెలిసిన మహనీయులకును, కర్మము భస్మము జెందుగదా ||ఓం||
శుచిగా ప్రణవము భావన జేసిన, శుద్ధులు నిను మది గాంతురయా ||ఓం||
శివశివ నీపదచింతన గలిగిన, సిద్ధము మోక్షము సిద్ధమయా ||ఓం||
అద్వైతంబను అమృతము గ్రోలగ, ఆధారము నీ నామమయా ||ఓం||
ప్రమథాధిప నీ పాదపద్మముల, ప్రణుతి జేతు దయ జూడుమయా ||ఓం||

నూట ఎనిమిది చరణములుగల యీగేయముతోపాటు కీర్తనములుకూడ కలవు.

గీర్వాణభాషలోనున్న శ్రీమదధ్యాత్మరామాయణమందలి ఉమామహేశ్వర సంవాదోత్తరకాండమున నున్న '*శ్రీరామగీత*'ను తెలుగులో ద్విపదలందు అల్లూరి రాజేశ్వరకవి రచించెను. ఈతడు పరిటాల నివాసి. లక్ష్మణు డడుగ శ్రీరాము డాతని కద్వైతము బోధించినట్లును ఒక్కొక్క సంశయమును దీర్చినట్లును వర్ణింపబడినది. కాని ఇది యంతగా ప్రచార మందలేదు. కనుక దీనిని జానపద గేయములందు చేర్పనక్కరలేదు. ద్విపదలుకూడ ఏపాదమున

క్రా పాదము తెగిపోక పాల్కురికి ద్విపదలట్లు ఒకే శబ్దముచే నటునిటు లంకె పడియున్నవి. ఇట్లున్న ద్విపదలు పాడుకొనుట కనుకూలముగా నుండవు.

అద్వైతవేదాంతప్రతిపాదకమై, స్త్రీలు పాడుకొనుట కనువై, బహుళ ప్రచారము గాంచిన గేయము 'వేదాంత కుచ్చెల కథ'. ఇది రచించినది చిన్నయ సద్గురుని శిష్యుడు, వేద పన్నాల సుందరాత్మజుడు. తండ్రిపేరు తెలిసెనేకాని రచయిత పేరు కానరాదు. 'కుచ్చలకథ వరుసను పాడగవలెను, పాడినవారికి పరలోకంబు; వినినవారికి విష్ణులోకంబు' అని చివరన నున్నది. 'కుశలవ కుచ్చెలకథ' యను కుశలవచరిత్రము వరుసతో దీనిని పాడవలయు నన్నమాట.

మిథిలాపురిని పాలించు జనకునికి నూరుగు రాచార్యు లుండిరి. ఒక్కొక్క రొక్కొక మార్గమును చెప్పెడువారు. 'శ్రుతులు సత్యమని చెప్పేవారును, వ్రతములు మేలని పలికేవారు, కర్మలు నిక్కము లనియెడివారు, నిర్మలజ్ఞానము నిక్కమనువారు, అజ్ఞానమె మూలంబనువారు, ప్రజ్ఞానము లేక చొప్పడదనువారు, చిరకాలాభ్యాసులకునుగాక, పరమార్గ మలభ్యంబనువారు, పాయని ఈశ్వరిభక్తియు గలిగిన, మాయను జెందక మనుమనువారు, పురుషుడీసువై యారోపాడనుచు, అరసి చూడ సౌఖ్యం బనువారు. అంతరదృష్టిని యవలోకింపుచు, వింతగ చుక్కయి వెలగనువారు, మనసు కలిగిన మమతలు వీడవు, మనసు లేకపోవలె ననువారు' ఆసభలో నుండిరి. జనకుడు తనకుగల సంశయముల దీర్చుడని వారిని కోరుచుండగా 'పంచశిఖుండను పరమమునీంద్రుడు, అంచితముగ జనుదెంచెను అప్పుడు' ఇంతలో నారదుడు వచ్చి సత్కృతుడై పంచశిఖుని మాట వినవలసినదిగా జనకు నాదేశించి వెడలిపోయెను. జనకుడు పంచశిఖుని పది ప్రశ్నము లడిగెను.' మునినాథా జగములు లేవందురు, 1 కనబడుచున్నవి కాదన దగునే, అశరీరులు కలరనగా విందును, 2. విశదపరచు డావిధమంతయును, పుట్టినవారలు గిట్టెదరనుచూ, గిట్టినవారలు పుట్టెదరనుచూ, 3. చెప్ప విందు నది సిద్ధంబవునా, ఎప్పటికిని బాయవు జన్మములు, అది యట్టులనే యనుచును వింటి, 4. అది వినిపింపుడి విశదముగాను, అదియును నేనై యనువర్తించున, అదియును నీవై తను బోధించున, అదియును తనువై యవతరించునా, 5 అది తా ననుటకు అర్హము గలదే, బ్రాహ్మణులే మోక్షార్హులనుచునూ, 6. బ్రాహ్మణభావం అలవడు టెట్లు, 7. ఏ సాధనచే నలవడు మోక్షము, 8. ఏ సద్విధిచే నలవడు ముక్తి, 9. ఏవిద్య గావింపవచ్చును, 10. ఏవృత్తిని గావింపవలయును, ఈ పది

ప్రశ్నలలో పరమార్థము, దాపక నాపయి దయతో చెపుమా.' పంచశిఖుడు వీని కన్నిటికి సమాధానమిచ్చి విరాట్పురుషుని వర్ణించి వెడలిపోయెను. స్త్రీలు పాడుకొనునట్లు సరళముగా చిన్నగా నుండుటచే నీగేయ మధికప్రచారము గాంచినది.

'వసిష్ఠ వాక్యాములు' కూడ స్త్రీలలో ప్రచార మందిన వేదాంతగేయము. 'ఒకనాడు రాముడు వసిష్ఠుని బిలిచి, ఒక ప్రశ్న యడిగెనే ఓ రామ.' యని ఎనిమిది 'కిటతకిట'ల ఆవృత్తములతో నడచినది. శ్రీరాముడు వసిష్ఠునితో 'తన్ను తా తెలిసితే అన్యవృత్తేమిటికి, అది నాకు తెలుసునే ఓ రామ' యని యడుగ వసిష్ఠుడు,

సైంధలవణపురాయి సాగరములోబడి తా వుదకమాయెనే ఓరామా
అటువలెనే తన మనసు శివుని ధ్యానము చేసి శివునందు కలిసెనే ఓరామ
కీటకమ్మొ యెపుడు భ్రమరధ్యానము చేసి భ్రమరంబు తానాయె ఓరామ
అటువలెనే తన మనసు శివుని ధ్యానము చేసి శివుడు తానాయెనే ఓరామ' యనునట్టి

దృష్టాంతము లెన్నియో చెప్పుచు అద్వైతమును బోధించెను.

'పాము కూసము పిడిచి పశ్చాత్తాపాన పట్టుకొని వెదుకునా ఓరామ
విస్తట్లో భోంచేసి విసిరి పారావేసి మళ్ళి అది ముట్టునా ఓరామ' అను

దృష్టాంతములతో విరక్తుడైనవాని విషయవైముఖ్యము చక్కగా సమర్థింపబడినది. పాటచివరన 'వసిష్ఠారాముడు వర్ణించె నీకథా ఓరామా' యని కలదు. ఈపాట రచించినది (వ) శిష్టా రాముడు గాబోలు; లేదా వసిష్ఠునకును రామునకును జరిగిన సంవాదమని యర్థమో తెలియదు.

ఏగంటివారి యేలలు దక్క నింతవరకు పేర్కొన్నవి దీర్ఘగేయములు. ఇక తత్వముల పేరుతో ప్రసిద్ధిగాంచిన చిన్నపాటలను విచారింతము. వేమన తరువాత తెలుగునాట అధికప్రచారము గాంచినవాడు పోతులూరి వీరబ్రహ్మ యోగి. వేమనరచనలు పద్యము లగుటచే శిష్టసాహిత్యమున జేరిపోయినవి. కాని పోతులూరి వీరబ్రహ్మంగారి కాలజ్ఞానతత్వములు గేయరచన లగుటచేత జానపదులం దధికాదరము గాంచినవి. కాలజ్ఞానమనగా భవిష్యజ్జ్ఞానమని లోకమున వాడుక. కాని కాలస్వరూపుడైన శ్రీమన్నారాయణ తత్త్వజ్ఞానమే కాలజ్ఞానమని శ్రీ పూదోట మఠాధిపతులైన శ్రీ ఆనందనాదస్వామిగారి

వ్యాఖ్యానము. మన ప్రాచీనఋషులు యోగులు పరబ్రహ్మసాధన సాక్షాత్కారానుభూతులను అక్షరసాంఖ్యసంకేతముల ద్వారమునను చేతనాచేతనపదార్థ నామముల మార్మికసంకేతములతోడను గుప్తముగా చెప్పిరని యాస్వామి నాకు వ్రాసిన 13-9-1976 నాటి యొక సుదీర్ఘలేఖలో తత్త్వములందలి సంకేతములకు మర్మములకు విపులవ్యాఖ్యానము గావించిరి. ఇట్టి విద్యను గురించి ఈ గ్రంథమున నింతకన్న నెక్కువగా చెప్పుటకు నా కధికారము చాలదు. కాలజ్ఞానములు పోతులూరివారితో పుట్టినవి కావు అంతకు పూర్వమే యున్నవి. 'వీరశైవము తోనే విషపానాదిమహాకార్యాలు చెయ్యడమూ కాలజ్ఞానతత్వాలు చెప్పడమూ ప్రారంభమైనాయి. మడివాలు మాచయ్య కాలజ్ఞానతత్వాలు చెప్పేడు. సిద్ధ రామయ్య 'కాలజ్ఞానము' రచించాడు. తరువాత బయల్దేరిన సన్యాసులు కూడ కాలజ్ఞానతత్వాలు చెప్పారు'.1 శంకరార్యులు కూడ విషపానాదిమహాకార్యములు చేసినట్లు కథలున్నవి. 'కాలజ్ఞానతత్వములు' రచించిన పోతులూరి వీరబ్రహ్మం గారి చరిత్రమును శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం గారుటుల వ్రాసిరి. 'ఈతడు జాతిచే కంసాలి. ఈతని కాలము సుమారు పదునేడవ శతాబ్ది మధ్యభాగము. కర్నూలు మండలము బనగానపల్లెలో నీతని బాల్యము పసుల గాచుటయందు గడచినది. ఈతడు విగ్రహారాధనలు జాతరలు జాతిభేదములు మొదలగువానిని ఖండించి ప్రజలకు హితోపదేశము చేసెను. వీరబ్రహ్మము సాక్షాత్తుగ శివుని యవతారమని ప్రజలు విశ్వసించిరి. వేమనయోగివలె ఈతడును అద్వైత వేదాంతార్థములనే బోధించెను. తత్వప్రచారమునందీత డవలంబించిన పద్ధతి జనాకర్షక మైనది. నిత్యజీవితమునందలి యంశములను పురస్కరించుకొని రూపకములు సృష్టించుచు సులభమార్గములో గహనతత్వార్థములను బోధించును.2

పోతులూరి వీరబ్రహ్మంగారి పేరుతో ముద్రింపబడిన 'కాలజ్ఞానతత్వము' లందు పదిమంది రచయితల 154 తత్వములున్నవి. కొన్నింటి రచయితల పేర్లు లేవు. తత్వములతోపాటు వచనములు ద్విపదలును కూడ కలవు. వీనియందలి వృత్తము భక్తిజ్ఞానవైరాగ్యములకును, ప్రపంచ పద్ధతికిని, కలియుగ పద్ధతికిని, గురుమహత్వమునకును సంబంధించినది. మర్మకవిత్వముగల తత్వము లధికముగా నున్నవి.

1. శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి. కిన్నెర-పుట 559 డిసెంబరు 1953.
2. ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము. పుటలు 333-334.

'చెప్పలేదంటనక పొయ్యేరు, నరులార గురుని చేరి మ్రొక్కితె బ్రతుక నేర్చేరు ॥చె॥
చెప్పలేదంటనక పొయ్యేరు, తప్ప దిదుగో గురుని వాక్యము
తప్పుత్రోవల బోవువారిని చప్పరించి మ్రింగు శక్తులు ॥చె॥

ఇది వీరబ్రహ్మంగారి కాలజ్ఞానము. దీనియందే,

'తాకుతప్పులు తలచకున్నారు, తార్కాణమైతే యెక్కువతో తెలియనేర్తురు,
జోకతోడుక తల్లిపిల్లలు జోడుబాసి యడవులందు,
కాకిశోకముచేత ప్రజలు కాయగసరులు నమలి చత్తురు ॥చె॥
కేకవేసియు ప్రాణ మిడిచేరు, రాకాసి మూకలు కాకబట్టి కలువరించేరు.
ఆకాశము యెఱ్ఱనౌను, ఆరుమతములు ఒక్కటౌను,
లోకమందున జనులు అందరు, నీరు నిప్పున మునిగిపోదురు ॥చె॥
అగలు విడిచి పొగలు దాటేరు, అదిగాక పట్టపగలు చుక్కలు చూచి భ్రమనేరు,
భుగులుభుగులు ధ్వనులు మింటను, పుట్టి యేగిన పిమ్మటాను,
దిగులు పడుచు ప్రజలు చాల, దిక్కులేని పక్షులౌదురు ॥చె॥
పాతకూలు పడట గలిసేరు, పుణ్యాత్ములైన సాధకూలు సంతసించేరు,
భూమిమీద ధూముధాములు, పుట్టి పెరిగి పిమ్మటాను
రామరామ యననివారలు, రాలిపోదురు తెలిసికొండి ॥చె॥
కీడులైనను కూడపందూరు, ఒనగూడినప్పుడు యేడజూచిన వాడుకొందూరు,
వేడుకాతో పోతులూరి వీరభోగవసంతరాయలు,
యేడుదీవులు యేకచక్రము, నేలునూ బ్రహ్మాండ మంతయు ॥చె॥

సద్గురుని సన్నిధిని శ్రవణమొనర్చి దివ్యస్మృతిని బొంది లక్ష్య సాధనమున నానావిధసాక్షాత్కారానుభూతులను పూర్ణస్థితిని కాంచుడనియు నట్లు చేయనిచో ఘోరదుఃఖముల పాలగుదురని లోకులను హెచ్చరించుచే ఈ తత్త్వమందలి యాశయమని శ్రీ ఆనందనాదస్వామి యభిప్రాయము. ఇందులోని తల్లిపిల్లలు ప్రకృతిజీవులకును,ఆరుమతము లొక్కటగుట మనోబుద్ధిచిత్తాహంకార మహత్తత్వసత్తులను నారుకేంద్రము లావరణరహితమగుటకును, చుక్కలు జీవమండలమునకును,భుగులుభుగులు ధ్వనులు అభ్యాసకుని పారవశ్యమునకును, దిక్కులేనిపక్షి ఆవరణ రహితమగు పరమస్థితికిని, పోతులూరు జీవుల విలయమునకును, వీరభోగ వసంతరాయలు తన శక్తిని తానే లయమొనర్చి నవసర్గమొనర్చు పూర్ణపురుషునకును, ఏడుదీవు లేకచక్రముగా నేలుట సప్త భూమికలందు నిరావరణుడై సర్వశక్తినియామకు డగుటకును సంకేతములని స్వామి యభిప్రాయము.

బ్రహ్మంగారి గోవిందపదములను గేయమొకటి 'లెల్లె' పదము వరుసలో నున్నది.

'నడివీధినా ముందు నాటింతురా కొల్మి, నడిమండలామందు చాటింతురా నంది,
బుద్ధి తెలియానట్టి కుక్కలనుబట్టి, బంధించి బాకుల కుమ్మింతురా
॥శివగోవింద గోవిందా॥

ఇందులోని నడివీధిముందు = సహస్రారమునగల జీవుని ముందుండు చిత్రకూటము, కొలిమి = చిదగ్ని, నంది = అంతర్ముఖమైన మనస్సు, కుక్కలు = లక్ష్యార్థమెరుగని వృత్తులు, బాకులు = జ్ఞానప్రకాశము లట. ఇటులే వీరబ్రహ్మంగారి రచనము లింకను పదిపంద్రెండున్నవి.

ఇక తక్కినవారి రచనలను చూతము. ఏగంటివారి రచనము లిదివరకే చూచితిమి. ఏగంటివారి శిష్యుడనని చెప్పుకొన్న నంజయ్య తత్త్వము మర్మ కవిత్వముతో నున్నది.

చేతులకందని రెండు శివశివ నీతులు చెప్పగ విందురటా ॥చే॥
ఊరి పడమట నొక్క పాములేని పుట్ట, పుట్టలోనే యూరపిచ్చికటా
పుట్టమీద నొక్క యూసర వెల్లియట-ఎట్టెదేని వెన్న మెక్కునటా ॥చే॥
మొదలు లేని మ్రానుకు ఆకులేని తీగను ఐదుకొమ్మలట
మొగ్గలేని పిందె తొడిమెలేని పండు నోరులేని బాల మ్రింగెనట ॥చే॥
గుఱ్ఱము యెనుబోతు కూడ చరించగ నత్తెడ్లమీద నడచునట
జెట్టిపోతు జింక మట్టి మ్రానుమీద నమలక యా బయలు మేయునట ॥చే॥
గురుతుగ యాగంటి గురుకృప గలిగితే గురుతుగ నంజయ్య దెల్పెనటా
శివభక్తులైతే శివుని సన్నిధికి చేరుమని శివుడు చెప్పునటా ॥చే॥

రెండునీతులు = సత్యధర్మములు, ఊరిపడమట = అవ్యక్తము, పాము = చిచ్ఛక్తి, పుట్ట = మనస్సు, ఊరపిచ్చుక = బుద్ధి, ఊసరవెల్లి = చిత్తము, వెన్న = కర్మఫలము, మొదలులేని మ్రాను = సమష్టి ఇచ్ఛాశక్తి, తీగ = గుణము ఐదు కొమ్మలు = పంచభూతములు, మొగ్గలేని పిందె = ప్రకృతినుండి వ్యక్తమైన జీవుడు, తొడిమలేనిపండు నోరులేనిబాల మ్రింగుట = సాగర తరంగన్యాయమున తిరిగి మూలప్రకృతిలో లయమొందుట, గుఱ్ఱము = మనస్సు, ఎనుబోతు = అహంకారము, జెట్టిపోతు బయలు మేయుట = కాలమును మనస్సును మట్టిచెట్టను విశ్వప్రకృతి పరాశక్తి సహజముగా లయముచేయుట యట. ఇట్టివే యనేక రచనము లున్నవి. వీని యర్థమును వెలికి లాగుట కష్టసాధ్యము

బ్రహ్మంగారి శిష్యులందు దూదేకుల సిద్దయ్య ప్రముఖుడు దూదేకుల వాడని యెవరైన అడిగిరో లేదా నింపించిరో కాని దాని ఫలితముగా నాతడు చెప్పిన తత్వము చక్కగా నున్నది.

'ఏకులమని నను వివరమడిగితే ఏమని తెల్పుదు లోకులకు
లోకులకు పలుగాకులకూ దుర్మార్గులకూ యీదుష్టులకూ ||ఏ||
ఫాలభాగమున యాలలు బాడుచు భావము గన్నది నాకులము
మట్టున బుట్టిన దీకులము మట్టంటున బెరిగిన దీకులము
మట్టులో శివుడు మట్టులో బ్రహ్మం ముగ్గురు మూర్తుల మూలము దెలిసిందీకులము ||ఏ||

ఈగేయ మింకను పెద్దగానున్నది. దీనిలో తన వృత్తిని చక్కని రూపకములతో చిత్రించినాడు. 'ఇంటిలోపల ఇల్లు గట్టుకొని, మంట లోపల రాట్నం బెట్టుక కంటిలోపల కదురు బెట్టుకొని, ముక్కులోపల యేకు బెట్టుకొని, చెవులో బారా చేతికి దీసుక, నారాయణ యను నరము దీసుకొని, అష్టాక్షరియను తడక వేసుకొని, పంచాక్షరియను పంచ దీసుకొని, తధిమిత తధిమిత గులుదెబ్బ గులుదెబ్బ యని, ఏకినకులమే మాకులము'. 'కులమెంచగా నేల గుణమే కారణమ'ను తత్వముగూడ సిద్దయ్యగారిదే. శ్రీముక్తికాంత ఆత్మతత్వము ప్రశ్నోత్తరరూపమున నున్నది.

'శ్రీనివాసుని సేవజేసే సిద్ధులెవరే అక్కరో-పూని సద్గురు సేవజేసే పుణ్యులే వోచెల్లెలా॥ గురుతుగా గురుసేవ జేసే గురువు లెవ్వరె అక్కరో - మారుజన్మము లేనివారు మహనీయులె చెల్లెలా॥ మహనీయులానెవారి మతము యేమే అక్కరో'-ఇటులీ ప్రశ్నోత్తరములు పరబ్రహ్మమువరకు సాగినవి. నంజయ్య పేరుతోనున్న 'ఫాలలోచన విన్నపంబూ' అను తత్వమున చక్కని భక్తిభావము లున్నవి. భక్తుని హృదయమెట్టిదో గమనింపుడు :

'మధుర జలముల నిన్ను మజ్జనముజేసెద నంటె-మత్స్యముల ఎంగిలో దేవా
తుదముట్ట కుసుమముల తొడరి పూజింపగా-తుమ్మెదల ఎంగిలో దేవా
వదిలముగ నావుపాల నర్పించెదమంటె-పసి లేగ యెంగిలో దేవా'.

ఇట్టి గేయము నాకొకటి లభించినది. (మా నాయనమ్మగారు పాడగా వింటిని)

'ఏమి సేతురా నీదు మహిమా, ఎవ్వరికీ తెలియదాయె
పాదుకున్నది పంచామృతము ఎంగిలనుచున్నారు రంగా
పారిజాతము దెచ్చి నీకు పాదపూజ చేతమన్న
కొమ్మకొమ్మకు కోటి తుమ్మెద లెంగిలంటున్నాయి రంగా'

ఇది రంగని పరముగా నున్న వేదాంతపుపాట. లింగని పరముగా నిట్టిదే యొక పాట కలదు.

ఏమి సేతుర లింగ, ఏమి సేతురలింగ ||ఏమి||
గంగి ఉదకము తెచ్చి నీకు, లింగపూజలు చేతమంటె
గంగనున్నా చేపకప్పలు, ఎంగిలంటున్నాయి లింగా
మహానుభావా, మాలింగమూర్తీ. ||ఏమి||
అక్షయావుల పాలు దెచ్చి, అర్పితంబు చేతమంటె
అక్షయావుల లేగదూడ, లెంగిలంటున్నాయి లింగా
మాహానుభావా, మాలింగమూర్తీ. ||ఏమి||
తుమ్మిపూలు తెచ్చినీకు తుష్టిగా పూజింతమంటె
కొమ్మ కొమ్మకు కోటి తుమ్మెద, లెంగిలంటున్నాయి లింగా
మాహానుభావా, మా లింగమూర్తీ. ||ఏమి||

ఈ రెండు పాటలలో దేనికేది యనుకరణమో తెలియదు.

ఎంత మోహవిభ్రాంతునైనను శరీరముపై రోత గలిగించి విరాగిని చేయగల జుగుప్సాకరములగు భావములతో నున్నది, 'ఎవరని అడిగిన సిగ్గవుచున్నది ఏమని చెప్పుదు వినరయ్య' యనుపాట.

'కాలయముడు మనకు పొరుగింటివాడనుచు, కలకాలము దెలియు చిలుకా
కలకాలము దెలిసి కళనంటినా గురుని, కంటినడుమను జూడు చిలుకా'

యను చక్కని భావము లచ్చటచ్చట కొల్లలుగా నున్నవి.

'కాలజ్ఞాన తత్వము'ల వంటిదే 'ఆత్మబోధామృత తత్వము'లను మరి యొక సంకలనము. దీనిలో సుమారు 20 మంది రచయితల 55 తత్వము లున్నవి. పూర్వమువలెనే తత్వములందలి విషయములు రాజయోగము, భక్తి, నీతి, వైరాగ్యము, వర్ణాశ్రమనిరాసము మున్నగునవి కలవు. ఎడ్ల రామదాసుగారి పేరుతో నధికవ్యాప్తిగాంచిన 'ఏమిజన్మం బేమి జీవనము ఈ మాయకాయం బేమి జన్మం బేమిజీవన'మను తత్వమీ సంకలనమున ప్రథమగేయము. తంబురా మీటుచు బూడిద బూసికొనియో, కాషాయవస్త్రములు ధరించియో తిరుగుచు బిచ్చమెత్తెడు సన్యాసివేషధారు లందరి కీ గేయము వచ్చును. ఈ తత్వమున పిండోత్పత్తిక్రమము, నరజన్మము, సంసారమందలి దుఃఖము, విషయలౌల్యము మున్నగు విషయములు వర్ణింపబడినవి.

'ఏమిజన్మం బేమి జీవనము-ఈ మాయకాయం బేమి జన్మం బేమి జీవనము ||ఏమి||
ఏమిజన్మం బేమి జీవన మేమి శాశ్వత మేమి సౌఖ్యము
యేమి నా ప్రారబ్ధకర్మము స్వామి నన్నిటు జేసి మరచెను ||ఏమి||
దండిగా భూమండలంబున ఒండొరులు గూడంగ శుక్లము
మెండుగా శోణితము పైబడ, అండమై గర్భమున నుండియు,
పిండరూపము దాల్చుచుండగదా-మలమూత్రములలో
ఖండమై పడియుండవలయుగదా, అందులో శ్రమ తలి
దండ్రికైనను తెలియబడదుగదా-ఈ పిండకోశము నిండుదినములు గండమేనుగదా
కొండగుహలో నుండు పగిదిని గుండె లదరుచు దండమిడుకొని
నిండు తొమ్మిదినెలలు జూచుక, యుండలేనని జననమైతి ||ఏమి||

ఇటులే ఈ గేయము కడు దీర్ఘముగా సాగిపోయినది. నారాయణ హరిదాసు రచించిన

'జీవు లెనుబదినాల్గు లక్షలు చావు పుట్టుక లిక్కడా
యెవరు జేసిన వారికర్మము లనుభవించే దక్కడా
తల్లిదండ్రులు అన్నదమ్ములు సతులు సుతులు ఇక్కడా
వెళ్ళిపోయేటప్పు డెవ్వరు రారు మనతో అక్కడా
పంచభూతము వలననే ప్రపంచమైనది యిక్కడా
అంచితంబుగ నామరూపము లేని స్థలమం దక్కడా' అను ప్రసిద్ధగేయముకూడ

కలదు. ఇంకను,

'అనుభవింపక తీరునా ప్రారబ్ధము'
'తారకము నూతెరుగవలెనన్నా సద్గురుని కృపచే తారతమ్యము దలచి కనుమన్నా'
'పాలోయమ్మ పాలు పరాత్పరుని గన్నదే కీలు' వంటి గేయములు చాల కలవు.

వీనిలో మర్మకవిత్వముగూడ కలదు.

'కోటలాటి కోటా జగతిలో ఏకోట లేదు-కోటలాటి కోటా జగతిలో ఏకోట లేదు
వెయ్యి బురుజుల కోటైయున్నది-యేడు ఏరులు బారుచున్నది
ఎగిరిపోయే గుఱ్ఱమున్నది-వెళ్ళిపోయేదే బాట యున్నది ||కోట||
కొండల నడుమన కొంగ యున్నది-కొంగ ముక్కులో లోక మున్నది
కోటి దీపములు వెలుగుచున్నది-కోరినవారికి ఫలమొసగుచున్నది ||కోట||
ఆరు కొమ్ముల ఏనుగున్నది-ఐదుకోతులను మేపుచున్నది
ఆవలీవల జూచుచున్నది-అతిశయమై నాటాడుచున్నది ||కోట||
మేఘము లేనిది వర్షమున్నది-మేకలనైదు మేపుచున్నది
మేఘములోపల మేయుచున్నది-మేలిమైన వైభోగ మున్నది ||కోట||

మూలాధారమునందు నున్నది-మూలమూలకే తిరుగు చున్నది
మూలస్థానము ఒకటైయున్నది-మూలజ్యోతియై వెలుగుచున్నది ||కోట||
పదమూడామడ పట్నమున్నది-పాపలనడుమ లింగమున్నది
పాము శిరమునా పండు యున్నది-పరమభక్తులకు యెరుకై యున్నది
వీరబ్రహ్మము వాక్యై యున్నది-వివరము తెలిసితె బాగైయున్నది ||కోట||

దీనిలో చాలభాగమునకు సరిగా నర్థము బోధపడదయ్యెను. ఎగిరిపోవు గుఱ్ఱమనగా ప్రాణమై యుండును. పదమూడామడ పట్నమనగా బహుశః ప్రాణుండిడా పింగళములనుండి ఉచ్ఛ్వాసరూపమున బాహ్యంబునకు 12 అంగుళముల పర్యంతము వచ్చి యట నడగుట కావచ్చును.ఆరుకొమ్మల ఏను గరిషడ్వర్గముగా ఐదుకోతులను పంచేంద్రియములుగా భావించవచ్చునేమో. పాము మూలాధారము నుండి సహస్రారమువరకు సంచరించు కుండలినీశక్తి. కోట=మానవదేహము, ఏడు ఏరులు = మనోబుద్ధిచిత్తాహంకార మహత్తత్త్వ చిత్సత్తులు, ఎగిరిపోయే గుఱ్ఱము = అహమహమను బ్రాహ్మీస్మృతి, బాట = నివృత్తిమార్గము, కొండలు = పరాఽపరాప్రకృతులు, కొంగ = లయశక్తి, ముక్కులోని లోకము = శివ (అణు) లోకము, కోటిదీపములు వెలుగుట = జ్యోతిర్మ యావరణములు(జ్వాలమాలాకులం భాతి),ఏనుగు = నేనుగ నేనుగ యను పరమ స్మృతి, ఆరుకొమ్మలు = షట్కోశములు, ఐదుకోతులు = పంచభూతములు, ఆవలీవల.... ఆటాడుచున్నది = పరమస్మృతి వ్యక్తావ్యక్తములను రెంటిని జూచుచు వాని కతీతమగు కేవలస్థితిలో సర్వశక్తియై యన్నింటిని కదలించు చున్నది, మేఘము లేని వర్షము = దహరాకాశపు ఆనందతుషారము, ఐదు మేకలు = శబ్దస్పర్శరూపరసగంధములు, పదమూడామడ పట్నము = 5 భూత ములు + 7 మనోబుద్ధ్యాదులు, పాపలనడుమ = పరాఽపరాప్రకృతుల లేదా గంగాగౌరీయనువాని నడుమ, లింగము = అణుమూర్తి, పాము శిరమున పండు = పరాప్రకృతిపై నుండు కేవలానందము లేదా ముక్తికాంత యట. గ్రంథాంతమున నున్న మంగళహారతి కూడ పూర్తిగా వేదాంతమే. దీనిని నేను పలుచోట్ల వింటిని.

'మాయకు లోనాయె మాయకు మీదాయె-మాయ యిరువైయైదు మర్మము లాయె
మాయ యిరువైయైదు మర్మము దెలిసితె-మాయలోన గుట్టు మరి నిల్వదాయె||మంగళం||

దీని చివర చరణము,

గురువు శిష్యుడాయె శిష్యుడు గురువాయె-గురువు శిష్యులసందు గుపతొక్కటాయె
గురువు శిష్యుల సందు గుపతుగ దెలిసితె-ఎపక నిజమాయె ఏమి లేదాయె॥మంగళం॥

గురువు శిష్యులసందు అన్నప్పుడు 'ఆచార్యః పూర్వరూపం, అంతే వాస్యుత్తర రూపం విద్యా సంధిః,ప్రవచనగ్ం సంధానం ఇత్యధివిద్యమ్' అను ఉపనిషదర్థము స్ఫురించును.1 విద్య లేదా యెరుక ఆచార్యునకును శిష్యునకును నడుమనున్న సంధిబంధము. దీనిచే మాయ యడగునుగదా! ప్రబోధమొనర్చు గురువు అఖండభావమునుండి శబ్దమండలము జేరి శిష్యుడైనచో, శ్రవణ మొనర్చు శిష్యుడు వ్యష్టినుండి క్రమముగా నఖండస్థితిని జేరి గురువగుచున్నాడు. ఈవిధముగా గురువునకు శిష్యానుభూతి శిష్యునకు బ్రహ్మానుభూతి కలిగి వారిరువురి మధ్య క్షణికమైన గుర్తుగా నుండును. ఈ యనుభూతి గుర్తు క్రమాభ్యాసమున అహంబ్రహ్మాఽస్మియను నెరుక యుభయత్ర శాశ్వతమగునని శ్రీ ఆనందనాద స్వామి వ్యాఖ్య.

సికింద్రాబాదు వాస్తవ్యుడును, మయబ్రహ్మకులజుడునగు సాతెల్లిబాబ దాసను ఆధునికుడు రచించినది 'కలిప్రమాణ తత్త్వకీర్తనలు'. పోతులూరి వీర బ్రహ్మంగారిని గురువుగా భావించి అంగన్యాసకరన్యాసయుక్తముగను షోడశోపచారముల చేతను ఆరాధించెను. గురుమాహాత్మ్యము, స్తోత్రము, లోకపుపోకడ, కాలజ్ఞానము వస్తువులుగా కీర్తనలున్నవి. వీరభోగవసంత రాయుడు జన్మించి కలియుగమును నాశనమొనర్చి, కృతయుగధర్మముల నుద్ధరించునని బోధించెను. ఈతడు చెప్పిన కాలజ్ఞానము లత్యద్భుతములు. మనకు కొంత హాస్యమును కలిగించక మానవు.

.. ...'కల్లగాదిది నిజము నమ్మండీ, పల్నాటిసీమలో భద్రకాళీ పుట్టె వినరండీ,
వల్లెలూ పట్నాలు వింతగ బొల్లుబొల్లుగ జేయు నిజముగ,
కొల్లలుగ జనులంద రప్పుడు కూలిపోయే దివస మొచ్చును'-ఇంకొక కీర్తనలో
కల్లగాదు చైత్రమాసము, కొల్లగాను భానువారము, మెల్లగను యిక దుష్టశిక్షణ శిష్టులను రక్షించునన్నా ॥కలి॥ యాదిమరువక యుండుడోయన్నా యీ ధరణి లోపల శబలగ్రామమునందు వినరన్న-అందమలరగ విష్ణురూపదేవ బ్రాహ్మణ పుత్రుడయ్యె - పొందుగను జన్మించు దేవత - బృందము నిరీక్షించగాను ॥కలి॥ పరగునా శ్రీవీరభోగన్నా-వసంతరాయవతార మెత్తి యు వచ్చునోయన్నా

1. తైత్తిరీయోపనిషత్తు-శిక్షావల్లి

అరమరేమియు లేక దుష్టుల హతమొనర్చగ నున్న సుజనులు,
మరువకను శ్రీరామనామము మదిలో ధ్యానము జేతురోయన్నా ||కలి||

ఇటులే ఇంకొకదానిలో.

'మేకపోతుకు చన్ను లొచ్చును' 'ఎర్రచీమలు మొగినిపడునండీ - ఏనూగ ఎత్తై
నిర్రనీలిగి నిలుచు నిజమండీ, తర్వాత పర్వతమున నున్న పరుసవేదండీ-నిరతంబు
కందిమల్లయూరు జేరునోయండీ-ఆరామడకు వొక పట్నమయ్యి నిలుచు నిజమండీ'

వంటి కాలజ్ఞానము లధికముగా నున్నవి. కాలజ్ఞానములు చెప్పెడు వారిలో దినదిన మిట్టి యద్భుతవిషయరచనము క్రమముగా పెరుగుచువచ్చినటు కాన్పించును. పామరు లిట్టి గేయములను భయభక్తులతో వినుచు పాడుచు నుందురు. ఇట్టి వానిని వేదాంతములనుటకన్న నద్భుతవిషయములనుట మేలు. శిష్టసాహిత్యమున గూడ నిట్టి గ్రంథములు లేకపోలేదు. ఇటీవలనే వీరభోగవసంతరాయల పేరుతో వచనకావ్యములు పద్యకావ్యములు వచ్చినవి. వానియం దింతకన్న నద్భుతము లున్నవి.

శ్రీ పూదోట లింగావధూతగారు చెప్పిన తత్త్వములందు కూడ మర్మ కవిత్వమున్న పాటలెన్నియో కలవు. అట్టివానిలో

1. శంకలేకను అగ్నిక్రింద సర్పమును నెగయించునే
కంకణముచే కర్మబలములు కదిసి పృధివిని నణచునే
ఓంకరింపుచు చక్రవర్తుల నుర్విపై తా గూల్చునే
పొంకమగు నవధూత చంద్రుడు పువ్వుదోటను వెలుగునే

2. దిట్టతనమున మర్కటంబును దివికి చివ్వున నెగయునే
మెట్టలారును మూడు మీరుచు మేరుపై లంఘించునే
అట్టె దివి భువి నడుమ వెలుగుచు అరని దిక్కులు మ్రింగునే
ఘట్టిగా పూదోట రాముడు కడను సాక్షియుండునే

3. అగ్నిలోపలి మీన మొక్కటి అరని మొసలిని మ్రింగునే
సౌంజ్ఞమీరుచు బకము దశవిధసర్పముల భక్షించునే
ప్రజ్ఞమెరయుచు నంది యొక్కటి బైట రంకెలు వేయునే
తజ్ఞుడగు పూదోటరాముడు తారకంబై వెలుగునే

అను తత్త్వము గూఢార్థములతో ఎనిమిది చరణములు కలది. (పూదోట తత్త్వ గీతామృతము పుటలు 310-311)

భాగవతుల కృష్ణుడనునాతడు 'శుద్ధ నిర్గుణతత్వ కందార్ధదరువు' లను రచించెను. కందార్ధములన్నను కందార్ధదరువులన్నను నొకటే. కందపద్యము మరియు తరువాత నొకకొంత దరువుండుటచే నివి కందార్ధదరువులైనవి. కందార్ధములవలె సీసార్ధములును కలవు. వెంకటేశ్వరులు అలవేలుమంగాసంవాద ముత్యాలార్ధములలో నున్నది. యక్షగానములందును ఇట్టి వేదాంత గ్రంథము లందును నీ కందార్ధములు సీసార్ధములు మున్నగునవి యుండును. ఇది పద్యగేయకవిత్వముల సమ్మేళనము. గ్రంథకర్త తనను గూర్చి

క. భాగవతులనారాయణ-యోగికి జానకి యనేటి యువిదామణికిన్
బాగుగ పుత్రుడనై భూ-భాగమునన్ కృష్ణుడనుచు ప్రభవించి
నానూ-అవంతికి ప్రభువు నైనానూ
నాగురుకృపచేత నయమైన ఈ బోధ నేగంటి ననంత నీకు దెల్పుట కిట్లు
ప్రభవించినానూ అవంతికి ప్రభువునైనానూ. (పుట 35)

ఈత డనేకకృతులు రచించినటులు చెప్పుకొనెను.1 ఈ కృతి శా. శ॰ 1765 (క్రీ. శ. 1843) లో పూర్తిచేసినటులను తన గురుపరంపరలో శివ రామదీక్షితుడు-అప్పారావు-పరశురామ సీతారాములును పేర్కొనెను. గ్రంథకర్త గురువు పరుశురామ సీతారాములకును, పరుశురామపంతుల లింగమూర్తికిని ఎట్టి సంబంధమును లేదు.

'ఇది యాంధ్రకవిత్వంబని-మది రోయందగదు దీని మర్మ మరయుడీ
పదియారువన్నె పసిడిని-ముదమున తోల్పెట్టె నుంచ మట్టా
కుండుదురా—లోకులు చేత పట్టాకుండుదురా
ఇదిగాక కులహీను డిచ్చిన ద్రవ్యాము-విదితాముగా నెంత వేదవేత్తలుగావి
ముట్టాకుండుదురా-లోకులు చేతబట్టాకుండుదురా'

దీనియర్థ మాంధ్రకవిత్వంబన్న క్రీ. శ. 1843 ప్రాంతములం దింత నిరసనముండెడిదనియా? లేదా వేదాంతాది పవిత్రవిషయము లాంధ్రమున చెప్ప నలవాటంతవరకు లేదనియా? ఈ గ్రంథమున నున్న శీర్షికలు 1 సభా విజ్ఞాపనము. 2 గురుశిష్యాన్యోన్యదర్శనము, 3 అచలలక్షణము, 4 ఎరుక లక్షణము, 5 ఎరుకోత్పత్తి లక్షణము, 6 ఎరుకను విడిపించుట, 7 మతముల లక్షణము, 8 పరిపూర్ణబోధ, 9 గురుమంత్ర ప్రతాపము, 10 బోధస్థితి పురుషలక్షణము

1. ఇటీవల నాకు ఈతడే రచించిన 9 పద్య లఘుకృతులు లభించినవి.

11 భద్రాద్ర్యంకితము, 12 గురుని లక్షణము, 13 శిష్యుని లక్షణము, 14 గురు శిష్యోభయ లక్షణము, 15 గురుదత్తాభయదానము, 16 సుజన లక్షణము, 17 కుజన లక్షణము, 18 శిష్యవిజ్ఞాపన, 19 గ్రంథపూర్తి, 20 గ్రంథసమాప్తి.

ఈ గ్రంథకర్త ప్రతిపాదించినది 'అచల' వేదాంతము. అద్వైతవేదాంతమున నిదియొక శాఖ. ఈ యచలమతమునకు సంబంధించినవారిని కొందరిని నేను హన్మకొండలో జూచితిని. కాలాముఖశైవులందుండు మండలార్చనము వంటి యాచారములు వీరిలో గూడ నున్నవి. వీరికర్మలు చాల రహస్యముగా నొనరింతురు. ఎంతో కష్టముమీద వీరి రహస్యసమావేశములను నేనును రహస్యముగా చూడగలిగితిని. ఈ గ్రంథమునమాత్ర మిట్టి యాచారము లేమియు లేవు. ఇట్టి యాచారము లన్నియు నాయామతములు వెఱ్ఱితలలు వేయుచోటనే పుట్టినవి కాని మతాచార్యులకు గాని యావేదాంతములకు గాని యీ దుష్టాచార కలంకము నంటగట్టగూడదు. శంకరాద్వైతమును బోధించు దొంగ గురువు లద్వైతము పేరటను, రామానుజులు బోధించిన భక్తిప్రపత్తులను శేషశేషి భావముల పేరటను స్త్రీలౌల్యమునకును సురాపానమునకును గడంగిన వారెందరు లేరు? అచలమును ఈ గ్రంథకర్త ఇటుల చెప్పెను.

'పుట్టుట గిట్టుట లేకను, పుట్టెగిట్టెడి యెఱుక పోడిమెఱుగకన్
చట్టువలె కదలకుండును-బట్టబయ లిట్టి దెరిగి భావింప
వలెనూ-ఎరుకలేక సేవింపదగునూ
వట్టియాశలచేత పట్టూబడక యీ-గుట్టు దేశికు నోట గట్టిగ దెలుసూక
భావింపదగునూ-ఎరుకలేక-సేవింపదగునూ'. ఈ బయలనునది
'ఎరుకైన రీతినుండును-ఎరుగ నశక్యంబటంచు నెన్నిన నెరుకే
ఎరుగుదు ననినను ఎరుకకె - ఎరుగుట దుర్లభము సుమ్మి ఈయుత్త
బయలూ- ఎరుగనె యెఱుగ-దెరుకాని బయలూ
ఎరుగాదు విరుగాదు ఒరుగాదు తరుగాదు అరుగాదు కరుగాదు తిరుగాదు మెరుగాదు
ఈ యుత్తబయలూ-ఎరుగనెయెఱుగ దెరుకాని బయలూ'.

ఈ యెరుక పుట్టుచు గిట్టుచునుండును. తనలో తాను మోహించును. ఎరుకయే విద్యావిద్యలు, ప్రణవము, నాదము, బిందు, కళ, వర్ణాశ్రమములు, శ్రుతులు, నీవు, నేను. దీనినే బహుళః యద్వైతులు మాయ యందురు. బయలు (పరిపూర్ణము)నందు నీయెరుక వచ్చుచు పోవుచునుండును. భూతపంచకములు క్రమముగా నెరుకకు చరణములు, కటి, హృదయము, గళము, శిరము వంటివి.

కనుక ఎరుక పుట్టుచు గిట్టుచు నుండును. ఈ చిత్రములు బయలు(పరిపూర్ణము)నకు లేవు. ఈ యెరుకనే ఇతరులు (అద్వైతవాదులు) 'సాక్షి' యనిరి. అచల సిద్ధాంతమువారు దీనిని 'సాక్షిసహ' మనిరి. మాటల భేదము దక్క 'సాక్షి' యన్నను 'సాక్షిసహ' మన్నను ఒక్కటేనట. ఈ సాక్షి యనునది 'అనరాని వినరాని కనరాని బయలందు, తనకై తానరుదెంచి తనకై తాజను నీ సాక్షని తెలుసుకోరా, మాటల భేదమని కనుక్కోరా'. ఏమియు లేనట్టి యెరుక బయలులో నెటుల జన్మించెనను ప్రశ్నకు అద్వైతవాదులు రజ్జుసర్పభ్రాంతిచే మాయ యేర్పడు నన్నటుల నీ యచలవాదులు కూడ భ్రాంతియే యెరుకకు మూలకారణ మనిరి. కష్టెయం దొకప్పుడు నిప్పు పుట్టి మరల మాయమగునట్లు బయలులో ఎరుక పుట్టి మరల గిట్టును. ఇదే మాయ. ఈయెరుక యను నాట నాడించెడువాడు కర్త. వాడే యచలము.

ఆవరణము = ఆకసము = మితి గలిగినది
నిరావరణము = అచలము = మితిలేనిది

ఆవరణమున నిరావరణము జూచి యావరణ మెడలిన నావల నేమియు లేదు. కనుక నీరెండును వేర్వేరు. ఎరుకను గురుకృపచే విడిపించవలెను. మొదట బయలు (పరిపూర్ణము)నెరిగి తరువాత ఎరుకను విడిపించవలెను. అప్పుడే యచలప్రాప్తి.

ఇది ఈ గ్రంథకర్త స్థాపించిన యచలమతము. ఈతడు యోగపద్ధతులను కర్మాచరణములను నిరసించినాడు. 'ద్వైతాద్వైతవిశిష్టాద్వైతములను మాను' మనినాడు. కాని నాకు జూడ యద్వైతవాదుల యమనస్కయోగమునకును ఈ యచలసిద్ధాంతమునకును మాటలయందు దక్క భేదమేమియు లేదు. క్రొత్త మాటలం దుండుటచే నింతదూరము చెప్పవలసి వచ్చెను. కృష్ణదాసు కవిత్వము సులభగ్రాహ్యమై శిష్టవ్యావహారికమున చక్కని దృష్టాంతములతో నొప్పారు చున్నది. అచలవాదు లందరికందార్థముల వల్లెవేయుచుందురు. ఈతని రచనా విధానమున కుదాహరణముగా నొండు రెండు కందార్థములు.

'ఇలు జొచ్చి గ్రామసింహము-కల దొంతులు గూల్చు నింటి గరిత లొరుగు దొం
తుల చక్కజేతు రట్లనె-ఇల సుకవిజనోక్తి తప్పులెంచూ
దుర్జనుడూ-తప్పొప్పుగావించు సజ్జనుడూ
తులలేని బుద్ధిమంతులు సర్వజ్ఞులు మీరు-తెలిసినాతలపు నేదెలిపేదేమి
తప్పులెంచు దురనుడూ, తప్పొప్పుగావించు జ్జననుడూ'

'తొట్టిలు తొమ్మిదిగల మేన్మట్టికి నొకరింటిలోను ముక్కలు నాల్గుం
డెట్టిది తెల్లది నల్లది-కట్టిది దానగ్రమందు గలదొక్క
తూటూ-అది పెరుకానె పులుగుండు చోటూ
కష్టా గురుబోధానె గొడ్డాలి చేబూని మట్టి పులుగుల రెంటి మలచికొట్టుర పోని
కలదొక్క తూటూ-అది యెఱుకానె పులుగుండు చోటూ'.
'మలయాద్రి చెంత చెంచుల -కిల చందనభూరుహములె ఇంధనమట మి
క్కిలి గలుగబట్టి యట్లనె-చులుకననుమి యింటగలుగు సూరి
భూషణుడూ-బహుమాన్యుడు దూరస్థు డెపుడూ
తెలియానివారికి తెలిసేది కఠినాము-తెలివిచే దెలిసితే తెలియజేయును బోధ
సూరిభూషణుడూ-బహుమాన్యుడు దూరస్థు డెపుడూ.'
'పెత్తనమున నేనుం గిల-చెత్తను దినవలసె చీమ, చిన్నతనమునే
హత్తుకొని తినును చక్కెర-ఇత్తరి ఈ రెంట్లో నీకు
ఇష్టామేదైతే-చేకొను మాదె స్పష్టామిదైతే
పెత్తానమున చేటె పెంపొందుచుండూను-చిత్తాములో దెలియ చిన్నాతనమె మేలు
ఇష్టామేదైతే-చేకొను మాదె స్పష్టామిదైతే'.
'వటియించిన చన్నులు గల-కుటిలాలక నిందసేయు గుత్తపురవికన్
అటువలె తన తప్పెరుగక-అటువలె గ్రంథమును మెచ్చ దతిదుర్జ
నుండూ-లేనిదె తప్పు వెదకూచునుండూ
ఇటువంటి బోధనే నెరిగేదెట్లనుకోక-కటువాక్యములు బల్కి ఘనుల గాసిలజేయు
నతిదుర్జనుండూ-లేనిదె తప్పు వెదకూచునుండూ.'

ఇట్టివెన్నియేని కందార్థముల నుదాహరింప వచ్చును.

భక్తిజ్ఞానయోగములు రెంటిని సమానముగా చాటిన గుజ్జుల నారాయణదాసు 'తారకామృతసారము'ను రచించెను. ఈతని మతమున రాజయోగమే యుత్కృష్టము. 'మ్రొక్కెద నద్వైతమునకు, మ్రొక్కెద పరమాత్మ భాగవతులకు నెల్లన్' అనినాడు. ఈతని గురువు కనకయ్య. పీర్ మొహియొద్దీన్ (గురుతుల్యుడు) బోర అప్పలస్వామి (మిత్రుడు) ఈతని సమకాలీనులు; సమానాభిరుచికలవారు.

'కాశియాత్రలు దోవనేలండి' (పుట 27)
'సూత్రధారుని గానలేకను క్షేత్రములకు బోదురేమన్నా
త్రేతాయుగమువారి ప్రతిమలూ కల్పింప బడెనన్నా
మూఢులకు ముఖ్యము భూతపూజలయందు ప్రేమన్నా (పుట 27)

అను నభిప్రాయములు వెలిబుచ్చెను. ఒక దీర్ఘగేయమున రామాయణకథ కంతయు వేదాంతార్థము చెప్పెను. మరియొక గేయమున (పుట 77) సర్వ ప్రపంచము శరీరమందున్నట్లే చెప్పి తనయద్వైతభక్తిని చాటెను. ఈతనికి శబ్దాలంకారములపై కొంత ప్రీతి కలదు.

'అన్నాప్రసన్న రాఘవా' యను కీర్తనలో (పుట 11)

అన్నను నిన్ను సన్నుతి జేసేదాను ఎన్నడు కలుగునో కలుగదో విన్నప మాలించుట నీ కన్నను సరివేల్పులంటిని లేరంటిని ధరనంటిని వరమంటిని ఇమ్మంటిని'.

'రాజరాజేశ్వరి' యను కీర్తనలో (పుట 16)

'పంజకదళలోచనా భవసంకటములహరణా యింకా సంకా వంకా
వింకా బొంకమనుచు నయనా' ఈ కీర్తనము లిటులనే సాగిపోయినవి.

గురుశిష్యసంవాదకీర్తన మొకటి సరళశైలికి ఉదాహరణము. (పుట 33)

'రాజయోగము రమ్యమందురు బోధ తెల్పుమి గురువరా
తేజమైనది రామనామము రాజమార్గము శిష్యుడా
మార్గ మెరుగక మాయలో బడి మరచితిని సద్గురువరా
స్వర్గలోకము జేరెద వరివర్గముల నరికితె శిష్యుడా
నరికెదను వర్గముల మర్మము మరుగు తెలియదు గురువరా
ధరను కామక్రోధలోభ మోహమదములు శిష్యుడా
మదగజంబులు ఎనిమిదందురు విధము తెలియదు గురువరా
చదువు యౌవన రూప కుల ధన మదములందురు శిష్యుడా
ఆధిభూతము లైదుగలవట పాదు తెలియదు గురువరా
పృథ్వి వాయు వాకాశ మగ్ని జలంబు లైదుర శిష్యుడా'.

ఇంకొక తత్వము (పుట 35)

'యాలనురా గోలనురా కాలుని మాయలో ద్రోయకురా
చాలును ఈనరజన్మమురా జాలము చేయక బ్రోవుమురా
ఉన్నదిరా కన్నదిరా కనుపావల నడుమను చిన్నదిరా
సన్నదిడ్డిలో నున్నదిరా పున్నమివెన్నెల బోలునురా
కాయమురా మాయమురా న్యాయము తప్పక నడువుమిరా
పాయక శ్రీహరి భజనమురా చేయుము మదిలో నమ్మమురా'

ఈ కీర్తనమంతయు నిటులే నడచినది. మఱొకకవిత్వమున కుదాహరణము (పుట 38)

'గంగయమునల నడుమరా సక్షిగమున్నది చూడరా
సంగములో స్నానంబు జేసితె లింగరూపము నీవెరా
నక్కయొక్కటి యుండెరా కుక్కలను యెగవోలెరా
చిక్కు లేకను చీమ మకరిని నిక్కముగ దిగ మ్రింగెరా
గొప్ప పాములు1 ఐదురా కప్ప2 నొకటిని చూచెరా
చప్పుడేమియు చేయకుండగ నిప్పుబోబడి చచ్చెరా
ఈగ యొక్కటి చూచెరా వేగ మంచము మ్రింగెరా
జాగుచేయక మర్కటంబులు రోగములు తెగ గోసెరా'

ఇట్టి వేదాంతము తెలిసియో తెలియకయో జానపదులు పాడుచునేయున్నారు. సన్యాసులు బైరాగులు పొట్టబోసికొనుచున్నారు. ముసలివారు వైరాగ్యమును నీతిని ప్రబోధించుచున్నారు. ఇట్టి తత్వములను నేను కొన్నింటిని సేకరించితిని. వానిలో రెంటి నుదాహరించి ఈ విషయ మింతటితో ముగింతును.

గుడికందుల గ్రామమున (జగ్త్యాల తాలూకా) రామదాసను బిచ్చగాడు 22-11-52 నాడు వినిపించిన దిక్రింది తత్వము.

'తెలిసి తెలియని అపరాధి నేనై తీరా-దీనిగాలిన మాయ-తెలిసితే పరిపూర్ణామాయేరా
చింతచెట్టు తొట్టాలోనా-చిన్ని రామాచిలుకా లైదూ
అందులోని రామాచిలుకారా-దీనిగాలినమాయ-తెలిసితే పరిపూర్ణామాయేరా
ముత్తెమంతా విత్తూ వేస్తే-పగడమంతా మొలుకా మొలిచే
పంచరంగుల తీగె బారేరా-దీనిగాలిన మాయ-తెలిసితే పరిపూర్ణామాయేరా
అంతరానా పూత బూసే-ఆకాశానా కాతా గాసే
పర్వతానా పండూ బండేరా-దీనిగాలిన మాయ-తెలిసితే పరిపూర్ణామాయేరా
అగ్నిలోనా జొన్నా అలికి-ఆకాశానా పందిరేసీ
ఆదిలక్ష్మి కావలుండేరా-దీనిగాలిన మాయ-తెలిసితే పరిపూర్ణామాయేరా
బండమీద పైరు అలికి-గుంజలేని పందిరేసీ
కాళ్లలేనివాణ్ణీ కావలుంచేరా-దీనిగాలిన మాయ-తెలిసితే పరిపూర్ణామాయేరా
తూరుపూనొక తుమ్మా బుట్టె-తుమ్మామీద నిమ్మా బుట్టె
నిమ్మమీద శెమ్మెబుట్టేరా-దీనిగాలిన మాయ-తెలిసితే పరిపూర్ణామాయేరా
ఊరువెళ్ళి నేనే పోంగా-ఉన్నకుప్పా కగ్గీ తలిగీ
కుప్పగాలి అపూ్పదీరేరా-దీనిగాలినమాయ-తెలిసితే పరిపూర్ణామాయేరా

---

1. పంచేంద్రియములు కాబోలు
2. జీవుడు కాబోలు

తాళపత్రగ్రంథములనుండి సేకరించిన తత్వములం దొకటి యుదాహరింతును. ఉపనయనమునకు సంబంధించిన యాజ్ఞిక (కల్ప)మున్న తాళపత్ర గ్రంథమున చివరికమ్మపై నీ తత్వమున్నది.

'ఎంతో సౌఖ్యముగల ఈ రాజయోగము ఏమని వర్ణింతునే రామయ్య
పంతముతో గుణవంతుల విని యానంతసుఖంబైతినే ,,
కన్నూల లోపల ఘనమైన చిత్కాళలున్న జాడగంటినే ,,
వెన్నెలమీదట వేదళకంజములు వెలుగు గెప్తిని గంటినే ,,
పారావారము లేక పరిపూర్ణమై వెలుగు బ్రహ్మానందంబైతినే ,,
ఆరిటిని మీరి ఆరిటీ మీదట ఆత్మ నేనైయుంటినే ,,
అంగము మీదట గంగయమునల సందు శృంగమప్మము గంటినే ,,
సదమలమై వెలుగు సచ్చిదానందము సాజయోగంబైతినే ,,
కరుణతో గురుడు నా శిరమందు కరమిడి ఎరుక యేర్పడజేసెనే ,,
వేదాంతార్థములోనె బోధ దెలిపెటి దండి సాధుసంగతి గంటినే ,,
హరెరామ నేను మీ స్మరణజేసుటవలన పరమభక్తుడనైతినే ,,
వర వైరాగ్యముచాత స్థిరబుద్ధి సాక్షినై పరమ ధన్యుడనైతినే ,,
దరి జేరితే నేను ధన్యుడ నైతిని నిరతాము నను గావుమీ ,,
మదికి నూర్ధ్వంబైన మంథెన్ననిలయా మీ మహిమ లేమందునే ,,

కరీంనగర మండలమందలి సుప్రసిద్ధబ్రాహ్మణాగ్రహారమే ఈ మంథెన.

## కర్మమార్గము

ఇంతవరకు భక్తిజ్ఞానములకు సంబంధించిన సాహిత్యమును పరిశీలించితిమి. భక్తిజ్ఞానముల వలెనే కర్మము కూడ మోక్షసాధనముగా చెప్పబడినది. వేదాదు లీమార్గమున కధికప్రాముఖ్యము నిచ్చినవి. కనుకనే భారతదేశమునకు కర్మభూమి యనికూడ పేరు వచ్చినది. వర్ణాశ్రమాచారధర్మములు, వేదవిహిత కర్మలు, వ్రతములు, ఆచారములు, నియమములు, నిష్ఠలు మున్నగునవి భారతీయుల ప్రత్యేకతను చాటునట్టివి. వేదాంతు లీకర్మమార్గమును నిరసించిరి. కాని స్వయముగా వేదములే కర్మప్రాధాన్యమును ఘోషించుచున్నవి. శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీతలో,

లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా, పురా ప్రోక్తా మయానఘ।
జ్ఞానయోగేవ సాంఖ్యానాం, కర్మయోగేన యోగినామ్॥

యస్త్విన్ద్రియాణి మనసా, నియమ్యారభతేఽర్జున।
కర్మేన్ద్రియైః కర్మయోగ, మసక్తస్స విశిష్యతే॥
నియతం కురు కర్మ త్వం, కర్మజ్యాయో హ్యకర్మణః।
శరీరయాత్రాపి చ తే, న ప్రసిద్ధ్యే దకర్మణః॥
కర్మ బ్రహ్మోద్భవం విద్ధి, బ్రహ్మాక్షర సముద్భవమ్।
తస్మాత్సర్వ గతం బ్రహ్మ. నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్॥ మున్నగు వాక్యములచే కర్మప్రాశస్త్యమును వెల్లడించెను. జ్ఞానమే సర్వోత్కృష్టమని వేదాంతులనినను అధ్వరము సత్యకారియై, కారకాముల వాంఛించునట్లు కర్మనాధారముగా గొని జ్ఞానము ముక్తిప్రాప్తి గాంచును.

స సత్యకారోఽపి హి యద్వదధ్వరః, ప్రకాంక్షతేఽన్యానపి కారకాదికాన్
తద్దైవ విద్యా విదితః ప్రకాశితై, ర్విశిష్యతే కర్మభిరేవ ముక్తయే ॥ 1

కనుకనే మనవారు కర్మలకును నంతియ ప్రాధాన్య మొసగిరి. యజ్ఞయాగాది కర్మలు మహాకష్టసాధ్యములు. నిష్ఠానియమములతో పాటు కావలసిన ధన మవసరము. ధనము లేనిదే యవి సాగవు. సామాన్యజనమునకు నవి యందుబాటు లోనివి కావు. మీదుమిక్కిలి వేదకర్మాచరణమున కన్నిజాతులకును, అన్ని కులములకును అర్హత లేదు. కనుకనే వానికి సంబంధించిన వాఙ్మయము దేవ భాషయందుండి సాధారణులకు-అందులో జానపదులకు, అందని ఫలమయ్యెను. కాని శూద్రాసులకుగూడ వేదోక్తములుగాక పురాణోక్తములగు కర్మలు తప్పవయ్యెను. మోక్షాపేక్షగలవారు భయభక్తులతో నిట్టి కర్మ లాచరించుచునే యున్నారు. ఇట్టి వాఙ్మయము కొంత దేశభాషలందు లభించును. దాని ప్రభావము జానపదులపై బడినప్పుడు వారికి తగిన భాషలో పాడుకొనుటకు వీలగునట్లు గేయములు మలచుకొనిరి. కర్మకాండయందు పురుషులకన్న స్త్రీల కెక్కుడభిమాన మగుటచే స్త్రీలపాటల రూపముననే యిట్టి వాఙ్మయ మధికముగా గాననగుచున్నది. పురుషులకు సంబంధించినవి క్వాచిత్కముగా నున్నవి. తెలుగులో నున్న వాఙ్మయము కేవలము వ్రతములు, నోములు, పండుగపబ్బములకు సంబంధించినది ఉత్తరదేశమున వివాహాది శుభకర్మలకును మరియు శ్రాద్ధాది యపరకర్మలకును సంబంధించిన జానపదగేయ వాఙ్మయమున్నది. వారికీ వాఙ్మయమెట్లు కలిగినదో నేనొక వ్యాసమున పేర్కొని యున్నాను. 2

---

1. అధ్యాత్మ రామాయణము, VII-5-13
2. స్రవంతి. రెండవ సంచిక.

తెలుగువాఙ్మయముకూడ ఇట్టి వేదోక్తయజ్ఞపు పాటలకు వెలితిగాలేదు. ద్విపదరూపముగానున్న 'సోమపాట'లో అగ్నిష్టోమ కార్యకలాపమంతయు వివరముగా వర్ణితమైనది. ఈ పాటను వ్రాసినది నందేల సుబ్రహ్మణ్యయజ్వ పుత్రిక. ఆమెపేరు తెలియరాలేదు. సుబ్రహ్మణ్యయజ్వ రాయలసీమనుపాలించిన మట్ల వెంకటరామరాజు (1608 ప్రాంతము) సమకాలీనుడట.

'సోమపాట' వివిధప్రతులను నిత్యాగ్నిహోత్రులిండ్ల సేకరించి వివరణ సహితముగా 1948 గృహలక్ష్మి మాసపత్రికలో కీ.శే. ఒంగోలు వెంకట రంగయ్య పంతులుగారు ప్రకటించిరట. విజయ జ్యేష్ఠమాసమున నెల్లూరుజిల్లా అల్లూరు గ్రామమున వేదము సుబ్రహ్మణ్య శాస్త్రిగారు చేసిన అగ్నిష్టోమమును పురస్కరించుకొని వాఙ్మయతపస్వి నేలనూతల శ్రీ కృష్ణమూర్తిగారు విపులమైన టీకలతో విడిగా 14-6-1953నాడు దీనిని మరల ప్రచురించినారు. ప్రారంభ చరణము లీవిధముగా నున్నవి.

ఈ యజ్ఞవేదిక ఈ యజ్ఞశాల
ఈ యజ్ఞ మీ చెల్వ కెంత యొప్పినదొ
శ్రీగణనాయకు చిత్తమున నిలిపి
శ్రీగురు శ్రీనివాసస్వామి దలతు
సరసులెల్లను మది సంతసించుటకు
సరస యజ్ఞము పాట సరళి బాడెదను.

పాట చివరన ఫలశ్రుతి ఇట్లున్నది.

ఈ పాటబాడిన ఇంతులకెల్ల
ఆపద లెల్లను అడగిపోవుందు
ప్రాజ్ఞదెవ్వండైన పాటను వ్రాయ
యజ్ఞ పురుషుండిచ్చు నఖిలలోకములు

ఇట్టికర్మము లాచరించుటచే అష్టైశ్వర్యసిద్ధియు పుణ్యప్రాప్తియు కలుగునని మనవారి నమ్మకము. ఆసంగతి దేవుడెరుగును కాని వానివలన సాంస్కృతిక ప్రయోజనము మాత్రము తథ్యము. వివిధప్రాంతములందున్న ఇట్టి యాచార వ్యవహారములే భారతదేశసంస్కృతికి మూలకందములుగా నున్నవి. వీని వలననే మన సాంస్కృతికమగు ఐక్యత Cultural Unity యవిచ్ఛిన్నముగా నున్నది. నోములు, వ్రతములు స్త్రీల ప్రత్యేకపు సొత్తు. ఇట్టివి తెలుగువారికి

వందలకొలది యున్నవి. నోములు నన్నయ నాటికే తెలుగునాట నుండెను. శకుంతల దుష్యంతుని సభలో,

'సుపుత్రుల వేయి నింకేల యిప్పాటి నోములు దొల్లి
కడగి నోచితిని గాకేమి యనుచును గందె డెందమున'. (ఆదిపర్వము 4-102)

చేయుట కోపిక యుండవలయునుగాని సంవత్సరము పొడుగున వ్రతములో నోములో చేసికొనవచ్చును. సంస్కృత(వేద)మంత్రములతో గావింపబడు యజ్ఞ యాగాదికర్మముల కమితమగు ధనము కావలెనుగాని యిట్టివానిని తులసీదళము మొదలుకొని తూమెడు వరహాలతో గూడ చేయవచ్చును. వీనిలో భక్తి(నమ్మకము) ఉన్న చాలును. ఎవరికి వీలైనటుల వారాచరింపవచ్చును. తమ కున్నదానితో సంతృప్తిపడి ఫలమో పత్రియో సమర్పించి ఇరుగుపొరుగువారికి పసుపు కుంకుమలిడి మంగళ మాకాంక్షించి ఆంధ్రసీమంతినీమణులు తమ గృహముల నిత్యకల్యాణము పచ్చతోరణముగా కాపాడుకొందురు. వ్రతములకు నోములకు సంబంధించిన పాట లనేకము ముద్రింపబడినవి. శ్రీ నేదునూరి గంగాధరంగా రిట్టి వాఙ్మయము సేకరించి 'స్త్రీల వ్రతకథల' పేరుతో ప్రచురించిరి. శ్రీ బాలాంత్రపు వెంకటరావుగారు కూడ స్త్రీల వ్రతకథలు నూరింటిని సంపుటీకరించిరట.1 శ్రీ గూడూరు కోటీశ్వరరావుగారు ప్రకటించిన 'మహిళా సుమనోరంజని' యందు 16 వ్రతకథలున్నవి. శ్రీ గంగాధరంగారి ప్రచురణలో నధికభాగము వచనరూపమున నున్నవి. గేయరూపములుగా వారు ప్రకటించినవి ఇరువదినాల్గు.

మదనద్వాదశీవ్రతము (దీనినే చిలుకుముగ్గుల పాట యందురు.) నిత్య దానమునోము, దీపదానమునోము, పసుపుగౌరీనోము, చల్లచిత్తనోము, సహస్ర ఫలాలనోము, మోచేటిపద్మము నోము, తులసి ఏడువారాల వర్ణన, చాతుర్మాస్య వ్రతము (ఈరెండును కన్నడగేయములు), చిట్టిబొట్లునోము, కృత్తికదీపాల నోము, మూసివాయనముల నోము, పెండ్లిగుమ్మడినోము, నెలసంక్రమణ దీపాల నోము, లింగదానము నోము, వెలగల గౌరీవ్రతకథ, ములగగౌరి నోముకథ, తరగని అయిదువతనమునోము, వరలక్ష్మిపాట, సరస్వతిపాట, సావిత్రి గౌరీదేవిపాట, తులసీదేవిపాట, శుక్రవారపు సేవపాట, లక్షవత్తులనోముపాట, (స్త్రీలపాటల సంపుటములందును వేరువేరుగను), తులసీదళము, త్రినాథుని చరిత్ర పదము, అశ్వత్థ ప్రదక్షిణము, సూర్యునిగుజ్జాలు, కామేశ్వరిపాట. శ్రావణ

1. 'కృష్ణశ్రీ' భారతి-జులై 1953. విజయ ఆషాఢము.

మంగళవారముపాట, శ్రావణశుక్రవారముపాట వంటివి ముద్రింపబడి బహుళ ప్రచారము గాంచినవి. ఇంక నముద్రితము లెన్నియున్నవో! నేనుగూడ కొన్ని యముద్రిత గేయముల నిట్టివానిని సేకరించితిని. ఈగేయములన్నింటినిచర్చించుట ఎడతెగనిపని. కనుక ముఖ్యమగువాని కొన్నింటినే స్థూలముగా పరిశీలింతము.

ఒక్క 'త్రినాథునిచరిత్ర పదము' దక్క పైన పేర్కొనబడినవన్నియు స్త్రీలకు సంబంధించినట్టివే. మోహినీ రుక్మాంగద(ఏకాదశీవ్రతముపాట) కూడ పురుషసంబంధియే. దానిని వైష్ణవవాఙ్మయమున నీవరకే పరిశీలించితిమి. కనుక వెలివేయబడినట్లొంటిగా నున్న 'త్రినాథునిచరిత్రము'ను తొలుత పరిశీలింతము. 'ఓఢ్రమున ఈ కథయు ఒప్పుమీరగనుండ తెలుగుగా ఈ పాట తెలియ జెప్పి' నట్టివాడు చిత్రాడ కామేశం; విశ్వబ్రాహ్మణుడు; గంజాం మండలమునందలి సోమపురవాసి. ఈతడు 19వ శతాబ్దమువాడై యుండును. ఈ పదము 'హరి హరీ నారాయణాది నారాయణా కరుణించి మమ్మేలు కమలలోచనుడా' యను వరుసలో నడచినది. కథాసారము వచనరూపమున 'స్త్రీలవ్రతకథ'లందు గలదు. కన్నబిడ్డకు తల్లిచెంత పాలు లేమి ఐదురూకలు పట్టుకొని యావును గొన బయలుదేరిన మధుసూదనుడను బీదబ్రాహ్మణునికి, దొంగయావుచే పసిగి ఐదు రూకలకైన నమ్ముకొనుటకు సిద్ధపడిన ధనవంతుడగు కోమటి తటస్థపడెను. పేద బ్రాహ్మణునికి పాలిచ్చుగోవు లభించెనేకాని దాని గాపాడుకొనుట కష్టమయ్యెను. ఒకనా డాదొంగయావు పారిపోయెను. దానిని వెదకబోయిన బ్రాహ్మణునికి త్రోవలో నొక మఱ్ఱిచెట్టుపై, 'హరియు బ్రహ్మయు రుద్రు డతిచిత్రగతి మీర త్రినాథులనియెడు త్రిమూర్తు లచట' గనబడిరి. బ్రాహ్మణుడు తన యావు పోయినదని మొరవెట్టుకొనెను. 'ఆమాటలను వినుచు ఆత్రిమూర్తులవారు, ఆవు యెక్కడలేదు యిక్కడే వుండె,సంతకును నీవు పోయి సందియము లేకుండ, మూడు సరుకులు దెచ్చి మాకొప్పజెప్పు, వకపయిస ఆకులను వకపయిస గంజాయి, వకపయిస నూనెను వనరంగ దెమ్ము, తీసుకొచ్చియు నీవు తిన్నగా నిచ్చుటను, మేము జెప్పినరీతి మూడు వస్తువులు,పూజచేయుము నీకు పుణ్యంబు సమకూరు. నీయావు నీకు దొరుకు నిక్కంబుగాను'అని మూడు పైసలు కూడ వారే యిచ్చిరి. మూడు పైసలతో వ్రతము చేసికొనవచ్చునని భావము. నూనె తెచ్చుట కేమిలేక బ్రాహ్మణుడు గాండ్లవానితో 'కొలచి గావంచా కొంగులో వేయు' మన నాతడు బ్రాహ్మణుడు వెఱ్ఱివాడని మోసగింపదలచి 'గిద్ద తిరగల

వేసి యింత సమురును బోసి, గావంచలో వేసి కట్టి' పంపించెను. కాని చేసిన మోసమునకు తనయింట నూనె యంతయు మాయమై పోయెను. మొఱ్ఱోయని పరుగెత్తి బ్రాహ్మణుని వేడుకొనెను. త్రిమూర్తులు చెప్పినటుల బ్రాహ్మణు దర్చించి తన గోవునే కాదు సకల సంపదలను బడసెను. తక్కిన పౌరులును అటులే చేసి సంపదలు పొందిరి. కోమటుల వడ్డీబేరము లాగిపోయెను. వారి మొర విని రాజు వ్రతములు చేయవలదని శాసించెను కాని ఆరాత్రియే రాజకుమారునికి 'కష్టంబు లొచ్చెను కడువింతగాను.' త్రినాథవ్రత మొనర్చి యారాజు కృతార్థుడయ్యెను. ఓడవర్తకు డొకడు వ్రతముచేయుట మరచినందున తగిన ప్రాయశ్చిత్తమయ్యెను. ఒక గ్రుడ్డివాడు మరియొక కుంటివా డీవ్రతము నాచరించి కన్నులు కాళ్లును పడసిరి. వ్రతధిక్కారము చేసిన యొకగురువు గాలివానపాలై శిష్యునిచే వ్రత మొనర్ప ప్రబోధితుడై బ్రతికి బయటబడెను. వ్రతమొనర్చువారికి సంపదలును వ్రతము చేయనివారికి కష్టములును గలుగునట్టి దృష్టాంతము లీకథయం దున్నవి. సారాంశమేమన,

'మూడు కాసులరొను మీదమెుందు యీ పూజ _ అధికసంపద లిచ్చు ఆనందమిచ్చు
హరి యజు హరుచరిత అద్భుతంబుగనుండు-పుడమిలో యీ పూజ పుణ్యంబులిచ్చు'

రచయిత యెవ్వరోకాని 'తులసిదళము మహిమ యెవరు శ్రద్ధగాను చదివినాను, విన్నవారికయిన మోక్ష మున్నదాయెనూ, స్త్రీలకొరకు పాటగాను జేసి కృష్ణమూర్తికి,సమర్పితంబు జేయగోరి వ్రాసినాడనూ'అని చెప్పుకొనెను.ఈ 'తులసీదళము' పాట అధిక ప్రచారము గాంచిన గేయములం దొకటి.పుణ్యక వ్రత కథ గాక దీనిలో నాల్గు పటలము లున్నవి.నాలుగింట నాలుగు తులసీమాహాత్మ్య ప్రతిపాదకములగు కథలున్నవి. మొదట సాత్రాజితి యొనర్చిన పుణ్యక వ్రతము. ఆమె గర్వభంగము.తులసీమాహాత్మ్యమున రుక్మిణి శ్రీకృష్ణుని మరల పొందుట వర్ణింపబడినవి. సత్యభామ, దానమొనర్చిన భర్తను తిరిగి పొందుట కెన్ని సొమ్ములు వేసి తూచినను సమము కావయ్యెను. అప్పు డవమానముతో, సత్య పోలేకపోలేక రుక్మిణి కడకు పోయి "నావల్ల కాకపోయి సిగ్గుచేత మోము వంచి, మిమ్ము చేర వ్రొక్కినాను చిన్నదాననూ అని బతిమాలుకొనెను.రుక్మిణి,

నావద్ద ధనము లేదు ఎన్నడైనగాని విభుడు, ఎంతసొమ్ము తెచ్చినాను నాకు ఇచ్చెనా
తనకు సత్రజిత్తు డిచ్చినట్టి గొప్పముత్యసరులు,విభుడు నీకు దాచి యిచ్చె వేడ్కతోడనూ
ఇంద్రపదవి బోయి చూచి తెచ్చినట్టి కనకమెల్లి,యింపుగాను నీకు యిచ్చె కృష్ణమూర్తి

నరకాసురుని సంహారించి తెచ్చిన మూలధనము, నీ యింట దాచినాడు మోదమందియూ
పెండ్లినాడు కట్టినట్టి పాలపూసలేగాని, యితర సొమ్ము లేవియును నాకు రేపుగా
యశోద తనయుడయ్యె దానమివ్వ నీకు బుద్ధి, ఎవరు చెప్పినా రతని తండ్రి యుండగా
పట్టంపుదేవినైన నేను యిచట నుండగాను, నీకు యింత సాహసంబె వేశ్యకాంతరో?
అయిన నాకు గలిగినట్టి ముఖ్యమైన వస్తువుందె, ఇచ్చెదాను వేగపోయి వేసిచూడుమా'

అని దెప్పిపొడిచి, దూషించి తులసీదళముల నిచ్చెను. (స్త్రీలపాటలందు రెండు మూడు చోటుల సత్యభామను వేశ్యకాంతయని పిలుచుట కలదు. ఇదెట్టి విపరీతమో!) తులసి మహిమచే కృష్ణుని వారు తిరిగి పొందగలిగిరి. ఈ కథ తరువాత నాల్గు పటలము లున్నవి. మొదటి పటలమున సంతానహీనులగు రాజ దంపతులు తులసిపూజ లొనర్చి సంతానము బడసిన కథయును, రెండవ పటలమున తలిదండ్రులను భార్యాపుత్రులను జంపి మాంసము తిన్న కిరాతుడు కూడ అంత్యకాలమున నాతనిపై తులసిగాలి వీచుటచే పుణ్యలోకప్రాప్తి గాంచిన కథయు, తృతీయపటలమున తులసిపూజలు చేయవలసిన శుభదినములును తులసిపూజ లొనర్చిన కాళికా, నందికేశ్వర, సత్యభామ మున్నగువారల వృత్తాంతమును, 'కేవలము తులసి బృందావనము లేనియింటి త్రోవ నడువరాదు, వారు దోషకారు' లనియు, నాల్గవ పటలమున సంతానార్థమై తులసీసాన్నిధ్యమున దశరథుడు పుత్రకామేష్టి యొనర్చి రామాదిసుతుల బడయుటయు మొదలుగాగల కథలు వర్ణింపబడినవి. చివరన 'ఈ కథ తులసీమహాత్మ్యం విస్తరింప యెవ్వరయిన, వారు ధరణిమీద పల్లకిపదస్థు లగుదు'రనెడు ఫలశ్రుతియుగలదు. మొదట చెప్పిన త్రినాథవ్రతమునకు మూడు కాసులయినను కావలయును కాని ఈ తులసీపూజకు అలుకు. పూతలు, చెంబెడు నీళ్ళు. భక్తి తప్ప వస్తువాహనము లెవ్వియు నవసరము లేదు. ఇంచుమించుగా తెలుగు స్త్రీ లందరును తులసిని పూజింతురు.

శ్రావణమాసము వచ్చుటతోడనే మాంగళ్యవతులున్న ప్రతి గృహము కలకలలాడును. ఇంటింట లక్ష్మీపార్వతులు ప్రత్యక్షమగుదురు. ఇంటి యిల్లాలి సంరంభము, పొరుగింటి గృహిణీమణుల పేరంటపు తొందర, పురుషులకు చూడ ముచ్చటగా నుండును. పచ్చతోరణములతో, పండ్లతో, పసుపుకుంకుమలతో, మూత్నవస్త్రములతో, ప్రతియిల్లు భూలోక స్వర్గమువలె నుండును. శ్రావణ సోమవారము, శ్రావణ మంగళవారము, శ్రావణ శుక్రవారము, శ్రావణ

శనివారము ఇటుల వారమునకు నాల్గు దినములు వ్రతములతో నోములతో గడచిపోవును. శ్రావణ మంగళవారము, శ్రావణ శుక్రవారము వ్రతములను గూర్చిన పాట లిట్టి వాఙ్మయశాఖయం దగ్రగణ్యములు. ఒకటి మంగళగౌరీ వ్రతము, రెండవది వరలక్ష్మీవ్రతము. మొదటిది శైవమునకు, రెండవది వైష్ణవమునకు ప్రాతినిధ్యము వహించును. స్త్రీలపాటల సంపుటములం దీరెండును ముద్రింపబడినవి కాని తప్పులకుప్ప లగుటచే సరిగా బోధపడవు. స్త్రీలు పాడుచుండగా వినియో లేదా శ్రీ గంగాధరంగారి వచనకథ చదివియో అర్థము చేసికొనవలెను.

'*శ్రావణ మంగళవారము* పాట'లో వింతకథ యున్నది. సంతానములేని రాజదంపతులు శివుని ధ్యానించిరి. శివుడు వారికి వరము లీయదలచి జంగమ వేషముతో '*గురుధర్మ* ఘోరాండ' మనుచు (?) భిక్షకు వచ్చెను. రాజపత్ని భిక్షగొని మేడ దిగివచ్చువరకే జంగము వెడలిపోయెను. మరునాడుకూడ అటులే వెడలిపోవ జూచుచుండగా రాజపత్ని జంగము నడ్డగించి వెడలిపోవుటకు కారణమడిగెను. జంగము 'పుత్రపౌత్రులు లేరు, మీచేతి భిక్షంబు, హర హర అంటరాదని' పల్కెను. దంపతు లిరువురు జంగమును బతిమాలుకొన శివుడు నిజరూపముతో సాక్షాత్కరించి 'ధర్మవతియైనట్టి పుణ్యవతి నిత్తుమా-పదహారు వర్షముల సుతునిత్తుమా' యని యడిగెను. వారు కుమారునే కోరుకొనిరి. శివప్రసాదమున కుమారుడు కలిగెను. పెరిగి పెద్దవాడై విద్యాబుద్ధులు గడించెను. అతనిపేరు నారాయణుడు. రాజు తన కుమారుని దీసికొని కాశికి బోవుచు మధ్యేమార్గమున నొక పట్టణోద్యానవనమున విశ్రమించెను. శ్రావణ మాసమున మంగళవారమునాడు 'మంగళగౌరి'ను పూజింప పూలు గోయుటకై వచ్చిన యాపట్టణపు రాజుకూతురు సత్యవతి రాజకుమారుని జూచెను. ఇరువురికి వివాహమయ్యెను, శోభనమునాటి రాత్రికే రాజకుమారునికి ఆయుర్దాయము నిండుకొనెను. దంపతులు నిద్రించుచుండ నారాయణుని చంపుటకు పాము వచ్చెను. మంగళగౌరీదేవి స్వప్నమున సాక్షాత్కరించి సత్యవతిని మేల్కొలిపెను. సత్యవతి స్వర్ణకలశము దెచ్చి యట నుంచెను. సర్పమామె భక్తికి మెచ్చి అందులో ప్రవేశించెను. సత్యవతి ఆ కలశమునకు క్రొత్తరవికతో వాసెనగట్టి యుంచెను. రాజకుమారుని గండము తప్పిపోయెను. తెల్లవారగనే యాతడు

తండ్రిని కలిసికొని చెప్పకుండగనే కాశికి పోయెను. సత్యవతితండ్రి యామెకు మరల వివాహముచేయ సంకల్పించెను. కాని వ్రతము పేరుతో రాకుమారి కాలమును గడపుచుండెను. తండ్రికొడుకులు కాశినుండి తిరిగివచ్చినప్పు డామె తనభర్తనుగుర్తించి తాను భర్తప్రాణములు కాపాడుకొన్న యానవాలు చూపెను. వారికి మరల వైభవోపేతముగా వివాహమయ్యెను. కోడలితో రాజు స్వదేశము చేరుకొనెను. తనకు పుత్రభిక్షను పెట్టిన కోడలిని అత్తగారు రహస్యమడుగ సత్యవతి అత్తతో 'సత్యంబు దప్పకా మాంగల్యములు గల మంగళగౌరును పూజించితి'ననెను. అప్పటినుండి లోకమంతయు మంగళగౌరీవ్రతము నాచరించి కామ్యముల బడయుచుండెను. 'ఈ కథాపాటను పాడినవారికి—విన్నవారికినైన విభవంబు నిచ్చు—ఇష్టసంపద లిచ్చు ఈరాజ్య పదవిచ్చు—సత్ఫలం బిచ్చునూ సర్వేశురాణి'.

'శ్రావణ శుక్రవారముపాట'నే వరలక్ష్మీవ్రత మందురు. శ్రావణమంగళ వారము పాటకన్నను చిన్నదీపాట. 'కైలాసగిరిలోను కల్పవృక్షం క్రింద ప్రమథాదిగణములూ కొలువగాను' పార్వతీపరమేశ్వరు లుండిరి. అప్పుడు పార్వతి ప్రాణవల్లభుని 'ఏ వ్రతము సంపదలు యెలమితోడుత నిచ్చు యే వ్రతము కామితార్థము లొసంగు, ఏ వ్రతము పుత్రపౌత్రాభివృద్ధి నొసంగు'నని యడిగెను. అప్పుడు శంకరుడీకథను వినిపించెను. 'కుండిన అనియేటి పట్టణములోపల,చారుమతి అనియేటి చేడె గలదు,అత్తమామల సేవ అతిభక్తితో చేసి, పతిభక్తి కలిగుండు భాగ్యశాలి'. ఒకనాడామె స్వప్నమున వరలక్ష్మి సాక్షాత్కరించి 'శ్రావణమాసాన శుక్లపక్షమునందు శుక్రవారమునాడు మునిమాపునా, పంచకల్వలు దెచ్చి బాగుగా తను నిల్పి, సువర్ణకలశమున శోభితముగ' పూజింపు మనియు సకలసంపదలు సమకూడు ననియు చెప్పెను. చారుమతి లేచి స్వప్నవృత్తాంతమును అత్తమామలకును, బంధువులకును విన్నించెను. గృహ మలంకరించి తీరుతీరుల పిండివంటలు చేసి వరలక్ష్మీదేవి చెప్పినటు లర్చించిరి. నైవేద్యములిడి, 'నిండు బిందెలలోను నిర్మలోదకములూ పుండరీకాక్షులకు వారు పోసి,తొమ్మిదిపోగులా తోరమొప్పగ పోసి,తల్లికి కట్టిరీ సంభ్రమమున,వేదవిదుడైనట్టి విప్రుని బిలిపించి,గంధమక్షతలిచ్చి కాళ్లుకడిగి, తొమ్మిది పిండివంటలు తోరమొప్పగ జేసి,పెట్టి బ్రాహ్మణునకు పాయసంబిచ్చి' వ్రతము సమాప్తము గావించిరి. తక్కినవారందరును అటులే చేసి కామ్యార్థముల

బడసిరి.

తూర్పు మండలములం దధికప్రచారము గాంచిన వానిలో 'మోచేటి పద్మము' నోమొకటి. దీనిని శ్రీ నేదునూరి గంగాధరంగారు 'మోచేతి పెద్దమ్మ' నోమని తమ 'స్త్రీలవ్రతకథ' లందును, 'సెలయేటి' లోను పేర్కొనిరి. ఇతరులు మాత్రము పెద్దమ్మకు బదులు 'పద్మమ్మ' అనిరి. ఈ పాటయందలి భావములనే శ్రీ దేవేంద్ర సత్యార్థిగారు మరియొక శీర్షికతో ఆంగ్లానువాద మొనర్చి ప్రకటించి యున్నారు1. తెలంగాణమున నిది వినబడదు కనుక దాని వివరము అంతగా తెలియరాకున్నను శ్రీ గంగాధరంగారిచ్చిన పాట నిట ఉదాహరింతును.

'మోచేటి పెద్దమ్మ నోచేటివేళ-మొగ్గల్లు తామరలు పూసేటివేళ
బీరాయి పువ్వులు పూసేటివేళ-బిందెలతో ఉదకమ్ము తెచ్చేటివేళ
గుమ్మడి పువ్వులు పూసేటివేళ-గుండిగలతో ఉదకమ్ము తెచ్చేటివేళ
కాకర పువ్వులు పూసేటివేళ-కడవలతో ఉదకమ్ము తెచ్చేటివేళ
ఆనబాయి పువ్వులు పూసేటివేళ-అటికలతో ఉదకమ్ము తెచ్చేటివేళ
చిక్కుడు పువ్వులు పూసేటివేళ-చిప్పలతో గంధాలు తీసేటివేళ
ఆవులు దూడలు వచ్చేటివేళ-ఆంబోతు రంకెలు వేసేటివేళ
సందిటి దీపాలు పెట్టేటివేళ-చాకింటి మడతలు దెచ్చేటివేళ
మరదళ్ళు మరి జూద మాడేటివేళ, కూతుళ్ళు గుండిగలు దింపేటివేళ
కోడళ్ళు కొటుపసుపు కొట్టేటివేళ-చెల్లెళ్ళు చేమంతులు ముడిచేటివేళ
వదినల్లు వంటల్లు చేసేటివేళ-
ముద్దుల మొగము అద్దానబోలు-తన ముఖము తామర పద్మానబోలు'

'కామేశ్వరిపాట'నే అక్కలపాట యందురు. క్రీడాభిరామమున దీని ప్రశంస కలదు. కాని అచ్చైన పాటలం దొక్కటియైనను అర్థమగునట్లు లేదు. ఒక చరణమునకు మరియొక చరణమునకు సంబంధమే లేదు. అచ్చు తప్పులు కుప్పతిప్పలుగా నున్నవి. నేను మూడు నాల్గు ప్రతులు చూచితిని కాని వానియం దొక్కటియైనను మంచిది లేదు. స్త్రీలపాటలందీ లోప మధికము. ముద్రణకర్త లేమాత్రముకూడ శ్రద్ధ వహింపకపోయిరి. 'గల్లాపెట్టెలు' గలగల లాడుటయే కాని వాఙ్మయమునకు జరిగెడు అన్యాయము వారెరుగరు. ఈ విషయమై శ్రీ నేదునూరి గంగాధరంగారు నాకొక వింతవిషయము చెప్పిరి. వారు కొన్ని యముద్రితములగు స్త్రీలపాటలు సేకరించి యొక ప్రచురణకర్త కిచ్చిరట. ప్రచురణకర్త యా పాటలను కొన్ని పుటలం దచ్చువేయదలచిరి. వారనుకొన్న

1. Modern Review. May 1942.

పుటల పరిమితి దాటిపోయెడు పరిస్థితి సంభవింపగనే ప్రతి పాటనుండి కొన్ని కొన్ని (కర) చరణములు లాగివేసి అచ్చొత్తించిరట. ఈ విధముగా ప్రచురణ కర్తలవలన నీ వాఙ్మయమునకు కొంత యన్యాయము జరిగినది. ఐనను ఆ సంపద నుద్ధరించిన సత్కీర్తియు వారిదే.

చాతుర్వర్ణ్యములవారికి నిలువేల్పై కోర్కులు దీర్చెడు తల్లి కామేశ్వరి. ఈ 'కామేశ్వరి వ్రతము పాట' కూడ బహుళప్రచారమందిన జానపదగేయము. ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునరేటూరిభావనామాత్యవిరచితమగు 'కామేశ్వరీ చరిత్రము' కలదు1. ఇది ద్విపదలలో పాడుకొనుట కనువుగా నున్నది. దీనినే కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు క్రీడాభిరామ పీఠికలో క్లుప్తముగా పేర్కొని యున్నారు. కామేశ్వరి చరిత్రమునే 'ఆదిలక్ష్మి విలాస'మను పద్యకావ్యముగా అక్కినేపల్లి నరసింహకవి రచించి అంతర్వేది నృసింహస్వామి కంకితమిచ్చెను2. కాకతీయుల కాలమునుండియే కామేశ్వరీపూజ లాంధ్రదేశమున నున్నట్లు క్రీడాభిరామమువలన దెలియనగును. కాకతమ్మ, ఏకవీరలతోపాటు కామేశ్వరిని గూడ వారు కొలుచుచుండిరి. టిట్టిభసెట్టి మంచనశర్మ మిత్రద్వయ మోరుగల్లు నగరము చూడబోయినప్పుడు వారు ఏకవీరాదేవిగుడి దాటగనే 'కామవల్లీమహాలక్ష్మి కైటభారివలపు పాడుచు వచ్చు జక్కుల పురంధ్రి'ని చూచిరి. ఇట జక్కుల పురంధ్రి పాడినది యక్షగానమో లేక సాధారణపు పాటయో తెలియదు. కామేశ్వరి ఏడ్గురక్కలలో కడగొట్టు చెల్లెలు. వారి నందరిని 'అక్కలు' అందురు. అక్కలలో ప్రసిద్ధికెక్కిన కామేశ్వరీవ్రతము లొనర్చువారు 'అక్కల కొలుపు' చేయుట యిప్పటికిని పరిపాటి. ఆనా డేడుగురు ముత్తైదువుల పూజలొనర్చి మేళతాళములతో నీపాట బాడెదరు. ముత్తైదువులను అక్కలావహింతురని మనవారి నమ్మకము. క్రీడాభిరామమునగూడ నీవిషయము చెప్పబడినది.

సీ. ముద్రికామాణిక్యముల దీప్తి కెంగేలి పించెంబు గుంచెతో బిత్తరింప
నుపవాసమున తిద్దయును సన్ననగు కౌను చనుదోయి భరమున జలదరింప
దోకచుక్కల బోలు తోరంపు డెలికిన్ను లావైళమున సిగ్గు నతకరింప
నిద్దంపు వెలిపట్టు నెరిక దూలినయప్డు తొడల మించులు వెలి దొంగలింప
నురుమ చప్పుళ్ళకును బిల్లదురుల ప్రోత

---

1. డి. నెం. 1045 ప్రా.పు. భాండాగారము. కామేశ్వరీ చరిత్రము.

2. డి. నెం. 388 ,, ,, ఆదిలక్ష్మి విలాసము.

కంతకంతపఁ బేపఙ్బు నావహింప
నాఁడె పీటలపై నోలి గూడియున్న
యక్క లేడ్వురలో నొక్క యలపబోడి'.

మరియును 'అక్క లేడ్వురు నదె యాడజొచ్చిరి కడుంగడువేడ్క' నని వర్ణింపబడినది. ఒకయింటి యజమాని 'సంతానకాంక్షియై ప్రతిబంధనోదనార్థంబు యక్షకన్యలం బరీక్షారాధనంబు' చేయుచుండెనట.' మాణిభద్ర కులోద్వహులైన దేవతలు కామవల్లి శ్రీ మహాలక్ష్మితోగూడి యపేక్షితకార్యంబు' లొనగూర్ప సమర్థులని వారి విశ్వాసము. కామేశ్వరీవ్రతసమాప్తి యగునప్పటికి సాయంకాల మగును. కనుకనే 'అక్కలు లేచేటప్పటికి నక్కలు కూయు' ననుసామెత ప్రబలినది.

ఇక ప్రా.పు. భాండాగారమందలి 'కామేశ్వరీచరిత్ర' నారయుదము. ఈకృతి 'శ్రీకామినీకాంతు శ్రితగుణవంతు, లోకైకసంస్తుత్యు లోకైకనిత్యు' నని యారంభమైనది. కృతికర్త భావనామాత్యుడు, శ్రీవత్సగోత్రుడు, రేటూరి పురవాసి. ఈకృతి 'ఆరూఢి నిలువేలుపై తమ కెప్పుడు, సేమ మిచ్చిన గుంటచెరువున గుంచ, కామేశ్వరనుపేర గల వేల్పుపేర'నంకితముగా రచింప బడినది. ఈ కథను సూతుడు శౌనకాదులకు వినిపించినట్లున్నది. శ్రీరామచంద్రు డయోధ్యానగరమును పాలించుచుండెను. ఒకప్పుడు వైకుంఠమున లక్ష్మీ నారాయణుల సాన్నిధ్యమున నారదుడు శ్రీరామప్రశంస చేసెను. లక్ష్మీదేవి సకుతూహలయై శ్రీరామచంద్రునిగూర్చి వివరములను శ్రీమహావిష్ణువువలన విని యాతని దివ్యమంగళవిగ్రహమును చూడగోరెను. విష్ణు వామె కట్టికోరిక తగదని చెప్పినను ఎట్టకేలకు రామచంద్రుని దోడ్తేర శంఖుభట్టు నయోధ్యా నగరమున కంపెను. శ్రీరాముడు గరుడవాహనుడై వైకుంఠమునకు వెడలెను. శ్రీరాముడు తన యంతఃపురమునకు వచ్చుచుండగా విష్ణువు లక్ష్మీదేవిని పరీక్షింప గోరి యామె నొంటరిగ విడిచి తిరోహితుడయ్యెను. లక్ష్మీదేవికి రాముడెదురుగా వచ్చెను.

'చెలువంపు చిరునవ్వు చెక్కుటద్దములు, మొలక వెన్నెలగాయు ముద్దునోయగపు-
వాలుగన్నులు మంచి వక్షస్థలంబు, నీలంపుజిగి నిగనిగ నొప్పుమేను
రాజసం బొనగూర్చు రత్నహారంబు, ఆజానుబాహులు నంగదంబులును
..........................................................................
కేరి మన్మథుని చెక్కిలిగొట్టు సొగసు, మీరినయట్టి యామేటి చెల్వంబు'.

గల శ్రీరామచంద్రుని గాంచి లక్ష్మీదేవి శ్రీమన్నారాయణుడే తన్నిట్లు పరీక్షించు చున్నాడని 'ముదమంది యీ రూపమున నున్నయపుడె,కలసి పొందగవలెగాకంచు దలచి, నీమాయ లన్నియు నేనెఱుంగుదును, స్వామి నా కోర్కె దీర్చంగ బూనితిరి, అవలీల నీదు వయ్యారంబు జూచి, వ్రాలితిని నే మోహవనధిలో నిపుడు, కడతేర్చు రహిగూర్చు కౌగిటజేర్చు, అడరి నన్నానంద మందించు మిపుడ'ని కోరెను. రాముడు తానేకపత్నీవ్రతుడ ననియు, నట్టి కార్యము కూడ దనియు గర్హించెను. కాని యామె వినక రాముని చేలము పట్టి లాగెను. రాము డెటులో విడిపించుకొని పోబోవ నామె కోపముతో రాముని ఏకపత్నీ వ్రతము చెడునట్లుగా 'ధరమీద కృష్ణావతారంబునందు, స్థిరమైన వ్రతమెల్ల చెడిపోయి పిదప 'గోపభామలను,కురూపముగల భామలను'బతిమాలి పదములపడి వేడికొనుచు. ధృతి దప్పి దొంగవై తిరుగుచుండెదవ'ని శపించెను. శ్రీరామచంద్రుడుకూడ కుపితుడై,

'నాడైన నామీది నవమోహమహిమ, వీడక గుందుచు వెతల బొందుచును
కాముంచి విరహాన గ్రాగుచు మిగుల, కామేశ్వరనుపేరు గలిగియుండుదువు'

అని ప్రతిశాపమిచ్చి గరుడవాహనుడై వెడలిపోయెను.ఇదియంతయు జూచుచున్న విష్ణువు మరల ప్రత్యక్షమయ్యెను. లక్ష్మీదేవి తనకు బట్టిన దుర్గతిని భర్తతో చెప్పుకొని దుఃఖించెను. విష్ణు వామె నూరడించి. 'శివునకు జన్మించి సజ్జనుల కామితార్థము లీడేర్పుము.నేనును కృష్ణావతార మెత్తెద' ననెను.శివుడు శీతాద్రిపై తపమాచరించుచుండగా లక్ష్మీదేవి పోయి తనకోరికను వెల్లడించెను. శివు డామెతో నేను గౌరీదేవిని వివాహమాడునంతవరకు కొలనులో నుండుమని యొకకొలను చూపించెను.లక్ష్మీదేవి యందులో నివసించెను.గౌరి నుద్వాహమయిన కొన్నాళ్ళకు శంకరు డామెతో లక్ష్మియున్న కొలనులో జలక్రీడలు సల్పెను. గౌరీదేవి యాకొలనులో నేడు దోసిళ్ళ నీరు ద్రావెను. లక్ష్మి యా నీటితో గౌరీదేవి గర్భమున ప్రవేశించెను. గౌరీదేవికి సద్యోగర్భమయ్యెను.ఏడు దోసిళ్ళ నీళ్ల గ్రోలినందున గౌరీగర్భమున లక్ష్మి సప్తకన్యలుగా జన్మించెను.వారి పేరులివి.

'పొడవైన మెఱుఁగుల ప్రోవుచందమున, పెడతల జనియించె బెరవాణియనగ
శిరమున జనియించె శివవాణియనగ, కొప్పున జనియించె కొండవాణనగ
మొగమున జనియించె ముద్దరాలనగ, చన్నుల జనియించె జక్కులమ్మనగ
కన్నెలార్గురకును కడపట బొడమి, చిన్నారి పొన్నారి చెలియలై యపుడు
అన్నిట గొదలేని యాకారరేఖ, కన్నుల నుదయించె కామవల్లనగ

ఇటువలె శ్రీలక్ష్మి యేడ్వురై పుట్టె'. పార్వతీశివులు సప్తకన్యకల నటనే విడిచిపోయిరి. వారి సంరక్షణమునకు పోతురాజును సృజించిరి. (ఇప్పటికిని తెలంగాణమునందలి ప్రతి గ్రామమున పోతురాజు - పోతులింగడు గ్రామ రక్షణార్థమై నెలకొల్పబడును. గ్రామమందేగాక పొలములంత బావులచెంత గూడ పోతులింగ డుండును.) బ్రహ్మ వారికి సమస్తసౌకర్యములతో నొకపురము నెలకొల్పి పోతురాజునకు కూనలమ్మను సృజించెను. (రాయలసీమలో మరియు తెలంగాణము—మహబూబు నగరము మండలములందు కూలనమ్మ పదముల కధికప్రచారము గలదు.) ఒకనాడు శివుడు కామవల్లి ననుగ్రహించి యక్షులకు వాద్యోపకరణములు గూర్చి వారితో 'రమణ మీవంశ పారంపర్యమెల్ల, కమలాక్షి గొలువుండు కామవల్లెమను, కామవల్లిని గొల్చి ఘనులెల్ల మున్నె, ప్రేమతో మిము చాల ప్రియజము జేసెద'రనెను.

కృష్ణావతారమున గోపకుమారులతో శ్రీకృష్ణు డొకనాడు గోవుల గాయ బోయెను. కామవల్లి తన యక్కలతో వచ్చి కొలనులో నోలలాడుచుండ కృష్ణునిగోవులు కొలను చీకాకుపరచెను. కామవల్లి గోవుల గోపాలకుల శిలలగునట్లు శపించెను. శ్రీకృష్ణు డక్కల వస్త్రాపహరణముచేసి పొన్నచెట్టెక్కి వేణువునూది శిలలను గోవులుగా గోపకులుగా మార్చెను. (అక్కల వస్త్రాపహరణమునకును గోపికావస్త్రాపహరణమునకును త్యాగరాజుగారి నౌకాచరిత్రమునకును గల సంబంధ మెట్టిదో!) కామవల్లి వేణునాదమును విని వచ్చి కృష్ణుని తన్నేలు కొమ్మని వేడ్కొనెను. కాని శ్రీకృష్ణు డామెకు తమ శాపముల నెరిగించి 'అదిగాక మీద కల్క్యవతారమున, పొదలుచు కవగూడి భోగింప గలవు, కమలాక్షి యందాక కాకనొందుచు' నుండవలయుననియు చెప్పెను.

మరియును 'అతనికి (భీష్మకనృపతికి) రుక్మిణీయన నొక్క రూపు, చతురత నుదయించి సరవి నన్ బొందు, ధర్మంబుగలచోట దయగలచోట, అర్మిలి వసియించి అర్చనల్ గొనుము, విరహవేదన నిన్ను వేధింపకుండు, పరగ నింకొక్క వుపాయంబు గలదు, ధరణీతలంబున ధర్మాత్ములగను, వారని దంపతులలో నొక్కరి బట్టు, వారిలో నొక్కరి వసియింతు నేను, ఆరూఢి మనకు కల్యాణంబు గల్గు, తప్పక కలికావతారంబు నందు, కర్పూరగంధివై గైకొందు నిజ'మని విరహోపశాంతిని చెప్పెను.

కామవల్లి యటులేయని తన యక్కలతో చెప్పి తాను పోయి రుక్మిణియై జన్మించి శ్రీకృష్ణుని పొందెను. ఆ మహాదేవి డెబ్బదిరెండు ప్రదేశముల కొలకులందు

వెలసి పూజాదికము లందుచున్నది. ఈ విషయము స్త్రీలు పాడుకొనెడు పాట (స్త్రీలపాటలసంపుటము) లో స్నానకాలను శీర్షికతో నున్నది.ఇది స్థానశబ్దమునకు జానపదరూపము.

స్త్రీలాకాంక్షించెడు శుభము లెట్టివో అట్టివానికై వారొనర్చు వ్రతములెట్టివో మన మిదివరకే పరిశీలించితిమి.'*చిక్కుళ్ల గౌరి వ్రతము పాట*'లో స్త్రీజనముల కుండు సాధారణమైన కోరికలు కాంచనగును. మాఘపూర్ణిమ ముందు వచ్చెడు రథసప్తమినాడు 'చిక్కి చిక్కి నేను చిక్కుళ్ళగౌరి నోము పట్టితి'నని చెప్పి అక్షతలు చల్లుకొని,

ఎత్తుకున్న బిడ్డ నెడబాయకుండా - చంకలో నున్నబిడ్డ పడలకుండా
పక్కలో నున్నబిడ్డను పాయకుండా - కంటికి బెట్టిన కాటుక కదలకుండా
చేతికున్న గాజులు చెదరకుండా-కాలిమట్టె కదలకుండ కట్టినబట్ట విడువకుండా(కట్టకుండా?)
తొడిగిన రవికె లొడుగకుండా-వంటిసొమ్ము వదలకుండా వెంటపురుషుని పాయకుండా'

ఉండవలయునని గౌరిని ప్రార్థించి బంగారు చిక్కుడుపువ్వు చేయించి చీర రవికతో నొక ముత్తైదువ కిచ్చి అర్చింతురు. స్త్రీలకు కావలసిన కోరికలన్నియు దీనిలో నున్నవి.

స్త్రీలపాటలుగానున్న ఈవ్రతములు బహుశః స్త్రీలకును చాతుర్వర్ణ్యముల వారికిని పూజాధికారమును కల్పించుట కుద్దేశింపబడినవి. వీరశైవ వీరవైష్ణవ మతోజ్జృంభణఫలితముగా నిట్టి సంస్కారమునకు తావు లభించినదని మన మూహింపవచ్చును. ఒక్కొక్క విషయమున కొక్కొక్క వ్రతముగా కర్మ కాండ పెరిగి (జానపదులందిట్టి) వాఙ్మయరూపమున మనకు దక్కినది.'స్త్రీల వ్రతకథల' వంటి ప్రత్యేకగ్రంథములే వెలువడినందున నాయా వ్రతముల పేర్కొంటినేగాని వానిని విమర్శింప బూనుకొనుటలేదు. ఈ వ్రతముల సంఖ్య యపరిమితము. పాడిపెంపునకు **గూడ** నోము నోచుట మనవారి కలవాటు. ప్రతి చిన్న విషయమునకు వేదవిహితకర్మ లున్నటులే ప్రతిచిన్న కామనకై వ్రతము లున్నవి.ఉదాహరణకై 'చల్ల చిత్తనోమ'ునది పాడి నాకాంక్షించి చేయునోము. శ్రీగంగాధరం గారిచ్చిన పాటనే యుట్టంకించెదను.

చల్లచిత్తనోము నోచవే తల్లీ-వెల్లయావులపాడి చేయవే తల్లీ
ఇల్లు పాలనేత అలుకవే తల్లీ-ఎల్ల సొమ్ములు నీవు తాల్పవే తల్లీ

చల్లగను సుతులతో సాగవే తల్లీ-కొల్లలుగ సౌభాగ్య మేలవే తల్లీ
చెల్లని సంపదలు చేపట్టుతల్లీ-ఎల్ల బీదల నాదరింపవేతల్లీ'

చల్ల వెన్నలతో నీవ్రతోద్యాపనము జరుగును. ఈ విధముగా పాడికి పంటకు ధనమునకు దాంపత్యమునకు, ఐదవ తనమునకు, ఆపద తొలగుటకు, చివరకు అందచందములకు కూడ వ్రతములున్నవి ఈ వ్రతములన్నింటి ఫలితాంశ మొక్కటే. అది యేమన, 'కథ లోపమైనను వ్రతలోపము కారాదు. భక్తి లోప మైనను ఫలము తప్పదు'. ఈరెండు వాక్యములు కర్మకాండ ప్రాధాన్యమును దాని వ్యాప్తినిస్పష్టపరచును. పైన చెప్పిన కారణములవలనముద్రిత వాఙ్మయపరిశీలనము నింతటితో విరమించి నేను సేకరించిన కొన్ని గేయముల నుదాహరింతును.

శ్రీ అచ్యుతరాజుగారి సహాయమున ముస్తాబాదు గ్రామమున ఏకాదశీ వ్రతమునకు సంబంధించిన చిన్నగేయము మొకటి సేకరించితిని.

'చిత్తుమ్మ ఏకాశి చిలుకు దాదోశి, మాదుమ్మ ఏకాశి మంచి దాదోశి
దక్షుని ఏకాశి ఇంక నెల్లాళ్లు-కానెపుల్లలు దెచ్చి కసువార దీసి
ఆవు పెండా దెచ్చి అరుగుల్లు అలికి-గోవుపెండా దెచ్చి గోలెంల గలిపి
ధరణిమీదా సాన్పు దట్టంగ చల్లి-కాళ్ళు మొకమూ గడిగి కడుపలూ గడిగి
కడుపకూ ఆ కాంత ఏమాని మొక్కు-అష్టసంపద లివ్వు అతిభాగ్య మివ్వు
కోటిసంపద లివ్వు కోమాండ్ల నివ్వూ-ఎప్పటికి ముత్తైదతనము నాకివ్వూ'

'బొడ్డెమ్మ' 'బ్రతుకమ్మ' పండుగలు తెలంగాణము ప్రత్యేకతను చాటు నట్టివి. ఈ పండుగలు సాగరాంధ్రదేశమున కానరావు. ఈ పండుగల నాధారముగా చేసికొని తెలంగాణమున పెరిగిన వాఙ్మయ మధికముగా నున్నది. లక్ష్మీపార్వతుల పూజనములు తెలంగాణమున బ్రతుకమ్మపండుగ రూపు ధరించినవి. ఆశ్వయుజశుద్ధపాడ్యమినుండి మహర్నవమి వరకు తొమ్మిది దినములు బ్రతుకమ్మ పండుగ జరుగును. దీనికి పూర్వము తొమ్మిది దినములు బొడ్డెమ్మ పండుగ జరుగును. ఇది మహాలయామావాస్యతో పూర్తియగును. బొడ్డెమ్మ పిల్లలపండుగు. ఇందులో పెద్ద లంతగా పాల్గొనరు. ప్రేక్షకత్వమేగాని పెద్దరికము వారికేమియు నుండదు. పుట్టమన్నుతో నొక పీటమీద ఐదంతరువుల బొడ్డెమ్మను భాద్రపద బహుళపంచమినాడు నిర్మింతురు. దానిపై నొక కలశ ముంచెదరు. కలశముపై నొక కణుము (కొత్త రవికెబట్ట) నుంచి పసుపు గౌరమ్మను నిల్పి పసుపుకుంకుమ లిడి రుద్రాక్ష, గోరంట, బీర పువ్వులతో నలంకరింతురు ఇది

ప్రతి యింటిలో చేయనవసరములేదు. పల్లెటూరి యందు వాడకొక్క కుటుంబమువారైనను చేసిన చాలును. సాయంకాలమున ఇంటిముందర నలికి ముగ్గులుపెట్టి బొడ్డెమ్మ నచ్చట నిలుపగనే ఆవాడలో నుండు ఆడపిల్లలంద రచ్చట చేరుకొందురు. పెద్దలీ వినోదమును చూచుటకై వచ్చెదరు.చూడవచ్చిన పెద్దలలో నొక స్త్రీ పాటలు చెప్పుచుండగా పిల్లలు చేతులు తట్టుచు బొడ్డెమ్మ చుట్టు తిరుగుచు పాడెదరు. సాధారణముగా బ్రతుకమ్మ పండుగలప్పుడు పాడెడు పాటలనుగూడ ఈసమయమున పాడుదురు.బొడ్డెమ్మ నృత్యములను ఆటపాటలను మన మౌత్తరాహుల 'గర్బో' నృత్యముతో బోల్చుకొనవచ్చును. 'గర్బో' శబ్దమే'గొబ్బి'యని పండితుల యభిప్రాయము. ఆంధ్రదేశమున గొబ్బియాటలు మన మెరిగినవే. బొడ్డెమ్మకూడ వాని యనుకరణమేయని నాయభిప్రాయము. చీకటి పడువరకు 'బొడ్డెమ్మ' ఆటలాడుకొని తరువాత 'ఫలహారముల'పంచిపెట్టి బాలికలు మరల నా బొడ్డెమ్మను దాచి పెట్టెదరు. బొడ్డెమ్మ పాటలందొక చక్కని చందమామ పాట గమనింపదగినది. (ఇది మాచెల్లెలు రాజ్యలక్ష్మి పాడి విన్పించినది.)

'మాలుమర్రి మేడమీద చందమామ
వెండియ్య వేనగరలకు ,,
ఇత్తడియ్య చేరెలకు ,,
రాగియ్య కడుపలకు ,,
ముత్యాల ముగ్గులకు ,,
వజ్రాల వాకిండ్లకు ,,
పవడాల పందిళ్లకు ,,
మంచినీళ్ళ బావిప్రక్క ,,
కోసేవా రెవరులేక ,,
కోయించు చందప్ప ,,

వెండియ్య వేనగరలు చందమామ
ఇత్తడియ్య చేరెలు ,,
రాగియ్య కడుపలు ,,
ముత్యాల ముగ్గులు ,,
వజ్రాల వాకిండ్లు ,,
పవడాల పందిళ్లు ,,
మంచినీళ్ళ బావి బుట్టె ,,
మంచిమల్లె తీగబుట్టె ,,
కొండెత్తు పెరిగిపాయె ,,
పంచిపెట్టు గౌరమ్మ ,,

ఈ పాట వ్యంగ్యప్రధానమైనది. ఈ పాటలు పాడెడువారు కన్యకలని తొలుతనే మనవిచేసితిని. ఇందులోని మంచిమల్లె తీగ యవివాహితకన్య. కోసేవారెవరులేక యాతీగ కొండెత్తు పెరిగిపోయినదని వ్యంగ్యచిత్రణము. ఎంతచక్కని భావనమిది. ఆ యవివాహితకన్యకు వివాహము చేయించుటకు పూనుకొనవలసినవారు చందప్ప మరియు గౌరమ్మలట.కన్యకలు తమ వివాహము లగుటకును మంచిభర్తలు లభించుటకును గౌరీదేవిని బొడ్డెమ్మ రూపముగా

నర్చింతురని మనము భావించవలెను. బొడ్డెమ్మ పండుగ సందర్భమున పాడుకొనెడుపాట లింకను కలవు. వానిలో నొక్కదానినే యుదాహరించితిని. తొమ్మిదవనాడీ పండుగ ముగియును. ఆనాడు బొడ్డెమ్మ నర్చించి కలశములో వాడపిల్లలందరు ప్రతిదినము తెచ్చిపోసెడు బియ్యముతో పరమాన్నము వండి పంచిపెట్టి ఒకబావిదరి జేరి,

'బొడ్డెమ్మ బొడ్డెమ్మ బిడ్డలెందారే-బావిల పడ్డావారికి బారిద్దరమ్మా
చెర్లాబడ్డా వారికి చేరిద్దరమ్మా-కుంట్ల బడ్డావారికి కోరిద్దరమ్మా
నిద్రపో బొడ్డెమ్మ నిద్రపోవమ్మా-నిద్రకూ నూరేండ్లు నీకు వెయ్యేండ్లు
నినుగన్న తల్లికి నిండ నూరేండ్లు' అని పాడుచు బొడ్డెమ్మను నీళ్లలో

జారవిడచెదరు.

బొడ్డెమ్మ పండుగ తరువాత బ్రతుకమ్మ పండుగ. శారద లక్ష్మితో వచ్చి పల్లెటూళ్ళను ప్రఫుల్లముచేయు నీపండుగ కిదియే సాటి. తెలంగాణమందన్ని మండలములందును ఈపండుగ చేయుదురు. ఆయాగ్రామములం దుండెడు స్త్రీలందరును(వారితోపాటు వారిని చూచుటకు పురుషులుకూడ)ఒకచో సమావేశ మగుట కింతకన్న మరియొక తరుణముండదు. ఈ పండుగ మూలమున, గ్రామప్రజలంద రొకచో కూడెదరు. పరస్పరసమ్మేళనమునకు గుళ్ల గోపురములు తిరునాళ్లు, ఇట్టి పండుగలు మన పూర్వులు కల్పించిన సదుపాయములు. వీనివలననే మన జాతీయతాసూత్రములు పడుగుపేకలైనవి.

ఈ పండుగదినములందు ప్రతిదినము వెదురు లేదా దుసేరు తీగెలతో నల్లిన సిబ్బిలో గుమ్మడి పూవులు పరచి వానిపై తంగెడు, పైడితంగెడు, గునుగు, నువ్వు, రుద్రాక్ష, కట్ల, గట్టుగోరిమిడి, కాకర, బీర, గన్నేరు, పొట్ల, కట్లాయి పువ్వులతో బ్రతుకమ్మను పేర్చి దానిపై గౌరమ్మను నిల్పెదరు. పసుపు కుంకుమలతో నర్చించి పగలే బ్రతుకమ్మలను నోమట్టిలో నొక పీటపై పెట్టి యుంచెదరు. సాయంకాలము నాలుగు గంటలవరకు పెద్దలు, పిన్నలు తమకున్న విలువగల వస్త్రములు, భూషణములు ధరించి బ్రతుకమ్మలను తలకొకటి చేతులలో పట్టుకొని ఊరిబయట చెరువుదరినో, కాలువకడనో, గుడియందో గుమికూడి బ్రతుకమ్మలను మధ్యన నిలిపి చుట్టు తిరుగుచు చేతులు తట్టుచు పాటలు పాడెదరు. ఆ గ్రామలక్ష్మిని చూచుటకు మగవారుకూడ వచ్చి దూరమున కూర్చుండెదరు. మగపిల్లలు కట్టె గొట్టములతో కాగితము, పాపడకాయల

'బారులు' నింపి ఆటపాటలందు నిమగ్నులైన స్త్రీలపై ప్రయోగింతురు. వరుసలోనున్న కలకంఠి యెకర్తు గొంతెత్తి పాటచెప్పుట కారంభించును. తక్కినవారంద రామె ననుగమింతురు. విశాలమైన ప్రదేశమున నిట్టి బంతులు నాలుగైదు కట్టి ఎవరికి వచ్చిన పాటలు వారు పాడెదరు. ఈ పాటలందు లక్ష్మి పార్వతుల స్తోత్రములేకాక పౌరాణికగాథ లెన్నియో కలవు. సీత, అనసూయ, చంద్రమతి, శశిరేఖ, సత్యభామ, సావిత్రి, కన్యకాపరమేశ్వరి మున్నగువారిని గురించి పాడెదరు. ఇప్పుడిప్పుడు గాంధీవంటి యాదర్శపురుషుల జీవితములు కూడ పాడుకొనుచున్నారు. ఈపాటలందు ప్రతి చరణము చివరన, కోలు, ఉయ్యాలో, చందమామ, గౌరమ్మ మున్నగు పదములం దేదోయొకటి వచ్చుచుండును. బ్రతుకమ్మ పాటలని పెక్కు గేయములు ముద్రింపబడినవి. కొన్ని ముద్రణము కాలేదు. ఒక చందమామ పాటలో బ్రతుకమ్మ పుట్టు పూర్వములు వర్ణింపబడినవి. ఈ పాటను రచించిన కవి ఓరుగల్లు సమీపముననున్న మొగిలిచెర్ల గ్రామవాసి. అతడిప్పటికి ఐదు తరములకు పూర్వముండిన వాడని యాతని వంశీయులు నాతో చెప్పిరి. ఈ పాట ఓరుగల్లు మండలమున ప్రతియింట నొక్కరికైన కంఠస్థముగా నున్నది.

| | | | |
|---|---|---|---|
| శ్రీలక్ష్మిదేవియు | చందమామ | సృష్టి బ్రతుకమ్మయ్యె | చందమామ |
| పుట్టినారీతి జెప్పె | ,, | భట్టు నరసింహకవి | ,, |
| ధర చోళదేశమున | ,, | ధర్మాంగుడను రాజు | ,, |
| ఆరాజు భార్యయు | ,, | అతి సత్యవతి యండ్రు | ,, |
| నూరు నోములు నోమి | ,, | నూరుమందిని గాంచె | ,, |
| వారు శూరులయ్యు | ,, | వైరులచే హతమైరి | ,, |
| తల్లిదండ్రు లపుడు | ,, | తరగనీ శోకమున | ,, |
| ధనరాజ్యములు బాసి | ,, | దాయాదులను బాసి | ,, |
| వనితతో నారాజు | ,, | వనమందు నివసించె | ,, |
| కలికి లక్ష్మినిగూర్చి | ,, | ఘనతపం బొనరించె | ,, |
| ప్రత్యక్షమై లక్ష్మి | ,, | పలికె వర మడుగుమని | ,, |
| వినుతించి వేడుచు | ,, | వెలది తన గర్భమున | ,, |
| పుట్టుమని వేడగా | ,, | పూబోణి మది మెచ్చి | ,, |
| సత్యవతి గర్భమున | ,, | జన్మించె శ్రీలక్ష్మి | ,, |
| అంతలో మునులునూ | ,, | అక్కడికి వచ్చిరీ | ,, |
| కపిలగాలవులునూ | ,, | కశ్యపాంగీరసులు | ,, |

అత్రి వసిష్ఠులు చందమామ ఆకన్నియను జూచి చందమామ
బ్రతుకగనె ఈతల్లి ,, బ్రతుకమ్మ యనిరంత ,,
పిలుతు రదివరనుండి ,, ప్రేయముగా తలిదండ్రి ,,
బ్రతుకమ్మ యనుపేరు ,, ప్రజలంత అందురూ ,,
తాను ధన్యుండంచు ,, తన బిడ్డతో రాజు ,,
నిజపట్టణము కేగి ,, నేల పాలించంగ ,,
శ్రీ మహావిష్ణుండు ,, చక్రాంకుడను పేర ,,
రాజు వేషంబున ,, రాజు ఇంటికి వచ్చి ,,
ఇల్లింటమని వుండె ,, అతివ బ్రతుకమ్మను ,,
పెండ్లాడి కొడుకులా ,, పెక్కుమందిని గాంచె ,,
ఆపసేలమంది ,, అతి సుందరాంగులు ,,
ధర్మాంగుడనురాజు ,, తన భార్య సత్యవతి ,,
సరిలేని సిరులతో ,, సంతోష మొందిరీ ,,
జగతిపై బ్రతుకమ్మ ,, శాశ్వతంబుగ వెలసె ,,

చోళదేశమును పాలించిన ఈ ధర్మాంగు డెప్పటివాడో? పామునుగన్న ధర్మాంగద రాజు కాశ్మీరమువాడని 'ధర్మాంగద-పాముపాట'లో నున్నది. తెలుగుదేశమున కొకప్పుడు చోళదేశమను పేరుండెడిది కాబోలు. తెలుగుచోడుల వృత్తాంతము ప్రసిద్ధమేకదా. మహబూబునగరం మండల ప్రాంతమునకు ప్రాచీనమున చోళదేశమను సంకేతముండినట్లు శ్రీ భావరాజు వెంకటకృష్ణారావుగా రనుచున్నారు. యువాన్‌చాంగ్ ఈదేశ భాగమును 'చుళియా' యని వ్యవహరించెనట. చోడులు తెలుగు దేశమునందు పుట్టి అరవదేశము జయించి యచ్చట స్థిరపడిరని శ్రీ భావరాజువా రూహించిరి. తమిళదేశమే వారి జన్మస్థానమనియు తెలుగునాడు వలస ప్రదేశమనియు నితరచారిత్రకుల యభిప్రాయము. మొత్తముమీద క్రీ.శ. ఆరవ శతాబ్దమునుండియైన చోళవంశములవారు కడపమండలములో నుండిరి. కనుక చోళరాజులకు సంబంధించిన ఈకథ కడప కర్నూలు మండలముల మీదుగా మహబూబునగరం మండలమునందు వ్యాపించి తెలంగాణమందంతట ప్రాకియుండునని నా నమ్మకము. రాయలసీమ మరియు తెలంగాణములకున్న సాన్నిహిత్యము సర్వజనవిదితము.

లేకలేక పుట్టిన బిడ్డకుగాని, పెక్కుమంది చనిపోయిన తరువాత దక్కిన బిడ్డకుగాని యిప్పటికిని తెలంగాణమున బ్రతుకమ్మయని పేరు పెట్టుకొందురు. దేశముపై నీకథాప్రభావ మంత ప్రగాఢముగా పడినది. వరలక్ష్మీ సమారాధన

మొనర్చు తెలుగు మదవతులు గొంతులు కలిపి ఈ పాటపాడెడువేళ ప్రతిగ్రామము పులకరించు ననిపించును. ఈ పాటను రంచిన కవియే 'గౌరి పాట' రచించెను. ఇదికొంత సంస్కారమున్న యిండ్లయందుగాని ప్రచారము గడించలేదు. దీనిలో సాహిత్యపుజిగి యధికముగా నుండుటే యిందులకు కారణము. ఈ గేయము పెద్దదగుటచే అటనట కొంత యుదాహరింతును.

'శ్రీలక్ష్మి నీ మహిమలూ-గౌరమ్మ-చిత్రమై తోచునమ్మ
భారతీ సతివయ్యు బ్రహ్మకిల్లాలివై పార్వతీదేవివై పరమేశు రాణివై
పరగ శ్రీలక్ష్మివయ్యూ-గౌరమ్మ-భార్యవైతివి హరికినీ ॥శ్రీ॥
ముక్కోటి దేవతలు చక్కనీ కాంతలు, మక్కువగ నినుగూర్చి పెక్కునోములు నోచి
ఎక్కువా వారైరిగా-గౌరమ్మ-ఇహలోకముల యందునా' అని గౌరీదేవిని స్తోత్రమొనర్చి జానపదకవి యామె నిట్లభివర్ణించుచున్నాడు.

'గొప్పయగు నీముద్దు·కొప్పింద్రనీలములు, గప్పు చీకటి జగతి గప్పు కొప్పునబిళ్ల
చెప్పతరము గానిదీ-గౌరమ్మ-చంద్రరేఖా పాటిది ॥శ్రీ॥
నిగనిగాయనెడు నీ నగుమోము జూచితే, జగతి పున్నమనాటి చంద్రుణ్ణి ఓడించు
సొగసైన నీ తిలకమూ-గౌరమ్మ-చూచితే ఆనందమూ ॥శ్రీ॥
నల్ల వరిబియ్యమో మల్లెమొగ్గలో లేక, తెల్లవజ్రంబులో ముల్లోకములు యేలు
తల్లి నీ దంతబులూ-గౌరమ్మ-దానిమ్మ బీజంబులూ'

ఇక పండుగను గూర్చిన వర్ణనము చూడుడు.

'బాలలూ వృద్ధలూ ప్రౌఢాంగనలు కన్నె ప్రాయంపుకాంతలూ పరగ నాశ్వీజశుద్ధ
పాడ్యమీ మొదలుకోనీ-గౌరమ్మ-భక్తి నీయందు నిల్పి ॥శ్రీ॥
తొమ్మిదీ దినములు నెమ్మనంబున బొంగి, అమ్మలక్కలుగూడి ఆస్తితో తమకున్న
సొమ్ములూ ధరియించుకా-గౌరమ్మ-శోభనంబని పాడుచూ ॥శ్రీ॥
బంగారు పువ్వులూ బ్రతుకమ్మయని పేర్చి, మంగళంబుగ నిన్ను మధ్యనా నిల్పియు
రంగు గుమ్మడి పువ్వులూ-గౌరమ్మ-రాశిగా నర్చింతురూ ॥శ్రీ॥
కట్లాయి పువ్వులూ కాకెర పువ్వులూ-కలగోటుపువ్వులూ గన్నేరు పువ్వులూ,
బొట్లపువ్వులు జల్లుచూ-గౌరమ్మ-పొగడ పువ్వులు నింపుచూ ॥శ్రీ॥
పారిజాతంబులూ పైడితంగెడుపూలు, గోరెంట పొన్నలు కురువింద మల్లెలు
తీరు రుద్రాక్షపూలూ-గౌరమ్మ-పేరైన ముసుమాయులూ (?) ॥శ్రీ॥
పాలమీగడ లట్లు పానకంబులు జున్ను. పోళీలు మరి మడుగుపువ్వులూ శేమియాల్
మేలు శర్కర గరిజెలూ-గౌరమ్మ-మెప్పుగా నర్పింతురూ ॥శ్రీ॥
గంగ నర్మద యమున కావేరి మరియునూ, తుంగభద్రాది ముచికుంద నదితీరముల
బొంగి వేడుకమీరగా-గౌరమ్మ-పురుషులూ స్త్రీలు గూడి ॥శ్రీ॥

క్రోరి ఈరీతిగా కేరి పూజింతుము, చారుసుందరమైన సౌభాగ్యముల నిచ్చి
కారుణ్యమైన నేలుమీ-గౌరమ్మ-కల్యాణము వొసగి మాకు ॥శ్రీ॥

కావేరి తమిళదేశమునకును, తుంగభద్ర రాయలసీమకును, ముచికుంద (మూసానది) తెలంగాణమునకును ప్రాతినిధ్యము వహించుచున్నటుల దోచెడిని.సాయంకాల మగువరకు ఇట్టి పాటలు పాడుకొని ఆతరువాత వాయవారు తెచ్చిన'చద్దులు' లేదా 'ఫలహారములు' వాయనము లందించుకొందురు. మొదటి దినము బాగాలు తులసీదళములు వాయనములందుకొనెదరు.తొమ్మిదవనాటి బ్రతుకమ్మపండుగునకు 'చద్దుల బ్రతుకమ్మ' యని పేరు. ఆనాడు పెసరు, గోధుమ, బియ్యము, కొబ్బరి నువ్వులు,ఈ యైదువిధముల చద్దులు తీసికొనిపోయి వాయనము లందుకొనెదరు. వాయనము లిచ్చుకొనునప్పుడు ఇంతకుపూర్వము జగడమాడుకొని మాటలాడుకొనని మగువలుకూడ ఆనాడు పూర్వవైరములు మరచి స్నేహసూత్రముల కట్టుపడుదురు. ఎంత మంగళకరము లీ సన్నివేశములు! వాయనము లయిన పిమ్మట బ్రతుకమ్మలను నీళ్ళలో వాలారించి తమతమ గృహములకు వెడలిపోయెదరు.ఆరవనాటి పండుగను అర్రెమందురు.ఆనాడు బ్రతుకమ్మల పేర్చుటకాని ఆడుటగాని యుండ దెందునకో! ప్రస్తుతము క్రొత్తచదువులు చదువుకొన్న స్త్రీలీ బ్రతుకమ్మ నాడుటలేదు. వారి దృష్టికిది మోటు.

అగ్రవర్ణములవారికి లక్ష్మీ గౌరీ వ్రతములు,పూజ లున్నటులే శూద్రులకు ఎల్లమ్మ, మైసమ్మ, పోచమ్మ, బాలమ్మ మున్నగు దేవతలు కలరు. పలనాటి వీరకథాచక్రము,కాటమరాజు కథాచక్రముల వలెనే ఈ శక్తి కథాచక్రముగూడ విస్తారమైనది. ఈ దేవతల-శక్తుల కొలుపులుపల్లెటూళ్ళయందు పంబాల (బవనీల) వారు కొలిచెదరు. బవనీలవారికే బైండ్లవారనియును పేరు,అది వారిచెంతనుండు వాద్యవిశేషముచే గలిగిన పేరు. జమిడిక, జవనిక, పంబ మున్నగునవి వారి వాద్యమునకు పేర్లు. ఎల్లమ్మకే రేణుకాదేవి యనిపేరు. ఈ కథయే క్రీడాభిరామమున 'పరశురాముని కథలెల్ల ప్రౌఢి బాడె చారుతరకీర్తి బవనీలచక్రవర్తి' యని చెప్పబడినది. ఎల్లమ్మ (రేణుక) కుమారుడు పరశురాముడు. బలనీలచక్రవర్తి పాడిన పరశురాముని కథలెట్టివో? పరశురామాయణముగూర్చి Tylor పండితుడు కొంత వ్రాసినట్లును, మెకంజీ వ్రతులలో నీకథా విషయమున్నట్లును తంగిరాల వెంకట సుబ్బారావుగారు పేర్కొన్నారు1. తెలంగాణమున ప్రచార

1. తెలుగు వీరగాథాకవిత్వము.

మందున్న ఒక 'ఎల్లమ్మ' కథను నేను సేకరింపగలిగితిని1. దానిలోనున్న కథను క్లుప్తముగా మనవిచేయుదురు,

'యెలిగొండ పుట్టంగ సలిగొండ బుట్టి-సలిగొండ పుట్టంగ యెలిగొండ బుట్టె
యెలిగొండ సలిగొండ యేలేటివారు-సత్యమైన గౌతము డసామాన్య ధీరుండు'

జానపదుల కథలందు వాలుగొండ పట్టణము తరచుగా కానవగును. అట్టి యునికి లేని పట్టణములే పైన పేర్కొనబడిన యెలిగొండ సలిగొండ పట్టణములు. గౌతముని భార్య అహల్య.వారి సంతానము సప్తఋషులు.ఒకనాడు భగవంతుడు వచ్చి గౌతముని ఎట్టికొట్టల సాహిత్యము (సాహిత్యమనగా తెలంగాణమున స్వయంపాకము) కోరెను. ఎట్టికొట్టలు లేనందున గౌతముడు భగవంతుని తాత్కాలికముగా ప్రార్థించి మరల కొన్నాళ్ళకు రావలసినదిగా చెప్పి సాగనంపి రేగడిలో 'మట్టి కొట్టి నేడు మరి పోడుచేస్తు2, పోడులో కొట్టలు పొలుపొంద గాను, పండించి సామిని పవళించబెట్టి, వారికి సాహిత్యము వరుసతో నిస్తు'నని యోజన చేసెను.ఒకనాడు ముహూర్తము నిర్ణయించుకొని తన సప్తసంతానముతో గౌతముడా రేగడికి పోయి దానిలోనున్న మట్టిచెట్టును తన చంద్రాయుధముతో నరికెను ఆమట్టి పుట్టిననాడు పుట్టి అందులొ నొక నాగేంద్రుడు పెరుగుచుండెను. అతడు, 'పన్నెండు శిరసులు పైనను యెత్తి, గౌతముని మాటను ఘనముగా వినియె, మానవులెవ్వరో మాట వినవచ్చె'నని కోపముతో 'తెల్లని గుడ్లకు తెచ్చె రక్తంబు,తరిమికొట్టెను.పాము తామసంబునను'.సప్తఋషులతో గౌతముడు పారిపోయెను. పామువలన కలిగిన పరాభవమునకు నొచ్చుకొని గౌతముడు గారడివాని వేషముతో పోయి నాగసర్వమూదెను. నాగము శాంతించి తన పుట్టలోనికి బోవుసమయమున కత్తితో దాని పండ్రెండు శిరముల నరికి గృహము చేయుకొనెను. మరునాడు గండ్రగొడ్డండ్లు నూరించి, భార్యతో బోనము సిద్ధముచేయించి,కొడుకులతో తరలిపోయి,ధూపదీప నైవేద్యము లిడి,'పాములకు ఆ మట్టి పడనున్న మట్టి. త్రాచుపాములకు తావైన మట్టి జెరిపోతులకు ఆ మట్టి జగమైన మట్టి కుంటెన పాములకు ఆమట్టి, కుదురైన మట్టి, పక్షులకు

1. శ్రీబి.మంగయ్యగారి గేయమును సేకరించుటలో తోడ్పడిరిదీనిని వినిపించినది బైండ్ల (బవనీల) సర్వాయె.చొప్పదండిగ్రామము. 12-12-1954.రాత్రి.

2. పోడుచేయుట యనగా పొలమునకుగాని చేనునకుగాని గట్లు ఏరుపాటు చేసి చెట్టుగొట్టి సిద్ధము చేయుట.

ఆ మట్టి పడనున్న మట్టి, త్రాచుపాముల మట్టి తావైన మట్టి జేతిపోటులకు ఆ మట్టి జగమైన మట్టి, కుంటెన పాములకు అమట్టి కుదురైన మట్టి, నక్షత్రలకు ఆ మట్టి పడనున్న మట్టి, పెంజర పెదపాములకు పేరైన మట్టి'ని కొడుకులచే నరికించెను. ఆ మట్టిపేరు యాదవుల మట్టియట. ఇంటికి వచ్చి పాలు త్రాపెడు పిల్లిని బంగరు పావుకోడుతో కొట్టి చంపెను. ఇప్పటికి సర్పహత్య మార్జాల హత్యయను రెండుపాపము లాతనికి గలిగెను. మరునాడా మట్టిచెట్టును కాల బెట్టుచుండగా పక్షులు చచ్చెను. మృగశిరలో నాతడా రేగడిలో దంతెలతో[1] విత్తనములు చల్లెను. కొఱ్ఱచేను మొలచెను. ఆచేనులో మేయుచున్న ధేనువును కూడ గౌతము డొకనాడు కోపముతో చంపెను. ఇన్ని పాపముల పరిహారార్థమై యాతడు 'శోభనాల' బావి త్రవ్వించెను. కాని యాబావిలో నొక బ్రాహ్మణుడు పడి చనిపోయెను. గౌతముడు తనకు గలిగిన పాపము లన్నింటికి వగచి సముద్రస్నానము జేయ సంకల్పించెను. భార్యాభర్త లిరువురును సముద్ర స్నానమునకై బయలుదేరి పోవుచుండగా మధ్యేమార్గమున 'ఱేకు పుష్పము క్రింద తిన్నగా నపుడు, మొగనక్క ఆడినక్క రెండు కూటమాడు, అహల్య కనుల జూచె అనక్కలాను'. అహల్య గౌతమునితో 'చెట్టుక్రిందను యేమొ చేసినవి రాజ, చూదాము పదవయ్య సొంపుతో మన'మనెను. వారటకు పోవునంతకి నక్కలు విడిపోయెను. వాని రేత మొక ఱేకుటాకులో బడి మగశిశువయ్యెను. వారా బాలుని గ్రహించి జమదగ్నియని నామకరణము చేసి పెంచిరి. జమదగ్ని పెద్దవాడయ్యెను. శివపురమును పాలించు శంకరుడు తన కూతురగు రేణుకను- ఎల్లమ్మను- అతనికిచ్చి పెండ్లిచేయ నిశ్చయించెను. ఒక శుభముహూర్తమున 'పొలుపొంద ముత్యాల పోలును వ్రాసి, నవరత్న బాసిగము నయమొప్ప గట్టి, చెలువుగ ముత్తైదువలు సేసలు జల్ల, తెలివైన పుణ్యస్త్రీలు దీవనలు ఇవ్వ, అందంది బ్రాహ్మణులు ఆశీర్వదింప' రేణుకాజమదగ్నుల కుద్వాహమయ్యెను. శివుడు కూతురునకు 'మైసామాపురము' వరణముగా నిచ్చెను. సప్తర్షులకు జమదగ్నిపై కోపము కలిగెను. సమష్టిగా నుండుటకిచ్చగింపక వేరుబడవలయునని వారు కోరిరి. గౌతముడు తనకున్న యాస్తిని కొడుకులకు పంచెను. కాని జమదగ్ని పాలునకు మాత్రము గౌతము డొనర్చిన పాపమంతయు వచ్చెను. జమదగ్ని తన దురదృష్టమునకు వగచి తపమాచరించి పాపము దొలగించుకొన నిశ్చయించి ఎల్లమ్మతో చెప్పిపోయెను. అతని తపమునకు భగవంతుడు మెచ్చి ఆకలి దప్పికలు లేకుండునట్లు వరమిచ్చి యటనొక 'ధర్మచెలమ' గావించెను.

1. ఒకవ్యవసాయపు పనిముట్టు. ఇది దంతిశబ్దమే. దంతములు కలదని యర్థము.

ఇట్లుండ నొకనాడు రేణుక తన భర్తను చూడగోరి వట్టిచేతులతో బోవనొల్లక కాళింగమడుగు చెంతకు బోయి సర్పరాజును నాగస్వరముచే శాంతుని జేసి యటనున్న వంధాన్యము ను 'మరి వోడిగట్టుక మాపురము జేరె'ను. (మాహురమే మాపురమైనది. మాహురమ్మక్కసాని యచటి దేవత. ఆమెయే ఏకవీరయని క్రీడాభిరామముపలన దెలియనగును.) అచట బోనము వండి యలంకరించుకొనెను. ఆమె వర్ణనము, స్తోత్రము ఇట్లున్నది.

'పూత చెందిరములు బొట్టు భూమి అవతరించినావు,
ఘాతజేసి వోరంగంటి మాత యెల్లమ్మా
చేరెదేసి కన్నులాడి చెలియ ఓరుగంటి యెల్లి
వాగలాపి తూర్పునుంచి వనిత వచ్చెనూ,
మాని వచ్చెనా చింత మాని వచ్చెనా
మూరు దేశామునుంచి మగువ వచ్చెనూ
శివుని పూదియ్య చింత మాని వచ్చెనే,
యేమనైన సందిగొంది యేలు ముద్దుటుంగరాము
పాములోయమ్మ చిన్న పాములోయిమ్మా
పాములే పై భూషణములు బంగారి గజ్జెలతల్లి
నీకు శరణు జేతునమ్మ నాగభూషణములూ'

ఇంతవరకు నడచినపాట యొక గతిలోనున్నది. ఇది 'సువ్వి రామచంద్ర' యను తకిట తకిట ఆవృత్తములతో త్రిశ్రగతిలో నడచినది. ఆ తరువాత కిటతక కిటతక యను ఆవృత్తములతో చతురశ్రగతిలో నడచినది. మొదటి భాగము తురగవల్గన, రెండవ భాగము మధురగతి రగడలవలె నున్నది.

'వన్నెలపుటల వలువలు గట్టుక, సన్నపు శేషుని చేతుల బట్టుక
నాగుంబాముల నడుముకు గట్టుక, జేరిపోతుల చేత బట్టుక
కొండిపాముల కొప్పున ముడుచుక, యెన్నిక కెక్కిన యేకావీరా
..........................................................
ఆదిరూపమున అఖిలలోకముల, వేడుక పూజల వెలసిన తల్లి'

సర్పములకును ఎల్లమ్మకును గల సంబంధ మెట్టిదోకాని తెలంగాణమున పాములను ఎల్లమ్మ దేవతగా భావించి కొలిచెదరు. స్వప్నమున పాములు కనబడిన ఎల్లమ్మ దేవతయని మొ్రొక్కుకొందురు. చేనులో చెలుకలో పామువలన నపాయము గలిగిన ఎల్లమ్మకు కొలుపులు చేయుదురు. లక్కపోతలో గవ్వల నతికించిగాని గోడకు పసుపుకుంకుమ బొట్లు విసనకఱ్ఱ వెడల్పుతో దగ్గరదగ్గరగా

బెట్టి కాని ఎల్లమ్మదేవత యని పూజ లొనర్తురు. ఎరుక చెప్పువారి బుట్టలో గవ్వలతో చేయబడిన ఎల్లమ్మదేవత యుండును.

ఈవిధముగా రేణుకాదేవి సిద్ధమై భర్తను చూడ బయిలుదేరెను. ఆమె వలన జమదగ్ని తపోభంగమగునని భగవంతుడు మధ్యేమార్గమున ముగ్గురు పసిబిడ్డల సృజించి విడిచెను. వారా యెల్లమ్మను అన్నమడిగిరి. ఆమె వారి కన్నము పెట్టక భర్తకడకు వచ్చెను. కాని బోనపు పాత్రలో సగమన్నము మాయమయ్యెను. ఆమె యది చూచుకొనదయ్యెను. జమదగ్ని బోనమారగింప జల్లెడలో నీరు తెమ్మనెను. రేణుక తనకీ పరీక్షలో సాయపడుమని తన పిన తల్లిని-గంగను-ప్రార్థించెను. గంగ సహాయమున ఎల్లమ్మ జల్లెడలో నీరు తెచ్చి భర్తకిచ్చెను. బోనపుపాత్ర మూతదీయగా సగమే యుండెను. జమదగ్ని యది గని మధ్యేమార్గమున నెవరైన కనబడిరా యని యడిగెను ఎల్లమ్మ శిశువుల సంగతి చెప్పెను. జమదగ్ని యామెతో వారు మన పుత్రులు వారికి భోజనము పెట్టిరమ్మని పంపెను. ఎల్లమ్మ బోనపు పాత్రతో వెనుదిరిగి శిశువుల చెంతకు వచ్చెను. శిశువు లామెను వివస్త్రివై భోజనము వడ్డింపుమనిరి. అమె దైవమును దలచుకొని 'అక్షయవలువలు' పొందెను. పిల్లలకు భోజనమిడి వారిని వెంటబెట్టుకొని మరల భర్తను చేరబోయెను. (అనసూయ యింట త్రిమూర్తులు చేసిన చేష్టలు, ద్రౌపదికి లభించిన 'అక్షయ వలువలు' రెండును రేణుకాదేవికి సంభవించినవి.) మహారాష్ట్రిలు దత్తాత్రేయుడు రేణుకాదేవి కుమారుడందురు. ఆదిలాబాద్ మండలమునగల మాహూర్ (మాహురము)లో దత్తాత్రేయమఠము రేణుకాలయము లున్నవి. జమదగ్ని శిశువుల నెత్తుకొని తాను భోజన మారగింపనని "ఉసికతో కడువయు ఒనర గావించి, భాండముతో ఉదకమ్ము వట్టి తెమ్మనుచు' రేణుకను కొలను కంపెను. రేణుకాదేవి జలములకై పోవ కొలనులో 'కప్పలు కూటమాడు' చుండెను. వాని గాంచి యామె హృదయము చలించి తన భర్త తనతో 'మైనమాపురము' లో నున్నచో తామును ఇట్టులే దాంపత్యసుఖ మనుభవించి యుందుముగదా యని భావించెను. దివ్యదృష్టిగల జమదగ్ని కిది తెలిసి కుపితుడై ఎదురు రొమ్ము నలచి ముత్తెమంత మన్ను దీసి దానితో 'మసుకరేను'డను మాదిగను కల్పించెను. రేణుక స్నానముచేయు కొలనికడకు వాని బొమ్మనెను. వాడు కొలను చేరి యట దిగంబరయై స్నానమాడు రేణుకను పొందగోరి రమ్మనెను. రేణుక కోపముతో వానిని దూషించెను. వాడు తిరోహితుడయ్యెను. ఆమె యాశ్చర్యపడి స్నానము ముగించుకొని ఇసుక కుండలో నీరు నింపుకొని

భర్త కడకు వచ్చెను. విస్తరిలో నన్నము వడ్డించెను. జమదగ్ని తపము చాలించి రెండు కబళము లారగించి కోపావేశముతో తన ముగ్గురు కుమారుల రావించి తప్పు చేసినవారి నేమి చేయవలయునని ప్రశ్నించెను. పెద్దవారిరువురు తప్పు క్షమించవలయు ననిరి. జమదగ్ని వారి నసమాయికులనెను. మూడవవాడగు పరశురాముడు మాత్రము 'తప్పుజేసినవార్ని తలగొట్టవలయు'నని సమాధాన మిచ్చెను. జమదగ్ని యాతని మెచ్చి యాతని తల్లి తప్పిదము నెరిగించెను. ఆ మాట విని పరశురాముడు 'కుడిమీసం వడిబెట్టి గుడ్లెఱ్ఱ జేసి, తాటాకు మంటవలె దరికొని మండె, తెల్లని గుడ్లకు తెచ్చె రక్తంబు'. తండ్రి యాజ్ఞచే పరశురాముడు తల్లి తల నరికి తరువాత తండ్రిని వేడుకొని మరల బ్రతికించెను. జమదగ్ని రేణుకను కుమారులను వెంబడించుకొని మైసమాపురమునకు పొమ్మనెను. భర్తృనాజ్ఞను శిరసావహించి రేణుక తన కుమారులతో మైసమాపురమున నుండెను. ఇంతలో 'జెంబరగిరి పట్న'మేలెడు కార్తివరాజు (కార్తవీర్యార్జునుడు) జమదగ్నిని చంపెను. రేణుక ఈ వార్త విని దుఃఖించెను కాని తన కుమారులకు మాత్రము చెప్పదయ్యెను. ఒకనాడు పరశురాముడు బొంగరము లాడుచు తండ్రిలేనివాడని తోడిబాలురచే నిందింపబడెను. (బాలచంద్రుని బొంగరము లాటలో నిట్టి సంఘటనమే జరిగినది.) పరశురాముడు తన తండ్రిగూర్చి తల్లి నడిగెను. రేణుక జమదగ్ని మరణవార్త నెరిగింపక తప్పించుకొని పారిపోయి కోమటి, కాపు, మాలవాడలందు కొంతసేపు దాగియుండెను. కాని వారు పరశురామునికి భయపడి యామెను దాచలేరైరి. రేణుక, మాత (మాదిగ) వాడకు పోయి, మాతకోలంగి యింట లందలో[1] దాగియుండెను. పరశురాముడు తన తల్లి జాడలరయ మొదట చక్రమును బంపి నిష్ఫలుడై తరువాత తానే 'పంబాల అవతారం బాగుగా నెత్తి, చంకలో జమిడికె సవరించుకోని, జేరిపోతును బట్టి భుజాన వేసి, యీరగోల భుజాన ఇంపుగా దాల్చి, జోగువనిత నొకతి జోడు కూడుకొని, మాతవానింటికి మమతతో వచ్చి, ప్రార్థన జేసెను బాగుగా నపుడు'. (ఈ ప్రార్థనము కొంత దీర్ఘముగా నున్నది. దీనిలో ఎల్లమ్మ పుట్టినది మాహూరమనియు, పెరిగినది ఢిల్లియనియు, అడ్డబెట్టినది-నివాసమున్నది, అనుమకొండ యనియు, ఓరుగంట వీరభద్రునిచే పూజలు గొనెననియు కలదు.) ప్రార్థనము విన్న యెల్లమ్మ లందనుండి బయటికి వచ్చెను. తండ్రిజాడ లెరిగింపుమని మరల పరశురాముడు తల్లిపై కోపముతో చేయెత్తెను. తానే

1. చర్మములు నానవేసెడు గోలెమునకు లందయని పేరు.

శాంతుడై పశ్చాత్తాపపడి తల్లిపై నెత్తిన తనచేతిని మట్ట (మణిబంధము)వరకు తెగవేసికొనెను. ఎవరి యింటనైన, దొడ్డిలోనైన ఐదు వ్రేళ్ళతో పుట్టినచో 'ఉప్పలి మైస'ని నీకు పూజ లొనర్తురని ఖండింపబడిన హస్తతలమునకు వరమిచ్చెను. (తెలంగాణమున నిప్పటికిని ఇటుల మొలచెడు చేతికి ఉప్పలమ్మ, ఉప్పలి మైసమ్మ యను పేరులతో పూజలు జరుగుచున్నవి.కొందరికి ఉప్పలమ్మ ఇలువేల్పు. దీనిలో రక్తఉప్పలి, శ్వేతఉప్పలి యని రెండువిధములు. శూద్రులిండ్లయందీ పూజలు మెండు.సాగరాంధ్రమున ఉప్పలిని 'మొండిచేయి'యందురు. ఎల్లమ్మ భయపడి చివరకు కార్తవీర్యార్జునునివలన జమదగ్ని నిహతుడయ్యెనని తెలిపెను. ఈ వార్త విన్నంతనే పరశురాముడు మండిపడి కార్తవీర్యు నిర్జింతుననెను. తల్లి శత్రువు పరాక్రమశాలియని నిరోధింప జూచెను. కాని పరశురాముడు మాత్రము 'యేనుగుల పడబొడిసి యేటాడిస్తు-గుఱ్ఱాల పడబొడిసి కుచ్చెలుగ బెడుదు'నన్ను దీవించి పంపుమనెను.రేణుకాదేవి'పగవారి హస్తంబు క్రింద గావలెను,నీయొక్క హస్తంబు మీదు గావలెను'అని దీవించెను.వెంటనే 'తల్లికి దండంబు తలవంచి పెట్టి, తా దర్లె రాముడు దండుపైనంబు'. ఇది రేణుకాదేవి వృత్తాంతము. పంబాలవా రిప్పటికి నీకథను జెప్పుచు కొలుపులు గొలిచి బిచ్చమెత్తెదరు.

ఈవిధముగా జానపదులు భక్తి, జ్ఞాన, కర్మమార్గముల గూర్చిన వాఙ్మయ మధికముగా పెంచుకొనిరి. వారికీ వాఙ్మయమే మోక్షసంపాదనమునకు దిక్కు. ఎవరికిష్టమున్న మార్గమును వారవలంబించి తరింతురు.



# స్త్రీల పాటలు

కవిత్వమునకును జీవితమునకును ప్రగాఢసంబంధ ముండుననుట అందరంగీకరించినను, ఇట్టి సంబంధ మంతగా మనకు శిష్టసాహిత్యమున కానరాదు వాస్తవికజీవనమునకు సంబంధించిన సాహిత్యము శిష్టవాఙ్మయమున కొలదియే. రాజసభలందు 'ఇందీవరంబుల నీను క్రొల్గన్నుల శరదిందుముఖు లిడు చామరములు'ను రాజులవెంట పరివారము కొనిపోవు ముకురవీటికా కరండములును, పెక్కుయలపై దీపించు నద్దములును, ధవళాంశుకములోని యంగదట్టములును, నాటకు నేర్మిశంబైన విపంచులును, రాయలకాలమున నుండెనని ప్రబంధములందు కంట వత్తికొని చూచినగాని నాటి జీవనసౌకర్యముల సంగతి మనకు తెలియరాదు. శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు తమ ఆంధ్రుల సాంఘిక చరిత్రమున నట్టి కష్టకార్యమును సాధించినారు. కాని జానపద వాఙ్మయమున కవితాలత మానవజీవితమను పందిరిపై కెగప్రాకి అన్ని దిశలందును వ్యాపించినది అల్లుకొనిన తీగయే పందిరి యాకారము ధరించినదో లేక పందిరంతయు తీగగా పులకరించినదో యనుకొనునంత ప్రగాఢసంబంధమీ రెంటి కేరుపడినది. ఒకదానితో నొకటి పెనవేసికొని ఒకదానితో నొకటి కలిసిపోయినవి. జీవితము కేవలము సుఖమయమో లేదా దుఃఖమయమో కాదు. సుఖము దుఃఖము రెండును జీవితప్రవాహమున కిరుప్రక్కలనున్న దరులు. ప్రవాహ మనునది రెండుతటముల నంటిపారవలసినదే. కవిత్వ మనునది జానపదులకు సుఖమునకును దుఃఖమునకును వచ్చును. పుట్టుటగిట్టుటలు, వేడుకలువినోదములు, పెండ్లిపేరంటములు, ఆదరింపులు ఆరడులు, సత్కార తిరస్కారములు, మైత్రీవిరోధములు, శుభాశుభములు, ఆశానిరాశలు, సుఖదుఃఖములు సమస్తమును జానపదులకు కవితావస్తువు లయినవి.

సాంసారయాత్రలో గృహలక్ష్మికి గల ప్రాధాన్యము పురుషునకు లేదు.

అటులే గృహజీవనమున, కవిత్వమునకు గూడ స్త్రీలే యధికముగా నాలంబనములు. కనుకనే ఇట్టి భాగమునంతయు సౌలభ్యము కొరకు స్త్రీలపాటలుగా విభంచుకొని పరిశీలించుట యుచితము. పైన పేర్కొన్న మంచిచెడుగులు సంసారమున నందరు మానవులకు-ధనవంతులకుగాని, నిరుపేదలకుగాని - సాధారణములు. కొంచెం మెచ్చుతగ్గులుండిన నుండును. భేదమంతియ. కనుక నిట్టి సర్వసాధారణ విషయములు వస్తువుగానున్న కవిత్వముగూడ సాధారణీకరణమును ప్రదర్శనా పద్ధతినే యవలంబించును. జానపదకవిత్వలక్షణములందీ సాధారణీకరణము గూడ నొకటని మనము గుర్తించవలయును. అనగా నభిమతముగల పేర్లు తప్ప తక్కిన వస్తువంతయు సాధారణమైనదే. వాతావరణ మలౌకికము మరియు మాహప్రపంచమునకు సంబంధించినది కాదు. శ్రీరాముని పర్ణశాలయైనను శ్రీకృష్ణుని యంతఃపురమైనను ఈసారస్వతములో నది నేటికాలపు తాటాకు గుడిసెయే, నేటికాలపు భవనమే. కేవలము రత్నరాసులే భేదము. శ్రీరాముడు సీత, కృష్ణుడు సత్యభామ మున్నగువా రతిలోకవ్యక్తులు కారు. మనవంటి వారే. ఆయా పురాణవ్యక్తు లభిమానపాత్రు లగుటవలన వారి పేరులతో కవిత్వ మున్నదేకాని సంసారజీవిత మంతయు మనదే. ఇట్టి కవిత్వమున కల్పనకన్న వాస్తవికతకే ప్రాధాన్య మధికము. ప్రకృత మిట్టి గేయముల నీ ప్రకరణమున పరిశీలింపనగును.

స్త్రీలపాటల సంపుటములందును, తెన్నేటి తిరుమలదాసుగారి 'వేడుక పెండ్లిపాట'లందును, చేకుమళ్ళ కామేశ్వరరావుగారి 'పాతపాట'లందును, శ్రీ. గంగాధరంగారి 'సేలయేరు' నందును వివిధపత్రికలందును ఇట్టి సాహిత్యము కొంత ప్రచురితమైనది.

భారతీయనారీమణికి మాతృత్వమునది ఎనలేని సంపద. సంతానము పడయజాలని గొడ్డురాలికి సంఘమునను స్త్రీలోకమునను గౌరవము లేదు. ఆమె బ్రతుకంతయు నడవిగాచిన వెన్నెల.

'కొత్త చింతపండు గోనెల్ల చీకు-గొడ్రాలి వస్త్రాలు పెట్టెల్ల చీకు
పాత చింతపండు బస్తాల చివుకు-బాలెంత వస్త్రాలు పసుపుల్ల చివుకు
కొడుకుల గననివాళ్ల కడుపేమి కడుపు-కుల ముద్దరించని కొడుకేమి కొడుకు
పిడికెడు విత్తనాలు మడికెల్ల జాలు-వక్కడే కొడుకైన వంశాన చాలు'

సంతానము పడయుటకు స్త్రీలు పడరాని పాట్లు పడెదరు. వ్రతములు, నోములు,

తీర్థయాత్రలు చేసెదరు. ఇంతవరకు ప్రస్తావించిన ఇతర ప్రకరణములలం దెన్నియో కథలందు సంతానాకాంక్షులయినవారు చేసిన జపతపములు వర్ణింపబడినవి.

'సింహాద్రి అప్పన్న గుళ్లముందార-పట్టారు గొడ్రాళ్లు ప్రాణదారాలు
ఎందుకు పట్టారు ఏల పట్టారు-కొడుకుల్ల ఇయ్యమని కోరి పట్టారు
సంతు లియ్యమని చాల పట్టారు-బిడ్డల నియ్యమని పట్టు పట్టారు
సింహాద్రి అప్పన్నకు లంచాలు ఏమి-గుడితిరుగు వస్త్రాలు గుమ్మడి పండ్లు
వాగళ్ళ వడపప్పులు దండి బెల్లాలు'.
'బిడ్డలు లేరంటే గొడ్రాల నీకు-ఆడితివి అంతరేజు[1] గంగతానాలు
ఆడిన లేదమ్మ అన్నెకాపులకు[2]-పాడిన లేదమ్మ పాపకాపులకు
బిడ్డలు లేరంటే గొడ్రాల నీకు-ఈశ్వరుని గుళ్ళకు ఇటుకలు మోసేవు
రామయ్య గుళ్ళకు రాళ్ళు మోసేవు-రావియ్య[3] చెట్టుకు ప్రదక్షిణాలు చేసేవు'

ఇట్టి యాత్ర ఫలించి ఇంటి వెలుగును కన్న ఇల్లాలి సంతోషమునకు మేర యుండదు. ఆ సంతోషపారవశ్యమున తన బిడ్డ రాముడుగనో, కృష్ణుడుగనో, శంకరుడుగనో భావించి తల్లి లాలించును. జోలలు పాడి నిద్రపుచ్చును. గృహస్థ కవనమున లాలిపాటలు జోలపాటలు ముఖ్యములు. లాలిపాటలు పిల్లల నాడించుటకును (లాలించుటకు) జోలపాటలు పిల్లల జోకొట్టి నిద్రపుచ్చుటకును పాడెదరు. ఇవి శంకరాభరణ, నవరోజు, ఆనందభైరవి, శ్రీరాగము లందుండును. లాలి జోలపాటలయందలి సంగీతవిశేషములు కృష్ణశ్రీగారు చర్చించి యున్నారు[4]. ఇట్టివి పూర్వమునుండియు మన యక్షగానములందు వచ్చుచునే యున్నవి. సుప్రసిద్ధ వాగ్గేయకారుడగు తాళ్ళపాక అన్నమయ్యగారి కీర్తనములు జానపదవాఙ్మయమున చేరకపోయినను వారు రచించిన జోలపాట మాత్రము జానపదగేయముగా ప్రచారము గాంచినది.

'జోవచ్యుతానంద జోజోముకుందా-రావె పరమానంద రామగోవింద' యను జోలపాట పాడుకొనని తెలుగుతల్లి యుండదు. ఇందులోని జో + అచ్యుత = జోవచ్యుత అను సంధి తిరు + అరంగం = తిరువరంగంవంటి తమిళ సంప్రదాయపు సంధియని శ్రీ ప్రభాకర శాస్త్రిగారు చెప్పినట్లు శ్రీ తిరుమల రామచంద్రగారి సూచన.

---

1. అంతర్వేది. 2. పాపులని యర్థము. 3 వెండియ్య, తమిడియ్య, రావియ్య, వంటి ప్రయోగములు జానపదగేయములందు సాధారణములు.

4. భారతి, నందన ఫాల్గునము; మార్చి 1953.

'అంగుగా తాళ్ళపాకన్నయ్య చాల-శృంగారరచనగా చెప్పె నీజోల'. ఇది అన్నమయ్యగారి రచనమని తొలుత గుర్తించినది శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు1. పోతన 'జోజో కమలదళేక్షణ' యని కందపద్యమునే జోలపాటగా పాడి శ్రీకృష్ణుని జోకొట్టెను. తల్లి తన కుమారుని శ్రీకృష్ణుడుగా భావించి,

'లాలనుచు పాడరమ్మా ఈ బిడ్డ లక్ష్మీవిలాసుడమ్మా
పాదమున చక్రమమ్మా ఈ బిడ్డ వేదాంతవేద్యుడమ్మా
వేణునాదంబుతోను ఈ బిడ్డ వేదములు పాడునమ్మా' యని సంతోషముతోనుప్పొంగి పోవును. రామనామ మిష్టముగా నున్నచో కుమారుని రాముడుగా భావించి.

'రామ లాలీ మేఘశ్యామ లాలీ-తామరసనయన దశరథతనయ లాలీ' యనిలాలించును. శైవులయినవారు లేదా శంకరనామ మిష్టమున్నవారైనచో,

'లాలి శంకర సదా లాలితకుమారా, లాలి పటుతాండవోల్లాస ఘనధీరా
లాలి పంచాస్య కైలాస సంచారా, లాలి మధురాలాప లాలి గంభీరా
పతితపావన రుద్ర ఫణిరాజభూషా, జితకాలకూట వర్ణితభవ్యవేషా' యని

పాడుకొందురు. పుట్టిన శిశువు ఆడదైనచో,

'లాలి బంగరుబొమ్మ లాలి మాయమ్మ-లాలి ముద్దులగుమ్మ లాలి సీతమ్మ' యని లాలింతురు. ఇటులనే లక్ష్మీదేవి పేరుతో పార్వతీదేవి పేరుతో పాడుకొందురు. ఈ పాటలన్నియు సాధారణీకరణమున కుదాహరణములుగా గ్రహించవచ్చును

'జో రవికులశుభాంగ జో సన్నుతాంగ'
'లాలి శ్రీ రఘురామ లాలి రిపుభీమా'
'ఫాలలోచన వీరభద్రావతారా-కాలకాలగిరీశ కంధితూణీరా'
'లాలి గరుడతురంగ లాలి భవభంగా, లాలి సీతాసంగ లాలి వేదాంగా'
'శ్రీ విల్లిపుత్తూర నావిర్భవించీ, భావమలరగ తిరుప్పావు రచియించీ'
'లాలి మార్కండేయ లాలి మాయయ్యా' మున్నగు స్త్రీలపాటల సంపుటములందున్న పాటలన్నియు నిట్టివే. శ్రీ నేదునూరి గంగాధరంగారి 'సెలయేరు' లో లాలిపాటలు జోలపాటలు చాల గలవు. ప్రతి తల్లికి తన కుమారు డందముగా నగుపడును. 'కాకిపిల్ల కాకికి ముద్దు'ను సామెత యిట్టిదే. కురూపియైనను సరి; తల్లి మాత్రము తన కుమారుని,

'పాపాయి కన్నులు కలువ రేకుల్లు-పాపాయి జుంపాలు పట్టు కుచ్చుల్లు

1. అన్నమాచార్య చరిత్ర పీఠిక.

పాపాయి దంతాలు మంచి ముత్యాలు-పాపాయి చేతులు పొట్లకాయిల్లు

పాపాయి పలుకులు పంచదార చిలుకల్లు-పాపాయి చిన్నెలు బాలకృష్ణు వన్నె'లని యుప్పొంగి పోవును. తన కుమారుని కింట నీరుండుట ఏతల్లియు సహింపనేరదు.

'ఏడవకు ఏడవకు వెఱ్ఱి అబ్బాయి-ఏడిస్తె నీకండ్లు నీలాలు గారు

నీలాలు కారితే నే చూడలేను-పాలైన కారవే బంగారు కండ్లు' అని హృదయ తాపమును వెలార్చును. తన పాపకు 'అంగరక్ష ఆదిరక్ష దివ్యరక్ష దీపరక్ష, చిన్న నా అబ్బాయికి శ్రీరామరక్ష' యని వేడుకొనును. ఇతరబాలు రందరకన్న తన కుమారుడే గొప్పవాడని, మంచివాడని తల్లి యభిప్రాయము.

'వీధి నెందరు వున్న విసరదే గాలి, రచ్చ నెందరు వున్న రాదమ్మ వాన

చిన్ననా అబ్బాయి వీధి నిలుచుంటె, మొగిలి పువ్వుల గాలి ముత్యాల వాన'యనియు 'ఆడుకొని అబ్బాయి వచ్చె కాటోలు, అందెలా చప్పుళ్ళు పందిళ్ళలోన, చదువుకొని అబ్బాయి వచ్చె కాటోలు, సరస్వతీ చప్పుళ్ళు పందిళ్ళలోన'అనియు భాషించును. అందుకొనరాని ఆకాశమందలి చంద్రుని సైతము 'చందమామ రావె_జాబిల్లి రావె, కొండెక్కి రావె-కోటివేలు తేవె, బండెక్కి రావె - బంతిపూలు తేవె, తేరుమీద రావె - తేనెపట్టు తేవె... అన్నీని తేవె-అబ్బాయి కియ్యవే' యని పిలుచును.

లాలిజోలలందుండు కవిత్వమున కదియే సాటి. మనోహరమైన భావములు, లలితమగు పదబంధములు, సుకుమారమగు శయ్యను సంతరించుకొన్న ఈ లాలిపాటను గమనింపుడు.

అమ్మణ్ణి కన్నుల్లు తమ్మి పువ్వుల్లు, తమ్మిపువ్వులలోని కమ్మతేనెల్లు ||లాలీ||
చిన్నారి కళ్ళల్లొ కన్నీటి జల్లు, కన్నీరు చూపకే కరగు నెడదల్లు ||లాలీ||
చక్కని నాతల్లి గుక్కపట్టింది-చెక్కుటద్దాలలో చెదిరెనే సంజ ||లాలీ||
చల్లనీగాలి మా చంటి పాపాయి-వొళ్ళార్చి శ్రమదీర్చవోయి రవ్వంత ||లాలీ||
కిలకిలా నవ్వితే కలువల్లుపూసె-కలువపువ్వులేమొ కలికి చూపుల్లు ||లాలీ||
వియ్యమందేనంట వెయ్యారు లిచ్చి-మొయ్యగలవా చెప్పు ముత్తువాతల్లి ||లాలీ||

మరియొక పాటగూడ గమనింపదగినది.

'చిక్కుడు పువ్వెరుపు చిలకముక్కెరుపు-చిగురెరుపు చింతల్ల దోరపండెరుపు

రక్కిన పండెరుపు రాగిచెంబెరుపు-రాచవారిళ్ళలో మాణిక్య మెరుపు

తా యెరుపు అమ్మాయి తనవారిలోన'. ఈపాటలో చిక్కుడుపువ్వు తప్ప తక్కినవి ఎఱ్ఱగా నుండునట్టివే. చిలుక ముక్కుతో మైత్రి పొసగుటకు మాత్రము పాపము చిక్కుడుపువ్వుగూడ రంగు మార్చవలసివచ్చెను.

లాలిజోలపాట లెప్పటికప్పుడు పుట్టుచునే యున్నవి.

'లాలి లాలీలాలి లాలమ్మలాలి-లాలనుచు పాడరే బాల యేసునకూ' అను పాట ఆధునికమైయుండవలెను. హిందువులు రామకృష్ణుల పేరులతో పాడుకొనునట్లే క్రైస్తవులు 'ఏసు' పేరుతో పాడుకొందురు. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు రచించిన లాలిపాట యొకటి యత్యంత మధురమైనది శ్రీమతి లంక శ్యామలాంబగారు సేకరించి ప్రకటించినారు1. ఆరంభచరణములు 'శ్రీరమ్య దేహ లాలీ మాముద్దు చిన్నారికూన లాలీ, గారాలకూచి లాలీ మాయప్ప కంజాత నయన లాలీ' యని కలవు. ఇంగ్లీషులో లాలిజోల పాటలను 'లల్లబీ' లందురు. లాలి, లల్లబీలకున్న పదసామ్య మెట్టిదో? హిందీభాషలో వీనిని 'లోరియా' అందురు. 'బుందేలీ' మరియు 'గఢ్వాలీ' వంటి హిందీ మాండలిక భాషలందును వీని నాపేరుననే పిలిచెదరని శ్రీ దేవేంద్ర సత్యార్థిగారు వ్రాసియున్నారు2. బాలింతరాలికి పురుడువోయుట, బారసాల చేయుటవంటి యాచారములు (పుత్రోత్సవములు) మనకున్నట్లే ఔత్తరాహులకును గలవు. బారసాలనాడు శిశువును తొట్టెలో వైచి మనవారు పాటలు పాడెదరు. ఔత్తరాహులందు (మిథిలాప్రాంతమున) నీ పుత్రోత్సవసమయమున పాడునట్టి గీతములను 'సోహర్' గీతములందురు3. మన దేశముననున్న ఆర్థిక వ్యవస్థనుబట్టి కాబోలు అందరును స్త్రీసంతానమునకన్న పురుషసంతానమునే యాకాంక్షింతురు. స్త్రీసంతానము కలిగినచో 'సోహర్' వంటి వేడుకలు ఔత్తరాహులు చేయరు. మనవారుకూడ ఆడబిడ్డలను గని చింతింతురు.

'ఆముదాలు పండిన చేను చూడండి-ఆడవార్నిగన్న తల్లి నరసి చూడండి
మోదుగు పూసిన బీడు చూడండి-మొగవార్ని కన్నతల్లి మోజు చూడండి
ఆడవార్ని కన్నావు అమ్మకున్నావు-మగవార్ని కన్నావు మొక్కుకున్నావు
కొడుకు పుట్టాడంటె కొండ లెక్కుదురు-రంభకోడలు వస్తె రచ్చ కెక్కుదురు'4

వంటి జానపదుల భావము లందులకు సాక్ష్యములు.

లాలిజోలలకు సంబంధించిన పాటలధికముగా 'పాతపాట'లనుపుస్తకమున

1. గంగాజ్యోతి. డిసెంబరు. 1954
2. (धरती गाती है) ధర్తీగాతీహై. పుటలు 118-163
3. (मैथिली लोकगीत) మైథిలీ లోక్‌గీత్. శ్రీ రాకేశ్.
4. వెలయేరు. పుట 81.

గలవు. శ్రీ చేమకూర కామేశ్వరరావుగారి పుస్తకమున సుమారెనుబది పాటలు ప్రచురించియున్నారు. శ్రీ గంగాధరంగారి 'సెలయేరు'లో 25 పాటలున్నవి. తక్కిన ఏ పుస్తకములందును ఇన్ని పాటలు లేవు. జీవితమందలి మధుర ఘట్టములలో సంతానప్రాప్తి, వారిని గూర్చిన వేడుకలు కూడ ప్రముఖమైనవి కనుక, లోలిజోలలగూర్చి ఇంత దీర్ఘముగా చర్చింపవలసివచ్చినది.

స్త్రీజీవితమున వివాహ మత్యంతప్రధానఘట్టము. ఆ సమస్య నాధారముగా జేసికొని ఎన్నియో సంఘటనలు, వాని నాధారము చేసికొని మరికొన్ని ఆచార వ్యవహారములు, వాని నాధారము చేసికొని వేడుకలు వినోదములు, వానిఫలితముగా ననంతమైన సాహిత్యము-గేయము లుద్భవించినవి. వీని నన్నింటి గలిపి పెండ్లిపాట లనవచ్చును. ఈ పెండ్లి పాటలకు కొట్నములు నాందిగా అప్పగింతలు భరతవాక్యముగా గ్రహింపవచ్చును. ఈ నడుమ నెన్నియో సంఘటనలు, వానిగురించిన గేయములున్నవి. కొట్నములకు పూర్వము కూడ కొన్ని పాట లున్నవి. అసలు జీవితమంతయు కవిత్వమే. ఇచ్చటినుండి యిచ్చటి వరకను పరిమితియే లేదు. వియ్యము లందుకొనుటకు ఇరుపక్షములవారి యాకాంక్షలు కోరికలు బలాబలములు కూడ కవితావస్తువులు. పిల్లవైపువారు పిల్లవాని స్థితిగతులు విచారించుకొందురు. తమ పిల్ల కలిగిన కుటుంబమున చేరుట కంద రాకాంక్షింతురు.

'అల్లవూరివారు పిల్ల నడిగేరు, పిల్లవానికి రూపురేఖ లున్నాయి
ఏటేట పండేటి భూము లున్నాయి, ఊరి పొలిమేరలో తోట లున్నాయి
చుట్టు కొల్లారంపు1 మిద్దె లున్నాయి, కుట్టువానికి మంచి సేద్యమున్నాది
మన పిల్లకూ తగ్గ ఈడు జోడేను, కన్నె నిస్తామని కబురంపుదాము'

ఇది వధువువైపువారి యాకాంక్ష. వరునివైపువారికి గూడ నిట్టియాకాంక్ష లుండుట సహజము.

'శ్రీరామచింతల్ల పండు బండింది-చూచి రావే సీత కోసుకుందామే
బీరెల్లివారింట్ల కన్య పుట్టింది-చూచి రావే లక్ష్మి చేసుకుందామే
ఎన్నీల గాయంగ ఏరు పారంగ-ఏరు దాటొచ్చేది ఎవరాడిబిడ్డ
వచ్చనీ కుచ్చుల్ల పాలకీ నెక్కి-బల్లంబు చూడొచ్చె దుర్గయ్య లక్ష్మి
అన్నతో వియ్యంబు అందవచ్చింది-వదినెతో వరువాసుకు ఆడవచ్చింది

1. కొల్లారమనగా నడుమ బయలును నాలుగు ప్రక్కల కట్టడమునుగల యిల్లు.

పిడ్డ పుట్టించని చెప్పంపు అనసా-బిడ్డకూ సూనెయ్యి బుడ్లు పంపెదము
కొడుకు పుట్టిండని చెప్పంపు అనసా-కొడుకుకూ గొలుసుల్లు కంటె పంపేము'[1]

ఈ వియ్యములందు కూడ క్రొత్త సంబంధములకన్న మేనరికములే తెలుగు వారి కత్యంతప్రీతిపాత్రములు. మేనరిక మింత వ్యాప్తిగాంచుట తెలుగువారి ప్రత్యేకతగా చెప్పుకొనవచ్చును. తక్కినవారిలో నిట్టి సంబంధము తక్కువ. మన్వాదిధర్మశాస్త్రములు మేనరికమునకు సుముఖము కాకున్నను తెలుగు వారేలకో యీ సంబంధమునే యధికముగా నాకాంక్షింతురు. మేనరికపు కొట్లాటలచే శశిరేఖాభిమన్యుల వివాహము తెలుగువారి వివాహమైనది. మేనరిక ముండగా నితరులు సంబంధ మందుటకై వచ్చుటకు కూడ వెనుకముందాడెదరు. ధైర్యము చేసి వచ్చినను నలుగురు నవ్విపోదురు. నలుగురు నవ్వక యూరకున్నను పెద్దలు కాదందురు. పెద్దలు కాదన్న వినకున్నచో మేనవారు పిల్లవానినో పిల్లనో ఎత్తుకొనిపోయి పెండ్లి (రాక్షస వివాహము) చేసికొందురు. భారత కథలందు చర్చింపబడిన 'శశిరేఖా పరిణయ'మను పదమున నీ మేనరికము కొట్లాట విపులముగా వర్ణింపబడినది. ఒకపల్లెపాట (సెలయేరు)లో నీ మేనరిక మెంత చక్కగా వర్ణింపబడినదో గమనింపుడు.

'తోటకు కాచారు దొంగ లిద్దరు-తొలకరి స్తే పూలు కోసేద్దామని
అబ్బాయి కాచేడు మామయ్యయిల్లు-కానకుండా పుస్తె కట్టేద్దామని
తెలియకుండ తలంబ్రాలు పోసేద్దామని
దూరాన పులి జంపి దారులే జోసి (కాచి)-దండిగా మేనత్త కొడుకు వచ్చాడు
పందిట్లో పులి జూచి పగడసాలలాడి-భార్యగల మేనత్త కొడుకు వచ్చాడు
పుట్ట చాటున పులిజంపి పులిజూదమాడి-పుణ్యముగల మేనత్త కొడుకు వచ్చాడు
వాకిట్లో పులిజంపి వసంతమాడి-వాసిగల మేనత్త కొడుకు వచ్చాడు
చెరువు కట్టలమీద కొంగల్ని జూచి-చెఱువు చేపలన్ని చెల్లాటలాడె
మంద కట్టలమీద అన్నల్ని (బావల్ని) జూచి-మచ్చికలు చేసేరు మామ కూతుళ్ళు
ఏనుగను ఎక్కేవు ఎలచిన్నవాడ-ఏయత్త కడిగింది ముద్దుపాదాలు
వరసకు అవుతాడు మేనత్త కొడుకు-వరసకు వేసేడు వరహాలపేరు
నవ్వులకు వేసేడు పువ్వులదండ-సరసముకు వేసేడు సన్నగుళ్ళపేరు'

ఇక పెండ్లికి సంబంధించిన పాటలు పెక్కువిధములు. కల్యాణపాటలు, గంధంపాటలు, కొట్నాల పాటలు. తలుపు దగ్గరపాటలు, బంతులాట పాటలు. బువ్వము పాటలు, వధూవరుల పాటలు, అలుకపాటలు, ముఖము కడుగుపాటలు,

1. ఈ పాటను కరీంనగరం మండలమున సేకరించితిని. 1953.

కట్నాల పాటలు, పతిభక్తిపాటలు, మిధునవిడెముల పాటలు, అవిరేణి పాటలు, అప్పగింతల పాటల వంటివిగాక ప్రతి చిన్నవిషయమునకు అనగా పసుపునకు, తిలకమునకు, తలంటులకు, ఊయెలకు, వసంతములాటకు, పానుపుకు, కూడ పాటలు పాడెదరు. గాంధర్వవివాహములు ప్రబలమై పోవుచున్న ఈ దినములం దిట్టి పాటలు పాడుట కవకాశమే యుండదు. ఆ పాటలు పాడెడువారు కూడ లేకుండ పోవుచున్నారు. తెన్నేటి తిరుమలదాసుగారిట్టి పాట లనేకము 'వేడుక పెండ్లి పాట' లందు కూర్చినారు. స్త్రీల పాటల సంపుటములందును, కణ్ణా అచ్చయ్య ప్రకటించిన 'స్త్రీజనానంద నవీన కల్యాణపాట'లందును, కొండపల్లి వీరవెంకయ్య 'కల్యాణపాట' లందును గంగాధరంగారి 'సెలయేరు'నందును, గూడూరి కోటేశ్వరరావుగారి 'మహిళామనోరంజని'యందును, ఇట్టిపాటలెన్నియో కలవు. ఎందరెందరు జానపదరచయిత లీగేయములను వ్రాసిరో చెప్పతరము కాదు. ఒక్క తలుపుదగ్గర పాటలను వ్రాసినవారిని గూర్చియే కృష్ణశ్రీగా రిట్లు వ్రాసియున్నారు. 'వీటి చివర కనబడే సత్యవోలు సుందరకవి, వెంకటరాయుడు, నాగభూషణ, చూడమ్మ, చామేంద్ర, వీపూరి, పామర్తి బసవాచార్యులు, శేషాచలదాసు, ఛత్రపురీశ, సుధగిరివాస, సుబ్రహ్మణ్యదాస, వాగిరి కొండ గోపాల, యేనుగుల మహల్‌వాస, పాలుట్లలక్ష్మణ, వంగలకృష్ణయ్య, యేలూరి దాస, రేపూడి పిచ్చయ్య, తుళ్ళూరి ఆనందరావు, నాదెండ్ల రామచంద్రుడు, అచ్చమాంబిక, వెంకటదాస, పుసులూరి వెంకటసుబ్బరాయ, రావూరి శేష, అన్నమకిటములనుబట్టి వీటిని రచించిన కవులపేర్లు తెలుస్తున్నాయి'1. ఈవ్యాస మందే వారిట్టి తలుపుదగ్గరి పాటలకు తమిళమందలి 'కదవు తెరక్కపాట'లాధార మనినారు. కనుక నింతకు పూర్వము పేర్కొన్న తీరుతీరుపాట లెందఱు వ్రాసిరో! పెండ్లిపాటలం దధికముగా రాముడు, కృష్ణుడు, శివుడు, సీత, రుక్మిణి, గౌరి వంటివారు కాననగుదురు. ఒక్క వియ్యాలవారి వరుస (హాస్యపు) పాటలందు దప్ప తక్కిన పాటలందన్నింటను స్త్రీపురుషదైవతములు వత్తురు. నిజముగా నీపాట లాయాదేవతలకు సంబంధించినవి కావు. మనవంటి సాధారణులకు సంబంధించినవే.

వివాహమున నాందీకార్యములందు కొట్నములు దంచుటొకటి. కొట్నము పాట లధికముగా ముద్రింపబడలేదు. అన్నిటికన్న నధికప్రచారమందిన గేయమిది.

---

1. భారతి. జయ ఆషాఢము; జూలై 1954.

'సువ్వి సువ్వి రామచంద్ర- సువ్వి సువ్వి కీర్తిసాంద్ర
సువ్వి సీతమ్మ మాకు-శుభము లిమ్మా
మోదమునను పెండ్లిపీట-మీద శ్రీరాము సరస
ఆదిలక్ష్మైన సీ-తమ్మ నునిచిరీ
వాటమైన కుందనంపు-మేటి కుందెనందు నిల్పి
గాటమైన పసిడి రో-కళ్ళు పట్టుకొ
రాజనములు యిప్పపువ్వు-రాజనములు మంచిపునుగు
రాజనములు సన్నజీలుగు-రాజనములునూ
.... .... .... ....
కుందెనందు నిండ నించి-కొట్నములు దంచిరిపుడు
కుందరదన లెంతో వింత-కులుకుచుండగా'

కొట్నముల పాటలన్నియు సాధారణముగా నీతీరుగనే త్రిశ్రగతిలో నడచును.

'రాముల చూడ రారమ్మ, రఘువంశాబ్ధి సోముని పెండ్లి నేడమ్మ'
'సీతా కల్యాణమహోత్సవ సమయము చూతాము రారే చెలీ'
'లక్ష్మీకల్యాణవైభోగమే, రామాకళ్యాణవైభోగమే'
'రుక్మిణీ కృష్ణుల కల్యాణమూ, వారిజాక్షులార చూడరారే'

'శ్రీపార్వతీశంకరుల కల్యాణము, సేవించరే వేడుకొ'యనునవి సాధారణమైన పెండ్లిపాటలు. వీనిలో వివాహవర్ణనము, వధూవరుల వర్ణనము, వివాహ మంటపము మున్నగువాని వర్ణనముండును.

'నలుగిడ రారే నలినాక్షులార, నలిననాభునకు నవమోహనాంగునకు'
'నలుగుకు రారా నీవు నవనీతచోరా, వేగ రారా దేవ వేణుగోపాలా'
'జలజోద్భవశైలా నలుగిడె చాల, నలుగూకు ఈవేళ నలుగందుకోవే'
'శ్రీరామ జయజయా, శ్రీరామ సీతాపతి రామా'
'భామలారా దంపతులకు, బాగుగ నలుగిడరే'

నలుగిడెదను వేగ నందివాహన రార, చలమేల తిగదూరసఖినేల రార'యను నలుగు పాటలందు నలుగుల వర్ణనముండును. 'అత్తరులోన మేలిమత్తరులోన అంబరు గూర్పి, క్రొత్త సంపంగితో గోవిందునకు'నలుగు పూయుట ఇందుండు వస్తువు. తరువాత తలంటులు.

'శ్రీ గౌరీనాథునకు శీతాంశుధరునకు, ఆగమవేద్యునకు మీరంటుడీ తలను ॥శ్రీ॥
కరిపద్మములయందు కంకణంబులు మెరయ, అరమేనిసామికి మీరంటుడీ తలను ॥శ్రీ॥
నందివాహనునకు నాగకంకణునకు, అందముతోడి మీరంటుడీ తలను ॥శ్రీ॥
గంగోత్తమాంగునకు జంగమ మహేశునకు, అంగనామణులార మీరంటుడీ తలను ॥శ్రీ॥
ప్రమథాధిదేవునకు ఫాలలోచనునకు, అమరసన్నుతులార మీరంటూడి తలను ॥శ్రీ॥

శృంగారాకారునకు శ్రీ సిద్దరామునకు, అమరసన్నుతులార మీరంటూడీ తలను ||శ్రీ|
బసవలింగేశునకు నసుకింటివాసునకు, అసమలోచనలార మీరంటూడి తలనూ ||శ్రీ||

అని ఈ విధముగా తలంబుటకును 'తిలకము దిద్దరే పెండ్లి తిలకము తీర్చరే, కలకలలాడేటి ఎలనవ్వు మొగమున' అని తిలకమునకును 'పసుపు పుయ్య రాదటే భామా శ్రీకృష్ణునకు' 'గంధం పొడి చల్లి రిటు గౌరీశంకరుల్, అందాముగా సుందారులు ఆనందమున వేగ' అని పసుపుగంధము లలదుటకును 'బంతు లాడీరీ బాలకృష్ణులు మరి వింతగా చేమంతి పూలబంతి చేబట్టి' అని బంతు లాడించుటకును 'దివ్యాంబరములు గట్టి దీపాల వెలుగున, నవ్వుచు మహాలక్ష్మి నాట్యమాడా, ఇలువేల్పు నీవు వెలసితివి మాయింట, అందముతో నీవు అవిరేణిలో నిల్చి, తప్పులు యెంచక దయను జూచి, ఎప్పుడు నీపాదసేవ జేసే మమ్మ, గొప్పగా దయజూచి కోరికలు తీర్చు లక్ష్మి' యని యవిరేణుల పూజించుటకును పాటలు పాడెదరు.

బ్రాహ్మణేతరు లందరిలోను అవిరేణుల పూజించుట కలదు. లగ్నమునకు పూర్వమే యవిరేణుల నిల్పెదరు. ఇది లక్ష్మీపూజ; వధూవరులకు శుభము ఆశించి చేయునట్టిది. కుమ్మరి రెండు క్రొత్త పెద్ద కుండలను అలంకరించును. కుండలపై నుండు చిత్రములం దొకొక్కప్పుడు పల్లకీపై నెక్కిన వధూవరులు గూడ చిత్రింపబడుదురు. పత్రములు ఫలములు పుష్పములు చిత్రింపబడును. లగ్నమునకు పూర్వము పురోహితునితో వధూగృహమునుండి కొందరు పోయి కుమ్మరికి కావలసినది యిచ్చి అవిరేణుల దెచ్చుకొందురు. మధ్యన నిరువురు వానిని మోయుచుండగా నాలుగు ప్రక్కల నలుగురుండి అవిరేణులకు క్రొత్త గుడ్డతో నీడను పట్టెదరు. ఇంటికి తెచ్చి వాని నొకచోట ధాన్యముపై నిలిపి లక్ష్మీదేవి నావాహన చేయుదురు. నాకబలిసమయమున నీ యవిరేణుల నాకబలి ప్రోలున కెదురుగా నుంచెదరు. అవిరేణులకు సంబంధించిన మరియొక పాట.

సిరిగజ్జెలను గట్టి శ్రీమహాలక్ష్మి మాతల్లి-చిందులుద్రొక్కుచు స్థిరముగాను
యేక చిత్తంబున యెప్పుడు మాయింట-పాయక భక్తితో నుండువమ్మ
కనక గద్దెమీద కదలక కూర్చుండి-అడిగినప్పుడు మాకు అభయ మిచ్చి
కోరిన కోరికలు కొనసాగింతువని-బలువయిన పట్టునే పడితినమ్మ
ఆభరణములు దెచ్చి అలంకరించి నీకు-పసిడి గొలుసులు తీర్చి బాగుగా వేసి
గంటలొడ్డాణంబు కన్నతల్లికి పెడుదు-కన్నబిడ్డలనుచు కరుణించు తల్లీ
అందముతో నీవు అవిరేణిలో నిల్చి-తప్పులు యెంచక దయను జూచి
ఎప్పుడు నీపాద సేవజేసే మమ్మ-గొప్పగా దయజూచి కోరికలు దీర్చు లక్ష్మి.

వియ్యాలవా రొకరొకరిని, వధూవరులను, బంధువులు మున్నగువారిని వెక్కిరించుచు గేలిసేయు పాటలు పెక్కులున్నవి. వీనిలో కొన్నింట సున్నితము గను మరికొన్నింట మోటుగను హాస్యముండును. ఇంతవరకు చెప్పినవి వేడుకలు. ఈ హాస్యపుపాటలు వినోదములు.

పల్లవి. ఎక్కడ దొరికినాడమ్మా ఈ పెళ్ళికొడుకు ||ఎ|
అద్దెడు మానెడు పోసినాము, అరిసెలైన వండినాము
అంగుడైన జూవదాయె-అరమొగము పెళ్ళి కొడుకు ||ఎ||
అయిదు వేలు పోసినాము, అత్తరుపన్నీరు దెచ్చినాము
చల్లుకోవటం చేతగాదు చవటమొగం పెళ్ళికొడుకు ||ఎ||

ఈ పాటయందలి దెప్పిపొడుపు చివరకు,

'లక్షవేలు పోసినాము, లక్ష్మివంటి బాల నిచ్చినాము
ఏలుకోవటం చేతగాదు, బేలమొగము పెళ్ళికొడు'కనువరకు పోయినది.

వధువును వెక్కిరించుట,

ఇంతా పెంకెతనమేల చెలియా- నీయంతరంగమంత తెలిసె లలనా ||ఇ||
నల్లచాయి మెల్లకన్నుదాన చెలియా-నీ చొట్ట బుగ్గ మిట్ట నొసలుగా ||ఇ||
బొంగ కారు నోరుదాన చెలియా-నీ తట్ట తలయు చొట్ట కాలుగా ||ఇ||

ఈ వెక్కిరింపులు వధూవరులతో పోవు. వియ్యాలవారు కూడ ఒకరి నొకరు ఏడిపించుకొందురు.

'వెలదిరో ఈ వియ్యపువారిది ఎరుకలి కులమమ్మ వీరిది ఏనాది కులమమ్మ
ఎరిగి ఎరిగి వీరితోను వియ్యమందితిమి
తట్టలు బుట్ట లల్లునమ్మ తాను పెదబావగారు
వెలదిరో మారెండో బావ వెలకూర్చునమ్మా' యని ఒక రనిన

'మన కెక్కడ దొరికినారే-బల్ టక్కరు లబ్బబ్బా తగనీ వియ్యాలవారు
మాటలు బహు తేట మన్ననలా ఝూట, బైట డంబమెకాని పైసా లేదు
ఎన్నో ఆభరణములు కన్య కిడుదుమని, సున్నాజుట్టిరి గద చోద్యామొందగ'

అని మరొక పక్షమువా రందురు. ఒకవియ్యపురాలిని వెక్కిరించు పాట.

'వంటైన వండగలరా వదినా మీరు-నాకు వంటంటె వళ్ళంత నొప్పాదమ్మా
సంతకైన వెళ్ళగలరా వదినా మీరు-నాకు సంతంటె సంతోష మొస్తాదమ్మా

ఇది 'వింతైన పండుగలబా పిల్లా నీవు' 'కట్టెలు దేరా శిష్యా' యున్నగు హాస్య పాటల కనుసరణముపై నున్నది. ఇక భోజనములందుకూడ ఒక పక్షము వారేమి యడిగిన పెట్టరని దెప్పిపొడువ నింకొక పక్షమువా రెంత పెట్టినను చాలుట లేదు, ఎద్దుల మేతయని దెప్పిపొడుతురు. తలుపుదగ్గరపాటల పేరుతో అక్కాతమ్మునకు, అన్నచెల్లెలికి, భార్యాభర్తలకు జరిగెడు సంవాదము లత్యద్భుతములు. వధూవరులం దొకరి పేరు మరొకరితో చెప్పించుట, ముందు ముందు బిడ్డలు పుట్టినచో తమ కుమారులకే మేనరికము స్థిరపరచుకొనుటకై అక్కలు చెల్లెండ్రు ప్రయత్నించుటలు సంవాదరూపముగా నీ తలుపుదగ్గర పాటలైనవి. వీనియందుగూడ రాముడు కృష్ణుడువంటి పాత్రము లుండును. ఇట్టి సంవాదములు వందలకొలది ముద్రింపబడినవి. ఈ పాటలు, పున్నాగ వరాళి, నాదనామక్రియ, పంతువరాళి, కేదారగౌళాదిరాగములం దుండును. అవతారమూర్తుల పేర్లు లేకుండ కేవలము సాధారణముగా నున్న అక్క మరియు తమ్ముని సంవాదమును గమనింపుడు.

తమ్ముడు: శ్రీగిరిజేశు కరుణ చెలగి పెళ్ళాడి వస్తి, తలుపుదియ్యి మక్కా నాకు తడవాయె వచ్చి
అక్క: శ్రీగిరిజేశు కృపను చెలగి పెళ్ళాడి వస్తె, తలుపెట్లా దీతు తమ్ముడ తగవు లుండంగ
తమ్ముడు: పట్టు చీరెయు రవికె పసుపు కుంకుమ లిస్తు
అక్క: పట్టు చీరెయు రవికె పసుపు కుంకుమ లొల్ల' అని ఈ విధముగా చేతికి చేకట్లు, చెంగల్వదండలు, ముక్కునకు ముంగర, ముత్యాల కమ్మలు, కాళ్లకు కడియాలు, కలవెండి మట్టెలు, కూర్చుండ కుర్చీలు, కుందనపు పాందాను, పట్టెమంచము పరుపు బాలీసు దెక్కెలు, ఎక్కుట కేనుగు, ఏలుటకు రాజ్యము, అడిగిన కట్నము లన్నియు నిత్తునని తమ్ముడనును కాని అక్కగారు మాత్రము,

'అడిగిన కట్నాలన్ని అలాగే యిస్తువు గాని
తమ్ముడూ నీబిడ్డ నిచ్చి అరణ మివ్వరా' యనును. అప్పుడు తమ్ముడు

'అందులకు పెత్తనము ఆడదానిదే కాని
అక్కా మీ మరదలు నడుగు అదేమి చెపుతుందో' యనును. పెండ్లి యనుట తోడనే బాధ్యతగల విషయము లాలుమగలు పంచుకొని గాని వ్యవహరింపరు గదా. ఇద్దరు కలియబలుకుకొని సమాధానమిచ్చినగాని అక్కగారు తలుపు తీయదు. వినోదముతో పాటు బాంధవ్యమందలి ప్రేమ, మమకారముల సూత్రములు వివాహకాలమునుండియే ప్రవృద్ధమగునని యీ గేయము తెలుపుచున్నది.

బ్రాహ్మణేతరులందు ప్రత్తివిత్తులు నాటుట యనునది యొకయాచారము. నాకబలి ముగిసిన తరువాత వధూవరులతో కూరాటి కుండలముందు ప్రత్తి విత్తులు నాటించెదరు. అప్పుడు పాడునట్టిదీ పాట1

పన్నెండున్నర్ంగాల పందిరి క్రింద, ప్రత్తివిత్తులగుమ్మె మెత్తైన దీసి
గోవు పెంట దెచ్చి గోరెంట కలిపి, ఆవు పెంట దెచ్చి అలుకైనా జల్లి
పెంచిన తక్కెట్ల పైపైడి బాటు, జోకిరి అన్నల్లు జోడు పండ్లు
జోకిరీ అన్నల్లు జోడు తక్కెట్ల నల్లని విత్తులు తెల్లబడ రాకి
తెల్లన్ని విత్తులూ పచ్చబడ రాకి, పచ్చని విత్తులు ఎఱ్ఱబడ రాకి
శ్రీరాముడు దున్నంగ సీత చాలేసు, రఘురాము దున్నంగ రంభ చాలేసు
ముత్తైద కెత్తిరీ మూడు తక్కెళ్ళు, ఐదూవ కెత్తిరీ ఐదు తక్కెళ్ళు
బాలెంత కెత్తిరీ పాది తకెళ్ళు,
ముత్తైద వేసిన మూడు రోజులకు, ములుకాయి ముల్లోలె మొలకేరుపడెను
ఐదువ వేసిన ఐదురోజులకు, అల్లియుపువ్వోలె ఆకేరుపడెను
బాలింతవేసిన పాదిరోజులకు, పల్లెపగామోలె పత్తేరుపడెను
బిడ్డ నిస్తావన్న పెద్ద నిస్తావా-పెద్దనెమిచ్చేను బిడ్డ నిచ్చేనూ
నీమాట నామాట ఒక్కటేగాని-అలితో ఒకమాట అనిపించవన్నా
తమ్ములపాకోలె తల వంచుకోని-ఇస్తానని పలుకవే ఇయ్యంపురాల
నీకూను నాకూను ఎవ్వరూ సాక్షి-బాసింగం గట్టిన బ్రాహ్మడే సాక్షి
పెండ్లికి వచ్చినా పెద్దలే సాక్షి' - రానున్న తరమున కిప్పటినుండియే మేనరికములు సంసిద్ధపరచుకొనుట యిది.

పెండ్లిలో చివరఘట్టము అప్పగింతలు. కని చిన్నప్పటినుండి పెంచి పెద్దచేసిన బిడ్డను ఇతరుల చేతులం దుంచునప్పుడు—ఒక వంశమునుండి మరి యొక వంశమున కప్పగించునప్పుడు – ఎంత కఠినాత్ములకైనను కన్నుల నీరు నిండును. స్త్రీసంతానమును గన్న దలితండ్రుల భార మొకటి తీరినను అప్పగింతల సమయమున వారికి కలిగెడు దుఃఖ మింతంతగాదు. శకుంతలను సాగనంపు నప్పుడు శమదమాదిగుణసంపన్నుడగు కణ్వమహామునియే సా ఋనయము డయ్యెనన మనవంటి సాధారణమానవుల (అందులో ప్రాకృతుల) పరిస్థితి యెట్లుండునో వేరే చెప్పవలయునా? బాష్పరుద్ధకంఠముతో కాశ్యపుడు శకుంతలను సాగనంపునప్పుడు 'శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీవృత్తిం సపత్నీజనే'2

1. దీనిని మడికొండలో సేకరించితిని 1952.

2. అభిజ్ఞాన శాకుంతలము. (4-17)

యని బుద్ధులు గరపిన ఘట్టము శిష్టసాహిత్యమున కలంకారము. శృంగార శాకుంతలమున నీ యప్పగింతల ఘట్టము మఱికొంత పెఱిగినది. మాదయగారి మల్లన రాజశేఖరచరిత్రము మున్నగువానిలో గూడ నిట్టి చక్కని యుదాహరణములు పెక్కు లభించును. సీతమ్మను సాగనంపుచు బుద్ధులు చెప్పినటుల జానపదు లప్పగింతల సమయమున పాడుకొందురు.

'నెలవిచ్చి మాయమ్మ నెలవిచ్చినాము-చెలగి మీ అత్తింట్ల బుద్ధి గలిగుండు
ఎవ్వరేమాడిన ఎదురాడకమ్మ-వీధిలో నిలుచుండి కిలకిలిప్పకమ్మా
పలుమారు పలుదెరచి నవ్వబోకమ్మా-పరమాత్మతోగూడి మెలుగు మాయమ్మా
వార్నిగాదని పూలు ముడువబోకమ్మా-పెద్దల గుర్తెరిగి నడువు మాయమ్మా
ఆకలి వుంటేను అడుగబోకమ్మా-అత్తగారితో పోరు చేయబోకమ్మా
నాతోటి జేసిన మంకుపోరెల్ల-ఎరుగని అత్తింట్లొ చేయబోకమ్మా' ఈ హితోక్తులు

భారతస్త్రీకి పరమశిరోధార్యములు. 'అరటాకువంటిది ఆడ జన్మంబు'! కనుక క్రొత్త యింటికి పోవు తమబిడ్డల కిన్ని బుద్ధులు చెప్పుట తలిదండ్రులు విధిగా భావింతురు. వధువుచేతిని పాలలో ముంచి అత్త (మామల)చేతిలో బెట్టి,

'ఈబాల యెరుగదు ఏమియునైన-మీ బాలలో నొక బాలగా చూడు
బొమ్మరిండ్లని యాడు బుద్ధెరుగదమ్మా-మెల్లగా నేర్పుతో పని నేర్పవమ్మా
ఆకలెరిగి అన్నంబు పెట్టినదాక-అడుగనేరదు నీవు అడిగి పెట్టమ్మా
కోడలు మీ సొమ్ము కొడుకు మీ సొమ్ము-ఆడువారిని గన్న అలుసింతెనమ్మా
సిరివంటి కోడలు మరుడంటి కొడుకు-మగువరో సౌభాగ్యమహిమమేమమ్మా', అని

పాడుట పరిపాటి.

'బాలా పన్నెండేండ్ల బాలసుమ్మి మన సీత పన్నెండేండ్ల లేత సుమ్మీ'
'అయ్యా ఈ బాలను చేకొనుమయ్యా దయతోడను'
'అమ్మారో మీయత్తా-వారింటి కనిపి-సమ్మాలి యెట్లుందు నిమ్మళంబుగను'
'సుకుమారి నెటుజూతువో ఇది సుమశరు చేతి ప్రసూనపు హేతీ'
'చెలియ నిన్నంపెదమే-చేరి సుఖమొందుమిక-చిలుకలకొలికి ధవుడు చెప్పినట్టు
నడుచుకొమ్మా' యను పాటలన్నియు నిట్టివే.

వివాహసమయమందలి సన్నివేశములను సమగ్రముగా వర్ణించు పాటలు కొన్ని పౌరాణికగేయములందు చర్చించియుంటిమి. సీతాకల్యాణము, సుభద్రా కల్యాణము, శశిరేఖ పెండ్లిపాట, శాంతకల్యాణము పాటలందలి వేడుకలు వినోదము లన్నియును కలవు. వారి పేరుతో జానపదుల భావము లీయాకారమును దాల్చినవి

పెండ్లియైన తరువాత నవవధు వత్తవారింట జేరి అత్తమామలతో బావ మరదులతో, భర్తతో, తోడికోడండ్రతో, ఇరుగుపొరుగువారితో సఖ్యముగా ఉన్నయెడల నామెకున్న సౌఖ్యము స్వర్గమునగూడ నుండదు. గృహజీవనమున ట్టి సామరస్యముగల ఇల్లాలు సీతాసాధ్వి. ఆమెపైగల యభిమానము జానపదుల వేలము. రామాయణసంబధముగల గేయములనుగూర్చి చర్చించినప్పుడు త పేరుతో జానపదులు సృష్టించుకొన్న పాటల నుట్టంకించి యుంటిని. జముగా నాగేయములన్నింటికి రామాయణముతో నెట్టి సంబంధము లేదు. మన త్యజీవితమందలి — గృహజీవితమందలి — సంఘటనలే సీతమ్మ పేరుతో వతరించినవి. సీత నత్తవారింటికంపుట, సీత సమర్త, సీతగడియ, సీతామ్మ వారి అలుక, సీతామ్మవారి వసంతం, సీత శుభగోష్ఠి, సీత దాగిలిమూతలు. సీతాదేవి వామనగుంటలాడుపాట, సీతాదేవి వేవిళ్ళు మున్నగు పాటలన్నియు నీ శ్రేణికి చెందినట్టివే. భాగవతపరముగానున్న రుక్మిణీదేవి సీమంతము, భారత పరముగానున్న సుభద్రసారె పాటలుగూడ గృహజీవనమునకు సంబంధించి నట్టివే. సాధారణీకరణలక్షణము వీనికన్నింటికి సమన్వయపరచినచో వాని యందున్న విషయమంతయు మన గృహజీవనమునకు సంబంధించినదే యగును. ఈ పాటలన్నిటినిగాని వానియందున్న విషయము లన్నింటినిగాని చర్చించుట కిట తావులేకున్నను ముఖ్యమగువాని కొన్నింటిని పేర్కొనక తప్పదు.

'సీత నత్త వారింటికిపంపుట' యను పాటలో జనకుడు సీతమ్మకు గరపిన బుద్ధులు గమనింపుడు.

'నెలతరో కన్నకూతురువు గనుక నేనొక బుద్ధెరిగిస్తు
వినుమా నాథుని ముంగట నెన్నడు పకపక నవ్వకుమీ
సుందరి నాథునికన్నా ముందర మేల్కొనుమీ
పలుకకు నిందించకుమీ కలనైనా పంకజాక్షి సీతా
చెలువుడు ప్రాణేశ్వరుడూ పిలువక రాయబోకుమీ పనులూ
పిలిచిన వేళనె పలుకుచుండుమీ కలకంఠిరో నీవు
అత్త మామకు జనులకు భక్తిగ సేవలు సేయుమీ
హెచ్చుగ వదినె మరదళ్ళలో మెచ్చుగ దిరగకుమీ
ఆకగ బిలచినవార్ని యెప్పుడు ఆశ లెరిగి కాపాడూ
నీ పరివార్ని హాస్యము శాయకు' మని జనకుడు బోధించినది మనకును వర్తించును.

'సీతసమర్త' యను పాటలో సీత సమర్తయైన వార్త నామెచెలులు కౌసల్య

కందించగనే యామె వచ్చి సీతమ్మను చీర చూపుమని యడుగును. సీత, 'అత్తడిగిన భయమునను బిత్తరించినవ్వేళ, ముద్దియ శిరసటు వంచుక కొద్దిగ చీరటు చూపినది'. నయము, భయము, సిగ్గు మూర్తీభవించిన కోడండ్ర ప స్థితి, ప్రేమ, యధికారము, ఆదరము గల యత్తల సన్నిధి నిప్పటికిని మన యిండ్లయం దీవిధముగనే యుండును. సీత సమర్తకాలమున జరిగిన అచ్చటలు ముచ్చట లన్నియు మన యిండ్లలో జరుగునట్టివే.

'సీతగడియ' యను పాట మనోజ్ఞమగు జానపదగేయము. అత్తింటి కోడలు అందులో బాధ్యతగల పెద్దకోడలు, క్రొత్తగా కాపురమునకు వచ్చిన కోడలి-పరస్థితి ఇందులో నున్నది. ఇంటిపనులన్నియు సరిచూచునప్పటికే ప్రొద్దు పోయినది. పనులన్ని ముగించుకొని, 'అత్తకౌసల్యకు అడుగులు పత్తి-మామ దశరథులకు మడతలంపిచ్చి-సుమిత్ర కైకకు సురటీలు వేసి' తానలంకరించుకొని, 'పండ్లు పలహారములు పళ్లెమందుంచి-బంగారు కలశముతో ఉదకంబు బట్టి' శయ్యాగృహము చేరుకొనునప్పటి కర్ధరాత్రమైనది. క్రొత్త కాపురముగదా! రాము డెంత సేపు ఓపికతో నుండగలడు! చూచిచూచి విసిగి రాముడు కోపముతో శయ్యాగృహపు తలుపుగడియ వేసెను. సీతమ్మ వచ్చి ఎంత బతిమాలినను రాముడు తలుపు తీయడయ్యెను.

'నిలుచుండి పాదాలు చేతులూ నొచ్చె-దంతంపు తలుపులూ తీయవోయి నాథ
వొంటొంటి చినుకుకే వొకచెంగు దడిసె-కాముడా తీయవోయి కనకంపు గడియ
పటపటా చినుకుకు పైకొంగు దడిసె-పచ్చల బాలుడా తీయవోయి తలుపు
నాలుగో జామాయె నా ప్రాణనాథ-రత్నహారంబిస్తు తీయవోయి గడియ
కటిణించి తీస్తివా కాళ్లకడ నైన-మంచి వక నిద్రైన శరణంది పోదు' నని

బతిమాలుకొనగా రాముడు మరింత బిగిసి,

'నిద్ర నీకు లేకుంటె నాకేమి సీత-గంటవలె దీపంబు అది నాకు తోడు
నీవు నిలుచుంటేను నాకేమి సీత-పువ్వులు బుక్కాయు అవి నాకు తోడు
నీవు నిలుచుంటేను నాకేమి సీత-పట్టెమంచము పరపు అది నాకు తోడు'

అని బదులు పల్కెను. చివరకు కౌసల్య వచ్చి రాముని మందలించి తలుపు తీయించినది. క్రొత్తకాపురము దినములందు దంపతుల పరిస్థితి లోకమున నిట్టిదే. పాపమా రామచంద్రునికి సీతమ్మకును దీని నంటగట్టి మనవారు హృదయ భారమును వెలార్చుకొనిరేగాని వేరేమియు లేదు.

'సీతమ్మవారి వసంత'మను పాటలో కొడుకు కోడండ్ర సుఖమును కన్నులారా జూడగోరు పితృహృదయము మనకు కన్నులగట్టును. సీతారాములు వసంత మాడినది దశరథుడు చూడలేదు. అతడప్పుడు కార్యాంతరమగ్నుడు. వారు వసంత మాడుకొన్న వార్త విని, 'వేడుక జూచుటకు నే నోచనైతి - పాపపు నేత్రములు పరమాత్మ డిచ్చె'నని పరితాపమును. వేదనను అనుభవించి తానా వేడుకలు చూడదలచి. వసంతములు సిద్ధము చేయించి, సీతారాములు మరల వసంతము లాడునట్లేర్పాటు గావించి. రహస్యముగా తాను కౌసల్యాదికాంతల గూడి. 'స్తంభాల మరుగున తొంగి చూచె'నట. వయసువచ్చిన కొడుకు కోడండ్ర వినోదములు సంతోషకార్యములు తలిదండ్రులకు కన్నులపండుగ కదా! ఈ సీతారాముల వినోదముకూడ మన జీవితమందలి యొక మధురానుభూతియే

'సీతాదేవి వామనగుంటలాడు పాట'లో లోకానుభవము, భక్తి, చాకచక్యము గల కోడలు చిత్రింపబడినది. సీతారాములు వామనగుంటలాడిరి. రాము డోడి పోయెను. ఓడినవాడు. 'నేను గెలచినా ఓడినా నీ సొమ్ముగాద టే నీవు గెలిచితే నా సొమ్ముకాద టే' యని తానోడినందులకు బంగారు బటువులు, ముప్పదివేల పతకము, మామగారు నాకబలినా డిచ్చిన యుంగరము సమర్పించుకొని 'పదకటింటిలోని పదిలక్షలు చేయు పానువున్నది పుచ్చుకొమ్మ'ని గడుసుగా పలికెను. సీతమ్మ అంతఃపురమునకు పోయెను. అచ్చట కౌసల్య ఆటలో నెవరు గెలిచితిరని యడుగ భయము భక్తిగల కోడలు గనుక సీతమ్మ తానే గెల్చినను "మీ కొడుకు గడుసు గనుక డిబ్బి తీసెనూ" అని యబద్ధములాడి రాముడే గెలిచె ననెను. అక్కడి సంగతి యంతటితో సరిపోయినది. ఇక తోడికోడండ్రడుగగా 'బావలోడి పదివేల కట్నా లిచ్చినా' రని బదులు పల్కినది. ఇచట నిజము చెప్పినది. ఇచ్చట నిజముగా తానోడిపోయినను సీతమ్మ గెల్చితినని చెప్పెడిదే. ఏలయన తోడికోడండ్ర చెంగట స్త్రీలు తమ పరాభవ మంగీకరింపరు గనుక. ఇట్టి సంఘటనములు గృహజీవనమున మనకు దృశ్యమానములే. సీతారాముల పాత్రము లిట్టి పాటలందు నామమాత్రము వారి పేరులున్నందులకు 'గాజు లమరించినా గడపలు దాటి-ముత్యా లమర్చినా ముంగిళ్లు దాటి-పగడా లమర్చినా పందిళ్లు దాటి-పచ్చ లమర్చినా రచ్చలు దాటి' మన దృష్టి సాగిపోవలయును. భావము లన్నియు మన జీవితమునకు సంబంధించినవే యగును. 'శ్రీరాముడు సీతా రమణితో ఓమనగుంటలాడి గెలుచుట' త్యాగరాజస్వామివారు ప్రస్తావించుటను బట్టి యీ పాట అంతకన్న పూర్వమే యున్నట్లు తలచవలెను.

...భారత పరముగానున్న 'సుభద్ర సారె' యను పాట 'అల్లుని మంచి తనంబును,' పెత్తనముగల కోదండ్ర మాటల తీరును, నిస్సహాయురాలగు భార్య పాట్లును తెలుపునట్టిది. ఒకనాడు మాటమాటగా సుభద్రార్జునులకు వివాదము కలిగినది. అర్జునుడు సుభద్రతో, 'పున్నమనాడైన బూరెలు వండుకొని పుణ్యుడా రమ్మని పిలిచిరె మీవాళ్లు, అమావాస్యనాడైన అట్లు వండుకొని అల్లుడా రమ్మని పిల్చిరె మీవాళ్లు, కనుమునాడైనాను గారెలు వండుకొని కాముడా రమ్మని పిల్చిరె మీవాళ్లు' అని దెప్పిపొడిచెను. ఇది లోకములో సర్వసాధారణముగా ప్రతి యల్లునకుండు 'మంచితనము'. సుభద్రమాత్ర మూరకుండెనా? ఆమె కూడ తగు రీతిగనే సమాధాన మిచ్చినది. పుట్టినింటివారి నన్నచో స్త్రీలు సహింపరు గదా. ఆమె, 'మావాళ్లు పేదవాళ్లు మాకేమి గలదు, పెట్టగల పెద్దింట పెండ్లాడితేను, అచ్చటలు ముచ్చట లన్నియును జరుగు'నని మరల వడ్డించినది. చిన్నచిన్న పట్టింపులు పెద్ద కలతలై గృహ జీవనము కల్లోలపరచుట మన మెరుగుదుము. ఇచ్చట నంతేయైనది. సుభద్ర మాటలు అర్జునునికి సూటిగా తాకినవి. అతడు. 'అతివ పలుకులు విని గుడ్లెర్రజేసి, ఎడమ మీసం దువ్వి పాంకోండ్లు ఎత్తి, పాంకోళ్ళతో దన్ని పక్కనా నవ్వేను. ఇంకేమున్నది? 'గోలుగోలుమని గోడపై ఒరిగి, వంటి సొమ్ములు తీసి భరణిలో నుంచి, గంటలా బాలుణ్ణి చెట్టబట్టుకొని, వెళ్ళెను సుభద్ర అన్నవాడలకు'. సుభద్ర అన్నగారగు శ్రీకృష్ణునిల్లు చేరుకొని జరిగిన కథ వినిపించి, 'ఫుల్లవిదువు మాటలాటి పురుషుడూ నన్ను గుడ్లెర్రజేసి పాదాల దన్నె'నని చెప్పుకొని దుఃఖించినది. శ్రీకృష్ణు డామె నోదార్చి కొన్ని దినము లుంచుకొని యనేకవస్త్రములు, భూషణములు, వస్తువాహనము లిచ్చి పసుపుకుంకుమలు సారె బోసెను. పుట్టింటినుండి ఇంత సిరిసంపద సుభద్ర కొనిపోవుట శ్రీ కృష్ణుని భార్యలకు నచ్చదయ్యెను. సుభద్ర పోయివత్తునని వదినెలతో చెప్పబోవ వారు కోపముతో,

> 'ఇల్లు విరునుకు పొమ్మ ఓ ముద్దుగుమ్మా, ఏడె ధాన్యంబుండె ఎత్తుకొనిపొమ్మా,
> వండిన వంటకము ఎత్తుకొని పొమ్మా, కాళ్ల మట్టెలజోడు ఎత్తుకొని పొమ్మా,
> కట్టుకొను బట్టొకటి ఉంచకుమీ'యని దెప్పిపొడిచిరి. కోడండ్రకు మరియు

ఆడబిడ్డలకుండు సామరస్య మిట్టిదేకదా! పాపము సుభద్రకు భర్తవలన జరిగిన పరాభవముకన్న వదినెగారల మాట లధికముగా బాధాకరములైనవి. 'అన్నరో వింటివా ఆలి మాటల న'ని యామె మరల దుఃఖించినది. కాని శ్రీకృష్ణుడు

'కొన్న మానిసు అంటె కొదువేమి మనకని సుభద్ర నోదార్చి సారెబోసి సాగనంపెను. శ్రీకృష్ణుడు సత్యభామ మున్నగు తన భార్యలను కొన్నవారనుట గమనింప దగినది. సుభద్ర శ్రీకృష్ణుని చెల్లెలు, ఆమె యాయింటనే పుట్టినది. కాని సత్యభామవంటివారు కోడండ్రగుటచే కొన్నవారైరి. ఆ మాట సుభద్రకు సంతోషము కలిగించునది. సత్యభామవంటివారికి తలవంపు కలిగించునది. తన భార్యలను హేళనమొనర్చి శ్రీకృష్ణుడు ఏడ్చుచున్న చెల్లెలి నూరడింపగలిగెను.' నిజముగా నీ కథను సుభద్రార్జునులకును, రుక్మిణీశ్రీకృష్ణులకు నంటగట్టుదుమా? ప్రజాజీవితమునందు నున్న సాధారణసంఘటనములే యీరూపు ధరించినవి. కేవలము కృష్ణాదులు నామమాత్రులని మనము గ్రహింపవలెను.

గృహజీవనమందు దేవోరపొచ్చెములు లేకున్నచో ముందుగా నుదాహరించిన సీతారాముల కథలవలె సంసారయాత్ర సాగును. చిట్టిపొట్టి కలహములైనచో 'సుభద్ర సారె' వలె నుండును. తాత్కాలికముగా కొంత యలజడి జరిగినను మరల కుటుంబమున ప్రశాంతత యేర్పడును. కాని యందరి సంసారము లన్నికాలములందు శాంతముగా సాగవు. ప్రపంచమున సుఖముకన్న, సంతోషముకన్న, ప్రశాంతముకన్న, దుఃఖము, కలతలు, అశాంతియే యధికము. అత్తగారు కోడలిని సాధించుటయో, పెత్తనము చేజిక్కిన కోడ లత్తగారి నేడిపించుటయో, కోడలు ఆడబిడ్డల మధ్యన వివాదములు పెరుగుటో, భార్యాభర్తల సంబంధము లంత బాగుండకపోవుటో, సమష్టికుటుంబమున కోడండ్ర మూలమున నంతఃకలహము లుద్భవించి వేరుపడుటకు దారితీయుటో, ఏదో యొక కారణము మూలమున గృహజీవనమున నశాంతి యేర్పడును భార్యాభర్తలయందేదో చిన్న పట్టింపుపై జగడము కలుగును. ఒకరితోనొకరు మాటలాడరు. కొంతవరకు దంపతులు మంచివారు కనుక ఎవరి పనులు వారు చేసికొని పోవుచుందురు. గృహిణి భోజనాదిసౌకర్యములు సమకూర్చునేకాని బెట్టు సడలనీయక భర్తగారిని భోజనమునకు ప్రత్యక్షముగా తానాహ్వానించదు. 'వంకాయ వండేను వరికూడు వార్చేను తినుమని చెప్పవే తడికా తడికా' యని యొక యప్రాణిని మధ్యవర్తిగా నేర్పరచుకొనును. భర్తగారు కూడ ఆమె కెందును తీసిపోరు గనుక, 'వగలమారి మాటలకు వళ్ళంత మండింది, వద్దనీ చెప్పవే తడికా తడికా' యని సమాధానము చెప్పును. గృహలక్ష్మికి కోపము మరింత పెరిగి తానుకూడ తినుటమాని మూలమంచము వేయును. తన లోపమును దిద్దుకొనియో లేదా ఆమెపై దయ దలచియో భర్త తానే సంధికి పూనుకొనును.

'పట్టుచీరె తెచ్చేను పెట్టెలోను పెట్టేను, కట్టుకోమని చెప్పవే తడికా తడికా' యని రాయబారము సాగించును. స్త్రీలకు సొత్తాభరణములు వస్త్రములన్న చెప్పరాని కోరిక. ఇది వారి దౌర్బల్యమే యనుకొనవచ్చును. ఇంత బిగిసిన భార్య పట్టుచీర భ్రమలో పడి పట్టుదల విడిచి మరల ఎప్పటియట్ల సుముఖురా లగును. ఈ సంఘటనము భార్యాభర్తలకు నడచు చిట్టిపొట్టి జగడమున కుదాహరణము. కాని తెగబడిన స్త్రీయున్న కుటుంబము పరిహాసహాస్యాస్పదముగా నుండును. భర్త కాదుగదా యితరు లెవ్వరు చెప్పినను వినని స్త్రీలుకూడ నుందురు అట్టివారిగూర్చియే, 'మొండికెత్తినదాన్ని మొగుడేమి జేసు-లజ్జ విడిచినదాన్ని రాజేమి జేసు - సిగ్గుమాలినదాన్ని శివుడేమి జేసు' నను మాట ప్రబలినది. సాధారణముగా నత్తలు కోడండ్రను, కోడండ్రు తమ యత్తల నాండిపెట్టుట పరిపాటి యైనట్లున్నది. 'అత్తగూడ ఒకయింటి కోడలే' యనియు, 'అత్తగారి యధికారము కొన్నాళ్ళు, కోడలి కొలువులు కొన్నాళ్ళు' అనియును సామెత లూరక పుట్టవుగదా! ఒక కుటుంబమున నన్నియు కలిగియుండి అత్తగారు యారడి యున్నచో కోడలి జీవితము దుఃఖమయమే.

'కాపురము సిరిగలిగి కడుపు బండినన్న, కమతకు కన్నోపు ధ్యానమే లేదు
కాపురము జూచితె, కన్నీళ్ల పండుగ-
అత్త మీది కాపురము కత్తిమీది సాము, కోడలు లేవి అత్త గుణవంతురాలు
అరటి పూసింది అరటి కాసింది, అత్త పెట్టిన ఆరళ్లు మరపున రావు
ఇల్లు లేదటనే ఇల్లాల నీకు, తల్లి దగ్గర లేదా ధైర్యంబు సెప్ప
తగిన పురుషుడు లేడా సినాదరింప-
అత్త ఆరళ్లకు అలపించేవు, వలవల కన్నీరు వద్దు రాల్చంగ'.

కొందరత్త లకారణముగా నేవో సాకులు పన్ని కోడండ్రను సాధింతురు. సన్యాసమ్మ, లక్ష్మమ్మ, వీరరాజమ్మ, కామమ్మ వంటి కథలందు క్రూరురాండ్రగు అత్తగారల పన్నాగములచే ప్రాణములు వీడిన కోడండ్రు కలరు. నిష్కారణముగా కోడండ్రను బాధించు ఒక యత్తగారి నెపములు వినుడు.

అత్త :- కోడలా కోడలా కొడుకు పెళ్ళామా-పచ్చిపాలామీది మీగడా లేవి?
వేడిపాలామీది వెన్నల్లు యేవి-నూనెముంతలమీది నురుగుల్లు యేవి?

ఈప్రశ్నల కేమైన అర్థముండునా? అత్తగారితన మిందులో పరాంకోటి నందు కొన్నది. ఈ ప్రశ్నములకు గడుసరి కోడలి సమాధాన మిట్లున్నది.

అత్తరో ఓయత్త ఆడిబ్లయత్త-పచ్చిపాలా మీద మీగడుంటుందా?
వేడి పాలామీద వెన్న యుంటాదా-నూనె ముంతల మీద నుసిగ యుంటాదా?
ఇరుగుపొరుగువార ఓ చెలియలారా-అత్తగారి ఆరళ్లు చిత్తగించారా?
పెత్తనం లాగేస్తె పేచీలు పోను
ఆరళ్ల అత్తయిన సవతిపోరైన-తల్లిల్లుమాటి మైన గరియించరేమి?.

అధికారముగల యత్తగారిని కోడలు తాను చేయవలసిన పనులన్నియు నడిగి చేయవలయును. కనుక కోడలు,

'పండుగ వచ్చింది ఓ యత్తగారు-పిండివక్కి నెయ్యిమెన్ని ఎన్ని పోసేది?' యని ప్రశ్నింపగా పిసినిగొట్టు అత్తగారిటు లాజ్ఞాపించును.

'నెయ్యనే నిచ్చెనా తియ్యనే గాదె-పొయ్యనే చిలగిచి తవ్వెడే వడ్లు
ఆ వొడ్లు నానేసి పిండంత దంచి-పిండిపోకలు చెయ్యి చక్రాలు చుట్టు
ఇరుగుపొరుగువారి కింతింత పెట్టు-మాపటికి మామకు మాటిమూలెట్టూ
మరునాటి చద్దులకు మరిదులకు పెట్టు-మనయింటి పాలేళ్లు మురియంగ పెట్టు
మనువింటి మరదలికి మననొప్పు పెట్టు'.

ఇంతవరకు పరిశీలించిన గేయములం దత్తగారి యధికారము ప్రదర్శిత మగు చున్నది. ఇక పెత్తనము చేజిక్కిన కోడలి నారయుదము. అత్తింటివా రన్న చులకన, పుట్టింటివారన్న గౌరవముతో జూచెడు కోడలు మానసికపరిస్థితి ఈ గేయమందు గాంచనగును.

'మాబావ లొచ్చారు కూరేమి లేదు-మంచాన నల్లులు గోడ ఒల్లుల్లు
మా అన్నలొచ్చారు కూరేమి లేదు-పాటిమీది పచ్చ పెసలు అచ్చావు నెయ్యి
బంతిపువ్వువంటి అప్ప కావాలి-బాడవలో నక్షత్రవంటి బావ కావాలి
చేమంతిపువ్వు వంటి చెల్లె కావాలి-చెట్టుమీది కోతివంటి మరది కావాలి'

చెలరేగిపోయిన కోడలైనచో అత్తమామల నతినీచముగా చూచుటయేకాక వారిని వెక్కిరించి వేళాకోళము చేయును.

'మాయత్తమామా ఊరేగుతుంటె-చుట్టపీకలు రెండు చూడొచ్చినాయి
మట్టగిడసలు రెండు మాట్లాడినాయి-కందిరీగలు వచ్చి కత నడిపినాయి
బోదురుకప్పలు వచ్చి బాగోతమాడు'

ఇట్టికోడ లత్తగారితోపాటు బావమరదులను భర్తనుకూడ లక్ష్యపెట్టదు.

'మా అత్త మా మామ ఊరేగినాక-వడ్లుదంచ నొక మరది వండ నొక మరది

వంట కుండలకాడ కావలొక మరది-పేడకల్లాపు జల్లు పెదబావగారు
ఇల్లలికి ముగ్గెట్టు యింటి మగవారు-' ఇట్టి యత్తకోడండ్ర మనస్తత్వములు ప్రదర్శించు గేయము లనేకములు మనకు లభించును. అత్తకోడండ్ర సామరస్య మనునది ఎచ్చటనో క్వాచిత్కముగా గానుపించును. కనుకనే, 'అత్తలేని కోడ లుత్తమురాలు, కోడలు లేని యత్త గుణవంతురాల'ను మాట ప్రబలినది. సమష్టి కుటుంబమున నున్న కోడ లత్తమామలకు బావమరదులకు, తోడికోడండ్రకు, భర్తకు నేతీరుగా భక్తి కనబరచవలయునో, ప్రతి విషయమున వారి యాజ్ఞ కెల్లెదురు చూడవలయునో ఒక గేయమున కాంచనగును. పుట్టింటినుండి తనను గొంపోవుట కన్నలు వచ్చినప్పుడు జరిగిన సంఘటన మిది.

'కలవారి కోడలు కలికి కామాక్షి, కడుగుచున్నది పప్పు కడవలో బోసి
అప్పుడే వచ్చేడు ఆమె పెద్దన్న, కాళ్ళకు నీళ్ళిచ్చి కన్నీరు నింపె

అన్న: ఎందుకూ కన్నీరు ఏమి కష్టాలు, తుడుచుకో చెల్లెలా ముడుచుకో కురులు
ఎత్తుకో బిడ్డను ఎక్కు అందలము, పెట్టుకో సొమ్ములు కట్టుకో చీరె
చేరి మీ యత్తమామలకు చెప్పి రావమ్మ

కోడలు: కుర్చి పీటమీద కూర్చున్న అత్త, మాయన్న లొచ్చారు మమ్మంపుతారు
అత్త: నేనెరుగ నేనెరుగ నీమామ నడుగు

కోడలు: పట్టెమంచముమీద పడుకొన్నమామ, మాయన్న లొచ్చారు మమ్మంపుతార
మామ: నేనేరుగ నేనెరుగ నీబావ నడుగు

కోడలు: భారతం చదివేటి బావ పెదబావ- మాయన్న లొచ్చారు మమ్మంపుతార
బావ: నేనెరుగ నేనెరుగ మీయక్క నడుగు

కోడలు: వంటలు చేసేటి ఓ యక్కగారు- మాయన్నలొచ్చారు మమ్మంపుతార
తోడికోడలు: నేనెరుగ నేనెరుగ నీభర్త నడుగు

కోడలు: రచ్చలో కూర్చున్న రాజేంద్రభోగి, మాయన్న లొచ్చారు మమ్మంపుతార
భర్త: పెట్టుకో సొమ్ములు కట్టుకో చీరె-పోయిరా సుఖముగా పుట్టి నింటికిని

కోడలు: ఇరుగు పొరుగులార ఓ అమ్మలార-చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు సేవించబోయి
మరదుల పెళ్ళికి మరలి వచ్చేను-ఇరుగక్క పొరుగక్క ఇదె పోయివత్తు.

ఇట్టి కుటుంబము ఇట్టి కోడలున్నచో సంసారము గుట్టుగా నడచును. సమష్టి కుటుంబమునందుండు హాయి కనుపించును. కొందరకు సమష్టికుటుంబపద్ధతి యిష్టము కాదు. అత్తమామలకు బావమరదులకు సేవలు చేయలేకనో లేదా తన భర్త

యధికముగా సంపాదించువారై తక్కినవా రధికముగా తినువారై నచో కోడం్రడ్ర
వేఱుపడుటకై తమ భర్తలను ప్రోత్సహింతురు.

ఏరుబడితేనె మేలు మొగడా-మనము
పొత్తులుంటేనే పోరు మొగడా ||ఏ||
ఏరుబడ్డ తెల్లారి ఏకమై మనముండి
ఏకించి పీకించి నెలకొక్క పోగాడికి
మోటదండెడ దొడ్డు మొలతాడు చేయిస్తు ||ఏ||
మక్కజొన్నాచేను మనపాలికే వస్తె
నక్కబెదురూ బెట్టి నా ప్రజ్ఞ చూపించి
ఇద్దూము పండేది పుట్టేడు పండిస్తు ||ఏ||
రంగు రంగొంకాయలు గొంగెడన్నీ దెంపి
హంగుగా నే ననుమకొండంగడికి పోయి
పొంగుబొంగే కల్లు బుంగెడంతా తెస్తు ||ఏ|| 1

జాణతనముగల కోడలు, అత్తమామలతో బావమరదులతో, తన భర్త వేరుపడినచ
తాను చేయగల పొదుపరితనము, తమకు గలుగనున్న ఒంటరి సుఖమున
చెప్పుచున్నది. ఇట్టి బోధలే అన్నదమ్ములు వేరుపడుటకు కారణములై పెక్కు
సంసారములు చీలిపోవుట లోకానుభవము. పై నుదాహరింబడినటువం
దీర్ఘగేయము నొకదాని శ్రీహరి ఆదిశేషువుగారు తమ గ్రంథమందు ఉదాహరిం
యున్నారు. ఆ గేయమున కోడలి జాణతన మధికముగా ప్రదర్శితమైనది.

ఈ విధముగా పరిశీలించుచు బోయిన -గృహజీవనమునకు సంబంధించి
యొక్కొక్క ఘట్టమును జానపదకవితా్రసవంతి దరులొరసి పారినసన్ని వేశముల
పెక్కులు లభించును. సాంఘికజీవనము సమగ్రముగా గోచరించుటకై జానప
గేయములందలి సాంఘికవిషయములను నొక ప్రత్యేకప్రకరణ మేర్పరచితిని
దానిలో నిందు కానరాని యనేక విశేషములు చేర్చబడినవి. కేవలము స్త్రీల పాట
కొక ప్రత్యేకత యుండుటచే విట నొక చిన్నప్రకరణ మేర్పరుప బడినది.

( ౦౦౦ )

1. ఈ గేయమును మాయూరిలో (దేవునూరు) సేకరించితిని. 1952.

# శ్రామిక గేయములు

ప్రవేశికలో జానపదగేయోత్పత్తిని గురించి చర్చించినప్పుడు కవిత్వ ముల్లాసముకలిగించుటకేకాక కష్టనివారణమునకు గూడ నుదయించుననితెలిసికొని యుంటిమి. మానవులు శ్రమించునప్పుడు కష్టము కనబడకుండుటకై. అలసిపోకుండుటకై, స్వగుణీకృతోత్సాహముతో పనిచేయుటకై అప్రయత్నముగా కూనిరాగములు తీయుట,లయాన్వితములగు నేవో మాటలుచ్చరించుట జరుగును. సామూహికకర్తృత్వమున నట్టి రాగములు మాటలు జానపదగేయములుగా పరిణమించి వ్యాప్తిగాంచును.ఇల్లలుకునప్పుడో,పిండి విసరునప్పుడో, ధాన్యము దంచునప్పుడో,కదురు కవ్వములాడించునప్పుడో,పరినాటు,కలుపు,కోతలప్పుడో, మోట దోలునప్పుడో, ఏత మెత్తునప్పుడో,నాగలి దున్నునప్పుడో, కుప్పగొట్టునప్పుడో,పడవ నడుపునప్పుడో,బరువులు మోయునప్పుడో.రోడ్డువెంట రోలరును లాగునప్పుడో,రాళ్ళు పగులగొట్టునప్పుడో,దిమ్మిస వేయునప్పుడో,కావడి.పాలకీ, మేనాలు మోయునప్పుడో.శ్రమాపనోదమునకై పాటలు పాడువారిని మనము చూచుచునేయున్నాము.హృదయ-లేదా-మేధాగతభారమునుతొలగించి ఉల్లాసమును కలిగించునటులే శారీరకశ్రమమును-కాయకష్టమును పోద్రోలి యుత్సాహమును గలిగించుటకును గేయములు తోడ్పడును.శ్రామికు లనగా రాజకీయసిద్ధాంతులు చెప్పెడు ప్రత్యేక శ్రామికులు కారు.శరీరకష్టమొనర్చు వారందరును శ్రామికులే. శ్రమపడువారందరు శ్రామికులే.పిండి విసరుట మొదలు పిడికిలి బిగించి కొడవలి చేబూని పనిచేయువరకు శ్రమపడుటయే. చుక్కాని పట్టుటనుండి సుత్తె పట్టువరకును శారీరకశ్రమమే. కనుక నీ ప్రకరణమున నన్నిరకముల శ్రామికులకు సంబంధించిన గేయముల గూర్చి విచారింతము. శ్రామికగీతములనే పలువురు పండితులు 'పాటకజన సారస్వత'మని పిలిచిరి. కొందరు కర్షక కార్మిక గీతములనిరి.పాటక శబ్దసామ్యమును గలిగిన 'పట్' శబ్దము నౌత్తరాహులిట్టిగేయములకు

పాడియున్నారు. గన్ పాల్ జానపదగేయముల గూర్చిన ప్రశంసలో దేవేంద్ర సత్యార్థిగారు 'పట్' శబ్దమునే వాడియున్నారు. 'కఠినాతికఠినమగు కాయకష్టము చేయునప్పుడు స్వరముతో స్వరము మేళవించి 'పట్' పాడుట ప్రాచీనము నుండి వాడుకగా నున్నది'1. పాటకజన మనునది కేవలమొక వర్గమును (Labour class సూచించును. అటులే కర్షకశబ్దము కేవలము భూసంబంధమగు కృషిచేయువారికిని, కార్మికశబ్దము కేవలము కర్మాగారములందు పనిచేయు వారికిని వాడబడుచుండుటచే నవి పాక్షికము లగుచున్నవి. కర్షక కార్మిక పాటక జనములవారే కాక శ్రమపడువార లనేకవిధములవారున్నారు. వారికి సంబంధించిన గేయము లెన్నియో కలవు. కనుక గ్రామికశబ్దము విశాలపరిధి గలదై సమస్త గ్రామికులను సూచించుటచే నీశబ్దమునే వాడుట సమంజసమని తలంతును.

శ్రామికగీతములందు వస్తువెద్దియైన నుండవచ్చును. ఇంతవరకు చర్చింపబడిన పౌరాణికములవంటి దీర్ఘములగు గేయములనుగాని లేదా ఏవేని చిన్నపాటలను గాని గ్రామికులు పాడుకొందురు. వృత్తికి సంబంధించిన పాటలు, శృంగారగేయములు, స్థానికవృత్తాంతములు, విషాదగాథలు, భక్తిగేయములు మున్నగు తీరుతీరుపాటలు గ్రామికులు పాడుకొందురు. గ్రామికగేయములు కూడ మనకచ్చటి లభించునవి కొలదిగనే యున్నవి. 'సెలయేరు'లో సుమా రిరువది గేయములు ముద్రింపబడినవి. ఆంధ్రప్రభ వారపత్రికలో కొన్ని మాత్రమే అప్పుడప్పుడు ప్రకటింపబడినవి. వీనిలో ముద్రిత వస్తువుకన్న నముద్రిత వస్తువే యధికముగా నున్నది. గ్రామికగేయములం దొక్కొక్క తీరునకు ఒండు రెండు గేయముల దీసికొని పరిశీలింతము. గ్రామికగేయము లన్నియు సాధారణముగా వారివారి కృషికి సంబంధించిన లయకు సరిపోవునట్లుండుట గమనింప దగిన విషయము. గ్రామికుల కాలుసేతుల కదలికలో, ఊపిరిత్తుల భారోచ్ఛ్వాస నిశ్వాసములో ఈగీతములకు తాళలయలు సమకూరును.

కృష్ణా గోదావరీ మండలములందు ప్రయాణ సౌకర్యములకు ఎగుమతి దిగుమతులకు జలమార్గము లున్నవి. కాకినాడ, బందరువంటి సముద్రపు రేవు లున్నవి. ఒకప్పుడు మోటుపల్లి మున్నగు రేవుపట్టణములనుండి ఆంధ్రుల సముద్రయానము లత్యంతదూరదేశములవరకు సాగినవి. ఆంధ్రనౌకలు కృష్ణా తరంగ పంక్తిని త్రొక్కి త్రుళ్ళింతలాడినవి. మధ్యకాలమున నావిరి 'యారి

1. ధర్తీ గాతీహై. పుట 163.

పోయినను ఇప్పుడిప్పుడు మరల నాంధ్రదేశమున నౌకావ్యాపార మధికమగు సూచనలు కానవచ్చుచున్నవి. సముద్రయానము లెట్లున్నను కృష్ణాగోదావరీ నదులు వాని కాలువలపై మాత్రము, నావలు, రాదాంబోట్లు, తెప్పలు సాగుచునే యున్నవి. ప్రశాంతజలముల జీల్చుకొనుచు పడవలు నీటిగలగల లుపశ్రుతి చేసికొని పాటలు పాడుకొనుచు పయనించుచున్నవి. చేతి కండ బలముతో త్రాడు లాగుచునో, తెడ్లు వైచుచునో నీటిని జీల్చెదు కళాసులకు తండేలొక సన్నిపాట నందించుచుండును. కళాసు లాపాట కొక ఊతపదమో, అనుపల్లవియో చేర్చి ఊపిరి విడుచుచు శ్రమదీర్చుకొందురు భారోచ్ఛ్వాసనిశ్వాసములు పదములై బయటికి పోయి కళాసులకు కొంత శ్రమను తగ్గించుచుండ తండే లందించు ప్రతిచరణము వారి కుత్సాహము గలిగించును. బలము ద్విగుణమై పడవ నడక వేగమగును. పడవ పాటలం దధిక ప్రసిద్ధిగాంచిన గేయము కీ.శే. వీరేశలింగం పంతులుగారి వాచకముల కెక్కి (గోదావరి పాఠము) పడవలు నడువని తెలంగాణమునగూడ ప్రచారమందినది. గంగాధరంగారీ పాటను తమ 'సెలయేరు' లో చేర్చియున్నారు.1

తండేలు :- గంగమ్మ తల్లికి చెంగల్వ పూదండ-కాళిందికి తెల్ల కల్వదండ
కళాసులు :- జోర్సెయ్ బార్సెయ్ జోర్సెయ్ బార్సెయ్
తండేలు :- గోదావరి తల్లికి గొజ్జంగి పూదండ-సరసోతికి సన్నజాజిదండ
కళాసులు :- జోర్సెయ్ బార్సెయ్ జోర్సెయ్ బార్సెయ్
తండేలు :- కృష్ణవేణమ్మాకి గేదంగిపూదండ-కావేరీకి చంద్రకాంతదండా
కళాసులు :- జోర్సెయ్ బార్సెయ్ జోర్సెయ్ బార్సెయ్
తండేలు :- పిల్లజెల్లా అంతా సల్లంగ రచ్చించి-ఇల్లు జేర్చండి ఓ తల్లులార
కళాసులు :- జోర్సెయ్ బార్సెయ్ జోర్సెయ్ బార్సెయ్
తండేలు :- సిక్కాలు నిండించి శింగాలు నిండించి-ఇల్లు జేర్చండి ఓ తల్లులారా
కళాసులు :- జోర్సెయ్ బార్సెయ్ జోర్సెయ్ బార్సెయ్
తండేలు :- సుళ్ళుదోపుళ్ళు మొసళ్ళు దప్పించి మ-మ్మిల్లు జేర్చండి ఓ తల్లులారా
కళాసులు :- జోర్సెయ్ బార్సెయ్ జోర్సెయ్ బార్సెయ్
తండేలు :- గోదావరి తల్లికి కొట్టరా టెంకాయ-కోరి దండాలెట్టి కుంకుమ పెట్టి
కళాసులు :- జోర్సెయ్ బార్సెయ్ జోర్సెయ్ బార్సెయ్

తండేలు పడవ కధికారి. ప్రయాణికులు వారి సామగ్రి వస్తువాహనముల రక్షణమున కాతడే బాధ్యుడు. అతడే కర్ణధారి. కనుకనే యాతడు "గోదారితల్లిని,

1. సెలయేరు-పుట. 136.

సరసోతిని, కృష్ణవేణమ్మను, కాళిందిని, గంగమ్మ తల్లిని' ప్రార్థించుచున్నాడు. సుళ్ళు దోపుళ్ళు మొసళ్ళు దప్పించి పిల్ల జెల్లను చల్లగా ఇల్లు చేర్చుమని టెంకాయ గొట్టి కుంకుమ పెట్టి గంగమ్మను ప్రార్థించుచు తన కళాసుల కుల్లాసమును గల్గించుచున్నాడు. కళాసుల చేతికండలు తెడ్లతో నీటిని చీల్చి చీల్చి, కరడు గట్టుచుండ వేడి నిశ్వాసములు 'జోర్సెయ్ బార్సెయ్, జోర్సెయ్ బార్సెయ్' అని కండరములకు కొంత 'సళ్ళబిగువు' కలిగించుచున్నవి. ప్రయాణము సాగుచునే యున్నది. ఈ పాట వయసెంతో తెలియదు. గోదావరి యెదపై తెలుగు తెరచాప లెన్నడు లేచినవో ఆనాటినుండి గంగమ్మ తల్లి ఈ పాట వినుచునే యున్నది. టెంకాయలు కుంకుమ లందుకొనుచునే యున్నది.

'మళ్ళీ వచ్చిందాక మర్లూ మరవనంట
నేతులో సెయ్యేసి సెపోవ్వలె సెంచు' అను పడవపాట శృంగార గేయము. 'నేలను నమ్మి - ఏలేలో-చెట్టూ వున్నది హైలాసా' యను పడవ పాట భక్తి వేదాంతములకు తెరచాప నెత్తినది. ఇది యంతయు నాశుకవిత్వమే యనిపించును. కేవలము భారము శ్రమము తగ్గించుటకై ఊపిరి పీల్చుకొనుటకై వీలు కలిగించు గేయములందు మాటలు తక్కువగా నుండును. అట్టి వానిలో అర్థరహితములగు మాటలు ధ్వన్యనుకరణములే యధికముగా నుండును.

౧ ఏలెస్సా ఓలెస్సా ఏలెస్సా ఓలెస్సా
ఏలెస్సాబో ఓలెస్సా-ఏలెస్సాబో ఓలెస్సా
ఏలాయేలా యేలా యేలా యేలా యేలా యేలేలా
ఏలాయేలా యేలా యేలా యేలా యేలాయేలా తందేలా
ఏలా ఏలా జోర్సెయ్ బార్సెయ్

౨ యొలోయాల-యేలోయాల
యెంత బరువున్నదిర-యేలోయాల
యెత్తరా అన్నా-యేలోయాల
యేమి సరకుర అన్న-యేలోయాల
బరువు సరకుర అన్న - యేలోయాల
మంచి సరకుర అన్న - యేలోయాల
బాగుగ నున్నది - యేలోయాల
బరువుగా యెత్తరా - యేలోయాల

మొదటి పాటలో నన్నియు భారము దీర్చు మాటలే. ఏలెస్సా యను మాటతో

తెడ్డు నొక్కొక్కసారు కదలించి కళాసు శ్రమ మరపించుకొనును. రెండవ పాటలో నిట్టిమాటలతో పాటు బరువులు వానికి సంబంధించిన విశేషములున్నవి. ఇంతియ.

తెలుగునాటి ఆర్థికవ్యవస్థకు కదురుకవ్వముల మ్రోతలు వెన్నెముక వంటివి. ముతక గుడ్డల కాంధ్ర దేశమున నున్నంత వాడుక యితరదేశములందు లేదు. మహాత్ముని ప్రచారమున నితర దేశములందు వీనికింత ప్రాముఖ్యము కలిగినది. మన దేశమునమాత్రము మహాత్మునికి గూడ నవబోధము కలిగించు నంతటి వ్యాప్తి ముతకగుడ్డలకుండినది. ఇప్పటికిని పల్లెపట్టులందదిలనేయున్నది. ఇంటిపనులు ముగిసిన తరువాత ప్రతి గృహిణియు ఏ రాట్నమునో ప్రత్తిగిరకనో త్రిప్పుచు కూనిరాగములు తీయుచుండును 'గుంపునంపును లేక కొనసాగ(బోగు వెంట మెరుంగు(జూపు పేరెములువార(బ్రాయంపు పడుచుల బనిగొంటివే దూది యనెడి పాటల( దేనె చినుకులీన'1 సాగిన ప్రోగుల రాగమాధుర్యమున సన్న సన్నమై మాంచెస్టరు మల్లులను మోటనిపించినవి. దేశసౌభాగ్యమునకు తోడ్పడినవి. బయట గడించిన కీర్తి మరియు ఇంట స్థాపించుకొన్న సువ్యవస్థచే 'కదురు కవ్వంబులు గలయాడునింట కరువు కాటకములు కలిగాన లేవు' అను మాటలు సార్థకములైనవి. ఇంతియ కాదు, స్త్రీకేదేని లోపమున్నను రాట్నమాలోపమును గప్పిపుచ్చుటయే కాక ఆమెకు కొంత గౌరవమును ఆపాదించినది. 'అందచందము లేని ఆడకూతురుకు. అంద మేటుపరచు అపత్తిచెట్టు'ను మాటకు ప్రచారము కలిగినదందుచేతనే రాట్నము పాటలందు వస్తువైవిధ్యమైన నుండవచ్చును నిరాకృత భర్తృక కన్నీటిజల్లొకప్పుడు సాగిపోవు ప్రోగుల టప్పుమని త్రెంపిన, ప్రియా గమనవార్తచే నుబ్బిపోవు ప్రియురాలి చేతికదలిక సక్రమము గామి ముఖ్యపడిన ప్రోగు లొకప్పుడు రాగబంధములు కూర్చుచుంకును పుట్టింటివారిని దలచుకొని యొక పూబోడి రాట్నము ద్రిప్పిన గృహజీవనమున తలమున్కలైన మంరయొక యిల్లాలు మాగాయపచ్చడి పెట్టుకొనవలె ననెడు కోరికను వెల్లడిర్చును. ఒక అత్తగారు కోడలి కొప్పువంకను గూర్చి ముచ్చటించిన ఒకకోడ లత్తగారి యారళ్ళను ప్రక్కవారు వినకుండ రాట్నపు మోతలో గలిపి పాడును. ఒక యిల్లాలు సీతమ్మ కష్టాలను దలచుకొనిన మరియొకతె స్వకష్టార్జితమును జూచి మగడెందుకని గర్వపడును. శ్రీ నేదునూరి గంగాధరంగారు సేకరించిన ఇట్టి గేయమొకటి శ్రీదేవేంద్ర సత్యార్థిగా రనువదించినారు.2

---

1 శుకసప్తతి 2-422    2. ధరీ గాతీహై

'మొగుడెందుకే నారి మొగుడెందుకే - అసలు మొగుడెందుకే నారి మొగుడెందుకే
రాటం సల్లంగుంటె రప్పిస్త గోల్కొండ - మొగుడెందుకే నారి మొగుడెందుకే'

ఈ పాట బహుశః గోల్కొండపట్టణ మున్నతదశయందుండగా పాడబడి యుండును ఒక స్త్రీ తన దురదృష్టము నిటుల నిందించుకొనుచున్నది.

'కాటుక చుక్కబొట్టు కిడిగినా పోదు-నొష్టరాసిన రాలు తుడిచినా పోదు
అద్దచెఱుగులు పెట్టి అద్దినా పోదు - పైటచెంగులు పెట్టి పులిమినా పోదు'

ఇంకొక స్త్రీ పుట్టింటివారి రాకకై యెదురుచూచుచున్నది పుట్టింటివారు వచ్చునటుల కాకిని పలుకు మనుచున్నది.

'కాకమ్మ నీకాల కట్టేము గజ్జె- రత్తమ్మ మావార్ని రాగుయ్యె కాకి
కాకమ్మ కూతలు కల్లలు కావు , కన్నవా రొచ్చేటి వేళలు కావు
నేరేడు పండంటి అన్న నాయన్న, నేడు వస్తానని నెలకన్న రాడు
తాను వస్తానని తమ్ముణ్ణి పంపు, ఏమోయి పెద్దన్న ఎన్నటికి రావు
ఏటేట పెళ్ళిళ్ళు కుప్ప నూర్పుళ్ళు, ఎడలేదు చెల్లెలా నిను చూడ రాను'

మరియొక స్త్రీ సీతమ్మ కష్టాలను దలంచుకొని సన్నిహితములగు దృష్టాంతముల దడవుచున్నది.

'పత్తిచెట్టు వంక పత్తాకు వంక - రాజ్యంలో సీతమ్మ రాతఫలం వంక'

ఈ తీరుగా స్త్రీలు రాట్నము త్రిప్పుచు తమ ఏకాంతమునకు పాటలను తోడుచేసికొని భారమును బాపుకొనుచుందురు.

బియ్యమో జొన్నలో ముందు పోసికొని ఒకరిద్దరు తోడుగూడి విసురు రాయి (తిరుగలి) త్రిప్పుచు పిండి విసరునప్పుడుకూడ వారి శ్రమాపనోదనమున కుపకరించు పాటలు పాడుకొందురు. తిరుగలిపాట లొకతీరు ఛందమున నుండును. కొంత దీర్ఘము తీసి ఒక్కొక్క చరణము పాడునప్పటికి విసురు రాయి రెండు చుట్లు తిరుగును. విసరునప్పుడు ఒకరు చెప్పుచుండగా తక్కిన ఇద్దరో ముగ్గురో పాడుచుందురు. తిరుగలి గరగర చప్పుడే వారికి శ్రుతి. తిరుగలి పాటలందు గూడ రాట్నపు పాటలందువలె వస్తువైవిధ్యము కలదు.

'అల్లి చోళ్ళు కుప్ప నూర్పుళ్ళు - అటుకమీద బోడోడు అయ్యమ్మా మొగడు'
'చోళ్ళు నల్లన్న పిండి తెల్లన్న - అంబలి పుల్లన్న దొక్క చల్లన్నా'
'కన్నతల్లిని బోలు చుట్టాలు లేరు-పట్టుచీరను బోలు చీరల్లు లేవు'

పై పాటలు శ్రీ గంగాధరంగారి సెలయేరులో నున్నవి. మాయూరిలో

సేకరించిన యొక గేయమునందు మామిడికాయపచ్చడిగూర్చి యున్నది. తెలుగు వారి కావకాయయన్న ప్రీతిగదా! ఆవకాయ గాటు తెలుగుదేశ మంతటను ఋచ్యముగా వ్యాపించినది. గుంటూరు ప్రాంతములందు గోంగూరకు పాక్షిక ప్రచారమున్నది.

‘మామీడి మామీడీ మంచి మామీడి- కొమ్మల్లు వంచేయి కోసేయి నిన్నూ
కొమ్మల్లు వంచేయి కోసేయి నిన్నూ-మేదరా కత్తీనా నరికేయి నిన్నూ
మేదరా కత్తినా నరికేరు నిన్నూ-ఉప్పుమిరంతోటి ఉంచేయి నిన్నూ
ఉప్పుమిరంతోటి ఉంచేయి నిన్నూ-ఆవా మిరంతోటి అద్దేయి నిన్నూ
ఆవామిరంతోటి అద్దేయ నిన్నూ-నీలంపు కాగుల్లా నింపేయి నిన్నూ
నీలంపు కాగుల్లా నింపేరు నిన్నూ-పేరైన రాజులకు పంపేరు నిన్నూ
ఆ ఊరిపేరేమి రాజు పేరేమి.ఆ ఊరు గోలుకొండ రాజు రామన్న’

ఈ పాట మా చెల్లెలు పాడగా వింటిని. చివరి చరణములో పాడిన వారి కిష్టమున్న అన్నదమ్ముల పేర్లు చేర్చి పాడుకొందురు. మిరం (మిరెము) అనగా కారము. ఇది తెలంగాణపు మాండలికము మిరెం = మిరెము = మిరియము. మిరపకాయలు రాకముందు కారమునకై మిరియములే వాడుచుండిరి. ‘పునుగుం దావి నవోదనంబు మిరియంపుం బొళ్ళతో చట్టి చుయ్యని నాదారని కూరగుంపు ముకుమందై యేర్చునావం జిగుర్చొను పచ్చళ్ళును’ ఆముక్తమాల్యద’ నున్నవి. కారము నిచ్చు కాయలు మిరియపుకాయలు మిరెపకాయలయినవి. మామిడీ కొమ్మలు వంచి జాగ్రతగా కాయలు కోసి మేదర కత్తితో నరికి, ఉప్పు, మిరం (కారము),ఆవపిండి నీలంపు కాగులలో నింపి భద్రముగానుంచి తమ యిష్టులకు పంపుకొనుట ఇందులో చెప్పబడినది.

మాయూర నొక కులుమపడుచు పాడుచుండగా విన్న విసురురాయిపాట యొకటి నిరాకృతభర్తృక దుఃఖమును, ఆమె మనోభావములను దెల్పును. ఈ తిరుగలిపాట సంవాదరూపమున నున్నది. ధూర్తుడగు కుమారుడు ఉంపుడు కత్తె యింట శయనించి ప్రొద్దున తనయింటికి వచ్చి తల్లి నిట్లడుగుచున్నాడు.

‘వానా గొట్టాదాయే వరుదెల్లదాయే-అవ్వా మన వాకిట్లా వరుదెక్కడిదే?

అప్పుడా తల్లి తనకోడలి పరిస్థితిని ఇంటిముందు పారిన వరదను ఇటుల చెప్పుచున్నది.

‘నువు బోయి పొరుగింట్ల పంటె నాకొడుకా-నీయాలి శోకంబూ వరదలై పారే’

ఇది యుత్ప్రేక్షయనుడు మరింకేమైన అనుడు. తనను కాదని భర్త పొరుగింట శయనింపగా భార్యకు గలిగెడు దుఃఖమును కన్నులగట్టుచున్నది. భయముతో, సిగ్గుతో కోడలు తన భర్త యింటికి వచ్చినవార్త తెలిసికొని అత్తగారిని

'అత్తరో ఓ ముత్తా మైరసా అత్తా1- నీ కొడుకు సీలకాంతు కేమన్నడత్తా' యని యడిగెను. అప్పుడాయత్త

'కోడలా కోడలా పసారి కోడలా-నా కొడుకు సీలకాంతూ నిన్నొల్లనాట' యని చెప్పెను. భర్త తన్నొల్లడను సంగతి అత్తగారి నోట విని క్షమయాధరిత్రియగు కోడ లేమనుచున్నదో ఆమె హృదయాంతరమున నెంత క్షోభ మున్నదో గమనింపుడు.

'వల్లకుంటె వలిసేద వలవిగ్రమేమి(?)-రచ్చల్ల పెదబావ మెచ్చినన్న చాలు
నాసాటి యారాండ్లు అక్కన్నా చాలు-నా అత్తమామల్లు సరెనన్న చాలు
నాసాటి మరదుల్లు వదినన్న చాలు-యారాండ్ల పిల్లల్లూ అవ్వన్న చాలు'.

చివరి చరణమా కోడలి సౌశీల్యమునకు, శాంతిసౌజన్యములకు పతాక మెత్తుచున్నది. తోడికోడండ్ర బిడ్డలు తనను అవ్వాయని పిల్చిన చాలునట. తాను మాతృత్వమును పైత మాశించుటలేదు. ఆభర్త తన్ను నిరాకరించినను వంశప్రతిష్ఠకై పరువుమర్యాదలకై ఆయింటనే రాయియై పడియుండునట. విసురురాయి గరగరలో నీమానవశిల దుఃఖరాగము కలిసిపోయినటులున్నది. ఓహో! జానపదుల స్వచ్ఛమానసములనుండి వచ్చిన గేయములెంత హృదయవిదారకములు. ఎంత సహజసుందరములు!

ప్రచారమునకు కీర్తికి ఒకప్పుడు మనదేశమున 'రోళ్ళ రోకళ్ళ' బాడుట పరాకాష్ఠ. శివభక్తులకథ లాతీరుగ పాడుకొనెడువారని పాల్కురికి యనెను. 'రోకటి పాటలట్లు వేదములు, పసుగొనమా శివభక్తుల యిండ్లు'2. జంగము లింగము మల్లికార్జును శబరకామిని యోర్తు పటికపురోల ముత్యాదురుబ్రాలోగి బోయుచు గౌటకొమ్ము రోకట గొని దంచుచు రసోత్కటకముగ బాడగా నన్నిచోడుడు వినెను. విన్నకొ టపెద్దన 'తలకొనితగ బ్రాలు దంపెడివేళ' తరువోజలు పాడెదరని నిర్వచించెను. నన్నిచోడుని కాలమునుండి రోకటి పాటలు ఈనాటి వరకు వినవచ్చుచునే యున్నవి. వడ్లు జొన్నలు మున్నగునవి దంచుట చాల పరిశ్రమతో కూడినపని. దంచినకొలది ఉచ్ఛ్వాసనిశ్వాసము లెక్కువగును. చేతులు కూలిపోవుచుండును. ఐనను పని యాపుటకు వీలులేదు. అప్పుడు పాట

1. మాయి + రాచ + అత్త కావచ్చును. 2. బసవపురాణము.

సహాయమునకు వచ్చును. హ్రస్వములు విసురురాయిపాటలందు దీర్ఘమైనటులే, దీర్ఘములు రోకటిపాటలందు హ్రస్వము లగును. బలవంతముగా రాయిని లాగునటులే అక్షరములను దీర్ఘముగా సాగదీయ వలయును. తొందరగా పోటువేయుటకు దీర్ఘాక్షరముల పొట్టిగా నొనర్చుటకూడ అంతే యావశ్యకము, 'సువ్వి సువ్వి రామ చంద్ర సువ్వి సువ్వి కీర్తిసాంద్ర' యనునంతలో మూడేసి మాత్రల కొకపోటు చొప్పున దంచెడు నాలుగు రోకండ్లు రెండేసి మారులు ధాన్యము పైబడి చరణాంతము వరకు నెనిమిది చేరెల ధాన్యము సిద్ధమైపోవును. భారము లేకయే పని సాగిపోయినట్లుండును. పాట తోడుగా నున్నచో

'దంపు దంపనియేరు అదియెంత దంపు - ధాన్యరాసులమీద చెయ్యేసినట్లు
వంటవంటనియేరు అదియెంత వంట - వదినెతో మరదళ్ళు వాదాడినట్లు'ట.

'సెలయేరు' లోనివే రోకటి పాటలు మరి కొన్ని.

'సువ్వన్న చుక్కల్లా రాజమామిండ్లు - నాచేతి రోకండ్లు నల్లరోకండ్లు
చేయించు అన్నయ్య చేవరోకండ్లు - వేయించు అన్నయ్య వెండి పొన్నుల్లు'
'సువ్వని నేనొక్క పోటేసితేను - చుక్కలు పిక్కటిల్లు సూరన్న కదలు
అన్నని నేనొక్క పోటేసితేను - ఆకసమ్ము కదలు ఆరాజు కదలు'
'తమలపాకులమీద వడ్లెండబోసి - రాచిలుక పోచిలుక వడ్లు దంతాము
రాచిలుక దంచినవి రాసులడ్డాయి - పోచిలుక దంచినవి పోగులడ్డాయి'
'రోకలి చిన్నాది రోలు చిన్నాది - నాతోటి పోటేసె చెలియ చిన్నాది'
'రోకలికి రోటికి రెండు దండాలు - మము కన్నతల్లికి వెయ్యి దండాలు'

నేను పరకాల తాలూకా రేగొండ గ్రామమున సేకరించిన (1952) రోకటి పాటలం దొకటి కాటమరాజు కథకు సంబంధించినది కలదు.

'చువ్వీ చువ్వెన్నలా చువ్వెన్నలాలా - చువ్వెన్నలాలా
చువ్వానీ పాడరమ్మా రామూలాలా రఘురాములాలా
అట్లట్ల పొయ్యేటి అవు లెవ్వరివీ అవు లెవ్వరివీ
అల్లముల పోలురాజు చిన్నబిడ్డడనే చిన్నబిడ్డడనే
పెద చెరువు కట్టపొంటి పెంగెర్లా మోతా పెంగెర్లా మోత
పెదబావ పల్లికొండ వచ్చు నావాడ వచ్చునావాడ
గలమ ముందటి మోత ఏమిటీ మోత ఏమిటీ మోత
గార్వాల ఐతన్న గజ్జెల్లా మోత గజ్జెల్లా మోత
ఐతన్నా గోరినాడు ఆది నెల్లూరు ఆది నెల్లూరు
అవుల్లు గోరినాయి రాగుల్లా పీడ రాగుల్లా పీడ

ఎఱ్ఱన్నా గోరినాడు ఎలమంచిపట్నం ఎలమంచిపట్నం
ఎద్దుల్లు కోరినాడు మద్దుల్లా సీత మద్దుల్లా సీత
మెత్తని కాళ్ళకూ మెరుగు పెళ్ళల్లూ మెరుగు పెళ్ళల్లు
మేనత్తా కొమురమ్మా మేనకోడల్ని మేనకోడల్ని
కాకరాచెట్టుకూ కాయలందమ్మా కాయలందమ్మా
కాశికిపోయె ఒక్కనీకి కాపడిందమ్మా కాపడిందమ్మా
చిక్కుడూ చెట్టుకు తీగెలందమ్మా తీగెలందమ్మా
చిన్న నా సిరిదేవి వచ్చునామేడ వచ్చునామేడ

ఈ పాటలో నున్న పల్లికొండ, ఐతన్న, నెల్లూరు, ఎఱ్ఱన్న, ఎలమంచి, కొమురమ్మ, సిరిదేవి మున్నగు పేర్లన్నియు కాటమరాజుకథకు సంబంధించినట్టివే. చువ్వి, రాగుల్లా, మద్దుల్లా, పొంటి శబ్దములు సువ్వి, రాగి, మద్ది, వెంబడి శబ్దములకు తెలంగాణ జానపదరూపములు. కాకరచెట్టుకు చిక్కుడుచెట్టుకు చరణములు ప్రక్షిప్తములు కాబోలు. ఈ చరణములు వేరే పాటలందును కలవు.

సిద్దిపేట తాలూకా అంకిరెడ్డిపల్లి గ్రామమున సేకరించిన యొక రోకటి పాటలో చెల్లెలు వడ్లు దంచి అలసిపోయి అన్నగారిని వదినను తనకు సహాయ మంపుమని కోరును. అన్నగారు నిద్రపోయిన భార్యను లేపనొల్లక చెల్లెలితో కొంచెము కటువుగా మాటలాడెను. ఆమె యలిగి తనయింటికి వెడలిపోయెను ఆడబిడ్డ శోకముచే అన్నగారియింట అరిష్టములు సంభవించినవి. భార్యకు జ్వరము వచ్చినది. ఎద్దుకాలు విరిగినది. చెల్లెలిశోకమే కారణమని ఎరుకత గద్దె చెప్పినది. ఇది తెలిసికొన్న యన్న ఆమెకు చీరరవికలు కొని ఆమె యూరికి పోయి బతిమాలి తనయింట శుభకార్య మున్నదని తోడ్కొని వచ్చెను. దీనిలో వడ్లెండబోయుట, రోకండ్లు రోలు మున్నగునవి ఎట్లు వర్ణింపబడినవో గమనింపుడు.

'వజనాలబండమీద1 వడ్లెండాబోసి-ఉల్లిపువ్వుల జల్లెడ మల్లెల్ల చాట2
వడ్లోడు3 జేసిన వన్నెలా గజము4-కమ్మరోడు జేసిన గంటల్లా పొన్ను
కుమ్మరోడు జేసిన కూటి కుందేన-కుసుమ రోలూ దుడిచి కుందెండ్లూ బెట్టి
కంకణాల చేత గజ మందూకోని-ఉంగురాల చేత ఊది పోటేసి
ఒక్కదానీ పోటు ఒనగూడాదన్న-వదినేను లేపరా అన్న రఘురామ
దంచూతె దంచరాదె ఊకె పోరాదె-నాయాలిని లేపనే సగము నిద్దురల్ల
పాయెనే చెల్లేలు అత్తవాడల్ల-ఆడుబిడ్డ పోయినంత ఐదు ఒద్దుల్ల

1. వజ్రాల బండ కావచ్చు 2. చేట 3. వడ్రంగి 4. రోకలి

బండి గట్టవురన్న బండిగట్టవుర-బండి వున్నది గాని ఇరుసు ఇరిగింది
అరికీ జరమొచ్చె ఎద్దుకాలిరిగె-అన్నుంచి రామన్న అంగడెల్లిందె
దోసెడన్ని ముత్యాలు దోతికొంగూనా- ఎనుకాలి నాంచారి వల్లా1 జూడావె
అల్లులా2 వచ్చినది ఆడబిడ్డ శోకం-అన్నుంచి రామన్న అంగడెల్లిందె
అంగడి తోవల్ల చీరెరైకల్లు-చీర రైకల్లు చిన్న సొమ్మూలు
రావు చెల్లేల రావు చెల్లెలా-నాయింట లగ్గాము3 రావు చెల్లేల
ఆదికాలంనాడు అన్నన్నామాట-ఎదురుగుండెల నాకు ఇమ్మయ్యి మెరను
మూడువేలా చీరె నల్లంచూ రైకె-ముందు నీ కరునమ్మ5 రావు చెల్లేల
నాల్గువేలా చీరె ముత్యాల రైకె-నాయెంట చెల్లెలా రావమ్మా నువ్వు
పాదివేలది చీరె పట్టంచూ రైకె-పసుపుకుంకుమదాన రావె చెల్లేల

ఈ పాటయందలి భావము భాష రెండును అసమానమైనవి. చెల్లెలి యలుక అన్నగారి అనునయము చక్కగా చిత్రింపబడినవి. మాండలికములు బాగుగా ప్రయోగింపబడినవి. మొదటి నాలుగు చరణములు జానపదుల కల్పనకు మచ్చు. చెల్లెలిని పసుపుకుంకుమదాన యనుట చాల మనోహరముగా నున్నది. ఐదువ రాలా యని యొక యర్థము. పసుపుకుంకుమల (కట్నముల) కధికారిణివి యని మఱియొక యర్థము. ఆడుబిడ్డలేనిది మంగళకరమగు కార్యమేదియు జరుగనేరదు కదా. ఇట్టి యమూల్యమగు పాట లెన్నియో రోకటి పాటలుగా నున్నవి.

సెలయేరులో 'పల్లోళ్ళ కుఱ్ఱోడు' శీర్షికతో నొక గేయము కలదు. దీనిని శ్రీ చింతా దీక్షితులుగారు కూడ ఒక భిక్షుకుని నోట విని 'జయంతి' పత్రికలో ప్రకటించిరని దేవేంద్రసత్యార్థిగా రనుచున్నారు6. దేవేంద్ర సత్యార్థిగా రీగేయము నాంగ్లమున ననువదించియున్నారు. పల్లె కుఱ్ఱవాడు (జాలరి - బెస్త) పీడిత వర్గమునకు ప్రతినిధిగానుండి నియంతృత్వశక్తుల బాధలకు దుఃఖించుచున్నటుల వ్యాఖ్యానము చేయబడినది. అట్టిగేయము తెలంగాణమున నేనొకటి సేకరించితిని. ఇది యొక ఏతము పాట. ఏతములు త్రొక్కుచు పాటలు పాడుట ప్రాచీన కాలమునుండి వచ్చుచున్నది. ప్రకృతి పరిశీలనము బాగుగా చేసిన—జానపదుల జీవితమును చక్కగా చిత్రించిన శ్రీకృష్ణదేవరాయ లీ పాటలను తడవియున్నాడు.

శా. ప్రాతర్వేళల నట్టివెట్ట సొగసై పాటిల్లె కుంభోంభనో
దూ్భతాంబుధ్వనివాద్యమై మరుదధఃపుంజీభవత్పాటల
వ్రాతామ్రేడిత సిక్తభూసురభిళారామంబు కుల్యాబహు
స్రోతస్పంధుల నంధుయంత్రవతికృత్రోద్గీతగేయౌఘముల్"7

1. శకునము 2. వల్లలో 3. లగ్నము, పెండ్లి 4. అమ్మ గావచ్చు 5. అరణము,
6. Modern Review, May 1942. 7. ఆముక్త మాల్యద 2-55.

కృషీవలుడగు జానపదుడు మన దేశమునకు కూడు పెట్టువాడు. రక్తమును నీరుగా పారించి రేయింబవలు కష్టించి పనిచేసి పంటలు పండించి మన కన్నము బెట్టును. కాని మనదేశదౌర్భాగ్య మేమిటోకాని "వాడు చెమ్మటలోడ్చి ప్రపంచమునకు, భోజనము బెట్టు వానికి భుక్తి లేదు."1 బ్రిటిషువారేర్పరచిన వ్యవస్థలో పట్టణములందుండు ప్రభువులు, గ్రామములందుండు అధికారులు, బీదరైతును పీల్చి పిప్పియొనర్చిరి. ఇతరులకు తిండిని పండించుచు తానెండి యుండెడు కృషికుని హృదయభార మీ గేయమున గాంచనగును. ఇది బ్రిటిషురాజ్యము సుస్థిరమైన తర్వాత పుట్టిన గేయమై యుండవలయును.

ఏటి కేతంబెట్టి ఎయి2 పుట్లు బండించి
ఎన్నడో మెతుకెరుగరన్నా-నేను గంజిలో మెతుకెరుగరన్నా ' ||ఏ||
కాల్జేయి3 కడుకోక్కని కట్టమీద కూనుంటె4
కాకి దన్నీపాయెరన్నా కాకిపిల్ల దన్నీపాయెరనాన్నీ ||ఏ||
పోరుకూ చాల్లేక పోయికాడ కూనుంటె
పోతి దన్నీపాయెరన్నా పోరితల్లి దన్నీపాయెరన్నా ||ఏ||
చుక్కపొద్దున లేచి బొక్కె నెత్తుకపోంగ
బొక్కబోర్లాబడితిరన్నా - నేను పక్కలిరగాబడితిరన్నా ||ఏ||
నాదేటి బ్రతుకాయెరన్నా-నేను నాడె చావకపోతిరన్నా ||ఏ||

ఈ పాటలో కాకి శబ్దము గ్రామాధికారిని సూచించును. గ్రామాధికారి తన్నగా చూచి అతని కుమారుడు (కాకిపిల్ల)గూడ నా బీదరైతును తన్నిపోయెను. వారి పోరుకు (చాల) తాళలేక ఆ బీదరైతు తన గుడిసెలో ప్రొయ్యి చెంతకు బోవ నాతని భార్య పిల్లలుకూడ ఈసడించుకొనిరి. పేదవానిని ఇంటివారు కూడ గణింపరు కదా! ఇటు గ్రామాధికారులతో తన్నులు దిని, అటు ఆలుబిడ్డల యీసడింపులకు గురియైన నాదరిద్రకృషీవలుడు దైవోపహతుడు కూడ. బొక్కెనెత్తుకొని చుక్క ప్రొద్దున పోవుచుండగా బొక్కబోర్లపడెను. ఎంత హృదయవిదారక మీ గేయము.

కృషికి సంబంధించిన గేయము లనేకవిధములుగా నుండును. పైన నొక ఏతముపాట నుదాహరించితిని. ఇటులే మోట (కపిలె), నాటు, కలుపు, కోత, నూర్పుడు (కళ్ళము) మున్నగు వానికి సంబంధించిన గేయములు కలవు. నదులు, కాలువలు, చెరువులు మున్నగు జలసౌకర్యములు లేనిచోట బావులు

1. గబ్బిలము-శ్రీ జి. జాషువ 2. వేయి 3. కాళ్ళుచేతులు 4. కూర్చొనియుండగా.

త్రవ్వి భూగర్భమునుండి భగీరథప్రయత్నమున జలములు పైకి దెచ్చి జొన్న, వరి, చెరుకు, గోధుమవంటి పంటలు పండింతురు. బావినుండి పెద్దపెద్ద బొక్కెనలతో ఎద్దులు కట్టి నీరు తోడు పద్ధతిని తెలంగాణమున మోటయనియు తెలంగాణము బయట కపిలెయనియు పిలుతురు. రాయలసీమలోను తెలంగాణ మందలి పాలమూరు మండలమునను ముక్తకములవంటి కపిలెపాటలు బహుళ ప్రచారమున నున్నవి. కన్నడదేశమందలి బళ్ళారి, తుముకూరు, కోలారు, ప్రాంతములలో కన్నడపాటలతోపాటు తెలుగు కపిలె పాటలును ప్రచారమం దున్నవి. ఇట్టి పాటలకై ఆంధ్రప్రదేశ సంగీతనాటక అకాడమీవారు ప్రచురించిన "త్రివేణి" సంకలనమును, బెంగుళూరు జానపదసమితివారు ప్రకటించిన "అలిచిప్పలు-ఆణిముత్యాలు" సంకలనమును చూడనగును. ఒక మోటపాటలో ప్రియురాలు తన ప్రియుని సంబోధించి ఆతని, అతని మోట సామగ్రి నేతీరుగా వర్ణించుచున్నదో గమనింపుడు1.

'చింతకిందిరో మోటవాదరా,చిరుగు యామంచి ఎడ్లజోడోయీ
నీ యెద్దుల మెడమీద మదిరకాడోయి-నీయెద్దులమెడకున్నా బద్దెపెలుపోయి
నీ వలపాటి ఎద్దూర వన్నెలాడోయి-నీ దాపాటి ఎద్దోయి ధర్మరాజోయి
నీ వలపాటి దారోయి పిల్ల బాటోయి-నీ దాపటి బాటోయి దండుబాటోయి
నీ మోకు పేరోయి ఆకు తీగోయి-నీ తొండపు తాడోయి కిన్నర తీగోయి
నీ మోట పేరోయి మొగిలిగుమ్మోయి-నీ బిళ్ళ పేరోయి భీమరథమోయి
నీకదురు పేరోయి కన్నెలాడోయి-నీ బొక్కెన పేరోయి బొడ్డుగిన్నోయి
నిన్ను జూడరో నీళ్ళ కొస్తిరా-నీళ్ళు లేవురా నీవు లేవురా
ఎక్కడ జూచిన ఎవరూ లేరోయీ-చెప్పరాని దుఃఖమొచ్చెనూ
కంటిశోకము కడువ నిండేనూ-కడువల నీరోయి మడువ సాగేనూ
మడువ మలిపే మామ కొడుకూరా-ఓ మామ కొడుకూరా
ముత్తెమంతాదోయి ముక్కుతీగోయి-మడువకేసి నువు మళ్ళగట్టోయి
వంపుబట్టెను వరుద లెల్లేను-మిట్టపట్టెను మిగులు బారేనూ
జామతోటను జాములెల్లేనూ-నిమ్మతోటను నిల్చిపారేనూ
అరటి తోటల అలుగులెల్లేనూ-మామిడితోట మళ్ళిపారేనూ'

తమ కిష్టులగు వారిపై అధిక ప్రేమ మున్నప్పుడు వారికి సంబంధించిన ప్రతివస్తువుకూడ నంతియ ప్రీతిపాత్రమగును. ప్రియుని జూడ మోటబావి చెంతకు వచ్చిన ప్రియురాలు మోటకు సంబంధించిన ఉపకరణము లన్నింటిని

1. దీనిని నల్లగొండ జిల్లా [illegible] గ్రామమున (14-4-1952) సేకరించితిని.

వర్ణించుచున్నది. చింతక్రిందనున్న మోటబావి యగుటచే మోట లాగెడు ఎడ్ల గూడ మంచి (చింత) చిగురుతో పోల్చబడినవి. ఆ చిగురు పెద్దుల జోడుల దాపటిది ధర్మరాజట, వలపటిది వన్నెలాడియట. ఎద్దులుకూడ ప్రియాప్రియు వలె నామసామ్యముచే స్త్రీపురుషులయినవి. ఎద్దులమెడపై నున్న మదిరకా వానికి కట్టబడిన బద్దెపలుపులుగూడ నామె దృష్టికి వచ్చినవి. ఆమె దృష్టిలో మోకు ఆకుతీగయైనది. తొండపుతాడు కిన్నెరతీగ యైనది. మోట మొగిలిగుమ్మ యైనది. బిళ్ళ (పెద్దగిరక) భీమరథమైనది. కదురు కన్నెలాడియైనది.బొక్కె బొడ్డుగిన్నె యైనది. ఎంత చక్కని యుపమానములు! ప్రియుని జూడవచ్చి నందు కాతడు కానరాలేదు. ప్రియురాలికి చెప్పరాని దుఃఖము వచ్చినది. కం నీరు కడవనిండినది. శిష్టసాహిత్యమందువలె జానపద సాహిత్యమున గూ కొన్ని కవిసమయములు సంప్రదాయములవంటివి అవిచ్ఛిన్నముగా నంత గాననగుచున్నవి. 'చెక్కవచ్చి చెంపదగులు'ట, 'చెప్పరాని దుఃఖమొచ్చె'ట 'కంటినీరు కడవనిండు'ట, 'కొమ్మ తూగి (ఊగి) కొప్పు నిండుట' వంటి కాకతిసీమ,చాళుక్యసీమ, రాయలసీమలందలి పెక్కు గేయములందు కానవచ్చు సంప్రదాయములు. కంటినీరు కడవ నిండుట విరహగీతములందు పరిపా యైనను కడవనీరు మడవసాగుట ఈ పాటలోనున్న విశేషము. అటుల సాగి మడవకు తన ముక్కుతీగ-ముక్కరనడ్డముగా వేసి మామకొడుకును నీ మలుపుమనుచున్నది. ఆ నీరు మిట్టపల్లములనక పారి జామ, నిమ్మ, అరటి మామిడితోటలు పారినది. మధురభావనముతోపాటు కల్పనాచమత్కారముగూ ఈ పాటయందు కానవచ్చుచున్నది. పాటలోని దృశ్యమంతయు నొక చక్క చిత్రము గీయవచ్చును. మోటకు సంబంధించిన పాటలందు

'మోట దొలిగెరా పిల్లడా-మోట దోలరా' 'నాగులోడా పోగులోడా'

యనుపాట లట్టి మధురభావములతోడను మనోహరదృశ్యముల తోడ తెలంగాణ మాండలికముల తోడను చక్కని నుడికారములతోడను నున్న

భూసంబంధమగు కృషికుల పనులు ఏరువాకతో నారంభమగున కొంద రాధునికులు దీనిని ఏరురాక యనివ్రాసిరి. ఈ పండుగ జ్యేష్ఠపౌర్ణమనా చేతురు. ఏరువాక యనగా దుక్కియొక్క ప్రారంభము. ఏరువాకపున్నమ దెద్దుల నలంకరించి పూజించి ఊరిబయటకు దోలుకొని పోదురు. ఈ యాచారవ పూర్వకాలమునుండి యున్నట్లు జైమినీయన్యాయమాలాగ్రంథమున హోలా

కరణమున 'సూ. ఉద్వృషభయజ్ఞాదయ ఉదీచ్యైః జ్యేష్ఠమాసస్య పౌర్ణమాస్యాం బలీవర్దాన్ అభ్యర్చ్య ధావయంతి సోఽయమ్ ఉద్వృషభయజ్ఞః' అని చెప్పబడి యున్నట్లు శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు వ్రాసియున్నారు[1]. భావసౌకుమార్యము గల యొక ఏరువాక పాట బహుళ ప్రచారము గాంచినది. ప్రోషితభర్తృక యొర్తు ఏరువాక వచ్చుటతోడనే తన బావ వచ్చునని ఉప్పొంగిపోవుచు పాడుకొన్న గీతమిది.

'తొలకరీ ఒకమబ్బు తొంగి చూచింది-మబ్బులో ఒక మెరుపు మెరిసిపోయింది
పెరటిలో ఒకజల్లు కురిసి వెలిసింది-జల్లులో నామనసు జారిపోయింది
ఏకొమ్మ మీదనో ఎండతాకిన పిట్ట-ఏటిత్రోవలు పట్టి ఎగిరిపోయింది
ఏరువాకనాటి కేడాది దాటింది-ఎదురుచూచిన గుండె చెదిరిపోయింది
పిట్టపిట్టా ముద్దు పెట్టుకున్నాయి-గోవులన్నీ ఇల్లు చేరుకున్నాయి
ఏటిగాలికి చిలుక లెగిరి పోయాయి- ఎందుకో నాఆశ లెగిరిపోయాయి
ఏటి ఒడ్డున నేను పాటబాడేవేళ-నవ్వుతూ మాబావ పువ్వులేరేవేళ
కొంటె కోయిల పైన కూత కూసేవేళ-లేతమనసులు విచ్చి పూతపూసేవేళ
బావొచ్చి నాతోటి బాసలాడాలె-ముద్దొచ్చి నాతోటి మురిసిపోవాలె
ఏరువాకమ్మ మాకెదురు రావాలె-తలవంచి మము చూచి దీవించి పోవాలె'

బావరాక కెదురుచూచు మరదలి తీయని కోరికలు, మధుర స్మృతులు, లలితములగు శబ్దములలో చక్కగా పొదిగినవి. జల్లులో మనసు జారిపోవుట, మనసులు విచ్చి పూతబూయుట-ఎదురు చూచిన గుండె చెదరిపోవుటవంటి భావములు ఆధునిక మధురభావములకు పూర్వరూపములట్లున్నవి.

వానలు కురువవలయుననియు వరిచేలు పండవలయుననియు తమ దారిద్ర్యములు తొలగవలయుననియు సమస్తజనులకు సంపదలు కలుగవలయు ననియు పాడుకొను జానపదుల హృదయ మార్గగీతముల దలపించును. 5-8-1953 నాడు ఏ.ఐ.ఆర్. మద్రాసువారు ప్రసారము చేసిన ఈ గేయమును గమనింపుడు

| | | | |
|---|---|---|---|
| వానల్లు కురవాలి | వానదేవుడా | వరిచేలు పండాలి | వానదేవుడా |
| పన్నెండు ధాన్యాలు | ,, | బండమీద పండాలి | ,, |
| మాకడుపు నిండాలి | ,, | కుంట చెరువు నిండాలి | ,, |
| బీదసాద బతకాలి | ,, | పేదసాద బతకాలి | ,, |
| కూలినాలి దొరకాలి | ,, | | |
| పారిపోయిన బావ | ,, | వరుగెత్తి రావాలి | ,, |

1. హిందువుల పండుగలు,

| | | | |
|---|---|---|---|
| ఊరికెళ్ళిన బావ | వాన దేవుడా | ఊరికురికి రావాలి | వాన దేవుడా |
| తల్లిలేని బిడ్డలు | ,, | తండ్లాట పడ్తారు | ,, |
| పసిబిడ్డ బాలకులు | ,, | | |
| చెరువంత మబ్బుపెట్టి | ,, | | |
| తూరుపున మబ్బుపట్టి | ,, | తుళ్ళితుళ్ళి కురవాలి | ,, |
| పడమట మబ్బుపెట్టి | ,, | పట్టిపట్టి కురవాలి | ,, |
| ఉత్తరాన మబ్బుపట్టి | ,, | ఉరికురికి కురవాలి | ,, |
| వాగు తల్లి నిండాలి | ,, | వరిచేలు పండాలి | ,, |
| కప్పతల్లి సీళ్ళాడి | ,, | కడవల్లు నిండాలి | ,, |
| దబ్బుకు తవ్వెడు బియ్యం,, | | మనిషి కిద్దరు పెండ్లాలు | ,, |

ఇట్టిగేయము లౌత్తరాహులకును కలవు. ఇటువంటి వానిని వేదబుక్కులందలి వారుణస్తోత్రములతో పోల్చుచు డా.సత్యేంద్రపండితుడు చక్కని విమర్శనము చేసియున్నాడు1. తొలకరించినంతనే 'తొలకరించిందమ్మ తొలకరించింది'2 యనియు 'వరద వచ్చె వరదవచ్చెరా'3 యనియు 'మోట నాగలి దున్నుకుంటూ పాటలేవో పాడుకుంటూ'4 ఉప్పొంగిపోయెదరు.

ఎండకాలమే చాలు పెట్టిన దుక్కి తొలకరి చినుకులకు తడియుటతోడనే కర్షకులు దున్నుట కారంభింతురు. వారి భార్యలు నాగేటిచాలుల వెంబడి నడచుచు విత్తనముల జల్లుచునో 'గడ్డపగులగొట్టు'చునో నడుచుచుందురు. పురుషులుత్సాహముతో దున్నుచు సాగిపోవుచుండ అలసిపోయిన స్త్రీలు వారినను గమింపలేక ఏదో సాకుతో 'ముందటేరు దున్నువాడ-ముద్దుల మేనత్తకొడుక-దాపటెద్దుకు దప్పికాయేను-ఓరందకాడ నరసయ్యబావా-సీల దింపి నీలబెట్టబ్బీ' యని వారి నాపజూచెదరు. ఆషాఢమాసమునం దధికముగా కృషీవలులు పాడుకొను నిట్టి గేయముల నౌత్తరాహులు (असारेगीत) 'అసారే గీత'ము లందురు5. వ్యవసాయము చేయుటకు మొగదిక్కులేని యొక స్త్రీ తన భూమి నెవ్వరైన అమరకమునకు దున్నగలరేమోయని యడుగు గేయ మొకటి కలదు.

'రాయంటి నా మొగుడు రంగమెల్లి తిరిగిరాలేదు
నాచేను దున్నాలి నాకు రైతు మంచివాడు కావాలి ||రా||
మాయ చంగలిత్తుంగ మత్తుగా బెరిగింది

1. బ్రజలోక సాహిత్యకా అధ్యయన్ ब्रजलोक साहित्य का अध्ययन
2. ఎ.ఐ. ఆర్. జూలై 1954. 3. 28-8-1953 ఎ. ఐ. ఆర్. 4. 22-7-1955 ఎ. ఐ. ఆర్. 5. ధర్తీగాతీహై. శ్రీ దేవేంద్ర సత్యార్థి.

తీయలేకను వదులుకున్నాను-నాకు-దిక్కు లేకను మ్రొక్కుచున్నాను
కాని మేఘములట్టి కమ్ముతూ నెలనెలకు
మానకుండా వాన కురిసేను-లో మాన్యములో-తొలకరించేను ||రా||
బీటుచేను నాది వాటముగ దున్నాలి
రాటుకూపోటుకూ ఆగాలి-ఆరైతు-మోతిబారై యుండాలి ||రా||
ఏటికోలకు నాగలేలవు పన్నేయించి
మోటైన గిత్తలా కట్టాలీ-ముప్పొద్దు యినుమారు తోలాలి ||రా||
గడపలున్నా కాడ కరుకోల దగిలించి
కాళ్ళెత్తి నొక్కితే గడ్డంత యేళ్ళతో ||రా||
భళ్ళభళ్ళన పెకిలి పోవాలి-ఆ-బలిసియున్నాగడ్డి చావాలి ||రా||
గుండ్రదిబ్బలపైన రెండు చేతులతోటి-గండ్రనాగలిమేడి కదలకుండా నిలిపి
కోండ్రోసి నొక్కితే నాగాలీ-పణత-రేగాడిలోన మునగాలి ||రా||
మెరక పల్లంజేసి మెత్తగా దున్నాలి-తరగకుండా నీరు చెరువులాగుండాలి
ఇరుగు తరుగూలేక పండాలి-మా-యెగసాయమే బాగుచెయ్యాలి ||రా||
యెవరైన చేయగలిగితెల్లి చూసుకొండి-యీవలావల గట్టు లోవలోపల గాడి
యిరుకు పుంతకు దారి వివరించి చూసితే
ఎదర మోడున్నాదె మాచేను-ఇష్టమైతే కవులు కిస్తాము ||రా||

పై పాటలో దుక్కిచేను దున్నవలసిన తీరంతయు చక్కగా వర్ణింప బడినది. పైకికనబడు అర్థమే సరియైనదగుచో ఈపాట వ్యవసాయమునకు సంబంధించిన పాటలందు శ్రేష్ఠమైనదిగా భావింపవచ్చును. కాని ఈ గేయమున పచ్చి బూతు - శృంగారము - కూడ ధ్వనించుచున్నదని నాభయము. అదికూడ నున్నచో నీచశృంగార మంత గుప్తముగా నభివర్ణించిన-జానపదకవిని తిరస్కార భావముతో నైనను మెచ్చుకొనక తప్పదు. ఇట్టిపాటలు 'ఘుమఘుమాపాటల' పేరుతో కొన్ని ప్రచురింపబడినవి. శ్రామికుల జీవితమున వేషభూషణముల యాడంబరము, అధిక్యము, ఆహారపానముల సౌఖ్యము తక్కువ. వారికి మిగిలినది శరీరసుఖమే. వారి ముక్తాయింపులు మొత్తముమీద విషయసుఖము పైపునకే మ్రొగ్గుచూపుట కిదియే కారణము. ఫ్రాయిడ్ మహాశయుడు తన 'లిబిడో'సిద్ధాంతమున దీనిగూర్చి చెప్పెను. 'లిబిడో' యనగా **"The energy of those instincts which have to do with all that may be comprised under the** *Love* **"**. శ్రామికుల పనిపాటలందీ 'లిబిడో' స్ఫుటముగా ధ్వనించును. సంగీతమే కాక శరీర సుఖమునకు సంబంధించిన

యూహలు కూడ గ్రామికుల కుత్సాహము నొసంగును. రోడ్డు రోలరు లాగెడు పాట 'బోయిలర్లను కట్టుముంగలపై జరిపెడు వారి 'జంబయిలే జోరులంగరి' పాటయును, మెరికనెక్కిన పడవను నీటిలోనికి ద్రోయుచు పాడెడు పడవవారి 'సన్నజాజి ఐలేసా, చీరకట్టి ఐలేసా' యనుపాటయును ఇట్టివే. వీనిని ప్రచురించు నప్పుడు ప్రచురణకర్తలు అచ్చటచ్చట కొన్ని బూతుమాటలు తీసివేసి ప్రచురించుట యలవాటు. విలాసముగా పాడెడు గారడివాని పాటలం దాకర్షించుటకును, బరువులు లాగెడు పాటలందు శ్రమాపనోదనమునకును బూతులు ప్రవేశించును. గ్రామికగేయములం దెన్నియో బూతుపాటలు కలవు.

వ్యవసాయమునకు సంబంధించిన గ్రామికగేయము లింకను కలవు. విత్తనములు చల్లునపుడు, వరినాటు పెట్టునప్పుడు (నాటుపాటలను ఔత్తరాహులు रसियागीत 'రసియాగీతము' అందురు1.) కలుపుదీయునప్పుడు, కోత లప్పుడు, శ్రమాపనోదనమునకు, నూతనోత్సాహము కలుగుటకొరకు పాడుకొను పాటలెన్నియో కలవు. మచ్చుకొక పాటచొప్పున దీసికొన్నను గ్రంథము పెరిగిపోవునను భయముతో వాని ప్రశంసను మానుచున్నాను. పండిన గింజలు దులుపుకొని ధాన్యరాసులు పోసికొనునప్పుడు కళ్ళములో వ్యవసాయమునకు సంబంధించిన చివరిఘట్టమున పాడదగిన పొలిపాటలు - పొలిపదములు - పాడు కొందురు. ధాన్యరాసి చుట్టు గీతగీయుదురు. దానిని పొలియందురు. అది గీయు నప్పుడు తెలంగాణమున 'పొలిగోలిగ' యందురు. అప్పుడు పాడెడు పాటలను పొలిపదము లందురు. పొలికేకయను శబ్దమొకటి కలదు పొలిమేరయను పదమందరెరిగినదే పొలియన్న 'సరిహద్దు' కావచ్చును. పొలియనగా లాభమను అర్థముగూడ కలదు. 'పొలిగోలిగ' శబ్దము 'పొలి గలుగు' శబ్దమునకు జానపద రూపమై యుండును. బర్కత్-లాభము కలుగవలయునని ధాన్యరాసి చుట్టు ఈ పొలి గీయుట ఆచారము. పొలిగీయక ధాన్యరాసిని కొలిచినచో బరకత్-లాభముండదని కృషీవలుల నమ్మకము. తద్భవపదముగా పొలికర్థము బలియని కలదు. పొలికలను - యుద్ధభూమి, పొలికేక - యుద్ధఘోష (war cry) శబ్దము లున్నవి. సందర్భము ననుసరించి పొలిపదమునకు లాభమని యర్థము చెప్పుకొనిన బాగుండును. తమకృషి లాభింపవలెనని కృషీవలులు పాడుకొనుట యసమంజసము కాదు. పొలి, పొలిగాడు, పొలికేక, పొలిమేర, మొదలైన శబ్దములన్నియు పొలియను ప్రజననదేవతకు సంబంధించినవి. తెలుగువారికి

1. धरती गाती है

ఆస్ట్రిలాయిడ్ జాతులతో సంబంధమున్నదందురు. ఈ జాతులకు చెందిన మెలినీషియనుల (కృష్ణాసియనుల) ప్రజనన దేవత పోలేరు. వ్యవసాయమున నీ దేవతకు ప్రాధాన్య మెక్కువ. తొలి తెలుగువారి ప్రజననతంత్రములు వాని విధులు ఈనాడు అర్థరహితముగా కన్పట్టినను ఆస్ట్రిలాయిడ్ జాతులవారి ఆచారవ్యవహారములతో పోల్చిచూచిన వాని ప్రాముఖ్యము తెలియగలదు[1]. పొలిపాటలు శ్రీ గంగాధరంగారు ప్రకటించియున్నారు[2]. 'రోజులు మారాయి' యన్న వెండితెరకీ పొలిపదముల దృశ్యమెక్కినది. 'రావేలు గలవాడ రార పొలిగాడ' యను పొలిపదము దేశమందంతటను పాడబడు గేయము. ఇది పాడినచో ధాన్యరాసులు 'దున్నలూ దొక్కంగ దిన్నెలా పొదవు, ఎద్దులూ దొక్కంగ ఎన్నులా పొడు'గై వర్ధిల్లునని వారి నమ్మకము. ఎండయనక వానయనక చెమటోడ్చి శ్రమాపనోదనమునకు మధ్యమధ్యన పాటలు పాడుకొనుచు నూతనోత్సాహమును పొంది పొలిపదముల (లాభము కలిగించు పాటల)తో కడతేరెడు కృషీవలుల జీవనము ధన్యము. భారతదేశమునకు వ్యవసాయము వెన్నెముకవంటిది కనుక ఈ శ్రామికులగేయముల నింత విపులముగా చర్చింపవలసివచ్చినది.

కార్మికులకు సంబంధించిన గేయములు కొలదిగనే లభించుచున్నవి భారతదేశము ముఖ్యముగా వ్యవసాయముపై నాధారపడిన దేశము. ఇచట నితర దేశములందువలె 'భారీపరిశ్రమ' లధికముగా లేవు.ఇప్పుడిప్పుడే భారతదేశమున పారిశ్రామికయుగ మారంభమగుచున్నది. భారతదేశమున తక్కిన ప్రాంతముల కన్న నాంధ్రప్రాంతమున పరిశ్రమలు, కర్మాగారములు తక్కువగా నున్నవి. కనుకనే మనదేశమున వ్యవసాయమునకు సంబంధించినకూలీలతో పోల్చినప్పుడు కార్మికజనము చాల తక్కువయని చెప్పుకొనవలయును. అటులే కార్మికుల గీతములును తక్కువగనే యున్నవి.తెలుగువారు పెక్కుమంది కార్మికులుగా రాష్ట్రము బయటనే యున్నారు. బొంబాయి, షోలాపురము, తాతానగర్ వంటి ప్రదేశములందు తెలుగువా రనేకులున్నను దేశమునకును,భాషకును,సంస్కృతికిని దూరముగ నుండుటచే నట్టివారి వాఙ్మయముకూడ తెలుగుదేశమున వ్యాప్తి గాంచలేదు. తెలుగువార లనేకులు పనికొరకై రంగూన్ వెడలిరి. శ్రామికులు

1. తెలుగునాట ప్రజనన తంత్రాలు-దేవతలు. శ్రీ తిరుమల రామచంద్ర. ఆంధ్ర పత్రిక-ప్రమాది సంవత్సరాది సంచిక 1973-74 పుటలు 134-139. 2. నేలయేరు.

రంగూన్‌ను రంగమందురు. రంగూనుకు పోయెడివారి ఓడపాటలు కొన్ని యున్నవి. 'రంగమెల్లి పోదామె నారాయణమ్మ' వంటి పాట లీకోవకు చేరినవే. వీనిగూర్చి శృంగారగేయప్రకరణమున చర్చించినాను. రాయవరము బద్దు సీతా రామయ వ్రాసిన'రంగం పదములు'వెస్టువార్డు కంపెనీవారు 1938లో ప్రచురించి యున్నారు. రంగూను రంగస్థలముగాగల పాటలు ఆధునికములని చెప్ప వచ్చును. తెలుగుకార్మికులు కూలి నిమిత్తమై దూరదేశములకు పోయిన సన్నివేశము లిందుండును. బర్మా, రంగూన్, అస్సాము పోయినవారు కష్టించి ధనము కూర్చుకొని విజయయాత్రగా ఇండ్లకు తిరిగివత్తురు. ప్రోషితభర్తృకా శృంగారమునకీ గేయములు మంచి యాధారములు. ఇట్లు దూరదేశములు తిరిగి వచ్చిన కూలివారు విశాలప్రపంచమును చూచినవారు. సాంఘికనిశ్రేణి కడ మెట్లపై నిలుచుండుటకు వీరంగీకరింపక తిరుగుబాటు చేసిరి. ఉన్నతవర్గముల వారి యాధిక్యమును ప్రశ్నింప మొదలిడి సాంఘికవిప్లవమునుగూడ తెచ్చిరి. రంగూను, మోలుమేను పట్టణప్రాంతములలో కష్టించిన వీరలు మోల్మేను పెట్టెలను పెద్దపెద్ద టేకుపెట్టెలు మనదేశమునకు గొనివచ్చిరి. అధికముగా నిటుల పోయిన కూలిజనము కోస్తాప్రాంతమువారు.

కర్మాగారములందుగాని, మిల్లులందుగాని బరువులు మోయునప్పుడు, బస్తాలు మోయునప్పుడు, పురుషులు పాడెడు దీర్ఘగేయ మొకటి కలదు. ఇది బావమరదలి సంవాదరూపమున నున్నది. దీనినే తెలుగుదేశమంతటను అనేక పాఠభేదములతో పాడుకొనుచుందురు. భుజములపై నున్న బరువుచే మూపు వంగి, దొబ్బలు బిగిసి ఊపిరి బలమున ముఖము కందగడ్డయైన శ్రామికుడు తానే బావయై తానే మరదలై పాటబాడుకొనుచు వీపుపై నున్న బరువును కొంత తేలిక యొనర్చుకొనును. ఆబరువే యాతని పాలిటికి మరదలేమో కనుకనే యాతడంతటి యుల్లాసముతో నవలీలగా బరువులు మోయగలడు. ఈ పాట దీర్ఘమైనదగుటచే నక్కడక్కడి చరణములు కొన్ని మాత్రమే యుదాహరించు చున్నాను.

ఏవూరు ఏదేశం పిల్లా నీది-కొవ్వూరు కొత్తపట్నమయ్యా మాది
పని నీవు సెయ్యగలవా పిల్లా నీవు - పనియంటె బద్ధకమయ్యా నాకు
కూడొండి పెట్టగలవా పిల్లా నీవు - వండుమంటె కొంప మునుగునయ్యా నాకు
ధాన్యమైన చెరగగలవా పిల్లా నీవు - ధాన్యమంటె దగ్గొస్తదయ్యా నాకు

సంతకెల్లి రాగలవ పిల్లా నీవు - సంతంటె సంతోషమయ్యా నాకు
రైకెమీద రామచిలుక రంగురంగులూ - చూపుచున్నవేంచె పిల్లా నీకు
వస్తావటే పిల్ల వస్తావటే - కొత్తకోరంగిదాక వస్తావటే
కొత్తకోరంగిదాక వస్తాగానీ మన - దారిఖర్చు దప్పిఖర్చు తెస్తావటోయ్
బేటీరాకుండనే కాసుకుంటాన్నానీ - నీవు - పొరిగిళ్ల కెడితేని -
పోకిళ్లపోతేని పడదీసి నీనోట గడ్డి పెడతానే

ఇంతవరకు సరసముగా సాగిన సంవాదము విరసమునకు దిగినది. బావగారి బడితెకు మరదలి నోటిబూతులు సమాధానములైనవి. 'కోర్టులో చార్జీ' పెట్టెద నని బావగారు బెదరించిన మరదలు 'తప్పుసాక్ష్య మిప్పించి తప్పుకొ'నుటకును 'ఇట్టమైనవాడితో ఎగిరి'పోవుటకును సిద్ధమైనది.

'ఇట్టమైనవాడితో ఎగిరిపోతేని-నిన్ను తన్నుకుంటు పొడుసుకుంటు తీసుకొస్తాను
తన్నుకుంటు పొడుసుకుంటు తీసుకొస్తేను-నీ-నిన్నింట్లొపెట్టి కొంపగాల్చి యెగిరిపోతాను
సరసమైన ఆడదానవె గుంటా నీవు-చాలుచాలు-పోపో బావా నీవు'

ఇట్టి విపరీతశృంగారసంవాదము బరువులమోత సందర్భమున నుల్లాసమును గలిగించి శ్రమము తగ్గించును. డెబ్బదిరెండు చరణములు గల ఈపాటను పదహారు చరణములలో కుదించి శ్రీమతి చామర్తి రఘునాథమ్మగా రాంధ్రప్రభ వారపత్రికయందు ప్రకటించియున్నారు. ఈ పాటయందలి మొదటి చరణములు తెలంగాణమున ప్రచారమందున్న

'కట్టెలు దెస్తావుర శివ్వా - నా - కడుపు నొస్తాదవ్వా
పిడుకలు దెస్తావుర శివ్వా - నా - పిక్కలు నొస్తాయవ్వా
మంచం దెస్తావుర శివ్వా - నా - మడిమెలు నొస్తాయవ్వా
.... .... .... ....
చిప్పదెచ్చుకోర శివ్వా - నే - నందుకు సిద్ధమవ్వా'

యను గేయమును బోలినవి. శ్రీ గంగాధరంగారి సెలయేరులో నున్న బరువు మోత పాట యొకటి.

జంబయిలో జోరు లంగరు - అవుర అవుర మనోళ్ళబ్బ
నీకు జారు లేదు బారు లేదు - నీకు రోసంలేదా మీసం లేదా
చల్లనీళ్ళా మల్లెమొగ్గా - ఉడుకు నీళ్ళా ఉల్లిపువ్వా
.................... ............... ...............

పైపాట నడచిన పద్ధతి బరువును, ఆ బరువును మోయుటకు శ్రామికుడు తెచ్చుకొను కృతక పౌరుషమును, (కృతకమేలయన పిల్ల తృణీకరింపగా

దెచ్చికొన్న-రెచ్చకొట్టబడిన పౌరుషమగుట ఉల్లాసమును చాటుచున్నది. ఇట్టివే సిసలైన జానపద గేయములు. ఏ చరణమున కాచరణ మొక పరిపూర్ణభావము. ఒకదానితో నొకటి కూర్చినచో 'అర్థాన్నపుటంగడిలో' దించును. 'పొయిత్రీ కాదు తొయిట్రీ' యగును.

ఆధునికకర్షకకార్మికగేయములు కొన్నింటిని ఆచార్య రంగాగారు ఆంగ్లమున ననువదించి ప్రకటించినారు1.ఆ పాటలపై శ్రీ దేవేంద్ర సత్యార్థిగారు విపులమగు వ్యాఖ్యానము నొనర్చిరి2.

నేను సేకరించిన కార్మికగేయములు శృంగారగేయములు.

'బొంబాయి సికె ముడిస్న-బొబ్బిలి బొట్టు పెడితే
సీనిమాలోల్లంత-నిన్నె సూతురు సీలా'యను దీర్ఘ గేయము ఆధునికమై యుండును. దీనిలో సినిమాప్రశంస యుండుటచే ఆధునిక మంటిని. బొంబాయి మిల్లులో పనిచేయు తెలుగు గ్రామికు డొకడు సెలవుపై స్వగ్రామమునకు వచ్చి తన ప్రియురాలితో నిట్లనుచున్నాడు.

అత్తా పోతానుంటా - పెయినిండా నగలు దెత్తా
నాపేరుమీద బత్కవే - ఓ బొల్లార పెల్లా

ఇది కరీంనగరం మండలమున సేకరించినది. 'అత్తా పోతా' అనున దచ్చటి యేస. వస్తాననుటకు అస్తా అత్తా యని జానపదులందురు. 'వ'ను 'అ' గా నుచ్చరించుట కరీంనగరం ప్రత్యేకత.వడ్లు = అడ్లు, వంగి = అంగి, వాకిలి = ఆకిలి, వాడు = ఆడు ప్రయోగము లామండలమున నున్నవి. 'పెయి'తెలంగాణ మాండలికము. మెయి శబ్దమే పెయి. ప్రియుడు తనకై దుఃఖపడగూడదని

'కలకాల యనబోకు - కన్నీరు దియ్యబోకు
మన అంతుశిసుంకె తప్పదే - ఓ బొల్లారపెల్లా.'

తన ప్రియురాలి వేషము నీ జానపదుడెంత చక్కగా వర్ణించెనో గమనింపుడు

'అచ్చాము తెల్ల చీర - అంచూన జిల్లేడుగొమ్మ
నీ కొంగున రామచిలుకలే - ఓ బొల్లారపెల్లా.'

తనకున్న సెలవులు గడచిపోయినవని ప్రియురాలికి వీడ్కోలిచ్చునప్పుడు,

'బొంబాయిల బొంగుల్రొరె - యిందూర్ల గంట లేగె
మన రజా యెత్తిపోతదే - ఓ బొల్లార పెల్లా.'

---

1. Contemporary India, 1936.
2. The Rural India. August 1942. 3. వంతు.

బొంగు=Chimny=సైరను.పనివేళను సూచించుటకు కాబోలు'బొంగు లొర్రె' యనుచున్నాడు. 'ఒఱలు' 'ఒర్లు'గా పరిణమించినది. రజా యనగా సెలవు. రజా యెత్తిపోవుట సెలవు గడచిపోవుట. ఈ పాటలు బొంబాయిలో పనిచేయు తెలుగు కార్మికులకు సంబంధించినవి1.

'బోలుబొందర టేసన లావు పెద్దదీ-బొంబాయోండ్ల గోసులు లావు సోకులా
మనవాడ టేసను అదియొక్కటీ-వర్గ నాదోల్ల జూపిత్తె మరిగిత్తదీ'యను

గేయము కూడ పై గ్రామమున సేకరించినదే.ఇది రైల్వేలో పనిచేయు శ్రామికుల గేయము.బోలుబోందర = పోరుబందరు,మనవాడ = మన్మాడ్, టేసన = స్టేషన్ శబ్దములు జానపదరూపములు. బొంబాయివారల గోచులు చాలా అందముగా (సోకుగా = షోకుగా) నుండునట.

'కొడుకా చందురయ్య - కొబ్బెర బెల్లం బెడుత
వర్తముగట్టినవాని పేరేమొ చెప్పు కొడుకా'2 యనునది బొగ్గుగనులందు

పనిచేయు శ్రామికుల గీతము. ఏలయన దీనిలో,

'ఇక్కాడ బొగ్గుగుట్టా - అక్కాడ బొగ్గుగుట్టా
గుట్టనడుమ బండ్లబాట-గుర్రమెక్కి రావోయి కొడుకా ఓగిల్లగీతల రాజా'

యని యున్నది. బొగ్గుగుట్ట యనునది 'సింగరేణి కాలరీస్'కి మారుపేరు. బొగ్గుగుట్టలో పనిచేయు శ్రామికుడు గ్రామమందున్న తన కుమారుని కూలిపని చేయుటకై తానున్నచోటికి రమ్మనుచున్నాడు. ఇట్టి కార్మికగీతము లన్నియు నాధునికములై యుండును.

భారీపరిశ్రమలు స్థాపింపబడి కొలదికాలమేయైనను మనదేశమున కుటీర పరిశ్రమలు వివిధవృత్తులు మాత్ర మనాదిగా సాగివచ్చుచున్నవి. కుమ్మరి, కమ్మరి, వడ్రంగి, మేదరి, చర్మకార, సాలె, కంసాలి, ఈడిగ (గౌడ) జాతుల వారు వర్ణాశ్రమధర్మముల ననుసరించి తమతమ వృత్తులు తమతమ పరిశ్రమలు చేయుచునే యున్నారు. 'స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః' అను వాక్యములు పల్లెపట్టులం దిప్పటికిని అనాహతముగా నున్నవి. ఇట్టివృత్తులు జాతులుగలవారి పేరుతోనున్న పాటలు కొన్నింటిని పరిశీలింతము.

---

1. ఇవి హనుమాజీపేట సిరిసిల్లా తాలూకాలో లింగయ్య,పోచయ్య యను హరిజనులు పాడి వినిపించినవి (1953). 2. ఆవునూరు గ్రామమున (1954) సేకరించినదీ గేయము.

ఒక సాలె భార్య జారిణియై యుండెను. భర్తకు దాని సంగతి యేమియు తెలియదు. కాని ఒక స్నేహితు డాతనికీ వార్త నెరిగించెను. ఆ భార్యయు భర్త నెపుడో గ్రామాంతరములకు పంపించి తన దుష్కార్యము సాగించుచుండెడిది. ఒకనాడా జారిణి తనకు గొప్ప శిరోవేదనము కలిగినదనియు దానికి మందు చేయించుమనియు భర్తను గోరెను. అత డాయూరి వైద్యుని మందు చేయుమనగా నావైద్యుడు(ఈ వైద్యునితోడనే సాలెవాని భార్యకు సంబంధముండెను) 'గాలిధూళిపండ్లు' తెచ్చిన నౌషధము సిద్ధమొనర్తు ననెను. 'గాలిధూళిపండ్ల'ను నవి యసాధ్యవస్తువులు. ఏదో సాకుతో దూరదేశమంపు టయే వైద్యుడు మరియు నా రంకులాడి ఎత్తిన ఎత్తుగడ. భర్త సరేయని బయలుదేరి వారి రహస వర్తనము కనిపెట్టుటకై ఆ రాత్రియే చాటుగా తిరిగివచ్చి రహస్యముగా నింటిలో ప్రవేశించి భువనేశ్వరములో (గృహదేవత నుంచెడు దారుమందిరము) దాగియుండెను. ఆ జారిణి ఆసుపోయుచు పాటలు పాడుచు తన మిండనికి (ప్రక్కింటికి) వినబడునట్లు

'గాలిధూళిపండ్లకు పోయిన మావారు
పోకడలేకాని రాకడన్న లేవూ' యని పాడదొడగెను. దాని భర్తస్నేహితుడు ప్రక్కనే పొంచియుండి దాని చర్యలను భువనేశ్వరములో దాగియున్న భర్త కెరిగించుటకై,

'భువనేశ్వరంలోని బోడలింగయ్యా
ఆలించి వినవయ్యా నీయాలి పాట' యని సంబోధించెను. ఇట్టి వింత కథలతోగూడిన పాటలు జనపదములం దనేకము లభించును. సాలీలకు మద్య మాంసములం దధికప్రీతి. ప్రతిదినము త్రాగనిదే వారుండరు. బక్కగొఱ్ఱెల బేర మనునది సాలీలకు లోకోక్తిగా పరిణమించినది. వానకాలమున వర్షాధిక్యము:చే గాని ఏదేని రోగముచే గాని గొఱ్ఱె లనేకము చచ్చిపోవును.అప్పుడవి చాల తక్కువ ధరల కమ్ముడుబోవును. రూపాయి అర్ధరూపాయి కొొక చచ్చినగొఱ్ఱె నమ్మెదుర్యు అట్టివానిని సాలీలే యధికముగా గొందురు. సాలీల మద్యమాంస ప్రీతి ఒక గేయములో స్పష్టముగా కాననగును.

'నూల పున్నమినాడు గోకులాష్టమినాడు – మూడిండ్ల సాలీలు కూడీరయా
ముడ్డికి మూడుస్కాండ్లు1 చెక్కిరయా - పొద్దు కాలబార2 చూచీరయా

1. మూడు పావలాలు 2. కలియబార

ఏడుతాళ్ళబాట పట్టీరయా - జుట్టూకు ముంతేడు పేసీరయా[1]
జుట్లు జుట్లు చేత పట్టీరయా - తిట్లు కొట్లకు వీరు దీగిరయా
చావట్ల మొగ్గాలు[2] పెట్టీరయా - సర్కారి పన్నులూ కట్టీరయా
సాలీల పెండ్లాలు సకానివారని - సీడాలు జూచుక సిక్కీరయా
వాపు పొక్కిరయా వాడు సోలిరయా
బక్క గొర్రెల బేరం చేసీరయా - ముబ్యాడ[3] కోయాట[4] తెచ్చీరయా
వీసానికో పోగు[5] ఎత్తీరయా - కాళ్ళు తలకాయ మిగిల్చిరయా'

సాలెవారు కల్లు త్రాగి తన్నులాడుకొని చావడికి (గ్రామాధికారి యుండుచోటుకు) పోయి మొగ్గలు (దండములు) పెట్టి, పన్ను (జురుమానా) చెల్లించుకొనుట, బక్క గొఱ్ఱెల బేరము చేసి మాంసము తినుట, మున్నగు విషయములన్నియు హాస్యముగా చెప్పబడినవి. ఇట్టి పాటలం దన్నింట కొంత హాస్యముండును. మొదటి పాటలో గూడ హాస్యమున్నది. ఒక వడ్రంగి,

'కన్నెవ్రాయపునాటి చిన్నదీ- నన్ను - కన్నుగీటి రమ్మన్నదీ' యని పాడుచు తాళమునకు సరిపోవునటుల బాడిసెతో కట్టెను చెక్కుచుండెనట. వలపుతలపుల ప్రమత్తతలో నొక చెక్కపేడు వచ్చి కంటిలో గ్రుచ్చుకొని కన్ను పోయెనట.

'వీసములో మాసము తీసెద'రను దోషము అగసాలె (ఔసల) జాతి కంటుకొన్నది. వీసమెత్తు బంగార మిచ్చినచో దానినుండి మాసమెత్తు = ఎనిమిది గురిజగింజలయెత్తు బంగారమును దొంగిలింతురట, కొలిమిచెంత కూర్చుండి జాగ్రతగా పనిచేయించుకొన్నను కన్నులుగట్టి వారు బంగార మపహరింతురట. కనుకనే వారికి పశ్యతోహరులని పేరట. మనయింటికి పిలిపించుకొని పని చేయించి సాగనంపినచో పట్టుకొని పోవుటకు వీలుకాదని పని చేయుచునే బంగారపు పిసరులను మ్రింగెద రందురు. ఆతరువాత గురుశంకకు పోయి కడిగి బంగారము దెచ్చుకొందురని కథలు చెప్పెదరు. వీరికన్నను కోమటులు జాగ్రత గలవారు. అగసాలెవారి యెత్తులు కోమటికడ పనికిరావు. మ్రింగి బంగారమును మాయము చేసినచో వారెత్తుకు పైయెత్తు నెత్తి మరల సంగ్ర హింపగల సమర్థులనుట మనమొక జానపద గేయములో వెగటైన హాస్యముతో చూడగలము. ఈ పాటలోనున్న సంకేతభాష గమనింపదగినది.

---

1. త్రాగిరి 2. దండములు 3. మూడు బేడలు 4. గొఱ్ఱె
5. మాంసపుకుప్ప

కలిమెర కట్టమీద కోలు కులజూ1 లంచాడు కోలు
కరవడి2 కెంపూలూ3 ,, కులజులు పెడిమీరీ4 ,,
కులజుల సోలంతారె ,, పులుగులు6 పెడిమీరీ ,,

చర్మకారులు (మాదిగలు) లెల్లెపాటలు పాడెదరు. అవి పచ్చిబూతు పాటలు డప్పులు (చర్మవాద్యములు) గొట్టుచు అడుగులు వేయుచు వారీ పాటలు పాడుకొందురు. వారొకరిని నిందింపదలచినగాని యొకరిపై కసిదీర్చుకొని బీభత్సము చేయనెంచినగాని అట్టి యగ్రవర్ణములవారి యిండ్లముందు చేరి వారిపై నిట్టి లెల్లెపాటలు పాడెదరు. భూస్వాములు లేదా జగడములాడుకొను ఇరు పక్షములవా రొకరిపై నొకరు మాదిగలచే లెల్లె పదములు పాడించెదరు. దీనినే 'లెల్లపాడుట' లేదా 'లెల్లెగట్టుట' యందురు. జుగుప్సాకరమగు నట్టిపాట కర్థము వివరింపకయే కొన్ని చరణములు మాత్ర ముదాహరించెదను. మాయూర నిరు పక్షముల వారికి జగడములై ఇట్టి వింత సంఘటనము జరిగినప్పుడీ పాటవింటిని.

తాలెల్లే లెల్లేల - తక్క - తాలెల్లే లెల్లేల ||తా||
లెల్లెలమ్మా పేరు లేతమామిడి పూత - బూసి కాత గాసెనయ్యా ||తా||
అమ్మ లెగురింగాను అట్ల ఉరుకొస్తాది-కొమ్ము పాయదీసి కోలెయ్యరా మైస ||తా||
భేతాళనోలీగే చేతులాడిస్తాది - రోత కరిగిలితుంట నాటరా బొత్తోడ ||తా||

చేటలు, గుల్లలు, మొంటెలు, జల్లెడలల్లి అమ్ముకొని బ్రతికెడు మేదర వారు పాడుకొను 'మేదరిపడుచు' గేయములో వృత్తికి సంబంధించిన విషయము లెట్లు వర్ణింపబడినవో గమనింపుడు.

చిన్నచిన్నా మల్లి, చిన్నారి మల్లి - దాని కిందున్నాది, జడల మాదారి7
మాదారీ నీబిడ్డ. మేలు సుందారి - సుందారి నీవెంతో, సూడ సొంపున్నవు
గుమ్మడాకు సీరిందో, గుల్ల లల్లిందో - తాటాకు సీరిందో, తడుక లల్లిందో
పేటాకు సీరిందో, పెట్టె లల్లిందో - మొగిలాకు సీరిందో, మొంటె లల్లిందో
చిక్కుడాకు సీరిందో, సిబ్బి' లల్లిందో - చామట్లం8 గుల్లలు గుడి9 గుచ్చుకోని
పాయెనే ఆబండీ, రాజులా వాడల్ల - రచ్చమీద గూసున్న, రాజు జూసిందు
రార సుంకరోడ, పోర యెలవాడ 10
మాదారి బిడ్డెంతో, మాసక్కానుండె 11 - మాదారీ బిడ్డను, మరువాక తేరా
రావె మాదరి బిడ్డ, రాజు బిలిచిందు-అన్నించి మాదారి, రాజు బేటీకి

1. అగపాలె 2. పాచి 3. కల్లు 4. త్రాగిరి 5. అశుద్ధము 6. కోమట్లు
7. మేదరి 8. చేతికొలది 9. గుది 10. తలారి 11. మహా చక్కన.

రాజూకు దండము, రచ్చకు దండాము-రావె మాదారిబిడ్డ, చాట్లు1 గుల్లాలు2
గుల్లల్లా విలువాలు, చెప్పవే చేడె - గుల్ల గుల్లకు నాకు, గుండు పోగుల్లు
చాటల్లా విలువాలు, చెప్పవే చేడె - చాట చాటకు రెండు, శాత3 సీరాలు
మొంటెల్ల విలువాలు, చెప్పవే చేడె - మొంటె మొంటెకు రెండు, మొగ్గలంగీలు
ఏకులా గుల్లలకు, ఏక రాజ్యంబు - దిండు కట్టెకు రెండు దండ కడియాలు
చందనా కట్టెకు, సగము రాజ్యంబు-ఇన్ని అడిగిన చేడె, ఇల్లు ఎక్కడనె
నట్టేటి సందాగ్రిన, నడివొడ్డు రాజ - ఇల్లెంద పొదకింద, ఇల్లుసుమ రాజ
ఏనూగు మీదెక్కి, ఏపోతును4 బట్టి-తాడిచెట్టు మీదికెల్లి, తోవసుమ రాజ
రాంగ రాంగ నాయిల్లు, రాతి దరువాజ - పోంగ పోంగ నాయిల్లు పోత దరువాజ

పై పాటలో మొదటి యైదు చరణములందు వృత్తివర్ణనమును,తరువాత తొమ్మిది చరణములందు మేదర పడుచునకును రాజుగారికిని జరిగిన (వలపు) బేరం సారెములును,చివర నాలుగు చరణములందు మేదరిపడుచు ఇల్లునుగూర్చిన సంకేతములును గలవు. ఈ పాటలో తెలంగాణపు మాండలికములు, ఏసలు కాననగును.

ఈ విధముగా నొక్కొక్క వృత్తిని దీసికొన్నను వందల గేయముల గూర్చి చెప్పవలసియుండును.

'కిరుక కిరుక నేను పుటుకు నారుణ్ణి - శావడికి లేకపోతే సరుసుకున్నాను' అను భట్రాజులిండ్ల ప్రచారము గాంచిన గేయములో సాంకేతికభాష కాననగును. భట్లు తమలో తాము మాటలాడ దలంచుకొన్నప్పుడు ఇతరులకు తెలియకుండుటకై కిరుకభాషలో మాటలాడుకొందురు. కిరుకదనగా భట్టుమూర్తి. పై గేయఖండ మొక యగసాలెకును భట్టురాజునకును జరిగిన రహస్య సంవాదము. పుటుకునారు దనగా యగసాలె. పుటుకు మని సుత్తె చప్పుడు చేయునట్టి నరుడు (నారుడు). ఒకరింట వివాహము జరుగుచుండగా నొక యగసాలె తానే భట్టుమూర్తి వేషము ధరించిపోయి యాచించి ధనము పొందెనట. ఇంతలో భట్టు వచ్చెను. అప్పుడు భట్ల భాష నెరిగిన యగసాలె భట్టుతో రహస్యమగు భాషలో మాటలాడి బతిమాలుకొన్న విషయమిది. శావడియనగా సాపాటు. తిండికి లేకుంటచే అగసాలెనయిన నేను ఈ వేషము వేసితినని చెప్పుచున్నాడు. ఇట్టి గేయములు ప్రతి కులమువారికి సంబంధించినవి ఒండురెండు లభించును.

1. చేటలు 2. గంపలు 3. చేత, చేనేత (మంచి) చీరలు 4. ఎనుబోతు కావచ్చు.

గౌడజాతివారు పాడుకొను గేయములను గౌడుగీతము లందురు. వన్నెకోడుదు గౌడగీతముల బేర్కొనెనని ఇదివరకే తెలిపియుంటిని. వన్నెకోడుదు పేర్కొన్నవి గౌడజాతికన్య లొకరివెనుక నొకరు పసుగుపెట్టుచు పాడు కొన్నట్టివి. గౌడులకు కాటమహేశ్వరు డారాధ్యదైవతము కాటమయ్యకు బెట్టనిదే పూజింపనిదే వారేపనియు చేయరు. క్రొత్తగా కల్లుగీయునప్పుడు, తాటిముంజలు తీయునప్పుడు, ఇంటిలో జరిగెడు ప్రతి శుభకార్యమునకును గౌడులు కాటమయ్య (కాటమరాజు)ను పూజింతురు. గొల్లలకు కాటమరాజెటులో గౌడులకు కాటమయ్య అటుల. ఇరువురు కాటమయ్య లొకరేయని సంశయించుటకు వీలున్న వ్రాతలున్నవి. కాని యవి యన్నియు సందిగ్ధముగా నున్నవి. శ్రీ మార్గని సుబ్బారావుగారు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున 'కాటమహేశ్వర చరిత్ర'మను గ్రంథ మున్నటుల వ్రాసినారు[1]. కాటమహేశ్వరుడు శ్రీశంకరుల సమకాలీనుడనునట్లొక కథను వ్రాసినారు. కాటమహేశ్వరుని శిష్యుడగు గౌడునివలన గౌడమంత్రోపదేశము పొందియే శ్రీ శంకరులు మండనమిశ్రుని కోట దాటగలిగిరట. కాటమహేశ్వరచరిత్రమును పులిగడ్డ నారయమంత్రి జంగం కథగాను కాటమరాజు చరిత్రమును పినయెల్లన వచనముగాను రచించిరనియు, నవి ప్రా. పు. భాండాగారమున నున్నవనియు, ఎర్రగడ్డపాటి పోట్లాట, భట్టు రాయబారము దీనికి సంబంధించినవే యనియు వ్రాసినారు. వీరు పొరపడి నల్లసిద్ధి రాజుతో యుద్ధ మొనర్చిన యాదవరాజునకును గౌడుల కాటమయ్యకును అభేదమును పాటించుచున్నారు. ఈ విషయములు ముఖ్యమైనవి కావు గాని 'భృంగీస్తవ' మను నొక శతకము గలదనియు దానిలో ఏలపాటలవలె పాడబడు గౌడగీతము లనేకములు కలవనియు వ్రాసినారు. ఇట్టి గౌడగీతములతో గౌడులు గౌరీశంకరులను స్తవము చేయుచుందురని 'ఇది గౌడదీపిక' యందున్నట్లు వ్రాసినారు. వారిగ్రంథమునన్న విషయము లివి.

'గౌడుగీతములు - (మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము)-అముద్రిత గ్రంథములు'. ఈ పాటలు ఇంచుమించు ఏలపాటలవలె నుండును. తిరుపతి తిరునారాయణములకు మధ్యదేశము కదిరి. ఈప్రాంతమున నింత గొప్పక్షేత్ర మింకొకటి లేదు. ఫాల్గుణశుక్లపక్షమునం దిచట బ్రహ్మోత్సవము జరుగును. కదిరి నరసింహునకు గౌడుల ఆదిదేవుడు కాటమహేశ్వరుండు బ్రహ్మోత్సవమునందు ఈ గౌడగీతములతో స్వామిని సేవించువాడుక చాల పురాతనమునుండి వచ్చుచున్నది. పల్లవియందు కాటమరాయుడా కదిరి నరసింహుడాయని

1, గౌడ వంశోత్పత్తి మార్తాండము.

సంబోధింపబడినది. దశావతారముల పాట పున్నాగవరాళి-ఆదితాళము, 'బెబ్రాయి సామిదేవుడా - నా యేల్నివోడా'.

సుబ్బారావుగారీపాట పూర్తిగా నిచ్చిరి. ఇది జయదేవకృత దశావతార స్తోత్రమున కనువాదము; బహుళప్రచారమందినగేయము. వారి చివరిమాట లివి. 'ఇంకను శివలీలామాహాత్మ్యమునందు, శివగీతములతోగూడ గౌడగీతములు గౌడగేయములు అనేకము లున్నవి గాని శతకము శిథిలమై అక్షరములు స్పష్టముగా కానుపించనందున వ్రాయుటకు వీలు కలుగలేదు. ఇట్టి గేయములు మైసూరు జిల్లా,కడప మొదలగు ప్రదేశములందు పామరజనులుకూడ ఇప్పటికిని పాడుచుండుట కాననగును'. సుబ్బారావుగారి వ్రాత లెంతవరకు సత్యములో తెలియదు.

గ్రామికగేయములను విమర్శించునప్పుడు బూతుపాటల ప్రసక్తి వచ్చినది. ఇంతియకాక ఆయా కులముల(వృత్తుల)వారి ప్రసక్తికూడ వచ్చినది. వారిని నిందించుటకాని, అవహేళనము చేయుటకాని, నా యభిమతము కాదు. పరిశోధనమున నిందలకు తావుండదు. వాస్తవమును గ్రహించుటే కావలసినది. లభించిన పాటలన్నింటిని సేకరించితిని. మచ్చునకై కొన్నింటిని మాత్ర ముదాహరించితిని, అంతకన్న నసభ్య విషయములున్న వానిని పరిహరించితిని. అన్నింటిని వదలినచో నీ సాహిత్యమునకు ద్రోహ మొనర్చినవాడ నగుదునని స్థాలీపులాకన్యాయమున విమర్శించితిని. కనుక నాయా కులములవా రీవిషయములను సహృదయతతో స్వీకరింపవలెనని నా ప్రార్థన. ఆయావృత్తులవా రిట్టి గేయములను పాడుకొనుచు శ్రమను తగ్గించుకొని నూతనోత్సాహమును పొందెదరనుటలో విప్రతిపత్తి లేదు.



.

# పిల్లల పాటలు

జానపదగేయములందు పిల్లలపాటల దొక ప్రత్యేకశాఖ. పెద్దలగు స్త్రీ పురుషులకున్న గేయసంపదను కొంత తడవిచూచితిమి. వారికివలెనే పిల్లలకుగూడ కొంత గేయసంపద గలదు. పసిపిల్లల లేత హృదయము లెంత నిష్కపటములో, నిర్మలములో, స్వచ్ఛందములో, మృదువులో, వారి గేయములుకూడ నంతియే నిష్కపటములు, నిర్మలములు, స్వచ్ఛందములు, మృదువులు. బాలురవలని యానందవిభూతి గర్భసంపన్నుల కెరుక. కొరత సంతానములేని హృదయముల కెరుక. పిల్ల లింటివెలుగులు, వీధివెలుగులు— లోకమునకే జ్యోతులు. ఎన్ని కలిగియుండినను పిల్లలు లేని యిల్లు 'కందులు గొట్టిన కళ్ళము'. సంతానార్థమై 'పాడు గుళ్ళకు మ్రొక్కి పబ్బతులు బట్టి' తలక్రిందు తపము లాచరించి, కుంటినో గ్రుడ్డినో, సంపూర్ణాయుష్కునో, సగము బ్రతుకువానినో కని, తృప్తి పడిన తలిదండ్రుల కథలు జానపదగేయములం దిదివరకే కొన్ని పరిశీలించి యుంటిమి. తమ సంతానమునకు రూపమున గాని గుణమున గాని ఎంత లోప మున్నను 'కాకిపిల్ల కాకికి ముద్దు'. తలిదండ్రులకు వారి బోసినోటి నవ్వులు వెన్నెల మొలకలు. వారి కాలుసేతుల కదలికలు భరతముని కెరుగరాని నృత్య భంగిమలు. వారి తొక్కుపలుకులు హృదయము లానగల అమృతధారలు. వేయేల 'పుత్రగాత్రపరిష్వంగమునట్లు ముక్తాహారకర్పూరసాంద్రపరాగప్రసరంబు చందనము చంద్రజ్యోత్స్నయు హృదయశీతము'1 కాజాలవు. కనుకనే మహాకవి కాళిదాసంతటివాడు 'ధన్యా స్తదంగరజసా మలినీ భవన్తి'2 యనియు 'న నందనాలోకనమంగళేషు క్షణం క్షణం హృష్యతి కస్య చేతః'3 యనియు నుప్పొంగిపోయెను.

---

1. ఆంధ్రమహాభారతము ఆదిపర్వము 4-91 2. అభిజ్ఞాన శాకుంతలము VII-17
3. కుమారసంభవము 11-20

బాలుర ఆకారవికారములు చేష్టలే అంత ఆనందప్రదమైన నింక నాలేత మనములు పాడుకొను కవిత్వ మెంత యానందప్రదమో చెప్పనక్కరలేదు. అర్థమరిసి గదా మనము సాధారణముగా కవిత్వము నానందించునది. కాని బాలుర కవిత్వము నర్థ మరయకను ఆనందించగలము. అది వారి కవితాకళ మరియు మన సహృదయత. కాని మనము తక్కిన జానపదగేయసంపద నెంతగా గౌరవించితిమో బాలగేయములగూడ నంతయే గౌరవించితిమి. పాశ్చాత్యులును తదితరభారతీయులును బాలవాఙ్మయమునుగూర్చి చేసిన సేవ యపారము. అనాదిగా వచ్చుచున్న పాటలను మూలమూలలనుండి సేకరించి చక్కని బొమ్మలతో ఆకర్షకముగా ముద్రించుటయే కాక ఆధునికులగు కవులచే వ్రాయించి బాలవాఙ్మయమెంతో వారు ప్రకటించియున్నారు. మనవారి దృష్టి ఇప్పుడిప్పుడే యిటువైపు మరలుచున్నందుకు సంతోషింప వచ్చును. ప్రభుత్వమువారును సాహిత్యసంస్థలును బాలవాఙ్మయము ప్రకటించుచున్నారు. ప్రాతవైన పిల్లల పాటలను తొలుత సేకరించినది శ్రీ యమ్. యన్. వెంకటస్వామిగారు. తెలంగాణమున ప్రచారమందున్న కొన్ని బాలగేయములను సేకరించి వారు పత్రికాముఖమున ప్రకటించిరి[1]. తరువాత పలువురు సారస్వతాభిమానులు గేయములను సేకరించి వివిధపత్రికలందు ప్రకటించుటయేకాక విమర్శనా యుతమగు వ్యాసములను రచించిరి. సర్వశ్రీ సురవరము ప్రతాపరెడ్డి, వేటూరి ప్రభాకరశాస్త్రి, చింతా దీక్షితులు, గొట్టిపాటి వెంకటసుబ్బయ్య, కృష్ణశ్రీ, ఏకుమళ్ళ కామేశ్వరరావు, గిడుగు వెంకటసీతాపతి, వేదాల తిరుమల రామానుజస్వామి, సముద్రాల వేంకట రాఘవాచార్యులు గారలు వ్యాసముల ప్రకటించిరి. ప్రత్యేకముగా బాలగేయములను పుస్తకరూపమున ప్రకటించినవారు ఇద్దరుముగ్గురే. శ్రీ విల్లిపుత్తూరు మరకదవల్లి మాదుశిరోమణి గారి పాటలు మద్రాసుప్రాంతమున ప్రచారము గాంచినవి. శ్రీ బి. వి. రంగయశెట్టిగారు 1916 లో 'బాలికాభూషణము' పేరుతో నచ్చువేసిరి. శ్రీ వేంకటపార్వతీశ్వరకవుల 'బాలగీతావళి' 1938 లో ముద్రింపబడినది. శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారి 'నవ్వులు—పువ్వులు' 1942 లో వచ్చినది. శ్రీ వేదుల సత్యనారాయణ శర్మ మరియు శ్రీ కాళహస్తి వీరభద్రస్వామిగారలు

---

1. Some Telugu nursery songs and catches By M. N. Venkata swamy M.R.A.S.M.F.L.S. The Indian Antiquary Vol XXXV May 1906.

సంకలన మొనర్చిన 'పిల్లల పాటలు' 1949 లో వచ్చినవి. శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావుగారు ప్రకటించిన (1941) 'పాత పాటల'లో కొన్ని బాల గేయము లున్నవి. శ్రీ నేదునూరి గంగాధరంగారి 'సెలయేరు'లో (1955) కొన్ని గేయము లున్నవి. వీరి చెంత నింకను అముద్రితములగు బాలగేయము లున్నవి. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు బాలగీతములను బొమ్మలతో సిద్ధపరచి యుంచిరట. అవి వెలుగు చూడవలెను. తెలంగాణమున ప్రచారమందున్న కొన్ని గేయములు నేను సేకరింపగలిగితిని. ఆంధ్రదేశ మంతటను సేకరించవలసిన గేయము లింకను కలవు. ప్రకృత ముపలబ్ధమగు గేయముల కొన్నింటిని పరిశీలింతము.

బాలగేయములు రెండు విధములు. బాలురకొరకై పెద్దలచే రచింపబడి తరతరములనుండి వచ్చునవి ఒక విధము. బాలురచేతనే రచింపబడి ఒకతరము నుండి మరియొక తరమువారి నోటికందెడునవి మరియొకవిధము. పెద్దలు పిల్లల కొరకు రచించిన పాటలందుకూడ రెండువిధములు కలవు. పిల్లలను లాలించుటకు పాడెడు లాలిపాటలును, నిద్రపుచ్చుటకు పాడెడు జోలపాటలును ఒక తీరువి. పిల్లలనే వస్తువుగా గ్రహించియో, ఏవేని కథావిషయములనో, ప్రపంచమందలి మనోహరమగు విషయములనో, గ్రహించి పిల్లలకు ఆనందము గూర్చుటకై ఆటలాడించుటకై రచింపబడినవి ఇంకొకతీరు పాటలు. లాలి జోలపాటలగూర్చి ఇదివరకే చర్చించియుంటిమి. ఈ లాలి జోలపాటల భావములు పిల్లలెంతమాత్రము అనుభవింపరు. కేవలమా సంగీతము మాత్రము వారిని నిద్రపుచ్చుటకో ఏడుపు మాన్పుటకో ఉపకరించును. 'వీటి ఆవిర్భావానికి బిడ్డలు నిమిత్త మాత్రులే. వీటికి శ్రోతలు మాత్రము కారు. అందువల్ల జారుగా సాగే స్వరాలు తప్ప లాలిపాటలలో పిల్లలకోసము ఉద్దేశించినవేమీ ఉండవు. తొట్టెలలో పడుకునే శిశువులు తాళపు దెబ్బల్ని కూడా అనుసరించలేరు. కనుక ఏదో 'రామా లాలీ మేఘశ్యామ లాలీ' అన్న ఒక్క లాలిపాటలో ప్రవేశించిన తాళగతి పిల్లలకోసము కాదేమో నంటాను'1. పెద్దలు రచించిన బాలగేయము లనుభూతికి వచ్చుటకు పిల్లలకు తగిన వయస్సు రావలయును. పసికందును పట్టుకొని 'చందమామ రావె జాబిల్లి రావె' యన్నచో రసాభాస మగును. కనీస మేడెనిమిది మాసముల శిశువైనగాని చంద్రునివైపును పాటలవైపును హృదయముమరలదు. అంతవరకు తల్లిదండ్రులు పాడవలసినవిలాలి జోలపాటలే. పిల్లలు కూర్చుండుట కలవాటుపడునప్పటినుండి పెద్దల పాటలు నిచ్చెన మెట్లవలె

1. 'కృష్ణశ్రీ' ఆంధ్రపత్రిక ఉగాది సంచిక, విజయ సంవత్సరం, పుట 97.

క్రమక్రమముగా పెరిగి, పిల్లలు తాము తలిదండ్రులవలననో లేదా ఇతరులగు పెద్దల వలననో విన్న పాటలు స్వయముగా పాడునంతవరకు సాగి సాగిపోవును. ఆపైన వారి సొంతకవిత్వ ప్రారంభమగును.

తలిదండ్రులు తమ శిశువులకు గరపు అభ్యాసము ఉగ్గుపాలతో మొదలగును. కనుకనే 'పాడీవిద్య ఉగ్గుపాలతో నేర్చె'నను మాట ప్రసిద్ధిగన్నది. దీనినే ప్రబంధకవులు 'వెన్నతోడ బెట్టిన విద్య' యనిరేమో. పాలులేని తల్లుల పిల్లలకీగతి ఆరంభమందే పట్టును కాని తల్లి ఎదయందూరెడు అమృతము పుష్కలముగా గల శిశువులకు మూడు నాల్గు మాసములకు ఉగ్గందును. పసి పిల్లలను కాళ్ళపై పండబెట్టుకొని చిన్న గిన్నెలో నింత నూనె, గంజి, పాలు, ఉప్పుగల్లు కై చిప్పతో కలియగలిపి గరగరిలాడించుచు, శిశువు దృష్టిని తనవైపు మరలించుకొని 'ఉగ్గు ఉగ్గు' అనుచు, అనునయల జేయుచు, తల్లి ఉగ్గుపోయును.

'ఊఁ ఊఁ ఉంగన్న-ఉగ్గుపాలు ఇందన్న
గుంటెడు ఉగ్గు కిమ్మన్న-ఉమ్మక కక్కక మింగన్న'యని పాడుచు,

తల్లులు పిల్లల కుగ్గుపోయుదురు. ఆ ఉగ్గు జీర్ణమగుటకై

జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం-గుజ్జులు తిన్న గుగ్గిళ్ళు జీర్ణమై
ఏనుగు తిన్న వెలక్కాయ జీర్ణమై-భీముడు తిన్న పిండివంటలు జీర్ణమై
అర్జునుడు తిన్న అప్పాలు జీర్ణమై-అబ్బాయి తిన్నపాలు ఉగ్గు జీర్ణమై
కుందిలాగ కూర్చొని నందిలాగ ప్రాకి-లేడిలాగ లేచి తాంబేలులాగ తాళి,

యని పాడుదురు. ఈ పాటలుకూడ బాలుర కర్థమగునట్టివి కావు. ఇవి కేవలము తల్లుల తీయని కోరికలు మాత్రమే. ఐనను వారి చైతన్యము తలయెత్తి కదలుట కారంభించును. ఆరోగ్యముగల శిశువు ఆరునెలలకే కూర్చుండ నేర్చును. కూర్చున్న శిశువును ముందిడుకొని తల్లి తాను చేతులు త్రిప్పుచు,

తారంగం-తారంగం-తాండవకృష్ణా తారంగం
వేణూనాద తారంగం-వెన్నలదొంగా తారంగం
చిన్నికృష్ణ తారంగం-చిట్టికృష్ణ తారంగం' అని పాడుచు శిశువును

రెచ్చగొట్టును. 'తారంగం' అనుమాట పునరావృత్తినొందినప్పుడు శిశువుల హృదయవీణ తీగలు శ్రుతి కలుపుకొనును. ఆ నాదామృతము విద్యుచ్ఛక్తివలె ఒడలంతయు ప్రాకిపోవును. తల్లి తనచేతులు త్రిప్పినటులే శిశువుకూడ చేతులు త్రిప్పుట కారంభించును. ఈ తీరుగా శిశువును కవ్వించిన తాళనాదము ఊరక చేతులు త్రిప్పించుటయేకాక తామర మొగ్గలట్లు పెదవుల విప్పజేయును. కాని

వారిముఖయంత్రమింకను తారంగమనునంతటి శక్తిని అలవరచుకొనకుండుటచే ఆ పాటయొక్క ప్రయోజన మంతటితో నాగిపోవును. నాదజ్ఞాన మీతీరుగా పిల్లలకు కలుగును. శిశువులు పశువులు ఫణులు నాదాకృష్టులగుట మన మెఱిగినదే.

ఇంతకన్న ఒక పైమెట్టు పిల్లలు లయానుగుణముగా చప్పట్లు చరచుట. చేతులు త్రిప్పనేర్చిన శిశువు కొలదిదినములకే తల్లిని చూచి చేతులు చరచుట కారంభించును.

'తప్పట్లోయ్ తాళాలోయ్-దేవుడిగుళ్ళో బాజాలోయ్
పండ్లు బియ్యం దేవునికోయ్- పాలునెయ్యి బాలునికోయ్' అను పాటను పాడుచు తల్లి తనచేతులు తట్టును. కొంతసేపు శిశువు చేతులు పట్టుకొని చేతులు తట్టించును. ఆ తరువాత శిశువు స్వయముగా చప్పట్లు చరచుట కారంభించును. ఈ విధముగా ఏడాది శిశువగునప్పటికి నాదమును మరియు లయను ఉగ్గుపాలతో పాటు జీర్ణముచేసికొనును. ఈ బాలగేయములందు యతిప్రాసములు తమంతట తామే వచ్చి కూర్చొనినవి. యతులు నాదానుగుణముగను, అంత్యప్రాసములు లయానుగుణముగను ఇమిడిపోయినవి.

పసిపిల్లల దేహదార్ఢ్యమునకు కావలసిన పరిశ్రమ వారి వయసునుబట్టి తలిదండ్రులు చేయించెదరు. కాళ్ళపై పరుండబెట్టి ఉగ్గుపోయు వయసున పిల్లలకు తలంటునప్పుడు వారి కాలుచేతులకు నూనె పట్టించుచు బాగుగా వ్రాసెదరు. కాలుచేతులు, ముడుతలు వంకరలు పోయి, చక్కనై సుదృఢము లగును. ఈ వయసున కీమాత్రము పరిశ్రమ వారికి చాలును. కూర్చుండ గలుగునంత శిశువులై తల్లిపాటకు చప్పట్లు కొట్టు వయసున తల్లి తన శిశువును తొడలపై కూర్చుండ జేసి ఒక చేయి బిడ్డవీపుపై మరియొకచేయి రొమ్ముపైనుంచి

ఊగు ఊగు గంగెద్దా-ఉగ్గు పాలే గంగెద్దా
సోలి ఊగే గంగెద్దా-సోలెడు పాలే గంగెద్దా
తాళి ఊగే గంగెద్దా-తవ్వెడు పాలే గంగెద్దా
మారి1 ఊగే గంగెద్దా-మానెడు పాలే గంగెద్దా
ఆగీ ఊగే గంగెద్దా-అద్దెడు పాలే గంగెద్దా 2

అని పాడుచు ముందు వెనుకల కూపుచు తానుగూడ కుడి యెడమ ప్రక్కలకూగును శిశువు ఊఁ ఊఁ అనుచు వెనుకముందునకూగును. శరీరమున కంతటికి కావలసినంత పరిశ్రమ జరుగును. వ్యాయామము చేయువారల కుచ్ఛ్వాస

1. మరి 2. ఇది తెలంగాణా ప్రాంతపు గేయము. దీనిని మాయింటనే సేకరించితిని.

నిశ్వాసములు లయానుగుణముగా వెడలునట్లే పిల్లల నిట్లూపుటచే వారి యుచ్ఛ్వాస నిశ్వాసములు లయానుగుణమగు ఊఁ ఊఁ నాదముతో వెడలును. ఈ పాట యందలి 'గంగెద్దా' యను అంత్యప్రాసము, ఊపుతో శరీరమంతట రక్త ప్రసారము జరుగునటులే, లయనుగూడ రక్తము వెనువెంట శరీరమంతట ప్రాకించును. త్రావిన పాలు జీర్ణమై శరీరమునకు శక్తినొసగ, శక్తిగలిగిన దేహము నిలయ ఉత్తేజిత మొనర్చును. శిశువు తనంతట తానే ఊగనేర్చును. కాలు సేతులు కదపును. ఊగించుటకు పాడెడు పాటలనేకములు.

ఏనుగొచ్చిం దేనుగూ-ఏపూరొచ్చిం దేనుగూ
మాపూరొచ్చిం దేనుగూ-మంచినీళ్ళు తాగిం దేనుగూ
ఉప్పాడొచ్చిం దేనుగూ-ఉప్పునీళ్ళు తాగిం దేనుగూ'అని ఒక ప్రాంతము

వారు పాడుకొనిన,

గుమ్మాడమ్మా గుమ్మాడీ-తీగ పాకింది గుమ్మాడి
పందిరెక్కింది గుమ్మాడి-మొగ్గదొడిగింది గుమ్మాడి
పువ్వుపూసింది గుమ్మాడి-కాయగాసింది గుమ్మాడి
పండుపండింది గుమ్మాడి-పంచి పెట్టిరి గుమ్మాడి' అని మరియొక

ప్రాంతమువారు పాడుకొందురు.

ఈ విధముగా గంజినీళ్ళతో కఫితాకళను జీర్ణముచేసికొను పిల్లలు ఏడాది వారై సన్నసన్నగా 'చందమామ ఘుటిక'ల కలవాటు పడెదరు. పిల్లలకు గుజ్జన గూళ్ళు వండి గోరుముద్దలు చేసి తల్లులు గృహాంగణముల నిలిచి ఆకసమున నున్న చంద్రుని జూపించుచు పాటలు పాడి పసిపిల్లలకు తినిపించెదరు.

చందమామ రావె, జాబిల్లిరావె-కొండెక్కి రావె, గోగుపూలు తేవె
బండెక్కి రావె, బంతిపూలు తేవె-పల్లకీల రావె, పారిజాతం తేవె
తేరెక్కిరావె, తేనెపట్టు తేవె-ఆటలాడరావె, ఆరగించిపోవె(అమ్మాయికిచ్చిపోవె)
నట్టింట పెట్టవే, అమ్మాయి కివ్వవే ) తెలంగాణమున గలపాట
నట్టింట పెట్టవే, అబ్బాయి కివ్వవే )

అని చంద్రు నాహ్వానించుచు చేతులూపుచు గోరుముద్దను మొదట చంద్రునికి చూపెదరు. అమృతకరుడా మాతృమూర్తులు తనకందించు గోటిముద్దలను కరముల దాకి సంతుష్టిపడును. తల్లు లాముద్దల తమపిల్లలకు తినిపించెదరు. పిల్లలు చందన్నను తమ చిన్నిచేతుల బిలుచుచు తల్లులందించు గుజ్జనగూళ్ళ మెసవెదరు. పిల్లలీపాటతో రమ్మని పిలుచుటను, చేతులు తలలూపుటను నేర్చుకొందురు. చేతు లూపనేర్పెడు పాటలెన్నియో ప్రచారమున గలవు.

'చెయి పూచమ్మా చెయి పూచు-సంతకు పోదాం చెయి పూచు
శనిగలు తెద్దాం చెయి పూచు-చల్లగ తిందాం చెయి పూచు
మిఠాయి తెద్దాం చెయి పూచు-మెల్లగ తిందాం చెయి ఊచు
'ఉలవలు ఉలవలు వేయించి-ఉట్ల నిండగ పోయించి
కందులు కందులు వేయించి-కడువల నిండుగ పోయించి
సెనగలు సెనగలు వేయించి-చేటల నిండుగ పోయించి'

'చేయూచు బాలా చేయూచు-చిన్నారి బాలా చేయూచు
అద్దాల దిడ్డీ చేయూచు-అరవ మాణిక్యాలు చేయూచు
పండ్లు తెద్దాం చేయూచు-పాపకు ఇత్తాం చేయూచు'

అను పాటలును పసిపిల్లలకు తాళమున కనుగుణముగా చేతులూపుట నేర్పును. ఈ పాటలందున్న యతిప్రాసలు, లయ, పసిపిల్లలకు మార్గదర్శకములు.

ఇప్పటికి పిల్లలు మెల్లమెల్లగా అత్త, అమ్మ, అక్క, అన్న, తాతవంటి మాటలాడనేర్తురు. పారాడి పారాడి గోడలతో పోరాడి మెల్లగా నిలుచుండ నేర్తురు. నిలుచుండనేర్చిన బాలలకు శరీరపరిశ్రమకై, తల్లులు పాడెడు పాట మరియొకటి. శిశువు ముంజేతులు రెండును, రెండుచేతులతో కవ్వపు త్రాడును వలె పట్టుకొని తల్లి చల్ల చేసినట్లుగా మెల్లగా నూపుచు 'చల్లచెయ్యి గొల్ల భామ-వెన్నదియ్యి వెంకటమ్మ'యని పాడును. ఈపాటకు కూడ పాఠాంతరము లున్నవి. కృష్ణశ్రీ గారిచ్చిన పాటలం దొకటి

'చల్లా చెయ్యి గొల్లభామ-సందిట దండలు కదిలేనూ
గోవులు కాయవె గొల్లభామ-గుజ్జనకాళ్ళు కదిలేను
పాలు పిండవే గొల్లభామ-పట్టెడు గుత్తులు కదిలేను'[1]

దధిమథనమువలె నూచగా శిశువుల శరీరమథన మగును. అందుండి ఆరోగ్యామృతము వెడలును. ఆ యమృతపానమున పసికందులు చిన్నచిన్న కండలుదేరి మిసమిసలాడుచు ఉత్సాహముతో ఉల్లాసముతో ప్రపంచయాత్రాపథమున తొలిసారిగా 'తప్పటడుగులు' వేయుచు పడుచు లేచుచు పయనము సాగింతురు. ఆ తరుణమున వారిని విర్భీకులను జేయుటకు కాబోలు తల్లియో తండ్రియో వెల్లికిల పరుండి శిశువును అడుగులపై గూర్చుండజేసి చేతులు పట్టుకొని మెల్లమెల్లగా 'ఉయ్యాలోయ్ జంపాలోయ్' అనుచు తమకాళ్ళ నుయ్యాలవలె నూపుచు,

1. ఆంధ్ర పత్రిక, విజయ సంవత్సరాది సంచిక.

కొత్తకొండోయ్-కొమిరెల్లోయ్
ఐలోనోయ్-మల్లన్నోయ్
అల్లల్లల్లా[1] యని పాడెదరు. చివర చరణము పాడునప్పు

డొక్కసారి కాళ్ళను చాలపైకి లేపనెత్తెదరు. శిశువు మొదటిసారి కొంత భయ పడినను తరువాత ధైర్యము తెచ్చుకొని, ఎదతో, శిరముతో తనకాలంబనముగా నున్న కాళ్ళను దగ్గరగా నదుముకొనును. అటు తరువాత భయముపోయి పైకి లేవనెత్తినప్పుడల్ల కేరింతలు గొట్టుచు అటుల మరలమరల లేపుటకు తల్లి దండ్రులనే ప్రోత్సహించును.

మరియొక పాట ఇట్టిదే. (ఇది కొంచెము పెద్దపిల్లల కుపయోగించునట్టిది)

దాదం దిక్కచ్చి-దాదారక్కమ్మ
చింతలెక్కి పడ్డాది-ఉట్టిమీద బెల్లం
పొట్టి కాకరకాయ-రాజుగారి దొడ్లో
వాలోస్తావా-పెరుగోస్తావా' అని తల్లిదండ్రు లడుగగా బాల పాలు

అన్నచో 'రాజుగారి దొడ్లో పాలు దొడదొడ' అనుచు కాళ్ళను పైకెత్తెదరు. పెరుగు అన్నచో 'రాజుగారి దొడ్లో పెరుగు దొడదొడ' యందురు. ఈతీరుగా నడచినచో అటునిటు పడిపోవుదుమనెడు భయముడిగి పసిపిల్లలు చిన్నగా తలిదండ్రుల చిన్నమాటల కర్థము గ్రహించు వరకువత్తురు. వారి ప్రాథమికావసరముల పేర్లను తడవినంతనే తమ కవగతమైనటుల ముఖకవళికలు మార్చెదరు. తమ కర్థముకాని పక్షమునగాని, తమమాట లితరుల కర్థముగాని పక్షమునగాని వారికన్నుల 'నీలాలు గారును.' అది చూచి భరింపలేక తలిదండ్రులు వారిని లాలించి, బులిపించి హసన్ముఖుల చేయుదురు. పిల్లల నవ్వించుటకు చక్కిలి గింత గొప్ప సాధనము. పిల్లలకేమి పెద్దలకైనను ఇది మంచి సాధనమే కాని ప్రయోగార్హము కాదు. ధైర్యము చేసి ప్రయోగించినచో చచ్చినదానికి చక్కిలి గింతలనినట్లు రసాభాసమో లేదా నవ్వునకు మారుగా (విపరీతముగా) కోపమో కలిగించును. పిల్లలకు 'చక్కిలిగింత పెట్టుటకు కూడ మనవారు పాటలల్లిరి. పాప కుడి అరచేతిని తమ యెడమ అరచేత వెల్లకిల నుంచుకొని కనిష్ఠికనుండి ఒక్కొక్క వ్రేలును లెక్కపెట్టుచు,

1. ఈ గేయమందున్న మూడు ప్రదేశములు తెలంగాణమండలి ప్రసిద్ధ శైవ క్షేత్రములు. మొదటిది హుజూరాబాదు తాలూకాలో నున్నది. రెండవది సిద్దిపేట తాలూకాలో నున్నది. మూడవది ఓరుగల్లునకు సమీపమున నున్నది.

అన్నం పెట్టి-అప్పు పెట్టి, గారె పెట్టి-బూరె పెట్టి
పాలు పోసి-పరమాన్నం పోసి, అప్పడం పెట్టి దప్పడం పెట్టి
కూర పెట్టి-నా పెట్టి' యని పాడుచు ఐదు వ్రేళ్ళు ముడిచి ఆడుచేతి

తమ తర్జనితో గీతగీచి 'గుంట కట్టి గుంట నిండ నెయ్యి పోసి, మా అబ్బాయి అత్తవారింటికి తోవేదంటే, తాళ్ళల్లనుంచి తంగేళ్ళనుంచి' యని మెల్లగా తమ చేతిని శిశువు చంకవరకు గొనిపోవుచు 'ఇదే తోవ ఇదే తోవ చక్కిలిగిలి' యని గిలిగింతలు పెట్టెదరు 'ఇదేతోవ' యనునంతవరకు శిశువు శ్రద్ధతో వినుచునేయుండి ఆపై అర్థము గ్రహించి అప్పటినుండియే నవ్వుటకారంభించును.

ఈ పాట తెలంగాణమున ప్రాచారమున నున్నది. కొందరు శిశువులు పెద్దల చేయి తమ మోచేతిని కూడ దాటనీయరు. అట్టివారికి శరీరమున ఉబుకెక్కువ. పెద్దలను వారు తమ బాహుమూలములను చూడనీయరు. మొదటనే నవ్వి పెద్దలనుగూడ నవ్వింతురు. పిల్లలు నవ్వుచుండగా పెద్దలంతకన్న నెక్కువగా నవ్వెదరు. ఈ పాటకుగూడ అనేక పాఠభేదము లున్నవి. ఒక్కొక్కచోట నొక్కొక్కతీరుగా పాడుకొనుచుందురు. "పల్లెకి ముగ్గెట్టి, ఆకేసి పీటేసి, పప్పెట్టి బువ్వెట్టి, పాలోసి పెరుగోసి, అత్తారింటికి తోవేదంటే, కితకిత కితకిత కిలకిలకిల" అనుపాట యొకచో గలదు1. "పప్పెట్టి పాయసం పెట్టి నెయ్యేసి బువ్వెట్టి, అం తినిపించి, చెయ్యి కడిగి, మూతి కడిగి మా అత్తారింటికి దారేదంటే, యిలా పోయి, యిలా పోయి, కితకితా కితకితా' యనుపాట ఇంకొకచో గలదు2. "చేతులు కడిగి, అరిటాకేసి, పప్పు పెట్టి బువ్వపెట్టి కూరవేసి, నెయ్యేసి, చారోసి, మజ్జిగోసి, అత్తారింటికి దారేదోయ్, అంబలికుండకు చిల్లేదోయ్ కిచకిచ కిచకిచ నవ్వు" అనుపాట మరియొకచో గలదు3. ఈ తీరుగా పిల్లలకు చక్కిలిగింతలు పెట్టి వారికి ఉల్లాసము నవ్వు చురుకుదనము తలిదండ్రులు పాటలతో మాటలతో కలిగించి భావిపౌరులనుగా సిద్ధమొనర్తురు. పిల్లలను నవ్వించి నిర్భీకులను చేయుట కుపకరించు పాటలందు "నూకలిస్తాను మేకలు గాస్తావా, పెద్దపులి వస్తే భయపడొద్దు గదా" అని కన్నుల చెంత చప్పట్లుగొట్టి కాని ఊది గాని వారి రెప్పపాటులో అనిమిషానందము పొందెడు పాట యొకటి.

శిశువులకు రెండేండ్లు వచ్చునప్పటికి చిన్నిచిన్నిమాటలు రానేవచ్చును. వారి సొంత వ్యాకరణమిచ్చిన సాధుశబ్దములతో ఆ వయసువారు సాధారణ

1. బాలగీతావళి. 2. పరిశోధన, మూడవ సంచిక 1954. 3. పిల్లల పాటలు.

వాక్యములు (Simple sentences) కూర్చెదరు. తలిదండ్రులు వారికి మెల్లమెల్లగా చిన్నిపాటలు పద్యములు నేర్పెదరు. ఇంతవరకు తడవిన పాటలు వినివిని వారికిదివరకే నోటి కబ్బియుండును. 'తారంగం తారంగం' 'చందమామ రావె జాబిల్లి రావె' వంటి గేయములను సులభముగా పాడగలుగుదురు. అనుకరణశక్తి పసిపిల్లలలో నద్భుతముగా నుండును. తల్లిదండ్రు లెటులచేసిన నటుల వారు చేయుచుందురు. తలిదండ్రులు పాడగా విన్న పాటలు సులభగ్రాహ్యమైనవి వారికి కంఠస్థమైపోవును. ఈ తరుణమున తలిదండ్రులు తమ పిల్లలకు భక్తి, నీతి, వినయము, విజ్ఞానముగల పాటల నొక్కొక్కటిగా నేర్పుచుందురు.

'ఏనుగు ఏనుగు నల్లన-ఏనుగు కొమ్ములు తెల్లన
ఏనుగుమీద రాముడు-ఎంతో చక్కని దేవుడు.'

చూచినను చూడకున్నను శబ్దమాత్రము చేతనే ఏనుగు పిల్లలకొక వింత జంతువుగా హృదయమున నిలిచిపోవును. ఈ నాలుగు చిన్న చరణములందు వారికి ఏనుగు నాలుగుసార్లు కనబడును. నల్ల తెల్ల రంగుల భేద మెరుగజాలనివారైనను ఏదో చల్లని శబ్దమువలె నది హృదయములందు గల్లుమని అంత్యప్రాసయై మ్రోగి కంఠస్థమైపోవును. రాముడు దేవుడని వారికి తలిదండ్రులు చేయు బోధ. అంతియ. దీనిపై నింకొక మెట్టు,

చేతిలో వెన్నముద్ద చెంగల్వపూబంతి-బంగారు మొలత్రాడు పట్టుదట్టి
సందిట తాయితల్ సరిమువ్వగజ్జెలు-చిన్ని కృష్ణమ్మ నిన్నునే చేరి కొలుతు'అను

గేయము. ఈ గేయము రాని శిశు వాంధ్రదేశమున నుండదు. దైవోపహతులగు మూగపిల్లలు తప్ప చిన్నికృష్ణమ్మ నందరు పాటపాడి కొలుచురు. ఇది నిజముగా చిన్నికృష్ణమ్మ వర్ణనమో లేదా తలిదండ్రులు తమ శిశువులనే యిటులభివర్ణించిరో, తల్లిదండ్రులకు వారి పిల్లలే నిజముగా కృష్ణులు శ్రీరామచంద్రు లగుదురు. కనుకనే వారు

'పాపాయి కన్నులు కలువ రేకుల్లు-పాపాయి జున్నులు పట్టుకుచ్చుల్లు
పాపాయి దంతాలు మంచిముత్యాలు-పాపాయి పిక్కలు మొక్కజొన్నపొత్తులు
పాపాయి చెక్కులు పసివెన్నముద్దల్లు-పాపాయి వన్నెలు పసినిమ్మపండుల్లు
పాపాయి పలుకులు పంచదారచిలకల్లు-పాపాయిచిన్నెలు బాలకృష్ణుపన్నెల్లు'అని

మురిసిపోదురు. ఈ పాటలో నున్న సహజమైన రూపములు సహృదయులను పిల్లలను గన్న తలిదండ్రులను ఎరుగుదురు ఇటువంటిదే మరియొకపాట.

'అమ్మన్న ముద్దును ఏమన్నాడు-అచ్చనావుల పాలన్నాడు
అప్పుడు కాచిన నెయ్యన్నాడు-దోరగవేగిన గారన్నాడు
పాకము వచ్చిన అరిశన్నాడు-పటికి పంచదార పాడన్నాడు' పిల్లల ముద్దును పాటలోనున్న వస్తువులతో పోల్చుట అవి సరియైన వస్తువులని కాదు. అన్ని పేర్లుకూడ పసిపిల్లల ముద్దుతో "తుల నందుకొన" లేవు. కేవలమవి భాషా దౌర్బల్యమును సూచించుటకే పెరిగిపోయినవి. ఈ భాషాదౌర్బల్యము మనకే కాదు. ముద్దును మాటలో పెట్టజూచిన ప్రతిభాష కాదౌర్బల్యము గలదు. హృదయానుభూతికి భాష సంపూర్ణముగా ఆకారమీయజాలదు కదా.

పిల్లలకు నేర్పబడు పాటలు క్రమముగా ఒక్కటొక్కటి భాషయందును భావమునందును చేవ గడించుకొనుచు పోవుచుండును. 'చేతిలో వెన్నముద్ద'ను జీర్ణించుకొన్న శిశువు సంధ్యాసమయమున తల్లిదగ్గర నిలుచుండి చేతులు జోడించి తల్లి చెప్పుచుండగా,

'సంజ దీపికి చక్కని జేజే, గుడిదీపానికి గుప్పెడు జేజే
కుందెల దీపికి గొప్పగ జేజే, ఏళ్ళెర హారతికి ఏట్టెడు జేజే
మంగళహారతికి మక్కువ జేజే, రామారతులకు రంగుగ జేజే
కప్పుర దీవికి కందువ జేజే. బాలదృష్టికి పాళము జేజే
వేగి వెల్గునకు సాగిలి జేజే, గురుస్వాములకు గుర్తుగ జేజే
చిట్టిపాపల చిరుహస్త్రాల, దేవుని కెత్తాలె దీవన జోత'యని సన్నసన్నగా పాడును.

యతులతో పాటు చక్కని గతులు, జేజేల పునరావృత్తి ఈ రెండును వారికి తొందరగా పట్టుబడి పాటయందున్న కొన్ని క్రొత్తశబ్దములను క్రొత్త భావములను పాదుకొల్పును. వేమనగారి పద్యములు ఆబాలవృద్ధుల కభిమాన పాత్రములు. వేదాంతుల కవి శిరోధార్యములు. పండితుల కవి సూక్తులు, కవుల పాలిటికి మహాకావ్యఖండికలు. పసిపిల్లల కవి పాలధారలు! పైపాటలు పాడ నేర్చిన మూడేండ్ల శిశువులు సునాయాసముగా,

గంగగోవు పాలు గంటెడైనను చాలు, కడవెడైన నేమి ఖరము పాలు
భక్తిగలుగు కూడు పట్టెడైనను చాలు, విశ్వదాభిరామ వినురవేమ'యను వేమనగారి పద్యమును చదువగలరు. ఇది పద్యముగదా, బాలగేయములం దెటుల జేరునను సంశయము వలదు. ఆటవెలదియను ఛందములో నిమిడినదేగాని గేయమున కుండు సర్వలక్షణము లీపంక్తుల కున్నవి.కనుకనే బాలుర నోటికిది సులభముగా నబ్బినది. భాష భావములు బాలగేయములం దిప్పటికి కావలసినంత జిగి

పెంచుకొన్నారు. మూడేండ్లు దాటిన తరువాత పిల్ల లన్నిపాటలు పాడగలరు. అవి కేవలము అభ్యాసముపై నాధారపడిన మాట. ఏతీరు పాటల చెప్పిన నాతీరు పాటలు పాడగల శక్తి వారికి మూడేండ్ల కలవడును.

గ్రహణశక్తి గలుగుచుండగనే బాలురకు చిన్నచిన్నగా జ్ఞానోపదేశము జరుగును. అవతారముల పేర్లు, దేవతల పేర్లు, నీతి, భయము, భక్తి వంటి విషయములు గేయరూపమున వారికి కంఠింపబడును

'మాపాప మామల్లు మత్స్యావతారం, కూర్చున్న తాతల్లు కూర్మావతారం
వరుసైన బాసల్లు వరాహావతారం, నట్టింట నాయత్త నరసింహావతారం
వాసిగల బొట్టెల్లు వామనావతారం, పరుగులు దేవ పరశురామావతారం
రక్షించు మామయ్య రామావతారం, బంధైన బంధువులు బలభద్రావతారం
పట్టినాకన్నైత శ్రీ కృష్ణావతారం, బుద్ధిలో మాచిట్టి బుద్ధావతారం
కలిపిపితో మాయన్న కలికావతారం, వర్ధిల్లు పసిపాప వర్ధిల్లు నా తండ్రి.'

ఈ పాటలో దశావతారముల పేర్లున్నవి. పసిపిల్లలీ పాట నతిసులభముగా కంఠస్థము చేసికొందురు. ఎవరైనను దశావతారముల పేర్లు చెప్పుడని యడిగినచో ముందుగా కాసంత వెనుకముందాడినను 'మాపాప మామల్లు' అను ముక్క నందించినతోడనే గ్రుక్క త్రిప్పుకొనకుండ గబగబ 'వర్ధిల్లు నాతండ్రి' వరకు చదివెదరు. నేర్పునప్పు డేక్రమమున పాట వారిమేధాగతమగునో ఆతీరుననే వారు వల్లింతురు. వారి జ్ఞాపకశక్తి యట్టిది, కనుకనే మన పూర్వులు చిన్నప్పుడే అమరమువంటివి కంఠస్థము చేయించెడువారు. చిన్నప్పుడు కంఠస్థమైన విషయము లెన్నటికి మరపునకు రావు. దశావతారముల తరువాత 'కుదురుగ పాపడు గుమ్మడికాయ, విరిసిన పాపడు విఘ్నేశాయ' మొదలుగాగల పాట లన్నియు ఒకొక్కటే నేర్పించెదరు. చిన్నచిన్న పద్యములు సులభమైన శ్లోకములుకూడ పసిపిల్లలు పాడగలరు. వెలయేరులో '"శ్రీ సూర్యనారాయణా మేలుకో హరి సూర్యనారాయణా' యను పాటను బాలుర ప్రార్థనాగేయమని యిచ్చినారు. ఇది బాలుర గేయము కాదేమో! సూర్యనారాయణ స్వామి వర్ణన మాగేయమున మనోహరముగా చేయబడినది. ఆ పాటను తెలంగాణమున మల్లేశ్వరస్వామి కుదయమున నభిషేకజలములు దెచ్చు పూజరులు పాడెదరు. 'వీడేవమ్మ కృష్ణమ్మ, వేణువు నూదే కృష్ణమ్మ' మున్నగు ప్రార్థనాగీతము లన్నియు బాలు రీవిధముగా నభ్యసింతురు. "చదువులతల్లీ సరస్వతీ" యను సరస్వతీ ప్రార్థనమును,

'వెనకా వెనకా వేములతాతా, కనకాపండ్లు కాముని రూపుల్
ఎత్తని గొడుగుల్ పీతవస్త్రములు, దూదిమడుగులు దుప్పటి రేకులు
వాగుసీమ్మ వనంపత్రి, తెల్లసిగులోని నల్లని వెంకయ్యకు, నాలుగు చేతుల నమస్కారము'
అనునదియు

'ఓబొజ్జ వెనకయ్య సీబంటు నేనయ్య, ఉండ్రాళ్ళమీదికి దండుబంపు
కమ్మని నేయైన కడుమంచి పప్పైన, బొజ్జ పిరుగ దిని పొడిచి గెల్చు' అను
విఘ్నేశ్వర స్తోత్రమును (ఇవి తెలంగాణమున ప్రచారమందున్నవి) బాలుర ప్రార్థనాగేయముల కోవలోనివే.

ఈ పాటలన్నియు శిశువుల కొరకై పెద్దలు చెప్పినట్టివి. పెద్దలు చెప్పగా విని పిల్లలు సులభముగా వీనిని పాడగలుగుదురు. ఇట్టి పాటల నెన్నింటినైన ఉదాహరింపవచ్చును. ఆరంభమున పేర్కొన్న బాలగేయముల పుస్తకములందిట్టి పాటలు ముద్రింపబడినవి. యతిప్రాసములు తాళము లయ మున్నగువాని జ్ఞానమీ పాటలవలన పిల్లలకు సులభముగా పట్టుబడును పిల్లలకు నాలుగైదేండ్ల వయసు వచ్చునప్పటికి సొంతకవిత్వ మారంభమగును.

బాలగేయములందు రెండవ ప్రధానశాఖ బాలురచేతనే రచింపబడి తరతరములనుండి ప్రవాహరూపమున వచ్చుచున్న గేయములు. అనుకరణశక్తి బాలురం దధికముగా నుండునని ఇదివరకే మనవిచేసియుంటిని. ఇతరులు గాని తమతలిదండ్రులుగాని చేసెడు పనులన్నింటిని బాలు రనుకరించుటకు ప్రయత్నము చేయుదురు. పెద్దలు చేయునటుల తాము చేయవలెననెడు కాంక్ష ఈ బాలుర కేలపుట్టునో మనమెఱుగము కాని పిల్లలు పెద్దల ననుకరింతురనునది మాత్ర మందరకును అనుభవసిద్ధము. తండ్రి చుట్ట త్రాగగా చూచిన కుఱ్ఱడు చాటుగా నొకకాగితపు చుట్టను కాల్చును. తల్లి చీరకట్టుకొనగా జూచిన బిడ్డ తానును ఏదోయొక గుడ్డను తీసికొని చీరవలె చుట్టుకొని కొంగు వేసికొని అది జారి పోవుచుండగా పదేపదే సవరించుకొను ప్రయత్నము చేయుచుండును.. కనుకనే బిడ్డల మంచిచెడుగులు తలిదండ్రులపై నాధారపడియుండునందురు. 'తనయుండు తప్పైన తండ్రి తప్పు' 'కూతురు చెడుగైన మాత తప్పు' అను మాటలు వేదవాక్యములు.

పిల్లల సొంత రచనములందు రెండు రకముల గేయములున్నవి. పెద్దల ననుకరించి పెద్దల గీతములను నేర్చుకొని వానిలో కాళిదాసు కవిత్వములో తమ పైత్యము కొంత యనునట్లు తమ సొంతకవిత్వము కలిపిన పాటలు కొన్ని.

పూర్తిగా స్వకపోలకల్పితములగు గేయములు మరకొన్ని. పెద్ద లొకప్పుడు తమకొరకు రచించుకొన్న గేయములను పిన్న లనుకరించి నేర్చుకొందురు. ఈ పెద్దలు క్రమముగా నాగరకత ముదిరినకొలది తమ యలవాటులు ఆట పాటలు వృత్తులు మున్నగువానియందు మార్పులు చేసికొనిరి. అనుకరణమున నాయాపాటలు పెద్దలనుండి పిల్లలకు సంక్రమించి పెద్దలచెంత లేకుండ పోయినవి. పెద్దలనుండి సంక్రమించిన పాటలలో పిన్నలు తరములు గడచిన కొలది తమ కవిత్వమును చేర్చి ఒకరునుండి మరియొకరి కందించుకొనుచు వచ్చెదరు. ఇట్టిపాటలు కేవలమొక ప్రాత యాచారమువలె రానురాను అర్థవిహీనములై పోవును. తలిదండ్రుల పాటలనుండి తాము గ్రహింపగలిగిన ఆద్యంతప్రాసములు, యతులు, యమకములు మాత్రమే పిల్లలకు చక్కగా పట్టుబడును. ఈ వ్యుత్పత్తితో వారు కూర్చిన పాటలలో వీనికి మించిన సొగసు లుండలేవుకదా! అందుకే యివి ఇంగ్లీషులో Nonsense Rhymes అనుపేరు పొందినవి. Nursery Rhymes పిల్లలకొరకు పెద్దలు రచించినవైనచో Nonsense Rhymes పిల్లలు సొంతముగా రచించిన గేయములని చెప్ప వచ్చును. భావసౌష్ఠవమును కుదుర్చునంతటి కల్పనాశక్తి బాలుర కుండదుగదా! ఇట్టివానిని అర్థములేని పాటలు Nonsense Rhymes) అనెదరు. ఒకపాశ్చాత్య పండితు డీయభిప్రాయమునే వెలిబుచ్చెను[1]. కష్టపడినచో ఇట్టి యర్థములేని పాటలందుకూడ అర్థము లభింపగలదు. అర్థములేని పాటలు దేశమంతటను కొలదిమార్పులతో నొకేతీరుగా నుండును. కేవలము సొంతకవిత్వ మనిపించుకొను ఈ బాలగేయములు మండలమున కొకవిధముగా నుండును. ఆటపాటలందు - చాల భాగము అర్థములేని పాటల కోటిలో చేరుపోవును. దేశమంతట నవి వ్యాప్తి గాంచుటకు కారణము వానిలో గేయలక్షణము లుండుటే. వానియందుండు నాదసౌందర్యము వానిని మార్పు నొందకుండ కాపాడుచుండును. మరియు నాపాటలం దాయా ఆటలాడు విధానము కొలదియో గొప్పయో కాననగును. ఆటలయం దాసక్తిగల బాలుర నోటబడుటచే నివి పిల్లల నాలంబనముగా జేసికొని ప్రాణములు నిలుపుకొని తరతరములనుండి వచ్చుచున్నవి.

---

1. 'In the course of time these became conventionlised into an unchanging meaningless form in which all memory of their origin is lost.'—John Hubert cornyn.

The Encyclopedia Americana Vol. 20.

నాలుగేండ్లనుండి పిల్లల జీవితమంతయు నాటపాటల మయము. ఈయాటలందు మగవారికి వేరు మరియు ఆడువారికి వేరు ఆటలు కలవు. కొన్నియాటలు మగవారు ఆడువారు ఇరువురును చేరి ఆడుకొనునట్టివి కలవు. నవనాగరకము ముదిరి ఇప్పుడీ ప్రాతకాలపు ఆటలు మరుమాయమగుచున్నవి. ఆటలతో పాటు పాటలుకూడ చెప్పరాని పాటుపడుచున్నవి. మనపూర్వులేయే యాటలాడుకొనుచుండెడువారో సింహాసన ద్వాత్రింశిక, శుకసప్తతి, కాళహస్తి మాహాత్మ్యమువంటి శిష్టులరచనములు గాని, ఉషాపరిణయమువంటి స్త్రీలపాటలు కాని చదివిన తెలియగలదు. ఇప్పుడాయాటలు మోసై క్రొత్తయాటలు తల లెత్తినవి. ఇవి విజాతీయములగు ఆటలగుటచే వీనితో కవిత్వము సహకరింప దయ్యెను. కనుకనే ఇవి ప్రజలనోళ్ళ కెక్కకున్నవి. కేవలము పట్టణవాసులకే ఈగతి పట్టినది. పల్లెపట్టులందు-అందులో నవనాగరకము ముదురని తెలంగాణమున నీయాటలును పాటలును రెండును, ఋతువుల కనుకూలముగా సెలయేరులట్లు పారుచునే యున్నవి. ఇట్టియాటల వివరములు సాంఘిక ప్రకరణమున విపులముగా చర్చింపబడును.

ఆడమగ భేదములేకుండ పిల్లలను వరుసగా కూర్చుండబెట్టి కాళ్ళు చాపించి లెక్కపెట్టుచు 'కాళ్లగజ్జి కంకాళమ్మ' పాట పాడెదరు. కొలది మార్పులతో ఈ పాట దేశమందంతటను కలదు. తెలంగాణమున సేకరించిన అర్థములేని బాలగేయములందు దీనిని చేర్చితిని. కాని కీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారి ప్రోత్సాహమున శ్రీమాన్ వేదాల తిరుమల రామానుజస్వామిగారి నడిగి దీనిలోనున్న ఆయుర్వేదరహస్యముల నెరింగితిని. పైకి అర్థములేనట్లు కనబడు పాటలు ఎప్పుడో పూర్వము పెద్దలచే రచింపబడి తరువాత పిల్లలకు సంక్రమించినట్టివని ఇదివరకే తెలిపియుంటిని ఇవి పెద్దలు రచించినవనుటకు తార్కాణము, సాధారణముగా పైకి అర్థము కనపడకపోవుట; పరిశ్రమించినచో గొప్ప విశేషములు బయటబడుటయే. ఇది 'సోమరాజి' యోగము. ఈపాట యందలి ఆయుర్వేదవిశేషముల 'స్రవంతి' ఏడవ సంచికలో ప్రకటించితిని. వివరములు సాంఘికప్రకరణమున గాననగును. ఈ పాటయందలి 'కాళ్ళగజ్జి కంకాళమ్మ, వేగుచుక్క, వెలగామొగ్గ' యనునంతవరకన్ని ప్రాంతములలో సమానము ఆ తరువాత అవసరముకొలది ప్రాంతప్రాంతమునను పెద్దలపిన్నల సొంత కవిత్వములు దూరి ఒకచో పొడుగు మరొకచో పొట్టిగా నున్నది. తెలంగాణమున ప్రచారముగల పెద్దగేయ మొకటి.

'కాళ్ళగజ్జి కంకాలమ్మ, వేగుచుక్క వెలగమొగ్గ, మొగ్గగాదు మోదుగ నీరు
నీరుగాదు నిమ్మలవాయి, వాయికాదు వాయింటకూర, కూరగాదు గుమ్మడిపండు
పండుగాదు పాపడమీసం, మీసంగాదు మియ్యాలపోతు, పోతుగాదు బొమ్మలశెట్టి
శెట్టిగాదు శామలమన్ను, మన్నుగాదు మంచిగంధపుచెక్క
లింగులిటుకు పందెమూల పటుకు, కాలుపందిసట్లు కిడకుడీసిపెట్టు'

ఈగేయమున పదమూడు ఖండములున్నవి. వేంకటపార్వతీశ్వర కవుల 'బాల గీతావళి'లో ఎనిమిదే ఖండములున్నవి. కృష్ణశ్రీగారి విజయసంవత్సరాదిసంచికా వ్యాసమునను, 'పిల్లలపాటల' పుస్తకమునను నంతేయున్నవి. కాని శ్రీగంగాధరం గారి సెలయేరులో పదునాల్గు ఖండములపాట యున్నది. అన్నిపాటలందున్న అన్నిఖండములకు పోలికలు లేవు. ఒక్కొక్క ప్రాంతమున నీపాట ఒక్కొక్క తీరుగా ప్రచారమందినది. పాటయందున్న యర్థము బాలుర కవగతముకాదు. కేవలము లయ, మరియు వ్యక్తపదగ్రస్తముగా (Alliterations) నడచు చరణములందలి నాదము వారి నాకర్షించును. ఒకేపదము రెండుమారు లావృత్తి నందుటచే పిల్లలకు సులభముగా కంఠస్థమగును. యతులెంత కట్టుదిట్టముగా కూర్చానెనో గమనింపుడు. గేయలక్షణము పూర్ణముగా గలిగి సులభపదములతో నొప్పారుటవలన పిల్లలందరు సులభముగా పాడుకొందురు

'బిత్తి' దిరిగెడు పాటలు కొలది భేదముతో రెండున్నవి. ఒకదానిలో స్త్రీలకు మరియొకదానిలో పురుషులకు వాజీకరణయోగములు చెప్పబడిన పాటలివి. 'బిత్తి' దిరుగుట అధికముగా బాలికలందే యున్నది. బాలికలకిది చక్కని పరిశ్రమ కలిగించును.

ఒప్పులకుప్పా, ఒయ్యారిభామా-సన్నాబియ్యం- చాయపప్పూ
మినపా పప్పూ, మెరికా బియ్యం-పాలు నెయ్యాడి, పాశంవొండూ
నీ మొగుడు దింటే, ఆనందమంటే' యనునది స్త్రీలకొరకును

'ఒప్పులకుప్పా, ఒయ్యారిభామా-మినపా పప్పు, మెంతీపిండీ
తాటీబెల్లం, తవ్వెడు నెయ్యా-గుప్పెడు దింటే, కులుకూలాడీ
నడుముగట్టీ, నామాటబట్టీ' యనునది పురుషులకొరకును ఉపయోగపడు

యోగములు. ఈరెండేకాక 'బిత్తిబిత్తి బీరకాయ-తమ్మలోని తాటికాయ', 'తిరుగూ తిరుగూ జల్లెడా', 'వానవాన వల్లప్పా, వాకిలి తిరుగూ చెల్లప్పా' వంటి పాట లనేకములీ 'బిత్తి' ఆటకు సంబంధించినవి తెలంగాణమున ప్రచార మందున్నవి. 'పిల్లల పాటలు' పుస్తకమునందున్న 'ఒక్కం జుగును, జుగునా

పైసం, మైనపు వత్తి - తారాజువ్వ, వెండిగిన్నె - పెలగారొట్టె, పచ్చిరొట్ట - పాతరొట్ట, ముగ్గాబుట్ట - ముత్యాలచిప్ప' యనుపాట బిత్తి పెంగెడు ఆటకు సంబంధించినదే.

'బాలగీతావళి'లో 'ఒప్పులకుప్ప' పాటతో 'చిప్పచిప్పగోళ్లు' అను పాట కూడ ఈ యాటకు సంబంధించినట్లే ఒకచో చెప్పనాయి. కాని తెలంగాణమున మాత్రము 'కొంగ కొంగగోళ్ళు' అను పాటయును, చిప్పిచిప్పి గోళ్ళు' అను పాటయును వేరొక యాట సందర్భమున పాడెదరు. ఆకసముపై బారులుదీరి కొంగలు పయనించునప్పుడు పిల్లలు తమ పిడికిళ్ళు మూసి గోళ్ళు పైకి కనబడకుండునటుల బిగ్గరగా పట్టుకొని ఒక పిడికిలి మీదనుండి వేరొక పిడికిలిని అతివేగముగా త్రిప్పుచు కొంగలవైపు చూచెదరు. కొంగలు వెడలిపోయిన తరువాత, 'తెల్లబియ్యమా పచ్చబియ్యమా' యని పిడికిళ్ళు విప్పి గోళ్ళు చూచు కొందురు. అప్పుడే పడునో లేక మరెప్పుడు పడునో కాని పిల్లలగోళ్ళపై తెల్లని మచ్చలుండును. కొంగ ముత్యము (రెట్ట) వేసెనని పిల్లలు మురిసి పోయెదరు.లేతగోరుల నొత్తిపట్టి త్రిప్పుటచే రక్తస్రావమాగి యటులగునేమో? 'కొంగ కొంగగోళ్ళు' అను పాటలో కునఖ (గోరుచుట్టు-జెష్ట)చికిత్స కలదు 'బిత్తి' పాటలందు శరీరమునంతటిని గుండ్రముగా త్రిప్పెడు లయయును 'గోళ్ళ' పాటలో అతివేగముగా చేతులను త్రిప్పెడు లయయును కలవు. ఈ పాటలు చదువుచున్నప్పుడు మన కన్నుల యెదుట నెవరో తిరుగుచున్నట్లు, త్రిప్పుచున్నట్లు కానబడును.

బాలికల యాటలందు 'చెమ్మచెక్క' ప్రసిద్ధి గన్నది. ఇరువురు బాలిక లొకచో చేరి ఒకరిచేతు లొకరు తట్టుచు కుడి యెడమలకు దూకుచు,

'చెమ్మచెక్క చారెడేసి మొగ్గ, అట్లు పొయ్యంగ-ఆరగించంగ
రత్నాల చెమ్మచెక్క-రంగులేయంగ,ముత్యాల చెమ్మచెక్క-ముగ్గులేయంగ
పగడాల చెమ్మచెక్క-పందిరేయంగ, పందిట్ల బాలుడు-పరుగులెత్తంగ' అని

పాడెదరు. 'బాలగీతావళి'లో నీ పాటకు'చాకలాడి వాణికింద-జాజిపూల దండ, మోరీలదండ - ముత్యాలదండ, దండోదండ - దండోదండ' యను మూడు చరణములు పెరిగినవి. ఈ పాటలో వంధ్యలకును, మాచకమ్మలకును మందులు చెప్పబడినవి. ఇదికూడ అర్థములేని (Nonsense Rhyme) పాటయే.'చెమ్మ చెక్క' యను పాటయందలి గతి దూకులు దూకినట్లుగా నున్నది. యతులు, అంత్యప్రాసములు చక్కగా పడినవి.

పది పండ్రెండేండ్ల ఆడపిల్లలు రెండు జట్లుగా చేరి ఒక పక్షమునుండి మఱియొక పక్షమునకు వియ్యమందుటకై ప్రశ్నములు,సమాధానముల రూపమున పాడుచు 'బుజబుజ రేకుల' ఆటాడుకొందురు ఇది దీర్ఘమగు గేయము. దేవతావివాహముల సమయమున నర్తకులు,వధూవరుల వైపువార లిరువురును, పాటలు పాడుచు వియ్యపు సంబంధములను కుదుర్చుకొందురు. ఈ 'బుజబుజ రేకులపాట' అట్టి పాటల కనుకరణమై యుండునని నాయభిప్రాయము. పెద్దలేది చేసిన పిన్నలది చేయుటకు ప్రయత్నింతురని మొదటనే తెలిపియుంటిని. 'పిల్లల పాట' లందును 'సెలయేరు' నందును ఈదీర్ఘగేయము లున్నవి. 'పిల్లలపాటలు' పుస్తకమున నిది 'గుజగుజ రేకులు'గా మారినది. తెలంగాణమున మాత్రము 'బుజబుజ రేకు'లే యందురు. ఈపాటలో వియ్యమందుకొనెడు ఇరుపక్షముల వారి సంవాదములు, కట్నములు కానుకల ముచ్చటలు, అసంతృప్తి, 'పెట్టుపోత'లధికమైనంతనే తృప్తి, నిశ్చయము, మున్నగు పెండ్లిచూపులకు సంబంధించిన విషయములన్నియు కలవు. నలుగురైదుగురు కలిసి పాడినచో పాట మనోహరముగా నుండును.

బాలికలు కచ్చకాయలాట నాడునప్పుడు'ఒక్క ఓ చెలియా,రెండూ రోకళ్ళు మూడు ముచ్చెలకా, నాలుగు నందన్న' అయిదు చిట్టిగొలుసు. ఆరుం ధారాలు, ఏడుం బేటీలు, ఎనిమిది మనమంది, తొమ్మిది తోకచ్చు. పది పట్టెడా'యని పాడెదరు. ఈ పాట 'సెలయేరు' నందును 'పిల్లల పాట'లందును 'నవ్వులు పువ్వు'లందును 'బాలగీతావళి' యందును కలదు.

'కాయ పట్టురాయనికుచ్చు బంగారు కుచ్చు,కాయ నాతో నాడినది సంగాత పడుచు
కాయ మూడవదియమ్మ ముక్కాలిపీట, కాయ నాల్గవదియమ్మ నల్లనిపూస
కాయ ఐదవదియమ్మ అమ్మనికాయ, కాయ ఏడమ్మ నాకాయ ఎత్తెత్తి పట్టు'అను

మరియొకపాట 'పిల్లలపాటలు'పుస్తకమునందును, 'హిందూబాలికా భూషణము' నందును గలదు. 'హిందూబాలికా భూషణ' మందు దాగిలిమూతలు, దొంతి, పూలచెండ్లు, గుజ్జెనగూళ్ళు, నాలుగుమూలల (నాలుగుస్తంభాల)ఆట మున్నగు వానికి సంబంధించిన పాటలున్నవి. ఇవి మద్రాసు ప్రాంతమున ప్రచారము నందున్నవి. వానిలో నచ్చటచ్చట మద్రాసు తెలుగు తొంగిచూచుచున్నది.

బాలికలు గొబ్బిళ్ళుపెట్టి సంక్రాంతి సమయములందు పాటలు పాడుచు నృత్యములు చేయుదురు. ఔత్తరాహుల 'గర్బో' (గొండ్లి) నృత్యమునకు

'గొబ్బి' తెలుగు సేత యని శ్రీ చిలుకూరి నారాయణరావు1 శ్రీ చింతా దీక్షితులు2 కృష్ణశ్రీ3 వంటి విమర్శకు లభిప్రాయపడిరి. కాని కీ.శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు గొబ్బి గోపికాశబ్దభవమనిరి. శాస్త్రిగారి యభిప్రాయ మిట్లున్నది. 'దక్షిణ భారత దేశమందెల్ల నీవ్రతము కొన్నిమార్పులతో నిప్పటికిని గలదని నేనను కొనుచున్నాను. ధనుర్మాసమున తెలుగుదేశమున బాలికలు తెల్లవారుజాముననే నిద్రలేచి గొబ్బెమ్మలను పేడ గోమయముతో (ముద్దలు) బొమ్మలుగా చేసి ముంగిళ్ళ ముగ్గులు పెట్టి పూలతో నలంకరించి పూజింతురు.

సుబ్బిగొబ్బెమ్మా సుఖమూ లియ్యావే
తామరపువ్వంటి తమ్ముణ్ణియ్యావే
చేమంతి పువ్వంటి చెల్లెల్నియ్యావే

ఇత్యాదిగా పాటపాడుచు ప్రార్థింతురు. ఇట్టి ప్రార్థనము తిరుప్పావై లోను కొంత కలదు. దక్షిణభారతమందంతటను సామాన్యమైన యొక వ్రతము ననుసరించి ద్రావిడవైష్ణవులు విష్ణుసంప్రార్థనారకమగు తిరుప్పావైని, ద్రావిడ శైవులు శివసంప్రార్థనార్థకమగు తిరువెంబావైని కల్పించుకొనియుందురు. 'గొబ్బెమ్మ' పదము 'గోపెమ్మ' పదభవము. అరవమున 'గొబ్బియళో' 'గోపిగళ్' పదభవము'4. హంసవింశతికారుడు,

'ద్వారవతీ యాదవకులభర్తకు-తాళహస్తములు తప్పక కొట్టుచు
వ్రజపురిని దావలమై చిక్కిన-గోపప్రియునకు గొబ్బిళ్ళనుచు' పాడినది శాస్త్రిగారి యూహమునే బలపరచుచున్నది. తెలంగాణమున గొబ్బెమ్మలను పెట్టుదురేకాని నృత్యముచేయుట పాటలు పాడుట లేదు. బెజవాడ సమీపమున నుండుటచే ఆచటి గాలిపారిన ప్రదేశములు సరిహద్దు ప్రాంతములందును, బెజవాడవారి యాసపలెనే మాటలాడు మధిర మున్నగు ప్రాంతములందును మాత్రమీ యాటపాటలున్నవి. 'కృష్ణశ్రీ' గారు విజయ సంవత్సరాది సంచికయందు వీని గురించి యిటు లభిప్రాయపడిరి. " 'కిటతక. కిటతక' అని నాలుగేసి అక్షరాల క్రియలతో యతులు నిలబెట్టుకుంటూ దీర్ఘాక్షరాలలో చక్కగా మేళవించే కంఠాల మాధుర్యాన్ని రంగరించుకుంటూ కరకంకణాల తాళాలకి అనుగుణంగా పడే అడుగుల కలుపుతో స్ఫురించే బాలికా వర్తులపు ప్రసారాకుంచనాల లయ ఎలాంటి హృదయానైనా గంతులు వేయిస్తుంది". ప్రాచీన పదకర్తలీ గొబ్బి పాటలు రచియున్నారు.

---

1: గుజరాతీవాఙ్మయ చరిత్రము 2. వ్యాస సంగ్రహము
3. ఆంధ్రపత్రిక విజయ సంవత్సరాది సంచిక 4. 'తిరుప్పావై-సప్తపదులు' పీఠిక.

'కొలనిదోపరికి గొబ్బిళ్ళో, యదుకులము స్వామికిని గొబ్బిళ్ళో
కొండగొడుగుగా గోవుల గాచిన, కొండుక శిశువుకు గొబ్బిళ్ళో
దుండగంపు దైత్యుల కెల్లను తల, గుండు గండనికి గొబ్బిళ్ళో
పాపవిధుల శిశుపాలుని గొట్టిన, కోపగానికిని గొబ్బిళ్ళో
యేపున కంసుని యిడుమల బెట్టిన, గోపబాలునికి గొబ్బిళ్ళో
దండివైరులను తరిమిన దనుజుల, గుండె దిగులునకు గొబ్బిళ్ళో
వెండిపైడియగు వేంకటగిరిపై, కొండలయ్యకును గొబ్బిళ్ళో'[1] యను తాళ్ళపాక

వారి గొబ్బిపదము ప్రసిద్ధము. ఇంకను 'తారమ్మయ్య తందాన గొబ్బి' యను పాటయును, 'గొబ్బి ఒళ్ళో గొబ్బిగొబ్బున'అను పాటయును, 'ఆ పూలు ఈ పూలు పళ్ళెమున బోసి'యను పాటయును, 'గొబ్బియళ్ళో చందమామ' యను పాటయు, 'సుబ్బిగొబ్బెమ్మ సుభములియ్యావే - చామంతి పువ్వంటి తమ్ముణ్ణియ్యావే చేమంతి పువ్వంటి చెల్లెల్నియ్యావే - మొగిలి పువ్వంటీ మొగుణ్ణియ్యావే, పనసపండంటి బాలుణ్ణియ్యావే'యను పాటయును ప్రచారమున గలవు. తెలంగాణమున నీగొబ్బి పాటలతో తులదూగునవి బొడ్డెమ్మపాటలు. గొబ్బిళ్ళుపెట్టి చుట్టు చేరి బాలికలు ఇతరాంధ్రమున నృత్యము చేయుచు పాటలు పాడునటులే తెలంగాణమున పుట్టమట్టితో బొడ్డెమ్మలు చేసి చుట్టు తిరుగుచు నృత్యము చేయుచు పాటలు పాడెడు ఆచారమున్నది. తోట విజయరాఘవుని 'శ్రీపతి గొబ్బిపాటలు' అన్నమాచార్యాదుల గొబ్బిపాటలకన్న భిన్నములు. గతిరీతి నివి భేదించును కృష్ణశ్రీగా రుదాహరించిన 'కరకంకణములు ఘల్ ఘల్లనగా-వినెడు సరసుల గుండె ఝుల్ ఝుల్లనగా' నన్న గొబ్బిపాట పైవానికన్న భిన్నమని స్పష్టపడుచున్నది. ఇది హుసేని రాగమున పాడెదరట. ఈ గొబ్బిపాటలును, ఇంతకుమున్ను పేర్కొన్న 'బుజబుజ రేకుల' పాటలును బాలికల అభినయ (నృత్య) గీతములు తక్కినవి ఆటపాటలు బాలికలకు సంబంధించిన 'గుడు గుడు గుంచెం' వంటి ఆట లెన్నియో గలవు ఆటలకు పాటలుకూడ కలవు. వానినన్నింటిగూర్చి చర్చించిన గ్రంథవిస్తర మగును.

కొన్నియాటలం దోడిపోయినప్పుడు శిక్షగా కూత (గూత) పెట్టవలసి వచ్చును కూత మధ్యలో ఆగగూడదు అనగా మధ్యన ఊపిరి విడువకూడదు దాగిలిమూతలాటలో 'తల్లి'ని చే కొనువరకో లేదా కచ్చకాయలాటయందు కొన్ని సంఖ్యలు లెక్కపెట్టువరకో ఓడినవారు కూత పెట్టి యప్పు దీర్చు కొందురు. కూతపెట్టునప్పుడు గూడ కొన్ని పదము లుచ్చరింతురు. 'సెల యేరు'లో నిట్టివి మూడు కూతపదము లీయబడినవి.

1. తాళ్ళపాకవారి గేయ రచనలు-12వ సంపుటము 1956.

1. 'కుంపిసింద కందులూ-రంగరాసి బొందులూ
బొందులూ బొందులూ బొందులూ బొందులూ . . . . . . . . .'
2. 'చెన్నపట్నం చెఱుకుముక్క-నీకో ముక్క నాకో ముక్క
ముక్కా ముక్కా ముక్కా ముక్కా . . . . . . . . . . . .'
3. 'భీమునిపట్నం పంచెలజోడు-నీకో పంచె నాకో పంచె
పంచీ పంచీ బించీ పంచీ. . . . . . . . . . . .'

మొదటి చరణములు పాడిన తరువాత చివరిమాటలు 'బొందులూ' 'ముక్కా' 'బిందీ' యనువాని నూపిరి విడువకుండ నియమిత సమయమువరకు ఉచ్చరించుచునే యుండవలయును. దీనివలన పిల్లల శ్వాసకోశములు బలపడును. Breathing exercise కన్న నిది పదిరెట్లు లాభకారి.

బాలుర ఆటలు బాలికలయాటలంత సున్నితములు కావు. వీనిలో పరిశ్రమ అధికముగా నుండును. బాలురుకూడ బాలికలవలె దాగుడుమూతలవంటి యాట లాడెదరు. 'గోడిబిళ్ళ' వంటి యాటలు ప్రత్యేకముగా బాలురకు చెందినట్టివే. ఈయాటకు సంబంధించిన పాటను నెలయేటి'నుండి యుద్ధరించుచున్నాను.

'గోడీబిళ్ళ గోటీబిళ్ళ కాసుబిళ్ళ కంచాబిళ్ళ
మూసుబిళ్ళ ముక్కాబిళ్ళ సాసుబిళ్ళ చక్కనిబిళ్ళ
కోసుపెట్టి గూనుపెట్టి సాచిపెట్టి గోచిపెట్టి
అంగట్లో అపట్లో కఱ్ఱతో కొట్టి బుఱ్ఱతో గుణించి
వద్దంటే కద్దంటే సాటి తగవులతో గోటు తీపు ఎలతో
కుంటిమంచి బొంటిపిక్క చాలలేసి ఉంకాయ
ఓనమాలు కాకాలు ఓడినదొంగ వాటిమీద కొంగ
కూలెట్టిపోయి లాలా అర్దా
లాకుక్కురా మిడకుక్కురా గూటీబిళ్ళ థూబొడ్డు'

తెలంగాణమున 'జాడ్ బందర్' ఆటనాడెదరు. 'కోతి కొమ్మచ్చి' జాడ్ బందర్' ఐనది. బందర్ అనగా కోతి, జాడ్ అనగా చెట్టు. ఉర్దూ ప్రభావముచే తెలంగాణమున నిది ఝూ, జా డ్ బందర్ ఐనది. ఈ యాటకున్న పాట ఆంధ్రదేశమంతటను గలదు.

'కొండమీద వెండిగిన్నె-కొక్కిరాజు కాలు విరిగె
దానికేమ్మందూ ?
వేపాకు చేదు-వెల్లుల్లిగడ్డ-నూనమ్మబొడ్డు నూటొక్కధార'

ఇదికూడ అర్థములేని పాటల కొటిలో చేరనదే. ఇట్టియర్థములేని పాటలన్ని ఒకచో చేర్చి కీ.శే. సురవరం ప్రతాపరెడ్డిగారికి చూపించగా వారు ఈ పాటయందున్న

భగ్నాస్థిచికిత్సను నాకెరుకపరచిరి కోతికొమ్మచ్చి యాడుచు చెట్టునుండి క్రింద పడి కాలువిరిగినచో దానికి చికిత్సకై తగినమందు పాటలో చెప్పబడినది.(కచ్చ రాయలాటాడు నప్పుడుకూడ దీనిని పాడుదురు) కొందరు విమర్శకులు కొక్కిరాజనగా సారంగధరు డనిరి. సారంగధరుని కాళ్ళుచేతులు నరికిననాడు సిద్ధులు మరల నాతనికి కరపాదములీ మందుచేత నతికించియుందురు. పైన పేర్కొనబడిన రెండు కారణములందేది యీపాట పుట్టుకకు కారణమో సరిగా నిశ్చయింప వీలులేదు. కొక్కిరాజు సారంగధరు డనుటకన్న కొక్కి-యనగా వంకరయను నర్థము చెప్పుకొని కొంటెకుట్టు పాదని భావించిన సమంజసముగా నుండును.

'చిల్లగోనె' తెలుగువారి జాతీయమగు ఆట. దీనినే ఉర్దూలో 'గిల్లీదండ్' అందురు. దీనికి సంబంధించినది 'ఒంటికాల్, రెండోచిచ్చి, మూడోముచ్చి, నాల్గోనడ్డి, ఐదులపెద్ది, ఆరోకన్ను, పోరగాడు' అను పాట. ఒంటి, చిచ్చి, ముచ్చి, నడ్డి, పెద్ది, కన్ను అనునవి ఆయాటయందలి పేరులు. ఒకదాని తరువాత నొకటి యాడవలయును. దానికే సంఖ్యలు చేర్చి బద్దిపరకు కొలత పెట్టునప్పుడు లెక్కించుట పాటగా మారినది. ఏడు కొలతలకొక 'పోరగాడు' లేక 'పిల్ల'గా పరిగణింపబడును. చిల్లగోనెయే గోడిబిళ్ళయట. ఆటలందోడి యప్పలు దీర్చుకొనుటకై మగపిల్లలుకూడ కూతపెట్టుదురు.

'ఇటుకు చింతకాయ-కొరుకుతె వంకాయ
కలబోసిందుతె - కాకరకాయ
కాయ కాయ కాయ కాయ . . . . . .' వంటి కూతపాటలు

తెలంగాణమున నున్నవి. నెలయేరులో నున్న

'ఓరగడం వగడం కవిలికిదంతం-గిర గిర చక్రం గుండప్ప
హహహా కరెన్నపాపడు కిడ్డీ కడ్డీ కడ్డీ'
'చెట్టు గొట్టగా పాలు గారగా-చెన్నాపట్నం దారిచ్చి
దారిచ్చి దారిచ్చి దారిచ్చి దారిచ్చి' వంటివి కూతపాటలే. ఆటలందోడి

అప్పుతీర్చక పరుగెత్తిపోయినను లేదా మధ్యన వెడలిపోయినను పిల్లలందరు కూడి గేలిసేయుదురు. బాలికలైనచో,

'నగమాటల బోయింది చాకలోని పెండ్లాం
మధ్యాటల బోయింది మంగలోని పెండ్లాం
అప్పుదీర్చక పోయింది ఉప్పరోని పెండ్లాం' అనియు, మగవాడైనచో

'నగమాటల పోయినోడు చాకలోడు
మధ్యాటల పోయినోడు మంగలోడు
అప్పుదీర్చక పోయినోడు ఉప్పరోడు' అనియు గెలిసేయుదురు. గేలి సేయుటయందుగూడ బాలబాలికలు యతిప్రాసములు విడువరైరి. గతి తప్పరైరి. అందుకే కాబోలు 'తల్లినాలిని తిట్టినా తాళానికి కలువవలె' నను సామెత ప్రబలినది.

బాలబాలికల కితరుల గేలిసేయుట, ఏడ్పించుటయన్న వినోదము. ఒకని దుఃఖము మఱియొకరికి సంతోషకారణము. ఆటలందుకూడ ఇతరుల నేడ్పింప వలయుననెడు కుతూహలముతో బాలబాలికలు 'ఉసిరికాయ', 'అగ్గిపెట్టె' ఆట లాడుదురు. నింద తమపై బడకుండ ప్రయత్నముచేసి ఇతరులపై బడద్రోసి గేలిచేయు ఆటలివి. పదిమందియొకచో గూడినప్పుడు తమలోతామె లెక్కించు కొనుచు ఒకటి రెండను సంఖ్యలకు మారుగా 'ఉసిరికాయ, ఊరిబిందె, లవ్వో, లాటో, చెంచో, బైటో, టాంగు, టీంగు, తమ్మల్లపెద్దమ్మ, తుసుక్కు' అని లెక్కడుదురు. చివరిమాట ఎవరిని లెక్కడునప్పుడు వచ్చునో వారు పిత్తినారని అందుకే దుర్వాసన వచ్చుచున్నదని గేలిసేయుదురు. ఈ తుసుక్కను మాటను మార్చిమార్చి లెక్కడినచో ఎవరికనుకొన్న వారికే వర్తించును. తమ కిష్టము లేనివారి నీవిధముగా హేళన చేయుదురు. ఇట్టిదే 'అగ్గిపెట్టె - గుగ్గిపెట్టె - కోడి - కొమ్మ - పిల్ల - పిత్తు' అనుపాట. యతిప్రాసములు తిట్లకొదిగినవి. ఇటులనే ఒకరి నెత్తిపై వారికి తెలియకుండునటుల ఆకో అలమో ఉంచియో లేదా అట్టివస్తు వేదియైన నెత్తిపై పడియుండ నది గమనింపక యున్నపుడు 'ఓయమ్మగారి నెత్తిల గొట్టెంకా'యని పాడి గేలిసేయుదురు. ఒక్కొక్కప్పుడిట్టి వస్తువేమియు లేకున్నను పాటబాడెదరు. గుమ్మడికాయ దొంగలన్న భుజములు దడవుకొన్నట్లు ఎవ్వరైన తమ నెత్తిపై చేయిపెట్టి ఏమైన నున్నదేమోయని చూచుకొనగా నది లేనప్పుడు తక్కిన బాలురు మరింత గొల్లుమని నవ్వెదరు. ఈ పాటలన్నియు బాలబాలికల ఆటలకు సంబంధించినవే. ఆటపాటల నింతటితో విడిచి తక్కిన పాటల నారయుదము.

తమలో తామేకాక బాలబాలికలకు పెద్దలనుగూడ గేలిసేసి యపహసింప వలెనను కుతూహలముండును. 'గిల్లికజ్జాలు' పెట్టుకొనెడు గుణ మధికసంఖ్యాకు లందు కాననగును. ముసలివారిని, ముక్కిడివారిని, చేతకానివారిని, పిచ్చివాడని వెంబడించి గేలిసేసి సంతోషించుట పిల్లలకలవాటు. మాయూర తమ్మళపావయ్య

యను వృద్ధుడుండెను. అతని పేరుతో నొకగేయము ప్రసిద్ధికెక్కినది

'బోడ కాకరకాయ బొట్టు-తమ్మళ్ల పాపయ్య జుట్టు
జుట్టుకు మద్దెల గట్టు-కట్టకుంటె ఒట్టు బెట్టు'. అంత్యప్రాసములు ముక్త

పదగ్రస్తము లీపాటలో నల్లిబిల్లిగా నల్లుకొన్నవి. ఈ తంబళ పాపయ్య మద్దెల గొట్టువాడు. కొద్దిగా కుంటివాడు. పిల్లలాతని వెంబడించి ఈతీరుగా పాడి గేలిసేసెడివారు. పాపయ్య చనిపోయినను పాటమాత్ర మున్నది. ఇదేపాట తెలంగాణమున పలుచోటులందు కొలది భేదముతో నున్నది. తమ్మళపాపయ్య యనుచోట స్థానికుడగు 'అయ్యోరెంకయ్య'నో మరెవరినో ఇరికించి పాడుకొందురు.

'కోమటి కోమటి కొయ్య,రొట్టెమీది రొయ్య
నీయక్క చెవులు గొయ్య-నీయాలి ముండమొయ్య'
'అయ్యోరయ్యో రంతంత-అయ్యోరి పెండ్లాం ముంతంత
ముంత దీసుకపోయి మూలకు బెడితె-నక్కెత్తుకపోయెరా నారాయణ'
'నారాయణ నారాయణ నక్కతోక-నన్నెందుకుంచినవు కొంచబోక
పుట్నాల గంపకాడ దించిరాక-మంచినీళ్ళ బావికాడ ముంచిరాక'
'తమ్ముడు తమ్ముడు తాయిత్తు-తమ్ముడు పెండ్లాం మురికిత్తు
మురికిత్తు దీసుక మూలకు పెడితె-నక్కెత్తుక పాయెరా నారాయణ' యనుపాట

లితరుల నవహాస్యము చేయునట్టి పాటలు. చివరపాటలు రెండును యన్. యస్. వెంకటస్వామిగారు 1906 లో (The Indian Antiquary Vol.XXXV) ప్రకటించియున్నారు. ఈ పాటలందు తెలంగాణపు నుడికారము స్వచ్ఛముగా నగుపించుచున్నది. గేలిసేయుటకు పిల్లలకు వాయువీరను మితిలేదు. వారెవరి నైన వెక్కిరించగలరు. కృష్ణశ్రీగారిచ్చిన (విజయ ఉగాదిసంచిక)

'బ్రాహ్మణుడు బ్రాహ్మణుడు బెద్దనుక్క-బ్రాహ్మడి పెండ్లాం సుద్దముక్క
'కోమటి కోమటి కొత్త బెల్లం-కొంటావా తింటావా?' బ్రాహ్మణులను కోమటులను

వెక్కిరించెడు పాటలు. దసరా సమయములందు పాడెడు పాటలకు హాస్యానుకరణముగా నున్న పాటనొకటి వారుదాహరించిరి.

'పిడకలూ పుడకలూ అమరంగపెట్టి-అందులో అయ్యవార్ని పండుకోబెట్టి
తాటాకు వెలిగించి తలకింద బెట్టి-అయ్యయ్యో పంతులూ అయిపోయినావా' యను

పాట గురువుగారికి పంగనామములు దిద్దెడు శిష్యుల కొంటెతనమునకు కిరీటము.

'పంతులు పంతులు, పావుశేరు మెంతులు-ఎగిరేసి కొడితే. ఏడు మెంతులు'।

పాట ఈకోవకు చెందినదే. తమకు వడపప్పులో, కొబ్బరికాయలో, అంటి పండ్లో ఈయని పూజారిని పట్టుకొని బాలురు గేలిచేసినపాట గమనింపుడు.

'ఆరటిపళ్ళు కొబ్బరికాయ అమ్మవారికి-చేతిలోని చెల్లనికాని పూజారికి
వడపప్పు చలిమిళ్ళు అమ్మవారికి-చేతిలోని చెల్లనికాని పూజారికి
అగరువత్తులు కర్పూరం అమ్మవారికి-చేతిలోని చెల్లనికాని అయ్యవారికి'(సేకరించినది)

ఒక చిలిపిమరదలు బావగారి నేవిధముగా నేడ్పించుచున్నదో చూడుడు.

'బావాబావా పన్నీరు-బావను పట్టుకు తన్నేరు
వీధివీధి తిప్పేరు-వీశెడు గంధం పూసేరు
చావడి గుంజకు కట్టేరు-చప్పిడిగుద్దులు గుద్దేరు'
'పదేళ్ళనాటిదే పాతదూలమ్మ-పడిపోయె మాబావ పళ్ళరుస మీద
పళ్ళన్ని పిప్పాయె నో రెర్రనాయె-వీధిలో బావగారికి విన సిగ్గులాయె'
(నవ్వులు-పువ్వులు)

బావగారినే ఈవిధముగా నపహసించిన కొంటె మరదలికి వదినగారి నుడికించు టొకలెక్కకాదు.

'వదినా వదినా వల్లంకిపిట్టా-గదిలో పెట్టా గంజినీళ్ళొయ్యా
నీ కొడుకుట్టా నాపేరెట్టా-అన్నయ్య కొట్టా నువ్వేడ్వ నేనవ్వా'
'వదిన వదిన వాసింత-పన్నెండేండ్ల కడుపంట
తిరిగిచూస్తె లేదంట-మళ్ళీచూస్తే మంచానున్నాడంట' (నవ్వులు-పువ్వులు)

ముసలితాతలను చూడగనే పిల్లలకేమనిపించునో కాని వారిని వెక్కిరించి యేడ్పింతురు. ముదుసలి తాతలకుగూడ మనుమల మనుమరాండ్ర వెక్కిరింపులు ఆనందదాయకములు. ఇద్దరి వయోధర్మములకు పోలిక యుండుటచే కాబోలు తాతమనుమల సయ్యాట లిట్లు సాగివచ్చుచున్నవి. జీవితమను దినమున నొకరుదయమును మరొకరు అస్తమయమును సూచించు రీపాత్రములు.

తాత పీత ముంజుకాయ మూత-కొడవలిపెట్టి కోత నంజు నాచేత-నీవు సిరోత
పిల్లలపాటలు)

ఈ పాటలందంతటను యతిప్రాసాది నియమములు వానియంత నవియే వచ్చిపడినట్లుండుట గమనింపదగిన విశేషము. తల్లిదండ్రులు చెప్పగా విన్న పాటలు వారి రక్తములో యతిప్రాసములను తాళలయలను ఇంకించును. ఆ సంస్కారమే వారనటుల పాడించును.

బాలురకు, ఆటపాటలకు హాస్యమునకే కవిత్వ ముద్భవించదు. వారి

సామర్థ్య మీబాలబాలికల కిప్పటికి కలిగినది. వారి బుద్ధి వికసించినది. పది ఋతువులు గడిచిపోయినవి. ఇట్టి తరుణమున వారి మెదడుకు పెద్దలు మేతలు వేయుదురు. చిన్నచిన్న సమస్యలిచ్చి వానిని విడదీయుమందురు. మొదట తెలిసి కొనలేకపోయినను తరువాత మెల్లమెల్లగా వారీసమస్యలను విడదీయుట కలవాటు పడెదరు. బాలబాలికల మేధావికాసమునకు దోహద మొసగునట్టివి పొడుపుకథలు. వీనిని తెలంగాణమున (ఓరుగల్లు ప్రాంతమున) శాస్త్రములందురు. శాస్త్రార్థ మెంత కఠినమో వీనిని విడదీయుట యంత కష్టమని కాబోలు పొడుపు కథలకు శాస్త్రములని పేరు వచ్చినది. పాలమూరు మండలమున తట్లందురు. సంస్కృతమున ప్రహేళికలందురు. పొడుపుకథలు ప్రపంచమందన్ని భాషలందును కలవు. ఒకప్పుడు గ్రీకులు రోమనులు ఈ శాస్త్రములకు గొప్ప ప్రాధాన్యమిచ్చి యుండిరి. మనదేశవాళీ కథలందుగూడ వానికట్టి ప్రాముఖ్యమున్నది. ఎందరో రాకుమారులు సాహసికులు స్త్రీలు పన్నిన శాస్త్రముల చర్చలందు పూర్వపక్షమై పోయిరి. యక్షప్రశ్నలు మనకుండనే యున్నవి. ఈపొడుపుకథలు బాలబాలికల మేధావికాసమునకు తోడ్పడుటయేకాక వారిని సాహసికుల గావించును.

'గోడమీద బొమ్మ - గొలుసుల బొమ్మ
వచ్చిపోయేటోళ్ళను వడ్డించే బొమ్మ' యనుటతోడనే పది సంవత్సరముల బాలబాలికలు 'తేలు' అని చప్పున చెప్పగలరు. ఇటులనే 'కిరకిర తలుపులు-కిరాయి తలుపులు, పెట్టవస్తాయి కాని-తియ్యరావు' (ముగ్గు) వంటి పొడుపుకథలు తొందరగా అర్థమగునట్టివి; బాలుర నిత్యానుభూతికి సమీపముగా నుండునట్టివి. 'నవ్వులు పువ్వులు' పుస్తకమునందున్న

'ముక్కుమీది కెక్కు-రెండుచెవుల నొక్కు
టక్కునిక్కుల నొక్కు-జారిందంటే పటుక్కు' (సులోచనములు)
'అడవిలో పుట్టింది-అడవిలో పెరిగింది
మాయింటి కొచ్చింది-తైతక్కలాడింది' (కవ్వము
'వచ్చని పెట్టెలో-విచ్చుకొనుంది
తెచ్చుకోబోతేను-గుచ్చుకుంటుంది
ఎంత గుచ్చుకొన్న ఏమైనగాని
తెచ్చుకోమాన-మెచ్చుకోమాన' (మొగలిపువ్వు)

వంటి పొడుపుకథలును, 'హిందూ బాలికాభూషణ' మందున్న

'నూతిలోని పాము-నున్నని పాము
బావచారల పాము-చక్కనిపాము' (పొట్లకాయ)

వంటి పొడుపుకథలును బాలురకు సులభగ్రాహ్యములు. ఇవి క్రమముగా కఠినములై బాలుర మేధను ఒరపిడిపెట్టి వికసింపజేయును.

'ఇంతంత గుడి గాదు-ఈశ్వరుని గుడి గాదు
కంచుకొప్పెర గాదు-కదిలించగా రాదు' (ఆకాశము)

వంటి శాస్త్రములను విప్పునప్పటికి బాలుర తెలివితేటలు ఆకసమంటును. అర్థము లేని పాటలు (Nonsense Rhymes) మెల్ల మెల్లగా శాస్త్రార్థములవరకు పెరిగి పోయినవి. యతిప్రాసము లెప్పుడో జీర్ణమైపోయినవి. భాష భావములు పెనవేసికొని బాలుర జిహ్వాగ్రముల పాదుకొన్నవి. పాటల ఫణుతులు మారిమారి 'ఇంతంత గుడి గాదు, ఈశ్వరుని గుడిగాద' ను నప్పటికి తెలుగువారి జాతీయఛంద మన బరగిన ద్విపదను సమీపించినవి. ఇంకేమున్నది! ఒక్క మెట్టు పైకెక్కిన ద్విపదయే సాక్షాత్కరించును. ఆమెట్టుపైన నుండునది దేశికవిత్వము. దాని జోలికి పిల్లలు పోరు. వారెక్కగల చివర మెట్టు దసరా పండుగ. ఆతరుణమున బడిపంతులును ముందుంచుకొని గడలు పట్టుకొని ఇల్లిల్లు దిరుగుచు 'శ్రీరస్తు విజయోస్తు దీర్ఘాయురస్తు ఆరోగ్యమస్తు మీకైశ్వర్యమస్తు, జయావిజయీభవ దిగ్విజయీభవ' యని 'బ్రహ్మదీవెన'లిచ్చెదరు. రాజులిండ్లకు బోయి 'ఎల్ల ఏనుగునెక్కి ఏలితివి జగము' అనియును, కోమటివారిని జూచి 'కోటికిని పడగెత్తి కోమట్లలోను' అనియును, చివరకు ఆరెవాండ్ల గృహములకు గూడ వెడలి 'మరాటి భాషలో మహిలోన మీరు కాతెరే జాపురే కోను కుటగెలరె' యనుచు పొగడి తమ శ్రమకు ఫలితముగా 'అయ్యవారికి చాలు ఐదు వరహాలు-పిలవాండ్లకు చాలు పప్పు బెల్లాలు' అని 'రేపురా మాపురా మళ్లీ:మ్మనక' తమను సాగనంపుడని 'బాలురా దీవెనలు బ్రహ్మదీవెన'లిచ్చెదరు. వీనితోడనే వారికి దసరా పద్యములు, భారతభాగవతములందలి సరళ పద్యములు కంఠస్థమైపోవును. శిష్టసాహితీమార్గమున పయనించుటకై యడుగు లిడెదరు పిల్లల నింతటితో విడుచుట లెస్స.



# శృంగార గేయములు

శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనో రసః'1 అని యాలంకారికులు శృంగారమునకు పట్టము గట్టిరి. సంస్కృతప్రాకృతములందును దేశభాషలందును శృంగారరసప్రాధాన్యముగల కావ్యములు వేనవేలు రచింపబడినవి. బహుళః ప్రపంచమం దన్నిభాషలందును శృంగారమున కగ్రస్థానమే లభించి యున్నది. దీనికి కారణము మానవనైజము దక్క వేరొకటి లేదు. ప్రాణికోటి సమస్తము సుఖమును, ఆనందమును నాకాంక్షించియే ప్రస్థాన మొనర్చుచున్నది. కనుక మాధుర్యహేతువై సుఖానందపర్యవసాయియగు శృంగార మింత యధికముగా సంపోషింపబడుట సమంజసమే. జానపదవాఙ్మయముకూడ ఇట్టి పరిస్థితికి వెలియైనది కాదు. శిష్టసాహిత్యమున కేవలము శృంగార కావ్యములే యధికముగా నున్నవి కాని జానపదగేయములందు శృంగారకరుణములు రెండును ఇంచుమించు సమానముగా నున్నవి. జీవితమున సుఖదుఃఖములు రెండును సమాన మగుటచేత కాబోలు (దుఃఖమే యధికమేమో) సహజత్వ మధికముగాగల జానపదవాఙ్మయమున నీ రెండును సమానముగానున్నవి. ఆలంకారికులు ఉపాధిని బట్టి శృంగారమును కొన్నిచోటుల గ్రాహ్యమనియు మరికొన్నిచోటుల దూష్యమనియు చెప్పిరి. ధర్మవ్యవస్థితమైనశృంగారమే ఆరాధ్యమనిరి. వాల్మీకికాళిదాసాది మహాకవులట్టిశృంగారమునే ప్రతిపాదించిరి. 'ప్రజాయైగృహమేధినామ్'2 అనుటచే ధర్మావలంబనమగు కామముపాదేయ మగునవి మహాకవి కాళిదాసు మతముగా గోచరించును. ఆలంకారికులు ఏకత్రైవానురాగము, తిర్యఙ్మ్లేచ్ఛగతము, బహుసక్తి కలిగిన శృంగారమును రసాభాసముగా చెప్పినను హరిపాలుడు3 విద్యాధరుడు4 సింగభూపాలుడు5 మున్నగువారు భిన్నమతముల ప్రకటించి రసాభాసములని చెప్పబడినవానినిగూడ నుపాదేయములని ప్రవచించిరి. కావి

1. ధ్వన్యాలోకము-ఆనందవర్ధనుడు 2. రఘువంశము I-7
3. సంగీతసుధాకరము 4. ఏకావళి 5. రసార్ణవసుధాకరము.

కేవలధర్మనిరతు లిట్టి వాదము లంగీకరింపరు. వాదముల సంగతి యెట్లున్నను ఇన్ని విధముల శృంగారము మాత్రము లోకమం దవిచ్ఛిన్నముగా సాగుచునే యున్నదనుటకు వాఙ్మయమున ననేకనిదర్శనము లున్నవి. కాళిదాసంతవాడుకూడ తిర్యగ్గతశృంగారమును వర్ణింపక పోలేదు. జానపదసాహిత్యమునందు గూడ నంతియ. మఱియును శృంగారము సంభోగవియోగాదిభేదములతో శిష్టసాహిత్యమున ప్రదర్శింప బడినటులే జానపద సాహిత్యమునందును నీవిభేదములు కలవు. శిష్టసాహిత్యమునశృంగారము నంగరసముగా నంగిరసముగా చెప్పినటులే జానపదసాహిత్యమునందును శృంగారము నంగరసముగా నంగిరసముగా గాంతుము. ఐనను శిష్టసాహిత్యమందలి శృంగార రసపోషణము నకును జానపదసాహిత్యమందలి శృంగారరసపోషణమునకును తారతమ్యము గలదు. శృంగారమును ప్రధానముగా వర్ణించినవి జానపద వాఙ్మయమున కావ్యములు లేవు కేవలము ఖండ కావ్యము లున్నవి. సమస్త లక్షణములతో నొప్పారు కావ్యములు జానపదుల రచనలందుండుట యరుదు. ఇంతకు పూర్వము చర్చింపబడిన ప్రకరణములందు పెక్కుచోట్ల శృంగార గేయము లున్నవి. వీలు ననుసరించి వానిని వేరే ప్రకరణములలో నిదివరకే పేర్కొని యుంటిని. శృంగారము ప్రధానరసమైన పెక్కు గేయము లున్నను అవి శిష్టుల నిర్వచనము ప్రకారము కావ్యములు కావు. ఆధునిక భావకవులు రచించిన ఖండ కావ్యములటులే జానపదుల గేయములు కూడ విభావాది సామగ్రిని సంపూర్ణముగ ప్రపంచించునవి కాక ఏదో యొక సంచారభావము నాశ్రయించినవిగా నుండును. జానపదగేయవాఙ్మయమున నితరశాఖలతో పోల్చిచూచినచో ముద్రితములగు శృంగార గేయముల సంఖ్య అత్యల్పము. అవి యెంత బహుళ సంఖ్యలో నున్నవోయంత విరళసంఖ్యలో నచ్చైనవి. ఈ ప్రకరణమున జానపద గేయములం దప్రధానముగా మఱియు ప్రధానముగా పోషింపబడిన శృంగార భావములు పరిశీలింపబడును. ఇట శృంగారము పరకీయమా స్వకీయమా, ఉత్తమ నాయికా నాయక నిష్ఠమా లేక ప్రాకృత నాయికా నాయకనిష్ఠమా యను చర్చ లనవసరము. పండిత శ్రీ అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు జానపదగేయములందలి శృంగార మంతయు నీచమనియు దుష్టమనియు కేవలము కామప్రేరితమనియు నిందించిరి.1 వెంకయ్య చంద్రమ్మ పాట, నారాయణమ్మ నాయుడుబావ పాటవంటివి వారి యాగ్రహమునకు గురయైనవి. వారి దృష్టికి

1. నేటికాలపు కవిత్వం

అది యుచితముగనే తోచినది. ప్రస్తుతము మనము విచారించునది శిష్టేతరము-జానపదము మరియు ప్రాకృతుల వాఙ్మయమే కనుక వారి విమర్శనలిట నతుకవు. మఱియును జానపదులు చిత్రించిన సీతారామాది యుత్తమనాయికానాయకగత శృంగారముగూడ పామరభావసమన్వితమే యని గ్రహింపవలయును.జానపదుల పేరిటనున్న వాఙ్మయమందంతటను గోచరించునవి వారి భావములే కాని ఆయా పాత్రములభావములుకావు.ఎట్టిగేయములందైనను జానపదులప్రేమకలాపములు, సాంఘికనియమోల్లంఘనములు (సంస్కార దృష్టి యనుకొనవచ్చును) పరస్పరాకర్షణములే కాననగును. కాని శిష్టులు వాంఛించెడు ధర్మనిరతి గల శృంగారమును చూడ గోరుట మన భ్రమ.జానపదవాఙ్మయమునందు జీవితము యథాతథముగ నగ్నతేజముతో భాసించును. కావ్యధర్మమైన ఔచిత్యవిచారము జీవితమునం దంతగా నగుపింపదని యంగీకరింపక తప్పదు. జానపద వాఙ్మయమున ఔచిత్యపోషణోద్దేశముతో పాత్రములకు మెరుగుపెట్టు పద్ధతి లేదు. జీవితమునం దెంత వైవిధ్యము ప్రత్యక్షమగునో అంతయు జానపద కావ్యము నందును ప్రత్యక్షమగును.అచ్చట నుదాత్తము ఉనుదాత్తము,సభ్యశృంగారము, రసాభాసశృంగారము, నీచశృంగారము మొదలగునవి యన్నియు నొకదానితో నొకటి బుజము లొరసికొనుచు పోవుచుండును. కనుక 'ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః'యను శ్రుతివాక్యములందలి జగదవిచ్ఛిత్తిహేతుక ధర్మకామము జానపదవాఙ్మయమం దుండవలెనని యపేక్షించుట ఛాందసము. ఐనను ఇట్టి ధర్మావలంబనము గల ప్రేమశృంగారములతో నొప్పు గేయములు కూడ అనేకములుగలవు. కనుక ప్రకృతము ననుసరింతము.మొదట నితఃపూర్వము పరిశీలించిన గేయములందలి శృంగారమును విచారించి తరువాత కేవల శృంగారగేయముల పరిశీలింపనగును.

రామాయణ సంబంధమగు'కౌసల్యా బైకలు'అను గేయమున ప్రసవవేదన ననుభవించు కౌసల్య యనినమాటలు (ప్రసూతివైరాగ్యము) గమనింపదగినవి. ఇది రచించినది గోదానాయకమ్మ. 'అతనితో నేనేమో రతి చాలయితిని గాని వెతల నేనెరుగనైతిని వోయమ్మా వెతల నేనెరుగనైతిని-ఈసారి గడిచితే ఇంక నా విభునితో ఏకాంత మాడనమ్మా వోయమ్మా ఏకాంత మాడనమ్మా' ఈ ప్రసూతివైరాగ్యము జానపదులది కాక కౌసల్యదందురా?ఇంకను 'అతివరో వినవమ్మ అతడొక్కనాడు-తరుణి రమ్మని పిలిచి తొడలపై నునిచి తడబడిన

హారముల్ చక్కగా తోసి-ముంగురులు సవరించి ముద్దులాడుచును - కౌగిట చేర్చెనో కడు మోహములతో - ఉండగా నేనెట్లు వలదందునమ్మా. ఉండితినోయమ్మ ఊరికె నేను - మోసపోతి గదనమ్మ భాసురాంగి' యని తానేమి యెరుగనట్లు పలికినది.

*'సీతనత్తవారింటికంపుట'* యనుపాటలో మిథిలాపురమున సీతమ్మ ఒకరాత్రి శ్రీరామచంద్రునితో కలిసియుండి తెల్లవారగనే గది వెలుపలికి వచ్చునప్పు డామెను వర్ణించిన పద్ధతి సంభోగశృంగారమును సూచించును. 'ధగధగ మెరసెటి దంతపు బొగడల పావలు బిగదొక్కుచునూ-పసుపంటిన చీరతో పయి చిట్లిన గంధముతో విడిబడు కొప్పులతోను-ముసిముసి నగవులతోనూ వచ్చెటి చిన్నెలు జూచి ముచ్చటపడిరి చెలులంతా'.

*'సీతగడియ'* యనుపాట చక్కని శృంగారఖండగేయకృతి. పడకటింటికి సీత ఆలస్యముగా వచ్చినందుకు శ్రీరాముడు గదితలుపులు వేసికొనెను. సీతమ్మ తలుపు తీయుమని బతిమాలి బతిమాలి 'నాలుగో జామాయె నా ప్రాణనాథ - రత్నహారం బిస్తు తీయవోయి గడియ-*కరుణించి తీస్తివా కాళ్లకడనైన-మరచి పక నిద్రైనశరణొంది పోదు*'నని మధురముగా వేడుకొన్నది. ఈపాటలో సంభోగశృంగారము వాచ్యముగ కాక ఎంతో ధ్వనిగా సూచింపబడినది. కౌసల్య వచ్చి శ్రీరామునిచే తలుపులు తీయించినది. సీత రాముని సరస చేరెను 'సిగ్గుతో శ్రీలక్ష్మి విభునిసన్నిధికి - *చేరగానే దివ్వె కలకలా నవ్వె* - ఆకులావాసనా పానుపుమీద-పోకలా వాసనా పానుపుమీద - గంధపువాసనలు పానుపుమీద-కస్తూరివాసనలు పానుపుమీద-పువ్వులా వాసన పానుపుమీద-బుక్కాల వాసన పానుపుమీద'. దీపపు నవ్వుతోడను పరిమళద్రవ్యముల వాసనతోడను సీతారాముల సంభోగశృంగారము సూచితము. ఇంతచక్కని వర్ణనము మనకు శిష్టసాహిత్యమున గూడ నరుదుగా లభించును.

పై గేయమువంటిదే *'సీతమ్మవారి అలక'* పాట. అలిగికూర్చున్న సీతమ్మ కడకు రెండవమారు చిలుకను రాయబారమంపు శ్రీరాముడు 'చిలుకరో ఓ చిలుక మారామచిలుక, ఎఱ్ఱని ముక్కునకు వెండి పొదిగిస్తు, పచ్చనీ రెక్కలకు పైడి పొదిగిస్తు. నీవు పోయె దారిలో శనగవేయిస్తు. శనగదిని నీళ్ళుద్రాగ చలమదోడిస్తు, నిలుచుండి నీళ్లు ద్రాగ నిమ్మలేయింతు, పడుకుండి పాలుద్రాగ పనసలేయింతు, అలసి నీవు కూర్చుండ అరుగు వేయింతు, కుదురుగా కూర్చుండ కురువింద వేతు'

అని 'పంచారామములందు బల్వెలపురన్ బ్రౌఢేందుబింబాననల్' బెండపూడన్నని దారతార కవయగోరి దూతికాతతికి ' కాంచీకంకణతారహారకటకగ్రైవేయ భూషావళుల్' లంచమిచ్చినటుల తాను లంచము లిచ్చుటకు గడంగెను. కాని చిలుకరాయబారము ఫలింపదయ్యెను. అప్పుడాచిలుక సంధిప్రయత్నములు మాని భేదమున సీతమ్మను సాధించెను. చిన్నబోయిన చిలుకను లక్ష్మణస్వామి కారణమడుగ నది ఒకయెత్తు ఎత్తి సీతమ్మ వినునట్లుగా 'వారాలు మొగలకు వాదమయినాది, వక్కవర్ణంనుండి వాదంబులుండె, ఇరుగు పొరుగున నుండు ఇంతులందారు, సిరిదేవి అలుకలూ తీర్చబోయిరి - వారి వశముగాక వచ్చి కూర్చుండ్రి- *రఘురాము వంట్లోను లఘువు తప్పింది'* యనెను. రాముని యస్వస్థతను విన్న సీత చప్పున లేచి శ్రీరాముని జూడబోయినది. వియోగ శృంగారమందీ భావములు తళుకులు.

'*సీతాదేవి వేవిళ్లు*' అనుపాటలో చూలాలగు సీతమ్మ శయ్యపై నుండగా శ్రీరాముడామెను సమీపించి 'ఆనాడు నీమేడ కొస్తినే దేవి, చాల చిక్కుంటివే జవరాల నీవు, ఆనాడు నీవద్ద నే పవ్వళిస్తె, చాల చోటాయెనే జవరాల నాకు, ఈనాడు నీమేడకొస్తినే దేవి, చాల నిండుంటివే సదమలదేవి, నీసుతులు నీవును పై పవ్వళిస్తే, పాదాల క్రిందనె నేపవ్వళిస్తు' నన్న మాటలందు శృంగారము మొదట వాచ్యముగా నున్నను తరువాత నతిమనోహరముగా సుందరముగా నున్నది.

'*ఊర్మిళాదేవి నిద్ర*' మహావియోగ గీతము; సకరుణము. 'సీతాదేవి అనవాలు' పాటలో సీతారాముల శృంగార జీవితమందలి మధురానుభూతు లున్నవి. '*శారదరామాయణము*' న సీతను గోలుపోయిన శ్రీరాముడు 'తరమా దానిసోయగం బెన్నగ తరమా, మది వరరూపమైన సుందరమా, దాని పలుకులును కోకిలస్వరమా' యని తలచుకొనుపట్ల వియోగశృంగారమును, ఆంజనేయుడు లంకాపురీస్త్రీల వర్ణించునప్పటి శృంగారభావములును గమనింపదగినవి. శాపగోపాలుని '*సుందరాకాండ పదము*' నందు సీతావియోగశృంగార మున్నది. అంగుళీయక మిచ్చివచ్చిన హనుమంతుడు రామునితో 'చిత్తగించుము నీదు చిటికెనే లుంగరము ఆదిలక్ష్మిచేతి కమరె కంకణ' మను భావము శకుంతలా విరహమున చిక్కిపోయిన దుష్యంతుడు 'అనభిలులిత జ్యాఘాతాంకం ముహర్మణిబన్ధనా త్కనకవలయ స్రస్తం స్రస్తం మయా ప్రతిసార్యతే'[1] యను వర్ణనమును మీరినది. '*కుశలవ యుద్ధము*' వంటిపాటలలో సీతారాముల శృంగారము మితిమీరినది.

---

1. అభిజ్ఞాన శాకుంతలము, తృతీయాంకము.

భారతసంబంధ గాథలందు 'నలచరిత్ర పదము' 'సుభద్రా కల్యాణము' 'శశిరేఖాపరిణయము-పదము' 'దేవయాని చరిత్రము-జంగంకథ' వంటి శృంగార గేయములు కలవు. మచ్చునకొక వర్ణన ముదాహరింతును. 'నలచరిత్రపదము'న దమయంతీవిరహము శిష్టసాహిత్యము ననుకరించును. విరహిణులకు శైత్యోపచారములు ప్రబంధములందు తరచుగా జరుగును. దమయంతికి జరిగిన శైత్యోపచారములు గమనింపుడు. 'మంచి గంధము తెచ్చి మగువకు బూసితే-కందితత్ క్షణమందు కస్తూరి యయ్యె. మల్లెపువ్వులదండ మదిరాక్షికిని వైవ-వాడివత్తులనయ్యె వసుమతీనాథ, ముత్యాలసరము లాముదితకు వైవంగ-మేలైన ముత్యముల్ నీలంబులయ్యె, పన్నీరు దెప్పించి పడతి పెన్నున బోయ-కుతకుతమని యుడికె కువలయాధీశ, చన్నీళ్ళు కాగులో చపలాక్షి నుంచితే-వింతగా చన్నీళ్ళు వేడెక్కెనయ్యా చిగురుటాకులమీద చెలియను జేర్చితే-పొగలుగా నలమెనా చిగురాకు లెల్ల, తరుణీమణికి మదనతాపంబు రెట్టించె-మగువను పోషింప మాచేత గాదు.'

'సుభద్రాకల్యాణము' పాటలో నర్జునుడు కపటముని వేషమున సుభద్రతో సరసోక్తులాడుట, కృష్ణప్రేరితలై రుక్మిణీసత్యభామలు సుభద్రను గేలిసేయుట, సుభద్రార్జునుల శోభనము మున్నగునవి శృంగారభావయుతములు. 'దేవయాని-జంగంకథ' ఏకత్రైవానురాగమను రసాభాసమున కుదాహరణము. తన ప్రేమను నిరాకరించిన కచుని శపించునంతవరకు పోయినది దేవయాని యనురాగము. దేవయాని యయాతిరాజుల యనురాగము, శర్మిష్ఠాయయాతిరాజుల గూఢానురాగము మున్నగునవి శృంగారమయములు. 'శశిరేఖాపరిణయము' పూర్తిగా శృంగారగేయము.

ఇక భాగవతకథలందున్న శృంగారమునకు మితియే లేదు. శ్రీకృష్ణ పరమాత్మని శృంగారనాయకునిగా నొనర్చి భక్తులు, వేదాంతులు, జానపదులు పెక్కు కథలల్లిరి. గోపికాస్త్రీల జలక్రీడలు, ఉషాస్వప్నము, రుక్మిణీదేవి ముచ్చట, రుక్మిణీదేవి సీమంతము, చిలుక రాయబారము, సత్యభామ సరసము, పారుజాత పల్లవి, రుక్మిణీకల్యాణము, భ్రమరగీతలు వంటి స్త్రీలపాటలన్నియు శృంగార రసతుందిలములు. గోపికాకృష్ణుల, రాధాకృష్ణుల శృంగారము నంతయు మధుర భక్తి పేరుతో జయదేవలీలాశుకాది సంస్కృతభక్తకవులును, క్షేత్రయ్య త్యాగరాజాది తెలుగు భక్తులును అత్యుజ్జ్వలముగా చిత్రించిరి. 'బాల కృష్ణలీల'లం దొక గోపిక యశోదతో 'నాయక్క రూపముతో నాయింటికి వచ్చి-రేయెల్ల

నాతో శయనించి తిరిగిపోయే వేళను—రూపమును మార్చి మాయమైనాడు నేనెట్లు మన్నింతు నీసుతు'నని కృష్ణుని ధూర్తశృంగారమును చిత్రించినది 'గోపికాస్త్రీల జలక్రీడలందు ధూర్తకృష్ణుని పట్టుదలచే వివస్త్రలై యున్న గోపికలందరును రెండు చేతులెత్తి మ్రొక్కగా 'అందరు మ్రొక్కగనూ ఒక చెలి యదియే సందనుచూ అందరి నడుమను అందముతోడుత అందందీ మ్రొక్క' మానము మారలిచ్చిన వర్ణనమున్నది. 'ఉషాస్వప్నము'సంపూర్ణముగా శృంగారఖండము. ఉషాకన్య నామె సఖులు స్వప్నమున నగుపడిన ప్రియు డనిరుద్ధుడాయని యడుగ 'అనగానె కాదంచు నౌనంచు బల్కక యతివ శిరమును వంచెను. చేతితో తలయెత్తి చెలికత్తె నవ్వినను సిగ్గుచే తలయెత్తదు ........ రత్నాలహారమును రదనముల గోరుచును రమణి తా తలయెత్తదు. రవికెముడి గిల్లుచును రాయిడి నొప్పుచును ఉవిద తా తల యెత్తదు'. ఇట ఉషాకన్య ముగ్ధనాయిక. భాగవతాదులందు ఉషానిరుద్ధుల వివాహము రాక్షసము. కాని ఈ గేయమున పితృసమ్మతము. ఉషాకన్య అనిరుద్ధుని ప్రేమించిన వార్త చిత్రరేఖవలన విని బాణాసురుడు పరమసంతోషమున నంగీకరించి ఇరువురికి వివాహ మొనర్చెను. బహుశః జానపదులు, ఉషానిరుద్ధుల ప్రేమకలాపములకు కష్టులు గలిపించిన నిరోధముల తొలగించియుందురు. రుక్మిణీదేవి ముచ్చట, రుక్మిణీ దేవి సీమంతము, చిలుక రాయబారము, సత్యభామ సరసము మున్నగు పాట లందున్న శృంగారభావములన్నియు పౌరాణికగేయప్రకరణమున చేర్చితిని. ఈ పాటలన్నియు రసగుళికలు. నేను సేకరించి భాగవత కథలందు జేర్చిన 'భ్రమర గీతలు' విప్రలంభశృంగారమునకు మకుటాయమానమగు గేయము. దీనినిగూర్చి కూడ రెండవప్రకరణమున చూడనగును.

చారిత్రకగేయములందు కూడ శృంగారము లేకపోలేదు. పల్నాటివీర చరిత్రమున 'విరహతాపము దొట్టి వేసట పుట్టి, పదియవస్థలు మేన ప్రాప్తించి మించ, బహువేదనల బడి పారంబు లేక, ఉసురుసురంచును ఉడుగని జాలి, భావంబులో నుండి భయమును బొంది, తనువు కంపింపగ తగుమాట మరచి.... పొంత సిగ్గు విడిచియు భుజియింపమాని, తపియింప దేహంబు తరిచైన రాక, తడబడ నాలుక తల్లడంబంది, జీవంబు దొలగంగ చింతయొనర్చి' పరవశమ్మున పాన్పుపై నున్నట్లు, బాలచంద్రుని సమక్షమున నటించిన శ్యామాంగియను

శ్యామాంగి నతిప్రేమ అక్కున చేర్చి, కాటుక చెదరంగ కన్నీరు తుడిచి, చెదరిన కురులను చిక్కులు దీసి, సీమంత మొగిదీర్చి చేర్చుక్కనిలిపి, కౌగిట బిగియించి కాంచనరత్న, హారంబు లెదమీద నమరికచేసి, కెరలి మోహమున చెక్కిళ్ళు ముద్దాడిన ఘట్టము జారిణీశృంగారమునకును, ఏడుజాములైనను భర్తృ సాన్నిధ్యమును బడసిన వీరనారీమణి మాంచాల యనుభవ ముత్తమ శృంగారమునకును ఉదాహరణము. ఇటులనే దేశింగురాజుకథ, పెద్దబొబ్బిలి రాజుకథ, సదాశివరెడ్డి కథలందు వీరదంపతుల యనురాగ ముత్తమశ్రేణికి చెందినది. బంగారు తిమ్మరాజు కథలో రంగసాని ప్రణయము వేశ్యాశృంగారము.

కరుణరసపూరితములగు కథలందు లక్ష్మమ్మ, సన్యాసమ్మ, మండపేట పాపమ్మ, నల్లతంగాళ్, ఎరుకల నాంచారి, వీరరాజమ్మ పాటలందు ధర్మ స్వభావులైన జానపదదంపతుల యుత్తమశృంగారము ధ్వనించుచున్నది. ఒక్క సారంగధర చరిత్రమున మాత్రము తుచ్ఛశృంగారభావము లున్నవి. ఇచట గూడ ఏకత్రైవానురాగమే ప్రదర్శితము జానపదుల శృంగారము నీచమను ఉమాకాన్తవిద్యాశేఖరుల యభిప్రాయమునకు సన్యాసమ్మ, మండపేట పాపమ్మ, వీరరాజమ్మ, కామమ్మ, ఎరుకల నాంచారి వంటి జానపదుల కథానాయికల పవిత్ర చరిత్రములు సరియైన సమాధాన మీయగలవు. శిష్టసాహిత్యమందును గూడ ఇట్టి పాత్రము లరుదు. వీరందరును ప్రాతఃకాలమున స్మరింపదగిన పతివ్రతలు. అహల్యా, ద్రౌపదీ, కుంతీ, తారా, మండోదరీ కాంతలవలె నుత్తమగుణ శీలములు కలవారు. ఈకథలం దధికముగా కరుణరసమిశ్రితమగు విప్రలంభ శృంగారము కాననగును. ఒక్క సారంగధర చరిత్రమున మాత్రము హేయ శృంగార మున్నదని మనవిచేసితిని. సారంగధరుని మోహించి చిత్రాంగి,

'చిలుకలను గోర్వంకలను జూపినాది, అతనిచే వాని విడిపించినాది
సరసపద్యములు చదివించినాది, ఈమె నిను వలచె ననిపించినాది
గృహమయూరముల నులికించినాది, హస్తములచేత నాడించినాది
హంసలకు నడకలను నేర్పినాది, లలితపుష్పలత లగుపరచినాది
అల్ల కొమ్మపై చూడుమన్నాది, పూలగుత్తులవి మేలువన్నాది
నాడెమెరిగి చేబూనుమన్నాది, మంచి సౌఖ్యము గ్రహించుమన్నాది
ఇక్కువల కవలవయి చూచినాది, కన్ను గిలిపి చూపుచు నవ్వినాది
వీటి క్రీడ బరికింపు మన్నాది, తగిన యనురాగమని పొగడినాది
మదనరూప నీమహిమ యన్నాది, మెల్లెపూదండతో గట్టినాది
శయ్యపయికి దోడ్కొని పోయినాది, అతని గూర్చుండబెట్టుకొన్నాది

తాను సరస గూర్చుండి యున్నాది, ప్రౌఢశాలివని యుంటినన్నాది
గుట్టు వెడలించివేస్తి వన్నాది, జాణవౌదువని శ్లాఘించినాది
మనసు బుచ్చుకొని పోతివన్నాది, దాని నిచ్చిపోవలయు నన్నాది
ఇటుగాక పోనివ్వనన్నాది, కీల్జడ నతని పయి జుట్టినాది
మోహపాశమున గడితి నన్నాది, ఇంక నేరీతి వెళుదువన్నాధి
తళుకు చెక్కుటిళ్ళు ముద్దాడినాది, కఠినమిక నుంచకని వేడినాది
నీదు సరసతకు లోపమన్నాది, లోచనముల కానందమైనదన్నాది
తనమనస్సంగమాయె నన్నాది, ఇపుడు లజ్జ పరిహారమైనాది
ఇతర దశల నొందించ కన్నాది' . . . . . . . . . . . . . . . . .
'నేను జెప్పినది మది నుంచవోయి, వేదశాస్త్రోక్తమని యెంచవోయి
పరమతత్వ మానందమయమోయి, అదియు సర్వగతమై యుండునోయి
ప్రకృతిచే నదియు దొరకును గదోయి, ప్రకృతి యనగాను స్త్రీయంత్రమోయి
స్త్రీల బొందుటానందకరమోయి, అందులో జారరతి సౌఖ్యమోయి
వనిత వలచి వచ్చిన వానికోయి, నిరతిశయసౌఖ్యము గల్గును గదోయి
ఇందు కితిహాసములు జరిగెనోయి, సృష్టి స్త్రీపురుషులకు సంగమోయి
ఆదిపురుషుడా ప్రకృతిసిద్ధుడోయి. బ్రహ్మమొదలుగా బరికించవోయి
నలువ చెలిని మోమున నిల్పెనోయి, హరియు సఖిని రొమ్మున గట్టెనోయి
గోపికల కోర్కె లీడేర్చెనోయి, కుబ్జ కోరి వచ్చిన గూడెనోయి
సతికి తనువిచ్చె సర్వజ్ఞుడోయి, దారువనకాంతలకు తారెనోయి
గౌతమునిభార్య కింద్రుడోయి, తాను పడరాని పాట్లు పడెనోయి
నిష్ఠచేనున్న కౌశికుండోయి, వలచి యా మేనకను గలసెనోయి
పెద్దలెల్ల నిటులున్నవారోయి, వారు నడచినది మార్గము కదోయి' యని జారిణీ శృంగారమును కనబరచెను. ఇట్టి అనౌచిత్యప్రవృత్తమైన ఏకత్రైవానురాగరూప శృంగారాభాసమగు దుష్టశృంగారమువలని హాని ఈ కథయందే తేలిపోయినది. చిత్రాంగి తానొనర్చిన పాపఫల మనుభవించినది. కనుక నిట చిత్రింపబడినది హేయశృంగారమైనను నీతిబోధకమని గమనింపవలయును. ఒక వస్తువు నందలి హేయత నుగ్గడించి నీతిని గరపుటగూడ ఒక పద్ధతిగా మన పూర్వు లంగీకరించినారు. భర్తృహరి, సంకుసాల నృసింహకవిపంటివారి రచన లిందు కుదాహరణములు.

అద్భుతకథా ప్రకరణమున 'కమ్మవారి పణతి-పసల బాలరాజు' 'కాంభోజ రాజు' 'గాంధారి' 'ధర్మాంగద చరిత్ర—పాముపాట' మున్నగు కథలందున్న శృంగారము కూడ అనౌచితీదోషదూషితము కాదు కమ్మపణతి కథలో నాయికా నాయకు లేకకులమునకు చెందినవారు కారు. మనకు సంబంధము కుదురనేరదని

బాలరాజున్నను కమ్మపణతి

'నాతల బుట్టినే నాథు వరియింప, శ్రీకృష్ణు రుక్మిణి జేరదే మున్ను
కులము నడ్డుగజేసి కొఱత లెంచెదవు, కులమన్న నేమయ గుంపండ్రుకాదె
గుంపులో ఎదియైన గుంపు కదయ్యా, వెలమ కమ్మలరీతి కలదె పుట్టుకను
ప్రేమయుండిన చాలు పెండ్లికి బాల, మనసు పట్టని పెండ్లి మరియేల చాల'అనుట

సంస్కారదృష్టిని వెలార్చునే కాని దోషభూయిష్ఠముకాదు. అంత్యమున నిరువుర కుద్వాహమగుటచే వారి ప్రేమ ఆదర్శమైనదేయని మనవి. గాంధారి కథలో శృంగారము వాచ్యముగా నున్నను అనుపాదేయము మాత్రము కాదు. గాంధారీ బాలరాజుల కాంధ్రుల కత్యంతప్రీతిపాత్రమైన మేనరికపు వరుసలున్నవి. గాంధారీబాలరాజులకు జరిగిన సంవాదములు,గాంధారి బాలరాజును నర్మగర్భముగా నితరులకు తెలియకుండునట్లు సంబోధించిన గేయములు మనోహరములు. ఇరువురికి జరిగిన సంవాదము ఏలపాటగా నున్నది.

గాంధారి : చంద్రకావి తలపాగ, జగ్గుమీర చుట్టుకొని, నందు వీధిన వేగ రాంగనూ
ఓ బాలరాజ - చందమామ వనుకొంటిని

బాలరాజు: నీవున్న పట్నానికొస్తె, నీ భాగ్యము నేనేమెరుగ, ఇరుకట్ల పాలైపోతినే
ఓ శివగాంధారి - నీకు దేవుడెట్ల సాయమయ్యెనే

గాంధారి : చిక్కుదీసి కొప్పుబెట్టి, శ్రీగంధము చుక్కబెట్టి, చొక్కమైన మేడపైకేమీ
ఓ బాలరాజ - నిక్కినిక్కి నిన్నె చూతును

బాలరాజు: ఊరిముందర ఉల్లితోట, ఊరినడుమ మల్లెతోట, వచ్చిపోయే చదువుల
బడిలోన - ఓ గాంధారి - పాలు అన్నం విషము లాయెనే

గాంధారి : కూడెనాడు కూడిపోతాం, కుండలో జలము కూడిన విధము, మన కూడికలు
పాయిదెల్లానె - ఓ బాలరాజ - పాపకర్మపు మాట లాడేవు

బాలరాజు: తియ్యమామిడి వృక్షం కింద, ఇవ్వరాని బాసలిచ్చి, గద్దరించి
పొయ్యేనంటావా - ఓ శివగాంధారి - దేవుడెట్లా సాయమయ్యెనే

గాంధారి : గాజులు ఘల్లుమనకుండ, గంధము పేదెత్తకుండ, కోరితిరా నీ కౌగిటిని
ఓ బాలరాజ - కొడుకు తల్లి నౌతా ననుకొంటినీ' ఈ పాటలోని చివర

చరణము పెక్కు మోహశృంగారగేయములందు కానవచ్చినది. ఇదే సందర్భమున ఇతరులకు తెలియకుండునట్లు గాంధారి నర్మగర్భముగా బాలరాజును సంబోధించిన రెండు పాటలున్నవి. బాలరాజు ముసుగు కప్పుకొని కాకర పొదలో దాగియుండగా గాంధారి యిటు లాహ్వానించెను.

'కాకరాచెట్లోటి బూసి - నాతో - కలిసిపోదువు రావె బూసి - నా
వద్ద యెవ్వరు లేరె - బూసి వచ్చి -వాలలాడి పోవె బూసి-నీకు

బాస యిచ్చినానె బూసి - నీకు - బలిపీట గొట్టెనే బూసి - నీవు
రట్టుచేయక రావె బూసి నీవు - రద్దాడి చేయకే బూసి'' బాలరాజొక గోతిలో దిగి తలపై బండ నొకటి చాటు పెట్టుకొని దాగియుండగ నాహ్వానించిన పాట తుమ్మెద పదము.

'ఆదినాథుడరావె తుమ్మెదా - అల్లతడు - వూరికిబోయె తుమ్మెదా
వద్ద యెవ్వరు లేరు తుమ్మెదా - వచ్చి - వాలలాడిపోవె తుమ్మెదా
చెట్టువేసిపోయె తుమ్మెదా - వో - కావలెవ్వరు లేరు తుమ్మెదా
ఓ రాతికిందాయున్న తుమ్మెదా - నీ - నెత్తిబరువు దింపె తుమ్మెదా
నీకు బాసలిచ్చినాను తుమ్మెదా - నీకు - బలిపీట గొట్టాను తుమ్మెదా'-

శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావుగారు గాంధారికథ నత్యంతప్రాచీన మనుచున్నారు. కాకతి రుద్రాంబయే గాంధారియని వారి మతము. 'రుద్రాంబ 1260 నుండి 1295 వరకు పాలించినది రాజ్యానికి రాకపూర్వమే ఆమెకు వివాహ మైనది. జంగం కథను కవి రుద్రాంబ పరిపాలన అయిపోయిన పిమ్మట రచించినప్పటికి దీని రచన 1300 దాటద'ని[1] వారి యభిప్రాయము. రుద్రాంబయే గాంధారి యనుట సరిగాదు. కథ మాత్రము ప్రాచీనమని చెప్పవచ్చును. ఈ గేయములు ప్రక్షిప్తములు కానిచో పాల్కురికి పేర్కొన్న తుమ్మెదపదముల కివి పూర్వరూపములు కావలెను.

శైవవైష్ణవమతములకు సంబంధించిన గేయములం దనేకములు శృంగారకళాఖండములు. పసగాడ సన్యాసికవి వ్రాసిన గంగావివాహమున హరుడు దక్షిణనాయకపాత్రమును నిర్వహించెను. గంగాశివుల విరహము లీగేయమున చక్కగా చిత్రింప బడినవి. 'ఖర్మాణ రాయచరిత్రము'న శివుడు మిండ జంగమ వేషమున చేసిన శృంగారభాషలు, పట్టణమున వేశ్యవాటికలోని వేశ్యల వర్ణనము లవేలములు. 'కొమిరెల్లి మల్లన్నకథ'లో మల్లన్నకూడ దక్షిణనాయకుడే. భ్రమరాంబా, మ్యాదలదేవి, మల్లన్నల ప్రథమసమాగమవేళ నున్న శృంగార భాషణములు కొంత మితిమీరినవి. 'సురాభాండేశ్వర కథ' యందు పరకీయశృంగార మున్నది. వైష్ణవకథలందున్న శృంగారముగూర్చి వేరే చెప్పనక్కరలేదు. శ్రీకృష్ణస్వామి కెన్నిరంకు లంటగట్టినను ఆమహానుభావు దూరకుండునే గాని కాదు లేదనడు. జానపదులకేమి శిష్టులకేమి శృంగార

1 గృహలక్ష్మి, 15 ఏప్రిల్ 1955. పుట 851

రసమును పోషించుటకు కృష్ణపాత్రమొక చక్కని యాలంబనము. కవులు తమ తమ హృదయములందున్న భావము లన్నింటిని శ్రీకృష్ణునిపేర వెలార్చెదరు. వరదరాజు పెండ్లి, ఆండాళ్ చరిత్రము, వేంకటేశ్వర్ల పేటలలో చక్కని శృంగార మున్నది. 'చెంచీతకథ' పూర్తిగా శృంగారగేయము. ఏకాదశీ మాహాత్మ్యమున మోహినీరుక్మాంగదుల ప్రణయము వర్ణింపబడినది. వీనియందు పోషింపబడిన శృంగారభావము లన్నింటిని ఇంతకుపూర్వమే రెండవ ప్రకరణమున చేర్చి యున్నాను. భక్తిసారస్వతమందు మధురభక్తి పేరుతో శృంగారము పోషింపబడినది. దానిని పారమార్థికగేయముల ప్రకరణమున పేర్కొని యుంటిని. కనుక పూర్వోదాహృతగేయములందలి శృంగారరసచర్చ నింతటితో విరమించి ఇంతవరకు పరిశీలింపని శృంగారగేయములగూర్చి విచారింతము.

శృంగారపూరితములగు జానపదగేయములు లక్షోపలక్ష లున్నవి. కాని ముద్రింపబడినవి మాత్రము స్వల్పసంఖ్యలో నున్నవి. చెల్ మోహనరంగ, వెంకయ్య చంద్రమ్మపాట, నారాయణమ్మపాట, సిరిసింమువ్వ పదము, రంగం పదములు వంటి కొంచెము పెద్దపాట లచ్చైనవి. ఇట్టి శృంగారరసాత్మక గేయములే నండూరి వెంకటసుబ్బారావుగారు మరియు అడవి బాపిరాజువంటివారి రసావిష్టుల నొనర్చినట్లు శ్రీహరి ఆదిశేషువుగారు తమ గ్రంథమున పేర్కొనియున్నారు. మరియును శ్రీఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి 'మాలపల్లి'యందలి జ్యోతి అప్పదాసుల ప్రేమ ఇట్టి గేయములకు వ్యాఖ్యానమనిరి. వెండితెరకును, గ్రామఫోను రికార్డులకెక్కుట వీనిప్రచారమును ప్రాశస్త్యమును వెల్లడించును. ఈపాటలే శ్రీ ఉమాకాంత విద్యాశేఖరులవారి యాగ్రహమునకు పాత్రములయినవి.

'వెంకయ్య-చంద్రమ్మపాట' ఆంధ్రదేశపు నలుమూలల ప్రతిధ్వనించునట్టి గేయము. ఈ గేయమంతున్న ఒక్కొక్కచరణ మొక రసగుళిక. ఇది శృంగార కరుణముల కలపోత మొత్త మరువది ఖండముల గేయము. సంవాద రూపమున నున్నది. ఈపాట వెంకయ్య చంద్రమ్మ గాధ తెలిసిన జానపదు లల్లినదిగాక కేవలము వారిమాటలే యనునట్లున్నది. వెంకయ్య హరిజనుడు. చంద్రమ్మ కాపుపడుచు. సంఘమునకు భయపడిన వారి ప్రణయసామ్రాజ్యమునకు, తన గర్భమున గలుపుకొన్న గోదావరీతటమున నేగ్రామమున పట్టాభిషేకమయ్యెనో తెలియరాదు.

'చింతచెట్టెక్కేవు, చిగురాకు కోసేవు కొమ్మయిరిగితె ముండకొడుకో
రెంకయ్య, కూలిపోతవు ముండకొడుకో రెంకయ్య'
'రావిచెట్టెక్కేవు రాగాలు తీసేవు రాలిపోతవు లంజకొడుకో
రెంకయ్య, రాలిపోతవు గండుకొడుకో రెంకయ్య'
'ఈతకల్లుకొఅకు ఈతచెట్టెక్కేవు కల్లుత్రాగకు ముండకొడుకో
రెంకయ్య, ఒళ్ళు గుల్లౌతది ముండకొడుకో రెంకయ్య'
'కాలు బెణికిందాని కనబడకపొయ్యేవు కట్టుకడతా వేగరారో
రెంకయ్య, కట్టుకడతా వేగరారో రెంకయ్య' యని చంద్రమ్మ పిలుచుటలో ప్రియురాలికి ప్రియునిగూర్చిన జాలి,దయ,ప్రేమములు పామరభాషలో నచ్చొత్తి నట్లున్నవి. ఇవి 'ప్రేమ పశ్యతి భయాన్యపదేఽపి'1 యన్న భారవికవి యర్థ గౌరవమును వ్యాఖ్యానించుచున్నవి.

'శిరసు తొడమీదెట్టి చిరునవ్వు నవ్వితే సింతలన్నీ మాయమైనాయే చంద్రమ్మ
వంతలన్నీ మాయమైనాయే చంద్రమ్మ'
'పండువెన్నెల్లోన పక్కేసి పడుకుంటె, మల్లె సెజ్జగ మారిపోనాదె చంద్రమ్మ
పూలసెజ్జగ మారిపోనాదే చంద్రమ్మ'
ఒక్కకౌగిలిలోన ఏకమైపోతేను పైన సుక్కలు నవ్వినాయే చంద్రమ్మ
కింద సుక్కలు రాలినాయె చంద్రమ్మ' యను వెంకయ్య ప్రేమహృదయ మాధురికభావకవుల కెందరకో కవితారసము చూరలిచ్చినది.

మాలోణ్ణి పెళ్ళాడ్తె మరియాద పోతాది మాట్లాడ కూరకోవే చంద్రమ్మ
మాట్లాడ కూరకోవే చంద్రమ్మ
చాటుచాటున మనము సరసమాడుతుంటె ఏపోరు పొక్కుండదే చంద్రమ్మ
ఏపోరు పొక్కుండదే చంద్రమ్మ
మంచిమనసైతేను మాలోడిమాటేల కులమెన్నుకోలేదురో వెంకయ్య
గుణమునే చూశానురో వెంకయ్య
నిన్ను పెళ్ళాడితే నిలువనీయరు నన్ను కులము తక్కువని కొట్టవస్తుండారు
ఎందుకొచ్చిన బతుకే చంద్రమ్మ నేనింక బతుకలేనే చంద్రమ్మ
గుడికి వెళ్ళాబోతే గుండె బెదురుతాది హీనజాతిలోన ఎందుకు పుట్టానో
నువ్వొకతివే వెళ్ళవే చంద్రమ్మ, నువ్వొకతెవే వెళ్ళవే చంద్రమ్మ
అడనున్నా సామి ఈడనూ ఉన్నాడు, ఈడనున్నా సామినే చంద్రమ్మ
నేను కొలుసుకుందునే చంద్రమ్మ
ఇద్దరాము కలిసి ఏకముగ నుంటేను, ఏడులోకాలు మనకాడనే ఉంటాయి
ఎక్కడికి వెళ్ళవద్దే చంద్రమ్మ, ఇక్కడనే ఉండిపోదామే చంద్రమ్మ' యను

1 కిరాతార్జునీయము 9-70

భావములు సంఘమునుగూర్చియు దేవతలను గూర్చియు దళితజాతుల మనో భావములు వెల్లడి సేయుచున్నవి. అచ్చటచ్చట శ్రీ జాషువా కవి తొంగిచూచు చున్నట్లుండును.

'మన ప్రేమలత పెరిగి మనల నొకటిగజేయ మనకడ్డులౌతవా మత కట్టుదిట్టములు
మనమందు చింతలేలా చంద్రమ్మ మనకిట్టి చింతలేలా చంద్రమ్మ'
'వెండికొండలాగ పండు యెన్నెల్లోన మిలమిలా మెరసేటి
చెరువు కెరటాలలో కాళ్ళు కడిగికొందమా వెంకయ్య-కబురు లాడికొందమా చంద్రమ్మ'

వంటి కోమలభావము లనేక మీగేయమునందున్నవి.

'నిన్ను విడువాలేను నిన్ను కూడాలేను,
తిప్పలూ పడలేనురో రెంకయ్య తిట్లు కాయలేనురా వెంకయ్య
గోదావరికిపోయి గోవిందునకు మ్రొక్కి,
కడతేర పోతానురో రెంకయ్య కడసారి చూపిదేరో రెంకయ్య
నువ్వు నచ్చిపోతె నేను నిలువాలేను,
నేనుకూడా వస్తనే చంద్రమ్మ నీతోడనేమందునే చంద్రమ్మ
స్వర్గలోకములోన చల్లని చోటులో సరసములాడుదామే చంద్రమ్మ చందమామను

మాతమే చంద్రమ్మ' వంటి త్యాగపూరితమైన ప్రేమ అత్యంతదయనీయముగా నున్నది. గోదావరీనది కడుపులో గలసిపోయిన ఆప్రేమికుల ప్రణయగాథ నీటి గలగలలం దిప్పటికిని ప్రతిధ్వని లీనుచునే యున్నది. ఇంత పవిత్రమైన ప్రేమమును నీచశృంగార మనలేము. సంఘనియమములు మానవకల్పితములు. ఒకప్పటి వ్యవస్థ ఇంకొకప్పుడుండదు. కులముల కట్టుబాట్లిప్పటికి చాలమట్టుకు వదలిపోయినవి. కనుక నీవర్ణాంతరుల ప్రేమకలాపములు నేటి సమాజమున కాదర్శ ప్రాయము లనినను తప్పులేదు. పరిణయము నియమబద్ధము కానందున నసభ్య మనుట పొసగదు. మొదట ప్రణయము తరువాత తత్ఫలితముగా పరిణయమను సూత్రముపై నేటి సమాజము నడచుచున్నది. పూర్వకాలపు గాంధర్వాది వివాహ పద్ధతు లిట్టిశృంగారమునే చిత్రించుచుండ నాధునికమగు వెంకయ్య చంద్రమ్మ పాటను స్తనశల్యపరీక్ష సేయుట న్యాయముకాదు.

పండితపామరభేదము లేక సమస్తజనముల గాఢాదరాభిమానములు చూరగొన్న మరియొక శృంగారఖండము 'చల్ మోహనరంగ' పాట. వెంకయ్య చంద్రమ్మ పాట సంభాషణరూపమున నున్నది కాని యీపాట కేవలము ప్రియురాలి మనోభావములనే తెల్పునట్టిదిగా నున్నది. తెలుగు పొలిమేరలు దాటిపోయిన గేయములందిది యొకటి. శ్రీదేవేంద్రసత్యార్థిగారు తమ Meet my people

గ్రంథమున దీని ననువదించి ప్రకటించియున్నారు. వెంకయ్య చంద్రమ్మపాట కన్న నీ గేయమున మధురములు కోమలములునగు భావము లధికముగా నున్నవి కాని భాష, పదబంధములు మున్నగునవి కొంత కృతకత్వమును చెప్పక చెప్పుచున్నవి. ఎవరో గొప్ప భావుకుని చేతిలో కమ్మచ్చులో తీగె సాగినట్లు సాగిపోయినది. ఈ పాటలోని నాయికానాయకుల పేరులుగాని కులముగాని తెలియవు. ప్రియుడు(మోహన) రంగడై యుండును. దీనినికూడ విద్యాశేఖరులు నిందించిరి. ఈ గేయమందున్న కొన్ని మనోహరభావములు-

'కంటికీ కాటుక బెట్టీ, కడవా చంకాను బెట్టీ, కళ్ళనీళ్ళు కడవ నిండెను గదరా
చల్ మోహనరంగా - కళ్ళనీళ్ళు కడవ నిండెను గదరా
'గట్టు దాటి పుట్ట దాటి గహనాంతరసీమ దాటి, అన్ని దాటి అలసిపోతిమి గదరా
చల్ మోహనరంగా - అన్నిదాటి అలసిపోతిమి గదరా
'అమవాస రాత్రినాడు, అర్ధరాతిరివేళ, నీవే నాదివ్యతేజము గదరా
చల్ మోహనరంగా - నీవే నా దివ్యతేజము గదరా
'నెలవంక దొన్నెలోన, కలమోదనింబు పాలు, కలిపి నీనోట నిడుదును గదరా
చల్ మోహనరంగా - కలిపి నీనోట నిడుదును గదరా
'నేనొక్క పక్షినైతే, నారెక్కలందు నిన్ను, పూని లోకములు ద్రిప్పుదు గదరా
చల్ మోహనరంగా - పూని లోకములు ద్రిప్పుదు గదరా
'చిందు కన్నీటికాల్వ, బందరుపెన్నైన యయ్యె, అందాక మిన్నకుండుట తగురా
చల్ మోహనరంగా - అందాక మిన్నకుండుట తగురా
'నీమీద బెంగచేత, నిలువెల్ల చిక్కిపోవ, ఉంగరామొడ్డాణమయ్యెను గదరా
చల్ మోహనరంగా - ఉంగరామొడ్డాణమయ్యెను గదరా
'నిన్ను గూడి కనులు మూసి, నిజమో స్వప్నమోయంచు, ఘనసందేహమున మునుగుదు సఖుడా - చల్ మోహనరంగా-ఘనసందేహమున మునుగుదు గదరా
'మన మనసూ లొక్కటైతే, మాయపెండ్లి యేల మనకు, మంగళసూత్ర మేటికి ప్రియుడా - చల్ మోహనరంగా - మంగళసూత్రమేటికి ప్రియుడా
'ఇద్దరికీ ప్రేమలుంటే, ముదమైన నగలవేలా, మన ప్రేమే కోటినగలు గదరా
చల్ మోహనరంగా - మన ప్రేమే కోటినగలు గదరా
'భద్రాద్రి రామమూర్తి, ఇద్దరి కాయుష్యమిస్తే, జాతరాకు తర్లిపోదాం పదరా
చల్ మోహనరంగా - జాతరాకు తర్లిపోదాం పదరా
'కొబ్బరి పంచదారా, గుడిలో రామయ్యకిచ్చి, మంగళారతులా విత్తము పదరా
చల్ మోహనరంగా-మంగళారతులా విత్తము పదరా'. ఇట్టి ఉదాత్తప్రేమభావనలు, భగవద్భక్తిగల ప్రేయసీప్రియుల శృంగారము కేవలము దూష్యమనుట

మన్యాయము. వీరి నధమపాత్ర లనుటకూడ సమంజసము కాదు. ఉత్తమాధమత్వములు కులమునుబట్టి కాక గుణమునుబట్టి నిశ్చయింపవలెను.

ఈ పాటయందు పాఠభేదములు చాల కన్పట్టుచున్నవి. దీనినిబట్టి పండితు లెవ్వరో దీనిని సంస్కరించుటకును క్రొత్తచరణములు కూర్చుటకును యత్నించి యుండవచ్చునని తోచుచున్నది. 'నెలవంక దొన్నెలోన' వంటి చరణములందుకు సాక్ష్యములు. మరియును,

'రంభాస్తంభములపైన అంభోజవల్లులల్లి, రాజభోగాలు గూర్తును రారా
చల్ మోహనరంగా - రాజభోగాలు గూర్తును రారా
మందార పారిజాత సుందరిభూజసీమ, లందె విహరింపబోదము రారా
చల్ మోహనరంగా - అందు విహరింప బోదము రారా
నా శోకాలాపములకు నభము కన్నీరు గార్చె, నీ శీతహిమతుషారము గనరా
చల్ మోహనరంగా - ఈ శీతహిమతుషారము గనరా
అమృతస్రవంతిలోన అవగాహనంబుచేసి, అమృతస్వరూపివౌదువు లేరా
చల్ మోహనరంగా - అమృతస్వరూపివౌదు గదరా,

వీనిలో మొదటి రెండు చరణములందు పదముల పొందిక తప్ప కవిత్వము లేదు. తక్కిన రెండు చరణములందు కొంత భావమున్నను ప్రయుక్తములగు పదబంధములు శిష్టులు చేయివేసినటుల చెప్పక చెప్పుచున్నవి. బహుశః ఈ పాటలో నిట్టివి కొన్నియైనను ప్రక్షిప్తభాగములై యుండును.

శ్రీహరి ఆదిశేషువుగారు తమ గ్రంథమున నొక 'సిరిసిరిమువ్వా పదము'ను కదవియున్నారు. ఆపాట రంగూన్ పోయి ధనము సంపాదించి చెడిపోయిన యొక వ్యక్తి నిర్వేదరూపముగా నున్నట్లు వారు చిత్రించినారు. కొండపల్లి వీర వెంకయ్య ప్రచురించిన (1930) 'హాస్యపు పాట' లందున్న మరియొక 'సిరి సిరిమువ్వ పద' మచ్చముగా ప్రేమగీతము. ప్రియురాలికి 'సొమ్ములెన్నొ తెత్తానని' రంగూనుకు పోయిన ప్రియుడు విరహముచే తిండితిప్పలు మాని ఏపని చేయలేక ప్రియురాలిని రమ్మని వ్రాసిన యుత్తరమీ పాట.

పీ మీది బెమచేత సిరిసిరిమువ్వ - పనిమీద బెమ లేదు సిరిసిరిమువ్వ
తిండిమీద బెమ లేదు ,, పిచ్చెత్తి పోతుంది ,,
తుదకేమి యౌదునో ,, తెలియజాలక యుంటి ,,

ఎటులైనను ప్రియురాలిని తన చెంతకు రప్పించుకొననెంచి ప్రియుడు కొంతధన మామెకు పంపించిన విధము గమనింపుడు.

నేను కూలి నేత్తానని సిరిసిరిమువ్వ - అడ్వాన్సు పుచ్చుకోని సిరిసిరిమువ్వ
నీకు నేనంపియున్నాను ,, ఈ మాటు రాకుంటే ,,
మరి నన్ను జూడవో ,, నీరాక జూచుచు ,,
నే రేవులో నిలుచుందు , చిరాకు పడకుండ ,,
పరాకు పడకుండ ,, యేమేగ రమ్మిందు ,,
పలుమారు దీవించి ,, వ్రాయిస్తు నుత్తరము ,,
యింతేను విషయాలు ,, చెంతకు రమ్మింక ,,

ప్రియురాలు చెంతలేక నేపనియు చేయ మనసొప్పని ప్రియుడు ఆమె చెంత నున్నచో అధికోత్సాహముతో పనిచేయగలడట

నీ వొచ్చి నను జూసితేని సిరిసిరిమువ్వ-నీ ముద్దు నాకిచ్చితేని సిరిసిరిమువ్వ
దయతోడ జూసితేని ,, యెంతైన పని నేతు ,,
యెంతైన గడియింతు నేను ,, యేదైన గొనిపెడుదు నేను ,,
నీవేనాటి కొత్తావో ,, ఆమాట రాయించు నాకు ,,
నాయందు మనసుంచు ,, నన్నెంతొ దయ చూడు ,,

దీనిలో శ్రామికగేయములం దధికముగా నుండు 'లిబిడో' కాననగును. ఇది బ్రిటిషుపాలనము స్థాపింపబడిన తరువాత గేయము కనుక ఆధునికము.

పై పాటవలెనే '*గోంగూరపాట*' కు గూడ నొక పాఠాంతరమున్నది. దీనిలో రాక్షసశృంగారము అభివర్ణింపబడినను బలాత్కారమునకు దలపడిన తోటకాపరికి గోంగూరకు పోయిన పడుచు, తన్నులతో బుద్ధి చెప్పినటుల లేదు. ఇంటికి తిరిగివచ్చిన పడుచు 'నేనెందుకు వెళ్ళియుంటినే గోంగూరకి'యని పశ్చాత్తాపపడుచు, తోటకాపరి దుశ్చేష్టితములను దలచుకొన్నట్లున్నదీపాట. ఒక పడుచు గోంగూర తెచ్చుటకై 'అత్తగారు సూడకుండ, ఆడబొడుచు కానకుండ, కొత్త చీర గట్టుకొని, గుత్తమైన రైక దొడిగి, కొత్తపెళ్ళికూతురట్లు, ముత్తైబయి గంపబట్టి, తోడు నీడ లేకుండ, తోటలోని కెడితే' ఆమె 'మెత్తదనము సూచి, మీది మీది కొచ్చిన' తోటకాపరి 'ఏటసీటి గొట్టినాడు, ఏంటేంటో పాడినాడు, యెన్నెన్నో కూసినాడు, యిట్టె వెంత జేరినాడు, పైకిపైకి పచ్చినాడు, పండ్లు యిగిలించినాడు, నీకునాకు జోడన్నాడు, నిన్ను మెచ్చితన్నాడు, ఉన్నదెల్ల నిచ్చివైతు, ఊరకుండు మన్నాడు, మీద చెయ్యి వేసినాడు, మీద ముద్దులన్నాడు, పంతమెంతొ సేసినాడు, వింతలెన్నో చెప్పినాడు, సంతు గల్గు నన్నాడు, గట్టిగాను పట్టినాడు, కంగారుబెట్టినాడు, కడకేంటొ సెప్పినాడు, కైలాస మన్నాడు, పట్టిపట్టి లాగినాడు.' ఈ విధముగా 'ఏడిపించి విడిసినాడు', అట్టి తోట కావరిని 'పాపిష్టి నా కొడుకె, కొంటిముండ నా కొడుకె, భడవముండ నా కొడుకె,

గట్టిముండ నా కొడుకె, కన్నగాడి నా కొడుకె' యని తిట్టుచు గోంగూరకు బోయి వచ్చినపడుచు పశ్చాత్తాపపడుట ఈపాటయందున్న ముఖ్యాంశము.

'నారాయణమ్మ పాట'లో నాయకుడు నారాయణమ్మను రంగూనుకు లేచి పోవుదమని బులిపించుట కలదు. రంగూనులో

'మోటారుబండెక్కి, వాటమూగ దిరుగుదాము
నాటకాల కెల్దాము, బూటకాలివి గావు
నీ యిట్టమొచ్చినట్టు, నే యెప్పుడుంటాను
నీ కెంతో సుఖమిత్తు, నీకెన్నొవస్తువులు చేయించి యిస్తాను
నాయందు దయయుంచి సరసకొచ్చెయ్యింక
శుక్రవారంనాడు బయలెల్లు ఓడలో, పోదాం తయారుగుండు
నీవెప్డు సూడనట్టి, సొకులెన్నో చూపుతాను
అందమైన సీంలెన్నో. అందు నీకు కొనిపెడుదు' నని నాయకుడు,
'రంగమెల్లి పోదామే నారాయణమ్మ' యని ఆహ్వానించును.

శృంగారవ్యాపారమునకు పురుషులెంతో స్త్రీలుకూడ నంతియ. కంతు ప్రకోపము ఇంతులకేమి పౌరుషవంతులకేమి అందఱికి నొక్కంతియ. మను చరిత్రవంటి కొలది కావ్యములందు దక్క స్త్రీలే తమంతతాము మొదలు చొరవ చేసికొని పల్కరించు శిష్టసాహిత్యము కొలదిగనే లభించును. ఏకాంతమునందు నున్న జవరాండ్రి నెపంబిడి పల్కరించులాగెంతయో కలదు. కాని జానపద సాహిత్యమున నేకాంతమునందు నున్న విటకాంఁడ్ర నెపంబిడి పల్కరించు లాగంతియ కలదు. రెండును సమానముగా నున్నవి. కాని ముద్రణభాగ్యము నంపినవి మాత్ర మంతంతయే. ముద్రింపబడిన అట్టి పాటలందు బండిపాట యొకటి. దానిలో కొన్ని చరణములు.

ప. చిన్నవాడా నీ బండి నట – నిలుపవేమిరా
అ. ప. బండినిట నిలిపి నన్ను పలుకరింపరా
చ. పన్నె చిన్నెల రైక దొడిగి, యున్నసొమ్ము లెల్లబెట్టి
నిన్ను జూచు కోర్కె తోడ, నేను వచ్చుచుంటిరా ॥ చి ॥
చక్కనైన చుక్కరా, చిక్కిపోయె నీకురా
మక్కువతో నన్ను బిల్చి, మాటలాడరా ॥ చి ॥
కట్టుకున్న చీరతోడ, పెట్టుకొన్న నగలతోడ
యిల్లలేచి వచ్చినాను, యెంతో నిన్ను వల్చినాను ॥ చి ॥

మెరపుతీగె మించురా, మెరుగులాడి చిలుకరా
సరసమాడ బిలిచెరా, జాగులేల నిలుపరా ॥ చి ॥
వలచి వచ్చె చూడరా, మొక్క జేడి పెప్పురా
పలుకుపలుకున తేనె లొలుకు, పంచదార చిలుకరా ॥ చి ॥
ప్రియము జూపిపేమిరా, పిలుపు వినవదేమిరా
భయము విడిచి నన్ను నీదు, పజ్జ కీడ్చుకొనుమురా ॥ చి ॥

ఈపాటయందున్న జానపదనాయిక వరూధినికీడుగా నున్నది. శ్రీహరి ఆదిశేషువుగారు నృత్తగీతసహితమై, శృంగార రసప్రధానమై, నాయికానాయకుల సంభాషణారూపమై, తిల్లానాల కపళిరింశరూపములైన తిల్లాలె పాటలను గూర్చి దీర్ఘవిమర్శనము చేసియున్నారు. శ్రీనేదునూరి గంగాధరంగారి 'సెలయేరు' లో సుమారు 35 శృంగారగేయము లున్నవి. ఇవి మూడు విధములుగా నున్నవి. పురుషుల ప్రేమగీతములు, స్త్రీల ప్రేమగీతములు; మరియు నుభయుల సంవాద రూపముననున్న ప్రేమగీతములు. స్త్రీల ప్రేమగీతములందు '*గుత్తివంకాయ కూర*' '*నీయడుగులే నమ్మినారా*' '*పుట్టమీద పాలవిట్టు*' '*లింగా నిన్ను మరువలేను*' '*గౌనూరు పాళాన*' '*దూడమ్మ దూడ దూడ*' వంటి పాటలు ముఖ్యమైనవి.

బావకై వండిన గుత్తివంకాయ కూరలో వలపు కోరి నింపి, కరకరమను కమ్మని పూరీలందు కూడ వలపు నింపి, తియ్యని పాయసమును తీరుగా వండి, 'పాయసంబులో ప్రేమ అనేటి పాలు పోసినానోయి బావా' యని ఆరగింప బిలుచు మరదలి హృదయము ప్రేమశబలితము. ఇది బసవరాజు అప్పారావుగారి గేయము. బినను జానపదసాహిత్యమున చేరిపోయినది.

'చిన్నజాబిలి ముందు చేతిలో పెయ్యేసి, వొట్టేసి పెదదారి వొంపు కాళించి'యు, 'సీతమ్మ జడ దెచ్చి చెరివియు జడలోన, నీతోడే వో పిల్ల నిన్ను విడువ' నన్నట్టియు స్వామిని దలంచుకొని 'నీయడుగులే నమ్మినారా నాసామి నన్ను విడనాడి పొయ్యేవా' యని దుఃఖించు నాయికాప్రణయము మధురము.

'మంచినీల బాయికాడ నాసామి, మందు నూరే సిన్నవాడ నాసామి
మందులేల మాకులేల నాసామి, మాటలాడితె నేను రానా నాసామి'యను నాయిక ప్రౌఢ.

'ఉంటె ఈ వూరిలో ఉండు, పోతే మీవూరికి పోరా
చుట్టుముట్టు పల్లెల్లో ఉంటె, చూడక నాప్రాణ ముండద'ని ప్రియుడైన లింగని వేడుకొను ప్రియురాలించుమించుగా ఉన్మత్తనాయిక.

విటుని మరణవార్త విని కాబోలు ఇతరులు విన్న మానము పోవునని తెలియకుండునట్లుగా దూడను సంబోధించుచు దుఃఖించెడు నాయికపాట యొకటి.

'దూడంటే దుఃఖం వచ్చె, దూడమ్మ దూడదూడ
దూడమ్మ దూడ దూడో, దూడమ్మ కోడెదూడ ||దూ||
పదిరూపాయలు బెట్టి, పట్టెమంచము గొంటి
మంచమన్న మాయలేదె, దూడమ్మ కోడెదూడ ||దూ||
మొలకు మొలత్రాడున్నది, త్రాడుకు బిళ్ళలున్నాయి
బిళ్ళ అయిన మాయలేదె, దూడమ్మ కోడెదూడ ||దూ||
చెంగావి పంచెల దూడ, చెవుల పోగుల దూడ
చేతిరూమాలు దూడ, దూడమ్మ కోడెదూడ ||దూ||
అర్ధరూపాయి బెట్టి, అద్దాల రవికె గొంటి
అర్ధమైన మాయలేదే, దూడమ్మ కోడెదూడ ||దూ||

ఈ పద్ధతికి ముగ్ధులై కాబోలు శ్రీ దేవేంద్ర సత్యార్థిగారు దీనిని వ్రాసికొని భాషాంతరీకరించిరి. ఇట్టి పాటలు తెలుగులో చాల గలవు. 'పిల్లనెవ్వరు గొట్టే' రన్న పాట ఇట్టిదే.

'చందమామయ్యో మామ చందమామయ్యో
రాతిరి రాతిరి వస్తావని చందమామయ్యో
రాతిగంధం తీసి ఉంచితి చందమామయ్యో' యను పాట శ్రీరాయప్రోలు సుబ్బారావుగారి 'హేమపాత్రల చందన మెండిపోయె, సానలందింకె స్నానకషాయగంధ'1మను పద్యచరణముల దలపించుచున్నది.

'నిమ్మచెట్టుకు పిచ్చెనేసి, నిమ్మపండు కోయబోతే
నిమ్మముల్లు రొమ్ము నాటెరా, ఓరందకాడ బంగారుమామ-చంద్రగిరి చీరెలంపారా
నీకు నాకు దూరమాయె, పిలికొండ లడ్డమాయె
రాజమండ్రి రైకలంపారా, ఓరందకాడ బంగారుమామ-చంద్రగిరి చీరలంపారా'

అను విరహిణీగీతమును కూడ దేవేంద్ర సత్యార్థిగా రనువదించి ప్రకటించిరి2. శ్రీ కె. సభాగారు సేకరించిన 'గువ్వి' గేయమొకటి మనోహరప్రేమగీతము.

'గుండ్లపల్లి గుటివిరా దాని-చేతిలో కీల్ కడెమురా
కీలుకడెమూ పెడాగొట్టి-కిన్నెరా నేయించెరా
కోడి నిస్తామానెరా-కోడిపెట్ట నిస్తామానెరా
కోడినమ్మిన కాలురూపాయ్-కోరి యిస్తామానెరా

1. జడకుచ్చులు, విరహవీధి.

2. Meet my people. page 187. Modern Review 1942 May.

వారవారము దినమురా రామ-సవురెపల్లె సంతరా
సవురెపల్లె సన్నమల్లెలు-కుచ్చు ల్నాల్నరదుడ్డురా
ఊరి పడమట బాటరా-నేబాట కూలికి పోతిరా
అందరాకు మూడుదుడ్లు-నాకు నాల్నరదుడ్డురా'

గుండ్లపల్లి గురివి తన హృదయము చూరలుగొన్న పాటగానికి తన కీలుకడెము చెడగొట్టి అమ్మి కిన్నెర చేయించి యిచ్చినది. ఆ పాటగాని రాగపు బరువు ఆమె హృదయ మెంతగా మోసినదో! ఆమె తన కోడినమ్మిన కాలు రూపాయిని కూడ ప్రియున కర్పించుకొన్నది. చివరకు కూలికి పిలిపించుకొని అందరికి మూడు దుడ్లనిచ్చి ప్రియునికి మాత్రము 'నాల్నర' దుడ్ల నిచ్చినది.

శ్రీ కె. సభాగారే ఆరెగొండ గ్రామమున (చిత్తూరు జిల్లా) సేకరించిన మరియొక గీతముత్కృష్టమగు శృంగారవాతావరణమును చూరలిచ్చుచున్నది. ఈపాటలో ప్రేమికుల స్నేహము, మరియు కలసిమెలసి తిరుగుటయందలి ఆనందము సూచింపబడినది. ప్రబంధములందుండు సంభోగ శృంగారము మరియు నాయికానాయకులు విరహభారమున వెలార్చు భావములకన్న ఎన్నియో రెట్లు మనోహరముగా నున్నది.

'ఉల్లిపూల పడవగట్టి-మల్లెరేకుల తెరను దించీ
నాగులేటి వాగులోన మామ-తేలిపోదామా
మొగిలిపూల తేరుగట్టి-మొగిలిరేకుల గొడుగు పట్టి
మొలుగు మేసే కొండామీద మామ-ముద్దుగానె ఎక్కుదామా.'

గీతమందున్న భావమమోఘము, 'మొగులు మేసే కొండమీద' అనుమాట కాళిదాసువంటి గొప్పభావుకుని నోట వెలువడదగినది. శ్రీ గంగాధరంగారి సేకరణములనుండి యొక మనోహరమైన గేయ ముదాహరింతును. విరహిణీ గీతములందీ గేయము పరాంకోటి నందుకొన్నది. ఈ గేయమును మండపేట గ్రామమున పువ్వుల సుబ్బలక్ష్మియను వృద్ధవేశ్య వినిపించినదట - (1937) దీనిని వారు 5-11-41 'ప్రజ'లో ప్రకటించిరట.

వాడు వలచీనాడమ్మా నన్ను వలచీనాడమ్మా చందమామోయ్
వాడు వలచీన తెల్లారి పిలిచీన పలుకాడు ,,
వాడు పిక్కల్ల సన్నంపు- బిగువైన మగవాడు ,,
వాడి భుజాన ఉన్నది భూచక్ర కంబళి ,,
అది పదిగళ్ళు భూమిపై పరచీన చాలమ్మా ,,

వాడి మునిపళ్ళ సందున ముత్యాలు తాపిస్తు చందమామోయ్
వాడి పక్కాన ఉన్నాది పచ్చాల పిడిబాకు ,,
అది ఎదలోన ఒకసారి నాటిన చాలమ్మ ,,
వాడు వలచ్చీనదాకాను వలపోసి తిరిగాడు ,,
వాడు వలచ్చిన తెల్లారి పిలచ్చీన పలుకాడు ,,
వాడు కలలోన నవ్వాడు కన్నెత్తి చూడడు ,,
వాడి కావిపంచెలమీద కస్తూరి తాపిస్తు ,,
వాడి బంగారు చెక్కిళ్ళ రత్నాలు మెరిపిస్తు ,,
వాడి ముద్దయిన మోముపై ముత్యాలు విరబోతు ,,
వాడు చూచిన చాలమ్మ స్వర్గమే దరిదాపు ,,
వాడు పలికినా చాలమ్మ ప్రాణాలు వికసించు ,,
వాడు నవ్వుతూ మాటాడి కవ్వించి పోయాడు ,,
వాని నవ్వులోనే మనసు నను విడిచిపోయింది ,,
వాని బంగారు మొలత్రాడు పైపైన మెరసింది ,,
వాడు ఉంగరాల జుట్టు రంగైన మగవాడు ,,
వాడు కోపాన ఒకసారి కసరి తిట్టిన చాలు ,,
వాడు ముసిముసి నవ్వుతో మురిపించిపోయాడు ,,
ఆ మగవాని కౌగిట మరణించినా చాలు ,,

ఈ గేయమునకును జానపదగేయోద్ధారకుడగు బోయల్ దొర సేకరించిన 'ఏటికెంపలి తీగడ్డమయ్యో' నను పాటకును చాల పోలికలున్నవి. బాకు తన హృదయమున జొచ్చుకొనిపోయినను, ప్రియుడు కోపాన కసరితిట్టినను ప్రియుని కౌగిటిలో మరణించినను చాలుననుకొనెడు విరహిణీభావము లమోఘములు శ్రీ పెనుమర్తి వెంకటరత్నంగారి 'వలచీనాడమ్మా'యను నీక్రిందిగేయమునకును పైన పేర్కొన్న జానపద గేయమునకు గల పోలికలు గమనింపుడు.

వలచీనాడమ్మా - మనసు - కలచీనాడమ్మా
దారంట మగలేవి తారసిల్లును, వాని - కాలిధూళిగ మారి, రాలిపోయిన చాలు ||వ||
గుండెలోతులు దొలిచే, గోరువెచ్చని వాని-వాలుకన్నులలోన, కాలిపోయిన చాలు ||వ||
మాటలోపల యేదో, మంత్రమున్నదె వాని-కౌగిట్లో కడసారి, కన్నుమూసిన చాలు ||వ||
వాట పాడితె చాలు, తోట పులకించేను-వింటూనె ప్రాణాలు, విడిచినా చాలమ్మ[1] ||వ||

ఇంతకన్న నందమగు గేయమింకొకటి.

'వేళ జూడ వెన్నెలాయె - వెండికట్ల కిన్నెరాయె
మల్లెపూల పందిరాయె - వయ్యారి రావె - నవ్వులోనె తెల్లవారును

1. భారతి, డిసెంబరు. 1951 పుట 1151

కొండ గోగులు పూసెనేమొ - కొండనిమ్మలు కాసెనేమొ
దొండపండులాంటి పెదిమ - వయ్యారి రావె - మనసు ఎవరి పాలుజేతును
మల్లెపూవులు పూసినట్లు - మళ్ళిమళ్ళి మాటలాడు
మల్లెపూలవంటి మనసు - వయ్యారి రావె - పూలనెవరి పాలుజేతును
నంది పూసె కంది గాసె - కంది కొసలు నంది మేసె
అందమైన మేలినడల - వయ్యారి రావె - గంధమైన పంపబోతిని'

ప్రబంధములందు విరహవేదన ననుభవించు నాయకుడు ప్రియురాలిని తలచుకొని అంగాంగ వర్ణనలు చేయుచు చెట్టును పుట్టను చూచి ప్రియురాలి శరీరావయవముల జ్ఞప్తికి దెచ్చుకొని పలవరించుటకన్న నీ జానపదనాయకుడు తన ప్రియురాలిని స్మరించి యాహ్వానించు గేయము మనోహరముగా నున్నది. నవ్వులో తెల్లవార బుచ్చుట ప్రియుడు కాంక్షించిన యమలినశృంగారము. ప్రియురాలికొరకు కాతడు దాచియుంచిన మల్లెలు, గంధము, మనసులు అతని ఏకత్రైవానురాగమును హృదయపావిత్ర్యమును సూచించుచున్నవి. ఇటులే జానపదుల శృంగార గేయము లెన్నియైన నుదాహరింపవచ్చును. శృంగారగీతములు మనకేకాదు భారతదేశమం దన్ని భాషలవారికిని అసంఖ్యాకములుగా నున్నవి. ప్రేమ, శృంగారము, విరహము మున్నగువానితో నొప్పారు గేయములను ఔత్తరాహులు 'బారమాసీ'1 యనియు 'చైతావర్' 2 అనియు 'ఝుమైలో' 3 యనియు నందురు. గుజరాతీభాషలో నొక ప్రోషితభర్తృక పాడుకొన్న జానపదగీత మొకటి పరమోత్కృష్టముగను అత్యుదాత్తముగను నున్నది.

'కాగ్ చున్‌చున్ ఖాయియో బడీహడీకా మాంస్
ఏక్ న ఖాయియో మేరీ అంఖియా మేరే పియామిలన్‌కీ ఆస్' 4

ప్రియుని రాకకై ఎదురుచూచి, చిక్కి శల్యావశిష్టయై చావసిద్ధముగానున్న ప్రియురాలు, నిస్సహాయముగా పడియుండ, నొక కాకి యామె మాంసమును పొడిచి తినుచుండగా నామె కాకితో నన్న మాటలివి. 'ఓ కాకి! నా యెముకల పైనున్న మాంసమంతయు నొలచి తినుము. కాని ఒక్క కన్నులు మాత్రము తినకుము. ప్రియుడు వచ్చుననెడు ఆశ యింకను కలదు'—ప్రియునికై నిరీక్షించు

1. 'గుజరాతీ వాఙ్మయ చరిత్రము' కీ.శే. శ్రీచిలుకూరి నారాయణరావు.
'ధర్తీ గాతీహై' దేవేంద్ర సత్యార్థి.
2. 'మైథిలీ కే లోకగీత్' (मैथिली के लोक गीत) శ్రీరాకేశ్
3. 'ధర్తీ గాతీహై'
4. 'లోకసాహిత్య.' శ్రీజవేర్‌చంద్ మేఘాణి (लोक साहित्य)

కన్నులు (ప్రియుని జూచుటకు) దక్క తక్కిన మాంసమంతయు కాకిని తినుమనుట ఎంత యుదాత్తభావము! శిష్టసాహిత్యమునను ఇట్టి భావము లరుదు.

ఇంతవరకు పరిశీలించిన శృంగారగీతములన్నియు ముద్రితసాహిత్య భాగమునకు చెందినవి. ఇక నముద్రితగేయములు నేను సేకరించినవాని కొన్నింటిని పేర్కొని ఈ ప్రకరణమును ముగింతును.

శృంగారప్రధానమగు గేయములందు సాధారణముగా విప్రలంభ శృంగార మధికముగ నుండును. అయోగవిప్రలంభముకన్న వియోగవిప్రలంభమున విచార మధికము. ఒక్కనాడే కాపురమొనర్చి మరణించిన భర్తను తలంచుకొని దుఃఖించెడు స్త్రీ వలపోత రూపముననున్న దొకపాట. ఇద్దరి ప్రేమ జీవితము పెండ్లితో ముడివడి తొందరగనే విడిపోయినది. ఈ పాట 1952 సంవత్సరమున (రేగొండ గ్రామమున-పర్కాల తాలూకా) సేకరించినది.

వచ్చి పొయే తోవలోన చందమామ వోలె చందమామ
నీవు ఆశ మొదలు పెట్టుకుంటివి ,,
ఇద్దరాము కూడితిమి ,,
వద్దిమాను కొరిగితిమి ,,
ఇద్దరిదీ కంటినీరు వద్దిమానుకుంట నిండె ,,
వద్దిమానుకుంటలోనె ఇద్దుమిరుస వడ్లు పండె ,,
ఇద్దుమిరుస వడ్లబియ్యం ,,
ఎద్దుమీద పోసుకోని ,,
కానరాని గట్లమీద '' ,,
మన ఇద్దరికి తలంబ్రాలు ,,
బాయిలోన బల్లి పలికె ,,
బన్నసరము కొలుకులూడె ,,

ప్రియాప్రియులు ఒండొరుల ప్రేమించుకొని 'ఒద్దిమాను కొరిగి' తమ కన్నీరుచే ఒద్దిమాను కుంటనిండ నానీటిచే యిద్దుమిరుస వడ్లు పండించి ఆ బియ్యముతో నెటకో కానరాని చోటులకు పోయి వివాహము చేసికొనిరి. అప్పుడే అపశకునముగా 'బాయిలోని బల్లి పలికి'నది. ఆ యపశకునము దృష్టాంతమై తత్ఫలితముగా 'బన్నసరము కొలుకు' లూడినవి. ఇది శృంగారగేయమైనను కరుణాత్మకమగు విషాదము దీనిలో జాలిజాలిగా జాలువారినది. 'చల్ మోహన రంగ' పాటలో కంటినీరు కడవ నిండినది కాని దీనిలో ఒద్దిమ్రానునకు ఒరిగి దుఃఖింపగా వీరి కన్నీరు ఒద్దిమానుకుంట నిండినది. ఇద్దుమిరుస వడ్లు పండినవి. వైధవ్యము

ప్రాప్తించినదనుటకు 'బన్నసరిము కొలుకు లూడె' నని అలంకారికముగా చెప్పబడినది. బన్నసరిములు మాంగల్యవతులు ధరించెడు భూషణము. కొలికి యనగా ముడి. బన్నసరిముల ముడి యూడిపోవుట, ఆ భూషణము తెగిపోవుట భూపతితమగుట వైధవ్యమును సూచించును.

ఒకధూర్తు డొకపిల్లను 'మూడురూపాయ లిత్తా-ముత్యాలపోగు లిత్తా నువు రావె పిల్లా గుంజాల గట్టుమీదికి' అని బులిపించును. కాని యా సుశీల 'మూడు రూపాయ లద్దు, ముత్యాలపోగు లద్దు, నేను రానోయి రాజా, దేవుడున్న గుట్టమీది' కని సమాధాన మిచ్చును. వాడు మరల పది రూపాయలు పట్టంచు చీరెల నిచ్చెదనని యాశగొల్పెను. కాని సమాధాన మెప్పటిదే లభించెను. ఈ గేయము శృంగారప్రధాన మైనదైనను దీనియందు దైవభీతి, సౌశీల్యము మున్నగు సుగుణములు కాననగును. ఈ పాట ఆవునూరులో (1954 సెప్టెంబర్ మాసమున) సేకరించితిని.

'నా మొగడూ ఊర లేడు - నాకు తోడెవ్వారు లేరూ
కోడికూత జాముదాకా-తోడు రారా వన్నెకాడా' యను గేయఖండ మొకటి హైద్రాబాదు నగరమున నొక రిక్షా లాగెడువాని నోట వింటిని. వెంటనే 'రే పాంథ పుస్తకధర క్షణమత్ర తిష్ఠ' యను శ్లోకము జ్ఞప్తికి వచ్చినది శ్లోకమంత ధ్వని ఈగేయమున లేకున్నను పోలికమాత్రము కలదు జానపదులు కనుక కొంచెము వాచ్యముగా ననిరి.

కోలాటములందును స్త్రీలపాటలందును సతీపతుల సంవాదరూపమున నున్న శృంగారగేయము లెన్నియో కలవు. 'వెంకటేశ్వర్ల వేట', 'చెంచులక్ష్మి పాట' 'సత్యభామాకృష్ణుల సంవాదము', 'పార్వతీశివుల సంవాదము', వంటి పాట లందుకుదాహరణములు. ఇట్టి సంవాదముల నిదివరకే శైవవైష్ణవ మత సంబంధగేయములందు చేర్చి చర్చించియుంటిని. ఈ గేయములందు సాధారణముగా నాయకుడు శఠుడు. శృంగారపు చిన్నెలతో నింటికి తిరిగివచ్చిన భర్తను భార్య ఈ చిన్నెలేమిటి? ఈ వన్నెలేమిటి యని ప్రశ్నించును నాయకుడేవో కుంటి సమాధానములు తొలుత చెప్పినను చివరకు మాత్రము తన తప్పిదము నొప్పుకొనునట్టి గేయములం దుండును. ఇట్టిపాటలకు విరుద్ధముగా నున్న పాటలు కొన్ని సేకరించితిని. విరుద్ధమన నాయకుని స్థాన మీపాటలందు నాయిక కుండును. నాయికపాత్రను నాయకుడు వహించును. జారిణియగు

భార్యకుగల శృంగార చిహ్నములు చూచి భర్త యవి యేమిటని యడుగ నాధూర్తురా లొక్కొక్క ప్రశ్నమున కొకవుగా సమాధానముల నిచ్చెను. ఈ సమాధానములందున్న ఝటితిస్ఫూర్తి మెచ్చనగును. సమాధానములం దొకటి పొసగినది. మఱియొకటి కొంత చిత్రముగా నున్నది. వేరొకటి పూర్తిగా పొసగని సమాధానము. తాటిచెట్టేల యెక్కితివన దూడకు గడ్డికోయుటకన్నట్లొక సమాధానము విపరీతముగా నున్నది. ఇదియొక కోలాటముపాట1.

భర్త : గట్టూకు బోయి నేను - కట్టెలు తెమ్మంటె
కొప్పునున్నా పూలు ఎక్కడివె భామ ? నీ
కొప్పునున్నా పూలు ఎక్కడివె భామ ?
ఆత్తేరి పూలు ఎక్కడివె భామ-ధూత్తేరి పూలు ఎక్కడివె భామ ?

భార్య : గాలిధూలి వచ్చి - గంపంత మబ్బొచ్చి
కొమ్మ ఊగి కొప్పు నిండింది మగడా
నాతోడు రంకాడలేదు - నీతోడు రంకాడలేదు
అబ్బతోడు రంకాడలేదు - అమ్మతోడు రంకాడలేదు

భర్త : అన్నీ సరేకాని ఇన్నీ సరేకాని
కొంగునిండా దుబ్బ ఎక్కడిదె భామ ? నీ
కొంగునిండా దుబ్బ ఎక్కడిదె భామ ?
ఆత్తేరి దుమ్ము ఎక్కడిదె భామ - ధూత్తేరి దుబ్బ ఎక్కడిదె భామ ?

భార్య : పాపేలు ఇంటికి పాలకని పోతేను
కత్తికోడె కాలు దువ్వింది మొగడా
నాతోడు రంకాడలేదు నీతోడు రంకాడలేదు
అబ్బతోడు రంకాడలేదు అమ్మతోడు రంకాడలేదు

భర్త : అన్నీ సరేకాని ఇన్నీ సరేకాని
చెంపనున్న కాట్లు ఎక్కడివె భామ ? నీ
చెంపనున్న కాట్లు ఎక్కడివె భామ ?
ఆత్తేరి కాట్లు ఎక్కడివె భామ - ధూత్తేరి కాట్లు ఎక్కడివె భామ ?

భార్య : కోమటోరింటికి కొబ్బరికి బోతేను
తక్కెట్ల గుండొచ్చి తగిలింది మగడా
నాతోడు రంకాడలేదు నీతోడు రంకాడలేదు
అబ్బతోడు రంకాడలేదు అమ్మతోడు రంకాడలేదు

1. దీనిని శ్రీవట్టికోట ఆళ్వారుస్వామి గారి ద్వారమున సేకరించితిని. దీనిని 1948 సంవత్సరమున పాతసూర్యాపేట వా స్తవ్యులు (శ్రీ)నారాయణరెడ్డిగారు వారికి వినిపించిరట.

భర్త : అన్నీ సరేకాని ఇన్నీ సరేకాని
మంచం కింద వాడెవ్వాడె భామ ? నీ
మంచం కింద వాడెవ్వాడె భామ
ఆత్తేరి వాడెవ్వాడె భామ - ధూత్తేరి వాడెవ్వాడె భామ ?

భార్య : ప్రక్క ఇంట్లుండేటి పడుసు పిల్లోడు
పిల్లికి తలనొప్పై నల్లికొచ్చిండు
నాతోడు రంకాడలేదు నీతోడు రంకాడలేదు
అబ్బతోడు రంకాడలేదు అమ్మతోడు రంకాడలేదు

ఈ పాటలో మొదటి సమాధానము సరసముగా మఱియు భావనాప్రధానముగా నున్నది. రెండవ దానిలో చమత్కారము కలదు. ఇది ఉక్తివైచిత్రి. గ్రహింపగలవానికి సత్య మిందు గోచరింపకమానదు. 'కట్టెకోడె కాలు దువ్వింది మగడా' యనుట నర్మగర్భముగా నున్నది. మూడవ సమాధాన మేమాత్రమును పొసగదు. 'తక్కెట్లగుండొచ్చి తగిలి'నచో చెంపకు కొట్లుపడునా ? చివర సమాధానముగూర్చి వేరే చెప్పనక్కరలేదు. ఇది పూర్తిగా నసందర్భముగా నున్నది. ఐనను అదికూడ ఒక సమాధానమే యగును. నల్లిని చంపి దాని వాసన చూచినచో తలనొప్పి తక్షణమే తగ్గిపోవును. ఇది మనుజులకు మాత్రమే. పిల్లులకు ఇతర పశువులకు పనిచేయునో లేదో? పిల్లకు అని చెప్పబోయి పిల్లికనియెనా? కాని 'పడుసు పిల్లోడు' శబ్దమున కేమి సార్థక్యము? పడుచువానికి పిల్లలుందురా ? ఉన్నను నల్లికై వాడీమె యింటికి రావలయునా ? తన యింట లేవా ? ఏమో ఎవడెరుగును? ఈ జారిణియింట నల్లు లధికము కాబోలు. ఎంత వింతైన యర్థములున్నవీ పాటయందు ! ఇది కులటాశృంగారము.

కృష్ణుని పేరుతో శిష్టులును జానపదులును శృంగారసాహిత్యము సమృద్ధిగా సృష్టించిరి. ఇదియంతయు జావళీల శృంగారము. ఒక జానపద కృష్ణుడు,

'వదతి నువ్వు నీళ్ళాడి పదిదినము లాయె - అలివేణి పానుపున ఒంటిగుండగలేను
కలికి కన్నుల జూడవే ఆదిలక్ష్మి-అంది ముచ్చటలాడవే'యని బతిమాలగా నామె
'బాలింతరాలనయ్యా ముద్దులకృష్ణ బాలింతరాలనయ్యా
ఒళ్లెల్ల పసుపోయి నూనంటు చీరోయి-కల్లగాదు యింక కాయంపు వాసనలు
ఇక్కడ మీరుండ ఇంపుగా దయ్యయ్యో-ఉల్లి పూసలదండ ఊబిది[1] బొట్టోయి
కట్టిన తలకొంగు కడకు దియ్యనెరాదు-పుక్కిట విడియము పక్కాల బాలుడు
అత్త గడుసుమారి ఆడబిడ్డ కావలున్నది' యని సమాధాన మిచ్చుచున్నది.

1. విభూతి.

'ఎంతోచక్కని చిన్నదీ కృష్ణయ్య నిన్నింటికె రమ్మన్నది'
'నాటుక బెట్టింది కన్నిట్ల గిలిపింది'
'ఒక్కవారం బోయి నే వెచ్చుకున్నాడ'
'రాధా వయ్యారి రాధా'యను పాటలిట్టివే.

తెలంగాణమున కాముని పున్నమ సందర్భమున వెన్నెల రాత్రులందు గ్రామ లక్ష్మి శృంగారిపారవశ్యమున నుప్పొంగిపోవును పిన్నలు పెద్దలు స్త్రీపురుష భేదము లేకుండ వెన్నెల రాత్రులందు ఆటపాటల నిమగ్ను లగుదురు. పిండారబోసినటులుండు వెన్నెల బయలులందు జనులు వెన్నెల పురుగులట్లు గుంపులు గుంపులుగా తిరుగుచు హోళీ పాటలు, కాముని పాటలు, అల్లోనేరళ్ళు, కోలాటము పాటలు, జాజర పాటలు పాడుచు విచ్చలవిడిగా తిరుగుచుందురు. కామదహనపు పండుగ యావద్భారతమున కలదు కాని ఔత్తరాహులకును దాక్షిణాత్యులకును కొంత భేదము కలదు ఔత్తరాహు లీపండుగను 'హోళి' 'హోళికోత్సవ' మందురు. ఇది వారి కతిముఖ్యమైన పండుగ. రాజపుత్రస్థానము, మార్వాడ్, గుజరాత్‌వంటి ప్రదేశములందిది యుద్ధృతముగా జరుగును ఔత్తరాహులకీ పండుగలో ప్రధానమగు వేడుక వసంతములు చల్లుకొనుట. తీరుతీరుల రంగులు కలిపి ఒకరిపై నొకరు చల్లుకొందురు. వరుసలు కలసిన వారు నడుగనక్కరలేదు. వరుసలు లేకున్నను అన్నదమ్ములు అక్కసెల్లెండ్రు కూడ రంగులు పోసికొందురు. హోళీ పండుగ రెండు దినములు వావివరుసలు మూలమూలల కొదిగి దాగుండును. చివరినాడు 'ధులండీ' పండుగ. ఆనాడీ సరసము రంగులనుండి ధూళివరకు పోవును. పెండ, మన్ను, బురద, ధూళి, తారువంటి పదార్థములుకూడ వాడెదరు. ఔత్తరాహులకు సమీపమున నుండుటచే తెలంగాణమునకూడ నీ రంగులు చల్లుకొను నాచారము దినదినము ప్రబలు చున్నది. తెలంగాణమున 'పాటక జనులు' కాముని పాటలు పాడుచు వీధివీధులు తిరిగెదరు. కాముని పాటలందు వస్తు వెద్దియైన నుండవచ్చును. కాని సాధారణముగా నవి శృంగారాత్మకములుగా నుండును. 'హోళీపాట' లుత్తరదేశ వాసులవి. అవి కూడ తెలుగుదన మలవరించుకొన్నవి.

'హోలి హోలిర రంగ హోలి హోలిర చెమ్మకేళీ' యను మకుటముతో తెలుగు పాటలనేకము పాడబడును. ఈ మకుటము పూర్తిగా హిందీవాక్యము, 'హోలీ హోలీరే రంగ్ హోలి' యనునంతవరకు సులభముగనే తెలియుచున్నది. ఇక 'చెమ్మకేళిరె హోలి' యనునది 'శ్యామ్ ఖేలేరె హోలి' యనుదాని కపభ్రంశ

రూపము. శ్యామ్ అనగా శ్యామసుందరుడగు కృష్ణుడు. శ్యామసుందరుడు హోలి యాడెనని యర్థము ఈ హోళిపాటల వివరములకై స్రవంతి మొదటి సంపుటము మూడవసంచికలో నేను ప్రకటించిన వ్యాసము చూడనగును. ఇక కాముని పాటలు శృంగారాత్మకములగువానిలో నొక్కటిట నుదాహరింతును.

| | | | |
|---|---|---|---|
| కాముడ కాముడా | వలలో | కిట్టికిక్కి పోంగా | వలలో |
| కట్టకాళ్ళ బెనిగె | ,, | గంగా రేగుముల్లు | ,, |
| సీతకాళ్ళ బెనిగె | ,, | ఓట్టిరేగు ముల్లూ | ,, |
| ముల్లు దీయి కాముడా | ,, | మొంతెడంబలి పోస్తా | ,, |
| ముల్దీయి కాముడా | ,, | ముల్దీయవయ్యా | ,, |
| ముల్లెట్లు దీస్తూనే | ,, | ఈ మూకాలోనా | ,, |
| కాలెట్ల ముడుదూనే | ,, | ఈ కంతాలోనా | ,, |
| ములువోయి ముల్లాయె | ,, | ములికీ చెట్టాయె | ,, |
| చిన్నాపి మంచంబు | ,, | సన్నపూప్వ నులుకా | ,, |
| దానిమీద బడుకున్నా | ,, | జాణా లెవరమ్మా | ,, |
| కొవార్బ చిన్నాదీ | ,, | మబ్బా గొన్నాదీ | ,, |
| కొబ్బెరి కాయల్లా | ,, | కొట్టి లేపయ్యా | ,, |
| కొట్టీన లేవాదే | ,, | కొమటోం పట్టీ | ,, |
| విసనకఱ్ఱ తోటి | ,, | విసరీ లేపయ్యా | ,, |
| విసరిన లేవాదే | ,, | వీజాదీ మొగ్గా | ,, |
| సానమీది గంధంబూ | ,, | చల్లీ లేపయ్యా | ,, |
| చల్లీన లేవాదే | ,, | చౌదపులా పట్టీ | ,, |
| గుండంల పూలన్నీ | ,, | గుప్పీ లేపయ్యా | ,, |
| గుప్పీన లేవాదే | ,, | గురిజాల ణంతీ | ,, |
| కాలంటి లేపయ్యా | ,, | కరుణించీ లేచూ | ,, |
| కాలంట బోగానే | ,, | కదిలేసే పణతీ | ,, |

ఈ పాటయందలి కట్టకాళ్ళ, కంతా, వీజాదీ, శబ్దములు కడకాళ్ళ, క్రంత, విరజాజి శబ్దములకు జానపదరూపములు. పాటయందు సంబోధింపబడిన కాముడు రతిప్రియుడో? లేదా సాధారణుడో? ప్రియుని కాముడాయని సంబోధించి ప్రియురాలు తనకు కడకాల బెనగిన(విరిగిన)గంగరేగుముల్లును తీయవలసినదిగా కోరుచున్నది. ప్రియురాలికి కలిగిన బాధను ప్రియుడు గుర్తించెను. ఆమెకు నిజముగనే ముల్లు విరిగినది. కాని ప్రియుడేమి చేయగలడు? అది విజనప్రదేశము కాదుగదా ప్రియురాలి పాదమంటి ముల్లు దీయుటకు? అదియొక క్రంత. అచ్చట

ప్రజల మూకయుండెను తానెంత కాముడైనను కాముకుడు) లజ్జ విడిచి నడివీధిలో ప్రియురాలి పాదమంటగలడా? పాపమా పల్లెటూరి ప్రియుడు సందర్భోచితముగా మెలగెను. కాని ప్రియురాలి కోపమునకు పాత్రుడయ్యెను. ముల్లు గ్రుచ్చుకొని యూరకుండదుగదా! అది తప్పక సెలవేయును అది సాధారణమగు ముల్లైనచో కడకాలునుండి పాదమున నింకేభాగమునకో సెలవేసి యుండును. అది గంగరేగు ముల్లయ్యెను. కనుక హృదయమున సెలవేసినది. తత్ఫలితముగా నామె (చిన్నాది మంచంబు వలలో సన్నపూవ్వు నులుకా)'చీకటింటి కడకంకటిపై జలదాంత చంద్రరేఖాసదృశాంగియై పొరలి'నది. కుపిత నాయికానునయమునకు కాముడు చాల పాటుపడెను. వీవనలు వీచెను, గంధము చిలికెను, పూలు చల్లెను కాని యామె లేవలేదు. ప్రియురాలి తాపము బాపుపట్ల 'విసరిన లేవాదే వలలో విరజాజిమొగ్గ' యనుట యెంతయు రసవత్తరము. చివర కాతడు చేయునది లేక పాదమంటబోయెను. క్రంతలో పాదమంటుటకు సిగ్గుపడెను కాని ఏకాంతమున ప్రియానునయమునకు పాదమంట నాయకుడు వెనుదీయలేదు. కాని యాతడు పాదమంటకమున్నె యామె 'కదలినది'. కదలినది ఆమెకాదు, ఆమెహృదయము. సత్యభామయైనచో వామపాదము కదలియుండును. కాని ఈ ౯ోవన జానపదస్త్రీ. వట్టి బేల. జానపదుల కోపము పాలపొంగు. కనుక తొందరగనే యామె ప్రియున కభిముఖి యైనది. జానపదుల శృంగారమంతయు నీచమే యనుట ఈగేయము విన్న తరువాత పొసగదు. మూడవ పాదమందలి 'సీతకాళ్ళ' కర్థమేమో తెలియ రాదు. ఇంకేదేని శబ్దమిట్లు మారిపోయియుండును.



# అద్భుతరస గేయములు

జానపదులకు అద్భుతరసాభినివేశము మెండు. సాధారణవిషయములం దలౌకికములు నద్భుతములునగు కల్పనలు చేర్చి పెద్ద చేయుట వారికి వినోదముతో పాటు భక్తియో భయమో పెంపొందించుకొనుట కుపకరించునట్టిది. దుర్భరమగు సంఘటనము కలిగినప్పుడుగాని, అసాధ్యమగు విషయము నాకాంక్షించి యత్నులు సాచునప్పుడుగాని ఏమానవాతీతమగు శక్తియో మంత్రమో యడ్డుపడి చిక్కును మంచుతెరవలె తొలగించిన నెంతబాగుండునను కోరిక అసమంజసమైనదైనను మానవసహజమే. ఇట్టి కోరిక నాధారముగా చేసికొని పౌటమరించినవో లేదా వాని ననుసరించియే ఇట్టికోరిక లుద్భవించెనో తెలియదు కాని ఇట్టి యద్భుతములు గల కథలనేకములు ప్రతిభాషయందును గలవు. మానవ శక్తులచే పరిష్కారము సాధ్యము కానప్పుడు, దివ్యశక్తుల నవతరింపజేసి యుపయోగించుకొనుట శిష్టులగు ప్రాచీనకవులవలెనే జానపదకవులును అవలంబించిన విధానము. శ్రవణకుతూహలురైన బాలురు తమ నాయనమ్మలనో అమ్మమ్మలనో, ప్రొద్దుపోవని పడుచు లేముసలియవ్వలనో పలుకరించిన చాలును; ఇట్టి కథలు వేనవేలు వినిపింతురు. కాశీమజిలీ కథలు, భట్టివిక్రమార్కుని కథల వంటివి చక్కగా ముద్రింపబడి శిష్టుల కందినవి కాని మౌఖికప్రచారమందున్న ఇట్టికథ లింకను ముద్రింపబడలేదు. అట్టివానిలో కొన్ని గేయరూపమునగూడ ప్రచారమందున్నవి. ఇట్టి కథలు విని జానపదులు 'దిక్కులేనివారికి దేవుడే దిక్కు'ను ధైర్యవచనము గల్పించుకొని కష్టసమయములందు గుండెనిబ్బరముతో కాలము గడపుదురు. మానవుడెప్పుడును ఆశాజీవి. అడుగడుగునను కడగండ్లు మానవునకు కష్టములేక కలిగిన సంపద. ఆశయను జ్యోతి వెలుగున పయనించు మానవునకీ మాత్రము సాయము లేకున్న నాతని బాట సాగదు. కథలలో నడ్డుపడిన దేవతలో, మంత్రదండమో, పావుకోళ్ళో, సంచియో, భూతద్దమో, బీజాక్షరములో తమకును

సాయపడునని జానపదుల నమ్మకము. అట్టిది సంభవమైనను కాకున్నను మనమునకు మాత్రము పెట్టనికోటయని భావింపవచ్చును. ఈ కథలందు శృంగారము, కరుణము మున్నగు రసములున్నను అద్భుతమే ప్రధానముగా నుండుటచే ఈగేయకథలను వేరుచేయుట పరిశోధనమున కుపకరించును. ఈప్రకరణమున పరిశీలింపబడు గేయములు జానపదులం దధికప్రచారము గాంచినను శిష్టులకు వీనిగురించి యంతగా తెలియదు. కనుక అద్భుతరసపోషణము, దానికై వారొనర్చిన కథాకల్పనము మున్నగు విషయము లిట చర్చనీయాంశములు.

అద్భుతకథలం దన్నిటికన్న నధికప్రచారము గాంచినది 'బాలనాగమ్మకథ'. ఈకథ రెండు వెండితెరల కెక్కుటయే దీని సార్వజనీనత కుదాహరణము. మాయలఫకీరు (మాయల మరాఠి), తలారిరాముడు, బాలవర్ధిరాజు, గాండ్లసంగు, మాణిక్యదేవి, తంబళి పెద్దవ్వ, చాకలి తిప్పడు, చంద్రాయుధము-వీనికి ఆంధ్రదేశమున కావలసిన కీర్తి వచ్చినది. బాలనాగమ్మకథ కన్నడ జానపదగేయముల కెక్కినది[1]. బాలనాగమ్మ పేరు ఆబాలగోపాలమున కెరుక. ఈ కథ తెలంగాణమునకు సంబంధించినది. దీనికి సాహిత్యచరిత్రమున గూడ తావు కల్పించినవారు శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు. కథాకాలము నిదమిత్థముగా తేల్చి చెప్పజాలము. పురాణగాథలవలె నత్యంతప్రాచీనమైనదిగా నగుపడినను ఈకథ అంత ప్రాచీనమైనది కాదు. దక్షిణభారతమున పురకలు పాదుకొన్న తరువాత జరిగిన కథయైయుండును. ఈకథగురించి శ్రీఖండవల్లి లక్ష్మీరంజనం గారి యభిప్రాయము గమనింపదగినది. 'అచ్చపు ప్రజాగీతమైన దీని కర్త పేరు గాని కాలము కాని తెలియవు. బాలనాగమ్మ కథలోని స్మృతులు చారిత్రక వీధులలో దూరదూరము అస్పష్టధ్వనులతో వినవచ్చుచున్నవి. అతిమనోహరమైన పురాతనవాతావరణము దీని నావరించి దీనికి పురాణగాథల ప్రతిపత్తిని కల్గించుచున్నది. బాలనాగమ్మ అత్తవారియూరైన పానుగంటిపురము తెలంగాణములో నల్లగొండ సమీపమున నిప్పటికిని సామాన్యగ్రామముగా నిలిచియున్నది. మహబూబు నగరము జిల్లాలో మరియొక పానుగల్లు కలదనియు అదియే బాలనాగమ్మ యూరనియు కొందరు చెప్పుదురు. ఎట్లయినను కాకతీయుల కాలములో ఒక పానుగల్లు ప్రసిద్ధపట్టణమై యుండెననుట చరిత్రాంశము. శైవమతము ఆకాలములో గొప్ప వ్యాప్తియందుండెను. బాలనాగమ్మను చెరగొనిపోయిన ఫకీరు జంగము రూపములో వచ్చుట గమనింపదగినది.

---

1 దూంబి దావర లావణిగళు డా॥ జె. యస్. పరమశివయ్య.

ఈ గాధయందు రెండుభాగములు కలవు. వానిలో పూర్వభాగమే ప్రాచీనతమమైన కథాభాగము. ఉత్తరభాగమునందు మౌలాలి నివాసియైన ఫకీరు చర్యలున్నవి. మహమ్మదీయులు మొట్టమొదట ఆంధ్రదేశములో స్థావర మేర్పరచుకొన్న కాలమును, వారివిషయమై ప్రజలలో వ్యాపించిన అద్భుతభయ సందేహములును, ఫకీరు వృత్తాంతములో రూపొందినవి. బాలనాగమ్మకథ ఇట్లు క్రమాభివృద్ధి నొంది సర్వాతిశాయియైన ప్రజాగేయమైనది1. 'మహబూబు నగరము జిల్లాయందున్న పానుగల్లు బాలనాగమ్మకథారంగస్థలమని యధికప్రచారమున్నది. అచ్చటి మూగవోయిన కోటగోడలీ విషయమై పెదవి కదల్పవు. కథలో నాగసర్పముల ప్రసక్తి యధికము. పానుగల్లుకోట సమీపమున చుట్టుపట్లనున్న నాగశిల్పము లీవాదమునకు బలము కూర్చుననుకొందును. ప్రజలు చెప్పుకొనెడు కథలు సరేసరి. ఈకథను క్లుప్తముగా విమర్శనాయుతముగా శ్రీ హరి ఆదిశేషువుగారు తమ గ్రంథమున పేర్కొని యున్నారు. వారియభిప్రాయము ప్రదేశము గూర్చి భిన్నముగా నున్నది.'నాగపూజలూ, జంగమారాధనలూ గ్రామీణజీవితములో ముఖ్యాంశాలైననాటిదీ కథ అనీ, తర్వాత కాలానుసారమైన చేర్పులూ మార్పులూ జరిగి ఉంటాయనీ మనం అనుకోవచ్చు. 1542-43 లో గండికోటవద్ద తిరుమలరాయలకీ పెమ్మసాని తిమ్మానాయుడుకీ యుద్ధం జరిగింది. ఈకథలో వద్దిరాజు పాల్గొన్న గండికోట కార్యం అదేనని కవి భావనయేమో। నాగలాపురి చెరువుని కృష్ణదేవరాయలు తనతల్లి నాగమాంబిక పేరట త్రవ్వించాడట అది 1538 ప్రాంతములో జరిగింది. అంతకుముందు ఆచోటు పర్వతారణ్యమయమే. బాలనాగమ్మ కథలో కూడా లక్ష్మిదేవమ్మ తపసు చేసిననాడు నాగమునీంద్రుని గట్టు పాముల కిరవు. వద్దిరాజులు గండికోట కార్యాని కెళ్ళారు.

'రాజు యేలే భూమిలోపలాను-నాగళ్ళపూడి గట్టు పుట్టెను

గట్టు పుట్టగ ఫకీరు పుట్టెను.' అని వ్రాయబడింది. ఈ వాక్యములు నాగలాపురి నిర్మాణాన్ని గురించి యేమోనని కూడ అనుకోవచ్చు. ఈవర్ణనలు చారిత్రక విషయాలకు సూచనలేమో ననుట కేవలం అనుమానమూ ఊహాగానమూ అనేఆనాలి వాటిని రుజువు చేయటం సాధ్యంకాదు'2. కాని పైనపేర్కొనబడిన నాగళ్ళపూడి 'గట్టుక్రిందనే మౌలాలిపేట-ఆపేటలోనే గాండ్లసంగు కాపురం'.

1. ఆంధ్రసాహిత్యచరిత్ర సంగ్రహము. పుట 326.
2. జానపద గేయవాఙ్మయ పరిచయము. పుట 124.

కథానాయిక. ఆమె తన మరణవార్త నెవరికి నెరుకపరచక తొమ్మిది మాసములు బిడ్డల సాకెను. మరణసమయ మాసన్నమైన వెంటనే బిడ్డల దగ్గరికి తీసికొని దుఃఖించిన ఘట్టము హృదయవిదారకము. ఆమె గండము గాచుటకై నవాభోజ రాజెన్నియో ప్రయత్నములు చేసెను. పరీక్షిన్మహారాజువలెనే నవాభోజరాజు ప్రయత్నములు ఫలింపవయ్యెను. నాగేంద్రుడీ ప్రయత్నముల నన్నింటిని నధిగమించి భూలక్ష్మిదేవి ప్రాణములు గొనుటకూడ అద్భుతవిషయము భూలక్ష్మి నివాసమునకు చుట్టునున్న ప్రతిబంధకముల గాంచి నాగేంద్రుడు మాయమై, తొలుత స్తంభము చెంత ప్రత్యక్షమై, మరల నట మాయమై, ఆమె శయనించి యున్న తల్పమున ప్రత్యక్షమై ప్రాణములు గొనెను. మానవప్రయత్నములచే విధిని తప్పింప రాదనుటకు జానపదులిట్టి యద్భుతకల్పనములు చేసెదరు. సర్పదష్టయై భూలక్ష్మి మరణించు సమయమున నామె భర్తతో 'బాలలున్నారు పసిబాలలయ్యా, కడుపెడు బాలల వప్పగించితిని, బాలల నెటుల సాకుతావో నీవు, నేను గట్టిగా వెళ్ళుతున్నాను రాజా, మారుపెండ్లి నీవు ఆడవలదు రాజా, మారు తల్లివో గట్టిగ వస్తేను, నా బాలలకు అన్నము పెట్టదు, నా బిడ్డలకు నీళ్ళు పోయదయ్యా………, అయిన దోషము నాకెందుకయ్యా, నీకు పెండ్లి యాడ బుద్ధి వుంటేను, పిల్లలనయిన తగినచోటనయ్యా, తగినచోట మనువులు మాట్లాడి అత్తవారింటికి నీవు పంపియైన, వెనుక నీవు వివాహమాడు రాజా' యని బాస చేయించినది. నవాభోజరాజు కొన్నాళ్ళటులే యుండెను. కాని ప్రకృతిజన మాతనికి మర్లమాతంగి సహాయమున మాణిక్యాలదేవితో పెండ్లి యగునట్లు చేసిరి. మాణిక్యదేవిలో సవతితల్లితనము మూర్తీభవించినది. నవాభోజరాజు ఢిల్లీకి పోయినప్పు డామె ఏడుగురు బాలికల నింతింతనరాని కష్టములు పెట్టెను. కాని చనిపోయిన భూలక్ష్మి వారిని కాపాడుకొనుట యద్భుతవిషయము. మాణిక్యదేవి మాయలందు నవాభోజరాజు చిక్కుకొని బిడ్డల నడవిపాల్జేసినప్పుడుకూడ ఆకలిచే మలమలమాడుచున్న బిడ్డలకు

'కన్నతల్లిగా సాయమాయెనమ్మా, అచట మేడిపండ్ల వృక్షాలు గావించె

అరటిపండ్ల వృక్షములు గావించె' ను. బాల లడవిలో నుండగనే పానుగంటి వద్దిరాజు-వీరి మేనమామ-వేటకై వచ్చి బాలలను దోడ్కొనిపోయి తనకుమారులు సూర్యవద్దిరాజు, చంద్రవద్దిరాజు, పాపవద్దిరాజు, శరభవద్దిరాజు, కామవద్దిరాజు, రామవద్దిరాజు, కార్యవద్దిరాజులకు పెండ్లి చేసెను. నవాభోజరాజు రాజ్యము గోలుపోయి మరల తన కూతుండ్రు, అల్లుండ్ర సహాయమున రాజ్యమును

బడసెను. కాని కొన్ని దినములకు మాణిక్యదేవి పెట్టిన మందువలన మరణించెను. పానుగంటిలో ఏడుగు రక్కచెల్లెండ్రు తమ భర్తలతో కొంత కాలము సుఖముగా నుండిరి. అప్పుడు గండికోట కార్యము తటస్థించెను. ఏడుగు రన్నదమ్ములు తమ పట్టణమును తలారి రాముని కప్పగించి పయనమైరి. కార్యవద్దిరాజు బాలనాగమ్మ మేడచుట్టు ఏడు గిరులు గీచి వానిని దాట వద్దని ఆజ్ఞ పెట్టిపోయెను ఇంతవరకు పూర్వభాగము.

ఇక ఉత్తర భాగమందున్న కథ—

'రాజు ఏలే భూమిలోపలాను-నాగళ్ళపూడి గట్టు పుట్టినాది
గట్టు పుట్టగ ఫకీరు పుట్టెను-వాడికి ఒక కోట నాయనా
పైడి మేడల నట్టనడుమునూ-పన్నెండు స్తంభాల మసీదున్నాది
మసీదులోనే మాయలఫకీరు-ఆరు పుట్ల అర్వం చదివేను
యేడు పుట్ల ఏకాంతం చదివెను-మూడు పుట్ల ఖురాను చదివెను
వాడు మంత్రకాడు ఛల్ మాయకాడు ధామ-వానికి భూతాలు నాయన
ఏడు వందలా ఎట్టి భూతాలు - మూడు వందల ముక్కిడి భూతాలు' వశమై

యుండెను. 'గట్టు కిందనే మౌలాలిపేట - ఆ పేటలోనే గాండ్లసంగు' ఫకీరు యొక్క ఉంపుడుకత్తె కాపురముండెడిది. దానికి సవతిని తేదలంచి ఫకీరొకనాడు అంజనము వేసి'పన్నెండామడ దూరమందూన,పానుగంటి వో పట్ణమందునాను' అందమైన బాలనాగమ్మను జూచి చెరపట్ట నెంచెను. ఫకీరు వేషము, బ్రాహ్మణ వేషము, పాములవాని వేషము వేసెను కాని యా వేషము లాతనికి నచ్చలేదు. అప్పుడాతడు

'జంగం వేషం తీర్చి కట్టినాడు-చంద్రకాంతి తలపాగ జుట్టెను
చేర్చుక్క వో బొట్టు పెట్టినాడు-సూర్యబిళ్ళలు చంద్రబిళ్ళలేమి
రుద్రాక్షల కిరీట మమ్మయ్యా-రూఢిగ శిరమున ధరించెనేమి'. జంగం వేషముతో

ఫకీరు గాండ్లసంగు వలదన్నను బయలుదేరి నయనవాది, చిలుకవాది, గంగవాది పట్టణములు దాటి పానుగల్లు చేరుకొనెను. కోట కావలియున్న తలారి రామునికి సంతానము లేకుండెను. అది గుర్తించి మాయజంగము సంతాన విభూతి నిచ్చెను. తత్ఫలితముగా తలారి రాముని

'జుట్టులో తొమ్మిదివందలమంది బుట్టినారు
నెత్తిగుడ్డదీసి నేలను గొడితేను-మూడు వందలు ముందుగ వస్తారు
ఏడుగురి వో భార్యల చెంతాను-నాలుగు మూడు వందలున్నారు.'
వారు 'బాబు మాకు పప్పులు పెట్టారా' అని యడిగిరి.

రాముడు 'పన్నెండు పుట్ల శనిగలు తెచ్చాడు-నడివీధిలో పోగు బోసినాడు
మనిషికి వక గింజ రాలేదు-కోటలు ఎక్కి కేకలు పెడతారు
నూతుల వెంబడి వేలాడుతారు-వాసాలనిండా ఇరుక్కవుండారు
గంప ఎత్తి తీసెను రాముడు-గంపల నిండా పిల్లలున్నారు
తలారులొచ్చి పాతర దీసిరి-పాతరనిండా పిల్లలు నాయనా'. వీరితో విసిగి

'జంగమ దేవర బసకొచ్చినాడు-నీ సంతు మరి కొల్లబోను తండ్రీ
వక్కనాటికే దూసుకతిన్నారు-నీబిడ్డలు గెద్దలు జేరాను
బిడ్డలు వద్దు జంగమ దేవరా-నీకు కోటలోకె సెల్వులిస్తాను
సంతు ముచ్చట సాలించు దేవరా' యని వాడు బతిమాలుకొనెను. మాయ

జంగము మంత్రముచే తలారిరాముని ఏడుగురు భార్యలకు ఏడుగురు సంతానము దక్కిరి. జానపదులకిట్టి అద్భుతములు, ఆశ్చర్యములు హృదయాహ్లాదకరములు. ఈ కల్పనలతో మాయల ఫకీరునందు వారమోఘమగు శక్తిని కల్పించిరి. అఘటనఘటనాచాతుర్యము మాయలఫకీరున కాపాదించిరి. వాడు తలారిరాముని నిట్లు వశము చేసుకొని కోట జొచ్చి తక్కిన కావలివారిని మంత్ర తంత్రములచే కట్టివేసెను. ఆరుగురక్కల మేడకు పోయి భిక్షమంది బాలనాగమ్మ మేడ చేరి భిక్షకై శంఖమూదెను. అప్పటికి బాలనాగమ్మ ఏడు దినముల పచ్చిబాలెంతరాలు. పురుడైన వెడల్లేదు. దాదులు వచ్చి

'అయ్యో బాబు జంగందేవర-అంటుముట్టుతో నాగు యున్నాది
నీకు ఎటుల భిక్షం పెడుతుంది?' యన 'మా జంగాలకు అంటే మన్నాదు.
అరె బాలనాగుకూ సంతు ఇచ్చినానూ-నాకు భిక్షం పెట్టకపోతేనూ
ఇచ్చిన సంతు తీసుక పోతాను' అని బెదరించెను. బాలనాగమ్మ భయపడి

జంగమునకు భిక్షముపెట్ట సిద్ధపడెను. అప్పుడు పసిపాప బాలవద్దిరాజు ఏడ్చుచు

'అమ్మా వినవే బాలనాగమ్మ-జంగందేవర గాదే నాతల్లి
నాగల్లపూడి గట్టు ఏలేవాడు- మాయలవాడు మాయలఫకీరు
వాడికి నీవు భిక్ష పెట్టవలదు-ఫకీరువాని పాలై పోతావు
మా తండ్రులు దూరాన నున్నార'ని తెలియని భాషలో మొరపెట్టుకొనెను.

అది గ్రహింపని బాలనాగమ్మ భర్త గీచిపోయిన ఏడు బెరలు దాటిపోయి భిక్షము వేసెను. జంగమువాడు బాలనాగమ్మను రాగి బెత్తముతో నల్లకుక్కను చేసి తలారిరాముని మోసగించి కుక్కను వెంటనిడుకొని నాగళ్ళపూడి గట్టు చేరుకొని వెండి బెత్తముతో కుక్కను దట్టి ఎప్పటి బాలనాగమ్మగా మార్చెను.

బాలనాగమ్మ తనను విడిచిపెట్టుమని ఫకీరును బతిమాలెను. వాడు వినక యామె పొందు నభిలషించెను. బాలనాగమ్మ వాని నెన్నియో తీరుల బతిమాలి లాభము లేదనుకొని తన సౌశీల్యమును గాపాడుకొననెంచి

'నేను పన్నెండేండ్ల వ్రతము పట్టినాను-నా పన్నెండేండ్ల వ్రతము చెల్లితేను

నీవు జెప్పిన మాటలు వింటా'నని ఎత్తు ఎత్తెను. అటులగాక బలాత్కరించినచో 'నీతల పక్కన పగిలి చచ్చేదావు' అని శపించెను. ఫకీరు భయపడి బాలనాగమ్మను గట్టుపై నొక మేడలో భద్రముగా నుంచెను. ఈశాపము రావణునకు నలకూబరు డిచ్చిన శాపమువలె నున్నది. అందువలననే రావణుడు సీతమ్మ నశోకవనమునం దుంచెను.

అచ్చట ఆరుగురు పెద్దతల్లులు, చంటిబిడ్డ బాలవద్దిరాజును పోషించుచు తమతమ భర్తలకు జరిగిన మోసమును లేఖలు వ్రాసి డేగల ద్వారమున పంపించిరి. గండికోట విజయమును సాధించిన వద్దిరాజు 12 వేల సైన్యముతో ఫిరంగులతో గుఱ్ఱపు బలముతో కదలి నాల్గవ నాటికి నాగళ్ళపురి గట్టు చేరిరి. ఫకీరువాడు మాయయుద్ధమున వారి సైన్యమును నాశనము చేసెను. వద్దిరాజులు ఫకీరువాని పట్టుకొని

'కత్తులు తీసుక నపుక సాగినారు-మూరెడు మూరెడు కండలూనేమి
నాలుగు గడియలు కొట్టిరీ వాని-తూరుపు దండ్లో తలగొట్టినారు
పడమటి దండ్లో పుట్టెను ఫకీరూ-అక్కడ వానిని తల కోసినారూ
దక్షిణపు దండ్లో పుట్టెను ఫకీరూ-అక్కడ వానిని తల దీసినారూ
ఉత్తరపు దండులో పుట్టెను ఫకీరూ-అక్కడ వానిని తలగొట్టినారూ
కాల్చి వానిని భస్మము చేసీరి-బూడిదంత జలమున కలిపీరి
జలమునందు పుట్టెను ఫకీరూ.' రామాయణమునందు రావణాసురుని వలెనే

మాయలఫకీ రెంతకును చావడు. వాడు మంత్రవిభూతి చల్లినంతనే

'ఏనుగులన్నీ నల్ల రాళ్ళయ్యె-రాజులంతా చావ బండలైరి
వాంకెలన్ని ఎఱ్ఱబండలాయె-ఫిరంగులన్ని నీటికుండలాయె
పన్నెండువేల బలముల ఫకీరూ-రాళ్ళ గుట్టలు చేసె నమ్మలారా'. ఈ వార్తలు

పానుగంటికి తెలిసెను. అప్పుడు

'పన్నెండు వందల స్త్రీలు గనుకనయ్యె-ఈ యారుగురు అప్పచెల్లెండ్లు
వక్కరేవుకే వచ్చిరమ్మలారా, మూడుపుట్ల నల్లగాజులోయీ
మువ్వది తూముల నల్లబూసలునూ-వక్కరేవున తెంచిపోసిరీ
దిన వాంములూ చేసి రమ్మలారా'.

బాలవద్దిరాజు పెరిగి పెద్దవాడయ్యెను. ఐదవఏట చదువవేసిరి. 12 ఏండ్ల చదువు బాలుడు 12 గడియలలో నేర్చెను. సాముగరిడీ లద్భుతముగా నేర్చెను. తాతతండ్రులకు కదలని బొంగరమును కదలించెను. ఒకనాడు బాలవద్దిరాజు తన బాణ ప్రయోగదక్షతను పరీక్షించుకొనుటకై నీళ్ళు నింపుకొని వచ్చుచున్న నంబివారి నరసమ్మ కుండను గొట్టెను. ఆమె దుఃఖించి బాలుని 'తల్లిదండ్రిని చెరలో పెట్టించి, ఇందుకె నీవు బ్రతికినావురోరి' యని నిందించెను. బాలవద్దిరాజామెను బతిమాలి తలిదండ్రులు చెరబోయినవార్త నెరిగెను. (ఇది పల్నాటి వీరచరిత్రమందలి బాలచంద్రుని బొంగరములాట కనుకరణ మనుకొందును) బాలవద్దిరా జప్పటికి 12 ఏండ్లవాడు. తల్లిదండ్రుల చెరలు విడిపింప కృత నిశ్చయుడై పెద్దతల్లులు వలదన్నను సిద్ధమయ్యెను. తాతగారి చంద్రాయుధము (అద్భుతమైన శక్తిగలది) ధరించెను. తన వృద్ధిక్షయముల సూచింపగల నాగ మల్లెచెట్టును కోటలో నాటి బయలుదేరెను. (ఇచ్చటినుండి బాలుడు ప్రదర్శించిన యద్భుతకృత్యము లన్నింట ప్రధానరసము తొణకిసలాడుచుండును) నాగసర్ప మాతనికి మధ్యేమార్గమున తన పడగనెత్తి ఎండ తాకనీయక కాపాడుటయే కాక భవిష్యమును చెప్పెను. ముందు నడచి యొక పట్టణమున పులిని జంపి పులి రాజు కూతురగు సుభద్రను వివాహమాడెను. ఈ సందర్భముననే చాకలితిప్పని కథ హాస్యపూరితమైనది కలదు. ఆ తరువాత గంగవాటి పట్టణము నయనవాది పట్టణములందద్భుతముల నెరపి రాచకన్నెల నుద్వాహమగుటకు చెప్పి ముందునకు సాగెను. ఈ తరుణమున నాగంభొట్లను బ్రాహ్మణుని మోసము, అతనికి పట్టిన దుర్గతి, బాలవద్దిరాజాతని నుద్ధరించిన కథయు గలదు. నాగళ్ళపూడి గట్టు చేయుకొని ఫకీరువాడుంచిన పొలిమేర శక్తిచే భక్షింపబడుటకు మాయగా దానితో రమించి తంబళిపెద్దమ్మతో బాంధవ్యము స్థిరపరచుకొనెను. ఆమెకడ నుండి బాలనాగమ్మకు తన్నెరుకపరచుకొని ఫకీరువాని ప్రాణరహస్యము లడిగించి తెలిసికొని వాని ప్రాణములు సాధింప బయలుదేరెను.

మార్గమధ్యమున గండభేరుండపక్షుల పిల్లల ప్రాణములు కాపాడి తాను సర్పదష్టుడయ్యెను. పానుగల్లు కోటలో నాగమల్లె చెట్టు వాడిపోయెను. కాని గండభేరుండపక్షు లాతని సంజీవినిచే బ్రతికించెను. వాని సహాయముననే బాలవద్దిరాజు సప్తసముద్రములు దాటి, యడవి చేరుకొని వనము నరికి ఫకీరువాని ప్రాణములు ధరించిన చిలుక యుండెడు ముంతమామిడి చెట్టును చేరుకొనెను. ఈ కల్పన మంతయు నద్భుతరసపోషణముననకే చేయబడినది.

పక్షుల సహాయమున పంచవన్నెల చిలుకను సాధించి తిరిగి నాలుగు దినములలో నాగళ్ళపూడి చేరుకొనెను. ఆనాటికే బాలనాగమ్మ పెట్టిన పంద్రెండేడుల గడువు పూర్తియయ్యెను. ఫకీరువాడు తన్నాడు నిర్బంధించునని బాలనాగమ్మ దుఃఖించుచుండెను కాని చిలుక బాలుని వశమైనప్పటినుండి ఫకీరువానికి మతిభ్రమణము కలిగెను. బాలవద్దిరాజు తన చెంతనున్న చిలుక నెట్లుచేసిన ఫకీరువాడటుల యగుచుండెను. బాలవద్దిరాజు ఫకీరువాని నేడ్పించి వాని చెంతనున్న మంత్ర తంత్రము లన్నియు గ్రహించెను రాళ్ళయి పడియున్న తంద్రులను సైన్యములను బ్రతికించెను. తల్లిని దీసికొని ఫకీరుతో, గాండ్లసంగోజితో పల్లకి మోయించుచు బాలవద్దిరాజు గృహోన్ముఖుడయ్యెను. మధ్యమార్గమున మాటయిచ్చిన కన్నెల నుద్వాహమై పానుగల్లు చేరుకొనెను. సీతమ్మవలెనే బాలనాగమ్మకు అగ్నిపరీక్షలు తప్పవయ్యెను బాలవద్దిరాజు తన తల్లులకు తండ్రులకు మరల వివాహములు చేయించెను. ఫకీరువానితో నాగళ్ళపూడిగట్టు చేరి వాని ధనమంతయు చూచెను. ఫకీరువాడు సమయము చూచి తన చిలుకను పట్టుకొనెను. కాని చిలుక తల బాలవద్దిరాజు చేతిలో కాళ్ళు ఫకీరువాని చేతిలో చిక్కుకొనెను

'విడువర విడువర బాలవద్దిరాజా నేను విడువను మాయలఫకీరా
అవతలగాను ఇవతలగాను ఇద్దరి సందున గయాగొట్టెను।
అల్లా ఖుదా యంటా ఫకీరు సాహెబు, బోరుకొండవలె విరుచుకపడినాడు
ఫకీరువాని ప్రాణము పోయింది, చిలుక జచ్చెను ఫకీరు జచ్చెను.'

బాలవద్దిరాజు ఫకీరువాని ధన మచ్చోటనే సద్వినియోగపరచి తన పట్టణము చేరి సుఖముగా నుండెను.

రామాయణమున రావణునకున్న యద్భుతశక్తులు వాని క్రౌర్యమును చాటుటకును, అట్టి యధర్మముపై విజయము సాధించుటకు వానికన్న నధిక బలుడుగా చిత్రింపబడిన రాముని శక్తి మరింతగా పెంచుట యున్నట్లే, ఫకీరువాని మొదట నద్భుతశక్తి యుక్తునిగా చిత్రించి వానిని నిర్జించు బాలవద్ది రాజును అంతకన్న గొప్పవానిగా నద్భుతరసపోషకముగా జానపదులు చిత్రించిరి, నాయకోత్కర్షవర్ణన కిదియొకపద్ధతి 1. క్రూరుడుదుర్మార్గుడెంత బలసంపన్నుడైనను

1. చచ్చెను
2. వంశవీర్యప్రతాపాదీన్ - వర్ణయిత్వా రిపోరపి।
తజ్జయాన్నాయకోత్కర్ష - వర్ణనం చ ధినోతి నః॥ దండి - కావ్యాదర్శము.

ధర్మము ముందర నోడిపోవుననుు నీతి ఇట్టి యద్భుత కథలం దంతర్లీనముగా నుండి జానపదులకు ధర్మాధర్మసంఘర్షణమున చేయూత నిచ్చి కాపాడును. కనుకనే బాలనాగమ్మ కథను తెలుగులపాలిటి చిన్న రామాయణమంటిని.

నమ్మరానంతటి యద్భుత కృత్యములతో, అలౌకికవిషయములతో నిండినది 'కమ్మవారిపణతి పసల బాలరాజు కథ' దీని జీవము వర్ణాంతరవివాహమని తెలియనగును. పాటకజనమునం దీనాటికిగూడ వర్ణాంతరవివాహములు లేవన్నచో నాటి సంఘమర్యాద లెట్లుండెనో ఊహింపవచ్చును. ఒకటి రెండు ఆధునికభావము లున్నను వాతావరణము మాత్రము పుక్కిటి పురాణయుగము నాటిదిగా గన్పించును. జానపదుల కిట్టి యసహజములగు నద్భుతకృత్యములపై నభిమానము మెండని ఇదివరకే తెలిపియుంటిని.

దీనిని వ్రాసినది కడియము గ్రామవాస్తవ్యుడు కిన్నెర నాగయ్య కొడుకు వీరాస్వామి యనునాతడు. ఇందలి కథ యిది.

'ఉత్తరాన దేవేంద్రుని నగరిన్, మించుచుండు మహా నందికొండ
కొండయేలిక శూరుండు, ధీరుండు, సత్యసంధుడు, నందివర్ధనుండు
అర్థికల్పకభూజుండు, భోజుండు, కలికిరాజను పేరిట విలసిల్లు.'

కలికిరాజను నీ కమ్మదొరకు సంతానము లేదు. ఒకనాడీతడు పొలము దున్నించు చుండగా నాగేటి చాలులో నొకబిడ్డ లభించెను. కమ్మదొర ఆమెకు సీతయని పేరుపెట్టెను. తరువాత కమ్మవారి పణతియను నామముకూడ ప్రసిద్ధమయ్యెను. పణతి అతిగారాబముగా పెరిగి పెద్దదయ్యెను. తండ్రి యామె నెవరు చూడకుండ ఏడుమేడలపై నుంచెను. ఇట్లుండగా చంద్రశేఖరుడను వెలమదొరకు

'సాంబమూర్తి సద్వరమున ప్రభవించె, చావుపుట్టుకలేని బాలుండు
వాని నామము బంగారు బాలుండు, అల్లారు ముద్దుగా నెదిగినాడమ్మా.'

బంగారు బాలుడు తన 16వ సంవత్సరమున ఆరులక్షల గోగణముతో నంది కొండకు వచ్చెను. ఆవులను మేపుచు నాతడు

'ఏడు మెట్ల కిన్నెర చేతబట్టి, కిన్నెరకు శ్రుతిజేర్చి బాలుండు
రాగమాలికల్ బాడె రాళ్లరుగ, పశువులు మేతను వదలి చూడంగ
అప్పుడు పాటను పణతి యాలించె- తనదు దేహము మరచె తండ్రిని మరచె'.

పణతి రహస్యముగా మేడ దిగి బాలుని సమీపించి, అతని రూపమునకు గానమునకు మెచ్చి మోహించి తనను చేపట్టుమని కోరెను. పశువులు గాచెడు

బాలుడు (బాలరాజు) ప్రవరునివలె పణతి ప్రేమను నిరాకరించెను.

'కన్యకా నీవెవర వీరితి నొంటి, రానౌనె నీదగు రాణివాసమును
వదలి వచ్చుట నీకు పొంకమే భామ, ఎవరైన జూచిన నేమిచెప్పుదురు
నీకిది సరికాదు పోపొమ్మ వదలి, పెండ్లికిప్పుడు నేను వేసారలేద'నెను.

అపుడా పణతి

'వచ్చి వరించిన వలదు పొమ్మనుచు, త్రోయ వెంగలియున్నె ధూర్తత్వమేల
కమ్మవారల యింటి కామినినేన్నెను, నమ్మి వచ్చితినయ్య నమ్మ నేయకుము
నాతల బుట్టెనే నాథు వరింప, శ్రీకృష్ణ రుక్మిణి జేరదే మున్ను'అని సమాధాన
మిచ్చెను. బాలరాజామెను వదలించుకొనుటకై

'వెలమ కమ్మల కెట్లు వెలది పెండ్లియగు, పసిదాన వగుటచే పరికింపలేవ'నెను
కాని కమ్మవారి పణతిమాత్రము,

'కులము నడ్డుగజేసి కొఱత లేంచెదవు, కులమన్న నేమయ గుంపంద్రుకాదె
గుంపులో నెదియైన గుంపు కదయ్య, వెలమ కమ్మలరీతి గలదె పుట్టుకను
ప్రేమ యుండిన చాలు పెండ్లికి చాల, మనసు పట్టని పెండ్లి మరియేల బాల
నా మదికెక్కిన నాడెంపువాడ, వగుటచే నన్ను చేపట్టంగవచ్చు
పట్టకుండిన నీకు పాపంబు వచ్చు,ఆడుగోడున బోకుమయ్య శృంగార'యని తనపట్టు

విడువదయ్యెను.అచ్చటనుండిన క్షేమము లేదనుకొని బాలరా జడవుల సంచరింప దొడగెను. కమ్మపణతి యాతని ననుగమించెను. వీరలిద్దరటుల బోవుచుండ, 'జోడుచంద్రులు పొడిచిన విధముండె'నట.ఏతీరుననైన నామెను వదల్చుకొన వలెనని బాలరా జాలోచించుచుండెను. అసాధ్యములు నమానుషములునగు పనులొనర్చిన నిన్ను పెండ్లాడుదునని బాలుడామెతో ననెను. ఈతీరున నయిన దప్పించుకొనవలెనని బాలరాజు ఎత్తుగడ.రావుల చెరువు సమీపించగనే బాలరాజు కాలముగాని కాలమున

'పట్టరాని పెనుమబ్బులు పట్టవలెన్, కటికిచీకటి తోచకయుండవలెన్
ఊరిమీద నొక చినుకును లేకుండ, అడవిమీద నొక వానయు లేకుండ
నడిమి చెరువులో వానలు కుర్వవలెన్, చెరువులు నిండి వాగులు పారవలెన్
కొత్తచెంబు తా చేతపట్టుకొని, ధరణిమీదనూ నిలిచినట్టులా
నీళ్ళపైననూ నడువవలయును, ఏడు మునుగులు మునుగవలెన్
ఏడు చెంబులా నీళ్ళు తేవలయు, కొలిచి వడిలో నీరు బోసికోని
ఒడిలో నీరు ఒలికిపోకుండా, కట్టిన చీరయు తడిసిపోకుండా

నుదుటను కుంకుమ రాలిపోకుండా, నోముదండలే వానిపోకుండా
ఏడు అడుగులు నా కెదురు ఏమ్మా, ఏడుచెంబుల నీళ్ళు తెమ్మా
ఇది చేసిన వెనుక పెండ్లిమాటలను, వెనుక చూచెదములే కమ్మపడతీ' యనెను.

పణతి అష్టదిక్పాలకులను వేడ్కొని బాలరాజు చెప్పినంత చేసినది. ఇట్టి యద్భుత కృత్యములు కల్పించి జానపదు లాయాపాత్రములను పోషించి వారియందు భక్తిగౌరవములు పెంపొందించుకొందురు. తప్పించుకొనుటకై వేసిన ఎత్తుగడ విఫల మగుటతో బాలున కాశ్చర్యమున కన్న భయ మెక్కుడుగా కలిగినది.

'ఎంత మోసము చేసెనయ్య భామా, నమ్మరాదుగా యికను నమ్మరాదు
ఆడువారల నికను నమ్మరాదు, ఆడువారిల నమ్మి బ్రతికి రెవరు
ఆడదానిని నిన్ను నమ్మరాదు, అడ్డకత్తితో తెగవెయ్యవలయు
కట్టుబోతుల విద్య నేర్చినావు, మాయకారుల విద్య నేర్చినావు
యెల్లమారమ్మ పదవులు నేర్చినావు, మంత్రాలు తంత్రాలు నీవు నేర్చినావు
తోడుబోతుల విద్య నేర్చినావు, దుష్టమార్గుల వరుస నిలిచినా'వని మార్గము

పట్టెను. అతని బతిమాలుచు కమ్మపణతి వెంటనంటెను. త్రోవలో నొక శివాలయమున నున్న నందిని ఆవుగా మార్చి, కోడె లేకయే చూలు నిలుచునట్లుచేసి, దూడను పుట్టించి, అడుగులేని దుత్తలో పాలు పిండి, నిప్పులేకుండ కాచి, తోడు లేక పెరుగుచేసి, కవ్వము లేక చల్లచేసి, వేపకాయంత వెన్న దీసి, ఏడుగిద్దెల నెయ్యి చేసి, అరచేత నిడుకొన్న పెండ్లి యాడెద ననెను. కమ్మవారి పణతి ఈసారియైన పెండ్లాడునని తలచి సకలదేవతల ప్రార్థించి యాయద్భుతకృత్యమును నెరపినది. పాడిపంటలకు కమ్మవారికి పెట్టినది పేరు. వారి ప్రసిద్ధి యిందు సూచితము. అదిచూచి బాలరాజు

'అబ్బా చెడితిర దీని కొంపగాల, దయ్యమో పెను భూతమోరా
పెండ్లిమీద నాకు ప్రేమలేదు భామా, పెండ్లిమీద నాకు ప్రియములేదు భామా'యని

త్రోవబట్టెను. ఇట్లు పోవుచుండ వారికి రక్తధూళిపురపు కోమటి యొకడెదు రయ్యెను. బాలరాజు పణతి నాతని కప్పగించి వెడలిపోను. పణతి కోమటిని మోసగించి మరల బాలుని జేరి

'నేనేమి జేసిన విడువజాల నిన్ను, వన్నేమి జేసిన మనసు త్రిప్పజాల
దేహమెల్లను నీకు నిచ్చుదాన, ప్రాణమెల్లను నీకు నిచ్చుదాన
వదలిపెట్టిన వదలుదాన గాను, విడిచిపెట్టిన విడచుదాన గాను
భూమిలో దాగిన వదలుదాన గాను, నీళ్ళలో దాగిన వదలుదాన గాను

అగ్నిలో దాగిన వదలుదాన గాను, గాలిలో మఱిగిన వదలుదాన గాను
ప్రాయమైనది ప్రక్కనుండంగ, చనువు గలయది ప్రక్కనుండంగ
వలచి వచ్చినది ప్రక్కనుండంగ, తానే వేడునది ప్రక్కనుండంగ
నిదురెట్లు వచ్చెనో నీరెండయందు, చాలుచాలుర కోపమేల బాల
ఏల ఈచలమేల గోపాల, ఏలరా నీకిది వెలమశ్రీబాల' యని ప్రార్థించెను.
అతడు వినక పారిపోయెను. కాని పణతి భేతాళుని దలచి ఆతని సహాయమున మరలించుకొనెను. బాలరాజున కాకలి యయ్యెను. అతడు
'ఆకలెత్తెనే కమ్మవారి పణతి, అన్నముంచవే కమ్మవారి పణతి
అన్నముండిన ప్రాణము లికనిలుచు, అన్నముండిన పెండ్లి యాడవచ్చు'ననెను.
పణతి బాలునికి ౯ వరహా లిచ్చి రక్తధూళిపురమున కేగి వంటసామగ్రి దెమ్ము వండిపెట్టెద ననెను.బాలునికి ధనము చూచినంతనే పణతిపై మక్కువ కలిగెను, ఆమె నాతడుద్వాహమగుటకు నిశ్చయించుకొని సామగ్రిని దెచ్చుటకై రక్తధూళి పురమున కారాత్రి పయనమయ్యెను. పోవునప్పుడామె నొకచో అరణ్యమందు భద్రముగా నుంచెను.బాలునిచెంత బంగారము చూచి సామాగ్రినమ్ము బచ్చుకు భ్రాంతి కలిగెను. అతని ధనము లాగికొనవలెనని బుద్ధిపుట్టి
'మనకు ధర్మ మధర్మమనగ గలదె-వచ్చిన దెల్లను వరవు చేయవలయు
రానిదంతను లాగి చేర్చవలయు' నని ధనము తీసికొని సామగ్రి నిత్తునని కత్తితో బాలుని చేయి నరికెను. బాలుడు పరుగెత్తి ప్రక్కనున్న ఆకుతోటలో ప్రాణములు కాపాడుకొనెను. కాని యాతోటకాపు లాతని దొంగగా భావించి పట్టి తలనరికిరి. తెల్లవారువరకు చూచి కమ్మపణతి రక్తధూళిపురము ప్రవేశించి బాలునికై వెదకుచుండెను. ఆమె కాపట్టణమున బాలుని శిరము కానుపించెను. బాలుని కళేబరము చెంతజేరి ఆమె విలపించుచుండ పురజనులామెను దొంగవాని భార్యయనుకొని పట్టి బంధింపనెంచిరి. అప్పుడామె
'అయ్యలార నామాట వినుడి మీరు, దొంగనంచు మీబుద్ధి తోచెనేని
అగ్నియందు దూకి వత్తు నిజము, తప్పిపోయినం దగవు చూచుకొను' డని దేవతలనుదలచుకొనియగ్నిగుండముల కల్పించుకొనెను.భేతాళునితో చుట్టునున్న కావలివారలు పారిపోకుండ చూడుమని చెప్పి పణతి అగ్నిప్రవేశ మొనర్చెను. ఒక క్షణము ఆమె దానిలో మాయమై దేవలోకము చేరుకొనెను. అచ్చట తన అర్థరక్కల కలిసికొనెను. వారామెకు పూర్వజన్మ ప్రకారము జ్ఞప్తిచేసిరి.
'దేవనాథుని కూర్మి నందనలము, భూమికేగగా వలయునంచు మనము
తండ్రి నడుగగా నిన్ను విలువు మఱియె, మాకు నుత్తరువిచ్చి పొమ్మనియె

మేము భూమకి వచ్చుచుండగను, మమ్ము వదలగలేక మాతోడ నీవు
వచ్చినా వదిగాంచి రయమున దండ్రి, మర్త్యలోకమునందు నిడుమ గుడువ
శాపమిచ్చినది జ్ఞాపకము లేదే, అంత నీవు దేవేంద్రు కాళ్ళు మ్రొక్కి
భూమి గోడులను గుడువజాలనయ్య, కరుణసేయుమా నన్నుగన్న తండ్రి
అనుచు వేడగా నతడు కరుణచేసి, నీకమానుషశక్తు లిచ్చె నతడు'.

ఇంత చెప్పినగాని ఆమెకు పూర్వసంస్మృతి రాలేదు. అప్పుడామె యక్కలతో

'క్షితికి వచ్చినది వొక్కనాడు మనము, జలము లాడుచు భూమినుండ నొకడు
సత్యసంధుడన్ యక్షనందనుండు, సుందరాంగుడు రాగ నతని జూచి
మోహమొందినదాదిగ మనతండ్రి, నాకు నుత్తర మిచ్చుట లేదనుచు'

తండ్రి తన కనుజ్ఞనీయని కారణమును చెప్పెను. అక్కలామెతో

'ఔను సత్యసంధుడె బాలరాజు, శాపవశమున నిన్ను మరచినాడు
శాపవశమున తన్ను మరచినాడు, భయముజెందకో చెల్లె నీవు వేగ
భూమికేగుమా శాపమోక్షణంబు, కొంది కాలములోన నీకు నగు' నని పుష్ప
హారమును పసిడి బెత్తమును ఇచ్చి పంపించిరి. కమ్మపణతి మరల నగ్నిగుండమున
సాక్షాత్కరించెను. అప్పటికే పారిపోదలచిన నచటి కాపువారల భేతాళుడు
మ్రింగియుండెను. పణతి పుష్పహారము పసిడి బెత్తముల సహాయమున బాలుని
బ్రతికించెను కాని బాలరాజామెను నిరాకరించి మరల ప్రయాణమయ్యెను. మార్గ
మధ్యమున పణతిచే పూర్వమువలెనే రెండుమారు లద్భుతకృత్యములు చేయించి
పరీక్షించెను కాని యామెను స్వీకరింపడయ్యెను. వారొక దేవళమున నిద్రింప
దొంగలు వచ్చి బాలరాజును చంపిం పణతికై తమలో తాము సుందోప
సుందులవలె పోరాడి యంధులైరి. పణతి మరల బాలుని బ్రతికించుకొనెను.
ఒకనాటిరాత్రి జంబునారాయణ పట్టణమేలు ముత్తరాసి రాజొకడు మత్తుమందులు
చల్లి యామె నెత్తుకొనపోయెను. ఇప్పటికి బాలునికి కనికరము కలిగెను పణతి
తలచినంత మాత్రమున తండ్రి మఱియు తదితరదేవతలు ప్రత్యక్షమై వారిరువురికి
పెండ్లి చేసిం వారటనుండి దేవలోకమేగి కొంతకాలముండి తరువాత
వైకుంఠమేగిరి.

శిష్ట సాహిత్యమును విమర్శించు దృష్టితో జూచిన నిట్టి యద్భుత కథలందు నెరసులు లభింపక పోవు. కాని యవి నెరసులనుటకన్న జానపదుల యద్భుత రసప్రీతిగా, వారి చిత్తవృత్తి కనుకూలమైన భావములుగా చెప్పుకొనవలయును. ఇట్టి యద్భుతములు నలౌకికములు నమానుషములగు విశేషములగూర్చి

జానపదులు పాటలు పాడుకొని సంతోషించారు. హుదయగారి మల్లన రాజశేఖర చరిత్రము-శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్యము ఇంతకన్న నమ్మిక కలిగించునట్టివి కావు జక్కన విక్రమార్కచరిత్రము, రుద్రకవి నిరంకుశోపాఖ్యానము మున్నగునవి అతిలోకచర్యల నామోదించునట్టివే ఈ పాటలో జానపదులు మరి కొంత దూరము సాగినను చో ఇరువుర ఆశయములం దేకతయే కాన్పించును.

అద్భుతకథాగేయములందు '*గాంధారి కథ*' అగ్రగణ్యము; పురాతనము కూడ కావచ్చును. దీని పౌరాతన్యముగూర్చి శ్రీ ఏటుకూరి కామేశ్వరరావు గారభిప్రాయపడినారు. 'ఇదొక విచిత్రమైన జంగంకథ. కవిపేరు తెలియదు కాని ఈ కవే కుమారిరాముని కథ అను మరొక జంగం కథ కూడ రచించేడు. గాంధారి కథ క్రీ.శ 1300 ప్రాంతపు రచన కాకతీయ ఆంధ్రమహా సామ్రాజ్యాన్ని రుద్రమదేవి అను స్త్రీ (1260_1295) పరిపాలించింది. ఆమె నేర్పుకి ప్రజలు ఆశ్చర్యపోయి 'ఈమె మహా మాంత్రికురాలా' అనుకొన్నారు. ఆమెయొక్క వివాహపు కథను జంగం కవి ఈ కథలో నిగూఢంగా తెలియ జేసేడు.1

శ్రీహరి ఆదిశేషువుగారి యభిప్రాయ మిటులున్నది. 'ఇలాంటి తాంత్రికవ్యవహారాల వర్ణనలెన్నో ఈ గ్రంథంలో ఉన్నాయి. అవి ఈనాడు పరిపాటి కాదు. అందుచేత ఈ కథారచన పర్వతాల మల్లయ్య భక్తులు తాంత్రికవిధానాలలో నిమగ్నులైన 11-12 శతాబ్దాలలో జరిగిందేమో ననీ, తర్వాత దీనిలో మార్పులూ, చేర్పులూ, జానపదవాఙ్మయానికుండే సహజ గుణానుసారంగా జరిగాయేమోననీ ఉహించవలసి వస్తోంది2.'

పై యిరువురు విమర్శకు లించుమించుగా దీని పౌరాతన్యమున నేకాభిప్రాయము గలవారే. నా యభిప్రాయముకూడ నంతియ. ఐనను జానపద గేయ విమర్శనమున కవికిగాని కాలమునకుగాని తావులేదని తొలుతనే మనవి చేసి యుంటిని ఇదమిత్థముగా నిర్ణయించుటకు ఆధారము లేమియు దొరుకనప్పుడు ఊహాగానముమీద ఆధారపడియుండవలసినదే. అట్టి యూహనే పై విమర్శకులు చేసియుందురు ఏటుకూరివా రీకథ రుద్రమదేవి వివాహకథ యనిరి. దానితో నేనేకీభవింపజాలను. రుద్రమదేవి వివాహకథయని నిరూపించుట కిందేమి యాధారములును లేవు. కేవలమా కాలముననున్న రాణియగుటచే నీకథ నామెకు

1. బాల. ఆగస్టు, 1953.
2. జానపదగేయ వాఙ్మయ పరిచయము. పుట. 136.

అంటగట్టుట భావ్యముకాదు. గాంధారికథ 'ఇదికథ ఇదిమార్గ మినుపింతు వినుడి' యని కుమారరాముని కథవలెనే ప్రారంభ మగుచున్నది. ఇదికూడ దానివలె కంపిలి రాజ్యములోని గాధయే. దీనిలోకూడ తపము, సంతానప్రాప్తియు కలవు. ఇంతమాత్రము సాక్ష్యమునుబట్టియే రెండును ఒకరే రచించిరను చేకుమళ్ళవారి నిర్ధారణము తొందరపాటనిపించును. కథయందు రాజులు రాణులుగా నున్నవారు నిజముగా సాధారణులుకూడ కావచ్చును. సాధారణుల కలౌకికాద్భుతమాహాత్మ్యములం దగిలించుకొనెడు జానపదు లిట్లు చేసియుందురనుటలో పొరపాటేమియు లేదు. అంతియకాని రుద్రమదేవియే గాంధారిగ పరిణమించిన దనుట కెట్టి యాస్కారమును లేదు. నిజామాబాదు జిల్లా ఎల్లారెడ్డి తాలూకాలో గాంధారియను గ్రామమున్నది. ఒకప్పుడది నరేంద్రరాజు రాజధాని. దానిపూర్వనామము దేవర పట్టణము. గాంధారి గ్రామమున ఇప్పటికిని ఈకథ కొలది మార్పులతో ప్రచారమందున్నది. అచ్చట గాంధారి బాలరాజుల విగ్రహములుకూడ కలవు. అచ్చటి పురావస్తువులు, ప్రచారమందున్న ఐతిహ్యములు, భావి పరిశోధకులకు గాంధారీ బాలరాజుల సిసలైన చరిత్రము తెలిసి కొనుటకు ఉపకరించగలవు. ఈ విషయ మింతటితో చాలించి ముద్రితకథ నారయుదము.

ఆరంభమున కవివాక్య మిట్లున్నది.

'ఇదికథ ఇదిమార్గ మినుపింతు వినుడీ, పురజనులార వో పుణ్యాత్ములార
అది యెట్టికథ యనగా వినుపింతు, ఆహంపి విరూపాక్షి ఆనెగొందిభూమి
కెంపిలి గంగాపతనియేటి గ్రామ, దేవరాపుర వీరగుంభిని రాజ
విక్రమార్కుండగు అతనికి నిజరాణి అలికులవేణి,
బిత్తరి కాంబోది యనునది తారశీల పట్టణము'.

ఈ తారశీలపట్టణమును జానపదకవి మనోహరముగా వర్ణించినాడు.

'ప్రొద్దుపోయి చూచిన పొన్న పూచినట్లు- జామోయి చూచిన జాజి పూచినట్లు
నెబ్బర నేరేళ్ళు మోదుగ బూచిన, చందం అదిగాక ఇంటింట
నాశికశదము యిరువైన మేడలు, పొడుగాటి మిద్దెలు భువనేశ్వరాలు
అడుగడుగు బావులు ఆటకూటములు, చిరుమల్లెశాలలు చిత్రశాలలు' నున్నట్లుగా

వర్ణించినాడు. సూర్యనారాయణస్వామి మేలుకొలుపు పాటలో సూర్యునివర్ణించుచు 'పొడుస్తు బాలుడు పొన్నపూఛాయ' యను నిట్టివర్ణనమే కలదు.

తారశీలపట్టణమును వశపతి (వసుపతియో - పశుపతియో కావచ్చును) రాజు పరిపాలించుచుండెను. ఆతని భార్య దేవపద్మగంధి. 24 ఏండ్లు గడచినను

ఆమెకు సంతానము కలుగలేదు. సంతానార్థమై పద్మగంధి పెక్కునోములు నోచెను. కాని లాభము లేదయ్యెను. చివరకు భర్తృనాజ్ఞగొని రాణి శ్రీశైల పర్వతమునకు పోయి మల్లికార్జునస్వామి సన్నిధిని ఘోరమైన తపమాచరించెను. ఈ తపోదీక్ష సత్యద్భుతముగా వర్ణించినాడు. స్వామి ప్రత్యక్షమై 'ఆయుస్సు లేని మగబాలను ఇచ్చేదా లేక-ఆయుస్సుగలిగి అయిదవతనం గలిగిన ఆడబాలను ఇచ్చేదా' యని ప్రశ్నించెను. వరమిచ్చు భగవంతు డిటులేల ప్రశ్నింపవలెనను ప్రశ్న సాధారణముగా మనకు కలిగినను ముందుముందు వచ్చెడు కథాపోషణమున కిది యత్యంత మవసరము. మృకండ్వాది మునులకుగూడ నిట్టి చిక్కు తటస్థించుట మన పురాణములు చాటుచున్నవి. రాణి కూతురునే కోరెను. శివుడా బిడ్డ కుండెడు లక్షణములు చెప్పి శివగాంధారియని నామకరణము చేయుమని ఫలమొసగి తిరోహితుడయ్యెను. రాణి తారశీలపట్టణము చేసుకొనెను. ఫల మారగించి సద్యోగర్భము ధరించి ప్రసవవేదన ననుభవించుచుండగా రాజు గారు బ్రాహ్మణాజ్ఞచే దేవళమున 'పడమటి భాగాన వున్న సందులను, తూర్పు భాగానికి గిర్రున తిప్పెను'. రాణి సుఖప్రసవ మయ్యెను. శివుడు చెప్పినటులే ఆబాలకు 'వీపున వింజామర, అంకాలున తామరపద్మం, బొడ్డున మాణిక్యం, కన్నుల చింతామణి, పండ్లను పరశవేది, నొసట చిత్రకన్ను పిభూతిరేక, ఒంటిజడ' యుండెను. ఈవర్ణనముకూడ జానపదులకు సర్వసాధారణము. మహిమోపేతులగువారిని వర్ణించునప్పు డీమాటలు తప్పవు. కాలజ్ఞు లామె జాతకమును చూచి మేనమామగండమని చెప్పిరి. గాంధారి మేనమామ సుహితుడు వాలుగొండ పట్టణము పాలించుచుండెను. అతని తండ్రి మాంధాత. గాంధారి ఐదేండ్లదయ్యెను. రాజదంపతు లొకబ్రాహ్మణతాపసిని పట్టితెప్పించి గాంధారికి విద్యాబుద్ధులు గరప నియమించిరి. గాంధారి శీఘ్రకాలముననే సమస్త విద్యలు నేర్చెను. గురువుగారికే తప్పులు దిద్దెను. గాంధారికి తోడెవ్వరులేక చదువుకొనుట యిష్టము లేకుండెను. తల్లిదండ్రు లది గమనించిరి. తోడుకై సుందరగిరి పట్టణపు గాండీవరాజు కుమారుడు బాలరాజును రప్పింప దలచిరి. గాండీవరాజు తారశీలపట్టణపు రాజుగారికి బావమరిది. గాండీవరాజు భార్య రామక్క గాంధారికి మేనత్త. వీరికి యేగంటీశ్వరుని వరమున బుట్టినవాడు బాలరాజు. ఒకప్పుడు గాండీవరాజు బావగారిపై తిరుగుబాటు చేసి తత్ఫలితముగా 'సోలెడు బియ్యం,తోటకూర కట్ట,పాతిక కాసులు గ్రాసం'గా బ్రతుకుచుండెను. బాలరాజు సామమార్గమున రాకున్న బలవంతముగా పట్టితెండని రాజుగారు భట్టీల

నంపిరి. రామక్క కీడు శంకించి బాలరా జూరలేదని బొంకెను. కాని వారి! బాలరా జూరనే యున్నట్లు తెలిసెను. బాలుడప్పుడు సాధనాల గరిడీయందు

'ముందర లఘువున వోరీ ముత్తుంరాళ్ళ గోతమును గోట జిమ్మెను
వెనుక లఘువున వోరీ ఏడుంరాళ్ళ గోతం ఎడమకాళ్ళ జిమ్మెను
జారుడుబండ దూకులు జీరుబండ మీదికి జీరుబండ దూకులు జారుబండమీదికి'

సాధన చేయుచుండెను.జెట్టీలాతని చూచి భయపడి బలవంతము పనికిరాదనుకొని వసుపతిరాజుగారి మాటలు మనవిచేసి తిరిగివచ్చిరి.బాలరాజు తల్లితో మేనమామ యింటికి పోదుననెను. జరిగిన పరాభవముచే కృశించు తల్లి బాలరాజును వలదనెను. కాని బాలరాజు మామతో మాటలాడి పోయిన రాజ్యము తిరిగి సంపాదింతునని తల్లికి నచ్చచెప్పి, అశ్వమెక్కి బయలుదేరి, తారశీల పట్టణము చేరుకొనెను. వసుపతిరా జల్లుని సగౌరవముగా నాహ్వానించెను. బాలరాజు మామగారిని (తన తండ్రికి చేసిన శిక్షకు) దెప్పిపొడిచెను. కాని వసుపతిరాజు అది సహృదయతతో స్వీకరించెను. బాలరాజు తానట నుండుట తన తల్లికి ఇష్టములేదని, తిరిగి పోయెదనని చెప్పెను. వసుపతిరా జాతని భోజనము గావించుకొని పొమ్మనెను. పద్మగంధి, బాలరాజు అందచందములు, తెలివి తేటలు, బలశౌర్యములు చూచి ఆతడు తమ నగరమున గాంధారికి సహపాఠియై యున్నచో ముందుముందు ప్రమాదము సంభవించునని బాలరాజును తొందరగా పంపించుటకు యత్నించుచుండెను. రాజుగారల్లునికి కట్నములు, కానుకలు ఐదూళ్ళు అరణమిచ్చిరి. ప్రయాణమగుటకు ముందు గాంధారీబాలరాజు లొకరినొకరు చూచుకొనుట సంభవించెను. ఒకరి రూపముల కింకొక రాశ్చర్య పడిరి. బాలరాజు ప్రయాణ మాపుకొని గాంధారికి సహపాఠియయ్యెను. వసుపతి రాజు గాంధారిని బాలరాజుకిచ్చి మునుముందు పెండ్లిచేయ నిశ్చయించుకొనెను. పద్మగంధిమాత్రము తనకూతురు సీదరిద్రునినుండి తప్పించి సుహితునకీయ దలంచెను. చదువుసాములప్పుడుకూడ వారిరువురు కలిసికొన కుండునట్లును మాటలాడుకొన కుండునట్లును కట్టుబాటు చేసినది.కాని వారిరువురు తమ గురువు కనులకు గంతలుకట్టి పరస్పరప్రేమమును పెంపొందించుకొనిరి. పెండ్లి చేసి కొనుటకు బాసలుచేసికొనిరి. గాంధారి ఒకనాడు గురువుగారును బాలరాజును లేని సమయమున గురువుగారి తాళపత్రగ్రంథములు శోధించి, శక్తిపంపు, శాంభవిపంపు, హనుమంతపంపు, వీరభద్రపంపు, భైరవిపంపు మొదలుగాగల మంత్రములును; శక్తిముగ్గు, శాంభవిముగ్గు మొదలుగాగల తంత్రములను

గ్రహించెను. వానిని ప్రయోగించి చూచుకొనెను. గాంధారి రహస్యముగా బాలరాజు మేడకేగి కలియుచుండెను. బాలరాజు తనకు ప్రమాదము సంభవించునని తెలిపెను. గాంధారి తన శక్తిసామర్థ్యముల నాతని కెరుకపరచి ఏమి భయముండ బోదని హెచ్చరించి తన శక్తిని ప్రదర్శించి బాలున కాశ్చర్యము ధైర్యము కలిగించెను. చదువు చెప్పెడు బ్రాహ్మణుడు వీరి ప్రణయరహస్యములను రాణి గారి కెరుకపరచెను. పద్మగంధి వారి నిరువురిని పట్టి కొట్టించెను. కాని గాంధారి తనశక్తిచే బాలరాజును కాపాడెను. బాలరాజు స్వగ్రామమునకు వెడలిపోవుచుండ గాంధారి తన మాహాత్మ్యమున మరలించుకొనెను. పద్మగంధి కూతురునకు వివాహముచేయ నిశ్చయించి జెట్టీలను సుహితుని కడకు వాలుగొంద కంపెను. కాని సుహితుడు 'పెండ్లిరోత పెండ్లామో రోతని, ఇల్లురోత యిల్లాలో రోతని, తదేక నిష్ఠతో పంచగడ్డాలు పెంచుకొని' యుండుటచే వచ్చిన జెట్టీల తన్ని పంపి వేసెను. బహుశః ఈతనికి గాంధారిపై మోహము లేకుండుటకును వివాహ మిష్టము లేకుండుటకును కారణము, గాంధారి మేనమామ గండమున పుట్టిన దనుటచే కాబోలు. తమ్ముని రాకకై యెదురు చూచెడు పద్మగంధికి ఆశాభంగ మయ్యెను. ఆమె గాంధారి స్వర్ణ చిత్రపటమును పంపించి తమ్ముని మరల నాహ్వానించెను. గాంధారిపటమును చూచి మూర్ఛపోయి సుహితుడు తన వ్రతము విడిచివివాహముచేసికొన సిద్ధుడయ్యెను. వివాహలగ్నములు లేవన్న బ్రాహ్మణుల మాన్యములులాగికొనెను. చదువురాని బ్రాహ్మణుడొకడు (నాగంభొట్లు) తరుణమును గమనించి 'రేపుప్రొద్దున శనివారమని విచారించనక్కరలేదు, దుర్వారమని విచారించ నక్కరలేదు, రేపు ప్రొద్దుపొడుపున మంచి లగ్నమయ్యా' యనెను. అందరి మడి మాన్యములు నాగంభొట్లకు లభించెను. ఇచ్చటకొంత హాస్యము ప్రదర్శింపబడినది. పెండ్లికొడుకై రాజుగారు పేరంటాండ్రతో సపరివారముగ బయలుదేరెను. గుడ్డి తిరుమలక్క, కుంటికాలు తిరుమలక్క, మూగచ్చమ్మ, చెవిటి సుబ్బమ్మ, చొల్లు నోటి రమణమ్మలు పెద్ద ముత్తయిదువలు. ఎన్ని యపశకునములైనను సుహితుడు గ్రహింపక వివాహనిశ్చయముతో బయలుదేరి ప్రయాణము గావించుచుండెను. మధ్యేమార్గమున రెండు కపోతములు 'పసుపతిరాజుకు నోలన్నా, సోయితుడా అన్నా, సోయితుడా మంచి శివునివరము, వరము కుమార్తెరా, సోయితుడా నీకు చిక్కదు, ఛీ వెళ్ళకూరా సోయితుడా, నీకు దక్కదు గాంధారీ'యని చెప్పెను. సుహితుడు కుపితుడై కపోతములను చంపెను. సుహితుడు తారశీలపట్టణము చేరుకొనెను. వివాహప్రయత్నములు సాగుచుండెను. పద్మగంధి తన పట్టుదల

నెగ్గెనను సంతోషమున, 'వాలుగొండ సీమనుంచి వచ్చెనమ్మ సోయిటుడు, మేలైన సొమ్ములంతా తెచ్చెనూటియమ్మ పట్టుచీర రవికె కట్టవే తల్లి నీవు-పట్టాభిద్రుని చేపట్టవే తల్లి' యని పాడగా గాంధారి

'మేలు మేలాయెనమ్మా మేలాయెనమ్మా-నా మేలంత బాలరాజు పాలాయెనమ్మా
వయసాయెనమ్మా వయసాయెనమ్మా-నా వయసంత బాలరాజు పాలాయెనమ్మా
బాగు బాగాయెనమ్మా బాగాయెనమ్మా-నా బాగంత బాలరాజు పాలాయెనమ్మా' యని

పాడెను. తల్లి యది విని గాంధారిని కట్టివేసి కొట్టెను. గాంధారి భేతాళుని ప్రత్యక్షము చేసికొని వాలుగొండపట్టణము నాశనముచేసి రమ్మనెను. వాడు వాలుగొండచేరి 'మొకమార్జన చేసి మూడుపుల్లల తిరుమణి,ముప్పందుం తిరుమణి నామందీర్చి, తాడిప్రమాణంగా చెరువుగట్టుమీద నిలుచుండెను.' మాంధాతరాజు వాని జూచి తాను పారిపోవుచు సేనానులకు వాని నెదుర్కొన నాజ్ఞాపించెను కాని భేతాళుడు 'తొలివీధి మలిపిరా వోరీ మలివీధి మ్రింగెను, యేమి రెండు గడియలకు ఏమి, పట్నమింత మ్రింగెను' భేతాళుడు గాంధారి చెంతకు వచ్చి ఆమెచే శాంతిబొందెను. గాంధారి తానేమియు నెరుగన ట్లూరకుండెను. ఇచ్చట వివాహముహూర్తము సమీపించెను. భేతాళుడు తిరిగి పోయినపిమ్మట మాంధాతరాజు తనపట్టణమునకు తిరిగివచ్చిపట్టణమునాశనమైనందుకు వగచి.తత్క్షణమే బయలుదేరి రావలసినదిగా కుమారునికి లేఖనంపెను. సుహితుడా యుత్తరమును చూచి కత్తితో గాంధారికి పెండ్లిచేసి తీసికొని రమ్మని నాగంభొట్లకు కత్తి నిచ్చి తన పట్టణమునకు వెడలి పోయెను.ఎత్తుకు పైయెత్తుగా గాంధారి పిండిబొమ్మను చేయించి దానితో కత్తికి పెండ్లిచేయించెను.గాంధారి తనను మోసగించి సుహితుని వివాహమాడినందులకు కుపితుడై బాలరాజు స్వదేశము తిరిగిపోవ నెంచెను. గాంధారీబాలరాజులకు ఈసమయమున జరిగిన సంవాదము ఏలపాటల రూపమున, తుమ్మెద పాటల రూపమున నర్మగర్భముగా నున్నది.గాంధారి బాలరాజును తనమేడపైకి రప్పించు కొనెను. ఆతడు కోరిన వన్నియు సమకూర్చెను. దేవేంద్రుని చెంతనుండి రెక్కల గుఱ్ఱములు తెప్పించుకొని ఇరువురు లేచిపోయి గంగయొడ్డున వ్రాలిరి. అచ్చట గాంధారి,భైరవుడు మరియు నితరశక్తుల సహాయమున నద్భుతకృత్యము లొనర్చినది. పోలురావులకడ వారొక పట్టణము నిర్మించిరి. వీరహనుమంతుడు మున్నగు వారు తారశిలవట్టణవీథుల కొన్నింటిని పెల్లగించి తెచ్చి ఇచ్చట పేటలు కోటలు నిలిపిరి.గాంధారీబాలరాజు లిచ్చట సుఖముగా నుండిరి.పద్మగంధికి వార్త తెలిసి తన సైన్యములను సహాయమిచ్చి తమ్ముని బాలరాజు మీదికి యుద్ధమునకు

పంపించెను.బాలరాజు వీరోచితముగా పోరాడి సుహితుని చంపెను. గాంధారి బాలరాజు కోరికపై పర్వతాలమల్లన్నను దలచి సుహితుని మరియు నాతని సేనలను మరల బ్రతికించెను. సుహితుడు గాంధారీబాలరాజుల తల్లిదండ్రులను పిలిపించి వారియివురికి పెండ్లిచేయించి తానెప్పటియట్లు సన్యాసమును స్వీకరించెను. గాంధారీబాలరాజులు సుఖముగా రాజ్యము లేలిరి.వింతవింతలగు నద్భుతములతో నమానుషశక్తులతో నిండియున్న ఈకథ సుఖాంతముగా ముగిసినది. కథ ఎప్పటిదైనను ఉర్దూ ఇంగ్లీషు పదములు, ఆధునికములగు ఫిరంగులవంటి ఆయుధముల పేర్లు ప్రవేశించినవి. జానపద గేయమునకీ లక్షణములు పరిపాటి.

జానపద గేయవాఙ్మయమున ననేకాద్భుతవిషయములకును అమానుష చర్యలకును ఆలవాలమైన కథలందు '*కాంభోజరాజు కథ*'ను మించిన దింకొకటి లేదని నిర్వివాదముగా చెప్పకొనవచ్చును. వచనరూపమున గూడ ముసలవ్వలీ కథను వినిపింతురు, ఈ కథయే మాయలోకమను పేర వెండితెర కెక్కినది. పలువురు ప్రచురణకర్త లీకథను ముద్రింపించిరి. గ్రంథాంతమున 'వ॥ ఈ కాంభోజరాజు కథ కృతిచేసినవారు *జంగం సుబ్బయ్యాదేవర* యీ పుణ్యకథ. కృతి జేసినారు కనుక పాడినవారికిన్ని వ్రాసినవారికిన్ని తొలగు దోషములు వచ్చు భాగ్యములు శుభమస్తు' అని కలదు. అద్భుతకథలం దన్నింట నుండెడు వివిధాద్భుతము లీ యొక్కకథయం దున్నవి. ఇట్టికథలం దిది యాదిమ కథ యైనచో దీనినుండియే కొన్ని కొన్ని యద్భుతలక్షణము లాయా కథలందు చేరినవని భావింపవచ్చును. లేదా యిట్టి యద్భుతకథా పరిణత స్వరూపమే కాంభోజరాజు కథయని భావింపవచ్చును. ఈ రెండును పరస్పరాధారాధేయ భావగర్భములు. ఈకథయందున్న అనేక విషయములు విమర్శకులను భ్రమల పాలుచేయగలవు. శ్రీ టేకుమళ్ళ కామేశ్వరరావుగారీ కథనుగూర్చి ఇట్లు వ్రాసి యున్నారు. 'ఈ జంగంకథ క్రీస్తు పూర్వం ఒక వెయ్యినాటిది కావచ్చు. ఆకాలం లో ఆంధ్రులు ఉత్తర హిందూదేశంలో కాంభోజదేశంలో ఉండేవారు. అప్పటికి ఈకథ రామాయణభారతకథలకంటె పూర్వమే! ఈ కథలో అటు తర్వాత గూడ చిల్లర మార్పులూ చేర్పులు జరిగి ఉండవచ్చు. కాబట్టి దీనిలో కనబడే 'రామ లక్ష్మణుల మందు' అనే మాటను పాటబాడే జంగాలు చేర్చినా చేర్చి ఉండవచ్చు. అట్లే మరికొన్ని చిల్లర అంశములు కూడాను[1]'.

ఈ వాక్యములను సమర్థించుటకై శ్రీ కామేశ్వరరావుగారు కాంభోజరాజు

1. బాల. మార్చి, 1953.

కథలోనున్న పలువిషయములను అనగా కాంభోజ కర్ణాటక శబ్దములను, కథాస్థలము, నాగులు, రాక్షసులు, దాసులు (Slaves) రామలింగస్వామి ప్రతిష్ఠ నరమేధము, అపనమ్మకములు, వలసలు, ఆయుర్వేదము, యంత్రములు, మతము, గ్రామనామములు, సాంఘికపరిస్థితులు మున్నగునవి యాధారముగా గొని అనేక వ్యాసములు ప్రకటించి యున్నారు1. శ్రీకామేశ్వరరావుగారి మతము సరియైనదనుటకుగాని కాదనుటకుగాని వారు వ్రాసినదానికన్న రెండింతలు వ్రాయ వలసివచ్చును. కాలము, కథారంగము, కవిప్రసక్తి జానపద వాఙ్మయమున నంతగా లెక్కింపదగినవి కావు. కనుక వివాదాస్పదవిషయములను విడిచి వేయుచున్నాను.

ఉత్తరాది యా భూమియందున తందాన కర్ణాటక భూమియందున
కాంబరీపురి పట్టణ మున్నాది ,,

అచ్చట కాంభోజరాజు పరిపాలించుచుండెను. అతనికి సర్వసంపదలు సమృద్ధిగా నుండెను. కాని సంతానము మాత్రము లేకుండెను. మొదట సూర్యకన్యక చంద్ర కన్యకవంటివారల అర్ధురక్కచెల్లెంద్ర వివాహమాడెను. వారివలన సంతానము కలుగనందున నేత్రవాది పట్టణపు రాజు కూతురు మాణిక్యాలదేవి నుద్వాహ మయ్యెను. ఈమెకుకూడ సంతానము కలుగదయ్యెను. రాజుగారు దానధర్మములు చేసిరి. సత్రములు గుళ్ళు గోపురములు కట్టించిరి. బావులు చెరువులు త్రవ్వించిరి. కాని లాభములేదయ్యెను. ఒక దసరా పండుగనాడు రాజుగారు పారువేటకై బయలుదేరిరి. ప్రజలానాడు

'కస్తూరితో కల్లాపు చల్లిరి తందాన తాన ముత్యాలతో ముగ్గు బెట్టిరి
మామిడాకుల తోరణము గట్టిరి ,, రాజు వేడుక చూచెదమనిరి
పట్నంవారియొక్క వణతులొచ్చిరి ,, వెలమవారి యా వణతులొచ్చిరి
కమ్మవారి యాకన్నిక లొచ్చిరి ,, కోమటి స్త్రీలు బ్రాహ్మణస్త్రీలు వచ్చిరి
బిడ్డలుగన్న తల్లులందరు ,, బిడ్డల నంతయు చంకబెట్టినారు
చేతుల బిడ్డల బెట్టుకున్నారు ,, భుజంమీద బిడ్డ లెక్కిరి'

త్రిమూర్తులు మున్నగువారు తమ దేవేరులతో అంబరవీథిని వచ్చి చేరిరి. వారు తమలోతాము ఈరాజు గొడ్డుబోతువా డనుకొనిరి రాజుగారికీ మాటలు వినబడెను. అతడు వెంటనే అంతఃపురమునకు వచ్చి చేరెను. భార్యలను పిలిపించి జరిగినది వినిపించి అందరమును చనిపోదమనెను. ఏడుగురు భార్యలు బయలుదేరి,

1. గృహలక్ష్మి, జూన్, జులై, ఆగస్టు, సెప్టెంబరు సంచికలు, 1954.

'అరణ్యముల బాట పట్టిరి తందాన తాన చీమలు దూరని యడవి దాటిరి
కాకులు దూరని యడవి దాటిరి ,, పుండ్ర[1] దండి గోవింద[2] వనములు
ఇంద్రాక్షల వనము దాటిరి ,, భద్రాక్షల[3] వనము దాటిరి

వన్యమృగములు వారిని జూచి పైదొలగి పోయెనేగాని భక్షింపవయ్యెను. అప్పుడు వారొక యగాధకూపము దరిజేరి పడుట కుద్యమించి ఇట్లు పలపించిరి.

'కైలాసము యెచ్చట నున్నదో తందాన తాన వైకుంఠము యెచ్చట నున్నదో
బ్రహ్మలోక మెచ్చట నున్నదో ,, నవబ్రహ్మలు యెచ్చట నున్నారో
మేము చేసిన దానధర్మములుగ ,, యేటిపాలు గాబోయె నిపుడు దా
బ్రహ్మదేవు డెచట నున్నాడో ,, వాని గుడియు రగిలి పోలేదో
కైలాసము రగిలి పోలేదో ,, విష్ణుమూర్తి చావకున్నాడా
వైకుంఠము రగిలి పోలేదో ,, ఏమి పాపము చేసినామయ్యా
అరణ్యములో మృతి జెందేము ,,

ఇదే సమయమున త్రిమూర్తుల వారి దేవేరులు పైనుండి పోవుచు వీరి శోకము వినిరి. పార్వతి అది భరింపజాలక లక్ష్మీసరస్వతులతో క్రిందికి దిగి వారిని మందలించి మీకు సంతానము కలుగగలదు, చావక తిరిగిపొండని పంపించెను. రాణులు తమ నగరము చేరుకొనిరి. దేవతలు బ్రహ్మదరికి జేరి కాంభోజరాజునకు సంతాన మొసగుమనిరి. బ్రహ్మ వల్లెయని వృద్ధబ్రాహ్మణవేషమున శాంబరీపురి చేరెను. రాజు సన్నిధికేగి 'ఆకలిచే యిప్పుడు అలసివచ్చితిని తందాన తాన స్వయంపాకము ఇప్పుడియ్యుము' అని కోరెను. రాజుగారాశ్చర్యపడి ఒక బ్రాహ్మణునకు తాను గట్టించిన సత్రములందు కూడు లభింపదయ్యెనా యని ప్రశ్నించెను. అందుల కాబ్రాహ్మణుడు నేను సత్రములందు తినను, నీవంటి పుణ్యాత్ములచేత స్వయంపాకము గ్రహించెద ననెను. రాజది విని నేను సంతానము లేనివాడను పుణ్యాత్ముడ గానవెను. బ్రాహ్మణుడు సంతానములేకుంట నీ పాపము కాదనియు శరణువేడి వచ్చిన నాగేంద్రుని నీతండ్రి చంపించెననియు నాగేంద్రశాపమే యిది యనియు దానికై రామలింగ స్వామి ప్రతిష్ఠ యొనర్చి తత్సన్నిధిని నీ భార్యలు కత్తులపై ప్రాణాచారముండిన సంతానము కలుగునని చెప్పి స్వయంపాక మర్థించెను. రాజు లోపలికి పోయివచ్చువరకు బ్రాహ్మణుడు తిరోహితుడై పోయెను. రాజుగారు రామలింగస్వామిని ప్రతిష్ఠించి కోనేరు త్రవ్వించి భార్యలను బ్రాహ్మణుడు చెప్పినట్లు ప్రాణాచార ముండుమనెను. అర్గురు రాణులటులే చేసిరి కాని పట్టపుదేవి (?) మాణిక్యాలదేవి మాత్రము-

1. పుండ్రము = పువ్వులగురివింద. 2. కోరింద? 3. నాగముష్టెలు.

'స్నానమందు చెమట పోతున్నదే తందాన తాన లేని భాగ్యము కలుగనే బోదు' అనియు, నల్ల రాళ్ళు సంతానమేమిచ్చుననియు; దేవతానింద యొనర్చెను. స్వామికి మాణిక్యాల దేవిపై అనుగ్రహము కలిగెను. తక్కిన యార్గురికి స్వప్నమున సాక్షాత్కరించి స్వామి సంతానఫలము లొసగెను. మాణిక్యాలదేవికి మాత్రము చిమ్ముటకు చీపురు, చెరుగుటకు చేట, తినుటకు తళియ నిచ్చెను. రాజు వారివారి స్వప్న వృత్తాంతములు వినెను. ఆర్గురి భార్యల నాదరించి పట్టపుదేవిని కోపించి ఊరిబయట నొక మేడలో నుంచెను. తక్కిన భార్యలకు గర్భములై నవ మాసములకు వారారుగురు పుత్రులను గనిరి. దైవజ్ఞులు వారి జాతకములు చూచి వారియందొక్కడును సింహాసన మెక్కుట కర్హుడు కాజాలడని చెప్పిరి. వారికి శతవద్ది రాజులని నామకరణ మొనర్చిరి. మాణిక్యాలదేవి తనకు పుత్రులు లేనందుకు ఆరాజకుమారుల నతి గారాబముతో జూచుచుండెను. అర్గురు రాణులకిది నచ్చ దయ్యెను. వారామెపై కుట్రబన్నిరి. విషాక్తభోజన మిడి కుమారుల చంప నెంచినదని రాజుతో కొండెములు చెప్పిరి. కాంభోజరాజు కుపితుడై మాణిక్యాల దేవిని భయంకరాటవిలో నొక చెర (బందె)లో బెట్టించెను. మాణిక్యాలదేవి తనకు కలిగిన స్థితికి విచారించి శివపంచాక్షరని దీక్షతో జపించెను. పార్వతి ప్రోత్సాహమున శివుడు జంగమవేషమున 'చెరబందె'కు వచ్చెను. అప్పటికా 'చెరబందె' 'పచ్చకెంపులు పసిడిపద్మములు, రవ్వలు పొదిగిన మేడలాయెను'. మాణిక్యాలదేవి యాపరమశివుని రెండువందల సంవత్సరములు బ్రతుకగలిగిన వాడును అనేకాద్భుతకృత్యములు చేయగలవాడును ప్రాణములు పోయినవారికి ప్రసాదించువాడునునగు పుత్రునిమ్మని వరమడిగెను. శివుడంగీకరించి తిరోహితు డయ్యెను. మాణిక్యాలదేవికి సద్యోగర్భమై తొమ్మిది గడియలకే ప్రసవ మాసన్న మయ్యెను. ఆమె ప్రసవమునకు ముగ్గురమ్మలు వచ్చిరి.

'తొమ్మిదవ గడియలోగాను తందాన తన బాలుడే ప్రసవ మవుతున్నాడు
లక్ష్మిదేవి బొడ్డుగోసెనయ్యా ,, సరస్వతి లాలలు పోసింది
పార్వతీదేవి సాన పరచెనయ్యా ,,

శిశువు జన్మించగనే సానపై వేసెడు ఆచార మిప్పటికిని తెలంగాణమున గలదు. సాన, రాళ్ళురప్పలకు చిహ్నము జన్మించిన తోడనే కష్టములు కడగండ్లు కలవవియు వాని నెదుర్కొనవలయు ననియు శిశువును రాళ్ళపై పరుండజేయు వాచారము సానపై పరుండజేయుటగా మారినదందురు. ఇటుల పద్మోమావాణీ దేవులు పరిచర్య లొనర్చిరి. బాలుని జాతకము జూచి నాల్గు గండములు వ్రాసి

వాని దీర్చుటకు నిశ్చయించుకొనిరి. చెరలో పుట్టినందుకు బాలునికి చెరాబంది రాజని నామకరణము చేసిరి. అలౌకికాద్భుతశక్తియుక్తుడు కాదగిన బాలుని వారించుట విడువక కైలాసమున బెంప నిశ్చయించి తల్లికి చెప్పి 12 ఏండ్లవరకు బాలునిపై మక్కువ కలుగకుండునట్లు చేసి కైలాసమునకు దోడ్కొనిపోయిరి చెరాబంది భవిష్యత్తు చేయగల యద్భుతకృత్యములకు గల కారణ మాతడు వరప్రసాది యగుట, దేవలోకమున బెరుగుట 12 సంవత్సరములు గడచినంత మాణిక్యాలదేవికి కుమారుడు జ్ఞప్తికివచ్చెను. ఈశ్వరుడు కాంభోజరాజుకు పుట్టిన పుండు సంగతి చెప్పి బాలునికి తగు ఔషధము లిచ్చి పంపించెను. చెరాబంది రాజు తన తల్లియగు మాణిక్యాల దేవిని చేరుకొనెను.

ఈకథ యిట్లుండగా కాంభోజరాజు పుత్రసమేతముగా నరణ్యమునకు వేటాడబోయెను. ఆసమయమున 'ముత్యమువంటి చినుకు' రాజుగారి వీపున బడి

వెలగపండంత బొబ్బ అయ్యెను తందాన తాన వొళ్ళంతా మరి అల్లుకున్నదయ్యా
పోట్లకు మరి తాళలేదయ్యా ,, చేతిమీదుగా రాజును తెస్తారు
యూగలైన ప్రాలుచున్నావి ,, మల్లెలైన మరి ప్రాలసాగెను
ఇనుమైనాలుగు రంధ్రాలు గలిగె ,, ఈ ఉలతోటి పొడిచినట్లుగా
పోట్లుగనుక యుధీకరించినావి ,,

ఎందరెందరో వ్రణవైద్యులు వచ్చి కోడికట్లు, మేకకట్లు కట్టినను నయము కాలేదు. 'నరకట్లుకై యాలోచించుచుండిరి. ఇంతలో చెరాబందిరాజు తల్లిగారి యనుమతి బొంది మందులవాని వేషముతో శాంబరీపురము చేరుకొనెను. అచట కుష్ఠువ్యాధితో బాధపడుచున గొల్లని నీరోగిని చేసెను. ఈవార్త పట్టణ మంతటను పొక్కిపోయెను. అతడు

'మందుల కావడి భుజమునందుపెట్టి, క్షత్రియ గొడుగు చేతబట్టెను
రాజవీధుల మందులమ్ముతాడు, మందులు మందులు మందులు యంటాను
మైలాబరిణి మందులంటాను, మచ్చుమాయలా మందులంటాను
మందులోను రామలక్ష్మణుల మందులంటాను, అటుకు మందు పోటుకు మందు
అగ్నిజ్వాల వ్రణముకు మందు, మేహపైత్యానికి మందువున్నాది
వొల్లుపోట్లకి మందు వున్నాది, శిరోవాయువునకు మందు వున్నాది
మనోవ్యాధులకు మందు వున్నాది, కాటిలోపల జిల్లెడేరు
ఏటి యొడ్డునా మునుగబంకా, పెద్దగబ్బిలాల పేరైన తైలాలు
ఈమందు గొనే పుణ్యాత్ము లెవ్వరో, ఈ మందుగొనే ధర్మాత్ము లెవ్వరో'

యని వాడవాడలు తిరుగుచుండెడు. ఈతని మాటలు విన్నంతనే రాజుగారి

వ్రణమందున్న పురుగు'ముచ్చ మూలిగి పండుకున్నదయ్యా'.రాజుగా రాబాలుని మాట విన్నంతనే బాధ నిమ్మళించినందున తన్మాహాత్మ్యమును గని యాతని పట్టితెండని కుమారుల నంపెను. రాజకుమారులు వచ్చి బాలుని గొనిపోయిరి. మందుకై బాలుడు 'ఊగనిమాను ఆకు కావలెను,తొణకని బావి నీరు కావలెను, ఆకాశాన పక్షి కావలెను, పగడపుతీగ పాలు కావలెను, ఎలుగుగొడ్డది వెన్న కావలె, పెద్దపులి పెరుగే కావాలె, పులిజున్ను పుట్టతేనె కావాలె, మాటలాడే తమలపాకు కావాలె, పోట్లాడే పోకలు కావాలె, సూక్ష్మము చెప్పే సున్నము కావాలె, అంత్రమధ్యము నీళ్ళు కావాలె, కన్యపడుచు కనుగ్రుడ్లు కావాలె'అని యసాధ్యములగు విషయముల దెల్పెను. బాలుడు రాజుగారి తొడవులు తీసికొని, అతని సింహాసన మధిష్ఠించి, 'సిఖావుంగరము' గొని మందు ప్రారంభించెను. 15 దినములలో వ్రణము సగము మానిపోయెను. ఇక సగము మాత్రము మిగిలెను.అప్పుడా బాలుడు తనచెంత మందులేదని'ఏడేడుసముద్రాల నడుమను, యోజనగంధి మేడ వున్నాది, యోజనగంధి దగ్గర గనుకాను, మాట లాడెడి మందు వున్నదయ్యా. మాటలాడెడి మందు కావాలె,తెప్పించుమీ కాంభోజరాజా' యనెను

తండ్రిగారికి 45 దినములలో మందు తెచ్చుటకై ఆర్గురు రాజకుమారులు బయలుదేరిరి ఒకచో సమాధిలోనున్న ఋషీశ్వరుని వారు మూర్ఖులై మందుజాడ తెల్పుమని రాళ్ళురప్పలతో కొట్టి బాధించిరి.వారిగర్వ మణచుటకై మునీశ్వరుడు తానేపురియం దుండెడు బోగము రంగసాని జాడలెరిగించి'రంగసానివో దగ్గర గనుకాను, నిర్మల మనియేటి మందు వున్నదయ్యా'యని యెరింగించెను. వారు తానేపుటకి ప్రయాణమైరి. బోగము రంగసాని 33 విద్య లెరిగినది. తన విద్యా ప్రభావమున నది అనేకరాజకుమారులను జయించి దాసులనుగా చేసికొనెను. ఈరాజకుమారులు కూడ రంగసానిచే పరాభూతులై దాసులైన పట్టున కొంత హాస్యరసము కూడ కలదు. రాజకుమారులు పెట్టిపోయిన గడువు మీరెను. కాంభోజరాజు బాలవైద్యునితో నీవే మందు తెచ్చి,నా కొడుకులను నాకు కనబరచి నా రాజ్యము నేలుకొమ్మని చెప్పెను.

చెరాబందిరా జక్కడినుండి బయలుదేరి మరల తన తల్లిచెంతకు వచ్చి యనుజ్ఞ వడసెను. మాణిక్యాలదేవి కుమారుని దీవించి పంపెను. చెరాబంది రాజు తొలుత 'రాక్షసపురిపట్టణము' చేరుకొనెను.అచ్చట రాక్షసులు రత్నాలగంధి యనునొక బ్రాహ్మణకన్యను పాకుచుండిరి. ఆమె ఈడేరినది. కాని యామెను

పెండ్లి యాడవచ్చిన ప్రతివరుడును మరణించుచుండెను. రాక్షసుల కట్టివాహార మగుచుండిరి. రత్నాలగంధి బాలుని జూచి మోహించి తన యాయువే వాని బల్లిగా మార్చుటన నగరునందుంచుకొని కొన్నిదినములకు రాక్షసుల యనుజ్ఞబడసి సప్తసముద్రములు దాటి పొమ్మనెను రాజకుమారుడు కీలుగుఱ్ఱమెక్కి వీరభద్రుని గుడిచెంత జేరెను. వీరభద్రుని స్తోత్రమొనర్చ ప్రత్యక్ష మొనర్చుకొనెను. వీరభద్రుడు యోజనగంధి శిరమందున్న కరాటమున మాట్లాడెడు మందున్న దనియు నక మూడుదినములే ఆమె నిద్రించు సమయమనియు ఈ దినములందు మందు తీసికొనవలెనో మరల నారునెలలామె మెలకువతో నున్నప్పుడది యసాధ్య మనియు బాలునికి పావుకోళ్లనిచ్చి పొమ్మనెను చెరాబండిరాజు పావుకోళ్ళుధరించి, కీలుగుఱ్ఱమెక్కి, యోజనగంధి మేడ చొచ్చుకొనిపోయి, యట కావలియున్న రాక్షసులను మోసగించి, మందు తీసికొని, తన వర్తమాన మొక కమ్మపై వ్రాసి యటనుంచి, యోజనగంధికి సంభోగచిహ్నము లలది బయలుదేరెను ఇంతలో యోజనగంధి మేలుకొని జరిగిన మోసము గ్రహించి బాలుని వెన్నంటి 'పంపుల పాలకి తాను యెక్కించి, మేఘమండలమున తాను వస్తున్నాది'. బాలుడు వీరభద్రుని జేరుకొనెను. బాలుని చంపుటకు వచ్చిన యోజనగంధిని వీరభద్రుడు 32 ఆయుధములతో నెదిరించెను. బాలుని యందము జూచి యోజనగంధి కోపముకూడ చల్లారెను. వీరభద్రుడు వారిరువురికి వివాహ మొనర్చెను. అప్పుడా బాలుడు వీరభద్ర స్వామితో 'మందు దొరకే గుఱ్ఱం దొరికెను, మాతల్లికి యిద్దరు కోడండ్రొచ్చిరి, మాయన్న లుండేటి పోబడి[1] చెప్పు' మనెను. వీరభద్రుడు చెరాబండిరాజుకు రంగసాని జాడ తెరిగించి దాని 33 విద్యల మోసము తెరిగించి దాని జయించుటకు 'సంహారకాలపు దుడ్డు'ను, 'మాయకత్తెర'నిచ్చెను. బాలుడు వాని సహాయమున రంగసాని నోడించి అన్నల చెర విడిపించి రంగసానిని పరిగ్రహించి తానేస్వరి పట్టము కట్టుకొని అన్నలతో రంగసానితో మరల వీరభద్రుని గుడికి వచ్చెను. అప్పుడు యోజనగంధిని కలిసికొని వీరభద్రుని సెలవంది బయలుదేరిరి. అర్ధురన లకు చెరాబండిరాజు తమ తమ్ముడని తెలిసి, తమకు వానిచే ప్రమాదము సంభవించునని తలంచి, మార్గమధ్యమున చంప నిశ్చయించిరి అందరు కలసి రాక్షసపురి చేరి రత్నగంధిని తోడ్కొని బయలుదేరిరి. చెరాబండి తొలుత తన తల్లియున్న యడవికి ప్రయాణమయ్యెను. ఆర్ధురన్న లదేసమయమని చెరాబండి గొంతు

1, పోయిన జాడ

కోసిరి. కాని యోజనగంధి మాటలాడు మందుచే నాతని బ్రతికించెను. చెరాబంది తల్లిచెంత జేరి కోదండమును చూపించి ఆశీస్సులందుకొని కాంబరీపురి చేరి రాజుగారికి మందుకట్టెను కాంభోజరా జెప్పటియట్ల ఆరోగ్యవంతుడై చెరాబంది తన పుత్రుడని తెలిసికొని మాణిక్యాలదేవి మేడకు వచ్చెను చెరాబంది తన పుత్రుడగునో కాదోయని రాజు మాణిక్యాల దేవిని అద్భుత కార్యముల పరీక్షించి వారినందరిని దోడ్కొని నగరునకు చేరెను. చెరాబంది రాజుకు పట్టము గట్టెను. అందరు సుఖముగా నుండిరి. ఇది కథ. ఇన్ని యలౌకికాద్భుతవిశేషము లేకథయందును లేవు. జానపదు లిట్టి యద్భుతములను మహోత్సాహముతో నాదరింతురు.

ఒకటిరెం డద్భుతవిషయములు గలిగి పాతివ్రత్య మహిమమును భారతీయస్త్రీల సౌశీల్యమును చేయెత్తి చాటెడుగాధ '*ధర్మాంగద పాముపాట*'. స్త్రీలయందీ గేయ మధికప్రచారము గాంచినది. అనేకకవు లీపాటను చేపట్టుటయే దీని సార్వజనీనతను చాటును. ఇంతవర కచ్చయినవి రెండుపాటలు. ఒకటి పూరి నారాయణరాజు రచించిన '*ధర్మాంగద చరిత్ర పాముపాట*' పెద్దపాట. ఇది మొదట నెప్పుడు ముద్రింపబడెనో కాని నాకు లభించినవి రెండు ప్రతులు ఒకటి వెస్టువార్డు కంపెనీవారు 1929లో ప్రకటించినది. దీనినే యన్ వి.గోపాల్ అండ్ కోవారు 1935 లో ముద్రించిరి. ఈ రెండును ఒకటే; అనగా నారాయణరాజు కృతులే. ఇక రెండవది గుండు జగన్నాధం వారు 1932 లో ప్రకటించిన చిన్నపాట.నారాయణరాజు కృతి యొక చిన్న ప్రబంధమంత కలదు. కాని ఈరెండవ పాట మొదటిదానిలో నాల్గవ వంతున్నది. ఈరెండవ పాట వ్రాసినదెవరో తెలియదు కాని స్త్రీకర్తృకమని నాయభిప్రాయము. నారాయణ రాజు రచన ప్రబంధమార్గమున నడచినది.రెండవది సరళముగా ఔచితీవంతముగా నున్నది.ఈరెంటికిగల భేదములు తరువాత విచారింతము. ఈరెండు ముద్రితము లగు గేయములుగాక అముద్రితమగు ద్విపదరచన మొకటి కలదు. బొమ్మకంటి నరసింహ కవి యనునాతడు '*ధర్మాంగధ చరిత*' మను పేర నీకథను ద్విపదగా వ్రాసెను. ఇది తాళపత్ర గ్రంథము 1.

మొదట నారాయణరాజు కృతిని విమర్శించి తరువాత తక్కినవాని నారయుదము.కృతికర్త 'తాత వెంకటరాజు తమ యవ్వ జగ్గమ్మ,తండ్రిపాపయరాజుతల్లి

1. దీనిని నేను ధూళిమిట్ట గ్రామమున మా మేనమామలింట 1950 వ సంవత్సరమున సంపాదించితిని.

జగ్గమ్మ'యనిచెప్పు కొనెను. తాత తండ్రులు గట్ట్యాడకోరామున నివసించిరట. తన కాలమునకు సతిపాదమతము కాపురమయ్యెను. ఈ నారాయణరాజు విజయనగర విజయరామగజపతి మహారాజు సమకాలీనుడు గ్రంధకర్త యింటిపేరు పూరివారు. కవి తనకావ్యము పూర్తియైనటుల చెప్పిన భవ సంవత్సరము క్రీ.శ. 1874 అగును విజయరామగజపతి సమకాలికుడనుట కిది సరిపోవుచున్నది. ఈతని యముద్రిత రచనము *సారంగధర పదము*. కుశలాయకమును రచించిన పూరి రామచంద్రరాజుకు కూడ 'తండ్రి పాపయరాజు, తల్లి జగ్గమ్మ'లు. నారాయణ రాజు రామచంద్రరాజు తన అన్నగారని ధర్మాంగద చరిత్రలో చెప్పుకొని యున్నాడు. కర్త 'సకల శాస్త్రములెల్ల చాల నేశోధించి, ఈ కథను చెప్పుదును ఇది పూర్తి గాను' అనియును "*ఆశ్చర్య కథ కనుక అందరికి తెలియంగ* పదము జెప్పెదనయ్య ముదము తోడుతను' అనియును, 'భవ సంవత్సర భాను చైత్రము నందు, శుద్ధ పాడ్యమి సరికి సొంపుగా నయ్యె, సారెకును నీ పూరి నారాయణరాజు, యీకథను తెలిగించె యెలమి మీరగను' అనియు చెప్పెను. కాని మూలకథ యెందున్నదో తెలియరాదు. ఈ గ్రంథమున నహల్య గౌతమునితో నొక వీరపతివ్రత గాధ చెప్పుమన నాతడీకథను చెప్పినట్లున్నది.

కాశ్మీరదేశమును కనకాపురము రాజధానిగా ధర్మాంగదరాజు పాలించు చుండెను. ఆ నగరమున

'సంగీత సాహిత్య సరసవిద్యలు గలిగి, వేదములు వల్లించు విప్రులే గలరు
చదువు సాములచేత చాల పెంపొందుచును, రాజు లా పురిలోన తేజముగ గలరు
అలకుబేరుని రాజ్య మతని పట్టణమెల్ల, కుదువబట్టగ జాలు కోమట్లు గలరు
పలుకు బొంకులు లేక పలుసంపదలతోను, శూద్రు లాపురిలోను సొంపొందగలరు.'

ఈ తీరుగా చాతుర్వర్ణ్య, గజ, హయ, వేశ్యా, వన వర్ణనము లున్నవి. ఇక ధర్మాంగదుని ధర్మప్రభుత్వ మిట్లుండెను.

'పెద్దలుండగా చావు పిన్నలకు లేదాయె, ఆరాజు పాలన మదియేమొ కాని
పేదసాదలు లేరు భిక్షుకులు లేరాయె, ఊరూర శుభములు కోరి చూడగను
ధర్మాంగదుండేలు ధరణిలో ప్రజలకు, ధర్మబుద్ధులుగాని తటవిటలు లేవు'.

ధర్మాంగదుని పట్టపుదేవి అర్మిలీదేవి. రాజుగారికి చాలకాలమువరకు సంతానము లేదయ్యెను. దైవయోగమున నర్మిలీదేవి గర్భము ధరించెను. నవమాసముల తరువాత ఏమి కారణమో కాని 'రెండు నాలుకలతో నిండు పడగను గల్గి, చిట్టు బుస్సుమనుచు శేషుండు బుట్టె.' ఇట్టివైపరీత్యమునకు రాజదంపతులు దుఃఖించిరి.

రాజు మంత్రిగారితో నాలోచించి 'పుత్రుడు పుట్టెనని పురములో చాటించి, భూరి దానము లిమ్ము భూసురావళికి, లేకున్న నపకీర్తి లోకమున మనకబ్బు, నాడికలు సమకూడు నపకీర్తి వచ్చు' నని ఈవిషయమును రహస్యముగా నుంచెను. కొన్నాళ్ళకు నానాదేశరాజులు ధర్మాంగదునితో వియ్యమంద దలచి జాబులు వ్రాసిరి రాజుగారు మంత్రితో నాలోచించి ఉచితరీతి సమాధానము లంపెను రూప సౌందర్యకులగోత్రముల తగిన కన్యకను విచారింప బ్రాహ్మణులను పయన మొనర్చి వియ్యాలవారితో తమ వంశాచార మిట్లు చెప్పుమనిరి. 'తమ చేతి కత్తికి తగ బాసిగము కట్టి, సకల సంభ్రమములతో చాల తర్లించి, కత్తికిని కాంతకును కరమొప్ప తలబ్రాలు. పోయించి తగ పెండ్లి చేయించి యుంచెదరు'. కన్య నన్వేషించుచు బ్రాహ్మణులు 'అంగవంగ కళింగ బంగాళ నేపాల, పాంచాల మళయాళ బహురాజులిండ్ల, కాంభోజ సింహాళ కామరూపాధీశ, పాంచాల సౌవీర జననాథులిండ్ల, మాళవ మహారాష్ట్ర మళయాళ కురుభోజ, ద్రవిడాంధ్ర కర్ణాట ధరణీశు లిండ్లు' మొదలుగా 34 దేశములు తిరిగిరి. ఈవర్ణనము పూర్తిగా కావ్యములం దుండునట్టిది. వారు తిరిగి సౌరాష్ట్ర దేశమున మాణిక్యపురమున రత్నాంగుడను రాజుగారింటికి పోయిరి. అతని కూతురు త్రైలోక్యసుందరిని చూచిరి. ఇచ్చట సుందరి వర్ణనము మూడుపుటలు ప్రబంధరీతి నున్నది. సుందరి యాబ్రాహ్మణులకు నచ్చినది. వారు రత్నాంగునితో తమరాజుగారి యాచారములను చెప్పి కన్య నిమ్మని కోరిరి. రత్నాంగుడందుల కంగీకరించి తన పురోహితులను వరుని జూడ పంపించెను. వచ్చిన బ్రాహ్మణులకు ధర్మాంగదుని మంత్రి తన కుమారుని జూపించి యీతడే రాకుమారుడని చెప్పి మోసగించెను. వివాహము నిశ్చయమయ్యెను. ధర్మాంగదుడు కత్తినిచ్చి మంత్రిని బంపెను. మాణిక్యపురస్త్రీలు వరుని జూచుటకై 'కొప్పులే వీడంగ కుచము లల్లాడంగ, నడుములే యసియాడ నవక మలరగను. పయ్యెదలు జారంగ పరుగెత్తి వచ్చి' రట. పురస్త్రీలీ వింతపెండ్లిని పలువురు పలువిధములుగా చెప్పుకొనిరి. పెండ్లి జరిగిపోయినది.

కోడలిని అత్తమామలు చక్కగా నాదరించి పుత్రనిర్విశేషముగా బెంచిరి. సుందరి పెద్దదై పతిచింతగలిగి ఇన్నాళ్ళకుగూడ నాతని గాంచనైతినని ఆలోచించి కొన్నాళ్ళు లోలోన మధనపడి చివరకు తన చెలికత్తె నడిగెను. ఆమె రహస్యమును చెప్పెను. సుందరి ధైర్యము తెచ్చుకొని అత్తగారి నడిగి తన విభుని జూపకున్నచో ప్రాణములు విడుతువనెను. అరుంధతీదేవి దుఃఖించి చేయునది లేక

'పణతిరో నీవిభుడు ఫణిరాజు చూడుమని, దాని సుందరి యెదుట ధరణిపై డించె'ను. ఆమె మూతదీసి కదలింపగా ఫణి 'నాలుకలు గోరుచును నాతిపై నురుకంగ, దబ్బునను సుందరి ధరణిపై బడెను, మొదలు తెగిపోయిన కదళికా తరువట్లు, నిలుచున్న పాటుననె నెలత పడిపోయె'ను. తరువాత సుందరి అత్తను "నీవంటి పాపిష్ఠి ఏలోకమున లేను, పాముకై నన్నిటకు పట్టి తెచ్చితివి, నీయొద్ద నున్నట్టి నెలతకు నైనను, కనికరము లేదాయె కఠినాత్మురాలా, పూర్వజన్మము నందు పొలతిరో మీరట్లు, ఈలాటి కార్యములు ఎన్నిజేసితిరొ' అని అత్తగారిని నిందించి 'పతిలేని యిటివంటు పడతి యౌవనమేల, పాడింట దీపంబు వగిదిగా నుండు, విభుని సౌఖ్యము లేని వెలది శృంగారంబు, అడవిలోపల నెమళ్ళాడి నట్లుండు. పతిసతియు నిద్దరును పవ్వళింపని బ్రతుకు, అడవిగాచిన వెన్నెలట్లుగా నుండు'నని తను తాను నిందించుకొని 'నాకు విభుడైనట్టి నాగారాజునితోను, దివ్యతిరుపతులెల్ల తిరుగివచ్చెదను,మంచి చెడ్డని మరి మాట చెప్పక మీరు,పాము పెట్టెయు దెమ్మి పడతిరో యనుచు' నత్తగారి నడిగెను. అర్మలీదేవి 'ఈ పేరు బెట్టుకొని యిల్లు వెడలుచు నిపుడు, పాము నొకపుట్టలో పారంగదోలి,వ్యభిచారమై నీవు వర్తించుటకు నిపుడు,ఈబొంకు బొంకితివి ఇది నిజముకా'దని దూషించెను. ఇంతలో మామగారు వచ్చి దుఃఖించి సుందరిని పోవలదని బతిమాలెను; కాని సుందరి మామగారిని మెప్పించి నాగేంద్రుని తీసికొని కాలినడక దివ్యక్షేత్రములు తిరుగ బయలుదేరెను.

సుందరి విరాగిణీవేషము ధరించి తలపై పాముబుట్ట నుంచుకొని సకల దివ్యక్షేత్రములు తిరిగెను ఈ పట్టున 116 దివ్యస్థలములు వర్ణింప బడినవి. సుందరి నైమిశారణ్యము చేరుకొని మాండవ్యాదిఋషుల దర్శించి తన గాథను వినిపించినది.మునులు'దివ్య తిరుపతులంత తిరిగినానంటివి,పేరు పేరులు మాకు కోరి చెప్పుముగా, ఘనపతివ్రత నీవు గనుక నీనోటను, వాటి వివరము వినిన కోటి పుణ్యంబు. పుణ్యంబు మాకబ్బు పొలతి నీనోము, తిరుపతులను తేటగా దెల్పు'మని వేడిరి. ఆమె వారికి తాను తిరిగిన దివ్యస్థలములు చెప్పెను. మునులు ఆమెను కరుణించి దివ్యదృష్టితో జూచి నాగరాజు పూర్వజన్మ వృత్తాంతము నిట్లు చెప్పిరి. 'పూర్వజన్మమునందు పుడమికిని రాజితడు, యేడుదీవులు తాను ఏక చక్రింబు, ఎదురెవ్వరును లేక యేలుచుండెను, కొంతకాలంబునకు నితడు కావరంబునను, బ్రాహ్మణుల భూములు పండనివ్వక తాను, అతుకుబడి గాకుండ అట్టెలను బెట్టె, బ్రాహ్మణుల శాపమున పాము రూపము కల్గె'. ఆశాప విమోచనకై

'పడమటంబుధి దరిని ధర్మగుండము కలదు, పాముపెట్టెతో కూడి పణతిరో నీవు, తడయకను స్నానంబు తరుణి చేసితివేని, నాతిరో ఈ పాము నరనాథుడౌ' నని చెప్పిరి. సుందరి మునుల సెలవంది, దేశదేశములు గడచి వారు చెప్పిన జాడనుపట్టి నడువ దొడగెను.

ఆమె 'నాగపున్నాగ మనంటి మామిడిచెట్లు, శాల్మలీ మాకంద చంపకంబులును, తింత్రిణీ వట కుంద తియ్యమామిడిచెట్లు, తాల హింతాలాది తరువులే చూస్తు' పయనించెను. 'ఏనుగులు సింహములు ఏకమై యొకచోట, చెలగి యాడుచు నున్న చేష్టలే చూచి, జాతివైరము లేదు జంతుజాలంబునకు, ఇది పుణ్యభూమనుచు ఇంతి మెచ్చుచును' నడచి గంగను సమీపించి తన కష్టముల దలచికొని ప్రాణ త్యాగము చేయనెంచి గంగలో దిగెను. ఆకాశవాణి యామెను వారించి గంగా మాహాత్మ్య మెఱిగించి యా సమీపముననున్న బ్రహ్మగుండమున 'నాగరాజును యిపుడు జాగుసేయకను, కంఠమున దాల్చి యీ గంగలో మునిగితే, నాగరాజు యిపుడు నరనాథుడౌ'నని పల్కెను. సుందరి యమితానందమంది గంగకు మ్రొక్కి యటులే చేసెను. నాగరాజు నవమన్మథాకారుడైన రాజకుమారుడయ్యెను. అతని యందచందములజూచి సుందరి మూర్ఛిల్లి తేరుకొని 'సలలిత గుణజాల సద్ధర్మశీల, కలిగితివి ఇప్పుడు కరుణాలవాల, నవమన్మథాకార నరలోక జనవంద్య, రమణీయగుణసాంద్ర రాజదేవేంద్ర, నిన్ను నమ్మితి చాల నీకునే నిల్లాల. మన్మథుని బాధకు మరి తాళజాల'ననెను. రాజకుమారుడు నీవెవరో నేనెరుగను పొమ్మనెను. సుందరి తన కథ యంతయు జెప్పెను. ఐనను రాజకుమారుడు నమ్మకయ్యెను. సుందరి యాకాశవాణిని వేడుకొన 'ఓ రాజదేవేంద్ర ఒప్పుగా వినవయ్య, ఆబాల మాటలు అంతయును నిజమ'నిపలికెను. రాజకుమారు డామెను పరిగ్రహించి యచట నున్న బ్రాహ్మణులవలన నాగంగ (బ్రహ్మగుండము) ప్రభావమెఱిగి చెంతనున్న ధర్మపురిలో నృసింహాలయమున నారాత్రి నివసించెను. తెల్లవారి యాదంపతులు బయలుదేరి దేశదేశములు గడచి మాణిక్యపురము చేరిరి. ఆమె తన కథను తన తల్లిదండ్రులకు వినిపించెను. రత్నాంగుడు కోపించి 'చతురంగబలముతో అతివేగమున వెళ్ళి, ధర్మాంగు పురిమీద దండెత్తవలె'నని నిశ్చయించెను. సుందరి తండ్రితో తనను అత్తవారింటికి దోడ్కొనిపోయి వారికి తగురీతిగా చెప్పి మరల నారాజకుమారునితో పెండ్లిచేయింపుమని కోరెను. రత్నాంగుడు సమస్తసేనలతో నూత్నదంపతులతో కాశ్మీరముపై దండెత్తి వెడలెను. అల్లుని బిడ్డను చూపించుమని ధర్మాంగునికడకు రాయబారమంపెను.

ధర్మాంగుడు భయపడి రత్నాంగునితో జరిగినదంతయు దాచక చెప్పి మన్నించు మనెను.రత్నాంగుడు దేశదేశరాజులను పిలిచి బిడ్డచే కథయంతయు చెప్పించెను. చివరకామె 'ఫణిరాజువలెనుండు నాథుకంఠము తీరు, నాలుకలు రెండుండు నా నాథుకిప్పుడు' చూడుడనెను.అందరును నమ్మిరి కాని ధర్మాంగుడు నమ్మడయ్యెను. సుందరి ప్రార్థింప మరల నాకాశవాణి సాక్ష్యమిచ్చెను. నాగరాజు పేరు చిత్రాంగుడని ఆకాశవాణి యనెను.బ్రహ్మాదులు ప్రత్యక్షమై సుందరీచిత్రాంగుల వివాహము చేయించిరి .దేవతలు వరములిచ్చిరి.కామధేనువు పెండ్లిసమయమున భోజనములు సమకూర్చెను. చిత్రాంగదుని పట్టాభిషేకముకూడ జరిగెను. వసిష్ఠుడు మంత్రములు చదివెను. 'చిత్రాంగదుని కీర్తి చిన్నెలోయనగ, దివ్య తిరుపతులందు దీపములు ప్రజ్వరిల్లె'ను. దేవతలు సెలవందుకొని తిరిగి పోయిరి. చిత్రాంగదుడు ప్రజలను చక్కగా పాలించెను ఇది గౌతము డహల్యకు వినిపించినకథ.చివరన 'హరిహరీ నారాయణాదినారాయణా కరుణించి మమ్మేలు కమల లోచనుడా'యని కలదు.

ఇక రెండవ'*ధర్మాంగధ చరిత్రము-పాముపాట*'నుగూర్చి విచారింతము. రెండింట సమాన మగుటజేసి కథను పేర్కొన నవసరము లేదు.పైపాటకును దీనికినిగల భేదమును మాత్రము తెలిసికొందము. ఇది పైపాటకన్న చాల చిన్న పాట, స్త్రీలు పాడుకొనునట్లు మంజరీద్విపదయందు చిన్నగా సరళమైన భాషలో వ్రాయబడి యున్నది. రచన మెవ్వరిదో తెలియదుగాని స్త్రీ కర్తృకమై యుండును. మొదటిదానికన్న నిది ఔచితీవంతము. మొదటిదానిలో గౌతము డీకథ నహల్యకు వినిపించినట్లున్నది. దీనిలో 'సూతపౌరాణికుడు శౌనకాదులకు, చోద్యంబుగా జెప్పె ఈకథను మున్ను'అని కలదు. దీనికి మూలము సంస్కృత మందో లేదా మరింకేభాషయందో యుండియుండును. కాని యిట స్పష్టముగా తెలియుటలేదు. ఈరెండవపాట ఔచితీవంతముగా నున్నదనుటకు కారణము లివి.మొదటి పాటలో సుందరి తన భర్తను గానక ధైర్యముతో నత్తగారిని సమీపించి నా భర్త ఎచ్చట నున్నాడని తెగవేసి తనకుతానై యడిగెను;కాని ఈ పాటలో సుందరి భర్తనుగూర్చిన చింతతోనుండ అర్కిలీదేవి కోడలిని'నా ముద్దు కోడలా నాగృహలక్ష్మి, నాభాగ్యదైవమా నా మూలధనమా. నీ విట్లు శోకింప కారణంబేమి, సఖులెవ్వరైనను మారాడినారా, మామగా రేమైన మాటాడినారా, నీమదిలో గల చింతల నాకు' దెల్పుమని ప్రశ్నించిన తరువాత సుందరి అత్త గారిని గౌరవించి 'కొదువేమి లేదు మరి కొరత గలదొకటి, నాభర్త సేవకు నా

ప్రాణములను, అర్పించుటకు లేని చింత చేసేను' అని వినయముతో చెప్పినవి. ఇది స్త్రీజనోచితముగా నున్నది. మొదటి పాటలో లేని విషయ మిందొకటి ఈ తరుణమున గలదు. ధరాంగుని కోడలి చింత తెలిసినంతనే తాత్కాలికముగా నాపత్తు తప్పించుకొనుటకై, మరి కొంతకాలము ఇటులే గడుపుటకై 'మన యింటి వాడుక కత్తికి పెండ్లి, చేసిన యటుమీద కమలాక్షవ్రతము, చైత్ర పాడ్యమి చిత్త నక్షత్రమునను, ప్రారంభించె ము సంవత్సరమున, ఉద్యాపనము జేసి యైననుగాని, భర్తను కనులెత్తి చూడంగరాదు, ఇంతకు జూచిన అర్థాయువగును, ఈ రీతి కులగురు నాజ్ఞ గల' దని తప్పించు కొనెను ఈ విషయము క్రొత్తకల్పనమే. మొదటి పాటలో తన భర్త నాగరాజని తెలిసినంత సుందరి అత్తమామల మాషించినట్లుండ ఈ రెండవ పాటలో 'అత్తమామలకును కటణంబు జేసి, ఇట్లని పల్కెను ఇంపుగా నపుడు, అత్తమ్మ నీమనసు అలుకి చెంది, తలపింపరాదమ్మ దుఃఖమాయెను. నీవేసు చేయుదు నానోము ఫలము నాకుగగ్గెనుగాని చింతింపవలదు. నాభర్త శేషమూర్తిని కృపతోడ, నాకిచ్చిపంపుడు వ్యసనంబు మాని' యని జతిమాలి సెలవంది వెడలినట్లున ది. మొదటిపాటలో అర్కలీదేవి కోడలిని నీవెట లేచిపోవ జూచుచున్నావని నిందించెను. కాని యిందుల నటుల లేదు. మొదటిపాటలో చిరాంగుని శాపకారణము బ్రాహ్మణాగ్రహారములను లాగుకొనుట యని చెప్పబడినది కాని దీనిలో మునులామెతో 'అతడును నీవును అడవులకును బోయి, వేటాడుచుండగా విప్రు డొకరుండు, అడవుల కేతెంచి యొకచెట్టుక్రింద, కూర్చుండి యుండంగ కొమ్మలో నీవు, తెలియక పామును పడవేసినంత, ఆపాము విప్రుని ముందట బడగా, భయమొంది శాపంబు బెట్టెను నీకు, మరుజన్మమందున కొన్నాళ్ళు నీవు, పామును భర్తగా బడయుదువనుచు' చెప్పిరి ఈ శాపకారణమే సమంజసముగా నున్నది. ఇది సుందరికి కలిగిన శాపము. అర్కలీదేవికి గూడ శాపముండెను లేనిచో ఆమె పాముచేల గనపలెను? దానికి కారణము మునులు సుందరితో నిట్లనిరి. 'పూర్వమున మీ అత్తమామలు భువిని, రాజ్యంబు లేలిరి రాజులు మెచ్చ, ఆకాలమందున నాగభూషణుకు. నాగాభరణములు సేయంగ నెంచి, భక్తుడొకడు వానికెంతకు వచ్చి, ధనసహాయము నాగభూషణంబులకు, దయచేయుడని వేడ నారాజు పల్కె, నాగములు పుట్టలో ననేకములుగలవు, నైకొని శివునకు నర్పింపుమనియె, అప్పుడాతని పత్ని నవ్వుచునుండె, కావున వారికి నాగంబు బుట్టె'. ఇదికూడ సమంజసముగానే యున్నది. ఇట్టి భేదములే కాక

మొదటిది పెద్దగా నుండుటచేతను, రచయిత (పురుషుడు) కొంత చదువుకొన్న వాడగుటచేతను. పాట కొంత ముదురుపాకమున బడినది. కావ్యధోరణి ప్రవేశించినది. వర్ణనములు దీర్ఘములు; భాష కొంత జానపదేతరము. శృంగార మచ్చేలము కాని ఈచిన్నపాట పైవిషయములందు దానికి భిన్నము. సరళమగు భాషలో స్త్రీలు పాడుకొనుటకు ఔచిత్యశోభితముగా సాగినది దీనికే ప్రచార మెక్కువ.

ఇక నేను సేకరించిన తాళపత్ర గ్రంథము సంగతి. ఇది మంజరీద్విపదలో నున్నది. ఆరంభమందలి చరణములు కొన్ని ఉదాహరణమునకై పేర్కొందును.

'శ్రీరుక్మిణీశ రాజితకీర్తిసార, సారసదళనేత్ర సజ్జనాధార
ధారాధరశ్యామ ధరణిసంచార, చారుమంజులభాష జగదేకపాల
పాలితామర సత్యభామకేలోల, లోల మానసరూప లోకమందార'

ఇట్టి ముక్తపదగ్రస్తములతో నారంభించినను తరువాత రచనము సరళముగనే నడచినది. 'వేడుక శ్రీరామవిభు గురుచేసి, చేసెద ధర్మాంగచరితంబు నేను' అని దీనిని శ్రీరాముని కంకితముగ చేసి కవి తన్నుగూర్చి 'సారసంబగు యజుశ్శాఖయు నాగ, గుణమైన కౌండిన్యగోత్రంబునందు. కరమర్థి శ్రీబొమ్మకంటి వంశాబ్ధి, వరచంద్రుడగు మాధవాఖ్యుండునాగ, పరమ వైష్ణవమూర్తి భవ్యానకీర్తి, అతని పత్నియు నరసమాంబయు నాగ, పతిభక్తి గలిగిన భాగ్య గంభీర, పుడమి యా ఘనులకు పుత్రుండ నేను, తడయక నరులెల్ల దయ చాల గల్గి, అరయంగ నరసింహు డందురు నన్ను' అని చెప్పుకొనెను. దీనిలో గూడ నీకథను గౌతము డహల్యకు తెలంగించినట్లే యున్నది. కథయంతయు 62 తాళపత్రములపై నున్నది. ఇది యద్భుతరసప్రధానమైన కథయైనను స్థలమాహాత్మ్యమును దెల్పునట్టిది. ధర్మపురీమాహాత్మ్య మిది. అచ్చోట స్నానము చేసి సుందరి నాగరాజును చిత్రాంగునిగా బడయగల్గెను. ఈ కృతిజెప్పిన బొమ్మకంటి నరసింహకవి ధర్మపురివాడై యుండును. గ్రంథాంతమున మరల 'ఘనముగా శ్రీబొమ్మకంటి నరసింహు, డనువాద శ్రీవిష్ణు కల్పితంబుగను, రచియించి చెప్పితి రమ్యంబుగాగ' నని ఫలశ్రుతి జెప్పి, 'శ్రీధర్మపురి లక్ష్మీనారసింహాయ నమః' యని ముగించెను. కనుక నతడు ధర్మపుర (తెలంగాణ) నివాసియైయుండును. కథయంతయు సరళభాషలో నౌచితీశోభితమై మనోహరముగా నున్నది. కథా ప్రదేశము తెలంగాణమైనను ఈ పాట ఆంధ్రప్రదేశ మంతటను వ్యాపించినది.

హైదరాబాదు సికిందరాబాదు నగరములందును, చుట్టుపట్టులను బ్రతుకమ్మ

పండుగ సందర్భమున 'బాలరాజు బతుకమ్మపాట' పాడుకొందురు. ఇది యొక వింతకథ. జానపదు లేకథల నెట్లు మార్చెదరో తెలిసికొనుటకీ యొక్క గేయము చాలును. 'కమ్మవారి పణతి-పసల బాలరాజు' గురించియు, 'ధర్మాంగద-పాము పాట' గురించియు తెలిసికొంటిమి. ఈ రెండద్భుత కథలను జోడించి ఎవ్వరో జానపదకవి నరసింహయూర్తియనునాత డీవింతకథను సృష్టించినట్లున్నది. రెండుకథలందున్న యద్భుతవిషయము లాతనికి మనోహరములుగా దోచి యుండును. కనుక రెంటిని మేళవించి మూడవ కథను సృష్టించెను. ఆరంభమిటులైనది.

శ్రీవిలసిల్లగా ఉయ్యాలో చెప్పెదను ఒక కథా ఉయ్యాలో
స్వర్గలోకంబందు ,, సత్కళల చెన్నొందు ,,
యక్షకులమునందు ,, అతిప యొకతుక బుట్టె ,,
ఆమె సౌందర్యంబు ,, అలవియే చెప్పుట ,,
మోహనాంగి యౌట ,, మోహిని యనుపేర ,,
క్రమముగ పెరుగుచు ,, కడతేరె సత్కళల ,,

మోహినీ సౌందర్యమును జూచి ఇంద్రుడు వలచి యామెను పెండ్లియాడ దలచి ఆమెతండ్రి నడిగెను. అతడు భాగ్యమనుకొని మోహిని కీవార్త నెరింగించెను. కాని మోహిని తండ్రితో 'తండ్రి నాచిత్తంబు దాచనేల వినుము, నేనొక్క యక్షుని నెమ్మదిని యెంచితిని, అతివ కొక్కడె భర్త అలరునా పదిమంది' యనెను. దేవేంద్రున కీవిషయము తెలిసి కుపితుడై మోహినిని చెరపట్టవచ్చెను. మోహినిని ప్రేమించిన యక్షు డింద్రు నెదిరించెను. యక్షరాజగు కుబేరు డాయక్షునిపై నలిగి 'ఓరి మన కులమునకు ఒప్పిదము కానట్టి, కార్యంబు గావించి కానివాడవైతి, అందువలన నీవు అవనిలో జన్మించి. ప్రేమ తెలియలేని వెఱ్ఱివాడవు కమ్ము' అని శపించెను. తన కోర్కెను మన్నించని మోహిని నింద్రుడు 'కాన నీవును కూడ వానిచెంతకె పొమ్ము, ప్రేమప్రేమని నీవు కామించితివి కాన, ప్రేమంబుతో నీవు ప్రేమలేకను వాడ్కుతపియించు డికపొమ్ము ధరణి జన్మించుము' అని శపించెను. అగ్నిదేవుడు మాత్రము 'మోహిని నీకేమి మోసంబురాకుండ' గాపాడెదనని యభయమిచ్చెను.

వీరిరువురు భూమిపై నవతరించిరి. సంతానములేని కమ్మవారికి మోహిని చంటిబిడ్డయై లభించెను. యక్షుడు సంపన్నులగు వెలమవారింట జన్మించెను. సీత, బాలరాజు నామములతో వారు పెరిగి పెద్దవారైరి. సీత సౌందర్యమును జూచి

'మాకివ్వుమని యంచు మాకివ్వుమని యంచు, ఎవరిమట్టుకు వారె ఎంతొ ప్రార్థించిరి.'కమ్మనాయుడామె నెవ్వరికీయక నొంటి స్తంభపు మేడపైనుంచెను. ఇట్లుండ నొకనాడు బాలరాజేదియోపనిమీద సీతయున్న గ్రామమునకు వచ్చి ఆ మేడక్రిందుగా పోవుచుండెను. సీత బాలరాజును చూచెను. 'శాప మహిమవలన చాన సీతయు వాని,కనినంత మోహించి కడు సంబరము చెంది, ఎవరుచూడాకుండ ఇలువీడి తిన్నగా, బాలరాజును గాంచి భార్యగా గొమ్మనెను' కాని 'శాప కారణమున జ్ఞానమేలేనట్టి,ఆబాలరాజంత అతివజెప్పెడిమాట,అర్థంబు గనకుండ' నుండెను.సీత బాలరాజును వెన్నంటెను. ఒకచో నాతడు నిర్జలప్రదేశమున 'కొంగులో నీరోస్సి' తెమ్మనెను. సీత వరుణదేవుని ప్రార్థించి బాలరాజుకు నీళ్ళిచ్చెను.ఒకచో వారిరువురు నిద్రించుచుండగా దొంగలు వచ్చి సీత నెత్తుకొని పోయిరి. కాని ఆమెను పెండ్లియాడుటకై దొంగలందరు సుందోపసుందులవలె కలహించి మరణించిరి. బాలరాజు సీతను వెదకుచు తిరుగుచుండగా ఇంద్రుడాతని కష్టపెట్టనెంచి బాటలో మునివలె కూర్చుండెను. బాలరాజా మునిని సీత జాడ యడిగెను. ముని మాటలాడకున్న బాలరాజు కినిసి 'ప్రక్కనే పడియున్న పామును గొనివచ్చి' ముని కంఠమున వేసెను. ఇది పరీక్షిన్మహారాజు కథ కనుసరణము. ముని కోపించి 'పామువై యికమీద ప్రాకుచుండుము జగతి' నని శపించెను. బాలరాజు పామై సీతను సమీపింప నామె భయపడెను; విలపించెను. అగ్నిదేవుడు బ్రాహ్మణరూపమున వచ్చి బాలరాజే పామయ్యెనని చెప్పి 'ఇప్పుడు పామును ఒప్పుగా తలదాల్చి, దివ్యక్షేత్రాలలో త్రిప్పి స్నానములాడు, ఆ పుణ్య ఫలముచే అగును ఎప్పటిరీతి' అని యదృశ్యుడయ్యెను. సీత యటులే దివ్య క్షేత్రములు తిరిగితిరిగి తుదకు 'సరయునది తోయముల స్నానంబు చేయగా, బాలరాజప్పుడు పడసెను తనరూపు'.వారిద్దరు కలిసి పోవుచుండ ఇంద్రుడు మరల వారిని బాధింప వచ్చెను. అదిగాంచి సీత ఇంద్రుని చంపుటకు సిద్ధపడెను. అప్పుడు త్రిమూర్తులు వచ్చి, ఆమె పతిభక్తికలరి 'ఇంక నీజోలికి ఇంద్రుడు రాడమ్మ, వచ్చినచో అతడు చచ్చునుసుమ్మ, కావున నిప్పుడు కరుణించి విడువమ్మ' యని ప్రార్థించిరి. సీత శాంతించెను. 'బ్రతుకుజీవుడ యంచు పారెను ఇంద్రుడు'. త్రిమూర్తులాదంపతులకు సకలసంపద లిచ్చి అమరత్వ మొసగిరి. ఈ పాట విన్నవారికి చెప్పెడువారికి సమస్తైశ్వర్యములు 'సమకూరు నంచును శంకరుడే తెలిపె' నట .పైకథలో మొదటిసగము 'కమ్మవారి పణతి'యు తక్కిన సగము 'పాముపాట'యు కలిసియున్నట్లు మనము సులభముగా గ్రహింపగలము.

పైన పేర్కొనబడిన ఆయాగేయకథలు జానపదులకు సుపరిచితములైనను శిష్టులందధికసంఖ్యాకులకు వాని పేరులు దక్క తక్కిన కథాసందర్భములు తెలియవు. కనుకనే కథలనుకూడ విపులముగా చెప్పవలసి వచ్చినది. జానపదులల్లుకొన్న ఈకథలందు మనకు దోచెడు నేరములు వారి కద్భుతరసమందున్న అతిప్రీతితోపాటు ఔచిత్యదృష్టిరాహిత్యమును పట్టియిచ్చును. ఇట్టి ఘట్టములందు మనము పరిశీలింపదగినది జానపదుల మనస్తత్వమే కాని వారి కల్పనాల్పత్వము కాదు. వారిబుద్ధికి తోచినంతవరకు కల్పించుకొన్న సన్నివేశములే తద్రసానుభూతిచే వారి కానందము కలిగించుటయును, భయభక్తులు పెంపొందించి సత్యధర్మములకే జయము కలుగునని చాటిచెప్పి వారి జీవితములను తీర్చిదిద్దుటయును, ఫలితాంశములుగా మనము గ్రహింపవలయును.



# కరుణరస గేయములు

కరుణ యొక్కటియే రసమని మహాకవి భవభూతి ప్రతిపాదించెను. మన దేశమున నేలనో శిష్టులు సంస్కృతమందేమి దేశభాషలందేమి అధికసంఖ్యాకులీ రసపోషణము చేయరైరి. భారతీయుల కావ్యమగు రామాయణము మాత్రము కరుణరసప్రధానమైనను, కొలదిమంది కవులు మాత్రమే కరుణరసమును పోషించిరి. అత్యధికసంఖ్యాకులు శృంగారమో వీరమో అద్భుతమో పోషించుటకై ప్రయత్నించిరి. సంస్కృతవాఙ్మయముయొక్క క్షీణదశయందును, ఆంధ్రమునందు ప్రబంధయుగము నాటినుండియు శృంగారము పెచ్చుపెరిగి పోయినది. మోదాంత ఖేదాంతములందు మన వారికి మోదాంతమే యెక్కు డభిమానపాత్రము. దానికిగల కారణము లేవియో మన పండితులు తర్జనభర్జనలు చేసియున్నారు. జీవితమును సమగ్రముగా దర్శించి మోదాంత ఖేదాంతములకు సమానమైన స్థానమిచ్చి పాశ్చాత్త్యులు సహజతకు సమీపమునకు పోయిరి. కరుణరసప్రధానములైన గ్రంథములు పాశ్చాత్త్యు లధికముగా వ్రాసిరనుట సర్వవిదితము. ఈరసపోషణమున మన శిష్టసాహిత్యమున గల కొరతను జానపదులు తీర్చినారనుటలో నెంతమాత్రము సందేహము లేదు.

జానపదులు శృంగారము తరువాత కరుణాద్భుతములకు రెంటికిని సమాన ప్రాధాన్యమిచ్చిరి. నిత్యజీవితమున సుఖమునకన్న దుఃఖమే యధికమగుట తత్ప్రభావితులైన జానపదు లాయా సంఘటనముల సహజముగనే చిత్రింప గలిగిరి. శిష్టులకున్నట్టి ఆదర్శదృక్పథము అనగా దుఃఖము నధిగమించి ఆదర్శ జీవితనిర్మాణమునకై సాహిత్యమును సాధనముగా, ఉద్దేశపూర్వకముగా మలచుకొను గుణము వీరియందంతగా లేదనుకొనవచ్చును. జరిగిన సంఘటనమును ఉన్నదున్నట్లుగా తమకభిమానపాత్రములగు మూఢవిశ్వాసముల తోడనే అద్భుతములు నలౌకికములు నమానుషములునగు విషయములతోడనే

జతపరచి చెప్పుకొనుటయే కాని, జరిగినదాని వేరొకతీరుగా మలచుకొను శక్తి వారికి లేదు. 'యత్స్యాదనుచితం వస్తు నాయకస్య రసస్య వా విరుద్ధం తత్పరిత్యాజ్య మన్యథా వా ప్రకల్పయేత్' అనుకొని శిష్టు లౌచితీదృష్టి కలవారై జరిగినదానిని వేరొకతీరుగా మలచుకొనిరి. జానపదుల కౌచితీదృష్టి తక్కువ. కనుకనే వీర గాథలలో కథాభాగమునకున్న ప్రాధాన్యము వర్ణనకుండదంటిమి. వీరగాథలు కేవలము వ్యక్తులకు మాత్రమే కాక సాధారణముగా రెండుజాతులకును లేదా రెండువంశములకును సంబంధించి యుండును. జాతి మరియు వంశము దాటినచో జానపదుల దృష్టి నాకర్షించెడువారు వ్యక్తులు. వారి శౌర్యమున కుత్సాహము దుర్మరణమునకు జాలి రెండుభావములును పామరులచే వారి చరిత్రములను పాడించినవి. ఉత్సాహము (మెప్పువలన కలిగినది) తరువాత జానపదులను సులువుగా నావహించునది జాలి. వీరగీతములం దుత్సాహము (మెప్పు) తోపాటు ఈ జాలి కూడ కథారచనమునకు వారి నెగద్రోయు ననుట యసత్యముకాదు. బొబ్బిలిని కొట్టుటకు దండు విడిసిన విజయరామరాజునకు-చేతులు కాలిన పిదప ఆకులు పట్టినట్లు-మల్లమ్మదేవి వ్రాసిన యుత్తరమును అతిశయోక్తులతో రచించుటలో జానపదకవి ఔచిత్యదృష్టికంటె జాలియే యెక్కువ గోచరించును. జనకంటకుడుగా జీవితమును గడపిన గుత్తాలగోపిరెడ్డిని నలుగురు పట్టి చేలనడుమ చంపవలసివచ్చినది. నలుగురు చేరి ఒక్కని చంపినారేయన్న జాలి 'శేరుశేరు యెండిమురుగుల్ సేతులాకు బెట్టుకోని, కట్టమీద యెల్తావుంటే కలకచే రనుకొంటిర కొడక' యని పాడించినది. ఈరకపుజాలి జానపదులకు సార్వత్రికము. దీనికితోడు ఆవ్యక్తి జీవితము సవ్యమగు ధర్మమార్గమందు నడచియుండినచో జానపదులు వాని చరిత్రకు జల్లుజల్లుమందురు. కనుకనే ప్రతిభాషయందును జానపదులు పాడుకొన్నట్టి కరుణాపూరితమలగు గాథలు పెక్కులు కాననగుచున్నవి.

ఆంధ్రజానపదగేయములందును ఇట్టి కరుణాపూరితములు, చిత్తద్రుతి కారకములునగు కథ లనేకము లున్నవి. అత్త పెట్టిన యారడి వలననో, కట్టుకొన్న భర్తయొనర్చిన యత్యాచారమువలననో, తోడికోడండ్ర యసూయ చేతనో, ఇరుగుపొరుగుల దౌష్ట్యమువలననో, దైవదుర్విపాకమువలననో ఇడుములపాలైన స్త్రీల కథలు జానపదవాఙ్మయ సముద్రమందలి కన్నీటి కెరటాలు. జరిగిన విషాదగాథలకు జానపదులు కొంత మాహాత్మ్యమును జేర్చి శిష్టులనుకొన్నంత కాకపోయినను కొలదిగానైనను—ఆదర్శ మనకూడదు కాని—భయభక్తులకు దారితీయునవిగా చేసిరి. ఇట్టి కథలను కొన్నింటిని పరిశీలించుటయే

ఈ ప్రకరణమునందు నా ముఖ్యోద్దేశము.

దేశీయేతివృత్తములందు ప్రాచీనమైన కరుణాపూరితగాథ 'కన్యకామ్మ వారి కథ' శిలప్పదిగారమందలి కణ్ణకి కథయే మన కన్యక కథయని విజ్ఞులందురు ఈమెయే కన్యకాపరమేశ్వరి. వైశ్యుల కిలువేల్పు. వీరముష్టులపాలిటి కల్ప వృక్షము. ఈయమ గాథను శిష్టలోకమునకు ప్రజాకవి గురుజాడ అప్పారావు గారు 'పూర్ణమ్మ' పేరుతో పరిచయమొనర్చిరి. కొందరు వైశ్యపండితకవుల కావ్యములుగా ఖండకావ్యములుగా శతకములుగా నీకథను వ్రాసినారు. వైశ్యు లిండ్లయందు కన్యకామ్మవారి కథగాని పాటగాని తెలియనివా రుండరు కన్య కామ్మవారిని గురించిన పాటలు, దండకములు, పద్యములు, లాలిపాటలు, మంగళ హారతులు, గొబ్బిపాటలు, వైశ్యుల గోత్రవివరములు కొండపల్లివార ముద్రించినారు. వీనిలో 49 ఖండికలతో నున్న గొబ్బిపాటయందున్న చరిత్రమున క్లుప్తముగా నుదాహరింతును. ఈ పాట

'సకియ వినవె కన్యకాంబ సచ్చరిత్రము, సకలదోషహరము జన్మసఫలదంబునౌ

అని యారంభమైనది. పెనుగొండయను పట్టణముకలదు. అచ్చట,

కుసుమశ్రేష్ఠియనెడు వైశ్యకులజుడొక్కడా, వీట కాపురంబు నెపుడు వేడ్క జేసెడున్-'

కుసుమ శ్రేష్ఠికి కుసుమాంబకు కన్యకాంబ జన్మించెను. ఈమెకే వాసవీకన్య యని మారుపేరు. కన్యకాంబ సౌందర్యరాశి.

'కమలనేత్ర కంబుకంఠి కాంతిదొంతియై, యౌవనంబు మొలకలెత్త నతిముదంబునన్.'

ఒకప్పుడు విష్ణువర్ధనుడను రాజు పెనుగొండ చూడవచ్చినప్పుడు కుసుమశెట్టి తన కూతునుగూడ వెంటనిడుకొనిపోయి దర్శించెను. ఈవిష్ణువర్ధనుడు రాజమహేంద్ర వరమును 11వ శతాబ్దమున పాలించినవాడని సిరాజుల్హసన్‌గారు వ్రాసినారు1. కాని వారేయాధారమున వ్రాసిరో తెలియదు. సారంగధర కథతోపాటు ఈకథాకళంకపంకమునుగూడ రాజరాజనరేంద్రున కలముట విచారకరము. రాజు నారికా కన్యక సౌందర్య మతిలోకముగా దోచెను.

'కన్య గాంచి ప్రభుని మనము కలత జెందెను, మోహమునను బుద్ధి జెదరి మూర్ఛజెందెను'

రాజెటులో తేరుకొని తనదేశము తిరిగిపోయెనే కాని,

'నిమిసమొక్క యుగముగాగ నెలతరూపునే, తలచి తలచి రాజు గోరె తన్విపెండ్లికై'.

రాజామెను పెండ్లియాడ నిశ్చయించి సంబంధమునకై రాయబార మంపెను.

1. The Castes and tribes of the H.E.H. the Nizam's Dominions.

కుసుమశెట్టి యంగీకరించెనేగాని, అతని కుమారులుగాని. కన్యకాంబగాని, కులము వారలుగాని మెచ్చరైరి.

'కుసుమశ్రేష్ఠి సుతుల జూచి కూడదనిరిగా-మేనరికము వైశ్యులకును మేలటంచునూ.'

రాజుగారికీ వార్త తెలిసి వైశ్యులొనర్చిన ధిక్కారమునకు ప్రతీకారముగా దాడి వెడలెను. కాని కన్యకాంబ తనకులమువారితో గలిసి అగ్నికాహుతి కాదలచెనే కాని రాజుచేతిలో మాత్రము చిక్క దలంచలేదు. రాజు 'పట్టణంబు చుట్టివచ్చి ముట్టడించెను, అగ్నిగుండములను త్రవ్వి రతివలందరూ.' కొందరు వైశ్యులామెతో చచ్చుటకు సిద్ధమైరి. మరికొందరు సిద్ధము కాలేదు. అగ్నిగుండములు సిద్ధమయ్యెను

'పడతులెల్ల (అగ్ని) గుండములకు చుట్టుమూ-తిరిగి మ్రొక్కి నిలిచి రపుడు ధీనమతులై'.

ఈ సమయమున వేరొక పాటలో కన్యక

'పశుపతి చరణములు మదిలోన నుంచి-వసుమతీనాథుని వేగ శపియించి
వేడు మొదలుగ యార్యకులము లోపలనూ - చేడియల కతిచక్కదనమున్ననూ -
పణతికేమైన వంకర యుండవలయు-ధరణిలోపలయుంచు కన్యక బలికియునూ -
మన కులమునందు జన్మించినవాడు-మేనరిక మివ్వనివారికి కీడు' అని శపించెను.

కోమటులందు మేనరిక మధికముగా నుండుట కిదియే కారణమని వైశ్యుల నమ్మకము. అందరును అగ్నిదేవున కాహుతియైరి.

'బాధలేక భస్మమైరి పడతులందరున్. కుందనంపు బొమ్మయయ్యె కన్యకాంబయున్'

అగ్నిమధ్యమున నిల్చి కన్యకాంబ పల్కిన పల్కులు గమనింప దగినవి.

హూణజాతులింక భువిని వృద్ధి గాంచెడిన్, క్షత్రరాజ్యమునకు విప్లవ చేటుమూడెడిన్
విష్ణువర్ధనుండు జచ్చు వేగ జూడుడీ, పరకరాజ్యములు మిగుల వాసిగాంచెడిన్
ఓడవర్తకముల మీర లొప్పి యుండుడీ, శమదమము గలిగి మిగుల శాంతి నుండుడీ
పరునిదార గోరరాదు పురుషుడెవ్వడూ, తరుణుల కిల నందములును తప్పవా నికన్
ధనముగూర్చి వగలజేసి తనువగావలెన్, ద్రోహబుద్ధి వర్తకమున దోపరాదిలన్
అరువులిచ్చి గోలుపోక అర్జకులగుడీ, పెద్దలాభములను వీడి ప్రేమజూపుడీ
కొద్ది ధనమె చాలునంచు గుణము జూపుడీ, వారకాంతలందు వీధి వలదు బోవగా'.

ఇటుల చెప్పినతరువాత 'పుష్పకమున వచ్చి నిల్చె పురహరుడెదురా, కన్యకాంబ బోయి విభుని గలిసియుండెనూ'. కన్యక పార్వతి యపరావతారమని వైశ్యులు పూజింతురు. సారంగధరుని కరుణాపూరితగాథతోపాటు ఈకథగూడ రాజరాజ నరేంద్రునకు కళంక మాపాదించునట్టిది. వీనికి చారిత్రకాధారము [illegible] ఏమియు లేదు.

ఆంధ్రభారతమును వ్రాయించిన కీర్తితోపాటు రాజరాజ నరేంద్రునకు కొడుకు కాలుసేతులు నరికించిన యపకీర్తియు తెలుగువా రంటగట్టిరి. చంద్ర వంశమున జన్మించుటచే గాబోలు పాపము రాజరాజున కీకళంకము తప్ప దయ్యెను.చారిత్రకులిది యసత్యమన్నను సారంగధరుని దిబ్బ, చిత్రాంగి మేడల వంటి స్థలనామము లా రాజమహేంద్రవరమున శాశ్వతత్వమును గడించు కొన్నవి. హంపిలో కూడ చిత్రాంగి మేడ రత్నాంగి మేడలని చూపెదరు. కంపిలిలో నీ కథకు ప్రచారమున్నది. భారతదేశమున పెక్కు రాష్ట్రములం దిట్టి గాథలున్నవి. పంజాబులోని పూరణ్ భగత్ కథ ఇట్టిదేనట. సారంగధర చరిత్రమును తొలుత చెప్పినవాడు గౌరన1. కాని యాతడు చిత్రాంగి సారంగ ధరుల వృత్తాంతము మాళవదేశమున జరిగినట్లు వర్ణించినాడు. ఈకథనే చేమకూర వెంకటరాజు మృదువుగను సరసముగను వ్రాసెను. మాళవ దేశపురాజు రాజమహేంద్రుడని గౌరన స్పష్టముగా వ్రాసెను. కాని చేమకూర వేంకటరాజు మాత్రము పొరపడి రాజమహేంద్రుడును రాజరాజనరేంద్రుడును ఒకరేయని తోచునట్లు వ్రాసెను. అప్పకవి (అప్పకవీయము పీఠిక)బాహాటముగా నీ కథాకళంకపంకమును రాజరాజనరేంద్రుని ముఖమున కలదెను. ఈ పొరపాటు ఆంధ్రులకు తరువాత గొప్ప ప్రమాదము తెచ్చిపెట్టినదనియు అనవసరముగా చాళుక్యరాజునకు కళంక మాపాదించినదనియు పలువు రాంధ్రపండితులు, చారిత్రకపరిశోధకులు అభిప్రాయపడుచున్నారు. సారంగధరచరిత్రమను యక్షగానమొకటి కలదు 2. కాని దీనిలో రాజరాజనరేంద్రుడు హస్తినాపురము నేలిన రాజని కృతికర్త సొంత కల్పనము చేసెను. కళులె వీరరాజు సారంగధర చరిత్రమును వచనములో సంతరించెను. బాణాల శంభుదాసు దొక ద్విపదకావ్య మల్లెను. ఆంధ్రనాటకపితామహు లీకథనే విషాద సారంగధర మను నాటకమును వ్రాసి ఆంధ్రనాటకరంగమున విప్లవమును కలిగించిరి. ఇంతమంది కవులీ కథను చేపట్టిరన్నచో దీనికిగల ప్రచారము మనము సులభముగా నూహించుకొనవచ్చును. సారంగధరుని సౌశీల్యము, చిత్రాంగి కాపట్యము, రాజరాజు బుద్ధిమాంద్యము, చివరకు సారంగధరుని విషాదమగు మృతియో, కరపాదఖండనమో ఇందర హృదయముల చలింపజేసినది. శిష్టులగుకవు లిందరీకథను చేపట్టగా జానపదులు

1. నవనాథ చరిత్రము.

2. సారంగధర చరిత్రము-యక్షగానము-కృష్ణకవి.

ఏల యూరకుందురు? జానపదకవులందు గూడ ముప్పురీ కథను వ్రాసిరి. గౌరన కృతిని చదివినప్పుడీ కథను నేను శైవవాఙ్మయమున జేర్చవలయు ననుకొంటిని. కాని జానపదకవుల రచనలందు శివపారమ్యమున కన్న కరుణమే నాకధికముగా నగుపడుటచే దీని నీప్రకరణమందే చేర్చదలంచితిని.

నాకు లభించినవి మొత్తము మూడు పాటలు. మొదటిది 'పర్వతాల మల్లన్న భమిడి మేడలమీద, మెరిపించె జోగిరూపు' అని యారంభమగు సుప్రసిద్ధగేయము. దీనికర్త యెవరో తెలియదు. రెండవది 'సోమవంశాబ్ధిరేరేడు, రామజోగి శాస్త్రి రచించినాడు, అంబికాపతి కరుణించినా'డని చెప్పుకొనిన శారదవరుసలోనున్న కథ. మూడవది '*సారంగధర-బతుకమ్మపాట*' ఇది స్త్రీలు పాడుకొనుట కనువుగా ఉయ్యాలపాట వరుసలోనున్నది. దీనిని వ్రాసినవారు బూరెల సత్యనారాయణమూర్తి. కర్త అత్యంతాధునికుడు. (1949 ప్రచురణము, కొండా శంకరయ్య, సికింద్రాబాదు) కథ సుప్రసిద్ధమైనది కనుక వివరములకు దిగను. కాని మూడింట నున్న విశేషములు మాత్ర ముట్టంకింతును. మూడింటిలో రెండవది శారద వరుసలో వ్రాయబడినది; ప్రౌఢమైన రచనము. తక్కినవి రెండును స్త్రీలు పాడుకొనుట కనువైనవి. వీనిలో మూడవది ఇంకను సరళభాషలో నున్నది.

మొదటి కథ, రాత్నాంగి శివునిగూర్చి పుత్రార్థమై తపమాచరించుటతో నారంభమగును. రెండవదానిలో నీకథను నారదుడింద్రసభలో భూలోకపు వింతలు వర్ణించుచు చెప్పినట్లుగా నున్నది. దీనిలో రాజమహేంద్రవరపట్టణ వర్ణనము కావ్యమార్గమున నడచినది. 'అంబరంబందు సౌధనివహంబు, అందులో నేగు చంద్ర బింబంబు, దేవడీకున్న దొక గోపురంబు, దాని దిగువనే మేఘమార్గంబు, అందు బోలేక రవితురంగంబు, పార్శ్వముల చేయుచుండు గమనంబు, అందువలనాయెనయనయుగ్మంబు.' ఇట్టి యుత్ప్రేక్ష లధికముగా నున్నవి. మొదటిపాటలో చిత్రాంగి 'పుట్టుపూర్వము' లేమియు లేక రాజుగారి రెండవభార్యగా చెప్పబడియెనేకాని రెండవదానిలో చిత్రాంగి వారకామినియని యున్నను కుమారునికై ఎన్నుకొన్న చిత్రాంగి సౌందర్యమును చూచి రాజరాజే చేసికొన్నటుల కూడ చెప్పబడినది. దీనిలో చిత్రాంగి వర్ణన మద్భుతముగా సాగినది. 'దాని కురు లింద్రనీలముల సౌరు, నొసలు జాబిల్లిలోన సంగోరు, మోము పూర్ణశశిబింబమును గేరు, నేత్రములు పద్మముల నణపదారు. చూపు వలరాజు చికిలి తరవారు, చిన్నపలువరుస ముత్యాలచేరు, పలుకులా వంచదారలో నీరు, గళము శంఖంబుతో నెపుడు బోరు, మేను బంగారు వన్నెలను మీరు, బొంగరాల్దిప్పు పాలిండ్ల జోరు, వల్లచీమలది బారు మాగారు, నాభి నవరత్నముల వామలూరు, నడుము

జూడంగ మిగుల నాదారు[1], జఘనమౌ కమ్మవిలుకాని తేరు, రంభలాయూరువుల పొందు జేరు, తావలా గోపులని పల్కుతారు. నడక హంసలకును సరదారు, మంచి యొయ్యారములకు బజారు, వలపు బుట్టింప నవి సాహుకారు, దాని కేలోకమున సాటిలేరు'. వర్ణనములు వచ్చినచోటులందెప్పు డీవిధముగానే రచన సాగినది. మొదటి కథలో రాజరాజు వేటకు వెడలినపు డడవిలో నొక చెంచువాడు, రాజరాజుకు మున్ను శ్రీరాముడు తిరిగిన ప్రదేశములను చూపించి, కాకాసురవధము, మాయలేడి కథ, శూర్పణఖ కథ మున్నగునవి చెప్పినట్లున్నది. తన పావురమును బట్టుకొనుటకై సారంగధరుడు చిత్రాంగి మేడకు బోవ నామె సారంగధరుని కామించి ఇట్లు చేసినది. ఇవి మూడవ పాట (బ్రతుకమ్మ పాట)లో నున్న చరణములు.

| | | | |
|---|---|---|---|
| మొలక కుచములు చూడు | ఉయ్యాలో | పిలుచుచున్నవి విన్ను | ఉయ్యాలో |
| కలువరేకుల బోలు | ,, | కన్నుగవనూ చూడు | ,, |
| పలుచనౌ చెక్కిళ్ళు | ,, | పల్వరుస జూడరా | ,, |
| పిడికెడు నడుమురా | ,, | తొడసొగసు గాంచరా | ,, |

సారంగధరుడు చిత్రాంగి నమ్మాయని సంబోధింప (మొదటి పాటలో) నామె

'అమ్మనన్న నోటికీ కమ్మనీ కజ్జాలు కాముడా నే బెడుదునూ
పెంచెనే మీ తండ్రి పెద్దవాని జేసి పెండ్లి శాయదాయెనూ
భోగాలవారింటి కొత్తువో పోతువో బొంకకా నాకు దెల్పూ
కన్ను సైగలుచేసి కాంతలా బిల్చుటకు కాలమిప్పుడు వచ్చెనూ
తల్లిపిల్లగనెంచి అల్లిబిల్లాడుదము కల్లలూ గాదునమ్మూ' యని నర్మ

గర్భములాడెను. ఇక రెండవ పాటలో వేటాడెడు రాజరాజు కొన్ని జంతువులను సంహరించి 'వాటి బెదురు చూపులను కరుణించి, ఇట్లు చిత్రాంగి చూపని తలంచి, బాణముల నంతలోను మగిడించి, నెమలికేక లంతట నాలకించి, అవియుగల చోట్ల కపుడు పరతెంచి, వాని పింఛంబు లరసి మోదించి, ప్రాణసఖియ కురులని వితర్కించి, కొంత తడవుండె నచట మోహించి.' సారంగధరుడు తెల్లపావురము లెగురవేసి నప్పుడు 'మల్లెపూబంతులాడె ననగాను, చంద్రబింబములవలె నుండగాను, ఎల్లచో వెన్నెలలు గాయగా' నుండెనట. అవి క్రిందికి వచ్చినపుడు 'మరలు పూలు గురిపించి రనగా' నుండెనట. ఒకటి పైకెగురగా 'మన్మధుని గాలిపడగనంగాను, సూర్యపరివేష మనుకొనంగాను, సురనదీతీర కాశమనగా' నుండెనట. తన కామము దీర్పని సారంగునిపై కుట్రబన్ని చిత్రాంగి రాజరాజునకు కొడుకు చేసిన యత్యాచారములని 'గవ్వముడి తా విప్పి గబ్బిగుబ్బలు జూపెనూ, కోకముడి విడిచి నీ కొడుకు జేసిన విధము నాథ యిటు జూడుమనెను.'

---

1. సన్నము.

మంత్రు లభియోగము విచారింపబోవ చింత్రాంగి యొనర్చిన ప్రదర్శనము రెండవ పాటలో జుగుప్సాకరముగా నున్నది.

'బలిమిగా బట్టుకొనుచు బేజారు-చేసె చూడుడని పైట మైజారు
పైకి దొలకించి గాయముల బారు-జూపగా హరహరాయంచు వారు
చూడలేక కన్నులు మూసినారు-సాహసపుముండ యని ఱడిసినారు
బట్టవిప్పునని తొట్రుపడ్డారు-దిగ్గునను లేచి వడి వచ్చినారు'.

జానపదకవికి ఔచిత్యదృష్టికంటె వాస్తవికదృష్టి హెచ్చనిపించును. శిష్టకవి దీనికి వ్యతిరేకము. ఐనను రెండు శ్రేణులయం దపవాదములు లేకపోలేదు. తన కుమారుడు నిరపరాధియని రత్నాంగి రాజరాజు నెంతయో బతిమాలెను. తొందరపడి కొడుకును శిక్షింపవలదని రత్నాంగి రాజుకు రెండు కథలు చెప్పెను. తొందరపాటుచే-కలుగు నష్టమును బోధించునట్టి వీకథలు.ఇవి మొదటి పాటలోనే యున్నవి. మొదటి కథలో కాంపిల్యనగర బ్రాహ్మణుడు తనకుమారుని పాము బారినుండి కాపాడి దాని జంపిన ముంగిని తొందరపాటుచే కుమారునకే ముంగి కీడొనర్చినదని నిశ్చయించి, ముందువెనుక లాలోచింపక చంపి,తరువాత వచ్చిన పామును జూచి పశ్చాత్తాపమునొందెను.రెండవది నిచుళాపురాధీశ్వరుని పెంపుడు చిలుక కథ. ఆ చిలుక ఒకమారు తోడి చిలుకలతో నందనవనికేగి అచ్చటనొక చెట్టు పండ్లారగించి తోడిచిలుకలు బాలురుగా మారిపోవ నది గమనించి తాను మాత్రము తినక ఆపండును దెచ్చి తన యేలిక చిత్రకేతున కిచ్చెను. రాజా విత్తనము కాపాడి నాటెను. అది మొలకెత్తి వృక్షమై ఫలించెను. ఒకనాడా చెట్టు పండొకటి క్రిందబడెను.దానిని కొంతదిన్న పాముొకటి బాలుడయ్యెమ.కాని యా పామువిష మాపండున నుండెను. అది యెరుగని భటుడొక డారాలిన పండును గొనిపోయి రాజుగారి కిచ్చెను.ప్రథమఫలము బ్రాహ్మణున కీయవలెనని రాజుగారా ఫలము నొక బ్రాహ్మణున కిచ్చెను. దానిలో పాము విషముండుటచే బ్రాహ్మణు డది తిని మరణించెను. బ్రహ్మహత్యచే కలిగిన కోపముతో రాజు నిజానిజములు విచారింపక (కారణమగు) తన పెంపుడు చిలుకను చంపెను. ఇట్లుండ ఒక వేశ్య తన చావుగోరి యాచెట్టుపండు దిని పసిబాల యయ్యెను.రాజున కీవార్త తెలిసి తాను తొందరచే కీరమును జంపినందులకు పశ్చాత్తాప పడెను. ఈకథలు తక్కిన పాటలందు లేవు. భట్టి విక్రమార్కుని కథలనుండి వచ్చి చేరినవీ కథలు.

రాజరాజు పారంగుని కరపాదఖండనమున కనుమతి నొసంగెను. తలవరులాతని దీసికొనిపోవుచుండిరి.అప్పటి ప్రకృతివర్ణనము రెండవపాటలో

గమనింపదగినది.'బాలుడది చూడనని జాలితోడ, అప్పు డస్తాద్రి పయికి జావాడ, పద్మినియు దుఃఖమున భక్తితోడ,నేత్రమును మోడ్చెనన మొగ్గలావాడ,ఆమెచే తరణియను బరణి వీడ, కుంకుమన సంజకెంజాయ లాడ, చిమ్మ చీకట్లు గ్రమ్మకొని గూడ, రాజు దుర్యశంబని జనములాడ, సురల చూడ్కులన తాక లల్లాడ'. ఈ వర్ణనములుపూర్తిగా శిష్టులైన రచయితలు చేయునట్టివి. అడవిలో తలవరులు సారంగుని విడిచి యెటకైన వెడలిపొమ్మనిరి. కాని సారంగుడు రాజాజ్ఞదొప్పున తన కాలుసేతులు నరుకవలసినదిగా వారి నుద్బోధించిన ఘట్ట ముదాత్తముగా నున్నది. చివరకు తలవరులు సారంగుని 'రాజమహేంద్రమునకు యోజనదూరమున పణగు బండల మీదను, పరుపుకొండల మీద రుద్రవృక్షము క్రింద బాలునీ పడవేసిరి, కత్తులూ నూరియు కాళ్ళుచేతులు గోసి కండలను తెగగొట్టిరి'. అప్పుడీతని వయస్సు 12 ఏండ్లని మొదటిపాటలో నున్నది.రాజరాజా యీడులో తనకొడు కట్టి పనుల చేయునని యెట్లు తలంచెనో? రెండవ పాటలో నిట్టి విప్రతిపత్తి లేదు. కాలుసేతులు నరుకబడిన సారంగుని యరణ్యరోదనము కరుణా పూరితము, 'హా మహాదేవ యనుచునుండంగ, రక్తముల వరద లప్పుడుపొంగ, సలుపుచే మొండె మచట దొర్లంగ, గండుచీమలవి గరచుచుండంగ,జుమ్మమని యీగలెల్ల ముసరంగ, క్రిక్కిరిసి నక్కలెల్ల జేరంగ,తిండికయి చుట్టు తిరుగుచుండంగ, అంతకంత కతిబాధ కలుగంగ, అపుడు కనువిచ్చి యచట జూడంగ, వారలెవరు కనరాక నుండంగ, యిటులని యేడ్చె నడవి నిండంగ, కాలులే దెచటికయిన బోవంగ, చేయిలేదు జంతువుల దోలంగ, ప్రాణములు పోక పొర్లుచుండంగ, దీనుడై తొట్రుకొనుచు దొర్లంగ, వాడిగల ముండ్లు పొడలు గాడంగ, స్మారకము దప్పి సొమ్మసిల్లంగ'. అప్పు డశరీరవాణి సారంగు నూరడించి పూర్వ జన్మపాపమనియు అప్పటివృత్తాంతము నిట్లు చెప్పెను.

ధవళచంద్రుడనురాజున కేడుగురు భార్యలుండిరి.వారిలో నొకతె సానిది. పేరు భువనసుందరి.రాజుగారి కామెపై మక్కువ.రాజుగారి మంత్రులు సుమంత జయంతులు. సుమంతుడు రాజుకు ప్రీతిపాత్రుడు. జయంతు డిది సహింపక సుమంతునిపై కుట్రపన్ని యాతని పావుకోళ్ళను, భువనసుందరి దాసికి లంచ మిచ్చి, యామె మంచము క్రింద పెట్టించెను. రాజు వానిని చూచి యనుమానపడి విచారణ జరిపించెను. కాలకేయుడను తలవరి పావుకోళ్ళు సుమంతునివని తేల్చెను.రాజు కుపితుడై రాజద్రోహమునకై సుమంతుని కాలుసేతులు నరికించెను. జయంతు డొనర్చిన కుట్ర యిది. తత్ఫలితముగా నీజన్మమున జయంతుడు సారంగుడై దాసి చిత్రాంగియై యనుభవించుచుండిరి. ఈవిషయమునే మూడవ పాటలో నిట్లు వర్ణించినాడు.

'పెదమంత్రి నీతండ్రి—ఆరాణి నీతల్లి—దాసియే చిత్రాంగి—పాకోళ్ల పావురాల్—చిన్నమంత్రివి నీవు—ఇట్లు బుట్టిరి మీరు'.

మొదటి పాటలో నీ విషయము లేదు. కేవల మాకాశవాణి రాజరాజ సభలో చిత్రాంగి మోసమును దెల్పినట్లును. ఆకాశవాణి వేడ్కోలుపై బ్రహ్మ సారంగధరునకు మరల కాలుసేతు లొసంగినట్లును, ఆకాశవాణి చెప్పగా చిత్రాంగి మోసము గ్రహించిన రాజరాజామెను చంపినట్లును కలదు. సిద్ధులు సారంగుని జూచి తమలో కలుపుకొనిరి. అడవిలొ దిరిగెడు బాటసారులు సిద్ధుడైన సారంగుని జూచిరి.'కుడికన్ను మెల్లనా ఎడమకన్నూ మచ్చ చింకిజడలే జూచిరీ, పుట్టింది మొదలుగా పెంచివున్నాయట్టి దాదులూ తగ జూచిరీ'. వారు రాజరాజుతో చెప్పగా నాతడు కొడుకును వెదకుచు పోయి తిరిగిరమ్మనెను. సారంగుడు వైరాగ్య ముపదేశించి తలిదండ్రుల నింటికి పంపించి తాను సిద్ధులతో వెడలి పోయినట్లున్నది.

కాని రెండవ పాటలో కాలుసేతులు నరకిన తలవరులా ప్రాంతముననుండి ఆకాశవాణి సారంగునికి అతని పూర్వజన్మవృత్తాంతము చెప్పగా వినిపోయి రాజరాజుతో చెప్పినట్లున్నది.రాజరాజది నమ్మెను.కాని చిత్రాంగి యది కల్పనమని తప్పించుకొన జూచెను. అప్పుడాకాశవాణి నిజమెరిగించెను. రాజు చిత్రాంగిని నూతిలో ద్రోయించెను. రత్నాంగిరాజరాజులు ప్రాయోపవేశమునకు సిద్ధపడగా నాకాశవాణి వింధ్యగుహలందున్న సారంగుని జాడ దెలిపెను, అప్పటికే సిద్ధు డొకడు సారంగునికి శైవము బోధించి తమలో గలుపుకొనెను. రాజరాజు తిరిగి రమ్మని కుమారుని బతిమాలెను. కాని సారంగుడు తండ్రికి యోగవిద్యా రహస్యములు (విపులముగా) చెప్పి తల్లిదండ్రుల నింటికి బంపించి తాను సిద్ధులందే కలిసి పోయెను. మూడవపాట రెండవ పాటకు సరళస్వరూపము.

అత్యంతకరుణాపూరితమగు నీకథలో శిష్టులు చేర్చినటులే జానపదులు కొన్ని యద్భుతవిషయములు చొప్పించిరి. ఆకాశవాణి మాటలు, సారంగుని కాలుసేతు లతుకుకొనుట వంటివి కల్పనలని మనము భావింపవచ్చును.

'కామమ్మ కథ' పిచ్చుకకుంట్లకు కల్పవృక్షము. ఇదియాంధ్రదేశమంతటను వ్యాపించిన పదము. రచయిత మాదాసు వెంకయ్య. సహగమన కాలమున

'మాదాసు వెంకయ్యను పిలిపించినాదీ కామమ్మ
తాను పుట్టింది పెరిగింది వ్రాయుమన్నదిగా కామమ్మ
కవన మేరుపరచి ప్రకాష్టి చెయ్యో వెంకయ్య

వాతికే వరహాలు వెంకయ్యకిచ్చే కామమ్మ

మారెయ్య నగలన్ని వెంకయ్యకిచ్చే కామమ్మ.' కథావృత్తాంత మాంగ్లేయులీ దేశమును పాలించిన తొలిదినములకు సంబంధించినది. భర్త మరణింపగనే పతివ్రతలగు హైందవస్త్రీలు పూర్వము సహగమనము చేయుచుండెడివారు. దీనినే సతి యాచార మనిరి. రాజా రామమోహనరాయలీ యాచారము నాంగ్లేయ ప్రభుత్వసహాయమున మాన్పించెను. ఐనను కొందరు పతివ్రతలు ప్రత్యేకముగా బ్రిటిషు ప్రభుత్వము అనుమతి పొంది సహగమనము చేయుచుండిరి అట్టి వారిలో కామమ్మ యొకతె. 'కామమ్మ కథే దక్షయజ్ఞపు సతీదేవినీ కన్యకమ్మవారినీ విడిచిపెట్టితే మొదటి పేరంటాలుకథ. పద్ధెనిమిదో శతాబ్దము నాటిదనిపిస్తోంది[1].' ఉత్తమశీలము త్యాగము పాతివ్రత్యము మొదలగు సద్గుణములు తక్కువ కులములవారియందు కూడ ఉండునని కామమ్మకథ నిదర్శన మిచ్చుచున్నది[2]. ఆపతివ్రత గుణముల కలరియే కాబోలు బసవరాజు అప్పారావుగారు 'కాపుకోడలు కామమ్మ కలియుగాన-సాగుమానము చేసిన సచ్చరిత్ర'ను, తలపోసిరి.

'కామమ్మ కథ' చక్కని ప్రతి ప్రా. పు భాండాగారమున గలదు[3]. దానియందున్న కథను పేర్కొందును. ఆరంభమున

'శుభము కామమ్మా శుభము కామమ్మా కామమ్మా

శుభమైంది సామర్లకోటలో నమ్మా కామమ్మా' యనికలదు. సుకపట్లలక్ష్మయ్య వెంకమ్మలకు కామమ్మ ముద్దుకూతురు. కాటకము వచ్చి తల్లితండ్రులు గతింప కామమ్మను పెదతండ్రి రామన్న అతని భార్య వెంకమ్మలు పెంచి మేనల్లుడు తిరుపతి మారయ్య కిచ్చి పెండ్లిచేసిరి. మారయ్య తల్లిపేరు చల్లమ్మ. పెండ్లియైన ఐదు నెలలకు.

'కాకినాడలోన కిలకిచేరొస్తా మారయ్యా పెద్దబోయి కొలువులూ కుదిరినాడు మారయ్యా' మారయ్యకు నెలకు మూడు వరహాల జీతము. ఆరునెలలు కొలువుండెనో లేదో మారయ్యకు తన దొరతో మాటపట్టింపులు వచ్చి జీతముగొని కొలువు చాలించుకొని సామర్లకోట చేరుకొనెను. తన తల్లి చల్లమ్మతో మారయ్య చెన్నపట్టణమునకు కొలువుకు పోదుననెను. తల్లి కుమారునితో 'మాయదారి చెన్నపట్టమే. గదరా మారయ్యా చెన్నపట్టపు కొలువు మన కచ్చిరాదూ మారయ్యా, కిందటా మీతండ్రి కొలువెళ్ళినాడు

1. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు. కిన్నెర, డిసెంబరు 1953.
2. ఖండవల్లి లక్ష్మీరంజనంగారు ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము పుట 332
3. డి. నెం. 2501 ప్రా.పు. భాండాగారము, మద్రాసు.

వట్టాము, చెన్నపట్టములోను చనిపోయినాడు మీ తండ్రి' అని పోవలదనెను. కాని మారయ్య వినలేదు. తనపేరుతో తులసి నాటి యది వాడినచో తనకు కీడు గలిగి నట్లు భావించుకొమ్మని చెప్పి మారయ్య తల్లి చల్లమ్మకు దండమిడి, తమ్ముడు రెడ్డి కాకినాడవరకు వెంటరా నోడనెక్కి పయనమయ్యెను. తమకు కీడుమూడిన తమ పేరి తులసి వాడుననునది సత్యనిరతిగల పాత్రముల వర్ణించు పెక్కు గాథలందు కాననగు విషయము. జానపదుల కిట్టి నమ్మకము గాఢము. మారయ్య మూడుదినములకు చెన్నపట్టణము చేరుకొని 'వాలీసు' దొరయొద్ద నెల కైదు వరహాలకు పెద్దబోయగా కొలువుండెను. ఆరుసంవత్సరములు జీతముండిన తరువాత మారయ్య మన మింటివైపు మరలెను. మూడునెలల సెలవు గొని ఆరేండ్ల జీతము పుచ్చుకొని మారయ్య ఇంటికి మరలెను. తనవారికడకు బోవు సంతసమున 'తల్లికి బొమ్మంచు చీర గొన్నాడూ మారయ్య, తమ్ముడికి పట్టంచు సాపు గొన్నాడూ మారయ్య, కామమ్మ కద్దాలరవికె గొన్నాడూ మారయ్య, నిమ్మపండ్లచాయ భరణి కొన్నాడూ మారయ్య.' తల్లికి, తమ్మునికి, భార్యకు ప్రేమకొలది కొన్నవస్తువులను గొని కాలినడకన మారయ్య సామర్లకోట బాటబట్టెను. ఇరువదినాల్గు దినములకు కాకినాడ చేరుకొనెను. అచ్చట తలనొప్పి జ్వరము పుట్టుకొని వచ్చెను. ఒకనా డచటనే యుండి మూడులంఘనములతో నదే జ్వరబాధతో మారయ్య సామర్లకోట చేరుకొని తల్లితో,

'వడమటింట్లోనాకు మంచమెయ్యావే చల్లమ్మ, చన్నపట్నపు కొలువులు పైవొచ్చినాదే చల్లమ్మ, మిమ్ము కన్నులజూడ నే వచ్చినానూ చల్లమ్మ, ఇహములో భత్యమూ చెల్లినట్లుందీ చల్లమ్మ'యనెను. తెచ్చిన ద్రవ్యము తల్లి చేతికిచ్చి భార్యను కన్నుల జూడ కాంక్షగలదని తమ్ముడు రెడ్డన్నను కామమ్మను దోడ్కొనిరా పిఠాపురమున కంపెను. రెడ్డన్న వచ్చినవెంటనే రామన్న మొదట వంపుట కిచ్చగింపకున్నను కామమ్మ బలిమిచే ఇష్టపడి తొలిసారి యత్తవారింటి ప్రయాణము గనుక కామమ్మ కలిమి వైభవముతో సారెచీరె లిచ్చి పదునారు కావిళ్ళ వస్తువాహనము లిచ్చెను. తుమ్మువలన నొకనాడు ప్రయాణ మాగెను. మరునాడు బాట సాగగనే కామమ్మకు; రెండిండ్ల సందున పిల్లి, నంబితంబలి, నాగుబాముల జోడు, వరదు వాపోత, క్రొత్తకుండల కావడి, ఒంటరి మాలవాడు, మున్నగు మళ్ళకునముల పీడోక్కలయ్యెను. ఎందరు వలదన్నను బ్రహ్మ వ్రాసిన వ్రాలు తప్పదని కామమ్మ పయనము సాగించి సామర్లకోట చేరుకొనెను. అత్తచల్లమ్మ ఆడుబిడ్డ సీతమ్మలు కామమ్మకు కన్నీళ్ళ స్వాగత మిచ్చిరి. మారయ్యకు 'వచ్చిపోవు ప్రాణములు'గా నుండెను. కామమ్మ సగము సారె నత్తకిచ్చి

తక్కిన సగము ఆడుబిడ్డతో కలిసి ఊరంతయు పంచిపెట్టెను. రెండు దినములలో వచ్చిన అట్లతద్దెనోము నోమి వేడుకలు ముగించి అక్షత లందుకొని పురోహితుడు 'అట్లతద్దె' కథలు చెప్పుచుండగా కామమ్మ వినుచుండెను. ఇంతలో పడమటింట గొల్లుమనిరి. కామమ్మ నోము సగమున చాలించి భర్త్రసన్నిధానమునకు వచ్చినది. అప్పటికే మారయ్య నోటిమాట లాగిపోయెను. కొరనోములు నోమిన కామమ్మ,

ముత్యాల నీనోట ముచ్చటాడవుగా మారయ్య, పగడాల నీకండ్ల పారజూడవుగా మారయ్య
ఎట్టిజీరా కండ్ల నిదుర పట్టిందా నీకైతె, ఈడుగా జోడుగా నుందమనుకొంటి కొన్నాళ్ళు
ఈడిడిచి జోడిడిచి నీవెళ్ళుతావా మారయ్య, నన్నిడిచి వెళ్ళేది న్యాయమా నీకూ మారయ్య
చిన్ననాడూ నన్ను పెండ్లాడి నావూ మారయ్య, కంకణముగట్టిన ఘనుడెవ్వడెరుగా నేనైన
ఏడేండ్లకైనా ఇంటికొ స్త్రివిగా మారయ్య, నేను ఈడేరి ఐదేండ్లు ఇంట నున్నానూ యీవరకు,

అని వలపోసినది. కాని యామె రోదన మరణ్యరోదనమైనది. భగవంతుడామె మొర వినలేదు. మారయ్యను క్రిందబెట్టిరి. కామమ్మ తన చేతులార భర్త్రకు చేసిన పరిచర్య నోటిలో నింత తులసితీర్థము పోయుటయైనది. మారయ్య ఋణము తీరిపోయినది. కామమ్మ భగవన్నామసంకీర్తనము చేసి అత్తమామలను మరదిని ఆడుబిడ్డను తానే యూరడించి సహగమనము చేతునన్నది. మరది రెడ్డన్న వలదని బతిమాలెను. కాని కామమ్మ 'పసపుకుంకుమ లేక ఘడియేగలేనూ వో మరది' యని పూర్వభారతస్త్రీసంప్రదాయమును వెల్లడించినది. రెడ్డన్న కుంఫిణీ (ఈస్టిండియా కంపెనీ) వారి ప్రభుత్వమున సాగుమానము చేయ వీలులేదనియు, కాకినాడ 'కలకటేరు' చెన్నపట్టణపు పెద్దదొరల యనుమతి కావలయునన, కామమ్మ 'బతికెవాండ్లకు మీకు భయాలు గనుకా వో మరది, చచ్చెవాండ్లకు మాకు భయాలు యేమి రెడ్డన్న' యని తొలుత సామర్లకోట 'కప్తాను' సెలవంద బోయినది. కప్తాను భార్య నానమ్మ సాగుమానము వలదని మడిమాన్యము లిత్తునని చెప్ప కామమ్మ 'నాకు పట్టెడే బొట్టుంటె పదిలక్షలమ్మా దొరసాని' యని సమాధాన మిచ్చినది. దొరసాని రెడ్డన్నను పెండ్లియాడి పసుపుకుంకుమలు నిలుపుకొమ్మన 'మాకు మనుమూ పెండ్లి మాయింట లేదూ దొరసాని' యని గర్హించి తన సత్యములు చూపినది. దొరసానికి కడుపునొప్పి లేపినది. దొరవచ్చి మ్రొక్కి యనుజ్ఞనిచ్చి చెన్నపట్టణమునుండి సెలవు దెచ్చుకొమ్మనెను.

కామమ్మ యింటికి వచ్చి భర్త్రశవము నలంకరించి మంచముపై నుంచి ఎవరును ముట్టవద్దని ఆనలుంచి తలుపు తాళమువేసి మామను పెదతండ్రిని పిన

తండ్రిని మరది రెడ్డన్నను తనతో చెన్నపట్టణమునకు రమ్మనెను. అది వర్షాకాలము కనుక ఏరులు నదులు నిండి పారుచుండెను. దాట వీలులేదని రెడ్డన్న యనగా కామమ్మ బ్రతుకుపై నాసవీడి తనకు భయము లేదని చెప్పినది. రెడ్డన్న చిన్నమ్మయను మాలపేరంటాలు సాగుమానముచేయ నిచ్ఛగించినపుడు కాకినాడ కలకటేరు, చేసిన కఠిన పరీక్షలు వినిపించెను. కామమ్మ విని చిరునవ్వు నవ్వి పసుపుకుంకుమలు అక్షతలు చేతబట్టి ప్రయాణమైనది. భీమవరపు కాలువ వెల్లువలై పారుచుండ 'పాదియ్యే గంగప్ప పాదియ్యవమ్మా-చెలిమితో నీకు నే చెల్లెలిని గానా గంగప్ప—జాలవారింటనూ నీవు పుట్టినావే గంగప్ప- బెస్తవారింటనూ నే పుట్టినానే గంగప్ప' యని ప్రార్థించి గంగమ్మను పసుపుకుంకుమల నర్పించి కాసెబూసి దేవుని దలచి కాలువలు దాటినది. పొరలిపొంగిన గంగమ్మ కామమ్మ చీలమండలు పుణికి తరలినది. మామ, పెదతండ్రి, మరది మున్నగువా, రేవలి యొడ్డుననే యుండిపోయిరి వారికొక మాయతెప్ప గల్పించి కామమ్మ వారిని దాటించినది. కాకినాడ కలకటేరుకు తన కథచెప్పి సాగుమానమున కనుజ్ఞ వేడినది. దొర వలదనెను. కామమ్మ యెదురాడెను. దొర కోపగించి నీ సత్యము జూతునని మండుటెండలో వారములకొలది నిలబెట్టించెను. అన్నపానము లుడిగి కామమ్మ సత్యము నిలుపుకొనెను. దొర చాటుగా సామర్లకోట కుత్తరము వ్రాసి మారయ్య శవదహనము చేయించెను. ఇచట కామమ్మ ప్రాణములు విడిచెను. మరది రెడ్డన్న వదినె శవము నెత్తుకొని యింటిబాట పట్టెను. మార్గమధ్యమున సొవ్వరపు సోమన్నగుడిచెంత కామమ్మ లేచి భర్తృ శవదహనమును, తాను భర్తతో గలిసి వచ్చుటను వినిపించినది. ఆయూరి యధికారి పెదరెడ్డి పాపయ్యకు సత్యము జూపి పోయిన కాళ్ళొచ్చి ఏడవనాడు సామర్లకోటకు రమ్మని ఇల్లు చేరుకొన్నది. మారయ్య చితి యింకను మండుచుండెను. కామమ్మ చితిలోనికి దిగి

'ఎంత ఎల్లగవుంది నీ పూలవనమూ మారెయ్య, ఎంత బాగావుంది పీ జాజివనమూ మారెయ్య'

యని యోలలాడి కొంతయగ్గి నొడిగట్టి రావికొమ్మ నగ్నిలో వేసి మరల తడిపి

చెట్టునాటినది. ఆమె సత్యమున నాకొమ్మ చిగిర్చి పూత బూసినది. భర్త యస్థికలు ప్రోవుచేసి పిడతలోనుంచి రావికొమ్మకు కట్టి పడమటిల్లు అలికి ముగ్గు బెట్టి దర్భశయ్యబఱచి బయట తాళము వేయుమని రెడ్డన్నకు చెప్పి తాను లోపల తాళము వేసికొని శయ్యపై బరుండి కాయము విడిచి ఏడుగడియలలో చెన్నపట్టణము చేరుకొన్నది.

'చెన్నపట్టణములోను వాలీసు మేడీసు పీనీసుగిరివాకా
సులోకాను కలలోను చెప్పే కామమ్మా
పైనప్ప మొదలారి కలలోను చెప్పే కామమ్మా
దూబాసి కలలో తా జెప్పినాదీ కామమ్మా'.

మొదటి చరణము లందున్న వారాంగ్లేయులు కాబోలు. వ్రాత ప్రతిలో నా పంక్తుల ప్రక్కన (At Madras Wallis, Meadows, Pennigiri Oakes) అని వ్రాసి యున్నది. పెద్దదొర ప్రక్కబట్టలు కామమ్మ పసుపు చేసి యాతని కలలో నాతనిబంటు మారయ్య మరణము, తన కథ వినిపించినది. దొర లౌకరి నౌకరు సంప్రదించుకొనిరి. సత్యములు చూడదలచిరి. ఆరేండ్లనుండి పోయిన జాడలేని (దొర) తమ్ముని దొరగారిచెంతకు కామమ్మ రప్పించి సత్యము గనబరచినది. పెద్దదొర కామమ్మ సాగుమాన మడ్డగూడదని జాబు లంపెను. మంచిగంధపు చెక్కలు పడవలో బెట్టి కళాసులు లేకుండనే విడువుమని కామమ్మ దొరగారికి కలలో చెప్పి వారిని సాగుమానము చూడరమ్మని యాహ్వానించినది. కాకినాడ కలకటేరు పెట్టిన బాధలు చెప్పినది. కాకినాడ కలకటేరు ఉద్యోగ మూడిపోయినది. చెన్నపట్టణపు రేవున దిగువ, గంధపు చెక్కల పడవ నడిపించుకొని కామమ్మ యాత్మ సామర్లకోట చేరినది. బొందిలో చేరి తలుపు తీయించుకొన్నది. అప్పటికి చెన్నపట్టణపు దొరల యుత్తర్వులు సామర్లకోట చేరుకొన్నవి. రెడ్డన్న సొప్పరపు పెద్దరెడ్డి పాపయ్యను దోడ్కొని వచ్చెను. కామమ్మ వరహాలిచ్చి స్థలము కొని అగ్నిగుండములు త్రవ్వించినది. చుట్టుపట్టు సీమల ప్రజలు తండోపతండములుగా సాగుమానము చూడవచ్చిరి. చెన్నపట్టణపు దొరలు కూడ దిగిరి. గంగిరెద్దులవారు ఆటదాసరులు కూడిరి. ఆయుత్సవములు 'యేడు శివరాత్రిళ్ళు సాగినట్టుండే అక్కడను'. ఇదివరకే పేరంటాలై వెలసిన చిన్నమ్మ మాహాత్మ్యము తగ్గునేమోయని యామె తల్లి లక్ష్మమ్మ దురుద్దేశముతో మంత్రకాడు మాదిగ వెంకనితో కామమ్మకు కట్టు గట్టింప ప్రయత్నము చేసినది. వాడెట్టుమారెమ్మ ప్రయోగము చేసెను. కాని యది బయటపడి వాని పండ్లూడెను. సాగుమానము చూడవచ్చిన గొల్ల్రాలు మంచాల వెంకమ్మ మెడనాను పోవ నామె కామమ్మను తూలనాడినది. కామమ్మ సత్యము జూపి రాజన్నకు దొరికిన నానిప్పించినది. వెంకమ్మ కామమ్మకు కట్నము లీయబోవ నామె వలదని పుట్టబోయెడు కొడుకు కూతుండ్రకు తమ దంపతుల పేరులు పెట్టుకొమ్మనెను.

దొరతో తాను గుండమున పడిన మూడవనాడు మారయ్య రుమాలు, తన మూరెడు మైజారు చెరగు, మంగళసూత్రపు బొందు, ఒక చేతి గాజులు, ఒక కాలి మట్టెలు, ఎఱ్ఱకలిబె పువ్వులు గుండములో నుండుననియు వానిని తీసి గుండము పూడ్పించి పైన పందిరి వేయించి కలిబె పూజ చేయించుమని చెప్పి స్నానము చేసి ఇంటింట పూజలంది తనవారి సెలవు గొని అమ్మలక్కలకు బండారు పంచి బాజాబజంత్రీలతో గుండము చేరుకొని మాదాసు వెంకయ్యకు పాతిక వరహాలు తన భర్తనగలు ఇచ్చి తన చరిత్రము వ్రాయుమని చెప్పి, మారయ్య అస్థికలు అగ్నిగుండమున వేసి, పాపయ్యతో తనకు తిరుణాళ్ళు జరిపించుమని చెప్పి, దేవతల దలంచి, యగ్నిగుండమున దూకినది. మూడవనా డామె చెప్పినట్లే వస్తువులు గుండమున గానుపించినవి. దొరలు, పాపయ్య పందిళ్ళు వేయించి పూజలు చేయించి ఎక్కడివారక్కడకు కామమ్మను దలచుకొనుచు వెడలి పోయిరి. కాకినాడ కలకటేరు క్షమాపణ గోరుకొన నాతని కెప్పటి యుద్యోగము లభించునట్లు చేసినది. ఆతడు వచ్చి కామమ్మకు గుడి కట్టించి తోట వేయించెను. కామమ్మ చెప్పినటులే మంచాల వెంకమ్మ తన తొలిచూలుకు మారయ్య యనియు మలిచూలుకు కామమ్మ యనియు పేర్లుపెట్టి బంగరు తొట్టి గుడిలో వ్రేలాడగట్టినది. ఆతోటలో,

> 'వక నిమ్మపండయ్యి వూగుతుంటుందీ కామమ్మ
> అప్పటికి యిప్పటికి వూగుతున్నదిగా కామమ్మ
> కామమ్మ చారిత్ర విన్నవారికినీ భాగ్యములు
> తియ్యకవుందునూ దీర్ఘాయువు గలుగూ యెప్పటికి'.

అనవసరమగు అతిశయోక్తులు గాని అద్భుతకల్పనలు గాని లేక జరిగిన కథ జరిగినట్లుగా హృదయవిదారకముగా కరుణరసపూరితముగా నున్న కథలందు '*లక్ష్మమ్మ కథ*' అగ్రగణ్యము. లక్ష్మమ్మకథను పుటిగంటి వీరయ్య దేవర రచించెను. సౌశీల్యము పాతివ్రత్యము మూర్తీభవించిన స్త్రీమూర్తి లక్ష్మమ్మ ఆమె సహనము త్యాగము మున్నగు గుణములు తెలుగుజాతికి గర్వ కారణములు. ఈ కథనుగురించి శ్రీ అక్కిరాజు ఉమాకాన్తవిద్యాశేఖరు లీ విధముగా వ్రాసియున్నారు.

'ఒకప్పుడు మహావీరులకు క్షేత్రమైన పల్నాడు ఈ మధ్యకాలంలో లక్ష్మి అమ్మవారి మహత్మ్యాన్ని ప్రదర్శించ గలిగింది. కటికి కుటుంబపు కోడలి క్లేశాలన్నీ అనుభవించి ప్రాణాలు విడిచే సమయంలో కూడా చంపుతున్న భర్త

హ_స్తపు కరుణాస్పర్శను అభిలషించిన యీ సాధ్వీస్థానం దుర్గి. ఈమె కమ్మ వంశానికి చెందినది, తండ్రి దిగుమ_ర్తి మునలప్పనాయుడు. ఆంగ్లకవి ఒథెల్లోను స్మరింపజేసే చిరుమామిళ్ళ వెంకానాయుడు లింగాపుర నివాసి ఈమె భ_ర్త. ధర్మపరతంత్రి అయిన ఉదా_త్తభారతీయగృహిణికి సర్వకాలాల్లో ఉదాహరణంగా ఉండగలిగిన యీమె యిప్పటికి పూజిత అవుతున్నది. ఈమె ఇతిహాసం సంచారి కథకులు బొబ్బిలికథాదులవలె ఇప్పటికి కీ_ర్తి_స్తున్నారు1.

కథాంతమున నున్న గద్యమున కవి యూరుపేరు లున్నవి. లక్ష్మమ్మ కథను చేపట్టుటచే నీ జానపదకవి నిజముగా ధన్యుడయ్యెను. వెంకమ్మఅ_త్తగారితనము, పిచ్చమ్మ ఆడబిడ్డతనము లక్షుమమ్మ భారతనారీమణిత్వము మున్నగు గుణము లొకదానినొకటి మించునట్లుగా కలవు. రచన పూ_ర్తిగా జానపదము.

లింగాపురపు చిరుమామిళ్ళ వెంకయ్యనాయుడు దుర్గిలో దిగుమ_ర్తి మునలప్ప నాయునింటికి ఇల్లటపుటల్లు డయ్యెను. మునలప్ప నాయునికి రామయ్య, కోటయ్యలు కొడుకులు; లక్షుమమ్మ గారాలకూతురు. ఆమె,

'ముందు తానొక జన్మమందు తల్లీ,నాగకన్నెగా లక్షుమమ్మగారు
ఎత్తవలసి నరజన్మ మెత్తెనమ్మా-చాంతాళ్ళ మరి బొమ్మచందమయ్యా
బంగారపు ప్రతిమ చందమమ్మ-ఆలక్షుమమ్మకు ఆనేపట్టి అమ్మయ్యా'.

వెంకయ్యనాయునికి అ_త్తవారింట సకలగౌరవములు జరిగెడివి. ఆతని మరదులు 'బావను చూడక నిముషముండలేరూ'.లక్షుమమ్మ వెంకయ్యల దాంపత్య జీవనము గూడ 'అల్లిదామర అల్లినచందము' కొన్నాళ్ళు నడచినది. వెంకయ్య గృహ యజమాని యయ్యెను. 'ఇంటిలో ఉండే లెక్కలు అమ్మయ్య-వెంకయ్యకే వొప్పగించినారూ'. లక్ష్మమ్మ ఆరునెలల యంతర్వత్నిగా నున్నప్పుడు దైవ దుర్విపాకమున వెంకయ్య 'భోగముదాని యిల్లు మరిగినాడు'. లక్ష్మమ్మ జీవనము భారమైనది. కాని యాసాధ్వీమణి భ_ర్తగారి ప్రవర్తనము తలిదండ్రుల కెరుక పరుపక గుప్తముగానుంచి తానే కృశించుచుండెను. ఆమె ప్రసవించి కూతురును గనెను. శిశువుపేరు పార్వతి. ఆకుటుంబమువా రాబిడ్డను'అరచేతిలో నిమ్మపండు రీతి' సాకుచుండిరి. బిడ్డ రెండేండ్ల దయ్యెను.కాని వెంకయ్య నాయుడు మాత్ర మిప్పటికిని లక్ష్మమ్మను కన్నె_త్తి చూడడయ్యెను. ఒకనాటిరాత్రి లక్ష్మమ్మ తన తప్పిదము నడుగదలంచెను. అప్పుడే వెంకయ్య సానిదాని కొంపకు పోవుటకు సిద్ధమయ్యెను. కోపముతో వెంకయ్య సాధ్వియగు లక్ష్మమ్మను

1. పల్నాటి వీరచరిత్ర, ద్వితీయ భూమిక. పుటలు 91-92.

కొట్టెను. తరువాత విచారించుకొని భయపడి వారి సొమ్ములు బీగములు వారి యింట పడవేసి 'లింగాలపురమే బాటపట్టెనయ్యా'. తెల్లవారునరికి వెంకయ్యా తన యన్నలను తలిదండ్రులను చేరుకొనెను. వారు వెంకయ్య తెగత్రెంపులు చేసికొని వచ్చినందుకు విచారించి యూరకుండిరి లక్షుమమ్మ నామెయన్న లత్తవారింట దిగవిడిచిరి. మొదట,

'అత్తగారు వెంకమ్మగారు, తోటికోడలు యిద్దరు అమ్మయ్యా
వెలలేని సంతోషపడుతారయ్యా, శ్రీలక్ష్మి వచ్చిచేరినా'దని సంతోషించిరి. లక్ష్మమ్మ తులసివనము వేయించుకొని పూజలలో నిమగ్నయయ్యెను. ఆమె వచ్చిన ముహూర్తమున అత్తవారికి నిధులు లభించెను. కాని వెంకయ్య మాత్రము మారనేలేదు. భర్తృనిరాకరణమున లక్ష్మమ్మ 'కుమ్మరివామే తగులుకున్నరీతి, గుమ్మడి పండు కుళ్ళిన చందమున' లోలోన బాధపడుచుండెను. భూషణములు సమస్త సౌఖ్యములు త్యజించి కృశించుచుండెను. కాని రెండవప్రాణికి తన బాధ తెలియనీయదయ్యెను. ఇట్లుండగా,

'కొన్ని దినములు వెళ్ళిన తర్వాత-ఆడబిడ్డగా పిచ్చమ్మగారూ
లక్షుమమ్మ కుమార్తెను చూచేను-తన కొడుకుకైనగా తీసుకోవలెనని
తల్లితోనుగా యోచనచేసేరా'. తల్లిబిడ్డ లాలోచించుకొని లక్ష్మమ్మ నడిగిరి కాని యామె తన కూతురు పార్వతిని,

'పుట్టింటికాడ ఆశయుండునమ్మా- మాయన్న రామయ్యగారికైనా
ఇవ్వవలెనని మనస్సు యున్నాది' అనెను. ఆనాటినుండి లక్ష్మమ్మగారికి దైవ మింకను అననుకూలమయ్యెను. తల్లిబిడ్డలు కలిసి

'నీబిడ్డనైనా యివ్వకపోతేనే-నీవు కత్తులమీద ఒరుగుతావు తల్లి
బాకులమీద వొరుగపోతవమ్మా-తల్లీబిడ్డగా ఒక్కటి ఐనారు
కోడలినైనా లక్ష్మమ్మనైనా-యముని బాధలే పెట్టబూనినారు'. అత్త, ఆడుబిడ్డ తోడికోడండ్రు అందరును కలిసి లక్ష్మమ్మ నెన్నియో తీరుల సాధించిరి. లక్షుమమ్మ భూదేవినిమించిన యోర్పును చూపెను. అది పనికాదని వా రాలుమొగలకు విరోధము గల్పింపజూచిరి ఒకనాడు తల్లిబిడ్డలు కలిసి వెంకయ్యతో

'ఏమి కోరి పెండ్లాడి వచ్చినావు-భోగముదానిని నీవు తెచ్చినావు
ఎన్నాళ్ళుండి కండ్లజూతుమయ్యా-ఒకటియంటే పదారంటాది
ఎడమకాలితో ఎగవి తన్నినాది-అట్లాటిదానికి బయటపడము తండ్రి' అని తీరుతీరుల నిందలు కల్పించి చివరకు

'అపఖ్యాతివో పాలైపోతాము-దాసున్నిగా మరిగియున్నదయ్య

దాసివానికే నీవు తోడుతాది-దాసివానికే పేనులు చూస్తాది
ఏవేళను చూచిన అప్పయ్యా-పైన పక్కల పడుకు వుంటదయ్యా'. అని రంకు అంటగట్టిరి. వెంకయ్య మొదట ఈ వార్త నమ్మకయ్యెను. అతడెంత బాధపెట్టినను సహించుచున్న సాధ్విని వీరిట్లు నిందలపాలు చేయగా క్రూరుడైన వెంకయ్య కూడ నమ్మలేకపోవుట లక్ష్మమ్మ గుణములకు సౌశీల్యమునకు పతాకస్థాయి.

వెంకమ్మ పిచ్చమ్మ లింకొక యెత్తు నెత్తిరి. బలవంతముగా లక్ష్మమ్మను దాసివానికి పడకగదిలో తలంటునట్టుల ఏర్పాటుచేసిరి. ఈ మోస మెరుగని సాధ్వి అత్తమాటలకు బలవంతముగా నొడబడెను. లక్ష్మమ్మ దాసివానికి తలంటుచుండగా తల్లిబిడ్డలు కలిసిపోయి వెంకయ్యను చూడరమ్మనిరి.

రెండుమాటలే చెవులబడినదయ్యా-పచ్చలబాకు చేతికందినాడు
గుఱ్ఱాలకొట్టే కొరడా తీసేరా-మహోగ్రుడై మండివచ్చెనయ్యా'-
వెంకయ్య ఉగ్రరూపము చూచి దాసివాడు గ్రహించి

'ఆమె తల్లిగ నేను ఓడ్డనయ్య- నాపైనగా దెబ్బ పడితెనయ్యా
నీకొంచ ముంచుతారా వెంకమనాయుడా' యని తప్పించుకొని పోయెను. వెంకయ్య లక్ష్మమ్మను నేలపై బడవైచెను. అప్పుడామె

'చేతులెత్తి తాను దండం పెడుతాది, ఒక్క కర్మమే ఎరుగను స్వామీ
పాదాలమీద తాను వొరిగెనమ్మా', వెంకయ్య ఇష్టము వచ్చినట్లు లక్ష్మమ్మను కొరడాతో కొట్టెను. ఆమె సొమ్మసిల్లినది. తలిదండ్రులను అన్నలను తలంచుకొని దుఃఖించినది. తల్లి రోదనము విని పార్వతి వచ్చి,

'మాతల్లి నీవు చంపబోకు తండ్రి, మాతల్లిని చంపితేను తండ్రి
ఎవరియండను నేను వుందునయ్యా-ముందుగాను నా గొంతు కొయ్యవయ్యా
వెనకనుంచి మాతల్లిని ఉంపారా'యని బతిమాలెను. వెంకమ్మ పిచ్చమ్మలు వెంకయ్యతో పగటిపూట చంపవలదని వారించిరి. రాత్రి యగుటతోడనే వారాతని మరల పురికొల్పిరి. వెంకయ్య వచ్చి లక్ష్మమ్మను బాకుతో పొడిచెను. ఆమె ప్రాణములింకను పోలేదు. వెంకమ్మవచ్చి లక్ష్మమ్మనుచూచెను అప్పుడు లక్ష్మమ్మ

'అత్తగారి చాయ కనుల చూచేరా-చేతులెత్తిగ దండము పెడుతాది
చంపేవారు చంపుతారు తల్లి-నాబిడ్డను తెచ్చి కనుల జూపండి
ప్రాణమయినగ పోతాదియమ్మా-ఈలోగా నా ప్రాణము పోదమ్మా'యని బతిమాలినది. వెంకయ్యకు కండ్లు పోయి మరల వచ్చినవి. (ఇది జానపదులకు లక్ష్మమ్మపైనున్న ప్రీతి వెంకయ్యపైనున్న కోపమును సూచించెడు కల్పనము)

అతడు 'భార్య ఛేటికి కదలి వచ్చినాడు-హస్తమైనగా తాను తాకినాడు'. అప్పుడు లక్ష్మమ్మ సంతృప్తితో ప్రాణములు విడిచినది. భారతీయనారీమణులందగ్రగణ్య లక్ష్మమ్మ. తన్నుపొడిచిన భర్తకరస్పర్శ కలిగినగాని సంతృప్తితో ప్రాణములు విడువని స్త్రీరత్నములు ప్రపంతచరిత్రమున నెందరున్నారు? ఆంధ్రదేశ మిందులకు గర్వపడగలదు.

హత్యానేరము సంభవించునని కప్పిపుచ్చుటకై అత్త మరియు ఆడుబిడ్డలు 'కుంకుడు కాయలు పూత దీపి నోటికైనను పూసినారు తండ్రీ, నాగుపాము కరచిందంటానే పండబెట్టిగా వుంటారమ్మయ్య'.లక్ష్మమ్మ బావగారికి కలలో జరిగినసంగతి చెప్పినది. ఆమెకు వైభవముగా నంత్యక్రియలు జరిగినవి. చితి చల్లార్పగా లక్ష్మమ్మ శిలయై వెలసినది. వెంకయ్యకు అత్తకు అడుబిడ్డలకు కండ్లు పోయినవి.అప్పటినుండి ఆమె

నూటవొక్క గుడిలోనే యమ్మ-పూజలైనను కొంటువున్నదమ్మ
సంతు లేకుంటె సంతు యిచ్చునమ్మ-బిడ్డలు లేకున్న బిడ్డలిచ్చునమ్మ'-

ఈవార్త తెలిసి లక్ష్మమ్మ యన్న లుగ్రమూర్తులై వచ్చిరి. లక్ష్మమ్మ వారికి ప్రత్యక్షమై బావ నేమనవలదని వారించినది. వారు పార్వతిని తీసుకొని దుర్గికి వెదలిపోయిరి. లక్ష్మమ్మకు గ్రామగ్రామమున పూజలు వెలసినవి. ఆమె కథను పాడినవారికి విన్నవారికి 'కలుగును భాగ్యము తొలగును దోషములు'. చివర భాగమున భక్తికొలది జానపదులు కొంత కల్పనము చేసినవారేకాని తక్కిన కథాభాగమున నెట్టి యతిశయోక్తులు లేవు.

ఊరు పేరు తెలియని కవి యెవడో విశాఖమండలమునకు సంబంధించిన 'సన్యాసమ్మకథ'ను వ్రాసెను.అత్తగారి ఆరడి, తోడికోడండ్ర ఈర్ష్యాసూయలకు పాల్పడి భర్తతోపాటు సహగమనము చేసిన పతివ్రత సన్యాసమ్మ. విశాఖ మండలమున నామె పేరంటాలై నేడు పూజ లందుకొనుచున్నది. నిజమైన కథకు జానపదుల యద్భుతరసప్రీతికూడ కొంత తోడ్పడి సన్యాసమ్మకు బ్రతికి యుండగనే కొంత మాహాత్మ్య మాపాదించినది. నిజముగా సన్యాసమ్మ కథ సాధారణమగు సంసారగాథ- అవిభక్తకుటుంబమున కనిష్ఠులు పడెడు బాధల నీకథ చక్కగా వివరించును. అంతమున సహగమన మున్నను ఆరంభమునుండి యున్న బాధలకే యధికప్రాముఖ్య మీయవలయును. ఆ బాధలందే జాలిగుణము అధికముగా దీపించుచున్నది.

దివిలికట్టు గ్రామమున గాజులకాపువారగు దాల్నాయుడు లక్ష్మమ్మలను దంపతులకు ఏడుగురు మగవారి తరువాత పుట్టినబిడ్డ సన్యాసి. సన్యాసి పుట్టిన

మూడవనాడే తల్లిచనిపోయెను. దాల్నాయునికి రెండవ వివాహమయ్యెను. అన్న రామన్న వదినె పాపమ్మ సన్యాసిని గారాబముతో పెంచిరి సన్యాసి చక్కనిది.

'బంగార మొకచాయ బాలొక్కచాయ సన్యాసి, నిండు పున్నమనాటి చంద్రుండు చాయ సన్యాసి, దేవళములుంటేను దేముడందురుగా సన్యాసి.' సన్యాసి మేనత్త బాలమ్మ

గ్రామమొక యగ్రహారము. ఆమె మూడవ కుమారుడు చెంచన్నకు సన్యాసితో వివాహమయ్యెను. సన్యాసి చిన్నపిల్ల కనుక అన్నగారి యింటనే యుండెను. అన్నయగు రామన్న ఒకప్పుడు మొఖాసాకు పోవలసివచ్చెను. అప్పుడు సవతి తల్లి సన్యాసిని బాధ పెట్టెను; కొట్టెను. అప్పుడు 'నన్నుకొట్టిన దెబ్బలు నీపే నన్నాది సన్యాసి.' అమాట యనుటతోడనే 'దీని చేతిదెబ్బలు దానికి తగిలెను ఆవేళ, పిన్నమ్మవొళ్ళంతా దెబ్బలు లేచె ఆవేళ'. సన్యాసికి చిన్నప్పుడే ఇంతటిమాహాత్మ్య మలవడినది. ఇట్టివే మరికొన్ని యద్భుతములు సన్యాసి పుట్టింట ప్రదర్శించినది. ఇక అచ్చట నుండుట బాగుండదనియు అన్నలతో సవతి తల్లిపై కొండెములు చెప్పుట బాగుండదనియు సన్యాసి అత్తవారింటికి పోదుననెను. రామినాయుడు చెల్లెలికి 25 గ్రామములిచ్చి అత్తవారింట దిగవిడచి ఆమెకొక మేడకట్టించి వచ్చెను. అత్త బాలమ్మ ప్రాపున సన్యాసమ్మ కొన్నాళ్ళు సుఖముగా నుండెను. ఇంతలో సన్యాసమ్మ భర్త చెంచయ్య ఎవరెంత చెప్పినను వినక మచిలీ బందరులో ఇంగ్లీషువారి పటాలమున కొలువుకు బోయెను. కొన్నాళ్ళకు సన్యాసమ్మ ఈడేరెను.

'చిగురుటాకుల బోలి చిగురించుతావీ హస్తములు, పెసరకాయల బోలి వికసించుతావీ తన వ్రేళ్ళు, పిడికెడు నడుమాయె పిరుదులూ బరువాయె బాలకును, అరటి బోదెలు బోలు అతివ పెందొడలు బాలకును, ఓరచూపుల బాల ఒయ్యారినడకల బాల, రొమ్ములు బరువాయె సోబనమెచ్చాయె బాలకును.'

ఇన్నాళ్ళు చిన్నది కావున పనిపాటలు చేయని సన్యాసమ్మ ఇప్పుడు తానుగూడ తోడికోడండ్రతో పనిపాటలు చేయసాగెను. అప్పటి కింకను బాలమ్మకు కోడలిపై ప్రేమ యుండెను.

'నాతోడ బుట్టావు నా ముద్దుబాల కోడాల, అరచేతిలోయున్న ఛీనిమ్మపండూ కోడాల అంబరానుండేటి ఓయగిన్నిగిన్నె కొడాల (కన్నె?) పంజరానుండేటి నా రామచిలుక కోడాల, వొడలమీద నుండేటి వయ్యారిమగువా' యని ప్రేమతో

పెంచుచుండెను. కాని తోడికోడండ్రు సూరమ్మ సుబ్బమ్మలు ఈర్ష్యాళువులై

సన్యాసమ్మచే వంతుపనులు చేయించవలసినదిగా అత్తగారిని కోరిరి. అత్త దాలమ్మ సన్యాసమ్మతో ఈ మాటలు చెప్పెను. సన్యాసమ్మ అత్తతో 'నాచేత మీపనులు కానేరవమ్మా దాలమ్మ, మాయన్నవద్దాకి కబురు లంపేను, దాసీలను పదిమంది పంపించగలడు మాయన్న, కూలిచ్చి నాలిచ్చి చేయించుతాను ఆపనుల'నినది. పుట్టింటి భాగ్యములు తలపోసిన సన్యాసమ్మ మెట్టినింటిని తనకు తెలియకే యవమానపరచెను. ఆ మాటలు వినుటతోడనే దాలమ్మకు కోపము వచ్చినది.

'ఎట్టాటి కళ్ళాకు మెత్తె కోపములు దాలమ్మకు, కూలిచ్చి యీ పనులు చేయించ గలవా ఓబాల, నాకంటే కలిమివారు నీకన్నవారా ఓ బాలా'యని సన్యాసి పుట్టింటివారిని దూషించెను. దీనితో మాటలు పెరిగెను. బాలమ్మ సన్యాసిని సాధింపనెంచెను. సన్యాసి యొడలిపైనున్న నగలొలిచి తీసికొన్నది. ఆమె తెచ్చిన ధనధాన్యసంపద లన్నియు లాగికొనినది. సన్యాసమ్మ కూటికి గుడ్డకు కష్టపడెను. చేయరాని పనులు చేయవలసివచ్చెను.

'ఏడు దొడ్డెల పేడ నీవంతుబడెను ఓ బాల. ఏడు సావిళ్ళు తుడుపు నీవంతు బడెను ఓ బాల, ఏడు వాకిళ్ళ కల్లాపు నీవంతుబడెను ఓబాల, ఇట్టి పనులు చేయలేక సన్యాసమ్మ

'ఈ కంట కన్నీరు ఆకంట బోసే, కొండగొత్తెలాగు ఘోషపెడుతాదీ'.

సన్యాసమ్మ పేడ తీయుటకు పోయినప్పు డామె మాహాత్మ్యముచే పేడ,

'తాబేలు వర్ణాన తర్లుచున్నదిగా ఆ పేడ, కప్పలాగున పేడ దాటెళ్ళుతుంది ఆపేడ.' సన్యాసి కష్టములు చూచి ఆడబిడ్డలగు అక్కమ్మ నరసమ్మలకు హృదయము ద్రవించి వారామెకు తోడుపడుచుండిరి. తల్లి దాలమ్మ యది కనిపెట్టి వారిని కూడ నిర్బంధించెను. సన్యాసమ్మకు సరిగా కూడు పెట్టక 'ముక్కిపోయిన జొన్నయంబలి, మూడురోజులు మురిగిన చల్ల, పచ్చిచింతకాయపచ్చడి, అంచులు పోయిన బోలెలో పెట్టెడిది. సన్యాసమ్మ అత్తగారిచ్చిన యన్నమును భర్తకు చూపించుటకై తన మేడలో నొక చోట దాచిపెట్టి కేవలము తులసి తీర్థము త్రావి బ్రతికియుండినది. ఎటులనో మరది అప్పన్నకు తన వదినెను తల్లి బాధలు పెట్టుచున్నదని తెలిసి విచారపడి తల్లికి తెలియకుండ వదినెగారికి పాలు పోయుచు కొంత సహాయపడుచుండెను. దాలమ్మ వారిరువురికి జారత్వమంటగట్టి నిందించెను. దాలమ్మ పెట్టిన చెరలు గ్రామమున పొక్కి సన్యాసి పుట్టింటి వారికి గూడ తెలిసెను. వెంటనే రామన్న సపరివారముగా బయలుదేరెను. ముందుగా నౌకరులు వచ్చిరి. సన్యాసి యది గ్రహించి అన్నగారు అత్త నేమందురో యను భయముచేత ఎదురుగా పోయి తాను సుఖముగా నున్నాననియు

అత్తగారు మంచిదనియు చెప్పి అన్నగారిని త్రిప్పి పంపించెను. లోకమున నిట్టి సాధ్వీమణు లెందరుందురు? సన్యాసి సౌశీల్యమున కీసంఘటనము మహోదాత్తత తెచ్చినది. శిష్టులైనవా రీ రచనము చేపట్టినచో ఇంకెంత రాణించెడిదో ఈకథ. చెల్లెలికి మరికొంత ధనమిచ్చి అన్న తిరిగిపోయెను. దాలమ్మ ఆధనమును గూడ లాగుకొని 'యిరుగునా పొరుగునా మరిగి యున్నావా సన్యాసి, నీ మరిది అప్పన్నతో మరిగియున్నావా సన్యాసి, లేక చోరుడైన నీమగడు నీకు పంపేనా సన్యాసి' యని నిందించినది. ఈ కష్టములు భరించలేక సన్యాసి యొకనాడు తన మేడ తలుపులు లోపలవేసికొని శరీరము నొకచో భద్రముగా విడిచి ఆత్మ రూపమై భర్త చెంతకు బోయి నిద్రలో తన దుఃఖమును తెలిపినది.

చెంచయ్య దొరల సెలవు తీసుకొని ఇంటికి వచ్చెను. అతనికన్నముందే సన్యాసి వచ్చి యెప్పటియట్ల తన శరీరములో ప్రవేశించెను. దాలమ్మ కొడుకు తెచ్చిన ధనమును దాచుకొన్నది. ఆమె తన కుమారునకు 'త్రాగుటకు పాలిచ్చినది కాని పుచ్చుకోగా పాలు పొగకంపులాయె ఆవేళ'. చెంచయ్య తల్లిని కారణ మడుగ నామె 'మన యింటి కోడళ్ళు తోమిన చెంబులురా చెంచన్న' యని సమాధానము చెప్పినది. కోడలిపై లేనిపోని నిందలు కల్పించి చెప్పినది. చెంచన్న యిది నిజమనుకొని సన్యాసిని కొట్టుటకై కోపముతో నామె మేడకు పోయెను. కాని నామె రూపము చూచి ఇట్లాశ్చర్యపడెను. 'బారెడు దీని కురులు ఇటులాయెనేమి దైవామ, జానెడు దీని కొప్పు మట్టాయెనేమి దైవామ, కట్టెలో జీవుడు లేకయున్నాదీ దైవామ' యని వాపోయెను. ఆమె తన యోగనిద్ర నింకను చాలించలేదు. చెంచన్న ఆత్మహత్యకు పూనుకొనగా నామె లేచి భర్తకు ప్రణమిల్లి తనబాధలను చెప్పుకొని నాపోయినది. చెంచయ్య భార్యను పుట్టింటికంపి యెప్పటియట్ల తల్లి చెంతకు పోయెను. కాని యాతని చెల్లెండ్రు తల్లి మాటలు విని వేరొక మార్గమున పోయి సన్యాసిని చెంచయ్య తిరిగి రమ్మనెనని చెప్పి మరలించి తీసికొని వచ్చిరి. చెంచయ్య భార్యను పుట్టింటి కంపి తా నెప్పటియట్లు కొలువుకై కదలంచెను. భార్య యిది కనిపెట్టి నేను పుట్టింటికి పోననెను. చెంచన్న మరువడ దలంచి అన్నతో జగడము పెంచుకొని అన్నను చంపజాలక అభిమానముచే తానే పొడుచుకొని చచ్చెను. సన్యాసి భర్త కళేబరమును సమీపించి,

'వందనము వారాజ చాల వందనమూ, నన్ను విడిచి నీవు వెళ్ళిపోతివిగా
యెవరి మొకము చూచి యిందు నుందూను, వాదమొంది ప్రాణాలు వదలుకున్నావొ
యీపడుచు ప్రాయము యెవరికితూను. నాయీడు ప్రాయము యెవరు ...'

అని విలపించి,

నీ కట్టెలో నాకట్టె కూడ వస్తాదీ నా రాజ, నీబొందితో నాబొంది కలిసివస్తుంది నీ జీవముతో నా జీవము ఏకమౌతాది నారాజ' యని సహగమనవాంఛతో భర్త కళేబరముపై అత్తరుపన్నీరులు చల్లి 'తగ్గితే తగ్గింది సంపంగి వనము నారాజ, మగ్గితే మగ్గింది నా మూలతరుగూ, సగ్గకా మగ్గకా నీవుండవయ్యా, తిరిగివచ్చేవరకు మనమూన యుండూ, గుండాల సెలవులకు వెళ్ళివస్తానూ'అని మరదియప్పన్నను సహాయముగా తీసికొని యెన్ని యాటంకములు కలిగినను గడచి మచిలిబందరు చేరి దొరల ననుజ్ఞ వేడినది. వారు సామాన్యముగా ననుజ్ఞ నీయరైరి. దొరలకు కొన్ని యద్భుతములగు పాతివ్రత్యమాహాత్మ్యములు కనబరచి సహగమనమునకై సెలవంది తిరిగి అగ్రహారము చేరుకొనెను. సహగమనసమయమునకు చిన్నప్పుడు పెంచిన వదినె పాపమ్మను పిలిపించుకొనినది. తన దుఃఖమంతయు చెప్పుకొని ఎందరు వలదన్నను వినక సహగమనము చేసినది. వదినె పాపమ్మ కడుపున మగబిడ్డ పుట్టినచో చెంచయ్యయని పేరు పెట్టుకొని సూరమ్మ కడుపున పుట్టెడు బిడ్డకు సన్యాసియని పేరుపెట్టి ఇరువురికి పెండ్లిచేసి వారి సంతోషము చూడుడని చెప్పి పోయినది. రామినాయుడు చెల్లెలికి గుడి కట్టించెను. అప్పటినుండి సన్యాసికి పూజలు జరుగుచున్నవి.

గోదావరిమండలమునకు సంబంధించిన పేరంటాలు గాథ యొకటి కరుణాపూరితమైనది కలదు. ఇది *'మండపేట పాపమ్మ పేరంటాలమ్మ కథ'* పేరుతో 1934 లో ప్రకటింపబడినది. సంపాదకుడు బళ్ళా స్వామికవి.

మండపేట(మాండవ్య పురము)లో కొప్పిరెడ్డివారను కలిగిన కాపులింట లక్ష్మీకాంతమ్మ మూలయ్య దంపతులకు పరమేశ్వరీవరప్రసాదమున పాపమ్మ జన్మించెను. కాని చిన్నతనముననే తలిదండ్రులు చనిపోవుటచే పెదతండ్రి రామయ్యనాయుడు పెదతల్లి సీతమ్మ, పినతండ్రి పినతల్లి, గారాబముతో పెంచి పెద్దచేసిరి. ఆమె యీడేరగనే కృష్ణామండలమందలి రాచర్లపుర వాస్తవ్యులైన కుంచె బాపనమ్మ రంగయ నాయుల రెండవకుమారుడు పాపయ్యనాయుని కిచ్చి పెండ్లి చేయుటకు సంబంధము నిశ్చయమయ్యెను. రామయ్యనాయుడు చెల్లెలు సుందరమ్మ కీవార్త తెలిసి మేనరికము తప్పింపవలదని బతిమాలి యేడ్చెను.

'పుట్టింటాశా పాడుచేయకన్నా-పుగ్గురతోడా బుట్టితి నన్నయ్యా
చెల్లెలి ముద్దు చెల్లించుమన్నయ్యా-నీ తోడబుట్టిన చెల్లెలను గానంట్రా' యని

సుందరమ్మ దుఃఖింప రామినాయుడు,

'సుందర నిన్నిచ్చి మోసపోతిమమ్మా-మరల యెట్లు యిత్తుమె నాచెల్లి
తల్లిదండ్రి లేని బిడ్డే పాపమ్మ, తగిన చోటికే బిడ్డ నివ్వవలెను' అని నిరాకరించెను.

సుందరమ్మ 'ఆడబిడ్డ యుసురు ఊరకె పోదన్నా' యని కోపించి వెడలిపోయెను. నిశ్చయప్రకారముగా పెండ్లి జరిగినది. పాపమ్మ తన యత్తవారింటికి పోయి కొన్నిదినములే సుఖముగా నుండెను. ఆమె పార్వతివరమున బుట్టినది గనుక పార్వతీపూజలు చేయుచుండెను. అప్పుడామె యత్తగారు,

'పాపాయమ్మ యివియేమి పనులమ్మ-ఇటువంటి పూజలు యెన్నడెరుగమమ్మా
పడుచుదానికీ పూజ యేమిటమ్మా-లేని యాచారము మాకు పెట్టకమ్మా' యని

నిందలించెను. పాపమ్మ,

'అత్తయ్యా యివి అచ్చిరానిపనులా-శుభప్రదాయిని మహాశివునికొమ్మా
ఆతల్లి పూజలే నేను జేయుచుంటి-గౌరదేవీపూజ కూడదా అత్తయ్యా' యని

ప్రశ్నించెను. అంతమాత్రముననకే అత్తగారికి కోపము వచ్చెను.

'అత్తింటి కోడలుకు హద్దుండవద్దా-పూజలతో నీవు కూర్చుండి యుంటేను
ఇంటిలో పని చేయ నెవ్వరచ్చున్నారు-పనులు చేయ నీకు దాసీలు లేరిచట
దొడ్డిలో పేడంత మేటుగా పడివుందే-త్వరగాను నీవెళ్ళి పేడ జేసిరమ్మా
వచ్చి పందుమే జొన్నలు దంచూము-ప్రతిరోజు తప్పకీ పనులు చేయవలె' నని

సాధించుచుండెను. పాపమ్మకు పరమేశ్వరి కలలో నగుపడి చెప్పి సహాయపడు చుండెను. అత్తగారు కోడలి పూజలు మాన్పించుటకై దెబ్బలు కొట్టెను. కాని పాపమా పాపమ్మసాధ్వి,

'పల్లెత్తు మాటయిన పలుక దమ్మలారా-మనసు లోపలనైన చింతజెందదమ్మా
భర్తతోనైనను జెప్పదె నాయమ్మా-పొరుగువారలకైన తెల్పదమ్మలారా.'

ఇటుల కొంతకాలము గడచెను. ఒక అట్లతద్దెకు పాపమ్మ పుట్టింటికి పోయెను. అచట నొకనాటిరాత్రి యామెకు దుస్స్వప్నము కలిగి తెల్లవారగనే అత్తవారింటికి బయలుదేరెను. మార్గమున దుశ్శకునము లయ్యెను. ఆమె యిల్లు చేరుకొనునప్పటికి భర్త బ్రతుకునట్టి స్థితిలోలేడు. భార్యను జూచి పాపయ్య ప్రాణము విడిచెను. ఆమె సహగమనముచేయ నిశ్చయించెను. మామగారు పుత్రనిర్విశేషముగా నిన్ను జూతుము సహగమనము వలదన, నామె

'ఏముండి ఫలమేమి వెత్తినామామయ్యా,ససుపుకుంకుమ నాకు కొదువాయె మామయ్య
విధవ విభవము మీరు చూడాలి మామయ్య-పతితోడి లోకమే పడతికి మామయ్య
పతి గతించిన భామ బ్రతికియుండరాదూ-గుండావికే నాకు సెలవిమ్ము మామయ్య'

యని కోరినది. అగ్నిగుండములు సిద్ధమయ్యెను. సహగమనమునకు ముందు పాపమ్మ సంతానములేని సీతమ్మకు స్త్రీపురుషసంతానము కలుగుననియు వారికి తమ భార్యాభర్తల పేరు పెట్టవలయుననియు చెప్పెను. (సన్యాసమ్మకథలో గూడ నిట్టి సంఘటనము కలదు.) మామగారితో ఇట్లనెను.

'మామయ్య నామనవి చిత్తగించూ-గుండమున నేబడ్డ మూడోనాడైనా
గుండము చల్లార్చి చూడండి మామయ్య-నీకొడుకు శిగబొందు యట్టె వుంటదయ్యా
నావట్టుచీరైన యట్టె వుంటదయ్యా-మంగళసూత్రమున బొందు వుంటదయ్యా
నాకాలి మెట్టెలు యట్టె వుంటవయ్యా-ఇవియన్ని గుండములో వుండునోమామయ్య
అవి తీసి జాగ్రత్త చేయండి మామయ్య-పట్టుచీర సగము చించి నామామయ్యా
నాకాలి మట్టెలు మైజారుచెంగూను-మాయిమ్మగారికే ఇవ్వండి మామయ్యా
పాపయ్య శిగబొందు మంగళసూత్రము-కట్టుచెంగుగా మీరు పుచ్చుకొండి
కుందనపుబొమ్మ గుండములో కనిపించు-ఆబొమ్మ పదిలముగ పైకి దీసి' ప్రతిష్ఠ

చేయుడని చెప్పి, ఏటేట సంక్రాంతికి తిరునాళ్ళు జరిపించుడని చెప్పి, మేనవారుండగా తప్పించి పెండ్లిచేసిన బాలవైధవ్యము గలుగునని పుట్టింటివారిని శపించి పాపమ్మ సహగమనము చేసెను. మండపేటలో చేనుకడ కావలియున్న పెదతండ్రి కలలో జరిగిన వివరములు చెప్పెను. రామయ్యనాయుడు రాచెర్లకు వచ్చి పాపమ్మకై దుఃఖించెను. పాపమ్మ చెప్పినట్లు రంగయ్యనాయుడు రామయ్యనాయునకు మైజారు చెంగి వ్వక 'కట్టుచెంగుగా కాలిమట్టెలేమీ, రామయ్యగారికి యిచ్చె నమ్మలారా'. ఇటు లొనర్చినందులకు పాపమ్మ అత్తవారిని శపింప వారందరు నాశనమైరి. ఆమె సంతులేనివారికి సంతానమిచ్చి ఎందరికో వారివారి కోర్కెలు తీర్చుచుండెను. పుట్టింట పెదతండ్రి యామె కుత్సవములు చేయించుచుండెను. అత్తవారి గ్రామమున మాత్రము 'గ్రామ మునసబుగారు చేయించుచున్నా'రట. ఇకఫలశ్రుతి-

'పాపమ్మచరితము భక్తితో వించేను-స్త్రీలు శుభవతులయి ముక్తినొందెదరూ
వ్రాసినవారికి చదివినవారలకు-తొలగునూ దోషములు కలుగు భాగ్యములు'.

కరుణరసాత్మక గాథలందు పేరంటాంద్రకథల కొక ప్రత్యేకత కలదు. భర్తశరీరముతో సహగమనము చేసిన సుమంగళులను జానపదులు 'పేరంటాంద్రు' అందురు. కామమ్మ కథ, మండపేట పాపమ్మ పేరంటాలుకథ, శృంగవరపుకోట యెఱుకమ్మ పేరంటాలు కథ, తిరుపతమ్మపాట, సన్యాసమ్మ కథ మున్నగునవి ముద్రితములు. కామమ్మ భర్తపోవునప్పటికి బాలిక. ఆమె పెండ్లికాలమున దప్ప భర్తముఖము తిరిగి చూడలేదు. అటులయ్యును కామమ్మ

తన గృహిణీధర్మమును నెరవేర్చినది. ఎరుకమ్మ గృహిణి. ఇద్దరాడబిడ్డల తల్లి. ఆమె భర్త అప్పన్న అడవిలో వేసిన నువ్వుచేమనకు చుట్టుకంప (కంచె) వేయుటకు వేకువజామున నేస్తగాండ్రతో బయలుదేర నుండెను. రాత్రి యెరుకమ్మ కలలో 'ధారప్పదేవుడు' ప్రత్యక్షమై నీభర్త పోవుమార్గమున పులిభయమున్న దనియు నాతని నివారింపుమనియు చెప్పెను. నిద్రమైకమున నామె తిరిగి యటులే నిద్రించి 'అడవిలోనూ విభుని పులిబట్టినట్టు, మగని వంటికండ మృగరాజు తిన్నట్లు' కలగనెను. భర్తను లేపి కల చెప్పెను కాని యాతడు వినడయ్యెను. ఉదయము 'యేళ్ళుసాగదోలి వీధికిని రాగాను, యెదురింటి యిల్లాలు చెడుతుమ్ము దుమ్మెనూ. ఆ తుమ్ము వినియెరుకమ్మ బాటకడ్డము వచ్చి వారింపగా 'శృంగవరపు కోటలో సీతమ్మపేటలో, కాకపడి అప్పన్న కండ్లెర్రజేసెను. అడవికి పోయిన అప్పన్న పులివాతబడెను. మరదులావార్త నెరిగింపగా ఎరుకమ్మ అడవికిబోయి పులిరాజును తనభర్త శరీరము నిమ్మని యడిగెను. పులి భర్త శరీరమీయకున్న నామె 'ఎడమచేతితోను మెకమునే చంపింది'. భర్తశరీరము ఇంటికి తెచ్చి మంచముపై నుంచి 'పరమాత్మ దైవమా నా ప్రాణనాథుండు, కనకంపురీతిగా కాయముండాలి' యని ప్రార్థించి 'పన్నెండు మాన్యాల పట్టభద్రుడు' ఆనంద గజపతి మహారాజును (సుమారు 1895) 'పాగుమానము కొరకు స్థలమిమ్మని' కోరనది. ఎకరము భూమికి 'తాకీదు' పుచ్చుకొని గుండము త్రవ్వించి సహగమనము చేసినది. ఆచోట నిప్పటికిని ఏటేట ఎరుకమ్మ తీర్థము సాగును. క్రీ.శ. 1895 నాటికింకను సహగమనము అనుమతింపబడుచుండెను. దీని రచయిత యెవ్వరో తెలియదు. దీనిని మంగు రంగనాథరావుగారు ప్రచురించిరి.

క్రీ.శ. 1928 లో బాలకవి కృష్ణారావు రచించిన 'తిరుపతమ్మ పాట' యీ పాట ఇతివృత్తము ననుసరించినట్లున్నది. తిరుపతమ్మ పెనుగంచిప్రోలు కమ్మవారు శివరామరాజు రంగమాంబలకు వెంకటేశ్వరుని వరమువలన పుట్టినది. 'శ్రీ గోపరాజాఖ్యున్, చేరి వరించియు రాగద్వేషాదులను, రహి నిడ నాడెను. 'ఘోరారణ్యంబున గోవుల గాయుచు క్రూరవ్యాఘ్రంబులచే-గూలినపతి పరలోక మరిగిన భర్తను సేవింప అరయగ నగ్నికి - నాహుతియైనది. మందపేట పాపమ్మ మున్నగువారిగూర్చి వ్రాసియేయుంటివి.

ఈ పేరంటాండ్ర కథలలో నొకవిశేషము కనబడుచున్నది. వీరందరును సహగమనము నిషేధింపబడిన తరువాత విశేషయత్నము చేసి సాగుమానము

చేయుటకు అనుమతి తెచ్చుకొన్నవారు. ఈసుగుణము జానపదుల నాకర్షించినది. ఏరుకమ్మ ఆనందగజపతి మహారాజుకడ నిప్పుబంతులాడి సత్యము చూపినదట. 'అగ్నికి భరించగలవా మాతల్లీ' యని ఆ ప్రభువు అనియుండును. భరింపగల ననుటకు ఆమె నిప్పును చేతిలో పట్టి చూపియుండును. ఇది నిప్పు బంతులాట యైనది. తక్కినవారు చూపిన సత్యములుగూడ ఇటులే గ్రహింపదగును. సన్యాసమ్మ చూపిన సత్యములకు ఆంగ్లేయు లచ్చెరువుపడిరి ఇవి కొంత అతిశయోక్తులు. పేరంటాండ్రందరును దేవతలై మ్రొక్కులు దీర్తురనునది ఈగాథలందలి మఱియొక విశేషము. వీరారాధనము భారతదేశమునకు క్రొత్త కాదు. అవతారము లొకవిధముగా వీరారాధనమునకు లక్ష్యములే. ఈ పేరంటాండ్రు కూడ ఆ రీతిగనే ఆరాధ్యదైవములైరి. పెద్ద (సంక్రాంతి) పండుగ తరువాత రెండవదినమున నూతనవధువులు పట్టెడు సావిత్రి గౌరి (బొమ్మలనోము) పేరంటాండ్ర పూజయే. పేరంటాలనెడు పేరుతోనున్న దేవతలు సహగమనము చేసిన సాధ్వీమణులు. ఈ నోము కోస్తాజిల్లాలలో నధిక ప్రచారమున గలదు. సహగమనగాథలు కూడ అధికముగా కోస్తాజిల్లాలకు సంబంధించినవిగనే యున్నవి.

చారిత్రకగేయములను పేర్కొనినప్పుడు దేశింగురాజు వీరగేయము (జింజి) అరవదేశమునకు సంబంధించినదని తెలిపియుంటిని. కరుణాత్మక కథలందుగూడ 'నల్లతంగాళ్ కథ' అరవదేశమునకు సంబంధించినది. దాని నరవములో కోళప్పంజేరిపురీవాస్తవ్యుడు, చెల్లప్పమొదలారు వ్రాయగా సుబ్బరాయలునాయడనునాతడు తెలుగులో వ్రాసెను. ఈ కథ కింకొకపేరు షట్పహోదరి (ర?) చరిత్రమట. కథకు రంగస్థలము మధుర. నాయకరాజుల కాలమున నాంధ్రులకు మధురతో సంబంధ మేర్పడెను. బహుశః ఆనాటి తమిళులు ఆంధ్రులు ఇచ్చిపుచ్చుకొన్నవానియం దీకథగూడ ఉండియుండును. కథాకాలమునుగూర్చి శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావుగారు 'దీనిలోని పాండ్యరాజు సద్వంశంలో జన్మించినవాడు. సద్వంశీయులగు పాండ్యరాజులు క్రీ పూ. 543 నుండి క్రీ.త. ఏడవ శతాబ్దం వరకుమాత్రమే పరిపాలించేరు. అటుతర్వాత రాజులు శూద్రప్రసంతతివారు. కాబట్టి నల్లతంగాళ్ అను ఈ జంగంకథారచన క్రీ.త. ఏడవశతాబ్దం దాటదని చెప్పవచ్చు'ననిరి 1. కాలనిర్ణయమున కింతమాత్ర మాధారము చాలదనుకొందును. ఐనను ఇదియొక యూహమైయుండును

1. బాల, ఏప్రిల్ 1953.

ఇది చారిత్రకమని నిర్ణయించుట కాధారములు లేనప్పుడు జానపద గేయమునకు కాలనిర్ణయ మనవసరము. నల్లతంగాళ్ అనగా మంచిచెల్లెలని యర్థము. నల్లతంబి యనగా మంచి అన్న — తమ్ముడు అని యర్థము.

పేరంటాండ్రు తప్పక వీరారాధనమునకు లక్ష్యములు. ఐనను ఓరిమి, సౌశీల్యము కూడ గొప్ప గుణములు. ప్రకృతము పరిశీలింపబడు నల్లతంగాళ్ కథయును దీని తరువాత రానున్న వీరరాజమ్మ కథయును ఇట్టి గుణములచుట్టు అల్లబడినటువంటి బంగారుగూళ్లు.

సర్వసంపదల కాలవాలమైన మధురను చంద్రవంశ్యుడైన రామలింగ రాజు పాలించుచుండెను. అతని భార్యపేరు ఇంద్రాణి. తపఃఫలముగా పార్వతీ పరమేశ్వరుల వరమున నల్లతంబి-నల్లతంగాళ్ జన్మించిరి. వారు పెద్దవారైరి. 'కుంతలరాజుయొక్క కూతురైన బాలికగు మూళియలంకారి మూదేవి చండాళిని' నల్లతంబి వివాహమయ్యెను. కొలది దినములకే అతని తలిదండ్రులు మరణించిరి. చని పోవుచు తండ్రి కుమారునితో నల్లతంగాళ్‌ను 'ఎల్లపుడు పంటలుండు హెచ్చైన దేశమును, వెదకి జూచి నీవు వివాహము చేయుమయ్యా. శ్రేష్ఠమయిన స్త్రీధనము చెల్లెలి కివ్వుమయ్యా' యని బోధించెను. తండ్రి చెప్పినటులే నల్లతంబి 'ఏటిగట్టున నిండి యుండు బట్టిగొడ్డులు స్త్రీధనము, అడవియందు నిండియుండు ఆకుమేక స్త్రీధనము, మిట్ట భూమి మేలైన స్త్రీధనము'. ఆరులక్షల దాసదాసీజనముల నమితమైన ధనముల నిచ్చి నల్లతంగాళ్‌ను కాశీరాజున కిచ్చి వివాహము చేసెను. మధుర కారుయోజనముల దూరమున నల్లతంగాళ్ తన భర్తతో నుండెను. ఏడుగురు సంతానమును గనెను. ఇట్లుండగా వారి గ్రామములందు పండ్రెండు వర్షముల కాటకము సంభవించెను. క్షుద్బాధకు నల్లతంగాళ్ అన్నగారిచ్చిన సమస్తము నమ్ముకొనెను. ఐనను కరువు తీరలేదు. అప్పుడు నల్లితంగాళ్ 'ఆకలికి తాళలేక అన్నయిల్లు పోదు' ననెను. ఆమె భర్త వలదనెను.

'ఓసి యిప్పుడు పోవ ఉత్తమము కాదబల, బ్రతికిచెడి పోరాదు బాల యొకరింటికిని బ్రతికిచెడి పోతివేని పరులు నగుదురయ్యో, పరులకు తావివ్వకు భంగమగునే తరుణి రాజ్యము పొందియుండి రాణువము వెంబడించ, ఆలాగు వెళ్ళినపుడు అందరు విలుతు రబల చెడి -పడిపోదువేని చేరి మాటలాడరుగా, గజపట్టణమునందు గడ్డియమ్మి బ్రతుకవచ్చు పిడకలు తట్టి మనము బ్రతుకుదమే తరుణి' యని యామెభర్త నిరోధింపజూచెను. ఇది జానపదులందుండు స్వాభిమానమును ఆత్మగౌరవమును సూచించును.
'పూలు పెట్టు తల పూర్వకర్మమో గడ్డిమోయ, వాసనతలయందు కట్టెలుమోయ కారణమో

గంధమెత్తు చేతులతో పేడ తట్ట కారణమో, కుంకుమెత్తు చేతులతో కూలిచేయ విధివశమో రాజైన మాయన్న నేడు రాజ్యమేలుచుండగాను' నేను తప్పక పోయెదనని సిద్ధమయ్యెను. ఆమె భర్త బిడ్డలు జాగ్రతయని చెప్పి సెలవిచ్చెను. నల్లతంగాళ్ ప్రయాణము సాగించుచుండ దుశ్శకునము లయ్యెను. పిల్లలను తీసికొని ఒంటరిగా ప్రయాణమయ్యెను. అడవులు కొండలు గడచి పోదొడగిరి. ఆకలి దప్పులకు తల్లి పిల్లలేడ్చిరి.

'ఆ పసిబాల లేడ్పు జూచి యడవియంత యేడ్వసాగె
కూన లేడ్చుట జూచి కొండలంత యేడ్వసాగె' నట.

ప్రకృతికూడ సానుభూతి చూపినట్లు వర్ణించుట ఉదాత్తముగా నున్నది. ఈ సమయమున మధురలో నల్లతంబికి చెల్లెలు కష్టములపాలగుట యంతయు స్వప్నమునందగుపడెను. అతడు పరివారముతో నల్లతంగాళ్ సాగివచ్చెడు అడవికి వేటకై బయలుదేరెను. వారలట కలసికొని దుఃఖించిరి. నల్లతంబి చెల్లెలితో, 'ఏమితక్కువ వచ్చె ఈయడవి నీవు రాను, తాటాకులేదో నీకు ధరణియందు వ్రాయుటకు, చీటి వ్రాసి పంపితేను శీఘ్రమున రానో నేను' అనెను. ఈ పండ్రెండేండ్ల కరువు సంగతి నల్లతంబికి తెలియక పోవుట వింతగానున్నది. జానపదులిట్టి పొరపాటులు చేయుట సహజమే. ఇంతియకాక నల్లతంబి చెల్లెలితో 'నీవు మనయింటికి పొమ్ము నేను వేటాడి వచ్చెద'ననెను. అప్పుడామె 'ఇల్లు తెలియలేదు యెందు మార్గమెరుగలేను, గురుతు చెప్పుమన్నా నాకు కూర్చి నేను పోవుట'కని యడుగ నాతడు కొన్ని గుర్తులు చెప్పి ఒంటరిగా పంపించెను. ఈ భాగముకూడ యసంబద్ధముగనే యున్నది. తంబి యామె నొంటరిగా నేలపంపవలె? పంపినను పుట్టింటిగుర్తులు తంగ యేల యడుగవలెను? తంగాళ్ తన బిడ్డలతో పుట్టింటికి పోయెను. ఆమె వచ్చుట చూచి వదినెగారు, మూళియలంగారి మూదేవి చండాలి సొమ్ములు దాచుకొనెను. మేడతలుపులు మూయించెను? తంగాళ్ మరియు నామె బిడ్డలు ప్రయాణాయాసమువలనను, ఆకలివలనను వాకిలిచెంత గోడుగోడున అన్నమో రామచంద్రాయని యేడ్చిరి. నల్లతంగాళ్,

'పతివ్రతను నేనైతినేని భర్త యతడయ్యేనేని, ఉత్తమ నేనైతినేని ఒకత్రాటి గొంతైన
తలుపు తాళములు తానే తెరువవలె, తానే తెరువవలె తల్లియింటి వాకిలది' యని

శపథములు పలికెను. తలుపులు తెరచుకొనెను. తంగాళ్ బిడ్డల కాకలియగుటచే వంటయింటి లోపలికిబోయెను. అచటనున్న ఫలములు పిల్లలు తినుటకై చేత పట్టిరి. కాని మూదేవి చాండాలి లాగుకొనెను. 'పండ్రెండు వర్షముల పాతమురికి

రాగులను' తినుడని యిచ్చెను. వంటకై చిల్లుల పాత్రను, వంటచెరుకుగా అరటిచెట్టు నిచ్చెను. నల్లతంగాళ్ జరిగిన పరాభవముచే, కలిగిన యాకలిచే నలిగి ఇరుగుపొరుగువారితో చెప్పి అడవి త్రోవ పట్టెను. మార్గమందు, గురుతుగా చేతి యుంగరము కొంత తంగేడాకును నుంచెను.

'భర్త మాట మీరి నేను పాపి నిందు వచ్చినాను, స్త్రీబుద్ధివల్ల వచ్చు చెడుపులగు ననేక' మని పశ్చాత్తాపపడుచు అడవిలో నున్న గొల్లలను పాడుబావి జాడలడిగి అచటికి బోయి వదినె గారిచ్చిన కుళ్ళిన పండొకటి యానవాలుగా నుంచి తన మాంగల్యము మామిడాకుపై నుంచి 'పెరిగిపోవలెను పెద్దరాయి గావలె' నని శపథము పల్కి తన బిడ్డలతో ప్రాణత్యాగము చేయ నిశ్చయించెను. ఒక్కొక్కరినే బావిలో వేసెను. కడగొట్టువాడు తప్పించుకొని,

'తల్లియగు నల్లతంగా దయచేసి వినుమమ్మా, తప్పి బ్రతికెదను తల్లిపేరు చెప్పెదను
నిలచి బ్రతికెదను నీపేరు చెప్పెదను, పుత్రు నొకని గని భూమిరాజ్య మేలెదను
యేడు బాలుల గని యెందుకు నీకీ బుద్ధి, పశువుల కాచి నేను బ్రతికియుందునమ్మ తల్లి
నన్ను చంపకుమమ్మా నల్లతంగ నాదు తల్లి'యని కరుణముగా విలపించెను. కాని

తంగాళ్ వానిని పట్టుకొని బావిలోవైచి తానును పడి మరణించెను. నల్లతంబికి దుశ్శకునములు దోచి వేట చాలించి ఇంటికి తిరిగివచ్చెను. మూదేవిచండాలి భర్తకు కపటముతో సకలసేవలు చేసెను. చెల్లెలేదని అతడడుగ నామె సమస్త సౌకర్యము లామెకు కూర్చి నేను నీళ్ళకై పోయివచ్చుసరికి ఎవ్వరును లేరు, వెదకి వేసారితినని యబద్ధము లాడెను. రాజామె మోసము గ్రహించెను. ఇరుగుపొరుగువారినుండి జరిగినది తెలిసికొని అడవికి పోయి పాడుబావిలో నున్న శవముల తీయించి సంస్కారము గావించి దుఃఖమును మ్రింగి ప్రతీకారము చేయనెంచెను. భార్యతో విచారించి తమ కుమారుని వివాహము చేయ సంకల్పించెను. పెండ్లి పేరుతో నామెను ఆమె బంధువుల నందరి నొక్కమారు చంప నిశ్చయించెను. శిల్పులతో,

'చెల్ల నీలాగు చేసె పాపి నా భార్య దాని, చుట్టాల చంపుటకు సూత్రపందిరొకటి
రాతిపందిళ్ళు మీరు రమ్యముగ కట్టవలె' ననెను. వారటులనే నిర్మించిరి. పెండ్లి

విందుల సమయమున రాజుగారు తనభార్యపక్షపు బంధువుల నందరిని సూత్ర పందిరి కూలద్రోయించి చంపించెను. ఇది పూర్వమున్న శిల్పవిద్య కాబోలు. రాజు మూదేవి చండాలిని హింసించి హింసించి చంపెను. చెల్లెలి మరణవార్తను బావగారి కంపెను. కాశిరాజు వచ్చి భార్యాపుత్రశోకమున ఆత్మహత్య

చేసికొనెను. నల్లతంబికూడ ఈ దుఃఖము చూడలేక అత్మహత్య చేసికొనెను. పార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమై చచ్చినవారి నందరిని సజీవుల నొనర్చిరి. ఇది రచయితలు 'మంగళాంతాని కావ్యాని (శాస్త్రాణి)ప్రథంతే' యనుటకొరకు చేయవలసిన పని. నల్ల తంబితో తంగాళ్ జరిగినదంతయు(వదినెగారి హింసలు) చెప్పి'చచ్చినవారుంటే జనులు నిందింతురయ్యా, మూళియలంగారి మూదేవి రాతియందు భూమి నవ్వునట్లు పొలతిని వ్రాయవలె,కారి మూయవలె క్రాల్గంటిని నవ్వవలె' ననియు ఆచారి(శిల్పి)తో'నల్లతంగా గుడియొకటి కట్టుమయ్యా యాచారి,నెలకొక యుత్సవము నీవు చేయుమాచారి,ఏడాది పండుగను ఎంచి చేయుమాచారి' యని మరల ప్రాణములు విడిచెను. బిడ్డలు ప్రాకులైరి. 'కాశిరాజు తంబియున్ను కైలాసము పొందిరి.'

పలనాటిసీమలో నధిక ప్రచారము గాంచిన కరుణాపూరితమగు కథలందు '*వీరరాజమ్మ కథ*' యొకటి. ఇందు కరుణమే ప్రధానమైనను పలనాడు రంగస్థల మగుటచేత కాబోలు వీరముగూడ కొంతస్థాన మాక్రమించుకొన్నది. మాంచాల వంటి వీరవనితలను గన్నతల్లి పలనాటిసీమ వీరరాజమ్మను గనుటలో ఆశ్చర్య మేమియు లేదు. అత్తగారి యారడికి తట్టుకొనలేక అడవిపాలైన రాజమ్మ దైవ దుర్విపాకమున దొంగల చేతులలో చిక్కి మానసంరక్షణకై కన్నకొడుకును బలినిచ్చి వీరనారీమణియై చోరుల హతమార్చి చివరకు ప్రాణములు గోలు పోయిన గాథయిది. బాపిరాజు ప్రోత్సాహమున యం.అప్పలనరసయ్య యనునాత డీవృత్తమును చేబట్టి చక్కగా పాత్రములను దిద్దితీర్చెను. ఈ కథయందు పరిశీలింపదగినది పాత్రముల శీలము. ఇందెట్టి యద్భుతకల్పనములుగాని యనవసరవర్ణములుగాని మాహాత్మ్యములుగాని లేవు. ఉన్నది ఉన్నట్లుగా, జరిగినది జరిగినట్లుగా జానపదభాషలో కథయంతయు నడచినది.

పలనాటిసీమలో రెంటచింతల గ్రామమున సంపన్నుడు నాగిరెడ్డి. అతని భార్య సూరమ్మ: దుర్గర్వ, గయ్యాళి. కలవారు కనుక నామె కెదురాడుట కందరు జంకినను 'మొగము చాటుబడిన మెటికవిరిచెదరూ వారెల్ల.' అన్ని యుండియు వారికి సంతానము లేదు. ఇరుగుపొరుగువారు,

'దీపంబు లేనిల్లు ఎట్టులుండునో ఓయమ్మ, చంద్రుడు లేని ఆకాశమట్లు మాయమ్మ
తామర పువ్వులు లేని చెరువట్లు మాయమ్మ, పెద్దలు లేనట్టి యిల్లెట్టు లుండు ఓయమ్మ
ఐదవతనము లేని యతివ యెట్లుండు సూరమ్మ,బిడ్డలు లేనిల్లు అట్టులేయుండు మాయమ్మ'

యనిరి. సంతానవిషయమై భారతీయుల అభిప్రాయమిట్టిది. లేకలేక సూరమ్మ పవపవపండువంటి బాలుని కనినది. ఆబాలకుని సౌందర్య మింతంతకాదు.

'బాలుడుండిన చాలు దీపంబు వలదింటిలో.' పేరు పేరిరెడ్డి అతడు క్రమముగా షోడశకళాపూర్ణుడయ్యెను. అతని పదహారవయేట ఒక నిదాఘము ప్రళయమైనది. ప్రజలు చీమలవలె మలమల మాడిచచ్చిరి.

'పచ్చని గడ్డెల్ల భగ్గుమనుచుండె ఎండకు, పక్షులన్ని చెట్లమొదల వ్రేలాడె బాధకు
చెరువులో చేపలు చచ్చి తేలెను ఎండకు, ఉండలేక జనులు ఊరు విడిచేరు
మండరోగము జనుల ప్రాణాలు దీసె నాయూర. నాగిరెడ్డికి జబ్బు అధికమయ్యెనుగా
అప్పుడు ఎంతచేసినగాని లాభంబులేక ఆ రెడ్డి, ప్రాణాలు దీసెను ఆపాడు జబ్బు.'

నాగిరెడ్డి మరణానంతరము పేరిరెడ్డి ఇంటికి పెద్దయయ్యెను. అతడూరివారికందరికు తలలోపల నాలుక.

'బంధుగుల ప్రేమతో బరికించుచుండు నారెడ్డి, పండుగపబ్బముల నందరిని బిలిచి యారెడ్డి
కూడుగుడ్డలనిచ్చి కూర్చుండబెట్టి యారెడ్డి, వారి నేమంబడిగి వారిదయజూచి యారెడ్డి
పెద్దలయందున వినయంబు గలిగి ఆరెడ్డి, పిన్నలందరి నెంతో ప్రేమతోజూచి ఆరెడ్డి
పేదసాదల జూచి బిచ్చంబు వేసి ఆరెడ్డి, పాలేర్లనందరిని ప్రేమతోజూచు ఆరెడ్డి.'

ఇది పేరయ్య సౌశీల్యము. జనులు పేరిరెడ్డి నాతల్లికి బుట్టవలసినవాడు కాదనిరి. ఇట్లుండ సూరమ్మ తన కొడుకునకు బేతిరెడ్డివారింటి బిడ్డ కామాక్షిని పెండ్లి చేయవలయునని నిశ్చయించుకొనెను. కాని పేరిరెడ్డి మాత్రము 'కులశీలములు కలిగి సద్బుద్ధి కలిగి మాయమ్మ, చదువుసంధ్యలు గలిగి చక్కనైనట్టి కన్యను, ఎంచుకొని నే పెండ్లిచేసుకొందును మాయమ్మా' యని తన నిశ్చయము దెలిపెను. ఆనాటినుండి తల్లికొడుకులకు సరిపడకుండెను. పేరయ్య స్నేహితుడు వీరయ్యకుకూడ సూరమ్మచే తిట్లు తప్పలేదు. వీరయ్య పేరయ్యకు తగిన చక్కని చుక్కను చూచెను. ఆమె సౌందర్యమును వీరయ్య ఇట్లు విన్పించెను.

పున్నమచంద్రుని బోలు వతిమోము పేరయ్య, మబ్బుతునకలచాటు తొలగుచంద్రుడు ఆచాన
కారుమేఘములోని మెరవు ఆచాన పేరయ్య, కొటేరు వేసినట్లుండు ముక్కు పేరయ్య
నీరుత్రాగిన కంఠమందు గనపడును పేరయ్య, పూచినలతబోలి పొలతి గనబడును పేరయ్య
పండుటాకులలోని పసరెల్ల దీసి పేరయ్య, తామరాపువ్వులో తళుకెల్ల దీసి పేరయ్య
మామిడిపండులో మధురంబు దీసి పేరయ్య, అతివ రాజమ్మను ఆబ్రహ్మ జేసె పేరయ్య.

ఈ చరణములు పెద్దనగారి 'నేరెటేటి యసల్ దెచ్చి' పద్యమును దలపించును. ఇంతవిన్న పేరయ్యకు రాజమ్మ హృదయాధిదైవత మైనది. పేరయ్య గుణగణములను, రూపసంపదలను విని రాజమ్మ కూడ అతని వలచినది. నలదమయంతులవలె వారి ప్రేమ ఉప్పొంగినవి. వీరయ్య హంసమయ్యెను. తొలుత రాజమ్మను ఆమెయన్నలు సూరరెడ్డి మున్నగువారు,

'అందమీ పండ్లకు ఆశపడియెదవా చెల్లెల, పెద్దింటివారితో పేదవారెవుఘా చెల్లెల
బంధుత్వమునుజేయ బాగుండదమ్మా' యనివారించినను పేరయ్య తమచెల్లెలిని ప్రేమించుటెరిగి యుబ్బిపోయిరి. ఒకశుభముహూర్తమున పేరయ్య మిత్రులతో రాజమ్మను చూడవచ్చి మూడుముడులు వేసెను. సారెలతో సంబరములతో వధూవరు లిల్లు చేరుకొనిరి సూరమ్మ అగ్నియై మండెను. ఇరుగుపొరుగువారు 'ఇంతచక్కనిపిల్ల యిలలోను లేదు సూరమ్మ.ఎంతపున్నెము చేసినావొ ఇటువంటికోడలు నీకు దొరికెనమ్మా కనువుదీరంగ సూరమ్మ' యన పైకి ప్రేమ నభినయించి లోని కాలుష్యమును, కాపట్యము నాచ్ఛాదించుకొన్నది. సాధింపులు మొదలుపెట్టినది. తిట్లతో పాటు, 'పాలేర్ల నందరిని మానిపించింది సూరమ్మ.దాసీల నందరిని తగ్గించినాది సూరమ్మ' పనులన్ని రాజమ్మ చేయవలసివచ్చెను. అత్త ఎంత కష్టపెట్టినను, 'పల్లెత్తుమాటైన పలుకదోయమ్మా రాజమ్మ, రాజమ్మ మగనితో చెప్పదు తల్లీ ఓయమ్మ' కొడుకింటనుండగా సూరమ్మ కోడలినేమనక, కొడుకు బయటికి పోవుటతోడనే పగపట్టి సాధించుచుండెను. రాజమ్మ పడెడు కష్టములు అమ్మలక్కలనోట నీలాటి రేవుకడ పొక్కెను.అవి పేరయ్య చెవినిబడ అతడు తల్లిని కోపించి మందలించెను. ఒకనాడు భార్య చేయుచున్న పనులజూచి మందలించి,'నాతల్లి పలుబాధలను పెట్టుచుండ రాజమ్మ,చెప్పకపోవుట బాగున్నదటవె రాజమ్మ'యని నిజము చెప్పుమనెను. రాజమ్మ కనబరచిన శాంతము భక్తి భారతస్త్రీరత్నముల సహజసంపద. రాజమ్మ కొన్నిదినములకు చూలాలయ్యెను. అన్నలు సపరివారముగా వచ్చి సీమంతమొనర్చిరి ఈసమయమున నా సీమంతిని పుట్టింటికి పోవలసియున్నను, వారి రాగబంధము రాజమ్మను అత్తింటనే యుండునటుల చేసెను. సూరమ్మకిది మరింత కోపకారణమయ్యెను. మేనగోడలు కామాక్షి చెంతకుబోయి,

'వంగనాచిముండ నాపు దొరికినది కామాక్షి,మగని తలపైకెక్కి నాట్యమాడింది రాజమ్మ
మందుమాకులుపెట్టి మతిని విరిచింది కామాక్షి, ఆయింట నేనికను ఉండలేనమ్మ కామాక్షి
నీవు కోడలివైతె కనులకద్దూదు నాతల్లి, ఎన్నాటికైనాను నీవు కోడలివి కామాక్షి' యని

శపథము చేసినది. ఇరువురు కూడబలుకుకొని రాజమ్మ పేరయ్యలకు కలహము గావింప యత్నించి విఫలులైరి. ఆసన్నప్రసవయగు రాజమ్మ పనులు చేయుచుండగా పేరయ్య మరల నొకమారు తల్లిని గట్టిగా మందలించెను. ఇంటిదాసి పేరయ్యతో రాజమ్మగారి కష్టములన్ని పూసగ్రుచ్చినట్లు చెప్పినది. సూరమ్మ కొడుకుచే మాటలుపడి కామాక్షితో చెప్పుకొనబోయినది. ఈ సమయమున రాజమ్మయందు దభిమానమున్న స్త్రీలు రాజమ్మకొరకై ఎరుకతను బిలిచి సోది

చెప్పించిరి. ఎరుకత బాల పీడయని చెప్పి శాంతిక్రియలు చేసిపోయినది. ఈ పట్టున రచయిత కొంత చక్కని హాస్యమునుగూడ ప్రదర్శించెను. రాజమ్మ మగ శిశువును కనెను గండదోషములకు ప్రతిక్రియలు జరిపిరి. పచ్చి బాలెంతరాలగు రాజమ్మను సూరమ్మ మరింత బాధపెట్టెను. రాజమ్మమాత్ర మెన్న డెదురాడదయ్యెను. ఇటుల మఱికొన్ని దినములు గడచినవి.

ఒకనాడు పేరయ్య వీరయ్యకు పిల్లను మాట్లాడుటకు గ్రామాంతరమునకు పోయెను. సూరమ్మ రొట్టె విరిగి నేతిలో పడెను. రాజమ్మకు కష్టకాలము దాపురించెను. ఒకరాత్రి కామాక్షి తోడుగా సూరమ్మ రాజమ్మను తిట్టి కొట్టి ఇల్లు వెడలగొట్టెను. చంటిపాపను చంకనెత్తుకొని రాజమ్మ,

'ఎచటికి పోదూను ఏదారి లేదూ దైవామ క్రిందాటి జన్మలో ఆలుమగలాకు నేనైతె ఎడబాపులను చేసి యేడ్పించినానో దైవామ' యని దుఃఖించుచు పుట్టింటిత్రోవ బట్టెను. మధ్యేమార్గమున గాలివాన వచ్చెను. దుఃఖజీవులకు దైవము కూడ ప్రాతికూల్యమే కనబరచును. చీకటిలో వానలో రాజమ్మకు 'కాళ్లలో ముండ్లెన్నొ గ్రుచ్చుకొన్నాయి, కాలిపొట్టలు రాళ్ళకే తగిలినాయి' పడుచు లేచుచు తడిముద్దయై రాజమ్మ బాట నడచినది. కొంతదూరము పోవ నొకయిల్లు కాన్పించినది. దేవునికి మ్రొక్కి రాజమ్మ ఆయింటి యరుగు నెక్కినది. కొడుకును గుండెల కద్దుకొని కష్టములు దలంచుకొని శోకించినది. అదివరకే ఆయింటిలోపల దొంగల గుంపొకటి యుండెను. వాన వెలసినదో లేదో చూచుట కొక గజదొంగ వెలుపలికి వచ్చి రాజమ్మను చూచెను. లోపల ఆడువారుండిరేమోయని రాజమ్మ యాతని పలుకరించినది. ఆ దొంగ లోపలికి పోయి తోడిదొంగల విచారించెను. అందరేకమై యామెను దోచుకొని మానభంగము చేయ నిశ్చయించి మోసగించి లోపలికి గొనిపోయిరి. రాజమ్మ దొంగలచేతిలో చిక్కెను. వారి మనోభావముల గుర్తించి శిలలు కరగునట్లు బతిమాలి యేడ్చినది. కాని వారంతకన్న కఠినులైరి. దైవతముల నందరిని దలంచినది కాని లాభము లేదయ్యెను. చివరకురాజమ్మ,

'ఆడజన్మము యెపుడు ఎత్తగూడాదు లోకాన, అందులో సుందారి యౌటయేతప్పా చూడంగ చక్కావి యాడూది తలవంచుకొనుచు వీధిని, పోవుచున్నా కాని పురుషూల కండ్లూ ఆమెపై పడుచూనె యుండూను ఏమిజన్మంబు ఆడుదై, పుట్టూటకంటేను యడవిలో చెట్టైపుట్టూట మంచిదావి యెంతూ నేనిప్పుడైతే యేలాగు, వీరిబారినుండి తప్పించుకొనుటాయంచు' ఆలోచింప మొదలిడినది. పై చరణములు సాధారణపురుషలోకస్వభావమును చక్కగా వెల్లడించునవి.

'దుష్టబుద్ధిని మాని నన్ను పంపండి అన్నాలు, పరసతిని మెన్నాడు కోరగూడదు ఎవ్వారు
పరసతిని పొందుట పాపంబుగాదా యెవరికు, నశియించె రావణుడు సీతను చెచ్చి
యింద్రూడు గౌతమసతి గోరి భంగపడలేదా తండ్రూలార' యని బతిమాలినది.

కాని వారి పట్టుదల ఇంకను హెచ్చెను. రాజమ్మ 'ప్రాణమైనను విడుతు మాన మీయ'ననుకొనినది. చిన్నయెత్తు ఎత్తినది. 'కడుపు పొంగూబాధ అధికమైనాది యిప్పుడే, పెరటిలోనికి పోయి తిరిగివచ్చెదను, మీరాలు అంతవరకుమనసు ఓపికపట్టియుండు' డని కోరినది. వారామె మోసగించునని తలచి కుమారుని నచ్చట విడిచి బయటికి పోయి రమ్మనిరి. ఆమె కొడుకువైపు చూచి కుమిలిపోయినది. లోలోన దుఃఖించి 'మానభంగము నొంద యిష్టంబులేక నాతండ్రి, నిన్ను అర్పించేను చేతులారంగ నాతండ్రి' యని కొడుకును దొంగల కప్పగించి బయటికి వచ్చి తలుపులువేసి బయట గొండ్లెము తగిలించినది దొంగలు లోపల చిక్కుకొని రాజమ్మను తలుపు తీయుమని కోరిరి. లేనిచో కొడుకును చంపెదమని బెదరించిరి. రాజమ్మ మాత్రము తలుపులు తీయదయ్యెను. దొంగలప్పు డాపసికందును ముక్కలుగా నరికి గవాక్షమునుండి బయటికి విసరివైచిరి. పుత్రమరణము కన్నులార జూచి మానరక్షణ దీక్షను మాత్రము రాజమ్మ వీడలేదు. ప్రాణముకన్న సర్వముకన్న భారతీయస్త్రీకి మానమే ముఖ్యమని చాటినదిరాజమ్మ. తెల్లవారునందాక రాజమ్మ అటులనే బయట కాచుకొనియుండెను అప్పుడా దారివెంబడి పదిబండ్లు పోవుచుండెను. రాజమ్మ వారిని సమీపించి తన కరుణాపూరితగాథ వినిపించి దొంగల దండించుటకై తోడ్కొని వచ్చినది. ఇంతవరకున్న శాంతమూర్తి రాజమ్మ ఆదిశక్తియై వీరావతారిణిగా మారినది. కొడుకు శరీరఖండముల జూచిన మాతృమూర్తి రాజమ్మ, వీరరాజమ్మగా పరిణమించినది. సాయము వచ్చిన వారినుండి యొక కత్తి తీసికొనినది.

పైటాకొంగువైతే నడుముకుచుట్టి రాజమ్మ, చీరెకుచ్చెళ్ళను వెనువెనుకాకు విరిచికట్టింది
కత్తి విరియబోసి కనులెఱ్ఱజేసి రాజమ్మ, శక్తిరూపమునైతె దాల్చియున్నాది రాజమ్మ.'

బండ్లవారు తోడురా రాజమ్మ ఇంటిలోపల ప్రవేశించి వీరవిహారము చేసినది. దొంగలుకూడ ప్రాణములు దక్కించుకొనుటకు ఘోరముగా పోరిరి. రాజమ్మను కత్తులచే పొడిచిరి కాని చివరకు వారందరు రాజమ్మ కత్తి కెరయైరి. రాజమ్మకు కత్తిపోట్లచే ప్రాణము లెగిరిపోవుచుండెను. కొడుకు శరీరఖండములపైయొరగి ప్రాణములు విడిచినది. బండ్లవారు తల్లికొడుకుల శవముల నచ్చట పూడ్చి యచట గుడి కట్టించి పూజలొనర్చిరి. పల్నాటిసీమ వీరపూజలకెన్నాటినుండియో

ప్రసిద్ధి గన్నది. పల్నాటివారారాధించు వీరమూర్తులందు రాజమ్మ యొకతె
ంగుట తెలుగువారి వీరభాగ్యము.

పేరయ్య వీరయ్యపెండ్లి గావించుకొని ఇల్లు చేరుకొనగనే సూరమ్మ
'దలిపై పాఁటిపోయినదని నిందమోపినది. కామాక్షిని పెండ్లాడు మనినది.
ంతలో వీరారెడ్డికి రాజమ్మ వీరమరణగాథ తెలిసెను. అతడు పేరయ్యకిది
ప్పెను. పేరయ్య దుఃఖసముద్రమున మునిగిపోయెను. తల్లిని దూషించెను.
'దళ్ల వత్తాలు కోసి తినకుండా ఉండాలి,అంచూను దేవుని ప్రార్థింతు నేను ఎప్పూడు'
ని ప్రార్థించి సంసారమును తల్లి కప్పగించి ఎటకో పోయెను.పాపమా
గహృదయుడు కూడ దారపుత్రుల జేరుకొనియుండును.చివరన 'ఇంటిలో పోరున్న
క్తి యగునూ కావున,పోరు మంచిదికాదు సిరితొలగిపోవు ఇంటాను,నలుగురూ నవ్వేదరు
ఏటాట్లు కలుగూ లోకాన,అపకీర్తి వచ్చూను అన్ని చెడిపోవు 'నని కవివాక్యమున్నది.
ల్నాటి వీరచరిత్రమందు భట్టు రాయబారమునకు వచ్చినపుడు 'పోరు మంచిది
దు భూమినెక్కడ' నన్న మాటల నీపంక్తులు తలపునకు దెచ్చును. రెండును
ల్నాటికి సంబంధించినందున రెండింటిలో వీరముండుటవలన నీగుణ మబ్బెనో
మో. జానపదగేయములందిది యమూల్యమణి. కథావస్తువు, భాష, భావములు,
రవము అన్నింట నిది మేలుబంతి.

ఇంతవరకు రాయలసీమ చాళుక్యసీమలకు సంబంధించిన కరుణ
ాత్మక గేయములగూర్చి వ్రాసియుంటిని. ఇక కాకతిసీమకు సంబంధించిన
యముల విచారింతును. మొదట నొక ముద్రితగేయము తీసికొని తరువాత
మ సేకరించిన అముద్రితగేయముల విచారింతును.

తెలంగాణమున శారదకాండ్రు 'ఎరుకల నాంచారికథ'ను పాడుచు
ట్టివోపి కొందురు. ఈకథను సేకరించి సంస్కరించి వ్రాసిన రుక్మాభట్ల
ఏమౌళిశర్మగా రిట్లనుచున్నారు.

'సుమారు మూడువందల సంవత్సరముల క్రిందట తంగెళ్ళపల్లి యను
'మమున, వెల్మ వంశంబున మూలానక్షత్రమున జన్మించిన, నాంచారి యను
ౖకను తల్లితండ్రులు దరిద్రతాబాధచే ఎరుకలవారి కిచ్చివేసిరి. అట్టి నాంచారి
ుకలవారి యిల్లు ఉద్ధరించి ప్రపంచమున ప్రఖ్యాతి వహించెను. అట్టి కథను
రదవాండ్లచే ఒకప్పుడు దీకొండ బాలనరసయ్య విని, యీకథ గ్రామ్యభాషలో
'యుమని నన్నెంతయో ప్రోత్సహించెను. ఇట్టి మహాదైన్యభావముగల కథమ
'మ్యభాషలో శారదవాండ్లు చదువునట్లుగా, వాండ్ల పదములు కొన్ని కూర్చుకొని

నా యథామతి యీచరిత్రను పూర్తిచేయగలిగితిని.'

తంగెళ్ళపల్లియను గ్రామమున వెలుమకోటన్నయను భాగ్యవంతుడుండెను. అతని భార్యపేరు నాగమ్మ. సకలసంపదలుండియు వారికి సంతానము లేదయ్యెను. అందుకై వారు తిరుపతికొండకు బోయి వేంకటేశ్వరుని సందర్శించి బీబీనాంచారు సన్నిధానమున పూజలొనర్చిరి. ఆరాత్రి బీబీనాంచారి వారి కలలో సాక్షాత్కరించి బాలిక పుట్టుననియు పేరు నాంచారయని పెట్టుడనియు జెప్పెను.(నాంచారయనగా విష్ణుదేవుని భార్య. అలమేలుమంగకును శ్రీరంగనాథుని నాచ్చ్యారుకును ఈ పేరున్నది. ఈ కథలో బీబీనాంచారును ప్రార్థించుట, నాంచారు పుట్టుట వింత. మహమ్మదీయులు తిరుపతిని శ్రీరంగమును ముట్టడింపగా స్థానికులు స్వామి యుత్సవమును ఏడాది కొకదినము అపసవ్యముగా నడుపుదుమనియు,తురకలకు వేత్రహస్తులై ఉత్సవము ముందునడచు గౌరవ మిత్తుమనియు విశేషించి స్వామికి తురకనాంచారును అమర్చెదమనియు నొప్పుకొన్నటుల వాడుక. బీబీ ఉర్దూ పదము.) దంపతులు స్వగ్రామము చేరుకొనిరి. కొన్నినాళ్ళకు నాగమ్మ గర్భము ధరించి బిడ్డను గనెను. కాని.

'బాలా బుట్టిననుండి కలిగె కష్టాలు-తొలిగె భాగ్యాలు
నాగమ్మ దినదినము రోగమ్ములొ మునిగె-తాపమ్మె కలిగె
యేడుదొడ్లావులు యేకంగా కూలె-ధరపైన వ్రాలె
ఆరుదొడ్ల కోడెలు అప్పుడు పడిపోయె-తాపమ్మె ఆయె
పంటబండే చేండ్లు వెంటనె పడిపోయె-వంటకు లేదాయె
వెలుమాల కోటయ్య వెతల పాలాయె-గతిలేక పాయె.'

కోటయ్య జ్యోతిష్కుల విచారింప వేదాల వెంకయ్యయను పండితుడు,

'మూలనక్షత్రాన బాల జన్మించె-చాలశ్రమ గూర్చె
యీబాలను యెరుకలకు యిచ్చివేయన్న-వెలమ కోటన్న' యనెను.

దారిద్ర్య మనుభవింపలేక వారా యూరనున్న యెలమంచి జేజయ్యలను ఎరుకల దంపతుల కతిదుఃఖముతో బాల నిచ్చివేసిరి.ఎరుకువారింట నాబాల ప్రవేశింపగనే వారికి లక్ష్మి వచ్చెను. 'బాల వచ్చినతోడ పంటాలు గలిగె—భాగ్యాలు గలిగె.' ఎరుకుదంపతు లాబాలకు నాంచారి యని పేరిడిరి. వారి కిదివరకే సోదయ్య యను మూడేండ్ల కొడుకుండెను. ఎలమంచి నాంచారి నతిగారాబముతో బెంచెను.

'వెండిగిన్నెల బువ్వ పేగ దినిపించూ-వెన్న దినిపించూ
తూగుటుయ్యలలోన తులతూగె బాల-పొగనూగ బాల'.

వారి సోదయ్యలు పెరిగి పెద్దవారైరి. వారిరువురికి వివాహమయ్యేను.నాంచారి ధ్యదైవతము ఎల్లమ్మ.ఎల్లమ్మ నాంచారి జిహ్వాగ్రమున నిల్లు కట్టుకొనెను. వారి చెప్పెడు ఎరుక (సోది) ప్రత్యక్షరము సత్యమై యొప్పుచుండెను. ళ్ళకు నాంచారికి బిడ్డ పుట్టెను. పేరు పాపమ్మ యని పెట్టిరి. పాపమ్మ దేండ్లదయ్యేను.

'దొరకు రాజులకు యెరుక తా జెప్పే-దేవీ నాంచారీ
చాలాగ ద్రవ్యంబు సంపాదన జేసె-దేవీ నాంచారీ'.

వారికి గోలకొండ నవాబుల కెరుకజెప్పి ద్రవ్యము గడించవలెనని కోరిక నది. అత్తమామల నడిగినది భర్త సెలవందినది.

'నాగపురి చీరెను నయమొప్పా దాల్చె-దేవి నాంచారి
పంచరంగుల రవికె బాగా తా దొడిగే-దేవి నాంచారి
బంతిపువ్వులదండ యింతి ధరియించే-దేవి నాంచారి
తనయింటి యెల్లమ్మను తగ బుట్టల బెట్టె-దేవి నాంచారి.'

ధముగా సిద్ధమై నాంచారి వాగులువంతలు దాటి చెట్టులుమిట్టలు గడచి కొండ పట్టణము చేరుకొనెను.

'చెప్పుల బజారుకు చేరవచ్చిందీ-దేవి నాంచారి
బేగం బజారులో తగ నెరుకజెప్పే-దేవి నాంచారి
బొమ్మల గుజిరియందు చొచ్చెరుకజెప్పే-దేవి నాంచారి
శాలిబండలో యెరుక చక్కగా జెప్పే-దేవి నాంచారి
పురానపూల్ వద్దకు పూబోడి వచ్చే-దేవి నాంచారి
సాహుకారి కార్వానకు చయ్యన తా వచ్చే-దేవి నాంచారి.'

పేర్కొనబడిన వన్నియు హైదరాబాదు పట్టణమం దిప్పటికిని గల వీథుల లు. ఈవిధముగా నాంచారి వీధివీధులు గడచి భాగ్యవంతుల కెరుకచెప్పి బుగారి దర్బారు చేరుకొన్నది.పహరావారి కెరుకజెప్పి నవాబును దర్శించినది. బామె యూరుపేరు లడిగి 'నాకి మనసులో వున్న శోకం జెప్తావా' యని ంచెను. నాంచారి వల్లెయని, కాశీవిశాలాక్షిని, కంచి కామాక్షిని, మధుర క్షిని,తిరుపతివేంకటేశ్వరుని, భద్రాచలరామన్నను,సిరపురి వేంకటేశ్వరుని, ంటిరాముని, కొమరవెల్లి మల్లన్నను, కొలిపాక సోమన్నను, నాచారం ంహుని,యాదాద్రి స్వామిని, గజవల్లి శ్రీరాముని దలచినది.చివర యెనిమిది ములు తెంగాణమున సుప్రసిద్ధ దేవతాస్థలములు. భద్రాచాలము సుప్రసిద్ధ

క్షేత్రము. సిరిపురమునకే చిల్పూరని పేరు. ఇది ఓరుగల్లు తాలూకాలో నున్నది. జీడికల్లు జనగామ తాలూకాలో నున్నది.కొమరవెల్లి సిద్దిపేట తాలూకాలోనున్నది. కొలిపాకయే కొలనుపాక; భువనగిరి తాలూకాలో నున్నది. యాదాద్రి యాదగిరి గుట్ట;భువనగిరి తాలూకాలో నున్నది.గజవల్లి తాలూకాపట్టణము. సకలదేవతల నాహ్వానించి నాంచారి నవాబుతో,

'నీ మదిలోగల చింతను నే జెప్పెద వినుమా సర్కారిబాబు
వడిగల నీ గుఱ్ఱంబు సూడితోటి గలదు ,,
పన్నెండు గంటల రాత్రి ప్రసవించు గనుమా ,,
పోతుగుఱ్ఱము దానికి బుట్టును నిజము ,,
నాలుగుకాళ్ళు తెల్లగ వాలము యెఱ్ఱగా ,,
నుదుట తెల్లని చుక్క కుదురుగ నుండు ,,

ఈతీరుగా ఎరుక జెప్పినది. నవాబు నాంచారిని కాపులోనుంచి చెప్పిన ఎరుక నిజమగునో కాదోయని పరీక్షించుటయేకాక పుట్టిన గుఱ్ఱపు పిల్లను దాచి నాంచారిని పరీక్షించి ఆమె మాహాత్మ్యమున కబ్బురపడెను. తత్ఫలితముగా,

'ఏడూళ్ళ జాగీరు నాడె వ్రాసిచ్చె-సర్కారిబాబు
మొహరువేసిన పత్రం ముదముతో నిచ్చె-సర్కారి బాబు.'

ఈఘట్టము గోలకొండ నవాబుల యశ్వప్రీతిని సూచించును. నాంచారి స్వగ్రామమునకు తిరిగి పోవుచు మధ్యేమార్గమున షాహాపురముఖిల్లాలో ప్రజల ప్రార్థనము విని మంచినీళ్ళ బావి పడునట్టి స్థలనిర్ణయము చేసి బావి త్రవ్వించెను.ఆ బావికి నాంచారిబావియని పేరువచ్చెను.సర్వాయిపాపని కాలమున షాహాపురములో దుర్గనిర్మాణము జరిగినది. దుర్గనిర్మాణమైన చాలదినముల కీవృత్తాంతము జరిగినదని మనము భావింపవచ్చును. నాంచారి యటనుండి తంగెళ్లపల్లి చేరుకొని మేడలు మిద్దెలు గట్టించి సంతోషముతో నుండెను.ఈ ఘట్టము ఎరుకలవారికి గల భూగర్భవిజ్ఞానమును సూచించును. పల్లెటూళ్లనుండు వాస్తుశాస్త్రజ్ఞులు బావు లెచట త్రవ్విన నీరు పడునో చెప్పెదరు.

ఇది యిటులుండగా సూర్యనాయకుడు చంద్రనాయకుడను లంబాడివారు 12 వేలతండతో గోలకొండనుండి బయలుదేరి నడచి సప్తగోదావరము దాటిరి.

'గోనెలోన సరుకు కోరి నింప్యారె-లంబాడివారు
ముత్యాలు రత్నాలు ముందుగ గొన్నారు-సంతసించారు
తినుబండారంబంత తీసుకొన్నారు-లంబాడివారు.'

ఈవిధముగా పల్లెలు పట్టణములు గడచి, వాగులు వరదలు దాటి,

'మెల్లమెల్లన వచ్చిరి నెల్లూరి సీమా-లంబాడివారు.'

పదములో గోలకొండ నెల్లూరి దారిలో లంబాడివారు సప్తగోదావరము దాటినటుల వర్ణింపబడినది. గోదావరి గోలకొండ కుత్తరమున నున్నది. కథకు కాళ్లువచ్చి గోదావరి మధ్యన దాపురించినది. లేదా గోలకొండనుండి యుత్తరముగా నడచి గోదావరి దాటి అటనుండి ద్రావిడ ప్రాణాయామము చేసి లంబాడివారు తిరిగి తిరిగి నెల్లూరు చేరిరని భావింపవలెను. నెల్లూరి రాజు వారి నాపి రాదారిచీటి (pass port) అడిగెను. వారు లేదని తిరుగబడిరి. రాజు వారిని నిర్బంధించెను. ఈ రాజెవరో తెలియదు. వారు చేయునదిలేక 'పదిసేర్ల ముత్యాలు పంపివేస్తాము-నెల్లూరిరాజా' యనిరి. వారి యైశ్వర్యము చూచిన రాజు కనులు గుట్టెను. వారి తండ నపహరింప దలచి వారితో జూదమాడెను. కాని దురదృష్టముచే తన రాజ్యమును పణముగా నొడ్డి కోలుపోయి, 'త్వరలో భార్యను చేకొని తరలి పోయాడు-దురపిల్లినాడు.' కాటమరాజుకథ మారిపోయి ఈ కథలో నీ విధముగా నతుకుకొన్నట్లున్నది.

లంబాడీలపై పగ దీర్చుకొనుటకు నెల్లూరిరాజు కొల్లాపురిగట్లకు బోయి బాలమైసమ్మ నారాధించి యాదేవిని ప్రత్యక్షము చేసికొనెను. ఎక్కడి నెల్లూరు ఎక్కడి కొల్లాపురము! జానపదుల కల్పనములకు పోలుపొందికలుండవు కదా! కొల్లాపురము బొంబాయి రాష్ట్రములో నున్నది. కొల్హాపుర సంస్థానమునకు రాజధానియగు ఆ నగరమున మహాలక్ష్మీదేవి కలదు. దేశదేశములనుండి యా దేవతను గొలుచుటకు ప్రజలు వచ్చెదరు. మహాలక్ష్మియే జానపదులనోట ఎల్లమ్మ యైనది. ఎరుకత సోదిచెప్పుట కారంభించగనే కొల్హాపురపు ఎల్లమ్మ, చాందా మహంకాళి, బెజవాడ కనకదుర్గలను తప్పక ప్రార్థించును. శక్తిదేవతల పేర్లు మాంత్రికులు వరుసగా పేర్కొందురు. ఓరుగల్లులో కూడ కాకతమ్మ, మాహురమ్మ, ఎల్లమ్మ, పద్మాక్షి మున్నగు దేవతల కట్టి ప్రసిద్ధియే కలదు. ఈపదములో కొల్హాపురము మహాలక్ష్మి బాలమైసమ్మగా చెప్పబడినది. ఎల్లమ్మ, బాలమ్మ, మైసమ్మ, మారెమ్మ, పోచమ్మ వంటి శక్తిదేవతలందరును జానపదులకు ఒకే శక్తికి మారు రూపములు. కనుక నిజముగా నీ పదమునకు కొల్లాపురముతో నెట్టి సంబంధమును లేదు. జానపదగేయములం దిట్టి యుదాహరణములు పెక్కులు. ఆమె తన కాహారమడుగ రాజు 'దేవీ లంబడితండ తినవె మాయమ్మా-బాల మైసమ్మా' యని తరలిపోయెను. లంబాడితండ నెల్లూరునుండి కొల్లాపురిగట్టు చేరుకొనగనే,

'త్వరలోనె మైసమ్మ తండాలో జొచ్చే క్రోధమ్మున వచ్చె
పాలుత్రాగె పిల్లల పట్టి దంపింది బాలమైసమ్మా
కాంతాల నచ్చట గాజర జేసింది ,,
ఆర్నూర్ల చలపెయ్య లప్పుడు జంపింది ,,
అంబా యంచావులు అప్పుడు బడిపోయె ,,
పాలు ద్రాగె లేగల పడవేసి చంపే ,,
గుట్టా చెట్టుబు కోడెల్ కూలి పడిపోయె-దిక్కూ లేదాయె.'

లంబాడి నాయకులు తండను బాగు చేయించుటకు ప్రయత్నించిరి కాని లాభము లేదయ్యెను. చివర కొక మాంత్రికుడు తాటాకుల రామన్న,

'తంగెళ్ళపల్లికి త్వరగ వెళ్ళండీ-లంబాడివారు
యెరుకల నాంచారిని యెరుకడిగి రండీ-వేగామె పొండీ' యనెను. చంద్ర నాయకుడు కొలచి రత్నములను కొంగున గట్టి పరశునాయకుని పయనము గావించెను. పరశునాయకుడు తంగెళ్ళపల్లి చేరుకొనెను. చూలాలగు నాంచారి పీటికి పోయి వచ్చుచుండెను.

'అరునెలల గర్భిణి అందము చూచాడు-లంబాడివాడు
తటుకున జూచుచు ధరపై బడినాడు-లంబాడివాడు.'

నాంచారి లంబాడివాని మనమును గుర్తించి సున్నితమైన హాస్యముతో హేళనముగా 'చక్కదనమూ చూచి సాగిలపడితీవా - లంబాడివాడ'యని ప్రశ్నించినది. లంబాడి తేరుకొని పశ్చాత్తాపపడి వచ్చినపని చెడుటయేకాక తన ప్రాణములు దక్క వనుకొని 'మూడునాళ్ళనుండి కూడులేదమ్మా,ఎరుకలి భామ'యని యబద్ధమాడి తప్పించుకొనెను. వచ్చినసంగతి మనవిచేసి రత్నాలు ముత్యాలిత్తును తండను లేప రమ్మనెను. నాంచారి రాననెను. లంబాడి,

'పగిడి గవ్వల గద్దె బాగా జేయిస్తా యెరుకాల భామ,చంద్రహారము నీకు చేయిస్తనమ్మా యెరుకాలభామ,నీవు కోరిన సొమ్ములె నేసిస్తనమ్మా యెరుకలభామ'యనెను. లంబాడి ఈ మాట లనుటతోడనే 'భామ సొమ్ములకొరకు భ్రమలో పడిపోయె-ఎరుకలభామ.' తమ కెన్నియున్నను భూషణములపై స్త్రీల కెక్కుడు కాంక్షయను స్వభావ మిట కన్పట్టును.నాంచారి అత్త నాజ్ఞవేడెను. ఎలమంచి లంబాడికులము 'మరియాద లేని కులము మక్కారికుల'మనియు,'అరిగి ఎరుకా జెప్ప అచ్చిరాదమ్మా'యనియు పల దనెను.ఎటులో యత్తను బతిమాలి నాంచారి బయలుదేరెను.ఎన్నో అపశకునములు చూపట్టెను. భయము శంకించి నాంచారి లంబాడితో రాననెను కాని లంబాడివా డతిదీనముగా వేడుకొనుటచే నాంచారి పయనమై కొల్లాపురము చేరుకొనెను.

జరిగినసంగతి జరిగినట్లుగా ఎరుకజెప్పెను. శాంతికై బాలమ్మకు తగు బలి నీ విధముగా చెప్పెను.

'పన్నెండు మేకాల పట్టుకరావయ్యా లంబాడివాడ అయిదు దున్నపోతుల నాహార మిడరా
పందుము పచ్చిముగ్గు పట్టుపేయాలె ,, మానెడు వూదుపొగ మైసమ్మకు పేయాలె
మూడుతూముల కుంకుమ మెుందుగజల్లాలె ,, అయిదుపుట్ల అన్నము అప్పుడు రతి[1]పోయాలె
బాలమ్మకెదురుగ వాదం[2] దీయాలెర ,, చెలుకపారలుౘ[3] బట్టి సిద్ధంగుండాలెర
మట్టిపారలు చేతపట్టి వుండాలెర ,, ఆరునెలల గర్భిణిని అందుంచవలెర
పారలచేత మన్ను బాగా బొయ్యాలెర ,, గడ్డపారలచేత గట్టిగ దటించాలెర
వత్తి జేసి దీపము నెత్తిన బెట్టాలెర ,, బోనముకుండా నెత్తిన బోర్లా వెయ్యాలెర
నేను జెప్పిన పనులు నీవు జేయాలెర ,, లంబాడివా రన్నియు సమకూర్చిరి

కాని ఆరునెలల గర్భిణి వారికి దొరకుటకు లభింపదయ్యెను. నాయకులు రహస్యాలోచనము చేసిరి.సూర్యచంద్రనాయకులు నాంచారినే బలిగా నీయవలెనని నిశ్చయించిరి.పరశునాయకుడీ దుశ్చింత వలదని వారికి బోధించి వారిచే బంధితుడయ్యెను. లంబాడివారు నాంచారిని మోసగించి బలిగా పూడ్చిరి. అప్పుడామె,

'నన్ను దట్టించుట న్యాయము గాదురా లంబాడివాడ అబ్బబ్బ నిలువండి అలసిపోతున్నాను
నన్నుజంపకు తండ తిన్నగ దోలిస్తాం ,, ఇప్పుడు నేను బాలను మెప్పించుకుంటాం
బండారొలికిన గాని పయనమై వచ్చార ,, దమ్మి తియ్యాలేక తాళలేకున్నాం
గర్భంబున పిండంబు కిలికలాయెర ,, యని కరుణముగా విలపించినది.

కాని కఠినచిత్తుల మనము కరుగదయ్యెను.గర్భము చితికి నాంచారి ప్రాణములు విడిచెను.వారొనర్చిన ఘోరకార్యమును జూచి బాలమైసమ్మ నాంచారిని దేవతగా జేసినది. నాంచారి దేవతయై 'తండను శీఘ్రమ్మున ధరణి పాల్జేసింది.' పరశు నాయకుని బంధములు విప్పి,

'నీవంశం ధరలోన నిల్చిపోతాదీర లంబాడివాడ-నీవున్నచోటను నిల్చు నాజెండా
సంవత్సర మొకసారి జాతర గావించు' అని చెప్పి తంగెళ్ళపల్లిలో మగని కలలో జరిగినదంతయు చెప్పినది. గోలకొండ నవాబునకు స్వప్నమున సాక్షాత్కరించి గుడికట్టించి జాతర చేయుమనినది. ఎలమంచిజేజయ్యలు కొల్లాపురము చేరి నాంచారి శవమును దీసికొని తంగెళ్ళపల్లి చేరిరి. నవాబచట గుడి కట్టించి జాతర చేయించెను. ఈ విధముగా నాంచారి కరుణరసపూరితగాథ ముగిసినది. చివరకు రచయిత తన్నుగూర్చి,

---

1. కుంభము. 2. ఓదము. 3. మట్టి త్రవ్వెడువారలు.

విధుమౌళిదాసుడు విరచించినాడయ్యా  తందానెతాన
పఠియించినవారికి భాగ్యమబ్బునయ్యా  ,,
నందన మార్గశీర్షమందు రచియించే  ,,  యని చెప్పుకొనెను.

గోలకొండ నవాబుల ప్రసక్తి యుండుటచే నీకథ పదునెనిమిదవ శతాబ్దమునకు సంబంధించినదని యూహించవచ్చును. లంబాడివారొనర్చిన ఘోర మిందు సూచింపబడినది. ఇప్పటికిని తెలంగాణమున అచ్చటచ్చట లంబాడి తండాలున్నవి. లంబాడివారు కూడ ఒకవిధమగు సంచార జాతివారే. మొన్న మొన్నటివరకు ఈజాతి నేరములొనర్చు జాతులలో చేరియుండెను. ఇప్పుడిప్పుడే లంబాడివారు నాగరికము పెంచుకొని చదువుసంధ్యలు నేర్చుచున్నారు. వీరికి భాష యున్నదేకాని లిపి లేదు. సాంచార లంబాడితండ కెరుక చెప్పబోవుటకు సిద్ధపడి నప్పుడు ఎలమంచి లంబాడివారిని నమ్మరాదని చెప్పినమాటలు గమనింపదగినవి.

ఇంతవరకు పరిశీలించిన కథలన్నిటికన్న దీనియందు ప్రసన్నమగుశైలి కానవగును. ఒడుదొడుకులు లేని రచనము. శారదకాండ్రకు ప్రీతిపాత్రమగు అంత్యప్రాసనియమ మిందు కానవగును. శారదకాండ్రధికముగా నీకథను ప్రచారము చేయుదురని మొదటనే చెప్పియుంటిని.

తెలంగాణమునం దిట్టి కథలు పెక్కులున్నవి. పిచ్చుగుంటులు, శారద కాండ్రు, ఎఱ్ఱగొల్లలు, బుడిగెజంగాలు మున్నగువారి నోట తెనుగువారి కారుణ్య మొలుకబోయు కథలనెన్నంటినినేని పిడికెడుబిచ్చముపెట్టివినవచ్చును. కావలసినది ఔదార్యము కాదు, కేవల మోపిక. చేత కలమందుకొనవలెగాని పొట్టకూటికి పూర్తిగాలేని ఈవీధిమానిసులనోట రాలెడు ముత్తెములనెత్తి సాహిత్యవీథులందు కుప్పలు వోయవచ్చును. చేయితిరిగిన పెద్దలెవరైన సాహసించి వాని చేబట్టి దిద్ది తీర్చవలెగాని రవ్వలు రాల్చవచ్చును. ప్రపంచ సాహితీ సౌధమునకు పతాక లెత్త వచ్చును. ఎరువుసొమ్ముల బరువుచేటుగా తలధరించు తెలుగువారికిగల దారిద్ర్య మంతయు చేజేత తీసివేసినట్లు పోవును. పూర్వులైన మన శిష్టులు కావలసిన వస్తువును సంస్కృతమునుండి సంతరించిరి. నవ్యులు వేరొకరికి తెలియకుండు నంతటి చాకచక్యముతో పాశ్చాత్యులనుండి సంగ్రహించుచున్నారు. పొరుగింటి పుల్లకూర రుచియను సామెతకు మనదేశముననే సార్థక్యము. ఆచౌర్యమెరిగిన వారు ఎరుగనట్లు నటించుచున్నారు. అందరుమ కలిసి మనదేమియు లేదను చున్నారు. లేని లేమిని ప్రసాదించుచున్నారు. ఉన్న కలిమిని కనుల చూడలేక పోవుచున్నారు.

ఇట్టిపాటలను నేను మూడునాలుగింటిని సేకరింపగలిగితిని. అవి యన్నియు అముద్రితములే. మొదటిది సుప్రసిద్ధమై బహుళవ్యాప్తినందిన 'రావులమ్మ' (రాములమ్మ) పాట. రెండవది *'సరోజినికథ'*. మూడవది *'మూసి పొంగిన కథ'* అనగా కీలకనామ సంవత్సరమున మూసానది (ముచికుందానది) ఉప్పొంగి హైదరాబాదుపట్టణము కొట్టుకొనిపోయిన కథ. నాల్గవది మొనమొన్నటి జనగామ రైలుప్రమాదగాథ. ఏదేని సంఘటనము జరిగినవెంటనే జానపదులనోట నది కవితారూపమున ప్రచారము గాంచుననుటకు చివర రెండు పదములు సాక్ష్యములు.

ఈనాల్గు పదములందు రావులమ్మ- రాములమ్మ పదమున కధికప్రచారము కలదు. రావులమ్మకన్న రాములమ్మయను శబ్దము సాధు వనుకొందును. తెలంగాణమందన్ని మండలములందును పాడబడునట్టిపదమిది. ఐనను నల్లగొండ మండలమున నింకను ప్రచార మెక్కువ. కారణము ఈపదము నల్లగొండ మండలమునకు సంబంధించిన దగుటయే. ఆమె పేరంటాలై వెలసినది, కనుక ఆమె పేరును స్త్రీపురుషులు భక్తి చిహ్నముగా ధరింతురు. అట్టి పేరులు అనగా స్త్రీయైనచో రాములమ్మ పురుషుడైనచో రాములయ్య యనునవి నల్లగొండజిల్లా యందధికము. జనగామ తాలూక (పూర్వమిది నల్లగొండ మండలమున నుండెను కాని ప్రస్తుతము ఓరుగల్లు మండలమున చేర్పబడినది) లో నున్న మల్లాపురము, గుండ్లసాగరము మున్నగు గ్రామముల సమీపమున నీ కథారంగమగు గ్రామ మున్నటుల పాట వినిపించిన శారదకాండ్రు చెప్పిరి. రెండు మూడు చోటుల నేనీ పాటను సేకరించితిని1. వాని నన్నింటి నొకకడ జేర్చి చదివినచో మనకు కథా స్వరూపము సమగ్రముగా గోచరించును.

రాములమ్మ పాటకు రామాయణగాధతో కొన్ని పోలికలున్నవి. రాములమ్మ

1. 1952 ప్రారంభమున మాయూర శారదకాండ్రు చెప్పగా వ్రాసికొంటిని. 14-4-52 సోమవారం రాత్రి 9-30 గంటలకు తడిసిన పాపయ్య, సంకోజి చంద్రయ్య కొండలింగయ్య, బొడ్డు వెంకులు అనువారు నకిరెకల్లు గ్రామమున(నల్లగొండమండలము) చెప్పగా వ్రాసికొంటిని. జానపదగేయముల సేకరించుట యనునది పెద్ద సమస్య. మైళ్ళ కొలది నడచి ఆశాభంగముతో తిరిగివచ్చిన ఘట్టము లెన్నియో కలవు. పైవారు ఊరక చెప్పరైరి. అచ్చటి పోలీసు ఉద్యోగుల సహాయముతో పట్టి తెప్పించి బలవంతముగా పాడించి వ్రాసి కొంటిని. నాయుద్యమమున నిట్టివి రెండు మూడు ఘటనలున్నవి. వానిలో నిది ప్రథమము, వింత సంఘటనము కనుక నిట నీవిషయ మప్రస్తుతమైనను పేర్కొనవలసివచ్చినది. మూడవప్రతి మిత్రులొకరు సేకరించి పంపించినది.

సీత; భీమారెడ్డి, రత్నా(లక్ష్మ)రెడ్డి యన్నదమ్ములు రామలక్ష్మణులు; లంబాడివాడు రావణుడు; రాములమ్మ భీమారెడ్డి దంపతుల పెంపుడుచిలుక (పావురము) మారుతి. మోసగించి సీతమ్మను రావణు డపహరించినటులే కడుపునొప్పిచే బాధపడు రాములమ్మను అడవిలో నొంటరిగా బోవుచున్నదాని నౌషధ మిత్తునని మోసగించి లంబాడివా డపహరించెను. చెరలోనున్న సీతమ్మ రావణునకు వశముగానటులే చెరలోనున్న రాములమ్మ వ్రతమను మిషచే లంబాడివాని వశముగాక తన సౌశీల్యమును గాపాడుకొనెను. సీతజాడ మారుతి తెచ్చినటుల భీమారెడ్డికి పావురము రాములమ్మ వార్త దెచ్చెను రావణాసురుడు రాక్షసుడు, మాయావి. లంబాడివాడు బలవంతుడు, అంతకన్న మాయావి, మంత్ర తంత్రము లెరిగినవాడు, పిక్కలలో తాయెతులున్నవాడు. రావణవధానంతరము సీత యగ్నిప్రవేశము జరిగినట్లే లంబాడివాని వధానంతరము రాములమ్మ అగ్నిగుండము జొచ్చి తనపాతివ్రత్యమును నిరూపించుకొనినవి. అమెసీ పలెకొన్నాళ్ళ సుఖమే యనుభవించినది. జనాపవాదమునకు భయపడి సీతమ్మను రాముడు మరల నడవికి పంపించెను. కుశలవయుద్ధానంతర మామె భూగర్భమున ప్రవేశించినది. అటులే జనాపవాదభీతిచే భీమారెడ్డి కోరగా రాములమ్మ రెండవమా రగ్నిగుండమున ప్రవేశించి, దేహత్యాగము చేసినది. పేరంటాలై వెలసినది. రాములమ్మ పదమునకు రామాయణముతో గల పోలికలివి.

పదము మూడువంతులు సంభాషణ పద్ధతిని ఒకవంతుమాత్రము వర్ణనా పద్ధతి—కథన పద్ధతి-ని నడచినది. కనుక నీపదమందు కొంత నాటకీయత కలదని మనము భావించవచ్చును. దీనికి బలముగా నింకొక విషయము కలదు. తక్కిన పదము లన్నింటి యారంభమున పాత్రముల పుట్టుపూర్వములో లేక ప్రదేశవర్ణనము మున్నగు విషయములో యుండును. కాని రాములమ్మ పాట ఏకాంకికవలె ఆరంభమగును. కీ॥ శే॥ కట్టమంచి రామలింగారెడ్డిగారి మాటలందు చెప్పదలచినచో నీపదమందలి కథావివరణము కాలసరణిగాక హేతుసరణిని నడచినది రాములమ్మ పొలముచెంత నాగలిదున్ను తనభర్త మరియు మరది మున్నగువారికి చద్ది గొంపోవుచు మార్గమధ్యమున నొక చెట్టునీడలో కడుపు నొప్పిచే బాధపడుచుండ ఆ బాటవెంబడి పోవుచున్న లంబాడివాడొకడు ఆమెను పలుకరించుటతో నీగేయ మారంభమైనది.

'పిరిమల్లె చెట్టుక్రింద-రాములమ్మో రాములమ్మ
చిన్నబోయి వున్నవేమొ-రాములమ్మో రాములమ్మ'

ఈ ప్రశ్నమునకు రాములమ్మ,

'నా కడుపుల నొప్పిరా-లంబాడయ్యో లంబాడయ్యా
ఆయాసపడుతున్నర-లంబాడయ్యో లంబాడయ్యా' యని సమాధాన

మిచ్చెను. రాములమ్మ సౌందర్యమును జూచిన లంబాడివానికి ద్రోహచింతనము కలిగెను. మొదటనే ద్రోహచింతనము కలిగెనో లేదో మన మిదమిత్థముగా చెప్పజాలము. కాని కడుపునొప్పియని చెప్పిన రాములమ్మతో లంబాడివా డిట్లనెను.

నీ కడువుల నొప్పికి రాములమ్మో-ఔషధమిస్తాను రాములమ్మో
మా తండకు రావమ్మ ,,

నీతండ ఎంతదూరమని రాములమ్మ యడుగ వాడు,

అర్ధ పర్వమీద రాములమ్మో నా తండ ఉన్నాది రాములమ్మో అనిచెప్పి
సానమీది ఔషధము ,, నూనెలో ఇస్తాను ,, అనెను.

ఇటులే పదమంతయు సంభాషణలో నడచిపోయినది.

అటువంటి మందూలు లంబాడోడో లక్షలు దాగినరో లంబాడోడో
కోటీపైసా బెట్టి ,, కొల్లలుగ దాగినరో ,,
రాగిపైసా బెట్టి ,, లక్షలు దాగినరో ,,
ముద్దపైసా బెట్టి 1 ,, మురిదిడ్డిగ దాగినరో ,,
పై పత్తెము దీంలేదు ,,

రాములమ్మ భర్తను, మరదిని, అత్తను, ఆడుబిడ్డను పంపెదను మందివ్వ వలసినదని లంబాడివాని గోరెను. కాని వాడన్నింటికి సమాధానముగా 'నీకు మందైన పారదు రాములమ్మా' యనెను. నాకు నడచుటకు చేతగాదని రాములమ్మ యన

చేతులా బట్టిండు లంబాడోడు చెరలగోనె కట్టె2 లంబాడోడు
మంత్రాలు జదివిండు ,, రాములమ్మమీద ,,
రూపాయి నొప్పీకి ,, పావులకె తచ్చాయె ,,

ఈకారణముగా లంబాడివాని శక్తిపై రాములమ్మ కధికవిశ్వాసము కలిగినది. ఆమె వెంటనే.

'ఏడూరి చెర్వేనుక లంబాడోడా ఏడుమోటలబావి లంబాడోడ
ఏడుమోటల బావిక్రింద ,, ఏడుపుట్లా చేను ,,
నా పెనిమిటి భీమరెడ్డి ,, నామరదీ లక్ష్మిరెడ్డి ,,

---

1. ముద్దపైసలు-సుమారు నలుబది సంవత్సరములక్రింద చలామణిలో నుండెను.
2. మంత్రదండము.

మోట గొడ్తున్నారు లంబాడోడా సద్దూలు నేనిచ్చి లంబాడోడా
నీతండ కొస్తానిర ,, యనెను. కాని లంబాడివా డిటులనెను.

సద్దూలు తెచ్చినవా రాములమ్మో దూపాలు[1] తెచ్చినవా రాములమ్మో
చిగిరెంత గడ్డీల ,, పెయ్యవే కొచవాలి ,,
సిరిమల్లె చెట్టుకు ,, తాపవే దూపాలు ,,

రాములమ్మకు కొడుకు జన్నారెడ్డి—చంటిబిడ్డ శాంతమ్మ జ్ఞప్తికి వచ్చిరి. ఆమె మరల నేనిల్లెంత దూరము నడువగలననెను. వాడు,

నడువ చేతగాకుంటె రాములమ్మో గోనెఎద్దున్నాది[2] రాములమ్మో యనెను.

రాములమ్మ నాది కాపుకులము లంబాడోడో నీది లంబాడి కులము లంబాడోడా
మీయెద్దు మీదైన ,, మేమైన కూచోము ,,

అని నిరాకరించెను. కాని లంబాడివాడు 'చెరలగోనెకట్టె తీసి' మంత్రించెను. రాములమ్మ ఆకర్షింపబడెను.లంబాడివాని యెద్దెక్కి రాములమ్మ ప్రయాణమైనది. కొంత బాట సాగినది. అరపరువు దాటినను తండ రాదయ్యేను. రాములమ్మ మోసము శంకించి ఏడ్వదొడగెను. లంబాడివా దేకాకియైన రాములమ్మను బెదరించుటయేకాక ఒకటి రెండు దెబ్బలు కొట్టెను. అప్పుడామె 'చేసుకున్న పెనిమిటితో లంబాడోడో,దెబ్బైతె తినలేదు లంబాడోడో' అని తనవారిని దలచు కొని వలపోసినది. లంబాడివా డామెతో,

కొడుకు కొడుకంటావు రాములమ్మో ఎక్కడి కొడుకమ్మ రాములమ్మో
బిడ్డ బిడ్డంటావు ,, ఎక్కడి బిడ్డమ్మ ,,
కొల్లాపురి గట్లల్ల ,, కొల్లంగ పెండ్లాడ్త ,,

యనెను.ఇప్పటికి వాని దుశ్చింతనము పూర్తిగా బయల్పడినది. పాపము రాములమ్మ పంచప్రాణము లెగిరిపోయినవి. ఆమె వానిని తిట్టినది; బతిమాలినది.

నీ శిరసు తెగిపడర లంబాడోడా నీతాడు దెంపార లంబాడోడా
వేరు గుడిసేస్తారు ,, ఎత్తి కూడుబెడ్తారు ,,
కులాన రెడ్లము ,, అనబోకు అనబోకు ,,
పాపకర్మండైన లంబాడన్నా మచ్చూను ఇల్లిందు లంబాడన్నా

కాని మచ్చుమందుల ఇల్లి లంబాడోడు మరి మోసగించిండు లంబాడోడు
గోనెెద్దుమీద ,, తీసుక పొయ్యిండు ,,

1. గంజియన్నము 2. బరువులు మోసెడు ఎద్దు

చెలుకపురి గట్లల్లకు లంబాడ్డోడ్డో ఏనెలకు తెచ్చిండు లంబాడ్డోడ్డో

కొల్లాపురం గట్లల్లకు ,, మరి తీసుకొచ్చిండు ,,

(పాఠాంతరము)

ఎఱుకల నాంచారి కథలో వలెనే దీనిలోగూడ కొల్లాపురము ప్రసక్తివచ్చుట గమనింపదగిన విషయము.వాలుగొండ కొల్లాపురమువంటి పట్టణములకు ప్రసక్తి లేకున్నను అవి జానపద గేయములందు స్థానము కల్పించుకొన్నవి. సంబంధము లేకున్నను ఒక పాటలోని విషయములు వేరొకదానిలోని చొచ్చుకొనిపోవుట జానపదగేయలక్షణములం దొకటిగా భావింపనగును.

ఎండలకు ఎత్తిండు లంబాడ్డోడు ఎండిపట్టు దేరా లంబాడ్డోడు

సీడలకు ఎత్తిండు ,, సీలిపట్టుదేరా ,,

పైన పేర్కొనబడిన పాదములన్నియు కవి వాక్యములు. సంభాషణమున గాక వర్ణనమున కథ నడచిన విచట. రాములమ్మను లంబాడివాడు పట్టుదేరాలం దుంచెనట. కాని,

చిలుపుల చిలుపుల వాసన లంబాడ్డోడు-గదురు గదురు వాసన లంబాడ్డోడ

ఆతరువాత లంబాడివాడు రాములమ్మ కడుపునొప్పికై మందు సిద్ధము చేయనెం

చెలుకపార బట్టిండు లంబాడ్డోడు గడ్డపార పట్టిండు లంబాడ్డోడు

తూరుపు బోయిండు ,, తుంగేరు దెచ్చిండు ,,

ఉత్తరంబు బోయిండు ,, ఊడుగేరు దెచ్చిండు ,,

పడమటికి బోయిండు ,, పత్తేరు దెచ్చిండు ,,

దచ్చినంబు బోయిండు ,, దంతేరు దెచ్చిండు ,,

కుమ్మరింటికి బోయిండు ,, కుండైన దెచ్చిండు ,,

కోమటింటికి బోయిండు ,, సోడైన దెచ్చిండు ,,

సానమీది మందు ,, నూనెతో కలిపిండు ,,

పొద్దు పొడువంగానె ,, భట్టైన బెట్టిండు ,,

పొద్దు గూకంగానె ,, భట్టైన దించిండు ,,

చేరెడంతా మందు ,, చిరిగి గిన్నెల బోసిండు ,,

లంబాడివాని దుష్టచింతనమెరిగి రాములమ్మ యది చావుమందా బ్రతికెడు మంద యని ప్రశ్నించినది. శూలకు మందని లంబాడివాడామెచే బలవంతముగ త్రాగించెను.మందుత్రాగి రాములమ్మ 'పిల్లికూనవలె ముల్చుకొని' నిద్రపోయినది కందిపప్పుతో ఏడుగడియల పథ్యమని లంబాడివా డనెను. మందుత్రాగిన ఒక్క గడియకే నొప్పితగ్గిపోయెను. రాములమ్మ వాని నిటుల ప్రార్థించినది.

నాకదుపుల నొప్పైతే లంబాడన్నా కుదిరి పోయిందీర లంబాడన్నా
మాయింటికి పోతార ,, నన్నైతె తోలించర ,,

కాని లంబాడివా డందులకు సమ్మతించలేదు.

పోతానికి[1] వచ్చినవ రాములమ్మ నీ సుందర రూపంబు రాములమ్మ
నేజూచి తెస్తినె ,, యన్న లంబాడివానిని రాములమ్మ

మరల ప్రార్థించినది.

ఇటువంటి మాటలు లంబాడన్నా చెప్పులారా విని లంబాడన్నా
వలవల నాతల్లి ,, వలపోయ దొడగింది ,,
హరహర ఓతండ్రి ,, అనబోకు అనబోకు ,,
నీవైన అన్నవుర ,, నీకు చెల్లెల నేను ,,

కాని వాని శిలాహృదయము ద్రవింపదయ్యెను. వాడింకొక యెత్తు ఎత్తెను.

ఎంచాక ఇప్పుడు రాములమ్మ ఏడువేల ధనము రాములమ్మ
కుప్పబోసి నీవు ,, కదిలి పోవచ్చును ,,

అని మందు పైకమడిగెను. రాములమ్మ,

నాల్గువేల ధరది లంబాడన్నా నడుము వొడ్డాణము లంబాడన్నా
నాల్గుపైసల సోదకిచ్చె ,, ఏడువేల ధరది ,,
ఏలుకు నుంగరము ,, ఏర్ల మందుల కిచ్చె ,,
పదివేల ధరది ,, పాపెట బొట్టైతె ,,
పాపెదు నూనె కిచ్చె ,,

ఇన్ని సొమ్ములు తీసికొన్న తరువాత లంబాడివాడు,

నీ చీరె విడువావె రాములమ్మో నా లంగా గట్టావె రాములమ్మో
నీ గాజులు చిట్లిచ్చి ,, నాగాజులు పెట్టావె ,,

యని బలవంతము చేయసాగెను. రాములమ్మ తనకొక వ్రతము కలదని కాలమును గడపుచుండెను. అచట రాములమ్మ భర్త భీమారెడ్డి రాములమ్మకై వెదకి వెదకి విలపించెను.

భూలక్ష్మి మింగేనా రాములమ్మో ఆకాశం మింగేనా రాములమ్మో
ఏమి దిన్నదో ఏమొ ,, తొల్లేల శాంతమ్మ ,,
వలపోతు ఉన్నాది ,, భీమారెడ్డి ఉత్తరము వ్రాసి తన పెంపుడు

పావురమునకు (చిలుకకు) కాలునకు గట్టి విడిచెను. పావురము తిరిగి తిరిగి

1. పోవుటకు

కొల్లాపురము గట్లనడుమ లంబాడివాని డేరా చేరుకొని రాములమ్మను చూచెను. రాములమ్మ ఉత్తరమందుకొని దుఃఖించి ప్రత్యుత్తరమున తన దీనావస్థనంతటిని తెలుపుచు భర్తను సపరివారముగా సాయుధముగా ఎల్లమ్మతీర్థమునకు (జాతరకు) రహస్యముగా రమ్మని వ్రాసి దానిని పావురము కాలునకు కట్టి పంపించెను. భీమారెడ్డి ఉత్తరమందుకొని కోపోద్దీపితుడయ్యెను

దండ గరచినాడు భీమారెడ్డి-దండ గరచి తాను భీమారెడ్డి
బుక్కెడు రక్తము ,, -భూమీమ్మీద ఉంచిండు ,,

తమ్మునితో తగిన ఆయుధములతో భీమారెడ్డి మారువేషమున బయలుదేరి కొల్లాపురము చేరుకొనెను. ఎల్లమ్మజాతర జరుగుచున్న దినములవి. లంబాడివాడు రాములమ్మను వెంటనిడుకొని లంగాలు గాజులు కొనుటకై జాతరలో సంత జరుగుచోట తిరుగుచుండెను. కాపుసోదరులు లంబాడివానిపై బడిరి.

చేయి చేయి గలిసింది లంబాడోడో-జగడామె పుట్టింది లంబాడోడో *

లక్ష్మారెడ్డి తన చంద్రాయుధముతో లంబాడివాని గొట్టికొట్టియలసెనే కాని లంబాడివాడు చావడయ్యెను. వాడు మంత్రములు మహిమలు గలవాడు. అప్పుడు భీమారెడ్డి తన సత్యపరత్వమును సంస్మరించి ఆయుధమును,

అరచేతుల నలిపిండు భీమారెడ్డి-అంకించి వేసిండు భీమారెడ్డి

ఈ దెబ్బతో లంబాడివాని శిరము తెగిపడెను. వాని మొండెము గుట్ట కూలినట్లు కూలిపోయెను. రాములమ్మ భర్తకాళ్ళపై బడెను. ఇన్నాళ్ళు లంబాడివాని చెరయందున్న రాములమ్మను భీమారెడ్డి స్వీకరించుటకు శంకించెను. ఆమె తన మాహాత్మ్యముచే చిటికెన వేలుతో పెద్ద గుండును లేవనెత్తినది. వారగ్నిగుండములు కావించి వానిని దాటి తన సౌశీల్యమును ప్రదర్శింపుమనిరి. రాములమ్మ అగ్నిగుండములో దూకినది.

చీలమండల వరకు రాములమ్మో-నీళ్ళైన ఊరినవి రాములమ్మో

భీమారెడ్డి రాములమ్మను శీలవంతురాలని నమ్మి ఇంటికి తోడుకొని పోయెను. ఉత్తరరామాయణములో సీతపై ప్రజలు అపవాదును కల్పించినటులే రాములమ్మపై ప్రజలు నిందమోపిరి. రాముడు సీతను ప్రజాపవాదమువలన నడవికి పంపించెను. కాని భీమారెడ్డి యటుల చేయడయ్యెను. తనభార్యను నమ్మి ప్రజాభిప్రాయమును తృణీకరించెను. ప్రజలమాటలు పెచ్చు పెరిగినవి. రాములమ్మకు ఇరుగుపొరుగుల సూటిపోటిమాటలు వినబడినవి. తనతోపాటు తన భర్త కూడ నిందితుడగుట

ఆమెకు సహింపరానిదయ్యెను. దేహము చాలించుట శ్రేయమని భావించెను. తనకు తానై,

ఊరికి ఉత్తరాన రాములమ్మో-కాడుపేర్పించింది రాములమ్మో
చిచ్చురికి పోయింది ,, -మూడురోజులకల్ల ,,
మరి యెట్లఉన్నాది రాములమ్మో-చాచెలువ తడితోడ రాములమ్మో'
దేవ కన్యక ఐంది ,,

భర్తకు స్వప్నమున గనబడి గుడి కట్టించి వారమువారము జాతర చేయించుమని కోరినది. భీమారెడ్డి యటులే చేసెను. రాములమ్మగాథ విన్నవారికి తలచినవారికి పాపభయము లేక సకలసంపదలు కలుగును.

నేను సేకరించిన అముద్రితములగు పదములం దొక్కటి మాత్రమే యుదాహరింప గలిగితిని. విస్తరభీతిచే తక్కిన పదములను విడుచుచున్నాను.



# హాస్యపు పాటలు

నవరసములందు హాస్యమొకటి. దీనికి హాసము స్థాయి. తక్కినవాని వలెనే హాస్యముకూడ బ్రహ్మానందసహోదరమని మన పూర్వాలంకారికు లంగీకరించుట భారతీయులకు హాస్యముపట్ల గల యభిమానమును చాటుచున్నది. కాని హాస్యమును గూర్చి పాశ్చాత్యుల దృక్పథము వేరు; మన దృక్పథము వేరు. పాశ్చాత్యుల హాస్యరచనములు చూచి మనవారు అట్టి సాహిత్యము మనకు లేదని పెదవి విరిచెదరు. అట్టి సాహిత్యము మన కధికముగా లేని మాట వాస్తవమైనను కొరత మాత్రము లేదు. మనవారి హాస్యము తీరు వేరు. అసలు పాశ్చాత్యులకును మనకును రసదృష్టియందే భిన్నాభిప్రాయములు కలవు. కనుక వారియందధికముగా నున్న చమత్కార సంభాషణ (Wit) మరియు హాస్యపాత్రములు (Humerous Characters) మన సాహిత్యమునందు లేవేయని బాధపడ నక్కరలేదు అట్టివి మన సాహిత్యమున కొలదిగనే యున్నవి. నవ్వును మనవారు 'వికృతాకార వాగ్వేషచేష్టాదేః కుహకాద్భవేత్ హాసో హాసస్థాయిభావః'1 యని నిర్వచించి యున్నారు. వికృతములైన యాకారము వాక్కు వేషము చేష్టలు మున్నగువాని యొక్క వేడుకవలన హాస్యము కలుగును. దానికి హాసము స్థాయిభావము. హాస్యమును మనవా రారువిధములుగా విభజించి ఉత్తమాధమ నిర్ణయమును కూడ చేసియున్నారు.'శ్రేష్ఠానాం స్మిత హసితే మధ్యానాం విహసితావహసితే చ, నీచానా మపహసితం తథాతిహసితం చ షడ్భేదాః'2. ఉత్తములకు స్మితహసితములును, మధ్యములకు విహసితా వహసితములును, నీచుల కపహసితము అతి హసితమును ఆరు విధములుగా ఏర్పరుపబడినవి. ఇట్టి భేదములే కాక జగన్నాథపండిత రాయలు, 'ఆత్మస్థః పరసంస్థశ్చేత్యస్య భేదద్వయం మతం, ఆత్మస్థో ద్రష్టు

1. సాహిత్యదర్పణము, విశ్వనాథకవిరాజు.
2. ,, ,,

రుత్పన్నో విభావే క్షణమాత్రతః। హసంతమపరం దృష్ట్వా
విభావశ్చోపజాయతే, యోసౌ హాస్యరసజ్ఞైః పరస్థః పరికీర్తితః 1' యని

హాస్యమును ఆత్మస్థము పరస్థముగా విభజించెను. హాస్యరసవిషయమగు విభావమును సూచించినంత మాత్రమున ద్రష్టకు కలుగునట్టిది ఆత్మస్థమగు హాస్యము. విభావమును చూచిన వేరొకడు నవ్వుచుండగా ద్రష్టకు కలుగునట్టిది పరస్థహాస్యము. మన పూర్వాలంకారికు లీహాస్యము లన్నింటికి లక్షణములు నిర్వచించియున్నారు. మహాకవుల రచనములందు ఉత్తమ మధ్యమ శ్రేణికి చెందిన నవ్వుండుటచే నది సాధారణులకు పాశ్చాత్యసాహిత్యమునందు భాసించు హాసము వలె భాసించదు. తొందరగా హాసమును భాసింపజేయు అధిక్షేపకావ్యములు అపహాసపూరితమైన ప్రహసనములు. హాస్యపాత్రములు, వ్యంగ్యముగా వేళాకోళముచేయు కృతులు పాశ్చాత్యులతో పోల్చిచూచుకొన్నప్పుడు కొలదిగనే కన్పట్టును. ఈ కొరత తెలుగులో మరింత కలదు. పాశ్చాత్య విద్యాప్రభావితులైన కొందరాధునికులు పాశ్చాత్యుల మార్గమున నడచి తెలుగులో కొంత చక్కని హాస్యమును పోషించియున్నారు. శ్రీముట్నూరి సంగమేశంగారు తమగ్రంథమున2 ఆంధ్రసాహిత్యమునగల హాస్యమునుగూర్చి చక్కని విమర్శనము చేసియున్నారు. వారు జానపదహాస్యముగూర్చి కూడ కొంత చర్చించిరి. కాని యది యక్షగానములు, తోలుబొమ్మలు, కలాపములవరకే సీమితమైనది. జానపద గేయములందున్న హాస్యమును ఈ ప్రకరణమున పరిశీలించుట నాయుద్దేశము.

నాగరకులకు గల సుఖదుఃఖానుభూతులు జానపదులకును గలవు. వీని బాహ్యచిహ్నములగు నవ్వు ఏడ్పులును గలవు. ఏడ్పునుగురించి చెప్ప నవసరము లేదు. జీవిత మధికముగా దుఃఖమయము కనుక నేడ్పు తప్పదు. తాత్కాలికముగనైనను ఏడుపును తొలగించి దుర్భరజీవితమును కొంత సుగమమొనర్చి మనస్సును సుప్రసన్నమొనర్చి, జీవితమును పెంచునది నవ్వు. అట్టినవ్వు ఎప్పుడెప్పుడు ఏయేవిధముగా జానపదులకు కలుగునో అది వారి సాహిత్యమున నెట్లు ముద్రితమైనదో పరిశీలింతము. ఇంతవరకు చర్చింపబడిన గేయములం దక్కడక్కడ ప్రదర్శింపబడిన నవ్వును ఆయా స్థలములందు సూచించితివి, దానిని మరల దిఙ్మాత్రముగా దడవి చిన్నగేయములందు హాస్యమెట్లు అంగిగా భాసించినదో తరువాత నారయుదము.

1. రసగంగాధరము, జగన్నాథ పండితరాయలు.

2. తెలుగు హాస్యము

రామాయణసంబంధియగు 'శాంత గోవిందనామము'లను పాటలో స్త్రీల నెన్నడు చూచి యెరుగని ఋష్యశృంగుని తపోవనమునుండి పట్టుకొనిపోవుట కప్సరస స్త్రీలు వచ్చిరి. వారిని చూచి ఋష్యశృంగుడు 'రెండు కొమ్ములు వుండె-వీరెట్టి తాపసులో-ఏపూజ చేసిరో' యని యాశ్చర్యపడి 'రెండుకొమ్ములు మీకు-ఏరాజు ఇప్పించె, ఈశ్వరుడు యిచ్చెనా - బ్రహ్మఇచ్చినాడ'యనిప్రశ్నిం: వారలాతని యమాయికత్వమునకు నవ్వుకొని యటులేయని తాపసులమని చెప్పి యాతని మోసగించి అయోధ్యానగరమునకు గొనివచ్చిరి. ఋష్యశృంగుని యమాయికత్వము చూచి కార్యార్థులగుటచేత అప్సరసలు తమలో తాము నవ్వుకొనియుందురు. కాని మనము భయములేకుండ కడుపుబ్బునట్లుగా నవ్వుకొనవచ్చును.

'వికృతాకారవాక్చేష్టం యమాలోక్య హసేజ్జనః
తదత్రాలంబనం ప్రాహుస్తచ్చేష్టోద్దీపనం మతమ్'అని కదా లాక్షణిక మతము. ఇచట ఋష్యశృంగుడు ఆలంబనము. అతని యాకారమే కుసుమాస్త్రుని సాయకములవంటి దివ్యస్త్రీలకు నవ్వుపుట్టించుచుండ ఆతని యమాయికపుమాటలు మరింత నవ్వు పుట్టించినవి. అవి ఉద్దీపనములైనవి. స్తనములను జూచి కొమ్ములనుకొనెడు ఋష్యశృంగుని యమాయికత్వము మనకును నవ్వు పుట్టించును.

'అడవి అనే చరగోవిందనామము'లందు కుంభకర్ణుని నిద్ర లేపుటకు రాక్షసులు 'ముసలముల మొత్తిరి ముష్టుల బొడిచిరి, మదపుటేనుగులచే మట్టించి రప్పుడు, గునపముల గాలిచి తను వెల్లగాల్చిరి,సీసంబు కరగించి చెవులలో బోసి'రట. కుంభకర్ణుని నిద్రలేపుట కింత యవస్థయైనది. సాధారణముగా నిద్రపోయెడువాని పిలిచి లేపెదరు. కొంచెము గాఢనిద్ర కలవాడైనచో తట్టి లేపెదరు. కాని ఏనుగులతో త్రొక్కించి, గునపములతో గాల్చి, చెవులలో సీసము కరగించి పోసి లేపుట యనునది యసాధారణవిషయము. కుంభకర్ణుని భీకరాకారము, మొద్దు నిద్ర, దీనిచే స్పష్టమైనవి. ఆలంబనవర్ణనముచే నిట హాస్యము పోషింపబడినది. కుంభకర్ణుని నిద్రను వర్ణించి వర్ణించి కవి మనకు నవ్వు పుట్టించుచున్నాడు. మరియు దీనిని వికారితము(caricature) గా చెప్ప వచ్చును. పెద్దపనికి చిన్నయత్నము సన్నపు పనికి పెద్దయత్నము కూడ హాసజనకమే కాగలవు. పూవుల గోయుటకు గొడ్డలి తెచ్చుటయు చెట్టు నరకుటకు గోళ్ళ నుపయోగించుటయు వికారచేష్టలే కాగలవు. మహాకవి కాళిదాసు శాకుంతలమున (1-18) నిట్టి చమత్కార మొకచో కలదు.

'ఇదం కిలావ్యాజమనోహరం వపుః స్తపః క్షమం సాధయితుం య ఇచ్ఛతి, ధ్రువం సనీలోత్పల పత్రధారయా, సమిల్లతాం ఛేత్తుమయం వ్యవస్యతి'. నీలోత్పల పత్రధారతో సమిల్లతను కోయబోవుట హాసజనకము కదా! నిద్రించువాని చెవిలో సీసము పోయుటకూడ ఇట్టిదైనను అంత ఉత్తమముగా లేదు. కుంభకర్ణుని వికృతాకారము వాని నిద్రలేపెడువారి వికృతచేష్టలు రెండవ తరగతికిచెందిన హాస్యమును కలిగించుచున్నవి.

'సూక్ష్మరామాయణము'న శూర్పణఖావర్ణనము హాస్యరసపూరితము. 'ముండ్ల వెంట్రుకలు మొండి చేతులది ముసలి రక్కసొచ్చెన్, ఆసఖియా కండ్లు గచ్చకాయల్, దాని బలుపండ్లు దంతికోరల్, పాలిండ్లువెండుబారల్, అది కండ్లజూచి శ్రీరామలక్ష్మణుల కనుసైగలు చేసెన్, ఆ శూర్పణఖ యొడలు మరచి వచ్చెన్.' ఇది కూడ పై యుదాహరణమువలె వికృతాకారమునకు సంబంధించిన హాస్యమే. శూర్పణఖ వికృతాకారమువలన కలిగిన హాస్యముకన్న నిట్టి వికృతాకారము గల శూర్పణఖ శ్రీరామచంద్రుని సౌందర్యమును మెచ్చుట, మరియు నాతని మోహించి కోరుట ఉత్తమశ్రేణికి చెందిన హాస్యమును కలిగించును.

'సీతగడియ' పాటలో సీతపై రాముడలిగి పడకగది గడియ (గడె) వేసికొనగా సీతమ్మ అత్తగారిని పిలుచుకొని వచ్చి భర్త సంగతి చెప్పి తలుపు తీయించుకొనెను. తలుపు తీయించి కౌసల్య రామునికి బుద్ధులు గరపుచుండెను. సీతకు కావలసినది తలుపు తీయించుటే కాని తమ యేకాంతమునకు భంగమగునట్లు కౌసల్య యచటనుండి రామునికి బుద్ధులు గరపుట కాదు. సీతమ్మ కౌసల్యను ఎట్లైన బయటికి పంపనెంచి 'మా మామ దశరథులు వక్కరున్నారు—అత్త మీరు పొండి మామామ కడకు' అని చిలిపిగా పలికి పంపెను. నిజముగా మామగారొంటరిగా నున్నారనికాదు సీతమ్మ యావేదన. తమ భార్యాభర్తల శృంగారమున కాటంకముగా నున్నదనియే యామె భావము. ఇట హాస్య శృంగారములకు మైత్రి. సీతమ్మ నర్మగర్భముగా నన్న మాటలు పరిహాసోక్తులు. ఇది వాక్చమత్కృతికి సంబంధించిన హాస్యము. శ్రీరామునితో నేకాంతమున నుండ గోరిన సీతమ్మ కౌసల్యతో పలికిన హాస్యలోభకారివచనమిది. వీథ్యంగములందు చెప్పబడిన 'వ్యాహారము'న కిది జానపద గేయములందు కాననగు ఉదాహరణము. 'అన్యార్థమేవ వ్యాహారో హాస్యలోభకరం వచః[1]' యని ధనంజయుని మతము. ఇది యుత్తమశ్రేణికి చెందిన హాస్యము.

1. దశరూపకమ్ 3-20

'ఊర్మిళాదేవి నిద్ర'లో సీతాశాంతలకు నడచిన సరససంభాషణము చక్కని హాస్యమున కుదాహరణము. శాంతమ్మ 'కుందనపు ప్రతిమ కళలూ ఈ కళ లెందుండి దాగున్నవో,దృష్టి తగులకుండనూ నీలాల నివ్వాళు లివ్వరమ్మా' యని ఊర్మిళను దెప్పి పొడువగా సీతమ్మ కల్పించుకొని శాంతమ్మను 'ఇంద్రాది చంద్రులాను వలపించు చంద్రులూ మీ తమ్ములూ, దృష్టి తగులాకుండనూ నీలాల నివ్వాళు లివ్వరమ్మా' యని మరల దెప్పిపొడిచెను. శాంతమ్మకు చురుక్కుమనెను. ఆమె వెంటనే సీతమ్మను 'అటువంటి మాతమ్ములనే వలపించిన మీరు సామాన్యులా' యని మరల దెప్పిపొడిచెను. కాని మాటకారిసీతమ్మ ఇంతటితో నూరకుండక ఝటితిస్ఫూర్తితో నీవుమాత్రము సామాన్యురాలవా 'ఏమి యెరుగని తపసినీ (ఋష్యశృంగుని)వో వదినె కేళించి విడిచినావు' అని నోరు మూయించెను.

'శ్రీరామ పట్టాభిషేకము' పాటలో వనవాసము గడచి వచ్చిన తరువాత పట్టాభిషేకము జరుగునప్పుడు అప్పుడే నిద్రలేచిన యూర్మిళను మంగళస్నానము చేయుమని చెప్పి పలుకరించి వచ్చిన లక్ష్మణుని జూచి శ్రీరామునితో శంకరుడు 'ఇన్నాళ్ళవలె గాదు ఇనకులోత్తముడా, సౌమిత్రి వచ్చేటి సంభ్రమ్ము చూడు'మని వేళాకోళము చేసెను. ఇది శృంగారహాస్యముల కలయిక. జానపదులందు గూడ ఉత్తమకోటికి చెందిన హాస్యము కాంచనగుననుట కీయుదాహరణము చాలును.

భారతసంబంధగాధలందు 'శశిరేఖా పరిణయము'న ఘటనావికృతికి (Absurdity in action) సంబంధించిన హాస్యమెంతయో కలదు. ఘటోత్కచుడు తన మాయచే శశిరేఖను గొంపోవుట,ఆమెకు బదులుగా తా నామె యాకారముతో పెండ్లిపీటలమీద గూర్చుండి లక్ష్మణకుమారుని ఇతరులకు తెలియకుండ వికృతాకారములతో బెదరించుట, పెండ్లివారి నందరి నేడ్పించుట మున్నగు చర్యలన్నియు మనకు నవ్వు పుట్టించును.

భాగవతసంబంధగాధలందు శ్రీకృష్ణుని పేరుతో పెరిగిన శృంగార సాహిత్యమున తదాశ్రితమైన సున్నితమగు హాస్యము కలదు. 'రుక్మిణీదేవి సీమంత'మను పాటలో శ్రీకృష్ణుడు సత్యభామతో తా నక్రూరునింటికి భోజనమునకు పోవుచున్నానని బొంకి రుక్మిణి యింటికి పోయెను. ఇది తెలిసిన సత్యభామ కృష్ణుడు తనచెంతకు మరల వచ్చినప్పుడు 'అక్రూరుడే సతి యాయెన అతి వేగంబున మీ'కని యెగతాళి చేయును. ఈపాటయందే

కృష్ణుడు రుక్మిణికి కలపమలదుచు 'నీ కరము లెరుపేమే' యనిన నామె 'కస్తూరికన్నా యెరుపు కమలనాభా మీకరము' అని ఎగతాళి చేయుట, 'పారుజాతపల్లవి' పాటలో శ్రీకృష్ణు డమరావతినుండి పారిజాతమును దెచ్చి సత్యభామ పెరటిచెట్టుగా నాటినతరువాత 'పూచిన పువ్వులన్నీ రుక్మిణికడకు తుమ్మెదలై' వెడలుట వంటివి హాస్యరసపూరితములు. ఈ పౌరాణికగాథలందు కలహాళనుదెక్కడ ప్రత్యక్షమైన నక్కడ హాస్యము కొంత యవతరించక తప్పదు.

చారిత్రకగేయములందు కూడ అటనట చక్కని హాస్యము కానుపించును. పల్నాటివీరచరిత్రమున వేశ్యమాత వర్ణనము, ఆకారవికృతికి సంబంధించిన హాస్యము. పల్నాటిచరిత్రము మరియు కాటమరాజు కథలందలి యుద్ధభీరువుల వర్ణనములందు వాక్చేష్టల వికృతికి సంబంధించిన హాస్యము కలదు. కాటమరాజు కథలో నల్లసిద్ధిరాజు, మరియు కాటమరాజు రాయబారులగు భట్ల సంవాదమున వ్యాజస్తుతి,వ్యాజనింద,వక్రోక్తి, నర్మోక్తి, నీచోపమ,కాక్వాక్షిప్తము,మున్నగు అలంకారములతో అర్థసంబంధమగు వికృతి గల్పించి వాచ్యముగను వ్యంగ్యముగను చక్కని హాస్యము పోషింపబడినది.

'నది యెల్లుమట్టిపై నడిచెనో యేమొ, యెఱ్ఱ పొర్లాడదా యెరమట్టిలోను,
సాము చేసినవారు జగడంబు చేసై-ఈ మహి జనులెల్ల యేడ బ్రతుకుదురు,
తలపొలములో బెదరి నిలబడ్డగోవు-కలవిలుచుకున్నట్లు కాదు కయ్యంబు
ముఱ్ఱుపాలను జున్నుముద్దలు మెసవి-గర్రున ద్రేపుట కాదు కయ్యంబు,
చేసిన వెన్నల పెగపొంత గాచి-కానున కమ్ముట కాదు కయ్యంబు.'

'మారాజు జగడాన మీరు చాలుదురె, మనసున వార్నిధుల్ మరి దాటవచ్చు
గనుకొని కాలువ కడు దాటరాదు, మాటలే పోట్లైతె మదగజము జంప
పీటెలు కత్తులు నేల గడింప, పోడుపోడు మనుమాట పోటులై తాకితే
కడనుండి సేయరా కయ్య మెంతైన, జావడికి రాక సమరసంబగునె'.
'చుట్టచుట్టుక యెంత సుడిగిన బాము-పుట్ట జొచ్చేటపుడు పొడుగారవలదె.'

ఈ సంభాషణములు చాల హాస్యపూరితముగా నడచినవి.వీరగీతములం దంతటను యుద్ధభీరువుల వర్ణనము హాస్యపూరితము. దేశింగురాజు పదములో తోంద్రమల్లు భయపడుచు భయపడుచు దేశింగురాజు వైష్ణవుడు కనుక తాను వైష్ణవవేషము వేసికొని పోవు ఘట్టముకూడ నవ్వు పుట్టింపకమానదు. 'పూని యెంగిలి యుమిచి మన్నుమువ పౌసగ నామమేసి, యేమగు నెత్తురు నడినామముగా మానితముగ

వేసి' తోంద్రమల్లు దొంగ వైష్ణవుడయ్యేను.

శైవవైష్ణవమతవాఙ్మయమున సంవాదముల కొక ప్రత్యేకత కలదు. గంగాగౌరీసంవాదము, ఈశ్వరభృంగి సంవాదము, లక్ష్మిపార్వతీ సంవాదము, సవతుల కయ్యము, చెంచులక్ష్మికి శ్రీకృష్ణునకు సంవాదము, చెంచితకు లక్ష్మికి సంవాదము మున్నగు వానియందు చక్కని నర్మోక్తులు, దెప్పిపొడుపులు, అవహేళనలు, వ్యాజోక్తులు గలిగిన చక్కని హాస్యముండును. ఆండాళు చరిత్రమున గోదారంగేశుల వివాహసమయమున భోజనములకు సిద్ధమైన బ్రాహ్మణుల భాషణములు గమనింపదగినవి.

'సుబ్బంభొట్లూ విన్నావషరా, చూడికొడ్త పెళ్ళషరా
అబ్బాయిని అచ్చయ్యను మరి మన, అవధాన్లను కేకెయ్రా
సంతర్పణలష నంతస మొదవగ, గొంతువరకు తిందాం
ముంతమామిడిపప్పు మిఠాయష, ముందు మనము పోదాం'అనుకొను వారిమాటలు

నాటకములందలి విదూషకుని భోజనప్రీతిని పోలినవి. ఇట్టి హాస్యమును మనవారలు త్తమహాస్యముగా నంగీకరింపలేదు. లక్ష్మిపార్వతులకు జరిగిన సంవాదము చాల చక్కని హాస్యమున కుదాహరణము.

లక్ష్మి- గౌరీదేవి నీ శంభుని గళమున నలుపేమిటె ఓయమ్మా-నలుపేమిటె ఓయమ్మా
పార్వ- నారీమణి నీ విష్ణుదేవుడు నలుపుగాదటే కొమ్మా-నలుపు గాదటే కొమ్మా
లక్ష్మి- బిరుదులేక నీ కాంతుడు జగములో భిక్షమెత్తుటే మమ్మా-భిక్షమెత్తుటేమమ్మా
పార్వ- బలములేకను బలిచక్రవర్తిని అడుగలేదటే కొమ్మా-అడుగలేదటే కొమ్మా
లక్ష్మి- శంకలేకను శంకరు కరమున జింక యుండుటేమమ్మా-జింక యుండుటేమమ్మా
పార్వ- శంకలేక వనవాసముకేగుట జింకకొరకునుమి కొమ్మా-జింకకొరకు నుమి కొమ్మా

గుణమును దోషముగా దోషమును గుణముగా చెప్పి మాటలాడెడు పద్ధతిని 'మృదవ'మందురు.

'దోషగుణీకరణం వా తన్మృదవం నామ విజ్ఞేయమ్
పరవచన మాత్మనశ్చోత్తరోత్తర సముద్భవం ద్వయోర్యత్తు'.1 పై గేయ మిట్టి వాక్చమత్కృతికి సంబంధించిన హాస్యోదాహరణము. 'సవతులకయ్యము' పాటలో అలమేలుమంగను చెంచిత 'వన్నెమృగమును దెమ్మంటినా-రక్కసుని వరియించి రథముపైకెక్కి-లంకలోకి వెళ్ళియుంటినా' యని దెప్పిపొడిచెను. ఒక్కొక్క దెప్పిపొడుపు విగూఢముగా చెంపపెట్టువలె నుండును. ఇట్టి వాక్చమత్కారమును

1. భరతనాట్యశాస్త్రము 18-122.

'నాళిక' యందురు. 'హాస్యేనోపగతార్థా ప్రహేళికా నాళికేతి విజ్ఞేయా'1. తద్గతమగు హాస్యముకూడ నర్మగర్భముగా నుండును. 'ఈశ్వరభృంగి సంవాదము' పాటల యందు శివుని తలపైనున్న పడతిని జూచి పార్వతి యడుగ నాతడు,

'నిండు వేసవికాలమున జలముండునో లేకుండునో యని
దండిగా నది దెచ్చి జడలో దాచియుంచినాను గాని ఎరుగనే పార్వతి యెరుగనే'యని

బొంకును. నదియైనచో దానికి ముఖము, కనులు, కురులు, కంఠము, గుబ్బలు, నూగా రెందుల కుండునని పార్వతి ప్రశ్నింప శివు డవి జలమందుండెడు తామరలు, మీనములు, తమ్మెదలు, శంఖము, జక్కవలు, నాగుబాములని యర్థము చెప్పును. ఒకదానికి మరింకొక యర్థమును కల్పించి 'అవస్పందిత' మను వాక్చమత్కారముతో హాస్యము పోషింపబడుట కిది యుదాహరణము.

'కౌశలాదుచ్యతే ఽ న్యోఽర్థ స్తదవస్పందితం భవేత్'2

'చెంచిత కథ'లో శ్రీకృష్ణునంతవానిని చెంచిత 'నిమ్మాల గిరిమీద నిమ్మాగ తిరిగేటి-కొమ్మాల గురిపోతు నేనేవా-ఏదుపందుల నెయ్య నేరుతువా,అడవిదుప్పులనెయ్య నేరుతువా అనుపులున్నా జాడ లెరుగుదువా-పుట్టతేనెలు పట్ట నేరుతువా-పరిగతేనెలు పట్ట నేరుతువా'అని యాతని సామర్థ్యమును శంకించుట కూడ చెంచిత అమాయికత్వ మును దెల్పునట్టి మృదువైన హాస్యము. ఇట్టి హాస్య మిదివరకు పరిశీలింపబడిన గేయములందచ్చటచ్చట గానుపించుచునే యుండును.

కేవలము హాస్యపూరితములగు గేయములు మనకు కొలదిగనే లభించు చున్నవి. అట్టివాని నధికముగా ముద్రించినటుల లేదు. తెన్నేటి తిరుమలదాసుగారి 'వేడుక పెండ్లిపాట'లందును, కరాఅచ్చయ్య అందు సన్నువారి 'శ్రీజనానంద నవీనకల్యాణపాట'లందును, 'స్త్రీల పాటలు' సంపుటములందును, పెండ్లికి సంబంధించిన వియ్యాలవారి హాస్యపుపాటలు కొన్ని ప్రకటింపబడినవి. కొండ పల్లి వీరవెంకయ్యగారి 'హాస్యపు పాటలు' పుస్తకమునందు తీరుతీరుల హాస్యపు పాటలున్నవి. రైల్వే పుస్తక విక్రేతలమ్ము 'గుమ్‌గుమా హాస్యపుపాట' అందొ కటి రెండు పాటలున్నవి. శ్రీగంగాధరంగారి 'సెలయేరు'లో అచ్చటచ్చట ప్రకీర్ణములుగా కొన్ని పాటలున్నవి. సుమారేబది హాస్యపు పాటలు తెలంగాణమునకు సంబంధించినవి నేను సేకరించితిని.

---

1. భరతనాట్యశాస్త్రము. 18-118.
2. ,, ,, ,,

పాశ్చాత్యసాహిత్యమున హాస్యానుకృతులు (Paradies) అధికముగా నున్నవి. ఒక కావ్యమునో కవితాశైలినో అనుకరించి దానిని (మూలమును) వేళాకోళముచేయుట హాస్యానుకృతి యనిపించుకొనును. మనపూర్వసాహిత్యమున చాటూక్తులు దప్ప ఇట్టి కావ్యములు లేవు. ఆధునికులందు కొందరిట్టి కావ్య రచనము చేసినారు. శ్రీఉదయరాజు రాఘవరంగారావుగారి మత్కుణోపాఖ్యానము, శ్రీ దేవీప్రసాద్‌గారి భక్ష్యేశ్వరీ శతకము, శ్రీ జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి గారి పెక్కు హాస్యానుకృతులు; శ్రీ కాళోజీ నారాయణరావుగారి గేయము లిట్టివే. శ్రీ కాళోజీ నారాయణరావుగారి "ఏ దేశమేగినా ఎందు కాలిడినా, చూడరా నీబొజ్జ పూడు మార్గం" అన్న గేయము చక్కని హాస్యానుకృతి. మూలకృతి యందలి గాంభీర్యమును స్యానుకృతి చప్పబరచి దానిని పేలవముగా, లేకిగా చిత్రించును. ఇట్టి విపరీతపరిస్థితివలన కలుగు వికృతి మనకు హాస్యహేతువగును. కనుక అనుకృతులవలన హాస్యరసమనునది మూలము తెలిసిననేగాని యుద్భవించదు. నిజమగు సంధ్యావందనమంత్రము వచ్చిననేగాని "ఆధునిక సంధ్యావందన" మను హాస్యానుకృతియందలి హాస్య మనుభవమునకు రాదు. ఇట్టి హాస్యానుకృతులు జానపద సాహిత్యమునగూడ కలవు. అట్టివాని కొన్నింటి నుదాహరింతును.

'చిక్కుడు చెట్టుకు తీగలందమ్మ. శ్రీకృష్ణ తమ్ముడికి తిరుమణందమ్మ
బీరయ్య పాదులకు పూవులందమ్మ-పణతికి పదినెలల బాలుడందమ్మ
కాకరతీగెకు కాయలందమ్మ-కన్నతల్లెట్టిన సొమ్ములందమ్మ'. అను చక్కని

జానపదగేయమొకటికలదు. దీనికి హాస్యానుకృతియగు నొకదంపుళ్లపాట గలదు.

'సువ్విసువ్వన్న సొగసు మల్లన్న-సువ్విసువ్వన్న సొగసు మల్లన్న
బీరపాదుకి పిందెలందమ్మ-మావారి ముక్కుకు వక్కులందమ్మ
పొట్లపాదుకి పూవులందమ్మ-కాట్లకుక్క మగడు కొంతకందమ్మ
తోటకూర కంబమూ దొడ్డికందమ్మ-మావారి పొగచుట్ట నాకు నందమ్మ
వెనుక దిక్కు లేకుంటె వెలది కందమ్మ-మస్తుగ తించేనె మగువ కందమ్మ
అత్త మామలు చస్తె అతివ కందమ్మ-దొంగదూడకు గుదికట్ట యందమ్మ
దొంగమగనికి పెంకిపెండ్లా మందమ్మ'. ఈ పాట యింకను ఇటులనే సాగి పోయినది. మూలమందలి గాంభీర్యమును, ఉదాత్తతను, గమనింపుడు. దీనివి

చదివిన తరువాత మూలముపైగల గౌరవభావము పూర్తిగా తారుమారై వేళా కోళము క్రిందికి దిగినది. ఇట్టి హాస్యానుకృతులు జానపదసాహిత్యమున ననేకము లున్నవి. పెండ్లియైన తరువాత అప్పగింతల సమయమున వధువునకు తల్లి దండ్రులుమున్నగువారు గరపెడు నీతులు బుద్ధులు సుప్రసిద్ధములు. శ్రద్ధ, భక్తి, నీతి, నియమము, పాతివ్రత్యము, సహనము, శాంతము, సౌశీల్యము వంటి ఉదాత్తవిషయము లీయప్పగింతల పాటలందుండును. అట్టివానికి హాస్యానుకృతియగు అప్పగింతల పాట యొకటి చిత్తగింపుడు.

'అత్తమామలుగాని అడుబొట్టెలుగాని-లేరమ్మ నీదెంత పుణ్యమోగాని
మగడొక్కడేగాన మనసుకెక్కినయట్లు-మర్దించి పీవళము చేసికోవమ్మా
నీమాట వినబడ్డ నిమిషంబునందు-అదలిపోయేటట్లు అతని భయపెట్టు
పతి కోపపడినపుడు పడియుండబోక-అంతకు పదిరెట్లు అతని మర్దిందు
ఇరుగుపొరుగువార లేమైన అంటే-యేద్వక పేయిరెట్లు దుమ్మెత్తిపొయ్యి
భర్తను వంచుకోగల భార్య గౌరవ మెన్న-రారాజునకునైన రమణిరో లేదు
ఆఎయెల్ల మరువక ఏమాత్ర మలియక, సుఖపడుచుండుమో సొగసు పూదీవ'.

పసిపిల్లలను లాలించుటకు నిద్రపుచ్చుటకు లాలిపాటలు జోలపాటలు పాడెదరు. కన్నతల్లి తన సంతానముగూర్చియో పుట్టింటివారిగూర్చియో, తన యత్తింటివారిగూర్చియో లేదా భగవంతునిగూర్చియో ఇట్టి పాటలందు పాడు కొనును. పాట పాడుచు జోకొట్టినయెడల పసిపిల్లలు ఏడ్పుమాని సుఖముగా నిద్రింతురు. ఒక విపరీతపు జోలపాట గమనింపుడు.

జోజో నాతండ్రి జోజో తండ్రీ-జోడుగుర్రాల సార్టుపై వస్తాడు మామ జోజో
పాలుపెరుగు పోసి పడిపెంచినాను-వీలుగాదంటాడు పెంకి నీతండ్రీ ,,
పనిలేక పొరుగిండ్ల కనయంబు బోవ-ఘనమైన మెచ్చుట గలుగునుర తండ్రీ ,,
పాలుత్రాగి నీవు పడియున్న యెడల-బాలయ్యతోబోయి మాట్లాడి వస్తా ,,
కలకాల మొకయింట కాపురము సేయ-కలుగుట కష్టమురా కన్న నా తండ్రి ,,
పైడాబులే కాని పలుకు పసలేదు-చూడరా నీతండ్రి వింతహొయలెల్లా ,,
దనముకొరకై నేను తారాడుచుంటి-అదియున్న నీతండ్రి నవల కంపింతు ,,

ఇట్టి హాస్యానుకృతులు మంగళహారతులకును, మేలుకొలుపులకును, కోలాటపు కీర్తనలకును, గణపతిస్తోత్రములకును వేయేల ననేకవిధములగు గేయములకును

కలవు. వానినన్నింటి నుదాహరించిన గ్రంథము చాలదు. ఇట్టి గేయములందు ముఖ్యముగా మూలమును తేలికచేసి వికృతిని గల్పించి హాస్యమును పుట్టించుటే ముఖ్యోద్దేశమని గమనించిన జాలును.

వాక్చమత్కృతి ద్వారమున వికృతిని గల్పించి హాస్యమును పుట్టించెడు పాట లధికముగా గాన్పించును. ఇట్టి వాక్చమత్కృతిగల గేయములు జానపద సాహిత్యమున కొల్లలు. గూఢార్థములగు మాటలు పేర్చి ప్రశ్నోత్తరముల జరిపెడు పద్ధతిని "ఉద్ఘాత్యక" మందురు. ఇదిగూడ వీథ్యంగములం దొకటి.

'యోజయన్తి పదై రన్యైస్తదుద్ఘాత్యక ముచ్యతే
యత్రాన్యస్మిన్ సమావేశ్య కార్యమన్యత్ప్రసాద్యతే'1.

వెలయేటిలో 'స్త్రీచమత్కారి' మను శీర్షికతోనున్న గేయ మిందు కుదాహరణము.

స్త్రీ : ఒకరికి చేయినిచ్చి-ఒకరికి కాలునిచ్చి
ఒకరికి నడుమునిచ్చి-కూకున్ననోయి రాజా-కూకున్ననోయి రాజా

పురు : ఎవరికి చేయినిచ్చి-ఎవరికి కాలునిచ్చి
ఎవరికి నడుమునిచ్చి-కూకున్నవోయ్ జాణ-కూకున్నవోయి జాణ

స్త్రీ : గాజులక్కి చేతినిచ్చి-అందెలక్కి కాలునిచ్చి
వడ్డాణానికి నడుమునిచ్చి-కూకున్ననోయి రాజా-కూకున్ననోయి రాజా

ఈపాటలో స్త్రీ చెప్పిన మాటలు విన్నంతనే సంశయము కలుగక మానదు. కనుకనే పురుషుడు తొందరపడి ప్రశ్నించుట జరిగెను. మొదట చెప్పిన మాటల ప్రకారము సమాధానము శృంగారమునకు సంబంధించినదిగా నుండియుండునని ప్రశ్నించెడు పురుషుడును, మనమును భావింతుము. కాని మరల నా స్త్రీ సమాధానము వచ్చినప్పటికి అనుమానము తొలగిపోవుటయేగాక మనమాశించెడు సమాధానము రాక చప్పని సమాధానము వచ్చి వికృతిని పుట్టించి నవ్వించును. ఈ గేయమంతయు నిటులే నడచినది. ఉద్ఘాత్యకమందు మూడవ రకమునకు చెందిన యుదాహరణమిది. ఉద్ఘాత్యకమునకు ఉదాహరణములు శిష్టసాహిత్యమునందును లభించును. ప్రబంధములందలి పుష్పలావికలయు యువకులయు సంభాషణములు చూడనగును.

1. భరతనాట్య శాస్త్రము. 18-116.

అనుకొనని వంచనమునగూడ వికృతి కలిగి నవ్వుపుట్టును. మొదట ప్రియవచనములుగాతోచి తరువాత మెల్లగా అప్రియములుభాసించిన సున్నితమగు హాస్యము పుట్టును ఇట్టి వాక్చమత్కారమును 'ఛల' మందురు. 'అన్యార్థమేవ వాక్యం ఛల మభిసంధాన హాస్యరోషకరిమ్'1. సిరిసిల్ల తాలూకా హనుమాజిపేట గ్రామమున (1954) సేకరించినపాట దీని కుదాహరణముగా నిచ్చుచున్నాను.

'అంతే నాకు చాలు తమ్మలపాకు తొడిమే పదివేలు
అందరివోలె అడిగేదాన్ని కాను, కొందరివోలె కొసరేదాన్ని గాను'

మొదట నీ ప్రియచనములాడిన స్త్రీ యెంతో సౌశీల్యవతి యనుకొందుము. తరువాత మెల్లగా నామె యప్రియవచనములకు దొరకొనును.

ముక్కుకూ ముక్కెర లేక, ముక్కు చిన్నబోయినాది
నీ ముగ్గురు బిడ్డాలనమ్మి, ముక్కుకు ముక్కెర తేరా ||అంతే||
చేతులకు చెండీలు లేక, చేతులు చిన్నబోయినాయి
నీతోడి చెల్లెండ్లనమ్మి, చేతులకు చెండీలుదేరా ||అంతే||
కాళ్ళకూ కడియాలు లేక, కాళ్ళు చిన్నబోయినాయి
నీ కన్నతల్లి నమ్ముకోని, కాళ్ళకూ కడియాలు దేరా ||అంతే||
నడుమూకు వొడ్డాలం లేక, నడుము చిన్నబోయినాది
నీ నల్గురూ కొడుకులానమ్మి, నడుముకు వొడ్డాలం తేర ||అంతే||
మెడకు కంటెను లేక, మెడ చిన్నా బోయినాది
నీ మేడలన్ని అమ్ముకోని, మెడకు కంటెలు దేరా ||అంతే||
పట్టెమంచం పరుపూ లేకా, మనసు చిన్నాబోయినాది
నీ సూటుబూటు నమ్ముకోని, పట్టెమంచం పరుపు దేరా ||అంతే||

చివరి చరణమున సూటుబూటు లుండుటచే నీపాట ఆధునికమై యుండును. లేదా ఈభాగము మాత్రము ప్రక్షిప్తమై యుండును. తమలపాకు తొడిమయే పదివేలుగా భావింతునని తొలుత ప్రియములు పల్కిన స్త్రీ తరువాత తనకు కావలసిన భూషణములు, వస్త్రవాహనములు పెద్ద పట్టికగా నిచ్చి వానికై బిడ్డలను తల్లిదండ్రులను మేడమిద్దెల నమ్ముమని యప్రియము లాడుచున్నది. ఇట్టి ఛలము మనకు నవ్వు పుట్టించును. ఓరుగల్లు జిల్లా మడికొండ గ్రామమున(5-1-1952) సేకరించిన మరియొకగేయ మిట్టిదే.

---

1. భరతనాట్య శాస్త్రము 18-123.

వాన గొట్టాంది జాన, వదినే వచ్చేనమ్మ
ఎట్లా పొమ్మందు వదినె, వాన గొట్టాంది జాన ||వాన||
నీళ్ళు ఇస్తామంటె, చిల్లాల చెంబాయె
పీట వేస్తామంటె, పిల్ల సంజాదెనమ్మా1 ||వాన||
చాప వేస్తామంటె, సందు కొంచెమాయె
కల్లు దెస్తామంటె, చెల్లాని పైసాయె ||వాన||
సామలు దంచుదా మంటె, సన్నాని ధాన్యమాయె
కొఱ్ఱలు దంచుదామంటె, కొత్తా ధాన్యమాయె ||వాన||
కోడిని గోస్తామంటె, గుడ్లమీది కోడీ వదినె
వడ్లూ దంచుదామంటె, ఇత్తనాల వడ్లు వదినె ||వాన||
కౌగిలిచ్చుకుందామంటె, కడుపూల బల్ల వదినె
కండ్ల చూస్తామన్న, కండ్లొచ్చెనాయి2 వదినె ||వాన||
నువ్వుబోయే తోవలోనె, కుడుకాలంగడి వదినె
నీకుప్పె కుదువబెట్టి. కొబ్బెరంపు నాయివదినె ||వాన||
నువుబోయె తోవలోనె, మట్టెలంగడి వదినె
నీ మడిమె కుదువబెట్టి, మట్టెలంపు నాయివదినె ||వాన||
నువు బోయె తోవలోనె- గాజులంగాడి వదినె
నీకాలు కుదువబెట్టి- గాజులంపు నాయి వదినె ||వాన||

పై పాటలో ఒక మరదలు వదినెగారి నేరీతిగ సత్కరించినదో గోచరించును. వానగొట్టుచున్నదనియు పొమ్మనుటకు నోరు రాదనియు తొలుత ప్రియము లాడిన మరదలు తరువాత వదినెగారికి కాళ్లు కడిగికొనుటకు నీళ్ళిచ్చెదమన్న చిల్లుల చెంబనియు, పీట వేసెదమన్న బిడ్డ సమర్తయై పీటపై కూర్చున్నదనియు, చివరకు చాపయైనవేసి కూర్చుండ బెట్టెదమన్న స్థలము చాలదనియు, వదినెగారికి త్రాగుటకై కల్లు దెచ్చెదమన్న చేతనున్న పైస చెల్లదనియు,చామలు దంచెదమన్న సన్నని ధాన్యమనియు, కొఱ్ఱలు దంచెదమన్న క్రొత్తధాన్యమనియు, వడ్లుదంచి అన్నము బెట్టుదమన్న విత్తనముకై తీసిన వడ్లనియు, చివరకేమియు చేయుటకు ఎలులేనట్లుగా శుష్కప్రియములాడినది. అనవసరవ్యయ మనుకొని యిట్లుచేసె నముకొందమన్న ఏమాత్రము వ్యయము లేనిపని కౌగిలించుకొని మర్యాద చేయుట గదా. కౌగిలించుకొందమన్న బల్లయైనదట. చివరకు కన్నులుతెరచి చూతమన్న

1. ఋతుమతి యాయెనని యర్థము 2. నాయొక్క

కండ్లు వచ్చెనట. వదినెగారికి 'పెట్టుపోతలు' లేవు సరికదా ; కన్నులతో చూచుటకుగూడ మరదలు నిరాకరించినది. ఇంతటితో ముగిసినదికాదు. వదినెగారు తిరిగిపోవు మార్గమందు కుడుకలంగడి, గాజులంగడి, మట్టెలంగడి యున్నవట. పోవుచు తనకే కొనిపంపుమని కోరుచున్నది. వదినెకు తాను పెట్టిన దేమియు లేదు; పై పెచ్చు తనకే కొని పంపించవలయునట. కొని పంపించునది వదినగారి వీలు ననుసరించియు కాదు. మడిమలు, కాళ్లు, కుదువ బెట్టియైన మరదలు గారికి మట్టెలు మున్నగునవి కొని పంపించవలెనట. మొదటి ప్రియ వచనములకు తరువాతి యప్రియవచనములకెంత భేదమున్నదో గమనింపుడు. ఇంకను నేను సేకరించిన 'దగ్గు ఏడిసెం పట్టింది ఓడ్డలారా - మీప దగ్గరికి రాకండి ఓడ్డలారా' యను పాటయును 'తమ్మాని ఓడ్డాని తన కోడలాని-దయతోడ బెట్టింది తక్కెదేకూలు' అను పాటయును ఈ కోవకు చెందినట్టివే.

గ్రామికగేయప్రకరణమున సాలెవారికి సంబంధించిన పాటలు, అగసాలెవారికి సంబంధించిన పాటలు, పేర్కొని యుంటిని. అవికూడ చక్కని హాస్యమున కుదాహరణముగా గ్రహింపవలయును. శృంగారగేయప్రకరణమున సతీపతులకు జరిగిన సంవాదమున జాణయగు భార్య తన ప్రశ్నములకు చమత్కారపూరితములగు సమాధానము లిచ్చుట సూచించియుంటిని. అదికూడ హాస్యమున కుదాహరణమే.

ఇక పాత్రములకు వికృతి నాపాదించి హాస్యమును పోషించు గేయము లనేకములు గలవు. ఒక పాత్రమునందలి యమాయికత్వమును తత్ఫలితముగా జరిగెడు వికృతచర్యలను వర్ణించుట గూడ హాస్యమును సృష్టించును. ఇది ఆలంబనవర్ణనమున కలిగెడు హాస్యము. ఆలంబన మొకపాత్రమైనను లేదా ఒక ఘటనమైనను కావచ్చును. హాస్యము ఆలంబనప్రధానమగు రసమగుటచే ఆలంబనము నెంతగా వర్ణించిన నంత హాస్య ముద్భవించును. పెండ్లిపాటలందు పేర్కొనబడిన వియ్యాలవారిపాట లందుకుదాహరణములు. హనుమాజీపేటలో సేకరించిన మరియొకగేయమున మరదలు వదినెగారి నెట్లు హేళనము చేయుచున్నదో గమనింపుడు. దీనిలో గమనింపవలసినది ఆలంబనముయొక్క అమాయికత్వము.

వదినెకు వగదర బిందెకు బిగదర, బంగరు కుచ్చుల మా వదినే
గోడబొంటి[1] రెండు నల్లులు పారితె

1. వెంబడి

ఉలువ లంటదీ మావదినె-బుక్కుత నంటది మావదినె
సరాల1 వొంటి రెండు లేళ్ళు పారితే
సేవా2 లంటది మా వదినె-తింటానంటది మా వదినె
దూలాల వొంటి పాములు పారితె
కడియా లంటది మా వదినె-పెట్టుకుంట నంటది మావదినే
శక్కర బుక్కి దొడ్లె పంటే3 చీమలు కుట్టినవా వదినే
అన్నం తినక అట్లల బంటే-అన్నయ్య కొట్టిండా వదినే

పై పాటలో ఆలంబన మొక స్త్రీ. వేరొక పాటలో నీ యాలంబన మొక మేక. ఈ పాట గూడ హనుమాజిపేటలో సేకరించినదే.

మాకె పోతంటదీ4 గొత్తి-గొత్తిపోతంటదీ మాకే
మంచలా శాలోల్లు-మాట మాట్లాడంగ-చూడవచ్చిరాని తా మురిసె మాకే ॥మాకె॥
దోసిల్ల రూపాయలు-గొంగట్ల బొయ్యంగ-వరదచ్చినని6 తా మురిసె మాకే ॥మాకె॥
మెడకు తాడుబెట్టి-గొరగొర గుంజంగ-కంటె బెట్టిరని తా మురిసె మాకే ॥మాకె॥
గొరగొర గుంజుకొచ్చి-పందిట్ల గట్టేస్తే-పెండ్లిపందిరాని తా మురిసె మాకే ॥మాకె॥
అచ్చిపోమేటోల్లు7-అటీటు8 నడువంగ-చూడవచ్చిరాని తా మురిసె మాకే ॥మాకె॥
కాళ్ళు నేతులుబట్టి కంట్లంబు9 గొయ్యంగ-కైలాసపురమని తా మురిసె మాకే ॥మాకె॥
ఏడురూపాయలకు-ఏడుకుప్పలేసి-ఎవ్వలింటికి వాళ్ళు కొంచబోతుంటేను
కుడుక కనుమూలాని10 తా మురిసె మాకే ॥మాకె॥
కార్యాలు11 దొబ్బలు-కలిపి వేయంగానె-ఒడిబియ్యామని తా మురిసె మాకే॥మాకె॥
ముసలోల్లు పైసోల్లు-బొక్కలూ12 కంకంగ13 అచ్చంతలని14 మురిసె మాకే ॥మాకె॥
సీకినా బొక్కలూ-బొతలా పారేస్తె-కుక్కనక్కలొచ్చి ఎత్తుకపోంగనే
ఐకుంఠ 15 పదమని తా మురిసె మాకె ॥మాకె॥
మిగిలిన్న బొక్కలూ-గద్దలెత్తుక పోంగ-పూలరథమాని తా మురిసె మాకే ॥మాకె॥

ఈ పాటలో మేక ఆలంబనము. దాని మూఢత్వముచే హాస్యము పోషింపబడినది. తెలివితక్కువ మేక తనకు రాబోవు విపత్తును గ్రహించలేక దానిని కల్యాణముగా భావించుటలో హాస్య ముత్పన్న మగుచున్నది. ఇదియొక యపూర్వగేయముగా భావింపవచ్చును. దీనియందు ఆసురమైన హాస్యము (**Devilish Humour**) కలదు. మేకయొక్క విపత్తును ఆలంబనముగా చేసికొని కటికవాడిట్లు నవ్వుకొనుట ఆసురహాస్యము. దీనియందు దైవీ హాస్యము

---

1. వడ్లెలు, 2. పేపెలు, 3. పంటే-పడుకొనుటచే, 4. మేకపోతు, 5. సాలెవారు 6. వరదక్షిణ, 7. వచ్చిపోయెడువారు, 8. అటునిటు, 9. కంఠము, 10. కణుగు 11. కార్యములు, 12. ఎముకలు, 13. నమలగా, 14. అక్షతలు, 15. వైకుంఠము.

గూడ వ్యంగ్యముగా భాసించుచున్నది. మేకయొక్క ఆపదకు సుంత జాలిపడుటయు దీనియందు ధ్వనించుచున్నది. సాధువర్తనుడైన వాడు 'అయ్యో ఈ మేక ఎంత యమాయిక జంతువు; పెండ్లికి పోవుదానివలె తన మరణమునకు పోవుచున్నదే' యని చింతిల్లును. ఇది వేదనాత్మకమైన (**Poignant humour**) హాస్యము.

కొంచెమైనదానిని గొప్పగనో గొప్పదానిని కొంచెముగనో చిత్రించి వర్ణించుట కూడ హాస్యమును పుట్టించును. చాకిదాని మీద, నల్లిమీద, కల్లుమీద, పొగచుట్ట మీద చెప్పబడిన చాటువద్యము లిట్టివే. జానపదగేయములందుగూడ నిట్టి హాస్యము పోషింపబడినది. నస్యపుకాయ సాధారణమైన వస్తువు. అది పోగొట్టుకొన్నవాడెవడో దానికై యేడ్చెను. వాని యేడ్పొక గేయమైనది. ఈ నస్యపుకాయ పాట లింగంపల్లి గ్రామమున సేకరించితిని. ఇదికూడ ఒకవిధమగు హాస్యానుకృతియే.

పోతివీ గదవే నా ముద్దుకాయ-పోతివి గదవె నస్యపుకాయ ||పోతి||
కట్టా పోవకుపొడి[1] పొట్టానిండాబోసి-పిట్టావలె నిన్ను పట్టూక తిరుగుదు ||పోతి||
తులము వెండిపెట్టి గజ్జెలు చేయిస్తి-అప్పు దీరక ముందె చెప్పాక పోతివి ||పోతి||
కట్టనూరికాడ కర్నాల[2] బాయిల-తానమాడబోతె దానమై పోతివి ||పోతి||

నస్యపుకాయ సాధారణమైన వస్తువు. అది పోయినందుకు దానిని వర్ణించుచు నేడ్చుటచే మనకు నవ్వు పుట్టుచున్నది.

హాస్యసృష్టికి పాశ్చాత్యు లవలంబించిన అధిక్షేపకావ్య (**Satire**) రచనము గొప్ప సాహిత్యప్రక్రియ. అధిక్షేపకావ్యములు పాశ్చాత్యవాఙ్మయమున ననేకములుగా నున్నవి. ఒక వ్యక్తినిగాని, ఒక సంస్థనుగాని, ఒక సంఘమును గాని, ఒక జాతినిగాని మూఢాచారములనుగాని హేళన మొనర్చుట యధిక్షేప కావ్యములందుండును. మన పూర్వ సాహిత్యమున మనకిట్టి చాటూక్తులు లభించును. వేమన, చౌడప్పవంటి శతకకారుల రచనములందీ హాస్యము కాననగును. కందుకూరి వీరేశలింగం పంతులుగారి 'సత్యరాజా పూర్వదేశయాత్ర' లను కల్పనా గ్రంథ మిట్టిదే. తిరుపతి వేంకటకవుల 'గిరతము', అనంతపంతుల రామలింగ శాస్త్రిగారి 'శుక్లపక్షము' పానుగంటివారి 'సాక్షి' యుపన్యాసములు, శేషభట్టరు వేంకట రామానుజాచార్యులవారి 'ఆంధ్రనామ సంగ్రహము' మరియు నితర వ్యాసములు, అధిక్షేపకావ్యములుగా ప్రసిద్ధికెక్కినవి. జానపదసాహిత్యమున నిట్టి

1. పొగాకుపొడి, 2. కరణాల.

యధిక్షేపగేయములు కొలదిగనే లంభించును.లభించునవిగూడ సంస్కార దృష్టి గల వేదాంతుల రచనములై యున్నవి.కనుక వీరి నందరిని వేమనకు వారసులుగా చెప్పుకొనవచ్చును.అగ్రవర్ణములవారి యాడంబరములపైనను,దొంగసన్యాసుల వేషములపైనను, సంఘమున జీర్ణించియున్న మూఢాచారములపైనను వేమన దాడివెడలెను.చక్కని హాస్యముతో నధిక్షేపరచనములుచేసి అధిక్షేపమునకు గురియైన వారిని గూడ నవ్వించెను. లోకకల్యాణమునకు తోడ్పడు నిట్టి యధిక్షేపము-హాస్యము - ఉత్తమకోటికి చెందినది. వేమనగారు పోషించిన హాస్యమును శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు చక్కగా వివరించియున్నారు1. తరువాతి వేదాంతులుకూడ వేమనగారి యడుగుజాడలందు నడచి మూఢాచారములపై దాడి వెడలిరి.అట్టివారి గేయములుకొన్ని మనకు వేదాంతతత్వములున్నగ్రంథములందు లభించును.

పాశ్చాత్యసాహిత్యమందు కొన్ని హాస్యపాత్రములు కలవు. ఫాల్స్టాఫ్ డాన్క్విక్సాట్ వంటి పాత్రములు మన సాహిత్యమున లేవు. మన విదూషకులు, శకారులు, చోడిగాండ్రు ప్రదర్శించునట్టి హాస్యము బండహాస్యము.మొక్కపాటి వారి బారిష్టరు పార్వతీశం, గురజాడవారి గిరీశం మున్నగు పాత్రములందు పాశ్చాత్యహాస్యపాత్రలందు కాననగు. హాస్యము మరియు (witticism) చమత్కృతి కొంత కాన్పించును. 'విట్' అనేది వాక్చమత్కృతి లేక వికృతిని తటాలున ఆరోపించగల ప్రజ్ఞ'2. అనగా ఆలంబమునగల వికారమును సూటిగా చెప్పక కొంత కళాత్మకముగా ఉపమ, దృష్టాంతము మున్నగు అలంకారములతో చెప్పి తత్సామ్యముచే హాస్యమును కలిగించుట (విట్) చమత్కారసంభాషణ మనబడును. ఇది 'మేధ'కు పని కల్పించునట్టిది. చమత్కారము కేవలము వాచ్యమైనచో సాధారణహాస్యముగా మారి అందరికిని అర్థమగునట్లు స్పష్టముగా నుండును. వాక్చమత్కృతి వేమన మరియు నితర శతకకారులం దధికముగా గాన్పించును. ఇట్టి హాస్యము జానపదవాఙ్మయమున చాల ఎక్కువగా నున్నది. కాని గేయములందు తక్కువగా నున్నది. ఇచ్చట వాఙ్మయము విస్తృతపరిధిగల పదము. చమత్కృతి జానపదుల సామెతలం దధికముగా నుండును. సామెతలు గేయవాఙ్మయమున చేరవు. కేవలము

1. వేమన. 2 తెలుగు హాస్యము. పుట 28.

గేయములందు వాడబడిన సామెతలలో అచ్చటచ్చట నీ చమత్కృతి మనకు కాన్పించును.

'తగ తండ్రి జంపిన తగవుండగా లంజె - జగడాల బోవు జాడ నాజాడ'
'వరద బోసెడువాడు వరద నుండెడువాని - వెఱవకుమన్న విధము నా విధము'

అను యాగంటివారి వచనము లిట్టి హాస్యమునకు తార్కాణములు. పసకాడ సన్యాసి 'గంగా వివాహము'న

'కస్తూర్రి పడితేను కడుపు నిండగవలెను, కడుపు నిండని వట్టి కస్తూర్రి యేల'
'దొప్పక్రిందను చేరి దోసి లొగ్గినరీతి, తృప్తి నాశను జెందునో తోయజనేత్రి'
'ముందున్న శ్రవణములకింతేను మిక్కిలి, వెనుక కొమ్ములు వాడి వినవె గౌరమ్మ'

వంటి సామెత లిట్టి హాస్యమున కుదాహరణములు. జానపద గేయములందున్న సామెతల నన్నింటిని భాషాపారస్వతవిషయముల ప్రకరణమున జూడవచ్చును. ఆ సామెతలందెన్నియో ఇట్టి చమత్కృతిచే హాస్యమును కలిగించును.

జానపదగేయములందు గానుపించు హాస్యము మన జాతీయహాస్యము. శిష్టసాహిత్యమున నున్న హాస్యము సంస్కృత మూలగ్రంథములనుండి వచ్చినట్టిది. అది భారతీయు లందఱకిగల సంపద. కేవలము జానపద జీవితము నుండి గ్రహించు హాస్యము జాతీయమైనది. పండితులుకూడ నిత్యనైమిత్తిక జీవితమునగల హాస్య సన్నివేశములనుండి హాస్యమును గ్రహించి తెలుగు శిష్ట సాహిత్యమునకెక్కించిరి. సంస్కృతానువాదములం దిట్టి హాస్యము ప్రవేశించి మూలమునకు మెరుగులు దిద్దినది. ఇట్టి సున్నితమగు హాస్యముతోపాటు జానపదులందు మోటుహాస్యము కూడ కలదు. అది అధమహాస్యము. అంత మాత్రమున విచారింప బనిలేదు. ప్రపంచమందలి సాహిత్యము లన్నింట నిట్టి హాస్యము గోచరించుచునే యుండును. జానపద గేయములం దధికసంఖ్యలోగల స్త్రీల పాటలందు మోటు హాస్యముండదు. మృదువై సభ్యమైన హాస్యమే స్త్రీలపాటలం దుండును. ఇట్టి హాస్యము జానపదుల నిత్యజీవితమును సుఖమయ మొనర్చుటకు దోహద మొసంగును. జీవితమందలి స్తబ్ధతను పోద్రోలి ఉల్లాసమును చేకూర్చి హాస్యము మానవుని జీవితమును సరసమొనర్చు నమటలో సందియము లేదు

—: o :—

# భాషా స్వారస్యములు

ప్రామరులగు జానపదుల రచనములందున్న సాహిత్య విషయములను సహృదయతతో పరిశీలించిన యెడల ప్రాకృతమానవునందుండు కళాభిరతి సంస్కారికి గల కళాభిరతికి తీసిపోదనిపించును. జానపదగేయములందు జ్ఞాతముగనో అజ్ఞాతముగనో మనకు కనబడు శిల్పము, సౌందర్యము, సహజ రమణీయత, మున్నగు విషయములు మాత్ర మనంతముఖములుగా భాసించు ననుటలో సందియము లేదు. జానపదుల హృదయములు నిష్కల్మషములగు దర్పణములు. వారి మనోదర్పణములందు ఊహసంజనితములగు నానాకల్పనలు, ప్రకృతి దర్శనమున కలిగిన గిలిగింతలు, భయము, సంతోషము. కోపము, దుఃఖము వంటి గుణములచే గలుగు వికారము లున్నవియున్నట్లుగా,స్వచ్ఛముగా ప్రతిబింబించును. ఆ ప్రతిబింబములు సహజమనోహరమగు వాగ్రూపమున ప్రసరించినప్పుడుసంస్కారులగుసాహితీవేత్తలకుగూడ అభిమానపాత్రమగుటయే కాక విమర్శనాత్మకముగా పరిశీలించినచో సానలదీరని జాతిరత్నముల గనులట్లు తోచును.జానపదులకును శిష్టులకునుగలహార్దికసంపదయందధికవ్యత్యాసములేదు. కేలవము మేధాగతసంపదయందే వ్యత్యాసమున్నది. కవితాకళకు హృదయముతో నున్నంత సంబంధము మెదడుతో లేదు. ప్రపంచమందలి కవిత్వ మధికభాగము హృద్గతమగు పిపాసవలననే జన్మించినది. అది జానపదహృదయము కానిండు శిష్టహృదయము కానిండు ; కవితామార్గమున పయనించినప్పటి సౌందర్య దిదృక్ష, కళాభిరతి రెంటికి సామాన్యమే. దాని వాగ్రూపముననే కొంత భేద మగుపడును.శిష్టసాహిత్యము సాంస్కృతికమగుప్రౌఢమార్గమున,వ్యాకరణాలంకార శాస్త్ర నియమబద్ధమై దీర్ఘసమాస గుంఫనముతో ఏరికోరి తెచ్చిపెట్టిన శబ్ద విన్యాసముతో నడచును. ఇక జానపదసాహిత్యమన్ననో దేశీయమగు పరళ

మార్గమున వ్యాకరణాలంకారనియమములకు కట్టువడక అలతియలతి పదములతో అప్రయత్నముగా సహజముగా వెడలెడు వ్యావహారికభాషలో నుండును.

జానపదుల భావములవలె వారి భాషకూడ జీవకళయుట్టిపడునదిగానుండును. చెప్పదలచిన విషయము హృదయమునకు దాకునట్లు సూటిగా చెప్పబడునే కాని కవి ప్రౌఢోక్తులచే క్లిష్టావబోధముగా నుండదు. జానపదసాహిత్యము గేయసాహిత్యము కనుక గేయధర్మావలంబనమున శబ్దములు, దీర్ఘములు హ్రస్వములై, హ్రస్వములు దీర్ఘములై వ్యాకరణపు మూసలో నిముడవు. అది చూచి కొందరు గ్రామ్యభాషయనియు దూష్యమనియు తెగడుదురు. దీనికి కారణము తెనుగు భాషాసాహిత్యముల క్రమపరిణామవికాసచరిత్రము వారెరుంగక పోవుటయే. మన భాషాసారసత్వవిషయముల యారంభస్థితిని క్రమపరిణామమును తెలుపునట్టి గ్రంథములు లేవు. ఇప్పుడిప్పుడే అట్టిపరిశోధనలు జరుగుచున్నవి. కేవలము శిష్టసాహిత్యము నాధారముగా చేసికొని అట్టి పరిశోధనలకు పూనుకొనుట నేల విడిచి సాము చేయుట యగును. జానపదుల రచనములను విడిచినచో మనకు మన భాషాసాహిత్యముల సహజస్వరూపముగాని వికాసము గాని తెలియవు. ప్రజాసామాన్యమున వ్యవహారముననున్న మాటలే సంస్కారము పొంది సాధువు లగును. వ్యవహారముననున్న గేయములే ఛందస్సునకు బీజములగును. భాషా శాస్త్రజ్ఞులందర కీవిషయము తెల్లమే. కనుక తెనుగు సాహిత్యసౌధమునకు జానపదగేయసాహిత్యము పునాదివంటిదన్నచో సత్యేతరము కాజాలదు. పట్టభద్రుడగు పండితునికి బాలశిక్ష చదువు నవస్థ పునాదియైనటులే శిష్టసాహిత్యమునకు గూడ జానపదసాహిత్యము పునాది. సంస్కృతసారస్వతమపారముగాజీర్ణించుకొని పాశ్చాత్యవాఙ్మయమందలి రమణీయత నెరిగి వాని వెలుగులో జానపద గేయముల జూచి పెదవి విరిచెడువారి కలవడినది పరానుకరణమే కాని జాతీయములగు భావములు, భాష, పలుకుబడులు, నుడికారములు, సామెతలు కావు. తమ బాల్యమునుతామేమరచెడువారికి జానపదగేయవాఙ్మయమును సహృదయతతో పరిశీలింపగల హృదయమైశాల్య ముండుట కష్టము జానపదగేయ పరిశీలనమునకు సహృదయతతోపాటు చారిత్రకదృష్టికూడ అవసరము.

భాషాభావములు, ఛందస్సులు, వర్ణనములు, అనుభూతులు కాలానుగుణముగా

మారుచు క్రమపరిణామవికాసము నందుచుండుట సహజము. అన్యభాషల సంపర్కమున క్రొత్తమాటలు, క్రొత్తసంప్రదాయములు, క్రొత్తక విసమయములు సాహిత్యమున చేరిపోవుచుండును. ఇట్టిది జానపదగేయములం దధికముగా నున్నది. ఎన్నియో ఉర్దూ ఇంగ్లీషు పదములు వాని యనువాదములు వ్యావహారిక భాషయందు ప్రవేశించి గేయములందు తలదాచుకొన్నవి. వానిని కాదనుటకు వీలు లేదు. ఒక్కొక్కప్పుడు శిష్టుల రచనములు అనువాదములకన్న జానపదుల రచనములు అనువాదములే మేలనిపించును. జానపదగేయములందలి పదసారళ్యము నిరలంకారత, సౌకుమార్యము, రామణీయకము, ప్రశాంతసౌందర్యము ఆది కవులను దలపించును. వాల్మీకికాలమునకును, మురారికాలమునకును సంస్కృత కావ్యరీతులం దెంత మార్పు వచ్చినదో విజ్ఞు లెరుగుదురు. అటులనే నన్నయ, నన్నిచోడులకుపూర్వమున్న దేశీయకావ్యమార్గములే రానురాను ముదురుపాకమున బడి లోకహితమను కావ్యోద్దేశమునకు దూరమై విద్వజ్జనానురంజకములుగా పరిణమించినవి. తరువాతివారి వక్రగతుల కెంత యలవాటుపడినను మన హృదయములు తొల్లిటి కవుల సూటిదనమును చూచినంతనే యుప్పొంగిపోవుట సహజము. అటులనే ఎంతగా సంస్కృతాంగ్లాంధ్రాది ప్రౌఢసాహిత్యముల పుక్కిట బట్టినను చక్కని దేశీయపు పలుకుబళ్ళతో దేశీయచ్ఛందములందు సూటియగు మాటలతో అల్పాక్షరముల ననల్పభావసంపదను వెలార్చు జానపద గేయములు సహృదయహృదయాహ్లాదకరములై పండితపామరరంజకములై యొప్పుచున్నవి. ఈప్రకరణమున జానపదగేయములందున్న సొగసులు దిఙ్మాత్రముగ పరిశీలింతము. రస, భావ, వర్ణనా, శైలీవిషయము లిదివరకే ఆయా ప్రకరణములందలి గేయముల దడవినప్పుడు మనవి చేసియుంటిని. వానిని మరల పేర్కొన్నచో చర్విత చర్వణ మగుటయేకాక గ్రంథవిస్తరమగును. కనుక నీ ప్రకరణమున భాషావిషయము లధికముగను, ఉక్తివైచిత్రికి సంబంధించిన విషయములు కొలదిగను పరిశీలింపబడును.

వికాసము సజీవమగు భాషయొక్క ముఖ్యలక్షణము. జన్మస్థానమున గోదావరీనది ఎంత చిన్నదో రానురాను అంత పెద్దదైనటులే ప్రతి జీవద్భాష దాని పుట్టుక సమయమున కొలదిగనే యుండి క్రమముగా పెరిగి సువిశాలమగును. నది పుట్టిన చోటునుండి కదలి సాగి పోవునప్పుడు ప్రాంతప్రాంతములందలి

వాననీరు,కాలువలు,వాగులు,సెలయేరులు వచ్చిచేరి పెద్దదగును. వ్యవహారమున నున్న భాషకూడ, ఒకచోటునుండి మరియొక చోటికి ఒకనోటినుండి మరియొక నోటికెక్కినప్పుడును,అన్యభాషాసంపర్కము కలిగినప్పుడును,అన్యవిషయముల మైత్రి యేర్పడినపుడును, శబ్దసంఖ్య పెరిగి వికాసము జరుగును. ఇది ప్రపంచమందలి భాష లన్నింటికిని సమానముగా వర్తించు సూత్రము. అన్య భాషాపదములులేనట్టి మడికట్టుకొన్న భాష ప్రపంచమం దొక్కటియైన నుండదు. వికసన మాగిపోయి వ్యవహారమునుండి దూరమైన భాషలందు తప్ప ఇతర భాషలం దన్నిటను పరభాషాపదములు చొచ్చుకొనిపోవుచుండును ఇట్టి భాషా సమ్మేళనమువలన పదములు వానియంతట అవియే చొచ్చుకొనివచ్చినను లేక ప్రయత్నసాధ్యములైనను విజాతీయతను విడిచి జాతీయములైపోయి ఆభాష కనుగుణముగా రూపుదిద్దుకొన్నచో నాభాషకు చెప్పరాని వికాసము కలుగును. దేవభాష యనబడు సంస్కృతము గూడ ఒకప్పుడు వ్యవహారమందున్ననాడు ఆర్యేతరభాషాపదముల నెన్నింటినో తనలో చేర్చుకొని వానికిగూడ గీర్వాణత్వ మలవరచిన సంగతి మన మెరుగుదుము. కొన్ని శబ్దములు వాని స్వస్వరూపమునే కోలుపోయినవి. కొన్నింటిని ద్రావిడశబ్దములని తెలిసికొని మన మాశ్చర్యపడు నంతగా నవి సంస్కృతములై పోయినవి. అటులే సంస్కృత పదములెన్నియో దేశభాషలందు చేరిపోయినవి. తెలుగులోనున్న సంస్కృత శబ్దజాల మింతంత కాదు. సాధారణుల కివి చెప్పినప్పుడు వారాశ్చర్యపడుదురే కాని వాడుకలో నవి సంస్కృతములని గుర్తింపలేనంత గాఢముగా లీనమైపోయినవి. సంస్కృతశబ్దములే కాక తెలుగులో ప్రాకృతశబ్దములు భారతదేశమందలి ఇతర దేశీయభాషాపదములు కూడ ఎన్నియో కలిసిపోయినవి. తురకలు దక్షిణ దేశమునకు దండెత్తి వచ్చిన తరువాత పారసీ,అరబ్బీ భాషాపదములు తెలుగుదన మలవరించుకొనినవి. ఆంగ్లేయుల ప్రభుత్వము వచ్చిన తరువాత ఇంగ్లీషు పదములు కూడ తెలుగులో చేరిపోయిన సంగతి మనమందర మెరిగినదే. ఇది కేవలము తెలుగునకు సంబంధించిన విషయము కాదు. ప్రపంచమందలి భాష లన్నింటికి ఈ పరిస్థితి తప్పదు. ఇంగ్లీషువారు మనపై ప్రభుత్వము నెరపినవారు కనుక వారి మాటలు మనభాషలోచేరినవనుకొందమన్న వేలమైళ్ళదూరమునయున్న ఆ విదేశీయులభాషలో భారతీయభాషాశబ్దము లనేకములు స్థానము గలిగించు

కొన్నవి. కనుకనే ఆంగ్లభాష మహావేగముతో వికాసమంది ప్రపంచమందలి భాషలన్నింటికి నేడు తలమానికమైనది. ఇది విదేశభాషావిషయము. భారత దేశమున గల భాషలం దన్నిట పుట్టువు ననుసరించి ఉర్దూభాష కనిష్ఠసోదరి. కాని యా బిబ్బోకవతి యందచందములు సోదరభాషలకే యసూయ గలిగించు నట్టివిగా నున్నవి, అందరకన్నలనున్న సుగుణముల కలబోత యైనదీ చెల్లెలు. అరబ్బీ, పారశీ, సంస్కృత, ప్రాకృత, దేశభాషాపదములచే పరిపుష్టమై ఉర్దూ భాష వెలలేని యందచందములను వేగవంతమగు వికాసమును కూర్చుకొన్నది. అటులే తెలుగు కూడ అందచందముల నెలవంక. పరభాషాపదములను తనలో జేర్చుకొని దినదినము కళలు పెంచుకొని తేటవెన్నెలలు పుక్కిలించినది.ఆంధ్ర జనచకోరముల కమృతప్రాయమైనది. తెలుగులో - అందులో వ్యావహారిక భాషాకవిత్వమగు జానపదగేయములందెన్ని ఉర్దూ ఇంగ్లీషు పదములు చేరినవో మచ్చుకు కొన్నింటి నుదాహరింతును.

## అన్యదేశ్యములు

మన వైయాకరణు లెన్నడో తత్సమ,తద్భవ,దేశ్య,గ్రామ్య విభాగముల నేర్పరచి యున్నారు. దేశ్యమున పరదేశ భాషాపదముల పట్టిక వేరు. తత్సమ తద్భవముల మాట నేనెత్తను అది గొంగడిపైగూర్చొని రోమములులెక్కించుట వంటిది. కనుక దేశ్యశబ్దము లందొక విభాగమగు పరదేశభాషాశబ్దములనే పేర్కొందును.మన శిష్టసారస్వతమున జొచ్చుకొనిపోయిన పరభాషాపదములకన్న జానపదగేయములందున్న విజాతీయపదముల సంఖ్య యధికమని నా యభిప్రాయము. జానపదగేయముల భాష వ్యావహారికము. కనుక వ్యవహారమందలి పదసముదాయ మంతయు వానిలో చేరిపోయినది. ఇట్టి విజాతీయ పదములుకొన్ని వాని నిజమైన యర్థమునుగూడ విడనాడి తెలుగునాట ప్రవాహరూపమునబడి నలిగిపోయి వేరు అర్థము లిచ్చునట్టివిగా మారిపోయినవి. విజాతీయశబ్దములు శిష్టసాహిత్యమున గూడ శ్రీనాథునినాటినుండియే యధికముగా గాననగుచున్నవి. జానపదగేయములందు శ్రీనాథకర్తృకమనబడు పల్నాటి వీరచరిత్రమున గూడ ఉర్దూపదములు ప్రవేశించినవి.

'ముఖమల్లుగుడ్డలు మును కొనితెచ్చి'.'మఖ్మల్'అను ఉర్దూపదము తెలుగుదన

మలవరించుకొని 'ముఖమల్లు' ఐనది. 'అన్నపు ఖర్చునకాకుపోకలకు'. ఖర్చు ఉర్దూ పదము; వ్యయమని యర్థము.

'కాటమరాజు కథ'లో నిట్టి శబ్దసముదాయ మధికముగా నున్నది. 'చీట్లు వ్రాయించుమీ శ్రీఘ్రాన తిక్క'. చిఠ్ఠీ ఉర్దూపదము. 'నిలిచిరి వజ్రీలు నిర్విచారమున' వజీరులను మాట వజీ్రలుగా మారినది. వజీరనగా మంత్రి. 'వారి యాటోపంబు వారి ముస్తీబు' ముస్తాబనికూడ వాడుక. ఇది ముస్తయిద్, ముస్తీదు, ముస్తీబు, ముస్తాబుగా మారిన ఉర్దూపదము. 'సరిదార్ల భటులను సాహసులగూర్చి'. సర్‌దార్ శబ్దము తెలుగులో సరదారై నది. 'పారాలు చలికీలు బందు లేర్పరచి' 'పరగ జముఖానంబు బఱపించుకొనియు' 'క్రొత్త చల్లాడాలు కొమరు నాడాలు' వంటి మాటలు. లాగునకు బిగించి నడుమునకు గట్టెడు దారమును నాడా యందురు. 'జానకి తాళ్లు చక్కంగ రాల్చి' తుపాకి చెవికి నిప్పంటించెడు ఫలీతా. ఇది పారసీనుండి ఉర్దూలోనికి వచ్చినది.

'అవుదాలపై నిల్చి యాసిద్ధిరాజు'. హౌదాయనుటకు. 'అమీద ఫౌజులు హతము నేడొండి' ఫౌజ్ అనగా సేన.

'తాకీదు చేసియు ధనము తెమ్మన్న' 'కవులు పత్రాలను గడిపెన్నబెట్టి'
'చెలగి బాకీతనము చేయబోయేవు' 'కానేవు మనసు దిలాస చేసుకొని'

'అంతవారలతోను అర్జీతు చేసి' 'చక్కగా నొకమాట జవాబులేదు.' వంటి శబ్దములు కొల్లలు. 'దూరాన బెట్టిన తురాయులదండు' ఇది 'తుర్రా' శబ్దభవము. 'తురుపుకు తట్టువ బంటుకు బంటు' ఇవి అశ్వవిశేషములు. 'హేజీబుగా నంపె నీ మందలోకి' 'ధరణిలో తోకకు తగిన బందెయును' బందిఖానానుండి బందె వచ్చినది. చేలు మేసిన పశువులను బందెలో దోబుదురు. 'ఘనముగా జిలాటైను గడు చెందిరికలును'. ఇది పాశ్చాత్యభాషా పదముగా నగుపడుచున్నది. (Gelatine)శబ్దభవము కావచ్చును. 'పల్లటి వేసియా పలికొండ కెఱగి' పల్టీయను ఉర్దూ శబ్దభవము. 'సాద వ్రాతయుగాదు సన్న చిన్నెలును' సాదా యనునది ఉర్దూపదము. సాధారణమని యర్థము. 'పలువగ నేజా తుపాకులవారి' నేజాయనగా ఈటె. 'అక్కిరెడ్డి మొదమాదు ననువుగ బిలిచి' మోతెమద్ (Secretary) శబ్దము ఈ తీరుగా మారియుండును. 'అటుముందుగా జండ అదిగోవ కదలె' ఝండా యనునది సిసలైన శబ్దము.

పలనాటి వీరచరిత్రము, కాటమరాజు కథలకన్న ఆధునిక పదములందిట్టి శబ్దము లసంఖ్యాకముగా చేరిపోయినవి, 'దేశింగురాజు కథ' లో బాచ్చా, పాదుషా,

బారాహజారి, హర్కారు, ఫకీరు, దేరా, పారా, తఖ్తు, దివాన్‌జీ ఘోడా, ఖైదు, జల్దీ, అచ్చా, సలాం, దాఖల్, చిఠ్ఠా. ఆజూబాజూ, నాజర్, నమ్మకహరాం, వజీరు, దర్వాజా, మహలు, దర్బారు, మసీదు, కందీలు, అముల్‌దార్, నవాబు, ముసద్దీ, తయారు, చోబ్దారు, జోరు, నమూదు, కిస్తీపన్నులు, తఫ్సీలువారిగ, పేష ఖబ్జు, సూబెదారు, బేగారు వంటి ఉర్దూ పదములున్నవి. భర్తీజేయించు తయారించు వంటి శబ్దములు ఇంచుక్ ప్రత్యయముల నతికించుకొన్నవి. గ్లోబులవంటి ఇంగ్లీషు వస్తువులు కూడ తెలుగులిండ్ల వెలుతురుకై యుపయోగింపబడినవి. మరియు ఫైర్, మేజరు, సిగ్నల్ వంటి ఇంగ్లీషు పదములుకూడ కలవు.

బొబ్బిలిపదమునగూడ అన్యదేశ్యశబ్దము లనేకము లున్నవి. సర్దార్, తరపు (పక్షము) హుకుము, తాలూకా, లడాయి, పెళితా (ఫలీతాశబ్దభవము), వరదీ, వర్దీ, జమాబంది, షామిల్, దికావు, లష్కర్, హర్కారు, మొహర్జా (మోర్చ శబ్దభవము, మోహరమను తెలుగు శబ్దమొకటి కలదు) వంటి ఉర్దూ పదములున్నవి. ఫ్రాంసీలబూచి 'కంబైటో కంబైటో విజయరామరాజా' యనెను. కం (Come) అనునది ఇంగ్లీషు పదము. బైఠో అనునది ఉర్దూపదము. ఈ రెంటి కూడిక కంబైటో యైనది. వచ్చి కూర్చుండుమని యర్థము. 'బంగారపు తీని పీటలుగ చేయించినాడు'. తీన్ అనగా మూడు. తీనిపీట యనగా ముక్కాలి పీట. Tipai తిపాయి ఇట్టిదే. 'వంగి మూడు కూర్మినులు చేసే ఫ్రాంచి దొరగారు' కూర్మినులు సలాము నమస్కారమను అర్థములో వాడబడినది.

'పెద్దాపురము కోడి పందెము'ల పదములో జగపతిరాజుగారు 'నూరుమంది ఇభరాములలోన కొలువైయున్నారు' అని కలదు. ఇభరాముడనగా రాజను అర్థ మిచ్చుచున్నది. 'మలికె ఇబ్రహీం' అను గోలుకొండ కుతుబ్షాహీ సుల్తానునకు తెలుగు సారస్వతమున మల్కిభరామనియు మలికిభరాము డనియు పేరులు కలవు. మల్కిభరామునకు తెలుగుదేశమునగల ప్రఖ్యాతిచేత రాజుకు ఇభరామను శబ్దము రూఢియై యుండును. మహారాష్ట్రులు నవలను కాదంబరి యన్నట్లు మనవారు రాజుల నిభరాము లనియందురు. మల్కిభరాము తురకరాజైనను తెలుగున కొనర్చిన సేవమూలమున నాతనికి తెలుగు భాషయందింతటి స్థానము లభించుట యుచితమే. 'బేటికి రాక కోటలోపల మొబాసుగుంచేను, సత్యవరము గడి దాటితే దేశముండబోదు'. మొబాసు, మొవాసు=దాగుకొనుట; మొగము దాచుకొనుట

యను నర్థమున ప్రయోగింపబడినది ఇది ఉర్దూపదమువలె నున్నది. 'సభలు తీర్చి మసలందు పేసిరీ జగపతి మహారాజా'. మస్నదు (సింహాసనము) శబ్దము ఈరీతిగా తెలుగై పోయినది. ఇంతవరకు పేర్కొనబడిన మరికొన్ని ఉర్దూపదము లీగేయమం దున్నవి. వానిని పేర్కొనుట యనవసరము.

'బంగారు తిమ్మరాజు కథ'లో పైనున్న ఉర్దూపదములతోపాటు మైన గోరలు అను పదమొకటి కలదు. ఇది 'కత్తిచాకు' వంటిది. మైనాయనగ ఉర్దూ భాషలో గోరువంక. గోరువంక శబ్దమునకు జానపదవ్యావహారికరూపము గోర. దాని బహువచన రూపము గోరలు. ఈ రెంటికలయిక మైన గోరలు.'ఒకటిరెండో మూడు గేటు వరుసగ దాటాడు.'Gate అనుఇంగ్లీషుపదము తెలుగు సీదారికి లాగినది.

'శాంతగోవింద నామాలు'పాటలో 'కొట్టు తాళం బిగా కొత్వాలు నంపెద' మని కలదు. కొత్వాలు ఉర్దూపదము. 'కుశలవ యుద్ధము' పాటలో రాముడు రణరంగమున నంగదునితో 'ఎవడురా అశ్వం బట్టినవాడు, ఎంతవాడుర అశ్వంబట్ట, అశ్వంబట్ట కులదస్తున్నద'యనెను.కుశలవులు గూడ'అశ్వమును విడువ నీకులదస్తున్నర' యనిరి. ఇది ఫారసీ పదమువలె నున్నది. అధికారమను నర్థ మిచ్చుచున్నది. భూదేవి కుశలవులకు సహాయముగా 'ఆరువేల సేనల జతగూర్చి - తయినాతిగా పంపించెను వారిని' తయ్నాతీ ఉర్దూపదము. రామునకు కుశలవులకు సంధి చేయుటకై దేవతలు 'అందరుకూడి ఆలోచించి రాజీ చేయుట న్యాయంబనిరి' 'రాజీ' ఒప్పందమనుట కుర్దూపదము. 'రామ కథా సుధార్ణవమున' బత్తీసాయుధములచే గొట్టిరి పవనతనయునకును' బత్తీస్ అనగా ముప్పదిరెండు. ఆయుధములు ముప్పది రెండువిధములు.'శతకంఠరామాయణమున'శ్రీరాముడు సేనానమేతుడై బయలుదేర నాతనితో 'బారుమీరినయట్టి పేరైన జుల్మతీ గుఱ్ఱాలు కోటానుకోటులే దరలె'నట. జుల్మతీ గుఱ్ఱములను మాట శిష్టవాఙ్మయమున కూడ కలదు. సింధుదేశపు గుఱ్ఱముల సైంధవములన్నటుల జుల్మతీ గుఱ్ఱములు కూడ దేశమును సూచించునవి కాబోలు.

'నలచరిత్ర పదములో 'మేలయిన పట్టు శమేనాకు లోన'శమేన= శామ్యాన శబ్దమునకు వ్యావహారిక రూపకము.'తల్కావప్ప కిన్కాబు తాబిదుం గట్టి'కిన్కాబు= కిమ్ఖాబు శబ్దమునకు భ్రష్టరూపము.

'శ్రీకృష్ణ జననము'పాటలో'భూతకికి కబురంపెనూ' అని కలదు.కబురు= వర్తమానమని యర్థము. సిసలైన ఉర్దూపదము ఖబర్.

'ఆండాళ్ చరిత్రము'న 'పగల్పత్తు రాపత్తుత్సవపై భవ మచట జూచువారు' అని కలదు. పగలు (టి) పది రాత్రి పది యని యర్థము. ద్రవిడమునుండి వచ్చిన మాటయిది. 'శ్రీవరాహావతారచరిత్రము'న నిశాన, నదురు, తాలింఖానా, జాగీరుదార్లు జబర్దస్తు, బందోబస్తు, దరోబస్తు, దివాన్‌ఖానా, మహల్, కచ్చేరి, చావడి, బతాయించి, బత్తీసాయుధములు వంటి ఉర్దూపదము లున్నవి 'గంగావివాహము'న దాకలా(దాఖలా)యను పదము కలదు. 'భల్లాణరాయచరిత్రము'న దిరసు(Dress) శబ్దము కలదు. 'కొమిరెల్లి మల్లన్న' కథలో శేరిదారు, కోటిడి, తహశీలు వంటి ఉర్దూ పదము లధికముగా గలవు. 'చిరతని తెప్పోత్సవ ఓడపాట'లో రయిలౌసు (Rail House), గుల్‌బులు, వాలుషేడులు వంటి ఆంగ్లపదములున్నవి.

'బాలనాగమ్మకథ'లో 'చిన్నవాండ్లకు సత్కా దీసిరి'. ఇది 'సద్గా' శబ్దమునకు తెలుగురూపము. ఇంకను బందు, ఆరాబు, ముస్తాబు, పర్మానా, జామీను, దరోబస్తు మున్నగునవి కలవు. 'ఎటుకల నాంచారి' కథలో గాబరి, గాభరా పదములున్నవి. ఇవి 'గభ్‌రానా' యను ఉర్దూపదమునుండి పుట్టినవి. 'మరియాద లేని కులము మక్కారి కులము' మక్కార్ అనగా మోసకాడు. 'సవతుల కయ్యము పాట'లో తావీదు, మొకాసా వంటి ఉర్దూపదము లున్నవి. 'కాంభోజరాజుకథ'లో తెల్లయేనుగుపై రత్నాల 'అవుదా' పన్నిరని కలదు. ఇది 'హౌదా' శబ్దమునకు తెలుగుసేత.

'గాంధారికథ'లో రాజుగారు 'కచేరి బరకాస్తు చేసి' పోయిరి. కచేరి, బరకాస్తు ఉర్దూపదములు. 'చెలిహిమమహల్‌దార్లు' 'కవచీతబ్బాలు' ఏమి పదములో; బహుజూరు అను ఉర్దూపదము 'బహుజారున'గా మారినది. 'సిర్‌పేష్' అనగా తురాయి యని యర్థము. 'చెబుక్' చాబుక్ అను పదమునకు తెలుగు. కొరడా యని యర్థము. మాఖూబ్ మౌఖూఫ్ అనుటకు. 'సారంగధరచరిత్ర శారద వరుస'లో 'చేయించె నపుడు కూచీలు' అని కలదు, సపరివారముగా బయలుదేరుట యని యర్థము. 'కూచ్' ఉర్దూపదము. ఇంకను కుడుతాలు, టోపీలు, జామాలు, జండాలు, కాపాలు (అంతఃపురోద్యోగులు) దుకాణాలు రగడు(రాపిడి), పౌజు, బందీలు, ఫైరు వంటి శబ్దములున్నవి.

'కాలజ్ఞాన తత్వము' లందు బందు, ముసద్దీలు, సదరు, ధగిడీక, (ధగడ్ అనగా మిండడు) బంచోదు, లుచ్చా, ధూర్తెరి మున్నగు శబ్దములు వేదాంతుల నోట వెడలినవి. 'తారకామృతసారమున' సబ్బియ్యము (సబ్బు బియ్యమందుతు

కూడ) కాననగును. ఇది సాగూ శబ్దమునకు వికృతి. భడవా వంటి పదము లున్నవి. 'రామదాసు చరిత్రము'న హుజూరు, అర్జీ, కిస్తీ, ఖర్చు, ఖాయిదా, ఫిర్యాదు, కారుబారు, సాలాఖరు, ఖైదు, హాజరత్, బందిఖాన, సత్తుచేయు, రసీదు, రవాన వంటి పదములున్నవి.

ఈతీరుగా నెన్నియో పరభాషాపదములు తెలుగు వలువలు ధరించి తెలుగులై పోయినవి. వాని మూలమున తెలుగు భాషకు వికాస మేర్పడినదని యంగీకరింప వలసినదే. ఎంత మడికట్టుకొని యున్నను పైన పేర్కొనబడిన కొన్ని శబ్దములనైనను కనీసము వ్యవహారముననో సంభాషణముననో వాడని తెలుగువా రుండరు. పరభాషాపదములు మన భాషను పాడుచేసెనని తలచుటకన్న సహృదయతతో వానివలన భాషకు గలిగిన మేలునెన్నుట లెస్స.

## వ్యావహారిక భాష

జానపద గేయములందుండు భాష వాడుక భాష కనుక నిది కావ్యభాషా వ్యాకరణమునకు లొంగకుండును. ఆ భాషను కావ్యభాషా వ్యాకరణపు కొలబద్దలతో కొలచుట యసమంజసముగా నుండును. వ్యాకరణ విరుద్ధములగు భాషావిషయములు జానపదగేయములందు బహువిధములుగా నున్నవి. వ్యావహారిక పదరూపములు, దుష్టసంధులు, దుష్ట నమాసములు, భ్రష్టరూపములు, శివకవు లుపయోగించినట్టి పదసముదాయము, జానపదగేయములం దధికముగా గానవచ్చు భాషావిషయములు. వైయాకరణుల కివి సమ్మతములు గాకున్నను భాషాశాస్త్రజ్ఞుల కివి యింపు గొలుపును. మరియును కోట్లజనుల నిత్యవ్యవహారమున ప్రయోగింపబడుటచే నివి తమ వ్యాకరణమును తామే నిర్మించుకొన్నట్లు కాననగును. అట్టి ప్రయోగములు కొన్ని మచ్చున కుదాహరింతును.

దినవెచ్చము, ప్రాణగొడ్డమువంటి శబ్దములను శిష్టసాహిత్యమున ప్రయోగించిన శ్రీనాథమహాకవి జానపదులకై రంచించిన పలనాటివీరచరిత్రమున నట్టి శబ్దములు ప్రయోగించుట వింతకాదు.

'కొలువులో నాయుడు కొవరెట్ట వట్టి, కులపగ దీర్ప పీకొడుకితడంచు' కులపగ మిశ్రసమానము. వ్యాకరణ మంగీకరింపకున్నను శిష్టకవి ప్రయోగమునను ప్రయోగ బాహుళ్యమువను సాధువైనది. 'ఘనమైన రుంజలు కనకతప్పెటలు' ఇది

కూడ మిశ్రసమాసమే. 'ఇతర వస్తులు మోసి యేతెంచునట్టి' వస్తువులనుటకు మారుగా వస్తులనినాడు. ప్రథమావిభక్తి ప్రత్యయమగు 'వు'లోపించినది. ఇట్టి ప్రయోగములు శివకవు లందధికముగా నగుపడును. ముందుముందిట్టి శబ్దము లింకను రాగలవు. 'నరికితే జలములు నడిమికి దెగవు' నరికినచో యనుటకు. 'తప్పానవాలని తలపకపోతి'తప్పు+ఆనవాలు=తప్పానవాలు.టుగాగమమురాలేదు. పినయెల్లయ రచించిన 'కాటమరాజు కథ'లో నిట్టి సంపద బహుళము. 'తలచు మాటలు మాని దాగుండు మనుము' క్త్వార్థకేకారసంధి. 'కాలారి చేతికి గ్రక్కున నిచ్చి కాలరి ( దూత ) యనుటకు. 'చక్కగా శానాపశానల గూర్చి' సేనాసమూహముల దెల్పుటకు సేనలకు వర్ణక్రమ భంగము. 'కదసి యాదవులును కాటార్ల నరక' ఛందస్సు కొరకు కటారి పొడుగైనది. 'సరిచూడ పగ దళము శాన యున్నదియు' చాల యనుటకు. 'మెండైనరాగాలు మెరసాడసాగె' మెరసి+ఆడు.అవతల పైడికం టదిరిపడి లేచె' పైడికంటి+అదిరిపడి. 'తగనొప్ప వాదాలు త్రవ్వించి యపుడు' ఓదములనుటకు. 'ఘనగుంపుగా నున్న గడ్డపై బడెను' 'పొదలు దూరాడాడ పొంచుండ సాగె' 'వస్తి మేమిటికని వగజెందువారు' 'కనకపువ్వుల దట్టి కానెగా గట్టి' 'కాలిదళములు కదిపె కనకపొడి రాల' 'వింతగా శిరమందు వీరజడ యల్లి' 'రాకట్టు ఉంగరాల్ రత్న కడియాలు' 'పాదకానుక పెట్టి పంతమీడేర్చి' 'ఏకాండమున గొట్టె నెంసిద్ది రాజు' 'కలవరపడి యంత ఘనవాల వేసె' ఘనమగువాల. వాలోవాఽ యను శబ్దమును తెలంగాణమున వల వలలో యందురు. 'అగ్రుడై పోచయ్య యశ్వంబు నెక్కి' అగ్రహియై యనుటకు. 'ఎడపక పగతుర ఎదములు వగుల' ఎదలనుటకు. 'ఆవుపై జెలరేగి హాగ్రులై మండి' '........కొని ఏకపొగడుచు గొండ సేసెదవు' నిరంతరము పొగడుచు ననుటకు. 'మూస్త తెరచుచు వత్తు మురిపెమే లేక' 'గోలెలు దొలిపించి పాలు బోయిస్తే' 'పండిన చేలెల్ల పరిజేస్తి మంత్రి' 'కదుపెద్ద ధరియించి గండపెండెములు' గండపెండేరములనుటకు. వలపత మొనరించి వసుదేశ్వరుండు'పక్షపాత మనుటకు.

'దేశింగురాజు కథలో' 'ఘనగుట్టము'వంటి మిశ్రసమాసములును ఎక్కుక, కోళ్ళ(కొల్లగొట్టుట), ఒళ్లకు (ఒడలికి) వంటి వ్యావహారిక రూపములను కలవు. 'బొబ్బిలి పదము'లో తయారుగనన్నండి, భేటికిరనన్నండి, తెన్నండి వంటి పదములు తయారు గండు, భేటికిరండు, తెండు అనుటకు మారుగా వాడబడినవి. 'తన కోడివి నవరించి తాయిగ విడిచేను' స్థాయిశబ్దమునకిది జానపదరూపమై యుండును. గొల్లున, ఘల్లున. నవ్వులనుటకు మారుగా ఘల్లునవ్వులు అనినాడు. ఉల్లాస్య,

ఉలుఫా (కానుక) శబ్దమునకు వ్యావహారిక రూపము. 'కోరపులి' కోరాడుపులి యనియో కోరపులి యనియో లేదా కోలుపులియో తెలియదు. 'గుండుమందు పేపీ యపుడు గెట్టన చేసిరి'ఘట్టన శబ్దము గట్టన, గెట్టనగా మారియుండును.'అలంగారము యెక్కినారు భేరీ స్త్రీలు దా' 'అలంగము' శబ్దము అలంగారముగా మారినది. అలంగ మనగా వప్రము లేదా కోట ప్రాకారపుగోడకు మట్టిచేతగాని రాళ్ల చేతగాని ఏర్పరుప బడిన కొఱడు. 'రవిడిగుండ్లు దొరలించినారు భేరిస్త్రీలు దా'శత్రువులపై కోటమీదనుండి దొరలించెడు గుండ్లు.రావడి, హావడియనగా ఉపద్రవము.ఉపద్రవము కలిగించు నట్టివి రావడి గుండ్లు. రావడిగుండ్లు రవిడి గుండ్లైనవి.బొబ్బిలి పదము సిసలైన జానపద గేయము.కనుక దీనిలో నధికముగా వ్యావహారిక ప్రయోగములున్నవి. భాష యంతయు వ్యావహారికమే కనుక ఉదాహరించుట యనవసరము. 'తా' ననుటకు 'బారాకోడి దా' యని పదము చెప్పి భిక్షమెత్తెడువా రుపయోగించు మాటలే ఇందున్నవి.

'పెద్దాపురము కోడిపందెము'ల పదము-జానపదులనుండి యుద్ధరింపబడి సంస్కరింపబడినది. పూలకోడిని సింగారించునప్పుడు 'పాతికవరా ల్బంగరుగొలుసు కాలికి పెట్టారు, ఆర్లకు అయినా బంగారపు రేకులు పొదిగారు' అని చెప్పబడినది. ఆరె లనుటకు ఆర్లనినాడు జానపద కవి. ఆరె యనగా కోడి కాలికి వెనుక భాగమున నుండు ఒంటి గోరు.'బంగారు తిమ్మరాజు'కథలో 'మోళీవిద్య'యను పదమొకటి కలదు ఇది మోడి శబ్దమునకు వ్యావహారిక రూపము, గణికాదులు ముగ్గవాలి కాలికి సమీపమందుంచిన వస్తువునులేవనెత్తుటను మోడియందురు.తెలంగాణమున మోడిపెట్టుకొనుట యనగా పోటీపెట్టుకొనుట. ఇది పందెము, పోటీ అను అర్థములలో వాడబడును.

'శాంతగోవిందనామము'లందు 'అవతలకు పోనేల - ఆరట్లుపడనేల' యని కలదు. ఆరడి, ఆరళ్ళు ఆరట్లుగా మారియుండును. స్త్రీల పాటలన్నియు సాధారణముగా వ్యావహారికభాషయందుండును. పాడుకొనునప్పుడు శబ్దములు, దీర్ఘములు హ్రస్వములై హ్రస్వములు దీర్ఘములై ఎగుడుదిగుడు లగుచుండును ఆయా ప్రకరణములం దుదాహరింపబడిన పాటలను చూచినచో వాని భాషాస్వరూప మేర్పడగలదు.

'సీత గడియ'లో 'వొంటొంటి చినుకుకే వక చెంగుతడిపె' నవి కలదు.

'లంకాయాగము' పాటలో ఇంద్రజిత్తు ఆంజనేయుని 'ఏనూరు జంఝుణి ఏక గొలుసుల వేసి కట్టెనే కంబములకు' — ఏకగొలుసు వైరి సమాసము. జంఝుణి యన నేమిటో? 'కనకము దెచ్చి వెదుపబద్దను తిన్నగా గట్టితేను-అంతకంతకు జవుకు అధికమౌనేగాని ఎన్నిటికి తిన్నబడదు' జవుకన వంకరయని యర్థము కాబోలు. 'సుందరకాండ పదము'లో 'వేగుమానంబయ్యె యెల్లలోకములూ'అని కలదు. వేకువ శబ్దమునకు మారుగా జానపదగేయములందు తరచుగా వేగుమానంబయ్యె నను వ్యావహారిక ప్రయోగము కాననగును 'కుశలాయకము'లో రావణుని వర్ణనమున 'ఎంతయిన వారలకు ఎట్టికొట్టము చెప్పి, ఇంట కట్టగజేసె దండి రాక్షసు'డని చెప్పబడెను. వెట్టియే ఎట్టిగామారెను. దానికి ఊతగా కొట్టము చేరెను. అన్నము గిన్నము, పాలుగీలువలె వెట్టికొట్టము పుట్టినది. 'కుశలవ కుచ్చల చరిత్రము'న 'పండిన చేను పసులు మేసితే, కేపులు గట్లు మేసున చెపుమ' యని కలదు. 'కుశలవ యుద్ధము'న యాగాశ్వమున కెదురుగా 'హరియప్పనములు ఇచ్చెడివారు'ండిరట. హర్యర్పణ మను మాట హరియప్పనముగా మారినది. దీనినే తెలంగాణమున హరెప్పనాలు, అరెప్పనాలందురు. 'రామకథా సుధార్ణవము'న రామునితో సీతనుగూర్చి చుప్పనాతి 'కోరిమాలిన దుర్లక్షణి జానకి కొరగాదది నీ'కనెను. శైవకవి ప్రయోగమట్లు జానపదుని నోట దుర్లక్షణి పదము చక్కగా భాసించినది. మాయామృగమును బట్టుటకై రాముడు 'అప్పుడు రాముడు రొద్దగప్పుకొని చప్పుడు గాకుండ, వ్రేళ్ల నేలపై మోపి నడచుచును వెనుక దిరిగి నిల్చె'ను. వేటాడువారు మృగమున కగపడకుండుటకై రొద్ద (కసవు, బురద) కప్పుకొందురు.

'శతకంఠరామాయణము'న 'ద్వాదశామడ పొడవు ద్వాదశామడ నిడుపు అందముగ విలసిల్లు అయోధ్యపురము' కలదు. 'సీతాకల్యాణము' పాటలో సీతమ్మ 'కీరపలుకుల బాల' యని వర్ణింపబడెను. చిలుకపలుకు లనుట కిది వైరిసమాసము. 'నలచరిత్రపదము'లో తనభార్య 'కలశ చేకొని జల బోయంగ' భీముడు నలుని పాదములు గడిగెను. సాధారణముగా జానపదగేయములందు శివకవి ప్రయోగములవలె తత్సమశబ్దములు విభక్తులు చేర్పకయే వాడుట కలదు. 'పచ్చ పతనమునకు బహుగట్టివాడ' బహుమంచి శబ్దమిది. 'విరాటపర్వాంతర్గత కీచకవధ'లో గుఱ్ఱములు కాతునని కొలచె సహదేవు'అని కలదు. ప్రథమావిభక్తి ప్రత్యయలోపము. విభక్తిప్రత్యయములు లేకయే జానపద గేయములందు సహదేవు, రాము, కంసు, విభీషణు, హనుమంతు, శబ్దములు ప్రయోగింపబడును. కీచకుని'మల్లె తైలముతోన

మరి నలుగుబెట్టి, సూగంధి గంధమున అటకల్లు గాచి' మజ్జన మాడించిరి. అటకలి (నలుగుపిండి)అటకల్లుగా మారినది. 'బంగారు తరికోళ్ళ పట్టెమంచాము' తటీమెన శబ్దము తరి యైనది. 'శ్రీకృష్ణజననము' పాటలో 'భూతకికి కబురంపెనూ అప్పుడా భూతకి చనుదెంచెనూ' పూతన శబ్దము జానపదుల నోట భూతకియైనది. 'గుమ్మడు పాటలో'లో 'వడక బ్రాహ్మణ వేషమున నే బలి నడిగితి దానమిమ్మని'వడుగు వడకగా మారినది. ఉపనయనమును వడకలగ్న మందురు. 'గయోపాఖ్యానము జంగం కథ'లో 'గానలోలుడిపు డింతటి శాబ్ది బూనిన విధమేమో' ప్రతిజ్ఞ యనుటకు శాబ్ది శాబ్దము వాడినాడు. శపథశబ్ద మిట్లు మారెను గాబోలు. 'తిరుమంత్రము పాట'లో బోగముది ఈటిసాని1 యనబడెను. ఇది 'వీటిసాని' శబ్దము కావచ్చును. 'ఏకాదశీమాహాత్మ్యమున' సమస్తప్రదేశములనుటకు 'సర్వచోటు' లనినాడు.

'శ్రీవరాహావతార చరిత్రము'న 'నాలుగు వందల ఏపుల తోటి' వేటకు బయలుదేరిరి. వేపి కుక్క) శబ్దము ఏపి, ఏపులుగా మారినది. 'జోడు కోరలు వాదేతు నన్నడు'వడివేయుట. మృగజంతువు, సప్తయేడు లోకములు, రణయుద్ధం వంటి పదములున్నవి. పాపమ్మలింగము పంది నెదుర్కొని బల్లెముతో 'రెండుమూడు చణుకులు చణికింది, నాలుగైదు హోలల్లు చూపింది' హోల్లయన (దావు) పట్టు కావచ్చును. 'దక్షుని యజ్ఞము'న బాగుగా పాటబాడెడువారనుటకు సత్పాటకులని కలదు. ఇంకను నెలనెల పడుట, దంతుర్లు బట్టుట వంటి శబ్దము లున్నవి. 'గంగా వివాహమున' నవరత్నగద్దె, మూలదుంప, వృషభటెక్కెము, మలివకొంపవంటి సమాసములు పెక్కులున్నవి. 'శ్రీయాళమహారాజా చరిత్ర జంగం కథ'లో పుర వర్ణనమున 'వాటముగా ఫలతోటలు గలవు దీటుగ అనగరిన్' అని కలదు. 'శ్రీయాళరాజు చరిత్ర పదము'లో దళతలలని కలదు. 'భల్లాణరాయ చరిత్రము'న వల్లుకు (ఒడలికి) తప్పితము, ఒప్పితము వంటి వ్యావహారిక పదము లున్నవి. 'కొమిరెల్లి మల్లన్న కథ'లో దైత్యమూకలు బహులము. 'చిరతని తెప్పోత్సవ వోడపాట'లో విభవంబుతో వారు వెడలి రాగాను, తాకనా బ్బొందుగా టంపరంబుగను,పీకతో నడవగా విణ్ణవీగుచును'తాకనాలు టంపరంబుగ అనగా నేమో! 'వందిమాగధులెల్ల వహి మీరగాను'? ఈ పాటలో శూద్రాదుల సంభాషణము నిజమైన జానపదుల భాష. ఈ గేయ మంతయు జానపదభాష కుదాహరణముగా జూపవచ్చును.

1. ఈటిసాని = వీటిసాని'పురసుదృశః స్మరచేష్టితం ప్మరామి'(భానుకవి) పుర స్త్రీ = వేశ్య.

'బాలనాగమ్మ కథ'లో 'దాహనలీంద్రలు కొన్ని పెట్టెనమ్మా'చలిపందిర,చలి వేందిర శబ్దములు సలీంద్రగా మారినవి. పొక్కలి = మూడు రాళ్ల పెట్టిన పొయ్యి పొక్కిలి యైనది. సంతానము లేదని తెలిసికొని భూలక్ష్మి 'కుప్పటంబువలె కూలె నమ్మాలారా' కుప్పట మేమిటి? 'తంగెడు మల్లెలు చేత విరుచుకొని, బాలనాగునె రెండు సంధించె'; మల్లెలను పదము బరికలు (బరిగెలు) అనుటకు మారుగా వాడబడినది. 'అరె బయిరీ ఆవొ మన్నడయ్యా' ఫకీరు కుక్కను బయిరి యని పిలిచెనట. భైరవ శబ్దము బయిరిగా మారినది. 'దాని మెడకు కొనవం గట్టెను'కుక్క మెడకు గట్టెడు వంకె కట్టె కాబోలు. 'కమ్మవారి పణతి పసల బాలరాజుకథ' లో 'ఎంతమాత్రము తీయవచ్చినారు' కొనవచ్చినారని యర్థము. 'లక్ష్మమ్మ కథ'లో వోబిడి (వోబడి = జాడ) కరుగుల బిందెలు ధనపు బిందెలు కలవు, కరుకులనగా రూకలు. 'నోటి గామిడి చేతను అమ్మయ్యా' తెలంగాణమున 'నోటిగాయి' యందురు. గామిడి యనగా శ్రేష్ఠము.ఈ యర్థము పొసగునా? లేక గాంభీర్యమను శబ్దము గామిడిగా మారెనా? 'పన్యాసమ్మ కథ'లో బాలక శబ్దము వలెనే 'బాలకి' శబ్దము ప్రయోగింప బడినది.చిన్నపిల్ల యనుటకు 'చినదాయి' వాడబడినది'చెంచన్నకు ఋణము విప్పలేదు' వివాహము కాలేదని యర్థము. 'మూనాలు' మూడు నాళ్లనుటకు. 'ముకుత' (ముగుద)ముగ్ధ కాబోలు.'పాపమ్మ పేరంటాలమ్మ కథ'లో తలహార సాన్నము శిరస్నాన మనుటకు వాడబడినది.'ఎరుకల నాంచారి కథ'లో'వడిగల నీ గుఱ్ఱంబు సుడితోటి గలదు సర్కారిబాబు' సుడి, సూడి, చూడి శబ్దమునకు వికృతరూపము. తెలంగాణమున సూడియందురు. 'పందూము పసువచ్చుట పట్టువేశారు' పట్టువేయుట యనగా ముగ్గు వేయుట.ఇది నిఘంటువుల కెక్కలేదు.దేవతల నారాధించునప్పుడు పసుపుకుంకుమలతో పట్టువేయుదురు.'వీరరాజమ్మ కథ'లో 'దొంగ్రాంగి ముండా వె దుష్టురాలవె రాజమ్మ'దొంగ్రాంగి యనగా తెలంగాణమున గయ్యాళి యని యర్థము. అదే దొంగ్రాంగిగా వాడబడినది. 'రొజ్జగాలి ఇచ్చట వీచుచున్నది నాయన' చలిగాలి యని యర్థము.

'కాంభోజరాజు కథ'లో బ్రాహ్మణుడు రాజగారిని 'స్వయంపాకము ఇప్పుడియ్యుము పదావర్తి ఇప్పుడియ్యుము' అనెను. సదావృత్తి (భైరాగులు లోనగువారి కిచ్చెడు వంటసామగ్రి)శబ్దము సదావర్తిగా మారినది.మాణిక్యాలదేవిని'శరాబంది కాన'లో నుంచిరి. చెర మరియు బందిఖానా శబ్దములు కలిసి 'కత్తిచాకు' వలె

శరాబందికాన యైనది. తల్లి చెరలో నుండగా పుట్టినవాడగుటచే శరాబంది పేరు కలిగెను. ఇటువంటివే క్షత్రియ గొడుగు (ఛత్రము గొడుగు) మ బారాపన్నెండు శబ్దములు. 'గాంధారి కథ'లో పద్మగంధి సంతానార్థమై 'నొయ నోములున్న పట్టరాని వ్రతాలున్న పట్టెను' నోచరాని యనుటకు నొయ్యరాని వాడబడెను. ఈ ప్రయోగము మహబూబునగరం మండలమున కానన 'కచ్చపాల' కక్షపాలశబ్దమునకు వికృతి. 'జోడాలవారు' వా ర్తా వా హ అర్థములో వాడబడినది. జోడంగి యనగా పరుగె త్తెడు కుక్క. జోడన అశ్వ విశేషము. 'కలికి గాంధారివేళ' యనుమాట జానపదులు తరచుగా వాడె నడిరేయి యని యర్థము. గాంధారము, గాంధర్వమనగా దినసప్తమాంశ అర్థము కలదు. కలికి యేమిటో? 'మర్లుబాటు' తిరుగుబాటనుటకు వాడబడి 'మోచేత మోకాట కుంది' క్రుమ్మియనుటకు. 'వాండ్ల అవజీవాలు బోయి'? 'వై నడిచేను' వైశమ శబ్దమునకు జానపద రూపమేమో! 'కోనమాట లాడే కారెడ్డము కారొడ్డెము లనుటకు. 'దూసుకొనుట' పారిపోవుట యని యర్థ 'సోలు' చాలనుటకు తెలంగాణమున వాడుకలో నున్నది. 'కుందాయి వి కుంద పోటులు కావచ్చును. కుంద యనగా తుపాకి మడమ. పుండ్లకు 'ఆ దోమ యీపు పుట్టకుండ' ఈపు పురుగు. తెలంగాణమున ఈపి యందురు. యనగా పుండులో పుట్టెడు పాచి. 'గవిడి' గవను శబ్దమునకు జానపదరూప తెరలనుటకు 'గోడ సరాల'ను పదము వాడబడినది. 'పట్నం బగ్గంపాడు అయి పూర్తిగా నాశనమైన దనుటకును పారిపోవుటకును తెలంగాణమున బె పాడందురు. 'మన కేమన్న కామాటీలు వున్నారా' కామాటమనగా మోటు బొంబాయిలో నున్న తెలుగు కూలీలకు కామాటీలనియు, వారుండు వాడకు కామ పురమనియు పేర్లు. 'ధర్మాంగద చరిత్ర పాముపాట' లో 'సీమంత గాజు సీమంతమప్పుడు పెట్టెడు గాజులు.

'సారంగధర చరిత్ర-శారదవరుస'లో 'తొత్తు గళిమాడగాను మ్రొక్కేరు 'గండబండపై గూర్చుండ బెట్టి' గండశిల లనుటకు. 'అగపు నేయకుం డనుచు వేడంగ' ఆలస్యమనుటకు.

'కాలజ్ఞానతత్వము'లందు పద్మగిన్నె, నిర్భయలు, వస్త్రిరి, ఇస్త్రిరి, కాస్తి పట్టుతనంటది వంటి రూపములు కానవగును. 'శుద్ధనిర్గుణ తత్వకందార్థ దరువ అందు దీన్ని, పీసానికి, లేదనేటట్టు, హళ్ళక్కె, దీన్నె, చేస్తిని, కనుక్కోర

లేందా (లేదగు), కూకుడు వేరు (కూకటివేరు), రెండోది, మానుకోనుండడు, తలపోస్తె, ఇస్తి, దయవస్తే, బుద్ధికి, చెర్లు, కోనేర్లు, సరిపడ్డది, ఎర్లు, సాటువలు (చాటువులు) చౌరంగ, సౌరంగ (సవరముగా) లోతంచెంచి, సాధనాని (సాధనయని) దీనందుండెడివంటి పదములు కొల్లలుగా నున్నవి. 'తారకామృత సారము'న దృశ్యచిన్నెలు, మూత్రకొంప, నరశల్యములు (నరములు మరియు శల్యములని) వంటి సమాసములును, 'వేదశాస్త్ర పురాణ కావల మీదనుండే బోధ దెలిసితే' వంటి విభక్తి ప్రత్యయములు లేని ప్రయోగములును గలవు. 'వేదాంత కుచ్చెల కథ'లో 'ఎంచగడ్డములు పెంచినగాని' యని కలదు. 'ఏగంటివారి వచనము' లందు 'వేయిరేకుల పూవు తుమ్మెదా, అది వెలుగును జగమెల్ల తుమ్మెదా, సద్గూరు నడుగావె తుమ్మెదా, పువ్వు సద్యజూపు నీకు తుమ్మెదా' యనికలదు. సద్యః అనుటకు విభక్తి ప్రత్యయములేని ప్రయోగమిది. 'యవ్వాన మందవె తుమ్మెద, బహుపువ్వుల వాసనె తుమ్మెదా, క్రొవ్వి నీవెరుగావె తుమ్మెదా నీకు నివ్వినేరము లేదు తుమ్మెదా'? 'బహుపువ్వులు బహుమంచి వంటి సమాసము.

'ఎల్లమ్మకథ'లో 'ధర్మచెలమ'దోడించిరట. ఈ యుదాహరణములన్నియు కేవలము నామమాత్రమునకే. ఇట్టి వ్యావహారికరూపములు వ్యాకరణవిరుద్ధ ప్రయోగములు జానపద గేయములందంతట నుండును. వాని నన్నింటిని పేర్కొనుటకు స్థలము చాలదు. స్థాలీపులాకన్యాయమున గ్రహింపవలసినదే.

## అలంకారములు

భాషకు అలంకారములు మెరుగులు దిద్దును. అవి 'కవితాలతాంగికి హారకటకకంకణాదులక్రియ నలంకరణకరణపరిణతులచే నలంకారభావమొందు'ను[1]. కవితాకళ పెరిగిన కొలది యలంకారముల సంఖ్య పెరుగుచున్నది. ఆదికవు లధికముగా నలంకారముల జోలికి పోలేదు. నిర్మలమై, నిరలంకారమై యాత్మప్రేరితమైన మనోవిన్యాసప్రాబల్యమే యధికముగా గల పూర్వుల కవిత్వము సరళముగా నుండుటచే ప్రజలకు తొందరగా గ్రాహ్యమగుట మన మెరుగుదుము. ఇటులని వారెట్టి యలంకారములను వాడలేదని నా యభిప్రాయము కాదు. కొన్ని యలంకారములు సహజముగా నుండును. మరికొన్ని తెచ్చి పెట్టుకొనినవిగా నుండును. పూర్వులు ప్రయోగించిన యలంకారములు సాధారణముగా సహజమగు నలంకారములు. అవి యా మాటలందే యుండునట్టివి. అర్థాలంకారములందు ఉపమ, రూపకము, దృష్టాంతము వంటి యలంకారములు

1. కావ్యాలంకార సంగ్రహము.

మనకు తెలియకుండగనే నిత్యవ్యవహారమున మనచే వాడబడు చుండును. 'ఎందుకట్టుల కాకివలె నరచుచున్నా'వను సాధారణ వాక్యమున నలంకారము గలదు.

కనుక నిట్టి సహజాలంకారము లాదికవులు వాడినటులే జానపదులును తమ నిత్యజీవితమందు సంఘటపడునట్టి ఉపమ, రూపక, సహజోక్తి,దృష్టాంతాది సహజాలంకారములు వాడియున్నారు. శబ్దాలంకారప్రయోగము జానపదులందు చాల తక్కువ. ఎక్కడనో వారికి తెలియకుండ పడిన పదములు తప్ప వారు కావలెనని పట్టుబట్టి శబ్దాలంకారములను ప్రయోగింపరు. అందమగు స్త్రీకి నొసట తిలకమువలె, కొప్పులో నొక బంతిపూవువలె, ముక్కునకు ముక్కరవలె, చెవులకు పోగులవలె నీ సహజాలంకారములు జానపదగేయసాహిత్యమునకు శోభను గూర్చునట్టివి. ముత్యాల కంఠసరులు, కేయూరముల వంటి భూషణములు జానపదుల కుండనటులే వారి భాషయందు గేయములందును అపురూపములగు నలంకారము లుండవు. అలంకారములట్లు ఉక్తివైచిత్రి కూడ భాషా సౌందర్యమునకు, వికాసమునకు దోహద మొసగునట్టిది. వ్యంగ్యవైభవాదులతో పాటు సూటిగా చక్కగా చెప్పుటకూడ నుక్తివిశేషమే.ఇట్టి ఉక్తివిశేషములుగూడ జానపద గేయములం దుండును. జానపదగేయములం దుండు అలంకారములతో పాటు వారి ఉక్తివైచిత్రిని గూడ దిఙ్మాత్రముగ ప్రదర్శింతును.

'పల్నాటి వీరచరిత్రము'న 'పిరిపొత్తుచేయుట చెల్లును కాని-ఆజ్ఞ పొత్తిచ్చుట అది నీతి గాదు' గంభీరార్థము నలతిమాటలందు పొదివి చెప్పుట కుదాహరణము. నలగాముడు నాయకురాలికి రాచకార్యముల జెప్పునప్పుడాడినమాట లమూల్యములు.

'కొంచపు పనియైన కొట్టెడు కొరకు, ఘనమైన దండమె కావలెగాని, కూతదు నన్నని
కోలల గొట్ట, తప్పైనా తమకావ దరముక వచ్చు, హెచ్చైన బలముతో నేగుట
నీతి, మరణమైన జాలు మంచిది యంచు, తగ దెంపొనర్తురు దారిద్ర్యయుతులు'

సూటియగు మాటలు; చక్కని దృష్టాంతములు.

'కుమ్మరామమునందు కుటిలత గచ్చు, పలము వేసిన భాండపటలంబు పగిలి, పెంకులై
పడ్డట్లు పెను కంపమొంది, విడిబడి యేనుగుల్ వీధుల బార' 'బాలుడనని వమ్ము
భావింప వలదు, చిన్నమిరియమందు చెడునె కారంబు.'

బాలుడు యుద్ధమునకేగునని ఐతమ్మ శోకించునప్పు డాడినమాటలు.

'వేములు పూసెను వేములు కాసె, కడసారి ఫలములు కాకులకాయె, మనుజ రక్షణ లేని మల్లెపూదోట, వడి చూరబోయిన వడువయ్యె దంట్రి, జల ముడ్కు పెనముపై చల్లిన భంగి, కప్పిన కుంపటి గాల్చిన రీతి, అణగిన వగపెల్ల అధికమై పొరలె, నీడ నిధానంబు నిలిచి కన్నట్లు, వడ్లలో వజ్రంబు వడిగన్నమాడ్కి, గుడి జొచ్చి దేవు గన్గొనిన విధంబు, కంటిని పుత్రుడ కాంక్షతో నిన్ను, తాడెక్కు పురుషుని తల్లికి అప్లై, గడమీద నాడు కర్కశుని తల్లికిని, శూరుని తల్లికి సుఖమేమి లేదు.'

బాలుడు వారకాంతను దూలనాడునప్పు డన్నమాటలు. 'ఇంటిలో భోజనం బిచ్చకు రాక, పరుల యెంగిలి కాసపడితిని గాదె.'

శ్యామాంగి పురుషుల నమ్మ గూడదని పలుకునప్పటి మాటలు. 'పర్ణాగ్రముల యందు పట్టుకవేలు, జలబిందుతతివలె చలనంబునొందు, మనసొక చందంబు మాటొక తీరు'.

స్వాభావికమగు ఉపమానములకు 'చెట్టెక్కి ఫలమును చేనంటి చూచి, వేగమే దిగి రాత వేసినట్లగును' 'పిడ్డు చిన్నది కాదె భేదించు కొండ, చిన్న మిర్యమునందు చెడునె కారంబు, ఘనకపాలము కెక్కి కాకనొందించు, మానక నోరంత మందును లెప్ప'. 'గాడి వీపునవెళ్లి గ్రక్కున అలుగు, మొగలి పూభంగిని మొనచంద మమర' వంటివి యుదాహరణములు.

'ఎద్దు క్రొవ్వి ఆబోతుపై రంకె వేసిన చందమున'

'తెరగొప్ప నెలుగుచే దెబ్బలు బడియు, వెనుక మంగలముకు వెరచినయట్లు'

'నెట్టన పోయిన నీళ్లకు కట్ట, గట్ట నూహించిన గతి గాదె యిపుడు'

కాటమరాజు కథయం దిట్టి అలంకారము లింకను సహజ సుందరముగా నున్నవి.

'ఆకు లన్నియు బండి యామ్రి మీద, వడిజేసి సుడిగాలి సుడిసినయపుడు, కారాకు దుల్లిన కైవడితోను' 'అందంబుగా వెదురాకు చందమున, తిరుమణి తిరుచూర్ణము దిద్దిరి తోడ' 'కందుకం బున గోలె కాంతిలో నెగసి' 'పెక్కు ముంగిసలతో పెద్దశేషుండు, సాహసంబున బోరుచుండాని నాపు' 'బాతుపై నెగసేటి భైరవు వలెను' 'ఏటికి మత్స్యంబు లెదురెక్కినట్లు' 'ఏ లత బాకు లెంతలేనినను-నాటనోపున యవి నలియుమగాక' 'పూని దీపము నూచి పూనక మ ల్లెల్ల-మలుప వచ్చియు దిందు మలగునా యెట్లు' 'కదనంబు కేగిన కాటి గుమ్మాలు-చెదరక జగడంబు నేయంగ గలవె' 'వ్రాపుల కదుపు నాణ్యంబెయ్యెన-గుర్రంపు బౌజుతో గూడంగ గలవె' 'బూరుగు తానెంత పొడుగు బెరిగినను-చందనముతో వది సరితూగగలదె' 'యెలమి జీలుగుచెట్టెంత లావైన-నల మేడ కంబాల నాచంగ గలదె, పాములు బారలు పదినూరులైన - విష్ణువాహనముతో వివదింప గలవె, యెలమి దూదికొండ లెంత ఘనమైన-ననలంబు నొకయింత యణపంగ గలవె, మదియించి

యున్నట్టి మత్తేభములను-బొదలి సింహముగూడి పోరంగ గలపె' 'ఉప్పెన కదిలునే ఉడుత చప్పుడుకు' 'కాకరకాయలు కడు పెద్దకాగ-చే దెక్కువవునట్లు చెలగె నీగుణము' 'వల్లని నీళ్లను సంద్రమదాక-మెల్లనే పారును మితిమేర లేక' 'గోంద్రకప్పకు నోరు గొప్పది లేద' 'ప్రత్తిగింజపలె పండ్లు దెరచెదవు - నూతిలో కప్పవలె గాతరించేవు' 'మనగోరువారికి మరుగంతె కాని-చనిపోవువారికి చాటు లేమిటికి' 'తనురెప్ప గోల్పోక కను మోసమగునె'

'దేశింగురాజు కథ'లో యుద్ధరంగమున గాయపడిన రక్తసిక్తాంగులను 'పూచిన మోదుగ చెట్టురీతి తన పోటర్లుండుట'చే నని వర్ణించినాడు. సహజము మరియు నౌచితీవంతమగు ఉపమానమిది.'బొబ్బిలిపదము'లో వెంగళ్రాయుని యొడలంతట తుపాకి గుండ్లు నాటగా'చూరు నీళ్ల లాగున రక్తము కారుతున్నది' యని వర్ణింపబడెను. చూరునుండి పెక్కు నీటిధారలు పడినట్లే తుపాకిగుండ్లచే భేదింపబడిన వెంగళ్రాయుని శరీరమునుండి కూడ అటులనే పెక్కు నెత్తుటి ధారలు పడుచుండెనని భావము. 'ఆరెమరాటీల కథ'లో క్రొత్తగా కట్టిన పట్టణమును వర్ణించునప్పుడు 'పగలు చూచిన పట్నం మల్లె పూచినట్లు, రేయి చూచిన పట్నము రేల పూచిన'ట్లుండెనట.

'కంసల్య బైకలు'పదములో 'గౌరీకళ్యాణ పాట' శీర్షికతోనున్న సీతమ్మ వర్ణనమున'నీళ్లలో ముత్యమ్మ నిలిచివున్నట్లు-నెలత సీతమ్మకు రెండాయె నెలలు-పాలలో పగడమ్మ ప్రబలియున్నట్లు పణతి సీతమ్మకు పావన్న చూలు'?అని చక్కని ఉపమానము పొదువబడినది. 'సీత గడియ' పాటలో 'ఆడవారి కోపంబు ఎట్టిదో యనుచు - మళ్ళి (తిరిగి)పరుండెను రవివంశజుండు.అగ్గి చెంగట వెన్న ఎంతతడ వాగునో.ఆడవారి కోపమ్మ అట్టిదేయనుచు, శీఘ్రాన కలిపెను శ్రీలక్ష్మియంత' 'సీతామ్మవారి వసంతం' పాటలో సీతమ్మ శ్రీరామునిపై వసంతము పోసి 'పంజరంలో చిలుక పారిన భంగి' పారి పోయె నట. 'సీతాదేవి వామనగుంటలాడు పాట'లో ఆట ముగిసినతరువాత శ్రీరాముడు సీతమ్మతో 'అఖిలబ్రహ్మాండములె ఆటపీఠములు, పరమధర్మముచేత ప్రజల రక్షించుటే పసిడి డిబ్బెలు,సఖియ నీతో ఆట నేడు సంభ్రమ మాయెనే' యనెను.'సీతాదేవి ఆనవాలు' లో శ్రీరామచంద్రుని పాదపద్మముల నొత్తుచు సీతమ్మ అలసిపోయెను. అప్పుడు 'చిట్టి ముత్యములు చిలికించినట్లు సీత సిరిమేనెల్ల చెమటలూ బో సె'నట. 'లంకాయాగము పాట'లో లక్ష్మణుడు మూర్ఛపోయినప్పుడు శ్రీరాముడు'ఉప్పుకోసము వచ్చి సుగ్రీవుడా నేను కప్పురము గోలుపోతి - అలికోసము పచ్చి జాంబవా నేనిపుడు అనుజుణ్ణి గోలుపోతి' నని విలపించెను. 'శ్రీరామపట్టాభిషేకము'న గద్దెపైనున్న సీతారాములు'అల్లుకొని

తామరలు నల్లగలువల్లు- అల్లిబిల్లిగ బూసి వెల్లిగొన్నట్లు, క్షీరకన్యక చుట్టు వారాశిలోను' కోరకింతామరలు బూసినాయట్లు, మేఘములవద్ద యా మేలైన నెమలి, కదుపులు గొనివచ్చి కిమ్మెకున్నట్లు, ఇంద్రనీలాలు పోగులు బోసినట్లు' ఉండిరట. రామచంద్రుని నీలవర్ణము సీతమ్మ పసిడి మెరపులు శ్రీలెంత చక్కగా వర్ణించినారీ పాటయందు!

'లక్ష్మణదేవర నవ్వు'లో పాదములపైనున్న లక్ష్మణుని లేవదీసి శ్రీరాముడు 'చంద్రుడు లేని రాత్రి యెట్టి దటబోలు. తమ్ముడా నీవులేని సభ యట్లుబోలు, దీపమ్ము లేనిల్లు యెట్టి దటబోలు, తమ్ముడా నీవులేని సభ యట్లుబోలు, చిలుకలేని పంజర మెట్టి దటబోలు తమ్ముడా నీవులేని సభయట్లుబోలు'ననెను. 'సీతాకల్యాణము పాట'లో సీత 'కరిదంతముల బోలు కలికిపిక్కలది'యని వర్ణింపబడినది. ఇది క్రొత్త యుపమానము. వరిపొట్టలతో పోల్చుట సాధారణము.

'ఉషాస్వప్నమున' ఉషానిరుద్ధుల వివాహమును బాణాసురు డంగీకరించిన వార్త విన్న ఉషాకన్య 'ఆకొన్న మనుజునకు అన్నంబు దొరికినట్లామె సంతోషమొందె, పేదకును లభియించు పెన్నిధి విధంబునను వెలది సంతోషమందె, దగగొన్న మనుజునకు దాహంబు దొరికినటు తరుణి సంతోషమొందె, వడగొన్న సస్యంబు వాన దడిసినయట్లు వనిత సంతోషమందె'నట. 'లక్ష్మీదేవి వర్ణనము'న 'పచ్చి పసుపు దుమ్ము విరిచినగతి మేని చాయవంటిదీ' 'కందుకుందు లేని నిండు చందమామ వెగడు మొగము' వంటి వర్ణనము లున్నవి. 'శ్రీ వరాహావతార చరిత్రము'న పిల్లన్నలింగము వరాహమూర్తితో యుద్ధమొనర్చి 'పూచినట్టి తంగేడు చందమున-భూమియందు పడిపోయెను బంటు'. పూచిన మోదుగు, పూచిన తంగెడు వంటివి క్షతగాత్రులకు చక్కని యుపమానములు కోటయ్యలింగము వరాహముపై నెక్కిపోరాడెను. అతడు దానిపైననే ప్రాణములు విడిచెను. వరాహము చనిపోయెను. 'ఏనుగుమీద సింహము వలెను వడియున్న కళేబరము' లని యుపమానము. 'శ్రీయాళ మహారాజు చరిత్రము' జంగం కథలో శివయోగి నరమాంస భోజన మడుగ శ్రీయాళరాజు 'దారము తెగిన గాలిపడగ వలె తల్లడ మందుచును' బాధపడెను. 'భళ్ళాణరాయ చరిత్రము'న చల్లమాదేవి ఎంత పలుకరించినను పలుకని మిండజంగమును చూచి, 'చలిది కూటిపై వెన్న చందమున నిలిచిన దీవిటు' డనెను.

'బాలనాగమ్మ కథ'లో సంతానము లేనివారి యిండ్లు 'కందులు కొట్టిన కళ్ళ మందురేమి, కాయలు గొట్టిన మామ లందురేమి' యని వర్ణింపబడినది. 'కందులు గొట్టిన కళ్ళము' సామెతగా పరిణమించినది. తక్కిన ధాన్యముల కళ్ళములందు కొన్ని

గింజలు మిగిలియుండును కాని కందులు గొట్టిన కళ్ళములో నొక గింజయైనను మిగులదు.

'కమ్మవారి పణతి పసల బాలరాజు కథ'లో వాండవు రొకచో కూడియుండగా 'జోడు చంద్రులు పొడిచిన విధముండె'నట. 'లక్ష్మమ్మ కథ'లో చింతచే లక్ష్మమ్మ 'కుమ్మరివాము తగులుకున్న రీతి-గుమ్మడిపండ్లే కుళ్ళిన చందాన'కు మిలిపోవుచుండె నట. 'సన్యాసమ్మ కథలో'లో సన్యాసమ్మ 'ఒడ్డిరిగి వృక్షమూ గడ్డ పడినట్లు నిలుచున్న పాటున ధరణిపై నొరిగె'. సన్యాసమ్మ పేడ నెత్తబోవ నది 'తాబేలు వర్ణాన తరలుచున్నదిగా ఆ పేడ, కప్పలాగున పేడ దాటెళ్ళుచుందీ ఆపేడ'. 'కాంభోజరాజు కథ'లో శరాబంది రాజిచ్చిన మందుచే కుష్ఠురోగికి రోగము కుదిరిపోయిన వ్రేళ్లు 'మోదుగ మొగ్గల రీతి ఆయె'నట. 'గాంధారి కథ'లో 'గాంధారి నాసికము గద్దగోరు వర్ణము'. ఇట్టి యుపమాన మేరును వాడియుండలేదు. ఇటులనే 'గాంధారి వ్రేళ్ళమి పిల్లిపిసరుకాయలు'. పూర్వకవులు వ్రేళ్ళను పెసర కాయలతో పోల్చిరి. కాని పిల్లిపిసరుతో నెవ్వరును పోల్చరైరి. 'ధర్మాంగద చరిత్ర పాముపాట'లో 'విభుని సౌఖ్యము లేని వెలది శృంగారంబు, అడవిలోపల వెమళ్ళాడినటు లుండు'నట.

'నారాయణ శతకము'లో 'ఎంత పాపాత్ముడైన మిము దలచి కృతకృత్యుడౌను పుడమి, నింత పరుసము సోకిన లోహంబు హేమమౌ నారాయణా'యని కలదు. 'రామ రామ శతకము'లో 'గాలిలోపల దీపము ఈ మట్టికాయంబు ఏవేళనో కీలులూడిన బొమ్మయు బడునట్లు నేలబడు రామరామ' యని కలదు. 'ఎల్లమ్మ కథ'లో పరశు రాముడు కోపముచే 'తాటాకు మంటవలె దరికొని మండె' నట.

జానపదులందిట్టి సహజాలంకారములు కొల్లలుగా నుండునని కొన్ని మాత్రమే యుదాహరించితిని. ఉత్ప్రేక్షవంటి యలంకారములు గూడ జానపద గేయములందు లేకపోలేదు. అవి కొలదిగా నుండును. కొన్నింటిని ఆయాకథలు వర్ణించినప్పు డుదాహరించియే యున్నాను.

## జాతీయములు, నానుడులు, మారుమూల పదములు.

క్రొంగ్రొత్త శబ్దముల కల్పనము భాషావికాసమున కధికముగా దోడ్పడు నట్టి విషయము. మానవుని యవసరములు పెరిగినప్పుడు, సాంఘిక విషయము లందు మార్పులు సంభవించినప్పుడు, ఇతరులతో వ్యవహరించు సంబంధము లధికమైనప్పుడు, క్రొత్త విషయములు దిగుమతియైనప్పుడు ఇదివరకున్న భాష

చాలదు. వానిగూర్చి మాటలాడవలసినప్పుడు, తమ భావములకు వాగ్రూప మీయ వలసివచ్చినప్పుడు, మానవుడు తన భాషయందు మరికొన్ని శబ్దములను కల్పించుకొనును. వ్యవహారము లేక 'సంబంధము చట్టుబండలు' లేక మానవుడు పరిమిత ప్రయోజనము గలవాడై కొండలయందు అడవులయందున్నప్పుడు వాని భాష పెరుగదు. ఉన్నభాష వానికున్న యవసరములకు సంకోచించును. ప్రగతిశీలమగు జాతి తన భాషను క్రొంగ్రొత్త శబ్దకల్పనముచే పరిపుష్టము గావించుకొని భాషా వికాసమునకు దోహదము చేయును. ప్రతిభావంతుడగు కవి చేతిలో ననేకశబ్దము లవతరించును. ప్రవాహమున వానికి సాధుత్వమేర్పడి జాతీయసంపదగా మారును. ఈ నవీనశబ్దకల్పన మనునది కేవలము శిష్టుల సొత్తు మాత్రమే కాదు. భావవ్యక్తీకరణమునకు పూనుకొన్నవారి కందరకు సంబంధించినదే. జానపదకవిత్వమున గూడ నిట్టి క్రొత్త శబ్దముల కల్పనము చూడనగును. అట్టి శబ్దముల కొన్నింటి నుదాహరింతును. క్రొత్తశబ్దములతోపాటు భాషయొక్క జాతీయసంపద యనబడు మారుమూలపదములు, నానుడులు, జాతీయములు, మాండలికములు భాషా వికాసమునకు తోడ్పడును. సాధారణముగా నీసంపద యనువాదమునకు లొంగునట్టిది కాదు. ఒకభాషయొక్క ప్రత్యేకత మరియొక భాషకు రాదనునది యిట్టివాని మూలముననే. ఈవిశేషము లన్యభాషానువాదములకు లొంగక తమ భాషా సహజత్వమునకును ప్రత్యేకతకును రూపుదిద్దును. ఇట్టి రూపములు వ్యావహారిక భాష నాశ్రయించి యధికముగా నుండును. అవియన్నియు జానపదగేయముల కెక్కి జానపదగేయకవిత్వము జాతీయకవిత్వముగా సిసలైన కవిత్వముగా భాసింపజేయుచున్నవి. అట్టి విశేషములను గూడ నిచ్చట పేర్కొందును.

శ్రీనాథకర్తృకమనబడు పల్నాటివీరచరిత్రమున నున్న శబ్దములు 'మగతనంబున బుట్టి మగకాళగట్టి'. మగకాళ యనునది వీరత్వమును ధైర్యస్థైర్యములను పౌరుషమును సూచించు శబ్దము. 'కూడి గుంపైయున్న గున్నయౌ చింతచెట్టు క్రిందికిలేదు శిబిర మంతయును, మూకంత వరిమడి మూలకు లేదు.' ఇవి తెలుగు జాతీయతను చాటునట్టి పలుకుబడులు. అన్యభాషానువాదములకు లోబడవు. 'అనిన నారణభట్టు నందరు జూచి' రణభట్టను శబ్దము రణమున రాయబారము నడుపు భట్టును సూచించుటకై కల్పింపబడినది కాబోలు. బొంగరము లాడవలదని తల్లి వారించునప్పుడు బాలచంద్రుడు తల్లికి ప్రతివచనములు చెప్పుచు 'పూబోడి నాదేహ పోషణార్థంబు

పెట్టని తావులపెట్టి దాచెద' వనెను. చక్కని జాతీయమిది. 'ఎంతో జాగ్రత్తగా నా దేహమును కాపాడెద'వని భావము. 'ముక్కుకు గానట్టి ముత్యంబు వలదు' తగని పని చేయుట వలదనుటకు. ఇటులే 'పగవాని విస్తరి బండి కిన్నగును' వంటివి.

కాటమరాజు కథలో నిట్టి విశేషము లధికముగా నున్నవి. 'రథసంబుతో దండు రాగిడలగాను' రాగిల్ల ననుటకు. 'అచ్చాళి మూకతో నప్పు దేతెంచె' జంజాటము లేని యని యర్థము.

'పనిపడి గణిడీలు పుట్టించ నపుడు' ఇంకను 'సౌరిది నెన్మిదివేల చొక్కపు చిల్పి పెలను,
'పురజింప గవివాత పులి యున్నయట్టు' 'పేట్సింది పారగా నెంపలిచెట్టు, పారికుండగ నాచి పట్టంగ గలచె' 'యతిప్రాన లుండని యా కైతలేల, సుతిగూడి నడువని పొగను పదమేల, పతిసూచి మెచ్చని బంటుతనమేల, ఇతరులు మెచ్చని ఈటె సాధనమేల'
'పులి కడుపున గొఱ్ఱె పుట్టు చందమున' 'ఊరకే చెప్పని ఒక్కపొద్దనగ'
'కసిమసంగుచు నుస్సుగల్లుగా జిదిమె' 'తిక్కన్న ఖడ్గాన తిరుతీపు లాడి'
'కట్టుమా సికవిజె కట్టుమా చాలు' 'తిడిమి తిడిమిన భూమి దిగులుగొనగాను'(రథధ్వని)
'మచ్చపుటముగ నెగసె మటి పుట్టకడకు' 'వానలేని పిడుగు వలె మీదబడెను'
'ఈ గడ్డపరరేమి వింతగాదయ్య' 'అశ్మశకాంత్రంబు ఆడితిమాటః'
'మెండ్యెంబు దగ్గరికి మెల్లనే వచ్చి' 'కొండలై మొండెముల్ గొతపెట్టుచుండ'
'సురయించి కస్తూరి సురటుల విసరి' 'ఒకగిపై బడి యొకరు ఒడికట్లు బడిరి'
'నెళవు చీకటివేళ నెప్పెఱుగలేక' 'చక్కని మేడ్యంబు సందున దూకి'
'తరిమళ్ళఁబడి చావు తప్పించుకొనియు' 'తందారిగా చెప్పి తా నిల్వలేక'
'పొడు పొడుమనుచును బొడెములు ద్రొక్క' 'తరముంగ సారనత్తులైన ... ందంబు,
'వారి ముందకు గమిడి వసి దీసినిల్లు' 'శ్రీహరి భక్తులై సిరి కళలతోను'
'కుయినెప్ప బంతేది కూటట విజము' 'పోడెంబు ద్రొక్కుచు పొంకాన మెరసి'
'ఈగ వాలకయుండ నీలె యిడకుండ' 'కొలువులో కంపటీల్ గొబ్బున లేచి'
'ఎద్దులు మేసిన యా పసినంబు' 'నక్కలే ధిక్కాయె నట్టడివి గాదె'
'ఉందూర వరిణాన నుండు మనువారు' 'రణమువెళ్ళి యురుక రాత్రి గాదాయె'
'నాయువు మారేడులాయె వటంచు' 'గోరుపట్టుపై సీకు గ్రుచ్చినట్లాయె'
'తురగంబులను బొడిచె తుదిపదముగాను' 'పింజ పింజ గదిసి వృథ్వి గంపింప'
'పెట్టిన తిరుమణి పేడెత్తకుండ' 'పూసిన గంధంబు పూరి చిట్లకుండ'
'బద్దిగొర్ల జేతుము భాగీరథికిపు' 'వన బోసినట్టుల్ల వదరేవు గాక'
'పోట్లాట కుడుములు పేట్లాట గాదు' 'కరువుబడి వచ్చిన కాలమైతేను-

1. పేవెలపంటి తినపదార్థములు.

కాకినెపముల నెన్నగాదగు మీకు' 'సరిసేయ నివి గూబజంకులుగాక'
'కోవరాలుండంగ గూలార్చినాడు' 'వడసార మీరాజు వధియింతు సజుడు'
'మొదలు చట్టుగల్లు మొసలపై నిలుచునా' 'ఎడమచే కుడిచేయి ఎపుగనివాని'
'ఏకీతి నెరుగని ఏకాంత మతడు' 'పెక్కుతో జేసిన పీకైన పాయు!'
'వాకతో మారాజు టముకు వేయంగ' 'కాకినా డంతయు కాకిపారాడె'
'అంచెల బండివ- అసిడికి సైచి' 'తలపొలములో బెదరి నిలబడ్డగోవు-కలవిలుచు
కున్నట్లు కాదు కయ్యంబు' 'అదిగోను పులియంటె అదిగోను తోక'
'మొక్కై గోడీగవలె మిట్టిపడియేవు' 'కాక కంపటులు మీకైరిగాండ్లనక'
'కూతుపంతాలు నిక్కులు నేర్చినావు' 'కాయకున్న పెద్ద కమికె మన్నట్లు'
'ఆవుల ప్రేయించినందుకు సరుపై-యాజు కరపట్నాలు నటు పొడిపించు'
'చిలుకయు మ్రొక్కల్లె నాళుపకికట్ల' 'అందెల యెద్దులు అప్పుగుళాల్ దాట'
'గములు పొడిపించి తమును నేయింప' 'పందువలు యరదప్ప పయితల్లి మారు'
'మేష్పులె దూవులు మేనులకెల్ల' 'మేలైన కోడడల మేపితి నంటి'
'చెలికొండ చిత్రమ చెఱుగునబైడి'1 'పోక సోకైతేనో పొదిలేవా గాక'
'భట్టవా నీవు యుబెట్టవ్వకాని' 'తావున నిట్టులే దామెన యనుచు'
'ఆరాళ్ళములు పెడలి యుద్ధంబు నడువ' 'ఘట్టితమై మెరయ కలనావి నొంది'
'అల్లటి పేసియు బతన్నక్రొక్కి' 'కోలితమును జేసి కూరిమిచేత'
'సాటున కెక్కిన సభవారి నంపి' 'యెక్కు కాపురావెసరెడి ప్రజతులు'
'మునిగి మందైకడు మూర్ఛయు నొంది' 'కట్టని చీరెలు గావు ఓ యమ్మ-కన్నకడు పేమియు గాదమ్మ నీది' 'జళిపించి కటార్లు సాహసంబుగను,సూర్య సోమ వీధుల జొచ్చి నరుకంగ, ధరమీద పీనుగుల్ తరచుగా నుండె'. సూర్యసోమవీథులను మాట జానపదగేయము లందు పలుతావుల వచ్చినది. నగరమునగల సూర్యసోమవీథులనియు, పేనలను నిలిపినప్పుడు 'సూర్యసోమవీథు లక్కడ యేర్పరించినాడు' (బొబ్బిలి పదము) అనియు వచ్చినది. ఈ మాట కర్థము నాలుగు వీథులై యుండును. శ్రీనాథ మహా కవి 'విధుడు వారాణసీ సోమవీథిచక్కి-,నభ్రఘంటాపథంబున నరుగు నపు'డనియు 'ఆ సమయమున కాశికానగర సోమవీథికా భవనవాటికామధ్యంబున నొక్క-యింటి మచ్చకంటి' అనియు వాడియున్నాడు.2 శ్రీనాథుడు వాడిన సందర్భమును బట్టి సోమవీథి యనగా పడమటివీథి యని తేలుచున్నది. సూర్యవీథి తూర్పువీథి యైనచో సూర్యసోమవీథులు జొచ్చియనునప్పుడు తూర్పుపడమరలు దిరిగి యనగా నాలుగు వీథులు చుట్టివచ్చి ప్రదక్షిణముచేసి యని యర్థమిచ్చును.కావి దెందులూరు

1. కొంగు బంగారమనుటకు. 2. భీమఖండము, పుటలు 26, 36.

శాసనమున '....అగ్గండి ఉత్తర వీధి కడపట సోమవీధి సూర్యా వీధులు గూడిన ఈశాన్యకోణమున మొకరి అన్నెపకుం బెట్టిన గృహక్షేత్రము'1 అని కలదు. సూర్యసోమవీథులు గలియు చోటు ఈశాన్యమనుటచే సోమవీథి యనగా ఉత్తర దిక్కగుచున్నది. ఇది కూడ చుట్టు తిరిగి లేదా ప్రదక్షిణముచేసి యను భావార్థ మిచ్చుచున్నది. కాని సూర్యసోమవీథులకు సరియైన యర్థమింకను ఆలోచింప వలసినదే. నిలువు అడ్డముగానున్న వీధులని శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారనిరి.

దేశింగురాజు కథలో గూడ నిట్టి శబ్దములు, నానుడులు, మారుమూల పదములున్నవి. 'మండి వేసి కొని సలాంచేసెను మరి పాచ్చావునకు' ఒక కాలు నేల మోకరించి దండము పెట్టెడు పద్ధతి యిది. మండివేసికొని కొలువుదీరుట బొబ్బిలి పాటలో కూడ పెక్కుచోటుల కలదు. 'మూడు కణజముల రొక్కము నిటకు ముందుగ దెప్పించు.' కణజమన పాతరయో లేక ధనపరిమాణమో యైయుండ వలెను. 'మేకపోతు గాంభీర్యంబని నే మేదిని వినియుంటి' 'దుడుకడు రాజిత సింహం బనదగు తోంద్ర మల్లన్న' దుడుకుచేయువాడని యర్థము కాబోలు. 'రయమున శ్రీనివాస రావుతో నట చదరుండియును' చదురుపై కూర్చుండుటకు చదురుండుట యని ప్రయోగము. 'పులి నోటను బడి బ్రతికినవారీ భువిలో నున్నారా' 'ఉలువలు దంచిన రోకలి వలెనే యూరక నిలుచున్న, తలచిన కార్యం బేమాయెను ఇక తప్పక పలుకన్న' కదలక మెదలక నున్నచో నిట్టి మాట నుపయోగింతురు. బెల్లము కొట్టిన రాయివలె ననుదానికి సమీపముగ నున్నదీ జాతీయము. 'తలక్రింద గుండాయె నవాబు తనయా దేశింగు' ప్రక్కలో బల్లెము, పక్కలో పాముపంటిది. 'కళ్ళెము మొదలుగ నవరత్నములతో పునపోషణ కెపుడు, చెళ్ళముగా చేయిస్తిని పీకు చెలగి మోసమిపుడు, యేల జేసెదవు తెలివిలేక నికనే జెప్పెద వినుము' చెళ్ళమనగా మురిపెమో ప్రేమయో కావలెను2. లేదా చొల్లెము (జడచుట్ట) ఇటుల మారినదో! 'వైరులచే తప్పించ దలచి యావన్నె మిగులు హయము, ముట్టికాలు తా వేసుక నిలిచెను పదము మీరగాను' గుట్టము శత్రుమధ్యమున నిలుచుండు పద్ధతి కాబోలు. 'పంజె యైన దేశింగు దేమని పలికినాడు నేడు' దరిద్రుడనుటకు. దేశింగురాజు నవాబుతో 'చెంజి పైకము తీసి కొనుము, నాచేతి కత్తి మొనను' అనుట వీర్యస్ఫోరకముగా నున్నది. ఈ నుడికారము తెలుగునకు

1. S. I. Vol. VII 736 (A. R. No. 113 of 1902)
2. పెల్లం=ప్రేమ (తమిళము)

ఉర్దూ ఇంగ్లీషు భాషలనుండి దిగుమతియై యుండును. ఇది **At the point of the Sword** అను దానికి అనుకరణమైయుండును.

ఇక బొబ్బిలి పదములోనున్న శబ్దముల సారయుదు.'విజయనగరము బొబ్బిలి మధ్య యెల్లసదరునందూ, డేరాలు అచట వేయించవలెను వెంగళ్రాయుడా'. ఎల్లసదరన నేమిటో? ఎల్లశబ్దంబు సర్వపర్యాయంబైన అవ్యయంబు దీని కసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబు లేదని చిన్నయసూరి గారనిరి. ప్రజాకవి పైచరణములో ఈ సూత్రమును పాటించెను. కాని శ్రీనాథమహాకవి 'ఎల్లన్ శష్కుల గొంచు వత్తునా నిజం బేర్పాటుగా చెప్పుమా' యనెను.1 ఎల్ల యనునది సమస్తమను అర్థమునగాక పొలిమేర యను నర్థ మిచ్చునో? 'సదరు' అనునది యుద్ధభూమి లేదా సేనకు సంబంధించిన పదమై యుండును. సికింద్రాబాదు పట్టణమును 'లష్కరు' అందురు. లష్కరనగా సేన. సేనలుండు ప్రదేశము లష్కరని పిలువబడినట్లే నాగపూరు పట్టణమున 'సదరు' అను నొక వీథిగలదు. అదికూడ ఇట్టిదై యుండును. లేదా ఎల్లలకడ నున్న చదునైన మైదానము కావచ్చును. 'జాబు లెత్తుకొని వస్తున్నారు హర్కారు లైతేను, బొబ్బిలివారి దేవిడికాడికి టంకా మైనారు' టంకమైనా రనగా చేరుకొని రని కాబోలు. బంగార మతికించు నప్పుడు వెలిగారముతో కొంత నాసిరకము బంగారపు పిసరుతో నతికింతురు. అట్టి దానినికూడ టంక మందురు. అతికించునట్టి, దగ్గరకు చేర్చునట్టి యను అర్థమున టంకమగుట ప్రయోగింపబడినదేమో! 'లకోట చింపి జాబు చదివినారు రంగారావుదొ'రను పెద్ద లకోట వ్రాసినారను వాడుక గలదు. పెద్ద యుత్తరమును లకోట యందురు. పైన లకోట చింపుట యనుటచే కవరు **Cover** అర్థమిచ్చు చున్నది. లకోట యనునది లేఖాశబ్దభవమై యుండును.

'మరచి నిద్రా పోతున్నారు తెల్గా బిడ్డాలు, గుఱ్ఱపు సందడి విన్నారయ్యా తెల్గా బిడ్డాలు, పడకయందే దట్టికట్టిరి తెల్గా బిడ్డాలు' ఇది గొప్ప నుడికారము. చాకచక్యము, చురుకుదనము, శౌర్యము అన్ని గుణముల నొక్క మాటలో సూచించుట కీ శబ్దము సృష్టింపబడినది. 'నువ్వులు చల్లిన రాలదయ్య దండుకు లోగాను' ఇసుక పోసిన రాలని జనమను జాతీయమున కౌచితి దిద్దినవీ మాటలు. 'కంచెలు మేసి పాటి మీదనే నిమ్మళించినాది' కంచె శబ్దము వివిధ మండలములందు వివిధార్థము లిచ్చును.

---

1. భీమ ఖండము పుట 37.

చేనుచుట్టుపేసెడు కంపకోటను సర్కారు జిల్లాలందు కంచెయందురు తెలంగాణమున గడ్డిబీడునే కంచెయందురు. ఇచట తెలంగాణమందు వాడుకలో నున్న యర్థముననే వాడబడినది. 'మండె పేసి కొలుపు దీరెను పెంగళ్లాయుండు' ఒకకాలు నేల మోకరించుట యని శబ్దరత్నాకరకారు డనెను. కాని యీ యర్థమిట పొసగదు. కొలుపుదీరువాడు మోకరించునా? కొలుపుదీరుటకు కూర్చుండు పీఠాసనము మండి యగునేమో! 'ఆరు లక్షల పైకం మేము అగావు లిస్తాము' అగావు - కుదువ, పారితోషికము, ముడుపు, నజరానాయను నర్థమున వాడబడినది.

పెద్దాపురము కోడిపందెముల పదములో 'ఫరోణి అయినా చేతికిచ్చిరి వేగి రావులూ' యని కలదు. ఫరోణి యనగా చిన్న యుత్తరము లేక 'చీటి'. ఇట్టి వైకృత పదమీ జానపదకవి కెటుల లభించెనో? వాడుకయం దున్నదేమో? ఇది పూర్తిగా మారుమూలపదము. 'కోటిలింగముల సంచయినము చేసితి మన్నారు' వచ్చిన రెండవనా డెముకలను ప్రోగుచేయుటను సంచయన మందురు. ప్రాణములు దక్కించుకొని వచ్చి అలసి నిద్రపోయిన తిమ్మరాజును అతనిభార్య సీతమ్మగారి కోర్కెపై పిఠాపురం నీలాద్రిరావు 'బావగారు లేవండయ్యా సూవారము కిపుడూ' అని లేపెను. సువార మనగా వంట. నీలాద్రిరావు తిమ్మరాజుగారికి బావవరుస. పరియాచకమునకై వంటచేయుటకు లెమ్మనెనో లేదా భోజనమునకు లెమ్మనెనో? పైన పేర్కొన్న మూడు శబ్దములును మారుమూల పదములే. 'చల్లప్రొద్దునా జగపతి రాజు షికారొచ్చినాడు' అంబటివేళ లేక అంబటి ప్రొద్దువలె చల్లప్రొద్దు అనునది సమయమును దెలిపెడు మాట కాబోలు! తెలంగాణమున అంబటి ప్రొద్దు లేక అంబటివేళ యను పదములు ప్రచారమున నున్నవి. జానపదులు అంబలిద్రావెడు ప్రొద్దును అంబటి ప్రొద్దందురు. ఉదయము 10 గంటలకును సాయంత్రము 4 గంటలకును అంబటి ప్రొద్దగును. రాజుగారు కనుక అంబటి ప్రొద్దనుటకు మారుగా చల్లప్రొద్దని జానపదకవి యౌచిత్యమును పోషించెనో తెలియదు. చల్లని ప్రొద్దు కాదుగదా! తిమ్మరాజు విజయనగరమునకు బయలుదేరుటకు పూర్వము అతనికి యౌవరాజ్యాభిషేకము మరియు వివాహము జరిగెను. అప్పుడు వచ్చినవారి సంఖ్య 'మనిషికి ఒక్కొ ముత్యంవేస్తే తూమెడు అయినాయి' ఇసుకపోసిన రాలదను మాటకొకచోట నువ్వులు పోసిన రాలవనుట తెలిసికొని యుంటిమి. దానికన్న నిది విశేషప్రయోగము. రాజుగారి పెండ్లికివచ్చిన రాజబంధువులగూర్చిచెప్పుచున్నాడు కనుక ముత్యముల కొలతలో చెప్పి జానపదకవి ఔచితిని పోషించెను. 'పట్టపుదేవి అన్నమాటలు పదమునకు వచ్చాయి.' పదమునకు వచ్చుట యన తార్కాణమగుట ఇది

చక్కని నుడికారము. 'వాసిపోసినా వయసు పోరినా వన్నె చెడనులేదు' 'మాణిక్యం మసి పాతను గప్పితే మకిలి పట్టినా' వంటివి చక్కని జాతీయములు.

'బంగారు తిమ్మరాజుకథ'లో రంగసాని మేడ వర్ణనమిట్లున్నది 'నూనె పోసి యెత్తవచ్చు నా రంగసాని మేడ, పాలుబోసి యెత్తవచ్చునూ రంగసాని మేడ.' ఇది యొక జాతీయము నున్నగా పరిశుభ్రముగా నున్నదని యర్థము. తెలంగాణమున మంచి యెద్దులను వర్ణించునప్పుడు 'ఆ యెద్దు వీపుపై నూనె బోసి యెత్తుకొనవచ్చు' నందురు. 'ఇంతలోనే ఆకాశకుసుమలూ అలంకరించినాయూ, ఏనుగులోకే గజ్జెంటేపా యయూ మనకూ' అంబరమన నాకాశము. ఆకాశమునుండి గురిసెననియూ లేదా వ్యసనము కలిగించుటా? అంబరించినాయా, ఆబరించినాయా: ఆవరించినాయా; 'కమ్ముకు వచ్చాయా' యని కానోపు.

'శాంత గోవింద నామాలు' పాటలో 'కన్య పెరుగా వాంకి-కంటకంబై తోచె' నట. బిడ్డలగన్న తలిదండ్రుల కిది యనుభవైకవేద్యము. 'శాంతా కల్యాణము' పాటలో 'కౌసల్య వివాహము మయ్యగ-గగన మందుకొనె రాజు'అని కలదు. మిన్నందుట వంటి పదమిది. మహా, లేక అధికము అను అర్థమున వ్యావహారికములో గగనమును వాడెదరు. 'ఆపని ముగించువరకు గగనమయ్యె' నందురు. 'సీతాదేవి వేవిళ్ళు' పాటలో సీతమ్మ గర్భము ధరించినదని యెరిగిన రామలక్ష్మణులకు 'చుక్కలా పర్వతం చూపినట్లుండె, నక్షత్రపర్వతం నడచినట్లుండె' నట. 'శ్రీరాములవారి పుట్టు పాట'లో కౌసల్య రాముని 'కిన్నరా కింపురుష గంధర్వ స్త్రీలందరా - తీర్థ ప్రబంధాలు చేయుచున్నారు లేరా'యనెను. తీర్థ మనగా ఆగమము. తీర్థప్రబంధములన ఆగమ ప్రబంధములని యర్థము. 'లక్ష్మణమూర్ఛ పదము'లో ఆంజనేయుడు కాలనేమితో యుద్ధమొనర్చినపుడు 'గుంటలోపల బెట్టి గండవాయుంచె' నట. ఈ జాతీయ మధికముగా సాగరాంధ్రులు వాడెదరు. 'కుశలాయకము' న 'మూడు లోకములెల్ల ముల్లుగా[1] విహరించె రక్కసుల రాజయిన రావణాసురుడు' లోకకంటకు డనునది ఈ రూపమున తెలుగునం దవతరించినది. 'కుశలవ కుచ్చుల చరిత్రము' న గర్భిణులగు కౌసల్యాదికాంతలకు 'గోద మృత్తిక పేడుక లనుచూ, వెలిమిడి మీదనె కోరికలుండే' వెలిమిడి యనునది పిడుక కాల్చిన పొడి; లేదా శ్వేతమృత్తిక-

1. ముల్లు—ముదం లునాతీతి ముల్లు-ముదమును ఛేదించువాడుగా లూఞ్ ఛేదనే ధాతువు కంటె క్విప్ ప్రత్యయము.

తిరుమణి యని చెప్పుకొనవలెను.'కుశలవ యుద్ధము'న రాముడు మూర్ఛపోయిన వార్త విని సీతమ్మ శోకించి 'పరమ పతివ్రతను తానే యైతే-పతిప్రాణములు సంజీవలెను' అనెను. సంజీవుట క్రొత్తశబ్దము. సంజీవి ప్రయోగమున బ్రతికినట్లు బ్రతుకుట యని అర్థము. అభ్యుదయ కవుల ప్రయోగమువలె నున్నది. శ్రీరాముడు సీతమ్మతో కుశలవులు తన్నాడిన మాటలు చెప్పుచు 'పంచదార ములుకులవలె నుండె'ననెను. పంచదారలోని తీపి ములుకులందలి వాడి వారి మాటలందుండె ననుటకు చక్కని పదము కల్పింపబడినది. ఎంత తీయని బాధ ననుభవించెనో కదా శ్రీరామచంద్రుడు! సీత రామునితో 'కోరిక లడవుల పాలవు పెరుగ' ననెను. ఇది యొక జాతీయము. ఋష్యాశ్రమములు చూడగోరిన గర్భిణియగు సీతమ్మను రాము డదే సాకుతో నడవులపాలు చేసెను.'శతకంఠ రామాయణము'న సుతులు గలుగని తనువు పతిలేని రాజ్యంబు, వినయ మెరుగని విద్య వెర్రి వైద్యంబు, పతిలేని మానపతి గతిలేని జీవనము, మతిలేని మంత్రి సమ్మతిలేని భార్య, అన్నంబులే నొడలు సున్న మెయ్యని విడెము, వ్యర్థ కార్యము లనుచు వడిమీర లేచి' 'కడుపులోపలి చల్ల కదలకుండగను' 'అగ్ని కొంగున ముడువ నాపేక్షపడ్డావు ముందు వచ్చేటట్టి మోస మెరుగకను' వంటి జాతీయములు నానుడులు పెక్కులున్నవి.

'నలచరిత్ర పదము'లో నలుడు కానలకు 'బోయి దీనత జెంది కాయకస వేరుకొని భక్షించి బిడములను వృక్షములక్రింద' పవ్వళించెను. బిడములన నేమో? అట్టుప్పని శబ్దరత్నాకరము. ఇది భక్ష్య విశేషమా? విడెమా? అడవిలో ఈ రెండును దొరకు నట్టివి కావు. దీనియందే. 'జీవదంతపు కుర్చీలు వేయించి'. జీవకళ ఉట్టిపడు దంతపు కుర్చీలు కాబోలు. 'కుండగోకిరి జేసి మండలాధీశునకు, వండిపెట్టగ జేసి వాని నీరీతి' కుండగోకరి యనవంటవాడు. 'అత్తరు గిండీలు అరివాణములును గిన్నెలు.' తెరవాటు గొట్టైదను ధీరత్వమున నేను-పచ్చి పతనమునకు బహుంగట్టివాడ', పచ్చిపతనము ఏమిటో? నీచత్వమా? లేదా పచ్చిపతనము (-శాకునము); దేగవలె తన్నుకొనిపోవుట కాబోలు. 'దేవయాని చరిత్రము – జంగంకథ'లో 'ధీరుడు రిపుగణ కాననంబునకు నీరుపాప గాదా,' అగ్ని యనుటకు నీరు పాపవంటి మారుమూల పదము ప్రాసకై ప్రయోగింపబడినది. 'విరాట పర్వాంతర్గత కీచకవధ'లో సుదేష్ణ సైరంధ్రితో 'మగువ కీచకు నింట మంచిసుర గలదు, కొరలో బోయించి గొబ్బునను రమ్మీ'యనెను. కోర యనగా గిన్నె. అన్నమయ్య 'కుందనపు పైడికోర వెన్నబాలు తేవో'యనెను. పలనాటి వీరుల యముద్రితకథలందు 'పైడి కోరతో పీడియ మిచ్చె'నని కలదు.

సూర్యుడు కీచకుని 'పాపకుడ నీ జిహ్వ పడును ఈ రాత్రి' యని శపించెను. జిహ్వ పడుట చక్కని తిట్టు. పాపాత్ముడు తిట్టులో పాపకుడై పోయెను. పాపగ శబ్దము ఇటుల మారెనో? లేక పాతకుడను మాటయో? 'విరాటపర్వము పదము'లో ద్రౌపది సైరంధ్రి వేషమున విరటు కొల్వునకు బోయెను. 'మాసియుండిన చీర మగువ తాగట్టి, గొప్ప కప్పగు కొప్పు గొంతి చెంపకు ముడిచి, దంతంబునకు కప్పు దాల్చె నా లేమ'. (గొంతియన స్త్రీయని శబ్దార్థచంద్రిక) గొంతిచెంప కనుచో కుడి చెంపకని యర్థము చెప్పుకొనవచ్చును. ఏలయన భారతమున, క. 'వలవల దిక్కున కించుక, మలగంగా దుఱుమిడి కుఱుమాపుడు పుట్టం బలవడగట్టి'[1] యని కలదు. ద్రౌపదిని వెన్నంటిన కీచకుడు 'ఉడుకు మనసున వాడు వడి వడిగ జనె వేగ' ఉడుకు మనసు చక్కని శబ్దకల్పనము. 'కుడులూ శిపాయీలు కోటిలెక్కను నడువ జాల్మతీ గుఱ్ఱములు సొంపుగను నడువ.' కుడులన ప్రదక్షిణములు.

'కాళింగ మడుగు పాట'లో 'కోళ్ళు గుయ్యగ తమ కోల లర్రితాళ్ళు యీడె ముంతలు నింపె యింటింటివారు.' ఈడుముంతలనగా పాలు పితుకు కుండలు. 'వీథి వెలుగూ కృష్ణ వివేకపరుడా'. సాధారణులకు తమ బిడ్డ ఇంటి వెలుగైన శ్రీకృష్ణుడు వీథికి వెలుగయ్యెను. వీథికేమిటి? లోకమునకే యాతడు వెలుగు. 'గొడ్డు పీగి కంటి గుణశీల నిన్నూ-కన్న ఫలములు తనకు కడతేరవాయె'? శ్రీకృష్ణుడు కాళింగుని 'గిరిగిర త్రిప్పి యా ధరణిపై గొట్టె-వాని దవడలు కనకమండపము లాయె' నెత్తురు గ్రక్కె- ననుటకు కాబోలు. 'రుక్మిణీదేవి ముచ్చట'లో శ్రీకృష్ణుడు రుక్మిణిని విడిచి రాధయింటికి బోవ రుక్మిణికి దుఃఖము కలిగెను. అప్పుడు 'ఇంతిరో తన కన్నులు నీళ్ళకుప్పలై కురిసినావి.' కన్నులు నీళ్ళకుప్పలై కురియుట చక్కని శబ్దకల్పనము. నీళ్ళకుప్ప = అంభోరాశి. 'పారిజాతపల్లవి'లో సత్యభామ యలిగినదని తెలిసికొని శ్రీకృష్ణుడు 'వన్నెగ ముని దెచ్చిన యా పారిజాతపు మాట విన్నపములు చేసిరి కాబోలు మా వెన్నెల మొలకకునూ' అనెను. సత్యభామ వెన్నెల మొలకయట. భావకవుల తలదన్నించినదీ శబ్దకల్పనము. రాజశేఖరుడు 'శశాంకకళికా' యనెను.

'ధర్మరాజు జూదము'న, 'ప్రథమమే వదలిచినవి బల్లారి బండ్లు.' బల్లారి బండ్లన నెట్టివో? 'సుభద్ర సారె పాట'లో సుభద్ర తన యన్నగారితో 'పుల్లవిరుపు మాటలాడి పురుషుడూ నన్ను, గుడ్లెర్రగా జేసి పాదాల తన్నె' నని చెప్పుకొనెను. పెడసరము

1. భారతము విరాటపర్వము. 1-291

మాటలని యర్థము. కట్టెపుల్ల విరచినట్లు మాట్లాడుట. 'సావిత్రీ బ్రతుకమ్మ'పాట తెలంగాణపుకవి రచించుటచేకాబోలు 'నాపతిని బ్రతికించి-నన్ను దోలించుమీ'యనెను. తెలంగాణమున తోలుకొనిపోవుట శబ్దము మనుజులకు గూడ వాడెదరు. తెలంగాణము బయట కేవలము పశువులకే వాడెదరు. గంజాములో కూడ మనుజులకు వాడెదరట.తోడుకొని శబ్దము లడల కభేదముజేసి తోలుకొని యైనది.

'వరాహావతార చరిత్రము'న'కలువ(కల్వ) తోక''పల్లి రోమము'లున్నవి. 'అండాళ్ చరిత్రము' న 'ఎందరు తుచ్ఛులు నా రాజ్యంబున కెవరుబెట్టజూచి' రను జాతీయము కలదు. 'దక్షుని యజ్ఞము న'భీకరంబయి తాను కంటపంబులు దోచ.' కంటసమన విరోధోక్తి.'ఇంతి నీకు నాకు యింతె కదలాయె.'దూరమయ్యెననిభావము. 'శోభనానికి మాకు సొంపు బుట్టాదని-జోడీలు బెట్టించి తోడి తెప్పిస్తినా' యని దక్షుడు సతీదేవిని నిందించెను. జోడాలు=నతి విశేషము, నమస్కరించి, ఆదరించి యనియా? లేక జోడెడ్ల బండి నంపి యనియా? 'గంగా వివాహము'న 'ఆకు చాటున కాయ అమరియున్న విధాన'నని కలదు. 'ఆకు మరుంగు పిందె'యని తెనాలి రామకృష్ణుని ప్రయోగము. 'కాకి ముక్కుకు దొండపండు గట్టినట్లు' 'దొప్ప క్రిందను చేరి దోసిలొగ్గిన రీతి' 'సుఖ మెరుంగని బ్రతుకు సున్నమెయ్యని విడెము' 'తినక రుచి తెలియదు, చొరక లోతు తెలియదు' వంటివి కొల్లలు.

'శ్రీయాళ మహారాజు చరిత్ర—జంగంకథ'లో రాజుగారు రాణిని కామ కేళికి రమ్మని పిలిచినప్పుడు పాడిన పాటకు 'తంగం పాట' యని పేరున్నది. తంగంపాట యన నేమిటి? అరవములో తంగం=బంగారము. 'మార్కండేయ జననము'న 'ముంగిటిలో ధనము, మునికొంగు పసిడి, తనచేతి జున్ను' వంటి నుడికారములు గలవు. 'కామరెల్లి మల్లన్న కథ'లో 'పాలవంటి కాపురంబు పాడు జేయబూని రవుడు'

'బాలనాగమ్మ కథ'లో రాజుగారి పరమసంతోషమును సూచించుటకై 'పుక్కిట పిడెము చెదరనవ్వె రాజు' అనుమాట మాటిమాటికి ప్రయోగింపబడినది. 'కడుపెడు బాలల నప్పగించితిని'.గోనెడు,గిన్నెడు,బండెడు వలె కడుపెడు శబ్దము. మాణిక్యాలదేవి బిడ్డలాహారము లేక 'సొప్పసొరుగులై'రట.సొరుగులు=మూర్ఛలు. చొప్పవలె సొరిగి పోయిరని భావమా లేదా ఎండిన చొప్పవలె ననియా? 'పుట్టకూడు' తెప్పించి మాయల ఫకీరు ద్వారముకడ కావలి యున్న ఎలుగుగొడ్డు కాహార మిడెను. పుట్టకూడన చీమగ్రుడ్లతో గలిపిన పుట్టమట్టి ముద్ద. అల్లి పావి పెద్దనగారు

'పుట్టికూటికిం జీమలకు నెలుంగు'లని వాడియున్నారు1. 'కమ్మవారి పణతి-పసల బాలరాజుకథ'లో కమ్మపడతి అష్టదిక్పాలురను స్తోత్రము చేయునప్పు డింద్రుని 'వేగండ్లుగల శెట్టి తెలుగంట్లతేడ'యనియు అగ్నిని 'కప్పుతెరువరి నీకు పదివేల నతులు' అనియు ప్రార్థించెను. సహస్రాక్ష, అనిమిషప్రభు (ఇంద్రుడు), కృష్ణవర్త్మ (అగ్ని) శబ్దముల కివి అచ్చతెనుగులు. ఈ మారుమూల అచ్చతెనుగు పదము లీ జానపదకవి కెటుల లభించెనో? 'చేతి కందినది నోటి కందలేదు.' చేజిక్కియు అనుభవమునకు రాదయ్యెనని భావము.

'సన్యాసమ్మ కథ'లో 'పదుము నక్కిన విరిగె' 'ఈకంటి కన్నీరు ఆకంట బోసె' 'కాపుకావని బాల కంకటిల్లేను' (ఏడ్చెను).తోడికోడ లనుటకు 'సరిజాదవ' పదము వాడబడినది. 'పాపమ్మ పేరంటాలమ్మ' కథలో 'కాకి శోకము' అధిక శోకమనుటకు. 'అకు చించుట' ఆయువుమూడె ననుటకు వాడబడినది. 'నల్ల తంగాళ్' కథలో కాంతాళము(తాలిమి లేమి) అను మారుమూల పదమున్నది.

'ఎరుకల నాంచారికథ'లో 'అయిదు మేకల నపుడు ఆహారమిచ్చె,బిందు బెట్టించె'. ఇది నిఘంటువుల కెక్కని పదము.కీ.శే.సురవరం ప్రతాపరెడ్డిగారు బిందించుట యనగా నైవేద్య మిచ్చుట, సాకపెట్టుట, లేదా సాకపోయుట యని యభిప్రాయ పడినారు2. కొఱవి గోపరాజు ఈపదమును ప్రయోగించియున్నాడు.

'కామాక్షికి మహాకాళికి చెండికి, నక్కజియ్యకు కాళి కంబికకును,
వింధ్యవాసిని కేకపీరకు మున్నుగా, నెల్ల వేల్పులకు బిందించి మ్రొక్కి'3

కాని రెడ్డిగారి యభిప్రాయము సరికాదు.బిందు వనగా రక్తపు బొట్టు.బిందు పెట్టుట. బిందించుట యనగా నాయా దేవతలకు రక్తపుబొట్టు విడుచుట. జంతువును బలి పెట్టి దాని రక్తమును దేవతలకు చల్లుటయే బిందు పెట్టుట.ఆయా క్షుద్ర దేవతలకు బలి పెట్టువారినడిగి ఈయర్థము నిర్ణయించుకొనవచ్చును.'బల్గారి కొండ్రాయుని కథ'లోకూడ ఈశబ్దము వచ్చినది.కొండ్రాయుని కత్తిని వర్ణించుచు జానపదకవి 'నాగుంబాము పిల్లవలె నున్నది నరబిందువు గోరుచున్నది' యనెను. నరబిందువనగా నరుని రక్తబిందువని యర్థము. నరబలి కావలయు నన్నమాట. 'బొడుగు బండల దాటి పోవుచున్నాడెలంబాడివాడు' బొడు గనగా నిఘంటువులో (శ. చంద్రిక) పిల్లవాడని యర్థము కలదు. కాని తెలంగాణమున బొడుగనగా భూమియందు

1. షుమదండ్రము-చతుర్థాశ్వాసము. 2. ఆంధ్రుల సాంఘిక చరిత్రము-పుట108
3. సింహాసన ద్వాత్రింశిక. ప్రథమభాగము-పుట 107.

కొంత భాగము పాతుకొనియుండి కొంతభాగాము పైకి తేలియుండు రాయి. ఇట్టి సముదాయమును బొడుగు బండలందురు. ఒంటివిత్తు వేరుసెనగకాయ, కొట్టుటకు వీలు కానిదానిని, గట్టిగా నుండుదానిని కూడ బొడు గందురు. రాయివంటి దని గౌణార్థము. కనుక పైప్రయోగము తెలంగాణపు మాండలికము. రచయిత తెలంగాణమువాడు.

'ఎరుకల నాంచారికథ' కూడ తెలంగాణమునకు సంబంధించినట్టిదే. 'మీ కెరుక చెప్పుట మా కచ్చి లేదయ్యా-లంబాడివాడ' అచ్చిరాదు·అయిరాదు. అనగా అనుకూలపడదని యర్థము. అచ్చుపాటు కూడ ఇట్టి శబ్దమే. 'అయిదువుట్ల అన్నము లప్పుడు రతిపోయాలె, పట్టుమీద రతిని బాగా రతిపోయించింది' రతిపోయుట యనగా కుప్పవోయుట = దీనిని కుంభము వోయుట యందురు. బలికూడును కుప్పవోయుట రతిపోయుట యందురు. 'గర్భంబున పిండంబు కలికలాయెర-లంబాడివాడ.' కలికలి యగుట చక్కని నుడికారము. అవిసిపోవుటయని యర్థము. ఇదికూడ తెలంగాణ మాండలికమే. బియ్యపు కడుగును కూరాటి కుండలో బోసి భద్రముగా కాచి యుంచెదరు. దీనినే కలి యందురు. కుండలలో వండుకొనువారు అన్నము వండునప్పుడీ కలిసీళ్లను ఎసరులో కొంత కలిపెదరు. ఈ రీతిగా వండిన యన్నము రెండు దినములైనను చెడిపోదు. తెలంగాణమున బ్రాహ్మణేతరులం దిట్లు సేయుట పరిపాటి. ఈ కలిసీళ్లు పుల్లగా నుండును. చలువ సేయును. గంజి లేకున్నచో కలిసీళ్లుపోసికొనియైనను బీద లన్నము తిందురు. 'కలియో గంజియో' యని వాడుక. పుట్టినవెంటనే శిశువుపై కలిసీళ్లు చల్లెదరు. పలుచని గంజివలె నుండుటచే, అవిసిపోయిన రూపమేర్పడును. కనుకనే నలిగిపోయిన పిండము 'కలికలాయె'ను. 'వీరరాజమ్మ కథ'లో 'పేరరెడ్డి 'తలలోను నాలుక దిరిగిన రీతి, పూవులలో దారంబు పోలిక' ఉండెనట. 'తలకట్టివా వయ్యితంత్రివలె నీవు' వ్యవహారదక్షుడని యర్థము. 'శనిగావివలె నీవు తగిలియున్నావు, నోటి మీద పుండు పుట్టదాయెనుగా వీరయ్య' జాతీయమగు తిట్లు. 'రావిరాని విమ్మ రంపాన బెట్టు రాజమ్మ' పలుకుబడి. 'వెన్నెవన్నెల విషవకత్తివే కోడల' టక్కులాడి; గజ్జెల గుత్తిము వంటిదీ మాట. ''తేనెపూసిన కత్తి' గడ్డి కప్పబడిన నూయి' 'మేకవన్నెపులి' బ్రక్కలో నున్నట్టి పాము' జాతీయములు.

'కాంభోజరాజు కథ'లో రాజుగారికి వ్రణబాధచే 'వచ్చే ప్రాణము, పోయే ప్రాణముగా' నుండెను. 'పొడిపిళ్ళయినా తీయుచున్నారు' జాడ తీయుచున్నా రనుటకు.

'కొంగువేయుట' జారత్వము చేయుట యని యర్థము. 'బిసల మంచము' మరల మంచమని యర్థము. బిస యనునది తెలంగాణమున నధికముగా వాడుకలో నున్నది. 'బిస చెడిపోయింది' అనెదరు. **Machine** అనుదానికి సమానముగా బిసను వాడెదరు 'మిసని' 'బిస'గా మారెనోయేమో! 'గాంధారి కథ'లో 'అగడాల అంగడికాయ' ఆకతాయి అనుటకు మారుగా వాడబడినది. 'సన్నపు తలపాగేమి జగ్గుమీర జాడ్డేమి' తళతళయని 'నానేరం నావోళ్ళే పడవేసి' నేరము నిరూపించి యనుటకు చక్కని జాతీయమిది. 'దుమ్ముకొ దులుపుట' శిక్షించుట, కొట్టుట యని యర్థము. 'నీ అరికాలముల్లు నాటిన నా మునివంట దీసెదను' ముని పల్లనగా పంటికొన. యుద్ధము చేయుచు గాంధారి రోషమున 'నాకు ముంజేత మీసమున్న' దనెను. మీసము వీరమునకు చిహ్నము. ముంజేతికి మీస మున్నదనుట పరాక్రమసూచకము. బొబ్బిలి పదములో కూడ 'ముంజేత మీసమున్నదీ రంగారాయుడికి' అని కలదు. 'ధర్మాంగద చరిత్ర పాముపాట'లో 'ఆడికలు నమకూడు అపకీర్తివచ్చు' (నిందలు). 'వీరకాఠనుచును కోరి వార్తలు దెలిపి' (వియ్యంపుడు). 'సందె లగ్నము గనుక మరి జంపు నేయక' (ఆలస్యము). 'శతమానమే[1] గట్టి సఖియ మెడనపుడు' (తాళిబొట్టు). 'బ్రాహ్మణుల భూములు పంటనివ్వక తాను, అతుకుబడి కాకుండ అట్టెలను బెట్టె' అట్టెలనగా బాధలు కావచ్చును. 'విల్లు విరిచిన లాగు వేలములు దిగ్గె' (శిబిరములు). 'రజతాద్రి నాంథుడు రాకసంబిచ్చె'?

'సారంగధర పాట'లో 'గవ్వముడి తావిప్పి గబ్బిగుబ్బలు జూపి-గోరువాటులు చూపెనూ' గవ్వవలె నుండు రవికముడి కాబోలు. ఇటులే పోకవలె నుండునది పోకముడి. 'చెదురుమాట లేల చారులారా' చదుర = నేర్పు. ( చతుర-చాతుర్య ) 'సారంగధరచరిత్ర శారదవరుస'లో దండాసివాడు, మాలవాడు, తలారివాడనుటకు. 'పాల గోవు మాలల కిచ్చినావా, ఎలుకకై యింట మంట లిడినావా' జాతీయము. 'నారాయణ శతకము'లో 'యమకింకరుల దలచిన నాగుండె యావులింపుచు నున్నది.' గుండె యావులించుచున్నదను పలుకుబడి పూర్వము లేనట్టిది. అభ్యుదయకవుల తలలపై నెగిరి పోవుచున్నదీమాట. 'ఎల్లమ్మ కథ'లో భగవంతుడు జమదగ్నిని 'కొట్టిల సాహిత్య' మడిగెను. సాహిత్యమనగా స్వయంపాకము. ఇది తెలంగాణపు మాండలికము.

---

1. వల్లగింజ తూనికగల దగుట మాంగళ్యము శతమాన మనబడెనో లేక 'శతమానం భవతి' అను ఆశీర్వాదము పలుకుటచే లాక్షణికముగా మాంగళ్యము శతమానమాయెనో తెలియదు.

ఈవిధముగా నన్వేషించుచు బోయిన నీ జానపదగేయములందు నానుడులు, జాతీయములు, మాండలికములు, మారుమూల పదములు వింతయగు శబ్దకల్పనములు లెక్కకు మిక్కిలిగా కనబడును. ముద్రితసాహిత్యమునుండి మచ్చునకుగా నిట్టి విశేషములు కొన్ని మాత్రమే యుదాహరించితిని.చిన్నచిన్న పల్లెపాటలందును, అముద్రితగేయములందును ఇంక ననేకములు గలవు. అముద్రితములగు గేయముల నుట్టంకించిన చోటులందు వానియందున్న విశేషము లాయా ప్రకరణములందు గాననగును.

## సామెతలు

ఒక భాషయందలి యందచందములం దన్నింటి దొకయెత్తు; కేవలము సామెతల దొకయెత్తు. సామెత లన్నిభాషలయందును కలవు. కవిత్వ మనునది సామెతలందు పరాంకోటి నందుకొనును.జీవితమే కవిత్వముగా నంగీకరించినచో సామెతలు లేదా లోకోక్తులు జీవితానుభవములయొక్క సూత్రప్రాయమైన నగ్న స్వరూపములుగా భావింపనగును. సంఘజీవియగు మానవుడు ఎడతెగని యీ యనంతయాత్రలో తనకుగల యనుభవసర్వస్వమును, గడించిన విజ్ఞానమును, పొందిన కష్టసుఖములను, లోకపు రీతిని చిన్నిమాటలందు కుదించి మరల సంఘమునకే విడిచినాడు. తాదృశానుభూతి యెవరికి గలిగినను ఆ సామెతలు మరల నానోట వెదలి నాణెములట్లు ఒకరినుండి మరియొకరికి సంక్రమించుచు చలామణి యగుచున్నవి. చెట్టు మొదలా విత్తు మొదలా యనునట్లు లోకోక్తుల గూర్చి కూడ పలువురు పండితులు చర్చించియున్నారు. కొందరి మతమున కవిత్వమున కారంభదశ లోకోక్తి స్వరూపము. మరికొందరి యభిప్రాయమున కవితాకళకు పతాకస్థాయి సామెత. ఎవరి యభిప్రాయ మెట్లున్నను ఆకారమున స్వల్పమైన పరమాణువువలె సామెతకున్న శక్తిమాత్ర మనంతము. 'అల్పాక్షరముల ననల్పార్థ రచన కల్పించుటయ కాదె కవి వివేకం' బన్న పాల్కురికి మాటలు సామెతల కన్వయించుకొనవచ్చును. సామెతలు కొన్ని సూటిమాటలందుండును. మరికొన్ని ధ్వనిపూరితములుగను, అలంకారయుతముగను నుండును. డాక్టరు ఛాంపియన్ పండితుడు సామెత నిట్లు నిర్వచించియున్నాడు.'A proverb is a racial aphorism, which has been or still is in common use, conveying advice or counsel invariably comouflaged figuratively, disguised in metaphor or allegory.'

కనుకనే సామెతలు వడిసెల గుండ్లవలె రువ్వుమని వచ్చి హృదయమునకు సూటిగా తాకును. సామెతలందు సునిశితమగు హాస్యముండును. ఈ సామెతలు స్త్రీలకు వచ్చినట్లు పురుషులకు రావు. నిత్యజీవితమున స్త్రీల సంభాషణమున మనమీ సామెతల నధికముగా వినెదము. శిష్టులగు కవులుగూడ సామెతలు వాడి యున్నారు. శిష్టకవులందుగూడ ప్రజాజీవితమును, లోకానుభవమును, అధికముగా నాకళించుకొన్నట్టి జాతీయకవులు సామెతల నధికముగా వాడియున్నారు, తిక్కన సూరన, వేమన, కదరీపతివంటి కవుల రచనములందీ సామెత లధికము. జానపద గేయములందు సామెత లధికముగా నున్నవి. ఇతర భాషలందు సామెతలను సేకరించి యనేకగ్రంథములు ప్రకటించియున్నారు. తెలుగులో చెప్పుకొనదగిన గ్రంథములు వెలువడలేదు. కీ. శే. చిలుకూరి నారాయణరావుగారు సామెతల నధికముగా సేకరించిరి. సుమారు లక్షసామెతలు వారు సేకరించిరట. కాని యవి గ్రంథరూపముగా వెలువడలేదు. సామెతలన్నియు జానపద వాఙ్మయమునకు సంబంధించినవి యైనను వాని నన్నింటి నిక్కడ తడవుటకు వీలులేదు. వాని దొక ప్రత్యేకశాఖ. జానపద వాఙ్మయముగూర్చి పరిశోధన మొనర్చిన ఔత్తరాహులు సామెతల నొక ప్రత్యేకశాఖగా పేర్కొనియున్నారు1. కనుక నేనిచ్చట పేర్కొను సామెత లన్నియు జానపదగేయములకు సంబంధించినవిగా నుండును. కేవలము గేయములందున్న సామెతలనే పేర్కొందును. వ్యవహారమున వాడుకలోనున్న సామెతల నన్నింటి నిట పేర్కొనను.

బాలచంద్రుడు యోధులకు రోషము పుట్టించుటకై మాటలాడినపుడు 'ముక్కు దూలము మీద బొడిచిన యపుడు, గుర్రు మనగలేని కోప మెన్నటి'కని దెప్పిపొడిచెను.

'కాటమరాజు' కథలో సామెతలు కుప్పతెప్పలుగా నున్నవి. 'గొల్లమీది పుల్లరి గోగుమీద బచ్చలి' దీనికే తాత్పర్యార్థముగా 'గోగు పెరుగు గొల్ల విరుగు' అను సామెత కలదు. 'ఉలవ లెత్తామంటె ఊళ్ళ నడిగెదవు' 'ఎద్దురూపము దప్పి ఏదు రూపమాయె' 'తెడ్డడిగినప్పుడే కొయ్యడిగినట్టు' 'పేదవాని కోపము పెదవులకు చేటు' 'పేరేమొ లొటపెటల్ పెదవులు మృదువు' 'రక్షించువారిని రమ్మని పిలిచి-భక్షింప జూచిన పని యింతలేదు' 'బూరె గంపలకాడ బొర్లుదండాలు' 'లోట చేత్తామని లోకంబు నెఱుగు' 'శారికకు దెలుపను శాస్త్ర మున్నాదె' 'దూరాన బెట్టిన తురాయుల దండు - అలకోల పెట్లకు వాగదన్నట్లు'

---

1. శ్రీ రామ్‌నరేష్ త్రిపాఠిగారు. "కవితాకౌముదీ"

దేశింగురాజు కథలో సామెతలు కొలదిగనేయున్నను చక్కగా నున్నవి. 'దిక్కులేనివాడూరికి నెన్నగ నక్కపోతురాజు' 'ముంజేయి కంకణ మరయుటకున్నిట ముకురము కావలెనా' 'చల్లకోసము వచ్చి ముంత దాచంగనేల మనకూ' 'ఉసురువున్న ఉప్పమ్మవచ్చును ఊరికిపోవన్నా'

'బొబ్బిలి పదము'లో మల్లమ్మదేవి కోట నెక్కి విజయ రామరాజు సేనల జూచి దూషించుచు 'కొండలు బద్ద కొన్నాళ్ళకైన కోనలు పడుతుంది' యనెను. బొబ్బిలి పడిపోయిన తరువాత విజయనగరముకూడ పడిపోక మానదని యర్థము. 'బొబ్బిలి కథ' పెద్దాడ మల్లేశము రచించిన దానిలో (డి. నెం. 2550 ప్రా. పు. భాండాగారము)గాయపడిన రంగారావును 'ప్రాణముతో పట్టుకొనిరండు అతనికే కోటను మరల నిప్పింతు'నని బూసి భటుల బంపినప్పుడు రంగారావు సమయము మించిపోయిన దనుటకు 'పాసిన కూట్లో కలి పోసితే పదనుకు వస్తుందా'యని సంధి నిరాకరించెను.

'కుశలాయకము'లో చక్కని సామెతలున్నవి. 'అత్తలెల్లను మంచి అలవేము తియ్యన-ఎందునైనా గలదె మందుకైనాను' 'పెద్ద చెరువు నీళ్ళకును పెద్దింటి నడువడికి తప్పులేదను మాట ధరణిలో గలదు' 'రాజుల హృదయము రాయితో సమమండ్రు-వాడు సామెత లెల్ల నేడు నిజమయ్యె' 'హంస కులమున బుట్టి ఆడి(రి)కలు తినుభంగి-సుతులయిన నేడు మీగతి యిట్టు లుండె' 'అడ జన్మముకన్న అడవిలో మ్రానయి-పుట్టితే మేలనుచు బుధులు బల్కెదరు.' 'కుశలవకుచ్చల చరిత్రము'న 'చెట్టు చెడే కాలానికి పిందెలు-చెప్పిన సామెతలే నిజమాయె' 'పండిన చేను పసులు మేసితే-కేపులు గట్లు మేసున చెపుమ' 'కుశలవ యుద్ధము'న 'కలగన్నచోటను గంప నింపుదుర' 'పాలుపగు విప్రుల పోటుల కంటె-ఘనమగు కప్పల కాటే మేలు'

'రామకథా సుధార్ణవము'న 'పాము కాళ్ళు పాముకె తెలుసును మరి పరుల కెరుగ వశమ' 'శతకంఠ రామాయణము'న 'అడబోయిన తీర్థ మరయ నెదురైనట్లు మ్రొక్కబోయిన వేల్పు మెదురున్నట్లు' 'క్రొవ్వుమీరిన గొఱ్ఱె కొండకు దాకితే కొదువేమి వచ్చునా కొండకేమైన' వంటి సామెతలున్నవి.

'నలచరిత్ర పదము'లో 'తను గట్టుటకు త్రాళ్ళు తా దెచ్చుకొన్నట్లు' 'ఈతకు మించిన లోతు గలుగునా నాథ, విషమెక్కువే తల వెంట్రుకలు దాటి' యని కలదు.

'శశిరేఖా పరిణయము పదము'న 'తానొకటి తలచితే దైవమొకటి తలచు' 'క్రొవ్వుచేతను బోయి కొరత బడ్డట్లు' 'వచ్చిన కార్యము వాకిటైనదియింక' 'వియ్యమందగ

బోవ దయ్యంబు బట్టె' 'సుభద్రా కల్యాణ ప్రారంభము'న 'దొరలు యేనుగు నెక్కి-యిద్ది దూరుదుర' 'శశిరేఖా పరిణయము బ్రతుకమ్మ పాట'లో 'జలధరంబుల నమ్మి చెలిమె జల్లినయట్లు' 'ఆశ దోష మెరుగదు' 'గయోపాఖ్యానము జంగంకథ' లో 'మేర గాదనుచు కొంగలు వంగలు మేసిన సామ్యముగ, నారికేళతరు దూడలు మేసిన తీరున బల్కెదవు' 'తాతకు దగ్గులు నేర్పిన గతి నా దగ్గర వదరెదవు' వంటి సామెత లున్నవి.

'సవతుల కయ్యము పాట'లో 'మసిపూసి నేరేడు మారేడు పండ్ల నమ్మట' 'ముందు చెవులకన్న వెనుక కొమ్ములు వాడి' 'శ్రీవరాహావతార చరిత్రము'న 'ప్రాణము లుంటె బల్సుకూర దిని బ్రతుకివచ్చు' 'దక్షుని యజ్ఞము'న 'భర్త చేసిన ముద్దు ఖేచర వీధులు బారు-భర్త చేయని ముద్దు పంచల పాలగును' 'గంగా వివాహము'న 'కక్కుర్తి పడితేను కడుపు నిండగ వలెను-కడుపు నిండని వట్టి కక్కుర్తి యేల' 'ఎద్దులు బండియు నేకమైతేను, ఎంతేసి గట్లైన ఎక్కిపోవచ్చు' 'ముదిత చల్లకు వచ్చి ముంత దాచగనేల, అడుగ వలసిన మాట కనుమానమేల' 'కానవచ్చిన పనికి గట్టెక్కగానేల' 'ముందున్న శ్రవణముల కంటెను మిక్కిలి - వెనుక కొమ్ములు వాడి వినవె గౌరమ్మ' 'నుదుట వ్రాసిన వ్రాత నులిమితే చెడిపోదు-అనుభవింపక తీర దనుభవం బెల్ల' 'కామిరెల్లి మల్లన్న కథ' లో 'ఆడుది యన్నట్టి మాట గోడ బెట్టినట్టు లుండు' 'ఏలేటి పురుషునకు ఏడుగురు భార్యలంచు' మొదలగునవి కలవు.

'కమ్మవారిపణతి పసల బాలరాజుకథ'లో 'తన్నుగట్టను త్రాడు తాతెచ్చుకొంది' 'ముద్దిగొట్టిన మూతిపండ్లు రాలె' వంటి సామెతలున్నవి.

'వీరరాజమ్మ కథ' లో 'ఇల్లు ఇరకట మంచు ఆలి మరకట మంచు పేరయ్య' 'ఉడుమున కేలరా ఊరి పెత్తనము వీరయ్య' 'గాంధారికథ'లో 'ఆ ఉరుముకు ఈ చినుకులా' 'చాపకింది నీళ్ళ సతులు మీవలపు' 'ఆడవారి మాటలు అద్దములో తేటలు' 'కడవంత గుమ్మడి కత్తిపీటకు లోకువ' 'పక్షుల మాటలకు వృక్షాలు గదులునా' 'ధర్మాంగధ చరిత్ర పాము పాట'లో 'రచ్చెక్కి సభలోన రాయబారంబేల' 'అత్తకును కాంతంబు కత్తికిని మెత్తన కలదంటె ఇలలోన కలికిరో వినవే' 'సారంగధర పాట' లో 'గుడి మ్రింగ దలచినా లింగంబు అడ్డునా' 'సారంగధర చరిత్ర శారద వరుస'లో 'ఈనగాచి నక్కల కిచ్చినాను' సామెతలు కలవు.

'శుద్ధనిర్గుణతత్వ కందార్థ దరువు'లందు 'తినుమంటె పులి వల్ల దనినట్లు' 'పాలిమ్మని తల్లికి మనవి జేయుదురా' 'అడవి యుసిరికాయ సముద్రపు టుప్పు' 'వేదాంత

కుచ్చేల కథ'లో 'వెలి కొంచెము ఫల మెక్కువన్నట్లు' 'ఏగంటివారి వచనము'లందు 'పూని యొడలు దస్సి బుద్ధ బలసినట్లు' 'వెస నారంభము చెడి కసవు బలసినట్లు' 'పరగ బీద బలసి బందికాడైనట్లు' 'ధరమెత్తనైన గుద్దలి వాడైనట్లు' 'తండ్రి ఱంపిన తగవుండగా లంజె ఱగడాల బోయినట్లు' 'వరద కోయెడువాడు వరద నుండెడువాని పెఱవకుమన్నట్లు' 'రామదాసు చరిత్రము'న 'దాసుని తప్పు దండముతో సరి' 'ఏటికి ఱల్లిన సీళ్ళాయె నా బ్రతుకు' వంటి సామెతలున్నవి.

కేవలము ముద్రితసాహిత్యమునుండి మచ్చునకుగా కొన్ని సామెతలను మాత్రమే యుదాహరించితిని. జానపదుల విజ్ఞానభాండాగారము లనదగు నీ సామెతలు లోకోక్తులింకను పెక్కు గలవు. అట్టివాని నకారాదిగా వ్రాసి ఇతర భాషలందున్న తులనాత్మకమగు లోకోక్తులతో పోల్చి పరిశోధించు టెంతేని యవసరము.

# సాంఘిక విషయములు

జానపదగేయములకు నిత్యజీవితము నలముకొను శక్తి యధికమని ప్రథమప్రకరణమున నివేదించియుంటిని. దీనికి కారణము జానపదగేయ లక్షణములం దొకటి జనసామాన్యపరిచితవస్తువు అనగా సాంఘిక జీవనమునకు ప్రతిబింబమగుట. జానపదగేయములను పరిశీలించినచో మనజాతీయ జీవితము, మన సాంఘికచరిత్ర తెలియగలదు. 'సాంఘికచరిత్ర మానవచరిత్ర, ప్రజలచరిత్ర, అది మన సొంతకథ. అది జనుల జీవనములను ప్రతి శతాబ్దిమం దెట్లుండెనో తెలుపునట్టిది. అది మన తాతముత్తాల చరిత్ర. వారియిండ్లు, వారి కట్టు, వారితిండి, వారి ఆటలు, వారి పాటలు, వారు పడిన పాటులు, వారు మనకిచ్చి పోయిన మంచిచెడ్డలు'1. ఈ దృష్టితో జూచినప్పుడు జానపదగేయములందొక లోపము గానుపించును శిష్టసాహిత్యమున సాంఘికవిషయము లేవేని యున్నంతవరకైనను ఉన్నవి యున్నట్లుగా గోచరించును. దీనికి కారణము శిష్ట సాహిత్యము పుట్టినప్పటినుండియు లిఖితరూపముగా గ్రంథస్థమగుట. లిఖిత పూర్వకముగా నుండుటచే దానిలో మార్పులు కూర్పు లంతగా చేరక నిజమైన చరిత్రము తెలిసికొనుటకు వీలగును. జానపదసాహిత్యము కేవలమౌఖిక ప్రచారముననే కాలూదికొని నిలచినది. కనుక దానిలో కాలక్రమమున మార్పులు కూర్పులు ప్రవేశించుట సంభవము. గేయరచనాకాలమున నున్న సాంఘిక విషయము లాగేయమున స్థానము కల్పించుకొన్నను కాలక్రమమున గేయము ప్రవాహమున బడి మారిపోయినటులే అందలి వస్తువుకూడ మారిపోవుటకు వీలున్నది. జానపదగేయములందును పూర్వకాలమునుండి మార్పునొందక వచ్చుచున్న వానిలో నాయాకాలములనాటి సాంఘికవిషయము లుండును.

'పల్నాటి వీరచరిత్రము' శ్రీనాథవిరచితమనబడు వీరగేయము. అది కొంత లిఖితపూర్వకముగా నిప్పటికిని భద్రపరుపబడి యుండుటచే నాకాలమునాటి

1. ఆంధ్రుల సాంఘికచరిత్ర.

సాంఘికవిషయము లాగేయమున గానగును. శ్రీనాథునికన్న పూర్వము రచింపబడి యుండిన జానపదగేయ మేదేని యున్నను అది మౌఖికప్రచారముననే యున్నచో దానిలో కొన్ని మార్పులు తీర్పులు చేరుట కవకాశముండుటచే దానియందున్న విషయము లాకాలమునకు సంబంధించినట్టివేయని ఇదమిత్థముగా చెప్పజాలము. జానపదగేయము దేశకాలపాత్రముల కతీతమైనదని ఇదివరకే తెలిసికొని యుంటిమి. ఐనను మార్పునొందని కొన్ని గేయములందును, మార్పునొందిన గేయములం దేవేని మార్పునొందని విషయము లున్నచో వానివలనను కొంత సాంఘికచరిత్రము గ్రహింపవచ్చును. కొన్ని సాంఘికవిషయములు మార్పునొందనివికూడ నుండును. కనుక నిట్టివాని నన్నింటిని కనుగొనవచ్చును. ఈ ప్రకరణమున జానపదగేయములందు కాననగు సాంఘికవిషయముల స్థూల పరిశీలనము చేయనగును.

## మతము

పల్నాటి యుద్ధమునకు మతకలహములు కూడ నొక కారణ మందురు. క్రీడాభిరామము 'అలుగవల్లి నాయురాలి దుర్మంత్రంబు, కోడిపోరు చాపకూటి కుడుపు, ప్రథమకారణములు ప్రల్నాటియేకాంగ, వీరపురుషసంప్రహారమునకు" అనుచున్నది. శైవవైష్ణవమతముల సంఘర్షణ మీ యుద్ధమున కొంతవరకు కాననగును. నాయకురాలు శైవమతమునకు బ్రహ్మనాయుడు వైష్ణవ మతమునకు వీరప్రతినిధులు. దాయాదుల పగలకు చెరియొకవైపు తోడై నిలచిరి. బ్రహ్మనాయుడు పల్నాటి విష్ణువనియు ( పల్నాటి కృష్ణుడనియు ) ప్రఖ్యాతి గాంచెను. జగమంతయు విష్ణుమయము చేయనెంచి చాపకూళ్ళు పెట్టించెను. కన్నమనీని ( మాలవాని ) కుమారునిగా స్వీకరించెను. మాచెర్ల చెన్నకేశవు డానాటి పలనాటి వైష్ణవమతమునకు సాక్షీభూతుడుగా నుండెను. బ్రహ్మనాయుడు కన్నమనీని అర్ధరాత్రంబున కదనరంగము చూడబంపెను. అచటి భూతప్రేతములతో సంభాషించినప్పుడు కన్నమదాసు తన్ను గూర్చి యిట్లుచెప్పుకొనెను. 'కలికికృష్ణుండైన కారుణ్యమూర్తి, పుట్టెను బ్రహ్మన్న భూలోకమందు, అతనికి గానుడనౌదును నేను, మాలలకును బుట్టి మాలనై పోక, విష్ణు పాదము బట్టి విశ్వంబులోన, తెప్పలినాయుడు తెరవయైనట్టి, వికచాబ్జలోచన పెమ్మసానికిని, శ్రీమించు మాచెర్ల చెన్నని మేన, పెంపు నొందెడు తులసి పెద్ద వనమాల, వరమున గన్నట్టి

మపుణ్యసుకృత'. మాలమాదిగలందు వైష్ణవమెంత ప్రగాఢముగా వ్యాపించెనో పై వాక్యములు స్పష్టము చేయుచున్నవి. భూతరాట్ స్తంభమును నిలుపుటకు పూర్వము యుద్ధభూమిని పవిత్ర మొనర్చుటకై మలిదేవరాజాదులు(బ్రహ్మనాయని వైష్ణవమునకు లోబడినవారలు) 'చెన్నకేశవదేవు శ్రీపాదజలము, తివిరి పూజారులు తెచ్చుట జేసి, తులసిపత్రంబులతోడ తీర్థంబు, అచ్చోట చల్లించిరి. 'పలనాటి యుద్ధకాలము నాటికి అచ్చటచ్చట వైష్ణవాలయము లున్నను దేశమున మాత్రము వైష్ణవ మంతగా వ్యాపింపలేదు. కాని యచ్చటచ్చట విరళముగా నుండెను. మాచెర్ల ప్రాంతములందు బ్రహ్మనాయని ప్రభావమున వైష్ణవము వ్యాపించి యుండును. దేశమున బహుళముగా వ్యాప్తిగాంచిన శైవమునకు నాయకురాలు ప్రాతినిధ్యము వహించి అంకురరూపమున నున్న యావైష్ణవము నూడబెరుకుటకై నాయనిపై కత్తి గట్టినది. నాయని పక్షమున ఆనాడు బహుళః అచటి వైష్ణవులందరు చేరియుందురు.

'కాటమరాజు కథ' నాటికి దేశమున వైష్ణవము బాగుగా వ్యాపించినది. యాదవులు వైష్ణవులు. కాటమరాజు, బొల్లియావు భూలోకమున కవతరించిన విష్ణ్వంశములు. కాని కాటమరాజు కథలో మాత్రము శైవవైష్ణవములు రెండును చొచ్చుకొని పోయినవి. యాదవసేనలందు వీరశైవభక్తులుకూడ నుండిరి. ఖడ్గ తిక్కనతో యాదవుల పక్షమున పోరాడినది బ్రహ్మరుద్రయ్య. ఈతడారాధ్య బ్రాహ్మణుడు. ఇదిగాకను యాదవులు గంగ నారాధ్యదైవతముగా గొల్చిరి. యాదవుల సంపదయగు గోవులకు, తృణజలసమృద్ధి కావలయునుగదా! ఇప్పటికిని నెల్లూరు జిల్లా దర్శి డివిజను దొనకొండలోని గంగకు జాతరలు జరుగును. కనిగిరి తాలూకా పాలేటి యొడ్డుననున్న ఆవలపాటి గ్రామమున ఏటేట వైశాఖపౌర్ణమికి గంగ తిరుణాళ్ళు జరుగును. గంగ శివునిభార్య. కాటమరాజు తండ్రి పంచలింగాల కొండ సమీపమున లింగమై వెలసెను. యుద్ధమునకు బయలుదేరునప్పుడు కాటమరాజు మరియు పల్లికొండ యాతని నిట్లువేడిరి.'శంకరా శివశివా శరణు మహాదేవ, భక్తుల పాలిటి పరమేశ ఈశ, తొలి చంద్రశేఖరుని దొడ్డపూజించి, పర్వతంబున నిల్పి పరమేశు కృపను, నావుల వలురాజు కతిపుణ్యవశత, వల్లమకు ప్రోలాజుపై పుట్టినావు, ఆపురహరు రూప మట పూజ జేసి, తుదను జంగాలకై దురములో నీవు, పరిణావ జంగాల పర్వతము బంపి,చోడ దళంబులు చుట్టంగ నీవు, హరహరాయని యెంచి యటు పారజూచి.' కాటమరాజు వైష్ణవుడుగా అతనితండ్రి శైవుడుగా, కాటమరాజు శివరూపమగు

తండ్రిని కొలుచునటులుగా చిత్రింపబడుట వింతగా నున్నది. బ్రహ్మరుద్రయ్య యుద్ధమునకు బోవుటకు ముందు వీరశైవాచారములు నెరపెను. అతనికి వాహనము వృషభ మయ్యెను. చల్లపిన్నయ్య మొదలుగా గల ఏడ్గురన్నదమ్ములు యుద్ధ కాలమున నొక యేకాదశినా డొక్కప్రొద్దుండి 'తాన మొప్పగనాడి ధవళాలు గట్టి, నెలవంక తిరుమణి నేర్పుతో దీర్చి... ....ఓ దేవదేవుండ ఓ విశ్వరూప, యో పాపసంహార యో పరమేశ........కరు విక్రమము గని కైలాస మిమ్ము' అని వేడుకొనిరి. వీరు యాదవులలో నున్న వీరుశైవులవలె గన్పట్టుచున్నారు. యుద్ధసమయమున 'హరిహరా' యనిరి. కాటమరాజు కృష్ణుని యవతారముగా, వీరన్న వీరభద్రుని యవతారముగా చెప్పబడిరి. ఐతమరాజాదులు యుద్ధమునకు పోవుటకు ముందు శివునకు పూజలు, అభిషేకములు చేసి 'పంచాక్షరీమంత్ర పఠన గావించి, ఏకార్తి పంచార్తి ఎలమి షడార్తి, మంగళారతి బాడి మరి పూజచేసి', జాహ్నవిని గూడ వేడిరి. యుద్ధరంగమునందు కూడ 'పల్లికొండయు రాజు బంధువర్గంబు, శివ పురాణము నేకచిత్తాన వినుచు' నుండిరి. వారి శివభక్తి యట్టిది.

అనుబంధమున గల 'భట్టు రాయబారము'లో కాటమరాజు పక్షమున వాదించు భట్టు:రాయశృంగావళిభట్టు (నల్లసిద్ధి పక్షమున వచ్చినవాని)తో కాటమ రాజును గూర్చి 'కావీర భూమిని కాలావులమేపి, నవనాథసిద్ధుల నయము గన్నాడు' అనెను. కాటమరాజు కూడ శైవప్రభావమునకు లోనైనవాడుగా దోచుచున్నాడు. కాటమరాజు ఐతమరాజాదుల కంపిన లేఖలం దొకదానిలో '(శ్రీ)కాంత వరపాద సేవాధురీణ' యని సంబోధించెను, దీనిచే కరియావులన్న మొదలగువారు విష్ణు భక్తులుగా గానబడుచున్నారు. ఐతమరాజు మొదలగు తన సుతుల యుద్ధమున కెటుల బంపుదునాయని తల్లియగు సిరిదేవి 'ఓ పార్వతీనాథ ఓ భక్తవర్య' యని దుఃఖించినది. ఇది యంతయు జూడగా యాదవులందు కొందరు శైవులు మరి కొందరు వైష్ణవులవలె గన్పట్టుచున్నారు. పల్నాటి యుద్ధకారణములం దొకటి మతవైషమ్యము కూడ కలదందురు. కాని కాటమరాజు కథలో మతవైషమ్యములు కానరావు. యాదవులు శివకేశవుల నిరువురిని సమానముగా గొల్చిరి. "కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా" యని హరిహరనాథతత్వమును ప్రచార మొనర్చిన తిక్కనకు వీరు కొంచెము మాత్రమే పూర్వమువారు గనుక ఆనాడు మతవైషమ్యాలు లేక హరిహరులు సమానముగా పూజింపబడుచుండిరని భావించవచ్చును.

'దేశింగురాజు కథ'లో కొన్ని మతవిషయములు కానవగును. దేశింగురాజ వైష్ణవుడుగా చిత్రింపబడినాడు. అతనికిలువేల్పు రంగనాథస్వామి. దేశింగ సతతము రంగనాథుని ధ్యానతత్పరుడుగా నుండినట్లు కథలో నున్నది. దేశింగ పసిబాలుడుగా నుండి ఢిల్లీకి పోయి బారాహజారి నెక్కి తండ్రుల చెర విడిపిం నప్పుడుకూడ రంగనాథస్వామి యాతనికి తోడునీడగా నున్నట్లు వర్ణింపబడినది నవాబుకడనుండి కప్పముడుగవచ్చిన తోండ్రమల్లోజి దేశింగు తనను చంపునన భయముతో కుహనావైష్ణవుడై దేశింగు సభకు పోయెను. వైష్ణవుడనియే దేశిం తోండ్రమల్లును చంపక విడిచెను. యుద్ధమునకు పోవుటకుముందు కూడ దేశిం రంగనాథుని సెల వడిగినట్లును ఆతడు జయాపజయములు చెప్పినట్లును కథల నున్నది. చారిత్రకముగా నిది సత్యము కాకపోవచ్చును. దేశింగు కాలమున దక్షిణమున వైష్ణవము బాగుగా వ్యాపించినను దేశింగు మాత్రము దక్షిణదేశవా కాడు. తండ్రి మరణకాలముననే అత డుత్తరదేశమునుండి బయలుదేరి వచ్చెన ఐనను ఆతని తండ్రి మున్నగువారు దక్షిణదేశమున చాల కాలమునుండి స్థిరప పోయి రంగనాథుని ఇలువేల్పుగా భజియింప కుమారుడగు దేశింగుకూడ రం నాథునే కొలిచియుండు ననుకొనవచ్చును. దేశింగుకు మహమ్మదీయులతో విరోధము సంభవించెను మహమ్మదీయు లప్పటికి దక్షిణదేశమున బాగు ప్రబలిపోయిరి. కాని దేశింగునకు మహబ్బతుడను తురక ప్రాణస్నేహితుడు నుండుట గమనింపదగినది. మహబ్బతుడును దేశింగు పక్షమున పోరాడి గుండ దెబ్బ తగిలి చనిపోవునప్పుడు పశ్చిమాభిముఖుడై ఖురాన్ వాక్యము పఠిం యసువుల బాసెను. తురక లందరు పశ్చిమాభిముఖులై దైవప్రార్థనము (నమాజు చేయుదురు. దీనికి కారణము తురకలకు పవిత్ర స్థలమగు 'మక్కా' పశ్చి దిశయం దుండుటయే.

బొబ్బిలి వెలమలు వైష్ణవులుగా చిత్రింపబడినారు. రంగారావుగారి విష్ణువునకువలె శంఖచక్రములు, వింజామరము, పద్మము, (సాముద్రిక లక్షణము లున్నట్లు వర్ణింపబడుటయే గాక మల్లమ్మదేవిగారు గోపాలస్వామి కభిషేకా పూజలు చేయించుట వర్ణింపబడినది. 'పెద్దాపురము కోడిపందెముల కథ'లో వత్సవాయిరాజులు వైష్ణవభక్తులుగా వర్ణింపబడిరి. ఆనందరాజుగారి యాజ్ఞచొప్పు తిమ్మరాజుకు భోజనమున విషము కలిపి పేరిభొట్లు వడ్డించుచుండగా తిమ్మరా గారి యిలువేల్పగు రంగనాథుడు 'భూమి మీదను పడగొట్టాడు పేరిభొట్లవండి.

ఆనందగజపతి ధాటికి తాళలేక జగపతిరాజు తన కుమారు నాతనికి బం నప్పగించి తాను రాజ్యము విడిచి సన్యాసియై భద్రాద్రిరామచంద్రుని పాదరాజీవ కడ కొన్ని దినములుండుట మూడవ ప్రకరణముననే చెప్పియుంటిని.

ప్రధానముగ మతసంబంధమైన గేయములగూర్చి నాలుగవ ప్రకరణ చర్చించియుంటిని. అట్టి మతసంబంధగేయములందు జేరిన 'శ్రీ అం చరిత్రము'న నూట యెనిమిది దివ్యతిరుపతుల వర్ణన మున్నది. ఈ దివ్యతిరుప క్రమ మొక్కొక్క-రొక్కొక్క-తీరున వర్ణించిరి.తాళ్లపాకవారి క్రమ మొకతీర నున్నది.ఇదేపాటలో మార్గశిరవ్రతమును గూర్చిన వివరము లున్నవి.భోగిపం కర్త మీయనైనది. శ్రీ రంగనాథుడు గోదాదేవి స్వప్నమున గనబడి భోగిం దినమే మన కందరకు భోగి పండుగయయ్యెనట. 'తిరుమంత్రము పాట' హరిదాసు తిరుమంత్రము కమ్మపై వ్రాసికొని పోయిన భోగముదానికై చోళర పట్టణపు వీథులు దిరిగెనట. చోళులు మొదట శైవులే. కులోత్తుంగ చోళ స్వయముగా రామానుజులవారిని దేశమునుండి వెడలగొట్టించె నందురు. కన నీ సంఘటనము (నిజమైనచో) చోళరాజులు వైష్ణవమును స్వీకరించినప్ప లేదా వైష్ణవమును పోషించినప్పుడో జరిగియుండవలెను.

## యుద్ధ విషయములు

ఆంధ్రులకు వీరరసాభినివేశము మెండు. అది కూడ ధర్మవీరవ జానపదుల వీరగీతములను తృతీయప్రకరణమున పరిశీలించితిమి. చారిత్ర గీతము లన్నియు వీరగీతములే.చారిత్రకములే కాక మరికొన్ని గీతములందుకూ వీరరసము వర్ణింపబడిన చోటులున్నవి. ఇట్టి పట్టులందు యుద్ధ తంత్రము, యు ధర్మము, రణరంగము, వీరుల వేషభాషలు, వారి యునికి, సైన్యమునంద తరగతులు, ఆయుధములు మున్నగు విషయముల వరన ముండును. పల్నా వీరచరిత్రమున నిట్టి విషయములు బహుళముగా నున్నవి. ఈ సైనికవ్యవ పల్నాటి వీరుల కాలమునాటిదై యుండును. లేదా శ్రీనాథుని కాలమునాటిదై యుండును. ఏ కాలమునాటిదైనను భేద మంతగా నుండదు.

జైత్రయాత్రకు బయలుదేరిన సైన్యములకు కావలసిన సౌకర్యముల సమకూర్చుటకు వస్తువాహనము లన్నియు సైన్యము వెంటనే తరలింపబడును

పూర్వమునుండి ఈనాటికిని ఈ వ్యవస్థ ఇటులనే యున్నది. మలిదేవరాజు బ్రహ్మ నాయుడు మొదలయినవారు కార్యమపూడి యుద్ధరంగమునకు బయలుదేరి పోవు నప్పుడు వారివెంబడి 'గొల్లెనల్గట్టిన గొప్పలొబండ్లు, బల్లాని పెట్టెలు పట్టెమంచములు, తపచైన పీటలు తమ్మపడిగెలును,వింత మందసములు వెలయు గొడ్గులును,కాశ్మీర కస్తూరి గంధకర్పూర,మాదిగా వాసన లమరు పెట్టెలును,బొక్కసంబుల బల్వి బోనగావళ్లు,జవ్వాజి పిట్టలు శారికాకీర, పంజరములు పట్టు పరిచారకులును, కోడెకాం డ్రదలించి కొట్టెడు రెడ్లు, పడివాగె తేజీలు పాలకీజోళ్ళు,అష్టభాగ్యంబుల అంగళ్ళవారు, సందడిపడ దండు చయ్యన కదలె' నట. యుద్ధవిరామసందర్భమున సైనికవిహార విలాసములకు సంబంధించిన వస్తువులు కూడ వారి వెంబడి యుండెడివని తోచుచున్నది. శారికాకీర పంజరములు కాశ్మీరకస్తూరి గంధకర్పూరము లందులకే కదా! విలాసవినోదములు కూడ రణరంగమున నొకవైపు సాగుచుండెడివి కాబోలు. ఇంకను అష్ట భాగ్యంబుల అంగళ్ళవారుగూడ నుండిరట. అనగా ఒక చిన్న పట్టణమే కదలి పోవుచుండెడి దన్నమాట. ఇటులనే నలగామరాజుసైన్యములు వచ్చి చేరు కొన్నప్పుడు 'ఆ దండులోపల అఖిలవణిజులును, సకలధాన్యంబులు సకలరత్నములు, బంగారు వెండియు బహుధా వితతి,సరిగవస్త్రంబులు సరసపుంబట్టు,పటములు ఘనతంతు పటములు మరియు,కాంస్యతామ్రశ్వేతక్రమభాండములు,రసవర్గములనెల్ల రంజనంబొప్ప, క్రయవిక్రయమ్ముల కావింతు రెపుడు, సౌందర్యఘనతచే సంపన్నమైన, వేశ్యవాటిక లొప్పు విశదంబు లగుచు, దారిద్ర్యమనునది దండులో లేదు, ధనధాన్య వృద్ధిచే దనరెడు లక్ష్మి, వేలంబు లోపల విలసిల్లుచుండు'. ధనధాన్యసమృద్ధియే కాక సైన్యములో వేశ్యలుగూడ నుండుట వింత. సైనికుల వినోదమునకై వేశ్యలనుగూడ నుంచెడువారు కాబోలు.

ఉభయ సేనలకు మధ్యన సాక్షిగా నొక స్తంభమును నిలుపుట పూర్వకాలపు యుద్ధధర్మమువలె గోచరించుచున్నది. బ్రహ్మనాయుడు మలిదేవాదులతో మేడపి నుండి కార్యమపూడికి బయలుదేరి త్రిపురాంతకము చేరుకొని అట తానిదివరకు 'శివపురిలోనుండి చేర్చినయట్టి, భూతరాట్ స్తంభము'ను పూజించి దానిని కదలించి బండ్లపై నిడుకొని రణరంగమునకు గొంపోయెను. బ్రహ్మనాయు డిదివరకు కల్యాణపట్టణపు వీరసోమునకు సహాయముగా బోయి శివపురి గాల్చి అచ్చటనున్న శక్తుల దెచ్చి త్రిపురాంతకములో నిల్పియుండెను. శివుడు

లయకారుడు గనుక, యుద్ధము లయకర్మ గనుక, యుద్ధరంగమున భూతరాట్ స్తంభము నిల్పెడువారు కాబోలు. ఆ స్తంభవర్ణన మిట్లున్నది. 'ఇనుము పిత్త కంచు హేమతామ్రముల, పంచలోహంబుల ప్రబలినదాన, నాలుగు ముఖముల నయమెప్ప మరియు, ఎనిమిది ముఖముల నెన్నికైనావు, ముగురు మూర్తుల నొక్క ముఖమంద నిలిచి, ఒకట సిద్ధులు మరి నొక్కట మునులు, గంగయు దుర్గయు కాలభైరవుడు, విలి భూదేవియు నీ యాసనముల, గంధర్వపతులతో కాచుచునుందు, ఒనుచు ప్రార్థనచేసి ఆ బ్రహ్మ పలికె.' ఇట్టి కంబమునకు వివిధాన్నముల కుంభము వోయించి 'ఘనమైన పోతుతో గావుచెల్లించి'రి. గావు చెల్లించుట యనగా బలివిచ్చుట. స్తంభమును శకటంబులపై నిడుకొని కార్యమపూడి రణరంగము చేరుకొన్న తరువాత 'చెన్నకేశవదేవు శ్రీపాదజలము, తివిరి పూజారులు తెచ్చుటజేసి, తులసి పత్రంబులతోడ తీర్థంబు, అచ్చోట చల్లించి అలరు లగ్నమున, శంకు సంస్థాపన సమ్మతిజేసి, నిక్షేపముగ రత్ననిచయంబులుంచి. తెచ్చిన కంబంబు ధీరతతోడ' నడికలన నిల్పి బలులను సమకూర్చిరి. ఇట్టి స్తంభము పూర్వకాలమున యుద్ధములందు సర్వసాధారణమో కాదో తెలియదుకాని పల్నాటి యుద్ధమున మాత్రమీ భూతరాట్ స్తంభము సాక్షిగా నిలచెను. స్తంభమును నిల్పి వీరులందరును గంగధార మడుగునకు బోయి'తమ తమ నామముల్ ధరలోన దరుచు, ప్రఖ్యాతి నొందంగ భక్తితో నందు, స్నానంబుజేసి (విశాల తీరమున), నిలిపిరి లింగముల్ నేమంబుతోడ.' ఈ లింగము లిప్పటికిని గంగధార మడుగునొద్దున గలగుడిలో నున్నవి. వీనికి పూజలు చేయుట నేటికి పరిపాటి.

సేనలందుండు జీతగాండ్రెన్ని విధములవారో గమనింపుడు. నలగాముడు నాగమ్మతో 'మనవద్ద బంట్లును మన్నెవారలును, పంక్తుల నన్నంబు భక్షించువారు, రొక్క జీతంబుల రూఢులౌవారు, క్షేత్రముల్ జేసుక జీవించువారు, పల్లెలు బుచ్చుక బ్రతికెడువారు, ఎలగోలు ప్రజలకు నెల్లర కిప్డు, పైనమై రమ్మని పరగ జెప్పింపు' మనెను. నలగాముడు భట్టుతో మలిదేవరాజు బలంబు తృణీకరించుచు 'సేనాధిపతి లేడు సేనలు లేవు, బలువైన శూలాల బంట్లును లేవు, కరితురంగంబులు కాలిమానిసులు, లెక్కింపగా నేమి లేవు వారలకు అని నిందించెను. నలగాముడు తన వెంబడి 'మూకలై యుండెడు మూలబలములును. ధాన్యముల్ గొనువారి ధన వేతనకుల, నెలగోలు ప్రజలను హెచ్చు వంటర్లను దీసికొని బయలుదేరెను. నలగాముని పైవికులు 'సురియలు పరిఘముల్ శూల సంఘంబు, ప్రాస ముద్గరములు పటుఖడ్గచయము, పేరైన చక్రముల్ భిండివాలములు, పరశువుల్ బల్లెముల్ బాకు కటార్లు, శార్ఙ్గముల్ ధనువులు శరధులు దాల్చి' యుండిరి. ఇవి నాడు వాడబడుచుండిన

ఆయుధములు. ఇంకను 'విను మినుము రాగి యిత్తడి కంచు. పెట్టిచేసిన యట్టి బిరుదులు గలవు'. బిరుదులన్నను ఆయుధములే. బంకెనలు, జల్లి కేడెములు, దండచక్రములు. గాయగోవాళాఖ్య బిరుదములుగూడ నుండెడివి. సామంత రాగోల మరియు సంకుళములుగూడ వాడుకలో నుండెను.

'కోళ్ళపోరాటము-గోవుయుద్ధము'లో తీరుతీరుల బాణములు ప్రయోగింప బడినవి. విలుమూకవారు గోవుపై 'చందురువంకలు చల్లజంపులును, పొట్టలపొంగులు పుణ్యతీర్థములు, యేరిదైవములు పిల్లయేముక లిర్వ్యలును, యొక పెక్కు నమ్ములు యోకవోకలును, తామరకూనలు తల్లిమెరుగులును, చీకటి మిణుగుర్లు జివురు గండెలును, గుండెలు ఛీతిలు కూతపెట్టులును, కుత్తికదీవులు కుప్పికోలలును' మొదలగు బాణములు ప్రయోగించిరి. బ్రహ్మనాయుడు గురిజాల విరుగబొడువ వచ్చినపుడు నాగమ్మతో నలగాముడు 'పన్నించు కోటపై పడగలు వేగ, గవనికి సూర్యేర కిదన పిక్రములు. వశిగొయ్య వడిశెల వాలు డొంకెనలు, గణికెలు దూలాలు గాలిదుందుభులు, మకర బిజ్జెలులను మంచి కత్తులను'సమాయత్త మొనర్పుమనెను.

యుద్ధరంగమున కేగిన నలగాముడు తన బలముతో 'చచ్చొక మేర్పడ సరసంపు భువిని, హేమ కుంభంబుల నెసగుచు నున్న, పటకుటీరంబుల పన్నుగా గట్టి మూల బలంబులు మొనగాండ్రు వచ్చి, కూర్చున్న ఘనమైన గొల్లెనల్ కూర్చి'దండు విడిసెను. యుద్ధమునకేగు వీరులను పెద్దలు దీవించుట యటుపిడిచి తమకన్న పిన్నలగు భార్యలు కూడ దీవించి పంపెడు నాచారమానాడు వీరధర్మముగా పరిగణింప బడుచుండెను. మాంచాల బాలచంద్రుని 'రతిరాజసుందరా రణరంగధీర............ శాత్రవ విజయంబు సమకూరు మీకు, ఈ యాయుధము వడి నిచ్చును జయము, కలియుగంబున మీకు ఘనపూజ లమరు'అని యాశీర్వదించి ఆయుధము నిచ్చెను. ఇట్టి సంఘటనలు 'దేశింగు రాజుకథ' 'బంగారు తిమ్మరాజు కథ' మున్నగు వానిలో గలవు. బాలచంద్రుడు యుద్ధరంగమున కేగినపుడు బ్రహ్మనాయుడు బోధించిన రణనీతి పరమోత్తమము. దానిని తృతీయప్రకరణమున నుట్టంకించితిని. నీతి గరపినతరువాత బ్రహ్మన్న 'తగినట్టి కర్పూరతాంబూల మిచ్చి, శంఖతీర్థ మొసంగి జయమొందు మంచు' పంపెను. వీరులకు యుద్ధమునకు పోవునప్పుడు విడె మిచ్చుటగూడ యుద్ధధర్మమే. దీనిని ఉర్దూలో "బీడా ఉఠానా'యందురు. నాయుడు వైష్ణవుడు గనుక శంఖతీర్థముకూడ పోసెను.

యుద్ధభీరువుల వర్ణనమును గూడ ఇదివరకే పేర్కొనియుంటిని. తృతీయ ప్రకరణమున వాని వివరములు గలవు. ఆ సందర్భమున 'బోయవారము షేమ పూర్వంబునందు, భుజమున కాయలు పూని కన్గొనుడి' యని కొందరు యుద్ధ భీరువులు బతిమాలిరి. బోయజాతివా రిప్పటికిని కలరు. గ్రామములందు పల్లకి మేనాలు మోయుట, చేపలు పట్టుట, ఓషధులు సమకూర్చుట, ప్రయాణములు (వార్తావహనము) చేయుట, తలారిపని చేయుట, నీరటికాండ్రుగా నుండుట, వారి వృత్తి. వారినే తెలగలందురు. ఆనాడు గూడ పల్లకీ మేనాలు మోయుటే వారి వృత్తియైయుండును. కనుకనే భుజములు కాయలుగాచె ననిరి. ప్రాణములు కాపాడు కొనుట కట్టి భీరువులు 'చనలేక భయమున చచ్చినవారి, మీద ద్రోసుక యుండి మెదలని వారు, చచ్చిన గజముల చాటున దాగి, పందతనంబున పడియుండువారు, పెండ్లాల దలచుక బిట్టేడ్చువారు, వల్మీకముల మీద వసియించువారు, గడ్డిలో జొరబడి కదలనివారు, పేళ్ళు చీకెడు వారు వెన్నిచ్చువారు'.

వీరారాధనముగూర్చి తృతీయప్రకరణమున నివేదించియుంటిని. మలి దేవరాజాదులు యుద్ధరంగమున భూతరాట్ స్తంభమును ప్రతిష్ఠించి వీరులతో గంగ ధార మడుగునకు జని స్నానముచేసి 'తమతమ నామముల్ ధరలోన దరుచు, ప్రఖ్యాతి నొందంగ భక్తితో నందు, స్నానంబు జేసి (విశాల తీరమున), నిలిపిరి లింగముల్ నేమంబుతోడ. ఈ లింగము లిప్పటికిని గంగధార మడుగు నొడ్డున గుడిలో పూజలందుచున్నవి. వీరుల స్మృతిచిహ్నముగా జరుగు జాతర, పూజ, మున్నగువానిలో ఈ విశేషము కూడ కలదు. ఇచ్చట లింగములనగా శివలింగములు కాదు. మలిదేవరాజు మరియు ఆతని యనుచరవీరవర్గముపై బ్రహ్మనాయని వైష్ణవప్రభావముండగా వారు శివలింగప్రతిష్ఠాపన మొనర్చిరని తలంపరాదు. తమతమ పేరులతో లింగముల నిలిపిరనుటచే తమనే నిలుపుకొనిరని తలంపవలయును. ఆ లింగములనే వీరులుగా నేటి ప్రజ లారాధింతురు.

ఇక 'కాటమరాజు కథ'లో గాననగు విషయముల నారయుదము. యుద్ధ రంగమున తమతమ గుడారము లెత్తించుటకు కాటమరాజు ఆజ్ఞాపించగనే పరిచారకులు 'తగ నొప్పగా వీరతమక మేర్పరచి, చిత్తరువ్వల గుడార్లు చెంత నెత్తించి, వచ్చ వన్నె గుడారు వరగ నెత్తించి, వలుబది స్తంభాల నామతీర్థంపు, గూడార్లు రత్నాల గూడార్లు ముత్తె, గూడార్లు పెలిపట్టు గూడార్లు చాల, నెండలకు గూడార్లు దండి వానలకు, జిడ్డుమైపపు బూత జెలగు గుడార్లు, వచ్చపట్టు గుడార్లు వందిటి గుడార్లు, నెడలేక యెత్తించి రెన్నో గుడార్లు,

గూవార్లకును పైదికుంద లెత్తించి, ఘనశరభశార్దూల గండభేరుండ, మొదలైన బిరుదు లన్నియు ముంద రెత్తించిరి. తమగ మనగా ఎత్తైన మంచె. వీరులు నిలిచి చూచుటకు ఏర్పరచినది వీరతమగ(క)ము. కాటమరాజుకు మాత్రము నలుబది స్తంభముల గుడార ముండెను. తక్కిన గుడారముల వర్ణన మానాటి కళలను వృత్తి విద్యలను సూచించును.

పల్నాటి వీరచరిత్రమందువలెనే కాటమరాజు కథలో గూడ ఇప్పుడు తెలియని ఆయుధము లెన్నియో కలవు. కొన్నింటిని మాత్రము నిఘంటువులు ఆయుధవిశేషములని చెప్పుచున్నవి.

'పట్టుకోట బసువరాజు పాపతిమ్మరాజు, కట్టుజల్లులు గదలు గుమిగూడి వచ్చె'
'చోడమండల మేలు సురియ సోమన్న, సబడీల మూకతో సరగ నేతెంచె'
'నందికనుమ నాగరాజు నాలుగువేల, యందెల గదలతో నప్పుడేతెంచె.'

పిన్నయ్య సేనలు 'కటార్లు జంజాళముల్ కత్తులు మరియు, వజ్రంపు మణులు గల వంకిణ్ణీల్ వాడి, నేజాలును సురాయి నేర్పుతోబట్టి, బాకుల చేబూని దాపురే యనుచు, ఛీఛీ యనుచును బాగుగానపుడు' వచ్చెను. ఇంతకుపూర్వమే కొమరిసిద్ధిరాజు 'విచ్చుకత్తులవారు ఏమతులైనడువ, జల్లిగదలును చాల జమిలి టెక్కెములు' తో వచ్చెను గండ గోపాలరాజు 'గొడ్డండ్లు కత్తులు గొబ్బున' దెచ్చెను. ఇరుపక్షములవారు 'బిరిసీల బల్లేల బడ బొడువంగ, రణమున నొరిగిరి రౌతు లందఱును' 'శరముల గుంతాలఁ జెల్లించి పొడువ'. 'చక్రాల కొందఱి శిరసులవేయ' 'సురకత్తి పిడికత్తి సురియలతోను' గోసంగులు యుద్ధము చేసిరి. బొల్లియావు యుద్ధమునకు భయపడి సిద్ధిరాజు సైనికులు 'అడ్డకత్తెలు భేదె లటు పారవైచి' పారిపోయిరి. 'అని పొడుషంబున నతివేగ గవిసి, మరి వేయ సాగిరి మల్లె మొగ్గలను చెల్లించివేసిరి చిల్లకోలలను' 'గన్నెరాకమ్ముల గాయాలు నాటె'. 'బొ త్తెపు నేజాల బొడువంగ సాగి, గోవును వేసిరి గోవింద యనుచు' 'పార్వతి యంబుల పరిలెట్టివారు, గుమ్మడి గింజల గుప్పుచు వంత, పంతగిరులను బూని పడుగున వచ్చి, యెడపక యావును వేసి రుక్కునను' 'కొంగవాల్ కత్తుల కోరసిగవారు, బంగారు పరుజుల పట్టు కత్తులవారు, వెండి కత్తులవారు వింత పరుజులవారు, దండైన పడిగె జంజాళములవారు, సన్నపు తియమణి సంకు టరిగెల వారు,' 'అర్ధనాటి జల్లులు అడ్డకత్తులవారు, మావు పిడిబాకులు మరి వరికిణీలు, నమరించి బిరుదులు అరహుదాలంది' 'కుపిప్పంప సాగిరి కొంకుగాలాబు' 'తమ మందుగుండును తగ బారుచేసి, సంధించి రంజకం పయ్యన బోసి, జానకితాళ్ళు చక్కంగ రాల్చి....తొడిబడ గురియించి తుపాకిగుండ్లు'. రంజకమనగా తుపాకి చెవిలో బోసెడు మందు. జానకి తాడు చెవి మందుకు విప్పంటించునది. ఇది ఉర్దూ పదము. ఆనాడు తుపాకులు

లేకున్నను కవి తరువాతివాడు కావున వాడినాడు. 'కాల్బలంబు జూచి కంపటీలెల్ల, వాలుగా నిలిచిరి సమరంబు సేయ' కంపటమనగా నొక ఆయుధము. కంపటములు ధరించువారు కంపటీలు కాబోలు. పద్మరాఘవుడు 'గాజువిల్లును కత్తి కనక బాణాలు వేయుచు, నార్చుచు పెన గూల్చె రిపుల' 'మ్రానువిల్లు గాదు మరి ఘాతవిల్లు' 'పలువగ నేజా తుపాకుల వారి, ననువైన యా ఛత్రి సాయుధమువారి' బహుశః ఇది ఛత్తీసాయుధము కావచ్చును. ఛత్తీస్ అనగా హిందీ భాషలో ముప్పదియారు. ఇన్ని విధముల ఆయుధములు దాల్చినవారని యర్థము. జానపదగేయములందు పలు చోటుల (బత్తీస్)ముప్పదిరెండాయుధములు వచ్చెనేకాని (ఛత్తీస్)ముప్పది యారు వచ్చుట ఇచ్చోటనే. కాటమరాజు వెంట నున్న సేనాసమూహము గమనింపదగినది.

> 'ఎనుబదెన్మిదివేల యేకాంగవీరు, లొలయ తొమ్మిదివేల యుత్తమాశ్వములు
> నూరిది నెన్మిదివేల చొక్కపు చిల్పిపెలను, నిరువదిలక్షల యీను గోడిగలు
> కరులను మూడువేల్ గద లైదులక్ష, పరగంగ లొటపిటల్ పదునైదువేలు
> పసగల పచ్చల పాలకీల్ నూరు, నరిగెలు నొకలక్ష యందలాల్ నూరు
> వెరసి ముప్పదివేల వింజామరములు, డమ్మామ లేనూరు డాలు లేనూరు
> కొమరొప్ప జగజంపు గొడుగు లేనూరు, తుపాకి విలుమూక తొమ్మిదిలక్ష
> పదునైన శూలాల బండ్లు నార్నూరు, గతి మన్నెవారును గాక సర్దార్లు
> వడిమి కొల్లకాండ్రు నాలుగువేలు, బహువాద్య మేళాలు పరగ నేనూరు'.

ఇందులోని సంఖ్యావివరము లన్నియు నతిశయోక్తులే. కాటమరాజుకు నిజముగా నంత బలము లేకుండెను. మరియును కాటమరాజు వెంట 'తుపాకి విలుమూక తొమ్మిదిలక్ష'లనుట నమ్మదగని విషయము. తుపాకులానాడు లేనేలేవు. బహుశః కథారచనమునాటికి తుపాకులు వచ్చియుండును. ఖడ్గతిక్కన యుద్ధమునకు వెడలునప్పుడు నల్లసిద్ధిరాజు తనికి 'గంధంబు కస్తూరి ఘనముగా బూసి, తబుకులో తములము తగగ నిప్పించి' వీరాచారము నెరపెను.

యుద్ధసన్నద్ధుడై దండువిడిసిన కాటమరాజు 'ఆవీర తమకాన నపుడు గూర్చుండి, భీమదుర్యోధనుల బిరుదులు వినుచు, రహి వీర తమకాన రామాయణమ్ము, వినుచును పొగటాల వేడ్క నాడుచును, బగరకు నెదురెదురు పరికించుచుండె'నట విరామ కాలమున యుద్ధవీరుల కిట్టి వేడుక లన్నికాలములం దుండెను. గుఱ్ఱముపై నున్న తిక్కనతో పోరాడుటకు 'వేవేగ రుద్రుండు వృషభంబు నెక్కె'ను. ఆనాడు యుద్ధమునందు వృషభములు కూడ వాహనములుగా నుపయోగపడుచుండెనో

లేదా బ్రహ్మరుద్రయ్య వీరశైవు డగుటచే శివునివలె వృషభ (బసవ) వాహను డయ్యెనో తెలియరాదు. ఎద్దులు బరువులు మోయుటకు బండ్లు లాగుట కుపయోగ పడుట మాత్రము సాధారణమే. ఐనను పల్నాటియుద్ధమున ఆవులు యుద్ధము చేయుట (మందపోటు), కాటమరాజు కథలో బొల్లియావు రణరంగమున వీర విహారము చేయుట చూడగా ఆవులు ఎద్దులు కూడ, ఏనుగులు గుఱ్ఱములవలెనే వీరకర్మల కుపకరించుచుండెనని యూహింపవచ్చును.

పల్నాటివీరులకు సంబంధించిన గాథలందు మన పూర్వుల యుద్ధధర్మములు కాననగును. 'గురిజాల యుద్ధము పూర్వభాగము'న గురిజాల విరుగబొడువ బోవుచున్న బ్రహ్మనాయునికి తల్లి శీలమ్మ యొనర్చిన యుపదేశ మామె ధర్మ నియతికి పతాక మెత్తుచున్నది. బ్రహ్మనాయునితో నామె 'చొచ్చి పొడువకు మన్న చొరబారి నీవు, అంతకంతకు దాగి అధములై యున్న, కట్టెమోపులవారి కలకూలివారి, దండించి శీలాల తగ నుండువారి, పసులకాపరులను బలుసుకూరాకు, తిని యడవులలోన దిరిగేటివారి,చెన్నార గుళ్ళలో జేరినవారి... సెలకొని రాత్రుల నిద్రించరేని,ఆవేళ బొడుచుట యధిక పాపంబు....ప్రొద్దుగూకువేళ బొడువ దోషంబు, పదపటి ప్రొద్దున పాడి ధేనువుల, పాలకై పశువుల పరగ నురుద్రాళ్ళ.తలకోలలను బట్టి తనరార దితుక,నావేళ కోటపై నార్పంగ రాదు....భస్మముగా గాలి పశులు సమసినను, అటువంటి దోషంబు అణగ దెన్నటికి' అనియును బ్రాహ్మణుల, భట్ల, దాసరుల,భక్తుల, స్త్రీల, శిశువుల, పశువుల, శరణార్థుల, చంపగూడదనియును ధర్మబోధన మొనర్చెను.

కాటమరాజు కథకూడ మన పూర్వయుద్ధధర్మములకు పట్టుగొమ్మ. ఖడ్గ తిక్కన యుద్ధమునకు వచ్చినపుడు యాదవుల పక్షమున నున్న చల్ల పిన్నమనేడు 'బుద్ధి చాలనియట్టి భూసురోత్తముడు,యుద్ధంబు సేయ నుద్యోగించినాడు, సర్వథా బ్రాహ్మణుడు చావకపోడు, బ్రహ్మహత్య మనకు బాపుకోరాదు, అని బ్రాహ్మణుని జంపమైతిమే నిపుడు, ఇందఱ నితడు మాయింపకపోడు, చంపకుండగరాదు చావగారాదు, ఇందుకు గతియేమి యెఱిగింపు మన్న'యని బ్రహ్మరుద్రయ్య నడిగెను.యుద్ధమున గూడ బ్రహ్మహత్యా పాతకమునకు భయపడి యాదవులు తిక్కన్న నెదుర్కొనుటకు బ్రాహ్మణుడగు బ్రహ్మరుద్రయ్యను బంపుట యానాటి యుద్ధధర్మమును వ్యక్తమొనరించుచున్నది.

పిన్నయ్య తన సేనలను నల్లసిద్ధి సైన్యముపై పురికొల్పునపుడు 'ఉదుట వడవుల బట్ట నురికించి రండి, తొణకి చంపకుడన్న దోషంబువచ్చు. మార్కొని పిల్చిన మరవకుండంగ, చెండాడి చంపను సెలవని పలికె'ను. పారిపోవువారిని చంపరాదనియు

కేవలము మార్కొన్నవారినే చంపవలయుననియు యుద్ధధర్మము. ఈ ధర్మమును పాటించిన యా గొల్లదొర యెంతటి ధర్మనిష్ఠాగరిష్ఠుడో !

సిద్ధిరాజు వీరనాయకుల నప్రమత్తులై యుండుడని హెచ్చరించునప్పుడు సైనికవ్యవస్థకు సంబంధించిన మరికొన్ని విశేషములు తెలియుచున్నవి. 'భద్రదేశముల మీద బట్టి దివిటీలు, నిద్ర గాచుండుడీ నీవు నేననక, యొంటరిగా ద్రను నొనరింగ బిలిచి, బంటుకు బారెడు ప్రహరి వేయించి, యావెన్క వెల్వేరిసి యమరంగ విగుడి, వలలన్ని చాలుగా వడ్డుడీ చక్క, వలలకు నెడముగా వాటమ్ముగాను, జిలుకు టమ్ములు పాతి శీఘ్రంబుగాను, దగనొప్ప వాదాలు త్రవ్వించి యపుడు, కాలుపల్ జీయుడీ కందకాల్ వెంట, నాయకులు దొరలు నందఱు మీరు, నాయత్తపడరోయి యశ్వాల నెక్కి' 'కోవరము తిరుగంగ .......మూవాత పెమ్మినేని మునియుక్కశాన, చెలువుగా నుంచుడీ సేనలలోను'. సాయంకాలము యుద్ధమాపుటకై 'కూచిదార పట్టైను కొమ్ము కసినేడు' దీనినే ధర్మదార యందురు. కూచి యనునది ఉర్దూపదము. కూచ్ కర్ నా యనగా సేనలు (మరలి) తరలి పోవుట.

పల్నాటివీరచరిత్రమందువలెనే దీనిలోగూడ 'సూర్యసోమ వీథుల జొచ్చి నరుకంగ, ధరమీద పీనుగల్ తరచుగా నుండె'నని కలదు. సైన్యమున సూర్య సోమవీథు లేర్పరుపబడెనని భావింపనగును. శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు సూర్యవీథులన పొడుగుగా (నిలువు) తూర్పునుండి పడమరకుండు వీథులనియు సోమవీథులన (నడ్డముగా) ఉత్తర దక్షిణముల కుండు వీథులనియు నర్థము చెప్పిరి

పల్నాటి కథలో వర్ణింపబడినటులే కాటమరాజు కథలో గూడ యుద్ధ భీరువుల వర్ణనము కలదు. 'తాటిబొందుల నందు దాగేటివారు, చచ్చినవారి క్రింద జొచ్చేటి వారు, కడు వేగ దొంతులై కదవలు న్నట్లు, తలల గుడ్డల నందు దాగేటి వారు' వర్ణింపబడిరి.

పల్నాటి యుద్ధము ముగిసిన తరువాత పీనుగులపై భూతప్రేతపిశాచములు నక్కలు కాకులు గద్దలు విహరించిన బీభత్సదృశ్యము వర్ణింపబడినది. కాటమరాజు కథలో నట్టి బీభత్సము కలుగకుండుటకై ప్రార్థింపగా వీరగంగ భక్తిరన్న కాశినుండివచ్చువరకు రణరంగమును 'ఈగ వ్రాలక యుండ నీలెయిడకుండ, కాకులా రణమందు గదిసి రాకుండ, నక్కలు రణమున నడయాడకుండ, పీచుకు భూతాలు నీగి రాకుండ, కౌజుకు గ్రద్దలు కొరాడకుండ, నాకాశపక్షులు పఱ్ఱు వంచకుండ, మేదిని బందులు మెడ వాల్పకుండ, పుట్టలో చీమలు పొలిసి రాకుండ, పెట్టిన తిరుమణి పేడెత్తకుండ, పూసిన

గంధంబు పూరిచిల్లకుండ,కాంతిగల దేహాలు కందిపోకుండ' కాపాడెను. ఈ వర్ణన మంతయు ధర్మయుద్ధతత్వమును వర్ణించుటకే చేయబడినది.

కాటమరాజు కథలో నడచిన యుద్ధమున ఒక్కొక్క వీరుడొక్కొక వీరు నెదుర్కొనుట కాననగును. కాటమరాజు పక్షమువారు తిక్కన్నపై బోవునప్పుడు బ్రహ్మహత్యాపాతకమునకు వెరచుట,అతని నెదుర్కొనుటకు మరల బ్రాహ్మణునే పంపుట, పారిపోవువారిని చంపకుండుట, వారి ధర్మనిష్ఠను సూచించును. కాటమరాజాదులకన్న నల్లసిద్ధి ధర్మనిష్ఠ కలవాడుగా దోచును. ఏలయన కాటమ రాజుకు నిజముగా సిద్ధిరాజు కున్నంత సేనలు లేకుండెను అతడు తన సేననంతటిని ఒక్కుమ్మడి యాదవులపై పురికొల్పినచో మొదటి దినముననే యుద్ధము సమాప్తమై సిద్ధిరాజుకు జయము లభించెడిది. కాని యాదవుల పక్షమునుండి వచ్చిన ఒక్కొక్క వీరు నెదుర్కొనుటకు సిద్ధిరాజు కూడ తన పక్షమునుండి ఒక్కొక్క వీరునే పంపెను. చివరకు కాటమరాజు నెదుర్కొనుటకు, రాజుకు సమానుడగువాని తానుగా నెంచుకొని,యుద్ధమునకు ఓగెను.ఇంకొక వీరునెవ్వని బంపక తానే యుద్ధముచేసి నిహతుడయ్యెను. భారతమున నొక్కొక్కరు సేనాధిపత్యము వహించి పోరాడినటుల కాటమరాజు కథలోగూడ ఒక్కొక్క వీరుడు ప్రతినిధిగా పోరాడినట్లు కలదు. కాటమరాజు నిష్ఠగూడ అట్టిదే. భట్టు రాయ బారమున యాదవుల భట్టు నల్లసిద్ధి భట్టుతో 'తపసుకు తట్టువ బంటుకు బంటు,రాజుకు రాజు కావారికి కంపటీడు' అని తమ యుద్ధధర్మమును చెప్పెను.

అనుబంధమున గల 'భట్టు రాయబారము' లో సిద్ధిరాజు పంపగా పుల్లరి యడుగవచ్చిన భట్టుతో కాటమరాజు కొలువులో కాటమరాజు పక్షమున మాట లాడెడు భట్టు 'ఏమి నీ మనసున నేమికోరినను, గామితార్థము లిచ్చు కాటమరాజు, దాసి వేశ్యలు రెండు తప్పక విడిచి, యెంతైన నాశించి యేమి యడిగెదవు, అడుగుమా రాయ శృంగావళి భట్ట'యనుటచే కాటమరాజు ధర్మనిష్ఠ స్పష్టమగుచున్నది. కాటమరాజు దాసీత్వము మరియు వేశ్యాత్వము సహింపనివాడని తెలియనగును. పల్నాటి వీరచరిత్రమున యుద్ధమునకై బయలుదేరిన సేనలవెంబడి దాసీలు మరియు వేశ్య లుండిరి కాని కాటమరాజుకథలో లేరు. ఇది రచయిత కాలమునాటి సంఘసంస్కార పరిణామమైనను, కాటమరాజుధర్మనిష్ఠను మాత్రము సూచించు చున్నది.

'భట్టు రాయబారము'న యాదవులభట్టు సిద్ధిరాజు భట్టుతో కాటమరాజు ప్రతాపమును వర్ణించుచు,సిద్ధిరాజును నిందించును. 'పారిపోవగ జంపు పోర బొమ్మ

గిట్టు'. 'మీ సిద్ధిరాజును మా ఎడ్డు కాలి బొమ్మ' 'తర్లిరాని రాజుకు దరువు పోలిబొమ్మ, చెల్లని రాజుకు చెనికాలి బొమ్మ'యనెను. శత్రువుల నవమానించుటకై వారి ప్రతిమలు నేయించి తమ్మపడిగలలో నుంచుట కాలికి గట్టుకొనుట, గండపెండేరములందు చెక్కించుట ప్రత్యేకముగా తెలుగునాట కాననగు విషయము. నాచనసోమనాథుడు 'పంతముతో బాహారమున బట్టుదు పాసిక బొమ్మగట్టుదున్'1 అనియును, శ్రీనాథుడు 'దాకాలి గండపెండారంబు దాపున బొమ్మలై వైరిభూభుజులు వ్రేల'2 ననియును వ్రాసియున్నారు. బొమ్మగట్టుట విషయమై కీ. శే. సురవరం ప్రతాప రెడ్డిగారు3 శ్రీనేలటూరు వెంకట రమణయ్యగారును4 చెప్పియున్నారు. ఇటువంటిదే మెడకు త్రాడుగాని గొలుసుగాని వేసి లాగి వీథులవెంట ద్రిప్పెడు నాచారము. శత్రువు చేజిక్కినప్పు డాతని మెడకు పలుపుగట్టి వధ్యస్థానమునకు గొంపోవుచుండువారు. శత్రుపక్షమున వచ్చిన రాయబారికి మెడకు పట్టుబట్ట త్రాడుగా వేసి శత్రురాజు నపమానపరచినట్లు దలంచెడువారు. యాదవులభట్టు సిద్ధిరాజు భట్టుతో 'పట్టుకోకల జుట్టి పలుపుగా బెనచి, నాకు బెనచుట కాదు మీ కల్నియందు, తగ సిద్ధిరాజునకు నామెను పలుపు'అని కట్నములిప్పించి రాయబారముపొసగనీయక తిరిగిపంపించెను. ఈ విషయమే మరింత విపులముగా 'పట్టుకోకను నొక్క పలుపుగా నెంచి, భట్టుకు మెడకు బట్టి పెరిగి భూపాలు, దనివి నాగట్టుతో నందలు పినగ, నిను జేయుటయుగాదు నిన్నేలు రాజు, పూరి మెడలను సింపొంద గలనిటాపున సిద్ధులే దామెన యనుచు, దెలసియుండగ పీకు నెలలు చెప్పితిమి. తలకపు మసి భట్టు దగ్గర నిలిచి'యని వర్ణించినపుడు కాననగును.

కాటమరాజునకు సాయము ఐతమరాజాదులు పోయినప్పు డెంత సన్నాహములతో కదలిరో గమనింపుడు. 'చక్కెర కటార్లు సన్నబియ్యములు బుడ్లులు గంధపొడి పసుపు జవ్వాది, పోకలు కింట్లాలు పొన్నుటాకులును, చేకొనియె. కొంత చేరువగ నడువ, బట్టుతిపాసీలు పరజాలు కొన్ని, దిట్టముగ ముందర ధీరత నడువ బళ్లై మందాలును పదుపులు దిండ్లు, బెట్టైల చీరెలు బెద్ద యడవములు, గొట్టరి యెద్దుల గొబ్బున నడుప, పుట్టడి సేయంగ ముందుగా గదలె, గొప్పైన గూడార్లు గోద పరాక లొప్పుగా నెత్తిన ఎద్దులు నడచె, నటుముందుగా జెండ అదికొని కదలె, నటు వెన్క సేనలు నంతయు గదలె, పిలుమూక యూడెలు వెన దుపాకులును, వెలుగొందగా మా పెల్లఛత్రములు, గంభీర వాద్యముల్ గాలికొక్కములు, శంఖుని పల్లకి సరసనే కదిలె

---

1. ఉత్తరహరివంశము. 3-117. 2. కాశీఖండము-పీఠిక, 45.
3. ఆంధ్రులసాంఘిక చరిత్ర. 4. వెలుగోటివారి వంశావళి.

'దేశింగురాజు కథ'లో భారతీయుల యుద్ధధర్మము చక్కగా నగుపించును. యుద్ధమునకు బోవునప్పుడు దేశింగు తన వెంటనున్న సైనికులకు 'పరుగిడువారల వెంబడి మీరలు పట్టవద్దు సుమ్మీ, జరిగినవారల జడిసినవారల చంపవలదు సుమ్మీ, యేమరి యుండినవారల మీరలు ఎదిరించగ వలదు, మైమరపియు లాహిరిచే నుండిన వారిని జంపగ వలదు'అని ధర్మోపదేశ మొనర్చెను. యుద్ధమున గూడ బ్రాహ్మహత్య చేయరాదని దేశింగు మతము. కనుకనే ఆరణి వెంకట్రావు 'నిలువంగీలను చించి వడిగ తా జందెము చూపుచును, చలము చేయకుము బ్రాహ్మణుడను నను చంపగదగ దనెను'. అప్పుడు 'చూచి బ్రాహ్మణుని చంపగూడదని సొంపుగ దేశింగు'ఆరణి వెంకట్రావును ప్రాణములతో విడిచిపెట్టెను. బొబ్బిలి కథ యందువలెనే దేశింగురాజు కథలో గూడ 'రామ రామ యనునంత కాలము రాజ్య మేలుదామా'యను మాటయే వీరులకు(war cry) యుద్ధఘోష మైనట్లున్నది. దేశింగురాజు సైన్యములకు కత్తులు బల్లెములు మున్నగు ఆయుధములే యుండెను. కాని నవాబు సైన్యమున తుపాకులవంటి మారణాయుధము లున్నట్లు వర్ణింపబడినది. మహత్ఖానుడు తుపాకి దెబ్బచే చచ్చి పోయెను. బంగారునాయు డాతని చంపుటకు సైనికులకు 'ఫయిర్ ఫయిర్' అని ఉత్తరు విచ్చెను. ఫయిర్ అను ఇంగ్లీషుమాట తరువాత చేరినదిగా తోచును. మాంచాల బాలచంద్రుని దీవించి యుద్ధమునకు పంపినటులే దేశింగురాజు భార్య దేశింగును దీవించి పంపెను.

కాటమరాజు కథలో వలెనే బొబ్బిలి యుద్ధమున గూడ

'ఎండలాకు ఎత్తించినారు ఎఱ్ఱపట్టు డేరా, నీడలాకు ఎత్తించినారు నీలిపట్టు డేరా
మంచులాకు ఎత్తించినారు మైనపులండీలు, రామసందు డేరాలోగా కొలువు తీరినారు.'

బొబ్బిలి యుద్ధమున ఫిరంగీలు తుపాకులు మందుగుండు సామానులు మున్నగు మారణాయుధములు ఫ్రాంసీల బూచి మరియు విజయరామరాజు వాడియుండిరి. బొబ్బిలి వీరుల కిట్టి సాధనములు లేవు. బొబ్బిలి మీదికి పోవునప్పుడు బూచి ఫిరంగి గుండ్లను బండ్ల కెక్కించుట 'రాచూరి పొగబాణము బండ్లమీద వేసిరి'యని కలదు. బహుశః ఇది ఫలీతావంటిదై యుండును. తుపాకి మందును బొబ్బిలి పదకర్త నల్లమందనెను. నల్లగా నుండుటచే నల్లమందనెను కాబోలు. దండెత్తిపోయినవారు గుడారములు విలిపి 'ఫ్రాంచివారి దండి కోడిదా యెత్తించినారూ, రాజుగారి తెల్లజండా ఎత్తించినారూ'. ఫ్రాంసువారికి కోడి, విజయనగర రాజులకు శ్వేతకేతనము లాంఛనములై యుండును.

ధర్మారాయుడు రాయబారమునకు పోయినప్పుడు తన వెంటనున్న వెలమ వీరుల నొకచో నిల్పి రాయబారము కుదురక కలహమే సంభవించినచో 'చేత

గట్టు'. 'మీ సిద్ధిరాజుకు మా యెద్దు కాలి బొమ్మ' 'తర్లిరాని రాజుకు దడుపు పొలిబొమ్మ, చెల్లని రాజుకు చెడికాలి బొమ్మ'యనెను. శత్రువుల నవమానించుటకై వారి ప్రతిమలు చేయించి తమ్మపడిగలలో నుంచుట కాలికి గట్టుకొనుట, గండపెండేరములందు చెక్కించుట ప్రత్యేకముగా తెలుగునాట కాననగు విషయము. నాచనసోమనాథుడు 'పంతముతో దొహరమున బట్టుదు పాసిక బొమ్మగట్టుదున్'1 అనియును, శ్రీనాథుడు 'డాకాలి గండపెండారంబు దాపున బొమ్మలై వైరిభూభుజులు వ్రేల'2 ననియును వ్రాసియున్నారు. బొమ్మగట్టుట విషయమై కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారు3 శ్రీనేలటూరు వెంకటరమణయ్యగారును4 చెప్పియున్నారు. ఇటువంటిదే మెడకు త్రాడుగాని గొలుసుగాని వేసి లాగి వీథులవెంట ద్రిప్పెడు నాచారము. శత్రువు చేజిక్కినప్పు డాతని మెడకు పలుపుగట్టి వధ్యస్థానమునకు గొంపోయెడువారు. శత్రుపక్షమున వచ్చిన రాయబారికి మెడకు పట్టుబట్ట త్రాడుగా వేసి శత్రురాజు నవమానపరచినట్లు దలంచెడువారు. యాదవులభట్టు సిద్ధిరాజు భట్టుతో 'పట్టుకోకల జుట్టి వలుపుగా బెనచి, నాకు బెనచుట కాదు మీ కల్నియందు, తగ సిద్ధిరాజులకు దామెన వలుపు'అని కట్నములిప్పించి రాయబారముపొసగనీయక తిరగిపంపించెను. ఈ విషయమే మరింత విపులముగా 'పట్టుకోకను నొక్క పలుపుగా నెంచి, భట్టుకు మెడజుట్టి పరగ భూపాలు, దవియె నాభట్టుతో నందఱు వినగ, నిను జేయుటయుగాదు నిన్నేలు రాజు, లేవురి మెడలను నింపొందగలని, తావున నిట్టులే దామెన యనుచు, దెలసియుండగ నీకు దెలియ జెప్పితిమి, తలకకు మని భట్టు దగ్గర నిలిచి'యని వర్ణించినపుడు కాననగును.

కాటమరాజునకు సాయము ఐతమరాజాదులు పోయినప్పు డెంత సన్నాహములతో కదలిరో గమనింపుడు. 'చక్కెర కట్నాలు సన్నబియ్యములు, బుక్కాలు గందవొడి పునుగు జవ్వాజి, పోకలు కంట్లాలు పొన్నటాకులును, చేకొని యొక కొంత చేరువగ నడువ, బట్టుతివాసీలు పరజాలు కొన్ని, దిట్టముగ ముందర ధీరత నడువ, బట్టె మంచాలును పరుపులు దిండ్లు, బెట్టెల చీరెలు బెద్ద యడపములు, గొట్టడి యెద్దులు గొబ్బున నడువ, ముట్టడి నేయంగ ముందుగా గదలె, గొప్పైన గూడార్లు గోడ సరాతు లొప్పుగా నెత్తిన యెద్దులు నడచె, నటుముందుగా జెండ అదికొని కదలె, నటు వెన్క వేసలు వంతయు గదలె, పిలుమూక యీటెలు వెస దుపాకులును, వెలుగొందగా నూడ వెల్లఛత్రములు, గంభీర వాద్యముల్ గాలిటెక్కెములు, శంభుని పల్లకి సరసనే కదిలె'.

---

1. ఉత్తరహరివంశము. 3-117.
2. కాశీఖండము-పీఠిక, 45.
3. ఆంధ్రులసాంఘిక చరిత్ర.
4. వెలుగోటివారి వంశావళి.

'దేశింగురాజు కథ'లో భారతీయుల యుద్ధధర్మము చక్కగా నగుపించును. యుద్ధమునకు బోవునప్పుడు దేశింగు తన వెంటనున్న సైనికులకు 'పరుగిడువారిం బట్టిపడి మీరలు పట్టవద్దు సుమీ, జరిగినవారల జడిసినవారల చంపవలదు సుమీ, యేమరి యుండినవారల మీరలు ఎదిరించగ వలదు, మైమరచియు లాహిరిచే నుండిన వారిని జంపగ వలదు' అని ధర్మోపదేశ మొనర్చెను. యుద్ధమున గూడ బ్రాహ్మహత్య చేయరాదని దేశింగు మతము. కనుకనే ఆరణి వెంకట్రావు 'నిలువంగీలను చించి వదీగ తా జందెము వాపుచును, చలము చేయకుము బ్రాహ్మణుడను నను చంపగదగ దనెను'. అప్పుడు 'చూచి బ్రాహ్మణుని చంపగూడదని సొంపుగ దేశింగు' ఆరణి వెంకట్రావును ప్రాణములతో విడిచిపెట్టెను. బొబ్బిలి కథ యందువలెనే దేశింగురాజు కథలో గూడ 'రామ రామ యనునంత కాలము రాజ్య మేలుదామా' యను మాటయే వీరులకు (war cry) యుద్ధఘోష మైనట్లున్నది. దేశింగురాజు సైన్యములకు కత్తులు బల్లెములు మున్నగు ఆయుధములే యుండెను. కాని నవాబు సైన్యమున తుపాకులవంటి మారణాయుధము లున్నట్లు వర్ణింపబడినది. మహత్ఖానుడు తుపాకి దెబ్బచే చచ్చి పోయెను. బంగారునాయు డాతని చంపుటకు సైనికులకు 'ఫయిర్ ఫయిర్' అని ఉత్తరు విచ్చెను. ఫయిర్ అను ఇంగ్లీషుమాట తరువాత చేరినదిగా తోచును. మాంచాల బాలచంద్రుని దీవించి యుద్ధమునకు పంపినటులే దేశింగురాజు భార్య దేశింగును దీవించి పంపెను.

కాటమరాజు కథలో వలెనే బొబ్బిలి యుద్ధమున గూడ

'ఎండలాకు ఎత్తించినారు ఎఱ్ఱపట్టు డేరా, నీడలాకు ఎత్తించినారు నీలిపట్టు డేరా

మంచులాకు ఎత్తించినారు మైనపులందీలు, రామసందు దేరాలో గా కొలువు తీరినారు.'

బొబ్బిలి యుద్ధమున ఫిరంగీలు తుపాకులు మందుగుండు సామానులు మున్నగు మారణాయుధములు ఫ్రాంసీల బూచి మరియు విజయరామరాజు వాడియుండిరి. బొబ్బిలి వీరుల కిట్టి సాధనములు లేవు. బొబ్బిలి మీదికి పోవునప్పుడు బూచి ఫిరంగి గుండ్లను బండ్ల కెక్కించుట 'రాచూరి పొగబాణము బండ్లమీద వేసిరో' యని కలదు. బహుశః ఇది ఫలీతావంటిదై యుండును. తుపాకి మందును బొబ్బిలి పదకర్త నల్లమందనెను. నల్లగా నుండుటచే నల్లమందనెను కాబోలు. దండెత్తిపోయినవారు గుడారములు నిలిపి 'ఫ్రాంచివారి దండి కోడిదా యెత్తించినారూ, రాజుగారి తెల్లజండా ఎత్తించినారూ'. ఫ్రాంసువారికి కోడి, విజయనగర రాజులకు శ్వేతకేతనము లాంఛనములై యుండును.

ధర్మారాయుడు రాయబారమునకు పోయినప్పుడు తన వెంటనున్న వెలమ వీరుల నొకచో నిల్పి రాయబారము కుదురక కలహమే సంభవించినచో 'చేత

ముందు వేగను మీరు కోటకు విడిచి దా, క్రిందిమీద చెయ్యండియ్యా ప్రాంచి వేరాలు' అని చెప్పెను. వార్తలు గొంపోవుటకు యుద్ధములందు వేగుల మున్నగు పక్షులు వాడబడుచుండెడివని తెలియనగును. యుద్ధమునకు సంబంధించిన ఇట్టి విశేషము లీపదములో నింకను గలవు. 'ఉడుము తోక పట్టుకోని లగ్గల కెక్కిరి'. ఉడుముల తోకలు పట్టుకొని లగ్గల్వట్టుట, అలంగ మెక్కుట, రవిడిగుండ్లు దొరలించుట వంటివి కలవు. 'ఎద్దుల కష్టుడు కాగుతున్నది అంబడీ దానాలు':'నెరగించుమని త్రిప్పినారు వాసిన మానులు'?శత్రువులు పుట్టకోట క్రిందికి వచ్చి 'యూభై రెండు రేఖాలుగా మొహర్లా లెత్తిరి'.మూలబురుజు క్రింద'ఆరువైమూడు రేఖాలాగ మొహర్లా లెత్తికి'ఉత్తవంటి రేఖగా వ్యూహరచనము గావించిరి కాబోలు.ఉర్దూలో వ్యూహమును మోర్చ యందురు.

ఓటమి తథ్యమని గుర్తెరిగిన బొబ్బిలివీరులు 'ముసలివారిని బట్టియప్పుడు గొంతులు కోసీరీ, యడాయడా బాలల బట్టి గొంతులు గోసీరి'-శత్రు హస్తగతము గాకుండ తమవారిని తామే చంపుకొనుట, నాశము చేయుట నేటి Scorched earth Policy వంటిది. ధర్మారావు భార్య రమణమ్మ గర్భిణి యగుటచే నరసారావు ఆమెను చంపడు. గర్భిణుల చంపుట వీరధర్మము కాదు. ఆమె ముందొక కత్తిని పడవేయగా నామె తనకుతానే పొడుచుకొని చచ్చెను. ఆతరువాత నరసారావు గర్భస్థశిశువును నరికి చంపెను. వీరి నందరి నీతీరుగా చంపుటకు రంగారావు గారు నర్సారావుకు విభూతి మంత్రించి యొసగ నాతని కొడలు తెలియని కోపావేశము కలిగెనట. బొబ్బిలివీరుల మగటిమి వర్ణింపరానిది. పసిపాప యగు వెంకట్రావును బొబ్బిలివారు తప్పింప నాతడు బూసి చేతికి చిక్కెను.విజయరామ రాజాదులాతని బొబ్బిలివాడో కాదోయని పరీక్షించినప్పుడా బాలుడు పండ్లుగాని, ఆటవస్తువులుగాని ముట్టక కత్తి చేపట్టుట బొబ్బిలివీరుల శౌర్యవైభవమునకు జయపతాక మెత్తినది. బొబ్బిలి వీరుల యుద్ధరినాదములు పెక్కు విధములు. 'హోళ్యాహోళ్యాలు యని తరిమి నరికినాడు'.'శలగో శలగో యంటు వారు వస్తు వున్నారు' 'రామరామ యనునంతకాలము రాజ్య మేలలేము. జగము యుండువరకు మనము యుండబోతామా, ఇచ్చట చచ్చినవారికి చాల వీరస్వర్గము' అను మాటలు పెక్కుచోటుల వచ్చినవి. ఇవి Ballads వీరగీతములకుండు ముఖ్య లక్షణములం దొకటగు (Repetition) పునరావృత్తి లక్షణముగా చెప్పుకొనవచ్చును. యుద్ధమునకు బయలుదేరునప్పుడు వెంగళ్రాయుడు తానెక్కు బారాతేజీని శృంగారించి 'తేజీయొక్క నాల్గు పాదములు తానే కడిగేనూ,పాదములకు పూజ చేసెను వెంగళ్రాయుండు'ఇదికూడ వీరాచారము కావచ్చును.

యుద్ధరంగమున దిగిన ఉత్తమాశ్వముల కన్నిటికి జానపదకవులు చిత్ర విచిత్రములగు నామకరణము లొనర్చిరి. పెద్దాపురిప్ప కోడి పందెముల కథలో వత్సవాయి రాజుగారి గుఱ్ఱము మేఘరంజి, కాటమరాజు కథలో అల్లుతాడెన్న ఎక్కిన గుఱ్ఱము మేఘమతి, కరియావులన్న ఎక్కిన గుఱ్ఱము గండకత్తెర, దేశింగురాజు గుఱ్ఱము బారాహజారి, మహత్ఖాని గుఱ్ఱము నీలవేణి, బొబ్బిలి కథలో వెంగళ్రాయుని గుఱ్ఱము బారాతేజి యట. గుణగణములందు దేశింగు బారాహజారికి వత్సవాయి తిమ్మరాజుగారి గుఱ్ఱము తమ్ముడు. బంగారుతిమ్మరాజు కథలో నాతని గుఱ్ఱము పేరుకూడ మేఘరంజి.

'లంకాయాగము' పాటలో రామరావణయుద్ధమున 'గజకర్ణంబులు గోకర్ణంబులు ఘనమైన ఝల్లీ ఝెలూ', మున్నగు ఆయుధము లుపయోగింపబడెను.

## విశ్వాసములు - ఆచారములు

ప్రపంచ మింత నాగరకము పెంచుకొన్నను కొన్ని విశ్వాసములను విడువ లేదు. అపశకునములపై నాధునికులకుగూడ నమ్మకము కలదు. ఇది బహుశః మనుజుని స్వార్థతత్వమునకు సంబంధించిన దగుటచేకాబోలు ఇంతగా పాతుకొని పోయి వ్రేళ్ళు దన్నినది. కోరికోరి యెవడు దుఃఖము దెచ్చుకొనును. తుమ్మినచో కార్యము చెడునని ఎన్నడో చెవిలో పడిననాటినుండి యది జీవితాంతమువరకు గింగురుమనుచునే యుండును. శుభమునకు బయలు దేరగనే యెవరైన తుమ్మినచో ఎంతచదువుకొన్నవాడైనను కొంత వెనుకముందాడును. ఇప్పటివారికే యిటులుండ పూర్వులకు శకునములపై నెంతపట్టింపు లుండెడివో చెప్పనక్కర లేదు. కనుకనే శకునపక్షులు, శకున శాస్త్రజ్ఞులు, పూర్వము రాజసభాంతరాళములం దుండువారు. మంచిచెడుగులు తెలుపుచుండుట వారి కర్తవ్యమైయుండెను. ఈ శకునములపట్టింపు కేవలము భారతీయులకే కాదు. ఏదో యొక రూపమున ప్రపంచమం దన్నిజాతులవారికిని కలదు.

పల్నాటి వీరుల చరిత్రకు సంబంధించిన 'కోళ్ళ పోట్లాట'లో మొదటి పందెమున నోడిపోయిన నాగమ్మ బ్రహ్మనాయని కోడిని మరునాడు గెలుచుటకు దయ్యాల మల్లాయె యను కట్టుబోతును పిలిపించి బ్రహ్మనాయని కోడికి మంత్రము బెట్టించెను. దయ్యాలమల్లడు 'వాకట్టు మరకట్టు వణికెడుకట్టు, పొట్టపొంగెడు కట్టు పొంగులకట్టు, కూత పెట్టుడుకట్టు కోపించుకట్టు, కాళ్ళను చేతులు కదలనికట్టు, ప్రాణంబు పోయెడి బలువైనకట్టు' నేర్చినవాడు. అతడు తన విద్యలు కొన్ని నాయకురాలి

యెదుటను నలగాముని యెదుటను ప్రదర్శించెను. ఇట్టి మంత్రతంత్రములందలి నమ్మకము జానపదుల కానాటినుండి నేటివరకును కలదు. 'పల్నాటివీరచరిత్రము'న బ్రహ్మనాయుడు త్రిపురాంతకమునుండి భూతరాట్ స్తంభమును తరలించుకొని పోవునప్పుడు బండ్లపైనెత్తి 'పంచవన్నెలకూడు పైబారదిచి' కంబమును భూతప్రేతాదుల గాలి సోకకుండునటులను రంగురంగుల యన్నము దిగదుడుపుగా తీసి పారవేయుదురు.

కాటమరాజు కథలో నలసిద్ధి సేనలయందు కలిగిన యపశకునములు గమనింప దగినవి. 'మెండైనరాగాలు? మెరసాదెసాగె, చీకువల్ మింటిపై చెలరేగి పలికె, నవతల పైడికం టదిరిపడి లేచే, పాల పేరెమువారె పాములు నడకొట్టె, నేలనాడువచోట నిలిచెను గౌళి'. అందులకు నలసిద్ది యాశ్చర్యపడి సంధ్యగోపాలుని బిలిచి శకునఫలము లడిగెను. సంధ్యగోపాలు డానాటి ఆగతానాగతవేది. అతడాయా శకునముల ఫలితములను సిద్ధిరాజునకు చెప్పెను. పల్నాటి వీరచరిత్రకు సంబంధించిన వివిధ కథలందు శకునములు వాని ఫలితములు వర్ణింపబడినవి. మల్లన పేరుతోనున్న 'కోళ్ళపోట్లాట'లో బ్రహ్మనాయునికి గలిగిన శకునముల కర్థము గోపుడు చెప్పును. ఈ గోపుడు బ్రహ్మనాయునికి కుడిభుజము. కోడిపందెముల తరువాత నిహతు డయ్యెను. పల్నాటివీరుల కథలందలి గోపునకు కాటమరాజు కథలందు(సంధ్య) గోపాలు డుద్దిగా కల్పింపబడెనేమో. బొల్లియావు బొడ్డున నున్న గంటనుగూర్చి సంధ్యగోపాలుడు సిద్ధిరాజుతో చెప్పిన విషయము వారి నమ్మకమును యాదవుల విశ్వాసమును సూచించును. శ్రీకృష్ణుడు గోవర్ధనగిరి ఎత్తినప్పు డాతనిచే నణచ బడిన పిడుగును విశ్వకర్మ కత్తి మరియు గంటలుగా చేసెనట. కత్తి వీరన్నకు (వీరభద్రుడు జాంబవంతుడు నరజన్మమెత్తిరి) గంటను పాతాళగణపతికిని ఇచ్చి కలియుగమున కృష్ణుడు కాటమరాజై పుట్టి గణపతి నోడించి గంటను గెలిచి బొల్లి యావునకు గట్టెనట అను బంధమున గల 'భట్టురాయబారము'న నలసిద్ధి కాటమ రాజులందెవరు సమయభంగము చేసిరోయని తీర్మానించుటకు పెన్న సమీపమున సంగమదేవుడు మాధ్యస్థ్యము వహించెను. కాటమరాజు పక్షమువారు శిలలను పలికించి తామే సత్యప్రియులమని రుజువుచేసికొనిరి. ఈ నమ్మకము ప్రజలం దిప్పటికిని గాఢముగా పాతుకొని పోయినది.

బాలచంద్రుడు ఐతమ్మ లోభకార్యములను దెగడుచు 'నీ మేనగోడలి స్నేవడ్డి వడ్డు, నా మేనమామలు నా పెండ్లినాడు. మా కులంబున ఓలిమాడలు గలవు, తగిన ధనం

ఒక తామీయ మనిరి, ఆమాట మీదట అమ్మరో నీవు, మట్టిడిపేసితి మూర్ఖతతోడ' నని నిందించెను. వధువు తలిదండ్రులు ఒప్పగించునప్పుడు కొను ధనమునకు ఓలియని పేరు ఈ యాచారము పల్నాటివీరుల కాలమందుండినట్లు పై మాటలు దెల్పుచున్నవి ఈ యాచార మధికముగా వెలమకులములో నుండునందురు. బాలచంద్రాదులు వెలమలు.

సంతానార్థమై ఐతమ్మ నోచిన నోములు—వ్రతములు, చేసిన దానములు పెక్కులు. కర్పూరచయదానము, కూష్మాండఫలదానము, విష్ణుకాంత నోము, సంధ్యావర్తి నోము-జగజ్జ్యోతి నోము, ఏకబాణము నోము, పచ్చవిల్లుని నోము, నంది పలగము దానము, అశ్వత్థపూజ, పెంటిపోతులకు పెండ్లి, చీకటింటినోము, కేదారేశు నోమువంటి వెన్ని చేసినను సంతానము కలుగలేదు చివరకు ఆకాశవాణి యాదేశమున నామె మాచెర్ల చెన్నుని (చెన్నకేశవస్వామి) సన్నిధిని గజనిమ్మ నోము నోమి సంతానమును బడసెను. ఈ గజనిమ్మ నోము వివరము లన్నియు గ్రంథమున నీయబడినవి. తక్కినవి కొన్ని నేటికిని ప్రచారమునందున్నవి. కాని కొన్ని మృగ్యములు.

రామమోహనరాయలు తెల్పిన సంస్కారములచే (సతి) సహగమనాచారము పోయెను. అంతకు పూర్వము భరతదేశమున నీయాచారము బహుళవ్యాప్తిలో నుండెను. కరుణరసప్రధానకథల ప్రకరణమున నీ విషయము చర్చించియుంటిని. పల్నాటివీరచరిత్రమున అనపోతుతో నాతనిభార్యయు అలరాజుతో నాతని భార్యయు సహగమనములు చేసిరి. కాటమరాజు కథలో ఖడ్గతిక్కన భార్య సాగుమానము చేసినది.

కాటమరాజు కథలో ఖడ్గతిక్కన మొదట యుద్ధమున విరిగి పారవచ్చి నపుడు ఆతని భార్య స్నానమునకు నీళ్ళుదోడి 'అక్కడ మంచము నడ్డంబు పెట్టి, యద్ద శేరు పసపు నమరంగ నుంచి, కూర్చుండి స్నానంబు గావింప జేయు' డని చెప్పివచ్చెను. మంచ మడ్డముగా బెట్టుకొని కూర్చుండి స్నానము చేయుట స్త్రీల యాచారము. పెరటి బయలులో స్నానము చేయునప్పుడు స్త్రీలు బహుళః చాటుగా నుండుటకై మంచము అడ్డుపెట్టుకొందురు. మరియును పురుషులు నిలుచుండియును స్త్రీలు కూర్చుండియును స్నానము చేయుట పరిపాటి. నేటి కాలమున స్నానముల గదులు బిగించుకొని పురుషులు నగ్నస్నానములు చేయుచుండుట ఆచారమైనది కాని ప్రాతకాలపువారు నగ్నముగా స్నానము చేయరు. 'న నగ్నః స్నాయాద్వా' యని మన ధర్మశాస్త్రములు (గౌతమ ధర్మసూత్రములు) చెప్పుచున్నవి. స్త్రీలు మాత్రము

నగ్నముగానైనను, సచేలముగానైనను కూర్చుండియే స్నానము చేయుదురు. ఈ యాచారము పూర్వమునుండియు కలదన్నమాట.

సిరిగిరితో లేఖలు చదివించుటకు ఐతమరాజాదులు శారదామండపమున గూడి కూర్చుండి 'అప్పుడు కూటాల కద్ద తెరగట్టి - కప్పురగంధుల కడుపేడ్క బిలిచి, కొమ్మలారా మీరు గొబ్బున బోయి-యమ్మ నూకాంబిక కటు విన్నపించి-సిరిదేవి కొమరిక్క సిరి భోగిలెంగ-సరసన నగుమంచి చట్టుమారమ్మ-పంచమలు యరణప్ప పైడిపాటి తల్ల - అందరి దోడ్కొని యతివేగ రాబోయనిరి. తెలుగువారి కీరాణివాసము (పర్దాపద్ధతి) పూర్వమునుండియే యున్నట్లున్నది. పల్నాటి వీరచరితమునకు సంబంధించిన కథలందు గూడ నీ రాణివాసము కానవగును. 'రాచమల్లు రాయబారము'లో బ్రహ్మనాయుడు నలరాజును గురిజాలకు రాయబార మంపుటకు మొదట తండ్రి కొమ్మరాజు నడిగి తరువాత తల్లియగు చల్లమ్మ యాజ్ఞగొనుటకై యామె యంతఃపురమునకు బోయినపుడు చల్లమ్మ నాయని 'అడ్డంబు తెరబెట్టి అర్ఘ్యపాద్యముల' తో నాహ్వానించెను.

'సొమ్ములు కట్నాలు సొన్నటంకాలు'. పల్నాటి వీరచరిత్రకాలమున మాడలున్నటులే కాటమరాజు కథాకాలమున సొన్నటంకాలను నాణెములు వాడుకలో నుండెను కాబోలు.

'దేశింగురాజు కథ'లో కూడ అపశకునముల ప్రస్తావన గలదు. దేశింగు యుద్ధమునకై బయలుదేరుచు రంగనాథస్వామి సెలవుగొనబోవ స్వామివారి మెడలోనున్న హారము తెగి పడిపోయెను. గోపురశిఖరము కూలిపోయెను. గుడిలో అఖండ మారిపోయెను. స్వయముగా స్వామివారు ముఖము త్రిప్పుకొనిరి. పాట పాడుకొనెడు జనముల నమ్మకములే దేశింగురాజున కంటగట్టబడినవి.

దేశింగురాజు చనిపోయిన తరువాత అతని భార్య సహగమనము చేసెను. ఆ సమయమున

'తాంబూలంబును జే (దీ) ని రత్నముల్ దనర చేతబట్టి
అంబరంబునకు నెగర రత్నముల్ అంత చెదరంగొట్టి
చుట్టుబడ్డ యా రత్నములెల్లను సొంపుతోడ జనులు
అట్టె యెత్తుకొని సంతోషంబున నలరి రంత జనులు'.

ఈ యాచార మిప్పటికిని కలదు. రాణి సహగమనము కనుక రత్నములు వెదజల్లినట్లు చెప్పబడినది. ఇప్పుడు శవము మీదుగా బీదలు రాగి డబ్బులు కలిగినవారు రూపాయలు వెదజల్లెదరు.

బొబ్బిలి కథలో కూడ అపశకునములు వర్ణింపబడినవి రాణీ మల్లమ్మగారు గోపాలస్వామి కభిషేకము చేయగా 'నొష్టయున్న తిలకము రాలి నేలను పడ్డాది, మెడలోనున్న పూలహారము తెగి నేలను పడెనూ, ఎదుటనున్న అఖండదీపము గప్పున ఆరేను, ఎదుటనున్న గోపాలస్వామి పడమట తిరిగేను, పడమట నున్న గాలిగోపురము పటపట పగిలింది.'

పెద్దాపురము కోడిపందెముల కథలో జగపతి, గజపతి రాజుల మరణానంతరము వారి భార్యలు సహగమనము చేసినటుల వర్ణింపబడినది.

'బంగారు తిమ్మరాజు కథ'లో గూడ అపశకునములు విశ్వాసములు వర్ణింపబడినవి. తిమ్మరాజు ప్రయాణవార్త వినగానే అతని భార్యకు 'నొదుట నున్నా కుంకమ బొట్టు నేలను రాలింది, కాలిన వున్నా వెండి మెట్టెలు బ్రద్దలు అయినాయి. చేతిన వున్నా గాజులు అన్నీ చిట్లిపోయినాయి' ఈ శకునములే కాక, ఏనుగులు గుఱ్ఱములు చచ్చిపోవుట, పల్లకి విరుగుట, చేతికత్తి క్రిందబడుట కూడ చెప్పబడినవి.

తిమ్మరాజు తన తల్లుల చెంతకు పోయినప్పుడు వారు 'కొడుకును చూచి నివాళు లిచ్చి దిష్టితీసినారు' కన్నతల్లి గూడ దృష్టి తీసెను. దీనికి కారణము 'తల్లిగారి దిష్టన్నాది బహు కానిదిష్టే' నట, కనుకనే 'నాలుగుపట్ల వరిహాలండి దిష్టితీసినారు, ఏనుగులాను ఏడింటినీ దిష్టితీసినారు, నాలుగుపుట్ల నల్లబొగ్గును దిష్టితీసినారు,' ఆరె మరాఠీల కథలో సిద్ధోజీ తనను జంపబంపిన దొంగలు చేరుకొనక పూర్వమే యారాత్రి సోమోజి తనతల దొంగలు నరికినట్లు కల గనెను. మరియు నాతడు నిమ్మతోటకు బోయి తన తమ్ముల పేరిట కోసిన నిమ్మకాయలనుండి పాలు నేయి కురువ తన పేరుతో గోసిన నిమ్మకాయల నుండి నెత్తురు కారెను. పల్లెటూరి ప్రజల కిప్పటికి నిట్టి నమ్మకములు గలవు. సదాశివ రెడ్డి గాథలో మైదుజాబులు మరియు భూతద్దముల ప్రభావము వర్ణింప నలవిగాదు. మహావీరుడగు సదాశివుని ముందు మైదుజాబులను భూతద్దములను బెట్టి జాతివారు పిల్లికూనను చేసిరి. సిద్దీవాడు సదాశివునిపై బూది జల్లి శిలగా మార్చెను. వాని పిక్కలందు తాయెతు లుండెనట. ఇట్టి మంత్రతంత్రములు విశ్వాసములు జానపదగేయములందు కుప్పతిప్పలుగా గాంచనగును.

ఇంతవర కుదాహరించినవి కేవలము చారిత్రిక గేయములందున్న విషయములలో కొన్నిమాత్రమే. పౌరాణిక గాథలందును స్త్రీల పాటలందును ఇట్టి విశేషము లింకను అధికముగా గలవు.

'శాంతగోవింద నామము'లను పాటలో దశరథుడు భార్యలతో కల శాంత నడుగ బయలుదేరినపుడు 'రామచిలుకలు ఎండి, ప్రేమతో ఎదురొచ్చె వేశ్యాస్త్రీలు వచ్చి, పురాభాండములు వచ్చె, గరుత్మంతుడు వచ్చె, శకునంబులను దీక్షి ఇవి యన్నియు శుభశకునములని మనవారి విశ్వాసము. దశరథుడు మున్నాగుడా శాంత నడుగ వచ్చిరని తెలిసికొన్న ఋషి దృష్టిదోషమునకు భయపడి తన వారితో 'శాంతనూ దాచండి, దృష్టి తీయించండి, గవుశనలు వెయ్యండి, గమిడి తియ్యవద్ద అనెను. శాంత నప్పగించునప్పుడు ఋషిదంపతులు 'బంగారు పళ్ళెములో, ప్రాలోప గోసిరి, ఆదిలక్ష్మి శాంతని; నామకరణం వ్రాసిరి'. నామకరణసమయమున నీ యాచా మిప్పటికిని పాటింపబడును.

శాంతాఋష్యశృంగుల వివాహమున జరిగిన తంతు విపులముగా వర్ణిం బడినది. గంపలో కూరుచుండబెట్టుట, కాడినీళ్లు పోయుట, జీలకఱ్ఱ బెల్లమ నెత్తిపై నుంచుట, లాజకట్నము లిచ్చుట, సన్నికల్లు త్రొక్కించుటవం యాచారములు నవనాగరకలోకమున మాయమగు చున్నవి. సన్నికల్లు త్రొక్కిం వేళ ఋష్యశృంగుడు దశరథునితో 'ఆడదాని పాదంబెట్టి, ఏ శాస్త్రములోనుండె ఋషులు చెప్పిరి' యని ప్రశ్నించెను. దశరథు డందులకు సమాధానముగా 'మీ తప్పి స్తేను-మరివకరు పడుతార'యనెను. అప్పుడు ఋష్యశృంగుడు 'శాం పాదంమీద, పోకచెక్కావుంచి, సప్తపాదం తొక్కె'ను. కనుక సన్నికల్లు త్రొక్కు ఆచారము అప్పుడప్పుడే ప్రవేశించినదిగా దోచుచున్నది. 'అతిష్ఠేమ మశ్మాన అను మంత్రము వివాహములం దెప్పుడు ప్రవేశించినదో? 'పాకెన్న పళ్ళెము పండితులు చదివి'రట. ఇది సదస్యము. అప్పగింతల సమయమున 'శాం చెయ్యి దెచ్చి, పాలలోనా ముంచి, అత్తగారికి వారు' అప్పగించిరట. పాల ముంచినను నీళ్ళలో ముంచినను మీ భారమని కాబోలు నిటుల చేయుదుర దశరథుడు శాంతకు 'ఐదువేల బానిసలు, అరణంబులు ఇస్తు'ననెను. బానిస (slaves)ఉన్ననాటి మాట (పాట)యిది. శాంత అయోధ్యనుండి బయలుదే ఋషిపల్లె చేరుటకు ముందు పల్లె బయట 'జమ్మిచెట్టూ క్రింద, శాంత సారెలు వుం పూర్ణకలశలు దించె, గృహప్రవేశంబాయె'ను. ఇల్లు నింపుకొనుటకు పూర్వము ఊ బయట జమ్మికడ దించి తరువాత వధూవరులను గృహప్రవేశము చేయించు యిప్పటికిని గల యాచారము.

ఋష్యశృంగుడు మామగారిచే పుత్రకామేష్టి జరిపించినప్పుడు యాజ్ఞికమ నుండు తంతు అంతయు విపులముగా వర్ణింపబడినది. శ్రీరామాదులు జన్మించి

పిమ్మట వారికి పదకొండవనాడు బారసాల జరిపినట్లుగా వర్ణింపబడినవి. కొందరు ఇరువది యొకటవనాడు చేయుదురు. బారసాలకు 'యిరవై యొక్క దినము' అను పేరందులకే వచ్చినది. ఇటులే చేలోత్సవము, అన్నప్రాశనము మున్నగు ఆచారములు వర్ణింపబడినవి. శాంతకు కార్యము చేయించునాడు 'కూతురుకి అల్లునికి—కౌసల్య తలలంటె' నట ఇదికూడ ఆచారమై యుండును.

'పుత్రకామేష్టి' పాటలో కౌసల్యాది కాంతలకు 'ఒకటి రెండు మూడు నాల్గు అయిదు నెలలు అయ్యేవరకు, వెలయ సీమంత మనెడు వేడుక జేసిరి' అంతర్వత్నులగు వారికి ఐదవ నెలలో జరిపెడు వేడుకకు, ఆచారమునకు-సీమంతమని పేరు. ఇదే పాటలో రామలక్ష్మణులకు వడుగు జరిపినప్పుడు వడుగులకు సంబంధించిన వివరములన్నియు చెప్పబడినవి.

'కౌసల్య బైక' లను పాటలో ఆసన్నప్రసవయగు కౌసల్యాదేవి యున్న ప్రసూతి గృహమున చెలికత్తెలాయా వస్తువులు భద్రపరచుటకై యొకరితో నొకరిట్లనుకొనిరి. 'పీటవేసి చిన్నది ఒక్క మూట వునచారే, మేటీగ దీపము నొకచోటున వునచారే, అడ్డసెండ వడ్లుపోసి వునచారోయమ్మా, పెద్దగుండు నొకటి పైన వునచారోయమ్మా ....తడవులేదు తాడు దులాన వేసియ్యారమ్మా.' సుఖప్రసవ మగుటకీ యుపాయములు తోడ్పడు నందురు. ఇదే పాటలో రామాదులు జన్మించిన తరువాత తొట్లె పెట్టుట బారసాల చేయుటవంటి యాచారములు వర్ణింపబడినవి.

'సీతగడియ'లో పూర్వపు అత్తింటి కోడలు తాను శయ్యాగృహమునకు వెడలుటకుముందు చేయవలసిన పనులు చెప్పబడినవి. సీతమ్మ అందరికి భోజనములిడి వంటిల్లు చక్కపరచి 'అత్త కౌసల్యకు అడుగులు వత్తి, మామ దశరథులకు మడత లందిచ్చి, సుమిత్రకైకకు సురటీలు వేసి, వరగ కౌసల్యకు పాన్పు తా బరచి' తా నలంకరించుకొని ఎంతో ఆలస్యముగా శయ్యాగృహమునకు చేరినది. బాధ్యత నెరిగిన కోడండ్ర ధర్మ మిట్టిది.

'పెండ్లి గోవిందనామములు' పాటలో రామాదులు జన్మించిన తరువాత నయోధ్యలో 'పురుడు వేడుకలాయె, పట్టిమువారలకు, పసుపు నూనెలు పోసిరి' పసుపు నూనెలు పంచుట యాచారమని తెలియనగును. ఇదే పాటలో రామాదుల వివాహమునకై అయోధ్యనుండి మిథిలాపురికి తరలిపోవునపుడు దశరథుడు 'వంటర్ని పిలిపించి వోణీలు గప్పిరి, కావిళ్లవారికి తగటంచు చాపులు, రాఘవులు గప్పేటి ఆ దుస్తులిచ్చిరి'. వంటరి యనగా వంటవాడు. వంటవారికి కూడ కట్నములు

పెట్టిపోవుట ఆచారము కాబోలు. కావిళ్లవారికి రాముడు కట్టిన దుస్తులిచ్చిరట పెండ్లిలో ఇప్పటికిని 'మైలపోలు'నాడు ఈ యాచారము పాటింపబడున వధూవరులకు తలలంటెడు చాకలి మంగలివారికి వధూవరుల శరీరములపై నున మైల వస్త్రములు తీసియిచ్చుట నేటికిని పాటింపబడు ఆచారము. కావిళ్ళవా (కావడి మోసెడువారు)కూడ సాధారణముగా చాకలిమంగలివారే. మడికావళ్ల వంటవారును, మైలకావళ్ళు చాకలిమంగళ్ళును కొనిపోవుదురు. సీతారాము వివాహమునకు పూర్వము'తన్నె శృంగారించి ఆదేవతల నిలిపిరి, అతివ లందరుగూ అవిరేడ్(అవిరేణి)కెల్లిరి, అతివ లందరుగూడి అవిరేణ్ణి నిలిపి'రట కులదేవతాపూజనమ అవిరేణుల పూజనము మున్నగునవికూడ ప్రచారమందున్న యాచారములే.

ఈపాటలో నింకను పెండ్లి సందర్భమున గాననగు అనేకాచారము చెప్పబడినవి. దోపు మున్నగు ఆచారములిప్పుడు మాయమగుచున్నవి. ఈపాటల దోపు ఆచారము కూడ చెప్పబడినది. దీనిని తూర్పు జిల్లాలలో 'దొంగవేశ మందురు. నాకబలికి పూర్వము'దోపు రాత్రివేళ, దొంగలను తగిలిరి, చప్పట్లు చరచి సభయంత నవ్విరి, మాయత్త కొడుకులు, మరి దొంగలూ సుమ్మీ, తెల్లవారితే వారి, ప కొట్టిస్తాము, సౌమిత్రిని పట్టి, సంకెళ్లు వేతాము, ఆయన పెద్దవారు, అది యెవరి తరముగ దని వర్ణింపబడినది. అలుకకు పూర్వమీదోపు జరుగును. దోపు అనగా దొం తనము. అలుకకు పూర్వము వరుడును వరునిపక్షమువారును, వధువు ఇంటినుం ఎవరి చేతికందిన వస్తువులు వారపహరింతురు. వారటు లపహరింతురని వధు పక్షమువారు మొదటనే జాగ్రత పడెదరు. విలువగల వస్తువాహనములు బయ నుంచక ఎత్తుకొని పోవుటకై కేవలము బొక్కెన, చేంత్రాడు, హారతి పళ్ళెరవ సాధారణమైన చెంబు లుంచెదరు. వధువు పక్షమువారు వరుని వెంబడిబ దొంగవాడని చేటలపై డప్పుగొట్టుచు వెంటనంటి వెక్కిరించెదరు. బావమరదు యల్లరి నధికముగా జేయుదురు. బావమరదులున్నచో వరుడు తన్ను వెంబడిం వచ్చినప్పుడు తానింత కుడుకముక్క (కొబ్బర) కొరికి వెనుక వైపునకు వారి విసరివైచి తాను విడిదికి పారిపోవును. అప్పుడే అలుక పాటింపబడును. ఈ దోపుకు చిహ్నముగా పల్లెటూళ్ళయందు పెండ్లివారు ఒక చెంబో మరి యిం వస్తువో చివరనా దెత్తుకొని పోవుదురు. ప్రస్తుతమిది మృగ్యమై పోవుచున్న యాచారము కాని దేవతావివాహములందు మాత్రము పరిపాటిగ సాగుచు యున్నది. మడికొండ గ్రామమున సీతారామకల్యాణసమయమున నీ దోపు ఏటే జరిపెదరు. పన్నిద్దరాళ్వారులలో చేరిన తిరుమంగయాళ్వారు కూరత్తాళ్వా

మున్నగు పారల వేషములు ధరించి వైష్ణవభక్తులు పెరుమాండ్ల పైనున్న భూషణములు దొంగిలింతురు. మడికొండ గ్రామము బయట దోపుమట్టి యను నొక మట్టిచెట్టు కలదు. సీతారాముల ఊరేగింపు అచ్చోటికి వచ్చినప్పుడు దోపు జరుగును. ఈ దొంగతన మనునది పెండ్లిలో నొకభాగముగా నెటుల చేరినదో ఎప్పుడు చేరినదో తెలియరాదు. రాక్షసవివాహములో కన్యతోబాటు వెలగల వస్తువులను దోచుకొనిపోవు ఆచార మేర్పడెనేమో? అలుకలు తీరిన తరువాత. నాకబలికి పోయిన తరువాత 'గుండు గుమ్మేసిరి. కూనాట్లు గలిపిరి' యని కలదు. ఇదేమి యాచారమో? నాకబలిసమయమున తలబ్రాలపై నల్లపూసలు గుండ్లు పెట్టెదరు. అది యిదియే కావచ్చును.

'సీతాదేవి యానవాలు' పాటలో ఒకనాడు శ్రీరామచంద్రుడు తుమ్మగా సీతమ్మ 'కోటంత ఆయుస్సు గోవిందు కనుచు, బ్రహ్మంత ఆయుస్సు పరంజోతి కనుచు, చింజీపి అనితీసి భూమిదాకు చెవిని, ఉంచుకునె' నట. ఈ విశ్వాస మిప్పటికిని గలదు, దాని పరమార్థము మాత్రము మరుగున పడిపోయినది.

'లంకా యాగము' పాటలో మారీచుని పన్నుగడపై 'హా' యన్న యార్త నాదము విని సీతమ్మ లక్ష్మణుని అన్నగారి సహాయమునకు పొమ్మనెను. లక్ష్మణుడు రాముని కెట్టి కీడు మూడదన సీతమ్మ లక్ష్మణుని దూరుచు 'తమ్ములు కారయా అన్నలు చస్తేను కాపురంబులు చేతురూ, చేను దున్నినవెనుక చేనువెంబడి ఓడు చేనువారిది కాదా' యనెను. ఆ కాలమున దేవరన్యాయ ముండెడిది కాబోలు. రావణుడు సీత నపహరించుకొని పోవునప్పు డామె విలపించుచు 'మున్నూటరువది నోములు నోచితి ఎన్ని కొంతను నోచితీ, సంధ్యాల వెన్నెలా జ్యోతి గావించుకొని ఏడిగిట్టుక నోచితీ' యని తలచుకొనెను. ఈతీరుగా జూచిన ఏడాది పొడుగున దినమొక నోము నోచుటకు వీలుండెడిదని తెలియుచున్నది. ఇప్పు డీ నోములన్నియు కానరావు.

'లక్ష్మణమూర్ఛ' పదములో లక్ష్మణుడు మూర్ఛపోయినప్పుడు నంది గ్రామమున నున్న భరతునకు 'అనుజుడు లక్ష్మణుడు అడవి లోపలను, తలకు చమురు చేత తడవుకొని క్రుశియించ, మొదలంట బురదలో మునిగి దుఃఖమున, కష్టంబు పడుతున్న కడుచెడ్డ స్వప్నములు' గలిగెను. తలకు నూనె యంటినట్లు కల రాగూడదని యిప్పటికిని మనవారి విశ్వాసము.

'కుశలవకుచ్ఛల చరిత్ర' పాటలో ఋష్యాశ్రమమున సీత ప్రసవించినప్పుడు జన్మించిన శిశువునకు 'పొలుపుగ దర్భల బొడ్డుపె నుంచిరి-పూబోణులు బొడ్డు

వొప్పుగ కోసిరి - మీరు పుడుదురని మీ తండ్రీప్పుడు-బంగారపు చేటలు చేయించే-అనుచో పుణుకులు చేటల పోసి-పట్టుచీరెలు పొత్తిళ్లు పరచి-పవళించా బెట్టిరి బాలుణ్ణి - ఓడ్డా మాది గె(గ)డ్డ మీది - యనుచు బలికిరి కాంతలు తామ' ఇప్పటికిని పల్లెటూళ్ళయందీ యాచారములు జాతకర్మలందు పాటింపబడుచున్నవి. పురుడు జరిపినప్పటియాచార వ్యవహారములు, అందున్న ఆయుర్వేద విషయములు గమనింపదగినవి. 'ముత్యాల పీటలు ముందుగా వేసిరి - రావే జానకి రమ్మని పిలచిరి, నడికట్టుగట్టి సంతోషముగను కుడి పాదమున కూర్చుండ బెట్టిరి-ఉల్లివేసి కాచిన మానెలను - సీతకు సిరసంటిరి వాము-పిప్పాకు కచ్చూరాలు వేసిన-వాంటిపిండి నలుగులు పెట్టించె....కొట్టుకాయము కొట్టి తెచ్చిరి అప్పుడు కాచిన ఆవుల పాలు-బంగారు గిన్నెతో పోయించిరి - పణతులు పావంబులు తొడిగించిరీ-బొడ్డు కోసిన కత్తి చేతికిచ్చిరి-వేపకొమ్మల వెలదికిచ్చిరి-తూర్పు వేపున నిలువ జానకి-మ్రొక్కవె జానకి భాస్కరుకైన-ఏటనేట చూలింత బాలెంతా-దయచేయుము భాస్కర యనెను-అక్కడనున్న అతివలకెల్ల-పసుపు కుంకుమా పణతులు ఇచ్చిరి-ఆకులు పోకలుకాయ పండులు-ఇచ్చెను జానకి వేడుకతోను' ఇటులే మరికొన్ని యాచారములు చెప్పబడినవి.

'కుశలవకుచ్చల చరిత్రము'న బారసాలనాడు బావిలో చేద వేయు ఆచారము నడిపినప్పుడు 'అందరు గ్రక్కున బావికి చనుదెంచిరి శీఘ్రముగా, బావిలోపల చేదలు వేసిరి మూడు చేదలు ముందుగ వేసిరి, పొత్తిళ్ళు బట్టలు తడిపించిరి, ఆకులు ముగ్గులు అక్కడ బెట్టిరి, కప్పకు మ్రొక్కిరి కాంత లందరు, లోనికి చనుదెంచిరి శ్రీఘముగా' కప్పకు మ్రొక్కుటేలనో? ఇప్పుడీ యాచారము కానుపించదు.

'రామకథా సుధార్ణవము'న అశోకవృక్షముపైనున్న కోతిని జూచి సీత స్వప్నమనుకొని 'కలలో కోతిని కనుగొంటిని యిక్కలను కలుగు కీ'డని చింతించెను. కలలో కోతి కనపడకూడదని మనవారి నమ్మకము.

'విరాటపర్వము పదము'న బృహన్నలతో నుత్తరుడు బయలుదేరి పోవుచుండగా 'పురసౌధములనుండి సరసిజేక్షణలు, పెరుగు లాజలు పూలు తరచుగను జల్లి' నట్లు వర్ణింపబడినది. పెరుగు జల్లుటెందులకో? ఆంధ్ర భారతమున కేవలము 'దీవించి సేసలు సల్లం బురంబు నిర్గమించి'నట్లు వర్ణింపబడినది.

'కొమిరెల్లి మల్లన్న కథ'లో గొఱ్ఱెయున్నితో సిద్ధమగు కంబళ్ళ వర్ణనము కలదు. 'కంబళ్ళను గట్టుకొనిన, కట్టుకొని పరచుకొనిన, అఖిలమైన వర్ణాలకు, ఆక్షేపణ వుండబోదు, దేవతలకు మెప్పు సుమ్మి, దేహము ఆరోగ్యముండు, నల్లగొంగడి గప్పుకొనిన, నఖిల భూతప్రేతమూలు, అతని వద్దకు చేరకుండు, అఖిలశుభములు తాను గూడు, తెల్లగొంగడి యెంటనున్న, దేవతా ప్రసన్నమౌను, కసిరె గొంగడి గప్పుకొన్న, కష్టమూలు తొలగునయ్య'. గొంగళ్ళను గూర్చిన యభిప్రాయ మిప్పటికి నిటులే కలదు.

## తెగలు

భారతదేశమున ప్రధానముగా చాతుర్వర్ణ్యములవారే యున్నను వారిలో మరల పందలకొలది ఉపజాతు లేర్పడినవి. ఒక్కొక్క ప్రాంతమున కొన్ని కొన్ని క్రొత్త కులములు బయలుదేరినవి. ఇట్టి విభజన మెన్నడు జరిగినదో ఇదమిత్థముగా తెలియరాదు. జానపదగేయములందు అనేకకులముల గూర్చిన ప్రశంస కలదు.

'గంగా వివాహము' పాటలో ఏలాపురమున గల వీథులు వర్ణించునప్పుడు సుమారు 45 కులములు వర్ణింపబడినవి. వీనిలో కొన్ని క్రొత్తగా నున్నవి. ఉదా:– శిలవంతులు, కమ్మవెలమ, మద్దివెలమ, సరిగుంటలవాండ్లు, మాల కన్నెకులు, జట్టినవారు, కాళింగులు, జడ్డివారు, పాండీలు, నెయ్యాలవారు మున్నగు కులములు తెలంగాణమున గానుపించవు. వీరు తెలుగువారో కాదో! కులములు, జాతులగూర్చి పరిశోధనలు సల్పినవారి గ్రంథములందు దివి కనబడ లేదు. 'కొమరెల్లి మల్లన్న' కథలో రెడ్లయందున్న తెగలు కొన్ని చెప్పబడినవి మోటాటి గుడాటి, పాకనాటి, గోనెయెల్మ, చిట్టెపు, గడనశాపరెడ్ల విభేదములు కొన్ని చెప్పబడినవి. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు పంటకాపులకు చెందిన మోటాటి, పాకనాటి రెండుతెగలనే పేర్కొనిరి[1]. వారు పేర్కొన్న పంట కాపులలోనున్న 14 తెగలందు తక్కినవారు వేరుగా నున్నారు. పదములో నున్న పేర్లందులో లేవు. అయ్యలరాజు నారాయణామాత్యుడు కొన్ని కాపుతెగలను పేర్కొనెను.

'పంట, మోటాటి, పెడగంటి, పాకనాటి, అరవెలమ, లాదికొంచాలె, మొరసు, గోన
కొణిదె, కాపులు మొదలైన షోటి దనరు, కాపులకునెల్ల మిన్నయగు కాపు కొడుకు'[2].

పై పద్యమున గోనెకాపు లున్నారు. పదములోనున్న 'గోనెయెల్మ'లే గోనెకాపులు. ఒక్కొక్క ప్రాంతమున నీ యుపజాతు లొక్కొక్క పేరుతో నుండునట్లు తోచెడిని.

'సీతాకల్యాణము' పాటలో కొట్నములు దంచునప్పుడు వివిధములగు వడ్లు పేర్కొనబడినవి. వడ్లెన్ని తీరులో గమనింపుడు'. 'గరుడ వాహనాలు గౌరి కుంకాలు, కుసువ బాదాములు కృష్ణభోగాలు, పంకవణ్ణము పెద్ద వడ్లాణములు, కంకణములు లక్ష్మినారాయణ మణులు, మాదేవి కాటుకలు మల్పెచిన్నాలు, దూది భోగాలును

---

1. History of the Reddi Kingdoms.
2. హంసవింశతి (4-136)

దొంతిమల్లెలును, గోదుప్రయాగలు గోదబ ధాన్యములు, ముత్యసరి ధాన్యములు ముక్క ధాన్యములు,బంగారుతీగెలు బలితాములును,గంగబారేలేను కామాభోగాలు,పీలిశా ధాన్యములు నారియా మణులు,వివరించి దంచేరు పేక్కతో నపుడు,నాటరాగములతో పాడి యాడించును'. కొట్నముల పాటలు నాటరాగములో పాడెడువారని తెలియుచున్నది.

'విరాటపర్వము పదము'లో నుత్తరాభిమన్యుల వివాహవేళ కొట్నములు దంచినప్పుడు 'గరుడ వాహనాలు చిట్టికన్నెరాలు రత్నసరులు, వాలకిన్నెరాలు మంచి పాల బుడమలు, రాజనాలు కార్తిగాలు రామసాగరాలు మంచి, గౌరి కుంకుమాలు మంచి కనకిసరులును,ఆకుసరులు ముత్యసరులు అక్కుళ్ళు రాజభోగు,లమును కాశ్మీరుసన్న లంద మొప్పగా' వర్ణింపబడినవి.

## వృత్తులు-పరిశ్రమలు-కళలు

అనాదిగా గానబడు వర్ణవ్యవస్థ తొలుదొలుత వృత్తిసౌలభ్యముకొరకే యేర్పడినట్లు విజ్ఞులు చెప్పుదురు. కాలక్రమమున చాతుర్వర్ణ్యములందు పెందల కొలది భేదము లేర్పడి జాతులు కులములు బలిసి క్లేశము మరియు నష్టము గూడ కలిగించునంతవరకు వచ్చినది. జానపదసాహిత్యమున పెక్కు జాతులవారి వృత్తులు, పరిశ్రమలు, కళలు వర్ణింపబడినవి. ఏవృత్తి లేనివారు కూలినాలి చేసికొని బ్రతుకుచుండెడివారు. అట్టిజన మిప్పటికిని కలదు. పూర్వముకన్న నిప్పు డట్టి సంఖ్య పెచ్చుపెరిగినట్లున్నది. ప్రజాజీవితమునకు సంబంధించిన నిట్టి విషయములు శిష్టసాహిత్యముకన్న జానపదసాహిత్యమందే యధికముగా నగుపించును. శ్రామికగేయముల ప్రకరణమున తెలుగువారు చేయు కాయకష్ట మెన్ని తీరులో వాని నంటిపెరిగిన వాఙ్మయమెంతో వివరించియుంటిని.

పలనాటి వీరుల చరిత్రకు సంబంధించిన కథలందు కూలినాలి చేసికొని పొట్టపోసికొనువారి ప్రశంసయు కలదు. 'గురిజాల యుద్ధము – పూర్వభాగము' అను పదములో మందపోటు బొడిచిన గురిజాలవారిని విరుగబొడుతునని బ్రహ్మ నాయుడు కోపోద్రిక్తుడై బయలుదేరినప్పు డాతని తల్లి శీలమ్మ 'కట్టెమోపుల వారి కలకూలివారి....పసుల కాపరులను బిలుసుకూరాకు,తిని యడవులలోన దిరిగేటివారి'చంపకు మని హితబోధ మొనర్చి పంపించెను. ఏ పనిపాటయు లేక అన్యాయముగా ధన మార్జింప దలంచి కొందరు దొంగతనమును వృత్తిగా గొనిరి రానురానది కళగా మారెను. చతుష్షష్టికళలందు దొంగతనము కూడ స్థానము కల్పించుకొన్నది. దొంగతనమునందు కూడ చాకచక్యము ప్రబలినది, రేచుక్క పగటిచుక్కలు అట్టి

వృత్తిలో మిన్నంటిరి. గురిజాల విరుగబొడువబోవు బ్రహ్మన్నకు మార్గమధ్యమున కొర్రపీరుడను గజదొంగ తారసిల్లెను. 'కూరతోటలు జొచ్చి కూరగాయలును' దొంగిలుటతో వానివృత్తి యారంభమయ్యెను. (తోటకూర దొంగిలినప్పుడే బుద్ధి చెప్పవలెనను సామెత కథవంటిదే యిది.) అటుతరువాత వాడు మెల్ల మెల్లగా నిండ్లు సొచ్చి అటకలపై దాగుండి సొమ్ము లపహరించుట నేర్చెను. ఇంతింతై వాడు 'కుక్కల వాకట్లు కొంకి కత్తియును, సొక్కు బూడిదయు చొప్పగోలయును, దృష్టి బంధనముచే తెలివి లేకుండ, అష్టదిక్కులు గట్టునట్టి నేర్పమర, అరువయి నాల్గవుషధము లమరంగ నేర్చి'న వాడయ్యెను. చివరకు ముందుగా వార్త నంపించి తరువాత రాజసముగా బోయి దొంగతనము జేయు 'అగ్గి రాముడుగా' మారెను.

వేళ తెలిసికొనుటకు మనవారికి పూర్వమునుండి గడియారము లున్నట్లు మన శిష్టసాహిత్యమునను జానపదసాహిత్యమునను కాననగును. అవి ఇప్పటి గడియారముల వంటివి మాత్రము కాకపోవచ్చును. అరబ్బు లిసుక గడియారమును కనిపెట్టినట్లు భారతీయులు నీటి గడియారములు కనిపెట్టిరని విజ్ఞుల యభిప్రాయము. పల్నాటి వీరచరిత్రకు సంబంధించిన యొకపాట 'రాచమల్లు రాయబారము'. దీనిలో అలరాజు గురిజాలకు రాయబారమునకు బోయినప్పుడు 'గడియారపు మొగసాల కడకు నేతెంచి'నట్లు వర్ణింపబడినది.

'పలనాటి వీరచరిత్రము'న నున్న భూతరాట్ స్తంభము 'ఇనుము పిత్తళి కంచు హేమ తామ్రములు పంచలోహంబుల'తో చేయబడెను. ఆనాడే లోహములతో చేసెడు పరిశ్రమ లభివృద్ధిచెందియుండెను.

'ముఖమల్లు గుడ్డలు మునుకొని తెచ్చి'యని యుండుటచే నాంధ్రదేశమున గూడ ముఖమల్లు పరిశ్రమ మభివృద్ధి యయ్యెనని తలంపవచ్చును.

'సకల ధాన్యంబులు సకల రత్నములు, బంగారు వెండియు బహుధన వితతి, సరిగ వస్త్రంబులు సరసపు బట్టు, పటములు ఘనతంతు పటములు మరియు, కాంస్య తామ్ర శ్వేత క్రమభాండములు, రసవర్గములనెల్ల రంజనంబొప్ప, క్రయవిక్రయమ్ముల' గావించువారానా డుండిరి. బాలునికి బంగారు బొంగరములు చేయుటకై అగసాలెవారు 'వారలిండ్లకు బోయి పట్టెడ కారు, కమ్మచ్చులును నీరుకార్లు సుత్తెలును, ఘనమౌ పడచ్చును కత్తెరల్ మరియు, అలరు మచ్చులు గుదు లాదియైనట్టి, పనిముట్లు గొని'వచ్చిరి. మాంచాల యలంకరణము సందర్భమున నెన్నియో భూషణములు పేర్కొనబడినవి. స్వర్ణకార వృత్తి యానా డుచ్చదశలో నుండియుండును. మరియును మాంచాల 'ముత్యాలు గూర్చిన ముంగొంగు మెరయ, ప్రతిమలు వ్రాసిన పట్టు వస్త్రంబు, కటియందు ధరియించి'

తల్లిచెంతకు బోయినట్లు వర్ణింపబడినది పత్రములపై గల యద్భుతపు పరిశ్రమ నీవర్ణనము సూచించుచున్నది.

బాలచంద్రుని వేశ్యాలోలుపత ఆనాటి సంఘమున వేశ్యల కున్న స్థానమును నిరూపించును. మొన్న మొన్నటివరకు ప్రతి గ్రామమున వెట్టిచాకిరి చేయుటకు కొంద రుండెడువారు. కాటమరాజు కథలో సిద్ధిరాజు వెట్టివాండ్రను బిలిచి సైన్యములకు కావలిగాయుటకై రాత్రులందు దివిటీలు పట్టుటకు నియోగించెను.

పూర్వకాలమున తాళపత్రములు భూర్జపత్రములు వ్రాతకుపయోగపడు చుండెడివి మొన్న మొన్నటివరకు తెలుగుదేశమున పెద్ద లుత్తరములు వ్రాయుటకు తాటియాకులనే వాడుచుండిరి. ఇప్పుడవి యడుగంటిపోయినవి మనపూర్వ వాఙ్మయ మంతయు తాళపత్రగ్రంథములందే భద్రము గావింపబడినది. తాటి కమ్మలపై మిక్కిలి యోపికతో ముత్యాల సరములవంటి పంక్తులు ఘంటముతో మనపూర్వులు వ్రాసెడువారు. కాటమరాజు కథలో ఉత్తరములు వ్రాయుటకై కోటపాటినుండి చక్కని తాటియాకులు తెప్పించుటయే ఒక ఉపకథగా చెప్ప బడినది. కాటమరాజు ఐతమరాజాదుల కుత్తరములు వ్రాయుటకై 'సమ్మతంబుగ మంచి నవరసయాకు, కొనగల మోవాకు కుదురు చక్కనిది' కోటపాటినుండి తెచ్చుటకు చట్టువార ఎల్లన్నను పంపించెను కమ్మలు తెచ్చినపిదప కాటమరాజు ఉత్తరములు వ్రాయించుటకై 'భానుంకీర్తి ప్రభవశేఖరుడు, లేఖలు వ్రాయను లిఖియించి చదువ, ప్రాకటఛప్పన్న బాషాధికారి, కాటభూపాలుని కరుణ తోడుతను. మేటియై ప్రభవొందు మిత భాషణుండు, కందర్ప సాటిగాగల రామచంద్రు' పిలిపించి బావయగు పల్లికొండకు, కొమరక్క సిరిదేవులకు, ఐతమరాజాదులకు నుత్తరములు వ్రాయించెను. ఆ కాలమున లేఖలువ్రాయుట కనేక భాషావిదులగు 'దుబాసీలు' రాజసభలందు వ్రాయసకాండ్రుగా నుండెడువారని తెలియుచున్నది.

పూర్వకాలమున లేఖ లెంత జాగ్రతగా నొకచోటినుండి మరియొక చోటికి పంపబడుచుండెనో కాటమరాజు కథలో గానగును. రామచంద్రునితో కమ్మలు వ్రాయించి కాటమరాజు 'తనవ్రాలు చేసిన తగు లేఖలన్ని, ఘనముగా జలదైన కడు చెంద్రికలను-వరుసతో జేసియు పైనాన బట్టి, యురువైన తనచేతి యుంగరంబునను, లక్క ముద్రలు జేసి గ్రక్కున నపుడు-కబురున నారాజు కాలారి బిలిచి, కాలారిచేతికి కమ్మ లందించి పైళంబె కమ్మలు పైనాన గొంచు' పొమ్మనెను. కాలారి యనగా వేగముగా వార్త గొనిపోవువాడు. లేఖలు భద్రముగా నుంచెడు పెట్టెకు చంద్రికయని పేరు. శిష్ట

సాహిత్యమునగూడ(విజయవిలాసమున)చంద్రికలు కాననగును.లక్క ముద్రలు వేసి యంగుళీయకము లొత్తి లేఖల రహస్యము కాపాడబడుచుండెడిది.

కాటమరాజు వ్రాయించిన లేఖను ఖతమరాజుకడ నున్న మంత్రి చదువలేడయ్యెను. అతడు 'నాడవ్రాతయుగాదు సన్న చిన్నెలును,పీఁజాఁబు తెలియదు యదుకులాధీశ' యనెను. అది బహుశః రహస్యము గాపాడుటకై వ్రాయబడిన గుప్తలేఖనమై యుండును అది చదువుటకు సమర్థురాలు సింగిరిదేవి; ఖతమరాజు కూతురు. కావుననే మంత్రి రాజుతో 'నీ ముద్దు కూతురు నీలాలవేణి. ప్రేమతో గొల్చియు ప్రియమార వార్చి,తెలుగు నరవించును. .చెలగి కన్నడమును జదివె నాగరము,నరనాథ మీపుత్రి నలినాయతాక్షి, తెలుగొప్ప ఛప్పన్న దేశీయభాష,లక్కమలాక్షికి నంత తెలిపిడియు'ననెను ఛప్పన్న భాషలు నేర్చిన తెలుగు స్త్రీలందు మనకు తెలిసినంతవరకు సిరిగిందేవియే ప్రథమురాలు కాబోలు.సింగిరితో లేఖలు చదివించుటకు ఖతమరాజాదులు 'బంధు సహోదరుల్, నందరు నగరికి నప్పుడేతెంచి, మరివేగ శారదామండపంబునను, నారూఢి వమునతో నపుడు గూర్చుండి'ం.ఖతమరా జెంత సాహిత్య ప్రియుడో! లేనిచో నగరులో నొక కూటమునకు శారదామండపమని పేరుండునా! శ్రీ కృష్ణదేవరాయలను నందితిమ్మనగారు 'మలయకూటప్రాసాదనివేశ కృష్ణరాయ మహీశా'1 యని పొగడెను. కృష్ణదేవరాయల సాహితీభవనమునకు 'భువనవిజయ' మని గదా పేరు. సుమతిశతకకారుని 'గొల్లని సాహిత్యవిద్య' యను మాటను 'శారదామండపము' పొల్లొనరించు చున్నది. బొబ్బిలి యుద్ధమున 'చంద్రశాల2 మంటపమందున రంగియ దొరగారు'అని కలదు. రంగారావుగారి భవనమునకు చంద్రశాల యని పేరు కాబోలు.

పందెపు కోళ్ళను పెంచుట పూర్వమొక వృత్తిగా నుండెడిది. పెద్దాపురపు కోడి పందెముల కథలో దేవాంగులు కోళ్ళను పెంచువారని చెప్పబడినది. పెద్దాపురపు వత్సవాయిరాజుగారి పూలకోడి 'దేవాంగుల యిళ్ళలోను ఎత్తి పెరిగినా'దట.

వినోదమునకేకాక ముఖ్యావసరములకై మనవారు కొన్ని పక్షులను,జంతువులను పెంచెడువారు. హంసములు, కీరములు వినోదమునకే కాక రాయబారములు నడపుటకును,వార్త లందించుటకును నుపయోగపడినట్లు మన పురాణములందును ప్రబంధములందును కలదు. జానపదగేయములందు గూడ నిట్టియుదాహరణములు కొన్ని కానుపించును.'బొబ్బిలి కథ'లో దేగలు ధర్మారావు రాయబారము వైఫల్యమును

1. పారిజాతాపహరణము. 5–108.
2. 'చంద్రశాలా శిరోగృహే' అమరము.

సూచించుటకై తమ కోటలోనికి బోయినవి. పల్నాటివీరుల కథలందు సైన్యముల వెంట డేగలున్నట్లు వర్ణింపబడినవి. రుక్మిణీదేవి తనను వివాహ మాడుటకై శ్రీకృష్ణునితో 'చిలుక రాయబారము' సాగించినది. అలిగిపోయిన సీతమ్మ కడకు శ్రీరామచంద్రుడు 'కీరసందేశ' మంపెను. అశోకవనమున నున్న సీతమ్మ తన్ను విడిపింపుమని శ్రీరామచంద్రునకు 'కోవెల రాయబార' మంపెను. 'రాములమ్మ పాట' లో నామెను చెరపట్టి యుంచిన లంబాడివాని జాడ తీసినది పావురము. ఆమెకడనుండి యామెభర్తకు పావురము కమ్మ గొనిపోయినది. పక్షులవలెనే జంతువులుకూడ నిట్టి యవసరముల కుపయోగపడుచుండెడివి స్వామిభక్తికి శునకమునకు పెట్టినది పేరు. అది వేటాడుటయందును, శత్రువుల పసిబట్టి పారద్రోలుటయందును తమ యజమానుల కుపయోగించును. 'ఆరెమరాశీల కథ' లో సిద్ధోజి పంపిన దొంగలు సోమోజిరావు తల గోసికొనిపోయి మూడామడ చేరుకొన్నను సోమోజి తమ్ముడు ఫీరోజి తన కుక్కల నుపయోగించి యవి పసిపట్టి పోయిన మార్గమున నడచి చివరకు దొంగలను పట్టుకొనెను. కుక్కలే యా దొంగలపైబడి వారిని హతమార్చెను. నేడు కుక్కల నపరాధ పరిశోధకశాఖవారు ప్రత్యేకశిక్షణముతో బెంచుచున్నట్లు మనమెరుగుదుము.

'సారంగధర పాట' లో తొందరపడి సారంగధరుని శిక్షింపగూడదని చెప్పిన కథలందు బ్రాహ్మణబాలుని పెంపుడుముంగి సర్పముబారినుండి కాపాడి తొందరపాటుచే నాబాలుని తండ్రిచే చంపబడినట్లు వర్ణింపబడినది. 'లంకా యాగము' పాటలో సీతకోరికపై శ్రీరాముడు పగడసాలలు పంపవలసినదిగా సముద్రునికి కమ్మనంపెను దానిని కాకికాలునకు గట్టి పంపెను. కాకులు గూడ వార్తావాహనమున కుపయోగపడెనా? 'కాకితో కబురంపుట' యనునది దీనివలననే పుట్టెనా? ఇదేపాటలో ఆంజనేయుని తోకకు రాక్షసులు 'పట్టు చీరెలు మంచి వాణీల గుడ్డలు పరకాల జల్తారులూ' కూడ చుట్టి నిప్పంటించిరి. తెలంగాణమందలి పరకాల తివాసీలకు ప్రసిద్ధిగన్నది. పరకాల తాలూకా మొన్న మొన్నటివరకు కరీంనగరమండలమున నుండెను. కరీంనగరమండలము జల్తారు పరిశ్రమకు పేరెన్నిక గన్నది. పూర్వము పరకాలలో గూడ నీ పరిశ్రమ యుండెను కాబోలు. పరకాల పేరుండుటచే నీ గేయము తెలంగాణమునకు సంబంధించినదేమో యని నా యనుమానము.

## వేషభూషణములు

కాలానుగుణముగా మనుజుల యభిరుచులు మారుచుండును. తత

దుచితముగా వేషభూషణములందును మార్పులు కలుగుచుండును ఒక క్రొత్త వేషము వచ్చి ప్రాత వేషమునకు స్వస్తి చెప్పిన, ఒక క్రొత్త భూషణము వచ్చి ప్రాత భూషణమును వెక్కిరించును. క్రొత్తజాతుల సంపర్కమున, వాని యనుకరణమున ఇట్టి మార్పు లధికముగా గలుగుచుండును ఇప్పటికి రెండు తరముల క్రిందనున్న భూషణములు నేడు మాసిపోవుటయే గాక పేర్లుకూడ తెలియకుండునట్లు ప్రాతపడి పోయినవి. మన నాయనమ్మలు ధరించిన ముక్కెర, బులాకి, బవిరెలు, కుంటెండ్లు, పట్టెడ, నాను, పిల్లెండ్లు మున్నగు భూషణములు ముంతగూడులందు దాగియుండుటో లేక అగసాలి కుంపటిలో కరగిపోవుటో మన మెరుగుదుము. పల్లెటూరివారు ధరించెడు పూసలు మరియు అద్దముల రవికెలు నేటి నవనాగరికనారీమణులు ధరించుచున్నారు. ఒకప్పుడు నాగరికులమనుకొను వారు బాహుమూలరుచు లగుపడునట్లు జాకెట్లు ధరించెడువారు. ప్రస్తుతమవి మోచేతిని గూడ దాటిపోవుచున్నవి. వేణీబంధము లెన్నియో విధముల మారు చున్నవి. రామాయణకాలమునాటి త్రిజటలు లేకున్నను ఏకవేణి, ద్వివేణి వంటివారున్నారు. పురుషుల వేషములందు గూడ ఇట్టి మార్పులే వచ్చినవి ఒకప్పుడు పురుషులు గూడ స్త్రీలవలె శిఖ లుంచెడివారు. పూలు ముడిచెడివారు. ప్రకృత మవి మాయమై పోయి మరియొక రూపు ధరించినవి. మీస మొకప్పుడు పౌరుషచిహ్నము. ప్రకృత మది మోటు. సినిమా కళవలన దేశదేశవాసుల వేషభూషణములు చూచియు, సినిమా నటీనటుల వేషములు చూచియు ప్రజలలో మార్పులు వచ్చుచుండుట అందరెఱిగిన విషయమే. జానపదగేయములందు, మన యవ్వలు తాతముత్తాతల వేషములు వారు ధరించెడు భూషణములు గోచరించును. కొన్నింటి పేర్లు మనకు తెలియవు. ఈ సందర్భమున నిఘంటువులు కూడ మూగనోము పట్టును. భూషణవిశేషమని తప్పుకొన జూచును. ఏయే భూషణము లెట్టివో వాని యాకారమెట్టిదో ఇదమిత్థముగా తేల్చికొనజాలము.

'పల్నాటి వీర చరిత్రము'న నలగామరాజు కొలువుకూటమున కేతెంచు నపుడు 'భుజియించిన తరువాత పునుగు జవ్వాజి, కస్తూరి రసమును గలిపిన యట్టి, శ్రీ చందనము మేన చెలువుగా బూసి, తగటు కూసంబులు ధరియించి తలకు, ఒక వింత యుష్ణీష మొప్పుగా గట్టి, నవరత్నమాల కంఠంబున వ్రేల, దండిగా కర్ణకుండలములు మెరయ, భుజకీర్తు లనియెడు భూషలు దాల్చి, మేనికి రక్షయై మించు తాయెతులు, దండచేతుల రెంట ధారణ చేసి, మురుగులు గొలుసులు ముంజేతు లందు, తిరముగా వ్రేళ్ల ముద్రికలను బెట్టి, నవరత్నఖచితంపు నడికట్టు దాల్చి, గండపెండేరంబు కాలికి బెట్టి, బంగారు దుప్పటి

పైనను గట్టి, పావుకోళ్ళను రెండు పదముల దొడిగి' బయలుదేరెను. పూర్వకాలపు భూషణములు వింతగా నున్నటులే వారి పేరులు గూడ వింతగా నుండును. ఈనా డాపేరులు మోతై పోయినవి. నలగాముడు, మలిదేవుడు, కన్నమనీడు, అనపోతు, ఐతమ్మ, రేఖాంబ, మాదచి, యాచమ, చందమ్మ, మాంచాల, పేరమ్మ వంటిపేరులు నేడు వినబడవు.

స్త్రీల వేషభూషణము లెట్టివో గమనింపుడు. చెలికత్తెలు మాంచాల నలంకరించు ఘట్టమున నివి కానవగును. మాంచాలకు సంపెంగ నూనెతో తలయంటి మంచిగంధమున అటకలి రాచి, పన్నీట జలకమాడించి,తడి యార్చ పొడి వస్త్రములు చుట్టి,'దీర్ఘమై నునుపులై తీరైన కురుల, కూర్చి సున్నగ దువ్వి కొప్పు గీలించి,బంగారు పూచేర్లు బాగుగా జుట్టి,మదనకుంతమునకు సమంపు పాపటను,మణిహేమ మౌక్తిక మండితంబైన,చేర్చుక్క జేరిచి చిత్రంబుగాను,పొలుపొంద శశిరవిభూషణయుగము, పాపట కిరువంక భాసిల్ల నిలిపి, మాణిక్య హాటకమయ ఓంబ మొకటి, తలవెనక మెరయగ దట్టించి రెలమి'.మరియును ఫాలమున బొమలు రెంటికి మధ్యన కస్తూరి తిలకము దిద్ది, ముక్కునకు ముత్యంపు ముంగరబెట్టి, గండభాగముల కస్తూరికామకరికా పత్రములు వ్రాసి, చెవులకు'తాటంక భూషణ ద్వయము గీలిగించి, ముత్యాలకుచ్చులు మునుకొని వ్రేల,బవిరలు కుంచెండ్లు పసమీర బెట్టి, కర్ణాగ్రదేశముల్ కాంతులసీన,తుప్పెల ముత్యాల కుచ్చుల రెండు, ఘన కుంతలంబుల గదియించి మరియు' మేనికి కాశ్మీర కర్పూర కస్తూరులు కలిపిన మలయజ మలది,బంగారు పువ్వుల పట్టు కంచుకము దొడిగి, దూముడి వేసి,ముత్యాల రత్నాల పేర్లు, పతకాలు, పవడాలు,బన్నసరాలు, వక్షమున గీలించి,గళమున ముత్యాల పట్టెడ నలంకరించి,చేతులకు అంగదములు, దండకడియములు దంటతాయెతులు గట్టి, మనికట్టు నెగువ నీలాలగాజులు దొడిగి, పచ్చల కంకణాలు, చామల కడియములు నంధింపజేసి, చేకట్లు ధరియింప జేసి, మాణిక్యతపనీయ మంజులోర్మికల నంగుళుల కమర్చి,పాపట సవరించి, బంగారు తగటు ముయ్యంచు చేలంబు కటియందు సంధించి, గజ్జెలు వ్రేలు తపనీయ కాంచిని దట్టించి ముడిచి, అందెలు గొలుసులు, ఖర్మవినిర్మిత బహువిధదీప్త భూషణంబులు, కాళ్ళకు, కాళ్ళ వ్రేళ్ళకు బెట్టి పదములకు లత్తుక రాచి, కండ్లకు కాటుక బెట్టి,యలంకరించిరి.ఇన్నిభూషణములు నేటి మగువలు మోయ జాల రనుకొందును.

కాటమరాజు కథలో చల్లపిన్నయ్య మున్నగువారు 'కాసెలు బిగియించి గంధంబు బూసి, రాళ్ళు దాపిపయట్టి రాకట్లు దాల్చి, ముత్యాల హారముల్ మురియుచు వేసి,

చౌక్కిట్లు గర్ణముల చయ్యాన దొడిగి, దేదీప్యమగ వెల్గు దివ్యాంబరములు, నవరత్నముల భూషణములు దాల్చి, కడు సూర్య కొటార్ల ఘనముగా బూని, మహదేవ హరహరా మహదేవ యనుచు,' యుద్ధమునకు బయలుదేరిరి. అయితమరాజాదు లీతీరుగా నలంకరించు కొనిరి. 'వజ్రాంగి తొడిగెను వల్లవులరాజు, వింతగా శిరమందు వీరజడ యల్లి, విర జాజులు తురిమి వేడుకమీర, పరగ మాణిక్యాల పతకంబు దాల్చి, పచ్చల కడియముల్ పసి డుంగరములు, మెచ్చయిన నేవళము మెడనూలు వేసి, యడపకా డంతట నాకు చుట్టీయ' బయలుదేరెను. కరియావులన్న 'ధీరుడై నెలవంక తిరుమణి దిద్దీ, కరముల చేమపూ కడియముల్ బెట్టి, మేలైన రత్నాలమెడనూలు వేసి, డాకాలి పెండెంబు ధరియించె నంత, బిరుదులు ధరియించి పరువడి వచ్చి, నలభై మూళ్ల దట్టి నడుమునకు గట్టి, వనరైన చెంగావి వలిపంబు గట్టి' వెడలెను. ఎఱ్ఱయ్య వీరవేష మీవిధముగా దాల్చెను. 'అప్పుడు కట్టిరి హనుమంతు కాసె, వీపులైతలజడల్ వీరజడ లల్లి, విరజాజులను నతివేగ ధరించి, మెడ జాలు గంధంబు మేలు హారములు, శరకుంతములు చేత చక్కగా బట్టె'. నలనన్న యెఱ్రయ్యలు నలసిద్ధిపై బోవునప్పుడు 'కట్టిరి హనుమంత కాసెలు వేగ, హనుమంత కాసెపై రేమంత ముండ్లు, చేమంతి బంతులు చెలగుచు వేసి, కనక వడ్డాణంబు కట్టిరి మీద, మేలు తుమ్మెదరెక్క మీరిన వన్నె, సంపెంగ నూనెచే వంపించి కురులు, వీరజడ లల్లిరి వేడుక పడుచు, ముడిచిరి గేదగుల్ ముంచుకొనియుండ, ఫాలమున కస్తూరి బాగుగా దిద్ది, పచ్చల పులిగోరు పతకముల్ దాల్చి, సన్నపు రుద్రాక్ష సరులు ధరించి, వన్నెగా బిరుదులు వరుస ధరించి' నారు.

'కాటమరాజు కథ'లోనున్న పేర్లన్నియును వింతగా నుండును. కాటమ రాజు, నల్లసిద్ధి, తిక్కన, పల్లికొండ, కరియావులరాజు, పోలురాజు, ముద్దయ్య, పోచయ్య, ముమ్మయ్య, పుత్తమరాజు, పోతినేడు, కోనేరు, కస్తూరిసిద్ధి, బీరన్న, అబ్బిరాజు, అక్కరాజు, అబ్బినీడు, ఓబళు, సాతంనేడు, మరినీడు, దన్నీడు, సాతర్ల పరచి, సంబినేడు, కామినీడు, పామినీడు, బొమ్మినీడు, కొండు, సోమినేడు, బొడెపాగు శింగన, పురుమన, కంబినేడు, కాచు, సందినేడు, మెడ పాగులంకు, మసిలినేడు, మగుచు, బాలినేడు, గుమ్మినేడు, గల్లపాగు బొడ్డు, అబ్బినేడు, ఎమ్ము, బంపు, వేళన, సందునేడు, బొమ్మ, కంబెను, మెరుగుండన, హరినేడు, తిమ్మినేడు, చినగబ్బి, మిణుగురు బొమ్ము, బరకసాని అబ్బి, కొమ్ము కసినేడు, ఐతమరాజు, నాచకూళనాయడు, నేతివారి ముద్దయ్య, భట్టావులన్న, అల్లి దాడెన్న, మున్నగు పురుషనామములును, నూకమ్మ, కొమరక్క, సిరిగిరి, సిరిభోగలింగ, అగుమంచి, మాదమ్మ, అరణప్ప మున్నగు స్త్రీల నామములును నేడు వినబడవుగదా!

అనుబంధమున గల 'భట్టు రాయబారము'న నిరువురు భట్లు తమతమ రాజుల గొప్పదనము చెప్పుకొనుచు ఎదుటివారిని హేళన చేయునప్పుడు సిద్ధిరాజు పక్షమున వచ్చిన రాయశృంగావలిభట్టు కాటమరాజు భట్టుతో 'బోడావుల చెన్నయ బొగడితివి చాల, నేడు బొడిచి గెలిచె నెక్కడ జంపె, చెప్పట్టి కత్తులు చెంప శిఖలె కాని, చెప్పనేమిటి కతని చేత నేమౌను' అనెను. యాదవులు చెంపశిఖలు వేసెడువారని తెలియుచున్నది. కాటమరాజునకు సహాయమునకై పోవుచు 'ధరణీశుడైతన్న తా బయన మయ్యె, జీనాంబరములను జెలువొంద గట్టి, చక్కని ముత్యాల చౌకట్లుపెట్టి, కెంపుల యుంగరాల్ కేల కడియములు, సొంపైన ముత్యాల జోడు హారములు, గరుపెద్ద ధరియించి గండపెండెములు, నడుమున నొడ్డియాణము నేమమునను, మస్తకమున వజ్ర మకుటంబు బెట్టి, కస్తూరి గంధం - గుమొప్ప నలది, చన్నరిపులకు వైరి జమిలియు గట్టి, పున్నమ చంద్రుడై పొంకంబు మెరసె'ను.

వీరిన వెంబడి యున గోసంగి దళముల వేషభూషణములు గమనింప దగినవి

'అమరంగి గోసంగు లందఱు నపుడు, తమ బిరుదు లన్నియు ధరియించి రంత,
కొమరొప్పగా నంత క్రొత్త వల్లడము, కమనీయమగు చంద్రకావి ధట్టీలు,
పులితోలు బిరుదులు పూసి కానెలును, జెలువైన సరిపెనల్ చెంప గంధాలు,
గాటంపు టరిగెలు గంట గాలమును, సొంపైన కుడిసిగలు సిలువు నామములు,
సిగల బువ్వుల చెండ్లు సింహ మరిగెలును, నొకకాల నొరలేటి నొరుగు రుమాళ్ళు,
నొరలు గోసినకత్తు లొనరం జేపట్టి, కిరుచు చేకత్తులు గీరు గంధాలు,
బొగడపచ్చలపేరు బేజాబంధువులు(బాజుబందులా?), తగిన గవ్వలపేర్లు దండకడియములు,
వెలుగు తలాటములు వేడ్క భుజములను, నెలుగు చర్మంబులు నెన్నిగా గట్టి,
నెడవగ బిరుదు లన్నియు సవరించి. యెడమచేతను గొమ్ము యిరవొక్క పేర్చు,
కోపంపు జూపును కోరమీసమును, దాపిన నవరత్న దండకడియములు,
రంగుమీరిన వన్నె రావిరేకలును, .....మెడ పెను నేవళములు,
వాలుగత్తులు సన్న వలిపె దుప్పట్లు, చెలువొప్ప సవరించి చెలగు తప్పెట్లు,
అప్పుడు మ్రోయింప నగుభుగుల్గాను, తప్పెట ధ్వనులకు తాళమానముల,
నడుగుల చిందుల నాడేటివారు, నాటుచో బాడుచు హరిహరాదులను,
వివయాన గంతులు వేసేటివారు, ఘనమైన సింహంబు గ్రచ్చు టరిగెలను,
మొలకత్తి ఝళిపించి మురిపేటివారు, ఎలకత్తులను ద్రిప్పి యంత మెరవళ్ళు,
నడ్డ బెళకులతోడ నట వచ్చువారు, గడలను ద్రిప్పుచు కరుల కైవడిని,
మత్తుగా వచ్చుచు మరి మసలువారు, మొత్తమై గుమిగూడి ముందర నడవ,
మెఱసి గోసంగులు మెండుగా నడువ, బిరుదుల నీడను బీరన్న కదలెను,

బొబ్బిలి యుద్ధములో వెలమ వీరులు 'జాజి పువ్వుల జల్లడములు జగ్గున దొడిగిరి. తాలా తట్టా కత్తులపారి సంకన వేసిరీ' యని కలదు.

ఇప్పుడిప్పుడు మటుమాయమగుచున్న శిరోవేష్టనమునకు మన పూర్వు లిచ్చిన ప్రాధాన్య మత్యధికము. రుమాలు లేనిదే మన పూర్వు లిలు వెడలెడువారు కారు. ఇప్పటికిని నీయాచారము పల్లెపట్టులం దింకను గలదు. ఎవరైన తమ రుమాలు దీసికొన్నచో తల గొట్టినంతకన్న నెక్కుడు బాధ వారికి కలుగును. పందె మొడ్డుటకో ప్రతిజ్ఞ సేయుటకో, రుమాలు నొడ్డుట ఇప్పటికిని గలదు. రుమాలు కుదువబెట్టి యెంతటి యప్పైన గొనెడివారు. కౌరవవీరుల శిరోవేష్టనము లుత్తర బొమ్మపొత్తికలకై కోరుట భారతదేశమున శిరోవేష్టనమున కున్న ప్రాముఖ్యమును సూచించును. 'ఆరె మరాఠీలకథ' లో తనను జంపవచ్చిన నలుగురు దొంగలు పైబడినప్పు డెటులో వారి కొంకులు నరికి తప్పించుకొని సోమోజిరావు తనకోటలో దూకెను. కాని యతని తలపాగ బయటనే పడిపోయెను. ప్రాణములపై ప్రీతి గలవాడైనచో నాతడు తలపాగ నటులే విడిచి పారిపోయినచో నాతని ప్రాణములు దక్కియుండును. కాని యాతనికి ప్రాణముకన్న మాన మెక్కుడు. కనుకనే యాతడు 'నాకు ప్రాణము పోయినా మేలు, నాకు పాగా పోయినది హాని' యని మరల కోట బయటికి పాగకై వచ్చి దొంగలచే పట్టుబడి హతుడయ్యెను.

ఇంతవరకు పేర్కొన్నవి కేవలము చారిత్రకగేయములందున్న విషయములలో కొన్ని మాత్రమే. పౌరాణికములు మరియు స్త్రీల పాటలం దిట్టి విశేషములు కుప్పలు తిప్పలుగా గానుపించును.

'శాంత గోవింద నామము'లను పాటలో శాంతను తన కుమారుడగు ఋష్యశృంగున కిచ్చి వివాహము చేయబోవునప్పుడు మాండవ్యఋషి కోడలి కేమైన కట్నములు గలవా యని భార్య నడుగ నామె 'మొన్న ప్రొద్దటి వేళ, మూసి వాయనంలోని[1], మెట్టెలు మాత్రంబు, నాదగ్గ రున్నవి, నాతికి పెడుతాను, గుండు ముత్యపు వత్తు, కూతురువద్ద నుండె, అది పట్టుక వచ్చి, శాంతిమ్మ కిస్తాను, నా చెవుల మద్దికాయలు, కోడలి కిస్తాను, మొన్న ప్రొద్దటి వేళ, మూసివాయినం లోని, మేనికమ్మియు చీర, ఆచీర యిస్తాను' అనెను. ఇవి సాధారణులు, బీదవారు ధరించెడు భూషణములు. పెండ్లి కొరకై ఇంత ప్రయత్నము చేసినగాని సాగదు. ఇప్పటికిని బీదసాదలు పెండ్లి చేయునప్పుడు తమ కూతుం డ్రమీది సొమ్ములు కొన్ని, తమ యిరుగుపొరుగు

1 మూసివాయనమా? మూసివాయనపు పేరంటాలు అనగా నీచపు దానములు కూడ పట్టు స్త్రీ యని వాడుక.

వారిని కొన్ని తీసికొని పోవుదురు దశరథమహారాజుతో వియ్య మందుటకు బీద ఋషి పడిన బాధలు మన సాధారణకుటుంబములవారి బాధలే. ఇదే పాటలో శాంతావివాహసమయమున ఋషిభార్య సుమిత్రను 'కాసె కోసీ కట్టి, గడపేసి ఆడము, చెంపకొప్పులు బెట్ట, బోగంవాడము కాము, పండ్ల కప్పులు వేయ, తురక సానులం గాము' అని దెప్పి పొడిచెను. కనుక దొమ్మరివారు కాసె కోసి కట్టుదురనియు బోగంవారు చెంపకొప్పులు పెట్టెదరనియు, తురకసానులు పండ్ల కప్పులు (దాసెన) పూయుదురనియు తెలియుచున్నది.

'పుత్ర కామేష్టి' పాటలో శ్రీ రామచంద్రుని కౌసల్య ఈ భూషణములతో నలంకరించెను. 'అందమైన పాదములకు అందెలు మూగాలు, కుందనంపు కడియాలు జైమిన్ని గొలుసులూ, మద్దికాయలు చెవులాకు మకరకుండలమ్ముమ్మలు, ముద్దు రావిరేక నొసట మొలకు గంటలూ, పచ్చపట్టు బట్ట గట్టి పగిడి మొలకట్టు గట్టి, వన్నెమీర బంగారు వత్తు లేసియూ.' 'కంఠమాల మెడలో వేయుదు కంటె పులిగోరు బెడుదు, నల్లనయ్య నీకు వేసెద నాగస్వరములూ, సీలవర్ణ నీకు వేతు చాల ముత్యాల పేస్లు, హారమణులు వజ్రాల జోడు కవచాలూ'. 'శాంతా కళ్యాణము' పాటలో కౌసల్యాదశరథులు శాంత పెండ్లిగూర్చి ముచ్చటించునప్పు డామె కిచ్చుటకీభూషణములను దలపెట్టిరి. గజకంఠమాలలు, పలకసరిపేటలు, చంద్రహారములు, జననాది గొలుసులు, దన్నసరములు, సూడిగమ్మ, దుద్దులు, పోచీలు, కంకణములు, మొగిలిపువ్వు కడియాలు, మురుగులు, సన్నంపుకెంపులు, నందిటీదండలు, పట్టెడ, బాజిబందులు, బావిలీలు, నాగబిళ్ళలు, చేరుచుక్కబొట్టు, వడ్డాణము, పావలు, అందెలు, పాదాల గొలుసులు, మట్టెలు, బ్రహ్మతొడుగులు, మున్నగునవి. దీనిలోనే నల్లపూసలు గట్టుట కూడ సూచింపబడినది. మరియును శాంతను శోభనపు గదిలోనికి పంపుటకుముం దామెకు 'నెలబాల జడ లల్లిరి'. ఇది యొక వేణీబంధవిశేషమై యుండును.

'ఊర్మిళాదేవి నిద్ర' పాటలో ఊర్మిళకు 'కీలు కొప్పమర విడిచి లక్ష్మణుడు నేర్పుతో జడ లల్లెనూ, బొండు మల్లెలు జాజులు జడపయిని శృంగారముగ జుట్టెనూ'. 'శ్రీరాములవారి ఉగ్గుపాట'లో శ్రీరాముని 'మణుల రావిరేక, మద్దికాయల జూక, మకర కుండలములు, మణుల కిరీటముతో' తో నలంకరించి నట్లున్నది. 'పెండ్లి గోవింద నామములు' పాటలో కౌసల్యాది బాలింతలకు స్నానము చేయించి 'పట్టు చీరెలు దెచ్చి, పణతులు గట్టిరి,పాదము కందెలు, పాయవజ్రమ్మలు, ముత్యాల వత్తులు,ముదిత లందించిరి, కెవగపువు రవికెలు, చేడెలు దొడిగిరి, చేమపూ కడియాలు, చేడెలు పెట్టి'రట. 'సీతాదేవి యానవాలు' పాటలో 'మెత్తని కురులకు మృగనాభి యలది, చక్కని కురులకు జవ్వాజి

మలది, అంకబంతులు జుట్టి తిలకమ్ము దీర్చె' నని కలదు. అంకబంతులు వేణీ బంధవిశేషమో భూషణమో తెలియదు. దీనియందే సీతమ్మ 'పెద్ద పూసలపేరు, పుంజాలదండ . దండి వృత్తంబాలు? తరుణి తా బెట్టె'నట. 'శారద రామాయణము, లో రావణు డాంజనేయుని 'అట్టె పట్టి నీ మీసాలు ద్రుంతు'ననెను. 'రామచంద్రుడు ఎగదువ్వి మీసము' అని కలదు. శిష్టు లేలకో రామునికిని ఆంజనేయునికిని మీసములుంచ వెరచిరి. రవివర్మ చిత్రము ందు మీసములు లేవు. కాని జాన పదులు మాత్రము వీరశిఖామణులకు మీసము లున్నటుల చిత్రించి ఔచిత్యమును పాటించిరి. కృష్ణునకు చిత్రములందు మీసములు లేకుంచుటజూచి కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారు ప్రత్యేకముగా కృష్ణునకు మీసములు పెట్టించిన చిత్ర ముంచిరి, 'కుశలవ యుద్ధము'న రామలక్ష్మణు లిరువురును, 'శిఖపై పువ్వుల బంతులు చుట్టి మల్లెమొగ్గలూ సంపెంగలూను, అందమైన ఆభరణములును,' ధరించినట్లున్నది.

'నల చరిత్ర పదము' లో సుమా రొక వంద భూషణముల పేర్లున్నవి. దమయంతికి జానపదు లీ నగలన్ని ఎచ్చట నుండి సమకూర్చిరో? ఇటులే 'శశిరేఖా పరిణయము' 'సుభద్రా కల్యాణము' 'ఉషా స్వప్నము' మున్నగు పాటలందు స్త్రీ పురుషుల వేషభూషణములు విపులముగా వర్ణింపబడినవి. 'సుభద్రా కల్యాణ ప్రారంభము' పాటలో సుభద్ర 'నటన గుమ్మడి తీరు నామంబు దీర్చె' నట. గుమ్మడి గింజ యాకారముగా నుండెడు తిలకమని యర్థము. పింగళి సూరన గూడ అగిసె యాకు బొట్టు, పూర్ణచంద్ర తిలకము, నెలవంక నామము, గుమ్మడి విత్తు నామముల దడవెను1. ఈ పాటయందే సుభద్ర 'కట్టిన చీరెకు అమరున్న రవికె' తొడిగనది. Suit లేదా Matching అని మన మర్థము చెప్పుకొనవచ్చునేమో.

## అలంకరణములు

పురాలంకరణము గృహాలంకరణము పలనాటివీరుల కథాకాలమున విట్లుండెడిది. నాయుడు పంపిన భట్టు రాయబారమునకై నలగామరాజు సభకు పోయినప్పుడు కొలువు శృంగారించిన విధ మీతీరుగా నుండెను. 'కస్తూరి చేతను కలయంగ నలికి, ముత్యాల తోడుత ముగ్గులు పెట్టి, కర్పూర మొదకంబు కలిపి ముందటను, కలయంపి చల్లి నిష్కల్మష భంగి, శ్రీరామ కథలను శ్రీకృష్ణ కథలు, పసన్నిగా వ్రాసిన పటములు దెచ్చి, కట్టిరి గోడలు కనుపడకుండ, మౌక్తికమంజీర మంజుపుంజంబు, వ్రేలాడుచుండెడు వివిధవర్ణముల, ఘనవితానమ్ములు గట్టిరి మీద, నిలువుటద్దములు నిలిపిరి

1. ప్రభావతీ ప్రద్యుమ్నము. పు॥ 171.

దిశల,తంతుపటములు విస్తరముగ బరచి,వన్నెల పట్టములు వానిపై బరచి,పరచిన వానిపై పంచవర్ణముల, రత్నకంబళములు రంగుగా బరచిరి. ఈ వర్ణనముచే ఆనాటివారి వైభవమే కాక చిత్రకళావిలసనము గూడ తెలియుచున్నది. రామకథలు, కృష్ణ కథలు, పటములపై వ్రాసి గోడలు కనబడకుండునట్లు వ్రేలాడ వేసెడువారట.

'గుహాభరతుల అగ్ని ప్రవేశము' పాటలో శ్రీరాము డయోధ్యకు తిరిగి వచ్చు వార్త విని పౌరులు నగరము నలంకరించిన మనోహరదృశ్యము కలదు. 'అప్పు డయోధ్యాపురి అంగళ్ళలోను,వాకిండ్ల కసపులూ పారంగ నూడ్చి,కస్తూరి దెప్పించి కలయంగ కలిపి,కస్తూరి చిలికించె ప్రాంగణము లెల్లా,కర్పూరఖండాలు కలయ ముత్యాలు, ముగ్గు లొప్పుగ బెట్టి ముంగిళ్ళలోను, మొగసాల గోడలా మరుదు గోడలను, చిగురు లొప్పగ జల్లి శృంగారముగను: గోడల మేడల గోపురమ్ములను, వాడవాడల వీథుల వన్నె చిత్రములూ, లక్ష్మి కుంభములు లక్ష్మిప్రతిమలును,లక్ష్మినారాయణుల ద్రాక్ష ప్రతిమలును: అజ గజ తురగములు రాజ హంసములు, రతిమల్లె తీగెలు రాజ హంసములు, బూట కోలాటములు బూర గొమ్ములును,? నాటకాలంకార నవుబత్తుకములు, వలరాజు కొలువులో వన్నె చిత్రములు,పుత్తడి బొమ్మ లిటు పుట్టినట్లుండె,నిండు కుండలు దెచ్చి నింపినట్లుండె, బొడ్డుమల్లెలు పోగు బోసినట్లుండె'.

కాటమరాజు కథలో యాదవులు బొల్లావు నలంకరించిన ఘట్టము రమ్యముగా నున్నది. 'గోవు రూపంబైన గోపాలకునికి, పసిడి బిందెల నీట పాదముల్ గడిగి, అందంబుగా వెదురాకు చందమున, తిరుమణి తిరుచూర్ణము దిద్దిరి తోడ, నలదిరి మేనున నగరు గంధంబు,నటు పున్గు జవ్వాజి యలదిరి చాల,సురయించి కస్తూరి సురటుల విసరి, నాల్గు పాదంబుల నాదుటందెలను, మెండుగా వేసిరి మేలు గంటలను, రత్నాలు దాపిన రావి రేకలును,తళతళ మెరయంగ ధరియింప జేసి, కొమ్ముమన బంగారు కుప్పెను దొడిగి, రహి మించ మెడచుట్టు రంగుగా నపుడు,గోమేధికంబుల గొలుసును వేసె, మురువైన ముత్యాల మువ్వల పేర్లు, గంటల సరసను ఘనముగా వేసె, మూపురముకు జుట్టు మురువు గజ్జలును, సన్న గజ్జలు వేసె సందు సందులను'.

ఐతమరాజాదులు కాటమరాజునకు సహాయమునకై పోయినపుడు వారివారి గుఱ్ఱముల నలంకరించినవిధము మనోహరముగా నున్నది.కొన్ని యలంకరణముల కిప్పుడు అర్థము తెలియరాదు. 'రాజు నెలవందియు రావలన బోయి, వాజుల కన్నిటికి వైన వైనాన. వాగెలు బంగారు వన్నెసమకట్లు, బాగైన కట్టాణి బన్నసరములును, బిగిలితలాటలు బిరుదు జల్లులును,వకలంక బంగారు టందెలు ....బాలార్క బిళ్ళల పగడ దేవళలు. పాల సంకుల పేర్లు వసువు రుమాళ్లు, నెచ్చైన బిరు దెండు ముఖముల అందె, వచ్చువి బంగారు వల్లము వేసి,తళుచైన బంగారుటంగీ బిగించి, వరిగె పట్టనములు పైవి నవతించి, పిగెబందు జేరాలు సింగిణీ విండ్లు, తగగ బొమిడికములు తగ ధరియించి:

యుత్తరరాజుకు...... కత్తుల కల్లెంబు కంచుపక్కెరయు, ముత్యాల ముఖమణుగు మూడు ముఖములది, వింతగా రిపులపై విజయంబు నొందె, కొంతైన చా(జా)కువ గొలుసు లిగ్గదల, బంతగించిన క్రియ పట్టుకరాగ, నయితన్న యెక్కేటి అపురూపరాయనికి, రావి రేకలు మణి రత్న భాషికము, లావణ్యఖనియైన లాలు సరిజల్లి, అసురవ అఖముల అద్దె హనుమంత బిరుదు, పసిమించు నెత్తిగోపాలమను బిరుదు, వేగంబె ధరియించి వేడుకతోను, వరభక్తి భట్టావుల వలభన్న యెక్కు, తురగంబునకు నొక్కతొండ పల్లము వైచి, సరిజోర రత్నాల సరిపెన వేసి, అతివేగ అల్లు దాడెన్న యెక్కేటి, ఉన్నత హయముకు నొనర వేగంబె, పులితోలు పల్లంబు పొందు వాగెయును, బసిఁడి తలాటంబు పటువైరి అందె, పసి మించు పువ్వుల పేరులు వేసి, కరియావుల నెక్కు గండ కత్తెరకు, బిరుదైన మువ్వల పిగిలి జల్లులును, దక్కన గుత్తాల తగవఫంజోళ, పక్కెర తేజీల పల్లన కట్టించి, మావంటి కదు మర్లు మరివేగ వచ్చి'. ఇందులోని భూషణము లధికముగా మనుజులు ధరించు భూషణములవంటివే. గుఱ్ఱమునుగూడ నింతగా శృంగారించుట జూడ వారి యలంకరణప్రీతి గోచరించును.

ఎద్దులు, ఏనుగులు, గుఱ్ఱములు, ఆవులనే కాక ప్రీతి పాత్రములగు సమస్త జంతువుల, పక్షుల నిటులే యలంకరింతురు. పెద్దాపురపు కోడి పందెముల కథలో కోళ్ళ శృంగారము వాని భోగము వర్ణింపబడినవి. విజయనగరంవారి కోడి విడికోడి. దాని వైభవము గమనింపుడు. 'అందెల సరసను బంగారంపు గొలుసు లుంచినారు, పట్టెడుదు జుట్టుకు బంగారంపు జూలే కట్టారు, ముక్కుకు అయినా మూడు వేలది బులాకి పెట్టారు, సింహతలాటం కడియ ముంచిరీ విడికోడీకండి, మెడ లోపలనూ పది వేలాది వజ్రపు పేరుంది, కట్టి పేయను మేత వేయను కాసా లిద్దరుగా, వచ్చి పాలలో శనగ పిండియు కోడికి మేపారూ, వైభోగముతో ఉన్నాదండి విడీకోడిపుంజు.' ఇంతవరకు సాధారణమైన పెంపుడు జంతువుల యలంకరణమే చూచితిమి కాని 'బంగారు తిమ్మరాజు కథ'లో భయంకరములగు మొసళ్ళకు గూడ శృంగారము చేయబడి నట్లున్నది. పిల్లలులేని దేవరాయలు మొసళ్ళను బెంచిరి. 'ముంగు ముక్కెరలు కర్ణ పుష్పముల మొసళ్ళు గలవండి, కంఠకోరలు కాలియందెల మొసళ్ళు గలవండి'. దేవరాయ లిట్టి విపరీతజంతువులకు గూడ భూషణములు సమకూర్చుట వింతగా గానుపించును.

'అడవి అనే చర గోవిందనామములు' అను పాటలో సీతాన్వేషణము సేయుచు ఆంజనేయుడు లంకలో 'పాకశాలలు దిరిగి, పణతి సందున వెదకి, అంతః పురము జేరి, అచట పుష్పక మెక్కి, రావణశయ్యపై' నున్న మండోదరిని చూచెను. ఇచ్చట పుష్పకమనగా నొక భవన విశేషము. 'సీతాదేవి వేవిళ్ళు' పాటలో రామ చంద్రుడు 'గాజు లమరించినా గడపలు దాటి, ముత్యా లమర్చినా ముంగిళ్ళుదాటి, వగడా

లమర్చినా పందిళ్ళు దాటి, పచ్చ లమరించినా పందిళ్ళు దాటి' పోయెను. 'ఉషా స్వప్నము' పాటలో 'చిత్తరువు చవికెలు' వర్ణింపబడినవి.

కాటమరాజు, పల్లికొండ కొమరక్కలకు పంపిన లేఖలను గొనిపోయిన కాలారి మధ్యేమార్గమున నొక యేరుకడ ముఖము కడుగుకొని'పొసగ తిరుమణి చాదిబొట్టు ధరియించి, పలుతెలుంగుల సూర్యప్రార్థనము జేసి, మడమొప్ప నాఁద్దిమూటయు విడిచి, సదయుడై కడుపార చద్ది భోంచేసి' ప్రయాణము సాగించెను. పయనించి పయనించి యాతడు 'పడమట నంజాము పర్యంతమునకు' ధనకొండ పట్టణము చేరుకొనెను. ఆ పట్టణమున నాతడు 'ఘుమఘుమ వాసించు కుంద జవ్వాజి-కమనీయ మగు మంచి కస్తూరి యగురు, జాజిమించిన మంచి జాతిసంపెంగ, భావింప మొల్లల పరిమళంబులును, నా బావులను జూడ నమృతోదకములు, మెలికల సోపానములు మించియుండు' ట గాంచెను.

'కుశలవ యుద్ధము'పాటలో వాల్మీకి యాశ్రమమున శ్రీరామచంద్రునకు 'ఫలహారములు బిండిపోకలును, మణుగుపువ్వులు యడకజములు, పూతరేకులు అతిరసములును, బొబ్బట్లు గారెలు మొదలుగానూ' వడ్డించిరి.

'విరాటపర్వ పదము'న నెన్నియో పిండివంటలు వర్ణింపబడినవి. వానిలో కక్కరాఁను పదార్థముగూడ గలదు. ఇది కర్కరా (కరకర) శబ్దమేమో?[1]

## వాద్యములు

పూర్వకాలమున నున్న వాద్యవిశేషము లిప్పుడు కానరావు. పల్నాటి వీర చరిత్రమున పేర్కొనబడిన వాద్యములు పెక్కులు. సైన్యముల ముందర నడచిన వాద్యము లీవిధముగా నుండెను.'ముందు దమాయీలు మురజసంఘంబు, బూరలుభేరీలు పోటుధారలును, కాహళ పంకిజి కాలికొమ్ములును, శంఖసమూహంబు సన్నాయి జోళ్ళు, మురళిచయంబు ముఖవీణ వితతి, నగరలు తప్పెటల్ నయమైన డోళ్ళు, తమ్మటమ్ములు నెంచదగు వీరణములు, ఘనమైన రుంజలు కనక తప్పెటలు, చేగంటలును మరి చిరుగంట చయము' లానాడు వాడుకలో నున్న వాద్యములు. కాటమరాజు కథతో నల్లసిద్ది యుద్ధమునకు బయలుదేరి రణభేరి వేయించగనే'నపిరీలు పట్టిరి నాదెడలేక, బూరగల్ కొమ్ములు భువి దద్దరిల్ల, తప్పెట్లు తుడుములు తటచు వాద్యములు, భేరి నాదులకు తప్పెట్ల మోదులకు,ధారుణీశుని దండు ధర తల్లడిలెను'ను. పోరునకు దలపడునపుడు 'తుడుములు కొమ్ములు దుది మేర లేక,యన్నిట మ్రోయించి రగుభుగుల్ గొనగ'.కాలారి కాటమరాజు లేఖల గొని ధనకొండకు బోయినప్పుడు'అరల వాద్యములును అంగళ్ళ వెంట-చెలగుచు ఘోషించు శంఖకాహళులు' చూచెను.

---

1 కక్క = మాంసఖండము (బొమికెతో కూడినది)

కాటమరాజు స్వయముగా తానే పోరాడబోయినప్పుడు 'శంఖులు గవ్వలు లగ బూరుగలు,బింకపు భేరీలు ఓరుదు కాహళులు,రావణవీణెలు ఓజతదండెలును,గోవింద ణెలు గొప్ప వీణెలును, దండెలు వీణెలు తఱచు గిన్నెరలు, మెండైన రావణ మేడి గాస్త్రములు, భేరీ ఢమామీలు పెద్ద గౌరులను, బూరలు దారలు పోర కలఁగంగ'నుండెను. ఘనమైన శంఖములే కనకతప్పెటలు–ఘనమృదంగంబులుఁగర్దచేయులును' కూడ ఉండెను.

'లంకాయాగము'పాటలో రావణుడు సీత దరికి 'తప్పెట్లు బూరగలు తారలూ శంఖులూ భోరుగలుగ వెడలెనూ', తారలు కూడ నొక వాద్యవిశేషమని తెలియు చున్నది.'కుశలవ కుచ్చల చరిత్రము'న కౌసల్యాది గర్భభరాలసలు 'రుద్రవీణెలు మీటరు కొమ్మలునూ' అని వర్ణింపబడినది. ఇది యొక వీణాభేదము. ప్రస్తుత మంత వాడుకలో లేదు.పూర్వ మిది బాగుగా ప్రచారమున నుండినట్లున్నది.కదరీ పతి తన శుకసప్తతిలో రుద్రవీణలను పేర్కొనెను.'సీతా కల్యాణము' పాటలో ఘుమ్మ ఘుమ్మనుకొంచు రొమ్ముతాళాలు' వాయించిరట. రొమ్ముపై గట్టుకొని వాయించెడు తాళములు కాబోలు.'నల చరిత్ర పదము'లో దమయంతీ వివాహవేళ అల్గోజు మేళంబు లాదివ్యవాద్యములు' మ్రోగినవి. అల్గోజు=చిన్న సన్నాయి.

'వరదరాజు పెండ్లిపాట'లో గూడ రుద్రవీణల ప్రసక్తి కలదు.'ఆ రాత్రి రుద్రవీణ లతివలంత మీటగా'ననుటచే నిది పూర్వమున చాల ప్రచారమందున్న వాద్యమని తెలియుచున్నది.

## వినోదములు

'పల్నాటి వీర చరిత్రము'న నలగాముడు నాయకురాలితో రాచకార్యములు చెప్పునప్పుడు బ్రహ్మనాయని సైనిక వ్యవస్థాలోపమును హేళన మొనర్చుచు 'ఒక నెల మించెనా యోర్వరు బంట్లు,దొరబంటు మేరలు తొలగుచునుండు, కార్యముల్ చెడిపోవు కలిమి లేకున్న, ప్రతిమల నాడగ బట్టిన యట్లు, నాటకవిధమున నాయుడు చేసె' నని నిందించెను.ఆనాడు ప్రచారమున నున్న తోలుబొమ్మల నాటకములను పైపంక్తులు తెలుపుచున్నవి.

మన పూర్వు లాడిన ఆటలెన్నియో మనకు నేడు తెలియరావు. నిఘంటువులు కేవలము క్రీడావిశేషమని తప్పుకొనును.పల్నాటివీర చరిత్రమునకొన్ని యాటలు పేర్కొన బడినవి. బ్రహ్మనాయుడు మున్నగువారు యుద్ధ రంగమునకు బోయినప్పుడు బాలచంద్రుడు మేడపియందు సంగడికాండ్రతో నాట లాడుచుండెను 'పరమోతు కతచేత బాలచంద్రుండు. సంగడిబాలురు చనువున గొలువ.

రమణీయమైనట్టి రాచిల్క చదువు, పసుచు వేడుక పుట్టి పిచ్చుల విడిసి, గుమ్మడికాయలు కొంతసేపాడి, చెరుకుల పందెంబు చెల్వొప్ప గెలిచి, తన సంగడీలకు దయతోడ నిచ్చి, తమ్ములు వెంటరా ధామము చేరెను.బాలచంద్రుడు తల్లితో ప్రొద్దు పోవుట లేదన్న నామె 'ముద్దుల కొమరుని మోము వీక్షించి,ప్రొద్దు పోవకయున్న పుత్రరత్నంబ,పోకలాటల చేత పుచ్చుము ప్రొద్దు,అడుడి మత్యమ్మ లమరు బంతులను,గుంతమాపల నాడికొని గెల్చి కొనుము,బైట నాడగ వద్దు బడలేవు సుతుడ,కుంకుళ్ళ కుల దెచ్చి గుడిలోన నుంచి,విడిపించి పోరాడు విధమును జూడు, రూకల కుప్పలు రూఢిగా నాడు' కొను మనెను.కాని యవి నచ్చక బాలుడు తల్లితో 'బొంగరాలాడగ బుద్ధి జనించె, నెలవిచ్చి పంపుము శీఘ్రమె మ' మ్మని తల్లిని ప్రార్థించెను. తల్లి మొదట బొంగరములాట కిష్టపడకున్నను బాలుని పట్టుదలచే నామె కుమ్మరపట్టికి రెండు వేలతో, చాకలి చందుకు మూడు వేలతో, కంసాలి చందుకు నాలుగువేలతో,కమ్మరికి ఐదు వేలతో, వెలమల పట్టికి ఆరువేలతో, బాపనికి పదివేలతో, బొంగరములు చేయించి యిప్పించి 'నారాయణుండైన నాయునికొడుకు, బాలుని చేతికి పంద్రెడు వేల, తీరిచి వన్నెలు దీరిచి పైన,సకల రత్నంబులు సంఘటియించి,మణులును వెండితో మొనల గదించి'యిచ్చెను. బాల చంద్రాదులు బొంగరము లాడ 'సేవకుల్ తగరుల శృంగారపరచి,పసిడి పల్లంబులు బాగుగా గట్టి, పట్టు జాలెలు దెచ్చి పరుపడి గప్పి, ముందర నిలిపిరి ముద్దు పొట్టేళ్ళ, బాలచంద్రుండును భ్రాతృసంచయము,పేడ్క మీరగ వాని వీపుల నెక్కి,కమ్మర గరితలు గణము లుప్పొంగి,వింజామరల బట్టి విసరుచునుండ,గచ్చకాయలు కొన్ని కలిగిన యట్టి, తిత్తులు చిరుతలు తీరైన గొడెలు,జూద మాడుటకై సొగటాలు కొన్ని,బంతులు పిట్టలు పంజర చయము,పేరైన డేగలు పిగిలిపిట్టలును, శారికావళి కీరసంఘంబు మఱియు, ఆటల సాధనా లవి వెంటరాగ' పోయిరి బాలుడు యుద్ధమునకు బోదునన ఐతమ్మ తాను సంతానార్థమై పడిన కష్టములు చెప్పి 'తాడెక్క పురుషుని తల్లికి అన్నె, గడమీద నాడు కర్కశుని తల్లికిని, భూమిని తల్లికి సుఖమేమి లే'దనెను. అనాడు త్రాడు పైనను గడల మీదను ఆడెడు వారు (దొమ్మరులు) ఇట్టి వినోదములు ప్రజలకు సమకూర్చుచుండిరి.

కాటమరాజుకథలో యుద్ధవిరామసమయమున కాటమరాజు వీరతమగము పై సొగటా లాడెను.బొల్లియావు బోయలతో చేసిన యుద్ధము 'వింతగా పున్నమ వెన్నెల గాయ,సంతత బిల్లదీపు లాడినయట్లు'దోచెను.ఇది యొక బాలక్రీడావిశేషమట. గొసంగులు యుద్ధమునకై బయలుదేరి 'తప్పెట్ల ధ్వనులకు తాళేల యనుచు,నప్పుడు చిందుల నాడి పాడుచును' వచ్చిరి. యుద్ధమున పంతములు దెలియుటకొరకు పద్మరాఘవునితో కాటమరాజు సొగటాలాడెను.బారపందెములు, చక్కపగడలు, అయిదు కర్రలు, తెలుపునలుపులు, మున్నగు విశేషములు వివరముగా నచటనే

తెలుపబడినవి.కీ.శే. ప్రతాపరెడ్డిగారు తమ సాంఘికచరిత్రమున నిట్టి వినోదముల వివరములు తెలిపియున్నారు.ముమ్మడయ్య మృతికి పోచయ్య విచారించుచు 'వాలవా యో ధీర వంశ వర్ధనుడ, వాలవాలో నీకు వల్లవుల మామ' యని వాలలు పాడెను. ఏల పదమే ఓలగా వాలగా యేలగా మారినది.వినోదమునకు భక్తికే కాక ఏడ్పుటకును వాల లుపయోగపడుచుండెడివి కాబోలు. నలనన్న యుద్ధమునకు బయలుదేరు నప్పుడు దేవతలు దీవించిరి.దేవకన్యకలు'కల్యాణమే గౌరి కల్యాణమనుచు'పాడిరి. ఇది ప్రసిద్ధమగు పెండ్లిపాట. ఆనాడు గూడ ఈ పాట ప్రచారమందుండెనని తెలియుచున్నది.

కాటమరాజు గారి లేఖలను గొని కాలారి ధనకొండ సమీపించెను, అప్పు డాతడు'ఒప్పైన ధనకొండ యూరి ముందరను,చెప్పచోద్యంబైన చాలురావులును,నచ్చట కలిగిన నటకు చేరువను,రచ్చగా గూర్చుండి రాజు తమ్ముడును, నమ్మనిజాధీశు నల్లడైనట్టి, ముమ్మయ్య పోచయ్య ముద్దు బాలుడును,గొమరొప్ప జగజంపు గొడుగుల నీడ,నమరంగ బొంగరా లాడుచునుండె'గాంచెను బొంగరములాట తెలుగు జాతీయ క్రీడ. పల్నాటి వీరచరిత్రమున బాలుడు బొంగరము లాడెను. బొంగరములాట ఊరి బయట నాడుట పరిపాటియని తెలియుచున్నది. ఊరిలో నాడినచో వచ్చి పోయెడువారికి దెబ్బలు తగులును. బతాంబ బాలునికి బొంగరము లిచ్చి. 'మేడపిలోనుండి మేలుగా వెడలి,ఉత్తరదిశయందు ఒప్పుచునున్న, చాలురావులకాడ సరసమైనట్టి, రమణీయమగు మొల్ల రావి క్రిందటను, ఆడుడి బొంగరా లానంద మెసగ' ననెను. రెండు గేయము లందును చాలురావులు కాననగును.చాలుగానుండెడు రావిచెట్ల నీడలో బొంగరము లాడినట్లు తెలియుచున్నది. కాటమరాజు కథయందు ఆరంభమున గ్రంథకర్త యగు పినయెల్లయ 'వలనొప్ప శ్రీనాథు వచన పద్ధతిని'తాను వ్రాసినట్లు చెప్పు కొనెను. అతడీ గ్రంథమును బాగుగా పరిశీలించె ననుటకు గల పెక్కు యుదాహరణములం దిది యొకటి.

కోళ్ళపందెములు తెలుగువారికి జాతీయవినోదము.పల్నాటి యుద్ధకారణము లందు కోడి పోరొకటి. మల్లన రచించిన 'కోళ్ళ పోట్లాట' లో గురిజాలవారు మాచెర్లవా రుభయులు పెట్టుకొన్న కోడిపందెము లద్భుతముగా వర్ణింపబడినవి. బ్రహ్మనాయుని కోడిపేరు 'అర్ధనారి' యనియు 'చిట్లు మల్ల'డనియు కలదు. నాయురాలి కోడిపేరు'నల్లమల్లడు'.బొబ్బిలికథలోకూడ కోడి పోరొకయుద్ధకారణ మైనది. విజయనగరమువారికి బొబ్బిలివారికి జరిగిన కోడి పందెములందు బొబ్బిలివారి కోడి గెలిచెను. అది విజయరామరాజుగారి కవమానముగా నుండెను.

బొబ్బిలికథలో కోళ్ళ పేర్లు చిత్రవిచిత్రముగా నున్నవి. ఇందులో కాసా కోళ్ళు వర్ణింపబడినవి. హజ్షీలను కాసాలందురు. అంతఃపురములందు ప్రత్యేకముగా (ఖాస్) పనిచేయునట్టివారు కాసాలు. రాజుగారే ప్రత్యేకముగా నొద్దునవి కాసాకోళ్ళు కాబోలు; లేదా కాసాలు పెంచిన కోళ్ళు కాసాకోళ్ళయియుండును. ఇటులనే చౌదరికోళ్ళు, బారాకోడి, నెమలిపొద కోళ్ళు, ఎత్తుడు కోళ్ళు, దింపుడు కోళ్ళు చెప్పబడినవి. పోట్లాటకు జాగ్రత పరుపబడినవి; (Reserve) ఎత్తుడుకోళ్ళు, రంగమున దింపబడినవి, దింపుడు కోళ్ళు. యుద్ధసమయమున నొకవైపు ఫిరంగి గుండ్లు బయటనుండి వచ్చి దివాణములో పడుచుండగా మరొకవైపు వెంగళ్రాయుడు 'కోడిపందెము ఆడుతు తాను కొలువున ఉన్నాడు'. ఇది బొబ్బిలివారి వినోదపారవశ్యమో లేక వీరశాంతమో తెలియదు. ఇదే పదమున

'చంద్రశాల మంటపమందున రంగయ్య దొరగారు
పగడసాలయు ఆడిన వెనుక సాముకు పోదాము' అని కలదు. పగడసాలాడుట, సాముచేయుట రంగారావుగారికి నిత్యవినోదములు. 'పగడసాలాడంగ ప్రమదంబు నొంది, జగతీశ యిచటికి చనుదెంచినపుడు, నిను చిన్నపుచ్చుట నీతికాదింక' యని రాఘవార్యుడనెను1. పగడ యనగా పాచికల మీది ఒంటిచుక్కయని నిఘంటువులు చెప్పుచున్నవి కనుక పగడసాల యన్నను పాచికలు, సారెలు, సొగటాలన్నను ఒకటే కాబోలు.

యుద్ధకారణముగా పరిణమించు కోడిపందెముల వినోదము పరాకాష్ఠ నందినది 'పెద్దాపురము కోడి పందెములు' కథయందు. పదమునకు పేరుగా పరిణమించిన ఈ వ్యసనము తెలుగువారికి దానియందున్న యాసక్తిని చెప్పక చెప్పుచున్నది. పల్నాటి యుద్ధమున నెడ్లకును కాటమరాజు కథలో నావులకును పేరు లున్నటులే ఈ కథలో కోళ్ళకు గూడ తీరుతీరుల పేర్లున్నవి. విజయనగరం వారిది 'విడికోడి'. పెద్దాపురం వారిది 'పూలకోడి'. ఆనంద గజపతి వత్సవాయి జగపతికి 'తోటపల్లి జగ్గప్పధారను వెంట బెట్టుకొని, నాలుగుజోళ్ళ ఒవిరీలాను చవులాలాలు, దచ్చాలాలు ఖురంగులాను బొంబాయీల, నాలుగు జాతుల పికిలిపిట్టలా వెంట దీనికోనీ, పూల కోడినీ పట్టించూకూ బలు వేగము రండీ' యని యుత్తరము వ్రాసెను. ఆ యుత్తర మందుకొని జగపతి తన కోడి పందెకాండ్లకు 'జాబులు చేరిన తక్షణమందున మీరందరు రండి, చవులాలాల సబ్జాలాల కురంగీల బొంబాయీల దేగాలబపిరీల, చేతబట్టుక అయిదోనాటికి నా భేటికి రండి' యని జాబులంపెను. ఇవి యన్నియు కోళ్ళ తెగలు కావచ్చును.

---

1. నళ చరిత్రము-ద్విపద.

కోడి పోరుతోపాటు ఇతరపక్షుల పోరాటముగూడ మనవారి కొక వినోదముగా నుండెడిది. పై కథయందే 'దొండ పండ్లనూ కట్టించారూ జాల కట్టిమీదా, పండ్ల కొరకు పిట్టలు అన్నీ పోట్లాడినాయి.' పిట్టలు పోట్లాడుచుండగా చూచి యానందించెడువారు. పోరాడుచుండగా చూచి యానందించెడు మనోవృత్తి మానవున కనాదిగా వచ్చుచున్నట్లున్నది.

'బంగారు తిమ్మరాజు కథ'లో భోగము రంగసాని దేవరాయల యెదుట 'కర్ణాటకమూ భరతపద్యాలూ కండ్ల జూపినాదీ, మొగ్గలు వాలీ మోలీ బగనా కండ్ల జూపినాదీ, చితార్చిచే ఫిడేళ్ళతో పాటలు పాడింది. నేడు భోగము మేళములు పోయినవి. కనుక మోడి కట్టుటవంటి విద్యలిప్పుడు కానరావు. పైనున్న మోళీ మోడియే. మోడి యనగా గణికాదులు మొగ్గవాలి కాలికి సమీపందుంచిన వస్తువును నాలుకతో నెత్తుట. మోడి యనగా పందెమని రూఢ్యర్థమై పోయినది. తక్కిన విద్యలు నాట్య సంగీతములకు సంబంధించిన వినోదములు. రెండవసారి రంగసాని ప్రదర్శనమునకు 'నల్లగుండా కుమ్మరీలను రాయలు పిలిపించె, నాలుగు వందల పచ్చి బానలు వేగమే ఆనించె, నాలుగు వందల అరిటాకులు వేగమే కోయించె, బానమీదనే అరిటాకులు దొంతరగా నిల్పి, ఆకు మీదనే వడ్లగింజలు ఎత్తుగాను బోసి, సూదిమీదనూ ఏడు సూదులు దొంతి బెట్టినాది, ఏడు గడియలూ ఒంటికాలితో నాట్య మాడించి'. ఇది యానాటి గణికల చాతుర్యమును వినోదమును చాటునట్టిది. నల్లగుండ తెలంగాణమందలి నల్లగొండ యేమో? నల్లగొండ భువనగిరి ప్రాంతపు కుండలు, కూజాలు ప్రసిద్ధి గాంచినవి. తిమ్మరాజు తన భార్య మాణిక్యాలదేవి నగరుకు పోయినప్పుడు 'నాలుగు వందల కీలుబొమ్మలూ నాట్య మాడినాయీ, నాలుగు వందల కంచు బొమ్మలూ నాట్య మాడినాయీ, పైడి బొమ్మలూ తిమ్మరాజుకూ అత్తరు బూశాయి' రాజులిండ్లయందు వినోదమునకై యిట్టి జంత్రపు బొమ్మలు, సాలభంజిక లుండెడివి కాబోలు.

ఇంతవరకు కేవలము చారిత్రక గేయములందున్న వానిలో కొన్నింటిని మాత్రమే యుదాహరించితిని. ఇట్టి విశేషములు పౌరాణిక గేయములందును తదితరములగు గేయములందును స్త్రీలపాటలందును అనేకములు గలవు. 'అదవి అనే చర గోవిందనామము'లను పాటలో రావణవధానంతరము సీతాసమేతుడై శ్రీరామచంద్రు డయోధ్యకు తిరిగి వచ్చిన సందర్భమున జరిగిన యుత్సవములం దచటివారు 'వారభామినులను వడివడి బిలిపించి, మెండుగా నపుడు మేళములు చేయించి' నారట. మొన్నమొన్నటివరకు తెలుగు దేశమున భోగము మేళములు జరుపుట పరిపాటిగా నుండెను. అది శ్రీరామోత్సవములకు గూడ నంటగట్టబడినది.

'కౌసల్య బైక'లను పాటలో గర్భిణియగు కౌసల్యాదేవి కోరికలు గమనింపదగినవి. 'పుల్లని లేత చింతకాయ, బెల్లము మారేడు కొసలు, తెల్లనువ్వు ఇంగువ పుల్లని పెరుమజ్జిగ, సన్న బియ్యము నిమ్మపండ్ల రసము, లేత గుమ్మడికాయ అరనెల్లికాయ1 కోసిన వంకాయ కొయ్యగూరనాకు, గుంటగట్టు మన్ను గోధుమరొట్టె, అంటుమామిడికాయ అలసందకాయ, కంచి చీరెలు మంచి యంచురవికెలు, మించు సామింతలు మేలైన కురుపేరు, పట్టుచీర గుత్తపు రవిక' మున్నగు వస్తువు లామె కోరినది.

'సీత వామనగుంటలాడు పాట'లో సీతారాములు రత్నాలు ముత్యాలు పోసికొని వామనగుంట లాడిరి. రామచంద్రుడు డాటగెలిచి 'డబ్బీలు' తీసెను. గుంటలలోనుండు గింజల నాటగెలిచి తీయుటను 'డిబ్బీలు' తీయుట యందురు. 'సీతామ్మవారి వసంతం' పాటలో సీతారాములు కుంకుమ, జవ్వాజి, కస్తూరి కలిపిన వసంతములు చల్లుకొనిరి. 'కుశలవ కుచ్చల చరిత్రము'న సీతారాములు సొగటా లాడిరి. దీనికే పగడలాసాట యనియు పేరు. సీతాలక్ష్మణు లొకవైపు, శాంతారాఘవు లొక వైపుండి వేసిన పందెముల పేర్లు సూచింపబడినవి. 'తత్రికతీ పంచమ్మిది చక్కా, పగడ ధార తొమ్మిది యనుకొనుచూ, భార ఖిత్రీ దుగ యనుకొనుచూ, దుగ ఖిత్రీ చవకం భారనుచూ, తప్పుజోడు గాదు దిగజోడు రమ్మీ, యిది సారెగాదు మదమున సారె, వక పేటున గట్టిందిర జోడు'. ఈమాటలు చాలవరకు ద్రావిడ భాషలకు జెందినవి కావు. మరాఠీ మరియు హిందీభాషాపదము లివి. ఇప్పటికి నీయాట లాడునప్పుడు పందెముల నిట్లే పేర్కొందురు. కనుక నీ వినోదము మన కుత్తర దేశమునుండి వచ్చియుండునని భావింపవచ్చును. 'కుశలవ యుద్ధమున'న పార్వతీ శివులు 'పాశీ' యాడుచున్నట్లును, సరస్వతీ బ్రహ్మలు 'చదరంగ' మాడుచున్నట్లును శచీంద్రులు 'దశావతారము' లాడుచున్నట్లును వర్ణింపబడినది.

'ఉషాస్వప్నము' పాటలో నెన్నియో బాలక్రీడలు వర్ణింపబడినవి. విరహార్త యైన ఉషాబాల 'కథలు చెప్పాదాయె కబురు లాడాదాయె కాంతలతో గూడదాయె, కుందెనగిరి యాడదు గుప్పచ్చి యాడదు గుడిగుడి గుంచమైన, దాగుడుమూత లాడదు ఊగుటుయ్యె లాడదు దాటుటిళ్ళాడదాయె, నన్ను ముట్టుకోకు నా మాలకాకి యను కన్నె యాటాడదాయె, నెత్తన రాళ్ళాడదు హత్తిచేతులు వేసి కత్తిబద్దాటాడదూ, వామనగుంటలు పాచిక లాటలు వాలలాడదు వరుసతో, బంతులాడదు పరిచల్లిన యట్టి చింతగింజా లాడదు, బొమ్మలాటాడదు బూచిమాటాడదు నిమ్మలాటల నాడదు, నాయప్పనవలమును నాకు నెమ్మలు నాట నయముతో తానాడదు, వానవాన వల్లప్ప వాకిలి దిరుగు చెల్లప్ప వరసాట లాడదెపుడు, చల్లోయమ్మ చల్లయని స్తంభము ల్పట్టుకొని గొల్లాట లాడదెపుడు,

1. అరవంలో అరనెల్లిక్కాయి, పుల్ల ఉసిరికాయ (రాచ ఉసిరికాయ)

వన్నెలొత్తాడదు వెలదులను గూడుకొని వెనదుద్దుకదురాడదు, కాళ్ళగజ్జెలనుచు కంకాళమో యనుచు కాంత తానాడదాయె, వేగుల చుక్కోయని వెలగమొగ్గోయని వెలది తానాడదాయె, దోపిడిపుల్లయని దొంగాడి పుల్లయని తొయ్యలి తానాడదు, చిన్నిచిన్నితొ గద్దు సింగారి గొరెంత గద్దు తాళెబేళెంత గద్దు, తామరమొగ్గల్లొ యనుచు తద్దాట లాడదు తరుణిటిల్లాటాడదు, చమ్మచెక్కయని చారడేసి బుక్కయని సఖియ తానాడదాయె, అట్లు పొయ్యంగినవి అరగించంగనని అతివ తానాడదాయె, దాచుకో మూచుకో సంతాప బుద్ధియని తరుణి తొడబంతాడదు,' అబ్బ! పూర్వమెన్ని యాట లుండెడివి ? నేడవి కానరావుగదా! శిష్టసాహిత్యమున కాళహస్తి మాహాత్మ్యమునందును, హంసవింశతియందును తీరుతీరుల ఆటలు వర్ణింపబడినవి. కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారు వానిగూర్చి తమ సాంఘిక చరిత్రమున వ్రాసియున్నారు.

'విరాటపర్వము జంగంకథ'లో విరటుని వినోదమునకై భీముడు మల్లులతో యుద్ధము చేసినప్పుడు మల్లయుద్ధమునకు సంబంధించిన విశేషములు కలవు. 'చల్లడంబులను కాశికోకను చక్కగ బిగియించి....గంతువైచి బేరణచేసి బ్రేంకణమైన బోవుచును, మొగ్గలు వాలుచు సాము దండెములు మొగ్గుగ దీయుచును, అగ్గలంబుగా సాధన చేయుచు ననిలనందనుండు, గిజిలాస్యమున పరిపిగొట్టుచు కిరమిలు విదలించి,..., యిరువు రొకరికొక రెదురుగ వచ్చిరి కరస్పర్శ జేసి, మరలుచు నిద్దరు యుద్ధ భూతలము మన్ను నొసట దీర్చి, కొంత మన్నుపై జల్లుకొనుచు బహుకోపాటోపమున' పోరిరి. భీము డొక మల్లుని 'మారులేక పోర్లించుచు వీపున మట్టిచేసి నిలిచె'ను. వీపున మట్టిచేయుట యనగా వీపునకు మట్టి యంటునట్లు వెల్లికిల పడవేసి యోడించుట.

## విజ్ఞానము

జానపదగేయములు పామరుల కవితాకళకును, వినోదమునకును ఎంతగా నాస్పదములో, విజ్ఞానవిషయములకు గూడ నంతియ నిధులు. వారి యనుభవము లన్నియు గేయములం దచ్చటచ్చట భద్రపరుపబడినవి. ఎంతయో కష్టపడినగాని యవి గుర్తింపబడవు. బాల గేయములందు కొన్ని యర్థరహితములని యను కొన్నప్పుడు కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారు వానియందున్న ఆయుర్వేద విషయములు వెల్లడించి నాకాశ్చర్యము కలిగించిరి. ముందుముందా వివరములు నివేదింతును. రోగములు వానికై చికిత్సలు జానపదులు గేయములందే చెప్పుకొనిరి. భారతీయు లాయుర్వేదమున, రసాయనశాస్త్రమున పారము గన్నట్లు పండితుల యభిప్రాయము. ఇప్పటికిని మందులు ఓషధులు మహాప్రభావము గలవి పల్లెటూరి బోయలకు, ముత్తరానులకు పరిచితములు. వచ్చినవారిని

బ్రతికించెడు సంజీవి మొదలు ప్రాణముగలవారి నరనిమిషములో జంపగల కాలకూటమువంటి మూలికలు జానపదసాహిత్యమున కాననగును.

పల్నాటివీరచరిత్రమునకు సంబంధించిన 'కోళ్ళ పోట్లాట' కథలో నాగమ్మ బ్రహ్మనాయని కన్నములో విషము బెట్టించినట్లున్నది. 'రాచమల్లు రాయబారము'న గూడ నలరాజుకు మొదట భోజనమందు నాగమ్మ విషము గలిపించెను. కాని యలరాజా యన్నపు వైవర్ణ్యమును గని పారవేయించెను. అతడు తిరిగి పోవుచుండగా నామె మార్గమధ్యమున పూలదండలు గ్రుచ్చు తమ్మళ్ళచే పూవులందు విషము బెట్టించి యలరాజును చంపించినది. అలరాజునకు 'విరజాజి సంపెంగ విరుల జాజులును,నన్నిటి నడుమను నధికవాసనలు, కేరుచు సుమబంతి కేలను బట్టి,మూర్కొనె మది ప్రేమ ముప్పిరి గొనగ,నెరయ లలాటంబు నెరి వెంట్రుకలును, నన విషంబటు ముక్కునాళము కెక్కె'ను.'కాటమరాజుకథ'లో పశువులకు సంబంధించిన రోగ మొకటి కలదు. బొల్లియావును సిద్ధిరాజు సైనికులు 'గుండెముసురు రాగ గూడారుమండి,మందలో నుంచక మరి తోలినా'రని వెక్కిరించిరి. గుండెముసు రనగా పశువులకు కలిగెడు ప్రమాదకరమైన రోగము. అది మహావేగముతో నితర పశువులకు వ్యాపించును కనుక రోగమునకు గురియైన పశువును వేంటనే వేరు చేయుదురు. ఎల్లయ్య యుద్ధమున గాయపడినపుడు నలనన్న 'గాయాల శ్రీతులసి గట్టించె నర్థి'. గాయములకు శ్రీతులసి గట్టిన నయమగును కాబోలు. భట్టు రాయ బారమున ఒకభట్టు నొకభట్టు దెప్పిపొడుచుకొందురు. కాటమరాజుభట్టు సిద్ధిరాజు భట్టును 'చలిచీమ గరిచిందొ జన్ని పుట్టిందొ,ఉలికి పడుతున్నావు ఒక్కొక్కవేళ' యని వెక్కిరించెను. జన్ని యనునది పశువులకు గలిగెడు రోగము.

'రెడ్డొచ్చె రెడ్డొచ్చె రెడ్డొచ్చెనమ్మా వీరభద్రారెడ్డి విచ్చేసెనమ్మా'యను గేయమున వీరభద్రారెడ్డి 'ఊరి బావులలోన ఉప్పు సున్నాలూ వెదజల్లు నేచేట నిందు పున్నానా'యని కలదు. నేడు గ్రామపారిశుధ్య సంఘములవారు మంచినీటిబావులందు రసాయనపదార్థములు గలిపి నీటియందుండు క్రిమికీటకాదుల జంపి శుభ్రపరచు చున్నారు. పూర్వులు ఉప్పుసున్నములు బావులలో చల్లెడువారు. పల్లెటూళ్ళయం దిప్పటికిని ఉప్పుసున్నములు చల్లుట వాడుకలో నున్నది. క్రిమికీటకసంహారమునకై మనవారు కనిపెట్టిన ప్రాతకాలపు రాసాయనిక ద్రవ్యములివి. 'పెద్దాపురపు కోడిపందెము'లందు జగపతిరాజును చంపుటకై ఆనందగజపతి తన దాసి రంగసానివి పిలిచి 'రసకర్పూరం అరఖులు రాచి ఆకులన్న కిమ్మా' యనెను.

ఇవి రసాయనశాస్త్రమునకు సంబంధించిన ప్రమాదవస్తువులు. బాలతిమ్మరాజు ఆనంద గజపతి చేతిలో చిక్కినపుడు తల్లియగు సీతమ్మ తన భర్తజగపతిరాజుతో 'బిడ్డలులేని ఇల్లేమిటికి వత్సవాయిరాజా, తిమ్మరాజును తీసుకవస్తే భోజన మవుతుంది. లేకుంటే వజ్రం తిని తనువే విడవాలె'ననెను. వజ్రము విషముతో సమాన మని మన ఆయుర్వేదవేత్త లందురు.

'కౌసల్య బైకలు' పాటలో నాసన్నప్రసవయగు కౌసల్యాదేవికొరకు బాలింతమందు సిద్ధము చేయబడినది. తెలంగాణమున దీనిని 'పెద్ద మందు' అనెదరు. పల్లెటూరి ప్రతి ముసలియవ్వకీ యౌషధవిషయములు తెలియును. ఈ యౌషధముచే సూతికారోగములు దొలగును ఈ మందు చేయుటకై 'పిప్పళ్ళు శొంఠి మిరియాలు కొట్టి వునచారే ఉంచరే) ఎక్కువైనా లవంగము పత్రి చేర్చారో యమ్మా, తాటిబెల్లము యింగువ తెచ్చి వునచారోయమ్మా, మేటిగా వేపాకు పసపూ నూరి వునచారే' యని చెలు లనిరి. వేపాకు పసుపు శరీరమున కలదుటకు కాబోలు. తక్కిన వస్తువు లన్నియు 'పెద్దమందు' కొరకు పనికివచ్చునవి. 'పెండ్లి గోవిందనామములు' పాటలో పసిపాపలగు రాములకు తలకుబోసి బొట్టుకాటుకలు పెట్టిన తరువాత 'వుల్లి తీరా తులసి, బాలలకు పొగ వేసిరి, వుల్లి పేన నూనె, వణతులు గోళ్ళు బోసి'రట. పల్లెటూళ్ళయం దిప్పటికిని పసిపిల్లలకు స్నానము చేయించిన తరువాత పొగపట్టుట కలదు. పిట్టకాలు, సాంబ్రాణి, బండి కందెన, పొగలు వేయుదురు. పొగవేయుటచే బాలగ్రహాదులు సోకవనియు పిల్లలు ఆరోగ్యవంతులుగా నుందురనియు చెప్పుదురు. ఈధూపద్రవ్యములందు ఆయుర్వేదమునకు సంబంధించిన సుగుణము లుండియుండును. 'రామ కథా సుధార్ణవము'న శ్రీరామవియోగమున మరణించిన 'దశరథుని శరీరంబు తైలంబులోన పక్వంబు' జేసి మంత్రులు భరతుడు వచ్చునందాక కాపాడియుంచిరట. మృతకళేబరములు కుళ్ళిపోకుండ కాపాడుటకై మనపూర్వులీ పద్ధతుల నవలంబించెడు వారని తెలియుచున్నది. 'లక్ష్మణమూర్ఛ' పదములో సుషేణు డాంజనేయునికి సంజీవిలక్షణము లిట్లు చెప్పెను. 'ఆకులు తెల్లగానుండు పుష్పములు ఎట్టనై వికసించు నేర్పాటుగాను, పండ్లు పచ్చగనుండు పరగ రాత్రులయందు, భాసిల్లు కాంతులు పరమమోదమున'. ఇట్టి యోషధి ఏదైన కలదో లేదో,

'నల చరిత్ర పదము'లో దమయంతికి తలకు బోయునప్పుడు 'పికవాణి యొకతె జంబీరరసమును బోసె'నని కలదు. రామరాజభూషణుడు కూడ వసురాజునకు శిరసంటునప్పుడిటులే వర్ణించెను[1]. దీని యంతరార్థము తెలియని

1. వసు చరిత్రము 5-76.

వెన్నేటి రామచంద్రరావుగారు పిచ్చివారి కంటునట్లు నిమ్మరస మెందులకని రామరాజభూషణు నాక్షేపించిరి[1]. జంబీరరస మంటుటచే నెత్తిపైనుండు చుండు పోవుటయే కాక వెంట్రుకలు కూడ వృద్ధినొందునని ఆయుర్వేద వేత్తల యభిప్రాయము. 'రుక్మిణీదేవి సీమంతము'న శ్రీకృష్ణుడు రుక్మిణితో 'గర్భిణి స్త్రీలకు నెల్లా కదలక నడువగవలెనా'అనెను. ఆయుర్వేద శారీరమున గూడ నీ విషయము చెప్పబడినది. ఋతుమతి యగు స్త్రీకిగూడ 'నఖచ్ఛేదన ప్రధావన హసన కథనాతిశబ్ద శ్రవణావలేఖనానిలాయాసా న్పరిహరేత్'2 అని చెప్పబడినది.

బాలగేయములం దాయుర్వేదమునకు సంబంధించిన విశేషము లధికముగా గానవగును. కీ శే. సురవరం ప్రతాపరెడ్డిగారి ప్రబోధమున నేనీ పాటలందున్న యర్థమును ఆయుర్వేదశతావధాని శ్రీమాన్ తిరుమల రామానుజస్వామిగారివలన నెరిగితిని. ఆడపిల్లలు బిత్తి దిరుగుచు పాడెడు పాటలో వాజీకరణయోగములున్నవి.

'ఒప్పుల కుప్పా - ఒయ్యారి భామా
మినపా పప్పూ - మెంతీ పిండీ
తాటీ బెల్లం - తవ్వెడు నెయ్యీ (తగువగు - పాఠాంతరము)
గుప్పెడు దింటే - కులుకూలాడీ
నడుము గట్టీ - నా మాట బట్టీ'

ఈ పాటలో నున్న 'చిట్కా' కేవలము స్త్రీలకొరకు. ఇక పురుషులకై చెప్పబడిన పాట-

ఒప్పులకుప్పా-ఒయ్యారి భామా
సన్నబియ్యం - చాయాపప్పూ ✓
( మినపా పప్పూ - మెరికా బియ్యం )
పాలు నెయ్యాడి - పాశం వొండూ ✓
నీ మొగడు దింటే - ఆనంద మంటే' ✓

ఆచార్యులవా రొకవ్యాసమున నీ పాటకే వివరణము వ్రాసియున్నారు[3]. వీని కనుకూలించు చరకసంహితాసూత్రములను ఔషధవివరములను వారిచ్చియున్నారు. ఆ వ్యాసమున నున్నపాట యిది యొక్కటే. ఇక నేను సేకరించి వారినుండి యర్థమెరిగిన పాటలు కొన్ని పేర్కొందును.

---

1. మను వసుచరిత్ర విమర్శనము.
2. సుశ్రుత శారీర స్థానము. అ ౨. సూ. 26.
3. గోలకొండ పత్రిక 5-6-1940

'కాళ్ళ గజ్జి - కంకాలమ్మ
వేగుచుక్క - వెలగా మొగ్గ
మొగ్గ కాదు - మోదుగు నీరు
నీరు కాదు - నిమ్మల వాయ
వాయకాదు - వాయంట కూర
కూర గాదు - గుమ్మడి పండు
పండు కాదు - పాపడ మీసం
మీసం కాదు - మిరియాల పోతు
పోతు కాదు - బొమ్మల శెట్టి
శెట్టి గాదు - శామల మన్ను
మన్నుగాదు - మంచి గంధం చెక్క
లింగు లిటుకు - పందెమూల పటుకు
కాలు పండినట్లు - కడకు దీసి పెట్టు.'

ఈ పాటలో పిల్లలకు జానువులపై చేతి వెడల్పుతో లేచి చాల బాధ కలిగించెడు గజ్జికి మందున్నది. ఈగజ్జిపుండప్పుడప్పుడు మానుచు మరలపొక్కుచు నీరుగారుచు పిల్లలను, వారికన్న నెక్కువగా తలిదండ్రులను బాధ పెట్టును. ఈ పాటలో నున్న కొన్ని పదముల కర్థము సాధారణముగా నెవ్వరికిని తెలియదు. గ్రామీణాయుర్వేదపరిభాష నెరిగినవారికి గాని ఈ పాట కర్థము తెలియదు. తెలంగాణపుపల్లెపట్టులందుండుతెలుగు, తెనుగు, బోయవారీయర్థముల నెరుగుదురు. గ్రామరక్షణము, వేట, తేనె నమ్ముట, ఔషధములకు పనికివచ్చు మూలికల బెంచుట వారి వృత్తి. వీరి నడిగినచో కంకాలమ్మ, వేగుచుక్క, వెలగమొగ్గవంటి శబ్దముల కర్థము చెప్పెదరు. ఈ పాటకు రెండు మూడు పాఠాంతరములున్నవి. ఏ పాఠమైనను మొదటి మూడు వస్తువులను మాత్రము తప్పక పేర్కొనును. అవి ముఖ్యద్రవ్యములు. తరువాతవన్నియు ప్రత్యామ్నాయములే. కంకాలమ్మ = కచూరాలు. వేగుచుక్క (సరియైనరూపము) = బావంచాలు, వెలగమొగ్గ = పాదరసము. ఈ మూడును ముఖ్యద్రవ్యములు. ఇందులో పాదరసమునకు మారుగా నెన్నియో ప్రత్యామ్నాయములు సూచింపబడినవి 'మొగ్గ గాదు మోదుగ నీరు' అనగా పాదరసమునకు బదులుగా మోదుగు చెట్టునుండి తీయు నీరుమ వాడవచ్చు నని యర్థము. (ఈ మోదుగు నీరు తీయు పద్ధతి ఆయుర్వేదరసాయనభాగమునకు చెందినది. మోదుగునీ రెట్లుతీయవలెనో ఆచార్యులవారు నాకు విపులముగా

చెప్పిరి.) ఆనీరు లభింపకున్నచో నిమ్మలపాయ=నిమ్మ పులుసు వాడవచ్చును. అది కానిచో, వావింట రసము, నీరుడు గింజల తైలము, మోదుగ మాడ, మిరియములు, మట్టి చిగుళ్ళు, లోహరజము, మంచి గంధపుచెక్క వంటి వస్తువులలో నేదేని యొక్క వస్తువు నుపయోగించుకొనవచ్చును. పై వస్తువులను వారివారి శరీరప్రకృతులననుసరించి వాడుకొనవలయును. నిమ్మపులుసు, వావింట రసము, మిరియములు మున్నగునవి శోధనద్రవ్యములు. మంట మండకుండుటకై మంచి గంధపు చెక్కవంటి చల్లనివస్తువులు చెప్పనైనవి. ఈమూడు వస్తువులను బాగుగా మర్దన చేయవలెను. లింగు లిటు కమనది మర్దనకు ధ్వన్యనుకరణము. పటుకనగా కాఠిన్యము. పందెమాల పటుకనగా నేమాత్రము కాఠిన్యము లేకుండునట్లుగా పందెము వేసికొనినట్లు మెత్తగా నూరవలయునని భావము. నయమైన తరువాత నా కట్టును 'కడకు దీసిపెట్టి'వన్నును. ఈ యోగమునకు 'సోమరాజి' (బావంచాలు), లేక 'శశికల' యని ఆయుర్వేదపారిభాషికనామము. ఇది అనుభవయోగము. ఇంకొక పాట

'చెమ్మ చెక్క-చేరెడేసి బుక్క
అట్లు పొయ్యంగ-అరగించంగ
రత్నాల చెమ్మ చెక్క-రంగు లేయంగ
పగడాల చెమ్మ చెక్క-పంది రేయంగ
పందిట్ల బాలుడు-పరుగు లెత్తంగ'

ఈపాటలో వయసు వచ్చినను సమర్తకానివారికి (మాచకమ్మలకు) సంతానము కలుగనివారికిని (వంధ్యలకు) 'చిట్కా' యున్నది. చెమ్మ యొక్క చెక్క=బెరడును బుక్కవలెనట. బొక్కుటను, తెలంగాణమున బుక్కుటందురు. చేరెడనునది ఆయుర్వేద పరిభాషలో బిడాలపదక పరిమాణము. చుళుకమని యర్థము. రత్నాలచెమ్మ యనగా నెఱ్ఱపూలు బూయు చెమ్మ. ముత్యాలచెమ్మ యన తెల్లపూలు బూయు చెమ్మ. మొదటిది రజస్వల కానివారికిని రెండవది వంధ్యలకును చెప్పబడినవి. ఈ పాటను జానపదసాహిత్యమున మరుగు కవిత్వమున కుదాహరణముగా తీసికొనవచ్చును. 'రంగు లేయంగ' అనునది రజస్వలకును, 'ముగ్గులేయంగ' అనునది సంతానాభివృద్ధికిని సంకేతములు. సంతానము కలిగిన తరువాత పగడాలు=ఉయ్యేల (తెలంగాణమున నీ పదము ప్రయోగమున నున్నది) పందిరి=ఉయ్యాలపై గట్టెడు పాలవెల్లి కావలెను గదా 'పందిట్ల బాలుడు పరుగు లెత్తంగ' కలిగెడు ఆనందము అనుభవవైకవేద్యము

ఇటులే 'కొండమీద వెండిగిన్నె' యనుపాటలో అగంతుకమగు (Accidental) భగ్నాస్థిచికిత్సయును, 'గుడుగుడు గుంచం గుండేరాగం' పాటలో గాముకాటు మందు 'కొంగకొంగ గోళ్లు'లో కునఖచికిత్సయును (గోరుచుట్టు= ష్ఠ) చెప్పబడినవి. ఈ గేయము లన్నియు బాలగేయములే.

పెద్దల పాటలం దనేక విషయములు కాననగును. సన్యాసులు, బైరాగులు తత్వములు పాడుచు గ్రామములందు తిరుగుచుందురు. వారికి సులభములగు ఆయుర్వేద రహస్యములు తెలియును. ఇట్టివానిని బైరాగి చిట్కాలనియు, గోసాయిచిట్కాలనియు మనవారందురు. ఒక వేదాంతతత్వమున పాము కాటునకు చికిత్స యున్నది. తత్వపు రెండవ చరణముననే చికిత్స యున్నది. కనుక మొదటిరెండు చరణము లుట్టంకింతును.

> చావదూం ఈ పాము - చప్పిడి దెబ్బలాకు |చా|
> భావించి వైరాగ్యమనే - బడితె దెబ్బ బడితెగావి |చా|
> మాచికాయ రసము - బీసారివేరు దెచ్చి
> కాచిపోసిన గాని - కావార మణగాదు 1 |చా|

మాచికాయ, బీసరివేరు, రసములను కాచిపోసినచో పాము విషము విరుగునట. ఎంత సులభసాధ్యములైనవీ యోషధులు. మరికొన్ని పాము కాటునకు మందులు తలనొప్పి మందులు స్రవంతి పత్రికలో (ప్రథమసంపుటము ఏడవసంచిక) ప్రకటించితిని. వివరములందు చూడనగును.

జానపదగేయములందు ఆయుర్వేదవిజ్ఞానమువలెనే జ్యోతిషము, సాముద్రికము మున్నగు శాస్త్రముల యనుభవములు కూడ అచ్చటచ్చట కాననగును. ఈజ్యోతిషశాస్త్రము పుట్టుక భారతదేశమందని కొందరు యవనదేశము నందని కొందరు పండితు లిప్పటికిని వాదించుచునే యున్నారు. ఖగోళ విజ్ఞానము వంటివి మనవేదములందే యున్నట్లు పెద్దలుచెప్పుదురు. జ్యోతిషము వేదాంగముగా చెప్పబడినది. అనాదిగా వచ్చుచున్న ఈ విజ్ఞానము దానివలని యనుభవములు జానపదులు తమ సాహిత్యమునగూడ కొంత భద్రపరచుకొనియుందురు.

'దేశింగురాజు కథ'లో యుద్ధమునకు బయలుదేరునప్పుడు దేశింగు తన భార్యతో మాటలాడి పోదు నన అతని పినతండ్రియగు ధరణిసింగు వలదనెను. కారణము ఆమె భరణి నక్షత్రము ప్రథమపాదమున రజస్వల యైనదట. భరణి

1, ఈ తత్వమును మానుకోట తాలూకా గుర్తూరు గ్రామమున సేకరించితిని.

పుబ్బ, ఆశ్లేషాదినక్షత్రములు చెడ్డవిగా చెప్పబడినవి. కనుక ఆరునెలలవరకు స్త్రీ ముఖము చూడరాదని ధరణిసింగు శాసించెను. దేశింగు అది విననప్పుడు ధరణిసింగు సతీపతుల మధ్యన తెరకట్టించి మాటలాడుమనెను. మరియు దేశింగు పుట్టినది, రాణి జన్మించినది, గుఱ్ఱము వచ్చినది, నవాబు దండు వచ్చినది శుక్రవారమట. ఇందులో నేదియో విశేషముండియుండునని శుక్రవారమునకు బదులుగా శనివారమునాడు యుద్ధమునకు బయలుదేరుమని ధరణిసింగు దేశింగుతో చెప్పెను. ఈ యనుభవములన్నియు ప్రజలకు సంబంధించినవే కాబోలు.

ఉత్తమపురుషుల వర్ణించునప్పుడు జానపదులు వారి కుండవలసిన సాముద్రికలక్షణముల కొన్నింటి నుట్టంకింతురు. 'శ్రీకృష్ణ జననము'న 'వీపునా వింజామరా నా తండ్రి బొడ్డునా పారిజాతం'. 'బొబ్బిలి యుద్ధము'న రంగారావును గొప్పవానిగా చిత్రించుటకు జానపదకవి ఇట్టి (సాముద్రిక) శరీరశాస్త్రలక్షణములే వర్ణించెను. 'వీపునందు వింజామరివుంది రంగారాయనికి'. ఇంకను కన్నులో మచ్చ, కపోలమున కనకమణి, అరకాలి యందు పద్మరేఖ, చేతులందు కమల దళములున్నట్లు వర్ణింప బడినవి. ఇవి యన్నియు గొప్పలక్షణములని ప్రజల విశ్వాసము. 'బంగారు తిమ్మరాజు కథ'లో కూడ తిమ్మరాజునకు 'పాదములో తామర పద్మం ఉద్భవించి యుందీ' యని కలదు. తిమ్మరాజు పెనుగొండ ప్రయాణమైనప్పుడు తండ్రి రఘుపతిరాజు కుమారునితో 'ఆదివారము పడమటి దిక్కు వారశూల గనుక' ప్రయాణము వలదనెను. అతని తల్లి 'శకునపుస్తకము చూచి' రాబోవు యపశకునముల ఫలితములను జోస్యము చెప్పెను.

'శాంత గోవింద నామము'లను పాటలో 'అష్టమి శనివారం, అయిదుఘడియల ప్రొద్దు, చిత్తనక్షత్రమున, సీతపుట్టిన దినము' అని కలదు. రావణుడామెను కమలమునుండి తెచ్చి మండోదరి కిచ్చి సాకుమనెను. అప్పుడు జ్యోతిషికులు సీతాజన్మసమయమును చూచి లంక నాశనమగునని జోస్యము చెప్పిరి. పైన చెప్పబడిన జాతకప్రభావమునకు భయపడి రావణుడు సీతమ్మ నొక మందసమున బెట్టి సముద్రములో విడిచిపెట్టినట్లు వర్ణింపబడినది. ఇదేపాటలో శాంతజాతకము చూచి జ్యోతిర్విద్వాంసు డొకడు 'అసుర సంధ్యావేళ, శుక్రవారము ప్రొద్దు, అతివ పుట్టిన దినం, అత్తవారింటివి, అరగడియ వుండదనె, అయిదవ వత్సరంకంటె, అతివ మీ నగరి నుండ' దనెను. శాంతమ్మ నిజముగనే కన్న తలిదండ్రులను వీడి కౌసల్యా దశరథులింట చేరినది. అత్తవారింటి (ఋషిపల్లె) కన్న నామె పుట్టినింటనే

భర్తతో కాలమంతయు గడపినది. 'సీతసమర్త' పాటలో దైవజ్ఞులు పంచాంగములు చూచి 'మంచి హస్తనక్షత్రము పంచమి సోమవారమ్మా, ఎంతోమంచిదైన అభిజితు మంచి ముహూర్తమే రామచంద్రా, పరమపతివ్రత అయియుండును, పలువురు పుత్రుల గనునూ. పట్టపురాణియై రాజ్యము పాలించును రామచంద్రా' యనిచెప్పిరి. 'సీతాదేవి ఆనవాలు' పాటలో శ్రీరాము డాంజనేయునితో సీతనుగూర్చి చెప్పుచు 'పాడ్యమి జదివినా వేదమ్ముపలెను — పరమసతి ప్రభావమెల్ల చెడియుండు' ననెను. పాడ్యమి అనధ్యయన దినములందొకటి ౧,౪,౮,౯,౧౪,౧౫,౩౦ తిథులు అనధ్యయన దినములు. 'రామకథా సుధార్ణవము'న హనుమంతుడు సీతతో శ్రీరామచంద్రుని యానవాలు చెప్పునప్పుడు 'ఫాలతలంబున నాలుగురేఖలు ప్రకాశింపుచుండు, ధ్వజ శంఖాంకుశ రేఖలు పాదంబుల నుండు., గళమున శంఖమువలెను మూడురేఖలు పరగుచు నుండు, ఊర్ధ్వరేఖలు కరంబుల నాలుగు ఒప్పమీరియుండు, కడుపు మృదువుగా మూడు మడతలను కలిగివెలయుచుండు, ముక్కు కాకితుండమువలె మిక్కిలిముద్దుగుల్కుచుండు, అరచేతులు కడకన్నును గోరులు నెరుపు గలిగి యుండు, గుండె వెడల్పుగ నడుమ లోతు లేకుండ నొప్పుచుండు, బొడ్డు లోతుగా వెలయుచు పొన్నపువ్వుపగిదినుండు, మంకెనపువ్వ వలె పెలసి పెదవులుసమానముగా నుండు, ముప్పదిరెండు దంతములు ముత్యంబులనుబోలి యుండు, చేతులెత్తినను చంకలోపలలోతు లేక యుండు, తొంబదారంగుళంబులు పొడవై దంబు మీరియుండు' ననిఉత్తమజాతికిచెందినపురుషశారీరక్రమము వర్ణింపబడినది.

మనవారుజంతువులహృదయము నెరుగుట గూడ నొకశాస్త్రీయవిజ్ఞానముగా పెంపొందించిరి. చతురంగబలములందు రెండింట అశ్వము లవసరము. అశ్వహృదయము చక్కగానెరిగినవారే రథసారథులుగానుపయోగపడుచుండెడు వారు. మరియును అశ్వలక్షణము బాగుగా నెరిగినవారిని, అశ్వముల పోషణ కుపయోగించెడువారు. కనుకనే అశ్వహృదయము, అశ్వవిద్య యనునవి శాస్త్రములుగా పెంపొందినవి. నలుడు, శ్రీకృష్ణుడు, శల్యుడు, నకులుడు, అశ్వహృదయము బాగుగా నెరిగిన పురాణపురుషులు. చక్రవర్తులు రాజులుకూడ విట్టినిపుణుల నశ్వాధికారులుగా నుంచుకొన్నట్లు మనచరిత్రములు చెప్పుచున్నవి. అశ్వహృదయము నెరిగినవారిని కొందరను మనము జానపదగేయములందు గూడ చూడగలము. ఆయావీరు లుపయోగించిన ఉత్తమాశ్వములు గూడ తమ యజమానుల హృదయ మెరిగి నడచుటయేకాక వారికి గలిగెడు మంచి చెడుగులను సూచించుచుండెడివి.

'దేశింగురాజు కథ'లో నాతని గుఱ్ఱము ఉత్తమాశ్వముగా చిత్రింపబడినది. దానిపేరు బారాహజారి. దేశింగు యుద్ధమునకు బయలుదేరునప్పుడు బారాహజారి పటపట కన్నీరు గార్చెననియు, ఆ కన్నీరు నేలపైబడి యచటి మన్ను తడిసె ననియు వర్ణింపబడినది. ఈ వర్ణనము **Sohrab and Rustum** గాథలో నున్న **Ruksh** గుఱ్ఱము ఏడ్పువలె నున్నది. దాని ఏడ్పును గని దేశింగు తనకు మరణము తప్పదని భావించెను. దేశింగు అశ్వహృదయమును బాగుగా నెరిగిన శూరుడు. ఎవ్వరును ఎక్కజాలని బారాహజారి నాతడెక్కి దానినే బహుమతిగా బడసినవాడు. ఇదే కథలో దేశింగు మిత్రుడగు మహత్ఖానుని యశ్వము 'నీలవేణి' గూడ యుద్ధరంగమున జూపిన చాకచాక్య మద్భుతము. తుపాకి గుండ్లను తప్పించుకొనుటకై 'పొంచెను మించెను బలు యుక్తులు దలంచె నీలవేణి-వంగుచు లేచుచు వ్రాలుచు దుముకుచు వచ్చె నీలవేణి'. దీనికి తగిన యాశ్వికుడు మహత్ఖానుడు.

'ఆరె మరాఠీల కథ'లో సోమోజిరావు మున్నగువారు తమ పినతండ్రి యగు సిద్ధోజిపై దాడి వెడలి మరల తమ రాజ్యము తా మాక్రమించుకొనవలెనని యాలోచించుచుండగా నచట సిద్ధోజి గుఱ్ఱము తన యజమానికి రానున్న విపత్తు శంకించి నీళ్ళు మేత యుడిగెను. సిద్ధోజి దానికేదో రోగము వచ్చెనని భావించెను కాని యాతని యశ్వరక్షకుడు దాని హృదయమెరిగినవాడు కనుక నా సైసు సోమోజీరావు మున్నగువారల పేర్లు దలంచి వారేమైన నీకు పగవారా యని ప్రశ్నించెను. అప్పుడా గుఱ్ఱము 'మరాఠీలపేరు యెత్తగా, కచ్చలాకు కాలు దువ్వెను, భూమి చూచి సకిలించెను, పటపట్ట పండ్లూ కొరికెను'. సైసువాడీ సంగతి తమ యజమానికి తెలియబరచి జాగ్రతపడునట్లు చేసెను.

ఇంతవరకు పరిశీలించిన విశేషములు చారిత్రక, పౌరాణిక, బాల, గేయములనుండి యుద్ధరింపబడినవానిలో కొన్ని మాత్రమే. ఇంకను దశవిధ గేయప్రకరణములనుండి సాంఘికప్రకరణమునకు కావలసిన వస్తువు నేరి కూర్చితిని. దాని నంత నిట పేర్కొన్న గ్రంథవిస్తర మగునను భీతి కలదు. జానపదగేయములందు ప్రతిబింబించు సాంఘికజీవనము గనుగొనుటకు పైన పేర్కొన్న విషయబాహుళ్యము మరియు విషయవైవిధ్యమను రెండు మెతుకులు. మిగిలిన కుండెడన్నమును పరీక్షించుటకు చాలునని మనవిచేయుచు నీ ప్రకరణ మింతటితో ముగించుచున్నాను.



# జానపద గాయకులు

జ్ఞానపదగేయములు భిక్షుకుల కన్నుమిడు కల్పశాఖికలైన, భిక్షుకులు జానపదగేయములకు భద్రపేటికలు. ఎన్నియో గేయములు భిక్షుకుల నోళ్ళ నిల్లుగట్టుకొని తరతరములనుండి సురక్షితముగా వచ్చుచున్నవి. ఈ భిక్షుకులు పరాన్నభుక్కులై నిరుద్యోగసమస్యను పెంచినవారని మనము నేడు భావించినను కనీసము జానపదగేయముల రక్షించిన కీర్తియు వారికే దక్కుచున్నది. వారే లేకున్నచో జానపద గేయములందు సగముభాగము-చారిత్రక గేయములు మఱియు నితరములగు దీర్ఘకథాగేయములు-మనకు దక్కకుండెడివి. కేవలము చిన్న గేయము లెవ్వియో మిగిలెడివి. కనుక నీ భిక్షుకులు సంఘమునకు గొప్ప మేలు చేసినవారే. నిజము విచారించినచో వారు పరాన్నభుక్కులు కారు. భిక్షుకులందు చాలమంది నిజముగా మొట్టమొదట భిక్షమెత్తుటే వృత్తిగాగలవారు కారు. వారి ప్రధానవృత్తి గేయసంరక్షణమే.

పూర్వకాలమున రాజులు,సామంతులు, పాలెగార్లు తమ యాస్థానములందు తమయొక్కయు తమ పూర్వులయొక్కయు బిరుదులను పఠించుటకును, ప్రశస్తిని కీర్తించుటకును,శౌర్యగాన మొనర్చుటకును ఇట్టి గాయకులను పోషించుచుండెడివారు. మరియు నితరులపై దండెత్తి పోయినప్పుడు తమ సైనికులకు వీర ముద్బోధించుటకును గూడ నీవీర(చారణ)గాయకుల నుపయోగించెడువారు. ఇట్టి గాయకులే రానురాను చారిత్రక వ్యక్తుల ప్రశస్తితో బాటు మనోహరములగు నితరకథాగేయములను గూడ బాడుచు తమ్ము పోషించు ప్రభువులు పోయిన పిమ్మట నాయాజాతులవారినో లేదా అందరినో తమ గానముచే రంజింపజేయుచు పొట్టవోసికొన మొదలిడిరి. రాజాస్థానములు బాసిన పిమ్మట నీ గాయకులకు ప్రత్యేకముగా నాయా కులములవారే పోషకులైరి. చాతుర్వర్ణ్యములందు బ్రాహ్మణులకు విప్రవినోదులు, క్షత్రియులకు భట్లు, వైశ్యులకు వీరముష్టులు, శూద్రులకు పిచ్చుకగుంట్లు మున్నగువారు ఆశ్రితులు. జానపద గాయక భిక్షక పరిణామమున నిది రెండవ పట్టము. అటుతరువాత నన్నిజాతులవారి చెంత

తమకు వచ్చిన పాటలు పాడి బిచ్చమెత్తుట యనునది మూడవఘట్టము. రాజాశ్రితులైనప్పు డాగాయకుల కింత నైచ్యము లేదు. రెండవఘట్టము గూడ అనగా నొక జాతిభిక్షుకు లొకేజాతివారికి వారి పూర్వుల వైభవము వినిపించి యడిగి కొనుట గూడ నంత ప్రమాదమైనదికాదు. ఈ పరిణామము మూడవ ఘట్టము చేరుకొనగనే నీచమైపోయినది. అట్టి భిక్షుకులందరును నిరుద్యోగ సమస్యను తీవ్ర మొనర్చుచున్నారనియు పరాన్నభుక్కులనియు నేడు మనము నిందించు చున్నాము. వీరగీతములను పాడించుట కిట్టి గాయకు లాస్థానమందుండుట యనునది కేవలము మనదేశముననే కాదు ప్రపంచమందంతట నొకప్పు డిట్టి పరిస్థితి యుండెడివి. కొందఱు పాశ్చాత్యవిమర్శకు లింతకన్నను వెనుకకు నడచి మొదట నావీరులే యిట్టి గీతముల బాడుకొనుచుండెడివారనియు తరువాతనే ఆస్థానములందు గాయకుల నేర్పరుచు పరిస్థితి కలిగెననియు నభిప్రాయపడిరి 1. భిక్షుకులచే దేశమందలి యార్థికవ్యవస్థపై నెట్టిప్రభావము పడినను 'మొలబంటి దుఃఖములో మోకాలిలోతు సుఖమనునట్లు మన జాతీయ కళానిధులు వీరి ప్రాపును ప్రోపును బడసి నేటికిని కొనయూపిరితోఁ గొరకొర లాడుచున్నవి2.' ఉదయమునుండి సాయంకాలమువరకు పల్లెటూళ్ళలో వీధివీధులు తిరుగుచు దోసెడు గింజలకో దొప్పెడు గంజికో దేశికవితావిభూతిని పంచిపెట్టెడు దరిద్ర భిక్షుకు లిప్పుడిప్పుడే తమ వృత్తికి స్వస్తి జెప్పి ఇతరవృత్తుల నాశ్రయింప జూచుచున్నారు. ఇది దేశమునకు క్షేమకరమే యైనను అట్టి వారి చెంతగల సాహితీసంపద నంతటిని తొందరగా భద్రపరచుట శ్రేయస్కరము. లేనిచో మౌఖికమగు నీజానపదగేయసంపద యంతయు దక్కకుండ బోవును.

జానపదగాయకభిక్షుకు లెన్నియో కులములవారు వారు గలరు. తీరుతీరుల భిక్షుకులు తీరుతీరుల పాటలు పాడెదరు. పిచ్చుకగుంటులు, శారదకాండ్రు,

---

1. "Anglo-saxon and earlier Germanic fighting men, thinks Gaston Paris, had at first no class of minstrels to sing for them; every man could improvise and sing his own verses. The second period is that of the professional poet, the jongleur, minstrel, courtbard, who worked upon the old material into coherent and protracted lays"—The Popular Ballad. F.B Gummere.

2. శ్రీ తూమాటి దోణప్పగారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్కళాశాలా పత్రిక. సంపుటము.13

వీరముష్టులు•జంగములు,దాసరులు,భాగవతులు, పూసలబలిజలు, బీరన్నలవారు, సుద్దులగొల్లలు, గంగిరెద్దులవారు, బాలసంతు వారు, బుడబుడకల వారు, చిందు మాదుగులు. జోగులవారు, బవనీలు, జక్కుల వారు,హరికారులు,కొమ్ముల వారు, వీరవిద్యావంతులు, మాష్టీలు, దక్కలివారు, బొమ్మలాట గాండ్రు, మున్నగు తీరుతీరుల భిక్షుకు లాంధ్రదేశమున నున్న జానపదగాయకులు. వీరందరి గూర్చి పరిశీలించుట యంతగా నావశ్యకము గాదు.కాని వీరిలో ముఖ్యులైనవారిని గూర్చియు వారుపాడునట్టి పాటలగూర్చియు వారి సాంఘికజీవనముగూర్చియు తెలిసికొనుట యనవసరము కాదు.

ఈ బిచ్చగాండ్రందరును సాధారణముగా దేశద్రిమ్మరులు. ఏ కొలది మందికో తప్ప తక్కినవారికి ఇల్లు వాకిలి యనునవి యుండవు. జగమంతయు వారిదే యన్నట్లు భ్రమింతు రీదరిద్రనారాయణులు. కొలది మంది మాత్రము దొరలో దాతలో యిచ్చిన మడి మాన్యము లుండుటజేసి కొన్నికొన్ని గ్రామములందు స్థిరనివాసము కల్పించుకొనిరి.ఇట్టి స్థిరనివాసము గలవారు కూడ ఏడాది కెనిమిది నెలలు తమగ్రామము బయటనే యుందురు.దేశసంచార మొనర్చి పొట్టవోసికొనుటే వారి ప్రధానవృత్తి.వారికున్న మడి మాన్యములు వారి కుచేల సంతానమునకు సంవత్సరమున కంతటికి సరిపోవు గంజినీళ్ళు పోయజాలవు. కనుకనే చీమలట్లు వారు వానకాలము దక్క తక్కిన నెలలన్నియు దేశాటనము చేయుచుండెదరు. ఒక్క వానకాలముమాత్రము తమ తమ గ్రామములు చేరుకొందురు.

సాధారణముగా నీభిక్షుకుల తలదాచెడు ఇండ్లును, వారి సంసారమును, వారికున్న వస్తువాహన సంపదయును గూడ సంచార యోగ్యముగనే యుండును. రెండు కట్టెలు రెండు చాపలు కలిసిన భిక్షుకుల పాలిటి 'భవ్యహర్మ్యము' సిద్ధమగును. కూటికొక కుండ, పులుసున కొక చట్టి, తినుటకు మాత్రము రెండో మూడో బోలెలు-చిప్పలు,త్రాగుటకు రెండు ముంతలు, స్వామిభక్తిగల యొక కుక్క, వారు పాడుకొను పాటల కుపకరించు వాద్యములు ప్రతి భిక్షుకకుటుంబమున కుండెడు "స్థిర చరాస్తులు". వీరిలో కొందరు భాగ్యవంతు లుందురు. రెండు పందులో•నాలుగు కోళ్ళో,లేదా ఒక గాడిదయైనను, దూడయైనను ఇట్టివారికుండు విశేషసంపద. ఇంతియ. ఈదిన మిచ్చట గానుపించిన భిక్షుకుడు తెల్లవారి మరియొక గ్రామమున నివాసముండును. ఒకచోటినుండి మరియొక చోటికి పయనమనుకొన్నంతనే సంసార మంతయు, భుజముపై గల కావడియందో వీపున

గల మూటయందో ఇమిడిపోవును. శీతాతపములు వారిని బాధించవు. చీకటి వెలుగులు రెండును వారికి సమానము. దూషణభూషణములు కూడ నంతియ. వేషభూషణముల ప్రసక్తియే లేదు. వారి సంపదను దోచుకొను దొంగ ఇంత వరకును పుట్టలేదు.తీరనికోరికలు గాని తీర్చవలసిన సమస్యలు గాని వారికుండవు. ఈ పూటకు దొరకిన రేపటి చింతనము లేరు. 'నిత్య శ్రీరస్తు,నిత్య మంగళాని భవన్తు'.కడుపునిండినంతనే పట్టుసీడనో పుట్టదరినో వెన్నువాల్చగలరు.భూమిపై "వెన్నంటుకొనగనే కన్నంటుకొనును'. కలతలేని గాఢని'ద భగవంతు డిచ్చిన వరము.దాని ఫలితము రోగము నొప్పియు లేని ఆరోగ్యము. దురదృష్ట వశమున నేదేని యనారోగ్యము తటస్థించెనా 'వెదుకబోయిన తీగ కాళ్ళకడ్డమైనట్లు'ండు వనమూలికలు వారెరిగిన ఆయుర్వేద 'శాస్త్రము'. మూలికలకు తోడు దరిద్ర చింతామణియన బరగిన జీడిగింజ, లేదా—శొంఠి కొమ్ము—లేదా వెల్లిగడ్డ.రోగము కుదిరెనా యారోగ్యము లేదా యందఱకున్నట్లే చావు; కాని సడి చప్పుడు లేనిది. మూడుదినముల శోకముద్ర; ఆపై మరల భిక్షయాత్ర. ఇది జానపదగాయకుల సర్వసాధారణజీవితయాత్ర. 'ఆస్తిపాస్తులు'లేనటులే వారికి తగవు తీర్పులను అరుదు. ఏమైన చిక్కులు కలిగినచో ఏడాది కొకమారు తమ 'కులపెద్ద' కడ సమస్యాపరిష్కారము జరుగును. న్యాయవాదుల జోక్యము లుండవు. న్యాయాధికారుల ధర్మనిర్ణయము లుండవు. మాయ మర్మము లెరుగరు. పెట్టిన సంతోషముతో దీవించి పోదురు. పెట్టక తిట్టినచో భయపడి పోదురు. కనుక నింతజానపద గేయవాఙ్మయమును పరిశీలించిన తరువాత దరిద్రులగు నిట్టి జానపదగాయకుల గూర్చి సుంతైనను తెలిసికొనుట లెస్స.

## పిచ్చుకగుంట్లు

వీరు పిచ్చకుంట్ల,పిచ్చుకకుంట్ల-భిక్షకుంట్లయని తీరుతీరులుగా పిలువబడుదురు. పాల్కురికి సోమనాథుని కాలమునగూడ నీజాతియున్నట్లు పండితారాధ్యచరిత్రము వలన దెలియనగును.'మాకు,పీవంగ చేతులు లేవయ్యా నడచి,పోవంగ గాళ్ళును లేవయ్యా అంధ. కులమయ్యా పిచ్చుకగుంటులమయ్యా' యని మొరలిడు మాటల బట్టి వీరు వికలాంగులని తెలుచున్నది. 'పిచ్చుక కుంటుపై బ్రహ్మాస్త్రం' మను మాట సాహిత్యమున కెక్కుట వీరి యంగవికలతాదౌర్బల్యమునే సూచించును. పిచ్చుక శబ్దము భిక్షుక శబ్దభవమై యుండును. కనుకనే కొన్నిచోటుల భిక్షకుంట్ల

యను పేరును వాడుకలో నున్నది. శ్రీ సిరాజుల్లసను గారును ఇదే యభిప్రాయమును వెల్లడించినారు1. కుంటిబిచ్చగాండ్రు రానురాను పాటలుపాడుచు పొట్టవోసికొను వారుగా పరిణమించి యుందురు. వీరు ప్రధానముగా కాపులను (రెడ్లను) 'అడిగి కొని' జీవింతురు. వీరు కాపులపాలిటి వందిమాగధులు. కాపుల కులగోత్రములు వంశావళులు వీరు వల్లింతురు. తొలుదొలుత ప్రత్యేకముగా నిదే వృత్తిగా నుండినను రానురాను కాపుకులమందలి స్మరణీయులగు వారి జీవితగాధలను పాడుచు అటుతరువాత నితరగాధలను గూడ పాడుచు పొట్టవోసికొనుట యలవాటై పోయినట్లున్నది. వీరు గొల్లవారిని కూడ 'అడిగి కొందురు'. తెలంగాణమందన్ని మండలములందును వీరు కాననగుదురు. లక్ష్మమ్మ, కామమ్మ, బాలనాగమ్మ, సరోజనమ్మ, రాములమ్మ, సోమనాద్రి, సదాశివరెడ్డి పర్వతాల మల్లారెడ్డి, సూర్యచంద్రరాజులు, హరిశ్చంద్ర, మున్నగు గాథలు వీరు పాడగలరు.

వీరి జాతి పుట్టువును గూర్చి రెండు వింతకథలున్నవి. త్రిమూర్తుల వివాహవేళ వారిగోత్రములు చెప్పగలవా డొకడు కావలసివచ్చెనట అప్పుడు వారొక మట్టిబొమ్మను చేసి ప్రాణము పోసిరట. బొమ్మను చేయునప్పుడొక కాలు కుంటిగా నుండెను. కనుక నాతని సంతానమువారందరును పిచ్చుకగుంట్లైరట. మరియొక కథలో నొకప్పు డేడుగురు గొల్ల స్త్రీలు సంతానమునకై శివునిగూర్చి తప మొనర్చిరట. శివుడు వారికొక కుంటి బాలకు నిచ్చి సాకుడని యాజ్ఞాపించెను. ఇట్లుండ నా గొల్ల వనితలు గర్భిణులై ఏడుగురు బిడ్డలను కనిరి. వారు పెద్దవారగుట తోడనే శివునాజ్ఞ చొప్పున నాయేడ్గురిని కుంటివానికిచ్చి పెండ్లి చేసిరి. శివుడా కుంటివానికి, శంఖము, గంట, ఎద్దు, గజాశూలము2 (త్రిశూలము) నిచ్చి భిక్షమెత్తి జీవించుమనెను. కుంటివాడా యెద్దు నెక్కి శూలము ధరించి, శంఖమూదుచు గంట గొట్టుచు భిక్షమెత్తెడివాడు. వానిసంతానమే పిచ్చుకగుంట్లట. ఏ పిచ్చుకగుంటు నడిగినను అతడీ కథలను వినుపించును. పురాణాదులం దిట్టి యాధారములు లేవనుకొందును. కాపు మరియు గొల్లకులమువారి సంతాన మీ పిచ్చుకగుంట్లయి యుందురు. కనుకనే వీరు కాపులను మరియు గొల్లలను యాచింతురు. వారివారి వంశవృక్షావళుల, కులగోత్రముల భద్రపరచెదరు.

---

1 The castes and tribes of the H. E. H. The Nizams Dominions. Page 568.

2 గజాసురుని సంహరించుటచే కాబోలు శివుని త్రిశూలమును జానపదులు గజాశూలమందురు. లేదా పెద్దశూలమని కాబోలు.

కన్నడదేశమునగూడ పిచ్చుకగుంట్లున్నారు. అచ్చట వీరిని హెళవ లందురు. హెళవలనగా అంగవికలులని యర్థము. వీరందరు తెలుగు దేశము నుండి పోయినవారే ఇంట తెలుగు బయట కన్నడము మాటలాడెదరు. కన్నడ దేశమందుకూడ వీరికిదేవృత్తి.

పిచ్చుకగుంట్లలో 1. గొల్ల, 2. తెలగ, 3. గంట, 4. తురక. 5. తొగరు, 6. మంద, 7. తిత్తి యను ఏడుపజాతు లున్నవి. తొగరువా రందరికన్నను తక్కువవారుగా భావింపబడుదురు. గంట తిత్తి యను పేరులు బిచ్చమెత్తు నప్పుడు వారుపయోగించెడు వాద్యములవలన వచ్చియుండును. ఈ యుప జాతులవా రొకరితో నొకరు వియ్యమందరు. 'ఎవరికి వారే యమునా తీరే' యను నట్లు తమ శాఖలోనివారితోడనే సంబంధ మందెదరు. వీరి గోత్ర నామములు మచ్చుకుగా 1. గంటెడు వారు, 2. బండారువారు, 3. సింగమువారు, 4. పిడము వారు, 5. అంతుగలవారు మున్నుగా గలవి. ఇకవారి ఇంటిపేరులు గమనింపుడు. 1. తాళ్ళవారు, 2. గండిసరివారు, 3. కుంకులవారు, 4. బాణమువారు, 5. పోపల వారు మున్నగునవి.

పిచ్చుకగుంట్లందరును సాధారణముగా. శైవులు. మల్లికార్జునుడు వీరి యారాధ్యదైవతము. పోచమ్మ, ఎల్లమ్మ, మల్లమ్మ, ఈదెమ్మ మున్నగు క్షుద్ర దేవతల గూడ నారాధింతురు. వీరికి జంగములే గురువులు, మరియు పురో హితులును. పెండ్లి కానట్టి స్త్రీలను వీరు ఎల్లమ్మ, రాజరాజేశ్వరీ, మల్లన్నల పేరుమీదుగా బస్వి విడుతురు. చనిపోయిన తరువాత శవములను ఖననము చేయుట పరిపాటి. సాంఘికవ్యవస్థయందు శారదకాండ్రు వీరముష్టులకున్న గౌరవమే వీరికికూడ కలదు. మద్యమాంసములు బహుళముగా వాడెదరు. స్త్రీలు చాపల నల్లుదురు. కొందరు పిచ్చుకగుంట్లు పందులను గూడ పెంచెదరు. వీరు వనమూలికల నెరుగుదురనియు, కడుపునొప్పి వంటి రోగములను నయమొనర్తు రనియు నొకచో కలదు.1

కాపులను గొల్లలను యాచించుటే తొలుదొలుత వీరి ప్రధానవృత్తియైనను, కాపు గొల్లలకు సంబంధించిన బిరుదావళులు, కథలు చెప్పుటయే కాక తదితరుల కథలు చెప్పి, అందరిని యాచించుటకు మొదలిడినప్పటినుండి వీరి వాద్యములు కూడ పెరిగిపోయినవి. మొదట వీరు కేవలము గంట మరియు తిత్తిపైననే

1 The Manuals of Kurnool and Nellore.

యాధారపడి యుండెడువారు. రానురాను శారదకాండ్రను జూచి వోళ్లోష్ఠాద్యములు కూడ వీ రుపయోగించుచున్నారు.

## శారదకాండ్రు

మున్నూరు, ముతరాసి మున్నగు తెలగకులములనుండి యుద్భవించిన జాతులం దొకటి శారదకాండ్ర జాతి. శారదకాండ్రు తెలంగాణముననే అధికముగా నున్నట్లు తోచును. భిక్షుక జాతులందు వీరే యధికసంఖ్యాకులు. పూర్వమీజాతి కెట్టి పేరుండెడిదో తెలియరాదు. మన పూర్వసాహిత్యమున నితరజాతులపేరులెన్నియో కలవు కాని శారదకాండ్ర పేరుమాత్రము లేదు. కనుక నీపేరు వీరికిటీవల కలిగినదిగా భావింపవచ్చును. జానపదగేయములందు శారదవరుస పదములు ముఖ్యముగా నీజాతివారలే పాడగలుగుదురు. ఈ రచనములం దంత్యప్రాస నియమ ముండును. ఇతర జానపదగేయములకన్న నీపాటలందు కొంతసాహిత్య భాగ మధికము. 'ఓ భారతి కరుణామతి, భళి శారద కరుణానిధి' యనుమాట లూతపదములుగా వాడుచుండుటచే వీరికీ పేరువచ్చినదో యేమో! జానపద గేయముల పరిశీలించినప్పుడాయా ప్రకరణములందు కొన్ని శారద వరుసలున్న పాటలు (సారంగధర శారద వరుస వంటివి) చూచియుంటిమి. మరియొక విశేష మేమన వీరుపయోగించెడు వాద్యములం దొకదానికి శారద యని పేరు. పురుషుడు ఎడమచేతి బొటనవ్రేలికి అందెలు ధరించి భుజముపై నిడుకొన్న కిన్నెరను కుడిచేతితో మీటుచుండును. దీనినే శారద యందురు. శారదయనగా సరస్వతి. సరస్వతిపేరు వాద్యమునకు గూడ పెట్టినా రీ భిక్షుకులు. శారదాదేవీ స్తోత్ర మొనర్చిగీత మారంభింతురు. కనుక వీరు శారదవారనబరగిరని యూహింప వచ్చును. పురుషుడు గీతము పాడుచుండగా ప్రక్కనుండు నాతనియింటిది వంత పాటబాడుచు బుడ్డి (దీనినే డిమ్కి యందురు) గొట్టుచుండును. నేటిరాజకీయ పక్షములవారి బుఱ్ఱకథలు శారదకాండ్ర వేషములకు, గానములకు వాద్య విశేషములకు అనుకరణములు.

వీరు శారదవరుసలోనున్న పాటలేకాక ఇతర చారిత్రకగేయములను గూడ వీరావేశముతో పాడెదరు. తెలంగాణమందు ప్రచారమున మన్న సర్వాయి పాపడు, సదాశివరెడ్డి, మున్నగు కథలు వీరే యధికముగా చెప్పెదరు. ఇంకను బాలనాగమ్మ, బొబ్బిలి, పల్నాటిపదములుగూడ పాడెదరు. ఒక్కొక్కకథ వీరు మూడు నాల్గు దినములు వినిపించెదరు. ఒకొక్క సమయమున నిరువురుపురుషులు

ఒక స్త్రీగాని లేదా ఒక్కపురుషుడుఇరువురు స్త్రీలుగాని కథలను చెప్పెదరు. ముఖ్య కథ చెప్పెడువాడు మాత్ర మొక్కడే. తక్కిన ఒకరో ఇరువురో వంత పాట పాడెదరు. ఓరుగల్లు తాలుకాలోనున్న వెంకట్రావుపల్లి మున్నగు గ్రామములం దధికసంఖ్యాకులు శారదాకాండ్రే. శారదకాండ్రు సాధారణముగా నందరును శైవులు. ఇది మాంసాహారులగు జంగములవలన కలిగిన జాతియనికూడ కొంద రందురు. పోచమ్మ, ఎల్లమ్మ వారిముఖ్యదైవతములు. కల్లుమాంసము లారగింతురు. ఓలి, మారుమనువువంటి యాచారములున్నవి. బహుభార్యాత్వ మధికము. మొండి, దేవర, గంగిరెద్దులవారు వీరి నడగి తినెదరు. వీరికూడు మాలమాదిగలు తప్ప ఇతరులొల్లరు. వీరందరు శైవులేమైనను లింగములనందరు ధరింపరు. లింగధారులు మద్యమాంసముల వర్జింతురు. వీరికి గురువులు జంగములు. లింగ ధారులిండ్లలో శుభాశుభకర్మలకై పౌరోహిత్యము వహించునది జంగములు. లింగధారులు కానివారి యిండ్లలో 'కులపెద్దలే' పౌరోహిత్యము నెరపెదరు.

## వీరముష్టివారు

వీరముష్టి, వీరభట, భద్రపాద మున్నగు పేర్లన్నియు నీ జాతికి చెల్లును. ముష్టి యనగా పిడికిలి. వీరులగు యోధులనియు వీర (శైవ) భిక్షుకులనియు వీర ముష్టివారి కర్థము చెప్పవచ్చును. వీరు కోమటులను జంగములను యాచించి బ్రతికెదరు. వీరి వాద్య మొక జేగంట. లేదా తప్పెట. దీనిని వాయించుచు వీర శైవమునకు సంబంధించిన గేయములనో భక్తులకథలనో పాడుచు భిక్షమెత్తెదరు. కోమటులు వీరి నధికముగా నాదరింతురు. దీనికి కారణమగు కథయొకటి గలదు. వీరముష్టులు కోమటుల కిలువేల్పగు కన్యకామ్మవారిపాటల బాడెదరు. కరుణరస ప్రధానములగు కథలందు కన్యకాచరిత్రము గూర్చి తెలిసికొనియుంటిమి. రాజరాజు కన్యకను బలిమిని బట్టుటకై వచ్చునప్పు డాతని సైన్యమందున్న వీర ముష్టులను మరియు నాతని యందలము మోయుచున్న వీరముష్టులను కావలెనని కొంత జాగుచేసిరట. అందుచేతనే కన్యకకు మరియు నామె ననుగమించిన కోమటులకు అగ్నిగుండముల జొచ్చుట కవకాశము చిక్కినది. వీరముష్టు లాలసించనిచో రాజరాజు తొందరగా చేరుకొని కన్యకను చెరపట్టెడువాడే. ఈ తీరుగా వీరముష్టులు కోమటిజాతికి మేలొనర్చుట జేసి కోమటు లిప్పటికిని వారిని గౌరవించి భిక్ష మిడెదరు వీరముష్టు లధికముగా పాడెడు పాటలన్నియు కన్యకా సంబంధములు. అయ్యలరాజు నారాయణామాత్యుడు కూడ వీరముష్టుల దడవి

యున్నాడు. వీరముష్టుల జన్మప్రకారమును గూర్చి యొక వింత కథ చెప్పెదరు. తొల్లి వీరభద్రుడు దక్షాధ్వరధ్వంసము చేయునప్పు డాతని చెమటనుండి ఈ జాతివారు జన్మించిరట. వీరభద్ర, భిక్షుక, విభూతిపిండాలవంటి గోత్రనామములు వీరి వీరశైవమును చెప్పకచెప్పుచున్నవి. వీరిలో కొందరు లింగధారులై జంగములుగా మారెదరు. వీరముష్టులకు గురువులు ఆరాధ్య బ్రాహ్మణులు పోచమ్మ, ముత్యాలమ్మ, మారెమ్మవంటి దేవతల గూడ వీరు కొలిచెదరు.

వీరముష్టులందు కొందరు భక్తులు వీరశైవులొనర్చు (శారనములు గ్రుచ్చుకొనుట, నాల్కలు తెగగోసికొనుట వంటి) భయంకరకార్యములుకూడ చేసెదరు. 'విభూతి పండ్లు' చేసి యమ్ముట బిచ్చమెత్తుట వీరి వృత్తులు. లింగధారులు దక్క తక్కినవారందరు మద్యమాంసము లారగింతురు. క్షురకర్మ వీరముష్టులకు పనికిరాదు. కనుక నొకప్పుడు సిక్కులవలె వీరముష్టులు కూడ వీరభటులుగా నుండిరని చెప్పవచ్చును. వీరముష్టుల స్త్రీలు చాప అల్లుట, పచ్చబొట్లు పొడుచుట వంటి పనులు చేసెదరు. బ్రాహ్మణులు, కోమటులు, జంగములు, బలిజలు వండిన యన్నము దప్ప నితరుల చేత వీరముష్టులు కూడు తినరు.

## బవనీలు

వీరికే బైండ్ల,, పంబాల యనియు పేరులున్నవి. బవనీలు కూడ తెలుగు దేశమంతటను కలరు. తెలంగాణమున గ్రామదేవతల కొలుపులు గొలుచుటకును, గత్తర, స్ఫోటకము వంటి రోగములు కుదిర్చెడు మాంత్రికులుగను బవనీలు ప్రసిద్ధిగన్నవారు. క్రీడాభిరామమున నేకవీరామహాదేవి యెదుట నిల్చి పరశురాముని కథలెల్ల ప్రౌఢి బాడిన బవనీలచక్రవర్తి ప్రశంస గలదు. ధూర్జటి తన శ్రీకాళహస్తీశ్వరశతకమున బవనీలను దడవినాడు. పరశురాముని కథకే ఎల్లమ్మ కథయనియు రేణుకాకథ యనియు పేర్లు. ఈ కథా వివరము లిదివరకే పేర్కొని యుంటిని. తెలంగాణమున నిప్పటికిని వీరీ యెల్లమ్మ పోచమ్మ వంటి కథలను చెప్పుచు బిచ్చమెత్తెదరు. వీరంకమ్మను గూడ కొల్చెదరనియు గౌడజాతులిండ్లలో పెద్ద దినము (చావు) నాడు ముగ్గు లిడుదురనియు థర్స్టన్ పండితుడు వ్రాసియున్నాడు1. మాలవారి యిండ్లలో కొలుపులు గొలుచుట పండుగదినములందు శుభాశుభకార్యములందు పూజాదికములు నెరపుట కూడ వీరికి పరిపాటి. వీరుకూడ

1. Castes and tribes of Southern India, vol VI Page 29.

మాలలందొక జాతివారు.కొన్ని చోటులందు తెలగవారుకూడ పంబాల—బైండ్ల కాయికము చేయుదురు.

బైండ్లవారను పేరు వీరు వాయించెడు వాద్యమువలన వచ్చియుండును. వీరి వాద్యములకు జమిడికలని పేరు శిష్టులు వీనిని బవనిక లందురు. బవనికలు వాయించువారు బవనీలు-బైండ్లవారు. బవనికనే జమిడిక లేదా పంబ యందురు. బవనిక వాయించుటచే బవనీలు-బెండ్లవారైనటులే పంబ వాయించుటచే పంబాల వారైరి. కృష్ణా గుంటూరు ప్రాంతములందీ వాద్యములను జముకులందురు. వీని సహాయముతో చెప్పబడు కథలు జముకుల కథలైనవి. కులమువలన వాద్యమునకో లేదా వాద్యమువలన కులమునకో ఆయా పేరులు వచ్చియుండునని నా యూహ. బవనీలు వేరనియు పంబాలవారు వేరనియు డా. తంగిరాల వెంకట సుబ్బారావు గారి యభిప్రాయము. బవనీలు మాదిగలట. పంబాలవారు మాలలట[1].

జమిడికయనునది ధ్వన్యనుకరణ పదమని నా యూహము. జమిడిక లందొకటి వాయించునప్పుడు జమిడిక జమిడిక యని ధ్వనించును. బవనీ లెప్పుడును రెండు జమిడికలు వాయించుచు కథను చెప్పెదరు. వంతపాట బాడెడు వాని చెంత నుండునది చిన్న జమిడిక. ఇది కేవలము శ్రుతికై యుపయోగ పడును. టింగుటింగుమని తంత్రీధ్వని వెడలును. రెండింటి యాకార మొకే తీరుగా నుండును. చిన్న జమిడిక నిర్మాణ మిటులుండును. ఒక కట్టె సోలకు ఒకవైపున బక్క (మేక చర్మము క్రిందనుండు సన్నని పొరవంటి దాని) నతికించెదరు. రెండవ వైపు ఏమియు నుండదు. సోల కానుకొని యొక మూరెడు దండముండును. దండమునకు చివర భాగమున నొక జీవగట్టి యుండును. సోల లోపలినుండి బక్క-మధ్య భాగమున కట్టబడిన తీగ యొకటి జీవగట్టుకు బిగించియుండును. ఆ తీగపై చేతితో వాయించిన టింగుటింగుమని మ్రోగు చుండును. పెద్ద జమిడిక సోల కట్టెతో చేయబడదు. ఇది ఇత్తడితో చాల పెద్దదిగా చేయబడును. చిన్న జడమిక కన్న నిది కనీసము నాల్గింతలు పెద్దగా నుండును. దీనికి వాడబడు బక్క- ఎద్దు, దున్న మున్నగు పెద్ద జంతువులది. మరియొక విశేష మేమన దీనికి తీగకు బదులుగా దొడ్డునరము నుపయోగింతురు. ఇత్తడి సోలను చంకలో నిరికించుకొని రెండవ చేతితో ఆ నరమును ఐదు వ్రేళ్ళ (విడిచిన పిడికిలితో) వాయించునప్పుడు దప్పు చప్పుడుకన్న భీకరముగా

1 తెలుగు వీరగాథా కవిత్వము.

ధ్వనించును. చిన్న పిల్లలా ధ్వనికి భయపడగలరు. శక్తులు, గ్రామ దేవతల కొలువులు చేయునప్పుడు వీ రతిబీభత్సకార్యము లొనర్చుచు నీ వాద్యములు ప్రయోగించుచు గుండె లదరునట్లు చేయుదురు.బాగుగా కల్లు సారాయి వంటి మత్తు పదార్థములను గ్రోలి కణకణలాడెడు కన్నులతో శక్తి ముందర గంతులిడుచు గొఱ్ఱెలను మేకలను గావు పట్టెదరు. గావుపట్టుట యనగా బలి పశువును నోటితో మెడ కొరికి చంపుట. వారీపని చేయుటలో సమర్థులు. బలిపశువు నెత్తురు గ్రోలి దాని ప్రేవులు ధరించి దొబ్బలు నోట గరచికొని జమిడికెలు వాయించుచు వీథులు దిరుగునప్పు డత్యంతబీభత్సముగా నుండును. వారి బీభత్సకార్యముల కనుకూలముగా నీ జమిడికలు మ్రోగుచుండును.ఈ బవనీలే రాయలసీమలో పెద్ద దేవర కథను చెప్పెదరని కీ.శే. సురవరము ప్రతాపరెడ్డిగారు వ్రాసియున్నారు.1

## బీరన్నల వారు

వీరికే ఒగ్గువారు (ఒగ్గోళ్ళు) అని మరియొక పేరు. వీరు కురుమజాతికి చెందినవారు. కురుమవారికి బీరప్ప-బీరన్న ఆరాధ్యదైవతము.బీరన్న కొలుపులు గొలుచుట, బీరన్న కథలు చెప్పుటచే వీరికి బీరన్నలవారని పేరు వచ్చియుండును. కథలు చెప్పునప్పుడు గాని బిచ్చమెత్తునప్పుడు గాని వారు ఒగ్గు వాయించెదరు; కనుక వీరికి ఒగ్గువారని పేరు కలిగియుండును.ఒగ్గు వీరి ప్రత్యేకవాద్యము.ఇతర గాయకభిక్షుకు లెవ్వరు దీనిని వాడునట్లు లేదు. బుడుబుక్కలవా రుపయోగించెడు బుడబుక్క గూడ ఒగ్గువలెనే యుండును కాని చాల చిన్నదిగా నుండుటయే గాక భేదముండును, శివుని చేతిలో నుండెడు డమరుకమే తెలుగులో ఒగ్గనబడును. ఈ ఒగ్గు శబ్దము నిఘంటువుల కెక్కినట్లు లేదు. ఒగ్గుతో పాటు వీరు గొల్లసుద్దులవా రుపయోగించెడు పెద్దడోళ్లు (వీరణములు) మరియు తప్పెటలు గూడ వాడెదరు. కాటమరాజు కథలో బీరన్న యొకడు కలడు.ఆ బీరన్నకును కురుమలు కొలిచెడు బీరన్నకును గల సంబంధ మెట్టిదో తెలియరాదు. గొల్లలకు పూర్వము గోధన ముండెడిదని చెప్పెదరు. కాటమరాజు కథకూడ అటులనే తెలుపుచున్నది. కాని ప్రస్తుతము గొల్లలకు ఆవులమంద లున్నట్లు కానరాదు. మేకలు మాత్రముండును. కురుమవారికి మేకలతో పాటు గొఱ్ఱెలుకూడ నుండును.గొల్లలు గొఱ్ఱెలను గాయుట నీచముగా భావించెదరు. అందుకే గొల్లవారికన్న కురుమలు తక్కువ జాతివారు. కురుమలకు కంబళ్ళు నేయుటగూడ వృత్తియే. గొల్లలు కంబళ్ళు నేయరు.

---

1. ఆంధ్రుల సాంఘిక చరిత్ర-పుట- 197.

బీరన్నలవారు లేక ఒగ్గువారు కురుమ లిండ్ల పౌరోహిత్యము నెరపెదఁ కురుమలను యాచించి జీవించెదరు. బీరన్నలవారు కొమిరెల్లి మల్లన్న కథ చెప్పెదరు.మల్లికార్జున స్వామియే మల్లన్న, ఈకథనుగూర్చి ఇదివరకే తెలిసికొ యుంటిమి. ఈ మల్లన్న కురుమవారికిలువేల్పు. కురుమలును బీరన్నల వారు సాధారణముగా శైవులే. కాని తెలుగుదేశపు కురుమలకు లింగధారణము లేద కర్ణాటకదేశమున మాత్రము లింగాయత కురుమలు బీరన్నలవారు కలర కురుమలలో కొందరు వైష్ణవులు గూడ కలరు. కార్తికమాఘ మాసములంఁ బీరన్న కొలుపులు, పూజలు జరుగును. పోచమ్మ మైసమ్మ వంటి దేవతలన గూడ వీరు కొలుతురు.తెలంగాణము నీకురుమవా రధికముగా నున్నారు.కొమిరెల్లి మల్లన్న కథలో నాతడు కాపుబిడ్డ యని తెలిసికొంటిమి. బీరన్నలవా రాతః రెండవ భార్యయగు రత్నాంగియను బ్రాహ్మణి సంతతివా రనుటచే బహుశ ఈజాతివారు కాపులకు బ్రాహ్మణజాతులకు పుట్టినవారని భావింపవచ్చును.

## గొల్ల సుద్దులు

కురుమవారికి బీరన్నలవా రెటులో గొల్ల వారికి గొల్లసుద్దులట్లు.ప్రధానముగ వీరు గొల్లలను యాచింతురు.కాటమరాజు కథ, కృష్ణలీలలు వంటి పాటలు ప్రచాఁ మొనరించెడువారు గొల్లసుద్దులే. అయ్యలరాజు నారాయణామాత్యుడు గూడ గొల్లసుద్దుల నిటులే వర్ణించెను.

ఉ. కొమ్ములు వీరణాలు జిగి గుల్కెడు వ్రాతల కృష్ణలీలలం
గ్రమ్మ గుడార్లు వీరుడగు కాటమరాజు కథానులాపముల్
బమ్మిన వుస్తకాలు ముఖపట్టిడి కట్టు రుమాలలు న్నెఱా
సొమ్ములు నామముల్ వెలయు సుద్దుల గొల్లలు వచ్చి రెంతయున్ 1

కాటమరాజునకు వతులు చేకూర్చుట యాదవులకు ప్రధానదైవతమైన గంగకు వేటలు బోనములు, పిడులు శావించుట వంటి యాచారములు దొనకొండ,ఆలవల పాడు మున్నగు చోటులం దిప్పటికిని ఏటేట జరుగుచున్నట్టివే.థర్స్టన్ వండితు డీగంగ పూజలు వీరులపూజలు పేర్కొనెను2. కథావివరములు పెద్ద పెద్ద బట్టలపై చిత్రింపబడియుండుట గొల్లసుద్దులవారి కథలందు గల విశేషము. పాండవుల వారను నొక తెలగజాతివారు (తెలంగాణములో) భారతకథలను చీరలపై

1. హంస వింశతి : 2-88

3. The castes and tribes of Southern India Vol II page293

చిత్రింపబడిన పెద్దబొమ్మల సాయముతో ప్రజానీకమునకు పాడి వినిపించినటులే గొల్లసుద్దులు కూడ కృష్ణలీలలు మరియు కాటమరాజుకు సంబంధించిన బొమ్మలను ప్రదర్శించుచు కథలను చెప్పెదరు. పద్యమం దభివర్ణింపబడినటులే వీరు కొమ్ములను, వీరణములను వాయించెదరు. వీరణము పెద్దడోలు వంటిది. కొందరు శంఖముల గూడ నూదెదరు. గొల్లలు సాధారణముగా వైష్ణవులే. ఐనను వీరిలో కొందరు శైవులునుగూడ కలరు. సంఘమందు బ్రహ్మక్షత్రియ వైశ్యజాతుల తరువాత గొల్లలే యధికులుర. రెడ్డి, వెలమజాతుల వారుకూడ గొల్లల యన్నము తినెదరు. గొల్లలుకూడ రెడ్డి ( కాపు ) వారి యన్నము తినెదరు. గొల్లలందు గూడ నెన్నియో తెగలున్నవి. వీరిలొ నెఱ్ఱిగొల్ల లందరి కన్న శ్రేష్ఠులు. గొల్లసుద్దులు ఎఱ్ఱిగొల్లలే. తక్కిన జాతి స్త్రీలు వేసినటుల కాక ఈ జాతిస్త్రీలు పయటకొంగుల కుడివైపునకు వేసికొందురు. వీరిలో వైష్ణవము పుచ్చుకొనినవారికి వైష్ణవబ్రాహ్మణులు పౌరోహిత్యము నెరపుదురు. ఒకప్పు డాలమందల పెంచినను ప్రస్తుతము గొల్లల ప్రధానవృత్తి మేకలను పెంచుటయే. గొల్లసుద్దులకు కూడ భిక్షావృత్తితో పాటు మేకలను పెంచుటయు కలదు. ఈ జాతి స్త్రీలయందు కొందరికి మాతృమనువున్నది. మరికొందరికి లేదు. ఓలి వంటి యాచారములు గూడ వీరిలో కలవు. పెండ్లిలో ప్రోలు వోయుట అవిరేణుల పూజించుట కూడ కలదు.

## దాసరులు

దాసరులందరును వైష్ణవులు. వైష్ణవమున నున్న దాసభావమువలన నీ జాతి వారికి దాసరులను పేరు వచ్చియుండును. దాసరులందెన్నియో తెగలు కలవు. వీరశైవము వలెనే వీరవైష్ణవముగూడ సర్వవర్ణములవారి కాశ్రయ మిచ్చినది. నీచజాతులందు వైష్ణవము స్వీకరించి భిక్షుకులైనవారందరును దాసరులుగనే పిలువబడుదురు. బుక్కదాసరి, పాగదాసరి, దండెదాసరి, భాగవత-బుట్టదాసరి, చిన్నదాసరి, మాలదాసరివంటి తెగ లనేకము కలవు.

శ్రీకృష్ణ దేవరాయలు మాలదాసరి నిట్లు వర్ణించెను.

సీ. చమురైన తోలుక్కబుసంబు టెంకియును వ్రత్తడి శంఖచక్రకుండలము లమర
దిశెదారి కొమ్ము దోల్తిత్తియు జోడమ్ము, మెడమీది మొగలాకు గొడుగు దనర
మత్పాదరక్షయు మావు పెన్నెఱకగు, ట్టిన యోటి తివిరి దండెయును మెఱయ
చిటితాళములు సంకపుటిక నొక్కొకమాటు, గతిరయంబున దాకి కలసి మొరయ

1. నచ్చుద్రో గోపనాపకా

గీ. వలుద వనమాల కంఠేయు మలినతనువు
బట్టె తిరుమన్ను బెదరు గెంబుట్టుజూపు
బసువు బొటితోలు పల్లంబు నెసకమెసగ
వచ్చు సేవింప సురియాళు వైష్ణవుండు1.

దండెదాసరులు మొదట వైష్ణవపీఠాధిపతుల యందలములు మోసెడు వారట. వీరి భక్తికి మెచ్చి కాంచీపీఠాధిపతులు దండమును, తాళములను, తంబురాను, శంఖమును, దివ్వెను ఇచ్చి భిక్షమెత్తు డనిరట. అప్పటినుండి వీరు భూమిపై నచ్చటచ్చట దీపస్తంభమును నిలిపి ఒకరు శంఖమూద, మరియొకరు తంబురా మీట,ఇంకొకరు చిరుతలు వాయించుచు విష్ణుసంకీర్తన మొనర్చుచు గోవిందలు కొట్టుచు నాట్యమొనర్చుచు భిక్ష మెత్తెదరట.వీరి స్త్రీలు మాత్రము భిక్షమెత్తరు. పూసలు, దువ్వెనలు, అద్దములు అమ్ముచు తిరిగెదరు. ఒక్కొక్క సమయమున పురుషులు తమ భుజములపై కావడులు పెట్టుకొని వానియందు విష్ణువిగ్రహములు, సాలగ్రామములు, శంఖములు, తులసిపేరు లుంచికొని మోయుచు వాని నమ్ముచుండెదరు. ఇట్టి కావళ్ళను గూడ కాశికావళ్ళందురు. పూర్వము (ప్రయాణ సౌకర్యములు లేని దినములందు)కాశికి బోయెడు తైర్థికులు వారివారి సామగ్రిని కావడులలో మోసికొని పోయెడువారు. కొందరు మనుష్యులుకూడ కాశికావళ్ళు మోయుటకై ఏర్పడి యుండిరి. గంగాతీర్థమును కాశినుండి తెచ్చునప్పుడు కూడ కావళ్ళలో తెచ్చెడువారు. వీనికన్నింటికి కాశికావళ్ళని పేరు. బుట్టదాసరి, మాలదాసరి కులములవారు దాసరు లందరిలో తక్కువవారుగా భావింప బడుదురు. బుట్టదాసరులకే భాగవతులనియు పేరు, వీరి స్త్రీలు బుట్టలనుగూడ అల్లుటచే నీ పేరు వచ్చియుండును. పురుషులు స్త్రీవేషముతో కాళ్ళకు గజ్జెలు కట్టి తాళ మృదంగ ధ్వనులతో నాట్యమొనర్చుచు విష్ణుసంకీర్తనము చేయుదురు. గరుడాచలము ప్రహ్లాద, రామదాసు వంటి భాగవతములుకూడ వీరు ఆడుదురు.

మాలదాసరులనే మిత్తిరి దాసరులందురు.వీరే నిత్యులు.రేపాక (కరీంనగర మండలము)లో నున్నమిత్తిరిదాసరులు విప్రనారాయణ ప్రహ్లాద యక్షగానములు ప్రదర్శింతురు. కీర్తనలు పాడుచు భిక్షమెత్తెదరు. దాసరుల ముఖ్యవాద్యములు చిరుతలు, తంబురా, లేదా కిన్నెర,తాళములు, కాళ్ళగజ్జెలు. మిత్తిరి దాసరులలో మరియొక విశేషవాద్యమునకు గూడ ప్రచారము కలదు.తంబురా వంటిదే మూడు

1. ఆముక్తమాల్యద ౬ - ౬

నాల్గు తీగెల దొక వాద్యముండును. దానిని భూమిపైనుంచి రెండుచేతులతో రెండు సన్నని పుల్లలతో తీగలపై వాయించెదరు. ఈ పుల్లలు మూరెడేసి పొడవుండును పట్టుకొనుచోట నొక చివరన చిన్న చిన్న గజ్జెల గుత్తులు వ్రేలాడగట్టబడును. దీనిని కటి వాద్య మందురు. దాసరు లందరురును వైష్ణవులే కనుక వీరు పాడునట్టి కీర్తనము లన్నియు విష్ణుసంకీర్తనములుగా నుండును.

భిక్షమెత్తుటతో పాటు చేపలు పట్టుట, పావురముల బట్టుట, తాటిచాప లల్లుట, తాటి బుట్టి లల్లుట కూడ దాసరుల కలవాటు. దాసరులలో కొందరికి సాతానులు మరి కొందరికి వైష్ణవబ్రాహ్మణులు గురువులు. దాసరు లందరును మద్యమాంసము లారగింతురు. వీరు తమలో తమకు కలిగెడు జగడములను 'కుల పంచాయితి' లో తీర్చుకొందురే కాని కోర్టుల కెక్కరు. మారుమనువు వంటి యాచారము లున్నవి.

## జంగములు

తెలంగాణమున వీరికే బుడిగె జంగములనియు పేరు కలదు. బుడిగె యనునది వీరు వాయించెడు వాద్యమునకు పేరు. శారదకాండ్రకు వంతపాట పాడెడు స్త్రీలు కాని పురుషులు కాని వాయించెడు బుడ్డల వంటివే జంగముల బుడిగెలు. ఇవి కొంచెము చిన్నగా నుండుటయే కాక ఇత్తడి లేక కంచుతో చేయబడును. శారదాకాండ్ర బుడ్డలు కూజా ఆకారమున నుండెడు మట్టితో చేయబడు వాద్యములు. వాని నొక బెత్తెపు చట్రమున బిగించి ఒకవైపు చట్రమునకు తోలు బిగింతురు. రెండవవైపు కూజా మూతి అనాచ్ఛాదితముగా నుండును. దీనిని మెడకు వ్రేలాడ వేసికొన్న కడుపుపై నడ్డముగా నుండును. కుడిచేతి వ్రేళ్లతో చర్మముపైనను ఎడమ యరచేత అనాచ్ఛాదితముగా నున్న మూతి పైనను వాయించుట పరిపాటి. జంగముల వాద్యము కూడ ఇటులే యుండును కాని వీరు మట్టికూజాలకు బదులు కొంచెము చిన్నగానుండు ఇత్తడి లేక కంచు కూజాలను వాడుదురు. ఇంతియ భేదము. జంగము లందరును శైవులు. వీరు చెప్పెడు కథలకు జంగం కథలని పేరు. జంగంకథల వరుస రగడకు సమీపముగా నుండును. జంగములు తొలుత కేవలము శైవసంబంధమగు కథలనే చెప్పెడు వారైనను రానురాను శైవేతరజంగంకథలను గూడ చెప్పుచున్నారు. దేశింగురాజు వంటి చారిత్రక గేయములు కొన్ని జంగంకథల వరుసలం దున్నట్టివే. విరాటపర్వము జంగంకథ, భక్మాణ జంగంకథ, సిరియాళ జంగంకథ, దేవయాని జంగంకథ, వామనవిజయము

జంగంకథ, అంబరీషోపాఖ్యానము జంగంకథల వంటి కథలు వీరు చెప్పెదరు. వీర శైవమునకు తగిన యావేశము వీరికుండును కనుక జంగంకథలు గూడ నీ యావేశమునకు సరిపోవునట్టి వరుసలో నుండుటచే వీరు కథలు చెప్పునప్పు డుత్సాహజనకముగా నుండును.

శ్రీగో, పాలా, రాధా, లోలా, శితజన, వరిపా, లా,
ఆగమ, లీలను, ధరస, పాలా, అగణిత, గుణజా, లా,

సాధారణముగా దీనిని రగడ భేదమని (అప్పకవి చెప్పిన నాలుగు మాత్రల నాటిన గణములని చెప్పినదానికి సమీపమున నుండుటచే) తలంచెదరు కాని చివరనున్న 'లా' గతి విచారింపరు. అదికూడ ఒక గణమే. దానిని కూడ 'శ్రిత జన' యన్నంత సేపు పాడవలసినదే. అట్లు పాడిననే యది జంగంకథ యగును; జానపదగేయ మగును.

ధేనువకొండ వారి జంగంకథలందు కథలు చెప్పెడు జంగముల వరనము కలదు. విరాటపర్వము జంగంకథను కవి,

'భారత మొక కథ చేయుమనుచు నను ప్రార్థింపగ జూచి
నే రచియింపగ బూనితి జంగమువారికి నుపకృతిగా
నీటుగ విభూతిరేఖలు దీర్చియు నిల్వుటంగీ ల్దొడిగి
వేటు రుమాలాల్ పేటు పాగా ల్వల్లెవాటు లొనర దాల్చి
జోడు గుమ్మెటల్ దట్టుచు వంతలు బాడుచు మరియొకడు
పోడిమిగా చేబూని సితారా భుజమున ధరియించి
గజ్జెలు మువ్వలు అందెలు పదముల ఘల్లని మ్రోయగనూ
తరుణుత తక యని నాట్యము సల్పుచు దంబుర మీటుచునూ
సంగతిగా సభ వారికెల్ల ప్రసంగ పూర్వకముగా
చెంగున దుముకుచు జంగంబులకును జీవనధన మనగా' రచించెనట.

జంగముల వేషములు వారుపయోగించెడు వాద్యము లిందు చెప్పబడినవి. బుఱ్ఱలే బుడిగెలే గుమ్మెటలను పేరుతో దీనిలో గాననగును.

జంగము లన్ని జాతుల శైవులను యాచించి బ్రతికెదరు. ఆడిదము సూరకవి 'జంగాల పాలు దేవాంగుల విత్తంబు'[1] అనుటచే ప్రధానముగా వీరు దేవాంగులను (శైవులగు సాలెవారిని) యాచింతురని తెలియుచున్నది. తెలంగాణమందున్న బుడిగెజంగములు బలిజలను, పంచదాయకులాలవారిని, కోమటులను

---

1 రామలింగేశ శతకము, 24 వ పద్యము.

యాచించెదరు. బ్రహ్మక్షత్రియవైశ్యులిండ్లలో మాత్రమే తినెదరు. ఇతరు లిండ్లలో తినరు.

వీరుకాక, సాతానులు,హట్కారులు. జోగులవారు. జక్కులవారు, బాలసంతు వారు,బుడబుక్కలవారు మున్నగు జాతులవారందరును జానపదభిక్షుక గాయకులే. వారిని గూర్చి వాసిన గ్రంథవిస్తర మగును. ఈ జాతులవారందరును తమ పొట్ట పోసికొనుటకైనను జానపదగేయములు పాడెదరు. వారి ముఖస్థమైయున్న జానపద సాహితీసంపద నంతటిని ఉద్ధరించి భద్రపరచుకొనుట శ్రేయస్కరము.



# జానపద గేయముల వరుసలు

పద్యమునకన్న పదమే ముందు పుట్టినదను పండితుల నిర్ధారణముచేతను సంస్కృతవృత్తములు తెలుగు పొలమునకు దిగుమతి చేయబడక పూర్వము, వాగనుశాసనుని భారతరచనమునకు పూర్వము, గల తెలుగు శాసనములందు పదచ్ఛందములే యధికముగానుండుటచేతను, మన దేశిచ్ఛందోరీతులు పదములని తేలుచున్నది. తెలుగు సాహితీసౌధమునకు పునాదులైన ఈ దేశి ఛందోరీతులు ప్రాజ్నన్నయయుగమునుండి ఈ నాటివరకును వినబచుచునేయున్నవి. వీనిలో వీలైనవాని కొన్నింటిని సంస్కరించియో, ఉన్నవి యున్నట్లుగనో పండితులు గ్రహించి కవిత లల్లిరి. లక్షణకారులు లక్ష్యలక్షణము లేర్పరచిరి. సంస్కృతము నుండి వచ్చిన అక్షరగణబద్ధవృత్తములకు భిన్నముగా నీదేశీయరచనారీతులన్నియు లయానుగుణమగు మాత్రాగణబద్ధము లగుటచే నివి ద్రావిడభాషలన్నింటికి సమానమనియు తెలుగు దేశికవితారీతుల నారయవలయునన్నచో తమిళ కర్ణాట భాషాచ్ఛందముల నారయవలయు ననియు కీ. శే. శ్రీ చిలుకూరి నారాయణరావు గారును1 శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారును2 తెలపియున్నారు. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు చాలవరకు దేశీయకవితారీతులను లక్ష్యలక్షణములతో సమన్వయించినారు.

'పువ్వు పేరే జాజిపువ్వు, పురముపేరే అయోధ్య పురము దేవి పేరే సీతాదేవి' వంటి పాటలు తమిళమందలి 'ఒరూ ఉమోనై' యను ఛందమునకు లక్ష్యము లనియు, 'గుడు గుడు గుంచం గుండేరాగం, పాముల పట్టం పడగా రాగం' వంటిపాటలు 'కూరై మోనై' యను ఛందమునకు లక్ష్యము లనియు,

౧ 'లాలి శంకర సదా లాలిత కుమారా - లాలి వటు తాండవోల్లాన ఘనధీరా'

౨ 'భూదేవి కూతుర్ని కోయిలారో - జనకునీకూతుర్ని కోయిలారో'

౩ 'పద్దన గూడదమ్మా వినవమ్మా - ఎట్టావు పాలు సుమ్మా' వంటి పాటలు 'తొడై' ఛందమునకు లక్ష్యములనియు సూచించి యున్నారు.

---

1 'మాత్రాచ్ఛందస్సులు' వ్యాస సంగ్రహము.

2 దక్షిణ దేశ భాషా సారస్వతములు - దేశి.

ఈ మార్గముననే నేనును నడచి వైయాకరణులు చెప్పిన లక్షణముల కొలతలతో జానపదగేయములను కొలచుటకు యత్నించితిని. 'సువ్వి సువ్వి రామచంద్ర' యనునది తురగవల్గమునకును 'గుమ్మడేడే గోపి దేవి' యనునది కన్నడమందలి భామినీషట్పదకును, జంగంకథ లన్నియు హరిగతిరగడకును, 'హరిహరీ నారాయ ణాదినారాయణా' యను పదముల వరుస ద్విరదగతిరగడకును, ఏలపదములు భోగషట్పదికిని, 'ధర్మరాజు జూదము' వంటివి మంజరీద్విపదకును 'గురికి బెత్తెడు దూర' మన్నట్లు సరిపోయినవి. పుత్రకామేష్టి పాట 'శ్రీరామచంద్రుల చిత్తకమలమందు నిలిపి, ప్రేమతో సన్నుతించిరి రామ గీతలూ' అను పాటను కొలది మార్పులతో కర్ణాటభోగషట్పదికి సగము భాగముగా చెప్పుకొనవచ్చును. ఇరువది మాత్రలున్నచో భోగషట్పదికి సగమగును. అర్ధభోగషట్పదియని క్రొత్త పేరిడవలయును. ఇటులే 'సీత శుభగోష్ఠి' పాటను కర్ణాట వార్ధికషట్పదికి సమీపమున నుంచవచ్చును. అప్పుడు దీనిని పంచపాద యనవలసివచ్చును. శతకంఠరామాయణము వరుస 'శ్రీమహా దేవుండు జగదేకవీరుండు' అనునది 'కరమొప్ప పంచలఘు గణచతుష్టయముచే' నొప్పారుచుండుట వలన ద్విరదగతి యనియో కర్ణాటక లలిత యనియో భావింపవచ్చును. కొమిరెల్లి మల్లన్న కథ 'శ్రీ గణేశ నిన్ను నాదు చిత్తమందు దలతునయ్యా' పాటను తురగవల్గనముగను సరిపుచ్చవచ్చును. ఇంకను కన్నడ, తెలుగు ఛందములే కొంత వైవిధ్యముగలవి యొక తీరుగను పోలికలున్నవి, రెండు భాషలందును వేరువేరు పేరులతోడను గానుపించినవి. ఉదాహరణమునకై కన్నడమందలి మందానిలమునకు అప్పకవి చెప్పిన మధురగతిరగడయును, కర్ణాటక ఛందోవతంసమునకు తెలుగు చతుష్పదయును, కన్నడ కుసుమషట్పదకు తెలుగు షట్పదయును, కన్నడమందలి లలితకు తెలుగు ద్విరదగతిరగడయు, కన్నడ భోగషట్పదికి తెలుగు హయప్రచారరగడయును, కన్నడ భామినీషట్పదకు తెలుగు వృషభగతి రగడయును చేరువగా నగుపడినవి. వీనినన్నింటిని సమన్వయించుకొని తెలుగు జానపదగేయములే రగడకో, షట్పదికో, తరువోజకో, అక్కరకో, 'దగ్గరగా' 'చేరువగా' 'వలెనే' యున్నవని తలచితిని. మరియొకప్పుడు లక్షణకారులు చెప్పిన ఏదోయొక ఛందమునకు గీతములు 'భేదము' లనియు నిర్ధారించుకొంటిని.

ఇంకను వాని ఛందోవిషయములు ఇదమిత్థముగా తేల్చికొనుటకు ప్రతి పాటకు గణవిభజనము చేసి ఆయా పాటలందు ఒక్కొక్క చరణమున కిన్ని

మాత్రల గణము లిన్ని యుండునని తేల్చుకొంటిని. ఉదాహరణమునకై కొన్ని పాటలను గణవిభజన చేసి చూతము.

ఊర్మిళాదేవి నిద్ర

'శ్రీరామ, భూపాలుడూ, పట్టాభి, షేకుడై, కొలువుండగా' ఇటులే ప్రతిచరణమున 5+7+5+5+7 మాత్రల గణము లుండును. ప్రథమ చతుర్థ గణములందు యతి గలదు. అచ్చటచ్చట ప్రాసయతులున్నవి. ఐదు మాత్రల గణములు ఇంద్ర గణములు; ఏడు మాత్రల గణములు చంద్రగణములు. పై చరణమందున్న గణములు. తగణము, తగ గణము, తగణము, రగణము, సవగణము. దీనినే ఇంకొక తీరుగా విభజింప వచ్చును.

శ్రీరామ, భూపాలు, డూ, పట్టాభి, షేకుడై, కొలువుండ, గా.
తగణము+తగణము+గురువు+తగణము+రగణము+నలము+గురువు.

లంకాయాగము పాట

శ్రీరామ, రఘుపతీ, సీతబిలి, పెంచుకొని, కోరిపే, గము నడువ,గా
ప్రతిపాదమున ఐదేసి మాత్రలవి ఆరు గణములు పైన నొక గురువు కలవు.

చిలుక ముగ్గు పాట

శ్రీకరం, బగుచున్న, శ్రీలక్ష్మి, తులసి
ప్రతిచరముణన 5 + 5 + 5 + 3 మాత్రల గణము లున్నవి.

త్రినాథు చరిత్రి పదము

హరిహరీ, నారాయ, ణాది నా, రాయణా, కరుణించి, మమ్మేలు, కమలలో, చనుడా
ప్రతి చరముణన ఐదేసి మాత్రలవి ఏడు గణములును చివరన నాల్గు మాత్రల గణమును కలవు చివరి గణమును రెండు సూర్యగణములుగా పెంచుకొన్నచో నిది సీసపద్యపాదమగును. ఇది తరువోజకు గూడ సమీపముననే యున్నది. కొన్ని పాటలను సంస్కృతవృత్తములతో గూడ నంటగట్టవచ్చును. ఉదాహరణమునకై యొకపాట.

శ్రీశైల భ్రమరాంబాష్టకము

'రవిసుధాకర వహ్నిలోచని, రత్నకుండల భూషణీ' యని సాగిపోయినది. అప్పకవి తరళలక్షణ మిట్లు పేర్కొనెను.

'వలుకుచో దరిళంబు లందుల, భాను విశ్రమ పద్ధతిన్
గలియ నభ నజాగముల్, సమకట్టి చెప్పుదు రుత్తముల్'1.

---

1. అప్పకవీయము-పుట. 243.

ఈ విధముగా ఒక్కొక్క పాటను పట్టుకొని ప్రాకులాడి ఒక్కొక్క ఛందమనియో లేదా ఒక్కొక ఛందమునకు దగ్గరగా నున్నదనియో, లేదా కొలది మార్పుతో నీఛంద మగుననియో చెప్పవచ్చును. జానపదగీతములన్నవి పదులా వందలా? వేలు లక్షలు దాటిపోవుచున్నవి గదా! లక్షల కొలది గేయముల నీతీరుగా విభజించిన కొన్నికొన్ని గేయముల ఛందము లొకదానిలో నొకటి కలసిపోవు ననుకొన్నను కొన్నివేల సంఖ్యలలో ఛందఃప్రస్తారములు చేయవలసి వచ్చును. కనుక జానపదగేయముల రీతులను కనుగొనుటకిది సరియైన మార్గము కాదు. కాని మన లక్షణకారులు చెప్పిన ఛందోలక్షణముల గతి యేమిటందురా? 'సంస్కృతప్రాకృతభాషాపండితులు దేశభాషాసాహితీరీతులను గనిపట్టి వానివి సంస్కృతప్రాకృతభాషాసాహితీ రీతులతో సమన్వయించి దేశభాషలకు లక్షణము నేర్పరుప దొడఁగిరి'1 యను కోరాడవారి వాక్యమును ఛందమునకు గూడ నన్వయించుకొని జానపదగేయములందలి కొన్ని రీతులను మాత్రమే దేశికవులు తమ చేతనైనవాని చేపట్టి దేశిఛందములుగా మలచుకొని రచనము లొనర్చిరనియు, వానికే విన్నకోట పెద్దననుండి అప్పకవివరకును గల లాక్షణికులు లక్షణము లేర్పరచిరనియు భావించిన సమంజసముగా నుండును. ఇంతకు పూర్వమెప్పుడో భరతాదులు కొన్ని దేశీయగానములకు లక్షణము లేర్పరచిరి. మార్గ, దేశి యని సంగీతమును రెండు తెగలుగా విభజించినప్పుడు భరతుడు, మతంగుడు, శార్ఙ్గదేవుడు మున్నగువారు దేశిగానమున నెన్నియో తీరుల పాటలను పేర్కొనిరి. తెలుగువారి ఏలపద మా సంగీతజ్ఞుల కెంతగా నచ్చినదో కాని వారందరు ఏలపదములనుగూర్చి విశేషముగా వ్రాసిరి. మన జాజరపాటలు చర్చరీగీతములై సంస్కృతకవుల కావ్యములకు గూడ నెక్కినవి. జానపదుల కవితాగానరీతుల కలరిన నా సంస్కృత కవిపండితులు చూపిన యాదరము తరువాత కలిగిన యుత్సాహముచే ఆంధ్రవిషయంబున చాళుక్యరాజులు దేశికవితను బుట్టించి యుందురు.

కనుక దేశికవితలకు మూలములై, సంస్కృత లాక్షణికులు, క్రీ. శ. ప్రథమశతాబ్ది నాటికే సంస్కరించి గీర్వాణ మలవరచుట కుత్సాహము పురికొల్పి నట్టివైన జానపదగేయముల ఛందోరీతులను వేలకొలదిగా గణవిభజన చేసిగాని, లాక్షణికు లేర్పరచిన కొలదిపాటి కొలతబద్దలచే గాని, ఇదమిత్థమని

1. దక్షిణ దేశభాషా సారస్వతములు-దేశి. పుట 135

తేల్చజాలము. నిజము విచారించినచో జానపదుల ప్రాకృత హృదయములనుండి ఇన్ని తీరుల ఛందములలో నిన్ని గేయములు వెడలునా? వారెన్ని పాటలు పాడినను, వారెట్టి మనోభావముల వెలార్చినను (అవి లక్షలసంఖ్యలైనను) వ్రేళ్ళపై లెక్కింపదగు కొన్ని వరుసలలో మాత్రమే వెడలినవనియే నాభావము. జానపదులు కష్టించి పనిచేయునప్పుడుగాని, ఆనందపారవశ్యమున పాడి చిందులు త్రొక్కినప్పుడు గాని, శోకభారము వెలార్చునప్పుడు గాని, వారి హృదయములు స్పందించిన రీతు లొకకొన్నియే. జానపదుల గేయరీతులను కనుగొనుట కత్యంతమైన సులభ మార్గము జానపదగేయోత్పత్తికి గల కారణము నారయుటే. ప్రథమప్రకరణమున నావిషయమై విపులముగా చర్చించియుంటిమి. ఆది మానవుడు సంతోషపారవశ్యమున చిందులు త్రొక్కినప్పుడు ముద్రితములైన పదాంకములందే గేయముల రీతులును గలవు. కవిత్వారంభ దశ, నాట్యారంభ దశ, సంగీతారంభ దశ, అచ్చోటనే గలదు. స్పష్టాస్పష్టములగు నా యంశముల నూహించి 'జానపదగేయములు మూడు, నాలుగు, ఐదు, ఆరు, ఏడు, యెనిమిది, ఆవృత్తములలో నడచును' అని యొక ప్రమాణ మేర్పరచుకొన్న నెన్ని లక్షల గేయములనైన నీసూత్రమున బంధింపవచ్చును. ఈ సూత్రముతోడనే జానపద గేయముల వరుసలను కొన్నింటిని వివరించెదను.

గేయములు పాడుకొనుటకును, పద్యములు చదువుకొనుటకును ఉద్దేశింప బడినవి. ఈ రెంటికిని నాలుగు, ఆరు, లేదా ఎనిమిది చరణము లుండును. గేయముల చరణములకు 'చరణము' లను పేరును పద్యముల చరణములకు 'పాదము'లను పేరును రూఢియైనవి. పద్యపాదము గణములచే కూర్పబడినటులే పాటల చరణములు ఆవృత్తములచే కూర్పబడును. గణములు గురులఘువుల విశిష్టమగు కూర్పులు. గురువులకు రెండు మాత్రలు, లఘువున కేకమాత్రయని పద్య గణములందు నియమము. గణములకు గల గురులఘువుల క్రమముగూడ నిర్ణీతమై యుండుటచే ఒక్కొక్క గణమున కొక్కొక్క విశిష్టమగు నడక - గతి కలదు. పద్యపాదము విశిష్టములగు గణముల ప్రత్యేకమైన కూడలి యగుటచే మొత్తము మీద దానికి (పద్యమునకు) గూడ ప్రత్యేకమగు నడక సమకూడును. గణము లన్నియును సమానకాలప్రమాణము గలవి కాకుండుటచేత పద్యపాదమందలి ఒక్క గణము మారినను పాదముయొక్క గతివిన్యాసము మారిపోయినట్లు గోచరించును. పాటలయొక్క చరణముల నిర్మాణము పద్యపాదములకన్న చాల సరళముగా నుండును. ఒక చరణమునందలి యావృత్తము లన్నియు కాల

ప్రమాణములో సమానముగా నుండును. ఒక ఆవృత్తములోని మొత్తము మాత్రల సంఖ్య నిర్ణీతమే యైనను, వాని గురులఘువుల క్రమము మాత్ర మొక్కటే కానక్కరలేదు. పాటలో 'ర' గణమైనను 'త' గణమైనను ఒకే కాల ప్రమాణము (అనగా ఐదు మాత్రల కాలము) గలవగుటచే ఒకదానికి మారుగ నింకొకటి వాడవచ్చును.

గణములందలి యక్షరములకు విలువు గీతలను చంద్రవంకలును చిహ్నములుగా వాడినట్లు ఆవృత్తములందలి మాత్రలకు త, క, కి, ట యను అక్షరములను లాక్షణికులు చిహ్నములుగా వాడెదరు ఈనాలుగక్షరములును ఒక మాత్ర కాలమునే సూచించును పాటయొక్క గతిలో రెండేసి మాత్రల చేరిక స్ఫురించినచో 'తక' యను రెంటిని గాని, 'కిట' యను రెంటిని గాని కలిపి యుచ్చరించి ఆ చేరికను సూచించుట సంప్రదాయమై పోయినది. మూడేసి మాత్రల చేరిక స్ఫురించినచో, నద్దాని 'తకిట' యను మూడక్షరములచే సూచింతురు.

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|
| సువ్వి, | రామ, | చంద్ర, | సువ్వి. | సువ్వి. | కీర్తి, | సాంద్ర, | సువ్వి, |
| 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 15 |
| సువ్వి, | పీ, | తమ్మ, | మాకు, | శుభము, | లి, | మ్మా, | *, |

అను కొట్నముల పాట మూడేసి మాత్రల యావృత్తములతో నడచునట్టిది. అనగా 'తకిట', 'తకిట'యని నడచునన్నమాట. ఇట్టి తకిట, తకిట యను మూడు మాత్రల (మాత్రలనుటకు మారు 'అక్షరము' లనుట సంగీతపరిభాషాసంప్రదాయము.) ఆవృత్తములు పైన పేర్కొన్న కొట్నముల పాటకు చరణమునకు పదునారుండును. చరణము వ్రాయునప్పుడు పైన వ్రాసినటుల రెండు భాగములుగా వ్రాయుట సంప్రదాయము. రెండు భాగములకును యతులను ప్రాసములును పద్యములందు వలెనే యుండును. చరణములందు చివరనున్న మూడావృత్తములందు సంగీతాక్షరములు (అనగా మాత్రలు) మూడేసి యున్నప్పటికిని (భాషాక్షరములు అనగా) సాహిత్యాక్షరములు మాత్రము రెండింటిలో ఒక్కొక్కటి యుండి మూడవదానిలో నేమియులేకుండ బోయినవి. సాహిత్యాక్షరములెట్లున్నను ఈమూడు ఆవృత్తములను తొమ్మిదిమాత్రలకాలము పాడితీరవలసినదే. సాధారణముగా నొక్కొక్క మాత్రకు ఒక్కొక్క స్వరము తగిలి యుండును. ఈ సంగతినే 'తొలిరోజుల పాటలలో అక్షరస్వరములుండు' ననియు చెప్పవచ్చును. 'తకిట' యను త్రిశ్రగతిలో నడచెడు పాటలు జానపదగేయములందనేకములు గలవు.

త్రిదా॥ సీత దాగిలిమూతలు, సీత ముద్రికలు, శ్రీరామమానసపూజ, తులసీదళములు, సువ్వాలలు, మేలుకొలుపులు, ('కేశవయని నిన్ను వాసిగ భక్తు'లనునది) వరదరాజు పెండ్లిపాట, కామేశ్వరిపాట, సుభద్ర కల, వంటి పాటలన్నియు త్రిశ్రగతియందే నడచినవి.

కోలాటపు పాటలు నాలుగు నాలుగు మాత్రల యావృత్తము లెనిమిది గల చరణములతో నుండును. పాల్కురికి సోమనాథుడు 'కోలాట గొడియలు' అని కోలాటకు సంబంధించిన వస్తుసామగ్రిని సూచించినాడు. తక్కిన నృత్య విలాసములను వర్ణించినంత వివరముగా కోలాటను వర్ణింపకుండుట కోలాట సోమనాథుని యనంతరముననే చక్కగా వృద్ధినంది యుండునని భావింపవలెను. కాని అన్నమయ్య రచించిన సంకీర్తనములలో ననేకములగు కోలాటపాట లుండుటచే 15వ శతాబ్దమునాటికి కోలాటలు తెలుగునాట విరివిగా వ్యాపించి యుండునని చెప్పవలెను. మచ్చున కన్నమయ్యగారి కోలాట పాట యొకటి.

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|
| వట్టి వలపు, | చల్లకు, | విష్ణు మూరి, | తీ నీవు, | వెట్టిదీర, | మాటలాడు, | విష్ణు మూరి, | తీ, |

దీనిలో నెనిమిది యావృత్తములు సూచింపబడినవి. ప్రతి యావృత్తమునకును నాలుగేసి మాత్రలు కలవు. సాహిత్యాక్షరములు మాత్రము నాలుగు కావని చెప్ప నవసరము లేదుకదా. 'వట్టి వలపు' "చల్లకు' 'తీ' ఈ మూడావృత్తములందున్న సాహిత్యాక్షరముల నన్నింటినిగూడ 'కిటతక' యను నాలుగు మాత్రల కాలమందే కుదించి పాడవలెను. ఈరీతిగా పాడినప్పు డీకోలాట పాట, కిటతక, కిటతక, కిటతక, కిటతక, కిటతక, కిటతక, కిటతక, కిటతక, యని నడచును. నేటికిని కోలాట పాటలును, తెలంగాణమందు వినబడు జాజిరి పాటలును ఈగతితోడనే, అనగా నాలుగు మాత్రల యావృత్తములతో (చతురశ్రగతి)నడచును. సీత నత్తవారింటి కంపుట, సీత సమర్త, సీతాదేవి వామనగుంటలాట, కుశలవకుచ్చల కథ, పిల్లల పాటలు, తలుపుదగ్గర పాటలు(నందిరాజువారు సుమారు 40పాటలిట్టివి ముద్రించిరి) బొబ్బిలి కథ, దేశింగు రాజు కథ, గొబ్బియళ్ళో పాటలు, లక్ష్మీదేవి సొగటాలు, పారిజాత పల్లవి, జాజర పాటలు, కోలాటపాటలు మున్నగునవి సాధారణముగా చతురశ్ర గతి (కిటతక)తో నడచెడు పాటలు.

ఐదేసి మాత్రల యావృత్తముల నడకను ఖండగతి యందురు. ఐదు మాత్రల నొకదానితో నొకటి ప్రత్యేకపు చేరికలేక వేరువేరుగా పలుకుచు ఐదేసి మాత్రల నొక్క కూడలిగా పలుకవలసినచో దీని గతిని 'కిట తకిట, కిట తకిట'

యని సూచింతుము. ఐదు మాత్రలను $2+3$, $3+2$ మాత్రలుగా కూడ సూచింపవచ్చును. ఈ రెండు గతులను 'తక తకిట' యనియును 'తకిట తక' యనియును సూచింతుము. ఖండగతి యావృత్తములు ఈ రెండు విధములం దేవిధముచేనైనను, లేదా కిటతకిట యని ఐదు మాత్రల కూడలులవలెనైనను సూచింప వచ్చును. నన్నయ్యకు పూర్వపు దేశి కవితలో,

పట్టంబు గట్టిన ప్రథమంబు నేణ్డు

బల గర్వ మొప్పగ బైలేచి సేన'యను చరణము వంటివి నాలుగేసి గల తరువోజలు విరివిగా వాడుకలో నుండెను. యతిప్రాస లమరింపజేసి చాళుక్య రాజులు వీనికి శాసన గౌరవమును బహుశః సభాగౌరవమును కూడ కలిగించిరి. కాని సుదీర్ఘములై (8 ఆవృత్తములు గలిగి)న నాలుగేసి చరణముల ఈరచనలు దేశిరచయితల కంతగా రుచించినట్లు లేదు. మార్గకవులు కూడ వీని నచ్చటచ్చట వాడినను వీనినే కొంచెము మార్చి నిర్మించిన సీసపద్యములనే ఎక్కువగా నభిమానించిరి. తరువోజ చరణములందలి చివరి రెండావృత్తములను సూర్య గణములుగా మార్చినచో సీసపద్యపు నాలుగు పాదము లేర్పడును. ఎత్తుగీతి ఈ నాలుగు పాదములను భరించును. ఈరకపు సీసములు నన్నయ్యకు పూర్వమే యేర్పడినవి. తరువోజ చరణములో నాలుగు, ఎనిమిది సంఖ్యగల యావృత్తములను సూర్యగణములుగా మార్చి చరణపు రెండు భాగములకును ప్రాసముల నమర్చినచో ద్విపదలు సిద్ధమగును. ఈ మార్పు పాల్కురికి సోమనాథుడు చేయుటవలననేమో పిడుపర్తి బసవన చెప్పిన ధూర్తనింద సోమనాథునకు వచ్చినది. నిజ మేదియైనను, పాల్కురికి వరకును, పండితకవులు ద్విపదలను వాడకపోవుటచే, ద్విపదలకు తెలుగునాట నాతని పిమ్మటనే ప్రచారము వచ్చినట్లు తెలిసికొనవచ్చును. క్రీడాభిరామకాలమునకు వీరాసీకముం బాడు ద్విపదప్రబంధములు వ్యాప్తిగాంచెను. ఇవి వాస్తవముగా లక్షణయుతములైన ద్విపదలందే (రంగనాథ రామాయణము వలె) ఉండెనో లేదా మాతపురాణము, మాహురమ్మ కథ వంటి దేశికావ్యములవలె, ఐదు మాత్రల ఆవృత్తములు నాలుగేసి గల పాదములతో రోకటిపాటలవలె నుండెనో చెప్పుట కాధారములు లేవు.

చిన్నకోట పెద్దనగారి 'తలకొని దగఁ బ్రాలు దంచెడి చోటఁ దరుణులచే సొంపు దనరుఁ దరోజ' యను మాటచే తరువోజలు రోకటి పాటలుగా వ్యాప్తియందుండెడివని తెలియవచ్చును. ఈనాడు వినబడు రోకటిపాటలు రెండేసి నాలుగేసి చరణములతోడను, ఖండగతిలో నాలుగేసి యావృత్తముల తోడను,

గాగుచుంటనుబట్టి తరువోజలే_మంజరీ ద్విపదలని కొందరు పేర్కొనుచున్న-రోకటి పాటలకు మూలములు కాబోలు ననిపించును. మాహురమ్మ కథ, మాత పురాణము, సుభద్రాకల్యాణము వంటి కథాకావ్యములును రోకటిపాటలట్లు పాడునట్టివే. వీనిలో నాలు గావృత్తముల పాదము లుండును. ఇవి 'కిటతకిట' యను ఖండగతిలో నడచును. స్త్రీలపాట లధికముగా ఖండగతిలో నడుచునట్టివే. ఉదా॥ సంక్షేపరామాయణము, గోవింద నామాలు, కౌసల్య వేవిళ్ళు, శ్రీరామ దండములు, సీతాకల్యాణము, రాఘవకల్యాణము, రాములవారి అలుక, సీత అప్పగింతల పాట, సీత వసంతము, సీతామ్మవారి అలుక, సీత గడియ, ఋషుల ఆశ్రమము, కోవెల రాయబారము, సీతాదేవి యానవాలు, సీత చెర, లంకాయాగము, సేతు మాహాత్మ్యము, గుహభరతుల అగ్నిప్రవేశము, శ్రీరామ పట్టాభిషేకము, సీత సురటి, లక్ష్మణదేవర నవ్వు, ఊర్మిళాదేవి నిద్ర, సీత శుభ గోష్ఠి, సీత మేలుకొలుపు, కుశలవుల యుద్ధము, చెంచీతపాట, తుమ్మెదపాటలు, ఉయ్యాలా, చిలుకా పాటలు, విసురురాయి, అవిరేణి, జోలపాటలు, ధర్మరాజు జూదము, శశిరేఖ పెండ్లి, శాంతాకల్యాణము, విశ్వరూపము, మున్నగు పాటలన్నియు ఖండగతిలో నడచునట్టివే.

మూడు, నాలుగు, ఐదు తరువాత నారు మాత్రల ఆవృత్తముల పాటలు లెక్కకు వచ్చును ఇవి $3 \times 2 = 6$ మాత్రల గతిలో నడచును. కనుక నీ పాటలను త్రిశ్రగతి పాటలుగనే చెప్పుకొనవచ్చును. కాని ఒక్కొకప్పుడు 6 మాత్రల ఆ వృత్తములు $2 + 4$ మాత్రలతో 'తక కిటతక' యని నడువ వచ్చును. ఏలపదము లీవరుసలోనే నడచును. ఏలలకు చిన తిరుమలాచార్యులు తమ 'సంకీర్తన లక్షణము'న చెప్పిన

'నాయకాహ్వానపూర్వమై నయము గలిగి, మ్లేచ్ఛ పరిభాష దగి రాగమిశ్రితమైన యేల పాట పదంబునా నిలఁ జెలంగు, మహిత నాయక సంబుద్ధి మధ్యమగుచు'1 అను లక్షణము నిర్వచనప్రాయమైనదికాదు. ఈ లక్షణమునకు తోడుగా 'నాలుగు 'తక కిటతక' ఆవృత్తముల పాదములు మూడేసి కలిగినది' యని చెప్పుకున్నచో ఏల లక్షణము తెలియరాదు. ఈ క్లిష్టతయే కీ.శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు'అప్పా రావోయి ముద్దుల కుప్పా రావోయి'యను పాటను ఏలయని చెప్పిన పొరపాటునకు కారణమై యుండును. శాస్త్రిగారు తమ రేడియో ప్రసంగమున చెప్పిన 'నీవూ నేనూ గూడీ' యన్న పాట ఏలపాట కాదు.

1. సంకీర్తన లక్షణము, పద్యము 65

మూడు, నాలుగు, ఐదు, ఆరు ఆవృత్తముల పాటల తరువాత వచ్చునవి ఏడుమాత్రల ఆవృత్తముల పాటలు. ఇవి మిశ్రగతిలో నడచును. ఏడుమాత్రలను (3 + 4) తకిట కిటతక గను, (4 + 3) కిటతక తకిట గను చెప్పుకొనవచ్చును. కాని 'తకిట కిటతక' ఆవృత్తములే సాధారణము. గుమ్మడు పాట, 'మేలుకొనవే చంద్రశేఖర మేలుకొనవే ఇంద్రవందిత' యను మేలుకొలుపును మిశ్రగతిలో నడచునట్టివే (తాళపు దెబ్బలను వేయునప్పుడు 'త' మీదను 'కి' మీదను దెబ్బవేయుట పరిపాటి. 'తకిట కిటతక'లు పాటతో పాటు తిరుగునప్పుడు రెండేసి దెబ్బలు సమకాలాంతరములో పడుచుండును) ముత్యాల సరములు గూడ మిశ్రగతిలో నడచు పాటలే.

వీని తరువాత పేర్కొనదగినవి ఎనిమిది మాత్రల ఆవృత్తముల పాటలు. 'బాలక్రీడ' లను స్త్రీలకథాగేయము నాలుగేసి ఎనిమిదిఆవృత్తముల పాదములు రెండుగల పాట. మొదటి భాగములో నాలుగు 'కిటతక కిటతక' ఆవృత్తములకు నిండుగా సాహిత్యాక్షరము లుండవు. కాని రెండవభాగమున నుండును. కనుక తొలిభాగము మెల్లగను మలి భాగము త్వరితముగను సాగినట్లు స్ఫురించును. 'అదిగో భద్రాద్రి గౌతమి' యనుపాట ఇట్టిదే.

'దేశి గేయములు మూడు, నాలుగు, ఐదు, ఆరు, ఏడు, ఎనిమిది ఆవృత్తములతో నడచు' నన్న వాక్యము వాని ఛందస్సును చక్కగా వివరించు లక్షణము. అన్నమయ్య సంకీర్తనములందు (7 మాత్రల ఆవృత్తముల) మిశ్రగతి సంకీర్తనములు చిక్కలేదు. పైన పేర్కొన్న వివరణము కేవలము సరళములగు తొలి దినముల కీర్తనములకే వర్తించును. రానురాను పాట లనుపల్లవిని బెంచుకొని క్లిష్టములై పోయినవి. కందుకూరి రుద్రకవి (1568) 'సుగ్రీవ విజయము'లో దరువులు లేవు. క్రీ.శ. 1633-1673 వరకు తంజావూరును పాలించిన విజయరాఘవ నాయకుడు తన 'విప్రనారాయణ చరిత్రము'లో ద్రుతగతిలో సాగిపోవు

'నెర నీటు, మీరంగ, నిచళాధి, నాథుండు,
గురిదొరల్, గొలువంగ, గొలువునకు, చ్చెన్'[1] వంటి దరువులను వాడినాడు.

దరువులనునవి గానముమీద గాక నడకమీద ప్రాధాన్యముంచి నడపిన ఆవృత్తములు. పదములు చతురశ్ర వంటి ఏగతిలో సాగినను, రాగము స్వరములతో కూడి నెమ్మదిగా సాగును. (క్షేత్రయ పదములు విన్నవారి కిది

1. విప్రనారాయణ చరిత్ర, పుట. 14.

యనుభవసిద్ధమే.) కాని దరువు లట్టి చతురశ్రగతిలో నడచినను స్వరములకు గల కాలప్రమాణమును కుంచించి మాత్రల మీదనే నొక్కుచు త్వరితముగా నడచును. ఈ నడక నృత్యముచేయుట కనుకూలమైనది కనుక దరువనునది. బృహద్దేశి వంటి సంగీతశాస్త్రము లెట్లు చెప్పినను, యక్షగాన నాటకములలో నృత్యానుకూలతకొరకు ప్రవేశించిన దనవచ్చును. అందువలననే కాబోలు విజయ రాఘవనాయకుడు రచించిన దరువులకు కొన్నింటికి రాగనిర్దేశమే కనబడదు. ఈ దరువులకు గాని, 'నొండి నాటకము' వంటి వీథినాటకములలో ప్రవేశించిన దరువులకుగాని, పలు పాదము లున్నను పల్లవి యనునది లేదు. దరువులు తెలుగు నాటకములోనికి తమిళనాటకసంప్రదాయమునుండి ప్రవేశించినట్లు కనబడు చున్నవి. తొలుత తమిళములో రచింపబడి తెలుగులోనికి వచ్చిన నొండి[1] నాటకములో పదములును కీర్తనములును లేవు. దానియందున్న దరువు లన్నియు పల్లవి లేనట్టివే. ఒక్కొకటి ముప్పది పంక్తులుకూడ సాగినది. కనుక దరువులు నాట్యానుకూలరచన లనవచ్చును. కేరళదేశమున కథకళి నాట్యప్రధాన ప్రదర్శనములు ప్రబలమగుటతో తమిళనాటకము గూడ నాట్యప్రధానమైనది కాబోలు.

దరువులు కాలక్రమమున చరణముల రూపాంతరము లై పోయినవి. చరణములు రాగప్రధానములు. దరువులు గతిప్రధానములు. అంతియ భేదము. రామదాసు(క్రీ.శ. 1675) కీర్తనములందలి చరణములు దరువులే యనవచ్చును. వీనిలో సాహిత్యాక్షరములు నిండుగా నుండును. కనుక మద్దెల వాద్యములో దరువునకు ఘాత లెక్కువ. ఎక్కువ ఘాతలు నృత్యమం దడుగులువేయుట నెక్కువచేయును. కనుక తెలుగు వీథినాటకములలో దరువు లెక్కువగా ప్రవేశించినవి. అవి యంతటితో నాగలేదు. కందపద్యములో ప్రవేశించి కందార్థదరువులను సిద్ధమొనర్చినవి. ఉత్పలార్థములు, సీసార్ధములు, చంపక మాలార్థములు, ఆట వెలద్యర్థములు, తేట గీత్యర్థములు, శార్దూల మత్తేభార్థములు, చివరకు వచనార్థములు గూడ వీథినాటకములందును జంగంకథలందును కలవు.

కీర్తన మింకొక విధమగు మార్పును గూడ పొందినది. ఇది సంగీత దృష్ట్యా కీర్తనమునందు కలిగిన యభివృద్ధి. పల్లవియను ధ్రువమైన భాగమును జయదేవుని కాలములో (11వ శతాబ్దము) ప్రతి చరణమునకును చేర్చి పాడెడు ఆచారముండెడిది. గార్లపాటి లక్ష్మయ్యగారి ఏగంటి తత్త్వములును.

1 నొండి = (అతవము) కుంటి-ఒంటికాలి భరతము.

అన్నమయ్యగారి సంకీర్తనములును చరణము-పల్లవి, చరణము-పల్లవి వరుసలో సాగిపోయినవి. అన్నమయ్య పల్లవులలోని రెండవభాగ మారాగములోని తార స్థాయిని స్పృశించియుండి యుండవచ్చును. పురందరదాసు కీర్తనములు కూడ ఇట్టివే. కాని తారస్థాయి నందుకొను గుణముగల యనుపల్లవి ప్రత్యేకముగా నెవరి రచనములం దేర్పడినదో చెప్పుటకు మనవరకు దిగివచ్చిన గానప్రయోగ సాక్ష్యము చాలదు. క్షేత్రయ్య పదములందు మూడు పంక్తుల పల్లవియును,నాలుగు పంక్తుల పల్లవియును కనబడుచున్నవి.ఇది నిశ్చయముగా ననుపల్లవికి సూచనమే. మొదటి పంక్తి లేదా రెండు పంక్తులును పల్లవి. తక్కిన రెండు పంక్తులును అనుపల్లవి. త్యాగరాజాదుల అనుపల్లవిలో చరణపు చివర రెండు పంక్తులలో వలెనే యతిప్రాసలున్నవి. వీనికి సంగీతసామ్యముగూడ పూర్తిగా నున్నది. త్యాగరాజునుండి అనుపల్లవికి స్ఫుటమైన సంగీతరూపము వచ్చి కీర్తన యొక్క సంగీతశిల్పసామరస్యము హెచ్చినది.

పోతులూరి వీరబ్రహ్మంగారి తత్త్వములందు

వినుడు బ్రహ్మము మాయ వినుడు
వినుడీ జనులారా - దుడుకూలు విడువండి
తడవు లేదు వీర - గురుడు పల్కిన వాక్యం ||వినుడి||

అను తత్త్వములో మొదటి పంక్తి పల్లవి; తక్కిన రెండును చరణములు. కాని ఈ చరణములో దరువుయొక్క ద్రుతగతి ప్రవేశించినది. తక్కిన చరణము లిదే వరుసలో నుండును.

పోతులూరి వీరబ్రహ్మంగారిదే ఇంకొక తత్త్వము

పల్లవి:
నే జూచినానే - బ్రహ్మము నాలో
నే జూచినానే - సద్గురు నాలో
నే జూచినానే -

అను పల్లవి:
నే జూచినానమ్మ - నెలతరొ తారక
రాజయోగమునందు - రంజిల్లు నా గురుని ||నే జూచి||

అనుదానిలో పల్లవియందే దరువు గుణము ప్రవేశించినది. కాని పల్లవి రూపము మాత్రము చెడలేదు. తరువాత నున్న రెండు పంక్తులును రాగమునకు తారస్థాయి నందించు అనుపల్లవి. తత్త్వమందలి తక్కిన చరణములన్నియు ననుపల్లవి ఫక్కియందే యుండును.

దూదేకుల సిద్దయ్య తత్త్వ మొకటి

పల్లవి:
ఏ కులమని నను వివర మడిగితే
ఏమని తెలుపుదు లోకులకు

అను పల్లవి:
లోకులకూ - పలు గాకులకు
దుర్మార్గులకూ - యీ దుష్టులకూ

దీనిలో ననుపల్లవి దరువువలె సాగినది.

ముట్టున బుట్టిందీ కులము-ము
ట్టంటున పెరిగిం దీకులము
ముట్టులో హరియు ముట్టులో శివుడు
ముట్టులో బ్రహ్మం ముగ్గురు మూర్తుల మూలము దెలిసిం దీకులము ॥ఏకుల॥

ఈ చరణమున అనుపల్లవి యొక్క ద్రుతగతి గోచరించుచున్నది.

పల్లవి॥ ఏమి జన్మము ఏమి జీవనము ఈ మాయ కాయము
అను పల్లవి { ఏమి జన్మము ఏమి జీవన మేమి శాశ్వత మేమి సౌఖ్యము
ఏమి నాప్రారబ్ధకర్మము స్వామి నన్నిటు జేసి మరిచెను ॥ఏమి॥

అను ఎడ్ల రామదాసు పాటయం దనుపల్లవి రాగములో పైస్థాయి నందుకొను చున్నది. 'ఈశ్వరా జగదీశ్వరా పరమేశ్వరా కరుణించరా' యను పాటయును, 'జాలమూ యేలనుర నీల మేఘ శ్యామ' యను పాటయును ఇట్టివే.

పండితుల కవిత్వమునం దనేకరీతుల వృత్తములు వాడుకలో నున్నవి. నన్నయభట్టారకుడు సీసపద్యమునుముఖ్యముగా కథాకథనమున కుపయోగించెను. తిక్కనగారి కందములు, వృత్తములు పేరుపొందినవి. కాని ప్రత్యేకముగా సీసని కుపయోగించిరని చెప్పుటకు వీలులేదు. పండితారాధ్యుడు కందమును, పాల్కురికి వృత్తమును ప్రత్యేకోపయోగ మొనర్చి శతకములు రచించిరి. పాల్కురికి ద్విపదను సృష్టించుటతో ద్విపదప్రబంధములు ప్రత్యేకముగా వృద్ధి పొందినవి. శ్రీనాథుడు సీసమును, పోతన్న ఆనుప్రాసికవృత్తమును సానబట్టిరి. శతకవాఙ్మయము వృద్ధినందుకొను కాలము వరకును రకరకముల వృత్తముల నెంచుకొనుట బహుళముగా జరుగలేదు. అప్పుడు మాత్రము బద్దెన కందమును, ధూర్జటి, పోతన్న, అన్నమయ్య వృత్తములను, తాళ్ళపాక తిరుమలాచార్యులు, కూచిమంచి తిమ్మకవి, కాసుల పురుషోత్తమరాజు, శేషప్ప, అడిదము సూరకవి సీసములను, వేమన ఆట వెలదిని, కవిచౌడప్ప కందమును వాడినారు. కందార్థములలో శుద్ధనిర్గుణతత్త్వమును వివరించుట కలదు గాని కందార్థ దరువులు పాటలలో లెక్కకు వచ్చును.

గేయకారులు కూడ వేరువేరు రకముల గేయములను వాడినారు. కాని ఈ వాడుకలో కొంత కాలక్రమవికాసము కాననగుచున్నది. తొలి దినములందు తరువోజ వికృతియగు మంజరీ ద్విపదలో పల్నాటి వీర చరిత్ర, మాతపురాణము, మాహురమ్మ కథ, కాటమరాజు కథ రచింపబడినవి. ఇవి మొదటినుండి చివర వరకును ఐదు 'కిట తకిట'ల పాదముల తోడనే రచింపబడినవి. తాళ్ళపాక

తిమ్మకక్క సుభద్రా కల్యాణము కూడ నీయచ్చులోనే దిగినది. ఇదు 'కిటతకిట'ల వరుసకాక నన్నయనాటికే శాసనములందు పొడచూపుచుండిన రగడల వరుసలలో కూడ జానపదకవులు కథలను రచించుచుండిరి. (సువ్విపాట వరుసలో గుఱ్ఱము కపోతయ్య 'దారుకా వనక్రీడ' కలదు) ఇవి యన్నియును మొదటినుండి చివర వరకును ఇటులే సాగిపోవును.

తెలుగు నాటి యక్షగానము తంజావూరికి తరలి పోవుటతో దక్షిణాదిలో పాటలుగా వ్యాప్తినందిన పదములు, దరువులు, తలుపు దగ్గర పాటలు (విజయ రాఘవుని విప్రనారాయణచరిత్రలోవలె) యక్షగానములలో ప్రవేశించినవి. ఈ యక్షగానములు కూచిపూడి వంటి భాగవతకేంద్రములకు తిరిగి వచ్చినవి. వీనియందలి దరువుల యుద్ధృతిలో జానపదగేయకథలలో కీర్తనలు ప్రవేశించినవి. గుంటూరు మండలమున నీ శతాబ్ది ప్రారంభమున పుట్టిన జంగముకథ లన్నిటను రగడరూపములో కథయును, మధ్య మధ్యన కీర్తనలు, దరువులు, వచనములు కనబడుచున్నవి. జంగంకథ కథనమునకన్న కాలక్షేపము వైపునకే ఎక్కువగా మొగ్గు చూపినది. కనుకనే కాబోలు జంగంకథలలో సొగసులు చాల తక్కువగా నుండును. కథనమునకే యధికప్రాధాన్యమిచ్చి, రగడయందే సాగిన బంగారు తిమ్మరాజు కథ, బొబ్బిలి కథ, దేశింగు రాజుకథవంటి కథాగేయములు దేశమందంతటను వ్యాపించి సర్వజనసమ్మతమైనవి.

కీర్తనలపై ప్రజలకు గల మమకారమునకు దోహదముగా 19వ శతాబ్దాంతపు కవులు కీర్తనల గాథలు రచించిరి. పాల్కురికి చెప్పిన సిరియాళుని కథ, క్రీడాభిరామపు విద్దికూచి రామాయణము కీర్తనలగాథ లైనప్పటికిని, కీర్తనల గాథలు 19వ శతాబ్దాంతమువరకును సార్వజనీనత గాంచనట్లున్నవి. 1850 ప్రాంతపు మందపాటి రామకృష్ణయ్యగారి గజేంద్రమోక్ష కథాగీతము, మునిపల్లె సుబ్రహ్మణ్య కవి అధ్యాత్మరామాయణము వంటివి ప్రౌఢరచన లైనప్పటికిని జానపదుల-స్త్రీల-సొమ్మై పోయినవి. శారదకాండ్రు చెప్పెడు కీర్తనల కథలు, హరిశ్చంద్ర, రామాయణము వంటివి పెక్కులున్నవి. జంగముకథలు వచ్చి శారద కథలను వెనుకకు నెట్టినవి. శారదకథల కంత్య ప్రాస మతిముఖ్యము. ఈ ప్రభావమే బహుశః అధ్యాత్మ రామాయణముపై బడినట్లున్నది. గుత్తెనదీవి రామాయణకీర్తనలు (మాచవోలు రాఘవయ్యవి), కుచేలోపాఖ్యాన కీర్తనలు, పాటల రామాయణము ( కారుపల్లి రామాంబ విరచితము ) పాటల భారతము, అక్కెనప్రగడ హరిదాసు బాలకృష్ణలీలలు, కుబ్జాకృష్ణవిలాసము, పూడిపెద్ది బుచ్చెన

గోపికాకృష్ణలీలలు మున్నగునవి కీర్తనల గాధలే. రాయపురపు సుదర్శన దాసు శిష్యుడు భోజదాసు, అంగమ్మచరిత్ర, పురందరదాసు చరిత్రములను రచించెను. దత్తాత్రేయ చరిత్రము, పద్మవ్యూహము, కుచేలోపాఖ్యానము వంటివి పాటలందే వెలసినవి.

విశాఖ మండలమున — భీముని పట్నము చుట్టుపట్టుల - జంపె వరుసలలో 'పదము' లను రచించుట 19వ శతాబ్దమధ్యమున ప్రారంభమైనది. జంపెలు యక్షగానములందలివే యైనను దీర్ఘకథనము నేర్చినది మాత్రము విశాఖమండల మందే. నడిమింటి రామయోగికవి బాణాసురయుద్ధ మొక రసఖండము-పసగాడ సన్యాసి, ఈపూరి రామచంద్రరాజు, తోలేటి సీతారామయ్య, పూడిపెద్ది బుచ్చెన్న, పొడుగు రామబ్రహ్మయ గొప్ప పదకవులు.

ఇది యంతయు దీర్ఘకథనముల గాథల సంగతి. చిన్న చిన్న రచనలు, ముక్తకములు, జానపదరచనములందు కుప్పలు తెప్పలుగా నున్నవి. వాని వివరము క్రిందిగువ పథకమున గాననగును.

| | | |
|---|---|---|
| ఊయెలపాట. | 8. కిట తకిట | ఉ. అలర జం, చల మైన, యాత్మలం, దుండని,. |
| గొడుగీతము. | 8. కిట తక | ఉ. బెత్రాయి, సామి దేవు, డా,.............. |
| రోకటి పాట. | 4. కిట తకిట | ఉ. ఈనాటి రోకటి పాటట................... |
| తుమ్మెద పాట. | 8. కిట తకిట | ఉ. శివ శివ, యనమేలు, తుమ్మెదా........... |
| మేలుకొలుపులు.(1) | 4. తకిట కిటతక | ఉ. మేలుకొనవే, చంద్ర శేఖర.............. |
| (2) | 8. కిట తకిట | ఉ. బంగారు, చెంబుతో, పన్నీరు, పట్టుక..... |
| గొబ్బి పదము. | 8. కిటతక | ఉ. కొలని, దోపరికి, గొబ్బిళ్ళో, యదు, ... |
| వెన్నెల పదము. | 8. కిట తకిట | ఉ. అగరగ, పట్టుకొని, వెన్నెలా, X,........ |
| జాజర. | 4. తకిట | ఉ. జాజిరి, జాజిరి, జాజిరి, జాజ.... .. .... |
| కోలాటపు పాట. | 8. కిటతక | ఉ. వట్టివలపు, చల్లకు, విష్ణుమూరి. తీ నీవు,...... |
| ఏల పదము. | 8. తక కిటతక | ఉ. భానువంశ, మూనబుట్టి, దానవ కా, మీని గొట్టి, |
| చిలుక పదము. | 8. కిట తకిట | ఉ. ఇల్లు ఇల్లనియేవు, ఇల్లునా, దనియేవు,<br>నీ యిల్లు, యెక్కడే, చిలుకా, |
| సువ్వాల | 16. తకిట | ఉ. సువ్వి, రామ, చంద్ర, సువ్వి............. |
| గౌరీకల్యాణము. | 8. కిటతక | ఉ. గౌరీ, కల్యాణ, వైభోగమే<br>లక్ష్మీ, కల్యాణ, వైభోగమే. |
| ధవళము. | 8. కిటతక | ఉ. గ్రక్కున, ప్రయాగ, పట్నం,<br>కాంచిరి, హర్షము, తోనూ, |

| | | |
|---|---|---|
| లాలి | 8. కిటతక | ఉ. రామ, లా,లీ,మేఘ,శ్యామ,లా,లీ,X; |
| జోల | 8. కిటతకిట | ఉ. జోఅచ్యు, తానంద,జోజో,ముకుందా,...... |
| తలుపుదగ్గర పాట. | 12. కిటతక | ఉ. కలికి క, వాటము, బంధన, జేసిన ...... |
| చందమామ పదము. | 4. కిటతక | ఉ. మాల్మర్తి,మేడమీద, చందమామా, |
| బ్రతుకమ్మ పాట.(1) | 4. కిటతక | ఉ. శ్రీరామ, జయరా,మా, వలలో |
| (2 | 4. కిటతకిట | ఉ. ధరచోళ, దేశమున, చంద,మామా, |
| (3) | 8. కిటతకిట | ఉ. శ్రీలక్ష్మి,నీ మహిమ, లూ, గౌరమ్మ...... |
| లెల్లెపాట. | 8. తకిట | ఉ. తా, లిల్లే, తక ............... ........... |

## సంగీతము

జానపదగేయముల మనుగడకు వ్యాప్తికి జానపదసంగీతము ముఖ్య సాధనముగా నిలిచియున్నది. జానపదగేయములలో సంగీతసాహిత్యములు పరస్పరము ఆశ్రయాశ్రితములు. నేటి శాస్త్రీయసంగీతమునకు మూలము జానపదసంగీతమేయని కొందరు విజ్ఞులందురు. జానపదగేయములలోని సంగీత స్వరూపమును పరిశీలించినపుడు సంగీతకళయొక్క క్రమపరిణామము స్పష్టముగా గోచరించును. ప్రాచీనకాలమునుండి నేటివరకును జీవనవ్యవస్థలో నెట్టి మార్పుచెందని గోండులు, సవరలు, భిల్లులు మొదలైన ఆటవికజాతులవారి సంగీతమునందు సంగీతకళయొక్క ప్రారంభదశ, మౌలికస్వరూపము నేటికిని నిలిచియున్నది వారి సంగీతమునందు 3,4 స్వరములకంటె అధిక స్వరవ్యాప్తి లేదు.గ్రామీణవ్యవస్థ స్థిరీకరించుకొని జీవించు పల్లె ప్రాంతములలోని గేయములలో సంగీతము కొంత పరిణతి చెందినట్లు కనిపించును. గృహజీవనసంబంధి గేయములందును,పెండ్లి పేరంటములకు ఉత్సవములకు వేడుకలకు సంబంధించిన గేయములందును, మరికొన్ని శ్రామికగేయములందును 4 స్వరములకంటె విస్తరించిన సంగీతము వినిపించును. నాగరకతా ప్రభావము, శాస్త్రీయ సంగీత ప్రభావములకు లోనైన ప్రజలలో ప్రచారమందున్న గేయములలో సంగీతము సప్తస్వరపరిమితిని, ఏకస్థాయి పద్ధతిని అధిగమించినది. లాలిపాటలలో పెండ్లి పాటలలో రాగనిర్దేశము చేయగల స్థితిలో సంగీతమభివృద్ధిచెందినది. పరిశీలింపగా జానపదగేయములలోని సంగీతము నేడు మూడు దశలలో వ్యాప్తిలోనున్నట్లు తెలియును. 1. (Primitive) ఆటవికజాతులకుచెందిన సంగీతము 2. (Folk) అచ్చపు జానపదులకుచెందిన సంగీతము 3 (Refined folk) సంస్కారవంతులైన జానపదులకుచెందిన సంగీతము. ఇందు మొదటి దశలో రాగనిర్దేశముచేయుటకు

సాధ్యముకాదు. రెండవ దశలో రాగనిర్దేశముచేయుట సాధ్యము కాకపోయినను అది యేమేళకర్తకు ( జనకరాగమునకు ) చెందినదో నిర్ణయింప వీలగును. మూడవదశయందున్న గేయములలోని సంగీతమున రాగచ్ఛాయలు స్పష్టముగా గోచరించును. పున్నాగవరాళి, నవరోజు, ఆనందభైరవి, నాదనామక్రియ, భూపాల, ఎరుకుల కాంభోజివంటి ప్రసిద్ధరాగములలో కొన్ని జానపదగేయములు పాడుట సంప్రదాయమైపోయినది.

జానపదుల గేయాలాపమున కలంకారము కంఠమాధుర్యము. జీర ఎరుగని కంఠ మేస్వరమును పలికినను వినుట కింపుగనే యుండును కదా! జానపదుల పాటలకు ముందుగాని వెనుకగాని స్వరాలాపముండును. ఈ స్వరాలాపమే వారి సంగీతమున ప్రధానభాగముగా గన్పట్టును. అటుతరువాత సాధారణముగా నక్షరస్వరములేయుండి సాహిత్యమున కనుపానముగ మాత్రమే యుండును. శ్రుతి నిలుపుటకు జవనికయో, తంబురయో, శ్రుతి హార్మోనియమో యుండుటవలన నీ స్వరములన్నియు నొకే యాధారషడ్జమమునకు సంబంధించి యుండును. ఇద్దరు ముగ్గురు కలిసి పాడునపుడును వారొకే యాధారషడ్జమమునకు చేరి పాడెదరు. భార్యాభర్తలు బిచ్చమెత్తుకొనుటకు బయలుదేరి—భర్త మధ్య స్థాయి యందును, భార్య తారస్థాయియందును పాడునప్పుడుకూడ స్థాయిభేదమే కాని శ్రుతిభేదముండదు

ఒక్కొక్కడే ఏ గడ్డిబండిమీద పరుండియో, లేదా ఏయారుబయట వెన్నువాల్చియో పాడుకొను జానపదగేయములందే స్వరములకు కొంత యాటవిడుపు. కథాగేయములు సాహిత్యక్రమము ననుసరించుటచే వాని కాదియందో లేదా అంత్యముననో తప్ప చరణములందు స్వరములు నర్తించుటకు స్వేచ్ఛయుండదు. వీనిని పాడునప్పు డొకే స్వరము, ముఖ్యముగా నంత్యస్వరము వినబడును. వినవింపైనదగుటచే ఈరీతిపాటకు ప్రచారముండనే యుండును. అంత్యస్వర మొక్కటే యిందు ప్రధానముగా నుండుటచే, సంగీతశాస్త్ర గ్రంథములలో నొకే స్వరసహాయముతో సాగెడు 'ఆర్చిక' లక్షణమునకు సంబంధించిన పాటకు ఇది సరిపోవును. లాలిపాటలలో నవరోజురాగమునకు చెందిన స్వరములు గలగలమని నర్తించినను చివరి స్వరములయిన 'రీ, సా' యనునవి 'లాలీ' యను భాగమున బిడ్డను నిద్రపుచ్చునవిగా నుండును. సంగీతశాస్త్రగ్రంథములలో రెండు స్వరములే జీవముగా గలిగిన 'గాధిక' విధానమునకివి లక్ష్యములుగా తోచును. మేలుకొలుపులలో చివర 'మేలుకో'

అను పదము నాశ్రయించిన మూడు స్వరములు మాటిమాటికి వచ్చుచుండుటచేత సంగీతశాస్త్రజ్ఞులు మూడు స్వరములతో సాగించుగానముగా పేర్కొనిన 'సామిక' అనుదానికి వీని నన్వయింపదగును. జానపదుల పాటలలో ఒకటి,రెండు,మూడు, నాలుగు స్వరముల మూర్ఛనలతో సాగెడు పాటలధికము గ నుండును. సంగీత శాస్త్రకారు లిట్టివానిని ఆర్చిక, గాథిక, సామిక, స్వరాంతరములనియు, ఐదు, ఆరు, ఏడు స్వరము లారోహణావరోహణములందు గల స్వరావళిని రాగము లనియు పేర్కొనిరి. వారు రాగముల కుదాహరణము లిచ్చిరే కాని ఆర్చికాదుల కుదాహరణము లీయరైరి. ఇట్టి గానపద్ధతులు జనవ్యవహారమున నుండి యుండవలెను గదా! అవి జానపదులందే ఉండియుండును. ప్రతి సంగీతశాస్త్ర గ్రంథమందును మార్గదేశి పద్ధతులను స్పృశించుట కలదు కాని దేశిపద్ధతిని పెంచి వివరించుట లేదు. ఈ ఆర్చిక,గాథిక,సామిక, స్వరాంతరములు దేశిగానమునుండి గ్రహించిరని చెప్పవచ్చును.

జానపదసంగీతమును పరిశీలించుటవలన నొకజాతికి అభిమానరాగములుగా స్థిరపడిన రాగములు తెలియనగును. అంతియ కాని అది గానపండితులు చెప్పెడు లక్షణములకు లొంగునది కాదు. జానపదుల పాటలలో కాకలి, కైశికి, అంతర, సాధారణ స్వరభేదము స్ఫుటముగా కానరాదు. అట్టిచో రాగనిర్దేశమువలన జరిగెడు ప్రయోజనము మిక్కిలి ఫలవంతము కాజాలదు. శ్రీమతి వింజమూరి సీతాదేవి గారు జానపదగేయముల సంగీతవిశేషములనుగూర్చి పరిశోధనముచేసి ఆయా పాటలకు రాగతాళనిర్దేశన మొనరించి, వానిలో మోహన,ఖరహరప్రియ, కీరవాణి, బిల్హరి, పీలు, ఫరజు రాగములున్నవని పేర్కొనిరి. అపరిపక్వదశలో నున్న జానపదగేయములం దింత సంగీతముండునా యని నా యనుమానము. వింజమూరి సోదరీమణులు పాడెడు పద్ధతి ప్రకారమును గమనించినచో జానపదగేయములకు మన సంగీతమును కొంత జోడించి సంస్కరించిననే కాని జానపదు లాతీరుగా పాడగల రనిపించదు. వారు పేర్కొన్న మేళకర్తలు మరియు జన్యజనకరాగముల వివక్ష కేవలము జానపదుల నోట వినబడు పాటలనుబట్టి చేయజాలమని నా యభిప్రాయము.

అంతకన్న మేలుకొలుపులను భూపాల,బౌళి రాగములందును,లాలిపాటలను నవరోజు రాగమునను, జాజిరి పాటలను హిందోళ, వసంత రాగములందును పాడుట సంప్రదాయమని చెప్పుట సమంజసము. పెద్దనగారు హారతులను 'హిందోళంబున బాడి' రనెను. రామరాజభూషణుడు గిరికను కాంభోజిలో

నేడ్పించెను. స్త్రీల పాటల కర్తలు 'నాటరాగములతో నాడుచు పాడుచు' ననెదరు. అన్నమయ్యగారు తమ కాలము నాటికి ప్రచారములో నున్న జానపదగేయములకు 'నమోనాలు'గా కొన్ని సంకీర్తనలు రచించిరి. 'అభిలషితార్థ చింతామణి'లో చర్చరీ గీతములను హిందోళ వసంతములలో పాడినట్లున్నది. అన్నమయ్య కూడ హిందోళమున జాజరి పాట పాడిరి. కనుక జానపదగేయముల రాగములను అన్నమయ్యగారు మార్చ లేదనియే భావింపవలెను.

జానపదగేయములలోని సంగీతమును పరిశీలించిన నీక్రింది లక్షణములు సమానముగా గోచరించును జానపదగేయములలో సంగీతసాహిత్యముల రచన మొకేకాలమున జరుగును. కనుక జానపదగేయముల లక్షణములైన ఆశురచన, అజ్ఞాత కర్తృత్వము, మౌఖిక ప్రచారము, సంప్రదాయబద్ధత అనునవి జానపద సంగీతమునకు కూడ సమన్వయింప నగును. జానపద సంగీతమున 1. స్వర పరిమితి తక్కువగా నుండును. 2. సంగీతరచన సరళముగా నుండును. 3. శ్రోత, గాయకుడు అను వివక్షత యుండదు. 4. చరణముల సంఖ్య నియతముగా నుండదు. క్రొత్తభావములు చేర్చునప్పుడు చరణములు కూర్చుట జరుగును. 5. పదబంధముల కూర్పు తాళగతిని సూచించువిధముగా నుండును. వరుసలను జ్ఞప్తియందుంచుకొనుట కనువుగా తాళగతి యుండును. 6 అనేకసాహిత్యరచనలు అధిక ప్రచారములో నున్న వరుసల కనువుగా పాడబడును. 7. ఒకే రచనను ఒకే గాయకుడు వేరు వేరు సందర్భములలో వేరువేరు వరుసలతో పాడును. 8. ఆది, ఏక, త్రిశ్ర, మిశ్ర, ఖండగతి భేదము లెక్కువగా నుండును. 9. సామూహిక గానముండును. 10. మధ్యమకాల సాహిత్యముండును. 11. సువ్యవస్థితమైన సంగతులు కనపట్టవు.

## కొన్ని గేయముల స్వర స్వరూపము

### 1. శంకరా భరణము — త్రిశ్రగతి

| | | | |
|---|---|---|---|
| సాస । | సాస । | సాస । | సాస । |
| సువ్వి । | సువ్వి । | రామ । | చంద్ర । |
| సారి । | గామ । | గారి । | రీస । |
| సువ్వి । | సువ్వి । | కీర్తి । | సాంద్ర । |
| సారి । | సాధ̣ి । | ధ̣ాని̣ । | ధ̣ాధ̣ । |
| సువ్వి । | సీ— । | తమ్మ । | మాకు । |
| ధ̣ధ̣ని̣ । | సారి । | సా , | |
| శుభము । | లి — । | మ్మా. | |

### 2. ఖరహర ప్రియ- ఖండగతి.

సా సాస | సా రి సరీ | గా,; |
శ్రీ లక్ష్మి | నీ మహిమ | లూ.. |
గా రీరి | సా రి సరీ | సారిసా | సా,; |
గొ రమ్మ | చి త్ర. మై | తోచున | మ్మా.. |

### 3. కాంభోజి—మిశ్రగతి.

, సాసాసా | పనీనీ దా | , పప దపదా |
— దాసా వ | రే—ణ్యు లు | — తగు భ.క్తి |
పనీని దపా | , పదదప మగ | మామ పప దద | సా;;, |
తో. వినుడీ | - ద.త్తా.త్రే. | యుల చరిత. | మూ.. |

### 4. మాయా మాళవగౌళ—చతురశ్ర గతి.

సరి సస | రీ రి రి | మా గరి | గా రిస |
కలి కిక | వాటము | బంధన | చేసిన |
సారిస | సానీ | నిస గరి | సా ; |
కారణ | మేమో | తె. ల్పగ | దే ; |

### 5. హిందోళ - త్రిశ్రగతి

సా సని | సా సని | సా సని | సా సన |
జాజిరి | జాజిర | జాజిరి | జా. జ |

### 6. శ్రీరాగము — మిశ్రగతి.

, సాసాసా | రీ , గ రి రీ | ,సాసారీ | గరీ,సా. |
. గౌ రీ క | ల్యా. ణ. . | .వై భోగ | మే . . . |
, సాసాసా | రీ , గ రి రీ | ,సాసారీ | గ రీ,సా. |
. లక్ష్మీక | ల్యా. ణ . . | .వై భోగ | మే . . . |

### 7. మలయ మారుతము _ మిశ్రజాతి

సారి స రి సా | సారి స రి సా |
మేలు కొనవే | చంద్ర శేఖర |
సారి గాగా | గా ప గ రి సా |
మేలు కొనవే | ఇంద్ర వందిత |
సా రి గ రి గా | గా గ గా రి గ |
మేలు కొనవే | ఫా ల లో చ న |

గ గ ప గగ రిస । గాప గా రి స । సా ; ; , ।
మే . లు కొన వే. । నీ ల కం ఠ హ । రా . . . ।

8. శంకరాభరణం - చతురశ్రగతి.

సా స స । సాసస । సారీ ।
గ్రిక్కున । ప్రయాగ । పట్నం ।
సా స స । సా స స । సారీ ।
కాంచిరి । హర్షము । తోనూ ।

9. మాయామాళవగౌళ – మిశ్రగతి

. పమ పాదా । సాస రీరీ ।
. కే. శ వ । యని నిన్ను ।
, స రి గా రీ । స నీ ని ద పా ।
వా. సి గ. । భ . క్తు . లు ।
, దని సాసా । సానీనీద । , దని సా ; ।
. వ. ర్ణింపు । చు.న్నారు । – లే . రా . . ।

10. ఆనందభైరవి – ఖండగతి.

సారిగరి । సా ని ధ ని । సా ; , ।
లాలనుచు । పా డ ర । మ్మా . . ।
సాసాని । సా గాగ । గారి గగ । మా , ; ।
యీ బిడ్డ । ల క్ష్మని । వాసు డ. । మ్మా - - ।
గామ ప మ । గా గా గ । గ రి రీ గ । గరిసాని
పాదమున । చక్ర - । మ , మ్మా । యీ. బిడ్డ
సా గా రి । సా గ రి గ । సా . ; ।
వేదాంత । వేద్యుడ । మ్మా . . ।

11. ఖరహరప్రియ – చతురశ్రగతి

స సా స । సా రి ప రీ । గా ; । రీ సా సా ।
శ్రీరామ । జయరా । మా. । వ ల లో ।
సాసా । సారిపరీ । గా ; । రి స సా ।
సీతా । ల . ల . . । మా । వ ల లో ।

12. హుసేని – చతురశ్రగతి

స పస సా ; , రి స రి । గాప మగ । గా గరి ।
కొలని దో । . వ రి కి । గొ. బ్బి. । శ్యో యదు ।

స సాసా | , రి రి గ | రీసా | సా ; |
కు ల స్వా | . మికి ని | గొబ్బి [illegible] | [illegible] ళ్ళో . |

13. శ్రీరాగము – చతురశ్రగతి

సా సా | రీ ; | స రి గ రి | గ రి స ని |
రామా | లా . | లీ . . . | మే . ఘ . |
సారీ | రి స స ని | నీ ; |
శ్యామ. | లా . . . | లీ |
గారీ | రీ సా | రిసరీ | స రి స రి |
తామ | ర స | నయన | ద శ ర థ |
సరి గరి | గ రి రీ | సా : |
తనయ. | లా . . | లీ. |

14. శంకరా భరణం – చతురశ్రగతి

సారీ రీ | సా రిసనీ | ధా , స |
జెటా ౹యి | సా మిదేవు | డా. న |
సారీసారీ |
న్నేలినోడ |

## అన్నమయ్య పాడిన దేశివరుసలు

అన్నమయ్యకు (1424–1503) పూర్వము తెలుగులో పాటలుండెనను సాక్ష్యము దప్ప ఈపాట లానాటివని చెప్పగలవి లేవు. నాచన సోమనాథుడు తన 'వసంత విలాసము'లో చెప్పినదన్న జాజరపాట యొక్కటిమాత్రమే కలదు. కృష్ణమాచార్యులు రచించిన సింహగిరి నరహరి వచనములు, శ్రీ రంగనాథ వచనములు ప్రతాపరుద్రుని కాలము నాటివి (1320) కలవు కాని యవి 'తాళబంధచ్ఛందో విరహితములు'; చూర్ణికలు. గార్లపాటి లక్ష్మయ్య ఏగంటి వచనముల రచించినవాడు ఏకాలము వాడో ఇదమిత్థముగా చెప్పజాలము. సోమనాథుని తరువాతవాడనుట మాత్రము నిశ్చయము. ఇక అన్నమయ్య గారి యసంఖ్యాక కీర్తనములే యానాటి గేయరీతుల దెలిసికొనుటకు మనకు నేడ్పడు ఆధారములు. ఈ సంకీర్తనములం దాయన తన కాలమున వాడుకలో నుండిన గేయరీతుల నెన్నిటినో ఇమిడ్చెను.

నన్నెచోడుడు 'ఉవిద లింపుమిగుల' పాడునట్టి 'ఊయలపాటల'ను పేర్కొనెను. ఈనాడు 'ఓన్నమ శ్శివాయను నక్షరముల తొట్టెలో ఆవిర్భవించెనే

ఉయ్యాలా' యను నూయలపాట యొకటి వినబడుచున్నది. 'అలర జంచలమైన యాత్మలం దుండని యలవాటు సేసె నీ వుయ్యాలా' యను అన్నమయ్యగారి పాట పైవరుసలో నడచినదే. ఎనిమిది 'కిట తకిట'ల ఆవృత్తముల పాదములు పండ్రెండును, రెండు పాదముల పల్లవియును గలదీపాట. 'ఎన్ని బాధలబెట్టి యేచెదవు నీవింక నెంతకాలము దాక కర్మమా' యనునట్టి పాటగూడ అన్నమయ్యగారిదే. వీనిలో నై దేసి మాత్రల యావృత్తములు మెల్లగా నడచుచు సాగిపోవును. ఉపదేశమో, భావమో, యభిప్రాయమో చక్కగా చెప్పుటకు వీలుగా నున్నదీ గతి. పాల్కురికి సోమనాథుడు చెప్పిన తుమ్మెద, వెన్నెల, పదములు కూడ 'కిట తకిట'యావృత్తములందే నడచును. 'తొల్లిటివలె గావు యింక, నొల్లవుగా మమ్ము నింక తుమ్మెదా' యన్న తుమ్మెదపాట అన్నమయ్యగారి కృతి. 'శివ శివ యన మేలు తుమ్మెదా' యన్న ఏగంటివారి పాటలో 'తుమ్మెద' జీవుని సూచించిన అన్నమయ్యగారి పాటలో వెంకటేశ్వరస్వామిని సూచించును. 'ఏవూరు ఏ వల్లి తుమ్మెదా, ఎక్కడికి ఎల్తావు తుమ్మెదా' యను పల్లెపాటలో దుందుడుకు కోడలు సూచింపబడినది. 'ఓయి భామల్లార తుమ్మెదా, పండిన వరిచేలు తుమ్మెదా'యను కోతపాటలోని తుమ్మెదపదము కేవల మూతపదమే. అన్నమయ్యగారీ పాట రూపమును మార్చి 'తుమ్మెదరో' యనుపాదాంతపదముతో చెప్పిన పాటనెవ్వరును అనుకరింపరైరి.

'గౌరు కొమ్ము రోకట దంచుచు' జంగమలింగము మల్లికార్జునుని శబర కాంతలు పాడినట్లు నన్నిచోడుడు వర్ణించెను. విన్నకోట పెద్దన రోకటి పాటలు తరువోజ లనెను. ఈనాడు వినవడు రోకటి పాటలు కొన్ని తరువోజకును, ద్విపదకును మధ్యగా నున్న వరుసలో గలవు. వీనిని విన్నచో 'సువ్వి రామచంద్ర సువ్వి, సువ్వి కీర్తిసాంద్ర సువ్వి-సువ్వి సీతమ్మ మాకు శుభము లిమ్మా' యను కొట్నములపాట పెండ్లి పాటలలోనిదే గాని అచ్చై లోకవ్యవహారమున గల దంపుడు పాటల కోవలలోనిది గాదనిపించును. దీనిని సువ్వాల యనుట గూడ కలదు. ఇది త్రిశ్రగతిలో కొట్నముల వేగమున కనుకూలముగా నడచుచున్నది. ఇది పాదమున కెనిమిదేసి 'తకిట'ల చొప్పున రెండు పాదములు గల రచనము. తులసీదళము, రామసువ్వాలవంటి పాటలన్నియు నిట్టివే. పాల్కురికి పేర్కొన్న రోకటి పాటలు తరువోజల వరుసలో వ్యాపించిన నాలుగు 'తకిట తక' ఆవృత్తములరచనలో లేక త్రిశ్రగతిలో నడచిన రచనములో తెలియరాదు. పాల్కురికి తెలంగాణము వాడు కనుక తెలంగాణమున ప్రచారమందున్న రోకటి

పాటల జాతమన్నవని త్రిశ్రగతి మరియు చతురశ్రగతిలో నడచునవిగా నున్నవి. అన్నమయ్యగారి 'నువ్వీ నువ్వీ నువ్వని. ఉదకుల దంచెద రోలాల' యను పాట చతురశ్రగతిలో నడచినది. 'ఉవ్వీ నువ్వీ నువ్వీలమ్మ - నవ్వుచు దేవకి నందను గనియె'ననుపాటకూడ ఇట్టిదే. 'భారమైన వేపమాను పాలువోసి పెంచినాను - తీరని చేదేకాక తియ్యనుండీనా'వంటి త్రిశ్రగతి పాట అన్నమయ్యగారు పాడినను నువ్వి పాటలు మాత్రము పాడక పోవుట వింతగనే యున్నది.

పాల్కురికి చెప్పిన 'ప్రభాత పదములు' మేలుకొలుపులు కాబోలు. కృష్ణుని, శివుని, సీతమ్మను, దేవుని మేల్కొలుపు పాట లీనాడనేకము ప్రచార మందున్నవి. ఇవియన్నియు 'కేశవయని నిన్ను వాసిగ భక్తులు వర్ణించుచునారు లేరా' యను వరుసలో నెనిమిది 'తకిట' ఆవృత్తముల పాదములతో నొప్పుచున్నవి. 'మేలుకొనవే చంద్రశేఖర, మేలుకొనవే ఇంద్రవందిత' యనునట్టి పాటలు త్రిపుట తాళములో (తకిటకిటతక యను మిశ్రగతిలో) కూడ కలవు. అన్నమయ్యగారు—

'ఏకాంతలో విన్నెనని తలచిరవి, లేకలు వచ్చెను లేవయ్యా
శ్రీకాంతుడవగు శ్రీవెంకట నా, శిక దళాక్షుడ లేవయ్యా' యను పాటయే గాక
'బాలయుటుక నిద్దురలు భోగించ దొరకొంటి,
అలర వడి మేల్కొనవె అఖిలేశ్వరు' యను పాటయును
'ఎందాక నిద్ర నీ కిదె తెల్లవారె గదె
ఇందిరా రమణ నీ విటు మేలుకొనవే' యను పాటయును ఖండగతిలో (నాలుగు కిటతకిట పాదములతో) ప్రభాతసంకీర్తనములుగా రచించెను.

'ఉయ్యాల లాలు నూచెదరు కడు, నొయ్యనొయ్యనొ యనుచు' అనునది శంకరాభరణపు చతురశ్రగతి పాట; లాలి పాట. 'జో వచ్యుతానంద జో జో ముకుందా రావె పరమానంద రామగోవింద' యనునది అన్నమయ్య గారిదే. వెంకటేశ్వర స్వామి అన్నమయ్య గారి దృష్టిలో నవయువకుడు. కనుక లాలి జోల లెక్కువగా పాడుట కవకాశము లభించనట్లున్నది. కాని కృష్ణజయంతి ప్రశంసమాత్రము పెక్కు చోటుల గలదు. ఆ సందర్భమున 'జో జో యని మీరు జోలపాడరో, పాజపు జయంతి నేడె సఫల మిందరికి' అనుపాట దేసాళం రాగమున త్రిశ్రగతిలో పాడిరి. యక్షగానములందు స్త్రీలపాటలు, లాలి, జోల, (సువ్వాల, ధవళము) వంటివి ప్రౌఢ దంపతుల నుద్దేశించి పాడెడు వలవాటు ఇటీవలిదై యుండును. ఆనాటిది కాదేమో.

వివాళి, మంగళమనునవి గృహసీమలో శుభకార్యముల సందర్భమున

వినపడునట్టివి. నివ్వాళి దృష్టి తగులకుండుటకై పారాణి పళ్ళెమును చుట్టు త్రిప్పుచు పాడునట్టిది. అన్నమయ్య స్వామినే పెద్ద భూతమునుగా కీర్తించెను. అతని పట్టగలిగిన దుష్టశక్తు లేమియుండును? కనుకనే కాబోలు అన్నమయ్యగారు నివ్వాళి పాడినట్లు లేదు. మంగళములు మాత్రము పాడినారు. 'జయ మంగళము', 'శుభ మంగళము' గల మంగళముల కాకాలమున నిశ్చితమైన వరుస యెద్దియు నేర్పడ లేదేమో! మంగళ గానము, మంగళము-మంగళ హారతి-ఆరతి-గారతి-ఆరాత్రిక - ఆలతులు - మున్నగువాని సంబంధము లింకను విచారణీయములు.

అన్నమయ్య శోభనపు పాటలు కూడ పాడెను. 'శోభనమే శోభనమే, వైభవముల పావనమూర్తికి' అను పాట చతురశ్రగతిలో నడచిన సంకీర్తనము. 'గౌరీ కల్యాణము'నెత్తకపోయినను 'లక్ష్మీకల్యాణము'ను ప్రశంసించిన పెండ్లి పాట యొకటి గలదు. స్వామిని మరియు అమ్మవారిని పెండ్లికొడుకు పెండ్లి కూతురులను జేసి యీమాటలను పాదాంతములందుంచి వేరువేరుగా పాడిన పాటలున్నవి. ఇవి యాకాలమున వినోదవాదము నెరపిన పెండ్లిపాటల ఛాయ లేమో.'రావే రావే రట్టడి కోడల,పోవే పోవే అత్తయ్యా పొందులు నీతో చాలును' అనుపాటయును, బావమరదలు సంవాదమును ఈ కోవకు చెందినట్టివే.

అన్నమయ్యగారి పాటలందు ఖండగతిలో నడచిన పాటలు చాల కలవు. నన్నయకు పూర్వము శాసనములందలి తరువోజ లటు సీసపద్యములుగా నిటు స్త్రీల పాటలుగా మారినట్లు తోచును స్త్రీలపాటల వరుస,దంపుళ్ళపాటల వలెనే,తరువోజ వరుసనే పోలియున్నది. తరువోజ రెండవ పాదమందలి చివరి గణములు సూర్యగణములుగా మారి వరుసగెత్తెడు పాటను సీసపద్యముగా నడిపించినవి. ద్విపదయందు గూడ నిట్టి మారుపే వచ్చినది. తరువోజలట్లు పాటవరుసలో గాక సీసపద్యపు నడకతో సాగిపోవు పాటలుకూడ తొలి దినములందుండి యుండును. ఇట్టివే యక్షగానములందు జంపెలను పేరుతో కనబడుచున్నవి యక్షగాన మనునది త్రిపుట, ఏకతాళి,జంపె, అర్ధచంద్రిక, కురుచ జంపె, ఏల వంటి పాటలను, ద్విపద మరియు వచనమును తీసికొని సాగిపోయిన రచనమని కందుకూరి రుద్రయ సుగ్రీవవిజయయక్షగానము సాక్ష్యమిచ్చుచున్నది. అటు తరువాత — విజయనగర పతనానంతరము దక్షిణాదికి తరలిపోయిన యక్ష గానములందు తలుపుదగ్గర పాటలును, పదములును, దరువులును ప్రవేశించినవి. జంపెలు జానపదుల 'హరిహరీ నారాయణాది నారాయణా' యను వరుసలోనివి. గతశతాబ్దిముననే జంపెలు కథాకథనమున కుపక్రమించినవి. అన్నమయ్య

కాలమున జంపెలు కేవలము పాటలుగనే యుండెననుట కాయన పాడిన ఖండగతి సంకీర్తనములే సాక్ష్యములు. మరియును.

'నిత్యాయ విబుధసంస్తుత్యాయ నిత్యాధిపత్యాయ మునిగణ ప్రత్యయాయ' వంటి సీసపద్య పాదపుపాట లీవిషయమును చక్కగా నిరూపించును. అన్నమయ్యగారి రచనములందు ఖండగతిలో నడచు దేశిజనుల వాడుకలో నున్న వరుసలు చాల గలవు.

'కాయము మోచితి గడన గడించితి
చేయార పుణ్యము చేసితినా' యనునది చెంచెతపాట వరుసలో నున్నది.
'ఆత్మ పంజరములో నయమున నుండి నా
చేతనే పెరిగిన చిలుకా' యనునది చిలుక పాట.
కొండ గొడుగుగ పట్టె కొన్నాళ్ళు - తా
కొండముచ్చుల నేలె కొన్నాళ్ళు' అనునది ఈపాదాంతపదములతోడనే నడచెడు పాట. కోలాటవరుసకు గూడ నిది సమీపముగా నున్నది.
'యేమి చిత్రం బేమి మహిమలు యేమి నీ మాయావినోదము
వామనాచ్యుత నిన్ను దెలియగ వసుధలో మా తరములా' యను దానిని 'సంసార మాయాస్తవ' మనవచ్చును గదా!

'రామ రామచంద్ర రాఘవా రాజీవలోచన రాఘవా, యనునది 'గోవిందరామ' పాట వరుస. 'చూపు లోపలి చూపు చూడకుర వోరి నీపై పూత చూపులకు బాలై తిమోరీ' యనునది. 'ఈ యింటి గౌరమ్మ ఎవరాడుబిడ్డా- పాగొండ పత్తిగొండ దొరలాడు బిడ్డా' యను విసురురాతిపాటవరుస. ఖండగతి పాటలవలెనే అన్నమయ్య రచనములందు చతురశ్రగతి పాటలుకూడ అనేకము లున్నవి. వీనిలో చాలవరకు

'కన్నులు దెరవక కమలబాంధవుడు, వెన్నెల రేణువు వెలయ దిదే' వలె ఆవృత్తమునకు నాలుగేసి లఘువులు గల 'ఏకతాళి' వరుసలే. యక్షగానములందు 'ఏకతాళి' గ్రంథమర్యాదను పొందినది. ఐనను లోకమందు వాడుకలోనున్న 'ఏకతాళి' వరుసలోని యావృత్తములం దన్నియు నక్షరము లుండవు.
'తొలకెడి జలములతోడి కన్నుగవ, తలచి డెందము తలకీసి' యని రెండవ పాదములో దీర్ఘము (రాగము) తీయుట కనుకూలముగా నక్షరములు జారిపోయినవి. పండితుల కీర్తనలు నిబంధపదపు నిండును సాధించుటకై నిండుగా నక్షరములు నింపుకొనును. తొలిదినములందీలక్షణ మధికముగా గానుపించును. యక్షగానము లందలి అర్ధచంద్రికలు, త్రిపుటలు, ఏక తాళములు, అక్షరములతో 'పిటపిట'

లాడుటయే దీనికి నిదర్శన మనుకొందును. అన్నమయ్య ప్రథమసంకీర్తనాచార్యుడు మరియు పదకవితాపితామహుండు. ఆయన మనుమడు చెప్పినట్లు అన్నమయ్య 'సంకీర్తనా పరిశుద్ధిన్ ........ చేయబూని' నాడు. ఈపరిశుద్ధి స్వామివారి కంకితము చేయుటచే సగమును, పూర్తియైన నిబంధపదమును మలచుటచే కడమ సగమును సాధింపబడినదని నమ్మెదను. పదచ్ఛందోరీతి నతిక్రమించిన పొట్టి పాదములు దేశిప్రభావమేయని యనుమానించి వెదకి వానినే యిట 'దేశి వరుసలు'గా పేర్కొనుచున్నాను.

తలుపు దగ్గరిపాటలు అన్నమయ్యగారి కాలమువరకు తెలుగులో (తమిళము నుండి) ధారాళముగా ప్రవేశించలేదు. 'లకుమమ్మ కేమైన లంచ మిమ్మనవో, శుక వాణి తలుపు మూసుక తియ్యదు' పాటలో వీని సూచన కొంతగలదు. ఐనను 'కలికి కవాటము బంధన చేసిన, కారణ మేమే లక్ష్మి'యను తలుపు దగ్గరి పాటల వరుసలు 'బలుపగు కర్మము లివివో జీవుల, ప్రారబ్ధంబులు సంచితంబులును'వంటి పాటలం దుండనేయున్నవి. 'చింతించకుమీ శివుని వైరిచే, చిక్కు పడకుమీ వో మనసా' మున్నగునవి యిట్టి వరుసలే.

అన్నమయ్యగారు కోలాట పాటలు గూడ రచించినారు. పాల్కురికి సోమ నాథుని 'కోలాట గొడియ' 'కోలాట' పదములు చూడ కోలాట పదునాల్గవ శతాబ్దప్రారంభమునకే ప్రచారమందినటుల తెలియుచున్నది. కాని తక్కిన నృత్యభేదములను వర్ణించినంతగా కోలాటలను సోమనాథుడు వర్ణింపకుండుట బట్టి కోలాట నాటికి నృత్యముగా రూపొందలేదేమో యనిపించును. అన్నమయ్య పాటలలో 'కోలాట'యను పదము లేకున్నను కోలాటపాటలతో సంపూర్ణ సామరస్యముగల పాటలనుబట్టి యవి కోలాటపాటలై యుండునని యూహించితిని. నా యూహమునకు గల కారణము లివి. గుజిలీపాటల పుస్తకములం దీనాటి కోలాటపాట లెన్నియో కలవు. ఈపాటలు నాటినుండియు నేటివర కేమాత్రమును మారలేదని నొక్కి చెప్పజాలము. కాని ముఖ్యలక్షణములు మాత్రము తక్కిన పాటలందువలెనే వీనిలోగూడ చెదరకుండనే దిగివచ్చినటుల చెప్పవచ్చును. 'గొల్లవారి వాడలకు కృష్ణమూరితీ, నీవు, ఏమిపని కొచ్చినావు కృష్ణమూరితీ'యను పాటయును 'శివ శివ మూర్తివి గణనాథా, నీవు, శివుని కుమారుడవు గణనాథ' యను పాటయును 'నామాట వినవమ్మ కోవెల - ప్రాణనాథుని తేవమ్మ కోవెలా' యను పాటయును కోలాట పాటలు. ఈ పాటలన్నింట చతురశ్రగతియే కాన వచ్చుచున్నది. రెండుపాదములకు గలిసి యెనిమిది యావృత్తము లున్నవి. రెండు

పాదములందును చివరన సంబోధనము లున్నవి. మొదటి పాదములో చివర యావృత్తమును 'థ(అ)నీవు' అని నాలుగక్షరములకాలములో పాడుకొనవలెను. రెండవపాదములో నాలుగవ యావృత్తమునకు సాహిత్యాక్షర మొక్కటే. దీనినే నాలుగక్షరముల కాలములో పాడుకొనవలెను. అక్షరములు తగ్గించుటచే పాటకు కొంత యూపిరి సలిపినట్లుండును. అన్నమయ్యగారి పాటలందు (రెండు,మూడు సంపుటములందు) ఇట్టి పాట లెన్నియోకలవు ఉదాహరణకై

'వట్టి వలపు చల్లకు విష్ణు మూరి తీ' యను పాటను దీసికొనుడు. ఇటులే కేశవ, మాధవ, నారాయణ యను కేశవనామములను, రంగనాథ, నరసింహ, వంటి ఇతర విష్ణునామములను పాదాంతములందు సంబోధనములుగా నుంచి అన్నమయ్యగారు చెప్పిన పాటలన్నియు కోలాటపాటలే. 'ఉద్ధవుండా!' యను పదముతో గోపికలు పాడిన శ్లోక సంకీర్తనము గలదు. మరియొక విశేష మేమన సంబోధనపదములే పాదాంతమం దుండవలెనన్న నియమము లేదు. 'చాంగు భళా', 'గొబ్బిళ్ళో', 'పాదము', 'సంసారము', 'వృథా వృథా', 'గెలుపులు','సంకీర్తనం','వైష్ణవము','మంగళము','పెండ్లికూతురు','పెండ్లి', కొడుకు'వంటి మాటలతో ప్రతిపాద మంతమగు పాటలుకూడ కోలాటపాటలే. ఐనను అన్నమయ్యగారివి మాత్రము చతురశ్రగతి కోలాటపాటలే.

నాచన సోమనాథుడు చెప్పిన జాజరపాటకు అన్నమయ్య రచనములందు రెండు చక్కని యుదాహరణములు గలవు. వసంత విలాసమందలి వంత్తులను బట్టి వెన్నెల రాత్రులందు వీణాగానము, మరియు రమణుల పాటల మేళవింపుతో జాణలు మెచ్చునది ఆనాటి జాజరపాట. శ్రీనాథుని కాలమున వారుణీ రసాస్వాద మదాతిరేకముతో చంద్రికలు గాయ వీథుల కనకవీణల మీటుచు భీమనాథుని జాదురజాదురంచు అంగనలు పాడినది జాజారపాట. ఈ రెంటను జాజార యనగా నేమిటో యర్థము తెలియరాదు. అన్నమయ్యగారొక పాటలో 'పులకల మేనితో బొరలెను కడుం జలిగొని చల్లకు జాజఱ' యను మాటలచే జాజఱ యనగా నెద్దియో చల్లెడు పదార్థమనియు, మరియొకచో "పంకు మదంబుల జాజఱ' యను మాటలచేతను 'రవ రవ చెమటం గరిగి' యనుటచేతను జాజర యనునది పొడి యనియు, 'పుప్పొడి జారగ' యను పాటలచే కస్తూరి, గంధవొడి, పుప్పొడి మున్నగువాని పొడి జాజర యనియు దీనిని చల్లుకొనుచు ఆడునట్టి యాట జాజర యాటయనియు తెలియుచున్నది. తెలంగాణమున'కాముని

పున్నమ' సందర్భమున 'జాజరాట' ఆడుట పరిపాటియే. రంగులు చల్లుకొనుట, కుంకుమ, బుక్కా, గులాలు చల్లుకొనుట ఈనాటికి గలదు.

పాల్కురికి చెప్పిన 'ఆనంద పదము' రూపమెట్టిదో తెలియరాదు. 'వెన్నెల పదములు' 'వెన్నెల'యను మాటతో అంతమగు చరణముల పాటలో లేక వెన్నెలలో విలాసముగా పాడుకొనుపాటలో తెలియరాదు తెలంగాణమున కాముని పున్నమ సందర్భమున పాడుకొను కొన్ని పాటలందు "వెన్నియ్యలో"యని చివర నుండును. అన్నమయ్య వెన్నెలలో 'అల్లో నేరేళ్ళు' పాడుటను విలాసముగా పేర్కొనెను.

'నెయ్యము ల్లల్లో నేరెళ్ళో, వొయ్యన వూరెడి వువ్విళ్ళో'యను చతురశ్రగతి పాట 'అల్లోనేరెళ్ళ' కుదాహరణము. తెలంగాణమున 'నల్లోనేరెళ్ళ'పాట లధికముగా పాడబడును. అల్లనేరెళ్ళు అల్లోనేరెళ్ళుగా మారినదని నా నమ్మకము. నేరెళ్ళు రెండు విధములు. తెలంగాణమున ప్రసిద్ధమైన పెద్దవైన-మంచి నేరెళ్ళను అల్ల నేరెళ్ళందురు. చిన్నవానిని కుక్కనేరెళ్ళందురు. కొన్ని ప్రాంతములందు కుక్క నేరెళ్ళకు కాకి నేరెళ్ళని కూడ పేరున్నట్లు తెలియుచున్నది. అల్లనేరెడి యనగా ప్రసిద్ధమైన నేరెడుపండని యర్థము. ఈ మంచి నేరెడుపండు పేరేల గేయముల కెక్కెనో తెలియరాదు. అల్లో యనునది నిర్దేశవాచకముగా వేటూరి ప్రభాకరశాస్త్రిగారొక స్వారస్యము చెప్పెడివారట. సీతమ్మ నేరెడు చెట్టుక్రింద చెలికత్తెలతో ఆడుకొనుచుండగా నేరెడు పండ్ల రంగు ఆమె ధరించిన తెల్లచీర కంటుకొన్నదట. అది చూచిన యామె చెలికత్తెలు గుసగుసలు పోయిరట. ఆరంగు ప్రథమ రజస్వలకు చిహ్నముగా అల్లో ! యని నిర్దేశించి "నేరెళ్ళలో సీతమ్మ సమర్తాడె"నని వ్యంగ్యముగా సూచించిరట. ఈ ప్రభాకర పరిశ్రమము మనోహరమైన జానపద నిరుక్తికి ( Folk etymology ) కారణమైనది. 'వుక్కిళ్ళో' 'తొక్కిళ్ళో' యను పాదాంత పదములు కూడ 'అల్లోనేరెళ్ళ'వరుస పాటలే 'కలుపు తియ్యం డమ్మలారా - చేను - బలుపు చూడం డమ్మలారా' యను కర్షకగీతమునకు 'అప్పమైన నియ్యరె యమ్మలారా నే, డప్పం దారగించే నదె అమ్మలారా'యను అన్నమయ్యగారి పాట కలదు. దశావతారములను పేర్కొనుచు పాడిన సంకీర్తనములును గలవు.

'చందమామ రావో, జాబిల్లి రావో-మంచి
కుందనంపు పైడికోర వెన్నపాలు తేవో' యనునది పిల్లలపాట వరుస. ఆరేసి' కిటతక'

త్రివృత్తముల పాదములతో' అంతట రాములవారూ, అంగన సీతను గూడీ, సంతస మందుచు వేగా, స్వపురమునకు చనుదెంచీ'యను స్త్రీలపాట వరుసలో

అన్నమయ్యగారు రచించిన
'సత్యము సేయగ వచ్చును, సర్వేశ్వర ఈ మాటకు
నిత్యము నీవే యెరుగుదు, నేనేమీ యెరుగ జామీ' యను పాటకలదు.

'తందనాన అహీ తందనానె పురె

తందనాన భళా తందనాన' యను విలాసనృత్యపు పాట యొకటి కలదు. క్రీడాభి రామమందలి "తందాన లమ్మకయ్యకున్' అను మాటలవలన తందానలు కూడ గొబ్బిళ్ళకు వలెనే పూజలకు రూఢి పదములైనట్లు కానబడును. తెలుగుదేశ మందంతటను నేడు వినబడు తందాన పదము లిందుకు సాక్ష్యములు. కాని పైన పేర్కొన్నది తందనాలాట:విలాసగేయము, చేతులు తట్టుచు పాడునట్టిది. 'వాడు తాగి తందనా లాడుతున్నా'డను మాట దీనివలననే పుట్టినదనుకొందును.

అన్నమయ్యగారి ఏలలు నా కంట బడలేదు. ఏల పదముల ప్రశంస సంస్కృత సంగీతగ్రంథములందు కలదు. 'ఏలలు వెట్టుచు నింపు సొంపార' బసవపురాణమును జదివెడువారు పాల్కురికి కాలమున నుండిరి. కీ· శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు 'అప్పా రావోయి ముద్దుల కుప్పా రావోయి' యనుదానిని ఏల పదమున కుదాహరణముగా నిచ్చిరి. కాని యది ఏల కాదు. రుద్రకవి సుగ్రీవ విజయములోని

'భాను వంశమూన బుట్టి-దానవ కామీని గొట్టి
మౌనివరులు సన్నుతింపగా-ఓ రామచంద్రా
పూని మఖమూ నిర్వహింపవా' యనునది ఏల పదము·ఇది 'తక కిటతక' యను గతిలో సాగిపోయినది. ఏగంటివారి ఏలలు యక్షగానముల యందలి ఏలలు కూడ ఇటులనే యున్నవి. శ్రీ కె. సభాగారు సేకరించి ప్రకటించిన ఏలలు కూడ ఈరీతిగనే సాగిపోయినవి. తాళ్ళపాక చిన తిరుమలాచార్యులు సంబోధనమును మించి ఏల లక్షణ మేమియును చెప్పలేదు. 'అప్ప'యన్న పై పాటలోని సంబోధనము మాత్రమే దాని నేలగా చెప్పుటకు చాలదు. తక్కిన ఏలలతో దాని కెట్టి పోలికయును లేదు. ఏలల నిర్మాణము అన్నమయ్య అభిమానించిన నిబంధపదముల నిర్మాణమున కందకపోవుటచేత కాబోలు ఏల లాతని రచనములందు ఇప్పటికి ముద్రితమైనవానిలో లేవు. ముందుముందు

ప్రకటింపబోవువానిలో లభించునో యేమో వేచి చూడవలె. ఐనను ఈవిషయ మింకను సూక్ష్మముగా పరిశీలింపదగినదే. అన్నమయ్య గారెన్నియో విధముల దేశి వరుసలందు కీర్తనములు రచించిరని చెప్పుటకుమాత్రమే ఇట కొన్ని యుదాహరించితిని. ఇంకను ఎన్నియో తీరుల దేశి వరుసల నాయన చేపట్టి యున్నారు. వాని నన్నింటిని దడవినచో గ్రంథవిస్తర మగునని విడుచుచున్నాను.



# ఉపసంహారము

ఇంతవరకు జానపదగేయముల పుట్టుపూర్వములు, వాని లక్షణములు, వాని ప్రశస్తితోబాటు వాని భేదములు వానియందున్న విశేషములు మున్నగునవి తెలిసికొంటిమి. జానపదగేయప్రవంతి యనంతము. నా నేర్చిన భంగి పదునాపు దోసిళ్ళ పానీయ మెత్తగలిగితిని. ఒంటి మానిసి దాని కేల మెత్తగాలదు. పలువురు పండితులును, కవులును, విమర్శకులును నడుము గట్టిననే కాని ఇది యసాధ్యము. తెలుగుదేశమున నున్న నదీనదములు సెలయేర్లు వాగులు వంకలు ఎంతగా వాడు కొనబడవలయునో అంతగా వాడుకొనబడక 'సాగరోగతిః' అన్నట్లే జానపదగేయ ప్రవంతికూడ ఇప్పటికే చాల భాగము మనకు దక్కకుండ బోయినది. ఉన్నదాని నైన నిక భద్రపరచి యుపయోగించుట తెలుగువారి కర్తవ్యము. పండితులు విమర్శకులు జానపదగేయములందున్న సాహితీవిషయము లెత్తి చూపవచ్చును. సాంఘికశాస్త్రవేత్త లాసంపదలో తమకు గావలసిన యమూల్యమణుల వెదక వచ్చును. చేయి తిరిగిన కవులు రచయితలు కళాకారులు వానియం దుపలబ్ధమగు దేశీయవస్తుసంపదను బట్టి తీర్చవచ్చును. శిష్టులగు రచయితలు [illegible] వస్తువునకై సంస్కృతవిపణివీథులందు గాలించినటులే నవ్యులు పాశ్చాత్యసీమ విహారము చేయుచున్నారు. తమయందున్న దేశీయసంపదను విడిచి 'పొరుగింటి పుల్లగూర' నాశించుచున్నారు. కీ. శే. బసవరాజు అప్పారావు, గురజాడ అప్పారావు, అడవి బాపిరాజు మున్నగువారల కొలదిమంది మాత్రమే దేశీయ వస్తువును చేపట్టి ప్రజాభిమానమును చూరగొనిరి. నవ్యులలో శ్రీ కవికొండల వెంకటరావుగారు జానపదుల భాష, భావములు మరియు పరిస్థితులను సంపూర్ణముగా నాకళించుకొని రచనలుగావించి దేశికవితావిభూతిని ప్రదర్శించినారు. నండూరివారి 'యెంకిపాటలు' జానపదుల భాషకు ఉత్తమకవితాకళ కేకామెత్తి నట్లున్నవి. జానపదకవితారీతుల నందరికన్న నెక్కుడుగా సద్వినియోగము చేసినవారు రాజకీయపక్షములవారు. తమతమ రాజకీయసిద్ధాంతప్రచారములకై బుఱ్ఱకథలు, జముకుల కథలు, గేయములు రచించిన వీరి యాశయము కొనియాడ దగినది. స్వరాజ్యోద్యమసమయమున వెలువడిన 'మాకొద్దీ తెల్లదొరతనము'

'దండాలు దండాలు భరతమాతా' 'కొల్లాయి గట్టితే నేమి' వంటి రచనములు పూర్తిగా జానపదుల సొమ్మైపోయినవి. స్వరాజ్యోద్యమమునకు, సంస్కరణోద్యమమునకు తోడుపడిన గేయములు వందలకొలది వెలసినవి. వీని ప్రయోజనము తాత్కాలికమే యైనను ప్రభావము మాత్రమనంతము. చేయితిరిగిన రచయితలు జానపదగేయములందున్న వస్తువును (రెండు, మూడు, నాలుగు, పదునొకండవ ప్రకరణములు చూడనగును) స్వీకరించి కలమందుకొనవలె గాని రవ్వలు రాల్పవచ్చును. ఆంధ్రభాషామతల్లి కెనలేని తొడవులు సమదరించ వచ్చును. జానపదగేయములందుండు జాతీయములు నానుడులు వింతవింత పలుకుబడులు శిష్టులాకళించుకొనవలసిన యమూల్యసంపద. నవ్యభారత పునర్నిర్మాణావసరమున వివిధప్రణాళికా ప్రచారమునకును, ప్రజాప్రబోధమునకును జానపదకవితారీతు లుపయోగించునంతగా నితరము లుపయోగపడవన్న నతిశయోక్తి కాదు. ఔత్తరాహులు ముఖ్యముగా హిందీ బెంగాలీ భాషలవారీమార్గమున చాల దూరము సాగిపోయినారు. జానపదసారస్వతసంపదయందలి వైశిష్ట్యమును గమనించియే కేంద్రప్రభుత్వమువారిటీవల రేడియో మున్నగు ప్రచార సాధనముల ద్వారమున నమితమగు సేవ చేయుచున్నారు. ఇరుగుపొరుగు వారని జూచి యైనను తెలుగువారభినివేశము కల్పించుకొన్నచో నాంధ్రదేశమునకు, నాంధ్రభాషామతల్లికి, నాంధ్రవిజ్ఞానమునకు మేలగునని సప్రశ్రయముగా నివేదించుచు విరమించుచున్నాను.

# తోడ్పడిన గ్రంథములు పత్రికలు

1 అధ్యాత్మరామాయణము - వాల్మీకి
2 అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు - తాళ్ళపాక అన్నమాచార్యులు
3 అన్నమాచార్య చరిత్ర - వేటూరి ప్రభాకరశాస్త్రి
4 అప్పకవీయము - కాకునూరి అప్పకవి
5 అభిజ్ఞానశాకుంతలము - కాళిదాసు
6 అమరావతీ స్తూపము - మల్లంపల్లి సోమశేఖర శర్మ
7 ఆంధ్ర జానపదగేయ వాఙ్మయచరిత్ర - చేకుమళ్ళ కామేశ్వరరావు
8 ఆంధ్ర భాగవతము - బమ్మెర పోతన
9 ఆంధ్ర మహాభారతము - కవిత్రయము
10 ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము - ఖండవల్లి లక్ష్మీరంజనం
11 ఆంధ్రుల చరిత్ర సంస్కృతి - ఖండవల్లి లక్ష్మీరంజనం
12 ఆంధ్రుల చరిత్ర 5వ సంపుటము - చిలుకూరి వీరభద్రరావు
13 ఆంధ్రుల సాంఘిక చరిత్ర - సురవరము ప్రతాపరెడ్డి
14 ఆదిలక్ష్మీవిలాసము (ప్రా.పు.భాం) - అక్కినేపల్లి నరసింహకవి
15 ఆముక్తమాల్యద - శ్రీకృష్ణదేవరాయలు
16 ఉత్తర హరివంశము - నాచన సోమనాథుడు
17 ఉదాహరణ వాఙ్మయచరిత్ర - నిడుదవోలు వెంకటరావు
18 ఏకావళి - విద్యాధరుడు
19 కామేశ్వరీ చరిత్రము (ప్రా.పు.భాం.) - వేటూరి భావనామాత్యుడు
20 కావ్యాదర్శము - దండి
21 కావ్యాలంకార చూడామణి - విన్నకోట పెద్దన
22 కావ్యాలంకార సంగ్రహము - ప్రబంధాంకము మూర్తిరాజు
23 కుమార సంభవము - నన్నిచోడుడు
24 క్రీడాభిరామము - వినుకొండ వల్లభరాయుడు
25 గుజరాతీ వాఙ్మయ చరిత్రము - చిలుకూరి నారాయణరావు

